## గిరి గీతలు

ఆ.వె. పిల్లలున్న నేమి ప్రేమలు లేకుండ ♦ అమ్మ ప్రేమ లేని ఆస్తియేల
తండ్రి మమత లేని తపనలు అవియేల ♦ ఇల్లు స్వర్గమగును యిన్ని యున్న.

ఆ.వె. తాత తండ్రులందు తారుణ్యముండెనో ♦ వారసత్వమందు వలపు గలదొ
తనదు జీవితమున ఘనతను గాంచగ ♦ వంశమంత జగతివాసికెక్కు.

ఆ.వె. భోగభాగ్యములకు భోక్తలై జనులంత ♦ యోగమేమొ తెలియ లేకయుండ్రి
భోగరహిత జీవి యోగమె యాగము ♦ భోగకలితుడాయె రోగజీవి.

ఆ.వె. ఆస్తి జాస్తియున్న అందల ముండిన ♦ అనుభవించుశక్తి అసలు లేదు
అంతరంగమందు శాంతిని గలిగించ ♦ ఆత్మదెలిసికొన్ననదియె చాలు.

ఆ.వె. అన్న అక్కచెల్లి అనుబంధబంధాలు ♦ పెళ్ళి జరుగగానె పేలిపోవు
అమ్మప్రేమకూడ ఆవిరైపోవును ♦ నాన్నయందు మమత నవ్వులాట.

ఆ.వె. గతముగమ్యమునకు మతముగ పనికొచ్చు ♦ వర్తమానమంత వార్తయగును
భవిత సవిత రీతి భాగ్యము నందించ ♦ జనుని జీవితమ్ము జాజ్వలమ్ము.

ఆ.వె. బ్రహ్మచారి బతుకు భాగ్యము యోగ్యము ♦ చింతలేమి లేమి చెలువు కలుగు
అందరొక్కటిగను ఆత్మచింతనమున ♦ బతుకు సాగదీయు భాగ్యమునను.

ఆ.వె. ఒక్క కూరచాలు చక్కని రుచికల్గ ♦ పెక్కుకూరలైన పేరులేగ
మక్కువగను పెట్టు మనసున్న ఇల్లాలు ♦ చేతితోడపెట్ట చెలువమగును.

ఆ.వె. అమ్మనాన్నలందు ఆప్యాయతలుగల్గు ♦ పుత్రుడగును జగతి పూజ్యుడుగను
ప్రేమలేని బిడ్డ పేరుకు పుత్రుడే ♦ ఉన్న లేకయొకటె ఉర్విలోన.

ఆ.వె. చిత్రములనుజూచి చిత్తముచలియింప ♦ మత్తులోన మనిషి చిత్తుగాగ
దురలవాట్లతోడ దూషింపబడుగాక ♦ మంచిగాంచుడయ్య మనుషులార.

ఆ.వె. గీతచదువగాను గీతలు మారును ♦ గీతమార్చివేయు గీష్పతిగను
అమరతరువు ఫలములందిచుగీతయె ♦ నశ్వరమ్ముగాదు దివ్యగీత.

ఆ.వె. భారతమ్మువినగ భారతి పులకించు ♦ భాగవతము జదువభక్తినించు
రామకథను గాంచరమణీయమగునుగ ♦ భరత సంస్కృతిచటి భాగ్యమాయె.

ఆ.వె. కంప్యుటరులలోని కాంతిని శాంతిని ♦ కలిమి బలిమినంత కలవరముగ
భారతికిని దెలిపి భాస్వంత భాగ్యాన ♦ ఇంపుగొనుడు మీరు ఇంజనీర్లు.

ఆ.వె. '**నెట్టు**' లోని మహిమ నెఱజాణతనమంత ♦ ఎఱుకజేసి జనుల మరపుదీసి
చేతిలోనపెట్టి చేతాలకందించి ♦ పల్లెవల్లె యనగ పరములగుడు.

ఆ.వె. తనదు తప్పులన్ని తాదెలియ కుండగా ♦ పరుల తప్పునెంచు పరమగురుడు
గురుడు కాడువాడు గూడుపుఠాణిరా ♦ గురువు తెలివి దెలియ గుంభనమ్ము.

ఆ.వె. వినయగరిమలేని విబుధులు మనకేల ♦ వినయమిచ్చు జగతి విజయములను
వినయరహిత జీవి విలయము ప్రళయము ♦ వినయగుణము నీవు విడువవద్దు.

ఆ.వె. మంచి మమతలేని మానవ జన్మేల ♦ దయయు ధర్మరహితదానమేల
శక్తి రక్తిలేని శాంతము అదియేల ♦ శుద్ధి బుద్ధిలేని సిద్ధియేల.

ఆ.వె. పదికి బడికివచ్చి ఐదుకు వెళ్లగా ♦ మొక్కుబడిగమారె మోద మిడదు
బెల్లు బిల్లురీతి చెల్లదు ఒల్లదు ♦ శ్రద్ధ కలిగి యుండ బుద్ధిజీవి.

ఆ.వె. సేవ చేయలేని సేవకుడెందుకు ♦ ఆర్తిబాపలేని అధిపుడేల
సతము హితములేని సన్యాసియేలరా ♦ మానవత్వరహితమతములేల.

ఆ.వె. రోడ్డుమీద కలుగు రోదనలను విని ♦ జాలి చెందకుండగేలిసేయు
కఠినచిత్తుమనసు కరిగించు విధమెన్న ♦ ఇనుమునానబెట్టు విధముగాదె.

ఆ.వె. మడులు మాన్యములు మహిమలు ధనములు ♦ మనిషి తనములేక మంచికావు
శుద్ధబద్ధ ఆత్మ ఇద్ధము సిద్ధము ♦ జీవితమ్మునందు జిలుగు వెలుగు.

ఆ.వె. ఆలుబిడ్డలందు అమితము కోర్కెలు ♦ బంధుతతులుగోరు భాగ్యములను
మిత్రతతులయందు మించెడి కోర్కెలు ♦ మాయజీవితమున హేయమగును.

ఆ.వె. పంచభక్ష్యములును పరమాన్న సహితము ♦ వండివార్చిపెట్టు వలపు గలుగు
భార్యయున్న వాని భాగ్యము భాగ్యము ♦ బ్రహ్మచారి బతుకు గతుకు గాదె.

ఆ.వె. భర్తమాట వినని భార్యయు భార్యయె ♦ భార్య మాట వినని భర్త భర్తె
బండిసాగగాను రెండగు చక్రాలు ♦ ఒకటి విరిగిపోవ ఓటి బతుకె.

ఆ.వె. జననమరణములను జావళీరీతిగా ♦ కాంచగల్గు జనుడు కలిమి యుతుడు
భౌతికమ్ములైన భోగభాగ్యమ్ములు ♦ కాంచునట్టి జన్మకలవరమ్ము.

ఆ.వె. అంతరించు నరుడు అతిగాను మతిలేక ♦ పనులు చేయుచుండు ఫలముగాంచ
మృత్యుమహిమ దెలియమృణ్మయరీతిగా ♦ భావనమ్ము సేయ భాగ్యయుతుడు.

ఆ.వె. హక్కులనుభవించ ఆనందమొదవును ♦ బాధ్యతలనుగాంచ బరువుగల్గు
హక్కుబాధ్యతలను చక్కని జంటగా ♦ చూచునట్టిజనుడు సుందరుండు.

ఆ.వె. వేదమంత్రములును వేళకు మించవు ♦ వాద్యఘోషవరుస వరపులేదు
వధువు వరులమాట వాదన వేదన ♦ ప్రేమజంటలిచట పేరుగాంచు.

ఆ.వె. పాఠశాలయందు పాలకపదవులు ♦ కష్టమైనగాని యిష్టమగును
తీర్చిదిద్దగాను తీరైన పౌరులు ♦ లభ్యమగునుగాదె లక్ష్యముంచ.

ఆ.వె. ప్రిన్సిపాలు పదవి పిలుపున తలపున ♦ ప్రిన్సిపుల్సు లేక పేలవమ్మె
గుణము కలుగగాను గురుతైన విద్యార్థి ♦ గణములభ్యమగును గరువముగను.

ఆ.వె. బాహ్యశుద్ధి కలుగ భాగ్యము లభియించు ♦ అదియెకానబడును అందరికిని
అంతరంగశుద్ధి అసలైనశుద్ధిగా ♦ భావనమ్ముసేయ భవము పండు.

ఆ.వె. మనసులోని మాట మరియేరికైనను ♦ తెలియరానిదగును తేటగాను
బయటిమాటలిచట బంధమ్ము కలిగించు ♦మనసుమాట కలియ మహిమ సుమ్ము.

ఆ.వె. బాధలోని బోధ భగవంతుడెరుగును ♦ సాధనమున బాధ సరసమగును
బోధ దేవుడైన బుద్ధుడు దేవుడె ♦ బంధనమున బాధ ఇంధనమ్ము.

ఆ.వె. శోధనమ్మునందు శోభించు యోధుడు ♦ విజసారథిగను విజయమొందు
అపజయమ్ము కలుగ అమరత్వమందును ♦ గెలుపు బలుపెయైన గేలిచేటు.

ఆ.వె. అన్నపానములకు ఆరాటమాయెను ♦ తినగలేని తీరు తీయనగునె
చాలుననెడిమాట సహజము సరసము ♦ అధికమైన తిండి ఆమయమ్ము.

ఆ.వె. కోట్లు గణన సేయ కోరిక తీరునా ♦ అంతమేమిలేదు స్వాంతమునకు
సహజమైన కోర్కె సహితము మహితము ♦ కోర్కె కొండలెక్క కొఱతె జన్మ.

ఆ.వె. అహము కల్గియున్న ఆంధ్యము వచ్చును ♦అహము పెంచు జనుల అంతరములు
అహములేకయుంట ఆధిక్యమిచ్చును ♦ అహమువిడువుమయ్య అవనిజనుడ.

ఆ.వె. మంచిచెడులు రెండు మానవలోకాన ♦ కాలమహిమతోడకదలుచుండు
మంచిదెలియగాను వంచన విడగాను ♦ వసుధమానవత్వవాసిపంచు.

ఆ.వె. శ్రద్ధకలిగియున్న శక్తిని వెచ్చించ ♦ పట్టుదలయుగల్గ గట్టిగాను
అంకితమ్ముకృషియు అందలమెక్కింప ♦ జనుని జీవితమ్ము ఘనముదలప.

ఆ.వె. సకలకార్యములును సంకల్పముండగా ♦ తప్పకుండ దీరు మెప్పుగొనగ
కొర్కెతీవ్రతరముకొఅతనుగల్గించు ♦ సాజమైన కోర్కె సార్థకమ్ము.

ఆ.వె. గన్నుపట్టినట్టి అన్నలందరునేడు ♦ అవనికొరుగగాను ఆర్తిమిగులు
జనుల మధ్యకొచ్చి జయమును గాంచగా ♦ ఆంధ్రభూమినేడు అమరమగును.

ఆ.వె. పెద్దపండుగలకు పేరులేదిక్కడ ♦ సంప్రదాయములును సంతకెళ్ళి
ఐటి కంప్యూటరులు అందలమిడునని ♦ యువత తేలియాడు ఊహలందు.

ఆ.వె. డాబు దర్పములును డాలరు పంటలు ♦ పండుననుచు యువత పరుగువెట్ట
దూర తీరములకు భారమె అమెరికా ♦ తంటలెన్నొ దెచ్చి మంటరేపె.

ఆ.వె. మాటలమ్ముకొనెడి మానినులందరు ♦ టీవియాంకరులుగ ఠీవినందు
హావభావములును హాసముల్ వేషముల్ ♦ కనగ కాంతిగలుగు కలవరముగ.

ఆ.వె. సంక్రమణమునందు సంక్రాంతి వచ్చెను ♦ మొసలినోటిలోన మోదమిడగ
ఇనుడు ఘనుడుగాను హితమును గల్గింప ♦ భారతమ్మునేడు భాగ్యదాయి.

ఆ.వె. మూడునాళ్ళు యిచట ముద్దుముచ్చటలతో ♦ ముగ్గులేయుచుంద్రు నిగ్గుగాను
పాడిపంటలింట పరవశమందించ ♦ క్రాంతికలుగజేయ శాంతిదాంతి.

ఆ.వె. అల్లువాడు రాగ చల్లని ఆశీస్సు ♦ యిచ్చుమామయిచట యింపుగాను
కూతుకూర్మితోడ కులమును బలమును ♦ వందితముగ జేయువరుసతోడ.

ఆ.వె. భోగిమంటలెగసి భోగములివ్వగా ♦ గంగిరెద్దువాని గడుసుదనము
కనుమఘనముగాను కారుణ్యమొలికించ ♦ పండుగాయెనేడు పండు విధము.

ఆ.వె. రాళ్ళురప్పలందు రాముడుకలడని ♦ భావనమ్ముసేయు భక్తిపరులు
మెత్తనైన మనసు మేలిమిగనలేరు ♦ రాయిమనిషిచేసె రమ్యముగను.

ఆ.వె. పూజలెన్నిసేయ పుణ్యముగల్గునా? ♦ త్యాగరహితభక్తి తనమదేల?
అన్నివిడిచిపెట్టి అంతరమందున ♦ దేహరహిత బుద్ధిదివ్యమగును.

ఆ.వె. మేడమిద్దెలందు మేరువుగనగాను ♦ యత్నమొనరజేయయాంత్రికమ్ము
ఆత్మబుద్ధిగలిగి అంతరువులువీడ ♦ ఆతడగును జగతి అమరముగను.

ఆ.వె. పూర్వగాథలెన్నొ పూతముగానమ్ము ♦ తరముమారగాను తపనగల్గు
మాటలోని మహిమ మాన్యతగనలేక ♦ దాటవేయుచుండు దారిలేక.

ఆ.వె. కుక్క మక్కువాయె కూరిమి చుట్టమై ♦ పంది పరమమాయె వరముగాను
పిల్లి పిలుపునందు చల్లనితల్లియై ♦ పెంపకమ్ముమీరె పేరు కలిగి.

ఆ.వె. జంతువులకు భయము జాతి లక్షణమాయె ♦ భయము భవమునందు బాధయగును
భయము బంధకముగ భాగ్యము నశియించు ♦ భయములేనివాడె భాగ్యజీవి.

ఆ.వె. నీడజాడవలెను నిత్యమువెంటాడు ♦ పాపపుణ్యములును శాపములును
గతమునందు జనుని గరువము పరువము ♦ వర్తమానమందు వరపుగనును.

ఆ.వె. జన్మలున్నవేమొ జనునకు తెలియదు ♦ జన్మజ్ఞానమున్న జనుడెజనుడు
వర్తమానజన్మ వర్తనసరియైన ♦ భవితజన్మకలుగు బాగుగాను.

ఆ.వె. ఇంతి మాటలన్ని ఇంపగు సొంపగు ♦ బంతిపూల వలెను బాగుగాను
వాడిపోవునవియె వరుసకు మరునాడు ♦ నమ్మవలదురన్న నాతిమాట.

ఆ.వె. కొండలెక్కగాను కోర్కెలుతీరవు ♦ తీర్థసేవనమ్ము తీరుగాదు
గుండెగుడిని నిండు గుర్తగు దేవుడు ♦ ఎచట వెదకి చూడనేమి ఫలము.

ఆ.వె. మతములెన్నియైన మనుజుడు ఒక్కడే ♦ అభిమతమ్ము గనగ నతని మతము
మంచి చెడులు రెండె మానవమతములు ♦ ఆచరణమునందు అధివసించు.

ఆ.వె. కులము మతములన్ని కూహకములునేడు ♦ ధనము కలుగగాను దారివేరు
పేద పెద్దలిచట పేరగు కులములు ♦ ధనము మార్చగలదు ధరణి కులము.

ఆ.వె. అందమన్న నేమొ బంధము భాగ్యము ♦ అతివలందు చూడ అమరమదియు
జనతఘనతయందు జాగృతి చందమై ♦ అందమవనిలోని ఆస్తిసుమ్ము.

ఆ.వె. మేడలోని మనిషి వాడకు అధిపతి ♦ వాడలోని మనిషి వసుధ మిన్న
మేడ వాడలన్ని మేదిని సమమగు ♦ మనిషి తనముకల్గ మహికి మేలు.

ఆ.వె. పేరు పెండ్లమగును వేరగు భావాన ♦ చేతలన్ని యింట చేటు దెచ్చు
అందరికిని వారు అన్యోన్య జంటగా ♦ బయట కానవచ్చు భవమునందు.

ఆ.వె. వృత్తులన్నినేడు వృత్తమై చెడిపోయె ♦ స్పర్థ వృత్తముగను వ్యర్థమాయె
సార్థకలితవిద్య సార్థకవృత్తమె ♦ భేదములను పెంచ బాధ గలిగె.

ఆ.వె. వావివరుసలన్ని వసుదేవుడెరుగును ♦ భావిభాగ్యములును భవుడు దెలియు
మమతసమతలన్ని మానవుడెరుగును ♦ కాలమహిమ దెలియ కాంతిగలుగు.

ఆ.వె. గడ్డితినెడి పశువు గణ్యము జనునకు ♦ మలము దినెడి జీవి మాన్యమగును
మనిషి మనిషి మధ్య ధనమని ఘనమని ♦ భేద భావనలును వేదనగును.

ఆ.వె. చెలువు చెలిమిలేని కలిమియె వ్యర్థము ♦ కలిమికలవరమ్ము కాలములకు
దానమున్న కలిమి ధరణికి ద్రఢిమగు ♦ అంతరములులేని అవనిదారి.

ఆ.వె. దిక్కుమాలినట్టి దీనుల దీనత ♦ మాన్చునట్టి జనుడు మహిమనందు
చింత చెంతలేని చిరునవ్వు నందించ ♦ అన్ని జీవితాలు అందమగును.

ఆ.వె. బట్టకట్టగాను భాగ్యము యోగ్యము ♦ విడిచివేయగాను విలువలేదు
నాగరికము జగతి నాణ్యము వీడెను ♦ వలువలూడ దీసి వాసివిడిచె.

ఆ.వె. నరమునరమునందు గరముగఘనముగ ♦ పాఱురక్తమంత పరమముగను
మంచి కాంక్షసేసి మానవగమ్యాన ♦ సాగు జనుని జన్మ సార్థకమ్ము.

ఆ.వె. మట్టినమ్మినోడు మహిలోన మాన్యుడు ♦ పంట తంట దీర్చుఫలము నిచ్చు
కృషిని నమ్మనోడు కూలుటతథ్యము ♦ ఋషియె జగమునందు కృషినినమ్ము.

ఆ.వె. ఎవరిపనినివారు ఎఱుకతో సేయగా ♦ జీవితమ్మునందు జిలుగు కలుగు
ఆత్మతృప్తి కలుగు ఆద్యంతములయందు ♦ భావిభాగ్యమగును భవము నందు.

ఆ.వె. నీతి చచ్చిపోయె నియమాలు భీతిల్లె ♦ జాతి వీర్యమంత జారిపోయె
నాయకత్వమేమొ నయమును వీడెను ♦ దేశభవితయింక దేవుడెరుగు.

ఆ.వె. పేదవారిదోచి పెద్దలు పెరిగిరి ♦ పెద్దలంత చేరిపేరుగాంచె
పాలనమ్మునందు పద్ధతి లేకుండ ♦ బాధ భాగ్యమాయె పాలితులకు.

ఆ.వె. నగర గరిమమీరి నాణ్యతలోపించె ♦ వగరు పొగరులోన వాసి వీడె
శుచియు శుభ్రతలును సూకరమహిమతో ♦ దోమ బాధతోడి ధామమాయె.

ఆ.వె. పల్లె జీవితమ్ము గల్లంతుగా మారె ♦ నగర జీవితమ్ము నాణ్యమాయె
దార్లు కార్లతోడి దారుణముగ మారి ♦ జనత దారిలేక ఘనత వీడె.

ఆ.వె. మురుగు మరుగు లేక మునుముందుకొచ్చెను
మంచిమురుగునీరు మాన్యమాయె
తాగునీరు వెలుగు తామసమాయెను
వ్యాధులన్ని కలిసి బాధమిగిలె.

ఆ.వె. చిత్రజగతిగాంచ చిత్రవిచిత్రము ♦ వాస్తవమ్ములేని వస్తువదియ
నీతినిజముజూడ నియమవిరుద్ధము ♦ జాతిజయమువీడె జవము లేక.

ఆ.వె. అంతరములులేని అవనినిచూడగ ♦ ఎంతకాలమగునొ ఏమొగాని
వింతతీరులన్ని విలువలు విగతించి ♦ కలుగువిధము జూడ కలతగాదె.

ఆ.వె. నీను నేనుగాను నేనునునీవుగా ♦ కలసిమెలసియుంట కలిమిసుమ్ము
మనముమహిమగలిగి మానవత్త్వమునందు♦మనినజగమునందు మమత వెలయు.

ఆ.వె. దారిదప్పుజనులు ధనమును గడియించి ♦ దహనమగును గుణము ధనమువలన
అడ్డదారులన్ని అవనిని అధమము ♦ నేరుదారి జగతి నేవళమ్ము.

ఆ.వె. మంచిపెంచలేని మనుజు జన్మమ్మేల ♦ చెడును త్రుంచలేని చెలిమియేల
వడిని సాగలేని వారువ మదియేల ♦ పూజ్యభావరహిత పుత్రుడేల.

ఆ.వె. మూడు ముళ్ళువేసి ముచ్చటగా గూర్చి ♦ అక్షతలను పెట్టి అతిశయముగ
భార్య భర్తలనెడి భాగ్యముగల్గించ ♦ భక్తి రక్తి విడిచి భవము కలగె.

ఆ.వె. ప్రేమ పేలవమ్ము పేదరికమ్మున ♦ భాగ్యగరిమనదియె యోగ్యమగును
బతుగు గతుకులందు భాగ్యము ప్రేమగా ♦ తలచుచుండ నదియె వలపు సుమ్ము.

ఆ.వె. కరుణవరణమగును కర్మలయందున ♦ మర్మరహితకర్మ మంచిదగును
నీతినియమములను జాతిని మేల్కొల్పు ♦ జగతి కర్మలన్ని జయముగాంచు.

ఆ.వె. ఆశకాల్చి వేయు ఆత్మీయతలనన్ని ♦ కోర్కె పేల్చివేయు కూర్మినంత
స్వార్థభావనమ్ము వ్యర్థముజేయును ♦ తనది ఆశ కోర్కె తగదు సుమ్ము.

ఆ.వె. గ్రంథజాలమందు అందముగా జెప్పు ♦ మాటలన్ని వినగ మహిమలేదు
ఆచరణముకల్గ అందముచందము ♦ చెప్పువిధము జూడ చెట్ట సుమ్ము.

ఆ.వె. బిడ్డలందుప్రేమ దొడ్డగయుండును ♦ మంచిచెడుల యందు మాన్యతగను
పోలికలకుపోయి పోకడ మారగా ♦ పొలుపుదక్కునదియు పుడమిలోన.

ఆ.వె. మాతృభావనమ్ము మచ్చుకు గనరాదు ♦ పూర్తి పితృప్రేమ పూజ్యమాయె
గురువు గురుతుగూడ గూఢమైపోయెను ♦ నేటి బిడ్డనడత నెవ్వగాయె.

ఆ.వె. ఆత్మగౌరవమ్ము అసలేమి లేకుండె ♦ పరులగౌరవించు పథము లేదు
తనను తాదెలియగ ఘనతను గాంచము ♦ ఆత్మశోధనమ్ము అసదుమాట.

ఆ.వె. ఓడిపోవుచుండె ఓటరు మాటికి ♦ సార్థపరులగెలుపు సొగసు దాయె
కల్లబొల్లి మాట కలగాను మిగిలెను ♦ ఓటు ప్రభుతగాంచ ఓటిదాయె.

ఆ.వె. కులముకొక్కపార్టి కూహకమాయెను ♦ గతము మతములన్ని సతమతమ్ము
లౌకికమ్ముజాడ లౌల్యముగా మారి ♦ పొందులేని బతుకు బందియాయె.

ఆ.వె. ఋతువు క్రమముమార బతుకులు ఛిద్రము ♦ ఎండవానలన్ని మండుచుండె
రోగబాధలిలను రోదన గలిగింప ♦ వాదులాటలాయె వరుల సభలు.

ఆ.వె. ఆకసమునకెక్కె అవసరవస్తువుల్ ♦ ఉప్పుపప్పులన్ని ఉట్టికెక్కె
నాయకార్యులంత నక్కలరీతిని ♦ కారుకూతలన్ని కూయుచుండ్రి.

ఆ.వె. విలయములనుగాంచ విభ్రాంతిగల్గించు ♦ గతమునందు లేక గణ్యముగను
పెరుగుపాపమంత విరుగుచు విడివడి ♦ పడెను భూమిమీద పాశవికము.

ఆ.వె. ప్రళయరూపమాయె పడతిది జ్జగమున ♦ పావనతనుగాంచ పరమమగును
అంతరంగమేమొ అసలేమొ కనలేము ♦ బాహిరమ్ముగూడ భావనమ్మె.

ఆ.వె. బంధనమున పడతి అందమె అందము ♦ వందనమ్ము ఆమె వలపునకును
కోపమొచ్చెనేని కోమలి కొలిమియె ♦ కాల్చివేయు బతుకు కలవరమ్ము.

ఆ.వె. ఆశలేని నరుడు అధికుడు కాలేడు ♦ ఆశ అధికమైన అధముడగును
తగిన ఆశ కల్గ తనకెంతొ తరళము ♦ ఆందమైన ఆశ బంధువగును.

ఆ.వె. నాది నాదియనుచు వాదనసేతురు ♦ వేదనందు నాది వెరపు గొలుపు
వాదులేని నాది వరపగు వసుధను ♦ నాది యన్నదేది నీదికాదు.

ఆ.వె. పుట్టినపుడు నరుడు పూజ్యుడు పుణ్యుడు ♦ గిట్టినపుడు వాడె మట్టి గలియు
పుట్టి గిట్టుటకును మట్టియె మూలము ♦ మట్టి మహితమన్నమాట మిన్న.

ఆ.వె. సుఖము కల్గగాను సుందరమాయెను ♦ బతుకు బాధగల్గ బధిరమగును
బాధ భాగ్యములను బంధువు రీతిగా ♦ భావనమ్ము సేయ బతుకు ఫలము.

ఆ.వె. పాతతరపు బతుకు పాతరైపోయెను ♦ కొత్తతరము కొలువు కొఱతమించె
ఓర్పు నేర్పు లేని ఒంటరిమాదిరి ♦ జనుని జీవితమ్ము జయము విడిచె.

ఆ.వె. మీడియాను చూడ ఏడుపు తప్పదు ♦ సినిమ టీవి గాంచ సిలుగు లెన్నొ
మలిన జీవితమ్ము మహిమగ చూపించ ♦ మానవాళి బతుకు మసకబారు.

ఆ.వె. ప్రేమ ప్రేమయనుచు పేలవమౌరీతి ♦ మాటచేతలన్ని మర్మముగను
వలువలూడదీసి వలపుల రాగాల ♦ యువత భవిత జూడ యూనమాయె.

ఆ.వె. అవధిమీరె నేడు అధికారదర్పము ♦ పదవి పొందగాను పథములెన్నో
అంధకారమాయె ఆర్థిక కాంక్షతో ♦ ఆంక్షసేయకున్న అవని సున్న.

ఆ.వె. పేదవారలింక పేదవారగుచుండె ♦ పెద్దవారలంత పెద్దలాయె
పదవి కల్గువారు పదనిసలాడగ ♦ వర్గకలహములను వాసి విడిచె.

ఆ.వె. దోచుకొనెడివారి దోబూచులాటగ ♦ ప్రభుత పథకములును పరమమాయె
నీతినేతిబీర జాతికి గోతిగ ♦ భారతమునుగాంచ భగ్గుమనును.

ఆ.వె. నియమజీవనమున నిధులెన్నొ కలవుగా ♦ భయము బాధలేక బతుకు గడచు
ధర్మ రహితమైన ధారుణి జనతకు ♦ ఘనతలేదుజూడ గరిమలేదు.

ఆ.వె. మంచిమానవతల మాన్యము లోపల ♦ మనుజుడుండగాను మహిమగల్గు
వంచనమ్ముతోడ వసుధను గాంచగ ♦ వాసివెడలి జగతి వాదులాట.

ఆ.వె. నేటి హీరొలంత నిన్నటి జీరోలు ♦ భవిత వారలంత భావయుతులు
కలిమి లేమి రెండు కలియుగరీతులు ♦ తెలిసినడచుకొనగ తేటయగును.

ఆ.వె. కనెడివాడుజగతి కలవరమందడు ♦ వినెడి జనుడు ఘనుడువిలువగలుగ
భావనమ్ముసేయు భవుడెంతొమాన్యుడు ♦ తీరుమార్చనోడు తీయనోడు.

ఆ.వె. పగలు రాత్రిలేదు వలపుల తలపుకు ♦ వగలమారివనిత తగుల మగును
మనసుకలపనోడు మగువకు శత్రువు ♦ ఇద్దరొకటియైన ఇంపుగలుగు.

ఆ.వె. గడచుకాలమునకు గండిని వేయగ ♦ సాధ్యపడదు జగతి వేద్యముగను
కాలవిలువ దెలిసి కలవర మందక ♦ సాగునట్టి జనుడు సరసుడను.

ఆ.వె. గతముహితము దెలియ గణ్యతగల్గును ♦ వర్తమాన మహిమ వాసినిచ్చు
భవిత భాగ్యగరిమ భావనకందగా ♦ నరుని బతుకు నాడు నాణ్యమగును.

ఆ.వె. దేశభక్తి తోడ దేహము చాలించు ♦ గాంధి నెహ్రూ బోసు గరువ మందె
లాలుబాలు పాలు లావణ్య మహిమతో ♦ మనసులందు నిలచి మాన్యులైరి.

ఆ.వె. భయము బాధ రెండు భాగ్యము నీయవు ♦ యోగసాధనమున యోజగలుగు
ధైర్యసాహసములు కార్యము నెరవేర్చు ♦ కామితములు దీర్చుకలియుగమున.

ఆ.వె. చింతలెన్నియున్న చిరునవ్వు నవ్వుచు ♦ పరులబాగుకొరకు బతుకు వాడు
భవ్యజీవితమున దివ్యతగాంచును ♦ కీర్తివంతుడగును ఆర్తివీడి.

ఆ.వె. భయమువిడిచిపెట్టి భవమున సాగగా ♦ బాధలడ్డు రావు బతుకు లోన
సాహసమ్ముతోడ సర్వులు సాగగ ♦ జగత స్వర్గమగును జయముగాంచి.

ఆ.వె. సిగ్గు కొఱకుబట్ట సింగారమాయెను ♦ బట్ట విడువ భామ భాగ్యమాయె
నవ్యజీవనమున నాణ్యతమీరగా ♦ నగ్నమాయె జగతి నాగరకము.

ఆ.వె. మొక్కుబడిగమారి మోజాయె బంధాలు ♦ పెదవిపై నిలచు ప్రేమలన్ని
మనసులోకి పోవు మానవబంధాలు ♦ మహికిచేటు దెచ్చుమమతలన్ని.

ఆ.వె. దైన్యమందుజనులు దైవము దలతురు ♦ సంతసమున వారుసరకు గొనరు
అన్ని సమయములును అంతరంగమునందు ♦ భక్తి గొలువ భవుడు భాగ్యమిచ్చు.

ఆ.వె. సకల గుణములన్ని సద్గురు కృపతోడ ♦ అందరికినివచ్చె అవనిలోన
అట్టివాని ఘనత అందరుకొనియాడ ♦ అమితఫలము కలుగు అందరికిని.

ఆ.వె. అందరానివాని అందరివానిగా ♦ అందరిచటచేరి అతనికొల్వ
అందివచ్చునతడు ఆనందమందించు ♦ కోరికొల్వనతడె కొఱతదీర్చు.

ఆ.వె. జీవజాలమంత జియ్యరు చలువగా ♦ జీవనమ్ము సేయు జిలుగుతోడ
అతడిప్రేమలేక అంతయునంతము ♦ అదియు తెలిసికొనగ అఘముతొలగు.

ఆ.వె. పచ్చదనము లేని పావనతే లేదు ♦ వృక్షతతులులేని వృత్తిలేదు
నీడజాడలేని నియతియే కనరాదు ♦ వృక్ష రక్ష జనత రక్షయగును.

ఆ.వె. అడవు లెన్నియున్న ఆవరణమ్మున ♦ అంతరక్షణమ్ము ఆస్తిగాను
అడవినరికివేత ఆపదకొనితెచ్చు ♦ వనము రక్షణమ్ము ధనము సుమ్ము.

ఆ.వె. ధూపపానమగును ధూర్తమిజ్జగమున ♦ పొగను త్రాగగాను పొలుపు దక్కు
వ్యాధి బాధతోడ వ్యత్యస్థమగునుగా ♦ త్రాగవలదు పొగను తలపువిడువు.

ఆ.వె. అమ్మకమ్ములోన అన్నివస్తువులును ♦ నిప్పుగాలిమట్టి నీరు మబ్బు
కొనెడి వారలంత కొఱతల ప్రభువులు ♦ ఉన్నవారిచేతి చిన్నెలన్ని.

ఆ.వె. వావి వరుసలేని వాదన లెందుకు ♦ భావిగనగలేని భాషలేల
సమయపాలనమ్ము సహితము మహితము ♦ సారజీవనమున సాగుమయ్య.

ఆ.వె. నేటివార్తవిన్న నెవ్వగ గల్గును ♦ రేపువార్త గనగ రేవడాయె
మాపు వార్త లిలను మాలిన్యయుతములై ♦ వార్తవరుసజూడ వాసిలేదు.

ఆ.వె. ఆనుకూల్యమిలను అసలైన భావన ♦ అననుకూల్యమునకు అవధిలేదు
అంతరంగములను అన్యోన్యతలుగల్గ ♦ అవనిజనతఘనత అందలమ్ము.

ఆ.వె. సావధానమునను సాగెడి జనునకు ♦ పరుల మాటలన్ని పరమమగును
వినుటనేర్చుకొన్న విలువైన జీవికి ♦ భాషణమ్ములన్ని వలువలగును.

ఆ.వె. మంచి ఎంచి చూడ మరుభూమి గనరాదు ♦ వరుల వర్తనమున వాసికలుగు
చెట్టతనమునందు చేతనకరవగు ♦ భావివర్తనమున బంధకమ్ము.

ఆ.వె. మాయదారిడబ్బు మత్తును గలిగించు ♦ దారికానరాదు ధనమువలన
కొలువుదీర్చు ధనము కోపతాపములను ♦ తనకుమించుధనము తపన పెంచు.

ఆ.వె. పల్లెవెలుగులన్ని పల్లానబడిపోయె ♦ పట్టణమ్ములన్ని పట్టపగలె
వట్టిపోవుచుండె వసుధలో నిధులన్ని ♦ వసుధ రక్షసేయు వరుడ నీవు.

ఆ.వె. పలుకు పలుకునందు పరమార్థ భావన ♦ చేతి చేతలందు చెలిమి కలిమి
మనసు నిలయమైన మధుర భావనలకు ♦ అట్టిమానవుండు అవని శివుడు.

ఆ.వె. రోగబాధలిలను రోదన పెంచును ♦ నిష్ట నిధులుగురియు నియమములను
బాధలేక జనుడు భవమున నిలువడు ♦ బాధ అనుభవమున భాగ్యమగును.

ఆ.వె. బురదలోని పంది బులపాట మనుకొను ♦ ఎముక నమలు కుక్క ఎఱుక మరచు
నక్క జిత్తులకును నాణ్యత కల్గునా ♦ కోతికొలువు జగతి కొంపముంచు.

ఆ.వె. మహిమకలుగు మాట మంత్రమ్ము జగతిని ♦ మౌనభాష మహికి మహిమగూర్చు
మౌనమంత్రములును మనిషికి మెరుగులు ♦ దైవతత్వమునకు దారులవ్వి.

ఆ.వె. సాధకుండు జగతి సాధువుగామారు ♦ శోధకునకు భువిని శోభగలుగు
శోధ సాధనముల శోకము విడిపోవు ♦ బాధ భాగ్యమగును భవము నందు.

ఆ.వె. పంతమేల నీకు వంతలు కొల్లలు ♦ వింత జీవితమున విలువలేదు
స్వాంతమందునీవు స్వార్థమువీడగ ♦ సార్థకమ్ము జన్మ సాగునయ్య.

ఆ.వె. గ్రామదేవతలను గాటను గట్టిరి ♦ ఉత్సవమ్ముజేసి ఉద్యమించి
పోతురాజువద్ద పోతులు వధియింప ♦ శాంతి కల్గునయ్య వాంతిగాగ.

ఆ.వె. విధులు తెలియలేని విబుధులుమనకేల ♦ బాధ్యతలను మరచు బతుకులేల
విధులు బాధ్యతలను వివరముగా దెల్పి ♦ మనెడి జనుడు జగతి మాన్యుడగును.

ఆ.వె. హక్కుభుక్తమగును చక్కనిరీతిన ♦ విధులు వదలిపోవు విగతముగను
విధులు హక్కులిచట వినియోగవస్తువుల్ ♦ యోగమందువారు యోధులిచట.

ఆ.వె. వేగవంతమాయె వెగటున బతుకులు ♦ స్పర్థ మించిపోయె సార్థకమున
వర్ధనమ్మునకును మర్ధనతోడాయె ♦ మార్దవమ్ము విడిచె మహిమలేక.

ఆ.వె. గుణము గురుతు విడిచెమనమున మలినమ్ము
మనము మాసిపోయె ధనము వలన
మంచి మించిపోయి వంచన వాసిగా
నరుని జీవనమ్ము నాశనమ్ము.

ఆ.వె. వైరభావమునను వైభవమే లేదు ♦ స్నేహ భావనమున సేదదేరు
సేవ భావమందు సేచన ఘనమగు ♦ మనుజ సేవ మాధవునికి సేవ.

ఆ.వె. మానధనముగల్గు మాన్యులు కొందరు ♦ విడిచితిరుగువారు వేలకొలది
అట్టినరుల భువికి అంతముతథ్యము ♦ కాలమహిమగనగ కలవరమ్ము.

ఆ.వె. మల్లెపూవు బతుకు మార్దవ మాయెను ♦ వాడిపోగనదియు వాసివిడుచు
ఉపకరించునదియు ఉన్నంతకాలము ♦ పరులకొరకు బతుకు భాగ్యజీవి.

ఆ.వె. ఆశతీరగాను ఆప్తులు కనరారు ♦ సౌఖ్యజీవనమ్మె సౌరభంబు
కదలలేనియపుడు కనవచ్చు జనులంత ♦ వార్ధకమున జీవి వలపు మిగులు.

ఆ.వె. పంచభక్ష్యములును పరమాన్న సహితము♦ ముందు కలుగగాను మురువు లేదు
తినెడియోగమంత తీరెను వ్యాధితో ♦ ఎన్నియున్ననేమి ఎదకు కలక.

ఆ.వె. అలకపాన్పునెక్కి ఆడది పడియుండ ♦ మగడు యేమిచేయు మహిమ వీడు
మగనిసొత్తు జగతి మానిని పరమాయె ♦ మానహానిలేక మసలవలయు.

ఆ.వె. ఆలుమగల యొక్క అంతర్యమొక్కటై ♦ మాటచేత మనసు మహిమతోడ
జీవితమ్ముసాగ జిలుగులు వెదజల్లు ♦ స్వర్గమన్న నిదియె స్వానుభవము.

ఆ.వె. తగవులెన్నొనేడు తపనకు గుర్తులు ♦ కామక్రోధములెగ కలవరములు
మోహమదములన్ని మోసముసేయును ♦ లోభమత్సరములె లోలుపతలు.

ఆ.వె. సహనమునకు నేడు సమయము కనరాదు ♦ అహమునకును జగతి అంతులేదు
నిగ్రహమ్ము లేక ప్రగ్రహమాయెను ♦ ఆగ్రహించు జీవి అణగిపోవు.

ఆ.వె. దొరలమాటలన్న దోబూచులాయెను ♦ మంత్రిమాటలన్ని తంత్రమాయె
మాన్యజనుని మాట మహిమను కోల్పోయె ♦ తేటమాట జగతి తేరునెక్కె.

ఆ.వె. విలువలేని కుక్క విశ్వాస ముంచును ♦ ఎద్దు దున్నపోతు ఎఱుక నుండు
మొద్దుమానవుండె మోసముజేయును ♦ మోసపోకుమన్న మోజుతోడ.

ఆ.వె. సృష్టిలోనివన్ని పుష్టిని గలిగించ ♦ వృద్ధినందె నరుడు బుద్ధిగలిగి
వికటమైన బుద్ధి విలువలు చెఱచగా ♦ నష్టిమిగిలి జగతి కష్టమాయె.

ఆ.వె. పాతరోతయనుచు భీతిల్లుచుండిరి ♦ కొత్తకోరుకొనగ కొలువుదీరె
పాతలోని మహిమ పావనమైనది ♦ కొత్తలోని కొత్తకోర్కెసుమ్ము.

ఆ.వె. అడవిజీవియైన ఆదిమ నరుడిట ♦ గహనసీమదాటి గణ్యుడాయె
మనసు దెలియకుండ మరుభూమి చందమై ♦ శాస్త్ర ఫలములన్ని శస్త్రమాయె.

ఆ.వె. చేతివృత్తులన్ని చేవను వీడెను ♦ యంత్రవృత్తులొచ్చి యాతనాయె
పల్లెసీమలన్ని పాపకూపములుగా ♦ వన్నెదరిగిపోయి వరుసమారె.

ఆ.వె. నగరజీవనమ్ము నాణ్యతయనినమ్మి ♦ పట్టణమ్ముచ్చి ఫలములేక
జిలుగు తరిగిపోయి జీవచ్ఛవములుగా ♦ తిరిగి రాగజగతి తీరుమారె.

ఆ.వె. పల్లెనమ్ముకొనగపరమార్థమిచ్చట ♦ ఇరుగుపొరుగులందు ఇంపుసొంపు
పట్టణమ్ములన్ని పాపకూపాలుగా ♦ పలవరించునేడు భారతమున.

ఆ.వె. మధురమగును పాట మార్ధవమైనది ♦ భాష భావనలకు భాగ్యమద్ది
అమరగీతమగును అందము చందము ♦ కంఠగరిమతోడ కాంతిపంచు.

ఆ.వె. తప్పుచేయుటన్న తరళము విరళము ♦ తప్పుతెలియుటేమొ ఒప్పుకాదు
తప్పులెంచుటన్న మెప్పుగ భావించు ♦ గొప్పవారి కిచట గురుత లేదు.

ఆ.వె. మంచిచేయువారు మంచినిగాంతురు ♦ మంచితనమె జగతి మాన్యమగును
పరుల మంచికోర పరమార్థమగునిట ♦ మంచి మంచి పెంచు మంచినించు.

ఆ.వె. బాధకలిగినపుడె భగవానుదలతురు ♦ సంతసమ్ములోన సరకుగొనరు
అన్నిసమయములను అభవునిగాంచగ ♦ బాధ భాగ్యమగును భవమునందు.

ఆ.వె. పుట్టు గిట్టు విధము పురుషోత్తముడుగాంచు ♦ నిత్యకారణుండు నియమమతడు
పీడ చీడలందు పిలుపున తలపున ♦ ఆత్మ భవునిగాంచ అందమగును.

ఆ.వె. కల్లకలవరమ్ము కలియుగమందున ♦ సత్యవాక్కు జగతి సహితమగును
నొవ్వబలుకుటయును నొచ్చుట సరికాదు ♦ మేలుకోరుటయును మెప్పుగాంచు.

ఆ.వె. తనివిలేకయున్న తపనలు హెచ్చగు ♦ జనుని తరియజేయు జగతి తనివి
చాలుననెడి మాట చలువను కలిగించు ♦ ఆశ అవధివీడ ఆర్తిమిగులు.

ఆ.వె. నీదు గొప్పతనము నీవఅకేయుండు ♦ పరులమెప్పుగొనగ పరమమగును
నిన్ను నీవు మెచ్చ మన్నిక లేదుగా ♦ ఆశయమ్మెనీదు ఆస్తియగును.

ఆ.వె. జీవి ఆశతోడ జీవించు జగమున ♦ ఆశలేని నరుడు అధముడగును
ఆర్తిలేనియాశ ఆశయమగునిట ♦ ఆశ ఆశయములె అవనినిధులు.

ఆ.వె. అభవుడెరుగజేసె అష్టాదశాఖ్యతో ♦ యోగశాస్త్రమహిమ యోజనమున
ఉపనిషత్తుగరిమ ఉన్నతిగీతలో ♦ విరిసె విలువతోడ విశ్వమందు.

ఆ.వె. భాగవతములోని భాగ్యము భక్తిగా ♦ పోతనార్యుడందు పోతపోసె
కృష్ణతత్త్వమంత కృపతోడ నింపొంది ♦ జాజ్జ్వలముగజగతి జయమునందె.

ఆ.వె. భారతమ్మునందు భావము సర్వమై ♦ పర్వమాయె జనునిపథమునందు
ఫలముగాంచెనదియు పంచమవేదమై ♦ సకలశాస్త్రములకు సంగమంబు.

ఆ.వె. మునులు ఘనులు జగతి మూలము గ్రహియించి
మంత్రములను గూర్చి మహిమ నించి
నాల్గువేదములుగ నవ్యతతోదిద్ది
ధర్మబోధనిచట ద్రఢిమజేసె.

ఆ.వె. రామకథనుజెప్పె రసికతవాల్మీకి ♦ ఆరుకాండలందు అందముగను
అతని జీవితమ్ము ఆదర్శప్రాయమై ♦ భారతీయునికిని బంధువాయె.

ఆ.వె. వ్యాధిబాధలన్ని వేధించుచుండెను ♦ కలుషమైన జగతి కలవరమ్ము
పేలవమ్ము నందు పేదరికమ్ముతో ♦ విద్యలేని జనుల విలువ లింతె.

ఆ.వె. కలిమి లేములిలను కావడి కుండలు ♦ లేమిగాంచకున్న లేదుకలిమి
కలిమి బలిమితోడ కావరమెక్కిన ♦ కథలు మారిపోవు కలియుగముగ.

ఆ.వె. వెలుగుకలుగజేయు వేదాంతభావన ♦ తత్త్వబోధజనుని తరియజేయు
బంధనములు జనుని బాధకు గురిసేయు ♦ తెంచుకొనెడి తెలివి తేటయగును.

ఆ.వె. కక్షవలనకాదు కార్యమిజ్జగమున ♦ శిక్షతెలియలేదు శివము విధము
కక్ష శిక్ష రెండు కలియుగమర్మముల్ ♦ శిక్షరక్షణమ్ము దక్షమగును.

ఆ.వె. బోధలెన్నొజేసి భోగముల్ త్యజియించి ♦ మౌనవృత్తితోడ మహిమగల్గి
తాపసులుగమారి తరియించిరెందరో ♦ వారిదారిమనకు వాసిపంచు.

ఆ.వె. మీసములను పెంచి కాషాయములుగట్టి ♦ గడ్డములను దువ్విగరిమగాంచి
రాగబంధములను రమ్యతల్ విడనాడి ♦ అడవినుండువారె ఆస్తిపరులు.

ఆ.వె. ఇష్టమైనదాని యితరులకివ్వరు ♦ పారిపోవునన్న భయముచేత
కారణమ్ముదెలియ కలవరపడుదురు ♦ భక్తిగల్గినడువ భాగ్యమగును.

ఆ.వె. మనసు ఒక్కచోట మాటొకచోటున ♦ చేతలొక్కవిధము చెలులయందు
అట్టిచెలియలందు అభిమానముంచిన ♦ అంతరంగమందు చింతమిగులు.

ఆ.వె. సంతుచింతలేని సంసారమందున ♦ భార్యచింత యొకటె బాధయగును
చింతలేమిలేక వింతగు బతుకులు ♦ వింతబతుకులకును విలువలేదు.

ఆ.వె. విద్యనేర్చుకొన్న విలువగు బతుకులు ♦ విద్యలేనివాడు వింత పశువు
తల్లిదండ్రిగురువు తమదైన నేర్పుతో ♦ జ్ఞానగరిమనిచ్చు జాణలుగను.

ఆ.వె. ఆచరణములేని అభిమానమదియేల ♦ శోధనమ్ములేని బోధలేల
సాధనమ్ములేని సాంగత్యమదియేల ♦ వాదనమ్ములేని వసుధయేల.

ఆ.వె. అందమైన జగతి నందించె దేవుడు ♦ అనుభవించనరున కానతిచ్చె
అనుభవించలేని అసమర్థబుద్ధితో ♦ వినశనమ్ముసేయ విలువలేదు.

ఆ.వె. దేవుడన్నవాడు దేశాన లేడుగా ♦ దేహమందెగలడు దివ్యముగను
అట్టివానిగనిన ఆత్మజ్ఞుడనవచ్చు ♦ ఆత్మభవునిగాంచ అతిశయమ్ము.

ఆ.వె. లేదు దేవుడనుచు లేవడిమాటలు ♦ పలుకువారికిచట ఫలములేదు
ఉండెననగ వారు ఉన్నతిగాంతురు ♦ భావనకునుమించు భవుడువాడు.

ఆ.వె. నీరు నిధిగజూడ నియమ్ముతోడుత ♦ కలుషమైన నీరు కలతపెంచు
ప్రాణహానిలేని పావనజలమున ♦ జీవి జీవితమ్ము జిలుగు సుమ్ము.

ఆ.వె. దేవదేవునెదుట దేహులు అందరు ♦ ఒక్కటగుదురిచట ఓజతోడ
పేదగొప్పలనెడి భేదాలు కలుగవు ♦ మనుజకల్పనమ్మె మహినిదెలియ.

ఆ.వె. మహిళమాన్యురాలు మహిలోన కనుగొన ♦ ఆధునికమునందు అధికమదియ
మహిళ మగలు మహిని సగభాగమనుకొని ♦ జీవనమ్ముసేయ జిలుగు బతుకు.

ఆ.వె. ధనము కలుగగాను దార్ష్టికమైపోయె ♦ పదవి కలుగగాను పథముగనరు
పదవి ధనము రెండు పరివేదనములాయె ♦ దాని దెలియుటన్న ధరణిమిన్న.

ఆ.వె. రాజకీయములును రభసగమారెను ♦ భోజులంతనేడు భోక్తలైరి
పరులకింతపెట్టువరులిట కరవైరి ♦ పెట్టునదియె గొప్ప పేరు దెచ్చు.

తే.గీ. సిరులకిరవైన షిరిడీని శివములలరు ♦ భక్తతతులకు భాగ్యమై భవము నందు
ఆదిమధ్యము అంతము అవనినిండి ♦ సాయిపేరున వెలసిన సదయుడీవు.

తే.గీ. మానవునిగాను జనియించి మాధవుడుగ ♦ మహిమ పంచిన మాన్యుడు మమత తోడ
అంతరాలను త్రుంచిన అవనిజనుడు ♦ కులము మతముల కుళ్ళును కూలద్రోచె.

తే.గీ. నామరూపములన్నియు నశ్వరములు ♦ కానరానిది ఆత్మగా గాంచెతాను
జ్ఞానబోధను గావించె జాణగాను ♦ నిష్ఠశ్రద్ధలనిధిగాను నిలచె జగతి.

తే.గీ. జీవిపుట్టుక మరణము జియ్యెరెరుగు ♦ కష్టసుఖముల మాటలు కలవరములు
పాపపుణ్యములను మాట పరముడెరుగు ♦ అట్టి పరముడు సాయియై అవనివెలసె.

తే.గీ. రామకృష్ణుల రూపము రహికి సాయి ♦ శివుని విష్ణుల దివ్యత భవుడు సాయి
నిత్యసత్యాల నియమాల నిధియె సాయి ♦ సర్వ అవతార సారము సాక్షిసాయి.

తే.గీ. నీదునామము జపియింప నిధులు గురియు
రూపమునుగాంచ జనులకు రుజలు తొలగు
నీదు తత్త్వము భావింప నియతి గలుగు
పూజచేసిన జగతియె పూజ్యమగును.

తే.గీ. సద్గురువు నీవు జనులకు సద్గతికిని ♦ మానవత్వపు దైవము మార్గమందు
బంధనములన్ని తొలగించు బంధువీవు ♦ అందచందాల భువికీవు ఆశ సుమ్ము.

తే.గీ. నీవు కరుణింప కఠినత కరగిపోవు ♦ ఆరువర్గాలు అల్లంత దూరమేగు
శాంతిసౌఖ్యాలు ప్రేమయు కాంతిగలుగు ♦ అభయదానము నరులకు ఆస్తి సుమ్ము.

తే.గీ. పల్లెపల్లెన నీగుడి ప్రాభవమ్ము ♦ పట్టణములందు జనులది పరవశమ్ము
షిరిడియానము జనులకు శివము పంచు ♦ నింబవృక్షము నీడయె నిధులు నించు.

తే.గీ. సర్వమతముల సారము సహితముగను ♦ నీదు హారతి హరియించు వాదులన్ని
బాధలనుగూడ బాధించు భవుడవీవు ♦ సాధువాదమునీదాయె సరసులకును.

తే.గీ. అల్లమాలికు అనుచును చల్లగాను ♦ ఈశ్వరేశ్వరుగాంచెడి హితుడవీవు
యోగియోగిరాడ్విధమున యోద్ధగాను ♦ జనుల నుతులను పొందెడి జయుడవీవు.

తే.గీ. ఆర్తులందరి ఆర్తిని ఆలకించి ♦ అభయమొసగెడి ఆప్తుడవవనినీవు
వేదవేద్యుడవీవుగా వేదనలను ♦ భావనముజేసి భాగ్యము పంచుదీవు.

తే.గీ. చిత్రచిత్రాతి చిత్రముల్ చెలువులేక ♦ జరుగులోకాన జాగృతిన్ పరగజేసి
కారణములకు నీవిట కారణముగ ♦ కలికికాంతిని ప్రసరించు కారకుండ.

తే.గీ. సంతు చింతల వంతల సదయతోడ ♦ అంతమొనరించి ఆశీస్సులందజేయు
సంగముక్తుల నందరి సరసముగను ♦ శర్మకర్మల నియమించు శక్తినీది.

తే.గీ. నీదుపావన చరితను నియమమునను ♦ చదువు వారల చరితయు పదవిగనును
ఆచరణమున నదిగాంచ ఆస్తియగును ♦ అంతరంగము శుద్ధమై శాంతిగలుగు.

తే.గీ. భక్తితోపూజసేయగ శక్తిగలుగు ♦ యుక్తముగనర్చసేయగా యుక్తిగలుగు
భక్తి, శక్తియు యుక్తియు భాగ్యమిచ్చు ♦ రక్తిసాయిని సేవింప రమ్యమగును.

తే.గీ. నీదుపాదముల్ స్పృశియింప బాధ తొలగు ♦ అహము అవనతమగునుగా అవధిమీర
క్రోధమేరాదు కోరికల్ కొరవులగును ♦ నీపథమునందు పదములు పరవశములు.

తే.గీ. శక్తి శతమాన కీర్తికి యుక్తివీవు ♦ వేదవాదాలనాదాల విభుడవీవు
విశ్వవిబుధుల విజయంపువిలువ నీవు ♦ అంతమేలేని జగతికి అంతమీవు.

తే.గీ. అణువు అణువున నిండిన అధిపుడీవు ♦ అండపిండాండ బ్రహ్మాండ అవధినీవు
భూతకోటికి భుక్తికి భువన మీవు ♦ సకల యజ్ఞాల కర్మల సారమీవు.

తే.గీ. చీమకుట్టదు నీయాజ్ఞ చేతలేక ♦ వాన వరదల వరుసల వరుడవీవు
జగతియారేడులోకాల జాగృతీవు ♦ భాసమానంపు విశ్వంపు భాసుడీవు.

తే.గీ. సర్వభూతాలపై దయ సాగుచుండ ♦ కలిమిలేముల కథలెన్నొ కదలుచుండ
నిర్ణయాలకునిధినీవు వర్ణనమున ♦ సత్యధర్మాల సారము సరళివీవు.

తే.గీ. దీనులందున దివ్యుడ దిటవు నీవు ♦ పెద్దవారలయందలి ప్రేమనీవు
బాలలందరి భ్యాగము భక్తి వీవు ♦ కన్నవారల మిన్నవు ధన్యవీవు.

తే.గీ. భార్యభర్తలయందలి బంధమీవు ♦ తల్లిదండ్రుల యందలి దయవునీవు
అత్తమామలయందలి ఆస్తినీవు ♦ మిత్రతతులందు మించెడి మించు వీవు.

తే.గీ. కలలసాకారమును జేయు కలిమినీవు ♦ ఆశ ఆశయసాధనకవధిమీరు
విశ్వమానవ తత్వంపు విబుధుడీవు ♦ ఘనత ఆధ్యాత్మ భావాల గరిమ మీరు.

తే.గీ. భగవదర్పిత కర్మలు భాగ్యమగును ♦ నిగ్రహమ్మున జనులందు నియమమబ్బు
కనగనిష్కామ కర్మలు కలిమి గలుగు ♦ సాయి భక్తికి మోక్షము సారమగును.

తే.గీ. భక్తినిను పూజసేతును భాగ్యదాయి ♦ విరుల నిను నర్చజేసెద విబుధశాయి
వరులవరుసన నిలబెట్టు వసుధ శాయి ♦ తృష్ణగెల్చెడి దిటవిమ్ము కృష్ణశాయి.

తే.గీ. నేను నేనను భావము నెవ్వగాయె ♦ నీవె నిత్యము సత్యము నియమములను
అంతరంగమునందున అధివసించు ♦ ఆత్మదర్శనమందించు అవసరమున.

తే.గీ. మూలకారణమై నీవు ముద్దుగొల్పు ♦ దేవ దేవుడ దేవేశ దివ్యతలను
సచ్చిదానంద రూపుడసదయతోడ ♦ మాదు మాలిన్యములనన్ని మహిమ జేయి.

తే.గీ. అన్నదానముసేయుట మిన్నగాను ♦ నీదు భక్తులు దలతురు నిత్యమిచట
బీద భీరువులందలి బాధలన్ని ♦ మాయజేసెడి నీశక్తి మహిమయుతము.

తే.గీ. ఊది ఉన్నతమాయెను ఉర్వరందు ♦ నొసట ధరియించ పండును నోములన్ని
నిధియఖండము వెలుగును నిత్యమిచట ♦ దానిదర్శించ ధరణిని ద్రఢిమ గలుగు.

తే.గీ. పాదరజమింతసోకగ పావనమ్ము ♦ ఆత్మధ్యానము సేయగ అతిశయమ్ము
గురుతగురువారమెంతయొ గరితసుమ్ము ♦ అవని గురుసేవ సేయగ అధికయశము.

తే.గీ. మంచిమార్గము విడుచుండె మానవాళి ♦ దురితమార్గాన జనుచుండె దుష్టులంత
మంచి చెడులకు మూలమై మహిని నిలచి ♦ మార్గదేశికుడై నీవు మలగినావ.

తే.గీ. అంతమేలేని నీలీల లద్భుతములు ♦ భోగరోగాల భోక్తలు భోరు కొలుప
పంచభూతాల సాక్షిగ పరవశముగ ♦ చేసిచూపితి జనులకు చేవతోడ.

తే.గీ. మేఘములలోన మెరుపును మెలికవేసి ♦ వర్షహర్షము తోడత వసుధ దడిపి
పచ్చదనమున ప్రకృతి పాదుకొలిపి ♦ సస్యములసాగుసేసిన సదయుడవుగ.

తే.గీ. స్వార్థచింతన పెరిగెను స్వాతిశయము ♦ అంతరములట అవధులు అధికమాయె
వింతవర్తన నర్తన విపులమాయె ♦ అందరొకటిగ భావించ అతిశయమ్ము.

తే.గీ. మానవత్వము మారెను దానవతగ ♦ మహిత తత్వమునీదిగ మాకు పంచు
భక్తి భావాల బతుకుల బాగుసేయి ♦ ముక్తిలో ముంచు మమ్ముల శక్తితోడ.

తే.గీ. సత్వరజసునుతమసుల సారమీవు ♦ త్రివిధ శ్రద్ధలు కలిగిన తీరునీది
మాయమాయముజేసెడి మమత నీది ♦ జ్ఞానయోగాన నడిపించు జాణవీవు.

తే.గీ. చదువు చదివిన సంస్కార సరళిగనము ♦ ధనమెజగమని జనులంత దారినడచు
మనము గమనింపరెవరును మార్గమందు ♦ మంచి మమతాను రాగాలు పంచుమయ్యా.

తే.గీ. ఎఱుకలేనట్టి జీవులు ఎదల మరచు ♦ జనుల హృదయస్థుడైయుండి ఘనముగాను
యంత్రములరీతి ద్రిప్పెడి మాంత్రికుండ ♦ సహన సహకార భావాల సరళినివ్వు.

తే.గీ. నందనమురీతి జగతిని వందితముగ ♦ స్వర్గసీమగ లోకాన్ని స్వాగతించ
కామధేనువు రీతిగ కలిమినివ్వు ♦ కనసమర్థుడవీవెగా కలియుగమున.

తే.గీ. మలినమాయెను మనసులు మదముతోడ ♦ కననసూయను కలతలు కలవరములు
కామబాధితులందరు కరుణ లేక ♦ వలపు లేకుండ తరిగెను తలపులన్ని.

తే.గీ. ఎన్నితీర్థాలు సేవింపనేమి ఫలము ♦ ఎన్నియజ్ఞాలు సేయగా నేమి ఫలము
ఎన్ని వేదాలు చదివిన నేమి యశము ♦ మనసు నీకర్పణముసేయ మహితఫలము.

తే.గీ. ఎందరవధూతలిలలోన ఎఱుకగనిరి ♦ స్వాములెందరు జగతిన రాములైరి
గ్రామదేవతలెందరు గణ్యులైరి ♦ సాయిబాబను మించిన సామిలేడు.

తే.గీ. వేదశాస్త్రాల వెలుగులు వేదనాయె ♦ ధర్మశాస్త్రాల దారులు దహనమాయె
సర్వధర్మాల సారము పర్వముగను ♦ సాయి తత్త్వమువిత్తమై సాగుజగతి.

తే.గీ. కలిమిలేములు కలతల కొలుములాయె ♦ బలము బాధ్యతలన్నియు బరువులాయె
భాగ్యమేమన్న నీతోడి బంధమాయె ♦ వందనముసేతునోసాయి వాసిపంచు.

తే.గీ. ఘోరసంసారబాధలు భారముగను ♦ కష్టనష్టాల కర్మలు కఠినముగను
యాత్రసాగించు జీవులు యాంత్రికముగ ♦ వారికడతేర్చువాడవు వసుధనీవె.

తే.గీ. కర్మమర్మము తెలియదు కలియుగమున ♦ నీదు ఆచరణమ్మున నియతిగలదు
భారమునువేయనీపైన బాధలేదు ♦ సర్వకర్మలు నీవైన పర్వమగును.

తే.గీ. ఈతి బాధలు జనులను ఇరుల ముంచు ♦ నాతి బాధలు నరులను నడుమువంచు
జాతి బాధలు జగతికి చేటు దెచ్చు ♦ అన్నిబాధలు దీర్చెడి అధిపుడీవె.

తే.గీ. జనులకద్వైత మన్నను జగతి కాంతి ♦ భావద్వైతము భవమున భాసితమ్ము
కనవిశిష్టము అద్వైత కలిమి భువికి ♦ అన్నిమతములమిన్నగు అవని మీది.

తే.గీ. తాపత్రయమున ఘనతయు తరిగిపోవు ♦ త్రికరణములిల వేరైన తీరువేరు
కామక్రోధములోభము కలిమి కలత ♦ మూడులోకాల విభుడవు మురువు నివ్వు.

తే.గీ. ఆత్మబోధను జేసిరి అధిపులంత ♦ నిగ్రహమ్మున ఘనులైరి నియమములను
తెలియదగినది యేదియో తెలిపిరంత ♦ ఏది తెలిపిన నీసాటి ఎవరు లేరు.

తే.గీ. హింస హంసగ విలసిల్లు హితము వీడి ♦ క్రూరతత్త్వము వ్యాపించు కూర్మి విడచి
జీవహవనము సాగగా జిలుగు వీడె ♦ కరుణబోధించి జనులను గాచినావు.

తే.గీ. నిధులు ఎన్నైన రావుగా నీకుసాటి ♦ విధులు నీవైన విజయము విలువ మిన్న
పదవి నీపాద పద్మము ఫలముగనగ ♦ సాయి నీచేత సరసాల సారమిచట.

తే.గీ. మేధ జీవులయందున మేలిమీవు ♦ బోధ జీవులయందున బోద్ధవీవు
వేదనలు లేని లోకంపు వెలుగు నీవు ♦ మానవాళికి మార్గము మహిమనీది.

తే.గీ. భయము బాధయు భవమున బంధమాయె ♦ గుణము అవగుణమాయెగా గురుతువీడి
గురువు నీవుగ జనులకు గురుతుజేసి ♦ దేశికునిరీతి జగతికి దేవుడైతి.

తే.గీ. చైత్యమందున మీరూపు చెలువు కలుగు♦పటములందున మీరూపు పటువు మించు
విగ్రహములందు మీరూపు విలువ పంచు♦ ఎన్నిరూపుల మిన్నవు ఎఱుక మీరు.

తే.గీ. మీదు మెల్లని చూపుల మించుకాంతి ♦ మృదువు మాటలు జగతికి మధురమగును
మీదు వర్తన కీర్తన వాదులేదు ♦ చెలిమి కలువల చెలువము బలిమి మీది.

తే.గీ. పత్రముల నిన్ను పూజింతు ఫలము నిమ్ము ♦ పుష్పచయమున నర్చింతు పుణ్యమిమ్ము
ఫలములను నిత్తులోకాన బలమునిమ్ము♦జలములను పూజసేతును జయమునిమ్ము.

తే.గీ. ఆర్తులెందరొ పూజింత్రు ఆర్తిదీర్చ ♦ నిన్ను దెలిసెడి జిజ్ఞాస మిన్నగాను
అర్థకాంక్షులు భజియింత్రు అవనినిన్ను ♦ జ్ఞాన గణ్యులు నినుగాంచి జాణలైరి.

తే.గీ. కోట్లు కోరెడి బతుకుల కొరత లేమొ ♦ పాట్లు పడువారి జీవన ఫలితమేమొ
కోట్లు పాట్లును జగతిన కోమలముగ ♦ ఎఱుక గలిగించు ఓ సాయి ఏలుకోర.

తే.గీ. పరమపావన జీవన ప్రగతి తోడ ♦ మహిమలెన్నెన్నొ మహిలోన మాన్యతలను
జనులకిచ్చిన జయశీల జవమునీది ♦ తరములెన్నెన్ని మారినన్ తరగదదియు.

తే.గీ. మానవునిగాను జనియించి మాధవునిగ ♦ షిరిడి దేశాన జీవించి శివములొసగి
మూడుమూర్తుల మూలమై ముచ్చటగను ♦ పరమ పావన ఫలముల పంచినావ.

తే.గీ. ఆదిగురువుగ అందరి ఆర్తి దెలిసి ♦ సద్గురువుగాను సహనము సరళినిచ్చి
పరమ గురువుగ ఫలముల వరములిచ్చి ♦ ఆది అంతము దెలిసిన ఆద్యుడగుము.

తే.గీ. వర్షమిత్తువు హర్షము వసుధ కంత ♦ నేలనెండింప జేతువు నేవళముగ
పంచభూతాల సాక్షివి పరముడవుగ ♦ గుణము నిర్గుణ భావాల గురుతునీవు.

తే.గీ. భూమి ఆకాశములనున్న భూతినీది ♦ నిధులనిధనముగావించు నియతినీది
ద్వంద్వరహితముజేసెడి వంద్యుడవుగ♦హృదయగుహలందు నిలచిన సదయుడవుగ.

తే.గీ. నీదు చేతలు చిత్రమున్ వాదులేదు ♦ కల్పమగునుగ సంకల్ప కలిమితోడ
నిత్యనైమిత్తికములందు నిధివి నీవు ♦ సత్యసారపు సత్త్వము సాగు సతము.

తే.గీ. యాంత్రికమ్మాయె జగమంత తాంత్రికముగ
మంత్ర తంత్రాల మాంద్యము మరపు వరపు
కాలగమనాన కర్మలు కాంతిలేవు
నీదు దయలేక జగతియె నీరవమ్ము.

తే.గీ. ఆశచావక ఆర్తియె అధికమాయె ♦ నిత్యమాయెను ధనమిట నీతిలేక
భోగయోగాలు బోధలు భువిని నిండె ♦ తెలసి తెలియని నరులకు తెలివినివ్వు.

తే.గీ. చావుబతుకులు తెలియని చదువరులును ♦ శాస్త్రసారము దెలిసిన శక్తులంత
ఆత్మశోధనజేసిన అధికులంత ♦ నీదునియతికిలోబడి నిలచువారె.

తే.గీ. గ్రామజీవనమంతయు రామరామ ♦ నగరమందలి బతుకులు నశ్వరమ్ము
చైత్యమాయెను చైతన్య చెలువు నేడు ♦ శక్తులన్నియు నీవెగా చెలిమి మిగులు.

తే.గీ. గాలియున్నంతసేపెగా గరువమంత ♦ తేలిపోయిన తరువాత తెలివిలేదు
కాలమొచ్చిన కాలుడు కలుపుకొనును ♦ విధిని తప్పించ నీకెగా సాధ్యమగును.



తే.గీ. నీదికానిది గోరుట నీతిగాదు ♦ అందలేదని దుఃఖింప నలవిగాదు
అనుభవమునంది ఆనందమందగాను ♦ విజ్ఞు లక్షణమందురు విబుధులంత.

ఆ.వె. దేశభక్తిలేని దేహాలిజ్జగమున ♦ దిటవు కలిగియుండెదివ్యులుగను
మాతమమతలేని మానవులందరు ♦ మహిమగొనుచునుండె మహిని నేడు.

ఆ.వె. పదవికలుగగానె పథమును దప్పుచు ♦ పాపములను చేయు పరములంత
రాజకీయరంగు రంగరింతల తోడ ♦ ప్రజల కంటకులుగ పలవరింత్రు.

ఆ.వె. గీతలోని మహిమ గీష్పతియెరుగును ♦ మాత మనసుదెలియు మహిని జనుడు
ఇహము పరము రెండు యింపగుచేష్టలే ♦ అదియె తెలియగాను ఆర్తి తొలగు.

ఆ.వె. అమెరికాకు వెళ్లి అందలమెక్కగా ♦ పేగుబంధములును పెరిగిపోయె
సుఖము సుందరతలు సురుచిరమౌ నంద్రు ♦ వేళమించగానె వెగటుసుమ్ము.

ఆ.వె. వర్తనమ్ముచూడ వర్తులమైపోయె ♦ నర్తనమ్ముచూడ నవ్యమాయె
దివ్యమాయెనేడు దేవతావస్త్రముల్ ♦ నగ్నమాయె బతుకు నవ్వులాట.

ఆ.వె. చింతనమ్ములేని చింతలు లేనట్టి ♦ వసుధజనుని బతుకు వాసిలేదు
బాధబోధరీతి భాగ్యముకల్గించు ♦ బోధకలుగుజనుడు భోగ్యుడగును.

ఆ.వె. యోగమన్ననేమో యోజనసేయరు ♦ యాగమన్నజనుని ఎదల మరపు
యోగయాగములను యోద్ధలుగమనింత్రు ♦ యోగమన్న సమత రోగరహిత.

ఆ.వె. 'నేను' దెలియుటన్న నెవ్వగ జనులకు ♦ నేను పేరుకాదు నేను నేనె
నేను రూపుకాదు నేనేమో నేనెగా ♦ నేను ఆత్మసుమ్ము నేవళమ్ము.

ఆ.వె. మనసు మర్మమేమొ మాధవుడెరుగును ♦ మనిషి తెలియుటన్న మహిమగాదె
మార్ధవమ్ము మనసు మహిజనమాన్యుడు ♦ కఠినమైన మనసు కలత సుమ్ము.

ఆ.వె. కోపమన్ననేమొ కొఱవియె జనునకు ♦ కొఱవి కోర్కెయైన కొరత సుమ్ము
కానిదానికోర కలతయె జనునికి ♦ లభ్యమైన దగును లక్షణమ్ము.

ఆ.వె. ఆత్మశోధనమ్ము ఆధిక్యమగునుగా ♦ విషయనిగ్రహమ్ము విలువ సుమ్ము
బుద్ధిసూక్ష్మమైన బుద్ధత ప్రాప్తించు ♦ బుద్ధుడైన జీవి ఇద్ధమగును.

ఆ.వె. ఋషులురుచ్యమైన విషయముల్ చెప్పిరి ♦ వారిదారిన నడువ వాసికెక్కు
మాటచేతను మనసు మహిమతో చెన్నార♦జగతి మధురమగును జయము కలుగు.

ఆ.వె. కలలు కలలుగాను కమ్మగా నుండును ♦ కలలు కల్లలైన కలత కలుగు
కలలు నిజములైన కలియుగముండునా ♦ కలిని కమ్మకలలు కామితములు.

ఆ.వె. ఆస్తిజాస్తి కలుగ ఆస్తిక్యమేమగు ♦ ఆస్తికతయెజనుని ఆస్తి సుమ్ము
మస్తకమ్మునందు మాధవునుంచగా ♦ మనిషి దైవమగును మహినినేడు.

ఆ.వె. కవిత సెప్పగాను కలిమియె బలిమియె ♦ కలతలేని బతుకు కవిది కాదె
సుఖము దుఃఖములను సుందరీతిని ♦ అందజేయు వాడె అసలు సుకవి.

ఆ.వె. విందులెన్నొ సేసి విలువలు మరచిరి ♦ పందలందరిచట పరములైరి
అందమైన బతుకు అర్థమువేరాయె ♦ ఆర్థికమ్ము మింగె హార్ధికమును.

ఆ.వె. భార్య భార్యకాదు భారమ్ము మోయక ♦ భర్తభర్తకాదు భక్తిలేక
సతియు పతియు కలిసి సహకారమందగా ♦ జీవనమ్మునందు జిలుగు కలుగు.

ఆ.వె. వీర్యరహిత యువత విలువలు విగతమై ♦ ఆర్యులందు భక్తి అసలెకరవు
పెద్దవార్ల మాట పేలవమగుచుండె ♦ గమ్యగమనరహిత గాడిదప్పె.

ఆ.వె. నేత జాతకమ్ము వాతరోగముతోడ ♦ పిత్త శ్లేష్మములను పీడతోడ
పిలుపు తలపులోన పేలవమాయెను ♦ నేత బతుకుచూడ నైవ్వగాయె.

ఆ.వె. భవిత తెలియగాను బకములు వారలు ♦ జరుగువిషయములను జంబుకములు
భూతమందు వారె భూతములైరిగా ♦ నేత ధర్మమేమొ నేతిబీర.

తే.గీ. 'పూర్వ' ఆచారములుగాంచ పూతమగును ♦ 'పశ్చి'మంబులుగాంచగ పరమమగును
పూర్వ పశ్చిమ పూజ్యత పర్వమగును ♦ జనుడు జగతిని జయమును జవముమించు.

ఆ.వె. బాలవాక్కు జగతి బ్రహ్మావాక్కందురు ♦ వేదవేదివాక్కు వెలుగునించు
యోగిపలుకు లెంచయోజనమించును ♦ సత్యవాక్కుసరళి సహితమెందు.

ఆ.వె. పెద్దవారిమాట చద్దిమూటనగాను ♦ పిన్నవారిభవిత చెన్నుబారు
నిగమవాక్కులందు నిధులుండెవిధులుండె ♦ నియతి అనుసరించ నిధియె నీవు.

ఆ.వె. స్వాములంత జగతి స్వార్థముతోనున్న ♦ అర్థజగతిలోన అన్ని అసదె
పరము ఇహములందు పరమార్థసాధనన్ ♦ ప్రగతిగాంచు జనులు పథములోన.

ఆ.వె. ధర్మమందు జగతి దాక్షిణ్యమగునుగా ♦ అర్థమందు జగతి అంతరంగ
కామమగును జనుని కారుణ్యమందించు ♦ మోక్షమిందునందు మోదమగును.

ఆ.వె. ఆరువర్గములు అరదండలగునుగా ♦ క్రోధలోభమోహకొఅవి మదము
కామమోహకలిమి కలవరపరచును ♦ వానివీడినపుడు వాసికలుగు.

ఆ.వె. మనసు కలుగు జనుడు మార్దవరీతిన ♦ మాటమధువు పంచు మహిని నిజము
చేత చెలువుతోడ చైతన్యకలితమై ♦ త్రికరణముల తీరు తియ్యనగును.

ఆ.వె. సర్వులందు నీవు సమభావముంచుము ♦ గురువులందు గురుత పరువు పంచు
స్వార్థరహిత జనుడె సార్థక జీవియౌ ♦ మతములన్ని చెప్పుమాట అదియె.

ఆ.వె. గాలి కలిగియున్న గరువము పరువము ♦ గాలిలేక యున్న జాలి కలుగు
గాలి కలిమిలేమి గంధర్వులెరుగును ♦ తనువులోని గాలి తపనయేమొ?

ఆ.వె. మట్టియందుబుట్టి మాన్యుడై జనుడుండ ♦ మట్టిదిట్టయౌను మహిమచేత
దీనుడైన జనుడు దిటవేమి లేకుండ ♦ సంచరించగాను వంచనమ్ము.

ఆ.వె. ఇంద్రియములునీకు ఇంపును గలిగింప ♦ నిగ్రహమ్ము కలుగు నియతితోడ
ప్రగ్రహమ్ము తోడ పలుమారులుండగా ♦ ఆగ్రహమున జనుడు అవనతుండు.

ఆ.వె. ఎంత తెలివియున్న ఏబ్రాసి చందము ♦ సుంత ఆచరణము శుభకరంబు
సంతలోని తెలివి వంతలమయమగు ♦ వంత తెలియగాను వసుధ శాంతి.

ఆ.వె. ధరలు హెచ్చుచుండె ధర్మము తగ్గుచు ♦ మారణమున జనుడు మసలుచుండె
స్వర్ణభూమినేడు సార్థక స్వార్థమై ♦ అర్థరహితమాయె అంతరములు.

ఆ.వె. నాయకత్వమేమొ నయగారమాయెను ♦ పదవి పథమునందు పరమమాయె
ఓటునీతిదప్పి వాటము మోసము ♦ భాగ్యభరతమాత బావురనియె.

ఆ.వె. ఉగ్రవాదమేమొ ఉధృతమాయెను ♦ అగ్రవాదమేమొ అదుపుదప్పె
ఛాందసమ్ము మతము చార్వాకమాయెను ♦ మేధసాగుచుండె మేదినిచట.

ఆ.వె. బాంబు మోతలెన్నొ బతుకుల కబళించె ♦ మందు పాదరలను మారణమ్ము
జైలుగోడమధ్య జనహత్యలాయెను ♦ శాంతియన్ననేడు వాంతియాయె.

ఆ.వె. కాంగిరేసు రేసు కాలము రాగానే ♦ రాలిపోవు సుమ్ము రాజ్యమందు
నిత్యమిచట నీతి హత్యగుచుండెను ♦ పాలనమ్ము చూడ పాలిపోయె.

ఆ.వె. పార్టిలన్ని నేడు పథమును విడిచెను ♦ పదవి సాధనమ్ము విదితమగును
సిగ్గుఎగ్గులేని సిద్ధాంతరాద్ధాంత ♦ వృద్ధ వర్గములును సిద్ధమాయె.

ఆ.వె. రామ రామయన్న రాసిక్యమాయెను ♦ భారతమ్ము గాంచ, భా'రతమ్ము'
భాగ్యరహితమాయె 'భాగ'వతము ♦ భరత సంస్కృతంత భారమాయె.

ఆ.వె. చిలకపలుకులెన్నొ చిలుకరించుచునేడు ♦ పలకబారుచుండె పడతినాల్క
నారి'వారి'లోని నవపద్మమాయెను ♦ వాలకమ్ము చూడ వనిత ఘనత.

ఆ.వె. సాధికార వనిత సారళ్యమాయెను ♦ మగల సమతయందు మహిమ మీరె
ఆదిదంపతులకు అర్థము మారెను ♦ సగము సగముగాను వగపు కలుగు.

ఆ.వె. సిగ్గుకొరకు బట్ట సింగారమాయెను ♦ బట్టలేని తనము బాగుగాను
'పశ్చిమంబు'నందు పరమార్థముండగా ♦ 'తూర్పు' మార్పుచెంది తూలిపోయె.

ఆ.వె. సంక్రమణము వచ్చె సంక్రామ కమ్ముగా ♦ క్రమము దప్పుచుండె కాలమంత
ఆంగ్లవత్సరమ్ము ఆంధ్రమ్ము గామారి ♦ భారతమ్మునందు భారమాయె.

ఆ.వె. శీతవాతమేమొ చింతలు కల్గించ ♦ సూర్యరస్మిగాంచ సుంతలేదు
గోరువెచ్చగదుల గోములగాంచగా ♦ మారుకాలమేమొ మరపుకొచ్చు.

ఆ.వె. వేరుపాటులేమొ వేళకు మిగిలెను ♦ జారుపాటులన్ని జగమునిండె
పాలనమ్ము నందు పార్టీల పల్టీలు ♦ ఆర్య నాయకులకు ఆవులింత.

ఆ.వె. మెత్తనైన భామ మొత్తిన మేలగు ♦ గట్టిదనపు గరిత గర్వభరిత
మాట మనసుచేత మహితమౌ మహిళకు ♦ మాన్యమగును బతుకు మగనితోడ.

ఆ.వె. పంట యింటికొచ్చి పనిపాట్లతోగూడి ♦ అల్లుడింటికొచ్చి అందముగను
పిండివంటలొండి మెండుగా పెట్టగా ♦ సంక్రమణము జగతి సరభసమ్ము.

ఆ.వె. తెలుగునేలయందు తెలగాణమనుచును ♦ వాదు బయలుదేర వాసితగ్గె
అందరొకటిగాను ఐక్యతనుండగా ♦ ఆంధ్రదేశమిలను సాంద్రమగును.

ఆ.వె. కలుషరహితమైన గాలియు కరవాయె ♦ నీరు నిప్పు మరియు నీతి కూడ
కలుషమయమునేటికాలమంతయు చూడ ♦ కలుష భయము వీడు కలతమాని.

ఆ.వె. బడులు గుడులు గాంచ భారము ఘోరము ♦ గురులు దేవులంత గుంభనులుగ
ఆధునికముగాన అభ్యంతరమ్మాయె ♦ బోధ గాధలన్ని బోరుగొలుపు.

ఆ.వె. పూర్వవాక్కులన్ని పూజ్యము జనులందు ♦ భావి భరతభాగ్యదాతలందు
సంప్రదాయమెరుగ సహితము మహితము ♦ కొత్తయైన కొఱవి కొంపముంచు.

ఆ.వె. వేదవిద్యలన్ని వెలుగులు జిలుగులు ♦ భాష భవమునందు బాధకలుగు
సంస్కృతీయమాయె సాగనివిధమున ♦ బ్రహ్మవిద్యచూడ భాగ్యరహిత.

ఆ.వె. రామరాజ్యమంచు రహిజనులందరు ♦ మాటలందు మహిని మనుచునుంద్రు
రాజకీయభోగరారాజులందరు ♦ బొక్కసమునుమెక్క వెక్కసమ్ము.

ఆ.వె. లెక్కలేనియట్టి మిక్కిలి దేవతల్ ♦ జనులయందునిలిచి జాగృతిగన
భాగ్యమగునుగాని భావము నందున ♦ లేనితనముగాంచ లేవడాయె.

ఆ.వె. ఋతువులన్నిమారి రుజలను కలిగించ ♦ జనుడుజవమువీడె జగమునందు
మార్పుమనిషిలోన తీర్పుగ సాగగా ♦ క్రమము తప్పదుగద కాలమందు.

ఆ.వె. పరవశమ్మునొందు ప్రకృతికాంతయు ♦ నరుని వర్తనమున వరపువీడె
తలపుతరియజేయు తారుణ్య భావాన ♦ కలసిమెలసి యుండ కలలు పండు.

ఆ.వె. కల్లమాటలిలను కలవరపరచును ♦ జగతి జనులయందు జయములేక
మాట సత్యమైన మరుమల్లె విధమగు ♦ విరుల సరుల వరుస విజయమగును.

ఆ.వె. దండనమ్ములేని ధరణి పాలనయందు ♦ మండనమ్ములేదు మానవులకు
ఖండనమ్ము కలిమి కాపురుషులకిల ♦ భండనమ్ము బతుకు భాగ్యదాయి.

ఆ.వె. అగ్గిపెట్టెయందు అగ్నియు అగ్గువ ♦ ముట్ట బుగ్గియగును మూలముగను
అగ్గిరీతి మంచి అవతార రూపమై ♦ అవని నిండిపోవు అతిశయముగ.

ఆ.వె. పుట్టుచూడలేని పూజ్యుడు నరుడాయె ♦ చావు తీరుదెలియ సవ్యమగునె
చావు పుట్టుకలును దేవుని మహిమలు ♦ మహిమలేని నరుడు మందుడాయె.

ఆ.వె. నిన్ను నీవు దెలియ మిన్నగుజగమున ♦ పరుల గాంచ గలుగు పరమముగను
జగము గానవచ్చు జయశీలరీతిగా ♦ తెలియలేని నరుడు తేటయౌనె.

ఆ.వె. మధురమైన వాక్కు బధిరము భువిలోన ♦ తీక్ష్ణమైన మాట తీర్థమాయె
మౌనవాక్కు జగతి గౌణము గరువము ♦ మౌనమన్న మాటె మనకు చేదు.

ఆ.వె. అనుభవాలభవము అభిమాన భరితమ్ము ♦ మానసహితభువికి మార్గమదియ
సహన సహిత సమత సరసముగరితము ♦ అనుభవమ్మె భువిని అధికతమము.

ఆ.వె. అనుభవమ్ములేని అవనిజీవనమేల ♦ జీవరహితమైన జియ్యరేల
భావరహితమైన భాగ్యమ్ము అదియేల ♦ భవము భవ్యమగును భావమందు.

ఆ.వె. అందమైన యిల్లు అందరు కాంక్షిత్రు ♦ కాంక్ష తీరగాను ఆంక్షలెన్నొ
ఆంక్షలన్ని తీరి అందము ముందున్న ♦ రక్షసేయగాను శిక్షయేగ.

ఆ.వె. కొత్తయింటి బులుపు కొంత కాలమ్మిల ♦ బులుపు వాపుగాని బలుపు కాదు
అభ్రరీతిగాను శుభ్రము చేయగా ♦ విభ్రమమ్ముతోడి విసువుకల్గు.

ఆ.వె. ఆంక్షలేనికాంక్ష అధ్వాన్నమిలలోన ♦ కాంక్ష కలిమి కలత కలవరమ్ము
కోర్కె జగతిలోన కోమల అమలమై ♦ జీవి జీవితమ్ము జిలుగు వెలుగు.

ఆ.వె. వైద్యశాస్త్రమిలను వైభవోపేతము ♦ రోగరహిత భువికి రాగసహిత
శక్తిలేని శాస్త్ర చాలన పాలన ♦ రోగశక్తి వీడురోజులొచ్చె

ఆ.వె. సెల్లుఫోనులందు సెల్లిపోయెను శాంతి ♦ మోత వాతబెట్టు మోజుతోడ
సిరుల బతుకులన్ని సిందరవందరై ♦ యువత భవిత గాంచ నవతలేదు.

ఆ.వె. అవసరమును చూచి అవకాశమునుచూచి ♦ మర్మనమ్ముసేసి మనుట లెస్స
కన వివేకరహిత జనజీవితముగాంచ ♦ కలవరమ్మెకాని కాంతిలేదు.

తే.గీ. నీవు నేనను మాటలు నిన్నటివిగ ♦ మనము మనదనుమాటలె మహిని మిన్న
భవిత గాంచగ భాగ్యము బంధనమున ♦ బంధుమిత్రులరీతిగ భారతమున.

ఆ.వె. పచ్చదనముతోడ పరిఢవిల్లును శాంతి ♦ శాంతితోడ శక్తి కాంతిగరిత
కాంతితోడ జీవి కలవరమేలేక ♦ వరపు జీవితమున వసుధ నిలచు.

ఆ.వె. పుస్తకములు జనుని మస్తకములు నింపు ♦ మేధతోడ మిగులు బోధతోడ
పుస్తకమ్ము హస్తభూషణమగునుగా ♦ అట్టి భూషణమ్మె అధికతమము.

ఆ.వె. నల్లకోటులందు తెల్లని న్యాయము ♦ మూయబడెను ముద్దు ముచ్చటగను
బలిమి న్యాయమయ్యె బహుబాధ జగమున ♦ కోర్టు కోలుపోయె కొలువు బలిమి

ఆ.వె. తప్పునొప్పుజేయు మెప్పైన వాదనన్ ♦ వాదుచేదుగాను సేదదేరు
వాటమైన మాట దీటగు న్యాయాన ♦ వట్టిపోయె జగతి గిట్టిపోయె.

ఆ.వె. న్యాయమూర్తిసేత న్యాసము దప్పగా ♦ మూర్తిగాను మిగిలె ఆర్తితోడ
స్ఫూర్తిదాతమూర్తి సుగుణము విగుణమై ♦ ధర్మమగుణమాయె దారిలోన.

ఆ.వె. తల్లిదండ్రిప్రేమ చెల్లిపోయెను నేడు ♦ వృద్ధులాశ్రమములు వృద్ధినందె
నాగరీకమన్న నాగుబామాయెను ♦ మ్రింగె ప్రేమలన్ని మిత్తవగను.

ఆ.వె. బంధుమిత్రతతులు బంధములైరిట ♦ అర్థమతులు జనులు ఆర్థికమున
మాటసాయమన్న మన్ననకరవాయె ♦ మమతలేక మనుట మహిమనేడు.

ఆ.వె. కాంతకనకములును వంతలు దెచ్చును ♦ వంతతోడి కొర్కె వసుధ జెరచు
సుంతసుఖములేని సూక్తులు మరియేల ♦ కాంతకనకములను కలియబోకు.

ఆ.వె. ఇంధనమ్ము ధనము ఇంపగు జగతిన ♦ మాడ్చివేయు జనుల మసిగచేయు
ధనమెముఖ్యమైన దారుణమగునుగా ♦ వలసినంతకోర వాసి కలుగు.

ఆ.వె. ఆశలేని జీవి అభివృద్ధి నొందదు ♦ ఆశయమ్ములేక అతడె చెడును
ఆశ ఆశయములు అవకాశముండగా ♦ అతని బతుకె అవని అందమగును.

ఆ.వె. లోచనమ్ము జగతి లోభము గాంచక ♦ లాభసహితమైన లాలితమ్ము
పలువిధముల లోభి నాశనమందును ♦ లోలుపతనువీడ చాలునయ్య.

ఆ.వె. అమ్మలేని బతుకు అంధకారమ్మురా ♦ నాన్నలేని బతుకు నశ్వరమ్ము
అమ్మనాన్నలిచట అసలైన దైవాలు ♦ వారి ప్రార్థనమున వాసిగాంచు.

ఆ.వె. కార్యకారణములు కరకంఠుడెరుగును ♦ ఆర్యసత్యములను అభవుడెరుగు
ఎరుకలేనివాడు ఏబ్రాసి నరుడెగా ♦ నరుడు దివ్యుడైన నాణ్యమగును.

ఆ.వె. తంటలేని యిల్లు తరళము విరళము ♦ మంటలేని యిల్లు మహితమౌను
మంట తంటలిలను మమకార మహితాలు ♦ మహిళమగల యందు మాన్యములుగ.

ఆ.వె. పడకటింటిలోన పడతులు పడుపాట్లు ♦ మగలు పడినగాని మాన్యమగును
పాట్లు పావనములు పరమార్థ జగతిలో ♦ దివ్య నరులకవియె దిటవు గూర్చు.

ఆ.వె. కామశాస్త్రమందు కామిని పరువము ♦ విధులు సుధల రీతి విశదమగును
ఆచరణమునందు అవియెరణమగును ♦ అంతరములు లేక ఆచరించు.

ఆ.వె. మగువ నమ్మదెందు మగటిమి పురుషుడు ♦ భార్యనమ్మదెందు భవపుభర్త
నమ్మకమ్ములేని నాట్యమె గృహసీమ ♦ పతివ్రతాత్త్వమన్న పారిపోయె.

ఆ.వె. డబ్బుచాటు మనిషి డాంబికవర్తనన్ ♦ నటన చేయుచుండె ఘటికుడుగను
ఘనత సంభవించి గణ్యత పోగానె ♦ డబ్బు డుబ్బు రీతి దబ్బరాయె.

ఆ.వె. రాజులంతపోయి రాజ్యాలు నశియించె ♦ వారివర్తనమున వరపులేదు
వరపు వర్తనమున వసుధమారాజులు ♦ వాసికెక్కిరిచట రాశిమీర.

ఆ.వె. కర్కశత్వమున్న మర్కటములరీతి ♦ మనుజజాతియుండె మంచివీడి
వంచనమ్ముతోడ వసుధను మించగా ♦ వాయుదేవురీతి వాసిదరిగె.

ఆ.వె. శుద్ధి సిద్ధి రెండు సూక్ష్మమౌ పద్ధతుల్ ♦ సిద్ధిపొందలేడు శుద్ధిలేక
ఆత్మశుద్ధికల్గ అసమాన వర్తనన్ ♦ సిద్ధిగాంచవచ్చు సిరిగజగతి.

ఆ.వె. వధువు వరులు కలిసి వంశమ్మునిలపగా ♦ కోరి కొమరుగనిరి కొలతమీర
వంశవాసి చెరిచి వట్టిగొడ్డుగ తాను ♦ పుత్రవిలుగ గనగ పూజ్యమాయె.

ఆ.వె. కూతుగనగ నేడు కుమ్ముదుమ్మనుచుంద్రు ♦ కూతువిలువదెలియ చేతమందు
పట్టెదన్నమెట్టు పరమురాలామెయే ♦  కూతుగన్నఫలము కొలతలేదు.

ఆ.వె. ఆలుబిడ్డలంత అభిమాన పాత్రులౌ ♦ ఇల్లు ఇంపు మీరు హితముతోడ
అంతరువులు లేని ఆంతర్యమహితులౌ ♦ అహము దివములందు అతిశయములెగ.

ఆ.వె. పేరు పెంపుగల్గు పేదవారల జన్మ ♦ భువికి భుక్తిపంచు భువనముగను
అర్థమున్నగాని అధికారమున్నను ♦ పేరు పెంపులేక పేదవారె.

ఆ.వె. అందమన్నదిచట అందరి సొంతము ♦ కొందరిదిగ కోరుకొనుటగాదు
అనుభవించజగతి ఆనందభువియౌను ♦ చూచి అనుభవించు సురుచిరముగ.

ఆ.వె. పిల్లచేష్టలనుచు పిలుపున తలపున ♦ కొల్లలున్నవిచట కల్లగాదు
చల్లనైన సీత ఉల్లము కరగించు ♦ చిన్నిచేతలందు చింతలేదు.

ఆ.వె. అతివమనసులోన అనురాగముండెనా ♦ అందమగునుదాని అన్నగాను
రెండుకలిసియున్న రెట్టింపు సుఖముండు ♦ విముఖతింతలేని విలువలవ్వి.

ఆ.వె. కులముగోత్రములును కూహకమనుచుంద్రు ♦ కులములేని జనత కూర్మియున్నె
గోత్రమేమిలేక పాత్రతగనరాదు ♦ జంట కలిమిజగతి తంటవీడు.

ఆ.వె. విధులు నిధులు లేని వింతపాలనమున ♦ జనత ఘనత వీడు జయము లేక
పాలితులును మరియు పాలక ప్రముఖులు ♦ ఫలము గనగ లేరు విఫలురుగను.

ఆ.వె. అడ్డదారులందు అందలమెక్కిన ♦ దిగుట చేతకాదు దిటవు లేక
ఎక్కిదిగుట యన్న ఎకసక్కెమగునిల ♦ చక్కనైన దారి సరళివేరు.

ఆ.వె. ఏడుకొండలందు ఏడుగడాతడు ♦ ఎందునున్నవాడొ ఎవరికెరుక
దర్శనమ్ముతోడ దరిజేర వెళ్ళగా ♦ దూరదూరములకు పారిపోవు.

ఆ.వె. కన్నుకానలేదు మిన్ననున్నట్టి ♦ పరమదైవములను వరముకోర
వారిగాంచినట్టి వరులెవ్వరనగాను ♦ ఆత్మసాక్షియేగ అందరికిని.

ఆ.వె. సర్వపాపములను ఖర్వము సేసెడు ♦ సర్వ గర్వములను చదును సేయు
అభవుడెందు గలడు విభవముగలవాడు ♦ మూర్తియందు నిలువ ముద్దుకలుగు.

ఆ.వె. దేవళమ్మునందు దేహాలు పడియుండ ♦ భావనమ్మునందు బాధలేగ
బాధ తీర్చునతడె బంధువు సింధువు ♦ దయయుగల్గినట్టి ధవుడు తాను.

ఆ.వె. నియమనిష్ఠలన్ని నీరుగారెను నేడు ♦ సంప్రదాయమన్న సరకు గొనరు
'సంత' సరకులన్ని చింతలు వంతలు ♦ సుంత సుఖము లేని వింతలేగ.

ఆ.వె. తెరలుచుండెనేడు తెరమీది బొమ్మలు ♦ బొమ్మబొరుసు రీతి బోధలన్ని
తరలిపోవు తెరలు తనువులతో గూడి ♦ సత్యమన్నమాట సబబుగాదు.

ఆ.వె. చినుకు చినుకు పడగచిత్తడి భూమికి ♦ వానజడిగపడగ వరదపారు
చిత్తడియునువరదచింతలపాల్జేయు ♦ వృష్టిలేని జగతి వృధయె సుమ్ము.

ఆ.వె. మిద్దెమేడలేమొ మిన్నంటు చుండెను ♦ శుద్ధిలేక భూమి శుభము వీడె
ఫ్లాటు నాగరికము ఫెయిలయి పోతుండె ♦ పంచభూతములును పలుచనాయె.

ఆ.వె. ఏసి గదులయందు ఎదమర్చిపోయిరి ♦ పరిసరములు చూడ పాపమాయె
పావనతలులేని వనజీవితమునందు ♦ పరమపదముగాంచ పరమరోత.

ఆ.వె. కొనుట అమ్ముటన్న కొలువాయె జగమున ♦ భూత తతులకన్ని భూతములుగ
జాతకమ్ము మారె జయహీన బేరాన ♦ నవ్యనాగరకము నవ్వులాట.

ఆ.వె. వాతరోగములును వారువములరీతి ♦ పిత్తజాడ్యములును పిలువగాను
శ్లేష్మమందు జనులు శేషమై జీవించ ♦ రోగరహితుడన్న భోగి చూడ.

ఆ.వె. ఎండతాపమేమొ మెండాయె జగమున ♦ చలియు ములికి రీతి సాగుచుండె
కలిమి లేములందు కలవాడు వరుణుడై ♦ వాతవరణసమత వసుధ సున్న.

ఆ.వె. చెట్లు జనునికిచ్చు చెలిమిని బలిమిని ♦ ప్రగతి పచ్చదనము ప్రాభవమ్ము
వాడివేడి వెడలు వరపుగల్గును భూమి ♦ చెట్టులేని చోటు చేటుసుమ్ము.

ఆ.వె. బడియు గుడియు రెండు భాగ్యము యోగ్యముల్
బడిని పంతులయ్య ఫలము నిడును
భవుడు దేవళమున పాపముల్ శమియించు
రెంటిగుణము తెలియ కంటి వెలుగె.

మార్చెయ్ మార్చెయ్ ఏమార్చెయ్ ♦ ఎఱుకలేని జనులనూ ఎమార్చెయ్
మహిమలమఱకలలోనా మార్చెసెయ్ ♦ కులము కుంపటులతో కూల్చేసెయ్
రంగుల రంగములతో రాజేసెయ్ ♦ పదము పతనముతోనా వదిలించెయ్
పథముల దుష్పథముతో పథించెయ్ ♦ మధనముదలతోన మురిపించెయ్
వాచికమున కులికిపలికి కూలించెయ్ ♦ ఆంగికమున అలికి అలికి మకిలించెయ్
రాజకీయ రాసభముగరహిమించెయ్ ♦ ఘూకర ఆకారముతో సురభించెయ్
ఓంద్రలతీంద్రింపుతో గాంద్రించెయ్ ♦ కాకారవ కలిమితో కలవరించెయ్
దివము దివము వేదికలను వేధించెయ్ ♦ కూర్మిమార్మికతలతో అధర్మించెయ్
స్వార్థార్థపు క్రోధతోన శోభించెయ్ ♦ వికృతియౌ విలువలతో వికసించెయ్
ఎజెండాలు జెండాలు అధఃకరించేసెయ్♦కప్పలు కోతుల విధమున ఎట్టైనా కానించెయ్
మంచి మానవతలకూ సెలవిచ్చెయ్ ♦ చేతకాని చేతలకు హ్యాండిచ్చెయ్



ఎగిరేను జండాలు – ఎజెండాలు షురూగాను
ఎన్నికవెన్నుదన్ను అధికారపు ధిక్కారము
కమీషన్లు మిషనులూ కలకాలమిషలు ♦ కోర్టుల తీర్పులూ కోతికొమ్మచ్చిలూ
శిలువల శిక్షాస్మృతిలో కరుణయె క్రైస్తవము ♦ కర్మల కాపట్యము స్వార్థశోభగీతము
అహింసయే హైన్యమైన అందము వందితము
♦ త్రిమతాలకు తిరిపెములే వరమైన వాక్కులు
వర్ణాశ్రిత కులములతో ఆర్ణవమే ఆర్జవము
♦ పేద పెద్దపేరులందు ఆర్థికమ్ము అవధులు
స్వర్గము అపవర్గము అవధులు దాటును
♦ ఇంద్రులు ఋషులుగా ఇంపుల ప్రతినిధులు

పార్టీలు వేష్టలు పరమార్థపు లిస్టులో ♦ స్వార్థపు టేస్టులో అటు ఇటు మార్పులు
ఆదికాల రాజత్వము నేటికాల జనస్వామ్యము
♦ రాజులు ప్రతినిధులు రారాజులు జనులు
పంపకాల అంపకాలు – అప్పుల ముప్పులు
♦ భావితరపుతిప్పలు – నాయకుల తప్పులు
దూరపు దృక్పథము – హ్రస్వము ఆచరణ
♦ మధ్యలోని సైంధవులు – మద్యపు మాంద్యులు
శాసనము శునకము – విశ్వాసము శ్వపనము
♦ అమలుచేయి అధిపుడు – అన్వర్థపు స్వార్థుడు
న్యాయమునేస్తమయి – గాయము పెద్దదయి
♦ అన్యాయము ఆప్తమయి – అధికారం అస్తమించు.



ప్రాంగణమిది ప్రాంగణం – ప్రవరమైన ప్రాంగణం
ప్రావృషేణ్య ప్రాంగణం – ప్రాకాశపు ప్రాంగణం
వేంకటేశు వెలుగులో – సంకటములు సడలగా
సాహిత్యము హితముగా – సరస్వతికి నిలయము
కరుణల కలిమితో – లేముల బలిమితో
భవభూతుల భూతితో – రామకథల రాజ్యము.

వేద వాద వెలుగుతో – భారత భాగ్యముతో
పురాణాల పుణ్యముతో – ధన్యమాయె ప్రాంగణము
ఎఱ్ఱన ఎరుపుతో – తిక్కన తీపి తెలుగు
ఒక్కటిగా చిక్కనై – ప్రకాశమై ప్రభవించెను
మంచి మానవతలకు – వంచనకుంచించుటకు
భారతి జయించుటకు – భాగ్యసీమ **ప్రరసం**.
(ప్రరసం – ప్రకాశం జిల్లా రచయితల సంఘం)

హనుమన్న మిన్నగా – వాసన్న వలపుగా
అన్నులమిన్నలిచట ఆశీనులు 'సీనులో'
కాల్పట్టణ శ్రీనాథుని – కామితముల దీర్చగా

గండరగండ కవులు – సిరిమల్లెల సిరులుగా
కలమునకూ కులము లేదు – కలవరమై కల'రవ'మై
కావ్యవీథి విహరించుట – కవిత్వమే పవిత్వము.

వేదిక వేదనతో – వెలుతురు కోలుపోవు
రాసభముల గాండ్రింపున – రాజకీయ రంగులతో
నుతముల 'తమము'తో – తత్తరపడి బిత్తరతో
ఆలయములయించెను – పాపక్షమల ప్రాథాన్యత
ఎరుపు మరకలైపోయి – ఎదలు మృదులమైనవి
మృదులమైన ఎదనుండీ – మధుకవితలు పండును.

జెండాలు ఎజెండాలు – జెండరులే లేకుండె
ధిక్కారము అధికారము – దిసమొలతో నాట్యమాడె
రాతిలోని కాఠిన్యము – జీవిలోని జీవము
రక్తములో అరుణిమ – దేవునిలో దీనత్వము
పరస్పరము వైవిధ్యము – స్వరస్వరము నిస్వనము
'కాకువు'లే కాకులుగా – బలిభుక్కులు బతుకులో
పోషణలో ధిషణత్వము – పోడిమి మీరును
వాదనలో రోదనలో – వాడి వేడి విడిచెను.
వ్యక్తిత్వపు శక్తియే – వ్యవస్థయే ప్రజాశక్తి
వృత్యస్థపు వ్యక్తులతో – వ్యాకులతే జనులగతి
పోలికలే పేలికలై – చీలికలే చింతనలై
ఏలికలే 'వాలు'గలై – ఎదలు మృదువు కోలుపోవు.

రసత్వమూ రహితత్వము – రెండును కవితత్త్వములు
రసమే పరమాత్మగా – కవియే మన ప్రకృతిగా.



ఆ.వె. సరళ జీవనమ్ము విరళమైపోయెను ♦ సహజ జీవనమ్ము సాగదెందు
కశ్మలంపు జీవి కాలాంతకుండాయె ♦ కాల కలవరమ్ము కలిమి వీడె.

ఆ.వె. సత్యమన్న జగతి నిత్యము నియమము ♦ సత్యమనగ సర్వ సారమగును
సత్యధర్మ జీవి సవనము సహితము ♦ మహిత మగును సత్య మధువు జనుల.

ఆ.వె. జ్ఞాన గరిమ వీడి జాణయై జనుడుండె ♦ జ్ఞాన హీన పశువు జ్ఞప్తి గలుగు
రెండు కాళ్ళ జీవి రేవడి జీవాల ♦ మేధ మాట కలుగు మేలి పశువు.

ఆ.వె. సంకరమ్ము జగతి వంకర జనులను ♦ అంకమగును అదియె ఆస్తికొరకు
అంతరముల జనుడు వింతగు జీవిగా ♦ విలువ సిగ్గు ఎగ్గు విడిచె నిజము.

ఆ.వె. చదువు శాలలన్ని సంతసరుకుగాను ♦ కార్పొరేట్ల చదువు కమ్మనాయె
ప్రభుత చదువులన్ని ప్రగతి రోధకములు ♦ అమ్ముకొనుటలయ్యె అమ్మచదువు.

ఆ.వె. కార్యక్షేత్రమందు కలవరమగుచుండె ♦ నాయకాధ్యులంత నమ్మబలుకు
నమ్మకమ్ములేని నయమైన స్వామ్యము ♦ ఎంచుకొన్న ఓటు పంచుకొనుటె.

ఆ.వె. అతనికంటె ఘనుడు ఆచంట మల్లన్న ♦ తంటదీర్చు వారి దారివేరు
మంటలెట్టు వారె మనరాజకీయులు ♦ అనుభవమ్ము దెలియు అహరహమ్ము.

ఆ.వె. పదవి కొరకు నేత పదము పథము కూర్చు ♦ మాట మార్చుపూటపూటకిచట
మౌనముద్రలోన మేధావులుండిరి ♦ మానభంగమగును మౌనమునకు.

ఆ.వె. ధర్మమర్మమంత దారిదప్పుచునుండె ♦ న్యాయమెంతొ నెనరు న్యాసమందు
న్యాయనిర్ణయమున న్యాయాధిపతిమాట ♦ పతితమగును జగతి ఫలము లేక.

ఆ.వె. భుక్తినిచ్చుచుండు భూమాత జనులకు ♦ శక్తి కలుగు జనుడు రక్తిగాంచు
రక్తి వీడగాను ముక్తిని కాంక్షించ ♦ శుక్తిరీతి ఘనుడు శుభము పంచు.

ఆ.వె. తరతమమ్ములిచట తరళము విరళము ♦ అంతరములు చూడ వింత తరము
అంతరము నశింప ఆనందభువిగాను ♦ భరతభాగ్య భవిత భోగ్యమగును.

ఆ.వె. విద్యనేర్చువాడె విబుధుడు సుబుధుడు ♦ బుధుడు బుద్ధుడగును బుద్ధిగల్ల
సుబుధుడెచటనున్న సుందరుడగునుగ ♦ విద్యమరువకున్న విజయమగును.

ఆ.వె. వినయగరిమ కల్గ విద్యార్థి విజయుడు ♦ సహన రహితు డెందు సాగలేడు
విలువ వలువగాను ఫలమును గాంతురు ♦ ఫలముగాంచలేక పంద యగును.

ఆ.వె. పొరుగువారితోడ పోలిక మెండాయె ♦ కోర్కెలెన్నొముందు కొలువుదీరు
తీరకుండు కోర్కె తీరులు బాధింప ♦ విన్నదనము కల్గ చిన్నతనము.

ఆ.వె. నవ్యనాగరికము దివ్యమగుచునుండె ♦ భవ్య సంస్కృతులును భాగ్యరహిత
దివ్యమైన పాత దిటవగు కొత్తయు ♦ పాతకొత్తలుగను పరమమగును.

ఆ.వె. వేషభాషలన్ని వేల్పుల మహిమలు ♦ గోచిపాతలెంతొ గోముగాను
రంగురంగుహంగు భంగుల భృంగముల్ ♦ చెంచె చెంగు మనుచు చేవమించు.

ఆ.వె. అంతరిక్షమందు ఆంతర్యమెరిగెను ♦ శాస్త్రవింతలన్ని చెలువుమీరె
అంతరంగమందు అసలైన తత్త్వము ♦ తెలియలేనితనము తెలివి యగునె.

ఆ.వె. సహజజీవనమ్ము జగమున సాగగా ♦ అసహజమునకిచట 'ఆస్తి'లేదు
శోధనమ్ములెన్నొ శోభించు విభవాన ♦ మందులేని వ్యాధి మరలవచ్చె.

ఆ.వె. తనదికానిదైన తపియింత్రుజనులంత ♦ తనది తనదికాగ తరియలేరు
పొరుగు కూరలెంతొ పొలుపగు ప్రజలకు ♦ పొరుగు తనదియగుట పోలదెందు.

ఆ.వె. మాతృభాషదెలుపు మాతృత్వమహిమను ♦ ఇతర భాషలన్ని ఇంపుకావు
బాల్యమందు తల్లి బాంధవ్య భాషగు ♦ తల్లిభాషనేర్ప చెల్లు శిశువు.

ఆ.వె. నీరులేక పోయె నిధులెన్నొ కలవుగా ♦ రక్షణమ్ములేక శిక్షలాయె
విలువ దెలియలేక విధ్వస్తమాయెను ♦ మెట్టపంటలన్ని వట్టిపోవు.

ఆ.వె. నాగరకత పెరిగె నదులున్నచోటుల ♦ నదులెడారులాయె విధివశాన
చుక్కబొట్టు రక్ష సుధలనుగురిపించు ♦ నీటిపొదుపు నేటి జాతి ప్రగతి.

ఆ.వె. కలుషమగుచునీరు కలవరమగుచుండె ♦ మురుగుశుద్ధిచేయ ముద్దగునుగ
నదులు సాగరములు నాణ్యతకోల్పోయి ♦ నీటికొరత రాగ నీరవమ్మె.

ఆ.వె. బిందుసేద్యమన్న అందము ఇందము ♦ పంటతంటదీరు ఫలితమొచ్చు
గుంతతీయగాను గురుతుగనీరుండు ♦ భూమిలోనిజలము భూరియగును.

తే.గీ. నీరుగలవాడు నియతిని నిర్ణయమమున
జాతిగలవాడు జగతిని జయముగొనును
మనసు గలవాడు మహితుడు మాన్యుడగును
మనసు నీతియు మధురము మహిని నేడు.

ఆ.వె. మంచిచేయగాను మనసుండవలెనుగా ♦ నీతి నిర్ణయమున నియమములును
మంచి నీతి మమత మానవ తత్త్వమౌ ♦ మానవత్త్వమన్న మనిషి మధువు.

ఆ.వె. భార్యభర్తలిలను భాగ్యదేవతలుగా ♦ సంతుకలుగగాను సాగరమ్ము
లోతుతెలియగాను లోలత్వమగునుగా ♦ ఈదగాను హితము ఇంపు జగము.

ఆ.వె. భాష భాగ్యమగును బాధను తెలుపగా ♦ భాషలేని పశువు భవము వెలుగు
మానవమ్ముభాష మహిమాతిశయముగా ♦ భాష భూషయగును భవమునందు.

ఆ.వె. విశ్వమున్నదన్న విశ్వాసమే గదా ♦ నమ్మకమ్ము లేక నరుడు లేడు
శ్వాసలేని జనుడు శవమగురీతిన ♦ శ్వానమాయె విశ్వసనము లేక.

ఆ.వె. తప్పుఒప్పుగాదు ఒప్పు తప్పవదుగా ♦ తరుణమందు తప్పు తరియజేయు
ఒప్పు మెప్పులేక తప్పగు తరుణాన ♦ ఒప్పు తప్పురెండు ఓగులగును.

మితము హితము మతము మించగ జనులను
సతము జాతి వెలుగు సహితముగను
మితమ హతము జేసి మించెడి మతులంత
మీదు క్రిందులగుచు వాదుపడును.

ఆ.వె. మంచి చెడులు మహిని మానవ భావనల్
ఆచరణము నందు ఆకృతులుగ
ఒకరి మంచి మరల ఒకరికి చెడుగగు
కాలగమన కథలె కామితములు.

ఆ.వె. తనివి తీరదెందు తపనలు హెచ్చగు ♦ సుఖము శుభము కోర్కె సురుచిరములు
తృష్ణకలుగ తృప్తి దరిజేర దెపుడును ♦ తృప్తి తృష్ణ రెండు జ్ఞప్తిగనుము.

ఆ.వె. సాత్వికమున జనుడు సరసుడు సురసుడు ♦ రాజసమున మహిని రాజు తాను
తామసమ్ము జనుని తమసమునను ముంచు ♦ త్రిగుణ రహితుడవని తీర్థుడగును.

ఆ.వె. భువన సుఖములన్ని భుగ్నమై పోవును ♦ స్వర్గ సుఖములేమొ వసుధ గనము
చపలచిత్తతలకు చేతము నిలయమై ♦ దుఃఖమింతయైన దూరుచుండు.

ఆ.వె. ఇహము అహరహమ్ము ఇంపగు హితమగు ♦ ఆనుకూల్యమైన అంతమగును
ప్రవరమేమిలేదు ప్రతికూలభావాల ♦ వినుట విలువ విద్యకనుట కలిమి.

ఆ.వె. పచ్చదనము పోగ వెచ్చదనమ్మొచ్చె ♦ సూర్యతాపమేమొ ఆర్యమాయె
క్రింద మీద వేడి క్రీడించుచుండెను ♦ మంట లందు నిలచె మానవాళి.

ఆ.వె. కాలగమనమేమొ కాఠిన్యమాయెను ♦ ఋతువు క్రమమువీడ రుజలు మూగె
తెలిసియుండికూడ తెంపరితనమున ♦ కష్టనష్టములకు కాలుజాచు.

ఆ.వె. పట్టణములు పెరిగి పల్లెలు విలవిల ♦ మట్టియందు మమత మలినమాయె
వేద్యరహితమాయె సేద్యము వేదనై ♦ సాంద్రసేద్యమేమొ సగము చచ్చె.

ఆ.వె. కృతకజీవితమున మతులన్నిచెదరెను ♦ ఫాస్టుఫుడ్డులందు ఫ్యాషనాయె
అమ్మచేయు వంట అసలేమి నచ్చదు ♦ కాచుకొనును రుజలు కర్మకాల.

ఆ.వె. రక్షలేని జగతి రాక్షసమగునుగా ♦ శిక్షలేని జనుడు కక్షయుతుడు
రక్ష శిక్ష రెండు రాజ్యంపు రవణాలు ♦ దక్షుడైన రాజు ధరణి వెలుగు.

ఆ.వె. ప్రేమ పేరులన్ని పేలవమగురీతి ♦ ఆలుమగలు జగతి అవసరముగ
మెలగుచుండునపుడు మేలేమి లేదుగా ♦ కలసిమెలసి యుండ కలిమి కలుగు.

ఆ.వె. తనదుమేలుకొరకు తాపత్రయముతోడ ♦ సార్థజనుడు బతుకు సార్థకముగ
పరుల ప్రగతి కోరు పరముడౌ జనుడుండ ♦ దేశజనుల సుగతి దేవళమ్ము.

ఆ.వె. రాయి దేవుడంచు రహిజనులందరు ♦ దేవళముల చుట్టు తిరుగుచుండ్రు
చేతనత్వమున్న చెలువైన జీవుని ♦ దేవుడనగ జెల్లు భావనమున.

ఆ.వె. కాలసర్పమేమొ కాటువేయుచునుండె ♦ ధర్మకర్మములును దారిదప్పె
దారిలేనిజనుడు దారుణకర్మల ♦ ధరణి చెరచుచుండె దర్పమునను.

ఆ.వె. వానకురవకుండె వసుధ ఎండుచునుండె ♦ పచ్చపైరులన్ని విచ్చిపోయె
నీరు ఇంకిపోయె నిమ్నమైలోనికి ♦ భూమి భూతములును భుగ్నమాయె.

ఆ.వె. వనములన్ని వెలసె జనుల కర్మలతోడ ♦ చెట్లునరకుచుండ పట్టువీడె
మొక్క పెంచగాను మొరటుగా భావించి ♦ పట్టణంపు జనుడు ఫలము వీడె.

ఆ.వె. ఖనిజసంపదంత ఖననము కాబడె ♦ వృక్ష సంపదేమొ వృద్ధిలేదు
జనత పెరిగిపోయి జాగృతి కరవాయె ♦ తెలిసి తెలియనోడు తెంపరాయె.

ఆ.వె. ఏసు బోధలన్ని ఎఋకకు అందవు ♦ గీత గీతలన్ని జాతిమరపు
ఆచరణములేని ఆస్తిక్యమెందుకు ♦ ధర్మనిరతియొకటె దారి జగతి.

ఆ.వె. సంగముక్తులంత సరళాత్ములైరిట ♦ భంగుసేవనమున భాగ్యమంది
యోగులంత నేడు యోజనకల్గగా ♦ కొనుట అమ్ముటలును కొలతమీరె.

ఆ.వె. శక్తి శుక్తినుతిగ శాంకరసదృశ ♦ భక్తి భవము నందు పాదుకొల్ప
ముక్తికాంత కలుగు ముద్దులసుద్దుల ♦ కార్యక్షేత్రకర్మ కాంతిరహిత.

ఆ.వె. పావనతయులేని పట్టాభిషేకము ♦ పాలనమ్ములేని ప్రజలవిధము
లాలనమ్ములేని లక్షణ శిశువును ♦ పుడమినుండగాను పూజ్యరహిత.

ఆ.వె. ప్రవరమగుచు నుండె ప్రారబ్ధకర్మము ♦ సంచితమ్ముచూడ సరళిగరిత
అంతరముల వింత ఆగామి సహగామి ♦ కర్మవిధముచూడ మర్మమహిత.

ఆ.వె. కల్లకపటమేమి కనరాదు శిశువుల ♦ బోసినవ్వులన్ని భోగ్యమగును
చిలిపి చేష్టలన్ని చింతల పోద్రోలు ♦ కలత నలత లేని కలిమి తనది.

ఆ.వె. వెతలు కతలుగాను వేలగు జగమున ♦ సుఖము మఖములన్ని సుందరములు
కలిమి కలతలెన్నొ కనవచ్చువినవచ్చు ♦ నేటి నవ్యయుగము నెనరు విడుచు.

ఆ.వె. తల్లిదండ్రితపన తనయుల కొఱకుగా ♦ బంధసహితమైన భారములను
కష్టమైనగాని ఇష్టమై జీవింత్రు ♦ గొప్పవారలైన మెప్పుగొంద్రు.



గులాబీల లాబీలో – గుబాళించు మధురిమవా
మందారపు దారులలో – మధూదయపు సింధూరమవా
మల్లెపూల మాగాణులలో – పడిదొలిన పరువము నీవా
బంతిపూల బజారులోనా – జారుపాటు జవ్వని నీవా
సన్నజాజి విరి గంధములో – సరసార్థపు రసరంజనివా
పొన్నపూల పోడిమిలోనా – మిన్నందిన మిహిరమునీవా
కదలీతరునితంబములలో – తరగని తరుణపు తారిణివా
జవ్వనీ నవయవ్వనీ నాకవనీ – నాకవనపు కమనీయత నీవా
సంపెంగపు సాయం ఘుమఘుమ – సారించిన సారంగపు సారూపిణివా
తొలకరి తొలిరేయిలోన – రేగిన మదనుని మదనవికారమా



కలసినవేళ – కలల సుమాల ♦ పలికినవేళ – వలపుల వీణ
పెదవి పదము విదిలించగ ♦ ప్రేమ పథము పరచుకొనెను.

పరచుకొన్నప్రేమలన్ని – పరవశమై విరిసెనుగా.

వాలుజడనువిరులునింపి ♦ వారువమై పరుగెట్టగ
విరిగంధము వెల్లువగా ♦ హృదిమధురము వరనదిగా

నిలవని నా మనసులోన ♦ నిధులునింపి నిలచినావు
విధివశమే మనకలయిక ♦ విరిబోణి వరవర్ణిని.

కౌగిలిగిలి కమనీయం ♦ స్పర్శసుఖం సుందరం
మగత నిదుర మాధుర్యం ♦ మరపు మనకు మంచితనం.

హాయిలోని ఆంతర్యం ♦ అనుభవమ్ము అందించెను
స్వర్గం మనస్వగతానికి ♦ స్వాగతవాక్యం పలికెను.

ఐటెక్కు కళ్ళతోడ ♦ ఐమాక్సు బొమ్మలాగ
ఐలవ్‌యు అనగానె ♦ ఐసయి పోయే మనసు.

హైహీల్సు చెప్పులతో ♦ హైటెక్కు నడకతో
హైవేపై వెళుతుంటే ♦ హైలెస్సా అనిపించే.

'చందన'లో అందంగా ♦ 'కళాంజలి' అంజలిగా
'బిగ్‌సీ'లో మగనాలిగ ♦ 'సీఎమ్‌ఆర్' సీమంతిగ.

"మా" టీవి మాధురిగా ♦ "జెమినీ"లో జానీగా
"ఈ"టీవి ఇంతిగా ♦ "తేజా"లో తేటిగా.

సినిమా సీమంతినిగా ♦ నాటికలో చేటికగా
టీవీలో టింగరిగా ♦ సిరీయల్ చిత్రాంగిగా.

రాగంలో రాగిణిగా ♦ భోగంలో భోగినిగా
యాగంలో యోగినిగా ♦ ఎద గదిలో మాధురిగా.

బంధనమే ఇంధనమై ♦ బాంధవ్యం బహుమతిగా
వలపు ధనం వందితమై ♦ తలపున కది సుందరమ్ము.

మదిగదిలో మథనపడి ♦ కనుచూపుల కలిమినిడి
కలల అలల కడలి నీది ♦ కడదాకా కదలుదాము.

ఉర్వరలో శార్వరివై ♦ పర్వప్రేమ పరవశివై
నాలో నవవీణియవై ♦ నవగీతం పలికించుము.

వేదాంతపు వెల్లువవై ♦ రాద్ధాంతపు రాగిణివై
సిద్ధాంతపు సిరిమల్లెగ ♦ శుద్ధాంతము నిండు చెలీ.

లేని జగం ఉన్నదిగా ♦ ఉన్న జగం లేనిదిగా
ఉండిలేని ఉర్వరలో ♦ పండించుము ప్రేమ ఫలం.

చెలియానా చెంగలువా ♦ చైతన్యపు చైత్యమా
భావనలో భాగ్యమా ♦ భువన వనీ భవనమా.

చెదిరిన నీ అందం ♦ చెంగలువై పూచిందా
అదిరిన నీ ఆనందం ♦ అరవిందం అయినదా.

కలిసిన చూపులలో ♦ కలవరింత మొదలాయెను
వరవర్ణిని కలవరమై ♦ రమియించెను రసరాజ్యము.

రసక్రీడయె క్రీనీడగ ♦ నాహృదిపై నడయాడుము
నీ నడకల నయగారమె ♦ నయాగరా ప్రవాహము.

ప్రవహించిన జలపాతము ♦ తమకముతో తరియించగ
తరతమములు తెలియబడని ♦ తీరములకు చేరిపోయె.

క్రిందుమీదు కనరాదుగ ♦ మధ్యనసలు మిథ్యాయెను
కదలెడి నీ పదములలో ♦ కలహంసల నడహొయలు.

అందెల ఆరవళిలో ♦ ఆర్ణవమే రవహీనం
వడివడిగా నదయాడగ ♦ వయ్యారము వణికిందీ.

కయ్యానికి కాలుదువ్వ ♦ కన్నుల కమనీయతకే
కాల్మొక్తను నీబాంఛని ♦ నీదరికే నేరానా.

నితంబముల వితండమే ♦ నిలునిలుమని నిలువరింప
వలువల వలలో దాగిన ♦ వాల్లభ్యానికి వందనం.

నారాణివి నీవేనని ♦ నినదించే నామనసున
నారాచం సంధించిన ♦ మనోజుడే మహనీయుడు.

శివునిచేత కాల్చబడీ ♦ చితిలో చితికిన యతడే
చింతనలోనీచెంతను ♦ చైతన్యము పొందినాడు.

అనురాగపు రాగమయీ ♦ ఆరాధ్యపు రాధవుగా
ధవుని చేర చరియింపుము ♦ ఇంపుసొంపు ఇరులు మార్చ.

ఆనందపు నందినివా ♦ నినదించిన హృదివీణవ
హవణించిన అలివేణివ ♦ వీణాహస్తినివాణివా.

కలికాలం కలికివినీవై ♦ కలకాలం కలల రాణివై
కలరవాల రవళివి నీవై ♦ కలవరాల వరవర్ణినివై
కదలిరావె కమలాక్షి.

కృతయుగాన కృతమస్తకవై ♦ త్రేతాయుగ త్రాతవునీవై
ద్వాపరయుగ ద్వారము నీవై ♦ కలియుగమున కల భాషిణివై
కలసిరావ కామన కామిని.

పెరటిలోన పూబంతి ♦ వనములోని నవమల్లీ
గార్డెన్‌లోగ్లామర్ రోజా ♦ మురిపించే ముద్దమందారమా
విరిసిన నవ విరజాజి ♦ నుననున్నని కదళీ తరువా
పోకచెట్టు పోడిమినీదే ♦ పున్నమిపూమధూదయమా.

జనవరి వరి పంటవు నీవై ♦ ఫర్వరిలో ఫర్వానావై
మార్చికి నవమార్గమునీవై ♦ ఏప్రియల్ ఎదప్రేయసినీవై
మే మాసపు మేఘము నీవై ♦ జూన్ నెలలో జాస్మిన్ నీవై
జులై నెలకు జూలియస్ నీవై ♦ ఆగష్టున గట్టుచేరగా
సెప్టెంబరు సేదదేర్చగా ♦ అక్టోబరు ఆక్టోపస్‌వై
నవంబరున నవభామినివై ♦ డిశంబరుకు దిశనిర్దేశించుము
నెలలలోని నెలవంకవుగా ♦ వంకలేని నవ అంకముగా
పూర్ణిమ నిశిపూవువు నీవై ♦ అమవసనిసి అమరము నీదై
మరుసమరపు మధూదయమై ♦ సాగిరావె సారసాక్షీ
అరమరికల మరకలు లేని ♦ ఆనందము ఆర్ణవరీతిన
అనుభవించి భవసాగరమే ♦ తరియిద్దాంతరుణవయసున
తపన తడిలేని ఒడిలో ♦ ఓటమిలేని విభూతిని
అనుభూతిగ లయిద్దాం ♦ ప్రళయంలో లయించగా
ప్రణయంలో పయనిద్దాం.

పంచాంగపు పడతివి నీవై ♦ తిథివారపు తియ్యని వనితై
నక్షత్రపు నవలవు నీవై ♦ కరణయోగ యోగిని నీవై
కదలిరావె చిలుకల కొలికీ.

గార్హస్థ్యపు గరితవునీవై ♦ బ్రహ్మచర్య భామవు నీవై
వానప్రస్త వాణివి నీవై ♦ సన్యాసపు సారణినీవై
సాగిరావె సహవాసిని.

ధర్మసహిత ధరణివినీవై ♦ సార్థకాఖ్య అర్థము నీవై
కామాలయ కామినినీవై ♦ మోక్షమిచ్చు దాక్షాయినివై
మోదముతో మోహరించు.

ఋగ్వేదపు విదితవునీవై ♦ యజుర్వేద వేద్యవునీవై
సామవేద గానమునీవై ♦ అధర్వణపు రాణివి నీవై
వేదసార వెలుగై రావె.

గీతార్థపు గిరిధరురాణీ ♦ రామాయణ రామాకారిణి
భారతమతి భామారూపిణి ♦ భాగవతపు భాగ్యాకారిణి
పురాణాలలో పూజనీయవే ♦ కావ్యతతులలో కథమతినీవే.

బ్రాహ్మణ జన బ్రాహ్మివి నీవై ♦ క్షత్రియజన ధాత్రివి నీవై
వైశ్యజనత వైభవమీవై ♦ శూద్రులందు సుందరినీవై
చతుర్వర్ణ శాంకరినీవై ♦ సంకరమే లేని దానవై
అంకము చేరగ రావే.

నిన్ననేను నిధిగా తలచితి ♦ విధులందున విమతుడనైతిని
సంతసమే లేని వాడనై ♦ సహగమనము చేయువాడనై
భావనలో భాగ్యములో ♦ భవబంధన బంధురమందున
భారవహన భావములందున ♦ భాషలేని యనుభూతుల యందున
భాగ్యముగా వెలసిన దానా

నీవే నా నిత్యప్రాణం ♦ నీవే నా సత్యం సర్వం
నీవే నా పర్వం ప్రణవం ♦ నీవేనా గరువం గమకం

ఓంకారపు ఓజస్సీవే ♦ ఐంకారపు తేజస్సీవే

హ్రీంకారపు రోచిస్సీవే ♦ క్లీంకారపు శీకరమీవే
శ్రీంకారపు శ్రీకర మీవే ♦ సర్వరూప సాధ్వసమీవే.

కాళికవై కరాళివై ♦ కర్కశత్వశమనివి నీవై
దుర్గవుగా సర్గవుగా ♦ దురితములను తరిమివేయ
పార్వతిగా పరమవునీవై ♦ పరమార్థపు మాధురివై
శాంకరిగా శుభకరిగా ♦ విభవములకు విజయినిగా
జనయిత్రిగ గణయిత్రిగ ♦ జాగృతికే ధనయిత్రిగ
మాయకు మాయినివై ♦ మానవాళి మురిపెమువై
ఆరోగ్యపు ఆమనివై ♦ అనురాగపు రాగిణివై
ఆలోచన లోచనగా ♦ ఆశయాల ఆకృతివై
అంతరంగ తరంగమై ♦ వింత విలువ విహంగమై
మాతృత్వపు తత్త్వమవై ♦ భ్రాతృత్వం భాగ్యమవై
మిత్రత్వపు మినుకువవై ♦ శతృత్వపు శమనివినీవై
అమ్మలగన్నమ్మవుగా ♦ దేవతలకు దేవివిగా
మానవులకు మానినిగా ♦ రాక్షసులకు అక్షివిగా
దాక్షిణ్యపు ధరణివిగా ♦ గంధర్వపు గాయనివై
ప్రకృతి కృతి పరాకృతై ♦ సుకృతులకు ఆకృతిగా
వికృతులకు అపకృతిగా ♦ అనుకృతులకు అపరాకృతిగా
సత్యపు సాధ్వసి నీవై ♦ అసత్యంపు ఆహతినీవై
ధర్మానికి శర్మము నీవై ♦ అధర్మంపు దమనివి నీవై
నీతికి నియమాధురినీవై ♦ అవినీతికి అపయశినీవై
పరాకృతికి ప్రవరపు నీవై ♦ అపరాకృతి అందమునీవై
అగణ్యమౌ గణ్యము నీవై ♦ దైవత్వపు దాక్షాయణిగా
శైవతత్త్వ శాంకరినీవై ♦ వైష్ణవంపు వైభవలక్ష్మీ
షణ్మతాల మాతవునీవై ♦ ఇంధనముల ఇంతివి నీవు
పంచాగ్నుల ప్రపంచమీవే ♦ పురుషార్థపు పూజ్యవు నీవై
చతుర్వేద వేద్యము నీవే ♦ త్రికాలంపు తీరులు నీవే
త్రిలోకాల లోలనమీవే ♦ త్రిసంధ్యలకు సంధివి నీవే
సప్తాశ్వుని వెలుగువునీవే ♦ సప్తవర్ణ సాగరమీవే.

1

సీ|| నవమిని జన్మించినవ్యుడై దివ్యుడై ♦ రాజ్యమ్మునేలెను రాముడిచట
సీతకు చెలువుడై సింగారమొలికించు ♦ దాంపత్య మహిమతో ధరణి నేలె
లక్ష్మణ సహితుడై లక్ష్యము జేరగా ♦ సోదరభావమ్ము శోభమీరె
అమ్మల తనయుడై అతిలోకబలియుడై ♦ ఆర్తిని దీర్చగా అధికుడాయె.

తే.గీ. రామజన్మము మహికెంతొ రమణగాను ♦ రామచరితము సర్వము రాగయుతము
రాముజీవనయానమురవణమాయె ♦ రామనవమియె పూజ్యమై రహిని జెల్లె.

సీ|| అందాలరాముడు అతిలోక జీవుడై ♦ అవతారపురుషుడై అవనివెల్గె
ఆదర్శపురుషుడు ఆర్తుల బ్రోచెను ♦ అసమానచరితుడై అధికుడాయె
రూపము తేజము రుజలను బాపగా ♦ రుజువులు కలవెన్నొ విజయములను
భూపుత్రిపూజ్యుడై భువనాలు వెల్గించె ♦ వెతలను బాపగా వేల్పుతానె

తే.గీ. భవము భాగ్యమై వెలుగంగ భావమతడు ♦ దినము దివ్యంగ వెలుగంగ దివ్యుడతడు
కలిని కల్పకమాతడు కామములకు ♦ కలిమి బలుములు కాలాల కారణమ్ము.

తే.గీ. రామ! రఘురామ! జనరామ! రామరామ! ♦ భామ జనసుత భాగ్యాల లేమ సీత
రామ! రావణ నిర్మూల రామరామ! రామ పావన భావన రమ్యమగుత.

సీ. భద్రాద్రిరాముడు భద్రముల్ కలిగించు ♦ కలియుగ ధాముడు కలిమి పంచు
కోదండ రాముడు కోర్కెలు పండించు ♦ జనులకు దండిగా జయమునిచ్చు
కౌసల్యరాముడు కమనీయ వేలుపు ♦ వెతలకు గతులకు వెఱపుచెప్పు
కారణజన్ముడు కరుణాసముద్రుడు ♦ కలిదోషవర్జన కారణమ్ము.

తే.గీ. చింతవంతల పాద్రోలి సిరులనిచ్చు ♦ అంతరమ్ముల తొలగించి అహముద్రోలు
పాపశాపాల దహియించి పథము దెల్పు ♦ కోపతాపాల వర్జించు కోమలుండు

సీ. శిశువుల పశువుల శివమెంచు దైవము ♦ ఆర్తినిదీర్చెడి అమరుడతడు
దళితుల దహితుల దయనీయతనుగాంచి ♦ ద్రఢిమను పంచెడి ధరణి ప్రభువు
గిరిజన పురజన విరిదండ తానుగా ♦ విలువల వినుతించె విజయుడతడు
నరజాతి ఖరజాతి నాణ్యత గమనించి ♦ గణ్యత స్థాపించు పుణ్యుడతడు.

ఆ.వె. శబరి రామదాసు విభవము పెంపొందె ♦ గుహుని నావకదిలె గుంభనముగ
నరుల వానరులను నయముగజూచెను ♦ రక్షదక్షతలను శిక్షచేసె.

సీ. ఋషియైన వాల్మీకి మృషలేని వాక్కున ♦ ముద్దుగ పలికెను ముచ్చటగను
సంస్కృతభారతి సరళమై విరళమై ♦ సంస్కారసహితమై సాగెనపుడు
పావన పాత్రలు పరమైన భాషణల్ ♦ పథము నిర్దేశించె ఫలము నంద
అవధులు లేనిది అందము చందము ♦ విశ్వంపు విజయమై విలువనందె.

ఆ.వె. ఆరుకాండలందు అరులను తొలగించు ♦ రామరావణమ్ము రహికి మేలు
గుణము గణముగాను గుర్తించువారికి ♦ గురువురాముడగును పరువుకల్గ.

తే.గీ. అమ్మ అందరికమ్మగా అతివ సీత ♦ పతియెవ్రతముగ భావించె పరమ గరిత
సహన సౌశీల్య భావాల సారమమ్మ ♦ సహిత సంసార సాగర మహిత నావ.

2

రామ రామ రామ రమ్య సుగుణసోమ
రాజిత రఘురామ రాజనమిదె గొనుమా!
దశరథ రధరధుడా! దశకంఠ దహితుడా
పావన వనపాలకుడా! పరమార్థపు జీవనుడా!

అయోధ్యలో యోధుడవై – అవనిజ సీతను గొనగా
శివధనువే శిథిలమాయె – శివములు జనతకు కలిగె
జనకరాజు జయమెంచగ – జనత జాగృతము జేసితి
నరవానర నవ్యతకే – నాణ్యత కలిగించితివి
విశ్వామిత్రుని మిత్రుడ – వశిష్ఠునకు విశిష్ఠుడ
సురల సుగుణ ఖనులజేసి – అసురుల అహమణచితివి.

హనుమంతుని మతిమంతుని – అనవరతము బ్రోచితివి
సుగ్రీవుని శుభము గోరి – వాలిని వధియించితివి
దాంపత్యము ఆదర్శము – దారి భారతీయులకది
జీవన నవ సిద్ధాంతము – శుద్ధ బద్ధ జీవనము
త్రేత నుండి కలికి మారె – కలవరమున యీ జగము
యుగములెన్ని మారినా – యుగళగీతి నీదెగా.

మంచి మానవతలు మించి – మహిదైవము నీవుగా
ఎంచి కొలువ ఎరుక గల్గు – పాంచభౌతికుల కిట

రామనామమేమరచిన – రహికి సుఖము లేదుగా
రామనామజపముతో – పాపములే పావనమగు.
రామనవమి నవ్యమై – దివ్యమాయె నీ భువిలో
కళ్యాణము కమనీయము – కలియుగ జనసందడిలో.
పతి సతులకు వియోగము – పావనతకు సంకేతము
లోకజనుల సౌభాగ్యము – లోలుపతల వినాశనము.

రాముని కోదండము – రావణ విభునకు దండము
అనురాగము అతిశయము – ఆర్తులకది అభయము
నీలమేఘఛాయతోడ – నిరుపమాన రూపముతో
ఆదిత్యుల దితిపుత్రుల – అహరహమును పాలించితి.

రామరాజ్యభావనమ్ము – భాగ్యదాయి భవమునకు
భోగ్యములను యోగ్యముగా – త్యాగియోగి రాగి యిచ్చు
ఇనకరుడై ఖరుల ద్రుంచె – హితమతులను ఆదరించె
ఆశ్రిత కల్పకమాయెను – అంతరముల రమియించెను.

రామనామ పారాయణ – పాపములకు విదారణ
పరమ పురుష గుణకీర్తన – వరమగు నీ జగతికంత.
రామభద్ర భద్రము విడు – భద్రాద్రిని గాంచెదము
ఛిద్రములగు రుగ్మతలు – సిరియె మాకు ఆరోగ్యము.

3

కరుణారుణ కామినీ! కనకదుర్గ భామినీ
అరుణారుణ వదనమున అవనినాదరించవా!
కనకమిచ్చు కమనీయవు! కాలగమన వరణీయవు.
కలికాలపు కలవరముల వధియింతువు వంచనలను.

శూలధారి శుభదాయీ – ఖడ్గపాణి ఖలహారీ
పలుదిక్కుల నరులనూ – వరములతో బ్రోచుతల్లి.
విజయవాడ జయమివ్వగ – కృష్ణానది తృష్ణదీర్చ
ఇంద్రకీల దుర్గముపై – హితమతివై వెలసినావ!

పులినమైన పులివాహన - పూజనీయమైన దేవి
పూర్వపరములెందైనను - సర్వపాప హరిణ వీవు.

భక్తుల బంగారమైన భాగ్యదాయియోగ్యజనని
ముక్తినిచ్చుముద్దుమాత - ముగురమ్మల ముద్దుతల్లి.
చండశక్తి మండితా - దండితారి వందితా!
అండనుండు అభయమిచ్చి - అహరహమును కొలుతుము.

పాపకర్మలందుమునిగి - పరము లేని నరులకూ
శాపములను తొలగించీ - పరమార్థము దెలుపుము
ధర్మరక్షసేయుతల్లి - ధనధాన్యములొసగుమమ్మ
కర్మలందు కలుషములను -మర్మముగా నణచుతల్లి.

నీ సన్నిధి నీ పెన్నిధి - నియమముగా నిర్ణయించి
త్రికరణముల తిరునామము - జపియింతుము జగతిలో
జగతిజనుల గతులమార్చు - జనవాణీ! జగజ్జనని
మగతనున్న మతులమార్చి - మమతను కురిపించు తల్లి.

పాపదుర్గపరిహారిణి - పరమార్థపు సంధాయిని
కష్టనష్టసంహారిణి - కలిమినిచ్చు కరుణాధుని
కోర్కెదీర కొండనెక్కి - కోమలముగ పిలువగా
కోపతాపములను విడచి - కాపాడుము తల్లిరో!

భయంకరీ! బాధహరీ! - భాగ్యదాయి! భామదుర్గ!
భావమందు నిలువుమా! - భవమె మహిమ యుతముగా!
కలలనిలను నిజముసేసి - కరువుకాటకములనణచి
సుఖశాంతుల కలిగించుము - శుభకరమే యీజగము.

నీవుండుట సత్యమనీ - నీదండను చేరితిగా
నాకండగ నీవుండుము - నాకము నాకందజేయి
సర్వము నీవైతివి - పర్వమె జనమైనది
సహన వహన ధారుణిలో - మహిమ బ్రోచు మాతల్లీ!

ఆరాధన ధనము కొరకు - ఆహ్వానము పలుకుమమ్మ
ఆరోగ్యము ఆలోచన - అందరికీ పంచుమమ్మ!

4

సాయి నామము దివ్యనామము – సాయిరూపము సకల పాపహరము
సాయి హృదయము దయకు నిలయము – సాయి చూపులు కలుష హరములు
కాంతి శాంతి కలిమి శాయి – కారణ జన్ముడు సాయి
కరుణపంచు కలిపురుషుడు – కలకాలముజనదైవము.

బాధలోన గాథగా – భవ్య చరుతుడాయన
భవరోగముబాపునట్టి – మనదైవము ఘనడు సాయి
సాయి రథము సాగుతుంది – సకల కలుష హరమది
సాయి పథము చూపుతుంది – సర్వపాపహరమహిమను.

జనగణజయగీతికలే – జయసాయికి మధురములు
జనసేవల జాగరణలు – జాతికి జయ జాగృతులే
కలిమి కలుగు జనులకూ – బలిమి లేని బడుగులకూ
తలచిననేతపన దీర్చు – తరతరముల ప్రభుడివి.

నిఖిల జగతి నియతికీ – సకల జనుల సుగతికీ
అఖిలసృష్టి ఆలనకూ – అవలంబము మనసాయి
బీదసాద భీరువులకు – ఆదరువే మనసాయి
చేరి కొలుచు చేతనులకు – చైతన్యమె జనసాయి.

సాయిస్మరణ సర్వలకూ – సకల శుభములందించును
సాయిభజన సహచరులకు – భాగ్యములను కలిగించును
విభూతిని ధరించగా – విజయమగుట తథ్యము
ప్రసాదమును స్వీకరించ – ప్రభూతమౌ ఫలములెన్నొ.

నీ ఆలయదర్శనమే – నిఖిల పాపహరణము
నీపూజయె నిజముగా నిధులనొసగు సత్యము
సాధనశోధనలతో – బాధలన్ని పోగొట్టి
సామరస్యమును పెంచి – సదయహృదయుడైతివీవు.

కొల్లలుగా కోరికలే – కోమలతను భంగించగ
భగవంతుడవైన నీవు – భావము నెరిగించితివి

తృష్ణదీర్చు కృష్ణసాయి – విష్ణుడాయె విలువనొసగ
శివసాయిగ శివములిచ్చు – భవసాయిగ భాగ్యమొసగు.

పరుల ఫలము నీకిష్టము – పరమపదము నీతేజము
పరమార్థముపసదనము – పరలోకము నందించుము
మధురమైన మనిషిజన్మ – మగతనిదురలోబడెను
నిదురను వదిలింపుము – నియమవిధుల నిలుపుము.

శక్తికలుగు శంకరుడా – భక్తినిపూజింతము
ముక్తినిచ్చి మమ్ములను – ముగ్ధులనొనరించుము
పగలురేయి పావనము – పాపకార్యరహితము
సాయిసేవ సంపన్నము – సాధించుము మానవుడా!

5

ఆంజనేయ అప్రమేయ – అంజలింతుమిదె గొనుమా
ఆర్తిదీర్చు అధికుడా – ఆర్తనాదమదె వినుమా
రామనామ మహిమతోడ – రాజిల్లిన మహనీయుడ
సువర్చలా వర్చస్సున – సుగతిని గాంచినవాడా!

అంజనఘనపుత్రుడవై – అహమును ద్రుంచెడివాడా
శుభసూర్యుని వెలుగుతోడ – సుఖములు గాంచిన తండ్రీ!
ప్రసన్నుడా ప్రవీణుడా – ప్రపన్నతతొ పూజింతుము
ప్రాభవ వైభవములనిచ్చి – పాలించుము ప్రవరుడా!

నీ వాలము వాల్లభ్యము – నిత్యసత్యముల నిల్పును
అధికమైన నీగదతో – అదలించుము అధములను
సంజీవని గొనితెచ్చిన – సాహస వానరవీరా
సకల జీవులను గాంచుము – కలకలమగు పాపములు.

లంకను దహియించినావు – లలిత సీత గాంచినావు
వానర వాహినులతో – సేతువు నిర్మించినావు
మహావీర! మహాబలీ! – మహాచరితసంపన్నుడ
నీ భజనలు సేయగా – మాబాధలు తీర్చుమయ్య.

సేవకుడా! బ్రహ్మచారి – సేదదేర్చి పోవయ్యా!
సాదరముగ ధ్యానింతుము – వేగిరమే రావయ్యా!
కోట్లజనుల కోరికలను – కోరితీర్చు మాసామి
కోపతాపములు వెడలగ – కొనుమిదె మా నీరాజన.

బుద్ధిశుద్ధిబూటకమై – నాటకమయె ప్రపంచము
స్వార్థజనుల మనసుమార్చి – శోభను కలిగించుమయ్య
నీనామము నీగానము – నిధియని దలతుముమేము
విధినియమములందుమమ్ము – విలువలతో నుంచుతండ్రి.

చిరంజీవి చిన్మయుడా – చింతవంతలను ద్రోలుము
సత్యసంధతలుగల్గగ – సహనవహనగుణము నిమ్ము
రామసీతహృదయాలలో – రాజిల్లిన హనుమంతుడ!
దశకంఠుని గుండెలోన – దడపుట్టించినవాడా!

సముద్రమునులంఘించిన – సర్వశక్తియుతుడా!
పర్వమె నీజీవనము – పరువము మా కదిగాదా!
భక్తిశక్తిభాగ్యమదే – రక్తిముక్తి సంధాయక!
రామరాజ్యమును జేయుము – రహికది సంతోషమగును.

భూతభయము ప్రేతభయము – భూమిలోన తొలగించగ
భూతదయాపరుడవీవు – భువనములకు పతివి నీవు
త్రేతాయుగమందుండిన – త్రాతవీవు తపనులకు
కలియుగ జనకలలన్నిటి – సాకారముజేయుసామి.

6

ఆదిలక్ష్మి అపరలక్ష్మి – ఆదరించుమమ్మా
ఆలించుము పాలించుము – అవతరించుమమ్మా
వరదాయిని వరరూపిణి – వసుధకు సుధనిమ్మా
కామితార్థ దాయినీ – కరుణను గనవమ్మా.

క్షీరాంబుధి వెలసితివి – క్షితిజనులను రక్షించితివి
నారాయణి నయగామిని – నామొరలాలించవమ్మ

క్షేత్రలక్ష్మిక్షాత్రలక్ష్మి – క్షేత్రజ్ఞుల కాపాడుము
క్షేమంకరి దయంకరి – దానమిమ్ము ధనకరీ.

ఆరోగ్యము ఆనందము – అందరికీ పంచుతల్లి
అంతరముల త్రుంచివేసి – అందరినీ కలుపుమమ్మ
ధనలక్ష్మి ధాన్యలక్ష్మి – దరిద్రులను కాపాడుము
ధైర్యలక్ష్మి శౌర్యలక్ష్మి – దైన్యరహితముగ జేయుము.

వైకుంఠము వైభవము – వాల్లభ్యము కలుగుతల్లి
హరిహృదయము ఆలయమై – అవతరించుమాతల్లి
లాక్షణికము లావణ్యము – లక్ష్యమున్న తల్లినీవు
దాక్షిణ్యము దాంతియుతము – ధరణిజనుల కల్పకము.

పెద్దమ్మకు సోదరివి – పేర్వడసిన దేవివీవు
భూజనులకు భుక్తినిచ్చి – భువనములను కాపాడుము.
నీవెంటనె పరుగిడుచూ – నియతిదప్పు జనులకూ
నిత్యసత్యమెరిగించుము – నియమమేదొ తెలుపుము.

ప్రకృతిలో నిత్యమూ – పరవశించు నీరూపము
పరవశమై పతనమాయె – ఫలితము నెరిగించుమమ్మ
వెచ్చదనము పచ్చదనము – వెలుగు చీకటులు నీవె
వృష్టినష్టి తుష్టిపుష్టి – ఉన్నతి అధమము నీవే.

నీవు కష్టసాధ్యవమ్మ – ఇష్టదేవతవునీవే
నవరసరసనవునీవే – నవ్యధాత్రిగాత్రివీవె
రూపివిరూక్షవునీవు – పాపికి శిక్షవు నీవు
నఖశిఖినిండిననీవు – నవ్యరోగపరిహర్తవు.

మితము హితము లందున – సతము సదయలందున
వినియోగము కలుగగా – వినుతయోగమమ్మనీది
మనసునందునిలుచుదాన – మనవినివినిమసలుదాన
మానవతివి మహనీయవు – మనుజజాతి వరణీయవు.

అసలునీవు కొసరునీవు – ఆశపాశములునీవు
అవసరముల ఆదరించు – ఆదితల్లివే నీవు

భువి దివిగా మార్చుమమ్మ – భూతతతుల భుక్తిగా
ఆస్తినాస్తిశక్తిగా – ఆప్తుల ఆర్తిని తీర్చుము.

7

పావనం పావనం – పరమపావనం
పాపభాగలోకంలో – పరమాత్మయె పావనం
అసలైన ఆత్మకూ – ఆదేవుడె ఆలంబన
జీవునిలో జియ్యరునే – జిలుగున దర్శించుము.

కోపముతాపముకోల్పడగా – కోరికలకు రెక్కలురావు
అసూయలేని అందమె అందం – సార్థకమగునుర జీవితము
దోషంరోషం దోర్బలరహితం – దోహదకారులు దురితములకునూ
మదమాత్సర్యము గర్వంసర్వం – మానవజీవితప్రహదములె సత్యం.

ధ్యానం యోగం ధ్యాసకు మలుపు – ఆశాపాశం అసలుకె మోసం
నవరసరుచిరం నాణ్యం గణ్యం – నవరంధ్రాలకు నవ్యం దివ్యం
నీవు నేను నిత్యము కాదుర – మేము మనము సత్యము కాదుర
నీనాతనముల నిధియొకడుండెర! – విధివిధములను వివరించునుర.

లేనిది ఉన్నది లేవడి చిత్రము – కన్నది విన్నది కలియుగమొత్తము
చిత్తము మొత్తము శివునికి హత్తిన – ప్రకృతి వికృతి పరవశమగునుర
శాంతం శౌచం పరోపకారం – సాంతమహింసకు సరళాకారం
కరుణాదయలే కలిమికి మూలం – కలియుగకాలపు కలసాకారం.

చెలిమి కలిమి చేతన మూలం – చేతల బలమె చెలువుకు మార్గం
మనసు వాక్కు కర్మల కలితం – మానవజాతికి మహిమోపేతం
జాతర పాతరలలో – జనం జయం కరవాయెను
మేళాతిరునాళ్ళలలో – మేదిని జనమదమాయెను.

నిస్తేజం నిర్లిప్తత – నిధి – విధులకు వైవిధ్యం
చైతన్యం మానవతా – నిత్య – సత్య నిర్ణయం
మానవతను మరచినా – దానవతను తలచినా
మంచిపంచు మానవునికి – మహిమనెంచు వివేకము.

వనమెజనునికొకనాడు – వసియించెను పావనమై
ధనము కొఱకు వనమునే – దహనము చేయును నేడు
తరము మారుచుండగా – అంతరములు తరలెను
వింత చెంత విలువ నిలచి – వలువలేని దిగమారెను.

భయంబాధ జంటగా – బధిరుడాయె ధీరుడు
నమ్మకమే వమ్ముగా – ఇమ్ముదప్పె జీవనము
వేల్పులెవరొ తెలియక – వెతుకులాటమొదలాయె
వేళమించిపోయెను – వెతలు మిగిలె మతులకు.

తపస్సంటె తెలియదు – తపనంటే తెలిసికోడు
తెలివిమించితేజరిల్లు – తెలియలేని మానవుడు.

8

మానవ! మనజీవితం – మాధవునకె అంకితం
నిత్యసత్యశోధనం – నిధిగవెలయుననుటనిజం
ఉండుట లేకుండుటలే – ఉద్యమ సోపానములు
త్యాగయోగతెంపరులే – తెరువు తెలియు తెరువరులు
తరతమములు తలపెట్టగ – మతముకాదు సోదరా!

సరసత సతమతముగా – సాగవలదు బాధరా
గురుబోధలు గుంభనములు – పరబోధలు నిత్యములు
పావన నవబోధనలే – పరమార్థము దెలియరా
విధివశమున వెలయుచుండె – వీధికొక్క దేవుడూ.

వ్యథతీర్చెడి అధిపుడే – అసలైన దేవుడురా!
సమాజమే దేవళమని – సాగువారె జీవులురా
జీవుడె దేవుని రూపుగ – జీవనమున సాగుమురా
నీవున్నది నిజమైతే – నిత్యమురా దేవుడూ
సత్యవాక్కునీదైనచొ – సారమె పరమేశ్వరుడు.

సదానంద చిదానంద – సాదర పరమానందం
ఆనందము బ్రహ్మమనే – ఆప్తవాక్యమదివినరా

కామాదులు కారడవులు – రామాదులు రహికి సుధలు
బుద్ధి బద్ధ జీవనమున – శుద్ధికి సూచనలురా.

వానర నర సంస్కృతికీ – వాసికలుగు వసుధలో
నరదానవ నాణ్యతకీ – వరదానము వంచనరా
పంచభూత ప్రపంచాన – పంచేంద్రియ నరులంతా
వంచనలే పంచుకొంచు – వాసి దరిగిపోతుండిరి.

భౌతికమున భాతి కలుగ – భావనలో భాగ్యముండు
త్రికాలముల తిరునామము – తీరులోనె తియ్యదనము
ఆశలమోసులు మదిలో – ఆహరించు ఆర్ద్రతలను
కలలోనివి కల్పనలుగ – ఇలజనులకు ఇంపు తొలగు.

ఆశనిరాశలకు మధ్య – ఆవరించె నిర్లిప్తత
లిప్తలోన అహమంతా – లుప్తమాయె జీవితముల
విడగొట్టుట పడగొట్టుట – విబుధుల మాయాజాలం
మాయలోనమనుజుడుండ – మహిమహిమమె లోకంలో.

అంతరముల తరములలో – అధికమాయె అవహేళన
నిరతం మనభారతమున – అవగాహన గహనమాయె
సమానతా మానంలో – అభిమానం అధికమాయె
సహజీవన యానంలో – జవసత్వం సరళమాయె.

వేదవిద్యవెలుగులో – వాదపటిమ వరుసదప్పె
నిత్యజీవవేదంలో – సత్యవాక్కు సమరమాయె.

9

హీనమైన చూపులో – హితం హతమె తెలిసికో
దీనమైన దృష్టిలో – దీవెన కలదని తెలియుము
ఆక్రందన అందరికీ – అవధియనీ తెలియరా
అభ్యర్థన పూర్వకమే – అభ్యుత్థానము భువిలో.

చెడు అనుట వినుట కనుట – చైతన్యం కాదురా
మంచి మార్గమని యెంచుట – మధురమైన జీవితము

దుర్వాసన దుష్టమనీ – సువాసనే శిష్టమనీ
వాసన వరముగ గాంచగ – వసుధనీకు వశమురా!

జిహ్వారుచియె జీవమనీ – గహ్వరమును గాంచకూ
రుచులువీడ రుజలుపోవు – సురుచినీకు వరమురా!
స్పర్శలోని సుఖమునూ – మర్శనమున 'దెలియురా'
మృష్టమైన స్పర్శలోన – స్పష్టమగును సుఖమురా!

మనసు మహిమతెలియగా – మమత సమత కలుగురా
ఇంద్రియసౌఖ్యములోనా – హీనమగును మమతరా!
నిండుమనసు మనిషికీ – నిత్య స్వర్గమగునురా
యోగసాధనమ్ములో – యోధుడవనితెలియరా!

సాధనశోధనలోనా – సాగునురా యీ జగము
బాధల బోధనలోనా – భావించర బతుకులనూ
ధర్మకర్మమర్మజ్ఞత – దారిచూపు జనులకూ
దానధారదారిలోన – దయజీవిత సర్వస్వము.

గుణగణములు గురువులు – ధనగణనలు దరువులు
జనగణముల అర్థములూ – జగతివారివర్తనలూ
మాతపితలుమాన్యములు – ధన్యజీవితములకూ
అనురాగం రాగమైన – జీవనమే ఉషోదయం.

ఉదధిలోన ఉదయించిన – ఉర్వరపై జనియించిన
ఉన్నతనతగురువరులే – వరపుత్రులు వసుధకు
సృష్టికర్తసృజనలో – సుందరభువి అందరిదీ
బంధు భావమున మెలిగీ – భవ్యజీవితముగడుపు.

ఎరుపెక్కిన ఎదలలో – ఏమరపాటుండనీకు
మరపుమనకు సహజమనీ – మార్పును ఎదిరించకు
పావనభువి జీవితమున – పాలుగొనుము ఫలముగా
పారుష్యము పరవశతా – పదమును నివు విడుమురా.

కులమతముల మలమూత్రము – కలదేహము కలుషమురా
కలుషములను పోద్రోలగ – కలియుగమే రోగరహిత

మోసముపై మోహముతో – దోషములను చేయకురా
వేషముపై వ్యామోహము – వెతల బతుకు నిజమురా!

10

స్కంధపురీ సోమేశ్వర! – క్రాంతికరా! భ్రాంతిదూర
శోకహరా శోభధరా! – శోభనకర – విభవకరా
కందుకూరి కందమా! – కరుణారససంద్రమా!
శాంతికాంతిదాంతినిధీ – శమదమములశక్తినిధీ.

పరమేశ్వర పార్వతీశ – వరములిచ్చు వరదుడా!
లింగరూపధారుడవు – సంగముక్తిపారగుడవు
జగదంబకు జయకీర్తివి – గంగమ్మకు గరితవీవు
లోకంబుల లోకేశుల – లోలత్వముహరియింతువు.

భసితాంగము భవదూరము – నిటలాక్షము నిధిమయము
నాగ గళాభరణము – పాపవిషయహరణము
పినాకినీ హస్తము – పిలుచు ముక్తిదాయకము
రుద్రాక్షల రూపము – రుజలన్నిటి సంహరణము.

కైలాసము కమనీయము – తాండవమే స్తవనీయము
ఆలుమగల సగభాగము – ఆదిభిక్షు అవతారము
లయకారుడు భయకారుడు – లక్ష్యము నెరవేర్చగలడు
త్రినేత్రము త్రిశూలము – త్రిలోకముల మూలము.

పులిచర్మము పూజితము – పులినమగును దర్శనము
గణపతి మురుగయ్యలు – గుణశీలపు గురుతులు
ఢమరుకమున నాదము – భాషకదియె నిధానము
నందివాహనము నీది – ఆనందపు అవధి అది.

ఆకారము వికారము – ఆదర్శము దర్శనము
లయకారుని లాలనము – లావణ్యము శోభనము
భావనమే భయదూరము – భాగ్యము ఆరోగ్యము
శక్తిముక్తిచాలకుడు – భక్తిరక్తి బాంధవుడు.

బంధనముల బంధువుగా – విడదీసెడి విబుధుడు
పరమార్థము పరార్థము – ఫలితార్థము ప్రారబ్ధము
అబ్దములే సార్థకములు – అర్థములే అన్వర్థము
కోరికలను కోతబెట్టి – కొలతలకోల్పడజేసి.

కోపరహిత కోమలతలు – కొలువుంచెడి కోమలుడు
శ్మశానమే నివాసమై – శోకములను పోగొట్టును
కైలాసపు కలాపమే –కలిపాపములను దునుమును
కంకాళము ధరించుటే – శంకలకు విమోచనము.

అస్తికలను మెడనుంచుటే – అస్థిరతల అవరోధము
కాలగమన గరువములో – కాలగళము కథనడపును
కలియుగజనప్రళయంలో – కలకలములనణగించును

11

గ్రహములగతి మారునుగ – అహరహములు జరుగునుగ
అనంతమౌ విశ్వానికి – అంతమె జనమరణముగ
బతుకు బాటలో – చితికిపోయినా
గతుకుల గమ్యమును మనిషిచేరకుండినా
అనుమానము మనిషినీ అహరహములు వేధించును.

నమ్మకమును నమ్ముకొనిన వమ్ముకాదు జీవితము
దరిద్రమే ధారుణిలో దయనీయము నరునికీ
శనిహస్తమె మస్తకమున శైథిల్యపు మార్గము
ఆకర్షణావికర్షణలు అవని జనత కందములు.

వికర్షణకె విలువనిచ్చు నవగ్రహముల చందములు
పెద్దమ్మా పెద్దయ్యలు పేరుపడిన వారలే
మెరుగుదలా విరుగుదలా పెద్దవారిచేతలే
సూర్యుడు కేంద్రముగా – సూదంటురాయిగా
సుడులుతిరుగు గ్రహములు – సుందరతల వారధులు
భువన భాండరచనకూ – పురికొల్పిన దేదియో
గదుల పదిలపరచగా – గహనమాయె జీవనము.

కానరాని మానసమున – కలియుగమున కలలెన్నో
కానవచ్చుసృష్టిలోన – కలకలముల జీవితములె
నిలకడ లేని మనసు – నియమబద్ధమగునదా?
నిర్ణయముల కడదాకా – పాలించుటె నియమముగా.

రసికుడైన దేవునకు – రసనయె లేదుగా
రసనకలిగి రచియించిన – రాసిక్యము కలుగదుగా
రసముల వైవిధ్యములో – రచన యెరసరంజితము
దేవుని యా రసములో – దేహికందునది శూన్యము.

అనంతమే అంతమైన – వింతసృజన విలువయేమి?
అంతరంగమనంతము – అంతరములు వింతలగును
అనంతుడే మానవుడై – అంతరములు విడిచినచో
అనంతమే అఖండమై – అవని అవతరించును.

తరతమముల అంతరములు – అంతమైన అనంతమే
తరచిచూచుమరపులన్ని – మరకలుగా మిగులును
కాలాంతము కాఠిన్యము – కలకాలం అనంతము
కాలమహిమ మనిషికృతము – కలికాలము బలికాలము.

పరమేశుని సృజనలో – పరమమైనవన్నియూ
అన్నిటిలో అందమునూ – అందుకొనర మానవా
ఆధారం కానరాదు – అవనికి యీ విశ్వంలో
విశ్వజీవి జీవితమున కాధారం యీ అవనే.

12

నిలకడ లేకున్నది – నిలువనీడ కరవైనది
నిత్య భయం వెంబడించి – నీరసమేమిగిల్చినది
మానవవృత్తులలో – మహిషవృత్తమగపడినది
జన నడవడివడిలో – జగతి గతే హీనమైంది.

భయ వేగం బాధలలో – బతుకుగతుకు మయమైనది
గమనములో గరళమయి – మమతలు మసిబారినవి

నీడజాడకానరాక – నిండుజీవి తహతహలు
నీడనిచ్చు వృక్షములను – నిలువున నరుకుటలు.

ఆకలి కలి అంటుకొని – అహరహములు అధోగతి
అంధకారబంధురమే – ప్రాణ బంధకారణమే
పశువు శిశువు పావనము – పరమగతికి సోపానము
జీవమున్న ప్రకృతిలో – జియ్యరు సర్వస్వము.

నమ్మకమే నాణ్యము – వమ్మగునది హైన్యము
వసుధ సుధలసారము – వలపు తలపు ధన్యము
అమరలోక సమరము – అతివాదుల కల్పనము
అసురలోక సహజము – అవగాహన శూన్యము.

అందనిదీ పొందనిదీ – అందరికీ ప్రియమైనది
అందు పొందు ఆలోచన – అవివేకపు సాలోచన
యత్నరహిత ఫలమును – ఎంచుకొనుట ఎరుకైనది
కామరహిత కర్మఫలము – కనుగొనుటే కరవైనది.

కార్యకారణముల జంట – ఆర్యజనులకదె తంట
హేతుహితము హీనమంట – హేయమాయె బతుకుపంట
మెదడులోని పొరలరీతి – విడబడియెను జనులరీతి
ఆదాయము ధనమురీతి – ఆరోగ్యము అధమరీతి.

నీడలేని మేధావులు – నిధులవేటలోనబడిరి
వ్రీడవిలువలన్నివదలి – విదేశముల కెగబడిరి
పదిలమైన పదవిలోన – పరమార్థము అర్థమనీ
అధికారులు ప్రతినిధులు – అధములైరి అవనిలో.

జనసేవయె ఘనమనీ – జనాశీస్సు జయమనీ
జనగణముల జాగృతిలో – జయం పొందవలెజనులు
బాధలన్ని ఒకటేనని – శోధనలో తెలిసికో
బోధ బాధలను తీర్చిన – భాగ్యమని మసలుకో.

తనమనధనములు గాంచుము – పరమాత్మకు అర్పించుము
పరులబాధ మనబాధని – పరమముగా ఎంచుము

కర్మలమర్మముదెలిసీ – ధర్మముగా వర్తింపుము
ధారుణిలో దారిదెలిసి – దయతో నివు గమింపుము.

13

కాగితాల జీవితాలు – కలియుగాన కలకలాలు
నోట్ల ఓట్ల పాలనలు – నుదుల బడిన గుడిసుళ్లు
డబ్బుమదం ధనదాహం – ధరణికె ఒక శాపం
రూపాయికి రూపం పాపం – విలువల విధి విబుధుల ధర్మం.

జీవితాలు శాసించే జిలుగుధనం – జీవరహితమైనదే నిజం
జనసృష్టికి దాసోహం జినుని సృష్టి – కాగితాల రూపంలో ప్రత్యక్షం
మసిబారుట మాడుటలే వాటిగుణం – మనసుల స్పందనలే మనకుగుణం
ఆశచూపు అవగుణాలు అధికం – అంధకారబంధురమౌ జీవితం.

పారరహితవ్యాపారం పరమగుణం – సారసహిత సహనమే సాధనం
అమ్ముటకొనుటలో అధమాధమం – మమతలు సమతలు మటుమాయం
విలువల వలువలు విబుధుల కవసరం – ధనం విలువ దానికీ వ్యతిరేకం
అహంలేని అందము అవనికి ముఖ్యం – దాసోహం ధనంకనుట దౌర్భాగ్యం.

కాగితాల కథలెన్నొ కలకాలం మిగులు – జీవితాలు మధ్యలోనె మిథ్యగానె మిగులు
విలువలేని కాగితాల విజయగాథలెన్నో – జీవితాల విలువలు జితకాములకే దెలియు
విఫణవీధి ప్రపంచమై – విలువలపై విహరించు
వినియోగము యోగమైన – విజయమే మనకందించు.

నియోగమే నిమ్నమైన – ప్రయోగమే ఫలరహితం
ప్రయోజనం పరమమైన – వరమేకద ప్రపంచము
ఖండములే అఖండమై – అవతరించె విఫణివీధి
అందరికీ అందులోన – భాగమిడుట అవశ్యము.

బడుగులు సంపన్నులు – బతుకుతీరు మరచిరి
ఆధిపత్యపోరులోన – అవతారము మార్చిరి
సంపాదన పథములో – సంసేవన ముఖ్యమనిరి
సంశోధన జరిపితే – సంబంధం తెలియదా!

అవమానం అభిమానం – మానానికి పొడిగింతలు
మానధనం ముఖ్యమైన – మానవాళి మహోదయం.

కష్టం ఇష్టంగా కలకాలం బతకాలని
అహం అవహేళనగా అహరహం మెలగాలని
త్యాగం యాగంగా యోగమాచరించాలని
ఆశలేని ఆశయం అందరిదీ కావాలని

సహనం వహనం సమజీవనంగా జరగాలని
అంతరాలు లేని తరం అవతరించాలని
స్వార్థం అర్థం సార్థకం కాకూడదని
భయం వేగం లేని ప్రశాంతత కలగాలని
భక్తితో వచ్చే మార్పు శక్తివంతం కావాలని
ఆరోగ్యభాగ్యం అందరికీ నిజమైన భాగ్యమని
కాగితాలకు విలువనిచ్చి కలియుగాన్ని ప్రళయంగా మార్చవద్దని.

14

నీరు మీరు వరం మనకు – నిధులపంట నిడును నిజం
నీటివిలువ తెలిసిమనం – మసలుకొనుట మంచితనం
వర్షమె మనకాధారం – హర్షమదియె మనందరకు
చుక్కచుక్క పొదుపున – చక్కనగును జీవనము.

చెరువుల పూడికతీసి – కాల్వకడ్డుతొలగించి
కొండచరియకందకముల – కొలువుంచుమునీటినీ
ఇంకుడుగుంటలు తీయగ – హితం కలుగు జనులకు
చెక్‌డ్యాముల చెలువుతో – చేరుభువికి నీరంతా.

అతివృష్టీ అనావృష్టి – అతలాకుతలం చేయగ
భూమిలోని నీటి నిలువ – భువనానికి మేలు చేయు
కుంట చెరువులాక్రమణ – తంటచేయు జనులకు
నీటి నిలువ పెంచగాను – కరువు దరికి చేరరాదు.

వాననీరు వాగులలో – సముద్రాన్ని చేరుతుండ
అడ్డుకట్టవేయగాను – భూమిలోని కింకిపోవు

కృష్ణాగోదావరులు – తృష్ణదీర్చు ప్రవాహములు
వర్షఋతువులందున – హర్షము కలిగించును.

అనావృష్టి ప్రాంతాలలో – ఆరుతడి పంటవేయ
అధికమగును దిగుబడులు – మంచినీటి కరవుండదు
కాలుష్యము కలుగకుండ – జాగ్రత్తలు తీసికొన్న
కలకాలము నీటి నిలువ – తెలిసికొన్న జయమగును.

రాయసీమ తెలగాణలు – సాగునీటి కటకటతో
సాగుచుండె నిత్యమూ – తాగునీటి దాహంతో
జలయజ్ఞం జనయజ్ఞం – భయమెంచిన యజ్ఞం
ఊరువాడ కలిసిమెలసి – ఉద్యమించ అద్భుతమగు.

ఏభేదం లేకుండా – ఏరువాక సాగినట్టు
జనసంద్రం కదలగాను – జలయజ్ఞం జయ యజ్ఞం
తెలుగుభూమి వెలుగుభూమి – తెలుగు జనులు తెలివిజనులు
నీరునిధిగ భావించీ – భాగ్యమొందు యోగ్యనరులు.

ఊరులోని నీటిచుక్క – వెలుపలికి వెళ్ళకుండ
మనభూమిని ఇంకజేయ – మనకెంతో మేలుచేయు
శ్రమదానం శక్తినిచ్చు – ధనదానం ద్రఢిమ నిచ్చు
కష్టేఫలి యన్నవాక్కు – ఇష్టముగా మనముండాలి.

పలుగుపార కత్తీ గొడ్డలి – పట్టుకొని నీవు పరుగునరాగా
పట్టణములను పల్లెలోనా – పారిపోవునుర నీటికి కరవు
ప్రభుత్వసాయం అందుకొనీ – ప్రజలంతా పాటుబడీ
ఎవరికివారే వారిప్రాంతముల – ఎదుగుదలకు ఉద్యమించుడి.

15

వాణీ వాణీ గీర్వాణీ – వాగీశ్వరి ఓ శార్వాణీ
మాటకు మాతా మాదేవీ – మహిమోపేతా జనజననీ
వీణాపాణివి విశ్వరూపివి – విశ్వసృజనకు విలువనిచ్చితివి
నలుమోములె నీ నాల్గువేదములు – నలువకునీవే నవ్యభామినివి.

మాటల పాటల మహిమోపేతవు – జాతిసంస్కృతికి జీవనాడివి
మానవజాతికి మహిత మాధురివి – నీ భావనయే నిత్యము సత్యము
ముందుగ నిన్నే నమస్కరించిన – ముద్దుమాటలను మురువుగనిత్తువు
భూషణములకే భూషణమైన – భువనవేణివి నీవేనమ్మా.

సుధలకుబదులే నీభాషణములు – వ్యధలను తీర్చే వెలుగురేఖలు
వివేకమునకే విలువలు కూర్చెడి – విబుధ పదములె నీముఖ దీప్తులు
చదువుల తల్లివి సరసపుమల్లివి – సృష్టి సవనమున సహభాగినివి
మేధకు మెలకువ శబ్దశాస్త్రమును – మేలుకొలిపిన మేదిని జననివి.

అమరవాణికీ ఆదిదేవతకు – మానవవాణికి మూలపుటమ్మవు
అన్యోన్యతలకు అందగింపువు – పలుకులపులకల పరమ మాతృకవు
భావబోధనకు భాసుర జగతివి – జగతి జనులకూ జవసత్త్వమవు
జ్ఞానసాధనకు గెలుపువునీవే – సృష్టిలోతులకు సూచివి నీవే.

బాసర భాసుర భాగ్యశాలివీ – జ్ఞానసరస్వతి జ్ఞేయవుగా
రుగ్మతరుజలను పారద్రోలగా – రూపమెత్తిన పాపహారిణీ
వాగీశ్వరివీ వేదభూషిణివి – వాదనాదముల వేదవినోదిని
నీ మూలమె యీ సారస్వతము – నిత్యసత్యము నియమబద్ధము.

శుద్ధవాక్కులో యిద్ధమహితము – మతమేదయినా మాకుదైవమవు
సరస గీతములు సరిగమలన్నియు – సాధువంతములు నినుజేరినవి
నీకుచయుగమను మాటసత్యము – విశ్వమునందున విలువనందినవి
మహతి నాదమే మధురం మధురం – సహనరూపమౌ సహభాగినివి.

ప్రకృతి పురుషుల పరమార్థానికి – సుకృతమిచ్చెను ఆకలరవమే
ప్రథమ మూర్తికి ప్రమదవీవుగా – ప్రమోదపదముల నిర్దేశించితి
కాలమహిమచే ప్రమాదకరమై – పరిణమించెనుగ ఫలకాంక్షలతో
నామ నాదముల నవ్యరూపవుగ – పదగీతములకు పరమ పావనిగ.

భాషాయోషగ భూషణమ్ముగ – ప్రాణవంతముగ ప్రాభవమిమ్మా
యుగములందున కల్పములందున – ఉన్నతినందిన ఉవిదవునీవు
కలియుగమ్ముల కలయుగమ్ముల – కలకాలములకు కామినివీవు
సంఘటనమునకు సారథి వీవు – సాంస్కృతికమునకు సారథివీవు.

ఉద్యమములకు ఊపిరి వీవు – అభ్యుదయమునకు అతిథివినీవు
శక్తిరూపిణీ! ముక్తిదాయినీ – భయపరిహారిణి! అభయదాయినీ!
రక్తిరాణివి – రమ్యకీర్తివి – మేధోరాజ్యపు మేలిమి తల్లీ.

16

గుండెగూటిలో గుసగుసలెన్నొ – మేదిని మెదడుకు మెలకువ లెన్నో
రక్తనాడుల రభసములెన్నో – మెత్తని మెలికల వత్తిడులెన్నో
నాడీమండల నాణ్యతలెన్నొ – నవ్యజీవితపు గమ్యతలెన్నొ
కోమలతలకూ కోశములెన్నో – ఆశాలతలకు అవధులుఎన్నో.

రసరమ్యతల రవణములెన్నొ – రుచుల రచనలా రూపములెన్నో
దర్శన స్పర్శన దారులు ఎన్నో – మర్శన మహిమల మార్గములెన్నో
మతముల తమముల తరళతలెన్నో – భక్తి ముక్తుల భావములెన్నో
పరమార్థమునకు పాదులు ఎన్నో – ఆస్తినాస్తుల అమరములెన్నో.

యాత్రిక యంత్రపు యాతనలెన్నో – మాతృతేజమున మహిమలు ఎన్నో
శతవత్సరముల శార్వరులెన్నో – గత భవితలకు గమనములెన్నో
రాతిజీవితపు రభసలు ఎన్నో – రాతిరి పగళ్ళ రంగములెన్నో
ఇనుప సంకెలల ఇరులెన్నెన్నో – ఇచ్ఛతుచ్ఛమగుమచ్చలుఎన్నో.

నవమాసముల నందనమేమో – నవరంధ్రముల అందమదేమో
బాల్యయౌవనపు భావనలేమో – వృద్ధజీవితపు బుద్ధమదేమో
ఈగల దోమల హీనతలెన్నో – హీనమానవుల గర్వమదెంతో
జన్యువు కనుగొన ధన్యతలెన్నో – మన్యువు మమతల మతలబులెన్నో
చిన్నమెదడులో చింతలుఎన్నో – బాధలగాథల భావములెన్నో
ఆలోచనలకు లోచనలెన్నో – అంతరిక్షగతిశోధనలెన్నో.

పరిణామముల పరవడులేమో – క్రమానుగతముల కారణమేమో
రక్తమాంసముల రూపములెన్నో – జీవకణముల జిలుగదియేమో
ఆప్యాయతల అర్థమదేమో – అంతరంగముల అంతరమేమో
సాంఘికజీవన సంగరమేమో – సంస్కారమున సారమదేమో.

నీదీనాదను నియతమదేమో – ప్రకృతి శక్తుల ఫలమదియేమో
పంచభూతముల పంపకమేమో – పంచేంద్రియముల వంచనయేమో

పురుషార్థములకు పూజ్యత యేమో – పరుషవాక్యముల పావనతేమో
ఆలుమగలకు అంతరమేమో – భూమ్యాకాశపు కలయికలేమో.

సంద్రసాంద్రతకు సాకులు ఎన్నో – భూమివృత్తమున భుజగములెన్నో
మనసు వేగమున మరపులు ఎన్నో – మానవ భయమున మరకలు ఎన్నో
ప్రకృతి స్థితికీ వికృతులెన్నో – పురుషుని చేష్టల పూజ్యతలెన్నో
స్వార్ధ మర్ధమౌ శోభలు ఎన్నో – సార్ధక జీవన సారథులెవరో.

పిడికెడు గుండెకు పిలుపు ఎప్పుడో – పలకని అలకకు పారమెన్నడో
కదలని అవయవ పయనం ఎటకో – పోయే ప్రాణం పోరు ఎందుకో
మేధో యంత్రపు వేదమేమిటో – వెదుకులాటలో వాదమదియెనో
ఆహరించుటకు ఆదరువేమిటి – అపహరించుటకు అందనిదేది.

సంఘర్షణలో హర్షమదెందుకు – సంరక్షణమున సరసము కలదా?
శాంతజీవనము సొంతముమరిచిరి – అశాంతములకు రెక్కలు చాచిరి.

17

పలకరింపులు కరిమింగిన వెలగపండులు
పులకరింపులు పలకబారిన హృదయానికి ప్రమాణాలు
ఆగని ఆలోచనల అంతరం తరతమాలు తెలియని తరంగం
ఆదిని అనాదిగా గుర్తించని అధమాధమ అంతరంగం.

ఆధారం అగపడని అవనికి ఆర్యదేవునితో అనుసంధానం
కిరణం కరణమై కార్యం సృష్టిచైతన్యమైనచో కాలచక్రం
చక్రభ్రమణం చేతన మహితమైనందుననే చింతకు అందని చిత్రం
వేడి వెలుతురుల వేకువలో తేకువతో గమించడం తెంపరిపని.

పచ్చదనానికి పచ్చధనానికీ ప్రారంభంలోనే పరుగులాట
జీవుల బలాబలాల హింసాహింసలలో జియ్యరు సృష్టికి జీవన్మరణాలు
పుడమితల్లి పరచుకొన్న పోరల పొత్తిళ్ళలో పునర్భవానికి పునాదిలేదు
తనలో తాను కరగి కరడుగట్టి కాలాల కలవరింతల్లో వరిష్టమై వెలసింది.

రాళ్ళుగా రేగళ్ళుగా రవళించిన భూమిలో
మానవరాజ్యం మరణశాసనం రాసుకొంటోంది

తన సౌఖ్యానికి స్వార్థానికి భూమి చాలదని
మిగిలిన భూతాలతో తగాదా పడుతున్నాడు

తనవద్దకు రానివ్వని సూర్యుని శక్తి సాధనంగా భావించి
తనవద్దకే రప్పించుకొన్నాడు
క్రిందపడిన పండుకు క్రితం స్థానం
భూమ్యాకాశాల మధ్యనున్న ఆధారమే.

నింగిలోని శక్తీ నీటిలోనిశక్తీ నియతం కానివని తెలిసి నియమాలు పెడుతున్నాడు
గోపురం కింద కాపురం పెట్టించిన దేవుడికి విశ్వవ్యాపకత్వం అంటగట్టడం
మానవమస్తిష్కాల మార్ధవానికి మాధవుని కాఠిన్యం మానస సరోవర మౌతున్నది.
శూన్యం సుందరమైనదని అంటూ ధన్యులౌతున్న యోగుల జీవనం భోగమయం
పాలక పాలితుల పాపాల పావనత్వానికి ప్రాయశ్చిత్తం ప్రజాస్వామ్యమేనా
పంది పన్నీరు మెచ్చదంటూ సరదాల బురదలో పడి సంక్షామాన్ని స్వాగతిస్తున్నాడు
విశ్వసంతలో నశ్వరమౌతున్న నరసంస్కృతిని వరదానంగ గ్రహిస్తున్నాడు.
అవనిలోని అరల పొరలన్నీ అవహేళనమౌతున్న తరుణంలో అంతరిక్ష ఈక్షణం
తవ్వితలకెత్తుకుంటూ తపనతో తరిస్తూ ఓర్పునశించి తార్పుడు పనిచేస్తున్నాడు.
అన్నిభూతాలు కలిస్తేగాని భుక్తిగడవని మానవభూతం
విశ్వభూతానికి విందుచేస్తున్నది.
పెత్తనం చిత్తాన్నిఛిద్రంచేస్తే భద్రమైన చైతన్యం భాస్వంతమై ఉద్యమిస్తుంది.
ఎదిగే ఎదగదిలో గుదిబండగా మారిన గురుత్వానికి మెరుగులు దిద్దేమమేధోవికసనం
వ్యక్తిశక్తిగా మారిన నేపథ్యంలో వెతలకు తావులేని వ్యవస్థ రూపొందాలి.
శ్రమ – సేవల విలువలు కట్టడంలో మానవజాతికి విధివిధానాలు నేర్పాలి
ఆనందం నందనంలో లభించే వస్తువయితే యీ లోకంలో నందనాలెన్నో
కృతి, ప్రకృతి, ప్రతికృతులలో ప్రాధాన్యం గ్రహించక అపకృతులు తయారౌతున్నాయి
కాలానికి కాలుష్యం కట్టబెడుతున్న కలికాలపు మనిషికి నిష్కృతి లేదు
వందేళ్ళ జీవితానికి వావివరుసలు చెప్పుకుంటూ వరుసదప్పుతున్నాడు మనిషి
అనుమానం అమానుషమై మానమర్యాదలు మాసిపోతూ మనస్థిమితం కొరవడింది
నవ్య మానవుని దివ్యతకై దీనత్వాన్ని ప్రేమించే దిగులు లేని మనసులు కావాలి.

కలం కులం కలకాలం కలవరం లేనిదిగా రహిస్తుందా?
కవికులం కపికులంకాకుండా క్రాంత దర్శిత్వంలో కొనసాగుతుందా?
కవిగళానికి నిగళం తగిలించిన నీతికోవిదుల జాతీయత ఏమిటో
కలంలోని మషీపంకానికి వంకలు తీర్చేవయ్యారుల వలపులెందుకో
కమ్మని కవిత్వానికి మనీతో విలువకట్టే కవితా వ్యాపారులకైతవాలెన్నో
అనుభవాలనుండి భవించిన భావాలకు అక్షరవిన్యాసమే ధన్యం
అలంకారాల ఆధిక్యం అందాన్ని చెరిచే విధానానికి అవలక్షణ అసలుపేరు
అల్లిక కవితలు అలవోకగా స్పందనకలిగిస్తే అభినందించాల్సిన అవసరముంది
కాలంతో నిమిత్తంలేని కవితా ప్రవాహానికి అడ్డుకట్ట ప్రచారరాహిత్యమే
మర్మంలేని కవనకర్మలో ధర్మబద్ధతకు దారిచూపే ద్రఢిమ తప్పనిసరి.

వల్లింపులు మళ్ళింపులు అల్లికలు భావాల అక్షరబద్ధతకు నిబద్ధులుకావాలి
ఆశ అనుభవం ఆలోచన అందగించే అక్షరసుమనందోనోద్యానం కవిత్వం
దేహికీ దేశానికి సందేశాన్నందించే సప్తస్వరసప్తపదులసారం కవిత్వం
నడకనేర్చిన నరునికి నడతనేర్పే సంప్రదాయ సంస్కృతులసహితం కవిత్వం
నవరంధ్రాల నరకవికి నవరసానుభవంతో భాస్వంతమైన భాషారూపం కవనం
వేదన నెలుగెత్తి చాటే వాదనాదమహిమల వెలుగు రూపమే కవిత
మృతుల జీవస్మృతుల స్మృతులలోని సుందరతల అక్షరావేదన కవిత
సార్వకాలిక సత్యాల సంపన్నతను సరసాక్షరాలలో చెక్కిన శిల్పం కవిత
చేదునిజాల చైతన్యం నుండి తేరుకొనలేని తెంపరుల తపన కవిత
గమ్యంచూపే గతానుగతభావాలు భవితకు చేర్చే వర్తమాననర్తన కవిత
కారడవుల్లో కారుణ్యాన్ని వర్షించే కష్టించే జీవుల శ్రమ నినాదమే కవిత
కదిలే కాలం వదలిన పదముల గుర్తులను పదిలపరచే పదసమూహం కవిత
కళ్ళముందు రంగంపై కరగిపోయే తెరపై జీవనాటకానికి చేసే వ్యాఖ్యానం కవిత
అర్థానర్థతలకు అవకాశంలేని చరాచర సృష్టివింతల చింతన కవిత
బాహ్యసృష్టికి అంతర్దర్శనంతో మర్శనచేసే మరో ఊహాచిత్రం కవిత
అందినదానికీ అందనిదానికీ అందమైన బంధం వేసే అక్షర సంబంధి కవిత
రంగులలోకంలో రంగరించిన హంగుల అక్షరావతారమహత్వం కవిత
సూర్యుని తాపానికీ సముద్రపు చల్లదనానికీ మధ్యనున్న మబ్బుతునక కవిత
ఆరుకాలాల కలకలానికి ఆదర్శమానవుని అనుభూతలకీ దౌత్యం నెరపేది కవిత

68

ప్రణయ ప్రళయాల పలకరింపులకు పనికొచ్చే పదముల పథము కవిత
పంచేంద్రియాల పరుగుపందెంలో గెలుపోటముల నిర్ణయాక్షరి కవిత
అపరసృష్టికీ అనన్యవ్యక్తీకరణకూ అవసరమైన సరంజామా కవిత
కని వినిపింపజేసే కవి రవికంటె అధికుడనే రసికుల ఆలోచన నిజం
అనంతవిశ్వాన్ని అంతరంగంలో బంధించే అపర బ్రహ్మ కవి అనడం అపోహకాదు
మనిషి చేసిన దేవుడు మసిబారకుండ పరిరక్షించే అక్షర శిక్షకుడు
కవి కలం హలమై అక్షరక్షేత్రాన్ని దున్నితే అనంత సత్యాలు పండుతాయి.

19

కలం పట్టి కదంత్రొక్కి పదంపాడి కదలరా సహోదరా!
హలం పట్టి పొలందున్ని పంటపెంచి పదముందుకు కృషీవలా!
గన్నుపట్టి గరువమెంచి గర్వమణచి గమించరా సైనికా!
మిన్నుముట్టు యత్నమెంచి మిహిరునిపై కాలుపెట్టి కదలుమురా మానవా!

నీపుట్టుక నింద్యం వంద్యం – నీ విధియే బంధన వంధ్యం
నీ అహమే మహదాకాశం – నీ గర్వం సర్వం ఖర్వం
నీ శీలం నిత్యవందితం – నీ శూలం నిత్య శంకితం
నీ నేర్పే తీర్పు ప్రకృతికి – నీ ఎఱుకే కఱకు పద్ధతి
నీ తెలివీ తేట తెంపరి – నీ బలిమీ బలురక్కసిదీ
నీ నామం నిలువుటద్దమూ – నీథామం నిత్యనూతనం
నీ భక్తీ భగవదర్పితం – నీ శక్తీ నిత్యశంకరం
నీ రక్తీ రామణీయకం – నీ శాస్త్రం దానవశస్త్రం
నీ న్యాయం వన్యం గణ్యం – నీమతమే సత్యం సత్త్వం
నీ తత్త్వం తరగని సత్యం – నీ తర్కం అర్కుని కరణం
నీ లోచన నిత్యవివేచన – నీలోకం నిధులతొ బధిరం
నీ శ్రవణం నీరవరవణం – నీ భవనం భువనపు విజయం
నీసుఖమే సుందరస్వప్నం – నీ దుఃఖం దుర్భర దురితం
నీపయనం పవనం వైనం – నీ గమ్యమె జనగాంధర్వం
నీ అభిమానం అభవం భాగ్యం – నీ అవమానం నిరుపమనిమ్నం
నీపుణ్యమె జనపూజ్యం త్యాజ్యం – నీపాపమె జనప్రాణసంకటం
పుట్టుట తెలిసిన విషయం – గిట్టుట తెలియని పయనం

రాకపోకలకు రాజ్యంలో – పాగావేసిన కాలమె స్వల్పం
నీకు తెలియని నీ తత్త్వానికి – నిగళం వేసిన నింద్యుడవీవే
వేదనలో నా వెలుగుచూచినా – చీదరింపులా చిరుతవునీవే
సిగ్గుకోసమే చీరకట్టినా – సింగారమునీ సిరియాయెనుగా
పై పైమెరుగుల పాపపులోకం – పరిపరివిధమున పావనమాయెను
మోసపు నడకల మోదపుజీవీ – మాదకద్రవ్యం నాదనబోకుడు
మాటల ఈటెల చేటునుకనుము – దాటకు ధర్మము దారుల నడుము
దయాకరుణలా దారిని కనుము – దాతృత్వమ్మున తరియించుమురా
త్యాగయోగముల యోజించుమురా – రాగభోగముల రహినేలుమురా
త్రిగుణాతీతము తిరుజీవనమురా – త్రికరణ శుద్ధేతిరుకరణమురా
అందని పొందుకు అర్రులు చాచకు – అందిన అందపు చందము దెలియుము
పరభాగ్యములే పాపభాగులు – వరనీశక్తియె వసుధకు పుణ్యము
ఆగని కాలం అందదులేరా – అందిన కాలపు అంచులు చూడర
నీజీవనమే నిన్నటి వెలుగు – రేపటి వెలుగే రేజీకటిరా
వర్తమానమే కర్తకర్మ – వరపు కర్మలే వసుధకు సుధరా

20

నీడలేని వాడా నిజం తెలుసుకో –
నీడనిన్ను వీడదురా – నీ వెంటనె పడునురా.
నిధియేనీడనుకొన్న నియమరహితవర్తనుడా
విధియే నిజమని నమ్ముకు విజయము సాధించరా.
తేలుకొండి మనసుకు తెలివితేటలెన్నెన్నో
తేల్చుకొనే వివేకమే తెలుపును నీ వర్తనరా.
సత్యమైన వాక్కునకు సరసతయే వలదురా
నిత్యమైన మాటలలో నిధులు విధులు కలవురా.
పరపీడన ప్రధానమే పావనమని ఎంచకూ
పరమార్థపు సాధనయే వరవర్ణిత మగునురా.
దేహిలోని దేవునికీ దేవులాటె నడవడిరా
దేవునిలో దేహికీ దీనదయే దివ్యతరా.
అగపడుదేవునికీ అగచాట్లెన్నున్నవో

అగపడే జీవునికీ అనుమానము లెన్నెన్నో.
జీవునిలో దేవునిలో జిలుగు వెలుగులెన్నియో
జీవునిలో జీవానికి జవసత్యము లెన్నెన్నో.
ఆత్మ అంతరంగమనే అనుభవంపు భవమేదో
పరమాత్మ అనంతమనే ప్రవరవాక్కు మహిమేదో.
ద్వైతము అద్వైతములో దోసమేమి తెలియునో
అద్వైతమునను సరించి 'ఆది' విధము కలుగునో.
సృష్టికార్యకర్తకు ద్వైతమున్నదా అనాదిగా ఒకడేనని అనుభవమ్మురా
కర్తకర్మక్రియలన్నీ కాలపురుషుడే – కాలం కలగా మిగిలే కలియుగమ్మున
జీవాత్మకు పరమాత్మకు అభేదము – జీవి జీవనమ్మున విభేదమే
ఆదిఅంతములు రెండూ ఆదిదేవుడే – మధ్యమానవాళియే మిథ్యదెలియరా.
నీనీడయె పరమాత్మ – నీవే జీవాత్మవురా
నీడజాడ తెలియకుండ – వీడకురా జీవనమును.
చైతన్యపు స్తన్యమే – సూర్యుని కిరణమ్మురా
తెలియనిలోకాలనుండి – తెలవారే వచ్చునురా.
ఆకాశము ఛత్రముగా – అవతరించు నీమేధ
పుడమితల్లి పునాదిగా – పూజ్యమగుట నిజమురా.
రాశిచక్ర గతులలోన – రాజిల్లును జీవనము
గతిదప్పెడు జీవనమే – దుఃఖరాశియగునురా.
నీడకుభయపడువాడే – నేటి మనుజుడాయెరా
వీడని భయమున మునిగీ – మనసువాడిపోవునురా.
చపలమైన రూపానికి – చలనమునీ నీడరా
ఆత్మరూపు స్థిరమైనది – అదె అందరి ఆనందము.

21

స్పర్శలోననే స్వర్గమున్నది – స్పందనలోనే అందమున్నది
తెలియనిలోకపు తపనుని కిరణము – తెలిసిన తీరే తొలిస్పర్శ
పద్మబాంధవుని ఆకర్షణమే – పచ్చదనమునకు మలిస్పర్శ
నేలనుతాకిన మేలిమి చినుకే – మేదిని మృదువుకు ఫలస్పర్శ
ప్రకృతిపురుషుల ప్రథమ స్పర్శలో – వికృత ఫలమే సృష్టికి స్పర్శ

జీవుల జీవన సాఫల్యములో – ఆలూమగలది ఆదిమ స్పర్శ
అంతరంగముల తరగల స్పర్శే – అందరికీ ఆదర్శమగునుగా
చెలియలికట్టను స్పర్శించనిదే – జలధి జలములకు జవములేదుగా
ఒడ్డులు ఒరుసుకు ప్రవహించనిదే – నదులగమ్యమే నరకముగాదా
చెలిమికి చెలువము శరీరస్పర్శే – ప్రేమకు పేరే పెదవుల స్పర్శ
మానవ మనసుల మధురము స్పర్శ – మాతృత్వమునకు మూలము స్పర్శే
హృదయవేదనకు ఊరట స్పర్శే – మధుర భావనకు భాషయె స్పర్శ
భగవత్ స్పర్శయె భక్తుని భాగ్యం – యోగమూర్తికీ యోజన స్పర్శే
కలలజీవితము కలతల స్పర్శ – కర్మకాండలకు కలదాస్పర్శ
ఆకర్షణలకు అందని స్పర్శ – మనసు మనసును మరువని స్పర్శ
మలిన చిత్తులకు మహిమయె స్పర్శ – విషజీవనులకు విలువయె స్పర్శ
పరమార్థమునకు పయనం స్పర్శ – పదార్థగతమౌ అణువుల స్పర్శ
అంగాంగముల అమరిక స్పర్శే – రంగురంగుల రమ్యత స్పర్శ
తూరుపు కొండకు సూర్యుని స్పర్శ – పడమటి దిశలో పావన స్పర్శ
ఆకాశమునకు అవనికి స్పర్శ – అంతరాళమున కందని స్పర్శ
స్పర్శకుమించిన భోగములేదు – స్పర్శకు చెందని యోగము లేదు
అమలిన స్పర్శకు అమరికె లేదు – మలిన స్పర్శకూ మరువం లేదు
మొలక మెలకువకు మేదినిస్పర్శే – కంటికి రక్షణ రెప్పల స్పర్శే
రక్తప్రవాహం కవాట స్పర్శే – గుండె చప్పుడుకు గురుతూ స్పర్శే
ఎముకల గూటి బంధం స్పర్శే – పంచేంద్రియముల ఫలితము స్పర్శే
నాదవేదములు నరునికి స్పర్శే – శాస్త్రశస్త్రముల చెలువము స్పర్శే
స్పర్శను మించిన లోకం లేదు – స్పర్శను మించిన జీవం లేదు
జన్మరచనలో స్పర్శే ఉందీ – ధన్యజీవికీ గణ్యత స్పర్శే
కళల అందమే కమ్మని స్పర్శ – కలకలమ్ముల కఠినపు స్పర్శ
అన్నిబంధముల కందనిబంధం – అమరమైనదీ ఆత్మల స్పర్శ
జీవాత్మ పరమాత్మల ఐక్యత – జియ్యరు రూపపు జిలుగుల స్పర్శ
విశ్వరూపమే వింతగు స్పర్శ – అంతయునేనే అనుటయె స్పర్శ
సంఘజీవనము సర్వము స్పర్శే – అందరొక్కటే అనుటయు స్పర్శే
అనురాగములకు ఆప్యాయతలకు – అమరమైనదీ అమరిక స్పర్శే

స్పర్శే సౌఖ్యము స్పర్శే ధన్యము – స్పర్శే మాన్యము స్పర్శే మానవం
మానవ తత్త్వము నిండిన స్పర్శే – మంచికి మార్గము మహదాశయము.

22

జాజిమల్లె పందిరిలో – జావళీలు పాడుకుందాం
మల్లెపూల పక్కపైనా – మాధుర్యం పంచుకుందాం
చందనాలు అద్దిన – చంద్రకిరణ స్పర్శతో
స్పందనాలు ఆగగా – స్వర్లోకం సాగుదాం
అనురాగపు ఆకలిలో – కలియుగాన కలుసుకుందాం
ఆత్మీయపు అందంలో – అందలమే ఎక్కుదాం
పెదవుల ప్రేమలు – ప్రేరకములుగా
చదువుల సరసము – రసభరితంగా
వయసుల వలపులు – తలపుల తనివిగ
లోభం లేని లోకానికి – డోలలొ మనము పయనిద్దామా!
అద్దం అర్థం – అర్థం కానిదీ
అపార్థమై అది – అందరానిది
ప్రతిబింబముగా ప్రతిఫలించునది
ఫలరహితముగా – పరిణమించునది
అద్దరిమనసుల – ఇద్దరి ఫలమది
కనులు కల్లలై – కలవరించినది
మనసు మల్లెలై – మరువమిచ్చినది
చిలుక పలుకులా – కులుకు చిలికినది
హంస నడలతో – అనుగమించినది
అన్యోన్యం ధన్యమైనది – అనునిత్యం – సత్యమైనది
ప్రేమపల్లకీ – పేరుమోసినది
రామ అల్లరీ – రహికి మెచ్చినది
భామభాగ్యము – బతుకు కచ్చినది
ఆడతనమునా – అమరమైనది
మనసుల సమరం మనప్రేమ – మరపేలేనిది మనప్రేమ
కాలం కొలతల – కందని రాగం

ఇరుసంధ్యలకూ – తెలియని రాగం
అరుణిమలోనా – కరుణకు నిలయం
తీరనికోరిక – తీరే ప్రేమ.

అమరసరాగం – ఆ అనురాగం
కులమతమ్ముల – కూల్చెడిరాగం
పాపశాపముల – పదిలమురాగం
మృత్యువునీడ – మురిసెడి రాగం
అనురాగం అభిమానరాగము – అనుబంధానికి ఆదిసరాగం
సత్యశివముల సుందరరాగం – నిత్యశాంతికీ నియమపరాగం

23

భూగోళం అంచులపైనా – భాగోతం ఆడుకుందాం
ఆకాశం వైశాల్యంలో అందాలను అందుకుందాం
పైలోకం స్వర్గంలో పాతకాలు ఉతికేద్దాం
పాతాళం చేతాళంలో – పావనతకు పాదులేద్దాం
అమరతరువు బరువులన్నీ – అవలీలగ దించేద్దాం
నరకలోక నాగరకతలను – నవ్యంగా చేసేద్దాం
ఐరావత అవధులన్నిటిని – అవగతం చేసుకుందాం
వాసుకి ఘనవయసునకూ – వాచవులే నేరుపుదాం
నందనవని చందాలను – అందుకొని ఆరగిద్దాం
పాతాళపు గంగమ్మకూ – పవిత్రతను కల్పిద్దాం
కైలాసం కులాసమంతా – మనదేనని అనుకుందాం
వైకుంఠంపు వాలకమంతా – వాసికలుగ అనుభవిద్దాం
సూరీడుని తాపమునంతా – సుందరతగ అందుకుందాం
చందురుడి చందనమంతా – అందముగా అలదుకొందాం
తారకలా తారుణ్యమును – తనివితీర అవలోకిద్దాం
గ్రహకూటము గమ్యమునంతా – రమ్యంగా రసియించేద్దాం
సంద్రానికి చెలియలికట్టగ – బంధనముల బంధించేద్దాం
అంతరాళ అంతరమంతా – వింతగాను విలోకిద్దాం
వేదసార వెలుగులనంతా – వేగమె ఆపోశనచేద్దాం

కావ్యాలను కవ్వంపెట్టీ – అమృతాన్ని మధియించేద్దాం
అవతారపు ఆదిఅంతముల – అందరికీ విప్పిచెప్పుదాం
పురుషార్థపు పూజ్యతనంతా – పూసగ్రుచ్చి వివరించేద్దాం
రామాయణ రామణీయకతను – రహిజనులకు బోధించేద్దాం
భారతమున భాగ్యమేమిటో – భావితరాలకు చెబుదాం
మతములలో హితమతమేదో – మహిజనులకు అందిద్దాం
కులముల జనకూరిమి మహిమను – మానవులకు వివరిద్దాం
సృష్టికిమూలము శూన్యము కాదా? – ప్రశ్నకు బదులును కనుగొందాం
అంతము మరణము అదిజనునకెయని – అందరికీ చెప్పేద్దాం
ధర్మమర్మముల దారిని తెలిపే – ధరణిని స్వర్గం చేసేద్దాం
కర్మలసారము కామరహితమని – కలియుగ జనులకు తెలిపేద్దాం
ఆగనికాలం ఆశలమయమని – అసలుగుట్టును విప్పేద్దాం
ఆశలె బాధల మూలకారణము – ఆజ్ఞానమునేతొలగిద్దాం
ఆడుట పాడుట అందరి కొరకని – అవబోధన కలిగిద్దాం
సంకుచితత్త్వము సంచితపాపము – వదలుటకై యత్నిద్దాం
సూర్యమండలము అండనుచేరీ – సుందరప్రకృతి సృష్టిద్దాం
చంద్రమండలపు చేరువకెళ్ళీ – చైతన్యమునే పంచిద్దాం.

24

అమ్మ అన్న మాటలోనె – అందమున్నది
అమ్మలాలిపాటలోన – అందలమున్నది
సూర్యకిరణచైతన్యము – అమ్మ అన్నది
చంద్రకిరణ శీతలతే – అమ్మ అన్నది
భూమి ఓర్పు భువనమై – అమ్మ ఉన్నది
వార్ధిగంభీరతయే – అమ్మకున్నది
కార్యాల కమ్మదనము – అమ్మయైనది
కరణముల వరణనమైన – అమ్మఉన్నది
భోజనము భోగమై – అమ్మ ఉన్నది
రూపముల రుచ్యమైన – అమ్మ ఉన్నది
అనసూయకు ఆదిగురువు – అమ్మయైనది

కోపతాపకోరికలకు – కర్తరియే అమ్మ
షడ్వర్గపు పగ్గముగా – అమ్మ ఉన్నది
పురుషార్థపు పూజ్యురాలు – అమ్మయైనది
మంచుకన్న చల్లదనం – మహిమగలది అమ్మ
ఇనునికన్న వెచ్చదనం – వెలయించును అమ్మ
ప్రకృతి పచ్చనితనమున పాలుపంచుకొనునమ్మ
ప్రాణాధారపు నీరున – పావనమే అమ్మ
ఆర్తికి ఆక్రందనలకు – అవసరమే అమ్మ
అందని అందాలకు – అపురూపమె అమ్మ
ప్రేమ అనురాగములకు పేరు పెంపు అమ్మ
మమత మాధుర్యాలకు మార్గమే మన అమ్మ
అమ్మ మానవత్వములో అహము లేదుగా
అమ్మ మహితత్త్వములో అపకారము లేదుగా
మంచిచెడుల మాలిన్యము మలిపేది అమ్మగా
భువన భాండపూజ్యతకే – భవనము అమ్మగా
అమ్మప్రేమ అనుభవించు – ఆరాధన గావించు
అమ్మదయకు పాత్రుడవగు – కరుణను చూపించు
అమ్మ ఆశయముల పండించు – ఆదరణను చూపించు
హృదయంలో పదిలపరచు – అమ్మరూపు ఆశయమే.

అంతరంగమామెది – తరంగముగ నీవుండు
అంతరములు లేనిది – తరతరాలు గుర్తించు
అవతారమె అమ్మది – అరివర్గములేనిది

నీకుమూలమైనది – నీవే నిధి యనునది
ఆకలికి అమ్మ – ఈకలికీ అమ్మ – కరుణ కలికి అమ్మ
అరుణోదయమమ్మ – ఆశయమే అమ్మ – అనుభవమే అమ్మ
అమరమే అమ్మ – సమరమే అమ్మ – అందరివరమే అమ్మ.

25

దయయు దానము కరుణము కర్మము

కలబోసి మలచిన కమ్మని రూపమ్మ
సేవాధర్మము చేతనలో నిండగా
దీనహీన హృదయాలలొ నిత్యం పండగా
విలువ విధుల నిధియె మాత వితరణ మీరగా
మదర్ థెరిస మాన్యమై మహిమను మీరగా
దేశకాలపుట్టుకలే దేహములకు లేవని
వేషరూపధారణలే వెలుగుల చేతలనీ
వెతలబతుకు కతలే జీవితకొలమానమనీ
మానవాళియెడలజాలిమహనీయ మధురమనీ
తెలిపిన మన మదరుకూ తేట జీవితము కలిగెను
నిర్మల హృదయము మలిన రహిత కర్మము
త్రికరణముల కిరణము ప్రకరణముల చరితము
చేవలేని చేతకాని చేదుబతుకు చింతనము
వంతల వలవంతల కూ ఆంతర్యము ఆసహ్యము
పొరుగువారి మురుగు బతుకు పరుగుదీయ ప్రయత్నించె
కరిగిన ఆ హృదయమే కన్నీరుతొ మున్నీరయె
అమ్మ నాన్న ఎవరులేని ఆ అనాథ బాలలకు
ఆమె కల్పవృక్షమూ – ఆ కృపయె అక్షరము
ప్రేమ పేరు మదరు – పేదవారి ఆదరువు
జాలి జోల జనని – జాజిమల్లి మనసు
సేవాభావపు సేతువు – చేయువారి కాదర్శము
గుండెనిండు గురుతు – కారుణ్యపు రూపము
ఆధ్యాపకతత్త్వము – అసమాన నేస్తము
జీవితమే ధన్యము – జీససు మహత్యము
ఆమె బతుకు అంకితము – అసమాన దర్పణము
కామరహిత కర్మలే – కామినికి పర్వము
పిలువకనే బిరుదులన్ని – ప్రక్కకొచ్చిచేరెను
త్యాగమనే గాలిపటం – చేరెను ఆకాశము
విశ్వవ్యాప్త సంస్థలన్ని – విలువలతో వెలిగించెను

భారతమే భాగ్యమయి - మదర్ థెరిస త్యాగమయి
కలకత్తా కాళికకు - కారుణ్యం మెండు
మనసేవిక మాతకు - దయాధనం నిండు
పతితలకు దళితులకు - పావని దేవత
మనసు కలుగు వారందరి - మాతయె థెరిస్స.

26

ఉమ్మడికుటుంబం - అది ఉన్నతకుటుంబం
ఉత్తమ కుటుంబం - అదే ఉదధికి సమానం
విశ్వం ఒక వింత కుటుంబం - విలువలకది విజయతరంగం
జనావళికది జాజ్జ్వల్యమానం - మానవతకది మహనీయకేతనం
మూడుతరముల ముచ్చటైన సంగమం - ముద్దులపద్దుకు హద్దులు లేనిది
తాతా మునిమనుమళ్ళకు తరగని సంబంధం
బంధువుల బంధములకు బంధనము లేనిది
ఆనందం వెల్లివిరియు ఆర్ణవమే అది
అనురాగం ప్రవహించే జీవనదే అది
అమరం అరచేతికి అందించేదది
ఆదరాల సాదరాల అవకాశం అది.

విభజించి పాలించిన విబుధుల విజయం
కూలబడెను కుటుంబాలు వేరైన వైనం
ఎవరికి వారలే యమునా తీరుగా
ఎదుగుదలే వదులవగా ఎఱుకయె శూన్యము
ఆకాశం కప్పుగా భూమియె భవనమ్ముగా
విశ్వజనత విలువనెంచి మానవతను సొమ్ముగా
మదిదలచిన పదిలమగును మనవిశ్వకుటుంబం
మంచి మహిమ మధురిమలకు మహనీయ గోపురం
ధరణిలోని దాంపత్యం దారిమళ్ళిపోకుండగ
సంసారపు సరళిలో సమతుల్యత సాధించగ
అన్యోన్యత అభిమానము ధన్యతనందించగ

కుటుంబమే రాదారిగ దివిజేరును మానవత
వివాహమే విలువలపునాది – కుటుంబాల గెలుపునకది అనాది
పెద్దాచిన్నలప్రేమధనాడి – కలిమి బలిమి కథలకదే కమనీయమది
వసుధైక కుటుంబమే  వాసిగాంచగా
కలగన్నకుటుంబమే – ఇలను మించగా
శాంతినిండు కుటుంబమే – చెలిమి పంచగా
సహజీవన సమభావము – సహనమునించగా
భయం బాధ కుటుంబాన్ని – బావురుమనిపించెను
వ్యాపారవేగములు వెల్లువలై – ఇల్లు గుల్లచేసెను
ఆస్తికతే కరవాయెను – ఆస్తి పెద్దదాయెను
మృదువైన మనసులే – మొద్దుబారిముద్దువీడె
కోడలు అత్తలలో – కోపము మీరెను
మామా అల్లుళ్ళలో – మాన్యత తగ్గెను
యువతీ యువకులలో – నవ్యత మించెను
కలియుగ కలహములే – కుటుంబమును కూల్చెను.

27

మడులు కట్టు వ్యవసాయము – మాన్యతాయెను
గుడులు కట్టు దైవభక్తి – గూఢమాయెను
బడులు కట్టు జ్ఞానశక్తి – భాగ్యహీనము
వేరువేరు కుటుంబాలు – విలువమించెను.

కుంచించిన గుండెగోడ – కుటుంబాన్ని వంచెను
స్వార్థ మానవత్వము – ఇంటిశోభ మంటగలిపె
ఆడది ఆడదనే – అసమభావమవనిలో
అవతరించి తరించగా – అటమటమయె కుటుంబము.

అమ్మఒడిని కమ్మగా అధివసించలేనివారు
నాన్నఎవరో తెలియని నవ్యభవ్య జీవనులు
అనాథులై అధములై అవహేళన పడినవాళ్ళు
కుటుంబాల కూల్చగలుగు కుంపటులై నిలుచువారు.

విద్యలోని స్పర్థలతో – వధ్యమాయె వలపుతలపు
కాన్వెంటు మోజులోన – కంటితుడుపు మమకారం
పసిబిడ్డల పెంపకమున – అంపకాల గృహములు
వృద్ధులశరణాలయాల – వధ్యమాయె అనుబంధము.

హోటళ్ళూ హాస్టళ్ళూ – 'హోమ్‌లీనెస్' నిలయాలు
దత్తతకేంద్రాలలో – దాగియున్న కుటుంబాలు
ప్లాటు, ఫ్లాటు జీవితాలు – ఫ్యాకల్టీ కుటుంబాలు
హద్దుల సరిహద్దులలో – అద్దములో కుటుంబాలు.

కైపుల కైంకర్యములో – కింకరమై కుటుంబాలు
కాలంకను మరుగులో – కలకలమౌ కుటుంబాలు
కులం మతంపేరుతో – కూలిపోవు కుటుంబాలు
చదువు సంస్కారాలని – చచ్చిపోవు కుటుంబాలు.

పాశ్చాత్యం మోజులోన – పతనమైన కుటుంబాలు
అమెరికాయె అమరంగా – అంతరించు కుటుంబాలు
కాలుష్యపు బంధంలో – కాలిపోవు కుటుంబాలు
కడలేని బీదరికము – కబళించు కుటుంబాలు.

ఆత్మహత్య ఆశ్రయమై – విశ్రమించు కుటుంబాలు
జలప్రళయం జటిలమై – జగతివీడు కుటుంబాలు
భూకంపం భూతమై – భూస్థాపిత కుటుంబాలు
కక్షద్వేషయుద్ధాలతొ – కలివీడెడి కుటుంబాలు.



వేదం వాదం మీరిన లోకం – వ్యాపారంలో మునిగిన లోకం
వెలుగు చీకటులు తెలియని లోకం – వెతలే బతుకుగ మిగిలిన లోకం
శాంతి శక్తికీ చెందని లోకం – కాంతి కర్మల కలుషపు లోకం
కుటుంబాలనే కూల్చే లోకులు – కాలిన కలలకు కూలిన లోకం.

28

పవనంలో పయనమా – పరువం జనపర్వమా
పావన నవ జీవనిగా – పారుటయే మధురిమా!

మనసే మరుమల్లెగా – వయసే విరిజల్లుగా
వలపే సెలయేరుగా – వధువే నవ మధువుగా.

కానని లోకానికి – కనులు పయనమౌతున్నవి
మాయని మమతలో – మంచుతెరల తెలుపున్నది
పంచేంద్రియ పథంలోన – పంచదారలున్నవి
మానసంపు సంపుటిలో – మధురపుటలు ఉన్నవి.

విశ్వం వశమైనదీ – అందం ఆకలిలో
నశ్వరమౌవిశ్వమే – నవనీత సదృశము
చిలుక పలుకు కులుకులే – చెలి చింతన మెలకువలు
ఒరగల్లు చెక్కిళులే – ఒంపు సొంపు వడపోతలు.

అందరాని అందానికి – అథరపదము నిలయము
ముఖచంద్రుని సుఖములో – మునిగెను ఆ మురిపెము.
ప్రకృతి ఆకృతిగా – పరమ పదము సుకృతిగా
వికృతి కలిగించెనుగా – విదుల మదుల విరివిగా.
తనివి తీర్చు తన్వికీ – తరగని సంపదగా
తనువు తపన తీర్చుగా – ధన్యత చేకూర్చునుగా.
ప్రాయము పదహారుగా – పరవశమై పోవగా
మనసు గాయమాయెగా – మాన్పునదే మహిమగా.
కలలోని బతుకులో – కలవరమై పోయెగా
కలవరాల కడలికీ – కలికి జన్మరూపుగా.
అందుకొనే అందానికి – అందల మేమున్నదీ
అందరాని అందానికి – అమరమే హద్దన్నదీ.

స్వర్గనరకసోపానం – శోభల అమృత పానం
పాలకడలి చిలికినా – పావనతల ప్రాకారం
పుణ్యమైన పురాణంలొ – పూజ్యమైన పడతికీ
గణ్యమైన ప్రబంధంలొ – ధన్యత కల్గించిరిగా.

కామం తీర్చగల్గు – కారుణ్యం కలవారు
కోపం కోరువారు – కోమలతకు నిలయులు

నాగరకం భోగమాయె – సంస్కృతేమో సగమాయె
వేగంలో వెగటు కలిగె – సగటు సుఖం భయమాయె.

అలంకారమే అంగాంగ విన్యాసం – వక్రవాక్కులే సక్రమమాయెను
కవ్వింత వింతలే వంతలాయెను – కలహయుగం కలియుగమై కాంతి వీడెను
అమలిన ప్రేమలకూ అంతము లాయెను –
అంతరముల అనురాగం – ఆకాశమునంటెను.

29

ఆకాశం నందనవనిలో – అందమె నీ ఆరోగ్యం
శాద్వలమౌ వన్యభూమిలో – ధన్యం నీ జీవన భాగ్యం
విరిసిన ఆ పుష్పపరాగం – పైకెగసిన పంచమరాగం
తీరాయెను త్రిశంకు స్వర్గం – మధు విభునికి మధ్యమరాగం.

రంగుల కళలలో రంగరించె రమణీయం
హంగుల కేళిలో హవణించెను రాజీవం
హృదయపు పుష్పంలో తుమ్మెదగా విహరించనా
మన్మనస్సుమన్మథమై సన్మనమై సవరించనా.

పరాగమే సరాగమై పావనతను వరించదా
అనురాగమె సుమరాగము అధరములకు అలదనా
అకాలమౌ వసంతాన్ని అనంతముగ అనుకొననా
మారిపోవు కాలానికి మరచెడి మనసుండెనా.

పరాగముల సంపర్కము ప్రపంచమున పరరాగమె
కలయికలో లయమైన కలనిజమౌ కాలమదియె
యౌవ్వనంపు వనములోన ఎదల గుబులు బులుపెగా
నవ్యకామసూత్రములో కాకి స్వరమె కోకిలగా.

కప్పురాలు కస్తూరులు – గుప్పుమనెడు గుబాళింపు
వాసనలేమరచిపోవు – నవనరులకు నిగారింపు.
కులుకుల తళుకులలోనా – కలకలముల మెలకువలు
భౌతిక విన్యాసములో – భాగ్యమునకు వెదకుటలు.

జగమంత జఘనములో – జాణతనం వీణెమీటె
పుట్టుట గిట్టుట మధ్య – పట్టుబడియె యౌవ్వనమ్ము.
భవమే అనుభవ భాగ్యం – బంధనములె ఇంధనములు
అమృతమే అనుభూతికి – అందనిదీ చెందనిదీ.

కైలాసం కులాసాలు – వైకుంఠపు వైభవాలు
కలికాలపు కామనలు – కలికి హృదయ కాపురాలు.
కోరికలే కోమలములు – తీరెడి తీరులు వేరులు
సిద్ధాంతమె రాద్ధాంతము – ఆచరణము అయోమయం.

వసివారెడు భంగిమలో – వలపువాసనలు కలవు
వాసనయే సుకృతమై – వాసి గనును వనితలో.
హృద్యమైన హ్రదముగా – హృదయమున్నదనుకొన్న
అనవద్యము ఆహ్లాదము – అనవరతము అందము.

ఋతువుమారి హితమువీడి – అనృతమై అమృతము
పాలిపోయి రాలిపోయి – పరమార్థము పరార్థమౌ
చవులు లేని చందమై – రాలిన అరవిందమై
రహిజనమకరందమే – మహిమవీడు హిమముగా.

30

సిండికేట్ల రాజ్యం – బండికూట్ల భోజ్యం
పెత్తందారుల వైనం – దోపిడికే దోహదం
మద్యం వ్యాపారులదీ – హృద్యమైన సంగమం
కేట్లు డూప్లికేటులదీ – కేతన స్వారాజ్యం.

సిమ్మెంటు వారిదీ – గమ్మత్తగు చోద్యం
మందుల వ్యాపారులదీ – అందమైన చందం
స్టాకుమార్కెటులదీ – షోకైన బంధం
మోసపు షేర్ బ్రోకర్లది – మోజైన సంబంధం.

కార్పొరేట్ కాలేజీల – మార్పులేని మార్గం
అందమైన సిండికేట్లు – అందరికీ మొండిచెయ్యి

మోసానికి మొదటిమార్కు - మోదమైన సిండికేట్
ప్రచారాల పర్వంలో - పరములదాగర్వం.

కాంట్రాక్టుల సిండికేట్ - టెండరులకు గాలం
నిర్మాణపు సిండికేట్లు - నిధులన్నీ మటుమాయం
మిల్లర్ల సిండికేట్లు - అల్లర్లలో రైతన్నలు
అవసరమౌ వస్తువులకు - అన్నిచోట్ల సిండికేట్లు.

పన్నులు ఎగవేతలో - పరములైన సిండికేట్లు
చట్టాలను నెట్టివేసి - సాగుటలో సంపన్నులు.
విశ్వసంత సిండికేట్లు - నశ్వరమౌ బడుగులు
ఆయుధాల సిండికేట్లు - యుద్ధములకు సిద్ధమౌట.

రియలెస్టేటు సిండికేట్లు - రియాలిటీ దూరమాయె
లాయర్లకు సిండికేట్లు - లాబీలకు లక్షణమ్ము
రాజ్యాంగేతర శక్తులు - శక్తిహీన జన స్వామ్యము
వినియోగము అయోగము - విజయమ్మగు సిండికేటు.

అభివృద్ధికి సిండికేట్లు - అవసరమే అవనిలోన
స్వార్ధపరుల స్వారాజ్యం - స్వాహాలకు సులభకరం
సంపన్నుల పన్నుగడలు - సంక్షామపు తీరులు
పన్నుకట్టు అభాగ్యులకు - పంగనామాల్ తథ్యము.

వినియోగుల సిండికేట్లు - విలువలకే పట్టము
సామాన్యుల సిండికేట్లు - సరసతకే తలుపులు
నిర్లిప్తత నిస్తేజం - నీరవమైనింగికెగసె
ప్రశ్నించుట పావనమ్ము - పాలనకది పరువము.

రాజకీయ వాదులలో - రచ్చబండ నిబద్ధత
సిండికేట్ల రాజ్యానికి - చిచ్చగుటే సిద్ధమంట
చైతన్యం రగిలించుము - విప్లవాలు విరియింపుము
మార్పు తథ్యమగునంట - తీర్పరులే మీరరంట.

విజయవాడ నలందకూ – విజయం విభవం
గురుకుల కాలేజీకీ – గరువం పరువం
ఆచార్యనాగార్జున – అమర సందేశం
నలందయే నవ్యమై – అందించె సంకేతం.

బుద్ధ దేవు సిద్ధాంతము – బద్ధమైన భరతావని
కృష్ణానదీ తటమునందు – కీర్తిగాంచె నీవని
వేద్యుడైన కుమారుడే – 'విజయ కుమారుడు'
విలువల వలువలతో – విజయుడైన ధీరుడు.

ఇంటరు విద్యలోని – తంటలన్ని గ్రహియించి
ఇంపుగూర్చు బోధనలో మేధావుల మెప్పునందె
నాల్గుచోట్ల నాణ్యమైన – నవ విద్యాలయములు
నలుగడలకు విస్తరించి – గణ్యమైన నవనిధులు.

ఆంధ్రదేశం నడిబొడ్డు – అతిశయించె నలందా
ఐదు ముఖ్యనగరాలలో – అనుగమించె నలందా
ఇంజనీరింగు విద్యలో – ఇంతింతై వటుడింతై
మెడిసిన్‌లో మెలకువలూ – మేలుగాంచె నలందా.

ఇంటర్‌లో ర్యాంకులూ – ఎంసెట్‌లో ర్యాంకులూ
ఐఐటి ప్రవేశాలు – అధికమె మన నలందకూ
చక్కటి వాతావరణం – అనుభవమౌ గురువులు
గుణశీలము గురుతింపగ – విద్యార్థికి విలువనిచ్చు.

హాస్టలులో ఆహారం – పుష్టికరం రుచికరం
విద్యార్థికి వ్యక్తిత్వం – విలువలకే మణిహారం
విద్యా వ్యాపారమే – వెల్లువైన లోకంలో
హృద్యమైన చదువుతో – కొనసాగును నలందా.

తరగతి బోధనలో – చదువు కొనెడి గంటలలో
మనసు కష్టపెట్టకుండ – విద్యగరపు నలందా
అందమైన నలందా – చందనమె నలందా
సరసమైన నలందా – సారమె మన నలందా.

ఎన్ని సంస్థలున్నా – ఎరుకయె నలందా
ఎన్నిమాటలన్నా – ఎదలలో నలందా
విలువల సాగరము – విజయ నలందా
విజయపు వైభవము – విలువ నలందా.

నిర్వాహక నైపుణ్యము – నిత్యసత్య నలందా
పరార్థంలో పరమార్థము – పరువు నలందా
నలందకు వందనం – నలందయే నందనం
విద్యాకామధేనువు – చైతన్యపు భానువు.

32

చందమామ అందానికి చందనంతో అభిషేకం
అందమైన చెలిమోముకు అక్షరాల అమృతం
రాతిరి ఆ ఆకాశం పూత పూసింది
జాతరలో జాణమనసు జావళయ్యింది.

చల్లదనం సందడించి సంఘర్షణ పడగా
కన్నెలేడి వేడిస్పర్శ సందర్శన నిడగా
తారల పూవులే తడిసినయా సొగసులు
విరిసిన యా కిరణములే విరజాజులనవ్వులు.

చీకటి కలయికలో చింతలేమి లేవుగా
కోర్కెల కొలతలలో కోమలతలు నిండెగా
అందనియా చందమామ అందానికి పోలికా
గుండ్రనైన భూమికపై తీండ్రించిన మాలికా.

విరిసరాలు వరియించిన విమలత తనులతగా
ఘుమఘుమాల గుసగుసలే కొసరెడి మనజతగా
ఆలకించు ఆ పలుకుల పులకలు మదికలచగా
ఆలోకన కిరణములే అంతరంగ తరగలుగా.

ప్రాయంపదనిసలలా పరువేసరిగమగా
పావననవయౌవనమే సంగీతపు గీతగా

కదలికయే కదనుత్రొక్కి పలుకుపదం పాడగా
అదలించెడి అధరములే అమృతమై ఆడగా.

మధనపడిన మన్మథుడే మనసు కలవరింతగా
మనసుమనసులో లేక మౌనమె నీరూపముగా
ప్రకృతి పరమాకృతిగా సుకృతమౌనీరూపం
ఆకృతి అందముగా వందితమయె నీ తేజం.

అందమైన కళ్ళలో అమరిన ఆ ఆనందం
పదిలపడిన మనసులో పావనమౌచందం
నీలమైన ఆకాశం నింగిలోని నందనం
పసిమి మిసిమి భూమిపై పరచిన నీ పసదనం.

లెక్కలేని తారకలే లేవళ్ళుగ మారగా
లెక్కకు మిక్కిలి చూపులె లేళ్ళాయెను చూడగా
అందము పొందుగా – అమరం నీ చందంగా
గుండెలు నిండుగా – గుంభనలే పండుగా
సాగిసాగి ఆగగా – సరసమాయెగా
ఆగిసాగ ఆశగా ఆశయమే పండెగా
చందమామ చేరాలని – అందరు అందురుగా
చేరువారు కొందరే – చైతన్యము నిండగా.

33

నడుమే ఆకాశం – నడకే నవనందనం
అందం అందలం – అతివకు అభివందనం
నింగిలోని మేఘానికి – నిలకడ ఉండదు
భంగిమలో భాగ్యాలే భావనలకు అందవు.

నడకల నవనాట్యంలో మెరుపు కాంతులున్నవి
కదలికలే కడతేర్చగ కారుమొలులు లైనవి
తడియారని తరుణ వయసు – తపనకలుగజేసెను
గడిదేరిన కన్నెమనసు – గారడీలు చేసెను.

మేఘం మెరుపుల మధ్యన – మేలిమి రూపమై
మెలకువతో నిలిచినది – వలచిన చిన్నది
తడిపొడుల సమతౌల్యం – జలధిని తాకగా
జాణతనం జయం పొందె – జాగులేని వానగా.

వానలోన జాణతడిసె – వాల్లభ్యము నిండగా
ఎదవేడిమి పదిలమై – మదిమమతే పండగా
వయసు మనసు వర్షములే – హర్షములై విరియగా
తియ్యనైన త్రికరణములు – తిరిపెమెత్తె ప్రేమగా.

కాలము కల్లగా – కాముని జల్లుగా
కాయము కల్పకమై – కలికి జగం నిండగా
పండిన ఆయవ్వనమే – వండిన మధువుగా
వదలని నారసనకే– రాసిక్యము నించగా.

సరస రసం స్వారస్యం – మరుసంగర భాస్వరం
సుస్వర భాస్వర శ్రుతులే – సుందర తర సంగీతం
తపనల తడియారదు – తరుణం వరణం కాదు
సెగల పొగల సేంద్రీయం – మనసుమమత రసాయనం.

తనువులు కలిసినా తపన తీరదు
మనసులు ముడివడగా మధురం జీవితం
దాంపత్యం దారిలో – పథ్యమైన కలయికలే
సృష్టికి సుందరమై – పుష్టివంత మాయెగా.

ఆకాశం అందుకొనీ – అనురాగం పండించీ
నవజీవన ఉషోదయానికి – జయగీతికలందిద్దాం
పండినమేఘం చినుకై రాలును – చినుకే భువికి చైతన్యం
పచ్చని భువిలో మెచ్చిన ఇల్లై – పరస్పరం పరమార్థులమౌదాం.

సందడి చేసిన సదనం వదనం – పసదనమైనది పండుగ రోజున
అరమరికలకే మరకలు పడగా – అంతరంగములు అంతఃపురములు
ఆకాశం అతివగా – భువియే భూపతిగా
సతీపతుల సౌందర్యం – విశ్వశక్తి అనుభవం.

34

అదిరే పెదవుల అందం చందం – ముదిరే ముద్దుల హద్దుల బంధం
తెల్లకాగితం తేటగు హృదయం – కళ్ళకు కలిగెను కమ్మని కిరణం.

అమెరిక అందం అమ్మడి లోకం – ఆఫ్రిక అడవే అతివల హృదయం
కలలో కళయై కాలము వలయై – ఇలలో చిక్కిన ఇంతియె మధురం.

దరహాసం రసరమ్య రంజితం – స్వరభాగ్యం భోగ్యం స్వానుభవం
చిరు చిరునగవుల చెలివగలే – సరసార్థ అర్థముల సాధించునులే.

పంజాబీ డ్రస్సులో పంకజాక్షీ – నీ బింకం పొంకం చాలించు మీనాక్షీ
చేపకళ్ళ చైతన్యం చేదు అనుభవం – లేడికళ్ళ లేజరులే లేపాక్షి దర్శనం.

మాటమధువు మధురమైన వాటమైన 'లేడిలే'
గాటపు గాయం చేసి గమ్మున కూర్చున్నావే
హ్రదంలోతు తెలియనీ హృదయం నీది
అంతరాళ ఆవృతమౌ ఆలోచనయే నీది.

ఖుషీల యువకులు రసించురాజ్యం
ఋషులై పురుషులు రుచించు భోజ్యం
యతులై మతులే యజించు యజ్ఞం
జతలై జాణలు జయించు ప్రణయం.

హైటెక్కు టెక్కులో అమరిన నీ అందం
హీటెక్కి ఆవిరై చేజారిన ఆవైనం
నియంతలై నియంత్రించి నీవేసిన మంత్రం
యంత్రమయి సర్వస్వం లోబరచిన తంత్రం.

లుక్కు అదిరి చిక్కుచెదరి పక్కలోన ప్రభవించె
పక్కుమనీ చక్కనయీ పరవశమయి పలకరించె
వెనకముందు వెతుకులాట వెలుగువల్లవీడిపోయె
ప్రత్యక్షము అక్షులతో అక్షరమౌ ఆమె చూపు
పాలకడలి ప్రభవించిన అమృతలక్ష్మివా
పావనతలు సృజియించిన అపరకామాక్షివా

పురాణ పురుషుల పూజ్యమైన పడతివా
పతివ్రతల వ్రతివతివై పాలించిన వనితవా.

35

పావనలోకంలో – పాపభాగులెందరో
మానవజీవులలో – మలిన మూర్తులెందరో
ఆరోగ్యమె నందనం – అంగాంగము సౌందర్యం
అలవాట్లకు వందనం – అమరామృత అతిశయం.

మందులున్న రోగాలు – వందల వేలున్నవి
చెడిపోయిన భాగాలకు – తొలగింపులున్నవి
బ్రహ్మచర్య భాగ్యానికి – బ్రహ్మరథం పట్టుదురు
దాంపత్యపు బతుకునకు – దారి తెన్నుకలదందురు.

పరిశోధన కందనివి – చిత్రరోగములు కలవు
పరిశుభ్రత పాటించగ – పారిపోవు జబ్బులవి
స్త్రీపురుషుల సంభోగము – సంతానము కొరకే
విచ్చలవిడి కామవాంఛ – వికటించును రోగముగా.

భార్యతోడి కూడియుంట – భాగ్యమయం యోగ్యము
వేశ్యలతో వైభోగము – వేదనలకు నిలయము
శారీరక మానసికము – శాంతిలేని బాధకరము
ఎయిడ్సురోగ మెదగుబులు – మరణానికి సన్నిహితము.

రక్తంలో హెచ్ఐవి – శక్తిని మింగేసేది
అంగాంగం వ్యాపించగ – అంతరించు మానవుడు
అనుభవించు ప్రకృతిలో – అందమున్నమాటనిజం
శారీరపు సౌఖ్యంలో – చేదు నిజం కలదుగా.

వ్యాధికి మఱి నయం లేదు – నివారణే మార్గమంట
మందులేని మహమ్మారి – అందరినీ మట్టుపెట్టు
తలిదండ్రులు పిల్లలకూ – సంక్రమించు యీ వ్యాధి
రోగితో సంభోగించినవారికి – సంభవించు నారోగము.

కాలవ్యవధిలేకుండా – కామాంగము కలియగా
కలవరమె కలియుగమున – కనిపించును ఎయిడ్సు
తెలియని స్త్రీలను కలియుట – తెంపరితనమె యగును
విచ్చలవిడి సంభోగము – పెచ్చరిల్లు ఎయిడ్సుగా.

అంటువ్యాధి కానెకాదు – అనవసరపు భయం వలదు
వ్యాధికలుగువారలను – వెలివేయగ వలదు వలదు
వేశ్యవీధికెళ్ళవద్దు – హైవేలను రమించొద్దు
కండోములు వాడగాను – ఖండింతము ఎయిడ్సు.

భయం బాధ లేనినాడు – భాగ్యమయం జీవితము
వెతలు వేగమయం కాని – బతుకుల సుఖజీవనం
ఎయిడ్సులేని సమాజం – అందరికీ అవసరం
అందుకే అందరం – జాగ్రత్తలు పడదాం.

36

పుచ్చలపల్లీ – మా పూజలందుకోవయ్య
సుందరయ్యా – మాకు చైతన్యం పంచవయా.
ఊేడువు – కామ్రేడువు – కార్మికులకు విభుడవు
మాతృదేశ రక్షకుడవు – మానవతకు మహారాజువు.

కులములున్న దేశములో – మతములున్న రాజ్యములో
కులమతములు మార్చగా – పేరుమార్చుకొంటివిగ.
మార్క్సిష్టు మార్గమున – వర్గచైతన్యమున
శ్రమశక్తికి విలువనిచ్చి– శాంతి సాధించితివి.
ఆశయాలు ఆశలూ – అమరసందేశముగ
అందించుము అందరికీ – అమృతుడవు నీవుగ.
దాంపత్య ధర్మము – బిడ్డల పొందుట కొరకుగ
స్వార్థమ్మును సాధించగ – ఆపరేషన్ చేయించితివి
కమ్యూనిజమందున – కలకాలం కట్టుబడగ
ఆస్తిని విడనాడితివి – ఆశయంతొ నిలచితివి.
రాజకీయరంగము – నీతిదప్పి యుండగా

స్వచ్ఛతకే విలువనిచ్చి - భరత భవిత కాపాడితివి.
వనరులున్న దేశంలో - కరువు తాండవిస్తున్నది
సరిగా వినియోగమున - ఆకలి దప్పులు తీరును.
నమ్మిన సిద్ధాంతానికి - కట్టుబడిన కామందువు
మరణమైన మరేదైన - వెనుదిరుగని ధీరుడవు.
రజాకార్ల రాజ్యంలో - రక్షణ కోరితివీవు
నైజాముని నడకలను - ఎదురొడ్డి పోరాడితి.
పోరాటమె నీ ఆరాటం - భూమిహక్కుకై పోరాటం
కార్మిక కర్షక కారుణ్యం - అరుణోదయపు శ్రీకారం.
విశ్రమించని శ్రామికుడ - విలువల విజయపు కాముకుడ
స్వార్థం అంటని సారధిగ - భవిత వారధిని బాగుచేసితి.
ఎర్రబావుట ఎదనిండింది - విప్లవ విలువ మదినిండింది
అరుణకాంతులు అంబరమంటీ - సంబరమైనది సామరస్యము.
పేదల పెద్దల పెనుగులాటలో - పేదల పక్షం నీదేగా
పరిశ్రమలలో శ్రామిక పక్షం - పరమార్థంలో ప్రజాపక్షమే
దున్నేవానిది భూమియనీ - ధరణికి చాటిన వరణీయుడవు.
శ్రామిక కార్మిక చైతన్యమే - అభ్యుదయమునకు ఆదియంటివి
సమసమాజమే సాగవలెనని - అణువణువున నీవాకాంక్షించితి.
కూడుగుడ్డగూడు కోసం - కూరిమి తత్త్వం సాగవలెనని
ప్రణాళికలతో ప్రగతికి మార్గం - సుగమం చేసిన సుందరుడు
అందనిచోటుకు వెళ్ళిపోయినా - ఆయన స్ఫూర్తితొ ముందుకు పోదాం.

37

అంతరించిపోతున్నది - అడవి సంపద
రక్షించక పోతివంటె - బతుకు ఆపద
కోట్లజీవరాసులలో - కోతివి నీవు
ఔపయోగ జీవులలో - అంతమె నీవు.

నీ బతుకే స్వార్థం - నియమాలకు విరుద్ధం
ఆలోచన కలదు కనుక - అన్నింటికి అందలం

జీవులు బలవంతమై – బలహీనుల తిందురు
సృష్టిలోని సిద్ధాంతము – సుజనులకిది వేదాంతము.

అంతరములు జీవులలో – అవతరించి పెరిగినా
అంతరంగమున్నదిగా – అందరిలో అధికుడవే.
అరణ్యమే జన్మభూమి – ఆ రక్షణ కావలెరా
జన్మభూ వినాశనమ్ము – జయము నీకు కాదురా.

అడవి జీవులన్నింటిని – శవాలుగా మార్చబోకు
పచ్చదనపు సౌభాగ్యము – మంటలలో కలుపబోకు
అడవి రక్ష నీకు రక్ష – తడయక మేల్కొనుమురా
జంతురక్ష జాతిరక్ష – జాగులేక సేయుమురా.

కాలుష్యం కోరలలో – కలియుగమే నశియించును
పరిరక్షణ సేయుమురా – ఫలితము నీకగునురా
పట్నాలే పెరిగిపోయి – పల్లె పల్లమాయెనురా
క్రిక్కిరిసిన నగరాలే – క్రిందు సేయు జీవితమును.

సాగరాల సరసతలను – సంరక్షించుము నీవు
నదీనదము నవ్యతలను – నాణ్యముగ చేయుమీవు
వాడిపోవు చెట్టులన్ని – వదనమునకు అద్దములే
జంతు సంతు వేటలన్నీ – జన జీవన చెరసాలలె.

ఎన్నో ఔషధ వృక్షములు – ఎటుపోతున్నవో తెలియదు
అందమైన ఆ సుందరవనములు – ఎందుబోయెనో కనరాదు
కనులు తెరుచుకో – కలతను గుర్తించు
జీవారణ్యపు రక్షణను – రణముగ కొనసాగించు.

జీవ వైవిధ్యము – జీవౌషధము
జీవావరణము – రక్షాకవచము
దేవుని సృజనయె యీ ప్రకృతి – దీవెన నిచ్చి సంరక్షించు
నిను రక్షించును నిత్యమది – జనుల రక్షకది జాగృతము.

కలుష జీవననం – కలియుగ బంధం
వనజీవన సంరక్షణం – వాసిగాంచును జీవారోగ్యం

అహింసయే ఆయుధంగ – అరణ్యాన్ని కాపాడు
హింసలేని జీవితాన్ని – హితముగ భావించు.

38

రామకృష్ణ పరమహంస – వేదాంతపు రాజహంస
పరమార్థపు వరహంస – పావననవ జీవహంస
మతం మానవత్వమనెను – దైవత్వము దారియనెను
ఆచరణం ముఖ్యమనెను – ఆదర్శము సత్యమనెను.

నిత్యసత్యవివేకమే – నింగి సదృశమ్మనెను
భగవానుని భావనయే – భాగ్యమిచ్చునని నమ్మెను
సేవల సేతువు కట్టెను – బోధామృత సారమిడెను
పరమాత్మను తెలిసికొనెను – వరుడై దినకరుడాయెను.

భారతీయ సంస్కృతినే – సంస్మరించి ఆచరించె
మత సారం హితమనే – మాన్యతకే ఆద్యుడాయె
సంసారపు సాగరమున – ఈదులాట ముఖ్యమనెను
వాదులాట వాసిలేదు – కర్తవ్యము కీర్తికరము.

వేదములును వాదములును – వెలుగు కలుగ జేసెడివే
వేద్యులైన వేదవిదులు – వెలుగుబాట నడచెదరు
బ్రహ్మచర్యభాగ్యమనెను – శ్రమ జీవన శక్తియనెను
శీలవర్తనమ్ములోనె – శివంకరము కలదనెను.

బాధలకూ వేదనలకు – మూలమె భవస్వార్థమనెను
లోకబాధలను మాన్పగ – లోభత్వము వీడుమనెను
భావనలో వైశాల్యము – ఆచరణలో ఆదర్శము
ఆలోకము ఆలోచన – అందరికీ ముఖ్యమనెను.

కలకత్తా కేంద్రముగా – కలియుగ సంస్కరణకై
కైవల్యము సాధించగ – కాలవిలువగమనించెను
సామాన్యము జీవనమ్ము – కాషాయం కమ్మదనం
జనసేవయె భయంకరం – జాతిజనత జాగృతమ్ము.

నరేంద్రుని నవ్యముగా – వివేకానందుజేసె
గురుశిష్యుల గుంభనమ్ము – విశ్వమునకు పరమార్థము
జ్ఞానమె గణ్యమ్మనెను – విజ్ఞానం విజయమనెను
సుజ్ఞానం శుభకరమనె – ఆత్మజ్ఞాన మమరమ్మనె.

పాపపుణ్యఫలములతో – పనిలేనిది పరమార్థము
వరసేవన వసుధలోన – వసియించును చిరకాలము
యోగధ్యాన మార్గములను – ఆచరించి అమరులై
అందరికీ వందితులుగ – అమృతమును అందించిరి.

నాగరకం ముదిరిపోయి – నడిసంద్రం నావలాగ
మునిగిపోవు జనలోకం – ముక్తినిధియె పరమహంస
ప్రళయమ్ములు సంభవించ – సేవాధర్మముతోడుత
పరుగెత్తెడి తత్త్వమంత – రామకృష్ణ స్ఫూర్తి యేగ.

39

హితమతి ఇందిరకు – ఇంపైన పుత్రుడు
జవహరు బాబుకు – జాణయౌ మనుమడు
సోనియమ్మ విభుడు – శోభకు వల్లభుడు
భారతమ్మ భవుడు – భవితకు సారథుడు.

పదునైన చదువున – పథము నెన్నుకొనెను
విమానమును నడపెను – విజయపాలకుండాయెను
తాత తెలివితేటలు – అమ్మగాంధి ధైర్యము
ఆచరణే పరిశుద్ధము – అమృతమే అతనివాక్కు.

రాజీవుని రాజ్యంలో – రాగం ఉదయించెను
రామరాజ్యభావనలో – రహిజనులేగడిపిరి
మతఛాందసవాదులతో – ఇందిర మరణించెను
ఉగ్రవాద వ్యగ్రులతో – రాజీవుడు రహి విడిచెను.

పరువమై పాలనలో – పరమార్థం సాధించెను
స్వార్థరహిత మార్గములో – సాగి సరసుడాయెను

సమాచారవ్యవస్థలో – పెనుమార్పులు తెచ్చెను
సాంకేతిక రంగములో – వంకలన్ని దిద్దెను.

విగతజీవి రాజీవుడు – విలువలకే సమాధి
మానవ స్త్రీ బాంబుతోడ – మాధవునికి చేరువాయె
విగ్రహమే సౌందర్యం – నిగ్రహమే నియమము
ప్రగ్రహమే పలుచన – సంగ్రహమే సాధన.

భారతికే బలిదానం – ఇందిర కుటుంబం
దళితులకే అంకితం – రాజకీయ జీవితం
మానవతా మంచితనం – మనసునిండు జీవుడు
సమసమాజ కాంక్షితుడై – సాగెను మన రాజీవుడు.

పొరుగు దేశ సంబంధము – విరిగిపోని విధమున
దేశములతో సంఘటనము – దోహదముగ జరిపెను
రాజీవుని ఆశయాలు – మనసులోన రాజిల్లగ
ఆదర్శము అతడుగా – అందరము సాగుదాం.

కులం మతం కుళ్ళునంత – మళ్ళించగ మార్గదర్శి
దేశభక్తి మించు విధము – దేవునిగా పాలించెను
అమరంలో రాజీవుని – ఆశయాల సాధనలో
కలిసి మెలిసి కృషిచేద్దాం – కలవరాల నరికడదాం.

దేశభద్రతకు ముప్పు – దేవళముల కెంతొ ముప్పు
మతమౌఢ్యపు సిద్ధాంతము – మనుగడకే ముప్పాయెను
రాజీవుడు మనకు స్ఫూర్తి – విగ్రహాలె దివ్యదీప్తి
భారతికే భాగ్యమూర్తి – భావిపౌర భవ్యశక్తి.

40

ఇంధనమే ధనముగా – బంధనములు పెరిగెను
ధనబంధము దారిగా – మనసు మహిమ వీడెను
జనబంధము జటిలమై – ధనబంధము కుటిలమై
కూలుచున్న మానవతకు – కుంపటి వ్యాపారమాయె.

సంస్కృతి వ్యాపారమై – సంగతులే మరచెను
విస్తృతమై విలువలే – విగతజీవులైపోయెను
కాలం వేసిన గాలం – కలియుగ విలయమ్మాయె
గాయపడిన నవగాత్రం – పాత్రతనే కోలుపోయె.

మోసం మోదం కూర్చగ – ధనవ్యామోహం పెరిగెను
దోషం దోహద పడగా – దోచుకొనుట దోర్బలమ్ము
మరణంలో మానవులకు – వరణీయము మనుషులే
బతికి బట్టకట్టినపుడు – బంధువులే రాబందులు.

పదవిని సాధించుటే – పరమార్థసాధనము
పదిలపడిన పదవిలో– పదనిసలే నిషాలు
అసత్యమే సహితమని – అనుమానం మహితమని
అవహేళన అమరమనీ – మరనరులే తలంతురు.

రహస్యమే రాజ్యమనీ – రాక్షసతయె రమ్యమనీ
అహం అహరహమ్మనీ – అమర నరుల అభిభాషణ
మృత్యువు తప్పదనీ – మృత్తిక నిత్యమనీ
మూలము శూన్యమనీ – ధన్యుల ఆలోచనము.

తనసృష్టికి ఫలమంటూ – దైవసృష్టి దైన్యమంటు
హైన్యధనం మాన్యమనీ – అధమ నరుల అవలోకన
సంబంధము తెగిపోగా – సంరక్షణ అసలె లేక
సంఘర్షణ జీవనమై – ఏకాకులు నరులుందురు.

అనురాగం పరాగమై – గాలికెగిరి గంతులేయ
పరరాగం పావనమై – ఫలముగాంత్రు వరనరులు
అర్థంతో అర్ధాంగిని – అంగడిలో బొమ్మలాగ
అమ్మికొనుట పరిణయమని – పరమార్థము పలికెదరు.

కులం మతం మలంరీతి – కలబోసిన కలుగు భీతి
ధనముండిన ఏముండదు – ధనదారిద్ర్యము నరులకు
అమ్మలనమ్ముట కొనుటకు – అధమ మాంస వ్యాపారము
బాలల మరి మైనరులను – భాగ్యమునకు క్రయించుట.

చితికిన మానవ మనసుకు – మతి వీడిన చికిత్సలతో
మందత్వము అంధత్వము – మనవారికి నిత్యకర్మ
పగిలిన ఆ మనసుకు – పగిలిన నరగుండెకు
ధనేంధనము అతుకునా – దారి నిజం మానవతే.

41

గీతా వాక్యం – గిరిధరు వేదం
సూర్యుని కిరణం – శుభ సందేశం
పద్దెనిమిదిలో పద్ధతి ఉన్నది – పరమార్థానికి బాటయే అది
ఒకటీ ఎనిమిది కలిపిన తొమ్మిది – నవగ్రహముల నవ్యత యున్నది.

ధర్మం కర్మం దారి జూపునది – జ్ఞానం జ్ఞేయం జ్ఞప్తిలొయున్నది
జగతికి అర్థం పుట్టుట గిట్టుట – ఆత్మజ్ఞానం అమృతతుల్యం
భయవిషాదముల బాధల సన్నిధి – నిష్కామముగా కర్మల పెన్నిధి
భవబంధములకు భంగమన్నది – అహం బ్రహ్మమను అభయమున్నది.

యోగయాగముల యోజనమున్నది – సన్న్యాసమ్మున సంబరమున్నది
విశ్వరూపమున విజయమున్నది – వశ్యమైన వరవాక్కు ఉన్నది
కృష్ణార్జునులకు సంవాదముగా – తృష్ణల మార్గము తెలియజేసినది
కొరవులె కోర్కులు నరులకనీ – నారాయణుడే నయముగ తెలిపెను.

శోక దుఃఖములు శోధనలోనివి – శోభనందినవి వాక్యములోనగ
మమతాబంధము మారిపోయినది – పరతత్త్వముతో ఫలము కల్గినది
పంచమవేదం పరమార్థముగా – భగవద్గీతయె భవ హరణముగ
ముక్తికి మార్గము ముందుంచినది – భక్తి భావముల భాగ్యమైనది.

విశ్వము నేనే విభవము నేనే – విలువలు నేనే విభుడను నేనే
కర్తను నేనే భోక్తను నేనే – కలకాలపు పరమాత్మను నేనే
నిమిత్తమాత్రం నిత్యమ్మంటూ – నశ్వరమైనది నాణ్యమ్మంటూ
మిథ్యయైనదీ మీగడ యనుచూ – అజ్ఞానముతో అభిజనులుందురు.

వర్ణవర్గముల వరుల జీవులా – సృజనకు స్థితికీ సుందరతలకూ
నాశనప్రాశన దీనదశలకూ – దివ్యుడ నేనే భవ్యుడనేనే

నా ఆదేశం ఆదర్శం – నా సందేశం నవ నిగమం
నీనా భావన విడనాడీ – నిత్యుని దలచుము సత్యంగ.

ధర్మం కోసం పోరాటం – ధర్మక్షేత్రం ధరాతలం
కర్మలక్షేత్రం కురుక్షేత్రం – కలిసందేశం గీతా సారం
త్రిగుణాతీతం తినుబండారం – సగుణ నిర్గుణము సరసాకారం
జీవులతత్త్వము పథ్యములన్నీ – పదములు పథమును తీర్చెనుగా.

కోశములన్నీ కోమలమయములు – అరిషడ్వర్గము అడ్డువచ్చెడిది
పంచేంద్రియములు వంచన వరుసలు – మనసు ఆత్మలే మహిమాన్వితములు
కాలం మూలం కలరవములకు – కాయం కలతల తలమానికము
మాయామయమే మానవలోకం – మాతరమైనది మాధవతత్త్వం.

బొమ్మలాటయే కమ్మనిలోకం – ఆటాడించును ఆపరమాత్మ
వికారసహితం జీవుల విలువలు – వినశన ఆశలె విజయపు చిహ్నాలు
భారతీయతకు భాగ్యం యోగ్యం – హైందవసంస్కృతి అందలమ్మది
ఆచరణమునకు ఆదిదైవతము – సత్కర్మల వర సంగమంబది.

42

ఉగ్రవాదమగ్రమై – వ్యగ్రమాయె విశ్వము
తీవ్రవాద తీక్షణతకు – తీరుమారె ప్రపంచము
మతరాజ్యం మత్తుమందు – రాచరికం రాచపుండు
జనపాలన ఘనపాలన – జయమునకే సోపానము.

బలవంతులు బలహీనులు – ధనవంతులు ధనహీనులు
యజమానీ శ్రామికుడూ – ఎల్లప్పుడు ప్రత్యర్థులు
కాలంతో మార్పుచెంది – కలకలమేర్పడియెను
యుగయుగాల చరిత్రలో – ఉద్యమాలు కోకొల్లలు.

సంఘజీవనములోనన – సరసుడైన మానవుడు
సంరక్షణ కోసమనీ – సంఘర్షణ పడుచుండెను
గుణకర్మల విభాగమున – కులవర్ణము లేర్పడెను
సుఖజీవన విలాసమున – ఘర్షణలే గణ్యమాయె.

సేవించుట సేవగొనుట – నిమ్నోన్నత నీతులాయె
బానిసత్త్వభావములకు – బాటలాయె లోకంలో
నిరంతరం పోరాటం – అంతరముల అంతమునకె
తరంతరం ఆరాటం – తన మనముల త్రుంచుటకే.

సాంకేతిక ప్రగతిలోన – సాంద్రమాయె విభేదములు
ఆయుధముల రక్షణలో – అధికులు అందలమెక్కిరి
మానవతే మంటగలిసి – దానవతలు ద్రఢిమ మీరె
విప్లవాలు ఉద్యమాలు – విలువల రాదారులాయె.

ధనవంతుల దౌర్జన్యం – దారిదప్పిపోతుండెను
సొమ్మొకడిది సోకొకడిది – రాజ్యం చేస్తుండెను
జంబూద్వీపంలోనా – జాతులెన్నొ మతములెన్నొ
జమానాల భూస్వాముల – జమీందార్ల చేతలెన్నొ.

అన్నిటికీ అంతరింపు – నక్సల్ బరి విప్లవమ్మొ
శ్రీకాకుళ అడవుల్లో – శ్రీకరమై విలసిల్లెను
అక్కడ అంతర్ధానము నంది – ఆంధ్రదేశమావరించె
ప్రజాయుద్ధ సంఘటనగ – ప్రారంభం పీపుల్స్ వార్ గ్రూప్.

కాలగమనయానంలో – కకావికల మార్గంలో
చీలికలై పేలికలై – చైతన్యం కోలుపోయె
భారతంలో కాశ్మీరం – భగ్గుమనే పర్వతం
మతఛాందస ఉగ్రవాద – మారణహోమం రణం.

సరిహద్దులు చెరిపివేయ – సాగుచుండె ఉల్ఫాలు
నాగాలాండ్ త్రిపురలలో – సాయుధమౌ పోరాటం
బాంగ్లా పాకిస్తానుల – బార్డరులో పోరులాయె
ఉగ్రవాద నిరసనమే – ఉన్నతులకు ఆదర్శం.

43

భాగవతం భాగవతం – భక్తి మహాసముద్రం

భాగవతుల చరితములే - భవబంధపు మోక్షణములు
సంస్కృతమున వ్యాసుడు - సకల గుణోపేతుడు
సత్యము భగవానుడు - నిత్యనియమ శీలుడు.

పరమాత్ముడు కలడనుటయె - పరమమైన నమ్మకము
అతని సన్నిధానమే - అందరికీ అభిలాషము
ఆది అంతములు తెలియని - ఆదిమ వానరుడే నరుడు
ఆధ్యాత్మిక ప్రపంచమున - అణుమాత్ర అతిశయుడు.

ఆంధ్రంలో భాగవతము - అందించెను పోతన
సాంద్రమైన తత్త్వమును - సవరించెను భాషలో
లోకజనుల లోలత్త్వము - లోలకమును పోలినది
స్థిరమైన చిత్తమునకు - చేతనయే భాగవతము.

పలికెడు వాడే పోతన - పలికించును రాముడు
అందరను మెప్పించగ - అమృతమును పంచెను
భక్తిభావయుతులుగా - భాగవతులు నిలచిరి
నవవిధాల కొలువగా - నందనుడే వందనుడు.

బ్రహ్మాండ భాండము - భావమందు మెదలగా
సృష్టి స్థితి లయములతో - సుందరుడే పరమాత్మ
గోపికాలోలునకూ - గోవర్ధనగిరిధారికి
మధుర మనసులర్పించుట - మానవులకు మాధవతే.

దుష్టశిక్ష శిష్టరక్ష - దుర్ణయముల నిరసనము
ధర్మసంస్థాపనకై - మర్మకర్మలెన్నొచేసె
కాళీయమర్ధనము - పూతన సంహరణము
పరమాత్ముని పరతత్త్వము - ఫలియించును కథలలో.

వెన్నదొంగిలింతలు - వ్రేతల వస్త్రాపహరణ
గొల్లెతలతొ సరసాలు - గోపాలుని విచేష్టలు
కృష్ణతత్త్వ ప్రతిపాద్యము - శృంగారము ఆపాతము
మధురభక్తి మాన్యము - మరోలోక సంపాద్యము.

రుక్మిణీ కళ్యాణము – రుగ్మతలకు దూరము
ప్రహ్లాద చరిత్రము – పరలోక హరుతత్త్వము
సుదామునకు కుబ్జకు – సుందర శుభదాయకము
బాల్యసఖుడు కుచేలునకు – భాగ్యమొసగు భావము.

అవతారతత్త్వము – అతిలోక రమ్యము
బలిరాక్షస సంహారము – వామనావతారము
భోగయోగ రాగములకు – భక్తి శక్తిముక్తులకు
భాగవతము శరణ్యము – భవరోగుల కరణ్యము.

44

హిమగిరి శిఖరం పై – హిందోళం పాగడా
ఆందోళించిన మనసున – అమృతమే నిండెగా
చెలి కౌగిలిలో చలి చెరసాల కెళ్ళెగా
వరసల ముద్దులలోనా రసాలమేతియ్యగా.

సరసం రసభరితం – సంగమం సరాగం
సమయం రసమయం – రసనల రసోదయం
కరిగితరుగుమంచులో – కాంచన గంగవునీవు
పారే సెలయేరులో – పంచదార అలవీవు.

వేడితనువు వేధించగ – చలిచెలిలే నీవు
చలిమలలో వెలసిన – సారసాంగినీవు
అంతులేని అనురాగం – అంతరమే నీవు
అంతరంగ రంగంలో – అమరతరువే నీవు.

తరుణరణం తరియించగ – తపను కిరణవీవు
తపనపనే ఫలియించగ – ఫలపరాగమీవు
చలిముద్దుముద్దగా – చెలిపదమున బడగా
వేడిముద్దు హద్దుగా – వేకువకువలాయెగా.

నవ్వు నందనమ్ముగా – నువ్వుపారిజాతమే
సుందరనందనవనిలో – సుందరిదరినేనుగా

కైలాసం కలశమై - నీ చేతుల కందెగా
సరోవరం మానసమై - సరసతలను పంచగా.

ఆకుకు అందనిదై - పోకకు చెందనిదై
సున్నితమగు సున్నమై - సరాగమును పంచెగా
పెనవేసిన ప్రేమలతలు - పేరు చెప్పలేదుగా
పరవశమై పరస్పరం - చేరి సేదదేరెగా.

ఎదసొదలో గుదిగ్రుచ్చిన - ఎఱుక మరకలెన్నొ
క్షణక్షణమే క్షయమౌతూ - సాగురాగమెందుకో
కోపం కోమలమైతే - కామం పేట్రేగదా
సహనం సంబరమైతే - అంబరమే అవధిగా.

కొండెక్కిన కోర్కెలతో - కొలువు బలిమి చేద్దాం
అండగ నీవుండగా - కొండే నాదరిరాదా
వాత్సాయన యామినివై - వధువు మధువు నీవుగా
కామాయని మాయవై - నయన సుధలు కురియవా.

ఆకారం అందం - అవతారం బంధం
అతనుని అనుబంధం - అమరం మన సంబంధం
అంబరమే భరించదు - అమర సంబరాన్ని
ఆ సంబరమే మనది - మనసుల తనువుల బంధం.

45

అలకాపురిలో కాపురం - అందమైన రస గోపురం
ఆనందానికి నందనం - అభినందించే అమృతం
కన్నెవయసు సన్నదనం - కలికి కులుకు కమ్మదనం
మధుర మనసు వధూవయం - మనకలయిక కలికి ధనం.

ముద్దుచూపు ములికితో - హద్దుచెరిపి నావుగా
వంపుసొంపు ఇంపుతో - ఇరుకున పడవేశావే
మాటల సయ్యాటలో - ఆటల ఉయ్యాలలో
పాటల పరువాలలో - పరవసింతు వయ్యారే.

నవరస రసికత – వరుసల సరసత
రుసరుస రుచికథ – కిలకిల కళకల
కాపురమే వరముగా – కామనలే తీరగా
కాలాంతము తరముగా – కల్పతరువు నీవుగా.

బొమ్మా నీవయ్యారం – బోసిపోవుతున్నదే
గుమ్మా నీగుయ్యారం – గూటికెళ్లుతున్నదే
మోడువారి బీడువారి – మోహమున్నదే
మోదం ఆమోదమైన – ముద్దులున్నవే.

వియోగమే యోగమైన – విలువ చిత్తమున్నదే
విలాసమే యాగమైన – వలువ పలుచనైనదే
చిలకా! నీ కులుకులకే – చింతపులుపు ముదిరెనే
కోయిల! నీ యీలపాట – గున్నమావి గురుతాయెనె.

అన్నంలేకున్నా – అన్నీ నీవేగా
శరీరమే శయించినా – శరణం నీవేగా
భావం భాషలకూ – భాగ్యం నీవేగా
భోగం యోగాలకు – రాగం నీవేగా.

అమరం మరణించినా – ఆకాశం కృశించినా
భూభవనం వనమైనా – నవరాణివి నీవేలే
శబ్దార్థము చెదిరినా – అర్థార్థము ముదిరినా
అలకారం లయించినా – ఆకారము నీదేలే.

కవితకు కలితవు నీవు – కవనానికి వనరాణివి
రసరాజ్యపు సరోజినివి – ఆలోచన కమృత కలశవు
ఆవేశించిన వేషానివి – రవిగానని రసరూపానివి
రాగోదయ రాజ్యానివి – రమారమణి మణిదీపానివి.

నీ కుంకుమ నిత్యం నేనై – నీ గాజుల సవ్వడినేనై
నీ అందెల బంధం నేనై – నిరతం నీ రతి విభుడౌతా
మరువలేని మరోలోకమే – మరపురాని మరోవేదమే
మన జీవన మాధురి ఝరియై – ప్రసరించును ప్రసన్నమయమై.

46

విశ్వసంత వంతపాట – నశ్వరమౌ భరతమాత
విశ్వమానవత్త్వానికి – వ్యాపారపు వెలుగుబాట
డంకెల్ సూత్రాలకు – మంకీల తలూపులు
మార్కెట్ మతమునకు – మర్కటముల కవ్వింపులు.

గ్లోబలైజేషనుకూ – గోరుముద్ద గారడీలు
ప్రైవేటైజేషనుకూ – పబ్లిక్‌గా దోపిడీలు
దేశభక్తి పెరిగిందీ – 'దేహీ' యనెడి తత్త్వంలో
అధికారపు అంధత్వం – బానిసత్వదారిలో.

పెద్దవారు పేదవారు – పేరుమోయుచుందురూ
మధ్యవారు మగతలో – మిథ్యలోన వేలాడుట
మౌలికరంగములన్నీ – మౌనబాటలోనున్నవి
పరిశ్రమల ప్రగతిలో – బహుళజాతి బలమున్నది.

దేశరక్షదీక్షలోన – దేవతలే అందరూ
సైన్యంలో ఖాళీలే – హైన్యతకీ నిదర్శనం
చదువు భారతావనిలో – పదవి పెద్ద దేశాలలో
సేవయనిన సంఘంలో – సేదదేరిపోయెనుగా.

వ్యాపారంలో విద్య – వధ్యమాయె బాధ్యత
వ్యాపారపు అవసరాలు – విద్యకు మౌలిక మాయెను
సమాజమే దేవాలయం – ప్రజలంతా విగ్రహాలు
ప్రజాసామ్య పరమార్థం – పూజారుల చేతిలోనె.

రక్తార్పణ నాయకులూ – రాజ్యంలో కరువులేదు
ముక్తియె సంపాదనము – భక్తి శక్తి ప్రజలది
ప్రజల భాషలో పాలన – విద్యకు పరమార్థము
అవిద్యలో అవగాహన – అందరికీ అందము.

వ్యవసాయం వృత్తులన్ని – వెలవెలబోతుండగా
పరదేశపు ఉత్పత్తులు – పరువును కాజేసెగా

మనభావం భాషలు – వనమున కెళ్ళెను
నిధులు నిర్ణయాలలో – బధిరులమే మనం.

రాజ్యాంగం చట్టాలకు – రాసభములు కాపరులు
ప్రయోక్తలు ప్రవరులు – అవలక్షణ అధికారులు
సామాన్యుని మనుగడకు – చావు సమీపించెను
మధ్యమానవాళికీ – మరణఘడియ వచ్చెను.

సామాజిక అధ్యయనం – శాస్త్రాల శాస్త్రీయం
జోడుగుర్రముల వంటివి – జోరగుజన స్వామ్యంలో
అరచేతిలొ విశ్వమంటు – అరచెడు నవనరునికీ
విశ్వం తెలియని సర్వస్వం – అరచేయికి అయిదేళ్ళే.

47

మిసిసిపీ చిన్నది – మిసమిస లాడుతు ఉన్నది
కాశ్మీరం కన్నెది – కనకంలా మెరుస్తుంది
సింగారం బంగారం – సిరిమల్లె మరుకారం
మనసే నవమందారం – మనిషే ఒకమధుమాసం.

నిషాచూపు మసాలాలు – నషాలానికంటగా
హుషారైన వయారాలు – నయాగరా నిండుగా
సాగర సంగమమే – సరిగమ సంకేతముగా
సిరిమువ్వల సవ్వడులే – వలరాజును కలచెనుగా.

చిరుసవ్వడి వడిలో – చెరిసగమై చేరగా
అరవిరిసిన అందంలో – అరమరికలు సమసెగా
ఒళ్ళారబోసికొని – కళ్ళ కలువ లేసుకొని
చూపులు సుళ్ళేతిరిగి – శుభకామన తెలుపగా.

హద్దులు మీరిన అందం – పద్దురాసుకొంటుంటే
సుద్దులు చెప్పిన చూపులు – ఇద్దరికీ ముద్దులే
గోదారి దారిబడిన – రాదారి రంభలా
అంబరాన సంచరించు – అమరారుణ కిరణమా.

కలకరిగిన సమయానికి – కనులముందు కనబడగా
ఊహల ఊసుల లోనా – ఉదయ కిరణ రేఖవా
తెల్లచీర తెల్లబోయె – తెలవారే చూడగా
తనువు తపన తరిగిపోయె – మల్లెపూలు వాడగా.

ఆడగా పాడగా – ఆలాపన ఆగగా
ప్రేమ ప్రేలాపనలో – పేరుమారి పోయెగా
అందం అరవిందమై – విందులనే చేయగా
అనురాగం రాగమై – సరాగములు పలుకగా.

పులకల లుకలుకలే – పలుకలలై పలుకులై
పలవరించి కలవరించి – వలపుజల్లుకురిసెగా
అమెరిక అందానికి – మెరికమేనకందం
మేరువు మేనులో – మేనరికం చేస్తానే.

మెచ్చు హెచ్చుకొప్పులో – కుచ్చు మల్లెపూలలో
ముచ్చటలే చెప్పగా – ముచ్చెమటలుపోసెగా
చిలికిన నీ హృదయంలో – పలికెను అనురాగాలు
అలరిన నా మనసులో – అతిశయించె ఆమనులు.

పెదవులపై అలదిన – ప్రేమ వర్ణమేమిటో
మదిగదిలో దాచిన – మధుపాత్రిక ఎవ్వరిదో
రతీదేవి పుత్రికవా – రసరాజ్యపు రాణివా
హిమగిరి కన్యకచెలివా – మధురోహల ఊర్వశివా.

48

ఆడియోలలో అందం చందం – వీడియోలలో వివరం విజయం
ఆటోగ్రాఫుల అనుబంధం – ఆలూమగల సంబంధం.

దాంపత్యానికి దారిలేదుగా – కుటుంబ బంధం కూలుచుండెగా
ఆకర్షణయే – అమృతమయమై – శరీరాకృతే శివశంకరమై
ఆస్తిపాస్తులే అమరతరువులై – ఆక్రోసించును ప్రేమవివాహం.

వేషం వేదం – మెరుగులు మెరుపులు
పాశ్చాత్యానికి – పాదసేవనం

స్టారుల సంస్కృతి – తారాపథమూ
తొందరపాటే – తొలకరి ప్రేమలు.

భారతీయతకు – భామలు టాటా
సహనం అహముల – సామరస్యము
మగల మహిళల – వగలూ సెగలూ
విడిపోవుటకే – విలువల వెలుగులు.

సెల్యులాయిడ్ల – స్టేట్‌మెంటులూ
దూరదర్శనుల – దూకుడు తనమూ
కంపేరిజనుల – కల్మషత్వమూ
కొంపే కూల్చుట – కొలమానములూ.

కోకల కోసం – కాసుల కోసం
బలిసిన స్వార్థం – బాధల వైనం
అసమానతలే – ఆజ్యం పోయగ
వశం దప్పిన – నవదాంపత్యం.

భార్యాభర్తల – సంబంధములో
భాగమెవరిదీ – భోగమెవరిదీ
తల్లీతండ్రుల – అత్తామామల
స్థానమెవరిదీ – తపన ఎవరిదీ.

ముదిరిన నాగరకతలే – మదులను మథనం చేసీ
వ్యథలను కొనితెచ్చెనుగా – వధాయెనుగ కుటుంబాలు.

అన్యోన్యత అనురాగం – అవగాహన ఆలోచన
మమతా మానవతా – మనందరికి అవసరము.

49

ముద్దు మొద్దుబారిపోయె – ముద్దరేమొ ముదిరిపోయె
వద్దురబాబు వలపుల మేళం – నిద్దురలోనే హద్దుల అందం
పలుకుల అలకలూ – చిరు చినుకుల పులకలూ
నవ్వుల నావలో నది నీదగ – మది నీదిగ మగువా.

తెలికలలో తొలిపలుకే – తేలియాడి పాడగా
శూన్యంలో శుభమై – నభమే అభయమై – భయనారికి భాగ్యమై
అందమై – బంధమై – అవనికి నందనవనియై
ఆలించి – ఆడించి – ఓడించి – అందలమెక్కినదానా.

మొక్కులు మొక్కవోయి – మోజులు బూజువట్టి
చక్కెరలే – చిక్కిపోయి – కొక్కెరలకు కొలువాయె
రా! మరాళమా! వరాలు రాల్చి పోవమ్మా
చిగురించిన రాతిలో చైతన్యపు నాతివా.

నా తలపుల పులకాంకిత తనువులలో లావణ్యవా
అందిన ప్రేమకు అందం అలదిన దినకర దీథితివో
పండిన రాగం పారవశ్యమై పరమార్థానికి మార్గంనీవా
నింగే వంగీ సంద్రం పొంగీ నీరూపానికి నిధులిచ్చాయా.

చుక్క చెక్కిలే సుందరము – పొలతి పొక్కిలే బంధురము
సుందర బంధుర నారీమణికీ – శుభదాయకమే యీ జీవనము
పక్కలోన చిక్కినదీ – చిక్కిపోయె చిన్నదీ
కౌగిలిలోగిలి లోపల – గిలిగింతలు పెడుతున్నది.

ఎలకోయిల కూతలో – ఇలనినాదమున్నది
ఎలప్రాయపు లయింపులో – ఏదో లయ ఉన్నది
ఆమని రామని అనగా – ఆరామేమని యన్నది
ఆరామం అమరమై – రామరామ యన్నది.

మారాముల గారాముల – మధుమతి రానున్నది
శృంగారపు భృంగముగా – రతిమతి కానున్నది
ప్రేమపేర్చినట్టి చితికి – రాగమంటుకున్నది
చితిలోని చైతన్యమె – మతిమార్థవమైనది.

అందం అరవిందమై – విందులు చేస్తున్నది
వందన మే మనధనమై – నమోవాకమన్నది
మగతనము ఆడతనము – మగతలోన బడిపోగా
అంగాంగము అనురాగము – గాంగఝరీకలాపమే.

వరూధినీ వరప్రవరము – మన ఇరువురి సంగమం
అమరావని అమరికలో – అవనికి అందిన రాగం
దిగివచ్చిన దేవతగా – హృదిమెచ్చిన మానసిగా
మదినచ్చిన మాధురిగా – మధూదయం మనరాగం.

50

మందుబాబులు – మందభాగ్యులు
మతిచెడి గతిదప్పిన – మానవతకు వత్తాసులు
సారాసర్వస్వమై – సంసారం చితికెను
తాగుడు దుర్వ్యసనమై – తరాలనే చెరిపెను.

ఇల్లు ఒల్లు గుల్లచేసి – కలలు కల్లలుగ జేసి
కలకాలపు కాపురాలు – కళవళపడి కూలెను
మత్తుమందు చిత్తమునే – చిత్తడిగను మార్చివేసి
పుత్తడి జీవితాలె – పున్నమిలో చీకటులే.

బ్రాందీలో గాంధీనే పాతిపెట్టు వారలు
విస్కీలో విలువలనే పూడ్చిపెట్టువారలు
రమ్ములో రమ్యతలను రభస చేయువారలు
జిన్నులో జీవితాలె గోతిలోన పెట్టువారు.

లిక్కరు చీపులో బతుకు లెక్కమారిపోవు
నల్లమందు మత్తులో మందభాగ్యులైనవారు
వాటమైన అలవాటే వాసిదరిగిపోవు
పెడదార్లు పట్టిపోవు అడ్డదారె మిగులును.

భారతీయ తయారీ – పరదేశీ ద్రావణము
బ్రూవరీల బ్రేవరీ – వక్రీమిగులును సారీ
రాజకీయ వ్యాపారం – సారాజులు రాజులు
సిండికేట్ల చిందులు – ఖజానాకు చిల్లులు.

బారులన్నీ బార్లాగా – చదువుకొన్నయువతకు
మద్యం సెస్సుతో – హృద్యమైన చదువులు

అనురాగం ఆప్యాయత – మందులోని మనమాటే
ఆరోగ్యం సౌభాగ్యం – మందభాగ్యమైన మాటే.

విచ్చలవిడి త్రాగుటయే – మచ్చిక చెడి మనుటయే
పుచ్చిపోవు శరీరాలు – చిక్కిపోవు నరములు
గుడుంబాల గూటిలో – ఆవిరైన కుటుంబాలు
కల్లు కల్తీలలో – కల్లలైన జీవితాలు.

మేధావుల పాలనలో – మేలిమి మందున్నది
మేల్కాంచిన మేనులకు – మత్తుపంచుతున్నది
ఎత్తుకు పైఎత్తు వేసి – మత్తులోన ముంచిరి
చిత్తమున్న చైతన్యము – చిందర వందర చేసిరి.

బానిసలై నిషాలోన – బాధ తెలియ కుండిరి
వేదనలో వెలుగుబాట – వెగటు జీవితపు పాట
ఆలోచన ఆపుకొనీ – అవగాహన అణచుకొనీ
ఆదర్శపు బతుకులనూ – అంతర్ధానము చేసిరి.

51

చిలుక పలుకుల చిరునామానీ పంచదార పలుకేనంట
తనివితలపుల తిరునామం నీ తనువుతపన లేనంట
తరుణీ నీ అందానికి తరుణం వచ్చె
కలికీ నీ కోయిల పాటకు కాలం వచ్చె.

కలహంసా నీ కమ్మని నడలకు సమయం వచ్చె
లేడీ నీ లేడిచూపులకు లేజరులొచ్చె
అమ్మో నీ ఉమ్మతీపిగా ఉడికించెనే నామదిని
వామ్మో నను వాటేసిన నీ వాలకమే నాకలక తెచ్చెనే.

అలకా చిలకా అనురాగం – పలుకూపులకామరాళం
కులుకూ కలుకూ కూనిరాగం – అలుసై మనసున అమృతరాగం
రామా రావే కావేరీ – భామా పలుకే సావేరి
గోపకన్యకది గోదారీ – నామదిలో కన్యది రాదారి.

రాజస్థానీ రాణివి నీవు – కాశ్మీరంలో కన్యకుమారివి
కలకత్తాలో కాళిక వీవు – భాగ్యనగరిలో భామవు నీవు
నీ చిరునవ్వే చిందులాటగా – నీవిరిదండే బంతులాటగా
నడకల నాట్యం పదములాటగా – కన్నుల కదలిక చూపులాటగా.

అటునిటు తిరిగిన నీ అందంలో – అదలించిన ఆ భంగిమలెన్నో
బెదిరించిన ఆ బేలచూపులే – బధిరమనసులో బాకుగ దూరె
పెదవుల పదను అదను చూచుకొని – పదముల పాటల పదనిసలొలికె
మౌనం మాటగ మనసుకు తెలుపగ – చేతిస్పర్శతో చెలిమిని పంచె.

అంతరార్థమే అర్థాంతరమై – అంతరంగమున రంగులు వేయగ
అర్థానర్థము లన్వర్థములై – హార్థికార్థముగ అవతరించెనుగ
ఆకాశం మన అవకాశంగా – రాగప్రయోజన పరమార్థంగా
మనకలయికలో కలరవమొలుకగ – అమరగానమే మన సంగమము.

గిరి కన్యక నీ గీర్వాణంలో – వనకన్యక నీవయ్యారంలో
జలకన్యక నీజాణతనంలో – నవకన్యక నీ నడుమువంపులో
సరసాల సయ్యాటలో – సరాగాల మనపాటలో
హృదయాల ఉయ్యాలలో – ఊరేగి రేగిపోదాం.

కమ్మని కాలం రమ్మంటుంది – కరగని కలలే నిజమంటున్నది
మానసవీణియ మధువొలికింది – మనకలయిక యిక మంచియన్నది
పాతాళంలో పాలవెల్లివా – భూలోకంలో పుణ్యగణ్యవా
ఆకాశంలో అమర కన్యవా – ఈ రూపంలో రూపరహితవా.

రత్నహారమున రంగు ముత్తెమా – మణికిరీటమున కౌస్తుభమణివా
శివుని కంఠమున సిరినాగినివా – అమరప్రేమకు ఆదిరూపమవా
ఆలకించినా అవలోకించిన – ఆఘ్రాణించిన రసియించినా
అమృత స్పర్శను అందించినా – మనసున మిగిలిన మరో ప్రేమవే.

52

భయంకరమ్మే – భవశంకరము
భక్తిభావమే – భవ నిధానము

పుట్టుట భయమూ – గిట్టుటె భయమూ
పూజ్యుల బతుకులు – పుణ్యమయములు.

ఆశలకోశము అసలే భయము – తపనలు తీరిన తలపే భయము
నరకము దలచిన నరులకు భయము – అమరాధిక్యము అసలే భయము
దానవరీతులు దారుణ భయము – దయాపరత్వం ధరణికి భయము
మానవ మార్గం మనసుకు భయము – మనసుల మలినం మనకే భయము.

అభయమైనది అవనిని లేదు – సభయం సంగతి సాధులకెరుకే
నదిలో మునిగిన నరునకు భయము – నమ్మకరహితము భయకారణము
పైవాడుకలడను పయనమె భయము – లోగల ఆత్మకు లోభము భయము
అహమేమికానని అవధికి భయము – మహిమల మార్గము మనిషికి భయము.

రోగము రాగము భోగము భయము – యోగము యాగము ధ్యానము భయము
భార్యాబిడ్డలు బంధుల భయము – నిత్యము సత్యము విధులకు భయము
పగలు రాతిరి సంధ్యల భయము – సెగలు చీకటి అరుణిమ భయము
రంగులు హంగులు భంగుల భయము – రాజ్యము ,భోజ్యము త్యాజ్యము భయము.

బ్రాందీ విస్కీ రమ్ముల భయము – గుట్కా మట్కా చిట్కా భయము
పెట్రోల్, బాంబులు, యాసిడ్ భయము – సైకిలు మోటరు, కారుల భయము
పేదల దళితుల బాధల భయము – పెద్దల అర్థుల ధనికుల భయము
కూడు గుడ్డ గూడుల భయము – కాడు, బీడు ఎడార్ల భయము.

మరుగు, మురుగు, మలినము భయము – నీరు, నిప్పు నిజమే భయము
లారీ, బస్సు, విమాన భయము – నావ ఓడ తెప్పల భయము
కొండలు, గుహలు, బండల భయము – వనారణ్యములు వార్ధులు భయము
మంచు, మంచం, కంచం భయము – మఠము, హఠము, ఘటముల భయము.

వినుట కనుట చూచుటె భయము – వాసన స్పర్శలు, వరులకు భయము
గుణములు, గణములు, కణములు భయము – రక్తి, శక్తి, ముక్తి భయము
యోగం మోదం దోషం భయము – హాస్యం, లాస్యం వేషం భయము
మంత్రం తంత్రం యంత్రం భయము – జంతువు తంతువు జయమే భయము.

అందం చందం బంధం భయము – మమత మానం సమతల భయము
భయమనురాగం భవరోగం – భయరోగాంతం భవదూరం
పంచేంద్రియములు పంచును భయము – నవరంధ్రములకు భయమే అవధి
మనసున దినుసుగ మనునా భయము – ఆత్మస్థైర్యము భయమునకడ్డము.

పాలక పాలిత పడతుల భయము – సాయుధులంటే చచ్చెడి భయము
అధికారం అంటే అందరికీ భయం – జీవుల జీవుల మధ్యనే భయము
తనుతెలిసిన తనువుకు తపన లేదు – పరులకు ఫలమిచ్చు వానికి భయంలేదు
భయం విడిచి భాసించు – నవనయమార్గంలో గమించు.

53

తూరుపు తీరపు తూర్యపురావం
బంగాళమునకు బంగరు కిరణం
కన్యాకుమారి నుండి కలకత్త కడవరకు
కనుమల కన్నులు విరిసిన నదులుగ.

కావేరమ్మది కనకధారగా – కృష్ణాభద్రలు తృష్ణదీర్చగా
గోదారినాసిక విరిఝరికాగా – వంశధారయే వాసిగాంచగా
మహానదమ్మకు మహిమ కల్గగా – ఎన్నో నదులకు ఎదతానాయెను
చెన్నపట్నం చిన్నదిరాగా – కృష్ణాపట్నం గోపికరాగా.

రామాయపట్నం రామదికాగా – కొత్తపట్నం కోమలి కాగా
వాడరేవు నీవాల్లభ్యమ్మై – గంజాం జాణై గణ్యతనివ్వగ
నిజాముపట్నం నెఱజాణైనది – మచిలీపట్నం మహిమ నిచ్చినది
లంకలు వంకలు లెంకలు కాగా – నావలు తెప్పలు నడలునేర్పగా.

గంగపుత్రులకు గతులేనేర్పగ – మత్స్యసంపదే వాత్సల్యముగా
సైంధవ లవణం సాగరమ్ముగా – ఉప్పుకొఠారుల ఉధృతినీదే
హంసలదీవీ అంతర్వేదిగ – కాకినాడ నీ కోక వర్ణముగ
రాతినూనె మఱి సహజవాయువు – గోదారంచున దాగియుండెగా.

విశాఖపట్నం విజయద్వారం – డాల్ఫిన్ పర్వత పర్వదృశ్యం
నావిక కేంద్రం రక్షణ శిక్షణ – నాణ్యమాయెగా యూనివర్సిటీ

కళింగపట్నం కామనలోనా - కాకుళమ్మున కుద్యమాయెగా
ఓఢ్రప్రాంతము ఓజస్సైనది - జాలరి జాలం జాగృతమాయెను.

భీముని పట్నం తీరపట్నమై - బీచ్ అందమే కనుల స్వర్గము
నదుల తీరముల ఆలయ అందం - భక్తి భావముల ప్రేరకమైనది
మతములు వేరు మహిమలు వేరు - హిందూ క్రైస్తవ ముస్లిం ఇతరులు
హితముకోరిరి గుళ్ళుకట్టిరి - ఆధ్యాత్మికతలకు పాదులు వేసిరి.

లెక్కకు మిక్కిలి శివాలయములు - వైభవమొసగెడి విష్ణ్వాలయములు
క్రైస్తవ చర్చిలు కనగమసీదులు - కాలముమారిన తీరుల దేవుల
సాంఘిక కేంద్రము దేవాలయము - సరసత వీడగ మామతాలయము
శిల్పసంపదల తల్పము పేర్చిరి - ఆది గాథలకు అందము నలదిరి.

రాతిచెక్కడము రాజ్యము నేలెను - గాలిగోపురము గణ్యతనందెను
నదీనదములకు నవ్యతనిడగా - నీటిని ఆపి నిధులను పొందిరి
ప్రాజెక్టులతో పంటలు పెంచిరి - ఫలితం హితముగ సతము దలచిరి
విభజన భజనలు వీనుల బాధగ - అడ్డుగోడలు విడ్డూరములు.

అన్నియు కలియగ కాలుష్యములు - అధఃకరించెను అవని అందమును
అబ్ధిజీవుల అధికవేటలో - జీవావరణము జీర్ణమగునుగా
పారిశ్రామిక వ్యర్థములన్నీ - ప్రవాహములలో శుభ్రత హరించు
తీరం తీరులు మారుతుండగా - తీపిచేదుల తెలివీ తెలిసికో.

54

పాలపాపా పాలపాపా - పాలికొస్తావా
నీపంజాబిడ్రస్సు నాకు అద్దెకిస్తావా
చున్నీలో సన్నబడిన సూదంటురాళ్ళు
బికినీలో బీదలైన బిరుసైన పిరుదులు.

ముద్దు ముద్దరేసెను - హద్దు చెదిరిపోయెను
ముద్దరాలి మద్దతుతో - పొద్దులు బరువాయెను
చిన్నది నా సన్నిధిలో - పెన్నిధిగా మారెను
ఉన్నది లేదను నడుమున వన్నెలు వరుసాయెను.

పాలబుగ్గ గిల్లితే – పాలుగారిపోయెను
పంట పెదవి నొక్కితే – దొండపండు దొరికెను
అరిటాకు జీవితాన – అరవిరిసిన అందము
కదలీపాకం కమ్మన – అమృతముగ తెలిసెను.

అపుడెపుడో కలగన్నది – అరచేతికందింది
ఆశయాల శర్వరియై – ఆదర్శము నన్నది
నామజపం నాదుతపం – నవనందన చందనం
నారీమణి మనోహరీ – హరిమధ్యం హల్లీసకం.

భరతంలో రతంచేసి – భాసించిన యామినీ
మహతిపైన మహిమచూపి – రాగించిన భామినీ
మువ్వగోపాలునికి – ముద్దుల చెలివా
కృష్ణవిరహతప్తయైన – 'మీరా' మినుకువా.

మురళీలోలునికి – ముద్దుల రాధవా
జయదేవ గీతానికి – జయరాణివి నీవా
షాజహాను జహాపనా – ముంతాజు మహలువా
భాగమతీ భాగ్యానికి – చార్మినారు చెలివా.

సలీమునికి సర్వమైన – అనార్కలీ కలికివా
మజునూ మనసైన – లైలాయిల దేవివా
ప్రేమను ప్రేమించిన – ప్రేమాభిషేకమవా
ప్రేమను శపియించిన – దేవదాసు పార్వతివా.

ప్రేమకు చిరునామా – శాశ్వత శక్తివా
ప్రేమకొరకు మరణించిన – అమరప్రేమ అతిథివా
రాముని సీతలో – రమణీయ భావనవా
పరమేశ్వర వధువులో – పరమార్థపు రమవా.

నారాయణ నారిలో – నవ నారి లక్ష్మివా
ప్రకృతి పరవశమైన – పచ్చని వనదేవతవా
కన్నులతో చూచినా కనరాని చెలువం
మనసుతోడ భావించిన మధురం మధురం.

55

ఆత్రమైన గాత్రమే – అదిరిపోయింది
చిత్రమైన చిత్తరువే – చెదిరిపోయింది
పరుగెత్తే పరువానికి – పంచదార పెట్టనా
బరువెక్కే హృదయానికి బత్తాయిలు పంచనా.

లేగులాబి గుత్తులతో పొత్తుపెట్టనా
చిగురు గున్నమావిడితో చెలిమి కట్టనా
వగరు పొగరు కోయిలకంఠం వంతపాడనా
చిలుక కొట్టు జాంపండుతో కొరుకులాడనా.

కదిలిన విశ్వమే – వశ్యమైంది నాకు
కమలిని కమనీయత – కలికె మైందినేడు
బంగారము భామకు – అంగారం హృదయం
కరిగి అరిగి కలబోయగ – మేలిమి నీ మనసు.

చెప్పలేని భావానికి – చైతన్యం ఎందుకో
చూడలేక కళ్ళకూ – సౌందర్యం ఎందుకో
ప్రేమలేని విశ్వానికి – పేరు పెంపు లెందుకో
రాగరహిత రాజ్యానికి – రాజు పేద లెందురో.

వయసు రాని మనసుకూ – వలపుతలపులెందుకో
మనులేని మాటలకూ – మధువు పూతలెందుకో
ఎందుకనో కనరానిది – కనికరమైనది
ఎక్కడనో అనరానిది – అర్థరహితమైనది.

ఎమిటదో తెలియనిదీ – తెల్లబోయి తెలుపైనది
ఎందుకనో అందనిదీ – అందమై ఉన్నది
ఎలా అనో ప్రశ్నించినది – బదులులేదై బరువెక్కినది
ఎవరనో ఎఱుకైనది – ఏమరుపాటై మారినది.

భాషణ భూషణమై – భామవాణియైనది
అన్వర్థము అర్థాంగము – అతివ పార్వతైనది

హృదయం దయచూపగా - రమ లక్ష్మిగ మారినది
సంకటమే సరసమై కలినాధుని కవలసతులు.

చిన్నతనం చిలిపితనం - కలిపి కమ్మనైనది
ఉన్నధనం ఉన్నతమై - ఉవిద ఉద్భవించినది
విరబూసిన అందానికి వరసకియే వాల్లభ్యము
సిరి మురిసిన చెలువానికి - చెలిసరసమె రసోదయం.

ఉదయానికి ఉదయించిన ఉద్యమ స్ఫూర్తి
అరుణకిరణ కరుణ కవిత కలికికి దీప్తి
గాత్రం గమ్యానికి చేరింది - ఆత్రం అదృశ్యమైంది
చిత్రం చిత్తరువై నిలిచింది - చెదరుట చేవ దప్పింది.

56

జాతినేత జవహర్ - జాణతనపు జయధర్
భరతమాత భాగ్యం - భవితకే జనయోగ్యం
మోతీలాల్ ముద్దుబిడ్డ - తరతరాల జాతిబిడ్డ
గంగానదీ తటమునందు - వటవృక్షము కుటుంబము.

తెల్లజాతిపాలనలో - తెల్లబోయి పాలుపోక
తెల్లారిన బతుకులతో - తిప్పలు పడు దేశీయులు
ఉద్యమాల ఊపిరితో - ఉన్నతి సాధించగా
బానిసత్వ బాధవీడి - స్వేచ్ఛను కాంక్షించగా.

వివక్షతో విలువలనే - కాలరాచి వేస్తుండగ
తుపాకితో బెదిరించీ - అదరగొట్టి అణచగా
జన్మభూమి జయగీతం - వందేమాతరమనుచూ
కర్మభూమి కాంతిలో - అభ్యుదయం అందించగ.

మానవులై మహిమచూపి - అమరులైన ఆ నేతలు
అందరికీ అభినందనం - అందించుట మనపని
కాంగ్రెస్ కర్మల లోనా - మర్మమెరిగి ధర్మముతో
సాంకేతిక భారతిని - సాధించగ యత్నించెను.

అనుభవాల సారమంత – ఆలోచన మర్శనతో
ప్రణాళికల ప్రగతితో – ప్రభవించి భారతాన్ని
తరతరాల సంస్కృతిలో – తరగని తీరుగ జేసెను
భారతమను అరణ్యమును – బాధ్యతతో బాగుచేయ.

రాష్ట్రములుగ విభజించి – రామరాజ్యమును కోరెను
సంక్షేమము సరళముగా – పేదల బంధువుగాను
క్షామరహిత ధరిత్రిగా – ప్రాజెక్టులు నిలిపెను
కమ్యూనిజమున కాంతిగ – మాస్కోతో చెలిమికట్టె.

పంచశీల శీలముతో – ప్రగతిమార్గమును చూపెను
మతఛాందస వాదములను – మట్టుబెట్ట యత్నించెను
నవభారత నిర్మాతగ – చరిత్రలో నిలిచిపోయె
వారసులుగ వాసికెక్కి – ఇందిర రాజీవులు.

హితమతులై జీవించిరి – జనజయముగ పాలించిరి
గాంధేయముగాడిదప్పె – తరతమములు పెరుగుచుండె
స్వార్థం మితిమీరిపోయె – అర్థం సర్వస్వమాయె
కన్నకలలు కల్లలుగా – కనులముందు కరుగుచుండె.

కన్నుపొడుచుకున్ననూ – కానరాదు దేశభక్తి
మళ్ళీ జవహర్ పుడితే – మంచి మానవతల గాంచి
అదిరిపోయి చెదిరిపోయి – అమరానికి మరలిపోవు.

57

తెలుగుజాతి చిన్నది – తీపి అందమున్నది
వాటమైన వరుసది – గాటమైన మాటది
పంచదార అరిసెలో – పంకజాక్షి రుచి ఉన్నది
కొబ్బరి బూరెలలో – కోమలి నిబ్బరమున్నది.

కజ్జికాయ కలిమిలో – కలికి కమ్మదనమున్నది
కాకినాడ కాజాలో – కామిని మనసున్నది
బందరు లడ్డూలో – బందరే చెలివయసు
బంగినపల్లిలో – మగువ మనసు భంగమే.

వడ్లపూడి నారింజలా – వనిత మమత సతమతమే
నాగపూరు కమలాలో – నాణ్యతయే నాతి సొగసు
కాశ్మీరి యాపిల్ లో – కమలాక్షి అక్షయమే
జాంగిరీలో యాంగ్రీయే – జాణతనపు తనువు.

బాదుషా భాగ్యమే – భామ హృదయ మధురిమ
పాలకోవ కోమలమే – కోమలి కొత్తందము
క్యారెట్ హల్వాలోన – క్యారెక్టర్ చెలియది
బాదం పాలలొ కలిసిన – భామిని కౌగిలి సుఖము.

మిరండా మరాండీ – మానిని మమతారాగం
కోకోకోలా కోలాటం – కోక్కోకము చెక్కిలిదీ
థమ్సుఅప్ దాక్షిణ్యము – దాక్షాయణి ధైర్యము
లిమ్కాలో లావణ్యము – లలితమ్మకు గణ్యము.

పాయసం రసమే – రసరాణికి రాసిక్యము
పానకం పాండిత్యం – తరళాక్షికి తరుణము
మహానంది అరటిలో – అతివ తియ్యదనము
చక్కెరకేళీరుచిలో – చక్కని చుక్కందము.

ఆల్‌బకరా పళ్ళే – ఆడతనం చందము
సీడ్‌లెస్ చిరుద్రాక్షలే – సీమంతిని మతిగతులు
సపోటాల సరసతలే – సారసాక్షి గుండెతీపి
వేటపాలెం జీడిపప్పు – చెలిమాటకు చెలువమే.

ఖర్జూరం రంజులో – రంభ రభసమున్నది
నేరేడు నేవళంలో – నెలత కలతలున్నవి
పెరటిజామ తీపిలో – సుదతి సురటియున్నది
చెరుకురసం చేరువలో – రసన రమణిదైనది.

జిలేబి చుట్టలలో – జిలుగుల మణియున్నది
మైసూర్ పాకంలోనా – మానిని మహిమున్నది
కొబ్బరిపాకంపైనా – కోరిక కోమలికైనది
పప్పుబెల్లాలలో – పడతికి పరమార్థము.

మించుతీపి తినవద్దు – మితము మతము అందరికి
చెలియ తీపి చెరిసగము – అమితమైన అవలక్షణ.

58

కారులేని షికారు – కుర్రకారు హుషారు
కామనలో తయారు – కామినితో బేజారు
జాణజారుపైట చూచి – జబర్‌దస్తి చూపులు
జాణజాణతనం చూప – జారుకొనెడి జాడలు.

వయ్యారం వంపులో – ఇంపుసొంపు ఊహలు
సయ్యాటల సరసంతో సంబరాల సోకులు
నవ్వుల కవ్వింతలలో – కలవరింత వంతలు
మాటల మాధుర్యంలో – మతిగతిచెడు చేతలు.

సరసాల సురశాలకు – మరుసరసవు నీవే
రాజర్షికి హర్షిణివి – రమణిమేనకవు నీవే
దుర్వాసుని దుహితవు – పరాశరుని పడతివి
శంతనవరు సత్యవతివి – హరిశ్చంద్రు చంద్రమతివి.

చలిమలలో చెలివి – మలయ మారుతివి నీవు
కాశ్మీరం సిగపూవువి – సాగరకన్యవు సరసకుమారివి
కోటేరు ముక్కుపై – కొత్తకోపమెందుకే
ముద్దుమూతి ముడతలో – మూల భావమేమిటో.

జాలికళ్ళ జవ్వనీ – జాజిమల్లెనవ్వునీ
జాముురాత్రి జాబిలీ – ఉద్యమించు ఉదయినీ
నీటిలోని నీ అందం – నింగి నిండు నీలిమం
కలికలలో కమ్మదనం – కమలాప్తుని నవకిరణం.

నరాలలో నవరసవు – నాడులలో నాగినివి
మనసు మరపు మంత్రానికి – మాయదారి యంత్రానివి
వయసే ఎస్సంటున్నది – మనసే మిస్సంటున్నది
మధువే మన్మథ మన్నది – రతిరమ్యత రంజన్నది.

మంజరీ నా మనోఝరీ – రంజనీ నారసాంజలీ
సరసామృత సాహితీ – సప్తస్వర మాధురీ
అందరాని అమరవనీ – అందిరాగ భువన ధునీ
అందుకొని గంధర్వినీ – అందిన నా అమలోద్భవి.

కాలానికి కళ్ళేనివి – కళ్ళకు నవ కళ్యాణివి
కామనకే కాముకివి – ప్రేమానికి ప్రేరణవు
ధనమునకే ధరిత్రివి – ధరిత్రికే చరిత్రవు
చరిత్రక చారిత్రవు – చారిత్రపు పవిత్రవు.

మాయలోక మమతవు – మిథ్యనడుమ మధ్యవు
శూన్యానికి శుభదవు – సర్వానికి మనికివి
మనీలోక మనీషావు – నిషాలోక మషాలావు
నిశీధిలో నిత్యనిధివి – పగటి వెలుగు పవిత్రతవు.

59

జనాభా పెరిగిందీ – జయమే తరిగింది
జగతి కల్లోలినిగా – జయకేతన మెగిరింది
మానవాళి మనుగడకే – మహాప్రళయ మయ్యింది
జనభవితకు జాగృతియే – గగన కుసుమమయ్యింది.

పేద దళిత కుటుంబాల – దారిద్ర్యం హెచ్చింది
పెద్దకుటుంబాలన్నీ – పేలవమై పెరిగిపోయె
పంటచాల కుండెను – వంట వలసినంతలేదు
భూమి భుక్తి చాలకుండె – భువనంలో విలయమాయె.

భరతవాసి వట్టిపోయె – వందకోట్ల జనులతో
భారతమ్మ బిడ్డలంత – పాలులేక తల్లడిల్లె
పట్టణాలు పల్లెలూ – పెరిగిపేరుకోలుపోవు
కట్టడాల కమామీషు – కలవరముగ కలత నింపు.

పారిశుధ్య సమస్యతో – పతనమాయె జాతిశక్తి
రోడ్లు వీధులన్ని నిండ – రొష్టాయెను జీవనము

నీరులేక నిమ్నమాయె – నిధులుండీ నీరుగారె
ప్రకృతికృతి వికృతియై – ప్రజలంతా పటువుపీడె.

స్త్రీపురుషుల తీరుజూడ – తియ్యదనం వీడుచుండె
అంతులేని వ్యాధులతో – అవస్థలే అందలమున
సంతానం అంతులేక – సతమతమౌ సమరమే
గాలివాటు జీవితాలె – గమ్యరహిత గార్దభములు.

జనపంటయె మీరెను – తినుపంటలు జారెను
పల్చబడిన బతుకులు – కలతకు కనువిందులు
వనరుల వినియోగములో – వాసిదరుగు చుండెను
వలసినంత సమకూర్చుట – తలపుల కందక యుండెను.

అవసరాలు తీర్చుటయే – ఆకాశము రీతైనది
అరగొర వసులతోటే – అలమటింత అధికమాయె
మేధకేమి కొదువలేదు – మేలుకోరువారరుదు
మేలుకోరువారందరు – మేదినిలో అధికులు.

బతుకుబాట భద్రము – భవిత ఛిద్రరహితము
జనోల్బణం జారిపోగ – జగతియె నవనందనము
బిడ్డతల్లి ఆరోగ్యము – భీరువగును సంతతితో
సంతుచింత అధికమైన – సంసారమె సారరహిత.

ఒకరిద్దరితో తృప్తి – సకలార్థ సంపత్తి
చిన్నకుటుంబాల శక్తి – చెన్నారును విశ్వదీప్తి
తెలివికలిగి తెలిసికొండి – తేటదనం కోరుకొండి
పెరుగుదలకు అడ్డుపడీ – పేరు తెచ్చుకొండిమీరు.

60

వ్యాసపూర్ణిమ – వెలుగు పూర్ణిమ
జ్ఞాన పూర్ణిమ – గురువు పూర్ణిమ
వెలుగు పంచె వేదాలు – పెరిగె జనుల జ్ఞానము
పురాణాల పూజ్యతతో – పునీతమే పురుషార్థము.

నిషత్తులేనిగమాలై – నిగమనమే అజ్ఞానము
భారతము భాగవతము – భవ్యజనుల భాగ్యము
గురువు పరువు గురుతించగ – గుణవంతము యీ జగతి
అజ్ఞానము అంతరించి – జ్ఞానమగును జాణగాను.

బ్రహ్మ, విష్ణు మహేశ్వరులు – భగవంతులు మనగురువులు
చీకు వెడలి వెలుగుపంచ – చిరుదివ్వెలు ఆ మహితులు
దివ్యమైన వెలుగుకంటె – దిటవైనది వేద వెలుగు
జనారణ్య జాగృతిలో – జావళీగ పరిమళించు.

ప్రకృతిలో పావనతలు – వికృతిలోవివరములు
పురుషునిలో పూజ్యతలు – జడజీవుల వెలుగులు
నిత్యసత్యనియమములు – సచ్చిదానందములు
ఆత్మరూప అతిశయము – అందించిరి ఆ గురువులు.

పూర్వోత్తర మీమాంసలు – పూతమైన శాస్త్రములు
గ్రహగతుల గమ్మత్తులు – భువన భాండ విశేషాలు
జీవాత్మల జిలుగులు – పరమాత్మ పావనతలు
త్రికాలాల త్రిలోకాల – తీరులు తెలిపిన వారలు.

నరనరకం వరస్వర్గం – వాసిని వర్ణించినవారు
పరమార్థము పరార్థముల – ప్రభావాన్ని ప్రవచించిరి
పాపపుణ్య జీవనములు – అస్తినాస్తి అంతరములు
ధర్మమర్మ ధర్శనములు – అరివర్గపు అహరహములు.

సృజనలోని సుఖదుఃఖము – శివసుందర శిఖరములు
స్థితిలయముల చింతనలు – శ్రుతుల స్మృతులసుందరతలు
మానవాళికందించిన – మహనీయ చరితులు
మాననీయ మానవులు – వెలుగుమేధ వేకువలు.

శక్తిలోని శంకరము – భక్తిలోని భాగ్యము
రక్తిలోని రమణీయత – ముక్తిమూలమాయెను
మహర్షులు మహనీయులు – యోగులు మతి త్యాగులు
స్థిరచిత్తులు మిత్రులు – లోకరక్ష దీక్షితులు.

వారివాక్కు వందితము – వారి నడత నందితము
వారికర్మ భాస్వంతము – వారే మన వారధులు
వాగ్దేవికి వాల్లభ్యము – భువనభాండభాగ్యము
సంస్కారపు సారధులు – సమత మమత సాగరులు.

61

సమరంతో మరణం సహగమనం చేసినా
సాహసమే హాస్యమయి సంతర్పణ జరిగినా
దానవతే మానవతకు దహనక్రియ జరిపించిన
అజరామర జీవితమే అతనిదిగా తెలిసికో.

బానిసత్వభావనకే భావితరం బలియగునని
దమననీతి దారుణమై దరిద్రతకు దరియగునని
పరజాతీ ప్రాభవంలొ స్వజాతికీ సమాధని
తెలుగువాడి వాఁడి చూపి తెగబడెనుగ అల్లూరి.

అకృత్యం అపకారం ఆంగ్లేయు అవధిగాగ
అధికారం అంధమయి ఆహరణే అతిశయించ
మన్యంలో సూర్యుడయి మగధీరుడు ఉదయించగ
మన్యజనులు మాన్యులయి విప్లవించ విలువ వెలిగె.

స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు సేవలతో చెదిరిపోగ
పోలీసుల దౌర్జన్యం పోరాటపు కారణమై
అడవిజనుల ఆశయమే ఆంగ్లేయుల తరిమివేత
నినాదమే పోరాటము విప్లవమే విజయమాయె.

దేశభక్తి జాతిరక్తి దేహమునే కబళించగ
కారడవుల కష్టములే కామనలకు కాంతినివ్వ
కులమతాలు కూలిపోయి కూటమి జన విప్లవమై
తెల్లవాడి గుండెలలో కల్లోలం రేగెనుగా.

అనైక్యతే అతిశయించి ఆహరణే అందగించె
విభజించీ పాలించుట విజయానికి సోపానమె

సంపదలే దోచుకొనుట తరలించుట నిత్యమయె
ఎదిరించుట ఎదమురువై ఎఱుక కలుగ కలబడిరిగ.

తుపాకులకు తూటాలకు బాణములే బాసటగా
ఫిరంగులకు పీడగా మిరపకాయ టపాలూ
అడవితల్లి బిడ్డలకు అండయైన అల్లూరి
మన్యపు మహనీయుడే ధన్యుడైన ఆంధ్రుడే.

బాధలలో బాసటగా బాధలనే ప్రేమించీ
భానుడైన భాగ్యశాలి అల్లూరియె అమరుడూ
తెలుగువారి తేజమంత మూర్తికట్టు కీర్తిశాలి
పరాక్రమపు విక్రముడు పరమార్థపు పావనుడు.

తెలుగుతల్లి తేటదనం తెలియజేసె అల్లూరి
త్యాగమె తన యోగంగా తేలియువాడే అల్లూరి
బంధనాల బంధువుగా భక్తి రక్తి ముక్తి నొందె
జన్మభూమి జాతిరక్ష జాగృతిగా జయమందెను.

62

ఆకలికీ దాహానికి ఆలయమీ కలియుగం
అంతరాలు రాలిపోవు కలికాలం ప్రళయం
ఆర్జించిన ఆర్థాలే వర్జించిన వలపులాయె
ఆదరణకు తరుణమొచ్చి ఆలోచనలోచనమయె.

పుట్టుకలో పూజ్యతనే పురిటితోనె మరచిపోగ
అవసానం సానబట్టి అవలోకన ఆదమరపు
కరుణరుణం తీర్చలేని కథానాయకునివీవు
కామనతో మనగలిగెడి కాంతారపు రాజువీవు.

రంధ్రాలకు రంధికలుగ రాసిక్యం రసిగారెను
బంధాలే అంధములై బతుకుబాట బంధురమే
పాడుబడిన దేహానికి పావనతే నీకోరిక
వనంలోని పావనతకు వంనదమే నీ చేరిక.

ప్రయాణంపు ప్రమాణమే ప్రమాదంలో పండిపోగా
ప్రమోదమే మాదకమై మానవతను మరిచెనుగా
ఈతరాని తరానికీ తరించుటను తెలిపెటోడ
లోతులేని నీటిలోన లోభివయి చరింతువా.

కళ్ళముందు కాలానికి వెనుకమెదడు వేకువగా
వెలుగురేఖ ప్రసరించగ వెతలుతీరు వేళయిదే
శక్తిలేని ఇంద్రియాలు రక్తి ఉన్న రాబందులు
నశ్వర మీశ్వరమైనచొ నాకలోక వరులు నరులు.

వంతల వలలో చిక్కి సంతయెగా సర్వస్వము
సుంతయేనియోజించని పంతమెగా జీవునహము
వెలితిలేని వేళకొరకు వెదకుటాయె బతుకు
వేళ వెలకు అమ్ముడై వేగుచుక్కగా మిగిలె.

ప్రతిహృదయము దయ్యంగా పరమార్థం మరచెగా
స్వార్థం స్వాగతమివ్వగ స్వగతమాయె తనగతం
పచ్చనిలోకంలో ప్రతిఫలించె వెచ్చదనం
లోకుల వెచ్చదనం మచ్చలుగా మార్పుచెందె.

మెప్పుదలకు ఒప్పుదలకు మేను వంచు జనులు
కనుకలి వినుకలి వరమై కలవరించు కలినరులు
ఆకలితత్త్వం తెలియని ఆకారం నీది
కలితత్త్వం కమ్మదనం అనుభ'వింత'మనది.

బాధలనే పంచుకొనుట భాగ్యంగా ఎంచు
శోధనలో శోభించుట శోభనమని ఎంచు
జననం జయమైన వేళ మరణం వరణీయమే
జనన మరణ జగతిలోన గతినీవని తెలిసికో.

63

నామం నశ్వరమే వశ్యమైన విశ్వంలో
రూపం రూపు మాయు జరారుజల జగతిలో

ఇంద్రియాల కింపు సొంపు హీనత లోమించు
మనస్సునకు నమస్సనెడు మానవుడే కంపు.

బుద్ధిగోచరములకు బద్ధతయే కరవు
చిత్తవిత్తమునకు చైతన్యమె చివురు
పదార్థమున అర్థము ప్రపంచాని కర్థము
చైతన్యపు చెలువున వెలిగెనుగా విశ్వము.

నేతి వాదమందున నేర్పరితనముండెను
సృష్టిలోని పుష్టికీ పులినత్త్వము పండెను
లేనిది ఉన్నదిగా లేవడియే యీ జగతి
ఉన్నది లేనిదిగా మిథ్యాయెను మధ్యలో.

తత్త్వము సత్యమైన నిత్యమగును లోకము
సచ్చిదానందములతొ సారహీన బ్రహ్మాండము
స్థూల సూక్ష్మరూపాలతో సూచితమౌ విశ్వము
నిత్యసత్య నిర్గుణముల స్వర్గవర్గ పరిమాణము.

తనను తాను మార్చుకొన్న తపనగల్గు పదార్థము
తనలో తానున్నానని తరియించుట యధార్థమే
దర్శనాల మర్శనలో దారివెతికె మానవుడు
వెదకుదారి వెతల బడగ సతమతమౌ నరుడు.

ద్వంద్వాలకు అతీతుడై వందితుడగు జనుడు
త్యాగయోగ తెరువులో తేలియాడి వరుడు
అరివర్గము అపవర్గము అంతరముల తెలియగా
హరివర్గము అందమని అనెడివాడే ఆస్తికుడు.

శోధన బోధన శోభించిన శోకములు
సాధన ఆరాధనలలో సంగమించు శోభలు
కలకాలం కలలకాలమై కలిమిలేములను కలిపేస్తుంది
కలికాలం కలలకందనిది కారుచీకటిని కామిస్తుంది.

చలనచిత్తం చపలచిత్తం శోకావృత్త వృత్తం
కదిలినా మెదిలినా వదలని తేజం అనంతవిశ్వం

అందుకోలేని సూర్యునికి ఆదిచైతన్యమనే పేరు
అందినంతవరకు అదినాసొత్తనుకొనే అనాదినరుడు.

వర్తులాకారానికి వాస్తవికత నేర్పిన వరుడు మానవుడు
తలవంచితే తరిగిపోతాననే తలపుతో వానరుడు
నాదం వేదమై వాదమైనినాదమై ఆదమరపుతో అంతం
మరపు వరపు లేనిదై మైమరపుతో మానవాళికి ప్రళయం.

64

భామా భామా బంగారుబొమ్మ
రామా రామా రంభవు సుమ్మ
బ్రహ్మకు ఏ రిమ్మతెగులు రేగిందోకాని
గుమ్మను సృజియించుటలో గమ్మత్తే చేసెను.

మత్తులోన ముంచేటి మత్తకాశినీ
చిత్తమంత చిత్తాయెను చిరునవ్వుల జల్లుకు
చిరునగవులు సిరులు కురిసె శీతలస్పర్శతో
మంచుమరిగె మగతలో మరుసంగరశ్వాసతో.

ఆలింగన ఘనములో అలరించెను మనము
అంగాంగము అఘరహితము అమరమైన ఆరతిలో
తడియారని తపనలో వడిమీరెను వయసు
తడబడు తనువుతో తరియించెను మనసు.

పొంగే హృదయానికి పొందు దొరికెను
నింగే నియమంగా నిధులు విధులు విరిసెను
అరవిరిసిన విరబూసిన అందానికి చందనం
కలవరించు కలికికీ కలరవమే కమ్మదనం.

అంగనలో అంగారం కరగించిన బంగారం
చెలిచెక్కిలి గిలిగిలిలో పొక్కిలి కర్మాగారం
ఇంతి ఇంద్రియాలలో ఇంపుసొంపు గిలిగింతలు
బంతి చామంతిలో భామ భంగిమల తంతులు.

మనసు నసిగి మమత మతిని చితిని విసరివేసెను
చెడిన మతికి విడిన తనువు విలువ వలువ కట్టెను
నీతినేతిబీరగా నెలత నెనసరు వీడెను
నీరుగారి ఆరిపోయి అతురతలు హెచ్చెను.

అనుకంపకు కంపరమై అంపకాలు ఆరంభము
అనుమానము విమానమై ఆకసాని కధిరోహము
ఆలుమగల మగతలో నెగతమెంతో ఘనము
ఆమని 'జగమనీ'లోనె ఆ మమతల విలీనము.

వాయులీనమైన వలపు తలపులతో తరించునా
కాగితాల కితవులతో తగవుల తమి తీరెనా
కతలమారి వెతలపోరి కాలానికి కలిమి కలిగె
మతులు మార్చి గతులు వెదకి గమ్యము అవగమ్యమయె.

అప్సరసల సరసతకే అహర్నిశలు ఆరాటము
నీటిబిందు నిగమనమే నిందలతో ఝంఝూటము
బంగారం భంగమైనదీ రంభరహిని పండించిందీ
అలౌకికము లౌకికమైనది లోకం లోలత్వంలో లోభించింది.

65

ఇసకేస్తే రాలకుండ మసకేసెను భారతం
ఇకనైనా తెలుసుకొంటె హితమగును నిరంతరం
కుటుంబాలు కుంటువడుచు – కూలుచుండె ఆరోగ్యం
అవసరాలు అవనతమై – అంధకార మలుముకొనెను.

నీరునారు పోయగానె – నింగికెగిరె నియమములు
కడుపు పంట కలవరమై – కలియుగమే కమిలిపోయె

పరిమితమే అమితమయి – పరిపాలన ఫలంలేదు
మితియే మన మతమనుకొని – మనమంతా సాగవలెను
అమాయకత ఆస్తికతా – అతలాకుతలముచేసెను
జనంపెరిగి జవం తరిగి – జాతి నూతిలోన బడియె.

బిడ్డతల్లి ఆరోగ్యము – భీరువయి బరువాయెను
మాతాశిశు సంరక్షణ – మగతలోన బడిపోయెను
తండ్రితపన తరిగిపోయె – బాధ్యత బరువై పోయెను
గాలికొదలి గరువమెంచ – గాడిదప్పె పాడివదలి.

విశ్వం నరసంకులమై – వశం దప్పి వాసి వెడలె
కాలుష్యం కలియుగమును – కబళించగ సిద్ధమాయె
పట్టణాలు పల్లెలన్ని – ప్రజలతోడ ప్రగతి వీడె
స్థలం లేక సతమతమై – వలసలు వరుసగమారె.

నిత్యం అవసరములన్ని – తీరుబాటు తిమిరమాయె
కూడుగుడ్డ గూడు కూడ – అందించుట కష్టమాయె
జనసాంద్రత మితిమీరగ – జయమేమో అపజయమే
పరస్పరం ఆహరణము – ప్రతినిత్యము కనుపించును.

మానవాళి సుఖముకోరి – మనమంతా యత్నించగ
జాతిభవిత భాతినొంద – మితసంతానము మార్గము
తెలియని రోగాలతో – తెలివిలేని జనులందరు
మారణమున బడుచుందురు – మితిసంతే మందగును.

పరిసరాల పరిశుభ్రము – ఆరోగ్యపు హేతువగును
అధిక జనుల ఆవాసము – అనారోగ్య ఆకరము
మానవ వనరులన్నిటి – మనమంతా గ్రహియించి
సరియగు వినియోగమున – సాగవలయు జనుల తీరు.

కడుపుమంట కడుపుకోత – కథలెన్నో విశ్వమందు
కడుపుచల్లగదలకుండ – కలిమిగొనుడు జనులారా
పరిశోధన లెన్నొ జరిగె – ప్రజల సంఖ్య మితిమీరెను
ఫలితము గమనించగాను – జనాధిక్య జగతియేగ.

వర్షములే లేకపోయె – త్రాగునీరు కరవాయె
అన్నీ కరవులకు నెలవు – అధికమౌ్మె సంతానము.

కామినీ కాంచనాల – కారడవుల బడిపోకు
కామితార్థదాయియైన – కాళికనే కలవరించు
భగవంతుని ధ్యాసతో – ధ్యానించుము స్మరియించుము
భవసాగర తరణమున – బాసటయని నమ్ముము.

నిత్యమైన సత్యమైన – నిధియే ఆ జగజ్జనని
ఇహలోక సౌఖ్యములను – ఇతోధికము అందించును
దైవదర్శనమునందే – దైహిక దైనికములుండు
తథ్యమిథ్య విచారమే – తరియింపుకు వరమగు.

వేకువతో లోకములను – వెలిగించే వేల్పునకు
కాఁకతోడి గుణముండుట – కారుణ్యమ? కార్పణ్యమ?
అణగియున్న మృత్తికయే – అండాండము పిండాండము
మృత్తిక వృత్తులు మారగ – చిత్తములే చిదంశాలు.

శాపమైన శాస్త్రానికి – శక్తియే మూడింతలు
శాంకరమౌ శాస్త్రానికి – శక్తి చూడ బ్రహ్మాండము
కోటిజన్మలెత్తినా – కోమలమే యీ జన్మ
(కోరికలతో) కోపంతో మలమైనది – త్యాగంతో అమలమైనది.

కోమలతకు ముడిపదార్థము – కోరికయై ఉంటుందా
మాంసదేహి మానవతకది – మలినత్వం పులిమేస్తుందా?
అందమనే పద నిర్వచనం – లేనిదైన వచనమెకాదా
వచనానికి వస్తురూపమే – అందమన్న అసత్యమ్ముగా.

ప్రదేశాల పారమార్థికం – పదార్థాల అర్థసార్థకం
పాలునీళ్ళ పావనతత్త్వం – పంకేరుహమను ప్రపంచతత్త్వం
నాదం నవజీవన వేదం – నరవరమౌనవ్య నినాదం
జనజయమౌ జాగృత గీతం – విశ్వాసులకే విజయ యోగమది.

జనజడములకూ జయసంకేతం – అనుసంధానపు ఆరవరాగం
మనసంబంధుల మహిమపరాగం – మాన్యయోగులకు మహిమాదేశం
చెల్లినకాలం చెలిమిని పెంచగ – మళ్ళిన వయసే మనసును పెంచగ
జరరుజదేహం జాగృతి వీడగ – జనన జాతులకు మతిగతి దప్పును.

వినయం విలువలవలువగు – విశ్వాసం విబుధుల శ్వాసగు
వివేకమే విజయుల వేకువగు – విజయం జనజీవన వెలుగగు
నిత్యం నిగమ రహస్యంబైనది – సత్యం సతతానికి వర్తులమైనది
నిరవద్యం అవధికి ఆమడ ఉన్నది – శివసుందరములు వసుంధర అందములు.

ధైర్యం దారిని వెలిగించేది – స్థైర్యం ఆత్మను స్థాపించేది
సాహసమే సమవాదపు హాసము – మానవ స్పర్థల మధూదయానికి మందారం.
ప్రకృతి వంచన కాంచనానికి – మినుకుల జీవన కామినికీ
మానవాళియే లోనైపోయిన – మనుగడమిగులదు కడకాలమ్మే.

67

ఆగ్రాశిఖరాగ్రం వ్యగ్రమై ఉగ్రవాదానికి ఊతమిచ్చిందా
ఆర్మీజనరల్ అంతరంగ అభిభాషణ చింతను మిగిల్చిందా
అందమైన ప్రేమమందిరం మందగించిన చూపుతో మసిబారిందా
ఆర్భాటం ఆరంభంలోనే హంసపాదై హింసకు హితమయ్యిందా.

భారతరాజకీయ వేదాంతికి భంగపాటు భాగ్యమౌతుందా
మతపెద్దల ఆశీస్సులు మతిచెడగొట్టగా మారాంతో మొరాయంచారా
పుట్టిపెరిగిన గడ్డపైన పురానాహవేలి అందం రాసిన సున్నంతో సున్నాగా మిగిలిందా
మంత్రించిన గంగాజలంతో పవిత్రులైన మంత్రుల మంత్రాంగం మరిగిపోయిందా.

ఫతేపూర్ సిక్రీ పాకిస్తానీ ఫత్వాతో ఎఱుపెక్కిన రక్తంగా ఎఱుక కలిగించిందా
ఒడంబడిక ఓడిపోయి ఆడలేక మద్దెల ఓడంటున్న అధికార పదవీ బధిరులు
ఎగిరిన శాంతికపోతాలు ఎటుపోయాయో – దేనిగూటికదే చేరుకొన్నాయి
సంసారబాంధవ్యం సన్యాసి సర్వసంగపరిత్యాగం యోగంలో రోదించాయి.

కుటిలమైన కుంపటిలో కుదరని పక్వపాత్రలో అన్నం సిద్ధమౌతుందా
అందంచూచి ఆనందం అవధులు దాటిన పతీసతుల పంతం నెరవేరిందా
మహాత్ముని సమాధి ముషరాఫ్ స్పర్శతో మలినమూ పులినమైనదా?
శాంతి సారధికి సమ సమాజవారధికి నీరాజనమైన గులాబులు గాయం చేశాయా?

బస్సు దౌత్యం తుస్సుమని బాంధవ్యం అంధమయి తూర్పుకు తిరగాల్సిన స్థితి
రగిలిన కార్గిల్ కార్చిచ్చు అగ్నిహోత్రులు రారమ్మని కత్తులు దూశారా?

తప్పును తప్పంటే తప్పయిన ప్రజాస్వామ్య రాజకీయుల తంత్రం ఫలరహితం
సరిహద్దులు పెట్టుకొని చెరిపేసే చేదు అనుభవాలు భారతీయులకెన్నో.

పరిహసించిన పాలరాతి అందం పురాతనత్వంతో పునీతమైంది
కర్మభూమిలో కదనభూమికాలిడి మానవీయతను మరుగుపరచింది
దిగాలుపడిన కాశ్మీరు దిటవును సంతరించుకొని దివ్యశాంతిధామం కావాలి
ఆహార విహారాల అననుకూల్యత అనుబంధాలను అమరం చేస్తుందా.

వివాదాలే విజయంగా భావించే వినూత్న అధినాయక శిఖరాగ్రం
సీమాంతర ఉగ్రవాద ఛీత్కరింపు చేదుఅనుభవంగా మారిన తరుణం
దురాక్రమణకు దారులు వెదికే దురితమైన తలంపు జనావళికి తలవంపు
అధినాయకుల అంగీకారానికి అడ్డుపుల్లలు వేసే పుల్లవిరుపు మాటల పునీతులు.

మతం హితానికీ హతానికీ అంగీకరిస్తే హీనుడు హతానికి తల ఒగ్గుతాడు
ఆసక్తితో వీక్షించిన ఆగ్రా శిఖరం ముస్లింశైలిలో మూగసాక్షిగానిలిచింది
తాజ్‌మహల్ రూపించిన ప్రణయమైతే ఆగ్రా చర్చలు ప్రళయం సృష్టించొచ్చా
రాజకుటుంబీకుల రసవత్ప్రణయం ప్రజాస్వామ్య భారతికి ప్రళయమైంది.

ఛాందసుల ఛందోగమనం మూఢులమనోవైనం గతితప్పి జనమతి పోగొట్టాయి
ఆకలితో అలమటించే ఉపఖండంలోని నిర్భాగ్యులకు నిండు అమావాస్యే ఈరోజు
కర్మవాదికీ కసాయి వానికీ కరచాలనం ఖడ్గచాలనంగామారిన వైనం
వల్లించే శాంతి వాక్యాలకూ ఒరనుండి కత్తులదూతకు సుతికుదురుతుందా?

68

ఛంబల్ రాణి – చైతన్య వాణి
దళితుల వేణి – పూలన్ దేవి
అహంకార మదమత్తుల – ఆగ్రహ జ్వాలల్లోనా
మానం అవమానమైన బానిస బతుకుల్లోనా
వెతల జీవితాలలో వెలుగులు పండించితివా
పతిత బతుకు పరమమైన నిదర్శనం యిదేగా
తుపాకీని చేతబట్టి – సమానతకు దారిచూపి
ముందు నీవు నడచినావు– అందరికీ దిక్కైతివి

పేదవారి సేదదీర్చి – ఆకలికీ అన్నమొసగి
దళితజనుల ధైర్యముతో – ధర్మ పీఠమెక్కితివిగ
కాసులు కామందులు – కామినులకు కర్కశులై
కఠోరముగ బాధించగ – బాసటైన భామవీవు
వగలో మగతనం కలిగి – కామాంధుల గర్వమణచి
కారుణ్యపు కామినివై – కలియుగమున నిలచితివి
అరణ్యమే అసలు విడిది – బందిఖాన వందితమ్ము
జనారణ్య జంతువృత్తి – అణచినట్టి అతివవీవు
సమానతే చనిపోగా – వివక్షతే వివృతమై
బానిసలే బావురనగ – భారతమే బందిఖాన.

బందిపోటు రాణివిగా – వందితమే నీ బతుకు
ప్రజాస్వామ్య సమాజాన – ప్రభవించెను ప్రభుతలో
రక్షలేని బహుజనులకు – రక్షణగా నీవుంటివి
మీర్జాపూర్ మినుకుగా – మింటిలోని కెక్కుదువు.

కంటికి కన్నుగా – కలియుగాన ఆశయము
పేదజనుల ఆశీస్సే – పేరుపొంది సఫలమాయె
నిరాశలో జీవితాలు – నీరుగారిపోకుండగ
నింగినేల ఒకటిగా – బాసటగా నిలిచినావు.

యవ్వనమే వనమైనా – మానము భంగమ్మైనా
ప్రతీకార వ్రతముతో – ఫలమందిన జాణవీవు
పుణ్యముతో పునర్జన్మ – ధన్యతతో ధర్మపదవి
దీనజనుల దివిటీవై – దివములోన దిధీతివె.

69

తిరుమల తియ్యదనం – తీర్థంలో వున్నది
తీరైన వెంకన్నయె – పరమార్థపు పెన్నిధి
కొండ బండపైన నెలవు – కోరికలకు బలువు
నిండైన నిధులకొరకు నిత్యము జనవలపు.

భాగ్యయుతంబ్రహ్మాండము – యోగ్యమైన అండాండము
అద్భుతమే ఆలయం – ఆనందము అమేయం
అలమేలు పకృతిలో – మేలుకొలుపు ఆకృతిగా
పద్మానన ప్రవృత్తిలో – ప్రపంచమే ప్రాభవము.

చిరుజల్లుల శీకరాల – విరుల తరుల శార్ద్వలము
పారవశ్య పావనతలు – వనపవనపు స్పర్శలు
కలియుగ వైకుంఠములో – కల'రవ'ముల కమ్మదనం
అవనిలోని సౌందర్యములో – అంతర్యము ఆ అంతర్యామి.

అన్నమయ్య పదములోని – అదనుపదను అమరమై
జనవరమై జయజగమై – జతులు గతులు మారెనుగా
అతివల సుందరస్వప్నం – అహరహముల మహనీయం
ఆత్మీయుల బంధమైన – సప్తగిరే ఆప్తగిరి.

శ్రావణమేఘాల వరుస – శాశ్వతమై శార్వరియై
చల్లదనం చిలుకరింత – గిలిగింతల పులకింత
ప్రకృతికాంత ఒడిలోన – సుకృతులంత పరుండగా
ఆకృతులే అందాలై – అందని అనుభూతిపండు.

యవ్వనమే ఆవనిలో – జవ్వని నవ్వాయెను
ఆవనియే ఆమనిగా – అవతరించె అతివమతిని
పుడమిలోని పూజ్యతయే – పువ్వులుగా ప్లవించెను
పుణ్యం పురుషార్థములే – ధన్యమాయె మన్యములో.

పరమార్థము పరార్థమై – వరించేనా పృథివిని
శ్రీనివాసనివాసమై – సిరిచేడియ మురిసెను
అందాలే అనుబంధాలై – సంధించెను సరసాలు
నవరసాల నర్తనలో – రాసిక్యము రసించెను.

రచనలోని రసికతలే – రమించగా శయించెను
ఆకాశం అవనతమై – అధరచుంబనము చేసెను
మనసు మధురమగునుగా – మాధవు భువి దర్శనమున
భువన భాండ భాగ్యమంత – భామల వలపున నిండెను.

మాయలోని మాధుర్యం – మానవతకు నవతగా
లేని విభుడు కలడనీ – కామినులకు తెలిసెను
కైలాసం వైకుంఠం – వైభవమై అనుభవమై
భవతాపవారణమై – అరణముగా అవనికందె.

70

బానిస భావాలకూ – భరతం పట్టేద్దాము
స్వాతంత్ర్యపు బతుకులకు – స్వాగతం చెబుదాము
దోపిడీకి దోహదమై – ద్రోహం చేసేటివాళ్ళు
దొరతనంపు దోబూచులు – దొంగాటలు ఆడువాళ్లు.

కర్మభూమి మర్మములను – కలరవముగ మార్చినోళ్ళు
కులమతాల కుంటప్లను – రగిలించిన దొరలోళ్ళు
సహించింది సహనమే – వహించింది వహనమే
సహనం హననం కాగా – సాహసమే హసించెగా.

ఉద్యమాల మాలలూ – విప్లవాల ప్లవములూ
ఉల్లంఘన లంఘనలూ – ఊరూరున ఉరవడులూ
మూఢత్వం మాడిపోయి – ముందడుగే మురిపెమై
కులమతాలు కూలిపోయి – కూడెను కూటములుగా.

అమాయకతమాయమై – అధికారం ధిక్కరించె
ఆంగ్లేయము హేయమై – ఆక్రందన అతిశయించె
భారత జాతీయతయే – పారద్రోలె పరజాతిని
పోర్‌బందర్ పోరగాడు – కొల్లాయితొ కోమటీడు.

సమానతకు సామాన్యుడు – సాగించెను సవనము
అహింసయే ఆయుధము – జాతి ఆత్మధైర్యము
ఐక్యతయే అమరము – అందునదే ఆనందము
సంస్కారం సారంగా – వినయమే విభూతిగా
చేతికఱ్ఱ చేతంగా – నడతయే నాణ్యతగా
నూలు తీత నూతనమై – స్వరాజ్యమే శోభనమై
జనులకు తలమానికమై – జయశీలుడు గాంధివచ్చె.

నినాదమే స్వదేశిగా – మరవస్తు నిరాసనమై
శాసనోల్లంఘనమే – శాపముగా చరియించగ
సత్యాగ్రహసాధనమున – సాగెను ఆసమరమంత
దమనకాండ దారిదప్పె – జైళ్ళునిండె ఎల్లెడలా.

జాతివేరు భాషవేరు – భారతమున భాగ్యయుతులు
మరణించుట జీవించుట – మార్గమేదొ తెలిసికొనిరి
త్యజించిరి తెగబడిరి – తెగువమీరి తెరలిరంత
క్విట్టిండియ కట్టడియై – నినాదమే నిగమమాయె.

త్యాగంతో యోగులైరి – పోరాటపు ధీరులైరి
శోధనతో శోభించిరి – బోధనతో మోదించిరి
హింసాహింసలు హితమై – నాయకులై నావికులై
నవ్యభారతమ్ములోన – నరులకు వరముల నిచ్చిరి.

71

మమతల మాగాణము – సమతల సారంగము
మహిమల హిమపర్వతము – మానవతకు మధుపము
మతహితముల మాణిక్యము – మరుమల్లెల సుమహారము
కులము కలిమి కమనీయము – కుధరమందు మధురము.

సహనము మన సంపదగా – సాగును సమరసరథము
అవమానము అవధిమీద – ఆరంభము మథనము
అహింస హంస ఆశయము – అహంబ్రహ్మ ఆధ్యాత్మము
వేదశాస్త్ర వెలుగుమయము – వెతల కతల మతహితము.

సార్థక తీర్థముల గణము – జనగణ సవనముల జయము
వీరధీరశూర గరిమ – విబుధ బుధుల వినయ మహిమ
భరతభాగ్యయోగ్య చరిత – భవలోక విభూతి గరిత
అరుణకరుణ కమల కవిత – అజరామర రాగభరిత.

సంద్రమలల సగుణ సహిత – భౌగోళిక భాగ్య మహిత

సంస్కృతికే సంపన్నత – ఆచరణకు అనుగుణ్యత
వైవిధ్యపు విభవ భరిత – వేదాంతపు వేల్పుచలిత
విశ్వాసము వశ్యమైన – వరజాతికి వాసికలిగె.

నిష్కామ కర్మ విధము – నిధిగ నిలచె భరతజాతి
భారత రామాయణముల – భావనయే భాగ్యమగును
మహాకవుల మహిత కృతులు – మనమనసుల దర్పణములు
ఆనందము బ్రహ్మయనీ – ఆదిఋషుల అభిభాషణ.

బ్రహ్మము పరమాత్మయనీ – దార్శనికుల దర్శనము
సృజనకు జనమోదములే – సత్యశివము సుందరములు
నరవర సంన్నతలే – నవ్యజగతి దివ్య శృతులు
మట్టియందు మరకతాలు – మానవతా పర్వతాలు.

కర్మజ్ఞాన కలిమి యుతులు – పరమాత్ముని వరములు
మనసునెరిగి మసలువారు – మానధనపు మానవులు
వివక్షతలు లేనివారు – ఆశయాల అక్షరులు
భాగ్యసీమ భారతాన్ని – బావురుమననీయవలదు.

యోగ్యజనుల యోజనలను – త్యాజ్యము చేయంగవలదు
మనభావం మరలిపోయి – మాతమ్రాన్పడుచునుండె
నీనాభావములు మాని – నిజజననికి నిధివగుము
దేశభక్తి దేవురింత – దేహాలకు మేలుకాదు.

జాతిరక్తి జవమువీడ – జనులకు జయమేమికాదు
స్వార్థం అర్థంగా – స్వాగతించు స్వారాజ్యం
పరార్థమే పరమార్థము – పరవశించు మనరాజ్యం.

72

కష్టము యిష్టమయి అష్టమిలో జనియించిన
అందని అందాల కృష్ణుడందరికీ వందనీయుడే
దేవకీ వసుదేవుల దేహములో దేవుడై
యశోదమ్మ నందులకు యశమును కలిగించెను.

అవతారము అవనికీ ఆనందము కలిగించెను
చిన్నతనం చిలిపితనం బులిపించెను బుధులను
మన్నుతిన్న చిన్నోడే మన్ననలను పొందెను
వెన్నతిని వ్రేతలనూ వెతల వేధించెను.

రోదనవిడి రోళ్ళన్నిటిని – లాగెను లక్షణముగా
మమకారము మహనీయము – మాత మహిమ మాధుర్యము
కంసుని హింసనూ – కఠినముగా అణచెను
చంపదలచు సరళిలో – సాహసమున తప్పుకొనెను.

చిన్నతనం చెన్నుమించె – విన్నదనం విలువ పంచె
ఆలమంద అతని సొత్తు – ఆనందం వాటిసొత్తు
గోపాలుడే గోవిందుడు – గోపబాలకృష్ణుడు
మహిళామానస చోరుడు – మహనీయుడు మహిముడు.

యోగమాయ యోజనమున – యోధుల హింసలు తొలగి
మాధవునిగ మధుధవుడై – మానవాళి దేవుడాయె
కాళియమర్ధనమున – కామితముల తీర్చెను
పూతనా హరణముతో – పుణ్యములను పంచెను.

వేణునాద పింఛములు – వెలుగుల విభవములు
నల్లని నవ వర్ణముతో – చల్లనిదయపంచెను
మునిగణముల మురిపెము – నరనారీ వరణీయము
మోహన మాధురిలో – కరిగించుట కమనీయము.

తృష్ణదీర్చు కృష్ణుడే – యదువంశపు మధువే
ఇంద్రియముల పాలకుడే – హితమతమున సారధుడే
గీతలోని పరమాత్ముడే – గోవర్ధనగిరి ధారుడు
గోపికలకు పికమాతడు – మధుసూదను గన్న తండ్రి.

మాధవుడే జనధవుడు – దేవాళికి దేవుడతడు
కోరిన కోరికలిచ్చును – కోపతాపముల దూరము
ఆది అంతములు లేవట – అన్నింటా అమరుడట
మనిషిలోని నిషాలన్ని – నిశీధిలో వెలుగువలెను.

నిగమ గమన సుగమములో – సుందరముగ తీర్చెటోడు
మనిషితనం మనవలెనని – మమత సమత మతమనువిధి
మనమంతా నమ్ముకొనుచు – మాధవునే ప్రార్థిద్దాం.

73

దేవుని రక్షణలో దేహులంత నివసింతురు
మానవ మమతలలో మాధుర్యము పండింతులు
ప్రేమల ప్రేరణతో పేద పెద్ద వసియింతురు
రక్షణ రాజ్యములో రమణీయము జీవనము.

అమ్మనాన్న అనురాగము – అక్కచెల్లి అనుబంధము
అన్నదమ్ములభిమానము – అవనిలోని సంబంధము
రక్షాబంధనము – రక్షకు బంధనము
ప్రేమకు తలమానికము – భాతృత్వపు భాగ్యము.

సోదరీ సోదరులకు శోభకొరకు సోపానము
అభయదాన చిహ్నము – ఆనందపు నందనము
బాధలు భయములూ – భావనలో బంధములు
రక్షాబంధనమున – రమణీయపు అనుభవాలు.

ఆడది ఆడదంటూ – అంటుండగ అవమానము
ఆడది అందరిదను – అనుభావమె సుందరము
అన్యోన్యము ధన్యమౌను – అనుబంధము మాన్యమౌను
స్త్రీపురుషుల చైతన్యము – పరమార్థము పావనము.

వనిత వలపు వసుంధరకు – వాసినిచ్చు ఖ్యాతి నొసగు
పురుషు తలపు పుణ్యమయము – పూజితమ్ము పునీతలకు
మగువ మనసు మధుర మయము – మగని గుండె మమతలగని
మగువ మగల సమాగమము – రక్షాబంధన గమనము.

సృష్టికి పుష్టిని కూర్చెడి – సుందరతలె బంధనములు
మృష్ట జీవనమున కిచట – ముద్దుగొలుపు నీదినము
సంస్కృతిలో సంయమనము – సరసతలో రాసిక్యము
సంప్రదాయ ప్రధానము – సహనమగువ సంబంధము.

ఐకమత్య మనురాగము – అంతరముల విదూరణము
సమానతకు ప్రమాణము – సామరస్య సాధనము
అన్నలేని అక్కలకూ – అక్కలేని తమ్ములకూ
అవకాశం అనుబంధం – అమరిన రక్షాబంధన.

శాంతి సౌభాగ్యములకు – కాంతి కమనీయతలకు
కలిమిలేమి కలిసిపోయి – కనబడు నీ బంధమందు
వర్గలింగబేధములకు – దేశ దేహ వేషములకు
తావులేని తారుణ్యమె – తనువుల రక్షాబంధనము.

బహుమానము భాగ్యమగును – భ్రాతృభావ ముద్యమించు
కలియుగాన కలిసిమెలసి – బతికిన కమనీయము
ప్రకృతి పురుషుల కలయికలో – సుకృత జీవన సరళికి
సుందర రక్షాబంధన – అందరికీ ఆనందము.

74

ఆగష్టు పదిహేను స్వాతంత్ర్య దినము
ఆదర్శ భావాల అనుతాపదినము
అభివృద్ధి వృద్ధమై – అవతరించే దినము
అవనిలో భారతికి వనవాస దినము.

జనస్వామ్య జాగృతికి వికృతి యీ దినము
పదవిలో పదనిసల విస్వనమె యీ దినము
అజ్ఞతకు మూఢతకు అందలమె యీదినము
విద్యలకు విలువలకు విధ్వంస మీ దినము.

వీరులా త్యాగాల విలువ తెలియని దినము
ధర్మకర్మల మర్మమంతా మాసిన దినము
నీతినియమాలకు నింగి చూపెడి దినము
జాతీయ భావనకు గోయితీసెడి దినము.

కుంభకోణాలకు కుదురైనదీ దినము
ఆక్రమణ విక్రముల ఆదరించెడి దినము

రాజకీయపు రాజు రచ్చకెక్కిన దినము
కొనుగోలు అమ్మకాల కొలతల దినము.

లంచగొండ్లు లాభమొందు లావణ్యపు దినము
వంచన పంచన నిలచిన భరత జాతి దినము
విశ్వసంత వింతగా వంతపాట యీ దినము
అంతరాలు పెరిగిపోయి అలమటించుయీ దినము.

ఎన్నిక మన్నిక కరవై ఎటుపోవును యీ దినము
వయసురాని వయసుమీరు ఓటరులది యీ దినము
పంచాయతి పాలనకు పంచామృత మీ దినము
కలబోతల వడపోతల కలకులముల పార్టీలది యీ దినము.

పాతరోత పావనమై పలవరించు యీదినము
కొత్తవింత పుంతలతో పూజ్యమైనదీ దినము
అంగడిలో వింగడించి అమ్మకమునకీ దినము
అప్పులతో తిప్పలతో మొప్పులతో యీ దినము.

నరమేధము నాణ్యమైన నాయకులదె యీ దినము
మతం కులం మాన్యమైన ప్రభువులదే యీ దినము
ప్రమాణాల ప్రమాదాల ప్రాభవవైభవ మీ దినము
త్రికరణాల తీరువేరు తిరునామమె యీ దినము.

సహనం శృతిమించనీకు – సవనం నవ విప్లవమే
ఆవేశం, ఆక్రోశం, ఆక్రందన – అన్నీ నవ ఉద్యమాలె
అవసరాలె అవధిగా – అనుగమించు అవనిలో
స్వాతంత్ర్యం తంత్రమైన – తాంత్రికుడవు నీవేగా.

75

ఆది అంతములు అసలు తెలియదు
మధ్య మిథ్యలో మానవ గమనము
రాకపోకల రాజ్యమిదిరా – రాజునీవని భ్రమించకురా
పురాతనమై సనాతనమై – పూజ్యమైనా త్యాజ్యమేరా.

ఆనవాలే తెలియదు – ఆవేదనలకు అందదు
గాలి ఉన్నతోలుతిత్తి – గాలిపోతే కాలమిత్తి
పరువు బరువు ప్రాభవమ్ము – ఫలము కలుగ పరవశమ్ము
ఇంద్రియములకు అందమైనా – ఇహము పరము దుఃఖమయము.

కట్టె మిగులగ కాలధర్మము – కదలుతుంటే కామ్యకర్మము
అహములోభము అమర సారము – కానరానిది మాంసలేశము
పుట్టిగిట్టుట గిట్టిపుట్టుట – గీత గీతిగ తెలిజేయును
నామరూపము కాలకలిమిగ – నాశనమ్మగు నమ్మకమ్ముగ.

చీకుచింతల చీదరింపులు – చేతనమ్మున చెలిమి మించును
మరణరణమున ఓడిపోయిన – మానవాళికి మనికి లేదుగ
మృత్యుదేవత క్రీడయందున – సత్యధర్మము సారహీనమె
చిటికెలోనన గుటకబడదుగ – కటికి వాడుగ కాలయముడు.

జీవనాటక రంగమందున – భంగమగునుగ భవపు జీవులు
చేసి మరచిన మరచి చేసిన – చేతలన్నియు చితినిబడునుగ
కర్మధర్మము కలికి మర్మము – మరణము ములికిగ నాటుకొనునుగ
రాజుపేదల రభస లెన్నో – చావు సరసన సహగమనమే.

మేధ తెలియని మెరుపువంటిది – వేద్యరహితము వేదనలనిధి
పోగుపడిన ధనరాసులు – పోరాడవు మృత్యువుతో
చెంతనున్న సంబంధులు – సుంతయైన ఆపలేరు
ఆలోచన లోచనాలు – కనురెప్పల కనువిప్పులు.

వినుకలి విపరీతాలు – రసనలన్ని రసహీనము
స్పర్శలోన స్పృహలేదు – విచక్షణకు వీలులేదు
మనసు మహిమ ఊసు లేదు – ఆత్మహితము గతము సతము
తెలిసిన జీవతరంగం – తెలియని జనాంతరంగం.

మానవ జీవన పతంగం – ఎగిరిపడిన అంబుధి తరంగం
గువ్వ ఎగిరిపోయినా – గూడు పాడు పడుతున్నా
గవ్వకు కొరగాని జనుడు – గర్వపడుచు సాగుచుండె
అమరం ఆహ్వానం పలకాలని – నరకం తిరిగిపోవాలని.

బతికినోళ్ళు అనుకుంటే – చచ్చినోళ్ళు సాగేదెటకో
ఆశలు తీరినా ఆశయాలు శయనించినా
అందకుండా పోయిన ఆ ప్రాణానికి విలువ అంతమే.

76

వసంత సంతలో – సంతసం పండెనే
మధుమాసం మనసులో మధువులు నిండించెనే
ఆరుకాలాలలో ఆరుద్రే అందలం
ఆశయాల అందంలో అమరంజన మానసం.

శ్రావణమేఘం – చంపకసారం
చిగురులసిరులకు– చినుకుల శైత్యం
ఉద్భిజ్జ ఉరవడి – ఉర్వికి శార్వరి
అండజ జాగృతి – మావిజ సుకృతి.

పరవశ ప్రకృతి – పరమను వరమిది
నందనవనితో – బంధువె యీ భువి
కైలాసమునకు – కలాపమే యిది
వైకుంఠముతో – వాసిని గన్నది.

నరకరకానికి – వరమే యీ విధి
పంచభూతాలకూ – సంచామృతమే యిది
శ్రుతిలయలకు నిధి – శుభముల కంబోధి
వేదవేద్యముల – వేలుపె యీ కృతి.

కాలచక్రమున కలయే యీ వని
అద్వయితానికి మధ్యమిథ్యయిది
ద్వైతభావనకు దోహదమీ భువి
సాకారమునకు సాగరమే యిది.

నిర్గుణతలపుల నిధియే ఆమని
కవులకు కలిమిగ – జీవుల బలిమిగ
జన్మకు జయముగ – ధన్యతనిచ్చెగ
అనుభవ భవమున – ఆనందమహిమగ.

సర్వం మరపుగ – పర్వమె ఫలముగ
వర్ణించిన వల్లకాదు – వల్లించిన వశం కాదు
కల్లకాని కథకాదు – వల్లకాని వసుధకాదు
అనుభవించ భవం కాదు – పలికించగ పరంకాదు.

జీర్ణించగ జితం కాదు – జియ్యరుకే విదిత మది
తత్త్వంతో తరచగా – కురుచైనది కువలయం
శాస్త్రంతో ఛేదించగ – శ్రావణమే వ్రణమయం
ఆధ్యాత్మిక అనుభూతికి – ఆత్మీయమె వసంతం.

మానవతకు దానవతకు – మధ్య మహిమ మధుమాసం
విశ్వసంత వినువీధిన – విజయం జనవిఫణికే
వసంతాన వంతనిండె – వసుధలోన సుధలింకెను.

77

ఆటంకాలను అటకెక్కించే ఆదిశివుని తనయుడా
కొలిచిన భక్తులకోరిక తీర్చే వలపు కొంగు బంగారమా
పార్వతి తనయుని పర్వదివసమున ప్రార్థింపగ రారండండీ
పావన నాముని ఆమనిలోనా మనసా నమస్కరించగ వేరండీ.

ఆపదలోనా ఆశ్రయుడూ – ఆశీర్వాదమె ఆతని వాదము
పాడిపంటలకు ఆటపాటలకు – పాటవమొసగెడి పావనుడు
సిద్ధిబుద్ధులకు సింధువాతడు – సంతోషిమాకు సహజాతుండు
ఆలన పాలన లాలనలోనా – అందరి దేవుడు బాంధవుడాతడు.

వినయశీలమున విబుధుడు – విజయ మార్గమున పథికుడు
విద్యల విలువల వేద్యుడు సాధ్యుడు – పూజనీయుడు పుణ్యచరితుడు
ప్రకృతి కృతికే సుకృత రూపుడు – పరమార్థానికి రమ్యభావనుడు
వనతరుగుల్మపు వసుధ వాచ్యుడు – పత్రపుష్పముల పవిత్రుడాతడు.

పురాణ పుణ్యుడు పూజ్యపురుషుడు – మహనీయతకే మహితుడాతడు
మానవ గణముల గణ్యుడు ప్రథముడు – మహనీయతకే మహితుడాతడు
తరాలు తరలిన తరగని దీప్తుడు – వరాల వర్షము వరునకు వరము
మారిన కాలపు మారని దేవుడు – మార్పుకు తీర్పుకు మానస పుత్రుడు.

తరగని ప్రేమకు చెరగని చెలువుడు – దయాదయితుడు ధరణీవరణుడు
శంకర పుత్రుడు శాపవారకుడు – శాంతికారకుడు కాంతి కలితుడు
జ్ఞానకర్మలకు మూలకారణము – ఆరంభములకు ఆనందమయుడు
వికృతరూపము విజయసోపానము – సుకృత ప్రాకృత ఆకృతియుతుడు.

ఈశ్వరేశ్వరుని ఇంపగు తనయుడు – నశ్వరసృష్టికి నవ్యతనిడు వాడు
సంకల్పములకు కల్పలకమాతడు – సర్వార్థములకు సాగరమాతడు
పచ్చని వర్ణము మెచ్చును పర్ణము – లోకపావనికి లోకరక్షకుడు
విద్యారంభము అక్షర శిక్షయు – అక్షయమగునుగ నమశ్శివాయతో.

గణేశు గుణములు ఘనధనమ్ములు – జనగణమనముల జయకేతనములు
అమ్మలకాప్తుడు నాన్నల నిత్యుడు – సోదర సోదరి శోభల గాత్రుడు
నవనాగరకము రకములు మారగ – మారని మాయని మమత గణేశుడు
శ్మశానవాసికి శక్తియుతునికీ – వాగర్థములకు వాసిజ్ఞానముగ.

ప్రభవించిన జనప్రాభవయుతుడా – ప్రవచనములకు పరిరక్షకుడా
ఆస్తిక్య భావాలు అంతరించకుండ – ఆదర్శభావాలు దర్శనీయముకాగ
అవనియే వనిగాను అవతారమెత్తగా – ఆర్తులకు బాసటై అవని నిలువు స్వామి
సర్వము పర్వము పార్వతి తనయుడా – గర్వము ఖర్వము గజవక్త్ర రూపుడా.

ఊరువాడ నగరాలు ఉన్నత భక్తితో – పూజలు నవరాత్రుల పుణ్యము నందుగా
నిత్యసత్యరూపము నియమాల సారము – నిధుల విధుల విభవముల విజయము
నమస్కార వందనముల నవ్యత మీరగా – పురస్కార పుణ్యములే పూర్తిగ నిచ్చుగా
విఘ్నౌఘవారకా విశ్వం రక్షించు – జంతు వృత్తి నిరసించి మానవతను పెంచు.

78

గణముల నాయక – గజముఖ శేఖర – పార్వతి పుత్రుడ – పరమ పవిత్రుడ
అపర్ణనిర్మిత – ఆశుభదేహం – అందరికిష్టము – అందమె అమరము
కాలగమనమున కామితదాయిగ – కరుణకలితునిగ కాంతినిమ్మురా
నాయకత్వమున నవ్యుడవీవే – నరనారులకూ దివ్యుడవీవే
పరమశివునికీ వరపుత్రుడవుగ – వసుధవాసులకు సుధల పంచుముర
చతుర్థి అర్థము చతురతకాగా – భాద్రపదమున భద్రతనిమ్మర
తల్లిదండ్రులు మెచ్చిన తనయుడ – చల్లనిచూపులె సాహసమయములు

దీక్ష దక్షతల దిటవు రక్షణల - శిక్షల శివముల చిదానందుడవు
అమర సేనానికి అనుగుతమ్ముడవు - సవన సమరముల సాధుల పక్షివి
నందన వందన నమస్కారముల - నామరూపముల భక్తి భావముల
పూజల సేవల భజన భాగ్యముల - కర్మఫలములకు కారణమీవుగ
ధరణి ధర్మముల దారిగాచుచు - మానవమార్గము మహిమ జేయుచు
సమత మమతలకు సరళిని జూపుచు - సర్వజనులకు శుభముల గూర్చుము
తలచిన కొలిచిన తపనల దీర్తువు - మనుజుల మలతువు మనసులమార్తువు
మంచిని మించెడి వంచన త్రుంచెడి - వరసిద్ధివిగా జనబుద్ధుడివిగా
శైవవైష్ణవులు సేవింతురు నిను - ముగురు మూర్తులకు మూలతత్త్వమవు
మట్టికి మనిషికి మధ్యవర్తివిగ - మతముల హితముల సతతసారధివి
దేహుల దివ్యుల దేవాలయములు - దేదీప్యమునీ ధైర్యస్థైర్యములు
మహామూర్తుల మాన్యమూర్తివే - గణ్య గణపతీ ధన్యుడవీవే.

79

ఆదినుండి శనివరకు ఆనందవారములే
అందరికీ అభయమిచ్చు అవనిలోని వారములే
సూర్యునిపేరుతో శుభమైన వారమిది
సప్తవర్ణరస్మిలో గుప్తమైన కిరణమిది
ఆదివారమారంభము ఆధ్యాత్మిక అందము
చెలిమితోడి చైతన్యం కలిమికి నవకర్తవ్యం
సోముని శోభతో శుభకర వారమిది
చంద్రునికకాలంబన అంతరముల కాలోచన
మనసున మలినములను మరుగుపరచువారము
మానవాళి మహిమకు మనురీతికి ఆధారము
మంగళ వారమది మహిమల హిమవారము
వాఙ్మనసుల వాసికీ వాల్లభ్యపు వారమిది
మంగళములకంగము - శుభములకిది సుందరము
సిరుల విరుల సింగారము - వనితల తలపులవారము.

బుధుని నామము బుద్ధివివేకము
బద్ధమైన భావము భాగ్యమందు వారము

మూడవ వారమిది ముచ్చటౌ రోజు ఇది
వెలుగుల వెల్లువకు వెతలు తీరు వారము
గురువారము – గురువుల వారము
అంధకారనిరసనము – అరుణకిరణ రసమయము
'సాయి'కి పవిత్రము – సాధువులకు సత్సంగము
సమరసతలకు రసాతలము – సన్యాసము చరితము
వక్రతలకు వైముఖ్యము – శుక్రనామ వారము
శ్రావణ శార్వరులకు – శక్తిమయపువారము
లక్ష్మిపేరుతో లక్షణవారము – లక్ష్యముచేరగా సాక్ష్యమె వారము
ఆచార్యుడు గ్రహములతో – అమరమైనదీ వారము
చివరి వారము చింతనగలవారము
శనిశక్తికి నిలయము – శంకరునికె వలయము
చెడుకూ మంచికీ – చెంతనుండు వారము
ప్రబలమైన ఫలము – ప్రాకృతికము కర్మము
ఇంపైనది ఇంద్రధనుసు – ఇహపరాలె జనమనస్సు
సప్తస్వరపు నాదహితము – సప్తసంఖ్య దినగణనము
సప్తధాతు సమాశ్రయము – సప్తఋషుల సంబంధము
సప్తపదీ పథ గమనము – సప్తలోక సంచారము
సారవంతలోకానికి – సామరస్య జీవికకూ
సారహీనమానవులకు – సాపత్యం కరవాయెను.

80

కలలూ కల్లలూ కలియుగమున కలవరాలు
కలకలాల కామితాలు కలరవాల కర్మలు.
కంటికి కనబడని కారుచీకటిని కలిగిన
కలలవార్ధి అలలలో అవనికి మరకలు పడగా.
అనరాని మాటకే ఆలోచన అసలు లేక
అసత్యమై అపథ్యమై ఆవేదన వేధించెగ.
ప్రియమైన పిలుపులో పీడన మిళితమయి
గళితమయిన గరువమే ఫలియించెను కల్లగా.

హితమైన ఇంద్రియము ఇదియదియని తెలియక
సతమతమయి సరళివీడి సాగెను కలికలలుగా
భావములోనున్నది భాషలోనె భాగ్యయుతము
వివేచనకు విగతమైన విన్యాసమె ధన్యాస్యము
రానున్నది కానున్నది రాత్రివేళ రభసముగా
మనసునందు మహిహిమమై మరిగిపోవు పగటికీ
ఉన్నను లేకున్నను కన్నను కనకున్నను
మరచిపోవు మాటలో మనికి లేదు ఉనికిలేదు
ఆకలి ఏకలలోనైనా అపథ్యాన్ని అందుకోదు
ఏపని ఎదలో మెదిలిన ఎఱుకయె కలగనడమె
మలినభాష మనసు చెరచు మమత మతము మారిపోవు
తనువు తపన తీరిపోగ తరుణమొచ్చు కరణములకు
ఊహలోని ఉనికిలేని – ఉర్వి తీరె తీయనిదీ
కల్లవల్లకాని పనికి – కలిపురుషుడె యాజకుడు
కల్లకు కాలం వల్లకాడుగా – వల్లించెనుగా వసుధ సుధలను
మిథ్యాలోకపు మిహిరం స్వప్నం – వరియించెనుగా నరుల వాంఛ
అనుబంధాలకు అవాంతరమ్మే – అంతరాలకు ఆంతర్యమ్మే
కలిమిలేములకు కలకలమ్ముగా – లేవడి రూపాలు కలలుకల్లలు
చెదిరిన చేతన బెదిరిన భావము – చెలిమికి బలిమికి బంధుత్వమ్ము
కానిచేతలకు రానిమాటలకు – కమ్మని మానస కార్యము వర్యము
వింతసృష్టి విలువలో వలువయె జనజీవన జాగృతి
వంతపాట ఆటలో వాసియె మన మానస సుకృతి
అమరానికి దారులు వెదకుట – నాదానికి నాణ్యత కలుగుట
నయనం నవయానం కోరుట – వాక్యానికి వాదం వెలుగుట
వివేకమున విజయం కలుగుట – భాషే నవ భూషణమగుట
ఊహే ఉద్యమ సోపానము – ఉదధిని గమించ ఉరవడించు
కలల కాలమే కరిగిపోయెను – కల్లలకాలము విరిగిపోయెను
కామితమే నవమానవ వాదము – కారుణ్యమె జనజీవనినాదం.

నాగరకం గరికపోచను నమ్ముకొని అమ్ముకొంటున్నది
నవ్యసంస్కృతి కృతకమై మైదానాలను మైదాతో అంటిస్తున్నది
టూరిజం ఇజమై ఊరువాడల్లో ఉన్నవాని ఉనికిని ఊడబెరికింది
తీర్థయాత్రల తీరులో తియ్యదనం కరవై ఆరిపోయిన జీవితాలు
సంస్కృతీ పరిరక్షణలో అక్షయపాత్ర క్షయించి క్షామం ఆవరించింది
కో-ఆపరేషన్ కోవర్టు ఆపరేషన్లు మేధావుల మేనుల్ని బలిగొంటున్నాయి
అధికారానికి అటుప్లస్సూ ఇటు మైనస్సూ పడుతూ అంతుబట్టని లెక్కయింది
జాతిజనానికి జెండా గుర్తులు తెలపాల్సిన తెలివిమీరినతనం మనది
మేధోవలసకు మేజువాణీలుకట్టే మేలుకొల్పు నాయకులకు నమస్కారం
పందిళ్ళకింద పంచిపెట్టే ఫలహారంలా ప్రజాధనానికి పంపకాలు మొదలు
జన్మభూమిని తాకట్టు పెట్టే జాతినాయకుల అప్పుల ఆలోచనకభివందనం
జాతిభద్రతనే భద్రంగా శత్రువుల కందించే దేశభోక్తల భోగాల భాగోతం
మానవ బలహీనతలన్ని మనీగామార్చుకొనే మానవవ్యాపారుల మాధుర్యం
మాఫియాలు మంచి ఖాతాలు వెదుకుతూ మించితే మీదబడే విధానం
పంచభూతాలనమ్ముతూ పంచాంగప్రకారం పంచామృతం తాగుతున్నారు
శాస్త్రవేత్తల వేతృత్తం నేతల నేతృత్వంలో తృప్తిలేక తృష్ణగా మారుతున్నది
వ్యాధుల వ్యాఖ్యాతలు వ్యాక్సీన్‌ల సక్సెస్ కథల్ని వ్యథాభరితంగా విన్పిస్తున్నాయి
కన్నీరురాని కంప్యూటర్‌లో వాటిని వెదకే కామందుల మందభాగ్యం
యోగ్యం కానిదాన్ని యోగంగా అభివర్ణించే ప్రాణిక్‌హీలింగుల హీనత్వం
తప్పును కప్పిపుచ్చుకొనే తారుణ్యం తరతమాలతో తరలిపోయింది
అభాగ్యుల కందించే అన్నపూర్ణ అన్నం అవకాశవాదులకందుతున్నది
ఆపద్బంధు ఆపదలమయమై బంధుత్వాన్ని కోరి బరితెగించింది
బార్లాతెరిచిన బారులు బోర్లాపడిన జీవితాలకు బోరుకొట్టిస్తున్నాయి
నిధులు లేవని విధులు మరిచే విబుధుల జనస్వామ్యానికి వింత శోభనం
మూడుపువ్వులారుకాయల ముచ్చటలో మునిగిన ముద్దుల పాలకస్వాములు
ప్రమాణం, మానం లేని ప్రయాణంలో ప్రజాస్వామ్య వనిత పతితగా మారింది
ఎండిన ఏళ్ళు, ఇంకిన చెరువులు, నోళ్ళు తెరిచిన చేలు స్వర్ణాంధ్రకు సాక్ష్యం
బిల్‌గేట్ బిల్‌క్లింటన్ కావాలనే బిగ్‌మనుషుల భీకర పన్నాగం విదితమే
మనిషి మనిషిని నమ్మలేని నాగరక ప్రపంచంలో నాణ్యతకు గణ్యత ఏదో

మానవతకు దానవత మరణశాసనంరాసే మహనీయ వర్తనకు ఏపేరు పెట్టాలో
బాగుచేయలేని భాష్యాల భాగ్యదేవతల బాంధవ్యంలో బంధితమైన దేశం
చిత్తంలేని విత్తానికి పెత్తనం ఇచ్చే చిత్తశుద్ధికల పెత్తందారీ పాలన
వచ్చిపోయె ఎన్నికల మచ్చలతో అమాయక గ్రామీణుల అంతరంగాలు
ఫ్యాక్షన్ యాక్షన్ మర్చి ఏమర్చిన పంటపొలాలను మరుభూములుగా మార్చాయి
గరికను అమ్ముకొన్నా నమ్ముకున్నా వమ్మయ్యే వ్యక్తులు వ్యవస్థలోని శక్తి హీనులే.

82

గురువు గురుతు మిగులునా – పరువు పట్టపగలెనా
పావన జీవన వనిలో – పరిమళాలు విరిసేనా
రాధాకృష్ణన్ పేరుతో – రమ్యమైన గురులదినంలో
రమణీయపు పాలెంతో రహిజనులకు తెలియునులే.

బెల్లు బిల్లు మాస్టారులతో బేలాయెను సరస్వతి
అధికారుల అండదండతో అధ్యాపన వధ్యమాయెను
రాజకీయ చదరంగంలో – చెదబట్టిన ఉపాధ్యాయుడు
ప్రయివేటుల ప్రమాణాలలో – ప్రాభవహీనం విద్యామానం.

పట్టణాలలో పంతులువాసం – పల్లె జనులకే విద్యాశాపం
రైలో బస్సో రైటంటేనే – గంటమోగును తరగతిలో
భార్యాభర్తటీచరైతే – భాగ్యం యోగ్యం బాలురకెరుకే
కౌన్సిలింగులో కాన్సిలైనదీ – చదువూ సంధ్యా సంగతి ఇంతే.

కాన్వెంటులతో కాలిపోయెను – గురుకులాలతో కూలిపోయెను
శిక్షత దక్షత కక్ష వహించెను – క్షీణత, హీనత చీదర మిగిలెను
మేధావులకే వ్యధలు మిగిలెను – మేదిని వేదన మించిపోయెను
నీతులు చెప్పుట నిత్యసత్యము – నియమకర్మలే మర్మసహితము.

టీటీసిలతొ టీచింగాయె – బియ్యీడీలతో భీరువాయెను
డీఎస్సీలతొ డీలాపడెను – ఇంటర్వ్యూలతొ మింటికెగసెను
ఆత్మస్థైర్యము అసలే లేదు – ఆత్మ గౌరవము రౌరవమాయె
త్రికరణశుద్ధే తిరునామమ్ము – గురువుల పరువే గూటికెళ్ళెను.

మండల పరిషత్ పాఠశాలలకు – మరణశాసనము రాసిరందరు
జిల్లాపరిషత్ జిలుగుశాలలకు – మిగలరు పిల్లలు భవిష్యత్‌లో
హాస్టల్ పిల్లలు హారితిపళ్ళెం – అందనిద్రాక్షే అధ్యాపకత్వం
అధికారులతో ప్రతినిధులంతా – ప్రధమకారణం అంతరింపుకు.

వేగం పెరుగగ విద్య తరిగెను – పెరిగిన మేధలు నీతి విడిచెను
గురుని గౌరవం గూటిలొ ఉంది – గూడేదంటే రాజకీయమే
కలవాడు కార్పొరేట్ కెళితే – కులంవాడు మైనార్టీకెళితే
నకిలీ శాలలు సకిలిస్తుంటే – నాగరకవిద్యనగుబాటయ్యింది.

కలిమీలేమీ మధ్య కమిలిన విద్యలో – కలియుగం కలవరమే
కలిగురువుల కల్మషంతో – కారుణ్యం ఋణపడుతుంది
గురుశిష్యుల గూడుపుఠాణీలో – గురువు పరువు గోవిందాయె
అన్యోన్యత అంతరిక్షానికెళ్ళి – సూర్యకిరణమై మరణించింది.

చీకటి చేష్టల చైతన్య గురువులు – ఛీత్కరింపుకూ కారకులు
ఆచారవంతులు అధ్యాపకులు – అంతరంగముల సారధులు
ఆలోచించే అధ్యాపకత్వం – అవగాహనతో అమరత్వం
బతుకుబాటకు భాగ్యాన్నిచ్చే – భావిగురువులే భాస్వంతులు.

83

పరువు బరువు మోయలేక – బడిపంతులు పడిపోయెను
గురువు గురుతు తెలియగా – తేరునెక్కి తేజరిలెను
బతకలేని బడిపంతులె – భాగ్యశాలి యోగ్యశాలి
మేధయె తన మేలిమిగా – మేలుకొలుపు పాటపాడు.

వ్యక్తిశక్తి వెలికితెచ్చి – వెతలనన్నీ తీర్చివేయ
యుక్తకలుగు యూర్జితుండ – భుక్తినిచ్చు భూరియశుడు
తొలుతటియా గురువులు – తొలకరి చినుకుల రీతిని
జ్ఞానవర్షమందించిన – జాతికి జ్ఞాతులు వారే.

నేటితీరు గమనించగ – నిమ్నమగును నీతివిధియు
బతుకుబాట తెలిసినోడు – స్వార్ధానికి సోకుదారు

సంపాదన ముఖ్యమనే – సంతసరుకు సహమతితో
జీతభత్య జీవనమే – భవతారక మంత్రగాడు.

జ్ఞానదాత అసలెకాదు – జాణనిత్య జీవనమున
దేవుడనే ఆచార్యుడు – ఆచారము విడిచెటోడు
కాలవిలువ గమనించని – కాలయముడు బాలురకు
చదువునంత వదలినోడు – సగముసచ్చి బతికినోడు.

ఆలోచన అసలులేదు – అవగాహన గహనమాయె
ఆదర్శము అదృశ్యము – ఆశయమే శయనించెను
జీతభత్యములు పెరిగెను – జీవన శైలియు తరిగెను
హక్కులు ప్రశ్నిస్తుండెను – విధులెంచగ బధిరుడాయె.

భావిపౌరులందరినీ – బావిలోన పడవేయుచు
రాజకీయ రచ్చునుబడి – విచ్చలవిడి విహరించును
మతిమంతుల మాన్యములో – గతితప్పిన పతితుడై
గమ్యరహిత వర్తనమున – నేటిగురుడు నెవ్వగలో.

భారతీయ సంస్కృతికే – భాస్వంతపు సంస్కారము
భాగ్యగురుడు బతుకులో – యోగ్యరహిత జీవనుడు
తల్లితండ్రి తరువాతిగ – బిడ్డను తీర్చెడి దేవుడు
భాగ్య బతుకు తపనతో – తనపని తానే మరచెను.

అత్యున్నత స్థానమిచ్చి – గౌరవించె జనమంతా
అత్యధమపు ఆశమీరి – ఆశయాల అంధుడాయె
పదిమందికి చెప్పునట్టి – పావనమౌ వృత్తియందు
నిందితుడై బంధితుడై – నిత్య నరకమున నుండెను.

సరస్వతీ మానమునే – మనసారా భంగించుచు
మాన్యుడాయె ఆచార్యుడు – చార్వాకుని చెలికాడు
తరము తెలివి తరిగిపోగ – తనవంతును గణించగ
తనది తప్పుకాదంటూ – తరింతురుగ గురువులు.

గాజుగదుల గాంధర్వం - కలవారికి వినోదం
భూపుత్రుల భోక్తవ్యం - భావి సంస్కృతోదయం
అమెరికాయె అమరమనీ - రమియించుట దొరుకునని
ఎగబడియెడి ఎఱుకవారు - మనదేశపు మనువారలు.

అంతరాల తరతరాలు - అమరం ఆ నేలలో
అందరు పనిజీవులే - జీవితమే యాంత్రికము
కంప్యూటర్ కలలోనా - కలిమి బలిమి వలలోనా
కర్మవాద వాదరలో - కలుముల వారలు కలరు.

అహం ఆదమరచి సుఖంలో - అందరినీ బెదిరించె
సుఖం సూక్ష్మతల మించీ - బ్రహ్మాండం బంధువాయె
అప్పులిచ్చు మొనగాళ్ళే - అసలు రహస్యమేదియో
ప్రపంచాన్ని పదిలపరచి - మానవాళి రక్షించగ.

మహనీయ మానవునికి - మరణం మరి ఉండదుగా
రణం నీడ నిలచినట్టి - గణరాజ్యపు గుణరోగము
దధీచి మనవాడేగా - వెన్నెముకకు వెలకట్టెన?
దేశభక్తి దేహములో - జాతిమతము గుండెమేధ.

శాంతినికేతనాల్ని - అశాంతికి కేతనాలు చేసే
అపర రవీంద్రులకు - అంతం లేదుకదా?
పేరుకు పేలవమైనా - అనుభవాలకు అంతేలేదు
కల్కిసాయిాల పేర్లకు - కాలాంతం కలియుగమేనా.

విడగొట్టీ పడగొట్టిన - విబుధుల విలువల వేలం
బజారులో జారిణికీ - భాగ్యం అబ్బించిన వైనం.
నాలుగ్గోడల మధ్య - నవ్వుల నవనారీ విలాసం
ఆజానుబాహుల అజాయింపులో నిశ్శబ్ద నింగి.

పోయిన పాతను పోగుజేసుకొనే పురోహితుడు
కొలువుదీరిన కొత్తను కొత్తకోణాల్లో చూసే పురాణ పురుషులు.
జీవనవేదానికి జియ్యరుల వయ్యారపు నడకలు
నవజీవన నినాదానికి సరిగమల సయ్యాటల గతులు.

మత్తుమందైన మతానికి చిత్తం సరిపడదని
పరాయత్తం చేసి పరములయ్యే పావనులు.
లంచం లాంఛనమైతే మంచమెక్కే మాన్యఅధికార్లు
ఉపాయాల ఉపన్యాసాల ఊదరలో వాదరపోయిన రాజకీయులు.

కలాని కందని కాఠిన్యం - కంప్యూటర్‌ల కందుతుంది
జీవన వేదపు జిలుగులు - సప్తవర్ణ విబ్జియార్‌లో విలువలు.
గెలాక్సీల లాకియర్ల లాకర్లు - వ్యాక్సీన్‌ల వేత్తల వేదనలు
చైతన్యాన్ని కులంలో మతంలో - బలంలో ధనంలో వెతుకులాటలు.

85

రాజకీయరణరంగంలో - రక్కసిమూకల వీరంగం
చదలంటిన జనస్వామ్యంలో - చెదిరిపోయె జనజవసత్త్వం
అసమర్థుల అతివాదనలో - మతిచెడ్డది మన ప్రతినిధిస్వామ్యం
గతిదప్పిన జనగమనంలో - శృతిమించిన నవవంచక శతకం.

నీతికి పాతర నియతే జాతర - జాతక చక్రం గతియే గడబిడ
సమతామమతా సాంగము భంగము అంగాంగములూ అవనత నతము
విలువల సభలూ విగత వస్త్రలూ - పలువల పలుకులు పలకబారుటలు
సంప్రదాయమూ సరసము విరసము - మన్నిక ఎన్నిక మాటకు మితము.

అధముల వెధవల అతివిలాసము - అపహాస్యములో జనసభజతులు
కులమున మతమున కూహకరతులు - మలసదృశులే మానవనేతలు
చదువులు చదివిన చవటలె అందరు - పదిలపు జ్ఞానము పరుగులు తీసెను
త్యాగమన్నదే తెరువరియాయెను - తెరువెటు వెళ్ళునో తెలియదు తనకు.

వంచన పంచన వసుధే నిలచెను - సుధలస్వామ్యమే విషమును గ్రక్కెను
దేశం దేహం ఒకటేయనియెడు - జాగృతి జనులకు జగతే దుర్గతి
బాంబుల మోతల భారతదేశం - బావురుమనియెను భాగ్యహీనగా
రుధిరాన్నమునే రోజూ తినియెడు - రుజపీడితులూ ఉగ్రవాదులూ.

బరితెగించిన టెర్రరిస్టులూ - ఎదురొడ్డిన త్యాగాల మూర్తులూ
దేశభక్తిలో దివ్యస్నాతలు - ప్రాణము విడిచిన ప్రాభవ పుణ్యులు

156

అస్వాతంత్ర్యం ద్విశతాధికం – స్వాతంత్ర్యం షష్ట్యబ్ధ పూరితం
కాలంతెలియని కలవరభరితం – కలకాలం మరువని మారణకృత్యం.

ఎప్పటికకప్పుడు ఎఱుకలు మీదికి – తప్పటడుగులే తరుగవు తిరుగవు
నేతల నెయ్యపు నిర్వాకం – నెవ్వగ జనులకు చార్వాకం
జనవిభజనయే జయశీలముగా – జంబుకనేతల జాంతవతంత్రం
పదిలపు పదవులె పరమార్థముగా – అర్థవంతులకు సార్థక సౌఖ్యము.

తీరని మారని తీరూతెన్నులు – తిట్లపురాణంతీర్థంకరమే
పుండాకోరుల పండనిస్వామ్యం – రండానేతల రభసల విభవం
నిస్వార్థమ్మే నీరుగారగా – స్వార్థం సోకులు సంతరించగా
నీతిరహితమే నిగమార్థంగా – అనుగమించు అసమర్ధనేతలు.

ప్రకృతివికృతి ప్రాకృత సుకృతి – ఆకృతి మారిన అనుకృతే
మానవప్రకృతి మదమత్తతలో – మాగిన కాగిన దానవ ఆకృతి
సంస్కారమునకు తిరస్కారమే – పురస్కారమై పురుడుపోసికొని
చతురాశ్రమముల చత్వారంలో – చదరపు క్రీడను జరుపునేతలు.

ఆధ్యాత్మికమే ఆదిఖండమై – అవతారాలే తారాపథమై
నాస్తికత్వపు నవ్వులాటలో – పడిలేచిన పరమార్థనేతలు
ఆంధ్యం కాని రాజకీయబూజును – మాంద్యం విడిచి మరలించు
నిలచిన భూమిని నిధిగా భావించు – భూమాతను చెరచకు విరచకు.

86

చీర అదిరిపోయింది – గీరకన్ను గీటింది
గీర్వాణి వదనంలో – నందనమే విరిసింది
కనుసన్న కలిమిలో – సన్నజాజి విన్నదనం
చీరచెరగు జారుడులో – జారిన హృదిపన్నగం.

నవ్వుల నవ నాట్యంలో – నవలతికల వంపులు
పలుకుల పలవరింతలో – చిలుక చెలులకులుకులు
ముద్దుముఖం ముంగురులతొ – మురిపెంగా మారెను
హద్దుచెరిగి ఆనందం – హృది అంచులు మించెను.

రంగుల చెలి హంగులలో – అంగాంగము అతిశయమే
అంతరంగరంగములో – వింతవిలువ చింతనమే
పంతము పట్టెనమ్మ – సొంతము వైరుధ్యమే
అనుకూల్యమైనచో – అంతయు సహగమనమే.

కౌగిలిగిలిగింతలో – కలవరింతవంతలో
కలగలిసిన కాలములో – కాముని నడిఒడిలో
వగరుకోయిలమ్మకూ – పొగరుకూడ అందములే
గున్నమావి గుబురులకూ – కన్నెస్పర్శకాంతిశాంతి.

వయ్యారపు నడకలో – గుయ్యారం కనుమరుగు
సయ్యాటల సారళ్యం – సారసాఖ్యలేని నడుం
నితంబాలు నిధులుగా – విధిమలచిన విన్యాసం
మీదు క్రిందు తెలియరాని – మీనాక్షి సన్న్యాసం.

పరశించె ప్రకృతీ – ప్రణతుల నీఆకృతికీ
సుకృతమే సురలకృతి – సురతానికి సుధల భృతి
పచ్చికబయలులోన – మచ్చుగమేలు కలిపీ
వెచ్చనియావెలుగులోన – వెతలుమరచి పోదామా.

కాముని ముని ముంగిటిలో – ఆమనియే అవతరించె
తరించుటకు తరలివెళ్ళి – తపన తీర్చుకుందాము
యాతన విడియామినిలో – ఎదలు మరచికదులుదాము
సురలోకపు యతనానికి – జతకట్టి జరుగుదాము.

మానవదేహాలకు – మాధుర్యం పంచుదాము
దానవధారుణికీ – దాక్షిణ్యం నింపుదాము
అందంలో అర్థమే – అవనికి తెలియదు
అవని అందగించగా – ఆనందం మనసొంతం.

నీవు నేను లేనిదే – నిధిగ జగము నిలువదుగా
ఇరుమేనులు ఏకమైన – మేలుకొలుపు పాటగా
మెరుగులలోకానికి – మేనితొడవు తొడుగుగా
తొడవు తొడుగులేనిజనము – తొలిసంజకురూపుగా.

87

ఆశయాల ఆమనిలో – ఆశల మరుమల్లియగా
అవతరించి తరించుమా – అంతరంగ తరంగమా!
తొలిసంధ్యకు తొలకరిగా – మలిసంధ్యకు మరువములా
ఇరుసంధ్యల హితమతిగా – ఇలలోన లయించుమా!

ఆవేశము వేషముగా – ఆదర్శము దృశ్యముగా
ఆలోచన లోచనమై – అవనిని చరియించుమా
పుట్టినపుడు పుత్తడివే – పెరిగినపుడు చిత్తడివే
బాధలె భవసారముగా – బంధువులై భవించుము.

బంధనములె ఇంధనములు – మానవీయ మండనములు
కలిమితొ కలిసిన కలతలు – లేమితొ విరిసిన విలువలు
కలదనినచొ కలవరమే – వలదనినచొ అదివరమే
వలచినచో వాసిలేదు – కాలమహిమ కలిమిలేమి.

అహంకార హుంకరింపు – అందలమును అణచివేయు
మమకారపు మందలింపు – మానవతకు అవతరింపు
అవధిలేని ఆశలతో – వధియింపే జీవితము
విధియించే విన్నదనమె – విధిగీతకు గీటురాయి.

విధివ్రాతను ఎదిరించే – బుధమార్గము గమియించు
గమ్యములో గమనములో – సామ్యత సౌమ్యత చూడుము.

88

మట్టిలోన పుట్టినోడ – మనుగడ సాగించినోడ
మట్టిలోన కలిసెటోడ – మానవునిగ వెలిగినోడ
క్రీస్తుపూర్వ కీర్తనలో – వర్తనలో కర్తనలో
తదనంతర తరుణములో – తారుణ్యము నందినోడ.
నందితుడా! వందితుడా! బందుగుడా! బంధితుడా!
చింతలవలలో చిక్కిన – చిరంతనపు చరిత్రుడా!
గ్రహరాసుల సీమలనూ – గమించిన గమనించిన

సాంకేతిక సరళివాడ – యాంత్రికత్వ ఎఱుకవాడ.
కొత్తపాత నిబంధనలో – కోర్కెల ఆర్తిని పంచినవాడ
నాల్గువేద నాదములలో – నాణ్యతనే తెలిసినోడ
పుక్కిటి పురాణములలో – చక్కని కథ సవరించినవాడ
భాషల భాగ్యములతొ – భావన భావ్యములతో.
సంభావ్యత సరసత్వము – సవరిచిన సరసుడా
తాపపు లేపనముల – పరితాపపు ఫలములతో
పలవరించి వరించీ – విరించిగా వెలిగినోడ
వివరించిన విషయములో – సవరించిన సరసత్వము.
రచనలై, కవితలై – రాజ్యములో రహించెగా
వివాదాల వినోదాల – విజయాపజయములలో
సమత్వము విమత్వమును – వినుతించిన విజయుడా
వర్తులమై వర్తనతో – సమవర్తిని సవరించి.
సుమమూర్తిగ సురభిళముగ – భవమూర్తిగ భాసించినోడ
రాయిలోని రమ్యతలను – రామలోని అభిరామత
కళల కలలకలతలనూ – కాలాలు వచించినోడ
చంద్రుని చేరగాను – సాంద్రయత్నమునుసేయగ.
ఫలమునంది బలముపొంది – చంద్రయాత్ర చైతన్యుడ
సూర్యుని సుందరతులు – కిరణమ్ముల ఆరణములు
భువికే ఆభరణములు – శక్తి సహిత చేతనములు
అయస్కాంత అవధిలో – అవని గమ్యముండెను.
ఆర్యసూర్యుచుట్టు తిరుగు – గ్రహగతులు అనుగ్రహము
రక్షణ శిక్షణ రహికీ – దాక్షిణ్యపు ధరణికీ
దయాశక్తి ప్రసాదించు – అర్కుడు అన్నిటికాద్యుడు
సాంద్రమైన సంద్రమునకు – సరసమైన సృష్టికీ.
అచేతనము చేతనముల – అద్వితీయుడాదిత్యుడు
మట్టిమనిషిచేరలేడు – మహనీయుని వహనీయుని
సాహసమే ఆహవమే – సరసమే నమస్కారము
మట్టిమనసు మాన్యతలే – మానవునికి గమ్యతలు
క్రిందుమీదులైనా – కీర్తనయే మనసుతనము.

**అమ్మానాన్నల ఆత్మజ్యోతికి శతవసంతాల సంస్కార నీరాజనం**

**బ్రహ్మవంశము - బ్రహ్మీమయ అంశము**

**గోదావరి తీరము - గోపురాల నిలయము.**

(అయినంపూడి) ఆలయము - ఆత్మీయత కాశ్రయము
జన్మభూమి జాగృతము - కర్మభూమి కార్ముకము.

అమ్మనాన్న ఆకాశము - ప్రేమలన్ని అవకాశము
పచ్చదనం వ్యవసాయం - వెచ్చదనం వెలుగుధనం.

పంచభూత ప్రకృతి - పంచాంగము ప్రవరకృతి
పంచపాండవాకృతి - పంచామృత సారమది.

సంసారము సారము సహకారము సవనము.
సారస్వతి నిలయము - సంయోజన సహగమనము
నియమాల యోగిగా - నిర్ణయాలు నయముగా
అమ్మకు ఆలంబనమై - ఆశయాల శక్తిగా
సంస్కారము సన్నుతమై - సమస్యలే సున్నితమై
మన్నికగా మన్ననగా - మనినజీవి మానాన్నయె.
తల్లితండ్రిగురువులలో - తల్లియె తపనతో
అనురాగదేవతగా - అందరినీ పాలించెను
కష్టమైన ఇష్టముగా - కరుణాంతరంగముగా
వ్యవహారము దక్షతగా - మావూరిని మురిపించెను.
గీతాసారము రమ్యము - శాంకరకృతులే శమనము
రమణగీత రమణీయము - అన్నిటి అపురూపమునాన్న.
భక్తిభావహృదయము - భాషభవపు భాష్యము
కర్మమర్మ ధర్మము - త్రికరణముల తీయధనము.
ప్రయోజకులు బిడ్డలు - ప్రాభవవైభవయుతులు
సంసార సారమును - అనుభవైక వేద్యులు
అమ్మ ఆప్యాయతకు - నాన్న నడత నాణ్యతకూ
నైవేద్యం యీ క్రతువు - నూరువత్సరాలు మురువు.

కలిమి బలిమి చెలిమియుతుడు – కర్మయోగసారమితుడు
భక్తియోగ భాగ్యమితడు – సర్వయోగ సహితుడితడు.
ఆడంబరమేమిలేని – ఆరాధన భావము
అందరికీ నేర్పినట్టి – ఆచార్యుడె మానాన్న
స్వాతిశయం అసలు లేదు – స్వోత్కర్షకు తావులేదు
సాత్వికత్వ జీవనము – సాధారణ మానవము
కోనసీమ అందాలు – కొబ్బరి వరి కోరికలు
వేదనాదవాదములు – అలనాటి అనుభవములు
జీవనయే యాంత్రికమై – జీవితమే తాంత్రికమై
వ్యవధిలేని వ్యధలలో – వ్యత్యస్థుడు నేటి నరుడు.
గృహిణికి గ్రహణము పట్టగ– స్వాతంత్ర్యము శోభవీడె
అన్యోన్యత న్యూనతై – అసమానత్వము సత్యము
మనసున్న మనిషిగా – మేధకలుగు మనీషిగా
మనిషి సేవ చేయగా – మాధవ సేవగునుగా.
మానవధర్మమును – మంచిచెడుల పద్ధతినీ
అమ్మనాన్నలనుచూచి – అందరమూ నేర్చినాము
తపన అవసరములేదు – తనకు తానె తర్కించుక
విచక్షణను వర్తించగ – విలువ కలుగు సమాజమున.
వారసులము మేముగా – ఆస్తులకే కాదుగా
అనువంశిక ధర్మములను – ఆచరించనదియెగొప్ప
వృత్తులు మారినా – వృత్తము మారదుగా
ప్రవృత్తులు ప్రవణమై – ప్రాభవమే ఓంకారము.

తృష్ణఫలము నేర్పినాడు – తృప్తి విలువదెలిపినాడ
తూష్ణీంభావము విడగా – తూర్పువిలువ నీవగుదువు
ఇవటూరి మల్లన్న – ఇంపైన అచ్యుత
దాంపత్యపుదారిలో – దాతృత్వం తత్త్వమాయె.

శేషగిరీ శేముషీ – పుత్రికై పుణ్యమతి
అందరికీ అక్కగా – ఆరాధ్యగ అవతరించె

రామబోధ రమ్యుడై– పెద్దవాడు పేరుగాంచె
ఆర్యసుబ్రహ్మణ్యుడై – ఆరాముడు ద్వితీయుడై.

కాపట్యరహితుడై – కపర్ధియే చతుర్థుడై
మృత్యుంజయ నాముడు – శతృంజయ శక్తిపరుడు
మానసములు దెలిసిన – మహిమాన్య వైద్యుడై
వేంకటలక్ష్మి యుతుడై – వెలుగొందును నరసింహుడు (ఐ.వి.యల్.నరశింహారావు, సైకియాట్రిస్ట్, గుంటూరు)

అమ్మమరణము – నాన్నకశనిపాతము
అక్కజూచి అమ్మమరచి – అవని నిలచె మానాన్న
సంస్కారము సాగిపోయి – సతమతమే హితమై
సాన్నిహిత్యమంతరించి – లోకతీరులోభసహిత.

నిస్వార్థము నియమముగా – అన్వర్థము ఆశయముగ
అంతరజ్యోతిని వెలిగించిన – ఆత్మజ్యోతి పరంజ్యోతి.

ఆరోగ్యము భాగ్యమనీ – ఇంటికూడు ఇంపనీ
ఇతరచోట్ల తిననివాడు – శతమానపు చెలువువాడు
అమ్మలేని జగతిలేదు – నాన్నలేక మేము లేము
అమ్మానాన్నలు ఒకటే – అద్వైతమె అదె మేమే.

బిడ్డలకూ ప్రేమ పంచు – తల్లిదండ్రులకు నేడు
సమయాభావము శాపము – సహనమే వారికి శమనము
పెద్దతలలు లేని ఇల్లు – ఒద్దికలకు దూరమగును
గరువము గౌరవము – సంతోషపు సాంగత్యము.

అనుబంధము అంతరించు – సంబంధము సంగమింపె
ఆత్మీయత వెతలతోడ – శాంతిలేదు జీవితమున
కోడలు కూతురుగా – అల్లుని కొడుకుగా
భావించి భాషించిన – మానాన్నయె ఆదర్శము.

వేదము చదివినా – శాస్త్రము పఠించినా
పురాణములు పుడెసిలించినా – కావ్యాలు వల్లించినా

అభ్యాసము, అన్వయము, అనుభవము, ఆచరణ – అంతరంగానికి
వింతతరం అనుభూతిని కల్గించేవే.

నేటి తరానికి – నాటి తరానికి తరతమాల తారుణ్యం
సుఖము, సంతోషము, ఆనందము అనే పదాల అర్థం తెలిసి
ముందుకు నడిస్తే, ఆతరం నాన్నగారి ఆదివ్య దీవన
సౌగంధ్యం నేటికీ మేము, మాపిల్లలు మా మనుమలు
ఆస్వాదించగలరని మనసార నమ్ముతూ

వచనా నమస్సులతో

అమ్మ నాన్న కుటుంబం.

రచన – "మనసు దెలిపిన మనిషికి" అంతేవాసి (9985700676)

**అంతర్జాతీయ పురుషుల దినోత్సవం**

తే.గీ. మగలు మహరాజులనుమాట మారిపోయె
మహిళమాన్యతపెరిగెను మహిని నేడు
అబల సబలగమారెను అతిశయమున
ఆలుమగలుగ ఇద్దరు అందమగును.

ఆ.వె. మహిళకలదటంచు మగవాని వెనుకను
మగలు కలరటంచు మగువ వెనుక
లోకరీతికలదు ప్రాకటముగనేడు
ఇద్దరిచట కలియ ఇంపుసొంపు.

ఆ.వె. ఆదిగ్రంథమందు ఆదాము అవ్వలు
మనువుశాస్త్రమందు మగడు మగువ
అన్నిమతములందు ఆదిపురుషుడుండె
మగువమాన్యతేమో అగ్గువాయె.

ఆ.వె. హిందుమతముచూడ ఇంపాయె పురుషులు
విష్ణువవతరించె వివిధముగను
మూర్తి త్రయము గాంచ ముద్దగుపురుషులు
ప్రథమ మందువారు ప్రథితులాయె.

ఆ.వె. ఇల్లు చక్కదిద్దు ఇల్లాలు జగమున
బయటి పనులు చూచు భర్తలిలను
పరదయందు పడతి ఫలమును వీడెను
నేటి భార్యలంత నెనరుమీరు.

ఆ.వె. పురుషుడాయె జగతి పూజ్యుడు పుణ్యుడు
వీర్యయుతుడు జగతి విజయుడాయె
పడతులంత నాడు పరవశమౌచుండ
నేటిపురుషులకును ధాటివచ్చె.

ఆ.వె. మాటయందు ముందుమాన్యత మగువకు
వధువు వరుడుగాను వలపు మీరు
భార్యభర్తలనిరి భాగ్యముతోగూడ
సీతరాములనిరి చెలువుమీర.

ఆ.వె. ఆదిశక్తి అతివ అభ్యంతరములేక
అద్వితీయుడాయె అవని మగడు
ప్రథమురాలు తాను పరమార్థసాధనన్
సంతు చింతలేని సరసురాలు.

ఆ.వె. భర్తవీర్యకణము భార్యాండమునుగూడి
జీవిరూపమాయె జిలుగుతోడ
పదియు నెలలు జరిగి పదిలపు బిడ్డడై
మహికి మహిమగూర్చె మానవతను.

ఆ.వె. పాలనమ్ముచేసె పరములు రాజులు
పడతి పాలనమున ప్రథితురాలు
మేధకలుగు వారు మేదిని జనులంత
వేరుభావములును వేసటగును.

ఆ.వె. గీతలోన జెప్పె గిరిధరుడెప్పుడో
బీజమనెను తాను బిగువుతోడ
సృష్టి, సుగతి, లయము సుందరతలు గూడ
తానుగాను తెలిపె తరళముగను.

ఆ.వె. లింగబేధములను లెక్కించకుండగ
జనత నడువగాను జయము కలుగు
అల్ప అధికములును అవనతమగునుగా
ఆడమగలు నేడు అందరొకటె.

ఆ.వె. భారతీయతన్న భాగ్యము యోగ్యము
సమతమమతలుండె సహితముగను
ఆడుబిడ్డలన్న అభిమానముండెను
నాగరకమునందు నాతిమిన్న.

ఆ.వె. 'పూర్వ'పశ్చిమముల పూజ్యత మగువకు
భారతీయమందు భాగ్యమదియ
ఆంగ్ల అమెరికాల అతివయె అధికము
పితరుడింటియందు పెద్దమనకు.

ఆ.వె. కులముగోత్రములను కులపతి పురుషుడు
ఆరుకార్యములను అతివగొప్ప
నీతినిగమములను నిధులాయె దంపతుల్
ఇంటిహితముగోరు ఇంతిమగడు.

ఆ.వె. అమ్మనాన్నలందు ఇమ్మగుప్రేమలు
అక్కఅన్నచెల్లి అధికమగును
వదిన మరదులందు వరుసలు వరపగు
రక్తబంధమన్న శక్తియుతము.

ఆ.వె. మతము హితము జెప్పుమాన్యులీజగమున
పుణ్యపురుషులాయె గణ్యముగను
వారివనితలంత వాసినిగాంచిరి
మతములోని ఘనత మగువ మగలె.

ఆ.వె. అతివ మగలు నేడు అన్యోన్యమౌరీతి
అర్థముగను బతుక సార్థకమ్ము
ఒకరికొకరుగాను ఓజతో జీవించ
బతుకు భాగ్యయుతము బాధలేదు.

ఆ.వె. ఉగ్రవాదమేమొ ఉధృతమాయెను
హింసహీనమాయె హితమువీడె
నెత్తురోడుచుండె నేటి దేశమ్మంత
భయము బాధ మిగిలె బంధురముగ.

ఆ.వె. హింసవీడుడనుచు హితమతుల్ సెప్పిరి
కంసపాలనమ్ము కఠినమాయె
భారమంత నేడు భగవానుపైనిడి
జనతసాగుచుండె ఘనతవీడి.

ఆ.వె. మారణాయుధములు మక్కువగానుండె
అగ్రరాజ్యములకు అవియె దిక్కు
విశ్వశాంతికోరు వినుతులు కొందరే
నశ్వరంపు నడత నాణ్యమాయె.

ఆ.వె. విశ్వనేతలిచట నశ్వరమైరిగా
మతము హితము వీడి హతముజేసె
పిలుపు ఏకమాయె భిన్నత్వమందున
లౌకికమ్ము గాంచ లౌక్యమాయె.

ఆ.వె. యువత భవితలేని నవతను కాంక్షించు
వృత్తులన్ని విడిచి వృద్ధిలేక
తెలివి వీడిరంత తేజవిహీనమై
వర్తనమ్మునందు వరపువీడె.

ఆ.వె. చలనచిత్రముగను చలితములగుచుండె
మత్తులోన మునక మాన్యమాయె
వ్యసన సహితముగను వ్యత్యస్తమాయెను
భవితలేని యువత భాగ్యమేమొ.

ఆ.వె. అర్థజగతియందు అర్థము వ్యర్థము
ధర్మవర్తనమున ద్రఢిమ కలదు
పురుషయత్నమేమొ పుణ్యంపు నర్తనై
ధన్యజీవులకును మాన్యమద్ది.

ఆ.వె. స్వార్థ జీవనమున శోభయే లేదుగ
అన్యహితముకోర అందమదియ
సమతమమత తోడ సాగెడి జనుడిట
పథమునందు తాను పరముడగును.

ఆ.వె. సహనమున్న జనుని వహనము గొప్పది
వినయమున్న వాడు విజయుడగును
సంతసమ్ము జనుని సారళ్యమొనరించు
శాంతజీవనమ్ము శక్తి సుమ్ము.

తే.గీ. అందమారోగ్యములునేడు అందలములు
జగతి ఆనందయుతముగ జనుడు గడప
ఇహము పరమున హితమును హితులు గంద్రు
అన్నికలవాడు జగమున అతిశయుండు.



ఉగ్రవాద ఉరవడిలో ఉరుకుతుంది దేశం
టెర్రరిజం తెంపరియై తెరువరియై తెలుస్తుంది
మానప్రాణరక్షణలో మనుగడ మనువర్తి కోల్పోయింది
మగత నిద్దురలో పాలకమ్మన్యులు పహరాలేని పాంథులైనారు.

నగరాలు నాగరీకంలో నాట్యం చేస్తూ మదంతో మైమరచాయి
సంద్రాలపై సాంద్రులైన రక్షకసైన్యం గానాబజానాలో గంతులేస్తుంది
తీరంచుట్టూ తీర్థులై తీర్థంకరులైన ప్రతినిధులు నిధులవేటలో నిమగ్నం
ఓట్లకోసం ఓటికుండలో నీళ్ళుపోసిన చందమైన శిక్షాస్మృతుల శింజినీరవం.

విశ్వంలో విలయతాండవం చేస్తున్నా విబుధుల మదికెక్కని ఉగ్రవాద వాదర
ఐదునక్షత్రాల అతిథిగృహాలే ఆతిథ్యమిచ్చి అందలమెక్కిన వైనం వైభవమే
మతాల మదమత్తులో గంగిరెద్దుల్లా గడితేరిన మారణహోమ నిర్వాహక గణం
కళ్ళముందే కవాతు జరుగుతున్నా కనలేని గూఢచారి వ్యవస్థ గుంభనం.

నిజాయితీ నిష్కర్ష నిండైన దేశభక్తి గల్గిన అధికారుల చర్యకడ్డుతగిలే ప్రతినిధులు
పాకిస్తాన్ పాకంతో పరిణతమైన ప్రపంచ నరహంతకుల నయా నజరానా

ముద్దుగారు ముంబయి అంబా అని ఆక్రందించి నిద్రలేని రాత్రులు గడిపిన స్థితి
ఆర్థిక రాజధాని అతలాకుతలమయి భయం గుప్పెట్లో బందీ అయిన వైనం.

తాజ్‌హోటల్ తారుణ్యం అరణ్యరోదనలో అలమటించి అలసిసొలసిన దైన్యం
బాంబులమోత, గ్రెనేడ్లదాడి, రైఫిళ్ళ విహారం సుఖమైన దిశలో దుఃఖం ఆవరింపు
అభద్రత, భయం, ఆవేదన అంతరంగాలను అంగాంగాలుగా ఖండించిన వేళ
మాంసపు ముద్దలు కదిలే అవయవాలు ఆర్తనాదాలు ముప్పిరిగొన్న ముదనష్టపువేళ

పోలీసుల ఆత్మత్యాగం సమర్థ అధికార్ల వీరోచిత మరణం దేశభక్తికి దీటైన నిదర్శనం
మానవత్త్వం మసిబారి దానవత్త్వం దారికాచి దారుణమారణకృత్యం జరిపింది
అత్యాధునిక ఆయుధాగారాల్లాగా అత్యంత విలాసమైన అతిథిగృహాలు మారినవి
యూదుల ఉనికి పట్టును ఉగ్రవాదులు లక్ష్యంగా పెట్టుకొని ఊచకోత కోసిన వేళ.

దిగ్భ్రాంతి చెందిన యావద్దేశానికి దిశానిర్దేశం చేసిన కమెండోల సాహసం
రాజకీయులంటేనే అసహ్యించుకొనే విధంగా అమాత్యుల ఆలాపనలు
భారతీయులంతా ఒక్కటేనన్న భావాన్ని ముక్తకంఠంతో ప్రకటించిన జాతి జనం
ఖండన మండనల కాలంలో కారుణ్యాన్ని కనబరచిన మహనీయుల మానవత.

దేశానికి సహానుభూతి ప్రకటించిన సభ్యదేశాల సమ్యక్ దృక్పథానికి జేజేలు
ఛిద్రం చేసే శక్తుల చింతనకు స్వాంతన అందదని సంకేతం పంపిన జనత
జాతిస్వాతంత్ర్యం ఉగ్రవాద తాంత్రికుల తంత్రాలకు చెక్కుచెదరదనే భావన
సహనశీలం, సమైక్యత, సమానత్వం భారతీయుల సొత్తని చాటిన వైనం అద్భుతం.

ఉగ్రవాద ఉద్యమాన్ని ఉర్వర నుండి తరిమేసే యజ్ఞంలో సమిధలైన వారికి అంజలి
ప్రాంతమేదైనా ప్రాభవ వైభవాలకు నిలయమైన దేశానికి భయం బాధాకరమే.



నాజూకు నడకలో నయాగరా కదలికలు
నవనాగరీకంలో నయనాల మేలి మెరుపులు
ఆదిశక్తి శాక్తేయానికి అహం తొడిగిన అందపు తొడిమ
అందరాని ఆనందానికి ఆలోచనలోచనమైన అనుపమ.

ముల్లోకాల ముద్దుగుమ్మల మూర్తిమత్త్వానికి కీర్తిపతాక
సప్తద్వీపాల సాగరకన్యల సరసాల సురశాలలకు వివేక

ముద్దుముద్దరేయగా హద్దుచెడిన హవణింపు హారిక
చూపుల శృంగాటకానికి బంగారం అద్దిన భాగ్యవేదిక.

అంతుదొరకని రసకేళికి అంతా తనే అయి అలరించిన అతివ
సుఖమఖంలో మధువును పుట్టించి పుడిసిలింపజేసిన పునీత
భరతంతో భరతంపట్టి భారతికే రతిపంచిన భాగధేయ
సురతంలో సుందర నందనాన్ని అందించిన అనురాగ రాధేయ.

కర్ణానికి వర్ణంతో కాంతిని పంచి కలవరపెట్టిన కామందు
స్వరమే వరమై సరిగమలకు సారళ్యం అందించిన పసందు
ఆకారం సాకారమైన సరస్వతిగా సారస్వత సంగీతాల స్తనద్వయి
అర్ధాంగము తానుగా పర్వమయి సర్వదేవతలకు తల్లిగా అద్వయి.

గుండెపయి గుంభనగా నిలచి గురుగరువమునిచ్చే పరువుల పల్లవి
కడలేని కామనల తీర్చే ఇరుగడలకు యేడుగడయైన వల్లరి
లోకాలోకులలోలుపతలకు లోకాల కళ్యాణానికి లోకిత
కామధేనువుగా కామాక్షిగా, కామాయినిగా, కారుణ్యమొలికించే కామిని.

మానుషాలకూ, అమానుషాలకూ, అతిమానుషాలకూ ఆలవాలమైన భామిని
మర్దినిగా శుభవర్ధినిగా సురుచిర ప్రార్థినిగా ప్రత్యక్షమయ్యే ప్రవర్ధిని
అక్షయ ఆశీస్సుల అనవరతం అందించే అసదృశ సాదృశ్యలక్షణ
పారమార్థికానికి పాలికాపులైన పడతుల తులలేని పాతివ్రత్యప్రౌఢిమ.

స్వార్థానికి శోభనిచ్చే శోభనవతుల శుభకరవిభవాల ప్రారూఢిమ
సన్న్యాస విన్యాసంలో సరంగులైన సాగర సంసార సారసాఖ్యల సౌమనస్యం
దాంపత్య దారిలో దారుణాల రణంలో అరణంగా పెట్టిన అతివల సౌందర్యం
శార్వాణుల గీర్వాణంలో శాంకరం వెదికే అపరశంకరుల అరణ్యరోదనం.

సత్యవచనల నిత్యతకు అసత్యసత్త్వాన్ని అందించే అపర సిద్ధుల అనుభవం
అన్నిరంగాలకు రంగులద్దే అతివల వలపుల వలలో బందీలైన బాధితమగలు
నారిని నమ్మవద్దనే నరుల నుడిలో నాణ్యత కలదోలేదోయని కలవరించే వగలు
రాత్రికి పగలై పగటికి పట్టపగలై వగలు ఒలికించే ఒయ్యారుల గుయ్యారం.

ఆర్యుడైన సూర్యునితో పోలక రాత్రించరుడైన చంద్రునితో పోల్చబడే పడతులు
సారహీన సారవంత సంసారాలకు సారమైన నారీమణుల నడతల కతలు

కథలెన్నైనా కామిని కాలిజాడలో పడి జడిసిన జవత్వాల జావళీలే
నవల వలపుల పులకరింతలో పునీతమైన పురుషుల కథలు పూజనీయాలే.



ఆ.వె. దేశభవిత కొరకు దేహము నర్పించి - దివ్యసీమచేరి భవ్యులైన
పటిమ కల్గినట్టి ఘటికులు వారలు - వారిజీవితములు వాసిగాంచె.

ఆ.వె. భావిభరతదేశ భద్రత చూడగా - నేడు మడిసినట్టి నేతలంత
వారివారసత్వ వసుమతి సుమతిగా - వెలుగవలయు యువత వెలితిలేక.

ఆ.వె. రాజకీయనేత రాసభమాయెను - పదవి పదిలమాయె పరమముగను
దేశహద్దు తనదు దేహము మాదిరి - కాచుకొనుచు నుండు కలవరమున.

ఆ.వె. ఉగ్రవాదమేమో ఉద్ధృతి హెచ్చెను - అగ్రవాదమెంతొ అధికమాయె
మెరుపుదాడులాయె మేదిని బాంబుల - వాటినణచగాను వరుడుతాను.

ఆ.వె. కరుడుగట్టినట్టి కర్కశమూకలు - పరువు వీడినట్టి పందలంత
నరుల మాంసములకు నక్కలరీతిగా - మిక్కుటమ్ము జగతి మించుచుండె.

ఆ.వె. శాంతి మాసిపోయె శక్తియు క్షీణించె - కాంతిదరిగె భూమి కరుణవీడె
అంతరంగములకు అతిశయమూర్తియై - అందరికిని తాను అధికుడాయె.

ఆ.వె. నౌకలందుతాను నావికుడాయెను - కాల్బలమ్ములోన కలదుతాను
వాయుబలములోన వరుడైన వీరుడు - త్రివిధ దళములందు తీర్థుడతడు.

ఆ.వె. అరుణకిరణముగను అవతరించిన తాను - శతృచేష్టలకును శక్తివీడి
సంధ్యకిరణుడుగను వంద్యుడై వాలెను - భరతమాత బిడ్డ భాగ్యదాయి.

ఆ.వె. గన్నుచేతబట్టి గణ్యుడై ధన్యుడై - గుండుకెదురుగాను గుండెనిల్పి
మెండువీర్యునిగను మేదిని వెలుగొంది - అపరదిక్కుకెళ్ళ అతిశయమ్ము.

ఆ.వె. శిక్షణమ్మునందు దక్షతమీరగా - రక్షణమ్మునందు రక్తిగలిగి
రాక్షసులను దునిమి రాజుగారాజిల్లి - మోక్షమందినట్టి ముద్దుబిడ్డ.

ఆ.వె. తనదు సర్వమంత తనదేశమనియెంచి - బంధుతతుల వీడి భార్యవిడిచి
సంతు చింతవీడి సంతస మందెను - దేశరక్షణమున దేవుడతడు.

సీ. భారతమాతకు భాగ్యాలపంటగా – యోద్ధలై యుండిరి యోధులిచట
సాహసకార్యాలసరిజోడు లేకుండ – సాగెడి యోధులు సరసులిచట
పరరాజ్యతంత్రాల పారద్రోలెడియట్టి – ప్రాకటవీరులు పరములిచట
దుష్కరమూకల దురితంపుచేష్టల – దూరమ్ముచేసెడి ధుర్యులిచట.

తే.గీ. త్యాగధనమున తెంపరితేరునెక్కి – రణమునందున రాజులైరాజిలంగ
బలము బలగము బాంధవ్యభాగ్యములను – విడిచి మడిసిరి వినువీధి విజయులైరి.

సీ. దైన్యములేకుండ సైన్యము నడచెను – పరదేశపాంధుల పథము మార్చ
దండయాత్రలయిన దాక్షిణ్యమును వీడి – రక్షణముఖ్యమై రాజిలంగ
పక్కలో బల్లెమై పాకుదేశముచేష్ట – తిప్పికొట్టుటకయి తీరుమార్చ
విశ్వదేశాలలో వినువీధికెక్కిన – ఆయుధగణమున ఆస్తిమించ.

ఆ.వె. హిందుదేశమాయె హితమతిమతిమతి – శాంతికొరకు శక్తి కాంతియుతము
పంచశీలసూత్రపరమార్ధ మర్ధమై – ఘనవిదేశ తంత్ర గరిమ మీరె.

సభా పర్వమూ – విభవరహితము
సర్వ గర్వ ఖర్వము – పర్వరహిత ప్రాభవము
శాసన సభ్యులూ – శాపగ్రస్థ ప్రతినిధులూ
రాద్ధాంతపు పార్టీలకు – సిద్ధాంత సైంధవులు.

విపక్షమూ స్వపక్షమూ – విలువ రహిత జన పక్షము
పక్షపాత ప్రభుత్వమూ – కక్షతోడి కలవరమూ
సభాపతుల పతనమూ – సభ్యత విడిచిన ఘనమూ
నిర్ణాయక సమయమునా – నిత్యస్వార్ధ పరత్వమూ.

ముష్టి యుద్ధ మురిపెమూ – తుట్ట తుదకు సంగమమూ
మైకులన్నివిరియడమూ – మైకములో జనస్వామ్యము
ప్రతినిధి స్వామ్యములో – జమాఖర్చు జతులు వేరు
కండబలం అండబలం – అర్థమగును సార్థకమై.

ప్రారంభపు మేజువాణి – పలకరింపు ప్రజలవాణి
పద్దులపై మూజువాణి – హద్దులేని అధరవాణి
అసహ్యమూ అవనతమూ – గౌరవగార్దభము మాట
బూతుల పంచాంగములో – పాతరగును ప్రభుత తీరు.

గుత్తసొత్తు పదవిగాను – మత్తుమునిగి మదముతోడ
చిత్తము చెడివర్తింతురు – విత్తముమొత్తము తమదని
వెధవలకే వెధవలయి – వేత్తలుగా వర్తింతురు
సత్యవచన సంగతికే – అంగాంగము అవమానము.

ప్రాక్తన పుణ్యులకూ – వారసులుగ వర్తింతురు
వేషభాషవర్తనలో – వెగటును కలిగింతురు
అందరికీ ప్రభుతయనెడి – అర్థము అసలే లేదుగ
పార్టీలో పార్టనుచును – పరవశించిపోదురుగా.

తప్పుఒప్పుగను మార్చగ – తిప్పలు పడుతీరులూ
పెద్దవారిమెప్పుగనగ – పేలవముల ప్రేలుదురు
దుశ్శాసన శాసనసభ – ధృతరాష్ట్రపు సభాపతీ
నియమములే నిలువులూటి – కౌరవ రవములెసాటి.

సిగ్గుఎగ్గులేనివాళ్ళు – సింగారపు టింగిరోళ్ళు
ఖదరుబట్టకట్టినోళ్ళు – భేఖాతరు బ్రేవరీలు
ఊరుపేరు చెప్పుకొనీ – ఉన్నతినీ కాంక్షింతురు
చెట్టుపేరుచెప్పుకొనీ – కాయలమ్ముకామందులు.

రౌడీలకు రౌడీలూ – రాసిక్యపు రాక్షసులు
కేడీలకు కేడీలూ – కేరింతల కేతిగాళ్ళు
పెద్దప్రజాస్వామ్యానికి – శుద్ధ శుంఠ ప్రతినిధులు
సభాపర్వసరోజమును – పెరికివేయు కరికరములు.

అప్పులతో గొప్పలాయె – అభివృద్ధే ఆమడాయె
భూములమ్ముకొనుటలోన – భోగమున్నదనుచుండిరి
కలియనిధృవములు కలియుట – కలవరమే కలిగించదు
అన్నిటిలో నిర్లిప్తత – అందరికీ శఠగోపం.



సుందర హాసంలో – నందనమే విరిసింది
వందనమని వసుధయే – విందులనందించింది

హాసమే న్యాసమైన – హాయి సన్యాసమే
విన్యాసపు హాసంలో – ధన్యము భువి విలువలే.

కామిగానివాడెవడూ – మోక్షగామికాలేడని
కామశాస్త్రఅర్థములో – పురుషార్థము పూజ్యమే
కాముని మడి ఒడిలో – కలవరింత వింతలో
అంతరాల సంతలో – సుంత సుఖం సుందరమే.

నలువిధాల చేటైనది – నవ్వనుమాటను నమ్మగ
దివ్యత యేదిటవు వీడు – సంతసమే సంతకెళ్ళు
ఇంద్రియాల ఇంపులోన – సొంపైనవి సోగకళ్ళు
సోగకళ్ళ సోయగాన – గాయమౌను గడుసరికీ.

బాలల దరహాసంలో – భాస్వంతము జనస్వంతము
తెలియని వయసులో – తేరునెక్కు తెరువరులే
నఖశిఖి పర్యంతమూ – సుఖరూపమె సౌందర్యం
కాముని నవ మఖములో – కాంతియుతం ఆనందం.

తనివేమొ తీరనిదీ – తపనేమొ తరగనిదీ
తారుణ్యపు తరుణములో – వరణము వరరూపానిది
చెదిరిన కలలకూ – చైతన్యం చెలిరూపం
కదిలే కలతలకూ – కారుణ్యం తొలిభాషణం.

అలవాటే వాటమైన – చెలిచాటుకు వెళ్ళగా
వెతుకుటలో వెతలుపడి – వేదనలే వెగటాయెను
సగం సగం పంచుకొనగ – సాగరమే సంసారము
సారమైన సంసారమె – సరసాల సంగమము.

సరసాలతొ మనిద్దరం – సురశాలకు వెళదామా
కాముని కైలాసంలో – మోక్ష మధువు గ్రోలుదమా
సంఘంతో సంగమించి – సాంగోపాంగం తెలిసీ
అభ్యుదయపు దయగాంచి – అమరమర్మమెరుగుదాము.

ఏకాంతము కాంతారం – ఇద్దరైన ఇంపు సొంపు
కాంతారంలోని కాంతి – కలగలుపే మనవలపు

దాంపత్యంలోని పతిని – పతనం కాకుండగాను
సతిపతులుగ సరసతతో – మతిమంతుల మౌదాము.

కథలలోని వ్యథలు సుధలు – కల'వరము'గ భావించీ
కలిమిలేమిబలిమిగాను – కలియుగమున సాగుదాము
ఆశ్రమాల శ్రమను దెలిసి – అశ్రమముగ సాగుదాము
పురుషార్థపు పుణ్యమెరిగి – పూజ్యులమై జీవిద్దాం.

వసుధలో సుధను దెలిసి – వలపుతలపు వాసిగాంచి
ఇద్దరు ముద్దుగ ఒకటై – శుద్ధజీవులవుదాము
రాసిక్యం రాజిల్లగ – రసఝరిలో ఈదేద్దాం
ఇంద్రపదవి సాంద్రతలో – ఇంపు సొంపు కందాము.



అసూయా ద్వేషాలతో అంతరంగాలు తరించిపోతున్నాయి
ఈర్ష్యల ఈదులాటలో ఇంపుసొంపులు పులకరిస్తున్నాయి
ధనదాహంలో దారుణమారణాలు దారిదప్పి దాష్టీకం చేస్తున్నాయి
మహనీయుల ఆత్మశాంతికి పాటించే దినాలలో దివ్యత్వం లోపిస్తుంది.

రాజకీయ రంకులాటలో కులటల కుటిలత్వం కులుకులాడుతుంది
సినిమాల నియమాల మాలలో సితారల తారుణ్యం తరిగిపోతున్నది
బుల్లితెర బులపాటం పాటవరాహిత్య జారుపాటులతో జరుగుతుంది
చంపటం చనిపోవటం సాధారణమైన లోకంలో సరసత్వానికి చోటేది.

సత్యం అసత్యాల సత్ప్రవర్తన నర్తనలో తనతనం కోల్పోగ తనయులు
నీది నాది అనే నిత్యజపం నిందలకు నిలయమై యమాలయ సోపానమైంది
మంచికి మారుపేరై వంచనతో నిండిన వసుధ పుత్రుల వాల్లభ్యలాభం
పోటీ ప్రపంచపు పోటరులు పోకిరీలై పోడిమిదప్పి మెప్పుపొందుతున్నారు.

సాంకేతిక కేతనాన్ని సంక్రామకంతో కలిపి ఎగురవేస్తున్న క్రాంతికారులు
లేనిదాన్ని ఉన్నదనుకొనే లేవడి బ్రతుకును వడివడిగా వలచే వసుధతరులు
దృష్టమైన అదృష్టాన్ని దూరీకరించే దురదృష్ట జాతకుల జాంతవ్యం
మతం మత్తులో చిత్తయిన చిత్రం చిత్రమైన రీతిలో చిరుదరహాసం చేస్తున్నది.

మానవతలేని మానవుల నవత మాలిన్య సహితమై సహనాన్ని సవదరిస్తుంది
అన్నింటినీ చట్టబద్ధంచేసిన అమాత్యులు అమాయకత్వంతో మాయచేస్తున్నారు
మోసం మధుమాసం మోకరిల్లజేసుకొనే మోతుబరుల బరితెగింపు
విభేధాల సృష్టి విజయగాథలకు విలువనిస్తుందనే విబుధనేతల నీతిమాట.

సమతా మమతల సారం సారంగమై విమతుల దాడిలో వనవీధిలో వసివాడినది
భక్తి బాంధవ్యానికి శక్తినీ, రక్తి రసమయ జీవనానికి ముక్తినీ ప్రసాదిస్తుందా?
నీతినియమాల 'యమం'లో యముని దర్శించే యాతనాపరుల యావ
బాధల భాగ్యంలో బోధల బుద్ధత్వాన్ని ప్రవచించే ప్రవీణుల ప్రాచుర్యం.

కోరికలు యీరికలెత్తే కోమల హృదయాలు మలభూయిష్టాలై భూస్థాపితమౌతున్నాయి
మనసులు మాధుర్యంగా మనాలనే కాంక్ష ఆంక్షగామారి ఆశయ రహితమైంది
ఉన్నతాశయాలు ఊర్ధ్వగతిదప్పి ఉర్విపైన బడే దశకు ఆహ్వానం పలికేవారు
అంతరాలు ఆకాశాన్నంటుతుండగా అంతరంగాలు తరంగాలై ఎగిసి పడ్తున్నాయి.

పోలికలు ఏలికలతో సమానంగా ఉంటే మెలికలు తిరిగే మేలిభావాల మేనులు
అనారోగ్యం తరగని రోగమై తరించే అభాగ్యుల భాగ్యానికి ఆహ్వానం
ప్రజలెట్లున్నా అన్నా పదవులు పదిలంగా ఉంటే పరమాన్నమనుకొనే పరములు
మంచిని త్రికరణశుద్ధిగా మన్నించే మాన్యుడు మానవులలో మనో దౌర్భల్యుడు.

మెరమెచ్చుల మేజువాణిలో మేలుకొలుపు పాడే మూజువాణి ముద్దుపౌరులు
వ్యాపారసంస్కృతి వ్యవహారదక్షతగా వ్యత్యస్తమైన వ్యవస్థలో కలిగేవి అవస్థలే
నిజం నిలదీయాలనే నిత్యసత్యదీక్షకు నిందల దరహాసం హాస్యభంగురమే.



ఆ.వె. విలువలేని జగతి విధ్వస్తమాయెను – నీతి నియతిలేక నేతలుండె
ఓర్పు నేర్పు వీడి మార్పురులందరు – వినయగరిమ వీడి విలయమాయె.

ఆ.వె. జనులు భావమందు జయకాంక్షవీడిరి – భాషలోన మిగిలె భాగ్యగరిమ
చేతిలోని చేత చెలిమిని వీడగా – జగతి తీరు నేడు జయము వీడె.

ఆ.వె. మార్పుకోరు జనులు తీర్పరులై నేడు – పరులకొరకు నీతిపథమునుడువు
పథమునందు తానె పసరమురీతిగా – సిలుగులెన్నొ చేయు సిగ్గువిడిచి.

ఆ.వె. పలుకు సత్యమగును పరమార్థ సాధనన్ – స్వార్థమన్న జగతి అర్థరహిత
పరుల హితముగాంచ పావన ధర్మమౌ – మతములన్ని చెప్పు మంచిమాట.

ఆ.వె. కూటనీతియందు కులములు మతములు – రాజకీయ మందు రంకుబొంకు
ధనము గణన సేయు దారుణ మార్గముల్ – అవియె భువికి చేటు భవితలోన.

ఆ.వె. కనులు కాంచలేవు వీనులు వినలేవు – పలుక భాషలేదు పరమునకును
స్పర్శతెలియలేదు వాసనయును లేదు – అదియె ఆత్మయగును అంతరమున.

ఆ.వె. మంచి మానవతలు మరుగగుచుండెను – వింత తీరు నడత విశదమగును
ప్రేమరాగములును పేలవమాయెను – బంధములనుగాంచ బంధనములె.

ఆ.వె. హక్కులన్నికోర హాయిని గలిగించు – బాధ్యతలనుగాంచ బరువుగల్గు
సమముగాను చూడ సహితము మహితము – సమత మమత జగతి సాగునపుడు.



శబరిమల అయ్యప్ప – విభవమే విభవము
శక్తిపీఠము గాంచ – ముక్తియే సులభము
అయ్యప్పదీక్షతో – అలరారు సౌఖ్యము
భక్తిభావము నింప – భవము నిండునుపంట.

మాలధారణములో – మహిమలే కలవు
ఉదయస్నానములోన – ఉన్నతులు కలవు
గురుసామి చేతను– సిరిమాల ధరియించి
నల్లనీవస్త్రాల – నవజీవనముగాంచు.

ఒకపూట భుజియించి – ఒకపూట అల్పము
బ్రహ్మచర్యముతోడ – బతుకులే పండును
మగవారు మాన్యులు – ధన్యతే వారికగు
శబరిమల వాసుడే – శక్తియుక్తులనిచ్చు.

ఇరుముడిని ధరియించ – యిరకాటములు తొలగు
సన్నిధానములతో – సంగముక్తుడె జనుడు

శబరిమల తీర్థాన – బంగారు మెట్లెక్క
జీవితమె బంగారు – జిలుగు వెలుగులు కల్గు.

దీపములు పెట్టగా – దివ్యత్వమబ్బును
హారతులు సేయగా – ఆధిక్యములు కల్గు
నామజపములు సేయ – నయగారమబ్బును
కఠిన దీక్షను సేయ – కలుములు కలుగును.

చెడునుదూరముసేయు – విడివడు కోరికలు
పరమార్థ సాధనకు – పరసీమ అయ్యప్ప



శృంగారము బంగారము – భార్యతోడి సంభోగము
వేశ్యల వైభవమ్ము – వేళమించు ఆరోగ్యము.

మందులేని జబ్బులంట – మాయదారి రోగమంట
హెచ్ ఐవీ జబ్బులంట – ఎఱుకలేని నొప్పులంట
నివారణే మార్గమంట – నిధులవలన కానిదంట
అంటురోగి కాడంట – అందరిలో ఒకడంట.

కండోములు వాడగాను – కలవరమే లేదంట
తిరుగుబోతు తనమంట – విరుగుడేమి కాదంట
చిలిపివ్యాధులధికమై – చిరురోగం ప్రబలు నంట
వ్యాధికారకములతో – వెతల బతుకు సాగునంట.

మానవాళి మనుగడకే – మహమారిగ తెలియునంట
స్వలింగాల సంపర్కము – విచ్చలవిడి సంభోగము
రక్తమార్పిడీలలో – రాజ్యమేలు ఎయిడ్సంట
ఇంజక్షను సూదులు – పరిశుభ్రము లేకుండగ
వాడినవే వాడగాను – వచ్చునంట యీ వ్యాధి.

మురికివాడ జనులకూ – ముద్దయినది రోగము
వేశ్యవాడ వెలుగులతో – విజయమ్మగు వ్యాధికి

స్త్రీలనుండి పురుషులకూ – పురుషులతో స్త్రీలకూ
గర్భిణీల పిల్లలకూ – సంక్రమించునీవ్యాధి.

శోధనలే చేసినా – శోభలేదు నేటికీ
వేదనలను విడువగా – ప్రయత్నమే ముఖ్యము
డ్రైవర్లూ జాగ్రత్త – డాంబికాలు పోవద్దు
నటులారా విటులారా – నాణ్యముగా బతకండి.

ఉడుకు రక్త యువకులార – ఉద్యమించి సాగండి
నవజీవన యువతులార – దివ్యముగా నడవండి
భవంభయం లేకుండగ – బాధ్యతతో మెలగుడీ
మానవమారణహోమం – మరిలేదని చాటండి.

89

సీ. భూమియు సంద్రము భువనాన రెండగు – పగలును రేయియు పాలుపంచు
పురుషుడు స్త్రీయును పుణ్యంపు జీవులు – ప్రకృతియు పురుషుడు పరములైరి.
మంచియు చెడ్డయు మాన్యత మూఢత – కలిమియు లేమియు కలవుభువిని
రాజును పేదయు రహిజన ద్వంద్వాలు – పాలక పాలిత ప్రగతిగాంచె.

తే.గీ. శబ్దమర్థము సుఖదుఃఖ శమముదమము – మృదువు కఠినము యౌవన వార్ధకములు
చేతనములును లేనివచేతనములు – ద్వైది భావము వైవిధ్య వైకృతముల.

కాలమ్ము గమియింప కలతల కథమారె – ఒకనాట మంచియె ఒకటచెడగు
మానవ వర్తన మారుటగమనింప – విలువలు మారిన విధము దెలియు.
మంచిని రక్షించ మహదాశయమ్మగు – రక్షించు మానవుల్ రహిని కరవు
చెట్టను వర్తించు చెడుగులు ఎందరో – కలికాల కర్ములు కలిమివీడి.

తే.గీ. తనదు జీవన కాలాన తపన పడక – తృష్ణ వీడిన జనునకు తులయె తేరు
స్వార్థ పరమార్థ స్వాదులు సాధువులుగ – కొంత మేలును చేయగ కొరతతీరు.

సీ. కల్లోలకారిది కాముక హృదయమ్ము – అస్థిరతకు నీడ అవనిలోన
కోర్కెలు గుఱ్ఱాలు కొలువుకు పరువాలు – కళ్ళెమ్ములేయగా కాంతికరము.
అదృష్టమన్నది అందదు మనిషికి – యత్నమె జనజీవయానమందు
నరులంత స్వార్థులె నయమున నడువగా – పరమార్థపరులర్థ పరులుగాను.

తే.గీ. కామితమ్ములు దీరగా కలుగు కలిమి - కలుగు కలిమికి బలిమియె కారకమ్ము
బలిమి జీవుల ధనమగు బాధలందు - బాధ భరియించు జీవుడెభాగ్యజనుడు.

తే.గీ. పరుల కష్టాల నష్టాల పంచుకొనగ - జనుల బాధల దుఃఖాల జయము పొంద
చీడపీడల చెలిమిని విందుజేయ - అతడె నిజమైన నరుడగు అవనిలోన.

90

మీమాంస యాజగమిహిరమై మిగులగా - వాదాల మోదాలు వావి వెలసె
దర్శనములయందు దర్శించు తత్త్వము - జగమున జనగతి తగవు దెలుపు.
శాస్త్రము జనునికి శక్తిని కలిగించు - శమమెంచు శస్త్రమై శాంతినిచ్చు
వేదాల విలువలు విగతము కానివి - వేద్యమై వెలుగులు వెతలుబాప.

తే.గీ. ఉపనిషత్తుల ఉన్నతి ఉర్విమించు - వరపురాణము రాణియై వరలు జగము
కావ్య ఇతిహాస కథలన్ని కాంతినీన - జయము జగతికి కలిగెను జవముతోడ.

సీ. బాబాల బలమెన్న భాగ్యమై జనులకు - భవితకు మేలెంచ బాగుగాను
స్వాముల స్వగతాలు సాగర వలయాలు - సాకార రూపాలు సాగగాను.
అవధూత లందరు అవనికి మేలెంచి - అందలమెక్కిరి అమరులైరి
పీఠాధిపతులంత పీడన నెదిరించి - అభ్యుదయమునందు అధికులైరి.

తే.గీ. బాబ ఎవరైన నేమిగా భవిత కోర - స్వాములందరు సమతను స్వాగతించ
మేలుకీళ్ళను దెలుపగ మేటివారె - మంచి మించగ వారంత మహితులిలను.

సీ. అస్తివాదమునందు అమరమ్ము కలదను - జనవాణి జగతికి జయము నిచ్చు
నాస్తిక జగమున నయమెంచు వారలు - భగవంతు డిటలేడు భయమెగాని.
ధాతువాదులయందు ధరణికి మేలగు - భువిమీది వస్తువుల్ భూతములకు
గతితార్కికమ్మున గతమౌను భౌతిక - దోపిడి జగమున దోర్లలితము.

తే.గీ. ఎన్నివాదాల నేముండె ఎఱుకెగాని - కాలగమనాన యివియన్ని కాంతిదములు
జగతి భావము ద్వివిధమై జాలిగొలుపు - రెండుకలిసిన జగమంత రేయి వెలుగు.

91

సీ. ఏకాక్షరీమంత్ర ఏలికలెవరైన - మేలును పొందగా మేలిబంతి
ద్వ్యక్షరిమంత్రము ధనమిచ్చు ధరణికి - దాక్షిణ్యదానాల దారిలోన.

త్ర్యక్షరి తెగువగు తగవున ధాత్రిని – తాపాల పాపాల తరల జేయు
చతురక్షరీయును చాతుర్యమొప్పారు – చేతమ్ముచైత్యమై చెలువు మీరు.

తే.గీ. వినుత పంచాక్షరంబున విరులు విరియు – వరషడక్షరి వరలును వాసితోడ
మంత్ర సప్తాక్షరమ్మున మైలవెడలు – అష్ట అక్షర లక్ష్ములు అవని వెలయు.

సీ. నహ్వార మంత్రాన నాస్తిక్యమన్నది – దరిజేర వెరచును ధరణిజనుల
దశద శాక్షరిమంత్రధారుణి బలమున – జనులంత జవమున జరుగునిచట.
ఏకాదశమ్మున ఎదలను నిండించు – జ్ఞానమ్ము పండించు జాణతాను
ద్వాదశాక్షరమంత్ర ద్వారాలు తెరవగా – దొరుకును శుభములు దోహదమున.

తే.గీ. అన్నిమంత్రాల సారము అవనివెలుగు – అన్ని తంత్రాల ఆంతర్యమవని ప్రగతి
క్షరము కానిది అక్షర సారమగును – ఉచ్ఛరించగ జిలుగును ఉన్నతిచట.

సీ. సాధువు ఎవరన్న సహనము సహితుడు – సాధన గొన్నట్టి సారమతియె
యోగము పొందిన యోద్ధను గమనించ – చిత్తావరోధనచింతితుండు.
బోధకు మహిమయె బోధన కిరవగు – పెరవారి కందించు పేర్మి వెలుగు
మునివృత్తి సలుపగా మురిపెము మనకెంతొ – జనవాంఛలను దీర్చు జాతియద్ధి.

తే.గీ. మిథ్య జగమని మాటాడ మించెనహము – సత్తు చిత్తను లోకాల సహితజనత
కదలు కదలని వస్తువుల్ కానబడగ – లేదు కాదను వాదము లేవిడగును.

92

సీ. సిద్ధాంత రాద్ధాంత చిన్మయ వేదాంత – సారము సమతయె సాగుభూమి
దర్శన మర్శన ఉపనిషత్సారము – ధరణికి తగవాయె తరములకును.
ఇతిహాస కావ్యాల ఇంపును సొంపును – నరులకు నందన నయముగాను
ఆధిక్యమన్నింట అమరిన రాజ్యాంగ – ఆశయ మేమన్న అదియె సమత.

తే.గీ. ఎందరెవ్విధి జెప్పిన నేమిగాని – అందరన్నది విన్నది నరుని ప్రగతి
దేశదేశాల చరితల దెలియునద్ది – దేవదేవుల దేహమె దేశికమ్ము.

సీ. వ్యాసమై వ్యాసుని వాక్యమె న్యాసమ్ము – రూపమై రూక్షమై రుచ్యమాయె
వాల్మీకి శోకమ్ము రాముని యానమై – కావ్యాల కాంతియై కలిమి గాంచె.
పోతన తనమంత పోసెను పోతగా – భాగవతమ్మున భాగ్యముగను
వ్యాసుని విభజన వెలిగెను వాసిగా – పౌరాణికమ్మున పొలుపుమీరె.

తే.గీ. వేదవేద్యము వెలుగుల వెల్లువగను – మిత్రువిధమున యింపును మీరగాను
కాంత కాంతిని కావ్యమ్ము అందజేయ – అన్నిలోకాభ్యుదయమున యందుమించు.

సీ. గొప్పవారెవరన్న గోత్రాలు విప్పగ – తెలియదు త్యాగాన ధీరులెవరొ
మంచివారెవరన్న మాన్యులు జగతిన – పదుగురి ఫలమును ప్రగతిమించ.
ఎవరికి ఎవరన్న ఏనాటి బంధమో – తెలుపు సంబంధము తేటమనసు
నీలోని నీతిని నిలబెట్ట నిజమగు – పలువురు ఫలముల పాలుగొన్న.

తే.గీ. గొప్ప తక్కువ కాదేమి కోర్కెలున్న – మంచి మన్నిక మరువని మాన్యుడగను
నీవు జనతకు జగతికి నిధియెనాడు – మదికినిధినిండు మాన్యత మానవులను.

93

సీ. పదుగురాడెడి మాట పాటియై ధరజెల్లు – ననుమాట నాణ్యము కాదు జగతి
జనవాక్యమన్నది జగతిలో దైవమై – వెలుగుట కనలేము వెలితికలుగ.
సత్యమ్ము సతతమ్ము సవ్యమై నవ్యమై – జనగతి మార్చగా జగము వెలుగు
యోగమ్ము యాగమ్ము యోజన మార్గమ్ము – వరపుగ వెలుగును వసుధలోన.

తే.గీ. తాను ఒకడాయె పలువురు తనకుముందు – గొప్పదనమది వారిని గౌరవింప
మెప్పుకలుగగ జనమది మేలునెంచ – ఒప్పు గొప్పల వసుధను ఓగు విడుము.

సీ. గురువెవరన్నను గూఢము అర్థము – చీకటి తొలగించు చింతనుండు
గురువన్న గరువంపు గుణముల ప్రోవగు – గణ్యమై ధన్యమై గమనమెంచు.
గురుజీవనమ్మును గురుతించ పరువగు – అజ్ఞాన మంతమై అవని వెలుగు
గురుబ్రహ్మ గురువిష్ణు గురుమహేశ్వరుడాయె – గురుడాయె సర్వము గురుతుగాను.

తే.గీ. గురువురూపమెదృష్టికి గుణమునిచ్చు – గురువుమాటయె పుష్టిని గూర్చుమదికి
గురువుభావమె గురుతగు గూఢతకును – గురువు చేతయె చైతన్య గురుతు జగతి.

సీ. రాజులు పోయిరి రాజ్యాలు పోయెను – రాజసమన్నది రజిని విధము
మంత్రులు తంత్రులు మాసెను జగమున – వర్ణాల విలువలు వాసివీడె.
ఘన పురోహితులంత గగనాని కెగసిరి – మంత్రాలు మాయలు మాసిపోయె
అధికులు అధములు అనుమాట వీడగా – సమపాలనము నేడు సాగుచుండె.

ఆ.వె. కర్తకర్మక్రియలు ప్రజలాయె స్వామ్యాన – ప్రజలె విభులు మంత్రి పాలకులుగ
వెలుగుచుండ వెతలు వేల్పుల పరమగు – ప్రజల ప్రభుత వెలుగు ప్రబల శక్తి.

94

సీ. మనుధర్మశాస్త్రము మాన్యము మతమున – పక్షపాతము నందు పరువుపోయె
అర్ధాంగి అనుమాట అర్థము విడిపోయి – మాన్యత మహిళకు మాటలేదు.
వర్ణాశ్రమమ్ముల వరపేమో తెలియదు – ఆచార అవసర మహిమలిలను
పరిణామ క్రమమున ఫలమేమో అధికమ్ము – శాస్త్రము రూపించ శక్తిలేదు.

తే.గీ. పుస్తకాలపుటల పులినమై యుండగా – ఆచరణమునందు అర్థమాయె
మార్పుమాని జీవి మనలేని జగమున – తీర్పు తీరులన్ని తిరిపెమునకె.

సీ. మతమేమొ హిందువు మనసేమొ క్రీస్తుగా – మనువారు సంఘాన మాన్యులగుట
హితమున ముస్లిము హీనమౌనడతను – ప్రార్థన చేయగా ఫలము లేదు.
మోక్షంపు సాధన మోహాన ముంచిన – బద్ధమౌ బుద్ధుడు భవ్యడగునె
జైనము జయగీతి జైత్రయాత్రను జేయ – జాతిని జనులంత జాగృతులెగ.

తే.గీ. భరతదేశము మతముల భాగ్యధాత్రి – ఎందరెందరొ దేశికుల్ ఎఱుక సెప్ప
మతము హితముగ మనమంత మారగాను – ధర్మకర్మలు ధరణికి ద్రఢిమ నిచ్చు.

సీ. పాలక ప్రభువులంత పాపకర్మలసేయ – పాలిత వరులంత పథము మీరె
దోచుట కర్మయై దొంగల విధమున – జనసొత్తు నంజగా జయమునున్న.
అధికార మదిరను మత్తున మునిగిన – అంధుల కందదు అవని రూపు
ధనమేమొ మూలమై ధరణికి దరిలేక – జనగతి గతముగా జాతికుందు.

తే.గీ. దొరకదెచ్చట న్యాయము దొరలయందు – ఆటవికముగ నందింత్రు అవనిజనులు
ఆటుపోటుల నెదిరెడి నాయకులను – నవ్వులాటగ పాలన నటనసేయు.

సీ. కనిపించు కనులకు కనిపెంచు మాతయు – మిథ్యయె జగమన్న మితియులేదె
సర్వేంద్రియములను సన్నుతి నొందిన – నయనమ్ము మాన్యత నమ్మగాను.
జీవము నశియించు జీవియు చెడిపోవు – ఆత్మయె అవనిని శాశ్వతమ్ము
భౌతిక ఆత్మిక యౌగిక దశలను – కనబడనొక్కటే కథల మదుల.

తే.గీ. అన్ని సాపేక్ష విషయాలు అవనిలోన – మరియు వైరుధ్యమయములు వసుధలోన
వాద విదులను నిండిన వరుసలవ్వి – ఏది ఏమన్న కనుముందు ఎరుక కలిమి.

95

సీ. ఆటపాటలయందు ఆనందమందించు - అవనికి ఆశయ మందమగును
క్రీడల స్ఫూర్తియె కీటకన్యాయమై - క్రిందుమీదగుచుండె కీర్తి దప్పి.
జీవనకేళిలో జీవము తరుగగా - ధనమది జీవమై ధరను నిలచె
కళలను కలిమిగా గమనించు జనులకు - రాసిక్య రాజ్యాలు రహిని మించు.

తే.గీ. సారవంతపు తనువులు సాగిరాగ - మేధ వికసించు మేలిమి మెలకువలను
ఆట అందము జనతకు ఆశయమ్ము - ఆశయాలకు జీవన ఆట నిధియె.

సీ. వ్యాపార సంస్కృతి వ్యాప్తము జగమున - అమ్మట కొనుటలు అధికమాయె
మానవత్వము లేదు మాన్యత మరిలేదు - ధన్యత ధనమున దాగియుండ.
పెద్దఱికమ్మన పెదవుల విరుపగు - పేలవమగుచుండె ప్రేమ జగము
ఔన్నత్యమనగాను ఔదల దాల్చెడి - జనుడిట మృగ్యము జాతియందు.

తే.గీ. రేటుపెరిగెను జనులకు రేవడులుగ - సాంద్రమాయెను జనమన సాధనమ్ము
మంద్ర మగునీతి మడిసెను మతమునందు - విమత విదురుడు విలువల వీగెనేడు.

సీ. నందన వనముండె నాకము నందున - భువియందు కలదేమి బూతు తప్ప
భారతమందున రతముండె భాసమై - అనువారు అవనిని పండితులెగ.
రామాయణమ్మున రాజిల్లు లంకను - మర్మన పరులుండె మరులు నేడు
పుక్కిట నీరుగా పౌరాణి కమ్మాయె - మిత్రుని రీతియె మిగులదెచట.

తే.గీ. కలవు కలవను మాటయె కాదు నిజము - హేతు మతమెంచ హితమగు హేతురహిత
మూడులోకాల ముచ్చట ముద్దుగాదు - మధ్యలోకంపు మాన్యత మంది కెఱుక.

సీ. కథలను కల్పించి గాథల బులిపించి - అంతయు మిథ్యని అనిరివారు
మేధను ముంచగా వేధలు వారైరి - నమ్మిక కల్పించి నటనజేసె.
అంతరములు జేసి మంత్రించి తంత్రించి - మాన్యమౌ ధరణిని మసిగజేసె
భూసుర భాసుర భువిజేయ యత్నించి - సఫలత నొందిరి చాలవరకు.

ఆ.వె. తెలివి ఒకరి సొమ్ము తెగువయుకాదుగా - తగ్గ హెచ్చులుండు తరములందు
వర్ణసంకరమున వాసిని గాంచెను - విశ్వమంత నేడు విలువ కలిమి.

96

సీ. గీతచెప్పినగాని గీష్పతి వినిచిన - కర్మల మర్మము కాంతికరము
పావిత్ర్య గ్రంథము ప్రవచించె మహ్మదు - పరహిత మెంచగా ఫలము కలుగు.

క్రీస్తు బోధలయందు కీర్తియె బైబిలు – పాపుల క్షమియించ పరమమగును
బుద్ధుని బోధల పూజ్యమౌ నడవడి – జనమోక్ష సాధక జయముగూర్చు.

తే.గీ. ఎన్ని మతగ్రంథములనెన్న ఏకసూత్ర – మమర అవనియు అమరమై అధిగమించు
మానవత్త్వము నందించు మాన్యములుగ–పంట నందించు జనులకు ప్రథిత జగతి.

సీ. గుహలలో నివసించు గురువుల గరువమ్ము – శిష్యుల విడువగా శివము దప్పు
మేధకు తట్టిన మేలిమి విషయాల – పదుగుర కందించ ఫలమె జగతి.
చీకటి పోద్రోలు చిన్మయ చిత్తులు – ఆకటి కటకట నాపగలరె
తపసున తరియించి తపనను వీడిన – తన్మయ గురువుల తాపమదియె.

తే.గీ. స్థలము సమయము సంగతి సరసమైన – ఎదుటి గుండెలు వికసించ ఎఱుకదెల్పు
సద్గురువులిట కలుగగా సమత సహిత – భువియు దివిసీమ జ్ఞానమ్ము భుక్తియైన.

సీ. నిధియౌను సుధయౌను నియమాల నడతయు – విధులను విలువల వేద్యమగును
శీలంపు చేలము చిత్తమ్ము ధరియింప – చిన్మయ సుందరి చింతనమ్ము.
మోక్షమ్ము మురిపెమ్ము మోజుల త్యజియించ – నాగరకమ్మున నటన మీరు
నిత్యము నవ్యము నిగమాల సారమ్ము – ఆచరణమ్మున అమరమవియె.

తే.గీ. విబుధులెవరైన జీవన విలువ దెలియ – త్రికరణములందు తియ్యని తీరువెలయ
అంకితమ్మగు భావము అమరమగును – సమర సవనాల సమతయె సాగవలెను.

సీ. అనుమాన మానమ్ము అవధిగా నరులంత – ఆర్భాట మొనరింప అసదుకర్మ
అభిమాన ధనమంత అవగాహనములేక – దుర్వినియోగాన దూరమగును.
మానాభిమాన్యులు మాన్యులధనములు – మహినిండ వెలుగును మాత భవిత
హృదయాన స్పందన హ్రదమునబడగాను – అమలిన మలినమై అంతమగును.

తే.గీ. నిజము నిధియైన నిలకడ నియమమగును – మానరక్షణ దక్షులు మానవులుగ
మాధవులుగాను సేవల మరువకుండ – జగతి నుండిన జయమగు జాగృతమున.

97

ఏది నిత్యము ఏది సత్యము – ఏదనిత్యము ఏదసత్యము
బతికిచచ్చెడి నరుడనిత్యము – బతుకుమాటయె సత్యమందురు.

ధర్మమార్గము దయమె గమ్యము – సత్యగమనము సాగుజగతిన
మాటమూటలు ధనపురాశులు – అందచందము లసలనిత్యము.

ప్రాణమన్నది నీటిబుడగగ – ప్రాయమన్నది పరమనిత్యము
సత్యసంధత సాగజగతిన – నిత్యముండును నిధిగ జనతను.

కలలమయమే కథల లయమే – కాలమహిమన కలుగు సత్యము
సత్యబోధయె సాగజనులకు – నిత్యజీవన నియతి నవ్యము.

అంతరంగము నిత్యసత్యము – అంతరమ్మున అదియనిత్యము
జీవుడగునది సత్యమందురు – గాత్రమన్నది కాదు నిత్యము.

నాదమన్నది నిత్యమనగను – వేదమన్నది వేద్యమగునుగ
శూన్యమన్నది సత్యమైనను – భూమియన్నది సత్యమే గద.

మారుటన్నది జగతినిత్యము – మారకున్నది జగము కాదది
నిత్యసత్యము నిత్యమగునుగ – సత్యనిత్యము సత్యమగునుగ.

నరుడు నవ్యుడె నాగరకమున – సత్యరూపును గాంచనేరడు
జీవ జగతియు నిత్యరూపము – తెలియలేదది తేటకాదది.

యోగసాధన తపోనిష్టయు – సత్యపథమున సాగుచుండును
నిత్యులైనను సత్యమైనను – నియతివీడిన నిమ్నమగునుగ.

జగమునిత్యమ జలము నిత్యమ మనము నిత్యమ మనసు నిత్యమ
ఆత్మయన్నది నిత్యమందురు – కానబడదది కలగ సత్యము.

జీవమన్నది సత్యమగునా – జీవితమ్మది నిత్యమవునా?

98

సీ. నాకమ్ము నరకము నవ్యము దివమున – భువిలోని వానికి భుక్తిలేదు
దేవతా గణముల దివమెంతొ రమ్యము – భువిజన గణముల పూజ్యమవియు.
ఇంద్రుడు సాంద్రుడు ఇహమున లేడుగా – జనవాణి లోనన జరుగుచుండు
యమధర్మరాజిట యాతనమయుడుగా – నరకానికధిపతి నడత నియతి.

తే.గీ. తెలియరానివి తెలిపిరి తేజులంత – మనిషి మేధయె పదనుగా మాటవెడలె
కాలగతికవి కమ్మని కథలుగాను – జనుని జీవన మార్గము జయము నొందు.

సీ. మంచిని ఎంచగా మార్గము దొరకును – చెడ్డయె చేటగు చేతనమున
పరసేవ దలపెట్ట పరమార్థ మనినమ్ము – పరముడ నీవౌదు పథము నందు.

ఎగ్గుల దలపెట్ట ఏబ్రాసి తనమది – మొగ్గుములగ్గుకు మోదమదియె
తృప్తియె తూరుపు తనువుకు అరుణిమ – ఉదయంపు వెలుగగు ఉన్నతముగ.

తే.గీ. మంచి మూర్తిగ నరుడుండ మారు జగతి – పరుల ప్రేమించ పరువగు పయనమందు
నమ్మకమ్మున నడువగ నయమె జగము – ఆత్మ అందము దీపించు ఆశయముల.

సీ. కలలుగ ఇలనిండ కామితములనన్ని – కాయాన సంధించ కలదు సుఖము
ఇంద్రియలోలత ఇలనెంతొ కఠినము – మనసు వివేకమ్ము మరువజేయు.
అరిషడ్వర్గాలను అహమెంతొ దీపించు – మనిషిని పశువుగా మార్చివేయు
కడుపుకు సరిపడ కబళము తిందుము – అట్లనె కోరికల్ అవనియందు.

తే.గీ. జగము మిథ్యను వారల జపము తపము – మనుజు వాంఛల మరలించ మార్గమేమొ
కథల గాథల అజ్ఞుల కందజేయ – లోకమజ్ఞత మగ్నము లుప్తమగును.

తే.గీ. చదువు సంస్కారమిడలేదు జగతిలోన – న్యాసమయ్యెను విన్యాస విలువ విడువ
ఆచరణమున అన్నియు అసదులాయె – నిజము దెలియగ హేతువు నీటిమూట.

99

సీ. అంతరంగాలలో అధికము రంగులు – అంగాల రంగాల అగుపడవుగ
రంగులు రూపాలు రహిజన వివిధాలు – కలుపునదొక్కటే కలత కరుణ.
స్వార్థుడు జనుడైన స్వగతము విగతము – కనబడకుండగ కలియుహృదిని
పొరుగుల తోడ్పడ పోదేమి స్వార్థము – పరమార్థ ఫలితము పరమమగును.

తే.గీ. జాతిభాషలు ప్రాంతాలు జాతకముగ – మానవత్త్వపు మనిషికి మత్తుగూర్చి
కలిసె కమ్మని కథలోన కలల కలిమి – తెల్లవారగ తెలిమబ్బు తెలివి తెగువ.

సీ. వఱువాత మేల్కొంచి వరపుగా పనిచేయు – ఇల్లాలు ఇంటికి ఇంపుసొంపు
అందరి రుచులకు అందమౌవంటల – వండియు వడ్డించు వలపుమీర.
విసుగును వేసట యిసుమంత లేకుండ – ఇంతియై బంతియై ఇలను నిండు
భర్తకు పంచును భవమున అర్థమ్ము – భవితకు బాటకు బలముగూర్చు.

తే.గీ. అట్టి ఇల్లాలినందరు అందగించ – బిడ్డలందరు అనురాగ బిరుదులుగను
సహన మహిమకు సాదర సారముగను – అమిత అభిమాన గౌరవ మందజేయు.

సీ. సంబంధ బాంధవ్య సరసత కొరవడె – సాధన వాదన సరగు మీరె
తనతప్పు తెలియక తనముందు వారల – తప్పులు తడవగా తపనమీరె.

దోషాలు ధరణికి దోహదమివ్వవు – సహనము భూమిని సాగుగాగ
చేతల చేవయు చెరగదు జగమున – చెలిమికి మించిన చేతలేదు.

తే.గీ. మనిషి జీవనకాలము మరియునెగ్గు – జీవితమునందు తనదగు జీవకర్మ
చేయకాలాల కదియుండు చేతములను – చచ్చి బ్రదుకుట అదియౌను చలువమీర.

తే.గీ. నాటకమ్ముల జనమత నయము వీడ – బూటకమ్మున మాటల మురువు పొంద
పైనమెరుగుల లోకాన పైదలిగను – యంత్ర బొమ్మగ నరునిది యానమయ్యె.

తే.గీ. మాట మెరమెచ్చు మనసేమొ మలినమగును–భావ భారము మోయును బతుకు గుండె
రక్త అణువుల జీర్ణించె రజిని రంగు – నరము నరమున గలిసెను కలిమి కోర్కె.

100

సీ. మెడలోన సర్పంబు మెయినిండ బూదియ – కంఠాన గరళమ్ము కాంతిదాయి
శిరముపై గంగమ్మ శివముల చంద్రుండు – కాటియందుండెడి కామశాపి.
కౌపీన ధారికి కన్నుండ నొసటను – శూలమ్ము చేతను సూక్తి దాయి
కైలాస శిఖరాన కైంకర్యసేవల – ఉమగూడి తాండవ మూర్జితముగ.

తే.గీ. అర్ధనారీశ్వరుండన అందమైన – శబ్దవాచ్యుడు ప్రణవాన శంకరుండు
శక్తి దయితుడు ముక్తికి సంగమంబు – శివుడు శివరాత్రిపర్వాన శివము విడుట.

సీ. మహిమల రూపాల మాన్యుడౌ నీశుడు – పార్వతి గూడగా పరముడగును
హిమశైలమునయందు హితమతి జనులకు – ఆలయ శిఖరాలు అందగించు.
నందివాహనమున నాజూకు నడకల – నరులను కాపాడు నాయకుండు
తలపున పిలుపున తరలెడు తపనుండు – భక్తరక్షణమున భవ్యగుణుడు.

తే.గీ. కోర్కెదీర్చెడి కోవెల కొలనుప్రక్క – సుందరాకార మందిర సుఖములందు
తేలియాడెడి శివుతేరు తేటయగును – అందగించును శివరాత్రి అహముద్రోలి.

సీ. దుష్టుల శిక్షింప దురితుల నణగార్చ – ధరణిని ప్రభవించె దయను కల్గి
శిష్టుల రక్షింప శివముల వీక్షింప – క్షితియందు వెలసిన కీర్తినీవె.
భ్రష్టుల మేలెంచి భయమున కాపాడు – బాధ్యత నీవెంచి బయలు పడగ
నిష్టను సేవించ నీవిచ్చు శుభములు – జనజీవితములకు జయమునిచ్చు.

తే.గీ. పాపసంహార ప్రాభవ ప్రభువు నీవె – దోష హరణకు నీవౌదు దోహదమ్ము
పామరత్వాన్ని హరియించు పాలకుడవు – పరమ పరతత్త్వ పావన పాలితుడవు.

101

సీ. ఢమరుక జనితమ్ము ధరనక్షరములుగా – ధరనిండె భాషగా ధనముగాను
ఓంకార నాదాన ఓపస్సు జనియించి – జగమున జయమెంచు జాగృతాయె.
పాపుల శిక్షించి పాపాల హరియించు – శూలాన శుభమెంచు శుభమునీవు
హిమగిరి కన్యకా హితమతి నీవయి – లోకాల లోపాల సకల మెరిగి.

తే.గీ. భక్తజనసేవ నీకెంత భాగ్యమయ్యె – దీన జనరక్ష సేయుటె దివ్యమాయె
జగతి దితిపుత్ర సంతతిన్ సమయజేసి – అందమానంద తాండవ అవనిజేసె.

సీ. మూర్తి త్రయమునందు ముద్దుగామూడున – లయకారవాచ్యుడై లహరి మీటె
శివపురాణమునందు శివరూప జ్యోతియై – మహినిండ మండించె మాన్యతలను.
అసురుల పరిమార్చి అవనిని రక్షించి – అమరుడై సమరుడై అవని నిలచె
ఆంధ్రదేశమునకు అమృతము నందించె – రూపాల మహిమతో రుజలుబాపె.

తే.గీ. వరపురాణములందున వాసిగాంచె – ఆదిభిక్షువు అందరి కందు భుక్తి
లేనివాడుగ కన్పించు లెంకతాను – శివము శివరాత్రినిడుగాత చిత్తములకు.

సీ. కావ్యాల గాథల కమనీయ శ్లోకాల – నినుగొల్తు రందరు నిత్యమిచట
అర్థాంగి పార్వతి అవనికి వెలుగుగ – అంతరంగమునకు అంగమయ్యె.
మహిమను మరపించు మాన్యుడు మురుగను – విఘ్నాల రాజుగా విజయసుతుడు
కైలాస కామినీకైవల్య మూర్తియై – కాముని దహియించె కాంతిమయుడు.

తే.గీ. వర్ణనమునందు వరపాయె వరుని రూపు – నేత్రములకది నేస్తము నెయ్యమలర
గాత్రములకంది అందము గరువ మొప్ప – పాత్రుడాతడు పరమార్థ పాలనమున.

102

సీ. లింగంబు అంగాంగ లీనమై లీలగా – భక్తుల కోర్కెల బాగుసేయ
రూపాల రూపమై రూక్షమై రుజలను – తొలగించు కార్యాన తొందరపడు.
శివరూప చిన్మయ చిత్తాన నిలచెడి – మలినమ్ము నావలన్ మాన్పునతడు
సాగర మథనాన సంజనితంబైన – విషమును మింగిన విదుడతండు.

తే.గీ. ఎన్ని విధముల విశ్వాన ఎదల నిలచి – మన్న నలగొన్న మహితుడ మాన్యుడవుగ
జాగరణసేయ జాగృతి జవమునిచ్చి – ఘనత శివరాత్రి గలిగించు గణ్యనీవు.

సీ. ముద్దుగా ముక్కోల మురిపెంపు హస్తాన – పాపుల సమయించు పాశుపతము
నందిని వాహన నవగ్రహనాణ్యమై – నరులకు పుణ్యాలనందజేయు.
అసురుల సమయించి అమరత్వమందించ – ఆతురత్వముగల్గి అవతరించె
తిరిపెము తీయనై తీరని మమతల – భక్తులనేలెడి భాగ్యమతడు.

తే.గీ. భువిని వెలసిన భువనంపు భూరియశుడు – దేవ దేవుల దేవుడు దేహులకును
చిత్తశుద్ధిని కొలువగా శివములిచ్చు – ఉపవసమునందు భక్తియె ఉన్నతమ్ము.

సీ. భవుడన నీవెగా భవబంధములనన్ని – బాధించు బాధల భవమునందు
శివుడన శివముల చిందించు చిన్మయ – వేదాంత వేద్యుల వేల్పునీవు.
హరుడన నీవెగా హరియించు పాపాల – అవని జనమ్ముల ఆస్తికుడవు
పరుడన నీవుగా పరమార్థ భరితమౌ – జనతాపహరణమ్ము జయమునించు.

తే.గీ. పేరులెన్నియొ పేర్మిని పెంపుమీర – అన్ని నీలోన లయమందు వస్తువులెగ
సర్వమున్నీవె సాగించు సమత మమత – వినుత పర్వాన విజయమ్ము నిమ్ముమాకు.

103

సీ. హద్దులు హితముగ హతమాయె సమతయు – అవగాహనము లేని అడ్డుగోడ
ప్రేమలు మీరగా పెనములు మనములు – పేదకు పెద్దకు పేలవములు.
ఆర్భాటముగనేడు అందరు అహమున – వర్తించ నర్తించు వలపు గెలుపు
పరిపక్వ మనసులు పంకాన మగ్నమై – ప్రాభవమును వీడె బతుకులందు.

తే.గీ. భూమిసరిహద్దు సంద్రము భువనములను – సంద్రసమ్మిత మేధల సారమంత
విభజనమునందు మగ్నమై విభుత వెలసె – ఆత్మ పరిశీలనమునందు అందు సమత.

సీ. ఆకాశవీధిని హాయిగా ఎగిరెడి – పక్షికి అశనమె ఫలముగాను
ఆరణ్యములయందు అదురుచు గమియించు–మృగముల మురువును భృశము భుక్తి.
జలచార సంద్రాన జీవుల గమనము – పొట్టకు దినుటకు పోడిమికిని
భువిపైన జనులంత భుక్తికి భవితకు – ఆశలు తీరగ అవని నిలచు.

తే.గీ. అన్ని జీవుల ఆర్తియె ఆకలికిగ – మానవునిపేర జీవికి మనికి అదియె
మేధ బాషయు గలిగిన మేలి జీవి – పొట్ట నిండగ పోరాడ పొంకమగునె.

సీ. కూపస్థ మండూక కూటమి జనులంత – స్వార్థమ్ము జగతిగా సాగుచుండె
బలమైన జీవులు బలహీనులనుజంప – బలిమియె కలిమిగ భావమందు.

హింసయె భువిలోన హితమని తలచెడు – క్రూరులు కూలగ కులము జెడియె
మేధావులందరు మేదిని వెలయగా – జనహిత మతియేమొ జవమువీడె.

తే.గీ. నాదవాహిని భువియందు వాసితగ్గె – నాది నీదను భావము నయము వీడె
మనదియను భావమొక్కటే మాన్యమిచట–బతుకుబతికించు మనుమాట భావ్యమగును.

తే.గీ. చెడుదునీవిట చెడగొట్ట చేతములను – చంపువృత్తిని చత్తువు చావురాగ
నిలుప ప్రాణము నీవెగా యీశ్వరుడవు – తలపు చెడుగాను చేదౌను తనది తనకె.

సీ. అవసరమన్నది జనునకు తప్పదు – తీరెడి తీరులు తిరుగు దిశల
అవగాహనముకల్గ అందరు విజ్ఞులే – అవనికి అదెమేలు ఆశయముల.
ఆదరసహితులై అవనిని నరులుండ – అతిశయమౌనుగా జయము జవము
అభిమాన మాధృతి అందందు మహిమగా – మహిజన మాన్యమౌ మానధనము.

తే.గీ. నరుల నటనమె నవ్యమై నాకమగును – నటన జీవనఘటనయై నయము గాగ
నరుడు నాగరకమ్మున నాయకుండె – అదియె లోపింప అధముడు అవనిలోన.

సీ. నమ్మకమిలలేదు నాథులయందున – బాధల లోకమ్ము బాగుపడదు
మానవసంఘము మార్మికతనుమున్గె – భావము స్వార్థమై బాధగుండె.
రాతలు రాసెడి రాజును పడదిట్ట – తనయత్నమేమిటో తనకు లేదు
నిమ్నమౌ మార్గాల నియతులు వీడిన – పరధనహరణమ్ము ఫలముగాంచు.

ఆ.వె. నరుడు నరుని నమ్మ నవ్యమే నేడిల – నమ్మకమ్ము పోయె నరులయందు
మట్టినమ్మగాను మాన్యమౌ ఫలముండ – మనిషినమ్మఫలము మనకు లేదు.

సీ. రైతులు కృషిచేయ రాజిల్లె సస్యము – శ్రమకేమొ ఫలమాయె శక్తిమీర
శ్రామికులందరు శ్రమచేయ శక్తిని – ఉత్పత్తి పెరిగెను ఉర్విలోన.
వృత్తిని పనివార్లు వర్తించ వరులుగా – సర్వులు పనిచేయ జరుగు ప్రగతి
విద్యార్థి వినయంపు విలువలు పాటింప – జ్ఞానియె సంస్కార గరిమ మించు.

తే.గీ. కృషియు లేకను ఫలమెంచ కౄరమగును – జనుడు ప్రతివాడు జగతిని జయముగాంచ
తప్పకుండగ శ్రమచేయ తరళమగును – సోమరులు నేడు అధమంపు సోదరులెగ.

తే.గీ. అందరానిది పొందగ ఆశ వదలి – పొందు పొందిక కల్గగ పొలుపుదక్కు
అంతరంగాలు ఆశయ అంచులుగను – మించు భారత భవితయు మించులుగను.

105

సీ. కర్మల మర్మము కలిలోని సర్వము కనులార గాంచిన కర్మయోగి
లోకమ్ము సర్వము లోలత్వభరితము పరమాత్మ భావమె పలుకుయోగి
జీవేశ్వరైక్యము జీవనమర్మమై జితకాముడైనట్టి జీవయోగి
సన్యాస నియమము ధన్యమై మాన్యమై ధరణికి వెలుగిచ్చు దైవయోగి.

ఆ.వె. తనువు తపనమరచి తరియించె వెంకయ్య – అందరాని మోక్షమందె జనుడు
సర్వసంగరహిత సమభావ జీవని – సకల జనులకిచ్చు సంతసమ్ము.

సీ. పంచేంద్రియాలను పంచభూతాలతో – అనుబంధముంజేసె అతిశయుండు
సుఖముల నెరుగని మఖముల జేసెను – గుప్తమౌ శక్తుల గురువతండు
కౌపీన ధారణకైఔవల్యకారణ – కరమున యష్టితో కలిమియుతుడు
నిశ్చల దృక్కులు నిర్మల వదనము – నిగమాల సారమె నిర్వృతుండు.

తే. పాపభాగుల నెరిగిన పావనుండు – మదము మాత్సర్యమోహాల మంథనుండు
దుష్టచేష్టల కష్టాల దూరగుండు – మంచి మానవ తత్వాల మాధవుండు.

సీ. శివునిగా నిన్నెంచ చింతయే లేదుగా – శంకరనామమే శక్తికరము
విష్ణువు రూపాన వివరముసేయగా – విబుధుల మార్గమే విజయ యుతము
కలియుగ దైవము కమ్మని వెంకన్న – కలవర రహితము కాలహితము
పల్లె పల్లెలనిన్ను పరమాత్మరూపంగ – ప్రజలంత పూజింప ప్రగతి కరము.

తే. రూపమొక్కటె రుజలన్ని కూపమందె – పిలుపు లెన్నైన పలికెడి వలపునీదె
మానసములందు సముడవై మసలు నీవె – మహికి సమభావ మందించు మాన్యనీవె.

తే. నీదు సన్నిధి నిధిగాను వాదుసేతు – నీవె పెన్నిధి సత్యము నిగమయుతుడ
నరుల కోర్కెలు కొడిగట్టి నదిని బడగ – బతుకు బాధలు భరియించు భవమునందు.

తే. అంతరంగము శుద్ధమై అహములేక – అమర వెంకయ్య నామము అవనిలోన
దిశల దశలందు మార్మోగ దివ్యమగును – ప్రణవ నాదమె ప్రజలకు పావనమ్ము.

తే. త్రికరణములందు తీరైన తీర్థమతడు – ఇంద్రియములకు హితమును ఇచ్చువాడు
త్రిగుణసారము దెలిపెడి తిరుధనుండు – తత్వమంతయుతానాయె తాత్వికుండు.

ఆ.వె. నీతిజాతినియతి నిత్యచైతన్యమై – విశ్వమంత వెలయు విలువగలిగి
ధర్మరక్షణమున కర్మలు కలుగగా – కలిమి కలియుగమున కలల పంట.

ఆ.వె. తనివితీరలేదు తరియించ రమ్మురా – తపన తరిగిపోయె తరములందు
తాపసుండు నీవె కోపము నణచగా – కోర్కెదీర్చిపొమ్ము కోమలతను.

106

సీ. వెంకయ్య తల్లిగా వెతలను దీర్చును – తండ్రియై పాలించు తపనతోడ
వెంకయ్య గురువుగా విద్యల నిచ్చును – పరువము గరువాల ఫలముతోడ
వెంకయ్య దైవము వేదాల సాక్షిగా – పాపాల శాపాల పారద్రోలు
వెంకయ్య కలిలోని అంకము కరుణకు – అనురాగ రాగాల అతిశయమ్ము.

ఆ.వె. గొలగమూడి యిల్లు గొప్పదైవెలుగగా – ఆశ్రయమ్ము తాను అల్పులకును
పరులు ఫలమునొంద పరిచరియలుసేసి – పావనతను గొనుడు పౌరులార.

సీ. అవధారణముగల్గు అవధూతతానయ్యె – లోకావసరముల లోలుడతడు
భక్తియు శక్తియు ముక్తిని గలిగింప – భాగ్యసేవలు పొందె భవమునందు
మననము మహితము మనురీతి మాన్యము – మానవదేవుడై మహిని వెలుగు
అద్భుత చర్యలు అవనిలో అమితమై – అంతరంగాలలో వింతసుమ్ము.

తే.గీ. పెన్న పక్కన పేర్గాంచె పేదవాడు – అన్నదానము అమరమై అమరుచుండె
నిత్య ఆరాధనములతో నిధులు గురియు – వేంకయార్యుని క్షేత్రము వైభవమ్ము.

సీ. దండముపెట్టగా దయకురిపించును – అండగా తానుండి అన్నిజేయు
వందనమనగానే బంధనములు దెంచు – అవనిలో అందాల నందజేయు
పరిచర్యసేయగా పరమును దెలుపును – ఇహలోక ఇక్కట్లు ఇరులు మాయు
ఉపవాసముండగా ఉన్నతినందించు – అహమును ద్రుంచును ఆశయముగ.

తే.గీ. శక్తికొలదిని పూజింప శమము విడును – భక్తిభావాన గొలువగా భాగ్యమిడును
రక్తి వెంకయ్యపై నింప ముక్తి కలుగు – వేంకటేశ్వరు భావమె వెంకయగును.

తే.గీ. తైలమిడగానె మైలలు తరలిపోవు – శిరుల ఖండము దర్శించ చేరుదరికి
సూత్రధారణ శుభముల పాత్రమగును – స్వామిరూపము సారము స్వాతిశయము.

సీ. కాల్మడకను రాగకామితములు దీరు – కారుణ్య కమనీయ కర్మఫలము
రుగ్మత భగ్నతల్ రూపము చెడిపోవు – నీచెంత నిద్రించ నియమ యుతము
నీనామరూపాలు నిత్యసత్యాలాయె – నరులందు వరులందు నాణ్యయుతము
త్యాగాన యోగాన తరియించి తరలిన – తాపసు నీవెగ తనువు బలము.

తే.గీ. నీ సమాధిని స్పృశియించ నింద వెడలు – నీదు నామము గానము సాధుయుతము
వార వారాంతముల గాంచ వాసి గలుగు – వెన్నుదన్నుగ వేంకయా! వెతలుదీర్చు.

107

వైభవం వైభవం మాల్యాద్రి వైభవం – వైనమంత చూడగా వైభవంపు దైవం
కొండపైన వెలసిన కోరికలకు సామి – అండమాకు నీవయి అందలమెక్కించు.

నరసింహము నీవుగా లక్ష్మి లక్షణమ్ముగా – లావణ్యపు జంటగా భక్తుల రక్షణజేయి
బ్రహ్మాండమంతటినీ బాగుపరచువాడా–ఇమ్ముగ మావిభుడవై విలువనిమ్ము విజయుడా!

సింహరూపు పైభాగము – నరరూపము వరముగా
అంతరములు లేనివాడ – ఆంతర్యము అవని శుభము.

నీకొండగుహలలో – నిగమవేద్యులుండిరట
నియతులనిత్యము సత్యము – నిధులైరట జగమునకు.

సర్వము పర్వము నీవే – గర్వరహిత మానవులకు
పూజ్యపురాణములకే – పుణ్యగణ్యచరితుడవే
మాలకొండ వైభవం – మహిమగనుము మానవా!
మనకుదండ నరసింహుడు – భవరోగములుడుగగా!

108

కందుకూరు సీమకే అందమైన దేవుడు – మాలకొండ నరసింహుడు మనకు దేవుడు
కొండ శిఖరమందునా కొలిచెడి భక్తులూ – కొలతలు మీరగా కోర్కెతీర్చుకొందురు.

విష్ణువు అంశగా విలువల అంశమై – విజయలక్ష్మి అండగా రక్కసులను శిక్షింతువు
ప్రకృతిశోభతో పరవశమై నిండుగా – సుకృతి ఆకృతిగా శుభములిమ్ము సామి.

శక్తిగల్గు శనివారము – శమములు నిండుగా
రక్తి భక్తులకు నిత్తువు – రమ్యనారసింహుడా
సంద్రతీర సరిహద్దుగ – రహదారికి ప్రక్కన
రమణితోడ వేంచేసిన – రాజశేఖరుడవీవె.

మెట్లదారి రోడ్డుదారి – మేలుగ నినుచేరగా
మేదినిజన మేలుకీళ్ళ – మేరనీవె మాల్యాద్రీ!

నీనామము గణ్యము – ధన్యమె ధరియించగా
ప్రేమ నీదె పెద్దదిగ – పేరుకూడ నీదెసామి.

109

భక్తులారరండీ – భజనసేద్దాము
శక్తుని పూజించీ చేతనత్వమందుదాము
మాల్యాద్రి మహిమనూ మానవులకు చెబుదాము
మనబాధలన్నిటినీ మరుగున పడవేద్దాము.

పంచభూతములకంటెను – పరముడాతడు
పంచేంద్రియములకు ప్రాభవమాతడు
చేతులెత్తిమొక్కినా చెలువును పంచును
మాట మనసు మలిపినా మాన్యత నిచ్చును.

పాపములను పారద్రోలు ప్రభువేతాను
పుణ్యములకు నిలయుడు పూజ్యుడు సామి
ఆరువర్గముల శత్రువు అమరమునకు విభుడు
తలచి కొలుచు తనువులను తపియింపజేయడు.

వేదములకు వెలుతురు వేదనలకు వెగటు
అష్టాదశ పురాణముల అమరిన వాడటు
పరమేశుడు రమేశుడూ వరనారసింహుడు
భయమునకే అభయము భవభయదూరుడు.

స్థలమును చూడగా కల నిజమగునుగా
దేవళమును గాంచగా దేహము పావనం
దేవీ దేవులను జూడ దేదీప్యము జీవనం
భావి ఘనము మనముగా భాగ్యము మానవం.

110

వందనం వందనం మాల్యాద్రి వరునికీ
నందనం నందనం అందమైన స్వామికీ
మనోవాక్కు కర్మలతో మహనీయుని పూజింప
మానవత్వ మహిమలే మానవాళిలో నిలచును.

దేవితోడ మాల్యాద్రీ దేహులకాపాడగా
జీవగణం భక్తిమునుగ ముక్తినాతడిచ్చుగా
ఆకాశంపై తిరిగిన దివ్యవిమానం
పూలమాల విడిచెనుగా కొండపైన
కోర్కెదీరె విష్ణువునకు కాపురమచటగా
భక్తజనుల నందనమది నవ్యమాలకొండగా.

పూలను పూజించగ – పుణ్యములబ్బును
నారికేళమును కొట్టగ – నవ్యత కల్గును
పసుపు కుంకుమల పెట్టగ పావనతబ్బును
తలనీలములనివ్వగ తలపులు వలపులే.

అమ్మ లక్ష్మమ్మను – నాన్న నారసింహునీ
నరులంత కొల్వగా – నయవర్తనము కల్గు
ఆరోగ్యమునిచ్చుగా – అమరులాదేవులు
ఆశయములు పండగా – శమములిచ్చు శక్తుడు.

111

మాలకొండ స్వామికీ మల్లెల హారము – లక్ష్మీనారసింహునికి రమణీయ హారము.

కొండబండలందున్న అండగు దేవుడు – అందచందములుగల్గు ఆర్తికి దేవుడు
జనియించిన వన్యజీవి ధన్యత జెందగా – జాగృతమొనరించెడి జాణయె తానుగా.

పాదార్చన పావనము పరమార్థ సాధకము
భక్తిపారవశ్యము భవపాపహరము
ఈతిబాధలన్ని తొలచు హితమతితానుగా
ఆశీస్సులనందించెడి ఆదరువేమనస్వామి.

పాలిత పాలకుల పాదపమాయన – జపముల తపముల ఫలముగ తెలిసెను
పంటల నిండించీ తంటల దీర్చెగా – మింటనున్న కంటివేల్పు మాల్యాద్రిస్వామిగా.

మానవతను పండించెడి మాధవుడాయన
దానవతను దమియించెడి కారణమాయన
త్రికరణముల తీర్చిదిద్దు తీయని వాడుగా
తిరువీధిని నివసించెడి నరసింహస్వామిగా.

112

కొండలకోనలందు కొలువున్న మాల్యాద్రి – కోర్కెదీర్చుమయ్య కొలుతునిన్ను
సత్య సుందరతల సారము నరసింహ – లక్ష్మితోడ బ్రోవు లక్షణముగ.

భయము బాధలన్ని భవమున లేకుండ – భాగ్య యోగ్యమైన భావి కలుగ
మానవాళి నంత మహిమతో కాపాడ – మాలకొండ సామి మనకు దిక్కు.

పరమయోగులున్న పావన క్షేత్రము – భక్తతతుల కిచట ముక్తికలుగు
అవనిలోన కలుగు అవధూతలందరు – మహిమగనగ మహిని మాలకొండె.

భువిని దివిగజేయు భూపుడవీవెగా – కాంతిశాంతి నిడెడి కలిమి విభుడ
కాలగమనమందు కరుణను కురిపించి – వసుధనేలు వాసి వరుడ నీవె.

113

మాల్యాద్రి కొండ మనబంగరు కొండ
మాన్యనారసింహుని మహిమల పూదండ
కొండమీదనెలకొన్న కొంగు బంగారమా
అండమాకు అహరహమై ఆశీస్సుల నిడుసామి.

రూపము సింహము మాపుము మలినము – సరసన లక్ష్మితో సమత నందింపుము
రక్కసితనమును – ఉక్కడగించగా – రమ్యత పంచెడి – రాజువు నీవుగా.

భువన భాండములకు పూజ్యుడవగుదువు
జనన మరణ జాతులకు జయకారణమీవుగా
శోభల శోధనలో శుభములనిడువాడ
బాధల భావనలో అభయమిమ్ము సామి.

మెట్టెక్కిన మేలు కొలుపు దిగిన అహము దిగిపోవును
అద్రిపైన నిలిచి చూడ అవనియె కనువిందగును
మాలలోని మహనీయత మనుజీవుల మానవత
కొండలోని కాఠిన్యము కోర్కెకోమలత్వము.

ముక్తినందించెడి ముద్దుల సామి భక్త జనుల పోషింపుము భవమున సామి
శక్తి యుక్తి కలిగించగ శాంకరుడవునీవు రక్తి కలుగ మాలకొండ రమ్యమగును సామి.

114

సీ. భారతదేశము భాగ్యాలరాశిగా భావించిరండహో భానులార
దేశభక్తిని మించి దేహులై దేవులై ఇంపు సొంపును గల్గి ఇంద్రులార
చల్లని తల్లిని చక్కగ రక్షించ సాగిరండిట మీరు చంద్రులార
ధర్మాన సత్యాన దాతృత్వ భావాన చరితను గాంచుడు చరితులార.

ఆ.వె. దీనజనుల రక్షణ దీక్షతో సాగించి – శీలసంపదలను శివమునెంచి
జాతి జనని గాచి జయపథమున సాగి – స్వేచ్ఛతోడ రండి సేవకులుగ.

సీ. మాతను రక్షించి మాన్యతనందగా అలనాటి ధన్యులు అమరులైరి
పోరాట పటిమతో పోడిమి మించగా ఆరాట పడిరంత ఆశయమున
సత్యాగ్రహమ్మున సాగిరి జనులంత హింసకు దూరులు హితులు వారు
క్విట్టిండియాయను గట్టినినాదమ్ము పట్టుదలనుమించి పరవశమున.

ఆ.వె. మానధనములన్ని మట్టిలో కలిపిరి – జాణలందరపుడు జయముగొనగ
జాతిరక్షచేసి జయభారతముచూడ – జాగృతముగ నాడు జవము నందె.

ఆ.వె. ఆశయమ్ము గలిగి ఆర్తులగాపాడ – తల్లి భారతమ్మ తనయులంత
తపసు చేసిరంత తపనయె స్వేచ్ఛగ – తారలైరి వారు పౌరుషమున.

సీ. బానిస భావమ్ము బావురుమనెనాడు భాగ్యమై గాంధీజి యోగ్యుడాయె
దెబ్బకు దెబ్బగా దిటవున పటువున దివ్యమై నేతాజి భవ్యుడాయె.
ఉరికొయ్య చెరసాల ఉద్యమచోద్యమై ఊపిరులూదిరి ఉన్నతముగ
ప్రాంతాలు ప్రజలంత ప్రాభవమహితులై ఐక్యతా రాగాన అందగించె.

ఆ.వె. విప్లవమ్ము వెలుగు విజయము మనదిగా – ఉద్యమమ్ములెన్నొ విద్యమాయె
త్యాగభావమందు యోగులు వారైరి – ఆర్తిబాప కీర్తి అమరమాయె.

సీ. సర్దారు భగతులు సావర్కరులు నాడు సాదర సోదర సారమైరి
లాల్బాలు పాలులు లక్ష్యము సాధించ లాభము జనులదై శోభమీరె.
తాంతియా ఝాన్సీలు తరళమౌ దీపాలు వెతలన్ని వెడలగ వెలుగు పంచె
నేతాజి గాంధీజి మాతకు ఆప్తులై ఆంగ్లేయ సామ్రాజ్య మవని విడిచె.

తే.గీ. జాతి జాతీయ కాంగ్రెసు జగతి వెలిగె, దేశభక్తియు శక్తియు దివ్యమాయె
కర్మధర్మము శర్మమై కలిమి పంచె దానవత్వము దౌష్ట్యము ధరణి విడిచె.

సీ. మూఢత మూర్ఖత ముప్పిరి గొనెనాడు – అజ్ఞత అధికమై అవని నిలచె
కులములు మతములు కూటములెనెన్నొ – కుత్సిత తత్వము కూలజేసె.
బానిస తత్వము దోపిడి వర్గాలు – దొరలకు ఆనాడు దోహదమ్ము
విభజించి పాలించు విధమును ప్రబలమై – విమతుల విజయము విలువమించె.

తే.గీ. భారతీయత భావింప భాగ్యమాయె – కులము మతములు కూటముల్ కూలిపోయె
వీధి పోరాట బాటలో వ్యాధికుదిరె – సార్వభౌములు జనులైరి సాహసమున.

115

నమ్మకాన్ని అమ్ముకొనే నాగరీకం నవ్య విఫణి వీధులలో విహరిస్తున్నది
మనసు మాన్యమై బుద్ధిబద్ధమై శుద్ధి సిద్ధించనిదై మానవమేధోవిభవం మసి బారింది
విశ్వ విఫణి వీధుల్లో భౌగోళిక గ్రామం భాగ్యమే భావనగా బంధాలు కొని తెచ్చుకొంటుంది
మెరికల్లాంటి మేధోజీవులు జన్మభూమికి జెల్లకొట్టి విదేశాలకు విందు చేస్తున్నారు.

భారతీయ సంస్కృతిలో భాగ్యదేవతలెందరున్నా పరమే పావనమంటున్న సుఖైక జీవులు
మానవత్వం మనుజీవులకుంటే మేధోమధనల ధనానికి దాసోహమంటున్న వైనం
కార్పొరేట్లు కర్పరంగా ఉన్న విద్యామానం కలవారి కంప్యూటర్లకు ఆనందబాష్పాలందిస్తున్నది
అరణ్యాలలోని ఋషులు నక్సలైట్లు ఆలోచన ఆశయాల్లో అందరి అవసరాలు తీర్చే మేధావులే.

ఎక్కడో మేసి ఇక్కడ ఈనిందని ఇంపుగా అనుభవించే
ఇతరులకు హితం కూర్చే భారతీయ మేధావులు.
ప్రయోగం, ప్రయోజనం, ప్రమాణం పాళ్ళు కలియక
పలవరించే శాస్త్రజ్ఞుల మేధస్సుకు మేలుకొలుపు ఎప్పుడో.

మానవనాశనం, మానవాభ్యుదయం మరచిన
మేధోవిభవం భవతారక తంత్రమై భాగ్యహీనమయ్యింది.
'మనము'ను మరచి మధనపడే మేధావులకు
'స్వార్థం'గుర్తొచ్చి స్వాభిమానాన్ని తాకట్టు పెడుతున్నారు.

అక్కడి 'అర్థం' ఇక్కడ 'అన్వర్థ' మవుతుందని
అవకాశవాదపాలక మేధావుల పరిభాష.
భరతజాతి మానవ మస్తిష్కం భగవద్భావనలో
భవితకు భరతవాక్యం పలుకుతున్నది.

ప్రయివేట్ విద్యాకర్మాగారాల్లో ప్రబుద్ధ మేధావుల్ని
ఉత్పత్తిచేసి ప్రపంచ దేశాలకు లాభాల కెగుమతి చేస్తున్నారు.
హైటెక్కు ఐ.టిల హైందవజాతి బిల్‌క్లింటన్, గేట్స్‌ల
ముందు సాష్టాంగ ప్రణామం చేయాల్సిందేనా?

బ్రహ్మపదార్థం అన్వేషించిన భారతీయ తాత్త్విక చింతన
బతుకు సుఖానికై విదేశాలకు తన్ను తాను అమ్ముకొంటుంది.
అష్టాదశ యోగాల 'గీత'లో అంతర్భూతమైన మేధ
'అన్యం' ధన్యమైనా అమ్మకానికంగీకరిస్తుందా?

తెలివి బలిసిన భారతీయులకు తేటజీవితపుటాశ
ఎండమావియే కాని ఎదకు మధురం కాదు.
మాతృభూమికి మంచిచేసే మానవాళి మేధ
మనోహరం మహాద్భుతం, మహనీయం, మాన్యం ధన్యం.

116

జంతువైన మనిషికీ – జాతిమానవులదనీ
వింత మనసు కలుగగా – వంత తెలియు వరుడనీ.
సంఘజీవనములోనా – సారమె తన మానవతనీ
సహనవహన సమతలో – సాగుమురా మానవునిగ.

కన్నుతెరచి జననమనీ – కన్నుమూయ మరణమనీ
మధ్యజీవితములోనా – మగతలోన బడకుమురా.
జన్మనీకు తెలియదూ – మరణమేమొ మారదు
జవము జయము పొందగా – జాంతవ జీవనుడైతివి.

తల్లి భూమి తనయుడవై – తలదన్నెడి వీరుడవై
కల్లలతో కాలమంత – కరుణలోనె కలగలిసెను.
త్యాగమె నీ యోగము – రాగమె నీ భోగము
పరమార్థము నీకాయెను – స్వార్థ రహిత జీవనము.

ధర్మనిరతి దార్ఢ్యముగా – సత్యశౌచ శక్తులుగా
శీలమె నీ చేలముగా – అంగాంగము పవిత్రమే.

మెదడులేని జంతువులే – మేలనిపించెను నేడు
కలిగిన నీ మెదడులోన – కలత నలత కలవరములు.

భయంలేని బంధువుగా – బాధలేని సింధువుగా
భావమె అనుబంధముగా – భాగ్యమె నీ మానవత.

117

అమరంలో సమరంలో ఆడదే అధికం
అవని భార వహనంలో ఆమెదే సహనం.
మనుధర్మపు మాన్యంలో – మగువ తీరు గణ్యం
నవనాగర లోకంలో – నాతి విధము నాణ్యం.

అమ్మగా ఆలిగా – అతివయె మధురం
చెల్లిగా అక్కగా – చెలువమె చెలువం
ఆది గురువు అమ్మగా – ఆలించెను నాడు
అవని పరువు ఆమెగా – అవతరించె నేడు.

సాంద్రులైన ఆంధ్రులలో – సారసాఖ్య ఆమె
భారతీయ భాగ్యములో – భార్యవర్య భామ
ఆరువిధముల ఆరోగ్యమిచ్చును
అష్ట మార్గములను ఐశ్వర్య మందించు.

రాజ్యముల రాకపోక – రామరహిని వర్తనమె
ప్రేమ రాగ ప్రేరణములు – ఆమె హృదయ గుణములు
పురాణాల పూజితము – ఇతిహాసపు హితము
మహిళ మతము గౌరవమే – మానవాళి మాన్యము.

మగువ తెగువ మహనీయము – మనసు పంచు మానవా
తనువు అర్థమొసగునది – తపనను పడనీయవద్దు
ఓర్పు తీర్పు ఓజస్సులు – మార్పునీవు చేయవద్దు
కలికాలమె చెలికాలం – కనికారమె చెల్లనీకు
మగువ యుగం నవయుగం – మన్ననతో అభ్యుదయం.

118

సృష్టిలోని అతివృష్టి శుభరహితం – అవనిలోని అనావృష్టి అశుభదాయకం
సృజనలోని సుజనులే సుందరులు – మందులైన మానవులే మహిషములు.

బ్రహ్మసృష్టి చేసినా – బాధ్యతలను మరచినా
కమ్మదనం జీవులలో – కలిమిగ భాసించును
ఆదిత్యుని కొలిమిలో కలిమి వీడినా
ఆ రాతిరి చంద్రునిలో సుధలు కలిగెగా.

మేదిని దినరాత్రములే – మేలుకొలుపు సంధ్యలు
కాదను నవనాగరికులు – వాదములో మిగిలెను
ఆడమగల అభిమానం – అవమానమాయెను
ఆ దేవుని ఆలోచన – అవగాహన కాదాయెను.

మానవుడే దేవుడైన – మహిమాన్యము మమతకు
జన్యువులో మార్పులన్ని – ధన్యతకే దారులగు
భారము వహియించలేని – భూమిని భూమాత
భాగ్యమునే కోలుపోయి – బంధనముల మిగులు.

కంపనలో జీవులకే – అంపకాలు పలికె
కమ్మని జనమన్ననకే – కలతల కథ వినిచె
కారణ భూమాతయే – రణగాత్రిగ మారె
ప్రేరణముల జీవికయే – పేలవమై లయించె.

మారెడి యీ రూపానికి – మాధుర్యము పంచి
మమకారపు మానవతకు – నుడికారం నించు.

119

విరూపాక్షు నీడలో – వెలిగెను నీరూపం
సురూపాక్షి సొంపులే – శోభన మణిదీపం
నడక కదనులో నడుము విరిగెను
ఉండిలేని నడుములో హృదయమే నిండెను.

లేడికనుల లేపాక్షి లేమనీవె జలజాక్షి
కామ కర్మ కామాక్షి రామ రహిని రమ్యాక్షి

చేపకళ్ళ జలజాక్షి చెలిమినించు చపలాక్షి
పంచేంద్రియ ప్రధమాక్షి – ప్రమదమివ్వు మధురాక్షి.

హంసనడక గాంచగా – హంస ఎగిరిపోవును
హింస మదిని పెంచగా – అంశు వందమాయెను
ఊహల ఊయెలలో – ఊగిసలాటాయెను
హృద్యముగా ఉద్యమమై – ఉన్నత స్తనభారము.

గుప్పెడు మనసులో – గూటి పక్షినీవుగా
విప్పెడు పెదవులలో – విరితేనెలు కురియగా
నాసిక సంపెంగలో – నవగంధము విరియగా
మోము మోదమాయెనుగా – చక్కని యా చెక్కిలిగా.

వేణివేదనల బాపెను – వాణి వాదనల వినిచెను
వాదన వేదన వాసికి – బోసిపోయె నాదములే
అలంకార కారణముగ – అవతారము మారెను
తారక భువిపై వెలసి – తన్విగ తపనను తీర్చెను.

అమృతాన్ని అందించిన – ఆ అందము కాదు
లోచనమే స్పందించిన – లోక అందమదియే
మనసును మైమరపించిన – వయసుకత్తె వాలకం
మానవతను అందించెడు – మనజన్మకు కారకం.

120

భార్యాభర్తల బాంధవ్యం – భవసాగరమున సౌందర్యం
కల్లోలములను దాచుకొనీ – కలతల తీర్చెడి కథసారం.

సహనం శాంతం సహకారం – స్తవనీయములే సమభావం
స్వర్గం శోభల సంసారం – భువి అనురాగపు అమృతసారం.

మనువు భాషలో మగువల మాన్యం – మగధీరులనిధి మానస వేద్యం
అర్థము అతివల అంతరంగమై – సార్థక జగముగ అవతరించుగా.

జన్మకారణం జగతికి జాగృతి – జయశీలమునకు జాణ ప్రకృతి
ప్రకృతి పురుషుల పావన కలయిక – కామన తీర్చును కల్పకమ్ముగా.

అంగమర్ధమై అతివశుద్ధమై – మనము బలమున మగువ మమతయై
జీవన జిలుగుల వెలిగించునదై – మగువ సగముగా మగడు ధన్యుడే.

సాగరమే చెలికట్ట దాటనిది – సంసారము గృహసీమ విడువనిది
గ్రహగతులన్నీ గమనము వీడిన – గరువమె భార్యల పరువపు పథము.

121

ప్రకృతీ ప్రకృతీ ప్రాకృత జనజాగృతీ – పావనతను వీడగా ప్రకృతియే వికృతీ
కృత్రిమలోకానికీ కౄరమాయె ప్రకృతీ – ప్రళయమైన ప్రకృతికీ విలయమైన ఆకృతీ.

ధరణిజనుల దారుణాలు ధరియించిన ప్రకృతీ
ప్రళయ కృతితొ మారణాల ప్రవర్తించు సుకృతీ
మతులు కృతులు వికృతమై మదమత్సర ఆకృతమై
మనుజీవుల ప్రకృతియే మమత సమత వికృతియే.

పురుషునికృతి ప్రకృతిలో పూజ్యమైన ఆకృతిగా
ప్రకృతిలో కలిసిమెలసి పావన నతల సుకృతిగా
కంపించిన భువిలోని కర్కశప్రకృతిలోనా
కనరానిది ఆకృతి కలలు కల్లలైన కృతి.

జననంలో మరణంలో జాజ్జ్వల్యం ప్రకృతీ
జయగీతం జనునిదై వినిపించును ఈశృతీ
సుకృతి ఆకృతికాగా సుందరమై ప్రకృతీ
ప్రకృతి ప్రాణంకాగా అందమైన జనునికృతీ.

ప్రకృతిలో నినదించు – ప్రకృతిలో లీనమవ్వు
ప్రకృతిలో పరవశించు – ప్రకృతిలో ఫలమందు
ప్రకృతిలో పావనమై – ప్రకృతిలో జీవించు
ప్రకృతిలో జయమందు – ప్రకృతిలో శాంతించు.

122

ఆంధ్రదేశమా – సాంద్రతేజమా – అన్నపూర్ణకాలయమై అతిశయించు దేహమా.

గోదావరి వంశధార గోదాయే నీది
పినాకినీ కృష్ణలా ప్రేమపంట నీది

బంగాళాఖాతమునకు బంధువు నీవు
తూరుపు కనుమల పానుపు తలగడయే నీకు.

రాణ్మహేంద్ర చాళుక్యుల రసనయె మధురం
కొండవీడు అద్దంకియె కోమలతకు నిలయం
కాకతీయ శౌర్యపటిమ కామితమే నీకు
మగువ తెగువ మాగాణము మమకారము పంచు.

తెలుగు విజయ భువనానికి రాయలు నీవాడు
కవితలల్లు మొల్లమ్మల కలరవమే నీది
పరదేశపు యాత్రికులకు పావనగాత్రివి నీవు
కరదీపిక తూర్పు ఇటలి కమనీయవు నీవు.

సస్యశ్యామల సీమ సారమైన కోస్తసీమ
రాయసీమ రతనాలకు తెలగాణం వెలుగుసీమ
మూడుపేట్ల ముచ్చటగా ముగ్ధ మందిరమునీది
భాగ్యనగర గరిమకే యోగ్యమైన భువినీవు.

కాకుళము కాళహస్తి ఆరామములెన్నో
బుద్ధిశుద్ధి బౌద్ధమునకు ఆలయమే నీవు
సారమైన తత్వవేత్త సాకారం నీది
ప్రపంచాన పావనతకు ప్రగతిశీలమే నీది.

123

ఆర్ష సంస్కృతి అంధమాయెను – ద్రవిడ సంస్కృతి దారుణమ్మయె
భరత సంస్కృతి బాధగమిగిలె – గాంధీమార్గము గహనమాయెను.

సత్యము సతతము – సంరంభమాయెను
నిత్యమహింసయే – నీరుగారిపోయెను
సత్యాగ్రహమనుమాటే – సంతపాటగామారె
శీలమనగ జగతిలో – శిలువ వేయబడెను.

కరుణ దయల కర్మలే – కాఠిన్యములైపోయె
త్యాగభక్తి భావనలే – వనవాసము చేయుచుండె

పెద్దవారి గౌరవమే – పేలవమై పోయెను
ప్రేమకున్న అర్థములే – పెడదారుల పయనించెను.

అమ్మల గౌరవించు అవని జనులు లేరుగా
నాన్నల పూజించెడి యువజనులు సున్నగా
మహిళ మాన్యతను గనెడి మానవులే కరవుగా
సంఘవర్తనములోనా సారళ్యత విరళమే.

చెడును అనుటకనుట వినుట చేతనలో చెలువుగా
సహనము సహకారము సంయమనము హరించెగా
జాతి మతము జాజ్జ్వల్యము జగతి హితము పూజ్యము
త్రికరణములు రణమునకే త్రిలోకములు కలతలకీ.

స్వేచ్ఛా స్వాతంత్ర్యములే విచ్చలవిడి విహరించగ
స్వేచ్ఛకొరకు పోరాడిన మహాత్మునే మరచిరిగా

124

అరుణకిరణముదయించెను అక్టోబర్ నెలలో
అరణ్యమున రణనినాద రమణీయత వినిపించె
చైనా రష్యాలలో చెంగలువలు వికసించె
అభ్యుదయము విప్లవమున అవనిని ప్రభవించె.

రాచరికపు సౌధములే రమ్యతలను విడిచె
నిరంకుశపు నీలినీడ వాలె నపరదిశకు
మధ్యయుగపు వంధ్యత్వము మరగికరిగిపోయె
నవ్యనాగరకమునందు దివ్యయుగము వెలసె.

సంకెలలను ఛేదించగ సంగరమే సలిపె
విడిపోయిన ఆ సంకెల విప్లవముగ వెలిగె
మానసికము విప్లవమై మనుజులందు కలిగె
శ్రమజీవుల జీవనమే శక్తి మయము దెలిసె.

ప్రపంచమే పావనతకు పథమునుచూపించె
విశ్వమందు మానవతకు వెతలు తీరిపోయె

దారుణముల మారణముల ధరణి మారిపోయె
మార్పు తీర్పుమనుజీవుల నేర్పరి తనమాయె.

మనిషి మనిషి మధ్యనున్న మహాగోడకూలె
చేయి చేయి కలుపగా చేతనత్వమాయె
యుద్ధము సిద్ధముకాగా వధ్యమాయె నవత
బుద్ధి శాంతిపూర్ణముగా ఇత్థమాయె గణ్యత.

మహాత్మునికి జన్మనిచ్చి - మహోన్నతము యీనెల
సర్వమానవాళికిదే పర్వదినపు ధనము
తేడాలను మరచెడి - తేటదనపు దినము
మనసుకలుగు మానవులకు - మాన్యమైన దినము.

125

మహిళల చైతన్యము - మహికి అదే ధన్యము
మానవతకు ప్రాభవము - నవతకదే ప్రాకారము.

గృహిణి గురుతుగా - మహనీయము మహిమ
జన్మకారణమ్ముగా - జగదాధారము జనని
సహన సాగరమ్ముగా - సంసార సారమది
కామితముల దీర్చగా - కలియుగమున కలికి.

మంటలలో మాడుచుండె - మహిళ మాననీయత
వంటలలో వాసిగాంచె - వనిత కమ్మదనమంత
అంగడిలో బొమ్మరీతి - అతివ సతము మారె
అమ్మదనం అవనిలోనె - కమ్మదనం వీడె.

మతములెన్ని చెప్పినా - మతులు గతులు మారినా
సతిని వెన్ను విరిచినా - వన్నె దరిగి పోయినా
బోధ లెన్ని చేసినా - భామ బాధ తీరునా
మాన హీన మాయెగా - మహిళ మహిమ మరపెగా.

ఆదివేదకాలానికి - ఆదమరపు గాను
అంధయుగపు మందులకూ - బంధనమై తాను

మధ్యయుగపు మత్తులకు – చైత్యమైన తాను
నేటియుగపు నేవళతలకు – నేతిబీర తీరు.

అర్ధరాత్రి ఆడపడుచు – అసలె రూపు లేదు
పట్టపగలు పడతికీ – పావనతయె లేదు
నలుగురిలోన వలకీ – వలువ లేనె లేదు
అరగొరగా వలువకీ – విలువకట్టు జనులు.

చైతన్య మహిళలే చైత్యములై పోయిరి
చిత్రములై చూడగనే చిత్తములను మరిచిరీ
విత్తమునకు అమ్ముడైన విలువల కూడలి యిదీ
ముత్యమంటి ముగుదలనూ ముద్దుగనీవు చూడరా!

126

గాంధీజీ జన్మభూమి – ఘనమానవ వన్యభూమి
మృగవర్తన నర్తనలో – మృతినొందెను మానవత
మెత్తని ఉత్తరభారత – చిత్తమదే చిరుదివ్వె
పడమటి దిశ సంధ్యలో – సింధువందమాయె హిందు.

పోరుబందరున పుట్టిన – పోరగాడె పోరుసలుప
పోరాటమె ఆరాటము – అవనిజనుల స్వాతంత్ర్యము.

ఛాందసముల అంధతముల – చెదరగ చైతన్యమాయె
బెదరని ఆ బేహారుడు – భేదములను దమియించె.

అవనిలోని ఆ తత్వము – సత్యాహింసలు భక్తిగ
మూలముగని మున్నీళ్ళను – కదిపి కుదిపి కలత దీర్చె.

స్వార్థరహిత స్వాతంత్ర్యము – స్వాగతించె సాధువుగా
సాధన తన ధనముగా – సాగె జనత మనసులలో.

ఆడంబర రహితము – ఆతని నిజవర్తనము
ఆశయమే అభ్యుదయము – ఆదర్శము భారతికి.

ఆకలి దప్పులు మరచిన – అతని తపన అమ్మస్వేచ్ఛ
దేవులందరొకటేనని – దేశమునకు చాటెనుగా.

శాంతియు సహజీవనములు – శక్తి ముక్తి దాయకములు
భేద భావ వాదములు – భీకరములు కర్కశములు.

మరణించిన మంచివారు – మనమధ్యనె వసియింతురు
మానవతకు స్ఫూర్తినిచ్చు – వారి మూర్తి పవిత్రము.

127

వెన్నపూస మనసు – వేదనలకు దినుసు
వనిత వన్నె వలపు – కన్న కడుపు తలపు.

కలిమి కలిగినా కరుణ తొలగదు
లేమి మిగిలినా – లేతదనం లేదు
కాలగమన మెటులైనా కామిత మాతల్లి ప్రేమ
యుగ యుగాల చరితలో ఉదయించిన మాత మమత.

సాటిలేనిది సాధనతో రానిది
మాట చాలదు మనసు మాటులోనిది
పంచభూతమయమది పంచేంద్రియ బంధమది
పాతకొత్త కానిది పావనతకు పాదు అది.

మురికి కడిగినా ముద్దు సద్దుమణగదు
పాలు లేక కొరికినా పలుకు పలక బారదు
కాళ్ళ గోళ్ళ రక్కినా కందిపోని దా మనసు
ఏండ్లు పూండ్లు గడిచినా ఎద ఎరుకకు మరకలేదు.

నిత్యసత్యఖనది నిగమార్థ సారమది
జాతినీతి జన్యువది జాజ్జ్వల్యము ధన్యమది
వన్యములకు మాన్యమది వసుధేశుల సుధ అది
రక్తమాంస రమ్యమది రహిరమణుల గణ్యమది.

అందము అధమము తెలియని అవని సౌందర్యమది
అరుణోదయ కారణమది అభ్యుదయపు ఉదయమది
అమ్మలేని జగత్తునకు ఆది అంతములు లేవు
జననిలేని జాతికీ జయశీలములే తరుగు.

128

వీరులదీ దేశం – విజయానికి సందేశం
పంచనదుల పావనం – పరమగురుల సమ్మతం
మతము హితము మమకారం – సమతారథ సాకారం
ఆదిగ్రంథ అవతారం – ఆదర్శపు సౌందర్యం.

శిక్కులకు సింధూరం – శివభారతి ముఖచందం
స్వర్ణాలయ శుభగణం – స్వాతంత్ర్యపు నికేతనం
పరిరక్షకు ప్రాణమిచ్చి – పావనులే వారలు
రణావనికి రాజులుగా – రమ్యజీవనులె వారు.

అమృతసర్ అమరము – సమరధనం జనులది
జలియన్ వాలాబాగున – జాజ్జ్వల్యము జాతిభక్తి
విప్లవ వీరుల స్థలము – ప్లవంగమే అభ్యుదయము
మాత బంధనల ద్రెంచుట – మహనీయుల ఆశయము.

రౌలత్ చట్టము చుట్టము – మట్టము జన స్వేచ్ఛయిచట
ఎదిరించిన ఎదలలో – పదిలమాయె తూటాలు
జనగణములు జయశీలురు గణరాజ్యము గుణమనుచు
కూడిరొక్కచోటున కూర్మిని మాటాడిరి.

వేడుకగా మిగిలెను వేళమించి పోయెను
డయ్యరు వచ్చినాడు ధమధమ మనిపించినాడు
వందలాది ప్రాణములే గాలికెగిరిపోయెనులే
రక్తపుటేరులు పారెలు గుండ్ల వర్షమే కురిసెను
దురంతమే జరిగిపోయె మారణము దారుణమయె.

దేశభక్తి దేహులంత దేవతలై దివికెళ్ళిరి
అచటనుండి ఆశీస్సులు అందించగ అతిశయించె.
స్వాతంత్ర్యము మనహక్కుగ నినదించగ నియతికలిగె
భరతజాతి భవితవ్యం 'బాగు'లోన జ్వలించెను
జ్వాలవెలుగు జాజ్జ్వల్యం స్వాతంత్ర్యపు శోభలతో.

129

మానవ సంబంధాలు – మాడిపోవుచుండెను
మారిన కాలానికీ – కల్లాయెను మానవత.

దేవుని జీవుని బంధము – దేహములో మిగిలెను
తల్లి తనయ సంబంధము – తలపులలో మండెను
బంధుతతుల బాంధవ్యము బాధలందు దెలిసెను
అందరి ఆ అనుబంధము – అవని నిండి ఎండెను.

ఆకాశము అవనికీ అవకాశమె బంధము
అమరానికి రహికీ అవసర సంబంధము
నరనారీ నవబంధము నాణ్యతనే కోరెను
భవసాగర మథనంలో బాధ్యతలను మరచెను.

జీవన గమనంలోనా జిలుగు వెలుగు వెలసెను
జీవికి గమ్యము దెలియక జీవహీనముగ మారెను
కర్మల అన్యోన్యతలు కలతలకథలాయెను
మర్మము ఆ బంధమై మమతలనే తలచెను.

అవకాశం అనుమానం అవహేళన భరితము
అసలు సిసలు బంధము బంధనముగ నిలిచెను
తపన తీర్చుకొనువిధము తరుణబంధమాయెను
నవమానవ నాగరకము బాంధవ్యము మరచుటే.

దివ్యత నవ్యతకాగా దిటమగు నీ బంధము
భవ్యజనుల బాధలందు బంధువీ సంబంధము
మరపులేని బంధములో మనుజీవులు సాగగా
వరపగునుగ యీ వసుధ సుధ మానవ మనుగడ.

130

తే.గీ. దేవి దేహుల కాపాడు దివ్యరాలు – భావి భాగ్యాలు యోగ్యతన్ భామ యిడును
అవని అహమును మమకార మపహరించు – దుర్గ అపవర్గ సాధక వర్గమిలను.

తే.గీ. కామ కారణ కాలము కలత నంద – రాణి రమ్యత రవణమె రసనసుమ్ము
రక్తధారల రాక్షసున్ శక్తితోడ – రక్తి ముక్తిని గూర్చెడి రమ్యదుర్గ.

తే.గీ. చండి చాముండి చైతన్య మందితమ్ము – దండి దారుఢ్య దాక్షిణ్య దాయిసుమ్మ
ఖండనము జేయు కార్పణ్య కర్కశముల – భండనము తల్లి భవపాపముండనమున.

తే.గీ. మాతమహిమకు మాన్యము మమతయుతము
మంచి చెడులను దెలిసిన మించు తల్లి
కన వివేకము కరుణలు కలుగు వెలుగు
జ్ఞాన గమ్యము జాణయె మనకు సతము.

తే.గీ. సింహవాహన నాదము చింతదీర్చు – సుకృత రూపము వికృతిన్ శుభములిచ్చు
కాళిరూపము కాలమై గమన గరిత – పారవశ్యము మాతది పరమ రూపు.

131

తే.గీ. పూజచేసిన పుణ్యాన పూతమగును – భక్తి దలచిన భాగ్యాల రక్తి గలుగు
అంధకారము వెలుగైన అవనిలోన – అమ్మ కమ్మని రూపము అందమగును.

తే.గీ. అరుణ కరుణల రవణము అతివగాను – ప్రకృతి ప్రాభవ వైభవ ప్రగతి తాను
త్రిగుణ సుగుణాల తీరులు తీయగాను – త్రివిధ రూపాల దేవియై తిరుమణియగు.

తే.గీ. సంఖ్య నవమిట నాణ్యము సరసతలను – దేవ రాక్షస తత్త్వాల దేవి గనగ
రక్ష సేయగ దైవత్వ రాజ్యమాయె – నమ్మ నవ్యమై దివ్యమౌ నరుల బతుకు.

తే.గీ. వాడ వాడల మేడల వాసి గనగ – వేడుకొనగాను దేవియె వెతలు దీర్చు
అంద మానంద మవనికి ఆమె యిచ్చు – బంధ తతులను బంధించు భాగ్యమమ్మ.

తే.గీ. కలదు లేదను వాదము కలత పడగ – మాత కలదను వేదము మహిమ గనును
జాత భూజాత జయమున జాణయగును – సర్వ లోకాల శాంతులు పర్వమగును.

132

నమ్మకమే నవజీవనరాగం – నవ్య జనతకది భవ్య వేదము
విశ్వాసము జనశ్వాసముకాగా – విశ్వమె విలువల వెలుగు కిరణము.

భామ తలపులకు – లేమ వలపులకు – భార్య భర్త లిట – భాగ్య దేవతలు
యోగ్య జీవనులు – యోజన నుండగ – త్యాగ బంధమది – తెరువు తెలుపునది.

ముద్దు మోమునా – ముగ్ధ భావనా – మూగ మనసునా – మునిగె వేదనా
భామ భోగము – భవుని యోగము – రామణీయకం – రమ్య జీవనం.

ఆత్మీయమైనది అందమన్నది – కనుచూపు నందది కమ్మనైనది
భావనలో నిండగా భాగ్యమైనది – అన్యోన్యత పండగా ధన్యమైనది.

షట్కర్మల సంస్కారం సహితము కాగా – జన్మనిచ్చి అమ్మగా జగతిని నిండగా
పరవశమున ప్రకృతిగా ఆకృతికాగా – పావన నవజీవనమున ప్రగతి సుదతికాగా.

ఆడది ఆడదే ఆడదాని నీసడించు
ఆడపిల్ల పుట్టుననీ కడుపుతీసివేయును
అమ్మలోని మానవతను ఆడజన్మ విడువగా
ఆడదాని గుండె గుడిని ఆ దేవుడు నిలుచునా.

134

ఆలు అలిగెనా అర్ణవమే పొంగును
భార్య బాధ పడెనా భాగ్యములే తొలగును.

కలికి మనసు కలవరమై ములికి తీరాయెను
కామిని కార్పణ్యానికి కామనలే కరిగెను
కరుణారుణ కలికి కనులు కలిమిని వర్షించు
పెదవులసడి ముడుపులతో ముద్దుల హర్షించు.

అహరహము అతివలకు సహనము హద్దు
అంతరంగ ఆంతర్యము అందరికీ పద్దు
భరియించెడి జీవిగా భార్య అర్థమీయగా
భవబంధము భర్తకుగా అర్థమతివ పొందుగా.

పొలతి పొందు విందుగా – పోడిమి మగడెంచుగా
మగని మనసు మాన్యముగా – మగువ లిలను దలచుగా
బంధము అనుబంధమై – సంబంధము సాగగా
తీపి గురుతు చిన్నారుల – చిరునవ్వులె విందుగా.

ఆలుమగల ఆంతర్యము – వింతల సృజియించుగా
అంతవింతలైన బతుకు – అవనిని జయగీతముగా
సాగర సంసారంలో ఆగని ఆ నౌకలోన
ఆటుపోట్ల తంటలతో – ఆవలిదరి జేరునదే

ఆలుమగల జీవనౌక – అమృతమయ జీవనము
అటునిటు పడి తట్టుకొనక – మధ్యమునుగు నౌకలే
ఆలుమగల అంతరములు – అవి అవనిని నేడువద్దు.

135

అవనిలోని అమృతభాండం – ఆలుమగల అన్యోన్య దాంపత్యం
సంసార సాగరాన్ని మథియించగా – అమృతమై ప్రభవించెను ఆలుమగలుగా
ఆలుమగలు పాత్రలై ఆ మథనంలో – అమరధనం పొందిరిగా సమరజీవులై.

సూర్యుడై పగటికీ సుందరుడై భర్తగా
అమృతమయ కిరణమై అతివరాత్రి వెలుగుగా
రేయిపగలు అమరమై మగువ మగలె మహిమగా
కాలము గమియించుగా కలల కమ్మదనముగా.

రుచి ఎరుగని రుచ్యమే సంసారసారము
మది గదిలో మరువమే మగువ మగల కలయిక
శోభన శోభలో శోధనయే మనసు మధువు
అర్పణలో అంగాంగము తర్పణయే తనువున.

నిత్యనియమ సారము సత్యసాంగత్యము
ముత్యములకు మూటగా ముద్దుల ముచ్చటగా
మానవతకు మాన్యముగా మమతల పూదోటగా
ఫలవంతము గుణవంతము పావన దాంపత్యము.

136

అందమైన లోకానికి అనుబంధం అందము
అనుజుల ఆ బంధమే అమరముగా విందుము
సుకుమారము సుందరము సహనంతో మహితము
మహిళమాననీయము మగవారికి మరువము.

వీడని ఆ అనుబంధము విలువలకే విజయము
మహిళ మగల మమకారము మానవతకు జయము.

గ్రహరాసుల అనుబంధము గణ్యమైన దీ
గగనంలో సూర్యునికే గరువమిచ్చునదీ
ఆడతనం ఆలయమై అవతరించు జనుడు
అక్కచెల్లి అనుబంధమే అవనిని ఆ ఆలయం.

మనువాదము మాన్యముగా మహిళ పంట పండెను
సమవేదము సహవాసము సౌమ్యతతో నిండెను
పంచేంద్రియ చైతన్యమె చెలువ చెలిమి కలిమి
పంచభూత పావనమే పుడమి చెలువ బలిమి.

ప్రకృతి రక్షను చేసెడి పురుషుడే పరముడు
సుకృతి సుదతిని జనుడు సురక్షణలో వరుడు.

రమ్యమైన స్త్రీ ప్రకృతి రక్షను కోరెను
గమ్యమె ఆ బంధముగా గణుతికెక్కెను
చెల్లి చిన్నదానిగా అన్న రక్షకోరును
ఆ రక్షణ నందించెడి యీ దినమే – రక్షాబంధన దినము.

137

దేశమాత రక్షణలో దేవులైరి వారలు
భూమాతను రక్షించగ పూజ్యులే మీరలు.

జనని జన్మభూమియే స్వర్గమనీ తెలిపిరీ
మనము రక్షసేయగా మాన్యమనీ తెలుసుకో
మాతజాతిరక్షలో మమత సమత నిండును
మగువ మానరక్షణలో మహనీయత పండును.

జయముకోరి జవానులకు జాతి జాణలంపిరీ
అందమైన సందేశము అదె రక్షాబంధనము
లింగభేదములని మించి అంగడిలో బొమ్మగా
అన్నలంత అతివలను అసహనమున ముంచిరిగా.

మనసులు దగ్గరై మధువులు పంచగా
అన్నచెల్లి అనుబంధమె ఆశయమగునుగా

వత్సరాని కొకరోజే వాసి పొందు బంధము
మత్సరముల మరువజేయు మాన్యరక్షబంధనము.

వందనము బంధనము విందును మాకందించు
చందన సుమగంధముల సరసత పండించు
ముచ్చటైన బంధము మూడుముళ్ళదీ
అచ్చమైన అనుబంధము అన్నచెల్లి బంధము.

ఒకకడుపున పుట్టినా పుట్టకపోయిన
వసుధజనుల సోదరతకు సాక్ష్యమీ బంధము
ఆడవారి కందమది మగవారి మహిమ విధి
కాపాడుటె కాంక్షగా కట్టు రక్షబంధనము.

138

కరుణ కలిత మాతరా – కమ్మని భూజాతరా
కలియుగమున కాంతిరా – కలికి జన్మ థెరిసరా.

విశ్వమానవాళికీ – విలువల సందేశమూ
నశ్వరమౌ మానవతకు – నవ్య సంకేతమూ
దీనుల దయజూపగా – దివ్య సంబంధమూ
అమ్మది ఆ బంధము – దయయె థెరిస చందమూ.

మట్టిలోన జన్మనెత్తె – మాన్యతయే మదరు బుద్ధి
బాధబాగుచేయునట్టి – బాధ్యతయే భాగ్యమద్ది
దూరతీరములనున్నను – దుఃఖమెక్కడున్నను
అక్కడ ప్రత్యక్షమగును – అమ్మ ఇమ్ముగా జూచును.

సుఖములకు విముఖమై – కష్టములతొ కలిమిగొని
దిక్కుమొక్కులేనివారి – దేవతయై వెలిసె థెరిస.

మనసు మధువు ఆర్ధతలో – మమత మానవత లోనూ
మహిమ మాత చేతలన్ని – మమకారపు మధురిమలే.

తనకు తనయులెవరు లేరు – అనాథలకు తల్లి ఆమె
వ్యథితుల సుఖమును చూడగ – వెలుగునామె హృదయమూ.

బాధలయీ భువికీ – భాగ్యమె మన థెరిస
శోభిత దయామయీ – శోధించెను జనహృదిని
ధాత్రిదాటిపోయెనూ – దైవమైన దయామూర్తి
ఆర్తి దీర్చు నామెగనీ – స్ఫూర్తి నొందు మానవుడా!

139

అమ్మ జన్మనిచ్చినా – ఆలు కౌగిలించినా
ఆప్రేమయె మధురం – అవనిలోని అమ్మధనం.

అమ్మల తలదన్నెడి విశ్వమానవులకమ్మ
మగువల మనసులు కలిసిన మాననీయ అమ్మ
అవతరించి తరించిన అనురాగపు అమ్మ
కరుణదయల కురియించిన కాంతియె థెరిసమ్మ.

కీర్తిగన్న క్రీస్తుమూర్తి కీర్తన ఆ యమ్మకూ
బుద్ధభావనములోని సేవన చెలి అమ్మకూ
ఆర్తిదీర్చు హైందవమున మూర్తులె ముద్దమ్మకూ
త్యాగధనపు మహ్మదీయ తెరువు పరువు అమ్మకూ.

మతము మానవత్వమన్న మహిత భావమమ్మయే
పీడరోగ పిలుపులలో తలపుతాను అమ్మయే
కస్తిపడిన హస్తములే కలిమి గాంచు నమ్మయే
ప్రేమమూర్తి పేరు మదరు ప్రేరకమా అమ్మయే.

అనాథలకు ఆదరువై అవనిపంట పండించె
బాధలన్ని బాపుటయే బాధ్యతగా తలచె
శరణాలయములలో నా కరుణ కాంతి విరిసె
అరుణారుణ జీవనమే అమ్మమదిని వలచె.

గుండ్రమైన భూమిలోని గొడుగే మన థెరిస
తీంద్రమైన ఆపదలో తీర్పరియే తల్లి
మంచి మమత మానవతల మాన్యమె మనమాత
విశ్వశాంతి విలువలకీ విజయము మాఅమ్మ.

140

వినయానికి విద్యకూ - విజయానికి విలువకూ
వినాయకుడె దేవుడూ - విబుధులకే ధనదుడూ.

కర్మభూమి మానవులకు - విఘ్నకర్మ మర్మజ్ఞుడు
శర్మమెంచి కర్తవ్యము - వర్తించగ వరదేవుడు.

సహకారం సారమైన - మమకారం మూర్తియైన
సామరస్య భావమైన - భగవంతుడు భాగ్యయుతుడు.

బొజ్జలోని భోగమేమొ - సజ్జనులకు సమత పంచు
గణనాథుని గమనతమంత - గుణసహితము లోకములకు.

పరమేశ్వరు తనయునికీ - వరమైనది గజవదనము
జంతు రూప జగమునకు - జయ శీలము జాగృతియే.

గుజ్జురూపు గురుతుగా - గురు విద్యకు పరువుగా
రుజలు బాపు పూజితుడై - సుజన మదికి విజయుడై.

నవరాత్రులు నవ్యముగా - దివ్యుడైన భగవంతుడు
నయవర్తన మానవులకు - నయముననిడునాతడు.

చవితి దినపు చలువ యేమొ - సరసమాయె భాగవతులు
భాద్రపదము భద్రమాయె - ఛిద్రములే తొలగిపోయె.

మనసుల మాలిన్యమంత - మహిమలోన కలిసిపోయి
మనుషులంత మహిమతో - మానవతే నిండెనిచట.

141

గాజుగదుల గాంధర్వం - గమ్యరహిత నాగరకం
సహగమనపు సారళ్యం - సరసతకే సంగరం.

చేట చెవులు కలవాడు - చెవిటియైన చందం
తేట తెలివి తెలిసినోడు - తేరు లేని వైనం.

నవ్య నాగరకములో - నాణ్యమైన గణపతి
దివ్యరూపములలో - భవ్యులకు హృదయపతి.

వీథి వీథి విలువ వెలుగు – ఆర్భాటపు ఆలయాలు
వేల సంఖ్య ప్రతిమలతో – వైభవమే చతుర్దశీ.

చైతన్యం చచ్చిపోయి – చేతనలో పతనమై
చతురత్వం మిగిలిపోయి – వితరణలే విలువలాయె.

చందాలను అందముగా – పొందు పరచిరీ
పాపము పరిహారమనుచు – ఫలము నందిరీ.

అన్యాయం స్వార్థాలకు న్యాయమె యీ న్యాసమూ
అవినీతి అక్రమాల – సక్రమ మీ క్రతువు.

పేద పెద్ద తరతమాలు – కులవర్గపు కలరవాలు
మందహాస మొలికించెడి – మధ్యమ తరగతి వారలు.

నవరాత్రులు రాత్రులాయె – నవ్యాంధకారములో
వెలుగు నాయకునిదిగా – వినాయకుడు విలువగాంచు.

విలువలేనిలోకజనులు – విజయములను కోరుచూ
విఘ్ననాయకుని కొలుతురు – అఘముల నంతము జేతురు.

మదుల గదులు పగిలిపోని – మమత గాజుగోడలైన
మనుజులంత మనసు కలుగ – వినాయకుడు హృదినివాసి.

142

మగతలోని మానవుడూ – సుగతి వీడెను
మమత విడిచి మనగాను – మనసు మరచెను.

వారసత్వము వాసి వెలసెను – సంప్రదాయము సారహీనము
సంస్కరణమున సరళిమారెను – చరిత చూడగా శక్తి హీనము.

తల్లిదండ్రుల తపన మీరెను – గురువు పరువులు గూఢమాయెను
పరిసరమ్ముల పదను తరిగెను – నమ్మకమ్మున నవ్యమాయెను.

మాటచేత మనసులు – మహిమ విడిచెను
ఎదుటివాడి క్షేమము – ఎదలు మరిచెను

దేశజాతి భక్తులే – దేహముగా మారెను
మానవత్వమన్నదే – మనవారలు మరచిరి.

చెడు చేయుటె చైతన్యం – మంచితనము మారణం
శపియించుటె శాసనం – జనక్షేమమే జయహీనం.

సంకల్పము సంతకెళ్ళి – సందేశము విందొనర్చె
సంతానము అవతరించె – సంతోషము అంతరించె.

నవ్య జీవనమ్ము దెలిసె – నరక సదృశమ్ముగా
దివ్య మానవాళికిచట – దిటవులేదు పటువులేదు.

నశియించిన నమ్మకమే – వశమాయెను దేవులకు
మానవుడే దేవుడైన – వికసించును మానవత.

143

ఆది దేవుడుదయించెను – ఆర్తులకే మూర్తిగా
ఆశ్రయమై అవనికే – అంతరముల మరపించెను.

మురిపించెడి వెలుగులో – ముద్దుల ఆ కిరణములే
మరపించెడి చీకటిలో – మమకారము పొంగెలే.

వెచ్చదనపు వెలుతురులో – వేడుకయే ప్రకృతీ
మచ్చలేని చూపులలో – పెచ్చరిల్లె చైతన్యము.

పాలవెలుగు పరువములో – పావనమీ ధరియిత్రి
పాలమనసు మనుషులలో – పరివర్తన జనుల శక్తి.

వెతలు తీరు వెలుగులో – వేకువకే దేవుడు
మతుల గతులు మారగా – మమతల తలపూవుగా.

కుంకుమ పంకము కురిసిన ఆ దేవుడూ
పంకపు మనసుల పరిమళ మొనరించెను.

ఆరనిజ్యోతియై అవనిని నిండెను
మారని దీప్తియై ప్రాణుల పండెను.

సుందర మందిర మదియే – సూర్యగోళ శుభకిరణం
అందమైన ప్రకృతికది – విందుచేయు విభవమదే.

ప్రభవించిన జీవానికి – ప్రాభవమావిభుడే
పావనమౌ మానవతకు – మాధవుడే పగటి విభుడు.

144

రంగు రంగు హంగులు – రంగమాయె వీధులు
గణరాజుని సేవకులు – గర్వభరిత పురజనులు.

నెమలి వాహనమ్మున – నెనరున వెలుగొందును
సింహవాహనమ్మున – సిరుల విరులనిచ్చును
గరుడవాహనమ్మున – గమ్యమెంచి నడుపును
ఎలుగు వాహనమ్మున – ఎఱుగ నిచ్చి మలచును
శేషవాహనమ్మున – చెలువునిగా నిలచును
కల్పవృక్షవాహనమున – కలుములన్ని పంచును.

ఆటంకములన్నిటిని – అదృశ్యము చేయును
అంతరంగములను – పరిశుద్ధము చేయును
విజ్ఞానము నొసగగా – విలువ కలుగు నాయకుడు
పార్వతి పరమేశ్వరులకు – పవిత్రుడౌ తనయుడు.

కాంతులలో కాంతలంత కలలను పండింతురు
దాంతులు వేదాంతులంత దయతో వర్తింతురు
ప్రాంతములే పరమమౌను వరవినాయకునితో
స్వాంతము విశ్రాంతితో స్వాగతమను మానవతను.

గణేశునికి నవరాత్రులు – ఘనముగ జరిపించగా
వరప్రదము వత్సరమే – భద్రమగును భాద్రపదము
మట్టిరూపు మానవులకు – గట్టి ఫలము లివ్వగా
దట్టమైన ఆశలన్ని – పట్టముగను ప్రవరమగును.

జయగణేశ మహరాజుకు – జాతి జనులు విజయమనీ
తలపులందు వలపులందు – తరియింతురు జగతిలో.

145

వీధులలో వేంచేసెను - విఘ్న వినాయకుడూ
విలువ మరచు సంఘానికి - అగ్నియైన నాయకుడూ.

పతనమైన తనువులతో - పతితమైన ఇంద్రియాలు
భూతతతుల భువనములో - పంచభూతములు పతనము.

ఫలరహితము పావనము - పరమ హితము హతము
మంచి చెడుల మార్గములో - మానవాళి చెడు మరగెను.

పరిశుభ్రము అభ్రమాయె - పచ్చదనం చచ్చిపోయె
నీరుగాలి నిమ్నములై - తేజస్సును తేలిపోయె.

అభయము ఆశీర్వాదము - అందించే వినాయకా
భయభ్రాంతుల లోకానికి - బాధల మరపించుమురా.

పసుపు ముద్ద పావనమై ప్రభవించిన తనయుడా
మనుజుల నీతనయులకు మనుమార్గము దిద్దుమురా.

సిద్ధి బుద్ధులందునా శివునికి తనయుడా
శుద్ధి శుభము పంచగా విభవములే నీవిరా.

హోరెత్తును వీధులన్ని - హోమము నీరూపము
మజ్జన జలములలోనా - మహనీయము మాన్యము
రూపులెన్ని చేసినా - శాపము నీకాయెను
పాపకర్మ మానవులకు - పావనమౌ దైవమా!

146

అమరావతి నుండీ ఆంధ్రమునకు వచ్చీ - వైకుంఠము వీడీ తిరుమల గిరికొచ్చీ
వాసిగాంచినవాడే వేంకటేశ్వరుడు - శివములిచ్చువాడే శ్రీనివాసదేవుడూ.

బాలాజీ పేరుతో బాధలన్ని తొలగించు
ఆపదమొక్కులవాడై అందరికీ అండనుండు
వడ్డికాసుల వాడు వడ్డించును శుభములు
కలియుగమున విష్ణుడూ కలతలకీ జిష్ణుడూ.

భార్యలిద్దరతనికీ – భాగ్యమె జన ఆనందము
పరమాత్ముడు భువికీ – వరమాయెను వసుధకు
అంతరంగ మందున – వింత విలువ పెంపొందగ
త్రికరణముల తీరును – తియ్యగ నందించును.

వేంకటాద్రి నీలాద్రీ – వెతల విభునికాలయమే
అంజనాద్రి శేషాద్రీ – ఆకరమే అతనికీ
గరుడాద్రి వృషభాద్రి – గరువమే జనతకూ
సప్తాద్రుల సాంగత్యం – సరసతకే సౌందర్యము
కొండ అండ నిండుగా – బంగరుగను మెండుగా.

చిత్తమె చిత్తూరుగా – విత్తమె ఆ తిరుమలగా
భక్తులందు బంధువుగా – బంధనములు విడజేయును
తాళ్ళపాక వారికీ – తరగని కులదైవముగా
అన్నమాచార్యునికీ – అన్నులమిన్నవు నీవే.

శైవ వైష్ణవములనూ – శైశవమున తొలగించి
భవ హరుడవు నీవుగా – భాగ్యమె యీ జగతికిమ్ము.

147

కలియుగానికీ – కలిమి దేవుడూ
కనకశైల విభుడు – జనులకిష్టుడు.

కొండపైన కొలువున్న – అందయిన అధిపుడు
ఆపదలను వదలగొట్టు – అవనిలోని భగవానుడు.

బ్రహ్మాండ నాయకుడు – బ్రహ్మోత్సవమహితుడు
వరుస వాహనములలో – వరములొసగు జనకుడు.

లక్ష్మీ పద్మావతులతొ – లక్షణ లావణ్య యుతుడు
కలియుగ కవి గాయకులకు – కలరవమే ఆ నామము.

అందని వాడతడుగా – అందరివాడాయెను
అవతారమె తరించెను – అవని జనుల వరణములో.

భక్తి రసము ప్రవహించెను – రక్త జనుల రసనలలో
ముక్తి మురిపె మాయెనుగా – శక్తి ఆస్తికత్వములో.

సుప్రభాత సేవలోన – సుందరుడే సులభుడూ
మంగళముల మోతలోన – భంగించును బాధలను.

రూపు తనివి తీరనిదీ – చూపు సూర్య సదృశ్యము
కాపు పాపముల కాయె – తాపములే తరిగిపోవు.

శ్రీనివాస వేంకటేశ – శివనామములతనివీ
బాలాజీ భక్తులకూ – భవమునకే బాంధవుడు.

148

ఆ.వె. దుర్గ దురితములను దూరమ్ము సేయగా – కాళి కామితముల కలిమినీయ
చండి చెండుగాత చెండాల తత్వమ్ము – విజయదశమి మాత విజయమగుత.

తే.గీ. కాళికాంబయె కలతల కాలరాచు – మహిత సారస్వతమ్మయె మాకు రక్ష
పార్వతమ్మయె పర్వాన పథము చూపు – ఈశ్వరమ్మగ చాముండి ఇరులదోలు.

ఆ.వె. మంచి చెడుగుపైన మహిలోన యుద్ధాన – విజదదశమి జగతి విజయమయ్యె
మహిషమర్ధనమ్ము మాతజేసిననాడు – రాక్షసత్వమంత రహిని వీడె.

ఆ.వె. అన్నపూర్ణరూపు అన్నమునందించ – అవని జీవులన్ని అమరమాయె
పాడిపండలిలను ఫలములరూపమై – పాలనమ్ముజేయు ప్రభుత మాత.

ఆ.వె. దేవి శక్తి రూప దేహుల రక్షించు – జీవజాలమునకు జిలుగు వెలుగు
మానవాళిమనగ మార్గము చూపించు – మాత ముద్దుమనకు మహిని నేడు.

తే.గీ. కొలిచియత్నము సేయగా కోర్కెదీరు – దసర నవరాత్రులందున ధనముగల్గు
దేవిరూపాలు దేహాన దిటవు నిల్పు – విశ్వవెలుగులు విరియించు విజయదశమి.

తే.గీ. శాంతికాంతులు కల్గించు శక్తి చేత – దానవత్వము దమియించు దసర యందు
మానవత్వము చిగురించ మనసులందు – మాత చైతన్య మహితయై మనల మలచు.

149

ఆ.వె. నిత్యసత్యవ్రతము నియమాల దీటుగా – సృష్టి అందమంత పుష్టి గలుగ
జగతి జనత ఘనత సుగతిని పొందగా – మాత మనకు నిడుత మనసు మమత.

ఆ.వె. రావణుండు మడియ రామరాజ్యము వచ్చె – దుష్ట శిక్షణమ్ము దుర్గచేత
శిష్టరక్షణమున శివముల కల్గించి – దక్షయైన జనని ధరణిమహిత.

ఆ.వె. వర్షమవని జనుల హర్షమై కురియగా – పులకలన్ని పొంగి పుణ్యముగను
భూత భౌతికమ్ము భవమున అందమై – మదిగదులను నిండు మధురముగను.

తే.గీ. సింహవాహనమిడు నెన్నొ శివములిచట – పుణ్యములనిచ్చు పులితేరు పూజ్యముగను
ఇంద్రవాహన మిచ్చట ఇరులదోలు – హయము హర్షము కలిగించు అవనిలోన.

తే.గీ. హంస వాహన మమరగ అధికమీవు – నెమలి నెనరున జనులకు నెయ్యమీవు
ఆయుధమ్ముల ధరియించి అంతరముల – వెడలజేయగ వెతలెన్నొ వెలిసిపోవు.

ఆ.వె. ప్రాంత భేదములను పరమమౌ పేర్లతో – పూజలందుకొనగ పుణ్యవీవు
మానధనము రక్ష మహిళల కందించి – మాన్యవగుము దేవి మనసులందు.

ఆ.వె. వరపురాణములను వాసికెక్కిన దేవి – సంప్రదాయములను సాగుమాత
మూడు గుణములామె మూర్తిగా స్ఫూర్తిగా – మురియు జగము మాత ముద్దుసేత.

తే.గీ. చీకటినిద్రోలి వెలుగున సిరులు నింప – అజ్ఞతనువీడి విజ్ఞత అవని నిండ
రూపమందము రూక్షమై రుజలు వీడ – మాతగురువుగ మహిజనుల్ మనునుగాత.

150

## దీపావళి పాపావళికి శాపావళి

ఆ.వె. తరతరాలనుండి తరగని సంపదై – తరియజేయు ధరణి తపన నుండి
మానవుండు నేడు మనసున మనగాను – మాత మానవత్వ మహిత యగును.

ఆ.వె. అంధకారమంత అసదుగా విడిపోయె – వెలుగువెల్లువగను వెతలు దీర్చె
విందుసేయుచుండు విజ్ఞత విలువల – విజయపథము మనకు వింత తీరు.

ఆ.వె. హృదయసీమలన్ని మధువులు నిండగా – వర్షకాలమేమొ హర్షమాయె
నీరునిధిగ పంట నిలువెత్తు సొత్తుగా – పచ్చదనము మెచ్చు ఫలము మనది.

ఆ.వె. కరకు నరకుడపుడు కామమ్ము మీరగా – బాధపాలుజేసె భవము నంత
ధరణిమాత బరువు తగురీతి తగ్గగా – ఆదిదేవు రూపు అమరమదియె.

తే.గీ. దివ్య దీవాళి పాపాళి దిక్కులకును – పారజేయగ శాపాళి సారయుతము
నవ్య నందాళి ఆంధ్యము నణచివేయ – వింతశోభల విదళించు విలువ వెలుగు.

తే.గీ. రామరాజ్యము రహినిండ రమ్యముగను – భారతమ్ముగ భాసమై భాగ్యముండ
భక్త భాగవతమ్ముగ శక్తిగలుగ – జనత దీవాళి జయశీల జవమునిచ్చు.

ఆ.వె. కొత్తబట్టలన్ని కోర్కెలు దీర్చగా – ఆభరణములెన్నొ అందమివ్వ
బాణసంచ బతుకు పండించు విధముగా – బాలలంత నేడు భాగ్యయుతులు.

ఆ.వె. అంతరంగమందు ఆనందహేలగా – అవతరించె నేడు అతిశయముగ
బాహిరమ్ము శుచిగ భాగ్యము నందించ – పర్వమాయె దీప వరుసగాను.

151

తే.గీ. దేవరాక్షస క్రీడలు దేహులకిట – వరపురాణములందున వాసినించె
అసుర నరకుని అణచిన అచ్యుతుండు – జనుల దైవమ్ము జగతికి జయమునిచ్చె.

తే.గీ. మానవాళికి దీవాలి మధురమాయె – దానవాళికి శిక్షయై ధరణిమీరె
మనసులానంద భరితమై మహిమగల్గ – మమత సమతలు వెలుగులై మహినివెల్గు.

తే.గీ. ధర్మసంస్థాపనముజేయ ధరణి నిలచె – పదిగ అవతారములతోడ ప్రవరుడాయె
విష్ణుమూర్తియె జిష్ణుడై విజయమిచ్చె – నరకు నరకగ నయనీతి నటన జేసె.

తే.గీ. పంచభూతాలు ప్రవరమై ప్రజలకిచ్చె – పంచ ఇంద్రియ సహితులై ప్రాభవమున
వంచనలువీడి వసుధను వరపు గల్గి – మించు భాగ్యము దివ్యాళి పంచుగాత.

తే.గీ. మంచి చెడులకు నిలయము మరుల మనసు
ఎంచి చూడగ మంచియె ఎదల నిలచు
పంచు కొనగను ప్రజలకు పటువు మంచి
మించు వెలుగుల దీవాళి మిగులు శుభము.

ఆ.వె. సత్య సహితముగను శక్తిని పొందగ – నరకు ద్రుంచగాను నాణ్యమాయె
పీడ వీడ జేయ పిడుగాయె నాతడు – వెలుగు పంచె నేటి వేళగాను.

ఆ.వె. పుణ్యపాపములను గణ్యమౌ వెలుగుగా – నిశిని వెలుగు దోల నిశితమాయె
పాపరహిత భువియె పావన మగురీతి – దివము రీతి వెలసె దీపవరుస.

తే.గీ. గ్రహము గతులను తప్పించ గణ్యుడగును – మానవుడు నేడు మేధతో మాన్యుడాయె
చీకునంతయు వెడలించి శివమునించ – పండబారెను అమవస మెండు వెలుగు.

152

తే.గీ. నేటి దీవాళి ప్రళయమై నెనరు వీడె – భువిని దివిసీమ మగ్నమై భుక్తివీడె
కృష్ణ చీకున క్రుద్ధమై తృష్ణవీడె – వెలుగుచీకట్ల వేద్యమౌ వెతలకతలు.

తే.గీ. గళము జలముగ గాంఢ్రించె కలత కృష్ణ
సుడులు తిరుగుచు గుండాల మడియజేసె
పైరు పంటలు పశువులు పాడుబడగ
ముంచివేసెను గ్రామాల మురువువెడల.

తే.గీ. కొందరికినేడు పండుగ కోర్కెలలర – అదియె ఎండగ దండగ ఆర్తులకిట
నిత్య పండుగే ధనమున్న నేతలకును – చీకు వెలుగుల చిహ్నమే జీవి బతుకు.

సీ. వర్షము హర్షమై వసుధను ముంచెను – ఆవాసములు నేడు ఆర్తిమయము
వాగులు వంకలు సాగెను సరగున – తల్లడ మొందెను పల్లునేల
ఆక్రందనములంటె ఆకాశవీధిని – దివ్యులు దేహుల దెలియలేదు
భాగ్యము వీడెను భయమున భవమును – బతుకులు చితికెను గతుకులందు.

తే.గీ వెలుగు కలిగించు దీవాళి వెల్లువగను – పట్టపగలేమొ ఆంధ్యమై పలవరించె
నట్టనడిరేయి అమవస గట్టుపైన – ఎదురు తెన్నులు చూచుచు ఎదల గుబులు.

సీ. ఇక్కడ అక్కడ ఎక్కడ చూచిన – జలములు కాన్పించ జయమువీడె
చిత్తడి చినుకుల చెరిగెను జీవితాల్ – వాయుగుండము నందు వరపుమునిగె
చెట్టుల పుట్టల చేతము చెరుగగా – డాబాల పైనుండి డాబు విడిచె
కూడును గూడును గుడ్డను కోల్పోయి – కూలిన శరణార్థి కూట మదియె.

తే.గీ. అన్న మాకళ్ళ కళ్ళాయె విన్నదనము – మాట మతిలేని రీతిన మౌనమాయె
బాట దెలియక బావురన్ భవపు జనులు – పర్వదినమన్న వారికి సర్వరహిత.

153

సీ. చప్పుడు గొప్పదై సరసము లేనిదై – దీవాలి బాంబులు దిటవు వీడె
కాకరవత్తుల కఠినంపు వెలుగేమొ – మెరుపుల పిడుగుల మించు విధము

సీమటపాకాయ సిరులను మింగెడి – అణుబాంబు విధమున ఆర్తిదెచ్చె
పచ్చను మింగెను యిచ్చిన జలమేమొ – మెచ్చు ప్రకృతియును విచ్చిపోయె.

తే.గీ. నదుల ప్రళయాలు కష్టముల్ నరులకిచ్చె
నరులు నరకుని నరికిన పర్వమందు
జీవ విరులన్ని వనమున జిలుగు వెలయ
దీప వరుసయె పరుషయై దిగులు నిచ్చె.

ఆ.వె. ఉల్లిపాయ ధరలు ఉల్లము మండించ – పర్వదినము నేడు గర్వరహిత
తారజువ్వలేమొ తారల నంటెను – నిత్య సరకులన్ని సత్యముగను.

ఆ.వె. చెప్పి ఫలములేదు చెప్పక తప్పదు – తప్పుతెలియజేయ తంటదీరు
మంచి తెలిసి కొనగ మంచిది మనిషికి – మనెడి తీరు గనగ మహిమె మాన్య.

ఆ.వె. నవ్య నరకులిచట నాణ్యులు ధరణిని – భవ్యులంత వారి పటువు నణచ
దివ్యరీతి లోక దేహులు జీవింత్రు – సత్యమంత సతము సహితయగును.

తే.గీ. నేటి దీవాళి బాంబాళి ధాటిమీర – మారణము నందు మానవుల్ మాటు బడగ
దారుణములెన్నొ జరగగా దహనమగుచు – ధాత్రి జనతకు ఘనతగా రాత్రి వెలుగు.

తే.గీ. మంచి చెడుపైన గెలిచెను ఎంచిచూడ – పంచుకొనగాను మంచియె పరమమగును
కర్మ కర్కశరహితము కాంతిమహిత – అదియె దీవాళి కాంతిగా అమర మగుత.

తే.గీ. ప్రేమ అభిమాన గౌరవ ప్రేరకముగ – సత్యకృష్ణుల సాంగత్య సారముగను
రాక్షసత్వము దహనమై రాజ్యమందు – మానవత్వము నిండును మంచిదిగను.

154

తే.గీ. వెలుగురవ్వల వెలుతురు వేదనలను – ఎదలలోనుండి వెడలగ ఎఱుకమీర
జనుల జీవన గమనము జవముతోడ – సాగురీతిని దీవాళి సరసమగుత.

ఆ.వె. చిచ్చుబుడ్డిలోని చిరునవ్వు రవ్వలు – నింగినంటగాను నిత్యమయ్యె
సత్యనియతి సాగ సంసారమంతయు – వెలుగు దివ్వెగాను వెలయునేడు.

ఆ.వె. కనమతాబు కాంతి కలలను పండించు – అగ్గిపెట్టె వెలుగు అందగించు
పటపటలను శబ్ద పటువున పథమున – పురుగు పుత్ర వెడలి పూజ్యమగుత.

ఆ.వె. మారు ఋతువు మధ్య మానవులందరు – మనెడి విధము నందు మలగు క్రిములు
బాణసంచ పొగలు భవమున వ్యాపించి – రోగ క్రిముల జంప రుజలు వీడు.

ఆ.వె. జనత తపన మీరి జవమును గోల్పోయి – స్వార్థ పరత వెలిగె సార్థకముగ
దీపవరుసలోని దిటవంత పటువుగా – స్వార్థమంత వెడల సార్థకమ్ము.

ఆ.వె. మగువ మగల చెలిమి మానవు రక్షింప – దానవుండు మడిసె ధరణిలోన
మానవత్వమిచట మరణించలేదని – దీపవరుస దెలుప దివ్యమగును.

ఆ.వె. సత్య సత్యమంత సమయించె నరకుని – సాత్వికతకు చోటు సరసమవని
కర్కశత్వమంత కాల్వలు గట్టగా – వార్ధి గలుపగాను వరపు వసుధ.

తే.గీ. దివ్య దీవాలి దిగులును ద్రెళ్ళ జేయు – బాధ తొలగగ ఆశలు భవము పండు
ఆశయాలన్ని అమరమై అవని వెలుగ – ఆంధ్రదేశము స్వర్గమై అమరుగాత.

155

ఆ.వె. చిచ్చుబుడ్డి హృదిని చిచ్చును పెట్టగా – ఆశచెదరిపోయి ఆర్తినించె
క్షణము వెలుగు నిచ్చి సొంతము చీకటై – బతుకు భయము నీట బృంగిపోయె.

తే.గీ. కాల్చు బాణసంచ కల్మష హరముగా – చీడ పీడలన్ని చెదరిపోవు
జలము జగతినంత మలముగా జేయగా – మందు తడిసిపోగ మంట వీడె.

ఆ.వె. పైరుపచ్చులన్ని పల్లారె వర్షాన – చేతికంది నోటి చెలిమి చెదరె
రైతుబాంధవునికి రజినియె వెలుగుగా – వెన్నువిరిగె వెతల వెలుగు మీరె.

ఆ.వె. పొంగి పొరలు నీరు నింగిని తాకగా – నేలనల్గడలును నెనరువీడె
పదుల ఏళ్ళనాటి పాపము వరదగా – పర్వదినము గలిసె పదట నిచట.

ఆ.వె. సాయమందజేయ సర్వులు నందింత్రు – బాధ పంచుకొనగ భవము సుఖము
కష్ట నష్టములును కాలపు గురుతులు – గురుతు పట్టగాను గురువు నీవు.

ఆ.వె. భయము నందజేయు బాంబుల మోతలు – చిన్నపిల్లలకును చిమ్మటలకు
బయట మూలనున్న భాగ్యము భయమేగ – మోతమీద మీకు మోజువద్దు.

ఆ.వె. ఆశ తీరువారి ఆనందహేలగా – కామితార్థములకు కల్పతరువు
ఆశయమ్ములన్ని అణగారి పోగానె – అంతరంగమునకు వింత విలువ.

ఆ.వె. దిక్కుమొక్కులేని దేహులయందున – కాంతి దరిగె పర్వకాలములును
పేద బడుగులకును పెన్నిధిగాదుగా – దీపవరుస వారి శాపమగును.

156

కాలం గీచిన గీటు దాటితే – కలకాలం కలవరమందవలయురా!
కాలరాచిన జీవన సౌఖ్యం – కాలమేఘమున వర్షమెలేరా!

హర్షమునిచ్చెడి వర్షములోనా – అవగుణముండిన ఆర్తినిచ్చురా
ఋతువుల భువిలో రుజలనణచగా – బతుకుల భాగ్యము కాలగమనమే.

కలమున కాలం కలరవమొలుకును – పదముల భావం పలుకుల కులుకును
పారెడి ఏరులు పావన సంద్రము – కొండలు గుట్టలు కాలపు కొలతలు.

ప్రకృతి వికృతి సుకృతి దుష్కృతి – ఫలితము దళితము గళితము కాలము
జీవన కాలము వెలుగుల వేదము – వేద్యము చోద్యము వేదన కాలము.

కొలతకు అందని కోర్కెల కాలము – కొరతల కుమిలెడి కోమల కాలము
భక్తుల ముక్తుల రక్తుల కాలము – మమతల సమతల మారణకాలము.

దారుణ రణముల దాపున కాలము – కారణ రహితము కర్మలకాలము
ధనముల ఋణముల దహితుల కాలము – మనముల జనముల జయమగు కాలము.

మానవ లోకపు మాన్యము కాలము – మానవ తత్వము మహిమగు కాలము.

157

కాలంలో కదలికయే – కామించెను సృష్టినీ
ప్రకృతి పురుషుల కలయిక – కలవరమై గమియించెను.

నాదమిచట వేదంగా – నరుని బతుకు నవ్యంగా
సాగెనదియె సవ్యంగా – సారమేమొ జ్ఞానంగా.

మానంలో పుట్టినాడు – మానవుడై పెరిగినాడు
మేధపెరిగి మాన్యుడాయె – మేలుమాట మిగలదాయె.

తనకేమో తెలియదూ – తానేమో తెలియదూ
ఎదుటివార్ల ఎఱుకలేదు – ఎదలోనే విలువలేదు.

కనబడేది నశ్వరమూ – వినబడేది వింతమాట
భావించగ బాధలన్ని – భవమనగా బంధనమ్ము.

158

మల్లెపూవు తెలుపు – మనసులనది మలుపు
పూవులోని పొలుపు – పూజనీయ తలపు.

సృష్టిలోన సుందరం – దృష్టిలోన మందిరం
వాక్కులోని పరిమళం – భావానికి బంధనం.

మనసులోని మాధుర్యం – మధురమైన సుమగంధం
మానవాళి ప్రకృతికీ – భాగ్యమైన పుష్పమదే.

మల్లెపూవు మంచితనం – మానవతకు మూలధనం
మమత సమత మనువర్తన – మాధవుడే మనకిచ్చెను.

రాలిపోవు పూవైనా – సోలిపోవు సొగసైనా
వాలిపోవు జీవులలో – వాసి మిగుల వర్తించున...

159

బాధలేని మానవుడా భాగ్యము నీదేరా
బాధ భాగ్యమైన యెడల భవుడవు నీవేరా.

బ్రహ్మరాత భావమేమొ – కర్మనీది గాంచుమురా
విష్ణుశివుల విలువలనూ – విజయపథము దెలియరా.

నాటియేసు జీవుడాయె – నవ్యమానవత నిండెను
బుద్ధిగలిగి బుద్ధుడాయె – ధర్మకర్మ బంధనముల.

దేవుడన్న జీవుడనిన – దేహి త్రికరణములెరా
మేధ స్వార్థమేదినిలో – మేలి బతుకు బాధలదే.

అమ్మను పూజించుమురా – అతిశయముగ జీవించుము
మానవతను మాన్యుడవై – మాధవునిగ బాధ విడుము.

160

వెలుగు నీడలు – వేదాల నీడలు
వేద వేద్యు జాడలు – వెతల బతుకు గోడులు.

తడియారని తపనలు – పొడిరాలిన పొలుపులు
చైతన్యపు కిరణాలు – చేతనలో కలతలు.

కలిమిలేమి కలరవాలు – మంచిచెడుల మానవతలు
మమకారపు మహిమలు – సహకారపు సమతలు.

త్రిమూర్తులకు తియ్యదనం – పంచియిచ్చు పరమార్థం
లోకపాలకునికిరణం – లోభమైన జనమరణం.

సూర్యదేవు సౌందర్యం – లోకమునకు బాంధవ్యం
జీవజాల చైతన్యం – జిలుగు వెలుగు కలియుగం.

161

తృష్ణ పొడిచె తూర్పుదిక్కు – తృప్తి విడిచె అపర దిక్కు
దిక్కులేని మానవుడా – దిక్కు దేవుడాయె నీకు.

సూర్యదేవుడుదయించగ – సుందరమే నీభువి
కిరణ స్పర్శ చైతన్యమై – కైతవముగ కోర్కెమించె.

పడమరలో పావనుడే – పరముడాయె భగవానుడు
తపన విడిచె తృప్తి కలిగి – తరియించర మానవుడా.

మానవాళి మాన్యమైన – తృప్తి తృష్ణ సుందరమే
తపన కిరణ– తారుణ్యం – తరియించగ లావణ్యం.

పంచేంద్రియ మందిరమున – మనసు దైవ విగ్రహమే
ప్రకృతి పురుషుల కలయిక – ప్రవరమాయె నీ సృష్టిగ.

162

జీవుడాయె దేవుడూ – దేవుడగును జీవుడూ
దేహరహిత దేవుడూ – దేహమున్న జీవుడూ.

హైందవమ్ము ఆదిలోన - అవతరించి అతిశయించె
శైవ వైష్ణ తత్వములను - చెలిమి మరచి చెలువు విడిచె.

మహ్మదీయ మాయె యింపు - క్రైస్తవమ్ము కలిమినొసగె
కలకలమున కలియుగమ్ము - దేశమతము కాంతిదరిగె.

మానవుమతమేమిటో - మారణమై దారుణమై
ఒక్కదేవుడంటూనే - వ్రక్కలాయె దైవత్వము.

కోట్ల దేవులుండిరిచట - కోరికయే స్వార్థమంట
పాలక పాలిత దేవుల - పరమార్థం మానవతయె.

163

వాదనయే వేదనగా వరుని వాక్కుమించెనూ
బోధనమున సాధనమున మనుజు మహిమ పండెనూ.

ఆవేదన వేదనలే అనుగమించునూ
ఆలోచన లోచనముల నవధరించునూ
అవగాహన గహనమును అవమతించునూ
ఆశయమై ఆశలనూ అణచివేయునూ.

సత్త్వగుణం సామ్రాజ్యం సహన భరితమూ
రజోగుణం రాసిక్యం రాజ్య మహితమూ
తమోగుణం తరియించగ తపన కలితమూ
త్రిగుణాలకు అతీతమౌ తీరు జనుగుణం.

ఓంకారం నాదంగా వాసిలోకమూ - మమకారం సహకారం మహితలోకమూ
మాతల మాతృత్వమే మాన్యలోకమూ - మమతలకూ మానవతకు మహిమలోకమూ.

బోధన బాధించగా - సాధన సవరించగా - శోధన శోభించగా - వేదన మానవతగా.

164

అందమైనదీ - ఆశలలోకం - ఆశయాలకూ - అందని లోకం.
అవతరించె మానవుడూ - ఆశదీరగా - ఆశమీరి ఆ జనుడూ - అంతరించుగా.

బతుకులోన ఆశయే భాగ్యమైనదీ – గతుకు బతుకు ఆశలే గమ్యరహితమూ
ఆశ అంతరంగమై అవతరించెనూ – వింత రంగుపులుముకొనీ విగతమాయెనూ.

నరునిబతుకు ఆశలో నవ్యమైనదీ – జగము ఖగము రీతిగా జయవిహీనమూ
ఆశమించె స్వార్థమూ అంతరువులనూ – ఆశ అర్థరహితమూ అదె జనతకు సార్థకం.



165

**జన్మభూమి – జాతికవులు**

జన్మభూమి చిన్నబోయింది ప్రజాస్వామ్య కులరాజుల ప్రాభవంతో
జాతిభవిత వన్నెదరిగింది ప్రవచించే నీతుల గతిదప్పిన గమనంతో
అమరాంధ్రమాత ఆశయం అడుగంటి అధఃపతితమయింది
స్వర్ణాంధ్ర ప్రజల స్వాతిశయం స్వార్థంతో స్వాంతనమరచి వివర్ణమయింది.

జనగణమనగీతికి మనందరం కారకులం ప్రేరకులం
వందేమాతర వరసకు కవులందరం వారసులం వంతలం
తెలుగుతల్లికి మల్లెపూదండ నలంకరించిన పాడిదప్పని బాణి శంకరులం
హితభరిత సాహిత్యంలో హీనతను తొలగించే మర్శక దర్శకులం మనం.

మానవత కీర్తికీర్తనకు అంటిన మాలిన్యాన్ని మట్టికరపించే మానవకుల కవులం
జగతిని చదివే జాగృత దర్శన జాణలం ప్రయోక్తలం ప్రవక్తలం గీతల గీష్పతులం
మగతలో సుగతి శ్రుతిదప్పి మాంద్యం ఆంధ్యమైనప్పుడు కవిగీత చైతన్యం
విగతించిన విలువల వలువల విన్యాసానికి సన్యాసం నేర్పే సాహస కలరవం కవిత్వం.

దేహంలోని దేవుని వాక్యానికి లోకం లోభపడేలా లోతులు చూపించే అమృత తుల్యుడు
మానవ మాధవ సేవల మహితత్వాన్ని మధించి మంచితనాన్ని విధించే మానవ మాత్రుడు
అంతరంగాలను ఆవరించిన అరిషడ్వర్గాల అంతాన్ని ఆసాంతం కాంక్షించే అధికారి
భూత వర్తమానాల విభూతిని భవిష్యత్తునకు పంచే స్వాతిశయ భారతిలో అహంకారి.

మానంలో ప్రభవించిన అభిమాని – మానాభిమానాల మాతమహోన్నతికి కారకుడు
కలం కులంలో కరుడుగట్టిన హితమత దురభిమాని సతతం సమతాభిమాని
జనన మరణాల మధ్య లిప్తకాలానికి కవనలీలాకల్లోలినిలో అమృతం పండించే అసురుడు
సురాసుర సంగ్రామ సరళిని సూక్తినైపుణ్యంతో అంతంచేయగల సంచిత పుణ్యసురాపానమత్తుడు.

బాధలేని బోధ భాగ్యాన్నందిస్తే భావం భాస్వంతం చేసే బాధల బోధల బుద్ధుడు
తనబాధ పరుల బాధను తొలగిస్తే పరమార్థంగా భావించే క్రీస్తు కీర్తి నిబద్ధుడు
త్రిమూర్తుల తీరులన్నీ తిరునామంలో కలిపే తియ్యదనపు తీక్షతకు తీర్థుడు
ఆచార్య ఛాత్రుల అభయారణ్యంలో భయంతో సంచరించే ఆశయాల అన్నలకు ఆప్తుడు.

కనకాభిషేకాల కవిశ్రీనాథులు భారతిపై విశ్వాసం వికసించిన కలికాల భైరవులు మన నాగభైరవులు
జాతీయత యాతనలో బడకుండా జన్మభూమిని రక్షించే జాతి కవులు
మానవత మరుగున బడకుండా కవితామనువర్తిని యువత కందించే యూపస్తంభాలు.

కవుల గళాలు జాతిమాత నిగళాలను గళితంచేసే
దళిత జాతుల గళ ఆర్తారావాలు
అసహాయత, అసూయ, అవమానం అవినీతి అంతరంగాలకు
అంటని అసహాయ శూరతకు ఆనవాళ్ళు
వేకువ వెలుగొండలో స్వర్ణాంధ్ర చంద్రుడు ఉదయించే వేళలో
మన మరో 2020 మరో ప్రపంచమే
ప్రకాశంలో ప్రకాశించే రాత్రిసూర్యులను జాతికందించే
రామన్నను ఆహ్వానించేది మన కవికులమే.

166

భూభాగం మానవ భోగిమంటల భోగంతో మసిబారింది
వణికించే చలి వదిలింది వాత పిత్త శ్లేష్మాలు వాయులీన మైనాయి
భోగం వేగానికి వేళదప్పి వెతలబడి మానవాళి మతిగతి దప్పింది
వారసుల కందించే వాసి వసుంధర కాలుష్యమే తప్ప ధనకనకాదులు కావు.

భోగం వనిత భాగధేయులకు భావన కందని భయరోగం ఎయిడ్స్ ప్రత్యక్షం
ముంగిటి ముగ్గులు సిగ్గిల్లి మూలకు సర్దుకొని ముద్దుల హద్దులు చెరిపాయి
గొబ్బెమ్మలు గోబర్ గ్యాస్ బాండీలలో గోరుముద్దలై గోవధ గోలలో గతించాయి
బంతిపూల రెక్కలు హక్కులై ఆకాశంలో విహరిస్తూ బాధ్యత చెట్లకు బరువయ్యాయి.

రంగు రంగుల రంగవల్లుల హంగులు భంగపడ్డ
భారత ప్రజాస్వామ్యంలా భాగ్యహీనమైనాయి.

హరిదాసులు దాసత్వంలో హరీమని దానగరిమలో
తరించే వారికి దాసులైనారు.
ఎద్దుల ఎదలో నందీశ్వరులు ప్రవేశించి హద్దులులేని
సేద్యంగా గంగిరెద్దుల గారడి.
శిలలై కదలలేని శివుని వాహనాలు గ్రామసీమల్లో
అదృశ్యమై ఆలయాలనలంకరించాయి.

నాగరకత సంప్రదాయానికి నవ్వు తెప్పిస్తూ
నాణ్యతలో నవలావణ్యం చిందించింది.
క్రాంతిరథంపై సంక్రాంతి పురుషుడు సాగివచ్చినా
సారహీనమైన భూజనుల బతుకు.
జాజ్జ్వల్యమానంగా జంతువులెక్కివచ్చే జాతి పురుషుల
ఎదలో జాగృతి జంతు తత్త్వమే.
మళ్ళూ మాన్యాలు మనుమలకు పంచే
మహనీయుల బతుకుల గతులు శ్రుతిదప్పిన వీణలు.

వారసత్వం రసహీనమయ్యే హితమతుల హీనమతం
స్వార్థంతో శోభించడం.
మగత నిద్దురలో మంచిని ముంచినా మత్తు చిత్తంలో
హత్తిన నైజం నివురువీడిన నిప్పె.
పసిమి ఫలాన్నిస్తుందనే ప్రవచనం ప్రసిద్ధులకు
పట్టదని ప్రజాపాలన ఋజువు చేసింది.
మంత్ర తంత్రాలతో రాలే చింతకాయల్లో పులుపు
మనిషి అందుకోలేని జీవన మలుపు.

కనబడినా వినబడినా అనబడినా అధికారం
అవనిలో అందరి ఆర్తిదీర్చడానికే.
కాలం కందగడ్డ మనిషి కత్తిపీట వాతబడినా
జిహ్వాకు దురద కల్గిస్తుందికదా.
రోగభయమున్న భోగికి మకరభోగి మాన్యతనందిస్తే
సంక్రాంతి కాంతినిస్తుంది.

గాడిదప్పుతున్న గ్రామరాజ్యానికి భోగిమంటల
  తంట గణ్యత నిస్తుందా?

సూర్యుని రాశిప్రవేశం దేశానికి సౌందర్యాన్నందిస్తే
  సూక్తి సుధాకరులు సుందరులే.
మకరం మదగజాన్ని బంధిస్తే మానవాళికి
  భాగవత కథ మాన్యమై మాలిన్యాన్ని విడగొట్టిందా.
జలచరం స్థలచరమైతే జాతిలక్షణానికి రీతిచెడి
  జీవశక్తిహీనమయ్యే ప్రమాదం.
ఆధునిక మకరకోవెల దీక్షల అయ్యప్పలకు
  దివ్యత్వాన్ని ప్రసాదిస్తుందనే భావన.

మండల దీక్ష మానవ శరీర రుగ్మతల మాపి
  మానవతా వ్రతానికి మంగళప్రదమౌతుంది.
కారుణ్యం మరచిన మనసులు కాలగమనంలో వచ్చే
  సంక్రాంతులతో విక్రాంత మౌతాయా.
దానశీలం దారిదప్పి ఆంధ్యంలో పడితే అహంకారి
  మానవుని భోగిమంట వెలుతురిస్తుందా?

167

తెలుగుల వెలుగుల మంటల భోగం తెలియని అక్షరమాలలో కలిసింది
పంట ఇంటికి వచ్చి తంట దీర్చే కాలానికి తరలివచ్చే సంక్రాంతి లక్ష్మి
భోగిపళ్ళ పసిపిల్లల భోగాలు భవిష్యత్తుకు దీటైన బాటలవ్వాలి
హద్దులు చెరిపే ముంగిటి ముగ్గుల ముగ్ధలు మురిపాల వెల్లులై ముందుకు సాగాలి.

ఆడతనాన్ని ఆవరించిన బిడియం రంగవల్లి అంతరంగలో అంతరించాలి
గోమయంతోడి కలయంపి పేదగొప్పల పేలవతకు
  నాందిగా రంగు ముగ్గుతో రంగరించాలి.
ఇంద్రధనస్సు మనస్సులతో హితకారిణులై హీనత్వాన్ని మానవతగా మార్పుచేయాలి
హీరోహోండాల హోరులో ఆవిరౌతున్న రాతినూనెలా హరిస్తున్న మంచితనం.

వేదాల వాదాలు మోదాన్ని పంచని నవనాగరకతా
  మోహంలో బ్యూటీపార్లర్ల ముఖాలౌతున్నాయి.

పంటల మాసూళ్ళు మానవతను మరచి మండలాఫీసు
ఉద్యోగుల వసూళ్ళుగా పరిణమించాయి.
వరికోతలు వరదాయినుల వయ్యారాల ముసుగులో
పతివ్రతల గుండెకోతలైనాయి
క్రమందప్పిన పంటల కాలానికి క్రతువులు
యాంత్రిక కర్మలై పాత్రత కోల్పోయాయి.

గ్రామాలు రాజకీయ సంగ్రామ రంగాలై కోడిపందేల
కోర్కెలు కర్కశమైనాయి.
అరకలు మరకలు పడిన వస్త్రంలో మురికిని పరికిస్తూ
బండెద్దులు బడుగులైనాయి.
అరిసెలు అర 'లై' కొట్టని మరపట్టిన పిండితో
కోర్కెతీర్చలేని వైనాయి.
పంటల వంటల పండుగకు అమ్మాయిని పంపని
అల్లుని తంట మిగిలి ఆర్తి నిండింది.

చంట ఇంట సందడిచేసే జనాభా భారంతో
భరత సంక్రాంతి లక్ష్మిబాధ పడుతుంది.
పౌరుషం పాడిపంటల పారవశ్యంతో పాలకులు
పంచుకొనే ప్రభుతకు శ్రీకారం చుట్టారు.
పల్లెల పందేల ప్రకృతికి పావనతను నింపే
రక్షకభటుల లంచాల లావణ్యం.
పండగ నాటి పాతదనంలా సంపాదన చాలని
సరస వ్యాపార మానవుల వేదన.

సహజసిద్ధంకాని భయం సమాజంలో సరిగమలు
పలికితే అనురాగం ప్రళయభరితం.
బామ్మలనుండి బాలెంతల పిల్లల వరకూ బంధం
తెగని అందానికి ప్రతిరూపం సంక్రాంతి.
పల్లెజీవుల మల్లెబతుకుల్లో మానవత ప్రభవించే
భవపుకాంతి భాగ్యమయ సంక్రాంతి.

వరమైన పరమాన్నానికి చవులు చిందించే తీయని
తెలుగు జంటల శోభన కాంతి సంక్రాంతి.

మంచు మించు మలిరేయి మగతను సుగతిగా
మార్చి తీర్చి మానవాళికందించే మాన్య క్రాంతి సంక్రాంతి.
చాలీచాలని కూలీల స్వేదం మధువుగా సేవించే
మానవ దానవుల మాంద్యం వదిలించే మధూదయక్రాంతి సంక్రాంతి.
జీవమున్నచోట జుగుప్స తప్పదనే జియ్యరు వాక్యానికి
జితకాముల మనఃకాంతి సంక్రాంతి.
మనుజీవి మంచి విడిచి వనజీవిగా మారే కాలానికి
సంక్రమణం సరళక్రమాన్నివ్వాలి.

పన్నెండు రాశుల పరమార్థ ప్రపంచానికి ప్రతిమానవునిలో
మానవత రాశీభూతం కావాలి
సప్తకిరణుని సంగతి అసంగతంకాని ఆలోచనల్ని
రేకేత్తించే చైతన్యం మూర్తిభవించాలి.
ఆకారం ఆంతరంగం జీవనం రాశీభూతమై
కలికాలగమనం కాంతివంతమై జీవి గమ్యం చేరాలి.

168

సంక్రమణాల విక్రమం క్రమంతప్పిన జీవితాన్ని సరిచేస్తే సవ్యమే.
అపసవ్యమైన ఆరుకోట్ల సంక్రమణాల అనుక్రమణిక అంతరింపున కింపే.
నమ్మకం వమ్మైన నేపథ్యంలో నవ్యజీవనానికి గమ్యం అవగమన మహితం.
కాళ్ళగోళ్ళనాడే కనబడిన కామిని కాపుర కలిమి పర్వానికి ఫలరహితం.

పసుపు పారాణుల పడతి జీవితానికి పరిశ్రమాధిపతుల బ్యూటీక్రీం భరోసా.
దేశీయం దేవులాటలో దేహిదేవాలయానికెళితే దేదీప్యమాన శివదర్శనం.
పరదేశాల పాకులాట పరమార్థంలో పండి అప్పుల ఊబిలో అంతరిక్షమైంది.
స్వార్థం స్వానుభవాన్ని స్వాగతిస్తే పరార్థం పరమార్థాన్ని పలకరిస్తుందా?
మానవ మనసులో రేగిన మంటల వేడిమి మిగిలిన మసిలో మిళితమైంది.
పండుగ దండగనుకొనే ఎండిన హృదయాల ఏలికల ఎఱుకలో ఎదమరచిన జనులు.

జాతిజనుల జాతర నాగరకుల యాతనలోబడి సంబరంలో సహజత్వాన్ని కోల్పోయింది.
ఆకులురాల్చే అవనిచెట్లు ఆకారం అందగించి వికారంగా వింతరూపును చిందించాయి.

పూచికాచి ఫలించే పూజ్యుల జీవితాల్లో కీటక సన్యాసం కిందుమీదుగా చేరింది.
అధికారాన్ని అన్యధాకరించి వ్యథికరణవ్యవస్థను అవస్థల పాల్జేసే సంక్రామకులు.
మానంలో జనించి అభిమానంకల్గి అనుమానం మించి అధికారంతో అహం అధఃపతితం.
దిసమొలతో ఎదురొచ్చే పసిబాలుని దివ్యత్వాన్ని, దీనత్వాన్నీ పర్వంచేసే వీనులు విజయం.

సహజత్వాన్ని అద్దంలో సంబరంగా చూచి తరించే దూరదర్శన యుగానికి దురపిల్లడం.
సంక్రమణంతో సమసిపోయిన గురుశిష్యుల బంధం గూడుపుఠాణిలో గుర్తుకొస్తుంది.
జనవరి వరికోతలు మిగిల్చిన గుండెకోత జలప్రళయమైతే జవసత్వాలకు పండగ దండగే.
సరిగమల సంతసరుకు సంఘం రానికూనిరాగంతో కూలబడే వ్యాపారం చేస్తున్నది.

కందాయ ఫలాల గారడీలతో కబళాన్ని సాధించుకొనే
కర్మఠుల కవిత్వతత్త్వ స్వత్వం.
కనుము మునుము పెట్టి కబళిస్తున్నా జనస్వామ్య ఆశయాన్ని
జాతిరక్తితో మేల్కొల్పే జాణల పర్వదినం.
బాధల గాథలతో బరువెక్కిన హృదయాలు సేదదేరి
భాగ్యంపొందే మరోవసంతం క్రమిస్తుందా?
తెలుగుల జన్మభూమిలో జన్మజన్మల సంక్రమణాలు జనుల
జాగృతికి జీవం పోశాయా?

ఋతువుల ఋణం ఋజుమార్గంలో క్రమించి
సంక్రమణంతో సదరు అనుక్రమానికి అందగించాలి.
అధికారం అందగించే అదను మకర సంక్రమణమయితే
వింత విశ్వం విలువల మయమే.
శతాబ్దంలో శమమెంచి అంతరించే వంద సంక్రమణాల
వసుధలో వాసి తరానికి నవోదయం.
మేధల మథనంతో మేలిమిని మేలుకోసం మెత్తబరచిన
మేదిని జనదీప్తికి వ్యాప్తి సంక్రమణం.

మేకవన్నెపులుల వాలకానికి వాత్సల్యాన్నిపంచే
జన్మభూమాతకు కంఠాభరణమీ అనుక్రమణం.

చేసినా చూసినా తెలిపినా చెడుపని తెలివికలిమికి
  పరీక్షగా క్షమార్హం కాని కర్మకు కారణం.
దూరం అంతరిక్షదారంతో కొలిచే అంతరిక్షనౌకల
  దారులు ఎడారులు కాకుండా ఎదల నింపాలి.
వెలుతురు వెల్లిగలిసి అంధకారం రాజ్యంచేసే దశలో
  మకర సూర్యుడు మనుమార్గకాంతిదాయి కావాలి.
అక్రమమైనా విక్రమమైనా అందగించే అనుక్రమంలో
  సంక్రమణసారం సహనధాత్రికి వరం.

169

సీ. దేవుని భక్తితో దేహమ్ము పోషించు దేవడీ గానుండె దేవళమ్ము
మనసున శాంతికి మార్గము మాన్యమై మహిమను కోల్పోవు మందిరమ్ము
మతమున హతమాయె హితమగు దేవుడు మానవ జాతిని మాదకమ్ము
ఒక్కడు దేవుడై మిక్కిలి జనులుగా భాగించ భారతి బాధకమ్ము.

తే.గీ. కృతము త్రేతయు ద్వాపర కృతులు గడచె
యుగము కలిగాను కల్లయై కాంతిదప్పె
ధనము దహియించె దేవుని మానవులను
దారిచూపు ప్రమాధిగా ధరణి నేడు.

సీ. దేవుని పేరిట దేహుల జంపగా దేదీప్యమానమౌ దేశమాయె
రాము రహీముల రక్తము వేరుగా రాణించు రభసయు రంగు వెలసె
కొలతయె ధనముగా కోర్కెలు మీరగా కోమల తత్త్వము కోలుపోయె
కాలము మారగా కాంతియు వీడగా వాసంతు రాకయు వరుసవీడె.

ఆ.వె. పగల వగల సెగల పరమముగాదియై
పాలిపోయె జీవి పటువు వీడి
మంచితనము దిటవు మానవునికి జేర్చె
మనప్రమాధి పంచు మమత సమత.

ఆ.వె. నూతనమ్ము రుచులు జాతికి హీనమై
సంప్రదాయ సరళి సరభసమ్ము

సాగిరాగ నేటి సారళ్య వర్తనన్
సరసమగు ప్రమాధి సాదరమ్ము.

170

సీ. దేవుని స్థలములు దేహికి స్వంతమై మహిమను కోల్పోవు మహినినేడు
మాన్యాలు పండగా మనుజులు ఆశతో నైవేద్యములు లేని నైచ్యమాయె
పారదర్శకతను పాటించలేనట్టి ప్రతినిధుల్ పాలనన్ ప్రగతివీడె
విశ్వాసమున్నట్టి విలువల జీవికి విందు దేవునిదగు విలువవిగత.

తే.గీ. దైన్యహైన్యము దేవుని వైనమిచట
నరుల నమ్మకమున నేడు నవ్యమగును
మనుజు మనసును మధియించి మహిమగనగ
మనప్రమాధియె మాన్యము మానవులను.

సీ. రుద్రయ్య సాగించె రుద్రయాగమునాడు అష్టక మిష్టమై అవనిపండె
ఎఱ్ఱన్న భారతి ఎదనిండు ఎఱుకతో మన్నన లొందెను మంచిమించె
ప్రాకాశ వీధిలో ప్రాభవ మహితులై పాలించి రెందరో ప్రభుతపంచి
కందుకూర్ జనులకు కలిమిని పంచిన మనజనార్దనసామి మహితుడుగను.

తే.గీ. స్ఫూర్తినందించ సాగెను కీర్తిగొనగ – మూర్తులన్నియు ముద్దాయె ముచ్చటగను
మూల మానవతత్త్వము కాలమందు – కలిసి పయనము చేయించు కలి ప్రమాధి.

తే.గీ. స్కంధపురిసీమ కవితల స్కందమాయె – కవులు కోకిలలైరిట గానములను
వరయుగాదుల వాసికి వరులు గాను – నవ్యయువకుల తీర్చును నవప్రమాధి.

171

సీ. అహమనుమానము ఆలోచనములేక అవగాహనమువీడె ఆశయమ్ము
అధికార పదవులు ఆర్తుల ఆర్తిని అంతమొందించని అవగతమ్ము
అన్నిరంగాలలో అధికమై స్వేచ్ఛగా అవినీతి అన్యాయమవధిసుమ్ము
మనసున్న వారలు మనుటయె కష్టమై మంచికి మార్గము వంచనమ్ము.

తే.గీ. చెడెను చేతము చేతలు చింతవంత – వింత మనుజుల శీలము విభవమాయె
మాట సంస్కార రహితమై మహికి చేటు – త్రికరణములను తీయనౌ తిరు ప్రమాధి.

సీ. మోసము ముదమాయె మోదము మదముగా మధుమాస ఫలములు మాసిపోయె
చిగురించుచెట్లను చీడలు తినురీతి పసిబాలలను వీడె పచ్చదనము
బుద్ధిబలమునేడు బూడిదైపోయెగా బద్ధమౌ నడవడి బాధమీరె
శుకములు పికములు శూన్యమై పోయెను పంజరములయందు బంధితములు.

తే.గీ. ఏమి మధుమాసమిలనుండె ఎగ్గుసిగ్గె – భగ్గుమనుఎండ బాధించి భవమునిండె
భవుని భక్తిని పరములై బంధనముల – విడగ యత్నించ విజయమౌ విధి ప్రమాధి.

తే.గీ. కల్తి శాల్తీల కాలము కలియుగమ్ము
మానమభిమాన మనగాను మనుజు ధనము
జాణతనమున స్వార్థము జయము గొనగ
ప్రళయకాల ప్రమాధియై ఫలము లిడుత.

172

సీ. పంచాంగమనగానె పంచెలో అంగమై – ప్రాభవరహితమై విభవహీన
పంచేంద్రియాలన్ని పంచల బడిపోయె – మనుజుల మమతలు మనసుహీన
శాంతియు దాంతియు శక్తియు నశియించ – ఆత్మను దెలియుట అసలెహీన
మంచిని వినుటయు మలినము నడచుట – మనుజీవి చరితను మాటెహీన.

ఆ.వె. తానుహీనుడాయె తనవారినిందించు – తపన పెరిగిపోయి తప్పుచేయు
ఆస్తికతయె దారి ఆత్మతత్త్వముగన – మనప్రమాధి మహిమ మానవతగు.

సీ. బాబాలు ప్రభవించి బాధలు దీర్చగా – బడుగుల మనసులు భక్తినిండ
అవధూత లందరు అవనిని పండించ – ఆస్తిక్యమవనికి జాస్తిపంట
జ్యోతిష వర్తులై జ్యోతిని వెలిగించ – జనజీవితములన్ని జయమునిండె
శీలాన చేలాన చింతలు నిండించ – మానవ దేవుల మహిమపండె.

ఆ.వె. మోదభరిత రహిని మోజులు మ్రింగెను – మాదకములు వచ్చి మనసు జెరిచె
వరప్రమాధి వసుధ వాసిని బొందగా – జనప్రమాదములును జారిపోవు.

173

సీ. శ్రీజనార్దనసామి శీతల దృక్కులు – చింతించు జనులదౌ వంతదీర్చు
మాధవు తత్త్వము మానవసహితమై – మహినిండు చైతన్య మహిమగూర్చు

కలిమిని బలిమిని కందుకూరందమై – వాసంత వరునికి వాసిగూర్చు
కలియుగమునయందు కాలము గాలమై – రక్కసి చేష్టల రక్కివేయు.

ఆ.వె. జన ప్రమాధి జగతి జయమెంచు జాణయై
ప్రమద సహితమగుచు ప్రగతినిచ్చు
గమ్యరహిత గమన గర్వమౌ స్వామ్యాన్ని
గణప్రమాధి గురుత గుణము నించు.

సీ. అష్టక రచయిత కష్టము ఫలియించి – ఆర్ద్రమౌ సూర్యుడు ఆర్తిదీర్చు
చేదును తీపియు చేతము నందున – చైతన్య భావమై చెలిమిగూర్చు
రాజకీయమునందు రాణలు జాణలు – నీతిని నడువగా నిధులు గలుగు
ఆస్తికత్త్వము మింగి ఆస్తులు అధమమై – వ్యధలను గ్రుంగగా వ్యస్తమగును.

తే.గీ. కాలగమనము కాస్తంత కాంతిలేక – కాంక్షమీరగ కాలుని కలవరించు
నడత జడతను జతగూడి నాశమాయె – కొత్తవత్సరమిదుగాక కొర్కె తృష్ణ.

174

సీ. దాతలు త్రాతలు ధరణికి నేతలై – జనగణమనముల జవము నింపు
త్యాగము యోగము తెరువుగ మారగా – జనజీవితములన్ని జయముగాంచు
మంచిని పంచగా మమతను నించగా – మాలిన్య రహితమై మహియువెల్గు
మేధావులందరు మేదిని రక్షించ – మేల్తర భావాలు మేలుకొనును.

తే.గీ. ఆర్తిదీర్చును అధికార మవధిమీర – ఆప్తమిత్రత అందమై అవనిపండు
ప్రేమ సహకార ప్రేరణ పెద్దయగును – ఆశ ఆశీస్సు ఆకాంక్ష అదె ప్రమాధి.

సీ. కక్షలు శిక్షలు కరుణను మ్రింగగా – కలిమిని బలిమిని కాంతివీడె
విద్యలు కళలన్ని విప్లవ గరువాన – విలువలు విడగాను వెలుగువీడె
దహనము దమనము ధరణికి ద్రఢిమగా – మమకార మంతయు మాడిపోయె
మిన్నుముట్టిన ఆశ విన్నాణవిగతమై – గురువుల పరువును బరువుపోయె.

తే.గీ. దైవ చింతన మానవ దైన్యమాయె – మగత మునిగిన జనులకు సుగతిలేదు
విగత విధ్వస్త విద్యలు వేద్యమాయె – ధరప్రమాధియె సుగతికి దారియగుత.

ఆ.వె. భయముకన్న భక్తి బాధ్యత దెలియును – రక్తిముక్తి రహికి రమ్యమగును
శక్తి కీర్తి సక్తి చెరగని చెలిమిగా – జనప్రమాధి జనుల జాగృతగును.

175

ఆ.వె. ఆస్తికతలేని ఆత్మ అంగవిహీనమై – అందగించ జగతి అంధమాయె
విశ్వశాంతి విలువ విజయము నందగా – విధిప్రమాధి విజయ వెలుగు పంచు.

ఆ.వె. కనుల కగుపించు దేవతల్ కలరు భువిని – కామరహితమైన కర్మచేయ
మానవాళిసేవ మాధవ సేవగా – మాన్యమగు ప్రమాధి మనకు నిజము.

ఆ.వె. లెక్కలేసి చెప్పు లేవడులందరు – లేమిలోని బాధ లెక్కచేయ
కలిమి బలిమి కాంతి కందురు విందురు – కలి ప్రమాధి జనత చెలిమి పంచు.

ఆ.వె. మానవాళి సృష్టి మహనీయ దేవతల్ – వేదవిద్యలోని వేల్పులెవరు
వాదమోద భరిత వాహిని మానవుల్ – ఎఱుక కలుగజేయు ఎద ప్రమాధి.

ఆ.వె. ప్రకృతి శక్తులన్ని పరమార్థ మౌనుగా – సూర్యచంద్రులిపుడు సుందరములు
జీవ జాలమంత జిలుగుల వెలుగుల – మనుప్రమాధి యందు మహిమ మీరె.

తే.గీ. అమ్మ ఆలించు ఆర్తిని అనునయమున – కనుల కనరాని దైవము కలిమిపంచు
త్యాగదానాలు జనులకు దారికాగ – ప్రేమ పంచుప్రమాధిగా పేరుమీరు.

176

సీ. మలయమారుతమున విలయము సృజియించ – మనసుల మరుమల్లె మధువుపంచు
రాదారివెంబడి రమణీయ పూదారి – రమణులు రమణను రసము పంచు
కుహుకుహు నినదాలు కూర్మిని గానమై – శ్రుతులకు సుభగమై సూక్తిపంచు
తరువుల పొదలను తరగని పంటల – తరియించు వనమెగా ధనము పంచు.

తే.గీ. జంట హృదయాల పంటలు తంటదీర్చ – జనవసంతుని రాకతోజగమునిండ
కలియుగాదిని కలతల కాలదన్ను – జనప్రమాధికి జయమగు జవము నిండి.

తే.గీ. ఝురులుపారగ జగమున విరులు విరియు
హిమము హితముగ జనులందు ఇరులు విరియు
మరులు వరులందు కళ్యాణ మహిమ గనును
జనప్రమాధియె సంసార జయము గనుత.

తే.గీ. మావిచిగురుల పిందెల మమత మిగులు – వేము వేకువ వైద్యమై వెతలు బాపు
కండ శర్కర వ్యాధుల కడకు నెట్టు – రుచులు రుజలను పోద్రోలు రుచి ప్రమాధి.

తే.గీ. పారవశ్యము భక్తికి పటువునించ – విశ్వసనమేమొ వేద్యము వెలుగుపంచ
నశ్వరమ్మున గాంచగ నవ్యతలను – దివ్యశక్తిని కల్గించు దివిప్రమాధి.

తే.గీ. ఆంధ్రదేశాన అవినీతి అంతరించు – చీకు చంద్రులు పాలనన్ శివము విడును
మంటగలిసెడి మానవు మహిమలన్ని – తంట దీర్చును పావకు తపన మించి.



177

## మానవతకు మాన్యము

ఎనుబదినాలుగు లక్షల జీవులలో – ఎఱుక జీవి మానవుడని ఎరుగరా
మదిగదిలో మానవతను నించరా – మాతృభూమి మాన్యతకై మనుమురా
దారుణముల మారణముల దలచకూ – దయయు కరుణ ధరణినించి వెలుగరా
దీను హీను దైవముగా దెలియుమూ – దళిత సేవ ధనమురా లోకమునా.

అంతరంగమున్న నీవు అధికుడవూ – అంతరముల వర్తించగ అధముడవూ
మేధనీది నీ సుఖమున మెలిబడగా – మెలకువ మేదిని కలుగదు మేలిమిగా
స్వార్ధసేవ సొగసుగాదు సోదరా – పరమార్ధము ప్రగతిబాట మిత్రమా
అధికారము ఆర్తిదీర్చ అందమూ – అందియె అందలముకైతె ఆంధ్యమూ.

విలువలేని వ్యక్తులున్న వ్యవస్థా – విజయపథమునను నడువదు వినుతుడా
వ్యక్తి శక్తి వ్యవస్థకే వెలుగురా – అవస్థలను తీర్చునదియె అవతారపు కాంతిరా
ధనగణనము ముఖ్యమైన మానవా! – దహనమౌను మనసు మమత నేస్తమా!
జనబలమున సాగగాను ప్రతినిధీ! – జయమగునుగ కాలములకు పౌరుడా!

పావనముగ భావనలో తలపులూ – భాగ్యమొసగు భయంవీడి భవమునా
సమ సమాజ నిర్మాణము సాధనలో – బాధలెన్ని ఎదురైనను భయపడకూ
కౄరరాక్షసత్వములను కూడకూ – కూరిమినీ కులము రామ రాజ్యమునా
అర్ధ ధరణి ధర్మమునే ఆహరించగా – ధర్మరక్షసేయుమీవు ద్రఢిమనూ!

మంచితనం మారిపోయె వంచనలో – తలవంచక మంచిని తరియించుమా!
నవతమనకు మానవత నాణ్యమూ – భరత భవిత భాగ్యమయము నయమునా!

అందమన్న అంతరంగమహిమరా – విద్యవేద్యమైన వెలుగు వెలయురా
ప్రతిభ ప్రగతి చిహ్నమగును జగమునా – పాండిత్యము మండనమున ప్రాభవమూ!

సృష్టికి ప్రతిసృష్టిచేయు మానవుడూ – సూక్ష్మతలను దెలియలేని దానవుడూ
పునీతమౌ సేవలోన పూజ్యుడూ – సునీతిలో సుగతి గనగ సుందరుడూ
యంత్ర తంత్ర మయమాయెను లోకమూ – ఎదలోపలి గదులు తెలియ లేదురా
ఆదాయము వ్యయములతో అంతమూ – వ్యాపారమె వ్యక్తిగతము విశ్వమూ!

సుఖవంతము సంసారము సూక్తిగా – త్యాగమయం జీవితమే కీర్తిగా
ఆలుమగల అన్యోన్యత ఆస్థిగా – బిడ్డ భవిత భయరహితము భవమునా
తృష్ణ తృప్తి తురీయమై తూగగా – కృష్ణగీత అమృతమై అమరునూ
యోగము నీవు దెలియగాను యోగిగా – కామరహిత కర్మకు నీవు కర్తగా.

బుద్ధి యింద్రియములనీవు పూజ్యుడవూ – పురుషార్థమె బద్ధమైన పుణ్యుడవూ
మానవా మానవా మానవతకు మాన్యమా – ధన్యము నీచేతలోన ధరణియె నిజమూ.



178

## మతం మానవుని హితం

మతం మత్తు మునిగిపోయి గతిదప్పెను మానవుడూ
గతం గణ్యమైనదనే గరువముండ సతం శుభం
హిందు భావమందు హితం ఇస్లాముకు బాధగాదు
బుద్ధ భావనందు బుద్ధి భూతములకు పూజ్యమగును.

మానవునికి శాంతికాంతి మహితమతం మాన్యకర్మ
మానవతకు దానవతకు మధ్యనిలుచు మతం సతం
బాధ అందరికి ఒకటే భాగ్యమన్న బంధమదే
దయయుధాత్రి కరుణ సమము దీనహీన దివ్యతలూ.

వైవిధ్యము వృత్తముగా వసుధ మతము వరమాయెను
మనిషి మనిషి మధ్య మతము మానవతకు సోపానము
ఆకలి దారిద్ర్యము జగతిని అందరికిని ఒకటే
కలికాలము నందు మనిషి మతము మూఢతకే నిధిగా.

స్వార్ధపరుల మతమునేడు స్వాగతించు విభేధముల
సార్ధకమౌ శాశ్వతమౌ మనమతమే మానవతా
జనంలోని చైతన్యం జాతికి చితిగా మారెను
మతంలోని మాలిన్యం మానవతను మాడ్చివేయు.

హిందూస్థానమ్ము నేడు హీనమాయెనూ మహ్మదీయ హిందు తత్త్వమత్తునందగా
బాబ్రికూల్చ బాధపడిరి మహ్మదీయులూ కూల్చి కుట్రలోన మున్గి కుమిలిపోదురూ
కట్టెనతడు మానవుడూ కట్టుబడియె మతమునా
కూల్చెనతడు దానవుడూ కూర్మి విడిచి మనసునా
మూఢమతం హతంగాను ముప్పును దలపెట్టుమూ
రూఢిమతం హితంగాను రహిని నీవు నిలుపుమూ.

ఉత్తరమున బాబ్రిగలుగ ఉత్తరమే సమతగా
దక్షిణమున దాక్షిణ్యం భరత భూమి సాగునూ
పదవి లాలసత్త్వమందు పందలైరి ప్రతినిధులూ
సదయ మూర్తులైనవారు సాగిరాగ సరసమగూ.

ఈశ్వర్ అల్లాలయందు ఇంపును గమనించుమూ
రఘుపతి బుద్ధుల లోనన రమ్యతలను గాంచుమూ
మంచిమాట చూపుచేత మతం మనుషులందునా
మంచిమతం సతం హితం మానవునికి మహితమైన మాన్యతా.



179

**మానవత దారి**

మానవతా మానవతా మాకునీవు నవత
మనిషి మనెడి మార్గమునకు మధురమైన మమత
మనసు కలుగుమనుజీవియె మానవుడని తెలిసికో
వయసుతోడ పనిలేకను వాంఛనీవు వదులుకో.

ధర్మ కర్మధాత్రిలోన దానవతకు దారిలేదు
మేధ నీకు మేలిమైన మేదినియే స్వర్గమగును

స్వార్థ చింత వర్ధనమై స్వాగతించె నరకమునూ
పరార్థమే పరమార్థము పాలనమున ప్రాభవమ్ము.

అంతరంగమున్న నీవు వింతజంతువిధమునా
విలువవీడి వర్తించకు సంఘజంతు వీవుగా
వ్యవస్థలో వ్యక్తి విలువ శూన్యమనుచు తలచకూ
వ్యక్తి శక్తిమీరగాను వ్యాసుడగును వసుధలో.

మరపులేని మనిషిలేడు మధురమైన సృష్టిలో
తలపు మంచిదైనగాని తరియింతువు జగతిలో
సంకల్పము కల్పకమై సాగుమీవు మానవా
చిత్తశుద్ధి చిందించును శివములనీ నేలలో.

సాటిమనిషి నీవిధమని సాగుమీవు సహితమై
అన్యోన్యత అనుబంధము అనురాగము అమరమౌ
అసూయయే మూలమగును అవని అంతరములకూ
అహమునునువు వర్జించగ ఆశయమే మానవతా.

అవగాహన ఆలోచన అతిశయించ లోకమూ
అమరమగును సమరమునా సహనవహన వసుధలో
ఆశమీర తరుగునదే ఆశయమ్ము సోదరా
ఆర్తిదీర్చ రమ్మునీవు ఆదర్శము నేస్తమా.

సమత మమత సార్థకమ్ము హితమునీవు మరువకూ
మాన్యమానవత్వమునకు మధురమునీ రూపురా
మంచితనం మనకుధనం మాన్య మనసు లందునా
సరస హృదయ సాగుమీవు త్రికరణముల తియ్యగా.

మానవతా మానవతా మాహృదిలో నిండుము
మహితమూర్తులందు నిండి మాకు దారిచూపుము.



### నిధులుగా ప్రజాప్రతినిధులు

ప్రజాస్వామ్య ప్రతినిధులూ మాకు నిధులు కండూ
నిధుల వేటలోన మీరు నీతివదలకండూ
సేవకొరకు ఎన్నికైన చేవగలుగు వారూ
చేవ గలుగు చేతలతో చెడును విడుము సతము.

అధికారము ఆర్తిదీర్చ అవని నదియె అందం
ఆశమీరి వర్తించగ అదె జనులకు ఆంధ్యం
దీనరక్ష దానపరత దివి కంతకు వెలుగు
వెతలుదీర్చు వేల్పులంత వేద్యులైన మీరు.

జనుల రక్షసేయలేని దక్షులైనవారు
శిక్షణకరవైనవారె శివముగాంచలేరూ
అన్యోన్యత లేనినాడు అవనియె శూన్యం
అంతరించు మనముందర వింతపోకడలనూ.

అసూయకు తావులేని ఆశయమ్ము మీది
జనుల ఆశతీర్చ నదియె జాగృతి కదినాంది
ధర్మకర్మ మర్మమేధన్యనీవు తెలియుమూ
జన్మభూమి జాతికదే శక్తియుక్తి ముక్తిదమూ.

అధికారము అవధికలుగ అంతరములు తొలగూ
భువిబాధలు తీర్చునదియె అవధియనీ గ్రహించూ
చేతములకు చెదలు పట్టి చైతన్యం విడువగా
మాతృప్రేమ మాన్యముగా మనకు ప్రేరణముగలుగూ.

ప్రబోదించు సూర్యుడే ప్రగతికి మనగుర్తుగా
ఆదిశక్తి ఆవరించి అహమువీడు పూర్తిగా
హితము మతము హిమధాముడె అతడెమనకు ఆప్తుడూ
సతము జనుల చల్లగాను సాకు మీవు మిత్రుడా!

జన్మభూమి పరిశుభ్రత పచ్చదనపు ప్రగతిగా
శ్రమదానం శక్తిమీర శాశ్వతమగు సుగతిగా

నేటితరం నేతలార భరతభావి గనుడీ
నవతరమున నాణ్యమైన ఆశయమ్ము వినుడీ.

ఆశ ఆశయమ్ము కలిసి అవగాహనమించు
సాలోచన ఆలోచన సహనశాంతి పంచు
అమరమగును ఆంధ్రమిచట ఆశయమ్ము కలుగ
సంకల్పము కల్పకమే త్రికరణములు వెలుగ.

181

మానవుడే మరచెనేడు మానవత్వమన్నమాట
దానవుడై దారిదప్పి మారణమ్ము చేయుచుండె
మంచిమనసు తెలియనీ మానవుడే దానవుడు
వంచనమును వీడివాడు వరుడయ్యెను లోకాన.

అభ్యుదయం మాటలోన అభ్యసనం వ్యసనమందు
అందమన్న రూపమాయె అవసరమే అధికమాయె
భారతంలోని బాట, రామాయణవరుల మాట
భాగవతపు వ్రతములోన, భారతి భాస్వంతమగును.

ప్రజాస్వామ్య ప్రాభవం – పతనమాయె సంఘమందు
రాచరికపు రాజసం – గణరాజ్యమునందు మిగిలె
మోసం మీసముదువ్వెడి – మోరకులది అధికారం
దోషరహితమైనవాడు – దొరకడిచట పాలనలో.

గీతానికి గీర్వాణం హెచ్చె – అక్షరం క్షరమౌచుండె
నీటిమూట మాటలుగా – నింగి కెరిగె జీవనగానం
బంగారపు బంధుత్వం – సింగారపు చైతన్యం
శృంగారం శృతిమించగ – మతిమంతముమగతనిండె.

ధనంలోనె మారకమై – ధరపలికెను మానవతా
ఆరకమై దానవతా – ఆశ్రయించె అంపశయ్య
అన్నలన్నమాట అసలు గుర్తులేదు – నక్సలన్న రాగానె నవనాడులు క్రుంగు

అడిగినదిచ్చును వాడికి అతిభయంతో – ఆకలై అడిగితే శాపనార్థాలిచ్చు.

దానవత్వం మానవత్వానికి దారినిచ్చే సమయానికి దహనం.

182

మారిందిరో తీరు మారిందిరో
మనవారి విలువలన్ని మానవతా మంచి మమత
తనదాకావస్తెగాని తెలియలేదు మానవుడూ
తనస్వార్థం మానుకొన్న తరగనిదే సుఖమురన్న.

తనగొప్పలు చెప్పుకొంటు తరియింతురు కొందరు
పెరవారలు చెప్పుకొనగ పేరుపెంపు గలుగుగదా!
పరసేవను పాలుగొనగ పావనమౌ మనదేశం
తమసంపాదనము మించ తావులేదు నీగొప్పకు.

కల కాలము జీవించరు కలిమికోరి మరణింతురు
ఉన్న మూడునాళ్ళైనా వన్నెగలిగి బతక లేరు
కనుపించని దేవునికై దానకర్మలన్నిజేయ
కనుపించెడి మానవుండె దయజూపును తెలిసికోర.

బతుకు వేగవంతమాయె – గతుకులతో గాడితప్పె
చితికిశల్యమైపోవును – బలముండగ మేలుకొమ్మ
భయం బాధ బరువుమీరు – భాగ్యమిచట భవం మీరు
బాధ భయం దీర్చునదే – భాగ్యమనీ తెలియరన్న.

మాట చేత మానవతా – మరచిపోకు మానవుడా
మహిగలుగగ మంచి మిగులు – చేత చెలిమి పంచుమురా
ధైర్యముతో ఎదిరించగ – ఎదల పదిలమగును మంచి
ధనము కొరకు ధైర్యమున్న – దహనమౌను మానవతా.

కరుణ దయల పరమార్థం – కలిమికాదు జనుల కిచట
చేతనయిన సాయమెంచి –చేయుటయే చైతన్యము
కీర్తిభూమిపై గలుగగ – కీర్తనమౌ జీవితమ్ము
మానవతను మనెడి మనిషి – కీర్తివంతుడగును భువిని.

183

అరమరికలు లేని – అందమైన భూమి
ఆశయాల దారి – అందరి రాదారి.

మానమందు బుట్టీ – మనిషి మాన్యుడాయె
మాయదారి స్వార్థం – మాన్యులనే జెరిచె
మానవతకు మూర్తి – మనసుగలుగు శక్తీ
దానవతను నిండీ – దారిదప్పిపోయె.

అంతరంగమున్న – అంతరములు సున్న
కులము మతములున్నా – కూలు సంఘమన్నా
శీలం నీ చెలిగా – గుణం నీ ధనంగా
జనసేవను ధన్యమై – జయమందుము మానవా!

భారతినీ మాతగా – హారతిమ్ము మంచికీ
తెలుగు తల్లి తేటనూ – తెలియు తీపి గురుతుగా
మతమౌఢ్యం మరుగు – జాతి ప్రగతి పరుగు
శ్రమశక్తికి విలువ – కరుణ దయలు చలువ.

అహం అంతమగును – అసూయలే తెగును
ఆలోచన చేయ – అవగాహన రాదా
ఆశయమే పంట – ఆశలిచట తంట
అమ్మనాన్న జంట – కలియ నీవె నంట.

అదితెలియర తమ్ముడూ – మది నిలుపర అన్నయా
మాటవినుము అక్కయా – బాటనడువు చెల్లెలా!
ఆశయాల బాట – అవని విరుల తోట
అదియె అన్నమాట – అమరజీవి నోట.

184

కాలం విలువే కమ్మనైనదీ – జన్మ జన్మలా జయమొసగునదీ
కల్లల కాలం కలికాలమురా – ఒల్లని మాటల వరకాలమురా

చెల్లనిరూకలు చెరుపు కాలమిది – మల్లెల మనసుల మరచు కాలమిది
జీవికి తృప్తిని కూర్చని కాలం – సృష్టికి తుష్టిని నించని కాలం.

అర్థం కానిది వ్యర్థం కానిది – అర్థంలోనే అణగియున్నది
అంతరంగముల వింతగు కాలం – అంతరములకూ ఆశ్రయకాలం
అహము స్వార్థమున అవగుణమైనది – పరమార్థములో ఫలముగననిదీ
తేటమాటలకు మూటలనింపును – మనసు మమతల మంటలురేపును.

కర్తరికాలం కర్మల మర్మం – కలిమి బలిమినీ కాంచెడి కాలం
మౌఢ్యము నిండిన మండన కాలం – దండన ఖండన దమనం కాలం
గృహముల గ్రహముల గూఢము కాలం – సూర్యచంద్రులదె సుందరకాలం
మంచితనానికి మారణకాలం – వంచన మించిన కంచెయె కాలం.

కంచములోని కబళము కాలం – కాంచెడి జఠరము తీరని కాలం
బ్యాంకులలోనా లాకరు తాళం – దొరకని దొంగల దోపిడి కాలం
కాలం రాసిన గాయపుగేయం – మనసును కోసిన మధువుగ మాయం
రాగబంధముల రంజని కాలం – రజిని గంధముల రమ్యమానసం.

కులముల కొలిమికి ఊదర కాలం – మతముల హతముల మాదకద్రవ్యం
అందని జాబిలి అందిన కాలం – అందక ఎగిరిన అంతరంగమెగ కాలం
యాంత్రిక లోకపు యాత్రిక కాలం – మాంత్రిక మాయకు మరలినకాలం
త్రికరణములకూ తెలియని కాలం – తీపిచేదులూ రుజల జీవులు.

తానే తెలియని తపనకు కాలం – తరియించుటకూ తార్కిక కాలం
పేదపెద్దల పేరుల కాలం – వాదమోదముల వాక్కుల కాలం
విశ్వశాంతికి విలువల కాలం – విగతమాయెగా స్వగతపు కాలం
కృషినిచేయగ ఋషియగు కాలం – కూర్మి జగతికి ధార్మిక కాలం.

నేతల మాతకు నెవ్వగ కాలం – రాతలు మార్చిన రహిజనకాలం
మఖముల సుఖముల మహిజన కాలం – మోసదోషముల మాపెడి కాలం
రానున్నదిలే రమ్యము కాలం – పోనున్నదిలే స్వార్థపు కాలం.

రుచులు రుజలను కొనితెచ్చి రూపాల్ని మార్చేస్తున్నా మారని మానవ చేతనం.
ఆరురుచులు ఆదికాలంవాళ్ళు చెప్పినా అనంతం రుచులని ఆధునికుల భావన.
తత్వాలు ఇరవైనాల్గింటిలో నవరంధ్రాలకందే రుచులు నవ్యాతి నవ్యాలు.
వీనుల విందై ఆనందబ్రహ్మమైన నాదం రుచిప్రకటనకు నినాదాలు చాలవు.

అన్ని జంతువుల మాంసాన్ని రుచిచూచే మానవజాతికి తనజాతి రుచించదు.
జిహ్మకు జివ్వనిపించే జిలిబిలి కలగలుపుల వంటకాలవైనం వాసికెక్కిందే.
జననాంగాల విజాతీయ సజాతీయ స్పర్శల రుచులు ఆనంద పరమావధికంచులు.
పెదవుల కలయిక మధురమై వధూవరుల తొలిరాత్రి స్పర్శ రుచి వర్ణనాతీతం.

కనగలిగే శక్తికి కలియుగప్రకృతి రూపొందించే
రుచుల దివ్యానుభూతి అనూహ్యం.
మంచులా కరుగుతూ రాయిలా రాజ్యంచేసే
మానవ మనసు రుచుల రోచులెన్నో.
ఊహను నిజంచేసి తనసృజనకు తానే మురిసిపోయే
మానవ మస్తిష్క రుచుల తీరులెన్నో.
నీటి బుడగ జీవితమని తెలిసినా తానే నిత్యుడననుకొనే
ఆశపోతు ఆశయ రుచులు అనంతం.

అన్నపానీయాల అరమరికల్లో ఏమరుపాటులోనున్న
ఎఱుక జీవి జీవిత రుచి అచింత్యం.
ప్రణాళిక వేసికొన్నా ప్రగ్రహాన్ని నిగ్రహించలేని
పరమార్థ సాధకుల బోధన రుచి నరవరం.
ఉదయాస్తమయాల లెక్కలు ఉర్వరను ఉచ్ఛ్వాస నిశ్వాసాల
రుచులతో రంజింపజేస్తున్నాయి.
జీర్ణంకాని తిండి జియ్యరుకైనా వలదనుకొని
ఆశచాలక తిని అజీర్ణవ్యాధిబాధతో రుచుల తిట్టుకొనే జీవి.

నిశీధిలో వినువీధిని చుక్కల్నీ పట్టపగటి పరిసరాలనూ
పట్టిచూచి చవులు తీర్చుకొనే సాధారణ జీవులు.
పసితనం రుచులు పసివాడు వరరుచులు
కష్టం ఇష్టం తెలియని కలియుగ చవులు.

పండిన ఎండిన ప్రకృతుల్లో ప్రాంతాల జీవరాశుల
 పరమ నికృష్ఠ నిష్ఠాగరిష్ఠ జీవన రుచులు.
కలిమిలేములు కలియుగ జీవుల కలలని తెలిసినా
 కలవరించే జీవుల రుచులకు హద్దేది?
వందేళ్ళ జీవితంలో చవిచూచిన చవులన్నీ
 చవకబారువేనని జీవన సంధ్యలో జనఘోష.

186

నేనంటే తెలియని నాకు అమ్మ చెప్పింది నేను నేనేనని
అమ్మంటే తెలియని నాకు అమ్మరూపం కళ్ళకు కట్టింది
నేను నేనేనని నాన్న నాకు ఎన్నడూ చెప్పలేదు
కాలం చెప్పింది నాన్నా నీకొక పేరుందని.

పేరులో ఏముంది పెన్నిధని వితర్కించాను
కొన్ని పేర్లలో నిధులున్నాయని కాలగణికులన్నారు
ఇల్లు పల్లె గట్టుచేను చెట్టు పుట్ట చెలిమి చేశాయి
వాగు వంక పైరు పచ్చ నాతో బాంధవ్యం చేశాయి.

ఎలిమెంటరీ చదువులో ఎన్నో బరువులన్నాయని తెలిసింది
అన్యోన్యత అంటే నేను, నాచుట్టూ అని అర్థమైంది
నాలో రక్తముందని అది అందరిలో ఉంటుందని ఊహించాను
నాలాంటివారే అందరూ అని 'అహంభావం'తో అనిపించేది.

నేను నాముందు వెనుకలు, కాలాల గుణింతాలని తెలిసింది
నాలో నేను తెలిస్తే నేను తెలివి కలవాడినేనని కలవరమైంది
నన్ను నేను తెలిసికొన్న తర్వాత భూమితో మాట్లాడాలనుకొన్నా
మాటరాని భూమి మహామహిమాతిశయరూపాలతో సాక్షాత్కరించింది
నాకాధారమైన నాతల్లికి మాటరాకపోతే నామాట మానమెంత?

187

నేనొకరూపాన్ని అవయవాల అమరిక అందరిలాగే కలవాణ్ణి. అందమైన రూపానికి కొలతలేవీ అంటే అందాలపోటీల న్యాయనిర్ణేతల నడగాల్సిందే. నాకొన మనసున్నది

కోతివంటిదది అని అంటారు మనసు తెలిసిన మర్మజ్ఞులు. ఉన్నదా? లేదా? అనే అనుమానం కూడా అప్పుడప్పుడొస్తుంది. గుర్తొచ్చినప్పుడు గుండె చప్పుడు నడిగితే గుట్టు తెలుస్తుంది. లబ్ డబ్ శబ్దాల ఉచ్ఛ్వాస నిశ్శ్వాసాల నడకలో సాగిపోతున్నది నావర్తమానం. బుద్ధి శుద్ధిగా నున్నట్లనిపిస్తుంది. ఒక్కొక్కసారి బుద్ధి మనసులకు తగాదా వస్తుంది. నెగ్గిందేదైతే ఏంగాని నేనుమాత్రం ఓడిపోతూ గెలుస్తుంటాను. చిన్నప్పుడు చిన్నాడని, చీమకళ్ళ చిన్నయ్య అనీ అడ్డకాళ్ళ అచ్చయ్య అనీ అనేక పేర్లతో పిలిచే నావాళ్ళకు నేనొక గొప్ప అనేభావం ఉంది. నేనొక వ్యక్తిని. వ్యక్తమైన శక్తి కలిగిన వాడినని జనుల ఉవాచ. నాలోని శక్తి నాకు తెలియనిదే. అమ్మవరప్రసాదమే. అందరి ఊహా పోహల ఉద్దీపనమే. నాపేరులోని నేను పరులకు గోచరించే ప్రాభవ వైభవాల ప్రతీకను మాత్రమే. పరిపక్వంకాని మేధస్సు పసితనాన్ని ప్రభావితం చేయలేదు. మానసిక శాస్త్రవేత్తల మాటల్లో పసితనపు గుర్తులు ఆరు ఏడు ఏండ్లకు వీడిపోతాయని. కాని నాకు పదేండ్ల వరకు పసితనం వీడలేదు. అందుకే యీలోకంనుండి నిష్క్రమించిన అమ్మయొక్క అమ్మతనం నాకు తెలియదు. అందుకే అన్నీభయాలే. భోజరాజీయం గుర్తుకువస్తుంది. 'చులకన జలరుహతంతువు' --- పద్యం తల్లి అంటే అంతటి అభయం. అనుభూతికే తెలియాలి కాని ఆలోచనా మాత్రంగా అది అంతుబట్టదు. తల్లిపాల రుచి ఫ్యాక్టరీ పాలలో రంగరించే రంగుల లోకానికి ఏతల్లి తపన గుర్తుకు వస్తుంది. అమ్మ ఆశలు ఆశయాల కనుగుణంగా ఎదగాలని ఆ తల్లికోరిక ఎడమచేత్తో కొడితే ఏడిస్తే ఎఱుకపోతుందని ఆవేదన నానూరేళ్ళ జీవితాన్నీ అంచెలంచెలుగా ప్రణాళికలు వేసికొని ఆలోచనాలోచనాలలో పదిలపరచుకొంటుందామె. ఎంత అనుభవం ఉన్నా నా భవం (పుట్టుక) యొక్క రహస్యాన్ని పదిమందికి చెప్పి పరవశించిపోతుంది. అమ్మ ఆశయాలు అర్థమైనాయా? అమ్మకోరికలు కొండెక్కినట్టేనా? నాకిచ్చిన జన్మకు అమ్మకు నేనిచ్చే బహుమతి ఏమిటి? పదిమందీ ఏతల్లి కన్నదో? అని అనుకొంటే అదే పదివేలు. జన్మసార్థక్యం అదే. నావ్యక్తిత్వానికి, మూర్తిమత్వానికీ, శక్తికీ అదే తుది సాఫల్యం.

189

దారీ తెన్నూలేని మాయదారి లోకానికి దాపరికం ఒక సమస్య.
దారే దొరకని మానవ సమాజానికి గోదారే రాదారిగ అగపడే వైనం.
వావి వరుసలు లేని వాసనారహిత జనావళికి వలపుల తలపులే పులకింతలు.
నవ్య మానవమేధకు అవధులు నిర్ణయించే అధినాయక కవి చిత్రహేల.

నిండిన వయసు పంటలో తాలుపాలెంతో నిర్ణయంకాని నైజ జీవనులు

సహచర వనచర సమాజానికి సహధర్మచారిణికత్వం కట్టబెట్టే కలిపురుషులు
పంతాలు పట్టింపుల వంతపాటలో రవ్వంత రాసిక్యమున్నా కలహాల కాపురం పదిలమే
హాలాహల జీవనుల హారతి రతుల రామణీయకానికి మణిమకుటం ఆస్థిక జీవనం.

వనసంచారం నవ్యమానవ కళ్యాణ కారకుల
నైజ జీవన గతిగా మతిమంతమౌతుంది.
తీరుమారని తీపిచేదుల స్వాదుత్వం
తిరువీధుల జీవన సోపాన గమ్యం.
తనువును వదలి తట్టుకోలేని తపనపరుల
ప్రేలాపన ప్రలాపనగామరే స్థితి.
మానవ యంత్రాలను మరచి మరయంత్రాల
చుట్టూ తిరిగే మరోలోకపు లౌక్యమానవులు.

కదిలే చైతన్య చైత్యానికి కమ్మని వలపులద్ది
కలనిజమైనదని భావించే అహంభావుకులు.
శిల శిల్పంగా ఉలిమలచిన వైనం వైభవాన్ని
ఆపాదించిపెట్టే ఆస్థిక్యానికి ఆవలిమెట్టే.
ఆత్మానుభూతికి అందని ఆత్మనివేదనం
అనవసరపు మాటగా అర్థం చెబుతుంది.
కామన తీరని కలిపురుషులకు కోవెల లేదా
కోమలి పరమాద్భుతాశ్రయాలు.

భవానికి అనుభవమే అసలైన ఆనందమనీ
అంతుదొరకక అలమటించే నరవరులు.
జననం మరణం జీవుని వరణమని ఎటొచ్చి
ఎటు పోతుందో తెలియని ప్రాణి వేదన.
వచ్చిన లోకంలో నచ్చిన జనం మెచ్చిన
లోకాతీత చేతలతో జన్మ పావనం.
వేసికొన్న దారికి గమ్యం గమనం గమనిస్తూ
పయనించడమే ఉత్తముని లక్షణం.
భూదారులు ఆకాశపుటెడారి దారులై ఆహరణోద్యమానికి
దిగకుంటే చాలు.

190

కల అలగా కామనల సముద్రాన్ని కలగుండు వరచింది.
ఇల ఇతిహాసమై ఇంతింతై ఇరుకునబడి ఇంపు దప్పింది.
పురాణాల పూజ్యకథల పున్నమి వెలుగులు అమవసనిశులైనవి.
కాలం తెలియని కనుకలివినుకలియుగం కలగాపులగమైంది.

ఎన్ని మానవమేధల వ్యధల శిథిల వ్యాపారమో నేటి పునీత పుడమి.
ఎన్నెన్ని ప్రళయార్చుల ఊర్పుల ఉద్యమయమమో మానవ జీవనయానం.
అందనిదానినుండి అధోలోకం వరకు ఆవరించి వరించిన వరనరమేధ.
ఆలోకంబగు పెంజీకటి కవ్వలి వెలుగును దర్శించ యత్నించే దార్శనికం.

మరిగిన రక్తం మరొకరికి దానంజేసే రక్త విక్రేతల వికృత జీవితం.
తరిగిన శక్తికి తారుణ్యం నందించే అందాల తాపసుల ఆశ్రమ వైద్యం.
మురికి మరకల మూలవిరాట్టును ఉతికి ఆరబెట్టే ఉత్సవాల సంరంభం.
మరకలుపడ్డ మానవజీవన మాతృత్వ మమకారాలకురంగులద్దే రాజసం.

సాహసం హసించిన జీవుని జీవనం పరిహాస భాజనమయ్యే పరమ దినం.
స్వార్థం స్వాగతించే గతానుగతికుల గతుకుల బతుకుల గంధర్వ యానం.
త్యాగం యోగించిన యోగుల త్యక్త దేహాలకు జీవసమాధుల నిర్మాణం.
ఆందోళించే జీవుల సరసన హిందోళాన్ని ఆలపించే జనాశయ ఘాతకులు.

కాగితాల తాలుబతుకుల కైతవాల కరవాలం లయించే శుభదినం.
రక్తమాంసాల రాలుగాయి జీవితాలు శక్తివంతమై శాంతిజనించే జనదినం.
వల్లించే నీతుల వరుసలు సరసత్యానికి సరాగమై విరాగమయ్యే వింత వైభవం.
చేత చేతికందని చేతంలో చాతకం సామెతగా చెరిసగమైన సెగల వగలు.

191

హిమం హితమైన కాలానికి హీనమౌతుంది అరుణకిరణం.
అతిసర్వత్రా అవహేళమౌతుందని చెబుతుంది అనుభవం.
రాలిన ఆకులే రసాయనమై రసాతలానికి పుష్టిని చేకూరుస్తాయి.
జారిన గింజలే జనించిన వృక్షాలైక్ష్మాతలానికి శోభనిస్తాయి.

మేటవేసి కోతకోసికొని మేదినిని అస్తవ్యస్తంచేస్తుంది వర్షం.
ఎగుడు దిగుడుల జీవితాలకు ఎఱుకయే ఎల్లకాలం కల్గిస్తుంది హర్షం.
దృక్పథానికి దృష్టిలోపమొస్తే దూరతీరాలు సారహీనమౌతాయి.
మనోదృష్టికి మాంద్యం లేకుంటే సుదూరాలైనా దరిజేరతాయి.

నరసంబంధాలు వరబంధనాలై వసుధకు వాసిదెచ్చే వరదినం చేరువలో ఉంది.
ఆత్మీయతలు హత్యకు గురైతే పారేవి పొగల సెగల లావా ద్రవాలే.
కులకుడ్యాల కూర్మికట్టడాలు మార్మికత తెలియగానే మసిబారతాయి.
మతం హితానికి హీనమని తెలిసినప్పుడు మౌఢ్యానికి మృత్యువు నిత్యమౌతుంది.

రంగుల హంగుల రసాతలం – రసహీనులకది మషీతలం
స్పందన వందన స్వాదుఫలం – లేనివానికది మేడిఫలం
ఉడుపులేని దేహం చూస్తే – ఉవ్విళ్ళూరుతు ఉంటాయి
రుచినీ శుచినీ పరికిస్తే – ఉసూరుమంటుంటాయి.

రుజ వరకు వెళితేగాని రుచి ఫలితం తెలియదు
మసియైన దేహం చూస్తే మనగతి గుర్తుకు వస్తుంది
మానుషత్వం అమానుషత్వమైతే అమాయకుల బలిగొంటుంది
మానవత్వం మలచగలిగితే విశ్వశాంతికది వీచిక అవుతుంది.

192

అలెగ్జాండరునుండి అమెరికాదాకా అన్నీ ఆహరణలే
హిట్లర్‌నుండి హమాస్ వరకు అంతా జనహత జావళీలే
ముద్దుపదం యుద్ధంలో మనిషి పథం పాదోధిలోకి ప్రయాణమే
అశోకుడు అందరికీ తెలిసినవాడే ఆయనచేతల చైతన్యం తెలియాలి.

అంతర్జాతీయానికి అర్ధాంతర అధ్యక్షుల అభాసైన వాక్కుల వరుసలే
విశాలమైన ప్రపంచానికి హద్దుల పద్దుల అపహరణల పర్వాలెందుకో
పంచభూతాల ప్రపంచభూతి అన్ని భూతాలకు సమభాగమే కదా
తడబడు నడకల తాలిబన్ ప్రపంచ భూతంగా పరిగణింపబడింది.

మేధ మేల్కొన్న దశకంటె త్యాగం యోగించిన వేళ యోజన ప్రధానమైంది
నలుపు తెలుపుల నాణ్యతను నవ్య సమాజం సమ్మానించే తీరుకు జోహారు

కష్టపడని కష్టపెట్టని ఇష్టమైన మానవ సమాజ భావన రూపుదిద్దుకొంటుందా
మట్టిలో కలియకపోతే మనిషిని మంచులో ఉంచి పదిలపరచాల్సిందే.

రాతివిగ్రహాల గ్రహాలు రాజమార్గావరోధకాలై అపకీర్తి శేషకాలౌతున్నాయి
చిల్లరదేవుళ్ళ గుళ్లు అల్లరిమూకల రాజ్యాలై అశేషభుక్తి మార్గాలౌతున్నాయి
విశాలప్రాంగణాల వినూత్న దేవాలయాలు దార్లు కాచుకొనే దైవాలైనాయి
బాధలు బాధ్యతలు లేకపోతే భావిభారత పౌరులంతా దేవతామూర్తులే.

వ్యక్తి వ్యవస్థ పరస్పరాశ్రయాలైతే వ్యవహారశైలి
వ్యత్యస్థంకాకుండా వెలుగిస్తుంది.
భయంలేని సమాజానికి బాటలు వేసే భాగ్యశాలుర బాంధవ్యం
భవిష్యత్ శాంతికి కారణమౌతుంది.
భూమ్యాకాశాల రక్షణకుడ్యాల సాక్షిగా క్షితిలో
అంతరాలు క్షయమయ్యే రోజొస్తుంది.

193

తినడానికి ఉండీ తినలేని జీవితాల వ్యధల తీరులెన్నెన్నో
తిండిలేని ఆకలి జీవితాల రోదనలకు అవరోధములెన్నెన్నో
నోరారా మాట్లాడలేని నోరున్న మూగజీవుల బాధల గాథలెన్నో
నోరు లేకున్నా మానవ శరీరభాషతో మాట్లాడే మానవ మాతృలెందరో.

కాంక్ష ఆంక్ష కలిమితో బందీలై కలవరపడి కలహించుకొంటున్నాయి
తరతమాల త్రాసులో తూనికకురాని మానవ మానస మహితత్త్వమెంతో
భజన పరుల విభజనతో జవం చచ్చిన జనం జాతి జాగృతిలో కలవలేకున్నారు
అధికార పదవీ అధిరోహరణలో అడ్డంతగిలిన పేదలకు గడ్డురోజులే.

అంధకారం అధికారానికి ఆరవ ప్రాణంగా
అరిషడ్వర్గాల విజృంభణ విజయం.
ఎంగిలాకులేరుకొనే ఎఱుకైన జీవితాల
ఎదసొదను ఆలించే పాలకులున్నారా?
బాధల్లో తప్ప గుర్తుకురాని సాటిమనిషి సాంగత్యం
బతుకంతా ఉండాలంటే సాధ్యమా?

సుఖాల సుందర స్వప్నాలు విచ్ఛిన్నమై దుఃఖాలను
దూరంచేసుకొనే రోజుదగ్గర్లోనే ఉంది.

మేఘాలు ఉరిమితే సూర్యుడు కన్నెర్రచేస్తే
స్రుక్కిపోయే అల్పజీవి ఆనందమెంత?
నిప్పునీరు నింగి నుండి నేలకు అటూ ఇటూ ప్రయాణం
చేస్తూ నివ్వెరపాటు కల్గిస్తుంటాయి.
జట్లుకట్టిన ప్రపంచదేశాధిపతుల జుట్టు
సామాన్య విశ్వమానవుని చేతిల్లోకి వస్తుంది.
బలం, బలగం, భాగ్యం ఏరూపంలో ఉన్నా
అది సరసన ఉండే మనిషికి సాటిరాదు.

అందరిమేలుకోరే అధినాయకపాలకశ్రేష్ఠులు
తమమేలు ముందు చూచుకొంటున్నారు.
పదిమందిని కష్టపెట్టి ఒకడు సుఖపడే రోజులు పోయి
సమభావన సరళమవుతుంది.
ఉచ్ఛ్వాస నిచ్ఛ్వాసాలతో ఉద్భవించిన వేడివాయువులు
వెతలను సృష్టిస్తున్నాయి.
శ్రమశక్తిని నమ్మినవానికి శాంతిసౌఖ్యాలు
కరతలామలకమై తరింపజేస్తాయి.
కళ్ళు నమ్మలేని నిజాలు కలవరపరుస్తూ కలికాలపు
వైపరీత్యాలుగా పిలువబడుతున్నాయి.
అమ్మకాల కాలంలో వస్తువేదీ లేనపుడు తనకుతానే
అమ్ముకొనుట తథ్యం.

194

అక్షరజ్ఞానశూన్య నిరక్షర కుక్షుల క్షుత్తు తీరే రోజు ఎంతో దూరంలేదు.
అందరూ జ్ఞానులైతే అజ్ఞానానికి తావులేక అవని అవతారం మారుస్తుంది.
ఇంద్రియాలన్నిటికీ ఇంతో అంతో అందే విజ్ఞానం జీవనాన్ని ప్రభావితం చేస్తుంది.
కకావికలై కలగాపులగమౌతున్న మానవ సంబంధాల నవీకరణ మొదలైంది.

సాంకర్యానికి తోడైన సంకుచితత్వం మానవత్వానికి మరోదారిగా మారుతుంది.
హేళనకులోనైన హేతుతత్వం హీన జనజీవనానికి దుర్గతి నాపాదిస్తుంది.
మాంత్రిక తాంత్రిక యాంత్రిక జీవనాల వైవిధ్యానికి వైభవం కల్గించే నవ్యయుగజీవనం.
ఆసురం భాసించే అవనిజనమనస్సులకు అమృతసేచనం జరిపించాల్సిన అవసముంది.
వింతలోకానికి విలువల చలువపందిరివేసే విబుధులకు వింజామరలు వీచే రోజులొచ్చాయి.
మోసాల మొదటిమార్కు విక్రమార్కుల అక్రమవర్తనకు అడ్డుకట్ట పడుతుంది.

వింతధ్వనుల విలువలను వెలువరించే విబుధుల వాక్కు బధిరులకు బాంధవ్యమౌతుంది.
కలహాల కాపురాల్లో కలరవాలు పలికించే చిలుకల కొలుకుల చిద్విలాసం విలాసం.
బూటకపుమాటల బుద్ధిశుద్ధమై వాగ్భూషణం భూషణమై అలరించాల్సిన అవసరముంది.
వారసత్వపు వాటాలకై వరుసతీరే వరనరులు ఆస్థికి ఆదికారణం తెలియని అంధులే.

తల్లీ తండ్రిని మరచే తనయుల జీవితానందతన్మయత్వానికి చెల్లుచీటియిచ్చే తరుణం ఆసన్నమైంది.

పెరిగివిరిగిన వృక్షానికి పేలవత నాపాదించే పెద్దల తత్వానికి ప్రకృతి శీలం తెలియదు.
దారుల తీరులు మారినా గమ్యం చేర్చే దారిబత్తెపు జీవితాలకు విముక్తి ఎప్పుడో
విరామంలేని పథికునకు విలువనిచ్చే వెలుగుల వేల్పుల విజయం వినువీథి కెగురుతుంది.
రాత్రినేలే రారాజుకు ధాత్రిపంచే పంచామృతం మానవ మధురోహల హేలావలయం.
వలపు తలపులు నింపే వందేళ్ళ మానవ జీవనానికి మతిమంతపు సీమంతం మధురవాక్కే.
పెదవి కదిలితే పదవులు పదిలపడే పథానువర్తన మనిషికి ఖుషీని కలిగిస్తుంది.
పెదవి జారితే పదవులు జారిపోయే ప్రమాదానికి పాలవని పదమే పరమపథం.

195

యుద్ధం అద్దం పడుతుంది 'ఉన్మాదం' ఉద్యమించడానికి
వ్యక్తులకూ వ్యవస్థలకూ మధ్య అవస్థలుతెచ్చే ఆయుధం
క్రూసేడుల క్రూరత్వాలు మతహతానికి మరువని సాక్ష్యాలు
దండయాత్రల దారుణకృత్యాలు ధరణిజనులకు శాపాలు.

మతరాజ్యాలు రాచరికాలు మారణహోమానికి మరువని ఋజువులు
ఉగ్ర అగ్ర వాదాల వాదులాటలు రాజకీయపుటాటలు
కాశ్మీరం కలతపడింది. కలవరించింది. కారుణ్యం వర్షించింది
గుజరాత్ గుబులు చెందింది – గూడు కోల్పోయింది – మతం మంటరగిలించింది.

సరిహద్దులను చెరిపివేసే సాహసం హసించింది ముషాఫ్ ముఖంలో
'అతల్' కవితాత్మలో అతులిత బలధామం అమరవీర చిహ్నమైంది
శాంతికపోతం అమెరికా అంతరాత్మలో అదృశ్యంగా నిలిచింది
ప్రపంచ పాలకుల కళ్ళన్నీ పాకిస్తాన్ భారత్‌ల లోగిళ్ళలోనే.

చంపుకోవడానికి సరియైన స్థలం ఎంచుకొనే ఎఱుకలో సైనికులు
బలిదానం ఒకరిదైతే భాగ్యం మరొకరిదిగా రాజకీయ రావణకాష్ఠం
కార్గిల్ కర్మవీరుల త్యాగఫలం అందకముందే మరోత్యాగానికి సిద్ధం
తరం మారినా తరగని హద్దుల తగాదాల తతంగం.

అంతర్జాతీయ జోక్యానికీ అధికుల జోస్యానికీ జోలపాట పాడడం
అణ్వాయుధాలు హస్తాల్ని వణికిస్తుంటే వదలివేసే క్షణం మారణం
సర్వజన శ్రేయం కాంక్షించే కామందుల కార్పణ్యం కరుణకు తావివ్వదా
ప్రజల్ని మభ్యపెట్టాలనే ప్రభువుల చర్యలు పౌరులు గమనిస్తూనే ఉంటారు.

196

వంతలు వింతలు లేనివింతవిలువలలోకం విబుధులమయం
చింతల చితిలో చితికిపోయే చీమూనెత్తురుల దేహం యిది
నిలబడలేని నింగివైపు నిత్యం నిలబడిఉండే మనిషి చూపు
భూమినంటిన భువర్లోకపు చివరల నిలబడలేని మనిషి ప్రాణం.

పావనమైనా 'వన'మైనా 'నవ'మైనా మనిషి మనసును లోగొనాలి.
అవకాశం ఇవ్వని ఆకాశంలో అవసరాలు తీర్చుకొందామనే తపన.
స్వర్గం అపవర్గానికి ఆదరువుగా మానవ వర్గం ఆశపడే విధానం.
నరకం మరోరకపు జీవన గమ్యానికి రాదారిగా భావించే మానవాళి.

ప్రకృతికి ప్రతికృతిచేసి ప్రణవాకృతిగా ఆరాధించాలనే జనాశ.
ప్రయోగంతో ఉపయోగం పొందే మానవ యోగుల అంతరాత్మ స్వార్థపూరితం
ధనంతో వేదన ప్రబలిన మానవాళికి మరో ఇంధనం మానవత్వమే
ఎగుడుదిగుడుల భూమిపై పెరిగిన మానవునికి ఎఱుకలో కఱకుదనమే.

ఆకలికి అన్నమనుకొనే అల్పజీవులకు అధికరుచుల ఆలంబన ఎక్కడిది.
స్వేదం వేదంగా ప్రభవించిన ప్రజాప్రభుత్వాలకు పతనమనేని ఉండదు.

నమ్ముకొన్న మానవులకన్నా అమ్ముకొనే మానవుల ఆధిక్యం ఆకాశానికెగసింది.
విశ్వాసం శ్వాసకు విలువనిస్తే మనిషి జీవనకాలం రెట్టింపవుతుంది.

మన్ను అన్న మానవునికి మమతానురాగాలు తెలుస్తాయంటే నమ్మాలా?
అనుబంధ బంధాలు అధికమైతే అహరహం తేడాలేని అంధకారానికి చేరువే.
ఆకటికీ చీకటికీ ఆశకూ ఆది అంతాలు అవసరార్థం అనుకొనేవే
జానెడు పొట్ట జాతికి జయశీలం కాంక్షించడం జరిగే పనికాదుసుమా.

197

రాసిన లేఖలో రహస్యాల సంరంభం
రాసిక్యపు మనసులో రజనీకర సంబరం
పదాలు దొరకని భావాలకు అనుభూతే ఆనందం
భవం అనుభవాల మయంగా భాసిల్లును కవిత్వం.

పాతవింతలోకంలో సుంత – వంత భరించలేం
అంతా ఆసృష్టికర్త వింతచేతగా అనుకొనడం
నవజీవన వనవాసానికి వనసంపద కరువౌతున్నది
జనారణ్యసీమలలో జాగృతజనవనజీవన మారంభం.

పట్టణాలపైకెగబ్రాకుతూ జారిపోయి పల్లెలకు ప్రయాణం
ఆకాశహర్మ్యాల జీవనం విసుగెత్తి పొదరిండ్ల వాసానికై తహతహ
మందులులేని రోగాల మందభాగ్యులు మృణ్మయ జీవనం గడుపుతున్నారు
నశిస్తున్న సహజ సంపదను కాపాడుకోవాలనే తపన ప్రారంభమైంది.

విలువలేని పంచభూతాలకు విలువకట్టే రోజులు విధ్వంసానికి సూచనలు
మేధ వేదన ఒకదానిని మించి ఒకటి పెరిగిపోతూ వెగటుకల్గిస్తున్నాయి
చేతికీ నోటికీ చెలిమిని కూర్చే ఆధునిక సైన్సు సెన్సు అమాయకం కాదా
కలవని రైలుపట్టాలను కలిపే కనులశక్తి అశక్తమానవాళికి అవహేళన.

వేగం విజయాన్ని కొనితెస్తుందని నమ్మితే భయాన్ని మిగిల్చి బాధను చేర్చింది
తొందర జీవితాలను చిందర వందరచేసి ఛీత్కారాలకు గురిచేస్తుంది
స్వార్థాన్ని స్వాగతించే స్వాములు కలికాల సార్థకులుగా వర్ధిల్లుతున్నారు
అవసరం తీర్చుకొని అన్నీకలుషితం చేసి 'పంకజ' ప్రాదుర్భావాన్ని కాంక్షిస్తున్నాడు

ధృవాలను కలిపే దూరదృష్టికల్గినమానవుడు మనోధృవాలను మలచలేకపోతున్నాడు.

198

ఆహారంకోసం అహరహం శ్రమించే చీమకూడ
ఐకమత్యంతో కదులుతుంది.
అవసరంలేకపోయినా ఆహరణోద్యోగంలో
అవనిజనుడు పంకిలమౌతున్నాడు.
అందరికీ అందాల్సిన ప్రకృతి అందాలను
తానే విందుగా ఆరగిస్తున్నాడు.
ఆకలి అవసరాలను అధికమించి కూడబెట్టే
కూటనీతిపరుడై కులుకుతున్నాడు.

ఎల్లలులేక ఎగిరేపక్షుల్ని ఏకాంతచేసి వాటిని అంతంచేస్తున్నాడు
మంచుకొండల్నీ మహాలోయల్నీ మాన్యాలు చేయాలని తపనతో చతికిలపడుతున్నాడు
కాలగమనాన్ని మార్చి గమ్యాన్ని తానే నిర్దేశించి
రమ్యావలోకనం చేయాలని ఉబలాట పడుతున్నాడు.
సృష్టించడం తప్ప లయాన్ని ఆపడం శక్యంకాని నరుని నాగరకత నాణ్యత ఎట్టిదో?
సృజన రహస్యాన్ని రూపంలేని బ్రహ్మకాపాదించి
తనచేతకానితనాన్ని నిరూపించుకొన్నాడు.
అణుబంధమే బ్రహ్మాండ బాంధవ్యమని నిరూపించి
కలిపి విడదీసి కలవరపడుతున్నాడు.

రాయిలోనిరాసిక్యాన్నీ మట్టిలోని మంచితనాన్నీ మనసుతో అభినందిస్తూ ఆనంద పడుతున్నాడు.

తనివితీరని తనువుతో తపనపడుతూ తారుణ్యాన్ని తరగని రీతిలో ఉంచాలని ఉవ్విళ్ళూరుతున్నాడు.

అసూయ సూదంటురాయితో అగ్నిని రగిల్చి మిగిలిన బూడిదకోసం ప్రాకులాడుతున్నాడు.

శక్తికి కేంద్రబిందవై శాంతిని వర్తింపజేయాలని వర్తులాకారంలో తిరుగుతున్నాడు.

నటన వర్తనగా విఘటన విజయంగా విధ్వంసం వైభవంగా మానవదానవ జీవనం వనపూరితమైంది.

సమానత్వం సన్మానింపబడే సాలోచనాంతరంగాల సౌమనస్యం సుమిస్తుంది.
ఛాందసం అంధత్వానికి ఆదికారణమైతే 'ఆది'నివధించే అవనియత్నం అవసరం.
సదయహృదయ స్పందనల బంధుత్వం సారళ్య సహజీవనానికి మూలకారణం.
నశ్వరమైన విశ్వానికి వినూత్న సృష్టి విపుల వ్యాఖ్యానమై విందుచేకూరుస్తుంది.
కలతల కన్నీళ్ళ కమిలిన జీవితాలను కాలం కనికరించి కామనలను తీరుస్తుంది.

199

తనువు తన పూర్వాన్ని తవుడుకొంటుంది
కోరిక కొత్తదనాన్ని చిత్తానికి హత్తిస్తుంది
ఆశల అక్షరాల క్షారం అంటింది
అమాంతం అదిసముద్రమై అలలతో అలరారింది.

ఆమ్లమై అమలినమై అతిస్వచ్ఛరుచుల్ని పంచింది
ఆమ్లక్షారాల జీవనరుచులకు శుచిత్వం ఆపాదించబడింది
బడబాగ్నిలా దాగిన అశ్వం విశ్వాన్ని కబళించాలని విర్రవీగింది
ఆకాశానికెగిరిన ఆశ వర్షమై హర్షాన్ని వెలిబుచ్చింది.

చల్లబడ్డ బడబాగ్ని సంద్రాన్ని అందంగా తీర్చిదిద్దింది
ఆశజీవికి అమరత్వాన్నీ సమరతత్వాన్నీ ప్రేరేచుతుంది
సమరం సహజత్వానికి విరుద్ధం అమరం అతిసహజం
అందని కాలానికి అందే అవసర ఆయుధం ఆశ.

మనోమాలిన్యానికి మందును ప్రసాదించే ఆశ అందం
ఆశకూ అందానికీ హద్దులు లేకపోయినా 'పద్దులు' సత్యం
మనసులోని ఆశ తనువు నిరాశను తరలిపోయేటట్టు చేస్తుంది
తనువు మనసుల తారుణ్యం తరగని జీవన సాఫల్యం.

ఆమ్లక్షారాల కలయికకు ఆశాజీవనం అమృతప్రాయం
అంత్యానికీ ఆదికీ అక్షరమైన ఆశ అమలిన జీవన సారం
అనురాగం వేగవంతమైతే అమలిన రాగోదయానికి అవరోధం ఏర్పడుతుంది.

200

కార్యదేవ – కరుణదేవ

సూర్యదేవ ఆర్యదేవ ఆదిదేవ అపరదేవ
అమరదేవ అరుణదేవ సవితదేవ కవితదేవ
ఉదయకిరణ ఉషాకిరణ సదయకిరణ సమత కిరణ
తిమిరాంతక తీర్థంకర పద్మబంధు పరాత్పరా.

కార్యదేవ – కరుణదేవ

జీవజ్వలన జవకారక భాస్కరుడా అహస్కరా
అర్కరూప అగ్నిగోళ ఆర్తిదూర మూర్తిరహిత
సప్తజిహ్వా ఆప్తాశ్రయ సప్తరథాసప్తవర్ణ
ఆదిశక్తి పరాశక్తి అపరశక్తి ఆత్మశక్తి.

కార్యదేవ – కరుణదేవ

వేవెలుగా వేదరూప వెలుగువెలుగ కాంతికరా
భ్రాంతిదూర భాస్వంతుడ భావరూప జీవబంధు
ఐంద్రీముఖ చంద్రకరా సాంద్రకరా సమరూపా
అశ్వశక్తి విశ్వశక్తి అమరశక్తి సమరశక్తి.

కార్యదేవ – కరుణదేవ

ఆకర్షణ విరోచనా సులోచనా సుందరకర
రవిరూప రమ్యరూప గమనరూప గణితరూప
అగ్నిరూప అర్చిరూప రాగరూప తీక్ష్ణరూప
జ్ఞానగణ్య ధ్యానరమ్య ధ్యేయసౌమ్య దివ్యధన్య.

కార్యదేవ – కరుణదేవ

చిదాకాశ సదానంద విద్వన్నుత విధివిదితా
వేగగమన వెతలదమన విమతశమన వీర్యరమణ
తేజసుడా ప్రాకృతుడా ప్రణవకృతీ ప్రభాకరా
స్థితిమంతుడ గతిశీలుడ యమునకరా యాత్రకరా.

కార్యదేవ – కరుణదేవ

మానమూర్తి మహితకీర్తి మహిమస్ఫూర్తి మౌనవర్తి
ధరపాలక ధిషణావర మేధాశ్రయ బోధాకర
అంశురూప ప్రాంశురూప కాంస్యరూప కమ్రరూప
కిరణకరణ క్రియావరణ శ్రియఃపతీ ప్రాచేతస.

కార్యదేవ – కరుణదేవ

వైతాళిక వైమానిక వైవస్వత స్వారోచిష
జన్యుమతీ ధన్యగతీ హైన్యహతీ వన్యహితీ
వ్యాసరూప న్యాసవేష న్యాయపోష శార్ధ్వలాత్మ
గీతాకర గీష్పతివర ఛాయాధర చేతనకర.

కార్యదేవ – కరుణదేవ

రామమూల రామాశ్రయ రహిరాజా గ్రహతేజా
భాస్వంతా భవకాంతా భారతకర భువనధరా
లోకాలోకా వేకువవేదా సాగరశోషా సంతతతారా
భూతాలోకా భవ్యనుభావా శుక్లవిరోచన శుభసంకేతన.

201

చూపే శృంగారము – నవ్వే నయగారము
వలపే వయ్యారము – తలపే తారుణ్యము.

నయాగరా జాలే నీ – వగరు పొగరు ఫిగరు
అరేబియా సముద్రమే – అందనినీ అందము
హిమాలయపు మహిమే – నీ చల్లని చందన గంధం
కాశ్మీరం రంజనమే – కలవరించుకోకందం.

భాగ్యనగర భామా నీ భావమేమొ చెప్పమ్మ
యోగ్యతయే యోగంగా భోగభువిని పాలిద్దాం
ఆకాశం నడుముకూ అవకాశం సుమపాశం
నితంబాలు తంబురలై ప్రేమ నినాదము పంచెను.

నవరసపాత్రే నీనాభియై ఆస్వాదన అమరమే
వరుసల సురశాలలో వరములవాల్లభ్యమే అది

మందగమన నీ అందెలు మరునిశాలమానికములు
కంకణ ఝణక్వణనమే స్వర్గశాల ఘంటికధ్వని.

వయసువాడి మనసువేడి కలసెవాడి వేడిగా
రాతిరి జాతరలో రతిరాణి మతిమరచెను
అంగాంగ సంగరమే అంతరంగభంగిమగా
సమరాగము సరాగమై అమరరాగరంగముగా.

అనుభవించు ఆశలో అనురాగము పరాగము
పూరేకుల షోకులో షోకిలాకు సుమరాగము
సోలెడైన సోకులో శోభనమే నవవిభవము
భవకామనవారిధిలో వగలాడికి వలపుధనం.

202

ఏకాదశి ఏకాదశి తొలియేకాదశి
ఏరువాక సాగమన్న ఏరుపారు ఏకాదశి
తొలకరి ప్రారంభంలో పలకరించు ఏకాదశి
కర్షకాళి హర్షముతో పులకరించు ఏకాదశి.

శివగంగ చిందులేయు – సింగారపు ఏకాదశి
భువిగంగ పంటలతో – సిరులు పంచు ఏకాదశి
ఏకాదశ రుద్రులంత – ఎఱుకపంచు ఏకాదశి
రుద్రపూజ చేయుటతో – ఛిద్రము వీడు ఏకాదశి.

హిమగంగ హితముతో – పొంగిపాఱు ఏకాదశి
శివనామ స్మరణతో – చిందులేయు ఏకాదశి
కైలాసవాసునితో – కమ్మదనపు ఏకాదశి
కాలచక్రగమనంలో – కాంతిదాయి ఏకాదశి.

వర్షాభిషేకముతో – వాసిగాంచు ఏకాదశి
పచ్చదనం పండించగ – మెచ్చుకోలు ఏకాదశి
చల్లబడిన భూమాతకు – సంతసమే ఏకాదశి
రుద్రభూమి భద్రమై – రుజలతొలచు ఏకాదశి.

పరమేశ్వరు ప్రేమలో – పరవశించు ఏకాదశి
ఆనందము నందించెడి – అమరమైన ఏకాదశి
ప్రయత్నములు ఫలియించగ – ప్రగతిశీల ఏకాదశి
పేలపిండి సున్నుండలు – బోజనమౌ ఏకాదశి.

పరమాన్నము పరమార్థము – ప్రాభవముల ఏకాదశి
హరనామ వరణంలో – అరుణారుణ ఏకాదశి
పంచభూత భూమిలో – ప్రభవించిన ఏకాదశి
జగతి జవమునిండించగ – జయశీలపు ఏకాదశి

203

కడుపే కైలాసము – కలిమే వైకుంఠము
కులాసాల కైలాసము – విలాసాల వైకుంఠము
రుద్రభూమి భద్రము – అమరావని అతిశయము
అభిషేకము అందము – అలంకార భాగ్యము.

భూతిపూత భోగము – త్రిపుండ్రమే తియ్యదనము
అవతార తారుణ్యము – పరమేశ్వర పావనము
శివాలయం చిరునామా – విష్ణ్వాలయ విభవము
కౌపీనము కంచుకము – శుక్లాంబర సుందరము.

సామాన్యుల వరదైవము – మాన్యుల మది దైవతము
త్రిశూలమే ఆయుధము – శంఖ, చక్ర, శార్ఙ్గధారి
పునుకలమాలయె తనది – కౌస్తుభమణి కంఠహారి
వనిత కొండకూతురు – అతివ అబ్ధి కొమరిత.

అర్ధాంగము అతివసొత్తు – వనిత వాసి వరుహృదయము
పార్వతమ్మ పావనము – లక్ష్మిదేవి లావణ్యము
దేవ దేవుడేయితడు – రాక్షసారి రమ్యుడు
శ్రీశైలము శివకరము – తిరుమలయే తిరుమాన్యము.

ఓంకారము ఓదనము – శ్రీకారమె చిరునామా
కింకరులే సేవకులు – సురలే వరదాసులు

భక్తభేదమే శూన్యము – భక్తి శక్తి భావనము
ఆదిదేవుడే యితడు – సురనరులకు సుందరుడు.

అపవర్గము నందించును – మోక్షమందు మోదముంచు
అందనిదీ పొందనిదీ – అభేదమే వందితమే
హరిహరులకు అందరము – వందనముల నర్పిద్దాం.

204

మాల్యాద్రి నిలయం – మహామహిమానుభావం
భవపాపహరణం – భాగ్యలక్ష్మీ నారసింహం
యోగిహృన్నివాసా – భోగభాగ్యప్రదాతా
నారసింహ విరూపా – నమామి వరదాతా.

వనాంతర సంచారీ – ఘనగర్వ పరిహారీ
ఉగ్రసింహరూపధారి – నిగ్రహమే (నీదారీ) నిత్యనిధీ
అవతారం తారకం – భక్తనరుల భావనం
కోవెలలో కోమలం – కోర్కెదీర్చు కొలమానం.

నీరూపం నీనామం – నిత్యనిధుల సమకూర్చును
నీకొండ మాకండ – కలకండ కమ్మదనం
భక్తి రక్తి ముక్తులతో – భవపాపము శమియించును
ఉగ్రరూప అగ్రదేవ – ఆలించుము పాలింపుము.

గుండెలోన నిండుగా – కొలువున్న కలిమిసామి
శక్తిమూలమైనవాడ – శమములనందించు సామి
శ్రీదేవి రూపమే నీసరసగా – చింతవంత పోగొట్టును
మాదేవి లక్ష్మిగా – మామనసుల నిత్యమై నిలుచును.

బ్రహ్మాండ మంతటికీ తల్లిదండ్రులే మీరు
భువన భాండమంతటికీ భుక్తి పంచు శక్తులు
అరణ్యాన అరణముగా అవతరించినవాడా
జనారణ్య జగతికీ జాగృతిపంచెడివాడా.

నిత్యసత్య రూపా - గగన వీధి వాసా
భక్తతతికి బంధూ - దయాధర్మసింధూ
నీసేవన శుభకరం - నీ భావన భయహరం
జన జయమే నీ భావం - జగతి వెలుగు నీ భాగ్యం.

205

పుస్తకాల పురుగులు - మస్తకాల మరుగులు
వాస్తవాల వామనులు - అస్తి నాస్తి కాద్యులు
నేటి విద్యార్థులు - చైతన్యపు చాతకాలు
నేర్పు ఓర్పులేనివాళ్ళు - మార్పుతీర్పు మరచినోళ్ళు.

భూతమునే భూతముగా - భావించెడి బాధితులు
వర్తమాన మానమునే - నర్తనముగ నడచువారు
భవిష్యత్తు జోస్యముగా - భాషించెడి భావనులు
ఊహలలో ఊరేగుతు - ఊదరగొట్టెడి వారలు.

సృజనలేని సుందరులు - బంధాలకు బంధితులు
గురువు గుట్టు తెలియనోళ్ళు - పరువు బరువు విడిచినోళ్ళు
వేళలేని వెలుగు కొరకు - వెతజెందెడి వెట్టివాళ్ళు
ప్రణాళికే అసలు లేని - ప్రగతి కాంక్షకలిగినోళ్ళు.

పుకారులను పూజించెడి - పుణ్యకార్య గణ్యులు
షికారులను కామించెడి - చిన్నారులు పొన్నారులు
గమ్యమసలు అగమ్యమై - గమియించెడి గంధర్వులు
రమ్య జీవితమునకై - ఎదురుచూచు పందలు.

ఫలంలేని ప్రయత్నాల - ప్రాభవాల విభవులు
పట్టుదలే గట్టెక్కిన - పట్టభద్ర భద్రులు
స్పీడుయుగం బీడువడగ - వాడిపోవు వాస్తవాలు
సినిమాలే నియమాలని - నియమాలను విడిచినోళ్ళు.

నాగరికం గరికపోచ - నవ్యమనీ దివ్యమనీ
వింత వింత విలువలతో - విగతధర్మ జీవనులు

అనుభవాల భవనంలో – అమరుడగుటె సత్యము.

206

మరణశాసనం – మరణశాసనం
మానవుడే వ్రాసికొన్న మరణశాసనం
వరనరుడే చేసికొన్న మరణశాసనం.

కాలుష్యపు సంద్రాలే కలవరపెడుతున్నాయి
నదులు మురుగునీటితో ముప్పుతెస్తున్నాయి
వాయువు ఆయువు తీస్తూ వాసి దరుగుతున్నది
ధ్వనులే ధ్వజములై జీవుల ధ్వంసం చేస్తున్నాయి.

సూర్యకిరణ ప్రసారమే సుందరతను వీడింది
పరిశ్రమల వ్యర్థములే అర్ధాయువు తీస్తున్నవి
వీధుల మురుగులే విధ్వస్తము వీడనివి
జీవనముల కామనయే జిలుగు విడుచుచున్నది.

శక్తికొరకు యతనములే శక్తిని దిగజార్చుతుంది
క్రూరమైన కృత్రిమమే శత్రువుగా మిగిలింది
శుభ్రతలో స్వార్ధమే అభ్రమునే ఆహరించింది
అడవులు విడిపోయెను అందరికీ అతివేడాయెను.

చెట్లు పెంచు చైతన్యమె గట్లుతెంచుకొనియెను
రసాయనపు రాహువులే రమ్యసూర్యచంద్రులను మింగెను
ప్రకృతి పావనతలకు అపకృతిని అందించెను
మానవ కాఠిన్యమునకు మహిసర్వము బూడిదాయె.

యాంత్రిక సాంకేతికముల యాతనలే కలిగెను
చెట్టుచేమ గట్టుపుట్ట చెదిరి మిగిలె చింతవంత
ఆరోగ్యము రోగముగా అవతరించి ఆవరించె
సంకరమున శంకరమే వంకరగా వాసినొందె.

పరిశుభ్రపు పరిమాణము పురాణముగ పూజ్యమాయె
పచ్చదనపు జనధనము పలుకులలో పల్లవించె.

207

మోసం మోహనరాగం ఆలపిస్తున్నది
దోషం దొంగాటకు దోహదమౌతున్నది
నేరం నేవళమై నెయ్యానికి వియ్యమన్నది
మోహం మోదానికి మొదటిమెట్టై వాదిస్తున్నది.

లంచం లావణ్యమై అన్యాయానికి ఆది గురువన్నది
వంచన చనవుతో వలపు ధనాన్ని దోస్తున్నది
మోదం ఓదనమై నరజీవనం నరకమైనది
క్రోధం ఆయుధమై కోమలతను నరికింది.

లోభం లాభాన్ని ఆశించి లక్షణాన్ని క్షయించింది
మదం మానవత మానాన్ని మసిచేసి మురిసింది
మత్సరం తాత్సారం చేయక తారుణ్యాన్ని తరిమింది
రాక్షసజన రాజ్యానికి రక్షణ శిక్షణగా పరిణమించింది.

అవినీతి ఆవిష్కారం అన్ని సమస్యలకు పరిష్కారమయింది
అధర్మం ధార్మికతను అడ్డుపెట్టుకొని అవతారం మార్చింది
అన్యాయం అనన్యన్యాయమై న్యాసాన్ని సన్నిహితం చేసికొంది
తప్పొప్పుల తారతమ్యం వ్యక్తులమెప్పుకోసమేనంటుంది.

అణగారిన జనసణుగుడులో గుడుగుడుకుంచాల గుంజాటన
సమన్యాయం సరిగమరాగాలై సంగతులు లేక గతించింది
లౌకికం లౌక్యంగా లౌల్యానికి సమతౌల్యమతికించింది
బుద్ధి బుద్బుదప్రాయమై బురదలోనుండి పైకిరానన్నది.

మనసు మాలిన్యంతో మసకబారి మానవతను మరచింది
ప్రేమానురాగాలు భువిలో గతించి టీవీలలో నిలిచాయి
ఆత్మద్రోహం ఆలోచనాపరుల నిత్యకృత్యమైంది.

208

బహుళజాతి సంస్థలే – బావురుమంటున్నాయి
వీఐపీలనుకొన్నవి – ఐపీలే పెడుతున్నవి

విజాతీయ సజాతీయ – విశ్వసంత వింతాయెను
భౌగోళిక గ్రామములో – బాధల బహుళ్యమాయె.

రాజకీయ వేదములో – కుంభకోణ వాదములు
కార్పొరేట్ల సర్పాలకు – కోరలూడి కొలువువిడిచె
హవాలాల దివాలాలు – హవాలోన కలిసిపోయె
బోఫోర్సుల ఫార్సులన్ని – హిందుజాల జయమనియె.

చక్కెర బొక్కిన నేతలు – సజావుగా జీవించిరి
పశుదాణా మేసినోళ్ళు – పదవులలో పదిలమైరి
సుఖరాములు సుందరులు – జనగణమే జవహీనం
సంస్కరణల రణంలో – విజయం ప్రభువులది.

సంస్థలమ్మివేయుటలో – అపజయమే జనానిది
సిద్ధాంతము ఛీయనిరి – పదవి పదిల మంటుండిరి
పార్టీయే పరమమనిరి – పౌరులనే మరచిరి
అంతర్జాతీయంలో – వింత విలువలుండెను.

మోడీ మంత్రాలలో – మోసము మొగమాటమాయె
లంచాలూ వంచనలూ – సంస్థలలో తిష్ఠవేసె
ప్రైవేటులకే పైవేటు – వ్యక్తి శోభ శక్తిమీరె
ఎన్రాను ఎఱుకలోన – చెరిగిన జీవితములెన్నో.

రాజకీయ చదరంగం – చెదలుపట్టి ఎదల తట్టె
ప్రాజెక్టుల జెట్టులలో – వేగమువగమూలమాయె
కంట్రాక్టుల టాక్టులలో – యాక్టులకే యాదలేదు
వరల్డ్ 'కాము' కాముగా – వాపు బలుపుగా చూపెను.

షేర్ల షేకుహ్యాండుతో – హ్యాండిచ్చెను వాటాలకు
వరుసలోని వరులెందరొ – గుంభనతో గుట్టురట్టు
దాగని దారుణము లెన్నొ – దర్శింతురు విశ్వజనులు
మేధావుల మేదినిలో – మేలుకొలుపు కొలుపులెన్నో.

సీ. చరితలో గరితగా చెన్నొందుమాల్యాద్రి చైతన్యమును పంచ చెంతకొచ్చె
పాపాలపోగొట్టి శాపాల శమియించి పావన క్షేత్రమై పాలికొచ్చె
పచ్చని శోభతో పరవశమందించు సువిశాల ప్రాంతము శుభములిచ్చె
రాజుల యేల్బడి రమణీయమాయెను ఆలయ ప్రభలన్ని అమరమాయె.

ఆ.వె. కొండ సరసనుండె కోమల ప్రకృతి – తనివిదీర్చుమదిని తపనదీరు
లక్ష్మినారసింహులావణ్యలహరిలో – తేలియాడుమయ్య తెలుగువాడ!

ఆ.వె. చుండిరాజవరుల మండన మహిమయై – మహికి మేలుగూర్చుమాన్యదేవ
కందుకూరు సీమ అందచందాలతో – అతిశయించగాను ఆశయమ్ము.

సీ. గుహలోని సింహము అహమును ద్రుంచగా – అసలైన తత్త్వము ఆస్తికతయె
ఆస్తులు జాస్తిగా అందించుమాలక్ష్మి – అందరికమ్మగా విందుగూర్చె
భక్తవాహినిగన భాగ్యమె కనులకు – భాగవతుడుతాను భవమునిండె
గుహతటాకములతో గూఢమై వివరమై – గుర్తింప నీనేల గురుతపంచె.

తే.గీ. రాక్షసత్త్వము శిక్షించ రమనుగూడి – కనులపండువుసేసిన కర్మసాక్షి
భోగతత్త్వము యోగము యాగముగను – యోద్ధనీవుగ నరసింహయోజనమున.

సీ. కైలాసమనెడిది కలదొలేదోగాని – మాదైన మాల్యాద్రి మహిని కలదు
వైకుంఠ విభవమువైనము తెలియదు – మాలక్ష్మినరసింహ మాకు విభుడు
స్వర్గాపవర్గాల వరుసలు గనరావు – మాస్వర్గసీమయే మాలకొండ
నందన వనమేమి నాణ్యతకలదేమొ – మానందనమ్మోగా మాలకొండ.

ఆ.వె. దేవదేవులంత దివ్యులై భవ్యులై – మాలకొండ గుహల మాన్యులైరి
అమరతరువులెన్నొ అమరిన దేశము – రోగబాధలన్ని రోయుసతము.

ఆ.వె. దివ్యకథను వినగ దిటవెంతొ కలుగును – క్షేత్రమహిమగనగ క్షయము వెడలు
హర్షవర్షమగును హవ్యము వదలగా – నారసింహుడగును నయము నవము.

తే.గీ. దేశదేశాల దేహులు వాసికలుగ – పాదసన్నిధి చేరగా పరములైరి
భేదరాహిత్య భావన వేదితులుగ – అందరొకటిగ పూజింప ఆర్తివిడిరి.

వైభవాన్ని కాంక్షించగ – వైరాగ్యం వస్తున్నది
శాంతిని ఆకాంక్షించగ – శమము శక్తి అంటున్నది
ఆశలు అడియాసలై – ఆకాశాన్నంటినవి
ఆయుధాల ఆయోధన – అయోగమై ఆర్తినించె.

పాలక జనప్రవచనాలు – ప్రగతిశీల ప్రయోగాలు
యోగించని యోజనలే – త్యాగనిరతి త్యక్తములు
సామాజిక అలజడిలో – సామజములు ప్రతినిధులై
పౌరజనుల నడ్డివిరిచి – పరవశాన తరియించిరి.

నక్సలైట్ల పోరాటము – పోలీసుల ఆరాటము
నరమేధము నాణ్యమాయె – ఎదురుకాల్పు ఎఱుకలాయె
రాజ్యహింస రమణీయము – తిరుగుబాట్లు విరిగిపోవ
ఎదురు హింస ఎదల గుబులు – పదిలమేన జనస్వామ్యము.

సహనానికి హద్దులుండె – విప్లవాల విజయపథము
వ్యథిత జీవి బతుకులోన – వేదనలకు వెలితిలేదు
ఐక్యమైన పోరాటము – అసంభవము భారతిలో
స్వార్థాశ్రయ శోభనమున – అర్థార్థులె అమరులు.

అనురాగపు రాగములో – రోగగ్రస్త రొదలాయెను
ఆయుధములు చేబట్టగ – అస్తవ్యస్తత వీడును
పాలకజన రక్షణకై – పోలీసుల శిక్షలాయె
బహుళజాతి సంస్కృతికై – భావమందు కోరికాయె.

అంతరాల అణచివేత – తరతరాల దమన నీతి
విశ్వబ్యాంకు విమత నీతి – సతమతమే సమనీతి
స్వాతంత్ర్యం తంత్రమైన – ధనమంత్రమె దారుణమ్ము
దోపిడీకి దోహదమౌ – దుర్నీతియె దురితమ్ము.

మారణమే వరణమైన – రణరహియే రవణమైన
భయభూతము ఆవరించి – బతుకులన్ని చితికిపోవు
కలయే వైభవముగా – కనిపించెను కలలోన
ఇలలో ఆ అణచివేత – హితముకాదు హీనమగును.

211

కాలగమనవలయంలో – కామన లయమైనది
కాలవేగ వాగురలో – కలవరమౌతున్నది
పగలు రాత్రి పావనము – వగరహితమె భావనము
అజ్ఞానం విజ్ఞానము – అవని జనత కానందము.

ప్రగతి గతిని ప్రవచించెడి – ప్రాభవమే జ్ఞానము
అభ్యుదయపు వేగంలో – అరుణోదయమే కాలము
భావనలో లౌకికము – భాషలోన లౌక్యము
చేతలోని చైతన్యము – చెలిమి బలిమి కలిమిధనం.

ఛాందసాల ఆంధ్యము– అవిద్యలో ఔన్నత్యము
ఆకలిలో ఆధిక్యము – అంతరాల సముద్రము
రాజకీయ చట్రంలో – రాజ్యాంగము బంధితము
అమలులోని చట్టాలే – అసమానత కాటపట్లు.

సంస్కారపు అహస్కరుడు – చీకటిలో చిక్కిపోయె
పునరుదయపు ఎదురుచూపు – ఎండమావి కాదు గదా
కాలపురుషునాకారం – కనబడదు వినబడదు
భావనయే భాషగాను – భాషించుట భాగ్యము.

జనసంద్రపు జాతరలో – తరతరాల తారుణ్యము
నిరుద్యోగ నిగ్రహమున – ప్రగహమే ప్రహరణము
అవినీతే సూర్యకాంతి – అందరికది అరుణకాంతి
ఉద్యమాల ఉదయకాంతి – విప్లవాల విజయక్రాంతి.

కాలషట్కకామనలో – షడ్వర్గపు సమరంలో
ప్రకృతికృతి ప్రాభవమే – జనవికృతి జవహీనము.

212

అమరకథలు ఎన్నెన్నో – ఆద్యులు ఆలాపించిరి
అసలు కథలు వ్యథలుగా – ఆర్యులు అవలోకించిరి

వ్యాసవాల్మీకులుగా – న్యాస విన్యాసము నెంచిరి
వ్యక్తిరూప శక్తులుగా – వ్యవస్థనే శాసించిరి.

భారతీయ తత్త్వంలో భాగ్యమేమొ భాస్వంతము
భారతజన ఆచరణలో – యోగ్యతయే శూన్యము
దేశభాషలిపిలోని – దేహుల సౌభాగ్యము
మాటల సంస్కారంలో – మాన్య పురస్కారము.

పాశ్చాత్య తత్త్వానికి – పావనతే ధన్యము
ఆచరణకు ఆవరణము – మనుష్యునికి మూలధనము
దేవరక్కసుల యుద్ధము – దేదీప్యము దివ్యము
విధిచేతల విధ్వస్తము – వినీతమౌ విజయము.

భౌతిక ఆధ్యాత్మిక దైవికముల భావనము
జనజీవన జిలుగులలో – జాజ్జ్వల్యమె శోధనము
సమానత్వ సందడిలో సారళ్యపు జీవనము
సంప్రదాయ సరళిలో – సహజీవన సమరము.

జనజీవన వైవిధ్యం – జాతిజనుల సంకేతం
సతమతమౌ మతములో – సమానతయె శూన్యము
భౌతిక ఆధ్యాత్మికముల – బంధుత్వమె బంధనము
వ్యక్తి సంఘ నిష్ఠములై – వెలుగు పంచు వ్యవస్తకే.

సంస్కారపు వాక్కులతో – సంశోధన ప్రారంభము
సౌమనస్య శోభతో – విశ్వశాంతి విభవము
గతగణ్యత ధన్యతనీ – హితవాక్యము మతమనీ
వర్తమాన మానమే – భవిత సవిత భాగ్యమగును.

సరిహద్దుల సమభావన – విరితేనెల విజయ వాక్కు
సౌభ్రాత్రపు సౌగంధ్యము – వైప్లవ్యపు విశ్వక్రాంతి.

213

విలయ తాండవం – విజయకేతనం
కరవు రాక్షసం – జనత కలవరం.

కాలం కథ మారుతుంది – కమ్మదనం విడిచింది
ఋతువు వరస దప్పుతుంది – ఋజువు రుజగ మారింది
వరుణ కరుణ వాసిదప్పె – నీటిగతియె నిమ్నమాయె
మంట పంటలను మాడ్చెను – తంటల తరుణమ్మాయెను.

దేశానికి వెన్నెముక – వెన్నువిరిగె వేదనలతొ
ప్రభుత్వాల విభుత్వాలు – ప్రవచనాల ప్రదక్షిణలు
విత్తనాలె విపత్తులు – చిత్తజల్లు చింతనిప్పు
ఎరువుల కల్తీ ఎఱుకే – పండుపంట వినాశమే.

నారువేయ నీరులేదు – మొక్కలోనె చిక్కెపైరు
బావినీరు తోడగాను – శక్తిలేదు చేవలేదు
బకాయిలే బంధనములు – అధికారుల ఒత్తిళ్ళు
తట్టుకొనే బలంలేదు – గట్టుచేరు గమ్యమేదొ.

బీదరికం వాదరలో – పేదబతుకు గతుకాయె
మార్గమేమి కానరాదు – మరోగతే ఆత్మహత్య
నాయకగణ స్వార్థంలో – నాశనమయె పథకాలు
ఉత్పాదక రంగాలకు – ఊతమిడుట కరవాయె.

ప్రాజెక్టుల పునాదులు – ప్రారబ్ధమె సమాధులు
ఏండ్లు పూండ్లు గడచినా – ఏబ్రాసియె అభ్యుదయం
రైతన్నల కూలన్నల – వలసలు వరుసలు దీరె
నమ్మకమే వమ్మాయెను – బతుకుటయే బాధాయెను.

స్వర్ణాంధ్రము శోభలో – వివర్ణమై రైతుండెను
హైటెక్కుల హైరానా – భరించలేనంటుండెను.

214

మహాత్ములకు మాతృభూమి – మానవతకు మరుభూమి
మహోదయపు భాగ్యభూమి – మరోజగతి మన్యభూమి
బుద్ధునికే జన్మనిచ్చి– ధన్యమాయె బీహారం
కరువుల వరదల లోబడి – కాంతివీడె ధర్మభూమి.

మరచినాము బుద్ధునీ – వినలేమా సిద్ధాంతమును
మానవహితకార్యములను – త్రికరణముల విడిచినాము
సౌరాష్ట్రపు సహజన్ముడు – మోహనుడే మోదకరుడు
కరంచందు కమనీయుడు – అహింసయే హితమతమనె.

రాము క్రీస్తు రహీముడూ – రమణీయులె అందరూ
మహాత్మునిగ మన్నికెక్కి – స్వాతంత్ర్యపు శోభదెచ్చె
ఆశయాలనే మరువగ – ప్రళయము మారణకాండల
హింస హీనమగుచుండెను – ప్రకృతియే వికృతాయె.

గురునానక్ గురుభూమి – పాకిస్తానము స్థానము
కొట్లాటల కాట్లాటల – కోమలతకు పెనుముప్పు
పంచనదుల దేశము – వంచనలకు వరసాయె
స్వర్ణశోభ ఆలయమూ – శోధనలో వధ జరిగెను.

క్రీస్తుదేవు పుణ్యభూమి – జరూసలెం జన్మభూమి
అన్నదమ్ముల పోరులో – అయోమయముగా మారెను
త్యాగమయుని జీవితాన్ని – మరచితిమి మనమంతా
అదియెనేటి అపసవ్యము – ప్రకృతిలో ప్రతిబింబము.

మహ్మదీయ మాన్యభూమి – అరేబియా అతిశయము
బోధలన్ని బాధకాగ – బాంధవ్యము వీడినాము
అందులకే యుద్ధాలు – పరస్పరం హనన క్రీడ
హితమతమే సతతము – జనప్రగతికి జవసహితము.

జనశీలపు జాగృతికై – జాజ్జ్వల్యము జయకరము
ప్రకృతి వికృతిగామారి – ప్రతికృతికి ఉద్యమించె
తరతరాల వినాశనము – తరగని తపనకు హారము.

215

భారత భారతి భాగ్యసీమలో – భావన కందిన భవ్యకేతనం
మూడు రంగులా ముచ్చటైనది – ధర్మ చక్రమున దయపంచినది.

రూపశిల్పిగా వెంకయార్యుడు – పింగళి వంశము మంగళకరము
స్వాతంత్ర్యమునకు శోభతెచ్చినది – పారతంత్ర్యమే పరుగులెత్తినది.

శ్యామల ప్రకృతి శాశ్వతస్థానము – పాడిపంటలకు పావన దేశము
దేశభక్తికీ దేవళమైనది – జాతిరక్తికీ జాగృతి పంచెను.

కాషాయమ్మున కర్మదేశమై – అరుణవర్ణమున అందమతిశయం
సంస్కృతి సరసత సామరస్యము – సాగిన పతాక సౌమనస్యము.

శుక్లవర్ణమున శుభసందేశం – విశ్వశాంతికది నిర్మలరూపం
మానవ మనసుల మల్లెలహారం – మానవత్త్వమది మనకుపహారం.

సారనాధమున సారవంతమై – బుద్ధధర్మమున శుద్ధియైనది
తాత్త్వికత్త్వమున తరియించినది – ధర్మకర్మలకు దారిచూపినది.

జాతిపతాకం జాగృతినిచ్చెను – గౌరవించుము పరువునిల్పుము
పతాకవందన పరమభాగ్యము – భావిభారతికి భాగ్యహారతి.

216

ఆకలి అంచులో – దారిద్ర్యపు దరిలో
దారికానరాదు – జ్ఞానదారి అగమ్యమే.

చదువుల పండగ – అక్షరమే అండగ
బతుకులు దండగనే – బాలలగతి మెండుగ
పూటతిండిదొరకని – పూజ్యపుణ్యభూమిలో
చదువుల చదరంగం – పదవుల చెదరంగంగ.

ప్రచారాల హోరులో – ప్రజాస్వామ్య దారిదప్పె
పూటకొక్క పథకంతో – పాఠశాల పరువుపోయె
ఆకలిలో అక్షరాలు – కలియుగాన కానరావు
చదివితెలివి సాధించి – విదేశాల కెగబడుటె.

అంకెల గారడీలు – సంకటాన్ని సవరించవు
కంప్యూటరు భాషలు – కలవరమును ఆపలేవు
పనిచేస్తే పైసలు – పట్టెడన్నం దొరుకును
బడికెళ్తే బాధలు – జీవితమే సాగదు.

కోరికలకు కొలతలేదు – కోటీశ్వరుల కొలువులు
బడుగు బతుకు దీనము – భయావహం బాధమయం
నిరుద్యోగ యోగంలో – నియమాలే కరవైనవి
మేథావుల దేశంలో – మేలుకీడు మెలకువలే.

పాఠశాల పావనమై – గురువే నవకల్పకమై
త్రికరణముల శుద్ధితో – తియ్యదనం పంచవలెను
పగటిభోజనం పెట్టీ – బియ్యం కొలతల కొలిచీ
పథకాలను వధచేసీ – కొత్తవాటి కొలువుదీర్చె.

మౌలికవిషయాల మరచి – వనరుల యోగ్యత మరచీ
ఉపన్యాస ఊదరలో – ఉద్యోగం ఉత్తమాట
చదువులేని నాయకుడు – చదువుకొన్న అధికారీ
చీకు తొలచు గురువులే – చిరునామా అవినీతికి.

చదువు బతుకు కోసమనీ – సామాన్యుని భావనలో
మాన్యులైన ప్రతినిధులకు – అవగాహన గహనమే.

217

కరువు తాండవించెను – కలవరమే కలిగెను
అనావృష్టి ఆవేదన – అతివృష్టితొ మతిభ్రమణ
శక్తిహీనమాయెను – జనులు శవమురీతాయెను
పశుసంతతి పాడాయెను – పంటలేక వంతకలిగె.

ఆస్తులుండి పస్తులాయె – ఆకలి చావులు పెరిగె
కండగలుగు భూములన్ని – ఎండవలన నోళ్ళు తెరిచె
ప్రణాళికలు ఫలమువీడె – ప్రతినిధులూ విఫలులైరి
మానవుడే మందమతై – మహి బతుకుట కష్టమాయె.

పరిశ్రమలు ఆశ్రయమై – జలసంపద జయరహితము
సమానతా మానంలో – సహజీవన శరణ్యము
ముందుచూపు ముదనష్టము – ప్రచారములు ప్రహసనములు
ప్రాధమికత ప్రాధాన్యత – అసలులేమి అవహేళన.

నదుల గదులు నశ్వరములు – ఎడారులే విడి భూములు
ప్రాజెక్టులు ఫలరహితము – వ్యవసాయము వ్యత్యస్తము
మొక్కల ఎరువున మోసము – విత్తన కల్తీలే విపత్తులు
నేరానికి శిక్షలేమి – నేవళమే కల్తీశాల్తీ.

ప్రభుత పారదర్శకమే – దార్శనికుల దారివేరు
రాష్ట్రకేంద్ర రారాజులు – వాదులాటలో వరదాయిలు
అన్నదాత వెన్నువిరిగె – వెన్నుదన్ను లేకపోయె
అవినీతీ అలసత్వము – అంచుదాటి మించిపోయె.

218

సీ. ఆగష్టుపదిహేను అందరి పండుగ – అదినేడు తలచగా ఆర్తి మిగులు
బాపూజి నేతాజి పరువము గరువము – భావించ భారతిన్ బాధకలుగు
రాజ్యాంగరచనమము రమ్యము గణ్యము – ఆచరణములేక అధమమాయె
ఏబది వత్సరాల్ ఎఱుకయె ముఖ్యము – పందల మందుల పాలనమున.

తే.గీ. మూడువన్నెల జెండాకు ముప్పువచ్చె – యుద్ధభయమున జనులకు ఉరుకులాయె
పేద పెద్దల అంతరాల్ పెరిగిపోయె – ధర్మకర్మల జనులేమొ దారిదప్పె.

సీ. భిన్నత ఏకత బిరుదేమొ గొప్పది – కులమత వర్గాలు కూపములెగ
వేదాలు విద్యలు వెలుగైన శాస్త్రాలు – వెతలను పోగొట్టు సతమతమ్ము
నానకు బుద్ధుడు నాణ్యమౌ మతములు – హితమును పంచగా హీనమాయె
తీర్థాలు క్షేత్రాలు తిరువీధులెన్నియో – రాజకీయముసోకి రచ్చలాయె.

తే.గీ. ప్రజల పాలనకోరగా ఫలమువీగె – ఎన్నికలు చూడ మన్నిక ఎండమావి
నేరచరితులు ప్రతినిధుల్ నెవ్వగాయె – పారతంత్ర్యమె ఫలమని ప్రజలకాంక్ష.

తే.గీ. త్యాగరాహిత్య భావన తెలివిమీరె – భోగభాగ్యాల భావనల్ యోగమయ్యె
దేశభక్తియె శూన్యమై దేహచింత – ఆశలుండెను ఆశయాల్ అసలు లేవు.

సీ. కేంద్రము రాష్ట్రము సాంద్రమై సాగగా – పార్టీలు కుంపట్లు పరమమాయె
సిద్ధాంత రాహిత్య సిరిగల్లు పక్షాలు – అధికార కాంక్షతో అహితమాయె
భూస్వామ్యపద్ధతి బుగ్గిలో కలిసెను – మరియొకరీతిన మాన్యమాయె
సామ్యవాదమ్మున సరసత కలదని – సాగెడి పార్టీల సరళివేరు.

ఆ.వె. జనత ఘనతపోయె ఘనప్రతినిధులతో – గణన ముఖ్యమాయె గరువమాయె
మిగిలె గణతంత్రరాజ్యము కక్షగాను – చిత్తశుద్ధిలేక చిన్నవోయె.

తే.గీ. అమరవీరుల ఆశయాల్ అంతరించె – ఉగ్రవాదము అగ్రమై వ్యగ్రమాయె
భయము వేగము బాధలు భవమునిండె – బాధ్యతలు లేమి మిగిలెను బంధనములు.

ఆ.వె. పార్లమెంటు చూడ ఫలహీనమాయెను – రాష్ట్రసభలను చూడగా రభసలాయె
నిధులవేటను ప్రతినిధుల్ నిమ్నులాయె – తాండవించెను అవినీతి తరళరీతి.

సీ. కల్లోలకాశ్మీరు కలవరమాయెను – గుజరాతు గుబులున గూడు విడిచె
సంస్కరణమ్మని సర్కారు సంస్థల – అమ్ముచునుండిరి అధమముగను
పాకునే తలతోడ ఫలవంత చర్చలు – సాధ్యముకాదుగా సంగరమ్మె
సిగ్గును ఎగ్గును సింగారముగ నెంచు – అధినాయకుల తీరు ఆగ్రహమ్ము.

తే.గీ. నల్లపాలకమాన్యుల నడతలన్ని – తెల్లవారిని మించెను తెల్లబోగ
మరల సమరము సాగించ సరళిమారు – సిద్ధపడుడయ్య యుద్ధము సిద్ధమేగ.

219

జనత పెరిగెను – ఘనత తరిగెను – వృద్ధిజరిగెను – శుద్ధి తరిగెను
భయము పెరిగెను – బాధ పెరిగెను – వేగమాయెను – వేళమించెను.

స్వేచ్ఛమించెను – సేవ తరిగెను – కక్షహెచ్చెను – శిక్షతగ్గెను
మాట హెచ్చెను – చేత వీడెను – సైన్సు పెరిగెను – సెన్సు తగ్గెను.

మాయమించెను – మమత మరచెను – ఆశమీరెను – ఆర్తి మిగిలెను
ధనమె ముఖ్యము – మనము శూన్యము – భక్తి బంధము – రక్తి రమ్యము.

శక్తి హీనము – శాంతి గహనము – రైతురాజ్యము – బైతు భావము
పదవి పదిలము – గణన గణ్యము – శ్రమ విహీనము – స్వార్థ స్వామ్యము.

కులము ముఖ్యము – మతము మహితము – ఓట్ల బేరము – సీట్ల రాజ్యము
న్యాయధర్మము – నేత మర్మము – కర్మహీనము – కాంతి హైన్యము.

భావి భారతి – భసిత హారతి – భాగ్య భారతి – ప్రభుత జాగృతి
విప్లవించర – వీర పౌరుడ.

220

స్నేహం, మిత్రం, దోస్త్, సావాసం – భావం, శబ్దం, అర్థం, తాత్పర్యం
వేరు వేరుగున్నా తీరుమాత్రమొకటే.

మనసు, ఆత్మ, హార్ట్, హృదయం
పేర్లు వేరయినా వేరుకానిది స్నేహం.
మిత్రుడు సూర్యుడు – మించుల మించువాడు
వెలుగును త్యజియించి – వెతలను తీర్చువాడు.

సహవాసం సావాసం – సతతం సంపన్నం
అవసరానికొచ్చువాడు – అసలు ఫ్రెండు అనుటనిజం.

నీటిపైన ఓడవోలె – నిత్యనూతనం స్నేహం
హత్తుకొన్న హృదయాలకు – ఆట విడుపు స్నేహం.

కానరాని పరిమళమే – పుష్పజాతి మిత్రం
కొలనులోని పద్మమే – కొలనుకు మిత్రం
కళ్ళజోడు కంటికీ – కనిపించే స్నేహం
కాళ్ళజోడు పాదాలకు – కనువిందకు స్నేహం.

వయసు ఊసులేదు – కలమత వర్గం లేదు
నవ్యత దివ్యత కలదు – భవ్యతపః ఫలమది.

స్వర్గాలను అందించే – అపవర్గపు అందమది
మానవ నవమానవతకు – మహిమాన్విత సోపానము.

ఆశ, ఆశయాలకూ – ఆదర్శపు దృశ్యమది
జీవితాల సాఫల్యపు – జిలుగు వెలుగు కలయిది.

నిత్య సత్య సంబంధం – నియమ నిరతి అనుబంధం
లత తరువుల లావణ్యం – పంటచేల పరమార్థం.

కలిసిన శబ్దార్థములే – కలియుగ జనస్నేహం
త్రికరణాల వరణమే – నికరమైన స్నేహం.

నరజీవన నాటికలో – ఆత్మతృప్తి భాషణం
వ్యాపారపు విశ్వంలో – ఎండగునుగ ఫ్రెండ్షిప్పు.

221

శాంభవి మాసము – కుంభిని మాసము
పార్వతి మాసము – పావని మాసము
శ్రావణమాసము – శార్ధ్వల మాసము
శార్వరి మాసము – శారద మాసము.

శక్తి రక్తి చైతన్యము – చెంగలించు మాసము
వరలక్ష్మియె వసుధలోన – వాసిగాంచుమాసము
ఆది మొదలు అష్టలక్ష్మ లవతరించు మాసము
వరదాయిని వరరూపిణి – కరుణించెడి మాసము
మంగళవారపు మధువే – మంగళ లక్ష్మీమాసము
శుక్రవార శుభదినమే – అందరికభయపు మాసము
మాత మాన్యమహిమగాత్రి – మహిళకభయ మాసము
అంబ అమ్మదుర్గకాళి – దురితహారి మాసము
పవిత్రతకు పావనతకు – ఫలమునిచ్చు మాసము
శుచి శుభ్రత ఆస్తికతకు – శుభము పంచు మాసము
శ్రీదేవీ భూదేవిగ – చిన్మయమౌ మాసము
సౌందర్యము శోభనము – సంవదించు మాసము
సస్యశోభ సంతరించు – ధాన్యలక్ష్మి మాసము
అభయమనీ అలరించెడి – ధైర్యలక్ష్మి మాసము
వరలక్ష్మీ వ్రతరీతికి – సంతసించు మాసము
త్రికరణముల పూజసేయ – తియ్యదనపు మాసము
లోకరక్షణము సేసెడి – దక్షురాలి మాసము
ఆరోగ్యము ఐశ్వర్యము – అందుకొనెడి మాసము
శాంతిసౌఖ్య సమరసతలు – చేర్చు లక్ష్మి మాసము
అవినీతిని నరికివేయు – అపరకాళిమాసము.

222

అర్ధరాత్రి స్వాతంత్ర్యం అంధకార బంధురం
అర్థమైన జనస్వామ్యం ఆర్థికమై బంధితం.

ముప్వన్నెల జెండాకే – ముప్పు వాటిల్లింది
ధర్మచక్రదారిలో – అధర్మమే అడ్డొచ్చెను
పచ్చదనం పాలిపోయి – అనావృష్టి తాండవం
పెచ్చుపెరిగి కాషాయం – పేలవమే రాజ్యాంగం.

శాంతి తెలుపు తెల్లబోయి – శవములైన జవానులు
భారతి భాగ్యం చూడగ – శ్మశానంపు హోరతులే
కులమతాల కోలాటం – ప్రతినిధుల చదరంగం
పార్టీవర్గ గెంతులాట – పాలకులది బంతులాట.

సిద్ధాంతం సిగ్గువిడిచి – నగ్నమైన నవ్వులాట
ప్రాంతీయం అంతిమమై – పరవశించె తగవులాట
లంచాలకు వంచనలకు – ఆశ్రయ అధినాయకులు
ప్రజాధనం మింగుటలో – సాటిలేని సమర్థులు.

పేదవాడి అన్నంలో – పెద్దపాలు కబళించీ
సామాన్యుని స్థలాలనే – ఆక్రమించు విక్రములు
రాజ్యాంగం బూజుపట్టె – రాజకీయం రచ్చకీడ్చె
చట్టాలె చట్టుబండ – సరళతకే గరళమాయె.

పథకాలది ప్రచారమే – స్వార్థమె అన్వర్థము
అవినీతి అంతటాయె – అరచుటతో మరచుటాయె
సమసమాజ సాధనలో – అప్పుతెచ్చి సంతర్పణ
స్వర్ణ రాజ్య సందడిలో – జనస్వామ్యం వివర్ణము.

ఆగడాల ఏడుగడకు – అంతమంతరంగమే
మరపు విడిచి మతిని పెంచి – మనుగడ సరిదిద్దుకో.

223

అంటరాని తనమది – అంటురోగ మంటిదిగా
అదినీవు అనుసరించ – తంటదెచ్చుకొందువురా.

పుట్టుట గిట్టుటలు – బతుకుట ఒక్కటే
లోలోపల ప్రవహించే – రక్తరంగు ఒక్కటే.

అంగాంగములొక్కటే - అంతరంగమొక్కటే
ఆశలాశయాలొక్కటె - అంతరములు ఎందుకురా.

గుణకర్మల విభాగమే - గుర్తు కలుగ వర్ణములు
నాలుగైన నలుబదైన - నరులు బతుకు బతుకుటకే.

ఉచ్ఛ నీచ వృత్తిలేదు - శ్రమశక్తియె విలువరా
సంఘజీవనమునందున - సమభావన మెప్పురా.

శౌచము మలినము - శరీరంపు గుణములు
అందరిలో అవి వుండెను - అంటుసొంటు అహమురా.

గోత్రము కులములు- జాతులు మతములు
ప్రాతసంప్రదాయములు - పావనతకు వనములు.

ఐకమత్యముండగా - ఐశ్వర్యము పండుగా
అవమానము అస్పృశ్యత - అభిమానము సర్వసమత.

సరళమైన సంస్కృతిలో - విరళమగును విలువలు
నవ్య దివ్యభావనలో - నాణ్యమగును భారతి.

విబుధుల విజ్ఞానము - మేధావుల మథనము
మానవతకు మాన్యమైన - మహదాశయ భువనమిది.

తరతరాలు తరలినా - గ్రహగతులే మారినా
మారనిదే మానవత - (ఆగని) చావనిదే నరునడత.

224

మానవ దేవుళ్ళతో - మాన్యమైనదీ భారతి
వందకోట్ల సంఖ్యతో - వరపైనది భాగ్యమతి.

నామరూప నవ్యతతో - దివ్యమైన నవభారతి
బిందువైన భిన్నత్వం - సింధువైన స్నిగ్ధత్వం.

మందిర మసీదులే - మానవతకు రూపాలు
చర్చి గురుద్వారాలు - చైతన్యపు తీరాలు.

హిందు హితం హీనమైన – ఇస్లాముకు సలాంచెప్పు
క్రీస్తు దయాత్యాగాలకు – గురుకీర్తన నాలపించు.

బుద్ధమతం బుద్ధికల్గ – దుఃఖం లేనేలేదు
మానవాళి కోరికలకు – మతం రంగు పులమబోకు.

సుఖజీవన సురభినీ – శుభకరముగ పెంచుము
విధిసైతానుల చేష్టను – విలువలతో నెదిరించుము.

ప్రతిహృదయం ద్రవించును – ఆర్తిమూర్తి కట్టినచో
ప్రతిమనసూ వెన్నయగును – ప్రేమపేరు చెప్పినపుడు.

అన్యోన్యత అందముగా – అహరహమూ జీవించుము
తోడునీడ తొలకరిగా – జీవన సేద్యం చేయుము.

నీరూపమె ప్రతిబింబము – అద్దములో సిద్ధము
ఆ అద్దమె నీహృదయము – అది దేవుని ఆలయము.

నరజన్మము నాణ్యమనీ – జీవులలో గణ్యమనీ
పెద్దలు చెప్పినమాటలు – పేలవమ్ము చేయబోకు.

కర్మకాల్చివేయుననీ – మర్మకర్మ ధర్మమెయని
భావించగ భాషించగ – భాగ్యమె మనభారతికి.

రాజకీయ రొచ్చులో – పార్టీల బురదలో
పావనతను మరువకు – పరమార్థం తెలుసుకో.

బాధలోనె భాగ్యమనీ – భావించిన బాబాలకు
వందనమని సాగిపొమ్ము – వాసిపొందు భరతావని.

ప్రేమరూపు నరుడనీ – పేరుపెట్టి పిలుచుస్వామి
స్వాగతమను శోభతో – జగతినిండు శోభనమే.

225

సత్యం శివం సుందరం – నిత్యం హితం నిర్ణయం.

భోగం యోగం బోధన మయము – సాధన శోధన సంగతి లయము
స్వాముల శోభలు స్వార్థపు నయము – పరార్థ బాబులు పంకమగ్నులు.

నామరూపములు నశ్వరమందురు – కామ కాంచనము కలవరమందురు
శాంతి సౌఖ్యములె శక్తియందురు – మానవత్వమే మనమతమందురు.

ఆత్మ స్వరూపమె అమరమందురు – జీవ జియ్యరులు నిత్యమందురు
యోగసిద్ధులే వరమని యందురు – ద్వైతమద్వైతము దోషమందురు.

దేవాలయమే సమాజమందురు – దేహులందరు దేవులెయందురు
దేహుల ప్రేమయె దివ్యమందురు – ఇంద్రజాలమే హితమని యందురు.

దయాధర్మములు ధారుణియేలును – మాయాజగములె మాన్యమాయెను
విశ్వప్రళయమని విబుధులవాక్కులు – కొత్త స్వాములకు సుస్వాగతములు.

226

పత్రికలు యుద్ధం చేస్తున్నాయి – గాలిలో కెగిరి మాట్లాడుతున్నాయి
అగ్రరాజ్యాల వ్యవస్థలు అవస్థలు పడుతున్నాయి
మాటల మారణహోమం మత్తెక్కిస్తున్నది
నేతలభావం భాగ్యం స్వార్థానికి సోపానం
సరిహద్దుల హద్దులు చెరిగిపోతున్నాయని ఆక్రోశం
ఆవేశం అణుయుద్ధానికి దారితీస్తే అంతం తప్పదు
వీరజవానుల బలిదానాలు విలువలకు పట్టం కడతాయా?
రాజకీయ రభస భాసించే యుద్ధమేఘాల విహారం
మత మారణహోమం మరపించే ఫిరంగుల మ్రోతలు
యుద్ధానికి సర్వసిద్ధం కానియుద్ధం మొదలెట్టమని మాట
దేశాల హద్దులు ప్రభుత్వాధినేతల చేతుల్లో తరిగి విరిగిపోతున్నాయి
జైజవానుల జయనినాదం కాక రాజకీయ రణనినాదం మొదలు
నేతల నేతి బుర్రల్లో ప్రభవించే ప్రవచనాల సంరంభం
ప్రజల అంగీకారమవసరంలేని ప్రతినిధుల నిర్ణయాల వెల్లువ
కవ్వింపుల కథలు కలవరం కలిగించే స్థితి గడ్డుపరిస్థితే
పేద దేశాల మధ్యదూరి పెత్తనం వహించే పెద్దల తత్త్వం మారాలి
ఓడిన వాడికీ గెల్చిన వాడికీ ఏడుపే మిగిల్చే యుద్ధం అసలొద్దు.

227

అస్థిరతకు ఆనవాలైన ప్రభుత్వాలు అనుసరించే అవకాశవాదం
ఆర్థికవ్యవస్థ అవస్థలలో పడి అసలుకే ముప్పు ముంచుకొస్తుంది
అణుపరీక్షలే అగ్రరాజ్యపదానికి అర్హత సంపాదిస్తాయా
దారిద్ర్యం ద్రవించే ప్రజాస్వామ్యానికి ప్రహరీల పహారాలు అవసరమా?

మానవత్వం నవీకరింపబడి నాయకుల మనస్తత్వాలు మారతాయా?
యుద్ధమనే నాయకుల కాకిగోలకు బోఫోర్సులు పార్సేగా
అంతర్గత పోరాటాలను ఆపలేని వారికి అణుయుద్ధం శరణ్యమా
ఆకలి కేకల జనస్వామ్యం మధ్య ఆపలేని యుద్ధోన్మాదం ఎందుకు?

అగ్రరాజ్యాల బెదిరింపులకు చెదరని స్థైర్యం వీరజవానులది
అర్థశతాబ్ది అభివృద్ధి అప్పుల ఆహవ భయాలతో హడలెత్తిస్తూ
కాల్పులకు భరతవాక్యం పలికితే దేశాల దేహం స్వస్థ పడ్డట్టే
సైనికులు చెల్లించే మూల్యం ప్రజాధినాథుల స్వార్థానికి సోఽహం అంటున్నది.

బ్రతికియున్న మానవత్వానికి సమాధికట్టే మనుషులే ఉగ్రవాదులు
మతం హతాన్ని ప్రేరేపిస్తూ హితానికి హీనస్వరం వినిపిస్తున్నది
కాశ్మీరానికి కాంతి, హిమశైలానికి మహిమ శాంతితోనే సాధ్యం
అణు ప్రభంజనంలో వణికే మానవత్వానికి ఊరట ఎప్పుడో.

పగలురేయి ప్రగతిశీలంతో మసలేవారు ప్రభుత్వానికి కావాలి
అతుకుల బొంతల అవినీతికి అందరూ బలికావల్సిందేనా
పేదపెద్దల తారతమ్యం పెరిగితే పేలవమయ్యేది మానవత్వమే
రామరాజ్యాలకు రావణరాజ్యాల భయం పొంచివుంటుంది.

ఆదేశాలతో మాత్రమే దేశాల భవితవ్యం ఫలవంతం కాదు
శాంతి, సమత, సహజీవనం జీవికగా జనవాహిని బతకాలి.

228

పరంపర 'పరం''పరా' – జనజీవన పరంపరా
జయశీలపు పరంపరా – జాగృతజన పరంపరా.

పరంజ్యోతి పరంపరా – పరాశక్తి పరంపరా
వారసత్వ పరంపరా – వాసినిచ్చు పరంపరా
వేదములకు వెలుగులేని వెదలకతల పరంపరా
శాస్త్రములకు చెలువులేని చేతల పరంపరా.

ఆశయాల పరంపరా – ఆశదీర్చు పరంపరా
అవకాశపు పరంపరా – అధికారపు పరంపరా
పరాశక్తి తెలియని పరమార్థపు పరంపరా
పంచేంద్రియ పరమార్థమె జనఫలముల పరంపరా.

మట్టి మమత తెలియలేని మనజీవుల పరంపరా
భూమియె ఆధారమని భుక్తి కదేమార్గమనే కృషికులపరంపరా
స్వార్థమె స్వాయంభువుగా భవిజనులది పరంపరా
పరమార్థపు అర్థానికి పరువు నిలుపు పరంపరా.

భయంబాధ అసలులేని భాగ్యజనుల పరంపరా
అదృష్టము దృష్టమనే అమాయకుల పరంపరా
వైవిధ్యం వైరుధ్యం వలపు గెలుపు పరంపరా
విభవమె భవసారమనెడి విమతుల పరంపరా.

తనువులు తరములకు తపన నేర్పు పరంపరా
కాలం కలతీరేనని కలవరించు కలరవముల పరంపరా
వారసత్వ వాసిదెలుపు వరజనముల పరంపరా
వర్ణవర్గకలహములకు వరదానపు పరంపరా.

మనసుకల్గు మానవులకు మానవతా పరంపరా
దాష్టీకపు దానవులకు దారిమలుపు పరంపరా
జననమరణ భ్రాంతులకే జయవాదపు పరంపరా
అహంకార అహంభావ అతివాదపు పరంపరా.

ప్రళయం లయమొనరించే ప్రగతి జనుల పరంపరా
అంతం ఆరంభమనే ఆశయాల జీవుల పరంపరా
ఆశించినది అందలేదని నిరాశపడే నరుల పరంపరా
అందినదే పొందినదే అమరమనుకొనే ఆశాజీవి పరంపరా.

వావివరుస అసలులేని వాల్యభ్యపు పరంపరా
అసలైనది ధనమేనని మధనపడినిధనమయ్యే పరంపర
అంధకారమధికారం అవధులు మించిన నర పరంపర
మేలుచేసిన మేదినినే మరచి వర్తించెడి మానవ పరంపర.

జడజాతికి చైతన్య స్తన్యమిచ్చే జననీ పరంపర
బడుగుల భాగ్యం భవజనాశయమనే నరనవపరంపర
జీవనకాలంలో జియ్యరు కావాలనే ఆశపోతుల పరంపర
మూలం తెలియని ముద్దు మొద్దు నవమానవాళి పరంపర.

ప్రేమ, త్యాగం పేర్లు తెలియని పేలవ జన జీవన పరంపర
మోసం మోహం మోదం త్రిరత్నాలుగా తీర్పుచెప్పే పరంపర.

230

దూబగుంట దుర్గమకుగ్రామమయింది
రోశమ్మకు పాశాలు చుట్టబడ్డాయి
మహిళల మౌనరోదన మగవారికి వినిపిస్తుందా?
మరో మహాప్రభంజనంగా మహిళలుద్యమించాలి.

రుద్రమలై మాంచాలలై చానమ్మలై చైతన్యం పంచాలి
అన్న రామన్నతో సారామాయమైందానాడు
కాపురాలు కళకళలాడుతూ కాలం గమించింది.
మాటనిలకడలేని రాజకీయుల మాయదారి ఎత్తుగడ.
బ్రాందీ, విస్కీ, బీరుల బారులు బారులు తీరాయి.
బడీ, గుడీ, దడీ అనేవిచక్షణలేకుండా తాగుబోతుల విహారం.
ఆదాయం కోసం దారుణ అకృత్యాలకు జంకని నాయకులు
బెల్టుషాపుల, సిండికేట్ల కేటుగాళ్ళు కోటీశ్వరులౌతున్నారు.
సామాన్య జనజీవితాలు సంతలో వింత జంతువుల తీరౌతున్నాయి.
యువకుల శారీరక మానసిక రుగ్మతలు రెట్టింపౌతున్నాయి.
పల్లెల్లో తల్లులు మగత నిద్రనుండి మేలుకొనాలి.
డ్వాక్రాలు, మహిళామండళ్ళు ఉద్యమంతో పరాక్రమించాలి.
తరంనాశనం కాకుండా తపనతో విప్లవశంఖం పూరించాలి.

నాయకుల నయవంచనకు బలికాకుండా బలిదానాలివ్వాలి.
ఆంధ్రదేశ భవిత అందంగా ఆరోగ్యంగా ఉండాలని భావించండి.
సారాంధ్ర స్వర్ణాంధ్రగా మార్చే స్వార్థరాహిత్యం కావాలి.
నారావారి సారాను నవ్వుల పాలుచేసే నయవర్తకులు కావాలి.

231

ఆశల అంగడిలో అనుభవాల భవసారం
ఆశయాల పందిరిలో అనుభూతుల కాసారం
చెలియలికట్ట కల్గిన సముద్రుడే సాంద్రుడు
అందమైన చంద్రుడే అందరికీ హితుడూ.

కనరాని ఇంద్రునికీ కమనీయపు హారతి
పంచభూతముల పాలిటి పరమార్థ శక్తిమతి
మానవాశ పండించెడి మహనీయమూర్తులే
దానవ జనదారికీ దారుణ ప్రతిరోధములే.

శక్తుల రక్తికీ ముక్తుల భక్తికీ – భవార్తికీ జనార్తికీ బంధువులే అందరూ
కనరాని కారుణ్యం కలికాలపు కథసారం – అనరాని వాక్కులకు అనువైనది అధికారం.

మాతృదేవి స్తన్యంలో మమకారమె మాన్యం
ధన్యత నిచ్చిన తల్లికి గణ్యతయే గగనసుమం
సంఘానికి అంగములై సహకారం పంచగా
భువిదివిగా భువనమంత నవనిధులే నిండుగా.

అంతరాల ఆంతర్యం అధికారపు అవధిగా
వింతతరం విలువలతో విబుధులు ప్రభవింత్రుగా
జనజీవన నాడులందు జయశీలం నిండగా
జాగృత జయవిశ్వమే మనవశమై యుండుగా.

ఆకలి దాహార్తులకు ఆమడదూరమై – జనారోగ్య జాడలే వాడలందు నిండుగా.

232

వేదభూమి వేదనలో వెలుగురేఖలుదయించెనా
పురాణాల పూజ్యతలో పుణ్యములకు నెలవున్నదా?

ఇతిహాసపు భారతాన ఇంపు సొంపు మిగిలేనా?
రామజన్మభూమిలో రమ్యత గణ్యత ఎంత?

సిద్ధార్థుని బౌద్ధములో సిద్ధమైన మోక్షమెంత?
మహావీరుజైనములో మనభారతి మహిమ ఎంత?
ఋషుల మునుల తపస్సులో జనగణముల జాగృతెంత?
దర్శనాల మర్శనలో దాగిన మనదేశపు మాన్యతెంత?

శాస్త్ర శస్త్రచాలనలో చెలువొందిన చైతన్యపు చేవ ఎంత?
మేధావుల మేదినిలో మేలుకొలుపు కొలుపుల లాభమెంత?
స్వాతంత్ర్యపు సాధనలో శోభించిన యోధుల యోజన విలువ ఎంత?
విశ్వశాంతి విజయానికి విలువల వలువల నిచ్చిన వీరుల బలిదానమెంత?

ప్రజాస్వామ్య పరిపుష్టికి ప్రణాళికల ప్రగతి బాటనేర్పరచిన తీర్పరుల తీరెట్టిది?
జై జవాను, జైకిసాను, జై భారత్ నినాదాల నియమాలకు నియతిఏది?
సమ సమాజ, సామరస్య లౌకికత్వ భావాలకు బాధ్యులైన ఆరాధ్యుల ఆర్తిఎంత?
దేశభక్తి దేహంగా దేవులైన జననాయక గుణశీలపు గుర్తులేవి?

గతగణ్యత గరువంగా, వర్తమానవృత్తి విత్తంగా, భవిత చైతన్య చిత్తం కావాలి?
దరిద్రనారాయణులపై దాక్షిణ్యం చరిత్రకల్గిన ధరిత్రి జనుల లక్ష్యం కావాలి.
మానవతకు మహామహులు వేసిన దారులు మనకు రహదారులు కావాలి.
స్వార్థం శోభించని అర్థవంత సమాజం అందరికీ ఆదర్శం కావాలి.
మాటల వల్లింపు చెల్లదని చేతల చెలిమి బలిమని తెలియజెప్పాలి.

233

భోళాతనం దళారీతనం 'దక్షిణ''ఉత్తరా'ల్లాంటివి.
రాజకీయాల్లో ససేమిరా బోళాతనం పనికిరాదు.
మనసు మంచిదైతే వంచనకు దూరమైన మాటలువస్తాయి.
కౄరత్వకూటమి అయిన రాజకీయుల మాటల్లో మర్మముంటుంది.
తార్కిక దార్శనిక తత్వాలకు అంతరం అనంతం.
వాదన కోసంవేదనపడే మనుషుల మాటలకు అర్థాలు అనేకం.
లాపాయింట్లతో 'లే''మాన్'ల మనసుల్లో దడపుట్టించేవారుకొందరు.

రాజకీయ పిచ్చివాళ్ళ స్వర్గానికి నిచ్చెనలు వేసే నీతికోవిదులు అందరు.
గోడమీది పిల్లి వాటం గోపీకృష్ణుల మాటామంతీ మహనీయం.
పట్టిన కుందేటికి మూడే కాళ్ళనే పట్టువదలని అక్రమార్కుల ఆక్రందనలు.
పార్టీల పావనత్వానికి పాచికలు వేసే పరమార్థుల పాతివ్రత్యం.
వదరుబోతుల అదిరిపాటుకు అదనుచూచి మాటకాటువేసే పద్ధతి.
అనడం కాదనడం అతిసామాన్యమైపోయి ఆఖరికి మానసికరోగం ఆసన్నం.
నిజం నిష్ఠూరమని తెలిసీ తెలివిమాలిన తెంపరిమాటల తేటపరులు.
నిత్యసత్యనారాయణుల నీతిమాటల నేతిబీరతనాన్ని నెమరువేయడం.
అర్థం తెలియని ఆవారాగాళ్ళ అంతరంగంలో వింత విలువల వీరంగం.
వ్యక్తి శక్తివంతుడై వ్యవస్థ అస్తవ్యస్తమయ్యే పార్టీల అంతరంగిక సంగతులు.
హైకమాండుల హైన్యానికి దైన్యంలోపడ్డ దారితెలియని ధర్మవర్తులు.
నియంతృత్వ పోకడలను నీరసించు నీతిపరుల పరువు నిలిచే రోజెప్పుడో.
ప్రజలు కేంద్రబిందువుగా ప్రవచించే ప్రజాస్వామ్యం వస్తుందా?
ఎన్నికలంటే ఎదల్లో గుబులు మన్నికైన పాలనకు వన్నెల వాకిలి తెరుస్తుందా?
ఆయుధం పట్టలేని అసమర్థత, ఆలోచన చేయలేని నిర్లిప్తత అందరిదీ.
దమనం పాలక గమనమయితే దారుణ మారణాలకు కారణమే అది.
మాట మౌనమయితే మథన మేధను వధించి మానవతను ధ్వనిస్తుంది.
నీటిమూటల మాటలు నిన్నటి నిత్యత్వానికి నివురుగప్పిన నిప్పులే.

234

కార్పొరేట్ల కార్తాంతికులు కారుణ్యం ఒలకబోస్తున్నారు
కంపూటర్ల ఇంట్యూషనులో కంటినీరు మంటగలిసింది.
'మార్కెట్ ఎకానమీ' లో అమర్త్యసేన్‌లు మర్త్యులౌతున్నారు
'గ్లోబల్ విలేజి'లో 'లేబర్'లు బరితెగించి 'లేజీ'లైనారు.

ఆశల వేగం ఆశయాలను ఆగంచేసి అవతారాలతో తరిస్తుంది
తత్వం తెలియని తాత్వికులు ద్వైతాలకు వైభవం పంచారు
ఆదిశంకరుల ఆశయం అపరశంకరుల ఆలోచన అందరి సుఖమే
మతం మారేదయితే అది జనహితానికి హతమేకదా.

'విద్య'నుండి 'విలువ'లదాకా కలవారికే కామసిద్ధి కలవరం కల్గిస్తుంది
అమర సదృశ అమెరికా జీవనము అన్నిదేశాలకూ అశనిపాతమే
ప్రపంచవలసల ప్రాభవ ఇంగ్లాండు ప్రవచించేశాంత వచనాలచేవ ఎంత?
తననేలకూ, తనజనానికీ నేవళమైన విధానాల రూపకల్పన అవశ్యం.

కృత్రిమత్వానికి ఆత్రపడే ధాత్రీజనానికి ప్రకృతి ప్రాభవం అందదు
నగ్నత నవ్యత్వానికి దివ్యత అయినపుడు పసితనమే పరవశిస్తుంది.
దాచలేని శరీరభాగాల దారుణత్వం మందులేని మానవరోగాలకాహ్వానం
నిరంతర పరిణామశీల ప్రపంచానికి నామ్నీకరణాలలోనే నవ్యత్వముంటుంది.

భాషల భాగ్యానికి భావనలందించే మాధుర్యం మానవాళికి మహోదయం
అమరానికి నిచ్చెనవేసే అసమానమేథావుల అభిలాష అనుభవరాహిత్యమే
వంచనావేదం వంటబట్టిన వరనరులకు పంచభూతాలే నరకాన్ని ప్రసాదిస్తాయి
అన్నిరంగాల్లో 'అంగి'గా తిష్టవేసిన అవినీతి 'హంగామా'తో భంగమౌతుంది.

పుట్టుకనుండి మరణందాకా పూజ్యత కొరవడిన మానవమస్తిష్క మాన్యం
మానవధనదాహం దహనమయ్యే రోజు దగ్గరలోనే ఉందని ఆశిద్దాం.

235

### ఆర్థిక సమానతకై మరోస్వాతంత్ర్యసమరం కావాలి.

అణచివేతకూ అసమానతకూ ఆదికారణం కనుగొనాలి
తరాల దాస్యం తరిమిన తపస్వుల ఆశయమే అది
వివక్షల విశృంఖలత్వానికి సంకెలలువేసిన సాహసికులు
సమానత్వం సమ్మానింపబడిన స్థలం మనరాజ్యాంగం.

అమలు మలుపులలో అంతరాలు వింతగా విర్రవీగాయి
తెల్లపాలకులు పోయినల్లపాలకులు వచ్చినవ్వులపాలుచేశారు
నల్లధనం కొల్లలుగా నవ్యమానవీయతను యాతన పెడుతున్నది
ఆశమీరిన అవినీతి అందరి హృదయాలను కలచివేస్తున్నది.

ఆకాశహర్మ్యాల మర్మం అధికారగణానికి అందిన విషయమే
భోగలాలసత త్యాగుల ఆత్మబలిదానాలకు ఆజ్యం పోస్తున్నది

యువకుల యోజన యోజనాల దూరంలో రోజుతూ రాజుకొంటున్నది
పనిలేని, పనిఉన్నా చేయని పౌరుల మనోగతం వర్తమాన వృత్తమే.

శ్రమజీవన సౌందర్యానికి చేయూతనందించే చైతన్యం కావాలి
ఎదురుచూస్తున్న ఎదలకు ఎఱుకను పంచి ఏమరుపాటును పారద్రోలాలి
నిర్లిప్తత లిప్తకాలమైనా జీవనతప్తులకు తృప్తిమిగల్చక తృష్ణమయమౌతుంది
మోసాలు చేసే మోతుబరుల బరాబరులను బంధించే దేశరక్షకభటులు కావాలి.

దాతృత్వం పేరిట దారిదోపిడీలు చేసే దానవ కర్ణులను దడిపించాలి
ప్రజాస్వామ్యం పదవీవ్యామోహపరుల పాలిటి పడకగది కారాదు
సంస్కృతికి అద్దంపట్టే సంస్కారులు జనస్వామ్య వర్తకులు కావాలి
అలిగిన ధర్మసుతులు కర్మభూమిని కాటేయకముందే కలవరాన్ని కనుగొనాలి.

ధనంచుట్టూ పరిభ్రమించే దయమాలిన దరిద్రచరిత్రులకు దండన వెయ్యాలి
జనరక్తం పిండుకొని, జాతిమాంసం నంజుకొనే నీచుల పనిబట్టాలి
కోర్టులకోమలత్వంలో రక్షకభటరక్షణలో దారుణాలు చేసే వారిని మసి చెయ్యాలి
పెద్దవాళ్ల పనిబట్టి, పేదవాడికి పనిచూపి పేలవమైన స్వాతంత్ర్యంపేరు నిలబెట్టాలి.

236

నీ కాటుక కళ్ళకు కాటేసే గుణముంది – ఆ కాటుకు నామదిలో కలవరమే రేగింది.
కంప్యూటర్ కళ్ళలో కదిలే ఆ అందం – ఇంపునింపు రాగమై వెలిగెను మన బంధం.

పెదవుల కదలికలో కథనం వేరులే – సంగీతపు సరసతతో చెవులు పండెలే
ప్రేమపేరు నీదిగా పెరిగెను పరవశం – ప్రేరకమై తనువులే తరిగెను తామసం.

గున్నమావిసన్నజాజి – గురుతు ఋతువు పాటకు
వాసంతపు సంతలో – వలపు తలపు కలయికకు
ఎన్నాళ్ళకు ఎన్నేళ్ళకు ఎదనిండిన అనురాగం
రసఝరియై ప్రవహించెను రసనలసరాగం.

ప్రమాణాల ప్రయాణమే ప్రయాసయే లేదుగా
కడతేరెను కలనిజమై కమనీయపు కాంతిగా
అలసట లేని అరమరికలు లేనిది
అమరంలో ఆస్తి అది అనుభవ భవసారమది.

కళ్ళులేని కాలానికి కనికారం ఉండదుగా – ప్రేమనావ పయనానికి దారినీటిజాలెగా
ఇద్దరమూదరిజేరగ ముద్దుహద్దుమీరెగా – ముద్దులన్ని మున్నీరై మురిపెములే తీరెగా.

237

జాజిమల్లె జావళీ – జాతరలో కథకళీ
రంగుల రసరంగేళీ – హంగామా మనకేళి
హంగుల ఆరతిలో – రసరాజ్య రమ్యనిధీ
కౌగిలింతగిలిలో – చలిచలి చక్కలిగిలీ.

ఇంగ్లీషు కిస్సులో – మిస్సు మస్తుగున్నదీ
ఆఫ్రికా ఆలింగన – అంగభంగమంటున్నది.

అమరమె మనముందుండగ మనకేమి దండగ
అండదండ నీవుండగ మనిద్దరికి పండగ
కలువభామ భాగ్యానికి వలువచెలువ వాసిగా
అపరంజికి రంజనమై పరంజోతి పంటగా.

తనువు తగిలితే చాలు తడబాటు పాటుగా
చక్కదనమె ధనముగా చెక్కిలి ఎరుపాయెగా
ఎడబాటే తడబాటై సిడిముడి తడబడగా
విడె నీవీబంధనమే వెఱగు పాటు వేళగా.

లోదుస్తుల లోకంలో లాభం కన్నుదాయెను
గుండెపిండు మండనలో గురులఘువుల కవితాయెను
సౌందర్యపు సౌదామిని అందానికి ఆమె 'మనీ'
కామిత ఫలకాంతామణి కామనకది ఆమని.

విరహంలో రహియించుట అహరహము ఆంధ్యమే
కలనిజమై కలసికొనుట కలకాలపు అలబలమే.
నీఅంతరంగమే నిధుల తరంగమై
అనురాగ సంద్రానికి ఆటుపోటుగా మారెను.

నవతకు నవ్యతగా నందనవనముగా
భవితకు బాధ్యతగా మనబంధమునిలుచుగా.

238

విధుల బధిరులైన వేళ విలువలు విగతమ్ములే
నిధుల విధ్యలైన వేళ నీతి నేతిబీరలే
గురువు గరువమెంచగా పరువు ప్రగతిగాంచులే
గురుతు గనని గురువులే సంఘానికి చెరుపులే.

అమ్మకాల కాలంలో అసలువిద్యనమ్మకమే
నమ్మకమే విడిననాడు నయవంచన నిత్యమే
హక్కుల హయాములో బాధ్యతలే బరువులే
బాధ్యత బలమైనవేళ బతుకుబాట నీటులే.

అధికారపు అసమర్థత అందరికీ చేటులే
నిర్లిప్తత నిత్యమైన సత్యపథము వధ్యములే
ఆరాధన ఆంధ్యమైన ఆలోచన వంధ్యమే
ఆశయమే శయనించిన శాస్తి జరుగు నిజములే.

కోకొల్లల కోరికలే కొల్లగొట్టు బతుకునే
తాత్వికతా ఆస్తికతలె తపనను హరియించులే
మానవ నవనాడులన్ని మలినమాయె మహినిలే
నవరంధ్రపు తనువులో వనచరముల వాంఛలే.

చదువులమ్మ సరసనా స్వార్థార్థుల శోభనం
అమ్మనమ్ముకొనువాడే అసలు సిసలు వారసుడు
జీతజీవితాలలో జిలుగులన్ని మాయములే
అన్నమిచ్చు అమ్మకూ అందరుఋణగ్రస్తులమే.

239

జాతి జాతకానికీ పాతరపడుతున్నది
దేశదేహదివ్యతకూ ధిక్కృతి ఎదురైనది
ఒకే జాతి ఒకే మతం ఓ.కే. మాటలలోనే
కులమతాల కుళ్ళులోనె కలతల కన్నీరులే.

తనకోసమె తపియించెడి తనువుల వారెందరో
జనజాగృతి జయములకై జనియించెడి జనులెందరు
అవమానపు జీవితమున మానరక్షమరచిరీ
అవసరమున అభిమానమె అంతరించె అవనినీ.

ఆకలి కడుపుకు కుడుపున అందలమే తనదిగా
ఆకలికేకల మాటున ఆశయమే ఆశగా
వేగం వేళను మించిన వేదనరొద వినుచుగా
జనపథమున మనపదములు జయగీతిని పంచుగా.

వంచన శిల్పము నందున తల్పమె శిలరీతిగా
తరగని అరగని తనువులె శిలకు సాటిరావుగా
విగ్రహమే నిగ్రహమై గ్రహణము విడదీయగా
ఆగ్రహమే అందమయి ఆనందము పంచుగా.

సత్యాగ్రహ సరళియే నిత్యజనుల నియమంగా
నిరశనమే నీతిగా జాతికి జయమబ్బునుగా
తపశ్శక్తి భక్తులతో తారుణ్యము కలుగగా
జనరక్తి దేశభక్తి దివ్యమగును దీటుగా.

రక్తమొకటె రంగులో అంగములన్నియు నొకటె
అంతరంగ అంతరములె అవమానము అందరికీ
పరిశుభ్రము పావనతా పరమార్థము అందరికీ
పావన జనజీవనమే బృందావన మందరికీ.

240

మానస మహిమకూ మౌనవేదమాయిది
మానవ మనుగడకూ మాన్యనినాదమాయిది
ప్రకృతి ప్రేమనూ ప్రవచించిన ఆవేదం
పురుషుని పూజ్యతనూ పురాణమై వచియించెను.

ఇంద్రియాల ఇంపునూ సంద్రముగా ప్రవచించెను
నవరంధ్రపు కంపునూ నవ్యముగా చిత్రించెను

భావజాల పరిధిలో భాషభ్రమలు గొలిపెను
ఆచరణము అంతరింప ఆశయమే ఆర్తినొందె.

అశనిపాత సదృశమై మసిబూసెను స్వార్థము
అందరికీ అందమయి అందివచ్చె పరమార్థము
నవజీవన నిశీధిలో విశీర్ణమై విలువలుండె
వన జీవన వసుధలో వలపు తలపు కలగ మిగిలె.

శబ్దార్థము చేవలేక తాత్పర్యము తరియించెను
అర్థార్థులె అన్వర్థులు వ్యర్థమాయె వ్యక్తిబతుకు
వేరు వేరు వేరుగా వేకువయే వేళమించె
కిరణస్పర్శ మరణమయి కీర్తి నిత్యసత్యమయె.

చీకటిలో ఆకటిలో చేటునొందె చెలిమి బతుకు
వెతల వేకువల మాటున బాటపాటవమ్ములేకపోయె
మానవతా మూర్తులే దైవత్వపు కీర్తులుగా
దారిజూప ధాత్రిలో పాత్రత ప్రభవిల్లుగా.

241

బతుకులాట వెతుకులాట – వేదనలో వెతలవేట
అన్యుల అన్యాయంచేసి – ధన్యతలో ధనదాహం
అహంకార అధికారం – అందరికది వెటకారం
నీకోరిక నీకుంటే – పరుల కోర్కె పరవశయే.

నీది నాది విభేధమే – నిమ్నతకు నిలయమగును
జానెడు పొట్టకయి – జాతిమతం పాతరే
సంసారపు సంద్రంలో – సారమంత క్షారమే
మానం వదలిన వారలు – మౌనంలో మగతలో.

దానం దరిజేర్చునంటు – ధరిత్రిలో రహియింతురు
దోపిడియే దోహదమయి – హ్రదములోన బడి పోదురు
జనాశలకు నాశమెంచి – ధనాశతో దహియింతురు
ఆరాధన ధనమునకే – మనశ్శాంతి మృత్తికకే.

రోజూ జన రోదనలే – రాజులకది శోధనలే
అంతరాల తరాలలో – రాలుగాయి రభసలే
నేరమందు మందతతో – పందల బతుకాయెను
నేతిబీర న్యాయముతో – అన్యాయము అమరమాయె.

ధర్మకర్మమర్మమందు – దారిలేని జీవనమయె
కామనలో కలవరమయి – పగటికలగ ప్రగతిగాంచె
మనదనుమాటలో – మార్మికతయె నిండెను
తనబతుకే తపనగా – తరియించుట తారుణ్యము.

మంచిచెడుల వివేచన – వంచనతో నిండెను
విజ్ఞానపు వినువీథిని – వినుకలివిలయమ్మాయెను
సాధనలో సారమంత – అంతరించె వంతలో
సామదాన భేదములే – సామరస్య పతమాయెను.

242

తొలకరి చినుకులు – చిలుకరించె వలపు
చినుకుల చిత్తడిలో – మత్తిల్లెను మనసు
వానవలపు తలపుగా – తరియించెను ప్రకృతి
పరవశాన పచ్చదనము – ఫలియించెను పావనతా.

వసుధకు సుధపంచగా – వనితకు ఘనతాయెగా
ఋతువుల క్రతువుగా – బతుకుపంట పండెగా
కలయికలో కలతలన్ని – కరుణను వర్షించగా
అలయికలో అలవోకగ – అవని అతిశయమ్ముగా.

అవనిలోని వనమందున – నందనమే విరియగా
ఇంద్ర చంద్ర పదవులే – క్రిందాయెను విందుగా
అవనీ ఆకాశములే – ఆకర్షణ నందగా
అధికమైన ఆనందమె – అరమరికలు విడిచెగా.

నవ్యమైన నగ్నతలో – విజ్ఞత విగతమ్ముగా
చినుకుల తడి తడుపగా – తరళిత విరళమ్ముగా

వసంతమే నీతనువున – సంతను సవరించగా
వంతబాడె వలపుగా – అంతయు అపురూపంగా.

కాలము మారగా – కామము కలవరముగా
కలియుగమే ఖగముగా – ఎగిరెను ఎదమీదుగా.

243

అతివాదుల మితవాదుల మతవాదుల రాజ్యమిది
అతిస్వార్థపు అన్యాయపు అధర్మంపు దేశమిది.

వ్యక్తిశోభ శుభముతో వెలుగొందెడి సంఘమిది
సమానతకు మానహాని తలపెట్టెడు తరుణమిది.

కానరాని దేవుళ్ళకు కాన్కలనర్పించెడి కాలమిది
గతవిషమును సతతము గణియించెడి గమనమిది.

దేహభక్తి మిక్కుటమై దేశభక్తి వెక్కసమౌ తెరువుయిది
మహామహుల బోధనలను బాధించెడి నరనాణ్యతయిది.

శోధనలో సాధించిన సంస్కారపు ఘనసరళియిది
త్యాగం అర్థం తెలియని యాగయోగ యోద్ధల యజనమిది.

ధనాశలో దరిద్రతను ధిక్కరించు దిలీపుల దివ్యత యిది
పంపకాల అంపకాల పాలకజనవాలకమున ప్రగతియిది.

అధికారము అర్థమే అవసరమను అసమర్థుల ఆర్తియిది
కీర్తికీలకమ్మెనెడు నవపాలక చాలకుల నడతయిది.

చరిత్రనెరుగని ధరిత్రి జనుల దారుణ మారణకృత్యమిది
మంత్రుల తంత్రుల పార్టీ పదవుల యంత్రాంగపు జనయావ యిది.

పన్నుల పన్నులు ఆపై పన్నులు సంపన్నుల పన్నాగానికి వన్నెలివి
చట్టము సరళము సరసత విరళము పెద్దల చుట్టము పేరు అది.

మేధల వేదన మెలకువ అణకువ మేలిమి మార్గపు మెకము యిది
అమ్మలనమ్మెడు ఆర్థిక స్వార్థుల ఆశయాలకు అవసరముయిది.

బాంధవ్యమునకు బంధమువేసెడి బందూకులదే భాగ్యమది
ఆయుధపోరున అర్థసమతయే అందెడివేళకు ఆదియిది.
భయం బాధ్యతను బలవంతముచేసెడి నవ్యభావమున నాంది యిది.

244

వయసు వాలిపోతున్నది – వాలకమే కనకబడినది
ఐదుపదుల వయసులో – మనసు నసుగుతున్నది
సెలవుకోరు శరీరమే – నీరసమున నిండినది
పుట్టిన నాటినుండి – పున్నమిగా గడవలేదు.

అమవస నిశి ఆంధ్యముగా – మాంద్యమందు పడియున్నది
అవసరమున కపకారము – అసలెపుడూ చేయలేదు
ఉపకారపు ఊసులలో – ఉరవడించు మనసునాది
కష్టములు నష్టములే – ఇష్టముగా ననుకొంటిని.

సుఖముల సుందరతలూ – సూక్ష్మములో మోక్షములే
జ్ఞానమంటె నమస్సనెడు – జ్ఞాతులెవరు నాకులేరు
అజ్ఞానము అవజ్ఞతో – అవతరించి తరించితి
డిగ్రీల చదువులే అగ్రమయి – అందించిన ఉద్యోగమె నాకు ఆస్తి.

సమానతల సమాజమున – అజమాయిషి అధికులది
అహంకార అధికారము – ఆర్థికులకె అందినది
చూడరాని దృశ్యములే – దృక్పథమున దర్శనములు
అనరాని వినరాని – అసహ్యంపు విలువలే.

మండే గుండెలలో – మర్మము మమకారమే
సహకారమె సవనముగా – ప్రగతియె ప్రాకారము
మంచిచేసి మరచిపోవ – వంచనలే ఎదురైనవి
త్రికరణముల రణముగా – అవతరణము ఆశలే
మాత ఋణము మమతగా – మానవతే అవతారము.

245

ఆర్తిమయము జీవితము – ఆపదలకు నిలయము
జననము జయకేతనము – మరణము మరో రణము
అమ్మకడుపు చల్లనిది అదివిడువగ కల్లయిది
తత్వము తెలియనిది అహరహముల ఆశలది.

కరుణ అరుణమైనది కలకాలము కమ్మనిది
పొగులుగుండె వగలమారి దిటవు గుండె ధైర్యశాలి
మానసమున సమమైనది మనువృత్తిని విషమమది
మాటలలో మమకారము సమాజమున సహకారము.

అందము అరవిందము ఆశయమే మకరందము
దేహమె దేవాలయము జీవుడె ఆలయదేవుడు
కీర్తికాంక్ష కీలకము ఆంక్షలు అవహేళనములు
మట్టిమానవాళికీ మరపులే మహిమాదికములు.

అతిని వర్జించుటలో మతి మాంద్యము వదలును
ఇంద్రియముల బంధనమున ఇంపులొలుకు జీవనము
ఆత్మతత్త్వమెరుగుము ఆధ్యాత్మిక మదియె వినుము
పరార్థమే పరమార్థము అర్థకాంక్ష నణచుము.

దోషము మోసములందున దోహదమును విడువుము
పశ్చాత్తాపము మించిన పావనతయె లేదనుము
వేగము భయముల వేళగాంచి మేలుకొనుము
మేలు మైలురాయిగా మేధస్సును వెచ్చించుము.

చింతకు చిరునామా వంతలకిది వాల్లభ్యము
తీరుమారి పోవునుగా తీర్పులు తిరునామమెగా.

246

పాపంపుణ్యం పదనిసలాయెను – నిషాలు ఖుషీలు నిశీధి నిండెను
సూకరసంస్కృతిసుందరమాయెను – నగ్నతమగ్నత నాణ్యములాయెను
శిక్షణ భక్షణ బంధువులాయెను – రాక్షస రాజ్యము రమ్యత నిండెను
హింసయుహీనత హంసములాయెను – మానవ మాంసమె మధురమ్మాయెను

308

రక్తము రక్తిగ భుక్తిగ మారెను – చంపుట చచ్చుట సరసతలాయెను
వేగము ఆగము వెతలకు నిలయము – భయము భాగ్యము భావములాయెను
భోగము రోగము రాగము తీసెను – బోధన శోధన బాధగమిగిలెను
సంస్కారములే 'కారము'లాయెను – పరిష్కారములు ప్రబలములాయెను
విశృంఖలతకు శృంఖలలొచ్చెను – కూటనీతియే కోటగ మారెను
మాటలు మనసులు మైలబడియెను – చేతల రోతలు చేటులు తెచ్చెను
రాజనీతియె రమ్యత వీడెను – రాజకీయమే రభసగమారెను
రామరాజ్యమున కామము ప్రబలెను – రావణచేష్టలు చితులను రేపెను
కీర్తికి ఆర్తికి కీర్తనలాయెను – మిత్రత పాత్రత మినుకులాయెను
మాటలు చూపులు మమతల నేర్పెను – మనసుకు బుద్ధికి మైనస్సాయెను
నేతల నీతులు తలరాతలయె – జాతికి పీడన వీడక యుండెను
ఎన్నిక మన్నిక ఎదలో కుదుపయె – మన్నన గణ్యత మృత్తికలో బడె
కర్మల మర్మం కనబడదాయెను – మాటల మర్మం వినబడదాయెను
విద్యలు వధ్యము విలువలు విగతము – మహాపురుషులకు మకుటం కరవయె
గ్రామజీవితము గాలిపటమయె – నగరవాసము నవ్యము దివ్యము
అంతరంగముల వింతరంగులయె – దర్శన మర్శన శనిగా మారెను
జీవన్మృతులే జగమున నిండిరి – కీర్తిశేషులకు మూర్తులె మిగిలెను
బతుకు బరువును దించిన వారలు – అతుకుల గతుకుల గతినే పొందిరి
పుణ్యజీవనులు పూజ్యులు కావలె – పాపపు బతుకులు పతనము కావలె.

247

విశ్వాసం శ్వాసంగా విలువలు వికసించాలి
నమ్మకమే అమ్మగా నవ్యత నాట్యం చేయాలి
మనసు మాన్యంలో మన్ననకు గణ్యత లభించాలి
భాషాసంస్కారం భావానికి భాగ్యం కలిగించాలి
సమానత్వ సాంగత్యం గత్యంతరం లేనిదై గమించాలి
దుస్సాహసం హసించే దూరాలు చేరువ కావాలి
అధికార దర్పాన్ని ఆర్పివేసే జన జలయంత్రాలు కావాలి
ధనానికి దాసోఽహమనే అహంకారులను అధఃకరించాలి
దీనుల పరివేదనను దివ్యంగా భావించే నవ్య జీవనులు కావాలి

కీలకమైన కేంద్రం కీలాలక మన్న సత్యం నిత్యంకావాలి
కొత్తపాతను పాతరవేసే తరం నిరంతరం నిర్వీర్యమౌతుంది
నిత్యభోగులకు సత్యాన్వేషణ సత్వరం అభిలషణీయం
గతించే మతిమాన్యతకు గరువం కలిగే గమనం కావాలి
జీవరాసుల రసికత రాణించే సికతా స్థలం చింతన మాత్రమే
చితి చైతన్యాన్ని రగిలించే స్థితికి వస్తే మానవుడు మాన్యుడే.

చింత వంత ఆవంతయినా 'సంత' జీవనాన్ని కదిలిస్తే చాలు
సంఘటనల నటన తనువులపై తాండవం చేస్తూ మండిస్తున్నది
మానవ మాధవుల్లో మాన్యులెవరనే ప్రశ్న మస్తకాలను ఛేదిస్తున్నది
సంసార సాగర 'గరం'లో ఆవిరౌతున్న ఆశయాలకు ఆశలే ఆది
ఎత్తిన పిడికిలి ఎత్తుభారమై మత్తులో చిత్తయి చిత్తక్షోభ కల్గిస్తున్నది
ఆయుధంతో ఆశయాలు పండించవలసిన వాళ్ళు ఆశల్ని తీర్చుకోవడం
చదువుల తల్లి రాజకీయ చదరంగంలో పడి చెదలు పడుతున్న వైనం
అనుభవాల భవాన్ని ఆనందమయం చేసుకొనే ఆంతర్యం తెలియాలి
భవసారం అనుభవసారమేనని అవనిజనులందరూ అనుకొనాలి
తెలివితో తేలికగా బతకడం తెలిసినవాళ్ళ జీవితం తేటగా ఉంటుందా
జీవిత ఫలాన్ని పదుగురికి పంచినపుడే పావనత్వానికి దారి లభిస్తుంది.

248

సేద్యం సేదదీర్చుకొంటూ శ్రామికుని సొద వింటున్నది
రోదన మిగిల్చిన వేదన వర్షం వర్షాభావంతో వాదులాడుతున్నది
అప్పుల వితరణలో వినోదించేవిశ్వబ్యాంకు నిధుల విధులు నిస్తేజం
తరుగుదల పెరుగుదలలతో తలకాయలు మార్చే తలారులు
ఊహల ఊయల అంతరిక్షరిక్షాలో అటూ ఇటూ కదులుతున్నది
మింట మంటలురేపే ఇంటర్‌నెట్ 'మందు'లపాలిటి మరో మారణం
కలనిజమైనా కల్లయినా కలలుగనే నైజం మనసున్న మనుషులది
ఆశయాల శవాలు అనాథలుగా అవనిపైబడి ప్రశ్నలు వేస్తున్నాయి
'ఎన్‌కౌంటర్' ఎదలో గుదిబండగా ఎన్నెన్ని తనువులు తరించాయో
పోలీసుల పోరాట ఆరాటానికి పోగాలందాపురించి 'పోటాలు' ప్రత్యక్షం

310

కళ్ళెంలేని పాలకగుఱ్ఱం కళ్ళువిప్పి కలవరపాటు కలిగిస్తూ కదులుతున్నది
నియమంలేని యమకింకరుల్లా కింకర్తవ్యతా మూఢులయి కీర్తిస్తున్న వైనం
చెల్లిపోయిన కాలం చెంపపెట్టులా కుళ్లిన సంఘానికి కూత నేర్పుతున్నది
భవిష్యత్ నిషత్తులు భాగ్యవంతంగా అణుపాటవాన్ని అంచనా వేస్తున్నాయి
గందరగోళం మధ్యగాడిదప్పుతున్న గాడిద బరువు చదువుల చక్కదనం
ఎల్లలులేని జ్ఞానానికి ఎల్లలు కల్పించి ఎదలను ఎఱుకకు దూరం చేయడం
చదువులమ్మను అమ్మికొనుట గ్రహిస్తే బ్రహ్మగారు విడాకులిచ్చేవారేమో?
అధికారధిక్కారం అతిసులువైన నేపథ్యంలో అన్నీ అస్తవ్యస్త విన్యాసాలే.

నర్సరీ నుండి వర్సిటీ వరకు యూనివర్సల్‌గా పెద్దవారికే పెద్దపీట
సంక్షేమ సంప్రోక్షణ క్షామపీడితులకు తీర్థప్రసాదాల తిరునామం
నవభారతం వనభారతంగా నక్సలైట్ జనభారతంగా భాసించాలి
చైనాను చూచి చైతన్యం పొందే చేతన హీన ప్రతినిధులకు నమస్కారం
విజ్ఞానయాత్రలు వినోదయాత్రలుగా వికార యాత్రలై విసువు గొలుపుతున్నాయి.

249

బలిపశువులు ప్రజలు – బలవంతులు ప్రతినిధులు
పశువు విసువు జెందితే – వినశ్వరము మిగులు
ఆరాటము పోరాటము – ఆదిజనుని ఆంతర్యము
అంతర్మథనము జరిగితే – అవతరించు విప్లవము
పుట్టుట గిట్టుట కొరకే – పూజ్యతకే జీవితము
హితములేని జీవితమే – హీనమగును సతతము
వేడిరక్త వెల్లువలో – శక్తులకే శమనము
జనశక్తికి ధనశక్తికి – జాగృతిలో వ్యత్యస్తము
మార్పులోని తీర్పులే – మానవ నైజములు
సహజత్వం చనిపోతే – సాంకరమున వంకరలే
వల్లకాడు పల్లెలై – వల్లెయనును నగరాలు
మానవమహి నిర్మితములు – మనుకాలము మితములే
నిధులే నిత్యమైన వేళ – సత్యహత్య సహజములే
విధులు బధిరమైన వేళ – విలువలు విగతమ్ములే

హక్కులు చక్కనివీ – బాధ్యతలే బరువులు
యాతన ఆసన్నమైన – జాతరలే తప్పవులే
దారిలేని ఎడారిలో – దాహార్తియె దారిగా
గమించుటే గణ్యము – ఎండమాని ఎఱుకగా
సంఘర్షణ హర్షము – సంరక్షణే లక్షణము
రక్ష కక్ష శిక్షగా – రక్కసి గుణవర్జితము
మాతరమే యాతరమని – మనమంతా మసలుకొనగ
అమ్మమతం అందరిదని – ఆనందము నందగా
ప్రజామతం ప్రవరమని – వరులంతా వందించగ
దేశ దేహ రక్షణయే – దేవుని మతమగునుగా.

250

సాంకేతిక తికమకలో – సంకేతము సంకటమయె
సంబరాల అంబరాన – సమత మమత తరిగిపోయె
అంకితమే అంకురమై – ఆశలు ఆకృతి దాల్చెను
యంత్రాలతొ యాతనలై – యమసదనమె వదనము
మంత్రాల మాటలతొ – మానవాళి పతనము
క్రియలేని కీర్తనలే – ప్రళయార్తికి ప్రారంభము
కర్మజీవి కంటినీరు – మార్మిక జనమారణము
ఆర్తికి అదలింపుగా – అవని జనుల కారుణ్యము
ఆనందము మనసుకే – ఆస్తి జాస్తి అసలెకాదు
భోగాదులు కొనితెచ్చును – బాధలు రోగములను
యోగసాధనములోనన – యోజన జన భాజనమగు
నిగ్రహమున అనుగ్రహము – ప్రగ్రహమున పరివేదన
శాంతిశక్తి దాయినిగా – శంకరమే చరిత్రము
ధరిత్రికే ద్రఢిమనిచ్చు – సంకల్పము కల్పకము
దారిలేని జీవితాల – దరిజేర్చుట దయాగుణము
మాతల తలరాతలను – మార్చేసిన మహనీయులు
మనసు మహిమ గమనించిరి – గమనమందు ఘనులైరి
కృత్రిమమున కృపగల్గగ – సహజత్వము సాగిపోయె

మార్పు నేర్పు మానవులది – ప్రకృతి కృతి పరమార్థము
అనుబంధము వీడకుండ – అనుభవింప అమరత్వము.

251

చీకు చింత చీకటిలో – ఆకటిరొద ఆవులింత
వేకువ వేళలో వెలుగురేఖ పులకింత
మండే గుండెలకూ మండనమే మనువర్తి
ఎండిన ఎదలకూ ఎఱుపు ఎఱుక ఏమరపు
కాంక్షల కొలిమిలో కరుణకు కార్పణ్యము
ఆంక్షల బతుకులో ఆశయాలు అమరము
నియంత్రణకు నీతికీ – నిత్య సత్యసంబంధము
విచ్చలవిడి స్వేచ్ఛకూ విగతవిలువ వీరంగము
సిగ్గు ఎగ్గు సిరులుగా వరమాయెను జీవితాలు
అన్ని వదలి వన్నె దరిగి అవమానమె మానమగును
పగటి గట్టు ప్రగతి పట్టు – చీకు సిరుల చింతపెట్టు
అహరహముల అనుభవమ్ము – వమ్ముకాదు వాసి సుమ్ము.
నిత్య నిమ్న ఆలోచన – సత్యదూర సౌరభమ్ము
అభ్యుదయం ఆకాంక్షగ – అనుగమింప అధిక ఫలము
కష్టనష్టముల కాలము – ఇష్టముగా అనుభవింప
కాలాంతర కౌగిలిలో – కలుగును శుభసౌఖ్యములు
కాలము నిర్ణీతము – కలిమి బలిమి మానవులకు
గాలమేయ గగుర్పాటే – అగపడదది అందరికీ
సామూహిక సంక్షేమము – సాగిన జన జీవితమున
అసూయలూ అరమరికలు – అసలుండవు అవనిలో
పగలు రాత్రి ఫలముగా – ప్రాభవమే బతుకు ప్రగతి
నిలువ నీడ నిత్యమైన – నలువ సృజన నాణ్యమే.

252

కాలం మారింది – కలకలమే రేగింది
కలలయుగం కలియుగమై కామితముల నణచింది

ఋతుక్రమము అక్రమమై – వికృతికే విలువనిచ్చె
క్రమజీవన కాలములో – విక్రమమ్ము ఆక్రమించె
అతిక్రమణ అవసరమై – మతిభ్రమణ శ్రుతిమించె
స్పర్థయె వర్ధిల్లగా – విద్యల తీరులు మారెను
ఆశమీర అవకాశం – అవసరంకోసమాయె
ఆక్రోశమె అసూయగా – ఆహతమున అణగిపోయె
తానే సర్వస్వమనే – తపనకు తరుణమ్మాయెను
అందరికీ విందుగూర్చు – అభిమతమే అవహేళన
పరిణామము వరించగా – పృథివియె వర్ధిల్లెను
ప్రణామమే ప్రవరమై – పరిణయముగ నర్తించెను
విజన సృజన వినువీధిని – విభుత్వమున నిలిపెను
స్థితిగతులకు సిరులు పంచి – జతకలిపెను జాగృతితో
ప్రళయము ప్రారంభమయి – ప్రాభవమే నశియించెను
కల్లోలము కనులముందు – తల్లడమే తరువాయి
తాపము జనశాపమై – మసిబారెను మానవాళి
చల్లదనం ప్రల్లదమై – వెల్లదనం వెలువరచెను
మండుటెండ మంచుకొండ – మానవునకు అవసరములె.

253

ఆకటి చీకటిలో అనంతమౌ ఆశలు
వేకటికటి ప్రదేశాన వెలుగురేఖ లెన్నెన్నొ
ఆదిమానవునిభాష ఆకటితో మొదలైనది
అసలు మానవుని మాటే అమ్మతోడి ఆరంభము
స్తన్యము చైతన్యములో – స్తవనీయత కలదుగా
స్తనకాంక్ష కలుగగా – ఆంక్షల బతుకతనిది
రక్తమాంస మావిలోన – మాయావియె మానవుడు
యోనిద్వారమును దాటగ – యోగభోగ పురుషుడే
తల్లిఒడిని తల్లడిల్లి – బడిగుడిలో భాగ్యమొంది
భాష భావముల కలిమిని – భవసాగర తారకుడు
తెలియని వయస్సులో తెలుపు మలుపు లెన్నెన్నో

తెలివి కలిగి తెరలగా – అడ్డుతెరలు అదృశ్యము
కనులకు కనరాని – ఆశల సెలయేరులు
దృశ్యమైన అదృశ్యమే – దూరతీరముల గాంచెను
సుఖజీవన సౌందర్యము – మఖరూపముగా మారెను
క్రతువు క్రమము కమ్రమై – కర్మల మర్మము దెలిసెను
వాటమైన వసుధలో – వాటాలను వాంఛించెను
నిలుకడ కడలేనిదిగా – నిధుల వేట మొదలాయెను
నీటిబుడగ జీవితమున – నిత్యసత్య హత్య లెన్నొ
చావు తావు తెలియలేక – అంతా ఆశక్తియనెను
శక్తి తెలియలేని నరుడు – అశక్తుడై రక్తుడాయె
రక్తిరాజ్యమేలగా – రహికి ముప్పు వాటిల్లెను.

254

ఆగ్రహాల గ్రహాలకు అనుగ్రహము నిగ్రహమే
ఆవేశపు వేషాలకు ఆలోచన లోచనమే
మానవ నవసంస్కృతిలో మాటువడిన మమకారము
మూటతేట మరువములో గరువమొందు ఘనకార్యము
ఆకలికళ అందములో కలియుగ కలసాకారము
ఇంద్రియాల ఏలుబడిలో భోగ భువికి అధికారము
ఆధారము లేని భువికి ఆదరమే కరవాయెను
అవనియే ఆధారమయి మానవుడే అపహాస్యము.

జ్ఞానము సాధించుటలో జ్ఞేయము కడుదూరమాయె
విజ్ఞానము విజయమనీ విర్రవీగు విబుధులాయె
నిగ్రహమే నిమ్నమయి ఆగ్రహమే ఆవరించె
విగ్రహాల విలువలకూ ప్రగ్రహమే ఫలమాయెను.

చేసిన ప్రతిచేతలో చైతన్యము కరవాయె
కనుమూసిన కనుతెరచిన కలవరమే వరమాయె
మనసు మరచిపోయి జనుడు బుజ్జగించె బుద్ధినీ
తెలివి దెలిసి తెలవారగ తెల్లబోయె తెరువునా.

కరుణను వర్షించుటలో అరణమునే కోరెనూ
అరుణిమ పంచిన సూర్యుని అహరహమూ మరచెనూ
ఆశించిన అమరమే అదృశ్యముగా మారెను
భువిస్వర్గము కనబడగా అపవర్గమునే మరచెను.

వినయము నయముగా విజయము పొందునూ
ఓర్పు నేర్పు తీర్పుగా ఓనమాలు దిద్దుము.

255

ముందుచూపు తొందరలో – అందానికి బంధము
అందమైన విశ్వానికి – ఆశల సంబంధము
రేణువు రెపరెపలకు – రెల్లపూవులకు తపన
వేణువు అణువులకూ – రాగసుధల ఆలాపన.

అడుగుముందుకేయగా – అణగిపోయె అవని నిధీ
పోటీగా పోయిపోయి – ఆగి తలచె అతని విధీ
నేర్వలేని వేదానికి – నేర్పరితనమెందుకో
నేర్చుకొనుటె నెవ్వగయై – వగనొందెను మానవుడు.

దైవ దైహికములమధ్య – దారితెలియలేని నరుడు
మాయదారి మార్గములలో – మంచి చెడుల కనరాడు
మట్టి మంట మధ్యలో – వట్టిబూడిదే జనుడు
ప్రకృతి ప్రతిసృష్టిలో – వక్రవర్తి అక్రముడు.

క్రమంలేని నియమాలే – కదలికి రహదారులు
అమితమైన కామితములె – అధోగతికి మతిదారులు
ఆవరణము వరణమై – రణములతో నిండెను
ఆకాశ ఆక్రోశమె – అంతమంతమనుచుండెను.

నాశనమే అశనమై – నవ్యతలే బలిసెను
అలసిపోయి అంతరించి – అసలర్థము తెలిపెను
ముందుచూపు కన్నులే – వెనుక వెతలు మరచెను
మేధమేలి మలుపులలో – మేదినియే వర్ధిల్లును.

కాలం కరుణించలేక – వరజనుడే ఖిలమాయెను
కలకాలకారుణ్యము – జీవజయము నందించును.

256

ఆశల ఆమనిలో అనురాగసెలయేఱు
ఎఱుక ఎండమావిలో ఎదలు సేదదేరు
అపసవ్యములాయెగా ఆశలు ఎఱుకలూ
సవ్య సాధనము నందున సాగుశాంతికాంతులూ.

సినీమాయ మనీమాయ సింగారము పంచగా
మాయ జీవితమునందున మచ్చ నిత్యమాయెనుగా
సత్యము సహజముగా సహన భువిని సాగగా
నిత్యము నియమముగా నిర్ణయములు నిధులుగా.

జీవి జీవనమునందున జిలుగు వెలుగు లేదుగా
వనజీవన నవ్యతలో వాసి కలుగ లేదుగా
అనురాగము రాగముగా అవతరించెనవనిలో
సరాగాల సందడిలో సురాగమే సమతగా.

అమరనాద మధురిమలో సరిగమలే సరిగా
నాదజనిత జగతిలో వేదమె నవనినదముగా
తూర్పు తృష్ణ దీరిపోయి పశ్చిమమే పరవశం
రాత్రి తృప్తి దీర్చుకొనగ రమ్యమాయె ఇనునిగతి.

శీలము శీకరమై చిందులాడె చంద్రకాంతి
కాలము నిలుపలేని కమనీయత అరుణకాంతి
వసుధ శాంతి సుధలతో వసివాడి పోవగా
నరుడు నవ్య చింతనతో వరుడుగ నడువగా.

కాలచక్రగమనంలో వక్రత ఆమనిగా
సక్రమ నరవర్తనలో శాంతి సాధ్యమగునుగా.

257

కనులకు కునుకులేదు – కలిమికి కలతలేదు
కానరాని కామనలకు – కళ్ళెము లేనే లేదు
అందని అందాలకు – అర్రులు చాచుటలాయెను
అందిన అనుభవాలె – భవజనులకు భాగ్యములు.

కృత్రిమత్వ కురూపమే – అమరాకృతి అందము
సహజతత్త్వ సారమే – సారళ్యపు జీవనము
బతుకు బాధ భాగ్యమెగా – భువన భవన వాసము
మతుల గతులు మారగా – మారణమే వరణము.

సుమతి సుందరమ్ముగా – కుమతి కురూపమ్ముగా
పాపరూప రుజలతో – ఫలహీనము తనువుగా
ఆత్మశోధ ఆర్తిగా – కీర్తికరము ఆశయము
కోతిమనసు కోవెలలో – బుద్ధి శుద్ధి బద్ధముగా.

కోపమైన కోరికలే – శాపమాయె శాస్తిగా
ఓరిమితన ఆస్తిగా – నేరము నెవ్వగయెగా
సేదదేర్చు సేవలతో – సేచనమగు తనువులు
సేవల వల వలపుతో – చెలిమి చేరువగునుగా.

ధనము ధరణి ద్రఢిమను – దారుణముగ పడగొట్టెను
మనం మానవతలతో – మహిమహిమను రక్షిద్దాం
అపయశాల అలలపై – అసురనాట్యమేయగా
ఎదయశమే పదిలమై – అశనమాయె ఆశయమే.

కార్యకారణములందున – కలతకేమి నెలవు లేదు
కాలము కఠినముకాగా – కలవరమే నరుని బతుకు
శబ్దార్థ చింతనలో – అర్థార్థికి ఆశలేదు
పదార్థాల పరివేదన – చైతన్యపు చిరునామా.

258

వైపుల్యము వైభవం – వైకల్యము వైధవ్యం
రంగులలోకమిది – రాగములకు రాజ్యమిది.

318

అందనిదీ అందినదీ – విందొనర్చు వివరమిది
వినయానికి విజయమిదీ – వితరణలకు తరుణమిది
చింతల చిరునామాలో – వింత వివరణములివి
నవ్వుల నజరానాలో – జమానాల జాగృతి యిది.

సంతల సంతర్పణలో – అర్పించిన ఫణము యిది
ఆలుమగల అమరికలో – అరమరికల వరము యిది
వగల సెగల వరుసలో – మిగిలిన గిలిగింతయిది
కలత కాంతి కన్నులలో – కరిగిన కలకలమెయిది.

నీలినీడ జాడలలో – నివసించిన నిధియె యిది
ఎదనిండిన పదములో – ఎఱుకపంచు నాదమిది
భువన భాష భాసురమై – భూషించిన భావమిది
మలయానిల మాధురిలో – మధూదయపు మాన్యమిది.

హిమరసమే సరస్సులై – సాగిన నవ సారమిది
పల్లవాలు ప్రల్లదమై – ప్రభవించిన విభవమిది
లావణ్యము లలితమై – రవళించిన లవణమిది
మనసు మహిని మార్దవమై – ఆర్ద్రత అందిన వేళయిది.

అందని నందనవనికై – వందనమను సమయమిది
అనుభవ భువి అమరమై – రమియించెడి భాగ్యమిది
అనుభూతుల భూతికై – తపియించెడి తపన యిది
మానవతయె మాన్యమై – మమత పండు మహిమయిది.

259

కాల్పులు కాల్పనికంలో – కారడవులె కనుచూపులు
వినని చెవులవివరణలే – విలువలేని నీటిమూటలు
ఎన్‌కౌంటరు కౌంటరులో – ఎదల గుబులు దాచగా
ప్రచారాల ప్రగతిలో – ఆశయాలె శవములూ.

ఉద్యమాల ఆయుధాలు – ఉర్వినిండి ఉరుకులెత్త
అధికారపు ఖాఖీలకు – ఆహుతాయె నవనిలో

ఎదురుదాడి ఎఱుకలో – ఏమఱుపాటాయెను
బందూకుల బంధనలో – బలిపశువులు బలహీనులు.

కూంబింగుల కూటమితో – కూలెను నవ విప్లవాలు
బాంబింగుల బలముతో – బద్దలాయె బతుకులు
సాయుధ పోరాటంలో – సమానతకు మాన్యత
ఆయుధాల ఆలంబన – అర్థ సమతకే మమత.

పాలకజన వాలకమే – పాలితులకు శాపమయె
జనవిప్లవ జాగృతియే – జాతికి శ్రీరామరక్ష
అణచివేయు ఆకాంక్షలు – అడియాసగమిగులును
రగులుతున్న గుండె మంట – కాల్చివేయు కార్చిచ్చుగ.

ప్రజాయుద్ధ పద్ధతిలో – ప్రతినిధిగతి మారును
పోలీసుల రక్షణలో – బతుకుగడుపుటయె సిద్ధము
చర్చల వేదాంతంలో – అంతుపొంతు కానరాదు
ఎత్తుల పైయెత్తులలో – చిత్తశుద్ధి సుంతలేదు.

తెలంగాణతేరుకొనదు – రాయసీమ రాజుకొనును
ఆంధ్రమందు సాంద్రమగును – ఆపతరముకానిదగును
సామాజిక ఆజిలో – సామజమే బూర్జువా
విప్లవాల వినువీధిని – విజయమె విధి జన ప్రేరితము.

260

జననం జయించింది – మరణం మరణించింది
జనాభాయె భాసురమై – ఆభాసము అవనిబతుకు
మూఢత గాఢతలోనా – మూలబడియె ముద్దుజీవి
నీరునారు ఎరువు వేయ – నిధుల పంట నిమ్నమాయె.

ఆర్వందలకోట్ల జనులు – అవనికి భారమ్మాయెను
అవిద్యయే ఆలయమయి – అభ్యుదయము వధ్యమాయె
పేటలలో పేదరికం – పేలవమయె ఆరోగ్యం
పల్లెల్లో వసతులన్ని – పల్లములో బడిపోయెను.

పుష్టినిచ్చు ఆహారం – పూజ్యమాయె విశ్వమందు
కొట్లాటలు కాట్లాటలు – కోరితెచ్చె నరమేధం
భోగభాగ్య భోక్తలంత – భువన భవన సారథులు
ఆకటి దప్పుల ఆర్తులు – చీకటి చింతల కీర్తులు.

ప్రణాళికలు నాళికలై – ప్రయోజనము శూన్యము
జననియంత్రణములోనె – మనబతుకులు మాన్యము
చైనా చైతన్యముతో – చేరవలెను గమ్యము
జాపాను జాగృతితో – జనగణ్యత సాధ్యము.

పట్టెడు సంతానముతో – పుట్టిమునిగిపోతుంది
పట్టెడన్నమైన లేక – ప్రగతి గతులు దప్పుతుంది
నీరింకెను నిధులింకెను – నిత్య కరువు తాండవము
అందరి ఆక్రందనలో – క్రిందాయెను జనజీవిక.

జనమేధల మథనంలో – జనియించిన ఆలోచన
ఆశయమై అతిశయించ – అవని నవ్య నందనమే.

261

రథయాత్ర రమ్యము – నరుయాత్ర నాణ్యము
జగన్నాథ నామముతో – జనునియాత్ర జయకరము
మానవుడిట మాన్యతకై – దైవరూపు సృజియించెను
మానవుడే దేవుడై – మహిమహిమను గమనించెను.

రుచ్యమైన రూపానికి – వాచ్యము వరపైనదిగా
నామకరణమును చేయగ – కామనలే తీర్చుకొనెను
దారులోహశిలలతో – దారుఢ్యము కల్పించెను
తరతరాల మన్నికకై – వరపురాణముల చేసెను.

వేదము దైవమనీ – వాదము నరునిదనీ
వేదవాదవెలుగులో – వేదనలను దమియించెను
మంగళగళముతో – సంగీతము సవరించెను
కవితల తలమానికమై – కలతలన్ని మరచెను.

కర్మభూమి కర్మలలో – మర్మములను దెలిసెను
ధర్మధరణి వర్తనలో – కీర్తి సుధల గురిసెను
మధ్యమిథ్య వధ్యమనీ – మగత నిదురలో నిండెను
జగమంతా నశ్వరమని – ఖగరీతిని ఎగిరెను.

మూడుకోట్ల దేవతలకు – ముకుతాడు వేసెను
కొత్తకొత్త దేవుళ్ళను – కొలువు దీర్చి మురిసెను
అయస్కాంత శక్తితో – అందముగా చేసెను
హుండీలతొ హుందాగా – జనకాన్కల గ్రహియించెను.

జవహీన జియ్యరులను – చిత్తముతో వదిలెను
జీవవంత మాంత్రికులను – దినదినమును కొలిచెను
మోహము వాహకమయి – మోదమదము నిండెను
అవసానము సమీపించి – ఆశయముల వల్లించెను.

262

గంటముతో మంటరేపి – తాటాకుల తనువు చీల్చి
తపనదీర్చు కవితలల్లి – తరియించిరి తాపసులు
న్యాసమె భువివ్యాసముగా – వ్యాసుడు విన్యాసము చేసెను
భారతముగ భాసించగ – ఇతిహాసము హితమెంచెను.

వసుధలోని వల్మీకము – వాల్మీకికి వాసమయ్యె
క్రౌంచపక్షి వియోగమే – రామకథగ రమ్యమాయె
పోతన పోసిన పోతలొ – భాగవతము భాగ్యరాశి
మధురభక్తి మాన్యముగా – కృష్ణలీల తృప్తిజేసె.

భారతీయ భాషలన్ని – పవిత్రమై ప్రగతిగాంచె
భారత రామాయణముల – భాగవతము భాసించెను
రసపూరిత రచనలతో – సంస్కృతమే సాగరమ్ము
ఆంధ్రము జనసాంద్రమయి – అనుభూతితొ తరియించెను.

సిరాలోన సిరులు నించి – అక్షరముల నమరించి
అందమైన కవితలతో – అలరించిరి అందరినీ

మనసుపైన ముద్రవేసి – మానవతను నిండించీ
పండించిరి పరమార్థము – వందించిరి వసుధను.

కలము కులము కలరవముల – కలియుగమును కామించెను
కామందుల కావరమును – కార్చిచ్చుల కాల్చివేసె
సమాజాలు ఇజాలతొ – మాజామత్తులో తేలగ
నిజ ఇజమే నీతిగా – జాతినిద్ర వదలించిరి.

తల్లి స్తన్యమందున్నది – తన తనమే చైతన్యము
అన్యుల కదియోగించగ – ఆశయమది అమరావని.

263

సాంకేతిక సంకరము – సంతలోని వింతాయెను
సుంతైన శుభములేక – భవవిభవము నశియించెను
వ్యాపారము వ్యావృతమై – వృత్తివృత్తమాయెను
కొని అమ్మెడి కోరికతో – కోల్పోయెను కోమలతను.

ఉన్నవాడి జమానాగ – వృత్తివిద్యలుండెను
లేమి లేవడిగ మారగ – వడిహెచ్చెను వరులకు
రాజకీయ రాసభములు – రభస చేసి రసహీనము
మేధావుల వలసలతో – మేలిమి మైలగ మారెను.

లెక్కల చదువులో – చక్కదనము చిక్కదు
మానవాళి మహిమలో – మమేకమై మనవలెను
విజ్ఞతకై విజ్ఞానము – జీవికకై ఉద్యోగము
చదువులలో సారమంత – సంపాదన సరళికాదు.

శాస్త్రము శస్త్రముకాదు – అవని వృద్ధికది అస్త్రము
సాంకేతిక కేతనమే – సామ్యవాద సంకేతము
మార్కుల చదువులతోడా – మార్గం సుగమం కాదు
అర్కుని ఆంతర్యమెరిగి – అవని అంతరము దెలియుము.

పదార్థాల మేళవింపు – చైతన్యపు చెంగలింపు
పరికరాల ప్రభవమ్మే – ప్రగతి జీవ పరిణామము

శక్తిలేక పృథివిలేదు – చైతన్యమె మానవుడ
కలగలిపిన కథసారం – కామనల పరిష్కారం.

టెక్నిక్కుల టాలెంట్‌లో – టెక్నాలజి వికసనము
శోధ భోధ శోభించగ – యోధుడెనవమానవుడు
రసాయనము రస్యమై – రమ్యమగును భువనమంత
సాంకేతిక సంక్రాంతి – సాధ్యమగును సాధనలో.

264

ఆలయాల అధోగతి – ఆయుధాల సంగతి
అమరానికి ఇదేగతి – మరణానికి మరోగతి.

గతిదప్పిన నరునికీ – శృతియే శృంగారము
జీవన వనవాహినిలో – నవసంస్కారము రీతి
సంపద పదనిసలతో – సాగుచుండె విశ్వమంత
అనురాగము విరాగమై – అరుణరాగమై వెలసెను.

అనుబంధము అణుబంధము – బంధుత్వము బధిరత్వము
భయ బాధల భావనలో – భువనమంత వనతుల్యము
కొత్త కొత్త ఆయుధాల – కొలువైనది ప్రపంచము
నూతనమౌ ఆలయాలు – దేవుళ్ళకు దేవిడీలు.

సృజియించిన ఆయుధాలు – సృష్టినాశహేతువులు
నరుని సృష్టి దేవతలై – వరవర్తన నందించిరి
ప్రళయానికి ప్రగతికీ – పరిశోధన సాధనము
ప్రకృతియే వికృతియై – ప్రాకృత సంస్కృతి మిగులును.

సమానతా వేదంలో – వాదాలకు తావులేదు
వివాదాల విలువలలో – విగతించును విశ్వశాంతి
ఆయుధమే భయమాయె – భయమే భవశత్రువాయె
ఆలయమే లయమాయె – అదియె వినశనమ్మాయె.

వినశనమే వికసించి – విశ్వమునశ్వరమగును
వివేచనే విజయమంది – విశ్వవిలువ వశ్యమగును

ఆలయ ఆయుధములే – అవనిజనుల కాలంబము
ఆధ్యాత్మిక ఆత్మికములు – అందరికీ అవసరములు.

265

అధికారపు ధిక్కారం – అహంకార హుంకారం
ఆశల హాహాకారం – ఆశయమది సంహారం
పదవీ మద వ్యభిచారం – ప్రతినిధి కది ఆచారం
భోగజనుల లాలసం – త్యాగజనుల ఘనయాగం.

అమరానికి సమరం – మానవునికి మరణం
గహనంలో పయనం – గమ్యానికి అవరోధం
విప్లవాల విజయం – వినోదాల విలాసం
చదువుల సంరంభం – అమ్మకాల అపయశం.

ప్రకృతి కృతి వికృతం – పరమాత్ముని ప్రాభవం
అనావృష్టి తాండవం – అతివృష్టితొ అంతం
మనసులలో మాలిన్యం – మాటలలో మాధుర్యం
చేతలలో చైతన్యం – చెలిమి బలిమి భావనం.

ఇంద్రియాల సాంద్రత్వం – ఇంపులొలుకు నరుభోగం
మనసు మహిమ మార్ధవం – బుద్ధి భువన బాంధవ్యం
పురుషార్ధపు పూజ్యత్వం – పరుషార్ధం పంకిలం
గుణగణాల గూఢత్వం – రజస్తమో సాత్త్వికం.

కర్మఫలం కలవరం – కాలమహిమ కలియాగం
ఆత్మశోధ ఆలంబం – సాధనకది సహకారం
మాన్యమాత మమకారం – మనందరికి కవచం
ప్రేమ పేర్మి ప్రేరకం – అనురాగపు ప్రాకారం.

మంచి మమత మహికి జయం – మానవతయె మననైజం
కోరికలకు బహుదూరం – కోమలతకు సమీపం
జాతీయత జాతకం – పాతరబడు వాలకం
దేశభక్తి దేవళం – దైవరహిత దారుధ్యం.

రాజకీయ రాసభం – సభలోనది సంరంభం
రామరాజ్య రాజసం – కాములలోనది పూజ్యం.

266

అమరవీరులు – ఆశయపు ధీరులు
సమరావని సారథులు – సహగమనపు సాహసులు
ప్రాణం విడువగా ప్రభుతను పండింతురు
ప్రాణం పోయగా పరమార్థము సాధింతురు
రాజ్యము పూజ్యమనీ ప్రజలే దేవుళ్ళనీ
రక్తధారలిత్తురు అనురక్తిని అందింతురు
పరమాత్మను జేరగా ఆత్మసంస్కారులు
జీవనమున నయమున అనయము వర్తింతురు
విలాసాల కులాసాల విజయమునే కాంక్షింతురు
విరోధాల విలాపాల విలువలనే కోరుదురు
తనవారు పెరలనే తరతమ భేదము లేదు
మనమనుభావమే మహాభాగ్యమగు వారికి
మంచితనం మమకారం కాంచనమని భావింతురు
వంచనలకు వైరములకు వధ్యములై వసియింతురు
వీరమాత బిడ్డలై మాతమహిమ రక్షింతురు
దేశమాత దేవుళ్ళై దేహములను విడుతురు
స్వర్గం అపవర్గములా శుభముల శోభింతురు
వర్గరహిత వాహినిలో దుర్గములై కనబడుదురు.
ఉన్మాదుల ఊహలకు ఉరితాళ్ళను కట్టుదురు
దురాక్రమణ దుర్మదులకు ధర్మపథము నేర్పుదురు
తరతరాల దాస్యానికి సెలవు చెప్పుసేవకులు
స్వాతంత్ర్యపు తంత్రములో మాంత్రికులు యాంత్రికులు.

267

కవ్వింతల వింతలో కాంతికి రణమున్నది
నవ్వింతల నవతలో నదినర్తనమున్నది

గిలిగింతల గిలిలో చెలితలమానికమైనది
తలపోతల పోతలో తారుణ్యము కల్గినది.

కుటిలకురుల కూటమిలో కటికచీకటున్నది
జడవాలు కొప్పులో జాజిమల్లె మరులున్నవి
ముఖచంద్రుని ముందరే అరుణకాంతి అమరినది
తుమ్మెదలెద పదిలమై తూర్పుకనులు తెరచినది.

చిరుపెదవుల పంటలో సిరుల విరులు పూసినవి
చెక్కిలి చక్కెర కెనయై పక్కపలచబారినది
అరనవ్వుల రువ్వులే అందానికి వందనములు
మేని సరుల రుసరుసలే మేలిమి మెరుపుల వరుసలు.

అర్కుని సంపర్కములో సంస్కారం కలిగింది
చంద్రుని బంధుత్వంలో చెరసాలే బతుకన్నది
కోపతాపకొలువులో కోరికలకు నెలవున్నది
మనసుల మాన్యములో మరోఫలము వలపైనది.

శబ్దార్థ చెలిమిలో అర్థార్థుల అనుబంధం
భావార్థ భంగిమలో భామ భాగ్య సంబంధం
ఆడతనం ఆమెధనం వినియోగమె దానిగుణం
మగవారి మనుగడకై కడవరకది కాంతికరం.

పరవశమే పాయసమై పరమసుధల నందించును
వయసు ఊసులేనిదై వలపు పంట వనితతనం
మాతల మాతగా జామాతల జవ్వనిగా
సృష్టికార్య శుభమునకు విభవపు చిరునామాగా.

అబల బలం అనుభవమై అనయమునయమెంచగా
తరతరాల తారుణ్యము తల్లి ఆలితపనగా
వేదం వెలదిగా గీతయె నాతిగా జాతి జాజ్వల్యమే.

268

తరం తరం నిరంతరం అంతరాల నవతరం

వింతవంత చెంత భయం నిరాశకిది నిజ నిలయం
ఆశలకాసారం అడుగంటి పోయిన మాట నిజం
అవకాశ వాదానికి లోకమంత లోకువైన వైనం.

వేగం వేగమనీ వెతలతోటి ఆగమైన విధం
భయంలేని బతుకుతో బంధుత్వం కోరుట గహనం
వినాశమున విజయమెంచు విభుల విభవ అనుభవం
ప్రళయ లయలో పరవశతను భావించెడి భవ్యుల అభయం.

ఓంకారము ఓదనమయి సహకారము కాంక్షించెడి తరుణం
వేదము వేదన నణచగ వెలుగు వర్షించిన సమయం
ఆకారము వికారముగ అనుభవించు అవనిజనుల ఆశయం
జనాశయము ధనాశగా దారిలేని ప్రయాణంలో ప్రమాణం.

స్వార్ధాశ్రమ శోభనానికి శుభముహూర్తం సూర్యుడస్తమించిన సమయం
పరార్థాన్ని ప్రతిపాదించే పార్థులు గీతాచార్యుని మదిలో నిదురించిన వైనం
ఆశయ శయనాగారంలో ఆశలకూ అనుభవాలకూ పొంతనలేని విధం
అమరాన్నాసించి అరమరికలు లేని ఆశతో అనుగమించే గమనం.

జననమరణాల జతులూ గతులూ మతమాన్యంలో సతమతమయ్యే గతం
పొరలు కమ్మిన పోకడలకు కడదాకా పొడసూపని కారుణ్యపు వరణం
సుఖం సుందర నందనవనికి దారిచూపితే భవానుభవం శూన్యం
దుఃఖం దూరతీరాలను చేరువచేస్తే దురితం హితానికి హతం.

అంతరంగం అమాంతం వీరంగంవేసే విబుధుల తరం తామసం
అంతా మంచిదనిపించే అమాయక ఆదర్శానికి దృశ్యం దూరం
కానిదానికి కామన అయినదానికి ఆర్తి అసమర్థ జీవలక్షణం.

269

లేజర్ కన్నులే లేలెమ్మని అంటున్నవి
రేజర్ పెదవులే రారమ్మని పిలిచినవి
మైక్రోస్కోపు మనసు స్కోపులేనిదైనది
మ్యాజిక్కుల మ్యూజిక్కులు చిక్కుల ముడివేసినవి.

బుద్ధిబూడిదైనది - బురద వరదలో బడ్డది
ఆత్మ అంతు తెలియనిది - అంతమె తనరూపమన్నది
చెక్కిలి చుక్కలో - పొక్కిలి పక్కలో
చిక్కిన చెలిమిలో - మిక్కుటమౌ వలపుతో.

అందానిబంధమేసి - బందీనై నిలిచాను
వందనమని ఒప్పుకొని - తప్పును తరిమేశాను
కలయికలో అలయికలో - లయగీతిక లావణ్యం
పరవశాల వశంలో - పలుకుల ఉలుకే మౌనం.

మోనోలిస అమ్మాయీ - మోజేమో మహలెస్స
రోజు రోజు రోజుతూ - రోజానై పూజిస్తా
సన్నని ఓ అమ్మాయి - సరసానికి వరసౌతా
సురశాలకు కొనిపోవే - సరసామృత మందివ్వే.

కోకగొడవ పెడుతుంది - కాక కలవరిస్తుంది
కాకిగోల వినబడదా - కలతల కథ కనబడదా
ఆకలి అంబరమంటె - రంభ రుచిని రసియించి
సంరంభం సంగరంగ - గరం గరం రుచిచూద్దాం.

ఫాస్టు ఫుడ్డు టేస్టు నీది - మినరల్ మించులు నీవి
వేస్టు చేయకమ్మ ఏజి - రోస్టుచేసి రుచిచూపు
కంప్యూటర్ మెదడులో - కలలెన్నొ దాచావు
ఇంటర్‌నెట్ నెట్టులో - ఇంపు సొంపు నింపావు
నవలా నీనవ్యతకే - నేనిస్తా నమస్కారం.

270

అధ్యయనం అధ్యాపన - అహరహమూ అవసరమే
వినయం విద్యార్థికీ - విలువలు అధ్యాపకునకు
అనయం ఆసంబంధం - అనుబంధము అనవలె
విధులన్నీ వివరము - విద్యార్థుల కదివరం.

బాధ్యతయే భాగ్యము – భవతారక మంత్రము
మనసుమైనసైనదేమో – వయసు దూకుడైనది
బుద్ధి శుద్ధి విడిచెనేమొ – మెదడు చవిటి పర్రైనది
కళలశాల విలువలూ – కాలగతికి గతుకులు.

పౌరజనుల పదములు – పదవుల దాసోఽహములు
పునాదిలో పూజ్యమయి – అనాదిగా అమరమయి
ఏమరుపాటైన ఎఱుక – మదినిండక మరణించెను
ప్రయోజనము యోజనగా – ప్రమాణమే పతనమాయె.

మానహీన మాధ్యమమై – మానవాళి చెఱచుగా
ఆచరణే చరణమయి – అంటియుండె భూమిని
ఛాత్ర చరిత మంతయు – చర్విత చర్వణమాయెను
సృజన శూన్యమైనది – ప్రతిభ అతిగ మిగిలినది.

వర్తన కార్తాంతికమై– జ్ఞానము గతి మారినది
లేనిది ఉన్నది ఉన్నది లేనిది – లేవడి జనవాదనైనది
మధ్య మిథ్య మానవతగ – వధ్యమాయె వరజీవులు
కామన కాలమై – కలకాలము కామించెను
విలువల కాలముగా – విమతులంత తెలియవలెను.

271

ఆలినమ్ముకొన్నవాడు హరిశ్చంద్రుడాయెను
ఆలిని అనుమానించినవాడు రామచంద్రుడాయెను
ధర్మపత్నినొడ్డినోడు ధర్మరాజాయెను
ఆలుమగలు భారతాన భాసించిన వైనమిది.

అమ్మను తెగనరికినోడు అవతారమాయెను
అమ్మలేని దేవతలే అందరికీ పూజ్యులు
అమ్మకథల అనురాగం అవనికదియె నవగీతం
కారుణ్యపు కథలలో కవిత కలకలమ్మాయెను.

తారుణ్యము వర్షించగ తల్లి తపన తీరెను
ఆరారు విధముల అతివను మతిమంతముచేసిరి
అవనియె అమ్మగా అందరునూ నందించిరి
తల్లికి వందనం తనయులకది నందనం.

అనురాగపు సరాగం అందరికది పరాగం
అమ్మదె ఆశయం అందమైన జీవితం
మాట మనసు మరువం మనజాతికి వరం
అమ్మలోకమే అభ్యుదయపు సంకేతం.

భారత సంస్కృతిలో భాగ్యదాయి మన అమ్మ
దివ్యకథల రూపంలో దీటైనది మనయమ్మ
ప్రేమామృత సేచనతో పెంచుమించు తల్లి
ప్రేమ హిమాలయముగా కరగిపాఱు గంగగా.

ప్రాణంపోసిన అమ్మకూ ప్రాయము తరుగుగా
జన్మనిచ్చి మురియగా జాజ్జ్వల్యము బతుకుగా
పేగుపాశ మగునుగా ఆగని మమకారముగా
బాధలన్ని అనుభవింప భవబంధము భాగ్యముగా.

272

భోజనం భోజనం విందు భోజనం
వివాహ భోజనం – విలాస భోజనం
కులాస భోజనం – పలావు భోజనం
శాకపాక సరళిలో – శక్తి పంచు భోజనం
ఆకలి అవహేళనకు – అందమైన భోజనం
పంచభక్ష్య భాగ్యంతో – పరమాన్న భోజనం
త్రిగుణాత్మక తీరుతో – తియ్యనైన భోజనం
నవధాన్యపు నాణ్యతలో – నవ్యమైన భోజనం
మాంస మసాలాలతో – మజా నింపు భోజనం
పప్పణ్ణం ధప్పళముల – పరమార్థ భోజనం
స్వీటు హాటు సిరులతో – చింతదీర్చు భోజనం

ఘుమ ఘుమవాసనలతో – గుబాళించు భోజనం
ఫాస్టు ఫుడ్డు కేకులతో – వేస్టుకాని భోజనం
విటమిన్ ఫుల్ ఫుడ్డుతో – వింత గొల్పు భోజనం
భారతీయ చైనీయుల – భాగ్యమైన భోజనం
పాశ్చాత్యుల ప్రాచ్యుల – ప్రాభవమౌ భోజనం
ఆవకాయ గోంగూరల – ఆంధ్రజాతి వంటకం
వంటకాల వడపిందెల – వరపైన భోజనం
కొత్త కొత్త రుచులతో – కోరుకొన్న భోజనం
ఫైవ్‌స్టార్ హోటళ్ళలో – పరవశమౌ భోజనం
వీధి మెస్సు మెనూతో – విలువైన భోజనం

273

కాశ్మీరం కలవరిస్తోంది – గుజరాతులొ గుబులు రేగింది
పాకిస్తాన్ పలకరిస్తుంది – భారతమే బావురంటుంది.

ఉగ్రవాద ఊరిలో – అగ్రవాద భేరులు
శాంతికామ దేశంలో – మతఛాందస వీరులు
అధ్వాన్న గృహంలో – అద్వానీ వాదనలు
సరిహద్దుల సదనంలో – జార్జీల జాగరణలు.

మోడీల మోదంలో – మోసానికి మార్కులు
గోద్రా గోదాలలో – గొవులె బలిపశువులు
ఊచకోత ఊసులో – కోతల వత్తాసులు
చొరబాట్ల పాట్లలో – చొప్పదంటు ప్రశ్నలు.

ఊదర ఉన్మాదంలో – వాదరకే సన్మానం
అణుయుద్ధ భయంలో గణతంత్రం గుర్పాటు
పోటా పోకడలలో – సపోటా సంగతులు
సంస్థల అమ్మకములో – సారధులకు వాటాలు.

ప్రజల నమ్మకాలను – వమ్ముచేయు వంచకులు
పదవుల పదిలమ్ములో – పంచదార వాక్కులు

బుకాయింపు బుద్ధిలో – ప్రచారంపు ఫలములు
హైటెక్కుల టెక్కులో – అతిసామాన్యుని వేదన.

అభివృద్ధికి ఆదియనీ – అధికుల సంభాషణ
వనరుల వినియోగంలో – వానరులే మనవారలు
సమానత్వ సాధనలో – మానము విడిచిన వారలు
సిద్ధాంతం చిందులేయ – పార్టీ వారలు పందలు.

భరత రాజకీయంలో – ప్రతినిధులే రాబందులు
అవినీతి నిండెనుగా – అనంతమౌ విశ్వంలో
వెతుకుట గతుకుట కాయెను – వేకువలో చీకటిలో
ప్రశ్నమిగిలిపోయింది – కుశలం కుంటుతుంది
కుటిలత కాటేస్తుంది – కూలిపోవు జనుని బతుకు.

274

కోక కేక వేసింది – కోపం కొండెక్కింది
రైకరంగు పొంగింది – రోషం దిగిపోయింది.

చందమామ చెప్పింది – అందమంతనీదేనని
సన్నజాజి నవ్వింది – సంగతి సౌగంధ్యమని
మల్లెపూవు మరువము – మనసు మహిమ పరువము
ప్రాయం పరుగెత్తింది – హంసపదము ఆగమంది.

నెమలి నాట్యమేసింది – నెలత నెనరు నిండింది
చిలుక పలుకు పలికింది – సిగ్గుమొగ్గ తొడిగింది
ఎద ఎదిగీ ఎగిరింది – మది దివిగా మారింది
పెదవి వెనుక దాగింది – అనురాగపు రాగమే.

నాదమె నది ఘోషగా – నవగీతిక పాడింది
మధురామృత మానసమున – స్వర్గశోభ వెలసింది
నవశోభన భవనముగా – నందనమే నిలిచింది
అందని ఆ అందంలో – అమర తరువు పూసింది.

కామధేను కామనలో – కలికాలమె పండింది
నీమేనితల్పముపై – నిత్యం కలగాంచగా
కల ఇలలో కలవరమై – వరదీవన లందించెను
వసుంధరే వసంతమై – సంతసమే కలుగగా.

తనమనధనములన్ని – తపనకు తర్పణలాయెను
కోమలతే లతగా – కొనసాగెను కోరికగా
లతపూవున నామనసే – లయించెగా లాహిరిలో.

275

తెలుగు మగువ తెగువలో – తెరలిందొక కెరటం
ఆంధ్రసంద్రమందదియే – అమరమైన ఆశయం
మానవాళి మహోదయము – మహనీయ కీర్తికరము
ఆర్తుల నాలించుటయే – ఆయమ్మకు ఆనందము.

స్వాతంత్ర్యసమరంలో – స్వామిభక్తి పండించెను
మహాత్మునికి చేరువయై – మానిని మాన్యమ్మాయెను
అబల బలం అధికమనీ – అందరినీ మేల్కొల్పెను
గాంధీగారి సిద్ధాంతమే – నిత్యమాయె కృత్యము.

దుర్గాబాయి దుర్గము – మహిళ మానప్రాణములకు
గృహసీమలె గురుతులు – తరగని మమకారమునకు
తేదీలు లెక్కలతో – తేలదుగా ఆమె స్ఫూర్తి
అందరి హృదయాలలో – అందమైన గుర్తు అది.

తనమనధనములను – అర్పించెను అతివలకై
భాగ్యనగర భాగ్యమే – బాగైన ఘనసంస్థలు
పేదమహిళవేదనను – మనసారా గ్రహియించెను
సంఘంలో స్త్రీజాతికి – సాహసమే ముఖ్యమనెను.

అవిద్యయే ఆడవాళ్ళ – అతిబలహీనతయనెను
గృహిణి విద్య నేర్చుకొన్న – గృహమే విద్యల నిలయము
దేశముఖ్ దేవునిగా – ఆమెకుతోడుండెను
నవలాజన నాణ్యతకై – దశదిశలా పయనించెను.

ప్రచారంపు ప్రభావమే – పలువురు కనుదెరచిరి
మానిని అభిమానమే – మాననీయమహనీయము
ఆంధ్ర మహిళా సభను – ఆమెయె స్థాపించెను
అదియే భువి విస్తరించి – ఆమె కీర్తి చాటెను.

మహత్కార్య సాధనలో – మనదుర్గకు సాటిలేరు
దుర్గాబాయి దేశముఖే – ఆంధ్రమహిళ కాదర్శము.

276

**పరంధామ పథం**

హయగ్రీవ హయగ్రీవ – హయగ్రీవ పాహిమాం
హయగ్రీవ హయగ్రీవ – హయగ్రీవ రక్షమాం.

దేవుని అవతారములు – దేహికి ప్రతిరూపములు
అంతరంగ ఆస్తికతకు – అర్థమైన ప్రతిమలు
అశ్వశక్తి అతిశయము – అశ్వహేష అనురాగము
అశ్వమె ఆదిమ జంతువు – మానవునికి మాన్యము.

సప్తాశ్వుడు సూర్యుడు – సరళి సప్తవర్ణములు
భానుడె భవమున దేవుడు – వేవెలుగుల వేద్యుడు
హయనాదము ఓంకారము – అదివ్యాప్తము విశ్వమందు
అశ్వనరుల రూపములో – ఆదేవుని గమనించుము.

దుష్టుల రక్షించుటలో – శిష్టుల రక్షించుటలో
క్షితిజనులను కాచుటలో – మతిమంతుడె ఆ విష్ణువు
వేదవేద్యుడాతడగును – వెలుగునిచ్చు వేల్పుడగును
వాక్కువాసి వాల్లభ్యము – నరవరులకు అందించును.

అవతారము కల్పనమే – అందదు హేతువునకది
కార్యకారణములలో – కరణమునకె ప్రాధాన్యము
శబ్దశక్తి చేతనులై – తనువుల రూపం చేసిరి
అసురత్వము సురత్వము – అవనిజనుల మతిలోనివి.

పదముల పదనిసలలో – పరవశులై నమ్మెదురు
ధైర్యసాహసములె రక్ష – విశ్వాసము శ్వాస విగత
మానవతే అవతారము – మహిలోనిక వేరులేదు.

జీవి జీవనమ్ములోన – జిలుగు వెలుగు యోగమగును
భావి జనుల భాగ్యానికి – భావజాల భాషయగును.

277

శుక్లాంబరముల – శుభసందేశం
సూర్యనికేతన – సుందరవేదం
బ్రహ్మకుమారీ – భాగ్యభావనం
ఈశ్వరీయమతి – హితమతమార్గం.

గీతాచార్యుని – చేతన చెలువం
ఆత్మసాధనకు – ఆస్తికరంగం
నరవరనడతకు – నవ్యసంకేతం
పరమాత్మునికీ – పర్వ సంగీతం.

మనసుల మలినము – మసిచేయునది
మమతల సమతల – మాకందమిది
తృప్తీ తృష్ణల – తుది వివేకమిది
మానవత్వపు – మహిమాన్వితమిది.

శివబాబాయే – శివభరితమ్మగు
జగమే ఖగమగు – ఆస్తులు అణగును
శాంతి సౌఖ్యములె – శక్తి నిలయములు
వికార విలువలు – వినశ్వరమ్ములు.

నియమమె నిధిగా – నీతియె విధిగా
నిత్యవర్తనము – సత్యవర్తనము
ధర్మధారణము – దారుఢ్యమ్మగు
కర్మవర్తనము – కమనీయమ్మగు.

సాహసమే – సరసార్థ సాధనము
నారాయణుడే – నరుడగు మార్గము
నారీమణియే – నవలక్ష్మియగు
జీవజగములకు – జిగిబిగి కలుగును.

278

తృప్తిలేని మానవాళి – తృష్ణదీర్చుకొనుచుండిరి
అవతారపు అవమతులతొ – అందనియా పరమునితో
విరాట్పురుషుడొక్కడనీ – వెలుగురూపు జగతియనీ
విబుధులు శోధనచేసిరి – సాధకులై సాగిరంత.

పరంపరల పావనమై – వన సంస్కృతి నవ సంస్కృతి
తత్త్వార్థుల తపస్సుతో – స్వత్వమునే గ్రహియించిరి
జనించుటా గతించుటా – జగతి కర్థమని చెప్పిరి
జయమునకై గమనమనీ – పాతర్థము మార్చివేయు.

పరమాత్మా జీవాత్మా – వరద్వైతము అద్వైతము
వాక్కులలో వరపునొందె – తెలియనిదై తేలిపోయె
గాడిదప్పి గమించగా – గహనమాయె బతుకులు
తానెందుకు పుట్టాడో – బతుకుట మరి ఎందులకో
తెలిసికొనే తెలివిగలిగి – తెల్లబోవు జనుడెందుకొ.

అనుకరణము కరణమనీ – త్రికరణములు మరచిపోయె
ఆనందమె అవధియనీ – ఆత్మ తత్త్వమును మరచెను.

రూపములే రుజలాయెను – నామములే నశ్వరములు
నిత్యమైన శుద్ధాత్మలు – సత్యబద్ధ జీవనములు.

మూఢత్వము ముద్దుపంచె – మర్మకర్మమనసునిండె
మాన్య మానవత్త్వమేమొ – మరుగున బడి విరిగిపోయె.

పరమార్థము పంచుకొనుట – అవతారములసలు కావు
తృష్ణ తృప్తి మానవులవి – అవతారములసలు కావు.

279

అనురాగబంధనం – అన్యోన్యత సంబంధం
సోదర సోదరి బంధం – శుభరక్షా బంధనం.

అమ్మనాన్న రక్షగా – అతివ ఆర్తి విడిచినది
పెరిగి ప్రేమ పంచినది – ప్రతిరూపము బంధనమిది.

తోడునీడ కలుగగా – వాడనిదీ వసుధలో
అనుబంధము ఆస్తిగా – అమరిన సోదర బంధము.

ఆకాంక్షలు తీరగా – ఆశయాలు పండగా
అనుభూతియె భూతిగా – అతిశయమీ బంధనం.

ఆంక్షల బతుకులో – అన్నగారి రక్షణలో
అతివ బతుకు మతిమంతం – అమరగమన అనుబంధం.

రక్ష కరవు జగతిలో – రాక్షస నవసంస్కృతిలో
రక్షధైర్య మిచ్చునుగా – కక్ష శిక్ష కలుగదుగా.

ఆడది ఆడదనే – ఆకాలపు అనుభూతికి
ఆడది ఆస్తియనే – ఆధునికత అతిశయం.

పుట్టిల్లూ మెట్టినిల్లు – పూజ్యమగును పడతికీ
హృదయమనే నట్టిల్లుకు – సదయపంచు సారసాక్షి.

పిన్నలకూ పెద్దలకూ – ప్రేమ పంచు పెన్నిధిగా
కుడిచేతికి కూరిమిగా – వెలుగొందును రాఖీయే.

రాఖీ సఖి రమ్యతలో – ధన్యులుగా జనులెందరొ
శోభలోని విభవమంత – సుఖకరమౌ జీవనయే.

పండుగ పండుగ కొరకేనని – పరమార్థము తెలియలేని
నరవానర సమూహాలు – వరజీవన గతిశూన్యులు.

సంప్రదాయ సంగతులే – సదాశయపు గతులౌను
మంచి పాతదైన గాని – మాన్యముగా స్వీకరించు.

సోదరి కోరిక నెరిగీ – శుభకరమౌ బహుమతులను
శక్తి కొలది చెల్లించగ – సోదరులకు శోభనమగు.

మానవతా మార్గానికి – సోదరత్వ శోభకూ
రాఖీ రమ్యత నివ్వగా – రమణీయము విశ్వము.

280

సహజ రాజయోగమిది – సమదర్శన సారమిది
ప్రాణశక్తి ప్రణవ మిది – పరమాత్మను చేర్చునది.

అష్టాంగ సాధనతో – ఆత్మశోధనమ్ముతో
అణునిర్మిత శరీరమే – అమరమౌట తెలియును.

అంతరంగ బహిరంగము – అంతరముల సంభరితము
అన్నిటి నంతం చేయగ – ఆత్మ వెలుగు దివ్వెగ.

త్రికరణముల తీరులో – తియ్యదనమె యోగము
పంచతత్త్వ పావనతే – పరమార్థపు యోగము.

కోతివంటి మనసు – కోరికలకు కొఱవియది
ఇంద్రియముల ధ్యాసమార్చి – ఇంపునొసగు యోగము.

నియమనిష్ఠ ప్రధానము – నిధులు అవసరము లేదు
తానెవరో కనుగొనుటే – తత్వార్థము యోగమునకు.

పాపపుణ్యఫలములే – పరతత్త్వమునకు దారులు
నీలోనే కలిగినవని – నిత్యసత్యమును గనుము.

పంచ వికారములను – పటాపంచలుగ చేయుము
వంచన పంచకు బోకుము – కాంచనమును కామించకు.

విశ్వము నశ్వరమను – వింత భయము ఆవరించె
శాంతి కాంతి చేవ కలుగ – నవవిశ్వము మానవతే.

మానవుడే మాధవుడగు – మాన్యమార్గమిదియుండె
ఆస్తి సుఖము శాశ్వతమను – అసద్గమనమును మానుము.

బ్రహ్మతత్త్వమును తెలియగ - భ్రాంతులన్ని విడనాడగ
బ్రహ్మకుమారి వగుము - బ్రహ్మాండమె నీవశము.

281

గ్రామీణం గడపదాటి గర్జించెను నగరంలో
వర్జించిన వరసంస్కృతి నిర్జించెను నియమాలను.

అన్యోన్యత అన్యమాయె - ధన్యత ధనదాహములో
వృత్తులు వృత్తములాయెను - వృద్ధియంత్రభరితము.

పబ్బులుక్లబ్బులలోనా - పారవశ్య పావనతలు
చిందులాట చందములూ - విందుల విరిగంధములు.

మరుగున బడి మురుగుతో - సహజీవన సంగమము
ఎవరుకన్న బిడ్డడో - పట్టదు మరి ప్రవరులకు.

ప్రక్క ఇంటి చక్కదనం - పైపైకే తెలియును
లోనివారిలోలుపతలు - లోకులెవరు గాంచలేరు.

అరచేతిలో ప్రపంచము - అందనిదీ చెందనిదీ
యుక్తవయసు సక్తమయి - రక్తిమీరు శక్తి విడచు.

కృత్రిమ వన కూర్పులు - సాంస్కృతికపు సాగరాలు
ఆకాశపు హర్మ్యాలు - అవకాశపు రహదారులు.

స్వేచ్ఛలేని జీవితాలు - స్వేదభరిత సేవనలు
ఆధారం అన్యులపై - అవతారం అవబోధం.

పరిసరాల కాలుష్యం - పలికించదు పరిశుభ్రం
కారణ కార్యములు రెండు - కలవారికి పరిచితమే.

స్వచ్ఛమైన నీరుగాలి - అచ్ఛమైన చెట్టుచేమ
అసలు కానరావుగా - కలవరమౌ కట్టడములు.

యాంత్రిక జీవనములో - మాంత్రిక జనమాధురి
ఉచ్ఛారణ ఉద్యమమే - జయమే అపజయముగా.

282

గొప్పలు పోకురా – తిప్పలు సోదరా
మెప్పులు పొందరా – మెలకువ నుండరా
అహం వదలిపెట్టరా – అభిమానం పెంచరా
అవమానం వీడరా – అనుమానం వదలరా.

తరతమములు తపనరా – సమభావన సొగసురా
అందరికీ నీవైతే – నీవే అందరి వౌదువు.

ధనం మిన్నకాదురా – ధరయె మన్ని కౌనురా
గుణం గురువు తెలియరా – జనం జాతి జగతిరా.

ఆరోగ్యం అధికమురా – ఆంతర్యము గాంచరా
ఆలోచన ముఖ్యమురా – ఆశయమే అవధిరా.

ధ్యానజగతి ధ్యేయమురా – జ్ఞాన గరిమ గరువమురా
మహనీయుల మాటలే – పటువైనవి ప్రగతికిరా.

లోకమలిన లోలుపతలు – లోభమనీ తెలియరా
లాభమైన యోగమనీ – లక్షణముల గాంచరా.

మానవాళి ఒకటెయనీ – రక్తరంగు ఎఱుపనీ
ఎఱుకగనుము సోదరా – ఎదమధురము తెలియరా.

అమ్మనాన్న అంరదకూ – కలవారని తెలియరా.
నీకు నీవు నీవు కాదు – నీకు మూల ముందిరా.

సత్యవాక్కు సరళినీ – సరిగ నీవు ఎఱుగుమురా
నిత్యధర్మ జీవనములు – నిధులున్నవి సోదరా.

ఆధ్యాత్మిక చింతనమున – అక్షరములు నేర్వరా
క్షరముకాని అక్షరములె – క్షమత్వమును యిచ్చురా.

ఆత్మభావనమ్ములో – అరమరికలు వదలరా
సారమెరిగి సాగిపొమ్ము – సాహసమున సోదరా.

అంతరాల వింతతీరు – సొంతము అంతమ్మురా
అందరొకటెయను భావన – అందుకొనుము అందమురా.

భారతితో బాంధవ్యము – హారతినీ కగునురా
హారతి రతిలో నీవు – ఆధిక్యము నందరా.

283

వత్సరమ్ము వాలిపోయె – సొద సర్వము సోలిపోయె
పరీక్షలూ ఫలితాలు – విఫల సుఫల సూక్ష్మతలు.

సమాధాన సరళికీ – మార్కు మాంత్రికానికీ
పొంతన సుంతయు కలుగదు – గురువుల గురుమార్కులు.

సెట్టుల సెట్టింగులలో – గట్టితనం మట్టికరచు
ముందు చదువు ముకుతాడు – వెనకతీరె వేదనలు.

కార్పొరేట్లు వెలిగించిన – కార్తాంతిక దీపమది
వసూళ్ళలొ మొదటివరుస – వంచనలో మించు ఘనత.

ర్యాంకుల రాగింగులో – రేవడులుగ విద్యార్థులు
సొమ్ము చేసి కొనుటలో – సొగసరి నవగురుకులాలు.

స్పర్ధ సరళి వ్యర్థమయి – వర్ధిల్లును మనఃక్షోభ
ఆత్మహత్య అంశమయి – అంధకార బంధురము.

భవిత బాగుచేయగా – బాధ్యతలే యాతనలయి
బంధనముల విందుగా – బతుకులె భవగతుకులు.

వసతిగృహం వాసిలేదు – గదులు కోళ్ళఫారాలు
భోజనమే బోధనము – బాధలాయె విద్యార్థికి.

ప్రభుత బడుల ప్రగతిలేదు – ప్రవచనముల వాచాలురు
బోధకులే బాధకులు – బోధనయే బెల్లు బిల్లు.

ప్రైవేటులు పరమాయెను – తరగతిగది తగనిదాయె
ప్రాభవము బండి సున్న – పరాభవం భవసారము.

తలిదండ్రుల తపనలెన్నొ – సమాజంపు సరళియేమొ
మునుముందుకు వెళ్ళాలని – 'మందు'లుగా మారిపోవు.

284

ప్రచారమే ప్రచురం – ప్రమోదమే ప్రథమం
ప్రజాస్వామ్య జాగృతిలో – ప్రభావమే బంధురం.

జనజగతిని గాంచినా – జయశీలత నెంచినా
జవసత్యం జాగరణం – భవసాగర తరణం.

ఓటమి గెలుపులకు – ఓర్పునేర్పు ప్రచారమే
సంపాదన పాదములో – మొదటి మెట్టు ప్రచారమే.

సత్యసరళినిత్యమగుట – ప్రచారంపు ప్రాభవమే
ధర్మజగతి దారిగనుట – ప్రచారంపు మర్మమే.

కథలు వ్యథలు గాథలన్ని – మనజీవుల ప్రచారమే
కావ్యసరళి గానవిరళి – విపులమైన ప్రచారమే.

ఉన్న కొంత ఉద్యమించ – ఉన్నతమగు ప్రచారమే
మంచి చెడుల మహిమ గనగ – మహనీయత ప్రచారమే.

కనులముందు కాంతిగనగ – కలవరమౌ ప్రచారమే
చెవులకింపు చెలిమిగాంచ – చేతనమగు ప్రచారమే.

ప్రచారాల పదనిసలే – ప్రలోభాల కవధులు
పాండిత్యపు పదముగనగ – పావనమౌ ప్రచారమే.

మూర్తి ముద్దుమురిపెములకు – ముమ్మాటికి ప్రచారమే
సంతసరుకు సరళిదెలియ – వింతవిలువ ప్రచారమే.

నవసంస్కృతి గరిమకూ – నాగరకత ప్రచారమే
గుడీ బడుల గురుతకూ – బరువైనది ప్రచారమే.

శ్రుతిమించీ మతిమరలి – గతిదప్పుట ప్రచారమే
పంచేంద్రియ ప్రభుతకూ – ప్రవరమైన ప్రచారమే.

ఆర్భాటం అందగించ – అధికమైన ప్రచారమే
గుణము గణము గరిమదెల్పు – గాటమైన ప్రచారమే.

తప్పు ఒప్పు తరల వరల – వాటమైన ప్రచారమే
సినిమా జన సిరులకూ – వరమైనది ప్రచారమే.

మేధోజన ప్రచారమే – మేలిమి సిరికురిపించును
మానవతా మహలులో – మాధుర్యం నిండును.

285

ఆత్మల అనుబంధం – ఆత్మీయత సంబంధం
సప్తపదుల సంగమం – మాంగల్యపు మాధుర్యం
తెలిసిన వారయినా – తెలియని వేరెవరయినా
ఏరోజుకు ఎఱుకగునో – అదె వివాహ సంబరం.

గత జీవిత గాంభీర్యం – సరస సహిత సంశోధన
భవిత బంధ సంభరితం – భార్య భర్త సహగమనం
చదువులెన్ని చదివినా – అనుభవాలు అందినా
అందని అనుభవ బంధం – ఆశయాల సారంగం.

వధూవరుల వరములు – వసుధతీరు తీరులు
వలపు తలపు మలుపులు – వయసు మనసు మహిమలు.

అంతరాలు తెలియవు – ఆంతర్యము అందదు
ప్రేమపేరు ప్రేరణగా – పెరుగు జగతి మాధుర్యం
మానవాళి జీవనమున – మరో ప్రగతి సోపానం
జీవ సుగతి గతులలో – కొత్త కోరికల గరువం.

గాడిదప్పు గంధర్వులు – పాడిదప్పు పావనులు
సాంసారిక చక్రంలో – సాగివచ్చు సరసులు.

మతాలకు మహితాలకు – మారనిదీ శాసనం
ఆలుమగల అనుగమనం – అవసరాల అనుపానం.

ఒప్పందం వరపైనది – భవిష్యత్తు బంధువుగా
సంసారం సింధువుగా – సరసమైన జీవనం.

286

ప్రకృతిలో మమేకమై – పరశించరండి
సుకృతులై జీవనమున సుఫలం పొందండి
విశ్వశక్తి ప్రాణశక్తి – విలువ విజయమందగా
ప్రాకృతులై ప్రవరులై – ప్రయోజనం పొందుడి
గ్రహగతుల గారడీలు – మహనీయత హరించగా
శుభగతుల సుందరతలు – విభవమ్ములు పంచునుగా
కొండలుగుట్టలు కొర్కెల హోరులు – లోయలు సెలయేరులు లోభహోరులు
పచ్చని చెట్ల వరుస – పారవశ్య ప్రవణతలు.

పక్షులతో జతకలిసి – సత్వములతొ సంగమించి
సరసత్త్వము సత్యమయి – సాగుడు మీరందరూ.

బాధ భయం విడిచి పెట్టి – భావమందు ధైర్యముంచి
సాహసమే సహభోగిగ – సంవదించి సాగుడీ.

యాత్రలోని యాతనలే – యమపురి సంశోధనలు
జీవయాత్ర జిలుగు వెలుగు – జయమందుడు జగతిలో.

పరతత్త్వపు ఆలోచన – ప్రణయాత్మల ఆక్రందన
వరవర్ణిత వసుధరూపు – వలపించును నిత్యము.

సహజత్వపు హజమంతా – సరళాత్మకు తెలియును
కృత్రిమతకు తావులేదు – పవిత్రతకు పెద్దపీట.

నిర్మలమై ఆకాశం – నింగి నిధుల నందించును
పునీతమై పూజ్యమయి – పుడమి పూర్ణ సుగతి నించు
పవలు రేయి సవనంలో – సావధాన చిత్తులరై
ప్రవరులయి పాలుగొనుడు – ప్రలోభములు సమసిపోయి.

అన్యోన్యత అభిభాషణ – ఆత్మీయత అందగింపు
ధ్యాన విషయ వినిమయము – ధ్యేయమగును సుకృతులకు
బండ బతుకు అండనిచ్చు – అడవి బతుకు కడలు తీర్చు
ప్రకృతి పురుషుల కలయిక – ప్రగతినిచ్చు భవిత పండు.

287

అంతరాల అవతరణ – వింత తరం వితరణ
భేద భావ భేషజాలె – బాధల నవపాదపాలు.

తాను నేను తరతమాలు – తపనకు హేతువులుగా
జీవనమే జవరహితము – జనహితమే చాంచల్యము.

అనుభవ దృష్టిలో – అనుమానపు మానములు
అభినవ సృష్టిలో – మనుజీవికి మారణాలు.

భౌతిక ఆంతర్యములలో – భావనకే బహుమానము
ఆత్మశోధనమ్ములో – సమత్వమే సహభాగము.

అదినాదను అహంకృతే – హుంకృతులకు మూలము
దక్కినదీ సరిపోవక – దహనమె జనహననము.

మమకారపు కారములో – మడియక తప్పదు
సహకారపు సవనంలో – సరసత్వము సాత్త్వికము.

జగమున రెండులేవు జాజ్జ్వల్యము ఒక్కటే
మూలతత్త్వ ముచ్చటే – ముందుమాట ముద్దుకోట.

అహంకారమణిగిపోయి – మమకారం మునిగిపోయి
అభేదమే అసలుదై – అవనిజనత కదలవలె.

ఆనందము అంతమనీ – అదె యారంభముగూడ
హద్దులేని ఆనందమె – అందరిదని తెలియవలె.

వైవిధ్యపు లోకానికి – వైభవమే ఆనందము
ఆత్మయోగ సారమంత – ఏకత్త్వపు ఎఱుక తెలుపు.

విషతుల్యపు సంస్కృతికీ – వీడుకోలు పలకండి
పరమాత్ముని ఎఱుకతో – పసదనమును గాంచుడి.

288

శాసన సభ కొలువుదీరె – శాపములకు కొదువ లేదు
ఊరించిన కోరికలే – ఉడికించును ప్రతినిధులను

పారదర్శకమ్మనీ – పరదర్శన చేతురు.

అవినీతికి అమడనీ – అవకాశం వెదకుదురు.
వాగ్దానపు మేరలేమి – అధికారపు ధిక్కారము.

ప్రాధాన్యతలను చెప్పీ – ప్రాభవ యత్నం చేతురు
గతంత్రవ్వి గాడిదప్పి – గోతిలో బడిపోవుదురు.

మంత్రుల మాంత్రికములో – మాటరాని మౌనస్థితి
నోరువిప్ప యత్నించగ – ఆర్థికమే అంత్యస్థితి.

ఆత్మహత్యలాగలేదు – అలజడియే జడివాన
సహాయంపు తంత్రులలో – నిస్సహాయ నిర్థనము.

ప్రణాళికేనాళికయే – ప్రవాహమే బయటికి
లోనికొచ్చు మార్గములే – లోటులోభలోలుపతలు.

శాఖలపై మంత్రులు – సేదదేరె ఊయలలో
మార్పుచేర్పుకూర్పులన్ని – మహనీయుల పొడి మాటలె.

అవగాహన లేనివాళ్ళు – అధికారంలో మునిగిరి
క్రియాశీల కీర్తనలే – నర్తనలై నవ్వించును.

ప్రమాణాల మానములే – అనుమానపు అవతరణలు
నోరుచెడీ చెవులు చెఱచి – భాష బాధ భవుని కెరుక.

ప్రథమఫైలు సంతకాలు – స్వంత చింత శోభలతో
అటకపైన అధికారులు – అలసత్త్వపు లాలసతో.

పూర్తికాని విస్తరణము – పదవులార్తి పదనిసలు
అసంతృప్తి అవతరణము – తరించుటే తరువాయి.

రాజ్యాంగం రాతలన్ని – రాజిల్లును పుటలలో
అమలులోని మలుపులెన్నొ – అధికారమె తెలియాలి.

చట్టంతనపని చేస్తుందని – చట్టుబండలుగ చేతురు
నల్లకోట్ల నయగారం – నిగారమై నినదించును.

శాసనం శాపంకాకూడదని – జనారణ్యంలో జాజ్జ్వల్యమనీ
జగతికి చెప్పే గతిశీలురు – శాసనసభ్యులు కావాలి.

289

శాసన సభ సభాపతి – శాసన సభ్యులకు పతి
ప్రజాస్వామ్య ప్రక్రియలో – ప్రధానమౌ పరపతి.

అదలించుట విదలించుట – కాకూడదు అతని పని
అందరి మన్ననలొందుచు – అధిగమించుటే పని.

ప్రజావాణి ప్రతిఫలించు – ప్రముఖమైన ఘట్టములలొ
పక్షపాత రహితమై – ప్రవచించుట ప్రవరము.

వైరిపక్ష వైధవ్యం – వాదనలో శ్రుతిమించగ
నిజాలకే నిండుదనం – నిలకడయే జీవనగడ.

బహుళ పార్టి వ్యవస్థలో – భారవహన సామర్థ్యం
బహుభంగుల యోజనతో – మహనీయత సాధించుట.

పార్టీలతొ బాంధవ్యం – వదలుకొన్న వల్లభుడు
మన్ననతో ఎన్నుకొన్న – మాంత్రికుడు తాంత్రికుడు.

అందరికీ అవకాశం – అందించే సాహసం
వర్గప్రాంత సర్గలనూ – అగ్గించెడి అధిపుడు.

బెల్లుకొట్టి భయపెట్టు – చల్లని మనసున్న వాడు
సహన వహన సారధి – సామరస్య సభాపతి.

మార్షల్ లను యోగించుట – యోజనమ్ము కాదు గద
మైకుల మైకాసురులకు – మాటలతో ఉపశమనము.

ఆరోపణ నిరూపణ – అసత్యాల సత్యత్వము
అదను పదను అన్ని తెలిసి – ఆఖరికే నిర్ణయించు.

గౌరవమ్ము గరువము – పరిమళించు జనపదవి
ఎన్నుకొన్న ప్రతినిధులకు – ఎఱుకనిచ్చు గుణనిధి.

రాజసమున రాణించుట – రభసలోన భాసించుట
సరసతలో శోభించుట – సభాపతికి భాస్వంతము.

290

రాజ్యాంగపు రాతలకూ – సంప్రదాయ సరసతలకు
ప్రాథాన్యము ప్రాభవము – పరిగణించు ప్రజాపతి.

కొత్తపాత సభ్యులకూ – కొలువు కోమలతలనూ
తెలియజేయు తెరువుచెప్పు – తేటదనం దీటువాడు.

సమస్యలను సంవదించి – సహకరించు సహకారి
ప్రతిపక్షము ప్రభుతకూ – అదలించెడి అదనుకాడు.

సభ్యుల హాజరు తీరును – మహజరుతో గమనించును
కోరం కోరిక తెలిసీ – కొలువు కొలత కోరి తెలుపు.

సమయ నియమ పాలనతో – సహభాగిగ సహకరించు
నిశ్శబ్దపు నిధిగాను – అపశబ్దము అసహ్యించు.

ప్రతినిధులకు మధ్యన – వాహకము గ్రాహకము
పరామర్శ మర్శనలకు – వరాకృతిగ వసియించు.

అధికారపు స్వాములకు – ప్రతిపక్షపు ప్రభువులకూ
మధ్య ఇంద్రజాలికుడు – సమన్వయపు అన్వయుడు.

జనక్షేమం జాగృతిగా – జయంకోరు జయశీలుడు
ప్రతినిధులకు పరమాప్తుడు – ప్రజాజగతి గతిశీలుడు.

మంచి జరుగ యత్నించగ – జతకలిపెడి మతిమంతుడు
వంచనలను త్రుంచివేయు – అధికారపు ఆశయుడు.

శాసనసభ శక్తినీ – ప్రతినిధి పరమాసక్తిని
గమనించెడి గణికుడూ – గణతంత్రపు వణిజుడు.

రాజకీయ పక్షములను – ప్రక్షాళన చేయగాను
రూలింగుల రూక్షతతో – వేటువేయు వెలుగు ఱేడు.

నిద్రలోని ప్రతినిధులను – భద్రంగా తట్టిలేపి
సభహుందాతనమునంత – కాపాడెడి రక్షకుడు.

బిల్లుల ఓటింగులోని – మూజువాణి మేజువాణి
శాసనాల చేతలో – చైతన్యపు చెలువుబాణి.

ప్రజలలోని అపోహలను – యదార్థపు యాతనలను
సంస్కరించి సాగుచుండ – సంస్కృతికది సాగుబడియె.

291

శక్తిపీఠములందు శాంకరిగా నుండి – జగముల శుభములు జరుపునమ్మ
కాళికామాతగా కమనీయ రూపాన – దుష్టుల దమియించు దూత అమ్మ
లక్ష్మిగా లలితగా లావణ్యమహితగా – లక్ష్యము గమనించు లహరి అమ్మ
పార్వతి పర్వమై ఫలితము జనులదై – ప్రభవించి విభవమ్ము పంచునమ్మ.

ఎన్నిపేరుల పిలచిన ఎన్నతరమ! – దేవి దేదీప్యమానమౌ దేహితాను
మమత మానవత్వాల మరువమమ్మ – విజయదశమిన విబుధయై వెలుగునమ్మ.

రాజరాజేశ్వరి రాజ్యమై రహియంత – ధనముల ఘనముల దక్షయగుత
సరసమై సహితమై సారస్వతమ్మయై – భాషల భావాల భాగ్యమగుత
లాలిత్య శోభయై లలితాంబరూపమై – మాణిక్యతలనుండు మహితగాత
బాలగా భవమున భాగ్యముల్ పంచగా – అవతారమెత్తిన అసురగాత.

292

సుఖము మఖముల గలిగించు సుందరిగను
భువిని పంటలు పండించు భవనమామె
కనక కలితము కలుముల కలుగజేయు
కనకదుర్గయె కాంతుల కమ్మనమ్మ.

నవరూప నవలగా నవ్యమై దివ్యమై – భవ్యజీవనమందు దివ్య అమ్మ
అలకార శోభతో అలరారు అధికమై – రూక్షమౌ రూపాల రుజల దోలు
పేర్లెన్ని పెట్టినా పేలవతలులేని – పెంపుకల్గినయట్టి ఇంపు అమ్మ
జగముల మాతయై జనముల దాతయై – జయమునందినయట్టి జాణ అమ్మ.

నిజము కానిది నిజమైన నిధియె అమ్మ
సత్యనిత్యాల సరసత్వ సారమమ్మ
సుందరమ్మగు రూపాల సుదతి అమ్మ
ఏడులోకాల ఎదలందు ఎఱుక అమ్మ.

మానవాళికి జయమిచ్చు మహిత దుర్గ
లలిత లావణ్యలహరియె లక్ష్మితల్లి
పార్వతమ్మయె ఫలమియ్య పర్వమగును
ఆది అపరాల శక్తుల అవధి అమ్మ.

అన్నపూర్ణమాత ఆకలిదీర్చును – కాశి నిలయముగను కలిమి పంచు
వెలుగు జీవితాల వేల్పుగా ప్రభవించి – కర్కశత్వమంత కాల్చివేయు.

293

కందుకూరు చిన్నదాన – కందిరీగ నడుముదాన
అందమైన మనసుదాన – అసలైన వయసుదాన
కనిగిరిరోడ్డుపైన – కసకసమని నడుస్తుంటె
కాలి అందె ఘల్లనగా – నామనసే ఝల్లన్నది.

పామూరు రోడ్డులోన – పైటజారి పోగానే
పావనమయె నామనసు – పావడపై చూపు పడగ
అంకమ్మ గుడికాడ – అటూ ఇటూ తిరుగుతుంటె
నిలవలేక నామనసు – నిట్టూరుపు విడిచినాది.

కోటేశ్వర హాలులోకి – కోరికతో నేనొస్తే
వస్తానని మాయజేసి – వలపు తీసివేసినావె
ప్రశాంతి హాలులోన – ఎన్టీ ఆర్ సినిమాకని
పదపదమని నేనంటే – పదనిసలే పలుకుతావు.

రాజమహల్ సినిమాకని – రాజసంగ నీవెళితే
రోజుకుంటూ నేవస్తిని – రోజంతా పస్తులాయె
సన్నజాజి చెట్టుకాడ – సన్నని యానదుంతోడ
పూలుకోసి మాలకట్టి – పూజకుననురమ్మంటివి.

పోస్టాఫీసు సెంటరులో – టేస్టైన టీతాగి
వేస్టులేక కాలాన్ని – బెస్టుగాను గడుపుదాము
రాళ్ళపాడు కట్టమీద – రయి రయ్యని నడుస్తుంటె
రాజనాల పంట పండి – రంజయినది జీవితమే.

మాచవరం గట్టుకాడ – మౌనంగా నీవుంటే
నామదిలో గుబులు రేగి – దిగులు ఎక్కువైనాదే. 294

కందిచేనుకాడ నీవు – కలవరపెడుతుంటేను
వాటముగా వాటేసి – కౌగిలిలో పడదాయె
జొన్నచేనుకాడ నీవు – జోలెకట్టి జోలపాడ
జోలెలోన నామనసే – జోగిపోతు వున్నాది.

తంబాకు చేనిలోన – తటపటమని నీవుంటే
తలపుల పంటె పండి – తనువు వలపులొక్కటాయె
జనుం పొలంకాడనీవు – మునుముపట్టి కోస్తుంటే
ముసరుకొన్న మురిపెమంత – ముద్దులు గురిపించినాదె.

సెనగపూల రైక దొడిగి – వరిచేనుగట్టుపైన
వలపు పంట పండించగ – వయసు గుర్తురాకపోయె
మన్నేరు నీళ్ళలోన – తానానికి నీవెళితే
తరచి చూచి ఒళ్ళంతా – తాలిమి నశియించెనాకు.

సింగరాయకొండపోతు – సిందూరపు చీరగట్ట
చీరపైన కన్నుబడి – జారిపోయె నాగుండెలు
కనకగిరికి వెళదాము – కనకం కొనియిస్తాను
పామూరుకు వెళదాము – పావడ కొని యిస్తాను.

ఎక్కిరాలపేట వెళ్ళి – ఎకసక్కెము లాడదాము
ఆత్మకూరు వెళ్ళిమనం – ఆటలాడుకుందాము
పందలపాడెళదాము – పాలేటిలో మునుగుదాము
ఆనందాపురము వెళ్ళి – అంతరముల మరుద్దాము.

పలుకూరుకు వెళ్ళి మనం – పకపక నవ్వుకుందాము
ఉలవపాడు వూరికెళ్ళి – సపోటాలు తిందాము
పల్లెకాయ పండుతిని – పరవశమై పోదాము
అన్ని ఊళ్ళు తిరిగొచ్చి – అంతరంగముల మరచి
ఆత్మల ఏకం చేసి – పరమాత్మను కందాము.

295

భారతీయ తత్త్వమే భాగ్యదాయి యోజనలో
సంస్కారపు సంస్కృతమే సారళ్యము సాధనలో.

నరేంద్రుడే నవ్యతలో నవ వివేకానందుడూ
ప్రాక్పశ్చిమ తత్త్వాలకు పరిమళమును పొందించెను.

కాషాయం కమనీయం – కషాయమే రుగ్మతలకు
దివ్యవాక్కు భవ్యదృష్టి – దిటవు పటువు పావనతా
పరమహంస శిష్యుడూ – పరివ్రాజక పరముడు
రాజయోగ రహస్యాన – రమ్యమైన ధీయుతుడు.

జ్ఞానయోగ జాణతాను – జయశీలపు జాగృతుడు
పరమార్థపు అర్థములను – ప్రాకటముగ ప్రకటించెను
స్వామివిధము స్వాగతించు – ధర్మమర్మ కర్మలనూ
వ్యక్తిత్వపు వ్యావృతినీ – వ్యవహరించె వెలుగులతో.

బ్రహ్మజ్ఞాన నిరతుడూ – బ్రహ్మీమయ భావనుడు
అవతారపు అంశువూ – ఆనందపు ప్రాంశువు
గురువు గుట్టు పరువును గుంభనముగ తెలిపెను
ఆలోచన ఆచరణల – అవసరమే నుడివెను.

విద్యవిలువ దెలిపెను – శాస్త్రచలువ గాంచెను
వినయగరిమ మీరెను – విబుధుల నుతులందెను
పిన్నవయసు పిలుపునా – మృత్యుహేల మీరెను
ఆణిముత్యములెన్నో – అవతరింపజేసెను.

కామినీ కాంచనములు – కలవరపరచేననీ
బుద్ధి శుద్ధి బుద్ధమనెను – బద్ధుడగుట వలదనెను
హైందవ ధర్మమ్మునూ – విశ్వమంత పంచెను
సన్యాసము ధన్యమనీ – సత్యసంధుడాయెను.

భారతీయ ధర్మానికి – భాగ్యయోగ్యతలపంచెను
త్రయీవిద్యసారమును – తరములకే నిలిపెను
మనిషిమాన్యతల జెప్పి – ధన్యత్వము నొందెను
మానవత్వ సాధనలో – మహిమలన్ని వివరించెను.

విశ్వధర్మమొకటేయని – విభుత ప్రభుత వివరించెను
నశ్వరమౌ జగత్తునకు – నవ్యజీవనమునిచ్చెను
విప్లవమే విజయనీ – వికాసమే నవ్యమనీ
వివేకమే దివ్యమనీ – భవ్యవాక్కు పలికెను.

వివేకమూ ఆనందము – విశ్రుతముగ కలియగా
విజయపథము గాంచెను – విబుధ హృదిని జయించెను.

296

విధులు బధిరమైన వేళ విలువలు విగతమ్ములే
నిధులు నిత్యమైన వేళ నీతినేతి బీరలే.

మానవాళి మాన్యములో మానవతకు చోటులే
దానవాళి ధారుణిలో దమనకాండ దారిలే.

హక్కుభుక్తమైన వేళ అవనినీదె యగునులే
భువియె భుక్తమైన వేళ భోక్తలెవరు లేరులే.

స్వర్గ భ్రాంతిలోన నిండి నరకమునే మరువకు
నరకమేమి భ్రాంతికాదు నిత్యమనీ తెలిసికో.

బాధ బోధ భావమనీ భాగ్యమునే గాంచకూ
వేదనలో వెలితినే విజయమనీ మసలుకో.

అంతరాల అవనిలో వింతులుండె తెలియుము
తరతరాల అంతరాల తరుణమునే తెలిసికో.

కులమతాల కూహకాలు కుళ్ళు అనీ తెలిసికో
కుళ్ళులేని సమాజమే కల్లయనీ మసలుకో.

దేహిలోని దేవుడినే దివ్యమనీ తెలిసికో
సృష్టిలోని మానవుడే సుందరుడని మసలుకో.

నిన్ను నీవు తెలిసికో నిత్యభ్రాంతి భావించి
జగన్నాటకమునందున జాణతనం పెంచుకో.

తత్త్వమెరిగి మసలుకో తరియింతువు జగమునా
అహంబ్రహ్మాయనురీతిని అవసరముల జరుపుకో.

అనిత్యమీ జీవనమని అహము దివము తెలిసికో
నిత్యానిత్యమును దెలిసీ నిర్ణయముల మార్చుకో.

ధర్మ రక్ష నీకు రక్ష – ధారుణియే మనకు రక్ష
ధారుణి కాపాడుకో – మారణముల నిలువరించు.

కలికాలం కలవరమూ – కలకాలం నిలువదూ
కలిమి కాలమాయెననీ – కలరవముల పాడకూ.

పాతకొత్త పరవశాన – పరువుగాను మసలుకో
కొత్తపాత కోరికలే – కొలువు తీరు జగమునా.

సుఖములేని మఖములూ – అఘములనీ తెలిసికో
ఆనందము అందరిదని – ముందరగా మురిసిపో.

మురిపెములో ముద్దులను – సుద్దులనీ తెలిసికో
సిద్ధిబడయ సుద్దులన్ని – బద్ధులనీ భావించు.

297

తల్లీ! నీ స్తన్యంలో చైతన్యము ఉన్నది.
మాతా! నీ మాలిమిలో మాధుర్యము ఉన్నది

జననీ! నీజోలలోనె జాజ్జ్వల్యత ఉన్నది
అమ్మా! నీ ఆలనలో అమరత్వం ఉన్నది.

మహిళా! నీ మనసులోనె మహనీయత ఉన్నది
అబలా! నీ బలములోనె ఆధిక్యత ఉన్నది
పడతీ! నీ పాలనలో పాతివ్రత్యమున్నది
నవలా! నీ 'లాలి'లోనె లావణ్యం ఉన్నది.

ప్రకృతీ! నీ కృపలోనె పావనత్వమున్నది
వనితా! నీవాసిలోనె వాల్లభ్యము ఉన్నది
తరుణీ! నీ కరణములలొ తరుణత్వం ఉన్నది
భామిని! నీ భావనలో భాగ్యము నిండైయున్నది.

అమ్మా! నీకార్యములలొ ఆర్యత్వము ఉన్నది
తల్లీ! నీ కరణములలో అరుణత్వం నిలచినది
మాతా! నీ భోజ్యములో భోగమిమిడి ఉన్నది
భామా! నీ కౌగిలిలో భవబంధము లున్నవి.

రామా! నీ రాజ్యములో రమ్యత గమ్యతయైనది
సీతా! నీత్యాగములో సేతువె నిర్మితమైనది
లక్ష్మీ! నీ రూపంలో లక్ష్యము స్వర్గమ్మైనది
మమ్మీ! నీ కోపంలో మమకారం దాగున్నది.

అమ్మా! నీ ఆర్తిలోనే కీర్తి దాగియున్నది
గృహిణీ! నీ గృహసీమను గుణము నిండియున్నది
దేవీ! నీ దేహమంత దివ్యతయే నిండినది
ప్రేయసి! నీ ప్రేమలోనె ప్రేరణ ప్రేరకమైనది.

కలువకంటి! కనులలో కలిమి బలిమి యైనది. 298

లలనా! నీ లాలిపాట లక్షణ శిక్షణ యైనది
సుదతీ! నీ శుభకామన భద్రముగా నున్నది
తరుణీ! నీ అరుణిమలో అమరలోకమున్నది
భారతి! భవభాగ్యములో స్వాతంత్ర్యమె యున్నది.

356

సత్యా! నీకోపములో సారళ్యత యున్నది
సవితా! నీ స్పర్శలోనె సమత మమతలున్నవి
చెల్లీ! నీ పిలుపులే చేతన కదిలించినవి
అక్కా! నీ ఆప్యాయత అందరికీ అందినది.

ఇంతీ! నీ చింతనలో ఇంపైనది హృదయము
కాంతా! నీ నిలయం కాంతారం నిత్యం నవతారకం.

అతివలతో మతిమంతము – అబలలతో బలవంతము
తరుణులతో అవతరణము – జననితోడ జయభరితము.

అమ్మను గౌరవించు – చెల్లిని సేదదేర్చు
అక్కను చక్కబరచు – భార్యను బాగుపరచు.

"జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ"

"కార్యేషుదాసీ కరణేషు మంత్రీ – భోజ్యేషు మాతా శయనేషు రంభా
రూపేచ లక్ష్మీ క్షమయా ధరిత్రీ – షట్కర్మయుక్తా సహధర్మపత్నీ"

"స్త్రీ బుద్ధికి ప్రళయాంతకీ"

"కలకంఠ కంఠి, కన్నీరొలికిన సిరియింట నుండ నొల్లదు"

"లోకం లోలాక్షుల అక్షులలో సలక్షణంగా ఉంటుంది"

"భార్యాభర్తల బాంధవ్యం భవసాగర తరణానికి నావ"

"ఆడది ఆడది కాదు ఈడదే"

"అబల సబల అతిబల బలాతిబల"

"ఆడదానికి ఆడదే శతృవు"
"అమ్మ ఆలన పాలన లాలనలను అందుకన్నొవాడు అమరుడే"

299

వయసు వాలిపోతుంటే మనసు జారిపోతున్నది
మనసు మహిమ తెలియలేక మమత మీరుతున్నది

అంగాంగము భంగిమలే రంగుమారిపోతున్నది
రతికేళీ రంగమందు మితిమీరిపోతున్నది.

దాంపత్య సుఖమునకు దారి తెలియకున్నది
వలపుల రాదారిలో తనువు తలపువశమైనది
కాటుక కంటిచూపు కలవరమై కదులుతుంది
పెదవిమీది పదనులో పంచదార పదిలమైంది.

ముక్కున ముక్కెర అందం ముద్దు ముద్దు గున్నది
చెవికమ్మల చైతన్యం చెక్కిలికే చెలువైనది
పావడలో పరువం ఉరకలు వేస్తున్నది
జఘనం ఘనమైనదై జాతిగుబ్బమైనది.

చిక్కిన నడుములో చక్కదనం ఉన్నది
జాఱిన కొప్పేమో జావళీని మించినది
నల్లని కురులలో మల్లెవిరుల మాధుర్యం
సోయగాల గుబాళింపు సొగసుల సౌందర్యం.

కాలియందె గలగలలే కామన పండించెను
చేతి గాజు గల్లనగా చేతము చెయిజారెను
ముఖం చంద్రమండలం ముద్దుల చెవి మురిపెం
కంటిచూపుచలువలో కానరాదు తనపరువం.

మనసు మైనసైనచో దినుసే నీ బిగికౌగిలి
చలువరాతి స్పర్శలో సంబరమే యీ యామిని
ఆమని యామినిలో అందమైనదీ కలయిక
ముద్దులు హద్దులు మీరగ మురిపెమె మన అలయిక.

కోకిలకే కొఱతవేసే కోమలమై నీ కంఠము
హంసలనే అవలదోచె అందమైన నీపాదము
చిలుకలనే చిదిమివేసె నీ పలుకుల చందము
దొండపండు రంగునే రంగరించె నీ అధరము.

కోపములో నీరూపం కోరికతో చల్లబడెను
అందరాని ఆనందము అందగానె మెత్తబడెను.

300

నవద్వారపు పురమిది – నవ్యమైన వనమిది
ప్రాణముతో పదిలమిది – వదలినచో దుష్టమిది
పంచభూత ప్రపంచాన – ప్రవరమైన జీవమిది
పంచకోశ పరిమితమై – ఆశమూలమైనదిది.

నరాలతో వరాలుగా – వరమైన దేహమిది
కండరాల అండతో – కలిమి బలిమి కాంచునిది
ఎరుపు రక్త వరపుతో – ఎదగదిలో పదిలమిది
జరారుజల జగతిలో – గతిమాలిన గరువమిది.

వికలమైన అంగములతొ – విధివంచన వివరమిది
పంచతత్త్వపావనతా – నవతత్త్వ నడత యిది
చతుర్వింశ అంశతో – చత్వారపు చూపుయిది
ఏ రంధ్రము చూచినా – దుర్గంధమె మనకిచ్చును.

గంధము గ్రహియించెడి – ముక్కు మురువు నిచ్చును
కనిపించెడి ఇంద్రియాలు – కనరానివి ఎన్నెన్నో
కనుగొనగా కానక – సతమతమగు మనవాడు
నీరులేక బతుకులేదు – నిధుల జీవనమ్ములో
అడవిలేక పురములేదు – అవని జనత బతుకులో
తోలుతిత్తియే కనబడగా – కానని కామనలెన్నెన్నో
తనువు మరచిన తపనలలో – తరుణమె తరగని వయసుల్లో.

జీవం విషయం జియ్యరు కెరుకా – భావం భాగ్యం భవునికి ఎరుకా
జియ్యరు వెదకే జీవులెందరో – జీవుని చూచే జియ్యరు లేడు
పరంపరలలో పావనమైనది – తరగని సంపదకానవచ్చినది
మతమె హితముగా మాన్యమైనది – హితము హతముగా హీనమైనది
మానవత్త్వమది మరుగుబడినది – ధనగణ్యతతో దారిదప్పినది.

వనంలేని వసుధలేదు - పురంలేని జనుడులేడు
నీటిబుడగ జీవనం - నిత్యం జన ఆరాటం
తెలివిమీరి తెరలుచుండె - తెరవెనుకే తెలియదాయె
సత్యశివము సుందరముల - కాంక్షించుట కరవాయెను
మనసు మోసగిస్తుంది - మాటమాయజేస్తుంది
కనులు కల్లలౌతాయి - వీనులు విగతమ్ములే.

తోలుతిత్తికే మిత్తి - తోట పురములకు స్వస్తి.

301

తల్లి మనసు వలెను చల్లదనమ్మిచ్చు - తల్లి మాట వలెను తపనదీర్చు
తల్లి చేతవలెను తారళ్యమొలికించు - తల్లి భాషమరువ తగదు తనయ!

ఉగ్గుబాలతోడి నిగ్గగు మాటల - గోరుముద్దతోడి గోముగాను
పసితనమ్ములోన పాలన లాలనన్ - తెలుగు వచ్చెనీకు తేటగాను.

ఆంధ్రభాషయన్న అందము చందము - సాంద్రమాయె తెలుగు సరళముగను
తెనుగు తేనే తేట తీరైన మాటల - మరువకుండనీవు మాటలాడు.

భావప్రకటనమున భాస్వంత మాయెను - పద్యగద్యములను ప్రవరమాయె
గీతిరీతిగాంచ జాతికి గర్వము - మాతృభాషమరువ శతృవీవు.

పంచెకట్టులోని పరమార్థమును దెల్పు - పట్టులాల్చిలోని గట్టిదనము
మీసకట్టులోని వాసిని ప్రకటించు - తెలుగువాడి తనము తెలియుమీవు.

స్తన్యమిచ్చుమాత గణ్యము ధన్యము - పెంచిపెద్దజేయు ప్రేమపంచు
నీతినియమములను చేతనత్వమునించు - మాతృభాషనీకు మాన్యమగును.

మేధకల్గుజనుల మేలిమి భాషగా - విశ్వవాప్తమాయె విలువ కలిగి
నీదు స్వంతభాష నిధియగు నీకెప్డు - దాని మరువనీకు దారిలేదు.

302

విశ్వాసము శ్వాసగా - విలువలు నవ వలువలుగా
వికసించే కుసుమమిది - విజయశీల మహిమమిది.

అంతరాలు లేనిది – ఆంతర్యము త్యాగమది
అవసరముల సారమిది – అనుభవాల భాగ్యమిది.

కోరికలకు కోమలమిది – కొత్తదనపు కొలత యిది
మదిగదికే మృదులమిది – మానవతకు మాన్యమిది
సృజనలోనె సుందరమిది – బతుకు లోని బంధమిది
కలతల కరిగించెడిది – కమ్మదనము పంచెడిది.

కాలాలకు అందనిది – కలిమికి చెందని బలిమిది
మాటలకూ చాలనిదీ – మమతల మాగాణమిది.

బంధనాల విడగొట్టే – ఆనందపు బంధమిదీ
గుండెలకే పండగైన – గురువు పరువు బరువు యిది.

'నేను'లోని నేవళమూ – 'నీవు'లోని నిర్మలతా
'మనము'లోని మాన్యతా – మధురమైన మరువమిది.

నూనెవలే కరిగిపోయి – వత్తివలే తరిగిపోయి
చీకటికీ వెలుగునిచ్చు – చిరుదివ్వే యీ బంధం.

లింగభేదమేమిలేని – సంగతియే సరసత్వము
సంగము సరసాంగముగా – అభంగమే యీ స్నేహం.

త్రికాలాల త్రిలోకాల – తీరులెన్ని వేరులైన
త్రికరణముల తియ్యనిది – ప్రకరణముల ఫలమె యిది.

ఆపద పథములలోనా – ఆర్తుల ఆక్రందనలోనా
అందించే అభమయే – అసలైన అనుబంధము.

పేదపెద్ద భావములూ – వాదనలూ వేదనలూ
వంచనలూ వలపులూ – త్రుంచలేని బంధమిది.

ఓర్పుకు ఓదార్పుకూ – తీర్పుకు తిరుమార్పుకూ
కన్నీటికి కథమార్పుకు – కారణమీ సంబంధము.

జనజీవన గమనంలో – జాజ్జ్వల్యము జాగృతము
జాతి జనత ఘనతకే – జయహారతి స్నేహమే.

303

కళాశాల కళాశాల – కలుములకిది కళలశాల
విద్యా విలువల విరులే – వికసించెడి విబుధశాల
ఉదయభాను కిరణములే – ఉద్యమించె హృద్యముగా
పచ్చదనపు పరువములే – పరవశించు ప్రగతిశాల.

వత్సరాలుగడచిపోయి – వాసినందె వసుధశాల
మత్సరముల మరుగుపరచి – మాన్యమాయె మహితశాల
గడ్డము వంశమువారికి – గరువమిచ్చె గణ్యశాల
శేషయ్యది శేముషిగా – చెలువునందె చెలిమిశాల.

ఉలవపాడు పాడినదీ – ఉన్నతమౌ జయగీతము
గ్రాండు ట్రంకురోడ్డు ప్రక్క – గ్లామరుగా వెలసినదిది
అధ్యక్షులు మారిరిచట – అభ్యుదయము గాంచిరి
ఉపన్యాస న్యాసములో – ఉరవడించి వెలుగొందిరి.

కాలము మారిపోయి – కార్పొరేట్లు వెలసినవీ
కాంతిదరిగి కలిమి వెలసి – శాంతి మిగిలె శక్తిశాల
అక్షరాలు మారిపోయి – ఆక్షేపణలే మిగిలెను
కారణమ్ములేవైనను – కరువైరిట విద్యార్థులు.

సుందరుడే అధ్యక్షుడు – శుభముగాంచు సురుచిరముగ
కార్యాలయ కమ్మదనము – కామితములు దీర్చునిచట
ఎఱుక నిచ్చు బోధకులూ – శిష్యుల హృది సాధకులూ
శితికంఠ శోధకులై – శివములిచ్చు శక్తిమించి.

పరులమంచి కోరగాను – మనకుమంచి యగును భువిని
మానవత్వమాన్యములో – మనుజులంత మరువములే
మల్లెల విరిజల్లులతో – సన్నజాజి గంధముతో
గులాబీల గుబాళింపు – మనశాలకు కొనితెద్దాం.

టీమువర్కు భీమునిగా – తేళ్ళజాను సుందరమ్ము
అందరికీ ఆదర్శము – అనుసరించి సాగుదాము

జీవీయస్ఎం శాలకు – జిలుగు వెలుగు తెద్దాము
బాధ్యతయే బంధువుగా – భవమునందు సాగుదాము.

304

తే.గీ. సిరులు విరులుగ విరబూయు సీమలందు
మల్లెగంధము మాటున వల్లెయనగ
తరువు నీడలు చల్లగ తపనదీర్చ
మైత్రి మరువముగా మారె మానవతకు.

తే.గీ. లింగభేదము లేనట్టి వంగడమ్ము – మనుజ పశువుల తేడాలు మాటువడగ
పేద పెద్దల తేడాలు పేరులేక – సాగుమైత్రియె లోకాన సరసమగును.

తే.గీ. ప్రేమ అభిమానములు రెండు ప్రేరకముగ – త్యాగభోగాలు తెరువుగ యోగముగను
అంతరంగములందున అమరియుండు – అంతరములేని ఆస్తియె అవని మైత్రి.

తే.గీ. వంచనములేక పంచెడి వలపు తలపు – బాధ భాగ్యము రీతినిబోధసేయు
బంధనములను త్రెంచెడి బంధువుగను – స్నేహభావము భువిలోన చెలువు మీరు.

తే.గీ. తోడునీడగ వెలిగెడి వేడుకగను – స్వార్థమేమియులేకుండ సాగగాను
ఇరువు రందునన్యోన్యహితముగోరు – అవని మైత్రియె అసలైన ఆస్తిసుమ్ము.

తే.గీ. చెలిమి కలిమికి అందదు చేవ మిగులు
మైత్రి మహిమము మహిలోని మాన్యతగును
చింతనమునందు స్వాంతము చివురుతొడుగు
కలవరములందు కలతకు కాంతిసుమ్ము.

తే.గీ. జనుడు స్నేహము లేకుండ జగతిలేడు – సంఘరీతియె సహితము సరసమగును
కోర్కె కొరతయులేనట్టి కొలువుగాను – అహము విడిచిన అందమె అవని మైత్రి.

305

తే.గీ. ఒకటిగాజేయు నిద్దర ఓర్పుమిగుల
మనిషి మనిషిగ జూచెడి మాన్యముగను
ఇచ్చుటయెకాదు గ్రహణము యింపు మిగుల
అవని చెలిమికి అనుభూతి అసలుదాయె.

ఆ.వె. నమ్మకమ్ము మైత్రి నవ్యము దివ్యము – వమ్ముకాదు వసుధవాసి గాంచు
తిండిబట్టరీతి తీరగునట్టిది – స్నేహరహిత జీవి చెలువుకాదు.

ఆ.వె. ఆస్తిపాస్తికన్న అందముకన్నను – పదవికన్న ప్రగతి పరువుకన్న
పరమమైన మైత్రి పరమాత్మయౌనుగా – మనసు మనసు కలుపు మహిమ మైత్రి.

తే.గీ. మాట మనసున చేతను మార్దవముగ – వ్యక్తమగునుగ స్నేహము వ్యావృతముగ
పరుల వరులుగ భావించు ప్రాభవమున – పల్లవించును మైత్రియు వెల్లువగను.

తే.గీ. కనగ యితిహాసమందున కాంతిగల్గి – మన పురాణములందున మహిమగల్గి
కావ్యతతులను వెల్లువై నవ్యముగను – చెలిమి చెన్నొందు చేతాల చింతనమున.

తే.గీ. బావమరదుల భావము భాగ్యమాయె – గీతగామారె వేద్యమై చేతములను
అర్జునుండును కృష్ణుడు అవనిమిగిలె – తేట తేనెగ స్నేహము తెలుపులూరె.

తే.గీ. ఖండమేలేని స్నేహము అండగాను – కర్ణయోధన మైత్రియె వర్ణమాయె
స్వార్థ అర్థాల సౌమ్యత సాగగాను – ప్రాణములనిచ్చె కర్ణుడు పాలకునకు.

306

నిత్యము కావేవి యిచట – సత్య హత్య సరసమాయె
అసత్యమే అధికమ్మయి – అహము ఇహము పాలించును.

దేవుడు కలడను వారికి – దేవులాట ముఖ్యమాయె
జీవితాల ఆటలోన – భాగ్యహీన భావమాయె.

చింతల చిరుదివ్వెలే – వంతల వసుధను మార్చును
అంతులేని ఆత్మలోన – చింతయె ఛీత్కారమాయె.

బంగారం అంగారం – సింగారం సిరికారం
మానిని మమకారంలో – మగని మనసె ఆకారం.

తెలుగు చలన చిత్రకాంత – పరకామిని కామనలో
పరకామణి ఫలములో – విఫలమాయె విలువ విడచి.

పరమహంస పరివ్రాజక – పావనతను గమనించగ
లోకధర్మలోలుపతలు – పతనమగును తత్త్వమునను.

నేను లోని నేనె నీవు – నేనును నేనని చూడుము
నేను నేనైన వేళను – నేనే నేనుకు నేనగును.

బతుకు భావమైన వేళ – భాష భాగ్యమగునుగా
చేత చెలిమిగాను మిగుల – చైతన్యము జీవితము.

గమ్యము రమ్యమైనదైన – గమనం గరువమ్మగును
పయనం పరువమ్మైన – పరమార్థం జీవితమ్ము.

దేవుడు కలడనువారికి – దేహము దేవాలయమే
లేడను వాదము వారికి – దేశమె దేవుని యిల్లు.

లేనప్పుడు నీవు లేవు – ఉండి నీవు ఉన్నతుడవు
ఉన్నతమౌ భావమందు – ఉద్భవించు పరమాత్ముడు.

కథలు వ్యధలు కలవరములు – విధి విలువలు వింత తీరు
బధిరమైన బాధితులకు – భవ బంధమె భాగ్యము.

చిన్న పెద్ద తేడాలిట – విన్నదనము ధనముతోడ
కన్నవిన్న కలవరమగు – సమానతయె మానధనము.

నిధిని నిత్యమని చూడకు – నీవు నిత్యమేమి కాదు
సత్యమైన పమాత్ముడె – రతిశీలుడు మతిమంతుడు.

307

విద్యయేమొ విధ్వస్తము – ఆరోగ్యము అధ్వాన్నము
జనుల బతుకు జవహీనము – నిత్యఘోర నరకమాయె.

ప్రజారోగ్య పథములోన – పదములు తడబడుచుండెను
కార్పొరేట్ల కలిమిలోన – కష్టములే కలవరములు.

విద్యవిలువ తెలసినోళ్ళు – నోళ్ళుదెరచి చూస్తుండిరి
వృత్తివిద్య వృత్తములో – విగతజీవులైరిచ్చట.

సంఘజీవనమ్ములోన – అసాంఘికం అదుపుదప్పె
పరిశుభ్రత అభ్రమాయె – వ్యాధులేమొ వెల్లువాయె.

పదార్థముల కల్తీలిట - సహజ ఎఋవు కరవాయెను
రసాయనపు రమ్యతలో - గమ్యము రమ్యత వీడెను.

మురుగునీరు మరుగుగాను - దోమలు దోర్బలముగాను
వ్యాధులకిట మూలమాయె - వ్యథల బతుకు పృధులమాయె.

తల్లిపాలు లేక బిడ్డ - తరళముగా ఎదగలేదు
స్తన్యమిచ్చుతల్లులేమొ - తరచైరిట తప్పిదమిది.

ఆయుర్వేదమునందున - అవగాహన కలుగగాను
ప్రకృతి వైద్యము దెలిసిన - వైభవమె ఆరోగ్యము.

అంతరమున పరిశుభ్రము - బాహిరమున భాస్వంతము
వ్యాయామము వెలుతురుగను - ధ్యానయోగధ్యేయమగును.

ప్రకృతిలో లీనమయిన - పరమార్థము లభియించును
వికృతికే విలువనివ్వ - వింతతీరు ప్రబలమాయె.

పాపము శాపము రెండూ - పరవశించి ప్రభుతగాంచి
పావన నవ జీవనమును - వనములోన బడివేయును.

ముందస్తు జాగ్రత్తలు - ముఖ్యమగును జనావళికి
మందులతో మాన్చుకొనుట - మహిమకాదు మహిలోన.

ప్రజలలోన చైతన్యము - ప్రగతిగాంచు ఆరోగ్యము
రోగరహిత సమాజమే - భోగమగును యోజనమున.

తప్పుకొనుచు ప్రభుత్వాలు - తప్పిదమ్ము సేయుచుండె
మెప్పునొందు మెలకువయే - విద్యవైద్యముల సేవలు.

వృద్ధిచెందు దేశములకు - బుద్ధిగలుగు ప్రతినిధులే
శుద్ధి బుద్ధి వెలుగుపంచ - సురుచిరమగు భరతావని.

308

నవజీవన వనములో - వికసించిన మల్లెనీవు
సంస్కారపు సౌగంధ్యం - వెదజల్లే వెలుగువీవు.

పాతతరం తలపులో – పావనతను గమనించు
కొత్తదనపు కొలువులో – కోమలతను కాంక్షించు.

త్యాగానికి తెరువరివై – యోగానికి యోద్ధవై
యాగానికి యత్నించుము – యాతనలను అధిగమించు.

స్వార్థములో శోభలేదు – ఫలమిచ్చును పరమార్థము
పావనతకు నతులనిచ్చి – మానవతకు మాన్యమగుము.

ప్రకృతికృతి పరవశమ్ము – కృతకమ్మున కూర్మిలేదు
మార్మికతను మరపించుము – ధార్మికతకు దారియిమ్ము.

జనేచ్ఛయే జాగృతమై – జయముగాంచు జీవితాలు
ధనేచ్ఛయే దారిద్ర్యము – ప్రశాంతతకు అంతమది.

సాపేక్షము మంచిచెడులు – సరసార్థము సదయ కలిమి
పదుగురి భావన భాగ్యము – యోగ్యమైన యోజనమ్ము.

నిన్ను నీవు తెలిసికొన్న – నిధియే నీ స్వంతము
తెలియలేని స్వాంతమున్న – అశాంతియే అంతమునకు.

ఋజుత్వము ఋషిత్వము – రుజువెనీకు నడతలో
రుజల బతుకు గతుకునిజము – గతము గమ్యమగును జగము.

దివ్యతకే దిటవునిచ్చి – నవ్యతకే నడకనేర్పి
నాణ్యమైన నరజన్మను – గణ్యముగా తీర్చిదిద్దు.

'మూర్తి' కీర్తి కరముగాదు – స్ఫూర్తి నీకు సుందరమ్ము
ఆర్తి నందు జీవితాలె – అవనతమీ జగములోన.

అంతరాలు అంతమగును – ఆంతర్యము శాంతమైన
అవగాహన ఆలోచన – లోచనమగు లోకమందు.

మందులేని రుగ్మతలను – తపియించును లోకముల
తరియించగ తరుణమొచ్చె – తృష్ణలేక సాగగాను.

సాగరమ్ము సంసారము – సారమైన వరణీయము
సహనముతో సదయతోడ – సాగగ తరణము సులభము.

309

జీవన నవగమనములో – జిలుగు వెలుగు కలుగగాను
ప్రకృతిలో మమేకమై – అనుగమింప అతిశయము.

బంధనములు బంధువులై – బాధలు జనబోధలై
భాగ్యములను కలిగించును – భావములో వాసికలుగ.

సింధువులో బిందువే – నీవు ఎఱుక గాంచినదీ
బిందువునే సింధువుగా – చేయగాను చెలువు కలుగు.

మాన్యుల నవ బోధలతో – మాన్యమైన భరతావని
దీనత్వము మాన్పగాను – దివ్యమగును సంస్కారము.

త్యాగధనుల చరిత్రలను – త్యజియించగ బాధగలుగు
జయశీలము జనులలోన – చైతన్యము పంచిరిగ.

వ్యామోహము వ్యతిరిక్తము – వ్యవహారము వ్యత్యస్థము
వ్యవస్థ అస్తవ్యస్తము – వ్యక్తి శక్తి వెలుగు వీడె.

సంపాదన పాదులోన – పెరుగుచున్న పదవి చెట్టు
వేరు పురుగు గ్రహియించక – వేగముగా మరణించును.

స్వార్థము శోభావంతము – పరార్థమ్ము ప్రల్లదనము
కల్లయైన వల్లకాడు – కారుణ్యము అరణ్యము.

పెద్దలంత పెరిగినారు – పేదలు భువి తరిగినారు
తిరిగి భూమి గుండ్రమై – గాండ్రించెను జనస్వామ్యము.

పట్టణాలు పెరిగిపోయి – పల్లెలేమొ తరిగిపోయి
పల్లె వెలుగు ప్రయాణమై – పట్టణాల 'బారు'నబడె.

సారా విరివిగ దొరుకును – సారమైన నీరు కరువు
మత్తుమనీ మాన్యతాయె – చిత్తరహిత ప్రభుతలాయె.

ఆరాటపు పోరులోన – అంతరమే పార్టీలయి
వింతతీరు విప్లవాలు – విలువలేని దీక్షలాయె.

ఐదేళ్ళకు పదవులాయె – పసరములకు సరములాయె
వారసత్వ రసత్వమున – వాల్లభ్యము చెల్లిపోయె.

తెలుగు వెలుగు తెరలిపోయె – సముద్రాల తరగలపై
పరదేశం దేవళమై – డాలరు నవదైవమాయె.

ప్రాచీనత ఛీత్కారము – రాజకీయ కీలుబొమ్మ
బొమ్మగాను తెలుగుబొమ్మ – ఢిల్లీలో డీలు వడెను.

310

దేశం మధ్యంతరం దేవులాటలో దేహాన్నే మరచిపోతుంది
అణుభారం పెనుభారమై అధికారపార్టీకి ధిక్కారస్వరం వినిపిస్తున్నది.

కాలం మారిన కామ్రేడ్ల కార్యాలు కాంగ్రెస్‌కు కొరుకుడు పడడంలేదు
ఎలయెన్సులు ఎన్నైనా రిలయెన్స్‌లేని పార్టీలు రింగులు త్రిప్పుతున్నాయి.

నీతికి నీళ్ళొదిలిన నిన్నటి నాయకులే నేటి దీటు ప్రతినిధులు
మరచిపోయిన ఎన్నికల వాగ్దానాలు కలలో కలవరం కలిగిస్తున్నాయి.

భూకబ్జాల రాబందుల బందికానాలో సామాన్యుడు బందీయే
భూపోరాటం ఆరాటంలో అసువులు బాసిన అమరులకు వందనం.

వేల ఎకరాల అసైన్డు అటవీ భూములున్నా అర్హులకు అసలు అందవు
రోజుకో కుంభకోణాన్ని పత్రికలు, ప్రసారసాధనాలూ ప్రవచిస్తున్నాయి.

స్వేచ్ఛను బహిరంగంగా హరిస్తున్న స్వచ్ఛమైన తెలుపు చొక్కాల వాళ్ళు
పౌరజీవితంలో జీవాన్ని మింగేసి ఔరా! అని ఆశ్చర్యం ప్రకటిస్తున్నారు.

హైటెక్ మోసాల హైరానాలో హైన్యమైన హితకారుల జీవితం
గాంధీగిరి సినిమాల గారడీలు చిరంజీవులైన నాయకులకు మాత్రమే.

సులభ సుఖాల సుందర నందనంలో సూక్ష్మంలో మోక్షాన్ని పొందుతున్నారు
రాజనీతి లోపించిన రాజకీయాలు రాసభాల కాళ్ళదగ్గిరే ఉన్నాయి.

సామాన్యునికి పట్టని విషయాలే అసామాన్యమై అవతరిస్తున్నాయి
ఇంతజాగాలేకుండా ఇల్లుకట్టుకొమ్మనే హితమతుల ఆంతర్యమేమిటో.

ఆధ్యాత్మికత్వానికీ ఆత్మీయతకూ అందని ఆలయాల నిర్వహణమేమిటో
సరసల వరసలు సర్వశిక్ష భక్షణకు సహకరించిన వరులెవ్వరో.

శ్రీవైష్ణవుల చింతనలో రూపుమారే ప్రభుత్వరంగ పరిస్థితి యేమిటో
అద్దంలో అమెరికా అందంగా కనిపించి ఆస్వాదన కందని కారణమేమిటో.

సెల్ఫ్‌కొరకు సెల్ఫిష్‌గా గల్ఫ్‌దేశానికెళ్ళిన భారతగాడిదలమోత బరువెంత
అమరమైన అమెరికాలో మరణించిన ఆధిక్యమేనని తలచే మనవళ్ళు.

సాంకేతికమంటూ సంకల్పాన్నే మరచే సామ్రాజ్యవాద బానిసల బతుకేమిటో
సంస్కారం సాగిసాగి తెగిపోయి తెల్లవాళ్ళను మళ్ళీ ఆహ్వానించే స్థితి.

అభివృద్ధి చెందామంటూ అహంతో విహరించే వారు ఆత్మపరిశీలన చేసుకోవాలి
మానవ వనరులు మస్తుగానున్న దేశానికి పస్తులుండే పరిస్థితి ఎందుకో.

గ్రహాలను పంపితే ఆగ్రహం వెళ్ళగక్కే అమెరికా మనకు శనిగ్రహమే
అభద్రత అమెరికా అంతరంగాన్ని వేధిస్తూ అందరికీ పంచమంటుంది.

311

అప్పుతెచ్చి అప్పనంగా దోచిపెట్టే ప్రజాప్రతినిధుల ప్రాణం తీయాలి
గన్‌మేన్‌లు లేనిదే గమించలేని గమ్మత్తు రాజకీయాలు మనవి.

స్వామికార్యం స్వకార్యం సాధించుకొనే స్వార్థరాజకీయాల శోభ
మంచిని మట్టికరపించి వంచనతో అంచెలంచెలుగా ఎదిగే అవినీతి వ్యవహారం.

చట్టాలు చట్టుబండలుగా సంపన్నులచుట్టాలుగా మారిపోయే మాంత్రికం
న్యాసం దప్పిన న్యాయం నల్లకోట్లచాటున నక్కివెక్కిరిస్తున్నది.

ఫైవ్‌స్టార్ సంస్కృతిలో పరమాన్నం దొరకని ప్రశస్త పరసంస్కృతి
నేలనింగివిధంగా అర్థవంతుల ఆగడాల మధ్యనలుగుతున్న మధ్యతరగతి.

నించొన్నకొమ్మను నరుక్కొంటున్న నియమ విరహిత నిధి జీవనులు
తెలివి ముదిరి తెలుగుదనం అమెరికా కంప్యూటరులలో అందమొలికిస్తున్నది.

కొత్తతరం రాజకీయాలు కొలువుదీరే సమయం ఎంతో దూరంలో లేదు
పోలికలో వాడుకాకపోతే వీడనే విధమేకాని విలువలు విగతించాయి.

గతం గణ్యమైనదనే గమనంలో వర్తమానం నర్తించి భవిత కీర్తనపాడుతుంది
అంబేద్కరు ఆశయాలు అమరమై విగ్రహాల్లో నిగ్రహంగా నిలుస్తున్నాయి.

ఆకొన్నవాడు ఆగ్రహిస్తే అన్నం దొరుకుతుందో లేదోకాని లిక్కరు దొరుకుతుంది
రక్షిత మంచినీరియ్యలేని రాజకీయం సారాతో సాగిస్తుంది జీవనం.

స్వాముల లెక్చర్లు స్వానుభవంలేక స్వార్థనాయకులకు శోభనిస్తున్నాయి
వేగం భయం వెతల బతుకుల్లో చితికి పోతున్న చేతనత్వం.

పరభాషా మోజులో తల్లిభాషను తగలేస్తున్న తాంత్రిక రాజకీయులు
కార్పొరేట్ల కలకలంలో కలవరపోతున్న కారుణ్యహృదయులు.

వెలిగిపోతున్న భారతాన్ని వేకువలో ఆనందించే వేద్యులున్నారా?
ఫలంలేని పథకాలకు ఫలకాలతోనే సరిపెట్టే రాజకీయ సంస్కృతి.

అస్మదీయులకు లబ్దిని చేకూర్చే అంతరంగంతో అనుగమిస్తున్న నేతలు
ఇందిరా రాజీవులు వందితులే! పేరుపెట్టే పథకాలతో పేలవములు.

చంద్రయానం చేసే భారతమ్మ అణుఇంధనంకోసం ప్రాధేయపడాలా?
మతలబులెన్ని ఉన్నా మతిచెడిన నేతల్లో మరోసారి ఎన్నికలు.

గెలుపోటముల గెంతులతో తంతులతో వంతపాడే వరసలు
మూడురంగుల్లో మాడిపోతున్న పచ్చదనాన్ని పల్లెవెలుగు బస్సు బ్రతికిస్తుందా?

అరవైయేళ్ళ స్వతంత్రభారతానికి అర్థంతర మధ్యంతరం తగునా?
మన్మోహన మోహనానికి మోదం తెలిపే మోతుబరులభవితవ్యం ఏమిటో?

సోనియా శోభ యినుమడిస్తుందా! మడిగట్టుకొన్నమనువాదులు జయిస్తారా
మధ్యలోని మూడోఫ్రంటు మిథ్యగా మిగులుతుందా! వామవాదులు వరిస్తారా?

అంతరాలు తీర్చడానికి మధ్యంతరం శరణ్యం! సమానతకు సహకారం
దివ్యమైన భారతావనికి దిటవైన పటువైన నాయకత్వం కావాలి.

312

సాగరముల సరసత్త్వము – నదులలోని నాణ్యతలను
కాపాడిన పాడియగును – కమ్మదనం కలిమి కలుగు.

స్వార్థమునే స్వాగతించి – పరార్థమును పరిమార్చి
పరమార్థం ప్రదర్శించ – అర్థములేనిది బతుకిట.

నీడనిచ్చు చెట్టునకూ – నీరుపోయు విధియెనీది
అనుభవాల భవమునకూ – అహరహమూ వందితుడవు.

కోపతాపములు లేనిది – కోరికలసలే లేనిది
నిత్యసత్యమైనట్టిది – నీజీవన గమనమది.

నింగినీరు నిప్పుగాలి – నిధులు నీకు యీ భువిలో
నిరంతరము కాపాడుము – నిన్నవి కాపాడు చుండు.

పంచభూతముల సాక్షిగ – భూతగణము రక్షించుము
భుక్తి శక్తి రక్తి ముక్తి – భువనములో నీకగును.

సూర్యచంద్రులిద్దరూ – శుభములు నీకివ్వగా
అశుభములను వారికిచ్చి – అవనతుడవు కాబోకుము.

మండనముల భూగోళము – మండిపోవుచున్నదిపుడు
భండనమున భయమునా – అండనీకు లేదిచ్చట.

భూతములే పెరుగుచుండె – భుక్తమాయె వనరులిచట
వసుధలోని వనరులనూ – రక్షించుము దక్షతతో.

రసాయనికంలోనా – రసనలు రసియించెను
సేంద్రీయ సేచనతో – శక్తిగాంచుమీ భువిని.

అందము చందము బంధము – అవతరించి తరించగా
కృతకముగా వికృతముగ – ఆకృతులే అవనతమయె.

ప్రకృతియే ప్రసాదించె – ఫలములను మూలికలను
వానిని ఉపయోగించగ – వాసిగాంచు నారోగ్యము.

ఆంతర్యము శుద్ధమైన – అవని అంతాశుద్ధము
బుద్ధి సిద్ధినందగాను – భూమియె నవనందనమ్ము.

పరిసరాల కాపాడుము – పసరమువలె వర్తించకు
వరమెనీకు వసుధనేడు – పరమార్థమె ప్రసాదము.

కాలుష్యము కలవరమై – కలరవముల సృష్టించెను
కాలచక్రగమనంలో – సాధించనిదేది లేదు.

313

తూరుపు సంధ్యారాగం – మారుపునవ బందూకం
అరుణకిరణ అవలోకన – ఆశయాల మహోదయం.

తిమిరం తిరిగిపోయి – వెలుగువేకువాయెగా
చైతన్యం చెంగలించి – చేవను కలిగించెనుగా.

కోరిక కొండమీద – కొలువుదీరె సూరీడూ
కారణమే కాలముగా – కలతలన్ని తీరెనుగా.

వేడుకాయె వెచ్చదనం – చల్లదనపు వెతలు చెల్లె
ఋతువు రుణము అరణముగా – ఋజువర్తన కలిగెనుగా.

నిత్యప్రయాణీకుడుగా – నింగిలోని సూరీడూ
బతుకు బాటసారులకూ – తేటదనం పంచునుగా.

సంకేతము మార్పునకూ – సంతతము సహితము
సరళత్వము విరళత్వము – సాగువిధము సాక్షిగా.

మస్తకముల మాలిన్యము – మరపులోన మాటుసేసి
మానవత్త్వమను మాటకు – మహితత్త్వము సాధించెను.

పక్షి పశువు శిశువు జనుడు – పరవశత్త్వమందగా
కదలికలతొ కథలు చెప్పి – కలవరముల దీర్చెగా.

వైవిధ్యము వైభవమూ – ఎఱుకలోని ఏకత్త్వము
ఆత్మలు పరమాత్మలూ – అన్నియు ఆ వెలుగుఱేడె.

రంగుల లోకానికి – రాసిక్యం అద్దగా
ఆనందం ఆర్ణవమై – అవని జనత మురిసెనుగా.

పర్యావరణం నేడు – పలకబారిపోయెనుగా
రక్షకులే భక్షకులై – రహి వీడెను రాసిక్యము.

ప్రకృతిలో పరవశించి - పరిమళాలు అనుభవించి
ప్రాభవమును వీడెనుగా - పరాభవము కాంక్షించెను.

ఇల్లు ఒల్లు శుభ్రముగా - హితమతిగా వర్తించెను
వీధిని విధ్వస్తముజేసి - కలుషములను కామించెను.

సింధూరం ఇంధనమై - అంధకార మంతరించు
వేడి వెతలు తీరిపోయి - వెలుగులు రహియించును.

314

భాగ్యనగరమా - అభాగ్య నగరమా
అభద్రతా భావమా - ఆర్తికి సంకేతమా
తెల్లవారుఝామునుండి - తెల్లవారువరకునూ
తెరువరులకు తెరువుదెలిపి - తెలివిమీరు నగరమా.

రణగొణధ్వని రభసతో - రాజవీధులన్నీ నిండి
ట్రాఫిక్ జాములలోనా - ఝాముల జాగరణలాయె
ఎవడు ఎవడు ఎవ్వాడో - ఎఱుకలేని మరకలతో
ఎదగదిలో స్వార్థంతో - అర్థసాధనమ్ములాయె.

సంస్కృతి సంగరమాయె - పరిష్కృతే అపకృతై
పరిసరముల ఆకృతులే - పసురములకు నిలయమాయె
బాంబుల సంస్కృతిలో - భాస్వంతము భరతావని
భాగ్యనగరి భామకదియె - అరుణిమ వరణమ్మాయెను.

రాబందుల బంధములో - రాక్షసాధముల ఒడిలో
రాజకీయలోచనలో - రక్తాంబరి భాగ్యనగరి
బతుకుట బతికించుటకని - చంపుట చనిపోవుటకను
సరళ కలిత కలయేనని - సాక్షిగ సాక్షాత్కరించె.

హైటెక్కు నగరమునకు - హైన్యము దైన్యమ్మాయెను
అనుభవ భవసారములో - అవహేళన అధికమాయె
రక్తమాంస ఖండములతొ - బీభత్సము భయంకరము
గాలిలోకి ప్రాణములూ - గాటమాయె వేదనలూ.

జనరక్షణ కరవాయెను – రక్షకభట రాజ్యములో
విధులు మరచి విలువ విడిచి – విభవము భవసారమనిరి
బుద్ధ జన్మభూమి సాక్షి – ఆటవిడుపు జనులకచట
ఆనందము ఆర్ణవమై – రక్తార్ణవమాయెనచట.

విద్రోహశక్తులకూ – విడిదియె హైదరబాదు
మతఛాందస వాదులకూ – మాన్యమాయె భాగ్యనగరి
తెలిసి మిన్నకుండిరా – తెలివిలేక యుండిరా
తెలిసికొనుట గగనము – తేటరాజకీయమూ.

అంతర్జాతీయమందు – ఆంతర్యము అంతరము
మహ్మదీయ క్రైస్తవముల – మారణహోమము మూలము
బంగ్లా పాకిస్తానులు – స్థావరములు ద్రోహులకూ
అస్థిరతే గమ్యముగా – గమిస్తుండె ఉగ్రవాది.

315

నేరగాడు పోలీసు – నెఱజాణల విధమున
అడ్డు అదుపులేదాయెను – విధ్వంరము విలువలిచట.

బందూకుల ప్రతినిధులూ – భయంలోన జనగణములు
బాధ్యత మరచిన వారలు – బతుకు జీవులకు వెతలు.

ముందుచూపు లేని ప్రభుత – పొంతనలేనివి మాటలు
అందమైన బతుకులలో – హఠాత్తుగా విషాదము.

పరామర్శ పరమార్థము – అర్థము అవమర్శనము
రాయితీల ప్రకటనలూ – రాజకీయ నిర్ణయాలు.

ముందుగాను నిర్లిప్తత – వెనుకచూడ అతిస్పందన
స్వార్థమేమొ సార్థకమ్ము – పరార్థమ్ము పల్చదనము.

సీమాంతర ఉగ్రవాది – సీమలోని ఉగ్రవాది
చెట్టపట్టాలు వేసుకు – చెడ్డపనులు చేస్తుండిరి.

అధికారము అంధమాయె – మాంద్యములో మాన్యులాయె
మానవతే మసిబారెను – దానవతే ధరణిమిగిలె.

అమ్మల ఆక్రందనలూ – నాన్నల ఆవేదనలూ
బంధుజనుల రోదనలూ – భాగ్యనగరి దృశ్యములూ.

విహారముల విందులలో – విగతజీవులైన వారు
వికలాంగులు బాధితులూ – రోదనలతొ భాగ్యనగరి.

నాగరికం నడత దప్పి – అనాగరికమందమాయె
జంతువృత్తి జాడ్యమాయె – వింతతీరు విధ్వస్తము.

సాంకేతిక సాగరము – కంప్యూటరు కాంతిమూర్తి
సహజీవన సౌందర్యము – రక్తపుటేరున సాగెను.

విజను మరచి యిజములూ – విధ్వంసము కాంక్షించగ
మౌఢ్యము జనమధ్యమునా – మొద్దుబారి హద్దుమీరె.

స్వేచ్ఛా స్వాతంత్ర్యములే – స్వార్థాసురబారిన బడి
సార్వభౌమత్వములను – తాకట్టున పెట్టుచుండ్రి.

ఆత్మ మర్మనమ్ములేని – అధికారుల ప్రతినిధుల
ఆటపట్టు ఆంధ్రజాతి – అధికమగును వధలు వ్యథలు.

జాతిజనత జాగృతమయి – ఆగ్రహమును ప్రకటించుచు
ఆందోళించగ నేడు – అవహేళన అవనతమవు.

ఉగ్రవాద చర్యలకు – ఊతమిచ్చు దేశములను
సంఘ బహిష్కరణసేయ – పరిష్కారములు కలుగు.

316

లోక్‌సత్తా లోక్‌సత్తా – లోకులదీ లోక్‌సత్తా లోకానిది లోక్‌సత్తా.
భారతమ్మ భాగ్యంతో – దేశభక్తి దేహముగా
జనగుండెలు దేవళముగ – ప్రభవించినదీ సత్త.

ఆంధ్రదేశ సాక్షిగా – అవతరించె సేవలో
జనుల జాగృతముసేయగ – జయముగవెలసినదీ సత్త.

స్వాతంత్ర్యము స్వాగతించి – ఆరుపదులు నిండినా
స్వార్థాసురసంహారం – జరుగలేదు స్వామ్యములో.

కులమతాల కూలగొట్టి – వర్గపార్టి వదలిపెట్టి
సత్యమైన సేవలో – నిత్యమైనదీసత్త.

పదవుల వేటయే – పరమార్థముగా నెంచి
సంపాదన ముఖ్యమనీ – సంచరించు నేతలకూ.

చెంపపెట్టు ఈ సత్త – చేతనతో కదులు సత్త
గూండాగిరి దాదాగిరి – గుట్టురట్టు మట్టుసేసి.

గాంధీగిరి గరువముతో – గమియించెడి దీసత్త
దీక్షలనీ బందులనీ – హర్తాళ్ళని ధర్నాలని
జనులను ఇబ్బందిపెట్టు – నాయకులకు చెప్పు పెట్టు
ఇజంలేని విజనుతోడ – ఇంతింతగ ఎదుగుచుండె.

జయప్రకాశునేతృత్వము – జావళీగ సాగుచుండె
అధికారం ప్రతిపక్షం – మీది మీది తప్పంటూ
గతము వర్తమానములను – గాడిదప్పించుచుండ్రి
స్నిగ్ధమైన సిద్ధాంతం – సిరులనిచ్చు వేదాంతం.

ప్రగతిపథం పయనంలో – పరవశించు జనస్వామ్యం
ఆక్రమణల విక్రములూ – ఫ్యాక్షనిష్టుపార్టీలూ
అవినీతికి అడ్రసులూ – అన్ని తెలుసుకొన్న సత్త
సారాను సాగనంప – సాగించెడి సమరంలో
పూర్ణమద్యనిషేధమ్ము – కాంక్షించినదీ సత్త.

317

వ్యవస్థలో అవస్థలూ – వ్యత్యస్థపు వ్యక్తులూ
వేరుపురుగులైన వారి – ఏరివేయునది సత్తా.

మేధావుల మధనంతో – మేలిమిగా ఎదుగుతుండె
పదవులు లేకున్నగాని – పరమార్థము జనసేవన.

నిరుద్యోగం రక్కసినీ – నింగికెగురగొట్టగాను
నియతియైన పథకములతొ – పయనించునదీ సత్త.

నీలిరంగు జెండాపై – తెల్లని నక్షత్రగుర్తు
నీతి నిజాయితీలకు – నిధియైనది లోకసత్త.

ఓటువిలువ తెలియజేయు – ఓపికతో శ్రమియించి
రాజకీయ గతినిమార్చు – రమ్యమైనదీ సత్త.

మారుతున్న సమాజమున – మారని విలువలు కొన్ని
సనాతనము సంస్కారము – సాగెడిదీ లోకసత్త.

తరమును రక్షించగాను – నిరంతరము తపియించే
త్యాగశీల వ్యక్తులున్న – తెంపరియీ లోకసత్త.

యంత్రాంగపు యాతనలను – యావతోడ గమనించి
సమర్థతే అర్థముగా – సార్తకమైనది సత్తా.

కపటము కల్మషములేని – కర్షక కార్మిక లోకం
అనుభవించు బాధలకూ – అంతము చూపెడి సత్తా.

సంఘమందు మహిళకూ – సాధికారతను యివ్వగా
సమసమాజ స్థాపనకూ – సంగ్రామము సేయుసత్త.

ఉగ్రవాద అగ్రవాద – ఉద్యమాల నిరోధించ
ఉన్నతమౌ వ్యవస్థతో – వ్యవహరించునది సత్త.

సామరస్య ధోరణిలో – ప్రాంతాలు ప్రదేశాలు
కలియుట విడిపోవుటకూ – అవకాశము కలిగించును.

విద్యావైద్యములకూ – విలువ నిచ్చు నియమము
దేశప్రగతి దివ్యముగా – వెలిగించునదీ సత్త.

అంధులైన అధికారులు – కాఠిన్యపు కామందులు
కలవరపడి కలిసిరాగ – కాంక్షించునదీ సత్త.

ఆంధ్రదేశ అధికారము – అందుకొనగ అవకాశము
ఆశయాల ఆలోచన – అందరికీ క్షేమకరము.

318

తెలుగు సాహిత్యసేవలో వెలుగులద్ది – కవుల పోషించి కృతులకు కాంతిపంచి
వాసి గాంచిన వరులకు వందనములు – అభినుతులనిత్తు కందుకూర్ అందమునకు.

యిర్వదేండ్లనాడు యిచటకు వచ్చితి – పర్వమాయె బతుకు గర్వమునను
అమ్మకందుకూరు అందించెనన్నియు – రుద్రకవియునిచ్చె భద్రకవిత.

సంతుచింతలేదు సంతసమాయెను – మనుమడుద్భవించె మంచిమిగుల
జన్మభూమి సరస జాగృతి మించగ – వెళ్ళుచుంటి నయ్యె వేళమిగిలె.

ఉలిచి యలమంద కోట్రెడ్డి ఉన్నతుండు – దివ్య దివివంశ దీధీతుల్ దిటవుపంచు
కనగ కంచర్ల రామయ్య కలిమియుతుడు–జనత జయశీల కందుకూర్ జయముగాంచు.

కవులు కళలకు కాణాచి కందుకూరు – భవ్య కళ్యాణభారతి భాసితమ్ము
సాహితీమిత్రమండలి సరసముగను – సభల విభవము అభయమై శుభముగూర్చె.

తెలుగుభాష వెలుగు తేలిపోవుచునుండ – నడుముకట్టినట్టి నవ్యులంత
ఆత్మగౌరవమున ఆభిజాత్యముతోడ – అడుగు ముందు నడువ అందమగును.

అంతమందు కలుగు ఆధ్యాత్మికత్వమ్ము – ముందుకలుగగాను ముదము గూర్చు
ఆత్మదర్శనమున అందరు సాగగా – జీవితమున వెలుగు జిలుగు కలుగు.

319

నతుల నుతులనిత్తు నయగారమలదగా – కవిత కమ్మనాయె కర్మభూమి
మర్మమైన బతుకు మాధవధర్మమై – మహిమపంచు గాత మాన్యులకును.

సోమదేవుడిచ్చు శోభలు విభవము – అభయమిచ్చుగాత అంకమాంబ
క్రీస్తు కీర్తనముల కీర్తిని గలిగించు – అల్లమహ్మదుండు ఆర్తిదీర్చు.

320

చట్టుబండలైనవి చట్టములు – మట్టుబెట్టబడినవీ ధర్మములు
మంచితనం మగతలో మునిగినదీ – మత్తులోని చిత్తములే మరుగుతున్నవీ.

మమత మానవత లిట మరువ బడినవీ – సమత సామరస్యములే సమసినవీ
హింసాదౌర్జన్యములే హితముగానున్నవీ – మాంసపు ఆహుతులే మతములైనవీ.

సామాజిక న్యాయమన్న సరసత కోల్పోయెను
సమసమాజ వాదనయే వేదనగా మిగిలెను.

ఉగ్రవాది ఉగ్గుబాలు పెగ్గులుగామారెను
మాఫియాల మాన్యములే సోఫాలుగ మిగిలెను.

వంచన పంచన నరుడే వసుధ వలపు విడిచెను
జన్మబూమి జననినీ మానరహిత జేసెను.

కులమతాల తంపటులు నేతల చలిమంటలు
జనతభయం భావనలే స్వార్థపరుల కామనలు.

వ్యవస్థలో వ్యత్యస్థము వ్యక్తుల వ్యక్తిత్వము
సంఘంలో అఘ సహితము – అధికారుల అనుమతులు.

జనస్వామ్యపు చింతలకే – అంతము ఆలోచించగ
వింతగు విలువలు తెలిసెను – వివరమడుగ విప్లవమే.

మనసులలో మరుమల్లెగ – వికసించిన విప్లవమే
మానవులలొ మానవతే – విశ్వజనత కోరునదే.

321

మన్నిక విడిచిన ఎన్నికలొచ్చెను – మన్నన మరచిన – వన్నెల నేతలు.

అర్ధ శతాబ్దములో అర్థమాయె మనస్వామ్యం
అర్థమిచ్చు నేతలే అర్థార్థులు పదవులలో.

మత్తుమనీ మచ్చలై మసిబారెను మనపాలన
పొత్తు చిత్తు హత్తుకొనీ – పొగచూరెను జనహృదులు.

సుద్దులు చెప్పెడి పెద్దలు – సుంత నీతి లేనివారు
బుద్ధిచెప్పు ఓటరులే – వింత విలువ వేల్పులే.

సేవలోని చేతనతా – చేవలేని ఆలోచన
అవగాహన కరవాయెను – ఆశయమే మరుగాయెను.

భయంలేని అధికారం – బాధమిగులు వేగమంత
ఉపయోగం యోగించక – ఉద్యమమే నీరుగారు.

అసత్యమే నిత్యమాయె – అవినీతియె నీతిగాను
అవసరమే అవధిగాను – అధికారమె ఆద్యమాయె.

పాలక పాలితులందున – పరమార్థం స్వార్థముగా
సార్థకతకు విలువలేక – వార్థక్యము వ్యవస్థలో.

అంతరములు విడువగాను – వింత తరము వృద్ధిగాంచు
ఆంతర్యమె అభ్యుదయం – అందలమున భారతమ్ము.

322

లంచమన్న మంచమెక్కు లాక్షణికులు నేతలు
వంచనయే వాలకముగ వరులైరధికారులు.

భారతీయ సంస్కృతిలో భావమేమొ తెలియకా
భాగ్యమె అర్థమనీ బాధలోన బడుచుండిరి.

ధర్మమన్న దారిలేని దారుణియే భారతమ్ము
మర్మమేమొ తెలియదనీ మేధావుల వాచకమ్ము.

దేహమందు మమతనూ, దేశభక్తి హీనతనూ
దేవులందు భక్తిముక్తి, మానవత్వమే హుళక్కి.

త్యాగమన్న కథలలోనె – యోగమన్న భోగమదే
సేవయన్న మాటలలో – చేతమందు చెదపురుగు.

కాకమ్మ కబురులతో – కామితములు తీర్తురు
కలికాలపు కల్లలలో – కలల జీవనము సేతురు.

అందరికీ తెలిసినదీ – అంధకారమున మునిగె
అందనిదీ పొందనిదీ – అందరిదై అవని నుండె.

బ్రతుకిచ్చిన భూమికీ – బద్ధశత్రువాయెను
బుద్ధిలేక వర్ధిల్లుచు – బద్ధకమున మునిగె.

323

తన ఇంట్లో కశ్మలాన్ని రోడ్డుమీద ఎదుటివాడి యింటిముందు వేసే ఏఱుక స్వర్ణ భారతంలో జనులది.

ఆక్రమణల్లో చిక్కిపోయిన బజార్లు మొక్కల పెంపకానికి అనుకూలించవు.

ఇంటిని అద్దంగా చేసికొని కంపును వీధిలోనికి వదలే కర్మఠులున్న దేశమిది.

మూఢత్వం ముద్దొచ్చి చంకనెత్తుకొని చస్తున్న విమూఢుల సంస్కృతి నేటిది.

కొననివాడు అమ్ముడుపోనివాడులేని జనస్వామ్యంలో విలువలు విగత జీవమైనాయి.

తప్పును చెప్పి నిలదీసే వ్యక్తిత్వం గల్గిన వ్యక్తులు యీ వ్యవస్థలో అవస్థలు పడాలి.

ఆకలి, అవినీతీలేని నవభారతాన్ని ఆకాంక్షించి అమలుచేసే పూజ్యప్రధానులు పుడమిలో పునీతులు.

అందివచ్చే అందలాలకు అతీతులైన బాలలే భాగ్య సహితులు.

మాతనుమరచిన వారికి మాతృత్వపు మధురిమను నేర్పే మధుమతులు కావాలి.

సంగతులు అసంగతాలైనపుడు సాంగత్యానికి సాహసించే సాధువులిట కరవు.

స్వాహాస్వాముల స్వార్థానికి స్వాతిశయ స్వర్ణభారతి సొగసు సోలిపోతుంది.

పేపర్‌లీకుల పేటెంట్ హక్కుల 'బ్రహ్మ'లు ఆరామ విరామంలో అందగిస్తున్నారు.

ఖాళీలేని గదుల్లో కాపీల కాట్లాట కొట్లాటగామారే దశను మౌనంగా వీక్షిస్తున్నాము.

కంచే చేనుమేసిన గతిలా గతిమాలిన విద్యావ్యవస్థ మార్పుల తీర్పులతో మలినమౌతున్నది.

పరీక్షల ఈక్షణాలు పాక్షికత్వంతో మేధ పదనును మెలివేస్తున్నాయి.

సడలే సామాన్యుల స్థైర్యం విస్తరించి విధ్వస్తదిశలో దశను తిప్పింది.

వాదనమనోవేదనకు కారణమైతే మరోవేదన మాన్యుల మానవతకే.

అంగళ్ళుతెరిచే పంతుళ్ళు వడ్డీలకు త్రిప్పనేర్చిన వరగురువులు బడి చెబితే అలజడే.

అంతానికోసం పంతం పట్టే ఆంతర్యం ఆరంభాన్ని అంతరంగంలో అంగీకరించాలి.

రక్తసిక్తమైన రణాంగణంలా స్వర్ణభారతి ముఖాంగణం మూర్తి కడుతున్నది.

మానవత్త్వపు మాట పెదవికి చేటుగా పెద్దలు భావిస్తే భారతం పేలవమే.

విగళిత వేద్యాంతరమైన కవిత్వం విలువలేని వాగాడంబరమైన తీరే ఒకవింత.

మనసుండడం, మండడం, కరగడం మానవులకే, మృగాలకసలేకావు.

లేమిని లేహ్యంగా గ్రహించే జీవనరోగులు కలిమితో కామితార్థులౌతారు.

భిన్నత్వంలో ఏకత్వం ఛిన్నాభిన్నమైన స్వర్ణభారతానికి భీషణమైన కలకాకూడదు.

బీదల పొట్లతో భీకరమౌతున్న స్వర్ణభారతి మానసానికి ధనదుల కప్పదాట్లు దాక్షిణ్యాన్నిస్తున్నాయి.

అహంకారం అన్నగా మమకారం మన్నుగా స్వర్ణభారతి మనుగడ కడతేరుతున్నది.

రంగు రంగుల పతాకంలో రంగరించిన దేశభక్తి రాజకీయ హంగుతో రంగు వెలిసింది.

బాపూ ఆశయాలు శిలాక్షరాలుగా స్వర్ణభారతిని శిలాసదృశం చేస్తున్నాయి.

మద్యం, మాఫియా మాంద్యంతో, ఆంధ్యంతో అభివృద్ధిని అవహేళన చేస్తున్నాయి.

బుద్ధుడు పుట్టిన భారతంలో బుద్ధిహీనులైన పాలకుల బులపాటపు వలపు.

వివేకానందుని మతానికి చికాగో చింత చేస్తే పకపక నవ్వుతున్న స్వర్ణభారతి.

కట్టడం, కూల్చడం కాలగమనంలో చెలిమి కలిమి పంచని చేదునిజానికి ప్రతీకలు.

మతాల సారం మానవత్వమని మాటవరసకనే మానవుడు చేతల్లో దానవుడౌతున్నాడు.

మమతల మాగాణం మన భారతంలో నీరులేక ఎండుతున్న సస్యకేదారాల సారహీనత.

ఆరుగాలం శ్రమించినా ఆర్తిని మిగిల్చే కల్తీ మందుల కాలుష్యానికి కర్షకులు బలి.

వంచనలో మునిగిన వాంఛకు మంచిని పంచే మహనీయత మనువర్తినిస్తుంది.

స్వర్ణభారతి దయనీయతకు కారకులు, ప్రేరేపకులు, ప్రేరకులు కనిపించే కాలమా?

ముసలితనంతో నీరసించిపోయిన భారతమాతకు పడుచుదనపు సూదివైద్యం చెయ్యాలి.

ప్రతినిధి పార్టీకేగాని ప్రజలకు కాదని తెలిసికొన్న ఓటర్లకు మతిభ్రమణం.

అధికారం, అంధకారానికి అన్నగా స్వర్ణభారతం చీకటి మయమైంది.

కనిపెంచినవారికంటే కనకాన్ని పంచినవారిపైనే మమకారం పెంచుకొంటున్న భారతం.

తాకట్టు తలకట్టుగా శిరోవేదన భరించరానిదై ఆకలిదప్పుల భారతం అలమటిస్తున్నది.

నమ్మలేని నిజాలు నమ్మకానికమ్ముడుపోతే నయవంచన నయగారం మీరింది.

పెట్టుబడి బడిమానేసిన కవితా గురువుల వసంతానికి పేలవమైన కోకిల గానం.

అతిశయోక్తుల ఆటుపోట్లకు తట్టుకొనలేని మాతహృదయసంద్రం చెలియలికట్టదాటుతున్నది.

ఖరీదులేని కమ్మదనపు కవితలు కాలవైపరీత్యం వల్ల కనుమరుగై కాంతి దప్పుతున్నాయి.

అపురూపమైన అందం ఆదరించలేని మానసాలకు చీదరింపుగా వంతలతో చింతిస్తున్నది.

ప్రాచీనతకూ, ఆధునికతకూ వారధులైన వారి సారథ్యంలో స్వర్ణభారతి సొగసు సోంపు మీరుతుంది.

మహ్మదీయులైనా, మనువాదులైనా మానవత్వానికి మధురిమ నందిస్తే మాన్యులైనవారే.

చెప్పిన నోటిని బట్టి సత్యాసత్యాల నిర్ణయం జరుగుతున్న స్వర్ణభారత భవితవ్యం పూజ్యం.

యాంత్రిక, మాంత్రిక, తాంత్రిక, వ్యాపార జీవితాలకు వెతలు వీడి వెలుగు విరిసే దెప్పుడో.

ప్రకృతిని పరాక్రమంతో జయించాలనే పరిశోధనా విక్రముల ప్రాకృత జీవనమేమిటో.

నీటిబుడగలాంటి జీవితానికి నిధుల వ్యధలు కన్నీటి బిందువులై జారి పతనమౌతున్నాయి.

పుట్టిగిట్టే మానవునికి పూజనీయత లభియించే పురుషకారం పునీతమై పుడమి నిండుతుంది.

తృప్తిని తృణీకరిస్తే తృణప్రాయమైన జీవనం గాలిలో విహరించి గగనానికి చేరుతుంది.

ఇష్టంలేని బతుకులు కనిష్టమై నికృష్ట మానసిక వ్యధననుభవిస్తూ కష్టభరితమైనాయి.

325

వయసు మీరిన జనస్వామ్యానికి వయసురాని ఓటర్ల ఓటింగు వాలకం.

చూచుకములు పొడసూపని పోడిమి వయసుకత్తెకోసం పోరాటం చేసే నవయువకులు.

సన్మానాల సన్మానసుల లాస్యం లవలేశం తెలియని పాండిత్యం.

మానహరణ మానవాహరణ మనువారి మనసుల్లో మాలిన్యాలైనాయి.

తెలివిపెరిగిన కొద్దీ తెలియని జబ్బుల స్వైరవిహారం తెగువమీరింది.

సినిమాలు చిదిమేసిన చిత్తడిలో పుత్తడి జీవితాలు పునీతమౌతున్నాయి.

సొగసుమీరిన సుందరస్వామ్యం వగపు చేష్టల వలపులో పడి చెడిపోతున్నది.

మందిమీరిన దేశంలో మాంద్యానికి తోడు ఆంధ్యం అదుపు మీరింది.

పంచాయితీ పాలనలో పతనావస్థలోనుండి మున్సిపాలిటీ మురుగులో పతనమైంది.

సుందర హర్మ్యాలు వసతి గృహాలై నెలజీతాలందిస్తే ప్రభుత్వాలు తెల్లకార్డు బియ్యం సప్లయి చేస్తాయి.

దొరకబుచ్చుకొనే దొరస్వాముల రాజ్యంలో దొంగసొత్తు పర్సేంటేజీలు పంపకంలో జగడాలు.

కొరగాని కొడుకు కొంపముంచుతాడనే తపనతో తండ్రి తల్లడిల్లడం.

మత్తు మానసానికి హత్తి జీవితాన్ని చిత్తుచేస్తే పొత్తు మరవని చపల చిత్తుడు మానవుడు.
ఆశయాలకు అమ్ముడుబోయిన అన్నలు కిరాతులలోకంలో నిల్వలేక అడవుల పాలౌతున్నారు.
జనస్వామ్య జాగీర్దార్ల జవహీన పాలనలో జన్మభూమి జయకేతనం వాలిపోయింది.
స్వర్ణభారతి వర్ణవ్యవస్థతో వివర్ణమై కులకుంపట్లతో కూలే దశకు చేరింది.
పచ్చచొక్కాలు, పచ్చనోట్లు ప్రజాస్వామ్యంలో పలుకుబడి బడిలో తప్పినవానిదే.
దెయ్యాలు వేదాలు వల్లిస్తాయని నమ్మేదేశంలో దేహుల మోసాలు దేవుని కెరుక.
నాశనమౌతున్న నమ్మకానికి నిలువెత్తు స్వార్థం నీరాజనమందిస్తున్నది.
వరస మారుతున్న కాలానికి వాసెనకట్టుకట్టే వరుడు వారువ సహితుడై రావాలి.
ప్రకృతి అందరిదీ కాని అనుభవించే ప్రముఖులు అందని అందలాల లెక్కిన వారే.
పంచభూతాలు భూతాలకు అందీ అందక అలమటించే దశలో విశ్వసౌభాగ్యం.
కల్తీ మందులకు శాల్తీలు గల్లంతయ్యే పారదర్శక, ప్రాతినిధ్య ప్రభుత్వం మనది.
గణించని రక్తసంబంధానికి గుణించే వడ్డీ లెక్కల గూడుపుఠాణి గుర్తును తెంచేసింది.
పగిలిన పత్తికాయలా రగిలిన మనోవేదన మిగిలిన జీవితానికి మిత్తిలా దాపురించింది.
అప్పుల సుడిగుండం జీవితానికి యమగండమై సంసారానికి వాయుగుండమైంది.
ప్రజాప్రభుత్వం సహాయాన్ని రేయింబవళ్ళు కోరే నిస్సహాయ వయోజనుల నిర్వాకం.
అదుపులేని ఆటవిడుపు ప్రభుత్వాస్తిని అత్యాశతో ఆలింగనం చేసుకొనే మగధీరుల మాగాణం.

326

పార్టీలు సామరస్య వైరుధ్యాలు అధికార అవధికి అందే ఫలాలే.
భారతీయమైనా తెలుగుదేశమైనా జనతను పాలించే జట్లు.
ఓటమిలో గెలుపులో వాటాల వాలకం వందితమైన జనస్వామ్యం.
ఢిల్లీ భాగ్యనగరాల చంద్ర బీహారీలు రాజకీయ భేహారులే.
జాతీయం విజాతీయమై విగతజీవమైన వందేళ్ళ పార్టీలు.
పంట పండని ఫ్రంటు తంటాలు పడి చంద్రునిలో మచ్చను చూశాయి.
చేతులెత్తేసిన కాంగ్రెసుకు చేతనత్వం చెన్ను మీరుతుందా?
ఆంధ్రాన్ని ఆంగ్లంలో అమరం చేయాలనే ఆలోచన అమోఘం
స్వర్ణభారతికి ఏండ్లుమీరి ఎఱుకదప్పి మరపులో మౌనంగా నిట్టూర్చింది.
రక్షణలేని రక్షకభటరాజ్యంలో ప్రతినిధి ప్రభువుల పాలనా ప్రభంజనం.

చట్టసభల సంగతుల అసంగత రాక్షసత్వంలో అమలులోని చట్టాలు.

ఖజానా ఖాళీ అయిందని నింపడానికి నిధుల వేటలో మత్తు హత్తుకొంది.

రక్తసిక్త రణాంగణాలు రాజుల సభలు ప్రజాసేవ ముసుగులోని శక్తిహీనాలు.

మెలకువ వీడిన మేధావితనానికి మేలిముసుగైన స్వార్థం సొగసరి యైనది.

అన్నగారి హయాం నుండి ఆంధ్రదేశం భరతభావికి బాసటయైనది.

దారిదప్పిన తమ్ముళ్ళను మరల్చే అన్నలు కరవైన ఆంధ్రరాజకీం దయనీయమే.

కులానికీ, మతానికీ, వర్గానికీ, పార్టీకీ, మగకు, ఆడకూ మధ్యనలుగుతున్న స్వర్ణభారతం.

రాజకీయం రాజీకీయమై పాలకశ్రేష్టుల పావనాశయమై పరిఢవిల్లుతున్నది.

వర్గపోరాటానికి వాల్లభ్యం కరవై భిన్నత్వంలోని విభిన్నత్వానికి విలువ కల్పిస్తున్నాం.

సామాన్యుడు నిలబడలేని ప్రజాస్వామ్య ఎన్నికలు ప్రవచించే సమానత్వం మనది.

కోటీశ్వరుల కొంగుబంగారమైన కుర్చీలు కొత్త చట్టాలతో కోరికలు తీర్చుకొంటున్నారు.

పరుగిడుతున్న ధనాన్ని పట్టుకొనేయత్నంలో పరువు వీడి పామరుడైన జనుడు.

పుచ్చిపోయి పెచ్చుమీరిన అవినీతి స్వర్ణభారతానికి అహంకారమధికమైంది.

సెల్యులార్, పేజర్లలో చెప్పే, వినే చేటుమాటల జనస్వామ్యానికి జవమెక్కడిది.

వర్తనకూ, నర్తనకూ, పరివర్తనకూ, ప్రవర్తనకూ అర్థం తెలియని రాజకీయ శీలవంతులు.

అమరుల ఆశయాలకు అసలైన అర్థం తెలిపే అధికుల అసంగత సంగతులు.

వెన్నుపోట్ల ఆంధ్రంలో వెతల దేశరాజధానిలో రంగులు కలిసిన రాజకీయం.

పద్దెనిమిది నెలలు ధర్మక్షేత్రంలో పార్టీల పారుష్యం కాలుష్యమై కకావికలై కాంతి దప్పాయి.

ఎన్నికల్లో మతం సతమతమై, సమ్మతమై, సతత సాంగత్యానికి అసంగతమైంది.

327

వాసిదప్పిన స్వర్ణభారతంలో కవితా వసంతహేల అవనత శిరస్కుల అంతరంగపు వింతహేల.

ఏడడుగుల ఏడుగడ కడదాకా సాగని విడాకుల మావిడాకులు వసంతంలోనే రాలిపోయాయి.

చిగిర్చి, పూచి, కాచి, ఫలించే వసంతం సంతసరుకైన చందం అరవిందమై అందం చిందించింది.

అర్ధాంగానురాగం వ్యర్ధీభూతమైన వేదభూమిలో వెలుగు వెలసిన వనితల జీవితాల వసంతం.

వర్ణాల వాలకం వివర్ణమై స్వర్ణభారతంలో రాజకీయుల స్వర్గం సవర్ణమై సంగతించింది.

గతిదప్పిన మతిమంతుల అధోగతిని గతంగా గమనిస్తూ వర్తమానంలో గమిస్తున్న జనం.

ప్రజాస్వామ్య స్వర్ణం ప్రవచనాల్లో ప్రాదుర్భావం పొంది అర్భక నేతల ఆర్భాటంతో అంతరించింది.

స్వాతంత్ర్యం సాధించిన పెద్దల కూటమి కాంగ్రెస్ పేదలతో పెచ్చరిల్లి పేలవమైన వైనం.

విభజించి పాలించే వినూత్న జనస్వామ్యపాలన భజనపరుల భంగపాటుతో భాస్వంతం కావాలి.

కొత్తఢిల్లీ, భాగ్యనగరాల కలయికలో భారతీయత భంగపడకుండా బాటను సరిదిద్దాలి.

రాష్ట్రాలు, కేంద్రాల రాజకీయం రావణకాష్టమై రామరాజ్య ప్రతిష్టాపన రహివీడే దశవచ్చింది.

కాశ్మీరం కశ్మలమయమై స్వర్ణభారతానికి శిగపూవుగా పూచి, వాడి, రాలిపోతున్న వైనం.

ఈశాన్యం దేశవిదేశీయుల ఈదులాటలో అంతుతెలియని అవని భారత సంద్రం అవనతమైనది.

బోడోలు, ఉల్ఫాలు, చక్మాలు, గూర్ఖాలు, జార్ఖండ్‌లు అఖండ స్వర్ణభారతానికి గండాలై గాండ్రిస్తున్నారు.

ఏభైఏళ్ల స్వాతంత్ర్యంలో తుపాకి రక్షణలో ప్రజాసేవ చేసే ప్రతినిధి రాజులను చూస్తున్నాము.

పదవి లభిస్తే ప్రజలు కనిపించని పచ్చకామెర్ల పాలక పండితుల ప్రజాపాలనకు జోహారు.

బొందిలేని బొమ్మల బంధుత్వంతో బరితెగించి భవ్య సభ్యుడై నవ్య నడతతో గమిస్తున్నాడు.

లౌకికం లౌక్యమై సమానత మానహీనమై, సార్వభౌమత్వం శునక సదృశమై రాజ్యాంగం అంగవిహీనమైంది.

డెమోక్రసీ డిమోక్రసీగా, గణతంత్రం గహనమై, త్రిగుణాతీతమైన పాలనతీరు పావనమై పండింది.

స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాత్రం ఆత్రంగా ఆశయహీనమైన ఆశల ముచ్చటగా సెలవు కోరుతున్నాయి.

డజనులోకసభలు, మరోడజను ప్రధానమంత్రులు, నవగ్రహోల్లా రాష్ట్రపతులు మందిమారినా మందగతే.

సివిలు, మిలటరీ సర్వీసుల సంగతులు వింటే వీతరాగ స్వర్ణభారతిలో విలుప్త విలువలు ప్రత్యక్షం.

గ్రామరాజ్యానికి గండికొట్టిన కేంద్రీకృత వ్యవస్థ కేరింతలు మారుమూల ప్రాంతాలకు మృత్యుగీతాలు.

అయోధ్య యోద్ధలు అయోమయంలో పడి ఆంధ్రదేశాన్నాశ్రయిస్తే చార్మినార్ చంద్రుడు చెంగలించాడు.

ప్రాంతీయమై, జాతీయమై, అంతర్జాతీయమైన తెలుగు చంద్రుడు వింత జ్వరంతో జ్వలిస్తున్నాడు.

వెన్నుపోట్ల, పన్నుపోట్ల అధికార అంధకారంలో వెలుగు జిమ్మలేని చంద్రుని చేతనం జన్మభూమిలో జిలుగు మీరింది.

శాసన సభ్యుల శాపవిమోచనం రాహుకేతువుల వైస్రాయంలో రంగరించిన సొత్తులో హంగు మీరింది.

తెలుగుదేశం వెలుగుదప్పినవైనం ఆప్తుల అన్యాయాల ఆటుపోట్ల సంద్రం చంద్రోదయ వైపరీత్య కారణం.

అమరంలోని అన్న ఆశయ నినాదం వేదంలా ఘోషించి చీకటి చంద్రుల చితిని మండించే చిరుదీపిక కావాలి.

అందగించే అన్న ఆశయదీప్తులు వెలుగుమూర్తులుగా తెలుగుల త్రికరణాలను తీర్థాలుగా స్ఫూర్తినించాలి.

సంతానం పందలుగా పందులుగా మృణ్మయ బుద్ధులై మురువువీడి మూలన బడి మూల్గుతూ ముద్దుకోల్పోయారు.

అద్వితీయం కావాలసిన ద్వితీయం ఆశల అర్ధాద్వైతంలో బడి ఆచరణకు రాని పాండిత్యంతో అలరారుతున్నది.

దయాదాక్షిణ్యాలు దయనీయమై దశమగ్రహాల దారుణం తెలుగుల పాలిటి తీర్చలేని ఆశయఋణమై అవని నిలిచింది.

స్వర్ణభారతి స్వగతంలో గతించిన అన్న ప్రధానమంత్రిగా మతిమంతుడయ్యే ఆశ అడియాసగా ఆంధ్రం అంధమైంది.

అపహాస్యమైన ఆశయాలు వశం దప్పిన వారువాలై రౌతును రచ్చకీడిస్తే రామరాజ్య తలపు తగవు మీరింది.

328

స్వర్ణభారతి స్వగతం తలిదండ్రుల మనోగతమై తనయుల తపనతో తరించింది.

వంశోద్ధారకుని అంశ అష్టాదశ వత్సరాల వయోజనమై ఎన్నికల ధర్మక్షేత్రంలో దహనమైంది.

కురుక్షేత్రంలో కుంభ సంభవుల శస్త్రాస్త్ర పాండిత్యం శిష్యులకు నేర్పడంలో శీర్ణమైంది.

ముదిమి ముంచేసిన మురువులో గంగాపుత్రుల గాధ్గధ్యం గాంధర్వమై గాడిదప్పింది.

కర్ణధారుల వర్ణవిన్యాసం సవర్ణమైన సంగతిలా లౌకిక భారతి సంద్రం కల్లోల భరితమైంది.

ధృతరాష్ట్రపుత్రుల దురాగతాల ధూసరితమైన దుహిత భారతి హితం ఆహతమై దుర్జనత్వమైనది.

శకునుల శంకరం వంకరగా సంకరమైన స్వర్ణభారత రాజకీయానికి వంకలు దిద్దింది.

ధర్మోపన్యాసాల దాక్షిణ్యం కంకుభట్టుల కలలో కలియుగం అజ్ఞతలో మగ్నమై అంతరిస్తున్నది.

కృష్ణలీలల లౌక్యం గోవర్ధన కుధరమై రక్షణకరవైన జీవనానికి రాసిక్యాన్ని అందిస్తున్నది.

పాంచాలి దీనత్వం పంచబంగాళమైన మహిళామాన్యంలో మానంకోల్పడి మౌనం దాల్చింది.

స్వర్ణభారత రాజకీయ సవ్యసాచులు నైపుణ్యాన్ని ప్రదర్శించి నిధులు మింగే నైచ్యానికి ఒడిగడుతున్నారు.

భీమ బలుల ప్రగల్భాల మాటలు మాటున మరగి కార్యంలో గీతాచార్యుల ఆలంబనం కోరాయి.

అన్నమాటవినే ఆశయం కల పాండవుల కరణ్యావాసం ప్రాప్తిస్తే ఉన్నవ్యవస్థ వ్యతిరేకించే ఉద్రేకులు అరణ్య వాసం చేస్తున్నారు.

ధర్మంకోసం జరిగే పోరాటాల జయాపజయాలు జగద్విదితాలై జనగణభారతానికి జయగీతిక లౌతాయి.

అహింస పరమధర్మమనే ఆశయం వేదం అందగించి హింసోన్మాదానికి హితమతులు ఎదురుతిరగాలి.

గౌతముడు తమ్ముడుగా, సిద్ధార్థుడు సిద్ధుడుగా, బుద్ధుడు బద్ధుడుగా స్వర్ణభారతం తథాగతం కావాలి.

అన్నదమ్ముల ఆప్యాయతను అర్థం మరపించి తలిదండ్రుల రక్షణను స్వార్థం ఆదమరపించింది.

అనాధ శరణాలయాలకు అమ్మానాన్నలను పంపే ఆధునిక కుమారుల మారకపు రేటుకు నిదర్శనం.

ముప్పదికోట్ల దేవతల ముద్దుల భారతంలో భాగ్యవిహీనులు మురిసే ముందు కాలమెప్పుడో.

దేవాలయాలలో దేహుల అవస్థలు వ్యవస్థలోని వ్యక్తుల శక్తిని వ్యక్తంచేసే వెలుగురేఖ లౌతాయా?

పాతదేవుళ్ళు పరమపదించిననేపథ్యంలో కొత్తవారికి నివేశన స్థలాల నిధులసేకరణ వ్యధలు.

బతికి బలవంతుడుకాలేని మానవుడు మరణించి మహనీయుడౌతున్న మనస్వర్ణ భారతం.

నియంత్రణలేని జనాభా నిత్యావసరాలకు నిధులు చాలని విధివ్రాత బధిర భారత సేవకులది.

కాలుష్యం కలవరపెడుతున్నా కాలు కదపని కామందుల కలిమి స్వర్ణభారతికి రాజకీయుల చెలిమి.

పచ్చని పెరటి చెట్లను పెంచలేని ముదిమి భారత ముగ్ధలు ప్లాస్టిక్ వృక్షాలను పదిలపరచి పరవశిస్తున్నారు.

గుట్కాలో, మట్కాలో గుబాళించే స్వర్ణభారతి సౌగంధ్యానికి గంధపు చెక్కల వీరులు గాలివీస్తున్నారు.

మద్యం హృద్యమై ప్రభుత మానసానికర్థమై పరిఢవిల్లే జనస్వామ్య జగజెట్టీ నేతల నేతృత్వానికి జనగణమనే.

శతకోటి దరిద్రాలకు అనంతకోటి ఉపాయాల సంఘుజీవనంలో వనవాసం కూడ ధనగణనకే.

వెలుతురుకు వెలపెరిగిన సమాజంలో వెతల గురుతులు కనిపించక కథలుగా విన్పిస్తున్నాయి.

వ్యధ దాగిన కథలో సుధల జీవితాల సౌకుమార్యం స్వర్ణభారత జనస్వామ్యానికి జయగాథే.

సంప్రదాయం, నమ్మకం నడిపించేనరుని అడుగుజాడల్లో నయమైన స్వామ్యం నర్తిస్తుంది.

రాజ్యాంగం మార్చాలనే రాజకీయుల రమ్యోపన్యాసం న్యాసం మారాలనే న్యాయానికి తలవంచాలి.

అధికారం వ్యధికరణమై సమానాధికరణ జనస్వామ్య సమాసానికి అలంకారమై అలరారాలి.

స్వర్ణభారతి కల్తీమయమైన రాజకీయ శాల్తీలతో కమ్మదనాన్ని కోల్పోకముందే కదంత్రొక్కాలి.

329

బొమ్మమీద గెల్చే బొరుసు ప్రతినిధులు పదవులు పొందిన అనంతరం వింత విబుధులు.

పార్టీ పట్టం కడితే పట్టువీడిన పట్టపగటి చంద్రులు చీకటి చర్యల చింతలు పంచుతారు.

ఆహ్వానం ఆత్మస్థైర్యానికి గండికొడితే మన్నికవీడిన మాన్యుని మనసు మమత వీడిన వైనం.

సంతానం సంతకెళితే సంగతులు గతులు దప్పితే ప్రేమలకు పెడర్థాలు తీస్తే అంతమైన అంతరంగం.

పతివ్రతల పావనత్వం పరువు వీడిన ద్వితీయమై అద్వితీయ మానవుని అధమం చేసిందా!

మెచ్చినది రంభ మునిగినది గంగగా మురిసిపోతున్న లోకానికి ఎదుటివాటి ఎద ఎఱుక ఏమరుపాటే.

వ్యక్తిత్వం లేని వ్యక్తులు శక్తిముందు చేతన రహితమై విచలితమై వింత పుంతల మంతనాలాడారు.

అంశమైన వంశం, బంధమైన బాంధవ్యం, దశమగ్రహ దారుణ చేష్టలో విలీనమై దహనం చేశాయి.

జనప్రళయం ప్రభంజనంగా జాతిజాగృతం కావడానికి జయశీలం అపయశమై అంతరించింది.

యుగపురుష సింహం గుంటనక్కల గూడుపుఠాణిలో చేవవీడి ఆశయ అపహరణతో అవని నిలిచింది.

మాట చెల్లించే మానవుల మహదాశయానికి మౌనజీవనరాగం విరాగమై విలుప్తమైంది.

అర్ధంతర మధ్యంతరాలకు చెల్లుచీటీ యిచ్చే చైతన్యమూర్తుల జనస్వామ్యం చెంగలించాలి.

ఏలుబడి మేలుచేసే ఎడదల మానవులకు వీలుకల్పించే పదవుల పరువం గౌరవ రహితం.

తరగని చెరగని తరతరాల చరిత్రలో పెరిగిన అహంకారానికి పేదలు బలైన తీరెట్టిదో.

ప్రజాస్వామ్యం పంపకాల మయమై ప్రభుత్వాలకు అంపకాలు చెప్పే వింతకాలం వెలుగుచూసింది.

మభ్యపెట్టే మానవస్వామ్యం నిరభ్యంతరంగా జరిగే నియతని కనిపెట్టిన ఓటర్ల చైతన్యం.

పసరమైన ప్రతినిధి పాశుపతంతో కిరాతకానికి ప్రోత్సహిస్తే శివగుణం లయం సిద్ధం.

భయానికి బాసటగా నిలచిన నమ్మకం జనబాధల్ని పెంచుతూ అపజయానికి ఆలంబనమైంది.

మెడలుకోసే మెరుపు మనుషులు మేదినిలో మేల్కొన్నారనే విశ్వాసానికి విమూఢత్వం భయం.

మేలుమరచిన మేలుజాతి సంఘపశువుల సంస్కృతి మైదానాన్ని మాదక ద్రవ్యమయం చేస్తున్నాయి.

సామాజిక న్యాయం సామజపు గమ్యమై కులాల ఘీంకార హుంకారమై కూలబడుతున్నది.

ఉన్నవారు లేనివారు ఉర్విజనతరగతులైతే కులమతాల కూరిమి గతులు రాజకీయుల తరగతులైనాయి.

జనతీర్పు మార్పును కోరితే ప్రతినిధి జనులు తార్పుడు, మార్పిళ్ళతో తీర్పరులై తిమిరవాసులు.

డజనులోకసభ సభ్యుల డాంబికం ఆంబికేయ సంస్కృతితో అంతరించి పోయే ప్రమాదముంటుంది.

మచ్చలు పెరిగిన చంద్రుడిలో హిమహితం కరిగిపోయి దాక్షిణ్యం దయనీయమై భారతి భాసమానమయింది.

అంశాల ప్రాతిపదిక అందగించింది ఆంధ్రచంద్రుడికీ చెన్నై జయరాణికి చెమటలు పోసిన వైనం.

తిరిగిన చక్రం వక్రమై పద్దెనిమిది పర్వాల భారతమై భ్రమణం లేక భ్రాంతిలో మునిగి తేరుకొంది.

జాతీయం, ప్రాంతీయం ప్రాజాపత్యం వహిస్తున్న కేంద్రానిది గరిమనాభి లేని గమనమైంది.

సృష్టికర్త కీర్తనలోని సుందరత్వానికి వందనంచేసే వరమానవుల గరువం కార్తీకమే.

కవిత్వం రాజకీయాన్ని కౌగిలించుకొని రాజ్యమేలిన రోజులు రహిమీద రహించి రమ్యమౌతున్నాయి.

చైతన్యానికి శక్తినిపెంచే చేతనలు చెరగని చెలిమి చేష్టితాలై చెన్నుమీరి కన్నుచెదరు చున్నాయి.

కావేరీ కాసారాలు, ఆల్మట్టి మట్టం అవశేషాలు, తెహ్రీ తేటనీటి తెగుళ్ళు రాజకీయ రంగసారమై రహించాయి.

హద్దులు చెదరని సరిహద్దులను దిద్దే అపరవాస్తుపురుషుల అంతరంగాలు రాజకీయ తరంగాలే.

ఆశయాలకు లైట్లు నక్సలైట్లు నరమేధంలో పోలీసు రాజ్యం పొంగి ప్రవహించే బుల్లెట్ల వర్షమైంది.

నిజమైన ఉగ్రవాది నిధులకోసం కక్కుర్తిపడే నీతిలేని జనుడు కాడు. నియతిని వర్తించేవాడు.

పెద్దలు పెంచిపోషించిన పేదరికపు ఉగ్రవాదానికి కంచే చేనుమేసిన చందం ఆలంబనం.

రౌడీరాజ్యపు రాజులు గుండా గుంపుల గురువులు కాలచక్రగమనంలో తారుమారై తలక్రిందులౌతారు.

330

విధానాలు మంచివైనా వితరణ గుణంలేని విబుధ పాలకుల వింతచేష్టల విన్యాసాలు.

తల్లికాకుల తపనతోకూడిన ఆక్రందనం పిల్లకోకిలల వసంతలేని పాటలా విన్పిస్తుంది.

కాకి కారుణ్యంతో కమ్మని ప్రేమతో జీవంపోసికొన్న కోకిల నవ్యజీవనంలో మమకారం మరచింది.

తల్లీబిడ్డల అనురాగం రాగరహితమై రంగుమారి జీవనరంగంపై నర్తిస్తూ వెండి తెరపై వెలుగుచూసింది.

కానిదానిపై కారుణ్యం అయినదానిపై అసహ్యం ఆధునిక జీవన రహస్యమై అంతరంగం అదృశ్యమైంది.

కలియుగాంతం కనుచూపుమేరలో కలగామిగిలి కర్కశత్వం వ్యాసమై కక్షల రాక్షసత్వంతో కలిమి హీనమైంది.

నమ్మకం వమ్ముకాని దివ్యాస్త్రమై దిశల దశను మార్చి దిగంతాల శూన్యానికి యానంచేస్తూ దివ్యమైంది.

పేట్రేగుతున్న విధ్వంసపు విన్యాసం విగత జీవానికి స్వాగతం పల్కుతూ స్వార్థానికి స్వోత్కర్షలా సాగుతున్నది.

సమానత్వం అసమానతల ఐరావతమై అవహేళనతో ఘీంకరిస్తూ జనజీవన సరస్సును కలగుండు పరుస్తున్నది.

అనుభవించే వసతుల సతులను వలచి వదలలేని మానసంతో వగపునకు చేరువౌతూ భవ్యులు నవ్యులౌతున్నారు.

మారని ప్రపంచాన్ని మాదకద్రవ్యాల మత్తులో ముంచి మాన్యులు మానవత్వ మహిమను వల్లిస్తున్నారు.

అంతానికి ఆరంభం వింతచేష్టల వీరంగమనే విజ్ఞుల వివరణ విలువల వలువలు ధరిస్తున్నది.

మరచిపోవడం మానవగుణంలోని మహత్తర విశేషమై మేలును మరచే మేధావుల మేలిమి మానసం హీనం.

దేశభక్తి దేహాతీతమై విదేశాల రక్తితో భుక్తి దొరకని భూమి పుత్రుల్లా మేధాభిక్షాపాత్రతో సంచారం చేస్తున్నారు.

'స్వదేశీ'ని స్వాగతిస్తూ 'పరదేశీ'ని ప్రస్తుతిస్తూ ప్రపంచ సంతలో సంతసం వీడి సంచరిస్తున్న అర్ధ భారతం.

అప్పుల తిప్పలు తప్పులతో కంఠదఘ్నమైన భారతానికి అశనిపాతమై ఎన్నికల బుద్ధి మోకాలి బంటిదై మోడువారింది.

నమ్మకం రాజ్యమేలుతున్న కర్మభూమిలో నందనవనసౌభాగ్యం కలలో కన్పించి ఇలకలో కలిమి రూపమై కామించింది.

డబ్బుదేముందిలే తింటామా, జీర్ణించుకొంటామా అనేవారే తినీ తినీ జీర్ణించుకోలేని జీవచ్ఛవాలై తీపి వ్యాధిన బడ్డారు.

రాజ్యాంగాన్ని మార్చాలనే జనబలంలేని పార్టీల పాలన జరిగిపోయే కాలానికి జయమంగళంపాడే జాతిగీతిక.

అత్తెసరు ప్రతినిధుల అసమర్థ ప్రజాస్వామ్యంలో సమర్థ ప్రధానుల సంగతి సర్వసంగ పరిత్యాగమే.

భయంతో పరుగిడిపోయిన బలం పదవీ భాగ్యం చేరువయ్యేసరికి బిడియంతో సరసన చేరే సంగతి గతం.

దళితులు పదవులను పొందితే దయనీయ భారతీయుల బతుకులు గతుకుల్లేని కాంట్రాక్టు రోడ్లవుతాయా?

స్వర్ణభారతంలో కులప్రత్యేకతలు కూరిమి ప్రసాదిస్తే 'లౌకిక' మనే రాజ్యాంగ ప్రకాశికలోని పదం అర్థవంతమే.

పొందిన వారి పొందుకే పొంకంతో పయనిస్తున్న ప్రత్యేకతల పడతి పడుపువృత్తిలో పడకుండా చూడాలి.

పట్టపగటి స్వర్ణభారతానికి పట్టువిడుపుల పార్టీలు ఫలితంలేని ప్రజాస్వామ్యానికి పట్టుగొమ్మలైనాయి.

రామరాజ్య భారతానికి చంద్రవంశ చాంచల్యం సూర్యవంశ సౌందర్యమై అయ్యోధ్యమందిరంగా అందగించింది.

బాలయోగుల సభాపతిత్వంలో భాస్వంతమైన భారతీయ జనత విజయం బరువుతో నిట్టూర్పు నిగిడించింది.

మాజీలపై మోజు కళ్ళ ముందరి కందకం కాలగమనంలో కందుకంలా కథమారిన సంకల్ప కల్పకం.

ఏకాదశ రుద్రులతో స్వర్ణభారతి ఎదకదిలించిన చంద్రుడు అంధకారంలో వెలుగు పంచలేని పగటి చంద్రుడే.

మందిరంలేని మహాభారతీయ జనత ఉత్తరంలో హిమాలయంలా కరిగిపోయే ప్రజాస్వామ్య పార్టీ సౌధమే.

పల్చబడిపోయిన సైద్ధాంతిక కిచిడీ ప్రభుత్వానికి స్థైర్యం పోయి అవినీతిబడిలో పడిపోకుండా చూడాలి.

మతం మత్తును కలిగించి మంతనంలో వింతపాటపాడిన విగతవిలువలు జీవనం గడిపే వాజపేయం మనది.

యౌగిక సంస్కృతి వీడిన రాజకీయ యాజ్ఞికులు ప్రభుత్వ యజ్ఞంలో పాలుపంచుకోవాలనే తపన పడుతున్నారు.

యజ్ఞగుండం జనులకు యమగండంగా యాజక మంత్రుల భోజకత్వం అధికార భాజకత్వమైంది.

ప్రణాళికలు ప్రగతి విగతమైన ప్రాభవాన్ని ప్రకటిస్తూ ప్రవచనాల పారమార్థికతతో పావనమైనాయి.

భయంలేని అధికారానికి బంధువైన స్వార్థం భంగమెరుగని బంధుత్వంతో బందీయై భవం బాధితం.

హిందూత్వం హితంవీడి, మహ్మదీయం మమతవదలి, క్రైస్తవం కరుణ కనలి రాజకీయంతో రాజిల్లుతున్నాయి.

భారతీయత భాగ్యం భావంలో స్వర్ణమై, స్వర్గమై, మాటల్లో మాన్యమై, చేతల్లో చైతన్యం వీడి చెదరిపోతున్నది.

అయిదుపదుల స్వర్ణం మాత మెడలో అయిదోతనం వీడి అప్పుల చెల్లించలేక తాకట్టుకు కట్టుబడుతున్నది.

331

కలికి కలల కమల దళాలను విరియించే హిమధామునికోసం ఎదురుతెన్నులు
పద్మదళాల పకపకల పారుష్యం పగటి కలల పరువమై పొగిలింది
పగలురేయిల ప్రామాణ్యానికి అతీతంకానిది అతివ జీవితం
పగలు ఎండినా రేయి పండినా పడతి అనురాగానికి అవధిలేదు.

ములుకుల మాటల మునిమాపుకు అతివ అందం ఆంధ్యం
చిలుకల కొలికికి కోమలత్వం ఆదరించే మగని మనసు
పరవశమైన ప్రకృతిలో సుకృతి ఆకృతి అతివ అమరకృతే
కృంగినా పొంగినా సహనం సామర్థ్యంగా సారసాక్షి జీవితం.

అబల సబలగా బలనిరూపణకు ఆటల నియమ కర్తలు మగవారే
ప్రతినిత్యం పతివ్రతలు పెరవారే తప్ప తనవారు అగపడరు

అందం అంగాంగాల వింగడింపుతో మందికి మన్నిక కలిగిస్తుందా?
మాతృమూర్తి మనసెరిగిన బిడ్డల బతుకులు భావిసూర్యరేఖలే.

చెలిమికీ కలిమికీ చెరిసగం పంచియిచ్చే బతుకులు పావనాలు
అతివల అందానికి మూలం తెలియని మొద్దుమగలు మనలేనివారే
ముద్దు మురిపాల పాలనందించే ముద్దుమూర్తికి మురువు కలిగించు
పొంగేతత్త్వానికి రూపెత్తిన పొలతికి మధురోహలు నించు.

నవలావణ్యాల నవలను ఎదగదిలో పదిలపరచుకోనీవు
భరించే భర్త భవితవ్యానికి బాటవేసే భామను గమనించు
గరువం, గౌరవం, పరువు ప్రతిష్టలు మూర్తీభవించే ది కుటుంబస్త్రీ
కర్మననుసరించే బుద్ధికి పూలబాటవేసే పుడమి పునీత ఇంతి.

దానవత మానవతల మధ్య నలిగిన ధరిత్రికి ధృతి వనిత
కాంతదాసులు కలియుగంలో కలిమిలేముల కందని కాముకులే
కామం క్రమం దప్పితే కలకలం పుట్టిన జీవితాలకు పుష్టి
అసూయల అమరేంద్రులు ఈర్ష్యల ఈవికి దానకర్ణులు.

ఆడది ఆడదైనా అత్తింటా పుట్టినింటా ఆటంబాంబే
సూర్య చంద్రుల మగలకు వేడి చలులను చవిచూపే వేలుపు
పొగడ్తకు తెగడ్తకు ఆగడ్తలాంటి అబల ఆంతర్యం ఏమిటో
ప్రకృతి పురుషుల కలయిక జగతి జాజ్జ్వల్యమానానికి జతి గతి.

332

గూండారాజ్యం గుర్తించుజనుడ! రౌడి రాజ్యం గమనించు నరుడ!
దాదాగిరీల దౌష్ట్యాన్ని చూడు! రాక్షస నేతల రచ్చను మరువకు
కత్తుల కటార్ల క్రౌర్యం ముందుండె – బాంబుల మోతల భయమేమొ వెనక
హత్యల లూటీల కథలెన్నొ కనిపించు – ఆపెడినాథుడు అగపడడీ భువిని.

అర్థరాత్రికి ఆడపిల్ల నడచివచ్చు మాటేమొ;
పట్టపగలు మానభంగ ఫలము గాంచు మగువలు
స్వాతంత్ర్యం మాటేమో పరతంత్రం సమీపించి పీల్చివేయుచుండె జనుల.
తెల్లనల్ల వాళ్ళమధ్య తెగువవాడు తెలివివాడు రాజ్యమేలునేడు.

మేధబలము నరుని బలము మేరువులుగ మిగులుచుండె
మత్తులోని ప్రమాదాలు మాఫియాల మోదాలయి మాన్యుల బలిగొంటుండెను.
గణతంత్రము గుణరహితము వ్యవస్థయే వెతల మయము.
సామాన్యుడు బతుకు విధము కనబడదిట కలికెమునకు
జీతపు జీవుల వెతలకు చితిపేర్చగ రండందరు.
అంతరాల వింతతీర్లు అమాంతంగ సమసిపోవు.
నింగినంటు మానవునకు నేలవిలువ గురుతుచేయ
మేధపెరిగి మనజుడేమొ మనసులేని మృగమాయెను.
వేధలంత వేద్యులాయె వెలుగజేయుడతని హృదిని.
రెండుకాళ్ళ వింత పశువు రేయిపవలు స్వార్ధమునకె
భువిజీవులు అన్నింటను పరమార్ధము పరార్ధమే.
దానవులై మానవులూ ధరణిజెరచ యత్నింతురు.
మానవులూ మాధవులై సమయించగ సౌఖ్యమొదవు.
విప్లవములు విరియగాను తిరుగుబాట్లు తెరలగాను
మనభూమియె మరువమగును జనబతుకుల జిలుగు వెలుగు.
సారధులుగ సాగిరండు సామరస్య సహనములతొ.
సౌభ్రాత్రం, స్వాతంత్ర్యం, సార్వభౌమ స్వామ్యమొచ్చు
సమయమ్మిది సమయించగ అవినీతిని ఆంధ్యమునూ
తరుణమ్మిది జనవాంఛలు తీరు విధము సుగమమ్ము.

333

తల్లిభూమి ఆంధ్రభూమి తెలుగు ప్రజలు మరుమల్లెలు
గాంధీ గ్రామస్వారాజ్యము గణ్యమైన నేలమనది
పల్లెసీమ పరువునిలప జన్మబూమి జాగృతాయె
శ్రమకువిలువ శివములిచ్చు త్రిలింగములగడ్డమనది.

పోతుగడ్డ పలనాడును భాగ్యసీమ తెలగాణము
రాయసీమ రామరాజ్య రజతమాయె భువన జయము
కవనవాణి కనగసొంపు మనసునిండు మధుర రచన
తెలుగుతేజమున నిండును సీతరామరాజుతెగువ.

అమరావతి అక్షరముగ ఓనమాలు ఓరుగల్లు
వరగల్లుగవాసి వెలిగె గుడుల బడుల గురుతు తెలుగు
గోదావరి గోదాలో కృష్ణ పెన్న పంటనించె
క్రాంతి కరము శాంతిమయము చెలువుమీరు చెలిమి మనది
అందమునకు అందగాళ్ళు ఆంధ్రవనిత లందురంత
జనని భూమి జవముపెంచు జవ్వనులే జయమునించు
యువత నవత నాగరకత నయముమీరు నయమనములను
భవిత భయము బరువు వీడు వర్తమాన వర్తనముల
గతము గతుల గమనమెంచి సతము నడువ జయముమనకు
పావనమ్ము పరమార్థము నమ్ముకొనగ పరుల సేవ
ఆంధ్రులన్న మతిమంతులు అవనిజనుల మదులయందు
సాంద్రయశులు సాహసముల పాలనమున పరములంత
మాత గురుతు మాన్యమగును మరువగాను మమత వెడలు
జాతివెలుగు కలుగజేయు జయము మీరు జగతి తెలుగు
మధురభాష మనకెకాదు విశ్వవెలుగు తూర్పు ఇటలి
దేశభాషలందు లెస్స ఆంధ్రకవులు భోగులిలను
మరచిపోకు మాతృభూమి గణ్యభూమి నీదు జనని
మనభావము మానవతకు పూలబాట పరచుమీవు.

334

జనవరి జనగణతంత్రానికి జిలుగు వెలుగుల చెలువు జయకేతనం
భారతజనస్వామ్యానికి సామ్యం జగతిని మృగ్యమైన మువ్వన్నెల జెండా
రూపశిల్పులమనఃకుహరంలో జనమాన్యత మార్గం తెలుపులూరింది.
కోట్లగుండెల గురుతుగా కోర్కెల హరివిల్లుగా హరితం అందగించింది
కర్మభూమి కాషాయంలో కామితార్థదాయియై జనత నికేతనమైంది.
ధర్మం నాలుగుపాదాలమీద చక్రభ్రమణం చేయాలని జనాభిలాష
పక్షిలాగ ఎగిరే పతాకానికి పతకం సిద్ధంచేసింది ప్రజాస్వామ్యం
మనదనేమాటలోని నయగారానికి సింగారాన్ని రంగరించిన మువ్వన్నెలు
జాతిజీవనాదం, జనజీవవేదం, స్వయంపాలనకు స్వస్వరూపం
కోట్లజనానికి జాగృతినందించిన జయరూప జవనాకృతి

భారతీయతలోని బాంధవ్యానికి బహురూప రంగులబంధం
మానవత్వంలో మమతానురాగాలకు మధురరూపం మనజెండా.
జనతనువీడి నడతను నవ్యంగా దివ్యంగా నడిపే నయన స్వర్గం.
గతానికీ వర్తమానానికీ భవితకూ భాగ్యవంతమైన భారతకేతనం.
సంస్కారానికీ, పురస్కారానికీ, పూజ్యభావనకూ పునీతమైనది జెండా
అందరూ అవనిలో మనందరంగా మారిన నేపథ్యంలో మరువని గుర్తు
దేశానికి దేహం, దేహానికి ప్రాణం, జీవానికే జీవం జాగృత కేతనం
మార్పుకు తీర్పు, తీర్పుకు తీపి, తీపికి తీరు జాతినికేతనం
అభిమానానికి అవధి, విలువలకు వలువ, విజయానికి వెలుగు రంగుల రంగం
బానిసత్వానికి బందూకు, జనసేవకు జాగృతి, దేశభక్తికి శక్తి జయకేతనం
వ్యక్తికి గుర్తు, శక్తికి రక్తి భారతీయుల ఆశలస్ఫూర్తి అతిశయ జెండా
ఆశయాల ఎడారిలో భరత జనునకు నీడనిచ్చే ఐక్యతాశక్తి కేతనం
మతాల, కులాల, కూహకాలతో భిన్నంకాబోయే భరతావనికి ఏకత.
భాషల్నీ, భావాల్నీ, భారతీయుల్నీ ముడివేసిన మువ్వన్నెల మూర్తి
స్వేచ్ఛా చేతనలకు చైతన్యం భారత జనగర్వానికి జయరూపం
నవ్యత్వానికి నయనం, సంప్రదాయానికి సాగరం మనజెండా
దేశభక్తికీ, రక్తికీ, శక్తికీ రంగుల అంతరంగరాజ్యం
కూడు, గూడు, గుడ్డలు జనజీవన ప్రాణాలైతే ఆప్రాణాలకు ప్రాణం మనజెండా.

335

మానవ సంక్రాంతిని ప్రకృతి మనువర్తితో మన్నిస్తున్నది
తనతనానికి తపనమీరింది. మనువర్తికి మాలిన్యమంటింది
మనతనాన్ని మృత్యువు కబళిస్తున్నది. మానవతకు చోటులేదు.
గ్రహవర్తనానికి క్రాంతి సంక్రాంతి. మనుజీవుల జీవనం అమలినం.
భూమి పంటకు విలువ కట్టాడునరుడు. భూమాత విలువ కనలేదు
గ్రామసీమ గరువానికి నిలయం. రామరాజ్యభామ సంక్రాంతి.
పాలస్వచ్ఛతకూ పశువు నలుపుకూ పోలికా, వాలకం తీపికి గురుతే
చల్లదనానికి చాటుకోరేచేటి, సంక్రమణానికి ప్రియునితో దోస్తీ
హిమధాముని హిమకిరణ ధనానికి ఇంపు, కలల పంట ఇంటిని నింపు
మనిషి, ఎద్దు, రంగురంగులమేళం రహికిచ్చే త్రివర్గ సుఖాలు.

హరితవర్ణ భూమిలో హరిదాసు ఆగమనం అవనికి శ్రీరామరక్ష.
కొత్త కొత్త జంటలు కోర్కెల కూతలతో కోమలత్వానికి ప్రతీకలు.
కోడిపందాల పౌరుషం పలనాటిని గెలిపించే కొలువులు
సంక్రాంతిలక్ష్మి సారళ్యానికి మానవుని స్వాగతం కాఠిన్యభరితం
లోగిటిలో ముగ్గుల ముద్దుల మురిపాలు తెలుగుల చేతిగీతలు
మంట చలిని కాటేయవలసింది ఆకలిమంట మనిషిని కాటేస్తుంది
పంట తంటాయై అప్పులుతీర్చలేని ఫలితానికి రైతుల ఆత్మహత్య
సమయం చూచుకొని సామాన్యునికి పెనుభారమైన వస్తువుల ధరలు
లక్ష్మిపాదాల పారాణి ఆరకమునుపే అత్తింటిలో ఆత్మకు హత్య
పశువుల కొమ్ముల పటువు కనుమ పసుపు కుంకుమలతో దిటవు.
గోమాత పావిత్ర్యానికి ఆటస్థలమైన మనభూమిలో కాంతి సంక్రాంతి.
పంటలు రైతన్నల ఇంటికి పరుగుతీసే పర్వము తెలుగుల పండుగ.
సంద్రం చిందరయై చల్లబడి హేమంతానికి హితవు పలికింది
నక్షత్రాల మార్పిడి పంటనూర్పిడితో పండుగగా భువి వెలిసింది
క్షతగాత్రులైన జనులకు చలిదీర్చుకొనే మంటలు కడుపు మంటలే.
సంక్రాంతి పురుషుని వాహనమేదైనా మాన్యుల రూపాలు రాతివే
పంచాంగాలు కాలానికి కొలమానం. మానానికి మానం మరుగౌతున్నది.
మనిషికీ మనువిధానికీ పొంతన మన సంక్రాంతి కల్గించాలి.
మొసలిరాశిమోము కర్కశమైనా మొసలికన్నీరు జీవితంలో కార్చకు.

336

పసితనానికి వసివాడే కాలం పరువు ఫలరహితమయింది
పచ్చిబాలింత గుండె గుడిని విచ్ఛిన్నం చేసే విమత బిడ్డలు.
దేశమాత దేవురింతల కడుపుతో దేహిగా మారుతున్నది
కురుకుమారుల కూతల్లోని కుమ్ముదుమ్ము ప్రాశన కాలంలో మాటలు.
కళ్ళుతెరుస్తూనే బుల్లి తెరలకు తరలే తనయుల వాలకం
అమ్మఒడినుండే బ్యూటీపార్లర్లకెళ్ళే అమ్మాయిల అందం
బడిమాటను బంధించి సాగుబడికెళ్ళే తనయుల తారుణ్యం
స్వదేశాన్ని మరచే విదేశీవనితల వీరంగానికి అవధులు మగువలు.
మగువల మానానికీ మౌనానికీ మగపురుషుల ముగుదాడు

కలవడానికీ విడిపోడానికీ కలిమిగీచే గీత సహగీత.
పురిటి కందుల్ని గొందుల్లోని కుండీల్లో వదలే గర్భశోకపువనితలు
సాంప్రదాయాన్ని సాగనంపే సారళ్యానికి సమాధి కడితే మంచిది.
బిడ్డల మమకారానికి సమయంలేని తలిదండ్రుల తపనకు తాళం వేయాలి
కడుపునిండటానికి పండటానికి కారుణ్య కలిమి కలియుగంలో ముఖ్యం.
తల్లి ఒడి వీడిన తనయుడు బడిగుడిలో బలవంతుడు కావాలి
అన్నదమ్ముల అవని బంధానికి సువిధ సమిధగా సంగమించాలి
అక్కచెల్లెళ్ల అమర సంగీతానికి శృతిలయలు సుమతులు మీరు
గౌరవానికి గమ్యంగా సమత్వానికి గమనంగా నీనడత నిలవాలి.
గతకాలం మేలనే గణ్యుల మాటకు గండికొట్టే వర్తమానివి కావాలి.
మనల్ని నిలిపిన మనపెద్దల మౌనరాతిరూపాల్ని మనసుల్లో ముద్రించుకో.
శిక్ష శిలువయితే పరోపకారం వరమై పృథివీస్థలి పులినమౌతుంది.
చెరసాల చెట్టతనానికి చెరుపయితే చెలవం చెలువుమీరుతుంది.
విషానికి విరుగుడైన అమృతం అందకపోతే జీవికి ఆనందమెక్కడ.
అక్కరకురాని అంతరువుల తమాషాలో బిడ్డలు భీరువులౌతున్నారు.
ఆరంభానికీ అంతానికీ అంతరం లిప్తకాలమే. ఆంతర్యం తెలుసుకో.
కోర్కెల కొండలుకూడ కరిగిపోతాయనే కాలగమనాన్ని గుర్తుంచుకో
బోగిపళ్ళు బొమ్మలకొలువుల కమనీయజీవితాలకు కరువొచ్చింది.
అస్తికీ నాస్తికీ అందని జీవితాల అయోమయం అంతానికి చేరువ.
కసి పసితనానికి కాలమహిమ కల్పించింది. నిజంకాకుండా చూడు.

337

పల్లెతల్లి పారవశ్యం పరువపు సంక్రాంతిని స్వాగతించింది
గతించిన తారల జ్ఞాపకాల దొంతరలు జాతిగుండె నాడులు
చంటవెంట సందడిచేసే ఊరితల్లుల పిల్లల ఉరవడింపులు
కాలంతోపాటు వ్యయమైన కష్టానికి ఇష్టఫలం ఇలక్రాంతి.

వాతావరణం వరమై మానవసహకారాన్ని మన్నించింది
జీతగాళ్ళ జీవితాలకు జవసత్త్వాలనిచ్చే జీవన క్రాంతి
కన్నెపిల్లల కోర్కెల రంగవల్లుల మలుపులు కంతం ఎక్కడో
గ్రామాల బురదలో బ్రుంగిన వానదేవుడు హిమహితుడైనాడు.

అనావృష్టి కాలానికి కళ్ళెం. అతివృష్టి కిమితి మానవుల మనసులు
పసిమికీ మిసిమికీ పావనతను ప్రసాదించే పరువాల వరులు
మునిమనుమళ్ళ ముద్దులకు మురిసిపోయే ఇంటిపెద్దల వింతచేష్టలు
గుమికూడిన గుర్తుతెలియని ముసుగువీరుల కనిపెట్టే భోగిమంటలు.

కంకుల కలిమితో కనికరించిన పంటచేలు వరిదుబ్బులతో ప్రత్యక్షం
మాటలురాని మూగజీవుల మాలిమికి అంకితమైన మనుషులు
కొత్తబట్టలు కట్టులతో కట్ట తెగిన ఆనందాంబుధి సంతతి
వంటకాలతో వడ్డింపులతో కాలంగమించే అమ్మల ఆతృత.

అరిసెల మాధుర్యానికి అవసరాలు తీరే కాలమహిమ గొప్పది
ఆప్యాయతల అంచుల మించులు తూకానికి అందనివి.
గారెల గౌరవానికి హృదయ మధురిమలు ఊటాడతాయి
అటుకుల చిటుకుల ఆనందావధి అందని తెలుగులు కానరారు.

జోడెద్దుల బండి జోరుకూ కాడెద్దుల తీరుకూ కరువుండదు
పశువులక్కూడా పండుగే. మనిషిలో కలిసిన మాటలేని జీవులు
గ్రహగతులు మారుతూ గహనంలోనికి మానవుడు గమిస్తున్నాడు
సంక్రమణం సంకరమై సంప్రదాయం సంగతిగతిలేనిదైనది
బోసిపోయిన గ్రామాల భోగిమంటలు మినుకు మినుకంటున్నాయి
పొట్టకూటికి దాసులు హరిదాసులై పండగకు ముఖం చూపుతున్నారు.
ఎద్దులకు మేతలేక తనమేతకై తపిస్తూన్న గంగిరెద్దువారు
ముంగిలి నుదుటిన గీచిన పొదుపుగీత రంగవల్లిగా మారుతుంది.
"కనుమ" కనులకు కనరానిదై కనుమరిగిపోయిన క్రాంతి సంక్రాంతి.

338

వచ్చిపోతున్న వత్సరాలు వరులకు వాత్సల్యాన్ని పంచుతున్నాయా?
మంచికిమారుపేరైన మనిషి కథను కంచికంపడమే కాలమహిమ
తలిదండ్రుల తపనలో బిడ్డల సౌఖ్యం భీతిల్లి భీరువులైనారు
పితరుల పీతాంబరాలు తండ్రుల ఖద్దరు వస్త్రాలై తారసిల్లాయి
గతవత్సరానికి వేసిన గాటు గ్రామ సహమతికి అవమతివేటు
మానని కులమత గాయాలను మాన్పే మరోవత్సరం మరెప్పుడో

ఇంటిని ఇంపుగా దిద్దుకోలేని ఇల్లాలికి హితవులు మతిమంతమాటలు
ఊరకతిని బలిసే ఊరకుక్కల రీతి మానవుల ఉనికిని ఛేదించు
సోమరితనానికి సోదరులైన నవయువకులను పెంచే నూతన వత్సరాలు
విధ్వంసనిలయాలైన విద్యాలయాలను గురుదేవుల ఆలయాలుగా చూచేదేనాడు.
మతంచెప్పినా మనిషిచెప్పినా హితానికి ఇరులుముట్టవనేదెప్పుడో.
కష్టాలను గుర్తించి ఎదురొడ్డి గెలిచి నిలచినవాడు దేవుడుకదా
అందించేవారికి అందుకొనేవారికి అవసరం అవగాహన అందం
ముసిరే చీకటికి మురిసే చంద్రుడు మరలా ముప్పునకు సిద్ధపడాలి.
పగలంతా ఆకాశాన్ని అవకాశంతో దున్నేసిన సూర్యుడు రాత్రికి మరుగే
క్రూరత్వం రాక్షసత్వం నిత్యకృత్యాలైన కాలానికి ప్రేమ మానవతలేవి?
పెరిగిన మానవులు తరగని వేదనలు మానవ వేదనకు మరోదారి?
సహానుభూతికి సమయం చచ్చేటప్పుడేనా? బతుకులోకూడానా?
పందిమెచ్చే పావనత్వపు బురద అని తెలిసినా మానవుని అడుగు అక్కడే
జోరీగలు ముసిరే పశువులా విదలింపులు కదలింపుల వింతజీవి
కోర్కెల అదుపును కోరుకొనే నవ్యజీవన వత్సరాలకు ఆహ్వానం
పరార్థానికి వరాంజలి సమర్పించే నూతన సంవత్సరాలకు స్వాగతం
మానవత్వానికి మాన్యత కల్గించే మరోవత్సరానికి సాదరాహ్వానం
రాముడు, రహీము, క్రీస్తు, బుద్ధుడు, నిజజీవితంలో ప్రతీకలు మాత్రమే
లోకం వెలిగించే శాస్త్ర శస్త్రాలకు జీవన విలువల సాదరాంజలి.

నిండైన పండుగ నింగీనేలల వెలిగించే నిలువెత్తు మానవుని కనికరం
పంచేంద్రియాల పావనత్వం పరువపు ప్రపంచాన్ని నిర్మించాలి.
మోసం మీసమై ఆక్రోశించే ఆవేశం పౌరుషం మనకువద్దు
సరసాల సురసాల సారస్వతం మనకు ముద్దుగా మనందరం మురియాలి
అహంకారము మమకారాలు మానవజీవన సంద్రానికి చెలియలికట్టలు
స్వార్థం బడబాగ్ని ప్రేలి ప్రళయాలు రాని నవ్యవత్సరాన్ని కోరుకో.

339

తెలుగులోగిళ్ళ సంక్రాంతి తెలుపులూరు – సస్యరమనిండు గాదెల సంబరముల
కొత్తకోర్కెల జంటలు కొలువు మీరు – కోడిపందాలు పల్లెల పౌరుషములు.

పల్లెనాటను శౌర్యమ్ముపలుకునిండె – బాలచంద్రుడు నాగమ్మ బాటలందు
సీమ గుంటూరు రక్తాన శివమువిడెను – మకర సంక్రాంతి మనపాలి మౌనముద్ర.

వడ్లనూర్పిడి వసుధకు వాసినిచ్చు – అవని అపరాలు పంటయె అధికమగును
పాడి పంటలు పశువులు పరమమగును – గ్రామసీమల సంక్రాంతి గరువమబ్బు.

సేద్యగాళ్ళును కూలీలు సేవనమున – భువికి భూషణమౌదురు భుక్తినిచ్చి
పల్లెతల్లియె పావన పదముమీరు – పెద్దపండుగ పేరున పెంపరునుగ.

సంబరములన్ని అంబరమంటగాను – భోగిమంటలు భువనాన భోగ్యమగును
పర్వదినమున పరమాన్న పాయసములు – పరువ మబ్బును నేలకు మనుజులకును.

జంటకోర్కెల చరియించ జవ్వనమున – పంట కొడుకులు కూతుళ్ళు తంటదీర్చు
భాగ్యరాశిగ ఇల్లాలు భాగధేయ – భవ్యసంక్రాంతి సిరులిచ్చు భావనమున.

రైతు రాణువ రాజ్యము రహిని వెలుగ – రజిని విడివడి రవిపంట రాజ్యమందు
మక్కువలుదీర్చు మాధవు మందిరముల – జనత సుఖముండు జవసత్వజాగృతులను.

340 భోగిపండుగ భోగముల్ భోరుకొలుపు – మకర సంక్రాంతి మాన్యముల్ మండజేయు
కనుము పశువుల పండగౌ కాలములకు–గ్రహము గతులిచ్చు పర్వము ఫలము శాంతి.

అమరహరిదాసు లోగిళ్ళ నటనజేయ – పాట రాగము పంటల పదమునిచ్చు
గంగిరెద్దుల మేలముల్ గ్రామమునకు – దయయు దాక్షిణ్యధ్రఢిమల ధరణికిచ్చు.

చిత్ర చిత్రాల వేషాలు సిరులు దెచ్చు – చిత్ర భాషణ భాషలు చెలువు మీరు
పంటకాలము దానాల పటువు హెచ్చు – అర్థులిలయందు సార్థక మగుట నిజము.

గ్రామసీమల గహనమ్ము జారిపోవు – పల్లె విరిమల్లె మనసుల పల్లవమ్ము
వల్లెయనుచుండు మనుజుల వలయుమద్ది – తల్లి సంక్రాంతి కాంతికి తావలమ్ము.

శాంతి కాంతుల సంక్రాంతి శార్ద్వలమ్ము – పైరుపంటల పాలిచ్చు పైదలియెగ
మనిషి మనసుకు మందగు మాన్యమదియె – ధన్య ధరణికి దార్ఢ్యము దారియద్ది.

ఆటపాటల అందాలు అవనివెలుగ – బాట దీర్చిన భూతమ్ము భవిత కంద
వర్తనమునందు మానము వరమునేడు – జీవి జీవించు జీవాన జిలుగు వెలుగు.

ఋతువు హేమంతమాయెగా రుచ్యముగను – హిమము కలిగించు చలిగిలిగింతనేడు
చెలియు చెలికాడు వెచ్చగ చెలువమీరు – చలికి పులకింత సంక్రాంతి సారసహిత.

341

కుప్పతెప్పల ధాన్యము కూర్మినిచ్చు – ముద్దుమురిపాల పాపలు ముంగిలందు
రంగవల్లులు రవళించు రజినివెలయ – గోమయమ్మున గొబ్బిళ్ళ కోర్కె గుర్తు.

బంతి చేమంతి బంతుల భామదాల్చి – నడచి వచ్చును బంగారు నవలతాను
సస్య సిరినిచ్చు సరికన్య అందముగను – అతివ ఎవరన్న సంక్రాంతి లక్ష్మియామె.

శ్రమకు ఫలితమ్ము సిద్ధించ సంబరమ్ము – ఆరుగాలము శ్రమియించ ఆస్థికలుగు
జీవి జీవన సూత్రము జిలుగు మిగులు–అదియె సంక్రాంతి సూత్రమై అవని వెలుగు.

హిందు సంస్కృతి పర్వాల హితము మీరు – అవని అందరి పండుగ సంక్రమణము
నేల తల్లిని నమ్మగ నేతలగుట – తథ్యమవనిని తరగని తావియిద్ది.

గ్రహము గతులను గమియింప గణ్యమగును
సూర్యచంద్రుల గరువము సుగుణమిచ్చు
తార రాశులు తరలగ తావిదమ్ము
మకర సంక్రాంతి మాన్యము వానియందు.

వత్సరానికి వచ్చేది వరపు వరము
భరత భాగ్యము భాసించు భవితకలిగి
మనము మనదను భావము మరువకుండ
మనకు మధువులు పంచుత మాన్యతిథియు.

నెలకు పదునైదు రోజులు నియతికల్ల – రోజు కొకముగ్గు రవణమ్ము రోడ్డుమీద
సాంప్రదాయిక గొబ్బిళ్ళు సరసముగను – సార్వకాలిక పర్వము సవన రీతి.

342

పిండివంటలు పిలుపుల పెదవులూరు
పాయసాన్నము పావన ఫలమునాడు
మినపగారెలు మిన్నంది మినుకు వలెను
మృష్ట భోజన సంక్రాంతి మురువు గొలుపు.

కొత్త బట్టలు కట్టగ కోర్కెదీరు – చిత్తమానంద మయమగు చింతవీడి
కొడుకు లళ్ళుళ్ళు కూతుళ్ళు కొమరుమిగుల – కొత్తశోభల సాధించు కొలతలేక.

వెలసె జడివాన చలివచ్చె వేకువాయె – పులకలుప్పొంగె గాలికి పురమునందు
భోగిమంటల చలిగాలి పారిపోవు – భవ్య మనుజుల సంక్రాంతి భాగ్యగరిత.

కృషికి ఫలమిచ్చు పండుగ కూర్మితోడ – అందరొకటిగ నొకచోట కలియునదియు
పేదపెద్దలు సమముగ పేర్మిమీరు – చిన్నపెద్దల సంక్రాంతి చెన్నుమీరు.

కలిసికట్టుగ పనిచేయ కార్మికులుగ – కృషికి పేరును కలిగించు కర్షకులుగ
శ్రమకు చైతన్యమేపారు శ్రామికులుగ – గ్రామ రాజ్యాన జనులంత గణ్యమగుత.

మేథ జాతికి పంచిన మేనివరులు – వేదనను దీర్చు వెలుగులు వెతలు వీడ
సాధనమునందు ఫలములు సాక్షిగాగ – జనత సంక్రాంతి జనులకు జాగృతగును.

పొట్టజానెడు కొర్కెలు ప్రోగు మిగులు – మేని బాధలు మేదిని మేరమీరు
స్వార్థమవనికి సార్థక శత్రువాయె – జనుడ! పరమార్థ పావన జగతికోరు.

343

ఆయురారోగ్య అర్థాలు అవని కలుగ – అనుభవమ్మున అధికులు అవనిజనులు
భవము భావింప వరసేవ పరులసేవ – మానువుని సేవ మాధవు మహితసేవ.

సేవ విలువను తెలియగ చేతమందు – సిరులు విరులును వెలుగును చింత దీరు
పరుల చైతన్య పరచగా పరువమబ్బు – పుణ్య సంక్రాంతి మనకిచ్చు గణ్యఫలము.

పరగ పంచాంగ శ్రవణంబు ఫలమునిచ్చు – ఫలము కందాయములనన్ని పొలుకలుగ
రాజ పూజిత మాదాయ వ్యయములెన్నొ – రహిన భూసురు డెరిగించు రమ్యముగను.

నాగరకమగు లోకాన నయముమీరె – గ్రామసీమలు కోల్పోయె గరువమంత
జనుల బుద్ధులు మారెను కర్మలందు – జగతి జయమెంచు జనుడిట సున్ననేడు.

అంతమాత్రగ హరిదాసు వచ్చిపోవు – భాగవతమన బరువయ్యె భవ్యజగతి
గంగిరెద్దుల వారులు గగనమయ్యె – పగటివేషాలు చూడగా పట్టపగలె.

రాజకీయము చెరిచెను రాజ్యమంత – వీడె సంస్కారభావము వింతగాను
రాక్షసత్వము రూక్షమై రహినివెలిగె – మానవత్వము మచ్చుకు కానరాదు.

అందరొకటిగ అవనియె అందమగును – మనసు మనసున కలియగ మరువమగును
మానవత్వాన మనమంత ముందుకెళ్ళ – ముద్దు మురిపెము సంక్రాంతి మోక్షదాయి.

344

పుణ్యతీర్థాల నదులను మునుగుటలును – గణ్యదేవాలయములకు గమనమగుట
పర్వదివసాన సూర్యుని ప్రార్థనమ్ము – ఫలము లిడునుగ సంక్రాంతి పాడిపంట.

సూర్యశక్తిని మించిన స్ఫురణ లేదు – లోక లోకాల చైతన్య లోలుడతడు
భువికి చేతన మందించు భువనమతడు – అట్టి సూర్యుని సంక్రాంతి అమరమగును.

దీక్ష అయ్యప్ప దివ్యము దిటవు పెంచు – జ్యోతి జాజ్జ్వల్యమానమై జోతలిడగ
మకర కోవెల మాన్యమై మనసునిండు – జీవి వాసికి వాసము జీవనమున.

చిత్రరీతుల సంక్రాంతి శివములిచ్చు – మంత్రపారాయణములందు మాధవుండు
కీర్తనములందు కీర్తించ కీర్తికరము – స్మరణమాత్రాన ముక్తియు కరము మీరు.

రంగధాముని కీర్తించె రాజకవియు – నాల్గుపదులముకుందము మాలగాను
ఆస్తికుల ఆస్తి సంక్రాంతి గానమయము – విశ్వరూపమ్ము విమతుల విరియజేయు.

భీష్మ భీరువు మరణము విస్మయమ్ము – పుణ్య ఉత్తర యానము పూజ్యదమ్ము
అంపశయ్యను శయినించె నాటివరకు – సర్వలోకాల లోకుని రూపు చెప్పె.

సర్వపర్వములందున సలలితముగ – దేవదేవుల దివ్యుల దేహశక్తి
తలచి తరియించి తపనను తరలజేయు – జనత జీవన సంక్రాంతి జయములిడుత.

345

విషయసుఖముల మునుగుచు వెలుగుచున్న – వెతల మనుజుల విలువల వేరుచేయు
కతల కాంతుల తులలేని కార్యములను – మేలు మేదిని కిచ్చును మేటి ధవుడు.

వీరవిలువకు వలువయె వినుత కాంతి – కలల కలువల కమనీయ శాంతిదమ్ము
విమల జీవన విధులకు విపుల శక్తి – కర్మ ఫలితము సంక్రాంతి కాలగతిని.

రాజ్య పదవులు పరమార్థ మనుచునమ్మి – అధిక అధికార దాహము అవనిసమయ
పాలకుల కల జనసేవ పథము మీర – రాజకీయము భోజ్యము రహిని జనుల.

ఆంగ్ల వత్సర ఆరంభ మాంద్రమందు – సాంద్ర ఫలముల సంక్రాంతి సౌరభమ్ము
శుభము సుమతుల కందును సూక్తి సహిత – వత్సరము వాసి వరపగు వదనములను.

రంగు రంగుల రంగము రంగవల్లి – మలుపు మానవ మృగముల మలిన చేష్ట
గొబ్బి గుబ్బెత కడుగును గోల మనసు – గాన హరిదాసు నాట్యము గడపు ముప్పు.

ఎన్నికల తంత్రమిటవచ్చె ఎఱుక లేక – ఎన్నికలలోన కలలన్ని ఎంత గొప్ప
సంతరసరకుగ మారని సమత కల్గి – ఓట్ల పండుగ సంక్రాంతి ఓటరునకు.

రాజకీయుల మంటలు రాజ్యమందు – భోగిమంటల రూపాన భోరుకొలుపు
భాగధేయుల సేవకు భాగ్యమవని – సాగిరాగను ఆహ్వానసారథివిగ.

346

అలహాబాదున సంగమ స్థలిని జనులు – గంగ నవగాహనమ్మున కామితముల
తీర్చు తీరులు తీర్థాల తియ్యనగును – మజ్జనములందు సంక్రాంతి మదుల మలచు.

ఆంధ్రదేశాన అతిపెద్ద పర్వదినము – నదుల మాన్యాల పంటలు నడచివచ్చు
వర్ష హర్షము శాంతించ వరపు భువికి – చలికి చెలియలు సంక్రాంతి సంపదలను.

భద్ర పర్వతరాముడు భాగ్యదాయి – సరిగ సిరికొండ మల్లన్న సౌఖ్యదాయి
కాళహస్తిని శివరాజు కరుణదాయి – సప్త గిరివాసి శేషుడు సతముగాచు.

స్కంధపురికందె కమ్మని కామితమ్ము – అష్టకముజేసి అవనికి ఇష్టుడాయె
పేరుపెంపున సంక్రాంతి పెద్దదౌను – తరము మారగ తరుణము తపనదాయె.

మనసు దినుసుగ మాటలు మనుజులందు–మనిన మనుజీవులందరు మహితమగును
జీవ విలువలు జనులందు జీర్ణమైన – శీర్ణమగునుగ దౌష్ట్యము శివము వెలయ.

కామ్యకర్మలలోకాన కర్మవిలువ – తెలియపడికట్టు తక్కెడ తేట ఫలము
ఆత్మనర్పించి కర్మల నాచరింప – అమల మమరము ఫలితము ఆర్తిదీర్చు.

గీతగీసిన గీష్పతి గిరిగ వెలుగు – చేత చేతమ్ము పండించ చెలువు మిగులు
మాత మనిషికి మరువని మాన్యమైన – మమత మనసుల నిండగ మంచి కలుగు.

347

అలవాట్ల ఆటుపోట్లకు జనసంద్రం విచలితమౌతున్నది
మంటలురేపిన తుంటరి తనానికి ఆభిజాత్యం అడ్డొస్తున్నది
అమరులైనా మరులైనా అవనిజనవేదంలో ఆదమరిచేవారే.
యుగాలుమారినా ఉగ్గుబాల మాధురి ఊయల ఊపిరి మారదు
కల్తీల కాలంలో అమ్మపాల పాలన అరువు తెచ్చుకొంటున్నదే
మర్చిపోయే అలవాటు మానవత్వానికి మరపుతెచ్చే మాలిన్యమే

తనువు మనసుల తపనదీర్చే మనువు జీవ దాంపత్యానికి రహదారి
మగువ సహనానికి మహిమకు నిలువెత్తు రూపమై భువిలో నిలుస్తుంది
పారుష్యం పలుకులలో పలకరింపు పులకరింపుగా మారదు
నిత్యజీవితానికి నియతి సత్యసాధనకు సమరసత ముఖ్యం
సహనం సవనమైతే జనజీవన శాంతికి ఈ భువి భవనం
కాలం కర్మను కలవరింతకు గురిచేస్తే కావ్యం అమరం
ప్రేమ పేరుకుపోయిన హృదయాలకు మాలిన్యం అంటనిమాట నిజం.

రెండు జీవుల్ని జీవసూత్రంతో కలిపే రెండక్షరాల ప్రేమే భువి దివి
ఎగజిమ్మే విషజ్వాలల హృదయాలు గహనానికి సోపానాలు
మనం మానవులమైతే మానవత్వానికి మరోమాట ఎందుకు
రాగద్వేషాల రాజ్యానికి పతనావస్థ దాపురించిన దాఖలాలెన్నో
మానవాళికి మనసు ముఖ్యమైతే మానవుడు మహనీయుడే కదా!
మౌనగీతాల మ్లానవదనాల మనుజుల సేవనం మాధవుసేవే
ధనం గుణాన్ని వెక్కిరిస్తుంటే దౌష్ట్యానికి తావు ఈ భూమి
మార్దవానికి మారురూపైన మనసుకు 'మాపు' మాలిన్యం మరకలే
మాట తేటగా మరునికి బాటయై జీవనగమ్యాన్ని చేరుస్తుంది.
కర్కశత్వానికీ కామానికీ కాలగమనంలో కాలం చెల్లినట్లే
రక్ష రాజ్యనాణేనికి బొమ్మయితే శిక్ష శివమెంచే బొరుసు
తనతనాన్ని వదలిమనతనానికి మరలే మానవులే మాధవులు
వికృతికి విడిదిగా పుడమికాకూడదని పూజ్యుల భావన
మాన్యుల భావన వనమై నందన వన సౌరభం నల్దిశలా విస్తరించాలి.

348

ఎన్నెన్ని సంక్రాంతులు సంక్రమించి క్రమించాయో ఎరుకలేదు
క్షణక్షణానికీ నవ్యతనుకోరే నాజూడు నరుని గమ్యమేమిటో
పచ్చదనానికి స్వాగతంచెప్పి పంటధనాన్ని కాంక్షించాలిమనిషి
వెచ్చదనం చలికి విరుగుడైనా జీవి జీవితానికి మాత్రంకాదు.

ఆరోగ్యానికి అపరదిశగా ఆలనాపాలనాలేని జీవితాలు ఎన్నో
ధనానికీ దానానికీ దారుణ సంగ్రామం ఆరంభమై కాలాలుదాటాయి

410

కల్మషం లేని సంక్రాంతి గ్రామాలు కలికానికై కానరావుగదా
పొలం పొలిమేరలు పొలుపుదప్పి పొలికేకలు కరువౌతున్నాయి
భువి మానవుడు ఆధారభూతమైన ప్రకృతిని అవమానిస్తున్నాడు
జోడెద్దుల నాగళ్ళు యంత్రాల ఏరువాకతో ఏటిలో కలిశాయి
కాలుష్యానికి కార్యస్థానమైన కామితార్థ ధాత్రికి వృష్టివైపరీత్యము
భస్మాసుర హస్తమైన మానవమేధ ఆత్మహత్యల అమరసందేశమిచ్చింది
పాలకరాయుళ్ళ చలిపులకలు వదలించే చెలి భోగిమంట
స్వార్థం అన్వర్థమననుకొనే సార్థకాఖ్యులకు మకరంతో మృత్యువు
నీతినియతుల్ని నిలువరించే అవినీతి జనగాత్రాలు భోగిమంటల్లో
తెలివి కలిమి కొరకేననే తెంపరుల తుంటరిచేష్టలు మకరకోరల్లో
ధనమనములనే జోడెద్దుల సేద్యానికి ఆరుగాలపు పంట సంక్రాంతి
కొలతనందించే త్రాసు కొలువుదీరి కలతల్ని హరించే భోగం
అస్థిరత్వానికి ఆలవాలమైన జనస్వామ్యానికి జీవం పోయాలీ సంక్రాంతి
పరమార్థమైన ప్రజాస్వామ్యానికి ఫలవంతమైన క్రాంతి సంక్రాంతి
రాజకీయాల రుగ్మతల్ని రూపుమాపే సంక్రాంతి పురుషులు ఓటర్లు
ఐదేళ్ళునిలిచే అందమైన ప్రతినిధుల నందించే చంద్రులువారు
సిద్ధాంతంలేని రాజకీయుల జీవన సిద్ధాంతానికి దిసమొలను చూపు
వ్యక్తికి శక్తి వ్యక్తిత్వమేనన్న విలువల బతుకుకు నాందినేడే.
దీక్ష దక్షతల జవజీవధారుణికి జన్యువుగా వెలగాలి
మైమరచిన మొదడుకు మధుమాసం మానవ సంక్రాంతి
విలువల వెలుగునకు వింతశోభ జనజీవన సంక్రాంతి.

349

లాభం లోభంగా లోకం లోలుపతల లోగిలిలో గిలిగింతలు పెడుతున్నది
స్వార్థం స్వాగత తోరణంగా పచ్చదనంతో పైపైకి ఎగురుతున్నది
మదం మత్తులో చిత్తయి చిత్తంలేని చిత్తడిక్షేత్రంలో మగత పండుతున్నది
అసూయ అందమైన మాటల్లో విసువులేని విగతచేష్టల్లో విలువల్ని వీడింది
ఈర్ష్య వర్షంగా అకాలంలో కురిసి అన్నికాలాలను చెరిచిన గ్రహగతిలా మారింది
బంధుత్వం బంధనాలను తగిలించి తగవులేని జీవనగతిలో తరింపజేసింది
తినలేని డబ్బుకొనితెచ్చిన పదార్థాలను తినిజీర్ణించుకోలేని అవస్థ అర్థరహితమైంది.

విలువలేని అర్థానికి విలువనిచ్చిన మానవుడు జీవిత విలువల్లో అర్థాన్ని గ్రహించలేడు
జీవన వ్యాపారం వ్యాహ్యాళి వ్యవస్థలో వెలుగుచూడలేని అవహేళనతో నిండింది
మంచిని ఎంచుకొనే ధైర్యం దారిలేని చీకటి హృదయాల్లో చిక్కి శల్యమై సిరివిడింది
తెలివి తెల్లారిన బతుకుల్లో తేకువలేని వేకువ సూర్యుడు మబ్బుచాటున మరిగాడు
అంతరాల అవతారాలు క్షణక్షణానికీ కణకణానికీ పాకి పావన జీవితాన్ని పాడుచేశాయి
మతం అభిమతమైనా సతమతమైన జనజీవితాలకది సతతవ్రతహీనక్రతువయ్యింది
చెలిమి కలిమిలో చెట్టాపట్టాలేసుకొని బలిమిలేక బాధతో బావురుమంటున్నవైనం
దేశభక్తిలేని దేహంతో మాతృభూమిలో మనుచున్న మనసులేని మానవుల ఆయనం
జాతిశీలం చెడిన జాగృతమానవాళి మనుగడలో మాత మానవతకు మౌనవ్రతమే
జీవం చచ్చిన జనసంస్కారానికి పునరుజ్జీవన యోగ్యత కలిగే పుణ్యకాలం వస్తుంది
కండ్ల కావరానికి కామెర్ల వైద్యంచేస్తే శాస్త్రానికున్న విలువ చెరిగిపోతుంది కదా?
మార్పు మానవ సహజమని తీర్పుచెప్పిన నేపధ్యంలో మారని మానవదేహాలు రాళ్ళేగా
కదలిక వదలించుకొనుటకు కాకుండ ఒదిగిమదిగి జనమదినిండటానికనిగ్రహించాలి
మృత్యువును తప్పించుకోలేని మెత్తదనం మేలుచేసే చైతన్యంతో మేదినిలో కలకాలం నిలుస్తుంది.

రెప్పపాటు జీవితంలో రెపరెపలూ ఆకాశాన్ని ఆహరించే ఆశలై అంతరిస్తున్నాయి.

350

రాజకీయ తంత్రాలు రాజిల్లుతున్న దేశానికి స్వాతంత్ర్యం శోభనిస్తుందా?
మాతమానాన్నిదోచిన రాజకీయ దొంగల మానసం సంతసిస్తుందా?
అరవైరెండువసంతాలు నిండిన భారత స్వాతంత్ర్యం కుతంత్రాలనిత్యవసంతం.
సరిహద్దుల హద్దులు చెదరిపదవుల పదనిసలు ఫలహీనమై మాత అవస్థ వ్యత్యస్తం
మంచితనం పంచిన మల్లెమనసులు మౌనగీతం ఆలపిస్తూ అలసిపోతున్నాయి
నోట్ల కోట్ల ఓట్ల దాట్ల నాలుగు స్తంభాల ఎన్నికల ఆటలో ఓటమి ఓటరుదే
కలిగిన కామందుల కలగలుపు కలల ప్రజాస్వామ్యంలో స్వాతంత్ర్యం కల్లగా మిగిలింది
జాతిశీలం శంకించబడి భారతదేశం భాగ్యవిహీనమై బాధలతో కృంగింది
సార్థక స్వార్థం సమర్థవంతమైన పాలనగా వ్యవస్థలో వ్యతిరేకత లేనిదై నిలిచింది
మానవత మౌనవీక్షణ మానసంతో టెలివిజన్ తెరపై తెగువచూపి తగలబడింది
దాపరికపుదారిలో దరిజేరిన భారత కురుసార్వభౌములు కురుక్షేత్రంలో కూలాల్సిందే

412

కాలం గతి దప్పిన జ్వాలయై గాలిలో విహరిస్తున్న నేటి స్వాతంత్ర్యగతి అధోగతి.

అవగుణాల పుట్ట అందంగా అలంకరించబడ్డ స్వాతంత్ర్యదేహానికి నవరంధ్రాలున్నాయి

తల్లిని ఆదరించలేని తనయుల తగవులు విగతస్వేచ్ఛతో వినువీధిలో విహరిస్తున్నాయి

ఆత్మవిమర్శ లేని ఆకతాయి నేతల ఆత్మీయతలో అలరిస్తున్నది తల్లి స్వాతంత్ర్యం

దేశమనే దేహానికి ఆవరించే రుగ్మతలు అసంఖ్యాకమై అణచివేతకు అసాధ్యమౌతున్నాయి.

అందరికీ అన్నీ అందిస్తామని చెప్పే అధికార దాహార్తులు దాహానికి నీరివ్వలేని స్వార్థపరులు.

మత్తులో ముంచి మగతలోదించి మదంతో నించి పదవులు కాపాడుకొంటున్న పందలు

సుఖమంతా తమ స్వంతమనీ బాధలన్నీ పరుల పరమనీ భావించే భారతనేతల కోరికకు కొరతవేయాలి.

సమాజాన్ని విభజించాలనే నేతల భావన భాగ్యరహితమై వారే విడిపోయే దుర్దశ ప్రాప్తించింది.

మోసం తాత్కాలిక మోదం పంచి పదవీమోహం నించి పండిన పదవీ ఫలమై నేలరాలుతుంది.

దేహంలాగే దేశమనీ రుగ్మతలకు మందు మనమేధస్సులోనే ఉందని మనిషి సాగితే భారతం స్వర్గమే.

351

అమరవీరుల ఆంతర్యంలోని సమరసందేశం అందుకొనే అదనుపోయింది

బోసినవ్వులబాపూజీవిగ్రహంబోసిపోయి మహాత్ముని బోధలు బాధకల్గిస్తున్నాయి

నెహ్రూజీ శాంతిసందేశాన్ని నెమరువేసే భావిభారతపౌరుల దేశభక్తి దేవుని చేరింది

రాచరికాన్ని జమీందారీతనాన్ని జనజాగృతిలో మిళితంచేసిన పటేల్ పటుత్వం ఎవరికి పడుతుంది.

సమరమే అమరాన్ని ప్రసాదిస్తుందనే సాహసం సామర్థ్యం మూర్తీభవించిన నేతాజీ మూర్తిని గమనించేదెవరు?

భారతమాత దాస్యాన్ని దూరంచేసే యత్నంలో ప్రాణాలను ఫణమొడ్డిన ‘భగత్’ భాగ్యజీవితాన్ని చదివేదెవరు?

మన్యజీవుల మానవత్వానికి మహిమ పంచిన ఆంధ్రవిప్లవసింహం అల్లూరి త్యాగాన్ని ఆలకించేదెవరు?

భారత మహిళ జవసత్త్వాలకు ప్రతీకగానిల్చిన ఝాన్సీ మగువ తెగువలోని మాన్యత గమనించేదెవరు?

ఆశయాల అంబేద్కరు ఆలంబనగా దళిత జనహృదయ మాలిన్యాన్ని గళితం చేసేదెవరు?

తత్త్వవేత్తల తారుణ్యానికి తలపూవుగా పూజ్యుడైన సర్వేపల్లి సహనచరిత వినేదెవరు?

మానప్రాణాలను ఫణంగాపెట్టి మంచితన్నాన్ని మహికిపంచిన మనవారి చరితల్ని చదివేదెవరు?

ప్రవక్తలు ప్రభవిల్లిన దేశంలో ప్రాభవం లేనినాయకుల నయవంచన కంచెగా స్వేచ్ఛను మేస్తున్నది.

బుద్ధుడు పుట్టిన పుణ్యభూమిలో గణ్యతలేని వన్యప్రాణులైన రాజకీయులు రాజ్యంచేస్తున్నారు.

కులం ముసుగులో మసిబారిన భారతప్రజాస్వామ్య తాజ్‌మహల్‌కు వార్ధక్యం వచ్చింది.

మతం మడతలో మన్నికవీడిన మతస్వాతంత్ర్యం విడదీసేసరికి చిరిగిపోయింది.

దారుణాలు తమరుణం తీరేదాకా దాక్షిణ్యాన్ని వీడి ధరణిజనస్వామ్యాన్ని మారణం చేస్తున్నాయి.

అశోకుడేలిన భువికి శోకం మిగిలి హిమశైలం కూడ కరిగి గంగానదిగా గమించి సముద్రంలో కన్నీరుగా కలిసింది.

దేశాన్ని దోచుకొని పరదేశాల్లో దాచే దారుణ నేతలను దమియించే వేల్పులున్నారా?

ప్రతిఊరిని పరిపాలించే జీవమున్న దేవుళ్ళు రాతివిగ్రహాలై జనహృదయాలయాల్లో నిండే రోజెన్నడో?

ప్రజాసేవావ్యాపారంలో ప్రముఖులై ఆధికారిక దానంలో అధములై ఆర్తినిపొందేవారే అధికులు.

త్యాగం తెలియని యోగులు అధికార యోగంతో మానవ జీవన మారణయాగం చేస్తున్నారు.

విలువకోసం వీరుని సమరం వెలుగుపంచే వేద వేద్యుల జీవనం జాతిరక్షకు శ్రీకారం.

వసంతాల సంతలో వరుసగా ముప్పైఅయిదు ముద్దువింతలు.
ఆదిలక్ష్మి ఆదివారలక్ష్మి అపరలక్ష్మి ఝాన్సీలక్ష్మిగా పుట్టినవేళ
పగలు ఫలవంతమై ఉషోదయం ఉన్నతమైన అందమై రూపొందింది
తులలేని మంచితనంపేరుగా కల్గిన తులశమ్మకు ఉదయించిన సుదతి
నయమైన నాగేశ్వరునికి నవ్యమైన మేధస్సుతో దివ్యమై వెలసిన రూపం
అందచందాలకు అందమైన బంధమై అనుబంధమైన ప్రేమపేరు
స్వర్గం స్వంతంగా సృజియించే సృష్టికర్త కృతికి అనుకృతి ఆకృతి.
చారెడేసి కనుల చేతనత్వం చైతన్యవంతమైన చెలియ చెలిమి
అర్థబలం అతిశయించిన అంగబలానికి రంగరించిన రాజ్యమాయె
ప్రేమపెరిగి పెద్దదై ప్రేరకమై సంసారానికి సుఖసారం అందించిన అతివ
భాగ్యమున్నాలేకున్నా యోగ్యమైన యోజనతో జయంపొందిన కుటుంబం
అదుపులో పొదుపును అవసరంగా అమలుపరచిన అందమైన జీవితానందం
ఉదయంనుండి ఉద్యమించి ఉన్నతలక్ష్యం తన సంసార ప్రగతేనని భావించిన భామ
ఒంటరితనాన్ని ఓరిమితో భరించిన వైనం ఒప్పుదలలో మెప్పునొందిన మెలత
జాగ్రత్త కలిగి జాగృతమైన జాణతనం జయంపొందిన జాగరణ మూర్తికట్టిన ముగ్ధ
అనుజుల ప్రేమకు అంతరంగాన్ని అమరంగా అందించిన ఆదర్శ అతివ
మగని మానసాన్ని మంజులత్వంతో మధువుపంచిన వధువుగా వర్ధిల్లినది.
భూతల స్వర్గంగా కుటుంబం భాసించాలనే భావంతో బాధ్యత మరవని మాన్యురాలు.

353

అసూయలను కలిగించే అర్థమునీకొద్దురా
ఆశయాల అర్థమును అందరికీ తెలుపరా
ఇంపు మించు హితమతివై ఇలను నీవు నడువరా
ఈర్ష్యలేని ఈవినీకు యీ బతుకున వరమురా
ఉన్నతముగ ఉర్వరందు ఆచరణము అవధిరా
ఊగిసలాటయె వలదుర ఉద్యమమున సాగరా
ఋతువులారు రుజలు తొలగ రుగ్మతలను వీడరా
ౠక్షమైన వర్తనమున కక్షలెన్నొ కలవురా
ఎఱుకలేని ఎదల నీవు మెఱుపు విధము నిండరా
ఏది ఎప్పుడెక్కడెట్లు ఎంత ఏమి ఏలయనుచు సాగిరా

ఐశ్వర్యము ఆదిలేదు అంతరించు నదియనరా
ఓరిమినీవాసి పెంచు ఒప్పు తప్పు నెంచరా
ఔరాయన జనులందరు అవనిని వర్తింపుమురా
అంతరంగ మందునీకు అవమతియే వలదురా
అచ్చమైన మెచ్చువాక్కు విలువనిచ్చు మెచ్చుమురా
ప్రాణమైన శీలమందు పరవశమున సాగరా
స్వరవరునిగ స్వాగతించు స్వార్థరహిత జీవిగా
అక్షరమే అందమనీ అదె మనసున కలదని నమ్మరా
వాగర్థము వలపునించ తలపున చరియించుమురా
సంస్కారము త్రికరణముల సాగవలెను సోదరా!

354

ఆర్తి దీర్చు అవనిజనుడె కీర్తి పొందునిచ్చట
కీర్తి కీర్తనమ్ముగా మూర్తులందు నిలచును
మూర్తి ముద్దు ముంగిటిలో అంగమె యీ ప్రకృతిలో
ప్రకృతి కృతి ఆకృతిగా ప్రకరకృతి జనుడెరా
ఆకృతి కృతి అమరముగా పాత్రమగును ప్రగతికీ
పాత్రమైన ప్రగతిగనగ సుకృతమే నీదిరా
సుకృత జనప్రకృతిలో సూక్ష్మజ్ఞానముండునురా
సూక్ష్మజ్ఞాన సహితులకే సుందరత్వమమరునురా
సుందర వందిత భువిలో అందమె అమరత్వమురా
అందమె ఇంద్రియ సహితము అంతరించు జగమునా
అంతరించు జీవమంత అవనిలో ప్రకృతి నీదే
జీవమున్న స్థలమందున జిలుగు వెలుగు నశ్వరమ్మో
నశ్వరమౌ నాణ్యతలే విశ్వనరుల వింతకృతులు
ప్రకృతి అందము చూడగ ప్రవరులెయీ పురుషులంత
అక్కరలో చిక్కరుగా చిక్కుల బడుదురు జనులు
మానవతా సమతలకే మచ్చగూర్చి మనవలదుర
భేదభావ మేమిలేని పేదరికము ప్రవరమిచట

క్రిందనిలువ స్థిరమేరా పైకివెళ్ళ స్థిరము లేదు
బాధ భావమందు కలుగ భాస్వంతము వాక్కురా.

355

శూన్యంలో దైన్యంలో దారి కనని మానవుడా
దక్షుడవై శూద్రుడవై భద్రములను గాంచరా!
భావనలో భోగభాగ్య భాషణలేలా – చేతనలో చేవలేని చేత లేలరా
కాలమాన గతులను కాంచగలిగి నీవుంటే
కాలునిమది కలవరమై నినుగాంచలేదురా
కలిలో కారుణ్యముతో కమ్మదనం పంచగా
కలతలు లతలు మారి కలిమి విరులు పూయునురా

కానరాని మనసు వెళ్ళు కనలేని చోటునకు
కనబడేది సత్యమని నిత్యము మరువకురా
నీతలపే నిత్యమనీ నీవలపే సత్యమనీ
నింగినేల తెలుసనీ నిమ్నుడవు కాకురా!

మానవ సంబంధమే మనుజీవికి అవసరమని
మానవతే మానవులకు మహదాశయ మని తెలిసి
ప్రేమశాంతి యీ భువికీ పేర్మి వెలుగు పంచుననీ
తెలివికలిగి తెలియరా తెలుపులూరు విశ్వశాంతి!

356

వింతలోకం విలువహీనం – వంత వలపుగా వాసిగాంచును
తల్లిని చంపి తనయుడైపుట్టి – తరగని ప్రేమనుపొందెడి తపన పరుడె నరుడు
తడబడు అడుగులలోనా – తరియించు తల్లినీ
అడుగుల జాడలె తడబడ ఆర్తిని బడవేయు జనుడు
కొట్టి తిట్టినా కోమలమౌ గుండెలో – పండిన అనురాగమే ఫలముగ భావించువాడు
క్షేత్ర బీజ సంబంధము పాత్రముకాగా – పవిత్రుడై ప్రభవంచును ప్రాభవమున స్వార్థపరుడు
కష్టనష్టములలోనా కామించును అందరినీ

సుఖము సుందరతల అందుకొనును తనకు తానె
అనుభవము శూన్యమైన – భవజన్మను బాధితుడు
జ్ఞానము అంతముకాగా – వింతరీతి అజ్ఞానియె
దశలెన్ని గడచినా దశమారని దశమగ్రహము
గ్రహగతులే మారినా గమనము సరిచేసికొనడు
వింత వలపుల – వంత విలువల – హీనలోకం – హితము మరచెను.

357

కలియుగాన దేవుడు – కలిమి కలుగు దేవుడు
కామనలో జీవునకూ – కామితార్థుడాయెను.
బంగారుకొండలో – సింగారమొలకించు
రంగారు రమ్యుడు – రహిజనులకు మహితుడు.

ఆక్రందనలను విని – ఆర్తిని దీర్చెడివాడు
అనురాగమొలికించి – అక్కున చేర్చెడివాడు
ఇంద్రియాల కింపుగా – ఇది అదియని తెలియక
ఇంపునింపు జనవిభుడు – జయశీలుడు ప్రభుడు
వంకలేమి లేనివాడు – సంకటముల దీర్చువాడు
అంకమతడు లోకములకు – ఆంతర్యము అతనికెరుక.
వినశనవశుడౌ జీవుడు – గురువుగ గుర్తింపబడగ
నాశన రహితుడు దేవుడు – నాణ్యమైన అసలు గురువు.

దేవుడు లేడను వానికి – దేహమే లేదుగా
జీవము కాపాడుకొనుట – సాధ్యము కాలేదుగా!
ముందువెనుకలకు వెళ్ళగ – మూలమేమొ తెలియవలెను
మూలశక్తి ఆ దేవుడు – ముసలితనమె తెలుపునీకు. 358

అనుభూతికిమించిన భువిభూతిలేదు – అనుభవ జ్ఞానంకన్న అధికతరంలేదు
పంచేంద్రియ పావనతే ఫలవంతము – ఆరవ ఇంద్రియభావన అఘరహితము.

శరీరమున పరిమళం చెడకుండగా – చేతనలో చైతన్యం చెంగలించవలెనుగా
పుట్టి పూజ్యుడయినా గిట్టి యోగ్యుడయినా–జీవనమే భావనమై అనుభవమే మించురా.

కాలుష్యము శ్రుతి మించిన కాలంలోనా – కలిమి జీవవేదమే అనుభవ బలిమి
అక్షరమై అవసరమై యత్నముసేయ – సాఫల్యము లక్షణమై జనసరళియె మారుగా.

భవబంధము భావనలో భాగ్యదాయిగా – భావించే మానవుడే బాధలుపడును
మానవ నవ బంధములే మహిమగజూచు–మనుజీవుడె మమకారపు సుందరుడగును.

359

మానవ సంబంధం – మహిమాను బంధం
మమకార బంధురం – మహనీయ సుందరం
మానవతా శోభితం – దానవతా శోషితం
దాక్షిణ్యపు ధారుణిలో – దారిజూపు దయాధనం.

మనసులున్న మానవులు కలిసియుండగా
మమతలు పెనవేయగా మనసు నిండుగా
అన్యోన్యత అవనిమించు జనులకండగా
ఆశయమే అందరొకటి ఆశపండగా.

ఏదో ఒకనాటికీవు ఎఱుక వీడుదువుగా
ఎవరో ఒక మానవుని ఎదను కోరుదువుగా
అహము వీడి అవసరమును మదిని నించగా
మానవ సంబంధమే మహిని నీకు రక్షగా.

ప్రాణముపై తీపికలుగు పాడు బ్రతుకునీది
ఆకలి దారిద్ర్యము లందున అలమటింతువీవు
కలియుగాన కలల బతుకు కల్లయైన వేళలో
మానవాళి చెలిమి కలిమి మాన్యమౌను నీకు.

మమత సమత పెంచుకో – మానవతను నింపుకో
మమకారము దారిలో – సహనముతో సాగుము
పరులమేలు కోరుము – పరమార్థము జీవనం
పావనమౌ బంధము – అదె మానవ సంబంధము.

360

ఆస్తులెన్ని అమరినా అంతస్తులు పెరిగినా
ఆధారం అవనియనీ అవగాహన చేసికో
నీఅమ్మను కన్నదీ యీభూమే తెలియరా
నిన్నుకన్న అమ్మకూ నిధి భూమేరా
అమ్మప్రేమ నీకుంటే అవనిప్రేమ అమ్మదిరా
అందరిదీ ఆప్రేమే పేరు భూమిప్రేమరా
నిమ్నమైన ఆధారం నీటికదేనిధియనీ
భూమినీటికలయికే భూతములకు తిండిరా!

అంతులేని ఆశకూ అవకాశం యీ భువి
అంతమైన ఆశకూ ఆధారం యీ భువే
అంతరముల తరములకు అంతరంగ మీ భువి
వింత తరము విలువలకూ విభవ మీ భువియే.

పావనతకు పేలవతకు ప్రాభవమ్ము భువియే
మానవాళి మమత సమత మాన్యము యీ భువియే
కాలాలకు అందనీ కాంతిమతీ యీభువీ
చైతన్యపు చేతములకు చేతనత్వ మీ భువే.

భూమి భుక్తి దీర్చురా – భూమినమ్ముసోదరా
మాతృభూమి మిన్నగా – మానవతకు అమ్మరా!

361

అమరం కోసం సమరము – అవని జనుల ఆంతర్యము
మేధమిగిలి మేలిమిగా మేదిని పండాలని
పకృతియే తనవశమై పరవశమందాలని
ఉన్నసుఖము చాలదని లేనిది పొందాలని
బాధలేమి లేని జగం భావనలో మిగలాలని.

అందని ఆకాశం అందిపుచ్చుకోవాలని
అందిన భువినిండా ఆనందం నిండాలని
వెలుగు చీకటులలోనా వెలితిని పోద్రోలాలని
అభ్యుదయం ఉదయంగా అరుణిమ కొనసాగాలని.

మంచితనం మానవతలు మంచువిధం కరిగిపోగ
వంచన పంచన నరులు మంచెపైన వసియించగ
నీతిధర్మనియతులే నిధుల విధము భాసించగ
స్వాగతించు స్వార్థమందు సార్థకతే మిగిలిపోగ.

జయమే జగతిని జీవనమై – భయమే ఎరగని భావనమై
నరులే నవతకు వారధులై – వరులే అమృత వాహకులై
వర్తించిన భువి శాశ్వతము – గుర్తించిన రవి చైతన్యము.

362

ఉర్వరలో ఉదయగిరిని ఉద్వాహము చేసికొన్న ఉదయభానుడా
సర్వమునీ కిరణములే సాకు భువికి సహనము నందివ్వవా!
అపరదిశను అరుణిమతో అందమైన ఆదిదేవుడా
స్వపరభేదసారసహిత మహినిమార్చి మహిమపంచు!
కొండ అండ ఐననీకు గుండెనిండ చైతన్యమె
మండించుట దండించుట నీకరముల నియతియే!
రాతిగుండె మానవులను రాపాడెడి రాజువీవె
జాతిమతం దేశాలకు కట్టుబడని కాంతినీదె.

విరులు తరులు వరులన్నియు విజయమందు వెలుగునీదె
ఋతువుక్రతువు రుజల రొదలు రూపుమారు ఋక్కునీదె.
వర్తుల వర్తనము నీది వసుధ క్రిందు మీదుగాను
అర్థముగా పూర్వపరము అవని అతిశయమ్ము నీవె.

నిన్నుచేరుయత్నముతో నిమ్నమానవులు నిలచిరి
మన్నుమిన్ను విన్నదనము మాడ్చివేయ మరలిరంత.
పగలురేలు వగలునిండి పరమార్థము మరచిరంత
స్వార్థము నీకున్నగాని వర్ధిల్లదు జనజగత్తు.

ఉదయగిరీ అస్తగిరీ ఏకము కావెప్పుడూ
ఏకమైన ఎఱుకలేమి ప్రళయమెగా తప్పదూ.

363

చిత్తశుద్ధిలేదు – విత్తబుద్ధికలదు – విలువలేమి వలదు – వినయమసలె కాదు
నేటిమానవుని నడత – నీతినియమరహిత
జాతిదేశ భక్తులు – తలపులోనె తగవు.
మనసు మాట చేతలలో – మమత సమత మరిగెను
స్వార్థ పరతలోన చిక్కి – సార్థకతయె సమసెను
నేతకోరు పదవులన్ని – సంపాదనకోరునుగా
సేవచేసి తరించుటే – చెరిగిపోయె పాలనలో
ఆశయమే అడుగంటెను – ఆలోచన లయించెను
అవగాహన గహనమాయె – అవలోకన అంధమాయె.

గతముమరచి హితం విడచె – సతం హతం గమనమాయె
సరసతయే మరచిపోయి – విరసతకే విలువనిచ్చు.

వినయపదము – విజయపథము – విలువకలుగు – విశ్వమయము
శాంతి కాంతి – అభ్యుదయము – చెరగనిదౌ – భువనమందు.

364

అంతరంగం – ఆశతరంగం – ఆశయాల రంగం – ఆచరణే భంగం
అంతరములు మరచుటే ఆంతర్యమై – వింత విధము సంచరింత విబుధభావనం
వ్యర్థము అర్థమనీ వ్యవహరింతగా – అర్థము స్వార్థమనీ అనుసరించగా
విత్తము చిత్తమనీ విలువ పెంచగా – మొత్తము త్రికరణముల మోజు వెడలెగా.

ఆత్మశక్తి సాత్త్వికమని అందరంటుండగా
నరుని రక్తి రాజసమని నవ్వులంటుండగా
తనదుభక్తి తామసమని తపనపరుల భావనగా
త్రిగుణములను త్రికరణముల తిరిపెమెత్తె తీయగా.

అక్కరతీరగా – చిక్కులు మరతురు – చిక్కులు ముట్టగా – చింతల బడుదురు
ప్రక్కన వారినీ – తనవలెచూడగా – ప్రగతియె మిగులును – సుగతులు కలుగును.

అంతరంగ ఆశలు – ఆశయాల ఆచరణలు
హృదిని ఉదయమందగా – ఉదయమె జన అభ్యుదయము.

365

బతుకులోని బాధలతో భంగపడ్డ జీవితాలు
గతుకులలో గమ్యమెంచి గమనంలో సాగుతాయి.

సత్యజీవనమ్ములోని సారమెరిగి సాగగాను
అవినమ్మె భూవిభుడే సత్యహరిశ్చంద్రుడే.
ధర్మవర్తనమ్ములోని ద్రఢిమనెరిగి ధరణివిభుడు
ధర్మరాజు దారుణముల దారిలోన పయనించెను.

ప్రేమతత్త్వసారమెరి పేరుగాంచె జీవనమున
పేరు నలుడు దమయంతికి కష్టనష్టముల వడసెను.
శ్రీరాముడె చింతనలో వంతలలో వాసిగాంచె
ఆదర్శము మర్శనమున ఆరాజ్యము రామునిదయె.
అష్టకష్టములువడసిన ఆడమగల జీవితాలు
శిష్టమాయె శివములతో నిష్టలకే నిధులువారు
అక్కరకే అరిష్టమై ఆశయమే అవనతమై
అనుబంధము బంధనమై బాధకు బంధువు నీవె.

పురాణములు ఇతిహాసము పూజితాలు జీవితమున
పలాయనపు బతుకులతో పాపపంకిలములాయెను.
బాధకలిమి బతుకులన్ని – భావనలో భంగములే
అనుభవాల అవనిజనుల – ఆనందము ఆశయమే.

366

నరులు తరులు విరులు ఝరులు నాట్యమాడగా
కరులు గిరులు హరులు లేళ్ళు కలతనందగా
జీవకోటి జిలుగు వెలుగు జీర్ణముకాగా
మానవాళి మనసు విడచి మనుటదెలియగా.

సృష్టి సుందరతల వీడెను – దృష్టి దురిత భరితమాయెను
మృత్తికయే మురిగిపోయెను – వృత్తులన్ని ఉరకలేసెను.

హిమహితమే తమమతమై మమత కూర్చెను
కఠినశిలల కమ్మదనము కలిమి నించెను

పూవుతావి లోని మధువు పూతమాయెను
పిందెకాయ పండిరాలి పిదప మొలిచెను.

జీవమున్న వస్తువేది నిత్యముకాదు – వాస్తవముగ వస్తువులే నిత్యమైనవి
ప్రకృతి కృతి ప్రసిద్ధమై పరమమాయెను – జనప్రకృతి వికృతిగా జయము మరచెను.

కనరానిది కనిపెట్టిన శాస్త్రవేత్తలే – కనని వెన్నొ కలప్రకృతి కాలవిలువలే
కలతలేని కాలమునా కామందువీవె – అందమైన లోకానికి అవధిలేదులే.

367

వేదనకూ వేళమించె వేకువకాగా – వెతల బతుకు వెలుగుపంచె తేకువ మీర
వేదవిద్యవాదనలో వెలుగు కోలుపోయె – మానవవేదం స్వార్థం మగతనిండిపోయె
జలధరముల జవసత్త్వం జనునికి ఎరుకే
ఎండమావి జనుని ఎఱుక ఎటుల కురియునో

కోపించెడి ప్రకృతియే కోమలమగును – పురుషాకృతి పూజ్యమైన పురమువెలయును
వైవిధ్యపు వైనమేమొ తెలియర నరుడా – వేవిధముల అనుభవమే వెతలు దీర్చురా!

పగటికలల బతుకులే రాత్రికి నిదురించు
నిదుర విదురులెవరైనా నియతినరులె భువిలో

పగలు రాత్రి వగల ప్రియులు పలువురు కలరు
వలపు వగపు వసుధ దెలియ వాల్లభ్యమహితులు.

ఉన్నదియే ఉర్వరలో ఊడిపోవునూ – లేనిది శాశ్వతమనుకొనులేవడియే జనుడూ.

సృష్టినష్టి సుందరమే శుభముకోరగా
నిత్యసత్యసూక్తులే నియమముకాగా
విధులు నిధుల విధముగాను విలువనందగా
మానవుడే మహిమ యుతుడు మానవతే వాంఛగా.

368

దేశరక్షకై దేహము నర్పించగా – దేవులైన వీరులకు అభివందనం
మాతరక్షకై మగధీరులై – మాన్యులైన జవాన్లకు మంగళాభినందనం.

దేశభక్తి జాతిరక్తి జవజీవములై
శత్రువీరగుండెల్లో నిదురించగా
శక్తియుక్తి తోడముక్తి పొందిన మనసైనికులకు
ఆత్మశాంతి కలిగించగ అభినందనం.

తల్లిదండ్రి తపనలో తరియించగా - బాధ నిండి బంధువులూ భాగ్యమందగా
ఆలు అన్నదమ్ములూ అమరజీవి నందించగ - ఆప్తులైన మిత్రులే కీర్తిని పొందగా.

ఎందరో ఎందరో భరతవీరులూ - అందరూ మాతకూ విందొనరించీ
వందితులై నేలకొరిగి నింగికెగసిరీ - తారలవలె తళుకుమనుచు ప్రకాసించిరీ.

369

కార్గిల్ కొండల్లో కరుణ ద్రవించింది - కర్కశ పాకిస్తానుల ముష్కర చొరబాటుతో
ఉన్మాదం ఉగ్రవాద ఉంగిడి తినగా - ఉద్యమాన సమరస్థలి ఉప్పెనకాగా
లౌకిక లావణ్యమే కొండలపై పారగా - గగనతలం గమ్యమై గరువమంత పొంగగా.

ఆక్రమణలు విక్రమాన అవతలివైపుకు పోగా
అరమరికలు లేనిజాతి అమరసుఖం పొందగా
సమరంలో సహగమనం సరసత్వం మృత్యువుగా
ఆశయమే దేశహద్దు త్యాగజీవనం హద్దు.

ఒకమహ్మదు ఒకప్రసాదు ఒకశర్మ ఒకరావు
ఒక్కటిగా మీద బడగ వ్రక్కలాయె శతృతతి
ఆనందం విషాదము అవతరించె నొక్కసారి
మాతపురిటి నొప్పులన్ని మటుమాయం ప్రసవంతో.

ఆరక్తపు అరుణిమలే భరతావని ఉదయంలో
జయకేతన వర్ణములై త్రికరణముల సృజియించగ
భయంతొలగి బతుకుమారి భావమె శాంతిగమారె
భావి భరత మాత మహిమ మానవతా శోభితమగు.

370

అమరసందేశము అందించెనొకనరుడు
కార్గిల్ కదనాంగణమున కలిసెను ఆవరుడు.

మాత ప్రాభవం మంచుకొండలో దాగె – జాతి వైభవం జాజ్జ్వల్యమాయెనచట
హద్దుకలిగిముద్దాయెను అవనిభారతం – సరిహద్దు చెరచగా సరసతకోల్పోయెను.

పాలకాధ్యులందరూ పరువును కోల్పోయిరీ
పాలనలో ప్రవరులై భద్రత లేకుండిరీ
దండికండలున్నవారు అండగాను ఉండిరీ
భారతసైన్యానికదీ జాజ్జ్వల్యపు జయంపంచె.

దొరకని దేహాలతో దోస్తులైరి సైనికులూ
తొడగని దుస్తులతోనా తొంగిచూచె మృత్యువూ
ప్రాణరహిత దేహాన్ని చూచిన బంధువులూ
త్రాణ కోల్పోయినా తరియించెననుకొనిరి.

ఆనాడు ఈనాడు ఏనాడయినా – ఆశయాన ఆర్తినీ
అలమటించు జనుడూ – జయం అపజయం
జాతి జనుల దీవెనలో – జవం గల్గు జవానుకే
అమరంలో అందునుగా.

371

భారత భారతి రక్షణ దక్షులు – భాగ్యమాతకు యోగ్యులు పుత్రులు
కదనరంగమున మదమద్రిప్పక – కార్గిల్ కొండల కాపల దారులు.

సమరం – సవనం – సహనం – వహనం
దహనం – దమనం – కరుణం – వరణం.

వీరులార! ధీరులార! విజయపథం విలువ రథం
మాతృభూమి మహితత్త్వం మనెనుగమీ చేతలలో.

పాకిస్తాన్ భూకబ్జా – పావనతకు ముప్పు
భారతభాగ్యం దర్జా – మీ బాధలకే మెప్పు
ఎముకలు కొరికే చలిలో – ఎదల పదిల పరచిరీ
ఎఱుకలేని ముష్కరుల – తరిమితరిమి కొట్టిరీ.

రక్తతర్పణంలోనా రాజులైరి జవానులు
శక్తికొలది పోరాడిరి అంగవికలులైరి

అమరభూమి కింద్రులు సమరాంగణ సారధుడు
ఆశయమే దేశభక్తి ఆశయె జనరక్షణం.
వాయుసేన వాసిమించె, కదంతొక్కె పదాతులు
మరఫిరంగి మారణమున మానమాతకు మహిమగలిగె.

372

ఆంధ్రవీరులార! అమరులు మీరు – ఆశయాల వరులు! భారతమ్మ విరులు
కమ్మని కాశ్మీరంలో కలతరేగింది – కార్గిల్ కొండలలోనా కరుణ ద్రవించింది.

మంచుకొండపైన మనసులు కుంచించుకొనె
మించు దేశభక్తిలోన మిగిలెను పార్థివ దేహం.

అమ్మానాన్నల ప్రేమ ఆశయంలో కలిసిపోయె
ఆలుబిడ్డ లిరువురా ఆశనిరాశగమారెను
ప్రాణం ఫణముగ పెట్టగ ఫలం యశస్సుగ మిగిలె
పావన భారతి భువిలో పౌరషమే ప్రవరమాయె.

ఆకాశంలో ఎగిరిన ఆవిమానం – చోద్యముగా చోదకుడే సోలిపడిపోయె
సహచర వీరులతో సాగెను తానూ – శతృవిబిర ఛేదనమున చెరిగిపోయె భువిలో.

ఎందరో ఎందరో ఎందరెందరో – అందరూ మాతకూ అసలైన పుత్రులు
తల్లి తపన దీర్చిన తరుణారుణ దీప్తులు – తరియించిన వీరులు! తాపసులే వారలు!

373

అంజన పుత్రుడై అసమాన గాత్రుడై – అందమై అమరెను అతనిరూపు
భావించు భక్తుల బంధనములుదీర్చ – భవమున భాగ్యమౌ భవుని చూపు
కీర్తించు జనులంత కీర్తిని గాంచగా – వాంఛించు వరునిది వలపు తలపు
పంచేంద్రియములకు పావనతనుకూర్చు – పాలన చాలన పరువు మురువు.

చిరము జీవించు చిరజీవి చింతలేక – కొంగు బంగారు సింగర కొండపైన
మూర్తి దర్శించ జనులకు కీర్తిగలుగు – ఆంజనేయుడు మహితుడై అమరెనిచట.

అంతరంగములను అమరుడై పాలించు – వింత విలువ నొసగు వేళలందు
ప్రగతి సుగతి నిడును ప్రవర ప్రసన్నుడై – పావనుడుగ హనుమ ఫలములొసగు.

374

## పర్యావరణ దినం (5.6.1999)

గీ. కాలవిలువను గుర్తించ కలిమి గలుగు; దేశభక్తిని చరియించ దివ్యమగును
ప్రాంత ప్రాధాన్యతనుయెంచ ప్రవరమగును; శుద్ధి 'పర్యావరణము'న శుభము గల్గు.

గీ. పంచభూతములుండెను ఫలముగనగ; ఇంద్రియములైదు గలవుగా ఇంపుతోడ
మహిమ మానవమేధల మలినముండ; వంచనము మించు వసుధకు వరపులేదు.

గీ. జీవమున్నది జిలుగున చెలిమి మిగుల; నాశనమునందు నరులకు వాసిలేదు
వాసి కలుగగ జీవము వసుధలోన; వెలుగ మానవ జీవన వెతల దీరు.

గీ. పావనమ్మగు భువినిండు భావనమున; బతుకు గతుకుల మతమైన భవితలేదు
కనులముందర ప్రకృతిన్ కర్కశమున; వాకృతముగజేగ విలువలు విగతమగును.

గీ. కశ్మలమునుండి జనియించి కర్మతోడ; కల్మషముగల్గుచేతల కలత నొంద
అమ్మపాలిచ్చు సమయాన అవగుణములు; అంతమొందించ భూమాత అతిశయమ్ము.

గీ. వాత కాలుష్యముండెను వసుధలోన; నీటికాలుష్యము నున్నది నిగిడె భువిని
భూమి కశ్మలమయిన భుక్తిహీన; భూత భుక్తియె కాలుష్య భువనగమను.

గీ. జనుని పరిశుభ్రవ్యక్తిత్వ జయము మిన్న; చుట్టుపట్టుల శుభ్రము సుందరమ్ము
అన్నపానము స్నానము అధికశుద్ధి; అవని జనులకు ఆప్తము అధికముగను.

గీ. అంతరిక్షపు నౌకల అభ్యుదయము; నరునిచేతల నాశన తరము లిలను
యంత్ర పొగలను కాలుష్యతంత్రభువిని; మనుట మహిమయె మాలిన్య మహిని నేడు.

గీ. వ్యర్థములునేడు ఇద్ధమై వృద్ధివీడె; మురుగు ముంచుక ముద్దునుమూసివేసి
ధూళి దూసరితములయె దురితమయము; నాగరకమున నరునికి నలత వచ్చె.

గీ. గృహము గురుతుగ గురువుగ గుంభనమున, నీరు గాలియునిత్యము నిధిగనుండ
విధియె జనునికి మిన్నగ సుధల విధము; నాల్గుదిక్కుల దివ్యమై నవ్యమగుత.

375

గీ. వాసయోగ్యపు గృహముల వరుసలోన; వసతులన్నిటి కల్గించ వాసి మిగులు
ఇతరయాంత్రిక గృహములు ఇంపుకావు; కలుషరహితము కలిమి గ కాంచు మన్న.

గీ. ఫ్యాక్టరీలను దూరాన పెట్టవలయు; వ్యర్థయాంత్రికమలినముల్ రద్దపరచు
అధికశబ్దాల నరికట్ట అతిశయమ్ము; అవని పర్యావరణమున కదియె హద్దు.

గీ. నదుల కాల్వల మురుగును వదలిపెట్టు; కలుష వారిని జనులకు కలవరమ్ము
సంద్రములయందు మలినముల్ సందడిగను; అంతరిక్షపు నౌకల అవనిభుగ్న.

గీ. నరుల మేధలు నవ్యమై నాట్యమాడు; తప్పటడుగుల నాట్యము తపన మీరె
శ్రుతిలయలగూడ శుద్ధము సుందరమ్ము; నరుల మనసులె విరులగు నందనముగ.

గీ. చేతలెన్నైన చైతన్య చెలువుమిగులు; తనకు తనచుట్టువారికి తగవుసేయ
తనదు భావన తరియించు తరుణముగను; అదియె అభ్రపువిభ్రమ అతిశయమ్ము.

గీ. చెట్టుకొట్టకు చేవయు చెరిగిపోవు; విషపదార్థము విలువను విరిచివేయి
మలవిసర్జన చేయకు వరపునేల; చెట్లు పెంచుము నీశక్తి చెరిగిపోదు.

గీ. పారవేయకు చెత్త దారులందు; వాడునీటిని వదలకు వసుధపైన
పసుల చావడి దూరాన పదిలమగును; పావనమ్మగు నీనేల పరమమగును.

గీ. వాతావరణము తుల్యమై వసుధ మించ; పచ్చదన పరిరక్షయే పరమమౌను
కలుషకారక జీవుల కఠినముగను; అణచివేయగ అమరమె అవనినేడు.

గీ. భరతదేశాన నదులన్ని భాగ్యరహిత; అడవులన్నియు అధ్వాన్నమహరహమ్ము
కనపరిశ్రమ లన్నియు కర్కశములె; స్వార్థవ్యక్తుల పాలయె సంఘ ఆస్తి.

గీ. భావిబిడ్డలకిచ్చెడి భాగ్యమేమి? చింత వంతల సిరిహీన వింతభువియె
వికల విలువల భాగాలె విన్నదనము; భావనముచేయ నేస్తమ బాధకలుగు.

376

సంద్రతీర సాగుభూమి రొయ్యల చెరువుల సాగుకు
పంటచేలు తంటగూడి కలుషమాయె భువి గుంటలు
భూమిలోని నీరు తరిగి కలుషజలము జనులకందు
చెరువులలో నీరంతయు చెరిగిపోయి తరిగె మంచి
పొగల విడుచు పరిశ్రమలు పొలుపువీడె స్వాస్థ్యమేమొ
వ్యర్థములౌ పదార్థములు వెగటు ననారోగ్యమాయె
ముఖ్యనదుల ముద్దునీరు మొద్దుబారె మాలిన్యము

మురుగునీరు కలిసిపోయె మంచినీటి కాల్వలలో
భువిని నరుడు ఖనిజములకు త్రవ్వ నెన్నొ గుంటలిచట
మరల పూడ్చివేయ కుంట మురుగు కూలములుగ మిగులు
పెద్దచెట్లు విరిగిపోయె చిన్నచెట్లు పెరగవాయె
వంటచెరకు కాల్చివేసె వరపగు మన అడవులన్ని
పెంటకుప్పలన్ని నేడు దర్శనమగు రోడ్లవెంట
మలమూత్రము జంతువులది – మధ్యనుండ మనకె చేటు
నగర జీవనమ్మునేడు నరకమాయె కర్కశమున
గ్రామజీవనమున మిగిలె ఘనతలేని గమనమంత
ఊరచెరువులన్ని నేడు చేపలకేంద్రములాయెను
మంచినీటి వనరులన్ని మాలిన్యపు కూపములెగ
జాతిపౌరజీవనమ్ము జాలిగొలుపు మారణమున
చిన్నారుల భవితనంత చిదిమివేయ తగదునీకు.

377

సూర్యగోళ సుందరతలు సురిగిపోయి కరుగుచుండె
ఆకాశప పొరలన్నీ అంతరమున శూన్యమాయె
భువిగోళము దూరమందు చవిచూచును మంట తంట
హరితాశ్వుని చైతన్యము హతమతమై అమరుచుండె
నీడతరిగి వేడిపెరిగి నిమ్నమౌచు భువిని జనులు
తపనమీరి తరుచుచుండె యుక్తి శక్తి ముక్తమాయె
పవలురాత్రి ఫలములేని వెలుగు వెతల బతుకులాయె
పూర్వపశ్చిమార్థమ్ముల పూజ్యతయే కరవాయెను
సహజ గ్రహాలలో తరిగె సారళ్యమౌ తీరు
కృత్రిమ గ్రహాలతో కూలెను వెలుగుల జిలుగులు
అంతరిక్షనౌక లెన్నొ అటమట మాయెను
సూర్యునితేజమంతయు సుందరతను వీడె
ఇంధనశక్తికి అంధత్వమొచ్చెను సౌరశక్తిని సరసతవీడెను
ప్రకృతి వికృతి ప్రాభవహీనమై రవికిరణములు రమ్యత వీడెను
శాస్త్రతతులు పెరిగెనిచట చెదరె మమత చెలిమికూడ

మేధపెరిగి జనులందరు మేలిమి నడతను వీడెను
పావనతలు పాలిపోయె ప్రాభవమే తరిగిపోయె
వేడి వెతల బడకనీవు వెలుతురు నడతను నడువర
చైతన్యపు సిరి రవిగా చేతముతో సహకరించు
మంచి మానవులకగును మమత పంచు రవికిరణము.

378

పార్టీలే పట్టువిడిచె – సిద్ధాంతం వార్ధిగలిసె
వ్యక్తిత్వం వెలుగుచూచి – ఎన్నికలో గెలుపు గలిగె.

కప్పదాట్ల కామందులు – కలిమికలుగు బలవంతులు
మోసకారి మోతుబరులు – బరిలో దిగి బరువాయెను.
లౌకికత్వ లౌక్యముతో – లావణ్యపు వన్యమృగము
కులకూటమి కూరిమితో – మారణ మత హితమతియే.

ప్రజాస్వామ్య భారతిలో – ప్రాభవమయె వారసులు
వరసమారి పరుషమాయె – వాదనయే వేదనాయె.

సమీకరణలెన్నోవేసి – సమతూకం చూచుకొని
ఓటరులను లోభపెట్టి – ఛీటరులయె నేతలిచట.

దేశభక్తి దేహమనీ – ప్రాణ రక్తముల నిచ్చును
పదవి సౌఖ్యమందునుగా – రక్ష తనకు రాజ్యమందు.

ముందుకుపోతున్నామని – మునుముందుకు నడువుడనీ
వెనుకనుండి వెన్నుపొడచి – వెతల బతుకులను గాంచును.

మంచి మానవతల తోడ – నీతిధర్మనియతి తోడ
మించు ప్రవర ప్రతినిధులే – తెలుగు వెలుగు జననిధులే.

379

మన్నిక లేకుండగా ఎన్నికలొచ్చేశాయి – మన్నుదిన్నపాములై మనకండీ పౌరులూ!
వాగ్దానము దానముగా లేనిదారి చూపుదురూ
ప్రచారమే ప్రగతికనీ పలుమాటలాడుదురూ!

సేవాభావం మాదని సేదదేరు పదవిలోన
ధనహీన సంక్షేమం దివ్యమనీ అంటారూ
మార్చిన పార్టీలలోన మాది ప్రజాస్వామ్యమనీ
ఊసరవెల్లుల మాదిరి రంగులెన్నొ రంగరింత్రు.

మోసకార్లు గూండాలూ మోజుదీర్చుకొందురు
హత్యలు దోపిళ్ళలోన ఆశయాలు అవి అంటూ
సిద్ధాంతము తెలియనీ రాజకీయ సిద్ధాంతము
రాద్ధాంతము జనస్వామ్యము రాజులతో రాజిల్లును.

అధికారం అవినీతిలో పదవి అంధమాయెనుగా
సేవా వ్యాపారంలో చెరిగె జనుల చైతన్యము
వ్యవస్థలో అవస్థలై వ్యత్యస్థము బతుకులన్ని
వ్యక్తిత్వము వెలుగుజూప ఎన్నికయే మన్నికగును.

380

చిలిపితనం కలికిధనం – చిందులేసి విందుసేసె
విందువందితమ్ముగాగ – నందనమే జీవితమ్ము.

మంగళ గళ మధురిమలను – మలచె వయసు వలపులన్ని
చెక్కిలి చక్కలిగిలిపెట్టెను – పక్కలోని కలల కాంతి.

మల్లెమనసు మనువుకోర – వల్లెయనెను నావయసూ
కల్లకాని జీవితాలు – కలిమి పంట ప్రేమ జంట.

విరహరవళి వినిపించెను – విరుల విరళి రహి నిండెను
చంద్రుచెలిమి చందనమై – సందడించె ఒడిమడిగా.

భయం బాధలెన్నయినా – భాగమాయె బంధనమున
అందమైన బంధనమే – అందలమున అధివసించు
పావనమై కలితనం – కామనకే కలతతీర్చె
మనసులు మలచినమాన్యం – మమత పంట మహిని జంట.

381

సన్న నడుం చిన్నదాన – చంపబోకె వంపులతో
హంస నడల అందమంతా – అడలిపోయె నాగుండెలు

చిలుకపలుకు చిగురించగ – మొలకనవ్వు మోదమిడగ
వగలు హొయలు వలకమార – మిగిలె ప్రేమ మించులుగా

అందగించె ఆత్మీయత – విందునిచ్చె విభవమాశ
కాంత కాంతి కాంక్షదీర్చ – శాంతి నిండె మనసులోన

అధర సుధల మధురిమలో – విదిత హృదయ విభవముతో
విలువ మీరు రూపముతో – విజయ పథమె సంగమమూ.

అంతులేని లోకమందు – అనంతమౌ కాలమందు
అంతరములు మరచిపోయి – అందమనుభవించుదాము
మరులుపొంగి మనసు మరచి – మనమె మనకు మనువు మధువు
పంచేంద్రియ పంచభూత – పావనతను పొందుదాము.

382

క్రికెట్టులో క్రిందు వడెను – భరతజాతి కలవరపడె
వికెట్టులో విలువవీడి – రాజకీయ రంగు మిగిలె
జట్టులోన జవము వెడలె – కట్టుబడియె కరవాయెను
మెట్టునెక్కి పడిపోయిరి – దిట్టతనం దిగులుతోడ.

అజర్ అహం అధమమాయె – జట్టు జుట్టుపీకుకొనియె
పట్టుదలే కరవాయెను – పట్టముగన పట్టువీడె
ప్రపంచమే పలవరించె – మేటి దీటు బాట్సుమన్లు
గవాస్కరూ టెండూల్కర్ – కపిలుదేవు కలిమిక్రీడ
దేశభక్తి దేహముగా – ఆట అమలు జరుగుచుండె
చిన్నపెద్ద జనులంతా – వినుట కనుట విలువ తెలుపు
భరతమాత పుత్రులుగా – విశ్వనుతులనందిరిగా
పరుగు యంత్రములరీతిన – పలువురుండ ప్రవరమాయె
కోట్ల జనుల కోర్కెలన్ని – కొలతమారి కొరతమిగిలె
ఆటలోని ఆంతర్యము – అవగతమగు గతముగాను
ఓటమి గెలుపులలోనా ఓర్పుతీర్పు మార్పునేర్పె.

383

తిరుమల కొండలో తియ్యని సామి – తిరుమతులను చేయుమయ్య మానవాళిని
అందని అందానికి ఆలయమే గుర్తు – అందులోని శ్రీనిఆసె జనులహృదిని హత్తు.

ముద్దుల తల్లులు మురిపెపు ముగ్ధలు – ఇద్దరు భార్యలు హితమతులందరు
కోరి కొలుచు వారికోర్కె తీర్చెడి సామి – కోమల ఆశీస్సులిడగ ఆర్తిదీర్చు సామి.

సంకట సమయాలలో వేంకటేశ్వరుడుగ – కలియుగ వేల్పులలోన కరుణమించువాడు
భక్తులపై రక్తి భాగ్యమిడును నీశక్తి – భవ్యసాగరమునందున తరియజేయుసామి
చింతదీర్చుడి శ్రీనివాసుడు – చింతనలోనా వేంకటేశ్వరుడు
చెంతచేరగా దయజూచువాడు – చేరికొలువగా చిత్తశాంతికలుగు.

ఏడుకొండలందున ఏడుగడగనిల్చి – ఎఱుకకలుగజేయు ఏలికవే సామి
బంగారు మందిరాన భామలగూడి – అందరికీ శుభముల అందించుసామి.

384

చిలికి చిలికి గాలివాన చిన్నదాని కోపం
పలుకు కులుకు పారవేయ పారిపోవు తాపం

కనుల కోరుచూపుతో కారం కొట్టె – పెదవి ముడుపు మూల్గులే ముద్దులు పెట్టె
పైటసర్దుబాటుతో గుండె పొద్దుపొడిచె – నడుముతిరుగు నటనలో ఘటనయె మిగిలె.

ఘనమైన జఘనమే గాయం చేసె – నిమ్నమైన నితంబమే నీరుగర్చివేసె
హంసనడక అందములో అంధకారమాయె – కంసవృత్తి కలవరమై కలికి మనసుమారె.

కలికి కులికి కలిమి మరచి చెలిమికి వచ్చె
చెలమయి అధరామృతమే చేతమునిండె
వగపులాట వలపుపాట సుధగ మిగిలిపోవుగా
ప్రేమపెరిగి విరిగి తరిగి పేద హృదికి పంచెగా
జగము జంట తంటవీడి ఖగమురీతి ఎగురగా
ఆలుమగల దాంపత్యము అంబరమే అవనిలో
గాలివాన గాటమైన గమ్యమే కరవుగా
రమ్యమైన లోకానికి వరముగాలివానగా.

385

వందనం – వందనం – వందనం
దళిత వీర యోధులకు వందనం – పతిత జాతి శూరులకు వందనం
అగ్రవర్ణ ఆగడాల – కామందుల కఠినాలను
ధనవంతుల దారుణాల – పాలకజన పాపాలను
ఎదురొడ్డిన సేనానులు – మది నిలిచిన మాన్యులు
రక్తసిక్త పల్లెలో – రక్తమునేధారవోసి
ప్రాణములను ఫణమొడ్డిన – పావనులే మీరలు – మీకిదే వందనం
కారంచేడు కక్షలలో – కమ్మవారి శిక్షలలో
కలిమి బలిమి కోల్పోయిన – వరకరుణామూర్తులు
బలిదానం చేసినోళ్ళు – దళితజాతి బంధువులు – వందనం
పదిరికుప్పం అదిరిపోయి – పదపదమని హెచ్చరించ
పేదపెద్ద వాదులాట – పెరిగిన ఆ తరుణంలో
తిరుగుబాటు బావుటా – ఎగరేసిన సారథులు
విరిగితరిగి విజయమంది – విభవం పంచిన వారలు –– వందనం.

వేంపెంట వేదనలో – వెలుగులు విరజిమ్మినోళ్ళు
హరిజన గిరిజన జనులు – అగ్రకులపు అగ్రేసరులు
బాధలన్ని భరియించి – భాగ్యములను పంచినోళ్ళు
అమర వీరవరులకు – ఆశయాల లాల్ సలాం
ప్రతిఘటించు పరములకు – ప్రగతిశీల లాల్ సలాం
నీరుకొండ నిమ్నులకు – అండదండగా నిలిచిన
దళితజాతి అన్నలకు – అరుణారుణవందనం
దళితుల ఫలితముకొఱకై – పతితుల పావనతకై
ఐక్యపోరాటాలతో – అందరు ముందుకుపోదాం
చుండూరును మండించిన చండ సూర్య వరులకు
కులాల మంటల కూల్చివేతలో తనువులు త్యాగంచేసినవారికి – వందనం.

386

బడుగువర్గభానుడా – అడుగువర్గ ఆప్తుడా

దళితుల దేవుడా – పతితుల పావనుడా
ఆశయాల భీమరావు – అందరికీ అంబేద్కరు
అణచివేతనణచివేయ – జనియించిన జాగృతుడు
దళితజాతి దారిలేక – దారుణ బానిస తనమున
బతుకు గతుకులో బడగా – ఉదయించిన రాముడు – ఉద్యమమున ధీరుడు.

బాబాసాహేబుగా – బాధలన్ని తెలిసినోడు
తెలివితేటలందున – తెరలిన తెలిసూర్యుడు
రాజ్యాంగరచయితగా – రామరాజ్యకాముడు
పదవులు తృణప్రాయములని – వదలిన అసమానుడు
సమానత్వ సారధిగా – కులవర్గము కూలగొట్టి
అంత్యజాతి స్వాంతమున – విశ్రాంతిని పొందినోడు
శ్రామికజన పక్షపాతి – కామందుల కలవరము
సమన్యాయం సాధర్మం – కావాలని కాంక్షించెను
బాధలన్ని పోగొట్టగ – బౌద్ధమొకటె మార్గమని
ప్రజాస్వామ్య లౌకికముల – ప్రవచించిన ప్రవరుడు.

ఆర్తులు అబలలకై – అహర్నిశం పోరాడెను
స్వాతంత్ర్యం సాధించగ – ఆత్మశక్తి ముఖ్యమనెను
భూతభవిష్యత్తులలో – అంబేద్కరు అమరుడే
అతని సాటి ఎవరు లేరు – భరత దేశ భాగ్యదాయి.

387

ఓంకార రూపుడా – ఓజో స్వరూపుడా
ఇంకార భాసుడా – హ్రీంకార భావుడా
శ్రీంకార చైతన్య – శివలింగ రూపమా.

రుజలను బాపెడి రుచ్యమౌ రూపమే – పంచముఖేశ్వరునిగా పావనమౌ లింగమూ
అమ్మనిలిపెనిచ్చట – అన్నిలింగాలనూ – ఇల్లుకట్టె న్చిట ఇమ్ముగా శివునకూ
భక్తులకూ భగ్యమూ – రక్తులకూ భోగ్యమూ
రహి జనులకు రాజ్యమూ – ముక్తికి సామ్రాజ్యమూ.

శివభక్తి చింతనుల – చెలువు మీరెనిచ్చట

ఉమాధవుని సేవకుల - ఉన్నతి గనుస్థలమిది
ఆశ అంతు తెలియలేని - ఆకతాయి నరులకూ
ఆశించక కర్మచేయు - ఆశయమును నేర్తురిచట.

388

కలిమికి లాస్యం - బలిమికి భాస్వంతం
భవబంధమోక్షం - బాధల సంహారం
అదేశివుని ఆస్థానం - దానిపేరు కైలాసం.

దేవగణములకు దేహమది - మునులు ఘనులకూ పూజ్యమది
తాండవమునకూ తానమది - భక్తజనులకై మోడ్పు - భాగ్య కైలాసమే.

కొప్పులోని గంగమ్మ కోరునది - చంద్రవంక వెలుగు మొదట పడునది
సృష్టి పుష్టిలయముల పుణ్యమది - రాక్షసత్త్వ రాజ్యానికి శిక్ష అది - అదే కైలాసం.

సత్యసుందరముల సహమతి కైలాసం
శాంతి కాంతి శివముల శక్తియె కైలాసం
ముద్దు మురుగ వినాయకుల మూలమైన స్థానం
శివభక్తుల కోరికలకు చిన్మయమా కైలాసం.

కైలాసం కమనీయం - కాలగళుని నిలయం
సర్వధారి స్థావరం - శూలధారి శుభనిలయం
అమరమైన కైలాసం - అవనిజనుల కాంక్షితం.

389

పుణ్యంతరిగీ - పాపం పెరిగీ - పూజ్యత మరచీ - త్యాగం విడిచీ
పతనమాయెలోకం - పైకెత్తగరండీ - దైవధ్యానమందు - శివరక్షను పొందగా.

మానవుడే దానవుడై మరచె మానవతను
దారుణముల మారణముల దహనమౌ చుండెను
ఆలయాన ఆర్తితో అభవుని పూజించగా
అవనిజనుల కందమగును అదె ఆనందముగా.

తులలేనిది కలగానిది - కలతల హరియించునదీ

శివనామం శివరూపం - చైతన్యానికి చిహ్నం.

అంతమునకు దూరము - ఆదికి అది మూలము
అంతరముల తరళము - ఆత్మీయము అతిశయము.

సాధువులను రక్షించగ - దుష్టజనుల శిక్షించగ
అన్నిరూపులందునిండి - అభవుడె జనరక్షసేయ.

390

కళ్యాణం కమనీయం - కారుణ్యం కార్పణ్యం
కలగలిసిన శివునికీ - కమనీయ వందనం.

కాపురుషుల దండింపగ శూలమున్నదీ
కామనలను పండించగ అభయహస్తమున్నదీ
హాలాహలమును మింగీ - అమృతాన్ని పండించె
మూడవకను తెరవగాను - కాముడు దహనమ్మాయెను.

రూపములు కోకొల్లలు - రుచ్యములు సుందరములు
లయకారుడు లాక్షిణ్యం - ప్రళయములో భయంకరం.

భక్తుల బంధువుతాను - రక్తుల రమ్యుడుశివుడు
శక్తుల నిలయుడు భవుడు - ముక్తికి మూలమె తాను.

ఆత్మలింగ రూపుడు - భవ బంధభాగ్యుడు
సృష్టికి కారకుడూ - నష్టికి నాధుడె శివుడు.

391

అభిషేకం చేద్దాము అభవుని రూపానికి
అవలోకన చేద్దాము ఆదిసృష్టికారకునీ
పంచభూతములు - పంచ ముఖములై
పంచేంద్రియములా - పాలించునుగాదా
ఋషుల మార్గమూ - విషహరణముగా
కాలకంఠునికీ - పూజలు చేద్దాము.

వేలరూపులై - వెలుగు లింగాలు - వెతలు తొలగగా - వేద్యమగును మనకు

స్వర్శ దర్శనములు – శాంతి ప్రసాదించు – కోర్కెల హరుని – కోరి భజించెదము.

పత్ర పుష్ప ఫలతోయము – పవిత్ర మా శివునకు
భక్తులందు వాత్సల్యము – భాగ్యముగన స్తుతించెదము.

కలుషహారి హరునకూ – కర్పూరము వెలిగించీ
హారతిచ్చి కొలువగా – అందరికీ మంగళమే.

అవనియందునా అందమైనదీ – అమరముకంటే సుందరమైన
అతనిరూపమే శివలింగమూ – అందరి మనసు అద్దానిపైనే.

392

మాయాలోకం – మర్మమంతా – మననీయదురా – మంత్రతంత్రాలతో
మానవుడా తెలుసుకో – మానవతను నడచుకో
మంచిచేయగా – వంచనలేక – పంచచేరువారిని – ఆదరించరా!

మాటకు మాట తెగులు – మౌనమెభూషణమురా
చేతము చైతన్యమైన – మనసు మధుర మౌనురా!

సహనసామర్థ్యము – సరసమౌ వాక్కులా
అనసూయను అందుకొని – ఆత్మదెలిపి మనుమురా!

చింతవంతలేనిదీ – ఇంతిపూ బంతిగా
అంతంతగ అతిశయమై – అందగించు సంసారము.

పావనమౌ నీజన్మము – పారుష్యము కలుగగాను
పతితమౌను అధమముగా – పరమార్థం తెలియుమురా!

మమతాను బంధాలు – బంధనముల చిక్కగా
బంధువులే అందాలుగా – బాధమునుగు జీవితాలు.

393

జనుల దృష్టి పథములోన – జగతి సృష్టి కారకుడూ
శివరూపము చిన్మయమూ – చింత వంతలకు హారమూ.

హిమగిరితనయ – ఇంపగు గంగ
అతని భార్యవైరిగా – అతను దహనమొనరించ

దేవసేనాని విఘ్నరాజులు – అతని పుత్రువైరిగా అవని పావనం
బూది విభవమూ – కౌపీన వసనమూ – కాడునిలయమూ – కామిత దైవమూ
ఆదిదేవుడూ అంతమె తనదీ – నిత్య సత్యమూ నిధియెరూపము
కంఠసర్పమూ కాలకూటమూ – కలిసిన సుఖము కామితార్థమూ.

అర్ధనారీశ్వరుడూ – ప్రకృతి పురుషుడూ
ప్రళయమూ ప్రవరమూ – పావన శివలింగమూ.

394

మేలుకో పంచముఖుడ మేలుకోవయ్యా – మేలుకొని మమ్ములను మేదిని రక్షించవయ్య
ఆర్తులందరొచ్చినారు – ఆలించుము మొరలను
అందమైన మందిరమున – ఆదుకొనుము అందరినీ.

వైతాళిక గీతిలోని – వేదనలే వినుమురా
మేలుకొలుపు పాటలో – మేలుగని ఏలుకొనుము.

పార్వతమ్మ పరవశమై – పావనతను గల్గించ
గంగమ్మ గమనంతో – సాఫల్యమందించగ.

నిదురనీవు మేలుకొనగ – నిమ్నమగును జనబాధలు
పవిత్రమౌ లింగమూ – పాలించుము మమ్ములను.

పాపపంకలమునంతా కడిగివేయగా – నీభక్తుల కష్టములను తొలచివేయగా
నీతిధర్మనియమాలను ప్రతిష్టించగా – నింగినేల ఏకమైన నియతి దెల్పగా
ప్రళయకాల భద్రుడవై ఫలములీయగా.

395

ఆలయం ఆలయం – అవనికి దేవాలయం
అపూర్వమై అందమైన పంచముఖుని ఆలయం
శివునికి గుడికట్టగా – శివములెన్నొ కలుగగా
శేషమాంబ జీవితమే – శివమయమై అతిశయించె.

విరూపుని సేవలోన – విలువగనగ విజయమగును
గురుమాతను పూజించగ – గుణశీలము లతిశయించు

అమ్మల గన్నమ్మగా - అంబ పార్వతమ్మగా
వినాయకుడు నాయకుడై - విఘ్నములే విగతమౌను.

మనశ్శాంతి మానవులకు - మహిమకాంతి శివరూపము
మాత దైవ గురుబోధలు - మన భవితకు మార్గమగును.

సప్తఋషుల రూపాలే - సమతకు సందేశాలై
నాగేశ్వరు అంకమ్మలు - నవ్య జీవన ప్రదాతలే.

396

లయం లయం లయం లావణ్యమయం - భయం భయం భయం భవపాపహరం
మతిలేని గతిలేని మాలిన్యలోకం - భయబాధ మయమాయె బాధ్యతరాహిత్యం
అంతమగుననీ అంతరంగములు చెప్ప-ఆంతర్యము తెలియక అవహేళనమగుచుండె.

పావన శివరూపము పాపహరం - మానస మధు మందిరం భయహరం
మానవ మతి గతిని ద్రిప్పు మనోహరం - దానవ జన వర్తనకూ దహనకరం.

ఆస్తికతకు ఆస్తిగా - అవని జనత కీర్తిగా
పంచముఖుని మూర్తిగా - ప్రభవించెను కీర్తనగా.

భయము బాధలయమాయెను భవునిలో - శివము శీలమయమాయెను శివునిలో
మతము మాతహితమాయెను మహిమలో - మతము భక్తి సవనమాయె నీభువిలో.

ప్రళయం ప్రాప్తించినా - విలయం విదలించినా
విజయం ఆవిభునిదే - విభవం యీ భక్తులదే.

397

కైలాసము కంపించగ - భూలోకము ప్రళయించగ
నటరాజుని తాండవమే - ప్రకటమాయె హృదిగుడిలో
నీతిధర్మనియతి వీడి - పాపకర్మ భరితమైన
పావనభువి సరిదిద్దగ - తాండవమే (తాడితమ్ము) తారకమ్ము.

కాలనాగు కబళించును - కలికాలపు కామములను
కాలకంఠ గరళమంత - హరియించును పాపములను.

కర్కశరక్కసి మూకల - కాలరాయు తాండవము
భ్రుకుటి చూపు భజియించును - వికటనరుల విభవములను.

ప్రళయం ప్రభవించెను - విలయం వికటించెను
కలియుగాంత కలరవమే - నటధూర్జటి నినాదమే.

అంగాంగం వింగడింత - అంతరములు తరియించగ
నాదఘోష నటనఘటన - నవయుగమున నాందియగును.

398

శివుని దయాదృష్టి - శీకరములపుష్టి
శీలమునకు తుష్టి - శివములకది వృష్టి
పాపభరిత భువికీ - పావనమే ఆదృష్టి
పరమార్థ సాధనకూ - వరమే ఆ విషమదృష్టి.

సగభాగము భామగా - సమవర్తన భావమై
సాగుభువిని సరసమై - సారమగును మనబతుకు.

రూపుహీనమై రూక్షమాయెను - చూపు సుధలతో సుందరమ్మయె
ఆయుధమ్ము అలకారం - అతిక్రూరం అహరహం
అహమునణచు అందము - సహనమగును సుందరం.

సత్యశివము సుందరము - సరసశివుని మందిరము
వేయి నూట పదహారుగ - వెలుగునిచట వెతలుదీర్చు.

399

ప్రకృతి పురుషుల కలయిక - పరమార్థపు సృష్టిగా
పరమేశ్వరు పార్వతులే - ప్రణయరూపులైరిట.

మనసు మధువు పరచగా - మగువ మగని చేరగా
మానస సంద్రమునందున - మాలిన్యము తొలగెగా.

హిమవంతుని కూతురు - హిమధాముని చెలువుడు
కలసి కలిమి నొసగగా - కమ్మనైనదీ జగము.

ఋతులన్ని హితమునా – రుజలతొలగజేయగా
వసంతమే సంతగా – వింతసృష్టి వెలిగెగా.

కాలకంఠు కళలకు – కలకాలపు చెలిమిగా
పార్వతమ్మ కుదిరెను – పాలనమే పరమము.

శృంగారము బంగారము – శుభకరము విభవము
శుద్ధి బుద్ధి దాయకమై – సురరాజ్యము చందము.

400

వేకువాయె ఈశ్వరా – వెతలు దీర్చరమ్మురా
కోడికూత కూసెరా – కోరికలే తీర్చరా!

సూర్యోదయ శుభసమయం – సుందరమీ భువిదినం
వైతాళిక గీతికలే – మానవాళినినదములే.

కనుదమ్ములు విప్పారగ – కలతలు నశియించునురా
చైతన్యపు వెలుగులోన – చేతలు వికశించునురా!

పంచముఖుని సన్నిధి – పరమమైన పెన్నిధి
పాపరహిత పుణ్యనిధి – పావనమౌ గుణనిధి.

మేలుకొనుము దేవరా – మేలుచేయుమీశ్వరా!
మేదిని దినమంతయు – మెప్పు కలుగజేయరా!

ఆశీస్సుల ఆవులింత – అగుపించెను ఒకవింత
అంతరములనణచు చింత – అంతరంగముల చెంత.

401

అమ్మరూపమునుచూడ అంతరములు దూరము
అమ్మచూపు ప్రసరించగ ఆశయములు పండు
అమ్మమనసు ఆర్ద్రము ఆశీస్సుల పంచును
అమ్మవర్తనమ్ము అహములేని అందము.

నుదుటిబొట్టునూతనం – కరుణదృష్టి కమనీయం
కలత తీర్చు కలరవం – కమ్మదనమె అమ్మవరం.

మహిలోని బాధలు – మహిమతో దూరము
మానవాళి వేదనలు – మాన్యమాత తీర్చును.

శేషమాంబ చేతనలో – చైతన్యమె శివమూర్తి
గురుభక్తిని కలుపగాను – కలియుగమున విరియించెను.

ప్రతిఫలమునుకోరి పనిచేయదు అమ్మ
ప్రతిఒక్కరి ప్రాభవమే ఆస్తియగును అమ్మకు
అమ్మదనం అతిశయం – ఆస్థికతే ఆశ్రయం
అమరభువికి ఆశ్రమం – అమ్మ అంతరంగము.

402

కోటిలింగ రూపుడై కోర్కెదీర్చె శివమూర్తి
వేయి నూట పదహారున వేద్యుడాయె సాంబమూర్తి
శేషమాంత చేతమునా – చేరిశివుడు నిలువగా
మూర్తులన్ని నిలచెనిచట – ముద్దుగొలుపు ఆలయమూ.

అమరనాథ మందుండెను – అవనిలోని హిమలింగము
అమరలింగేశ్వరుడుగ – అమరావతి నిండియుండె
హరిద్వారమందున – అమరెనా లింగమూ
కాశిలోన రూపించెను – విశ్వేశుని విధముగాను
అన్నిలింగములలోనా – అధికతరము యీ లింగము
పంచముఖేశ్వరునిదీ – పావనమీ శివలింగము.

వేయినూటపదహారుగ – వెలుగనవే వైభవముగ
శివశక్తికి నిలయమదే – భవపాపము హరమొనర్చు
గణపయ్యయె గవిఁటిలోన – విఘ్నములేవేవచ్చుట
ముందుకెళ్ళ ముచ్చటగును – ముద్దునందికేశ్వరుడూ
పంచముఖములుండెనుగా – పంచభూతములుమార
పంచాంగము కాలమందు – పంచేంద్రియ పావనతకు
'సద్యోజాత' పేరులోనె – సరసత్త్వము కలుగునుగా
'వామదేవ' వాసివాక్కు – వరపగునుగ భక్తులకూ
'అఘోర' మౌ అతనిపేరు – హరియించును పాపములను

'తత్పురుష'ము తరగనిదీ – తపనలన్ని తరిగిపోవు
'ఈశాన' ము హితమొసగును – ఇంపు నింపు భక్తతతుల
పంచముఖేశ్వరుని చూడ – పాతకములె పటాపంచలు
సప్తఋషుల సంచారము – నగరునందు నాణ్యమాయె
విఘ్నేశ్వర చాముండీ – నాగేశ్వర సహితమాయె.

403

అంబశేషమాంబకు – ఆధ్యాత్మిక తత్త్వమన్న
ఆబాల్యము వికసించెను – అదె కనబడునిచ్చట
కనులు తెరవలేదు బిడ్డ – ఏకాదశ దినములకూ
పాలుతాగలేదు తల్లి – ఇరవదొక్కరోజులకూ
కాపాడెను ఆదిశేషు – పసిగుడ్డును ప్రవరముగ
అమ్మ చిన్నతనములోన – అన్ని విశేషములు జరిగె.

మూడేళ్లకె ముచ్చటగా – భవిష్యత్తు చెప్పెనమ్మ
విద్యనభ్యసించలేదు – అంతర్ముఖిరీతిగాను
శాంభవి చూపునతాను – అరగంటనుచూచెడిదీ
నిశ్చల బ్రహ్మనుచూచెను – చిన్నతనంలోనె తల్లి
చిన్నచిన్న రాళ్ళనేరి – పూజచేయునపుడె ఆమె
దేవతలను భక్తితోడ – చుట్టుతిరిగెడిది అమ్మ
బాల్యవివాహమ్ము జరిగె – పేరిశెట్టి గారితోడ
పాదర్తిగ వంశమాయె – ఫలము సంతు ప్రగతి చెందె
రాజయోగమందు మాత – సాధువులను ఆదరించె
భక్తతతులు దరిజేరగ – భాగ్యమిచ్చి రక్షజేయు
అనారోగ్య పీడితులకు – ఆరోగ్యము నందించును
కోరికలను నెరవేర్చగ – భక్తుల ఇళ్ళకు వెళ్ళును
భాగ్యదాయి శేషమాంబ – శిష్యగణం చింతలన్ని
వంతలన్ని చెదరిపోసి – వసుధగాంచు సంపదలను.

404

సీ. ఓంకార నాదము ఓజోస్వరూపమై సుందర భువనాలు అందమాయె
ఓంకార బ్రహ్మము హ్రీంకార సహితమై హితమతమున మించి సతతమహిత
సృజనకు మూలమై శృతులకు మహితమై శివలింగ రూపము శివములిచ్చు
విద్యల వేద్యమై హృద్యమై కళలందు నటరాజు రూపము నవ్యమాయె.

గీ. శివుని శక్తియె లోకాన చింతితమ్ము – భవుని భక్తియె భువనాల బంధరహిత
శివము శివలింగరూపమై చెలువునొందె – శైవమతమున భావనల్ చెంగలించె.

సీ. వేదాల అర్థము వేద్యము చేయగా ఉపనిషత్తులరూపు ఉన్నతమ్ము
శృతులను స్మృతులను మతులకు తెలుపగా మహిమను మునులంత మాన్యులైరి
ఆరణ్యకములందు ఆధ్యాత్మికతకల్గ గురువులు శిష్యులు గురుతమీరె
అష్టాదశమ్మగు అతిశయ సంఖ్యను వరపురాణములను వాసిగాంచె.

ఆ.వె. హిందుమతము హితము హితమతులకు నేడు
భారతీయ తత్త్వభావనమున
శైవవర్ణవముల చైతన్య మందించె
సృష్టిచింతనమున శుభము గలిగె.

405

గీ. జనులమేధలు జయమంది జగతివెలిగి – ప్రకృతి పురుషుల మూలము పరిగణింప
యత్నమొనరించి ఎఱుకను యాతనలను – సృష్టి పుష్టికి తత్త్వమున్ సృజనచేసె.

గీ. భావనమ్మున భాగ్యమై భవము దెలిసె – చేతనమ్మున శక్తితో చేవగలిగె
నాద భరితము నాందిగా నాటి జగతి – అదియె ఓంకార రూపమై అతిశయించె.

ఆ.వె. మూలమాయె జగతి ముద్దాయె జీవికి – పెరిగిపెద్దదాయె పేరుమీరి
పంచభూతములను పావిత్ర్యమయమాయె – భువన చయము జరుగ భుక్తిగాను.

ఆ.వె. వాదభేదములకు వలదిట తర్కము – కాలగమనమందు కలవు పెక్కు
కాంతిమహిత జగము కామన తీర్చగా – జ్యోతి రూపమాయె జాతిశివము.

ఆ.వె. జ్ఞానమార్గగామి జరుగగా జగమున – వేద్యమాయె తత్త్వవెలుగు జగతి
మూర్తి తత్త్వమేమొ ముద్దాయె శివునిగా – అదియె లింగరూప మవనిలోన.

గీ. ఆదిగర్భేశ్వరుడింట అవని శివుడు – పురుష ప్రకృతుల్ కలయిక పూజ్యముగను
పానవట్టము పాదయి పరమమాయె – రూపమాయెను లింగము రుజలుబాప.

406

గీ. విశ్వమందున వినుతము విజయమాయె
పూర్వగోళము జగమున పుణ్యమహిత
జంబు ద్వీపము జయమగు అంబు మహిమ
భరతఖండము భాగ్యము భవము శివము.

ఆ.వె. వేలకోట్ల యేండ్ల వేద్యము కానిది – మేధమనుజులందు మెలికబడియె
వాద భరితగరిత వాస్తవమేదియో – శివుని తత్త్వమదియె చింతనమ్ము.

గీ. కాలగమనము గమ్యము గాంచగాను – ఆది అంతములేనిది అతిశయమ్ము
లిఖితమైనవి విషయముల్ లేవునేడు – మాన్యవేదాలు లభియించ ధన్యమాయె.

గీ. వేద అర్థము వివరణ వేద్యమైన – అన్ని విధముల జ్ఞానము అందునదియె
తెలియలేకను తెగువను తేల్చలేదు – మతము దానను ధరణిని మాన్యరహిత.

ఆ.వె. మాతదాత త్రాత మహిలోన మాన్యము – నాల్గువేదములను నాణ్యమాయె
రూపులెన్నికలుగ రూపమె ప్రకృతి – కంటిముందు శక్తి కానబడియె.

గీ. ఆది నారాయణుడుగాను అవతరించె – ఈశ్వరునిగాను తెలియును ఇంపుగాను
మాత శక్తిగ గ్రహింప మహిమ మీరు – అంతరార్థము లింగమై అవనినిలచు.

407

గీ. జీవితములెన్నియైనను జిలుగులేదు – జిహ్వకొకరుచి దివ్యమై జీవులందు
మానవాళికి అందని మహిమగాను – కలిమి దైవము కనబడు కానబడదు.

ఆ.వె. రూపులెన్నియైన చూచెడి కనులకు – ఒక్కవిధముగాను చిక్కునదియె
సృజనచేసిరంత సూక్ష్మము స్థూలమై – శైవ వైష్ణవములు చేత జనుల.

గీ. పర్వమైనది పూర్వమై పావనముగ – శక్తి శైవము భక్తుల సక్తిదీర
దైవతత్త్వము మానవుల్ దెలియగాను – ధరణిజరిగెను దివ్యమై కరణసహిత.

గీ. కార్యకారణభావము కర్మమించు – బీజ క్షేత్రాల బిగువున భాజనమ్ము
మార్పు మహనీయ తత్త్వమై మహినివెలుగ – శైవమిమ్మహి చేతనకదైవమాయె.

ఆ.వె. ఆంధ్రదేశమందు అందమై విందుగా - త్రినగదేశమాయె తెలుగులకును
మహిత్రిలింగములను మనమహిగణ్యమై - కాళహస్తి భీమ కలిమిగిరియె.

గీ. భక్తి తత్త్వము భాగ్యము బాధలందు - దైవ భజనము భావ్యము దేహులకును
శక్తిరూపము పూజల శమముమించు - ముక్తిదాయిగ లింగము ముద్దుగొలుపు.

408

సీ. అవధూత లెందరో అవనిని జన్మించి జనజీవితములను జవమునించె
తాత్త్వికులెందరో తరియింపజేయగా మూలతత్త్వముతోడ మురువు గొలిపె
బాబాలు భవమున భాగ్యమై స్వాములు భవపాప హరణాన భవము పండె
మాతల మాన్యము మహనీయ చరితాన మధువులు పంచగా మహిమగలిగె.

భారతీయత భాగ్యము బతుకులోన - భాసమాయెను భోగ్యమై భాగవతుల
భావమేమైన భవమున బాధతీర్చు - భవుడు శివుడైన రూపము భక్తి లింగ.

గీ. అంతరంగాల మానవుల్ అవనిలోన - వింతతత్త్వాల సాగగా విలువలేదు
ఏకమైనది దైవము ఎఱుక గలుగ - అదియె ఆధ్యము సృష్టికి అవనినిండు.

సీ. అమ్మలకమ్మయై ఆర్తిని దీర్చెడి మూలపుటమ్మయై ముద్దునింపు
శ్రీదేవి భూదేవి శివముల దేవిగా చింతను మరపించు చెలువుపంచి
మానము మాన్యమై మహిళగా ధన్యమై మానవజాతికి మధువు పంచి
గీర్వాణి శార్వాణి గీష్పతి తారయై తపనను దీర్చును తనువుపంచి.

గీ. పంచ పావన రూపాల పాలితముగ - పంచ ఇంద్రియ మంది పావనతగ
పంచ భూతాల లోకమై ఫలములివ్వ - పంచ ముఖముల లింగము పడతినిల్పె.

409

సీ. తూరుపు సంద్రము తులలేని సంపదన్ అద్దంకి రాజ్యము అందగించె
ముస్సి పాలేరుల ముద్దగు సీమగా ఓంగోలు ఏరున వరపు మిగిలె
కొండేపి ప్రాంతాన కొండగా అండగా టంగుటూర్ మండల మంగమాయె
జమ్ముల పాలెము జగమున వేద్యమై పల్లెల మల్లిగా ప్రవరమాయె.

గీ. గ్రామగణ్యత గడితేరి రామమయ్యె - వంశ మిడుపులపాటిగా వాసిగాంచ
మర్లపాడున జనియించె మహితురాలు - శేషమాంబగ జన్మించె చెలువుమీర.

గీ. విశ్వమెరిగిన వంశము వినుతమాయె – వశ్యవాక్కుల బ్రహ్మలై వరపుగనెను
జన్మమదియేమొ జగతికి జయముపంచ – కలిమి శిశువుగ కలిగెను కాంతి మహిత.

చిన్నతనమునందు మిన్నగు అద్భుతాల్ – కండ్లుతెరవలేదు కలిమిబిడ్డ
పదియునొకటి దినము ఫలముగా కనుపించె – చిన్నబిడ్డగానె చెన్నమీరె.

ఆ.వె. పాలుతాగలేదు పరమార్థమేమియో – ఇరువదొక్కదినము హితము జరిగె
ముద్దు మురిపెమంత మూలనబడగాను – ఆడబిడ్డ జన్మ అమరమాయె.

గీ. తల్లిజాలమ్మ జగతిని మల్లెగాను – నాన్న వీరస్వామిగనాడు నయముగాను
పేరు జనులను పెంపొంద పెద్దగాను – అమ్మ అన్నుల మిన్నయై అవనిబుట్టె.

410

ఆ.వె. దినములెన్నొ గడచె దిటవగు తత్త్వము – పిల్లకాదు తల్లి పిడుగుతాను
పాముపడగవిప్పె పాపను పాలించె – పర్వమాయె బతుకు పథమునందు.

సీ. దేవులు దేవేర్లు దేవతలందరు దేహికి నిత్యము మోహముగను
చిన్నరాళ్ళను దెచ్చి మిన్నగా నాడుచు భక్తిని చుట్టును భావమునను
స్వాములమునులను స్వాగతించెడిదామె పూజించు నందరి పూజ్యురాలు
చదువులు లేకున్న చరితము గొప్పదై ఆత్మతత్త్వము దెల్సె అతివగాను.

గీ. గురువు గురుతుగ బోధనల్ గూడుగట్టె
ఆమె అంతర్ముఖిగనుండె అతిశయమున
అదియె వింతాయె జనులకు అందరికిని
విశ్వబ్రహ్మల విలువలు విజయమందె.

ఆ.వె. మూడువత్సరాలు ముద్దుగానిండెను – భవిత తెలిసి చెప్ప భాగ్యమబ్బు
వింత వివరణమున విలువలు మీరెను – విజయపథమునందె వినుతురాలు.

గీ. పరమతత్త్వము దెలియగ ప్రవరురాలు – ఆత్మ తత్త్వము గనగాను అధికురాలు
బ్రహ్మజ్ఞానము భవమున భక్తురాలు – శేషమాంబయె దైవస్వ భాసురాలు.

411

గీ. నాటిపల్లెల నియమాలు నాణ్యమాయె – మతము హితముగ భాసిల్లె మనుజులందు
జాతి భారతి భక్తికి జయముకలిగె – దైవ విశ్వాస ముండెను ధరణి జనుల.

గీ. దైవరూపము మానవ భావమందు – నిలిచి గెలిచెను వాక్కున నియమములను
శీలసంపద శక్తిగా సిరులు పంచ – భయము బాధల దీర్చగా భాగ్యమాయె.

ఆ.వె. నాటి చిన్నమాత నాజుకు తనమంత – దైవచింతనమున భవ్యమాయె
భవుని ధవుని శివుని భాగ్యముగాకొల్చి – భక్తి తత్పరతను శక్తిపొందె.

ఆ.వె. ఐదువత్సరముల అంబకు ఆనాడు – పెళ్ళి బాల్యమందె వెళ్ళిపోయె
పేరిశెట్టి గారి పేర్వడ్డ పాదర్తి – వంశ అంశ వెలిగి వలపుమీరె.

గీ. దైవసాన్నిధ్యమామెకు దైనికమ్ము – శైవమతమన్న మాతకు చేతనమ్ము
పతికి పంచెడి ప్రేమయె పర్వతమ్ము – మతికి మంచియె పరహిత మతికి తలపు.

ఆ.వె. ఆలుమగల వృత్తి అర్థమై అందమై – రెండు హృదయములను మెండుగాను
సంతుకలుగ వారి సంతోషమెంతయో – భవుని భాగ్యమనగ భాసమాయె.

గీ. సుబ్బరాయుడు సుబ్బమ్మ శుభములొసగె – అత్తమామలు అంబకు ఆస్తిగాను
వంశ అంశగ పాదర్తి అతిశయమ్ము – పల్లెజమ్ములపాలెము ప్రవరమాయె.

412

సీ. శివలింగముల జూడ శివమెత్తు నామెకు చింతన చెంతకు చేరునామె
లోకములోభమై లోలుపతలగూడి లౌల్యము మహిమగా లాభపడగ
యత్నముచేయును యంత్రమురీతిని మంత్రము తంత్రము మాయలేక
అమ్మకు భక్తులై అతిశయమందిరి ఎందరో పెద్దలు ఎఱుకగలిగి.

ఆ.వె. వాక్కుశుద్ధమాయె వాసిని బొందెను – నమ్మకమ్ముకలుగ నవ్యమాయె
నిధులుకూడగాను నియమము నిత్యమై – సత్యవాక్కురీతి సరళిమారె.

సీ. శివభక్తి శివశక్తి శివరక్తి భవముక్తి శాంకరి మహిమకు అంకమాయె
గణముల కధిపతి గుణములగురుపతి పార్వతి కొడుకుగ ప్రవరమాయె
అర్థమునారిగా అన్వర్థమాయెను ఆతడె అభవుడు అవనిలోన
అద్దరి ఇద్దరి అతివలు ముద్దుగా కుడిఎడమల కూర్మికొలువుదీరె.

గీ. శివుని మహిమలు గనగాను శీతలమ్ము
భవుని భాగ్యము గనగాను భాసితమ్ము
ధవుని కొలిచిన ధరణికి ధనము కలుగు
ముక్తి ధనముగ నిండెను శక్తిమాత.

413

సీ. భస్మాంగములతోడ భాగ్యము నందించు భవమున దైవము భవుడె గనుము
కౌపీన ధారణ కమ్మనౌ రూపము కలిమికి కలిజన కామితమ్ము
కాలాగ్నిమింగిన కంఠము కాలమై కర్కశ రూపాలు కాంతిమీరు
నాగము నాణ్యమై యోగత్రిశూలమై వసుధను కాపాడు వరునిగాను.

గీ. శివపురాణములు కావ్యాలు చెప్పగాను – చదివి వినగను కనగను సంపదలగు
బాధలన్నియు తీరగ భవముపండు – శివునిరూపము లింగమై చెన్నుమీరె.

సీ. నన్నయ్య నుండియు చిన్నయ్య వరకును కవుల తత్త్వమ్మాయె కలిమి శైవ
ప్రత్యేకబాణిలో ప్రవచించె తత్త్వము శివకవులందరి చెలువు శైవ
బసవేశ్వరునిమది భాగ్యము నిందించి శైవము దైవమై చెలగె శైవ
ధూర్జటి దురితముల్ దూరముసేయగా మహిమలు చేసిన మహిత శైవ.

గీ. బహుపురాణములుండెను భవముశైవ – ఆది గర్భేశు తత్త్వము ఆస్తికతను
అందమాయెను గుండెలో అవనిజనుల – అదియె అమ్మకు ఆస్తియై అనుగమించె.

ఆ.వె. కలిమికలుగు తల్లి కలతలు వెడలును – లేమి లేని తల్లి లేదు ఆర్తి
కలిమి లేమి కూడ కామితమైవచ్చి – భక్తులందు కలిసి భాగ్యమందె

సీ. చిత్తము వృత్తిని చెదరని విధముగా చేయుట యోగము చేతనముల
మనసుల దేహాల మమతానుబంధాల మరుగున పడవేయు మహిమ యోగ
యోగము సాధించి భోగము నందగా అతివగా అందమై అతిశయించె
ఎందరో యోగులు ఎన్నియో యోగాల ఎఱుకను కలిగించ ఎదలు మురిసె.

గీ. యోగసాధన యోగ్యమై యోజనమున – అమ్మ చిత్తము విత్తమై అతిశయించ
శక్తి శివునిది విలువయై శమములిచ్చె – బోధ సాధన భంగియై బాధవెడలె.

గీ. అవని రాజయోగ అసమానమైనది – సాధు సంగతులను సవ్యమాయె
కామరహితకర్మ కామన తనకాయె – అదియె ఆమెకాయె అతిశయమ్ము.

ఆ.వె. ఆదరించు అమ్మ అతిశయశక్తితో – చీడపీడలన్ని చెదరిపోవు
అందజేయు నామె ఆరోగ్య సంపదల్ – అదియె నిత్యకృత్యమాయె తనకు.

415

ఆ.వె. భక్తులంతవచ్చి భాగ్యమునందగా – ఆమె భాగ్యమేమొ అభవుభక్తి
శరణుకోరువారి శక్తితో కాచును – రక్షణమున దక్ష రమ్యమాత.

సీ. ఎందరోపీడలు ఎగ్గులన్నియువీడ అమ్మను భక్తితో ఆదరించె
అనుమానములనన్ని అతివలు తీర్చున ఆనంద భరితులై అతిశయించె
ప్రశ్నలు వేయగా ప్రవరమౌ కాంక్షించి ప్రథితులైరి
భూతము గనునమ్మ భూజన భవితను వర్తమానము చెప్పు వాసిగాంచ.

ఆ.వె. అమ్మనాశ్రయించి అధికులైరందరు – అమ్మ పాదములను అంటిరంత
అధికతరముగాను అందచందాలతో – ఆశలన్ని తీరె అందరికిని.

గీ. భక్తి మన్నించు భక్తుల భావములను – కోర్కె కొలతను గాంచును కొమరుమిగుల
జరుగు విధమును చెప్పగా జయముగలుగు–జనుల సందేహముల తీర్చునములందు.

ఆ.వె. గురువు పరువు మిగుల గురుతుగా భావించి – శిష్యగణము పెరుగ శివములాయె
శివుని భక్తిమీర చింతలు వెడలగా – వింత తీరు అమ్మవిలువ పెరిగె.

416

గీ. అమ్మధార్మిక తత్త్వము అమరమాయె – అంబ ఆధ్యాత్మభావము గుంభనమ్ము
శేషమాంబకు ధర్మమె శేముషిగను – అతిశయించెను భారతి ఆంధ్రములను.

ఆ.వె. ఇరువదేండ్లనుండి ఇంపగు సేవలో – శివునిభక్తిమీరి చెలిమి కలిగె
మానవాళి కొరకు మహనీయురాలుగా – మలచె పంచముఖుని మాన్యశివుని.

సీ. జమ్ములపాలెము జగతికి వేద్యము జాజ్జ్వల్యమానము జయముభక్తి
వీరబ్రహ్మేంద్రుని విలువగు గుడికట్టి విజయమునందెను విభుని సేవ
ఆరాధనముజేసి ఆంధ్రను పండించె స్వామిని ఉత్సవ సహితముగను
పర్వదినములందు ప్రవరులదేవుల భజియింప జేసెను భక్తితోడ.

గీ. పోతులూరయ్య పోడిమి పొంకముగను – ఈశ్వరీదేవి నవరాత్రమిమ్ముగాను
పర్వదినముల దేవుల సర్వులకును – వైభవమ్మున జరిపెను శోభమీర.

గీ. పల్లెజమ్ములపాలెము ప్రవరముగను – పెండ్లిపేరంటములకిట పేరుగాను
మంటపమునిర్మితిని జేసె మాన్యమాత – శేషమాంబయు పేర్మెట్టి సేవచేవ.

417

గీ. స్వామి రథముల నిల్పగ కామితమ్ము – రథము రథశాల నిర్మించి రక్షజేసె
ముప్పదడుగుల ఎత్తైన ముద్దుశాల – భక్తి తత్పరతకు నేడు కీర్తిమిగిలె.

ఆ.వె. మతము మనుజహితము మాలిన్యరహితము – హిందు దేశమందు అందమగును
హిందుమతమునందు హితమగు తత్త్వము – ఇంపుమీర సంస్థ ఇరులమలచె.

గీ. లోకకళ్యాణమాసించె లోభరహిత – శోభ నిర్మించదలచెను శుభవనమ్ము
తపసు చేసెడివారల తరియజేయ – ఋషుల పేరను నగరును రుజలబాప.

గీ. దేశరక్షణ దీక్షతో దైవముగను – తనసమాధిని నెలకొల్ప తానుకోరి
గ్రామ ఉత్తరభాగాన గణ్యముగను – స్థాపనముజేసె నొకనగర్ సాధనమున.

గీ. మంచికోరెడి వారికి మంచి జరుగు – స్వార్థరహిత భక్తియె సార్థకమ్ము
లోకకళ్యాణ రక్షలు లోలుపతలు – శేహమాంబకు సాధ్యమె చేతసేవ.

గీ. సంస్థగొప్పది మతమున సాగివచ్చె – పేరు శేషమాంబ పేర్సెట్టి పెరుగుచుండె
కేంద్రమాయెను చెన్నయి కేతనముగ – అమ్మకృషికది ఫలితము అవని జనుల.

418

ఆ.వె. సప్తఋషుల నగరు సాదరనామాన – సవ్యమాయె యోగ సవనములకు
ధ్యానమందిరమ్ము ధ్యేయమై వెలయించె – నిష్ఠ గరితులకది నెయ్యమాయె.

గీ. దర్శనముజేసి భక్తులు తరియగాను – లోకమందెట లేనిదై లోకనకును
భూత భవితల కానని పుణ్యముగను – పదియునెన్మిది పీఠాల ప్రవరముగను
శైవరూపాలు శాశ్వత దైవములుగ – మాత తిష్టింపజేసెను మాన్యముగను.

సీ. గణరాజు గుణపత గమ్యము పుణ్యమై – వెలయించె విఘ్నేశు విలువమీర
నాగేశ్వరుండుగా నవ్యమౌ యీశుని దివ్యమై స్థాపించె దైవమాత
చాముండి సహితమై ఛండాలతనువీడ మలపించె చెలువున మహితశక్తి
అంకమ్మతల్లిది పొంకము రూపము రూపించె మాతల్లి రుజలబాప.

గీ. వేయినూఋను పదహార్ల వేద్యమాయె – విలువ శివరూపలింగము విశదమాయె
భక్తి పూజింప పుణ్యముల్ భాగ్యమబ్బు – శేషమాంబను చూడగా శేముషియగు.

గీ. పంచముఖుల లింగము పావనమ్ము – జనులు దర్శించ వారికి జయము కలుగు
మనసు శాంతిని మనునట మహిమగల్గ–శివుని కృపకది నిలయము శివము గలుగ.

419

సీ. నూతక్కి కోటయ్య జాతుడౌ ఆచారి జయమెంచు లక్ష్మమ్మ జగతి గురులు
జమ్ములపాలెము జాగృతినందగా శిష్యరికముజేసి శివములిడెను
గురువుల సాధుల గురుతను గమనించి గుణముల ప్రోవుగా గురుతుగనెను
తత్త్వము సర్వము సాగెను వేదమై సారము శివభక్తి సరసముగను.

ఆ.వె. శేషమాంబ తీరు శేముషిగురువుగా – వర్తనమ్ము మారె వసుధలోన
మంచి మమత సమత మానవులకు నివ్వ – మగువ దైవశక్తి మధువుపంచె.

సీ. స్థాపనచేయగా సద్ధర్మమవనిని మతమిట మాన్యమై మనెను నేడు
న్యాయము నీతియు నాణ్యమౌ నడతయు నరులందు పెంపొంద నవ్యముగను
భారతజాతికి భాగ్యమౌ విధమెన్న హైందవమాయెనున అతిశయముగ
బాధ్యతల్ విధులును భావనల్ భవమున వర్తించ చరితము వన్నెమించు.

గీ. జీవజాలము జయమెంచి జరుగగాను – జీవితమునందు సంఘము సవ్యమైన
విధము నడచెడి మార్గము విలువయైన – అదియె మతముగ మాన్యమై అవనినిలచు.

ఆ.వె. అట్టిహైందవమున ఆధిక్యమాయెను – శైవమతము నాటి శైశవమ్ము
నేటి విశ్వసనము నెయ్యము మించగా – శివుని చరిత గరిత శివము మతము.

420

గీ. క్రీస్తు పూర్వమునుండియు కీర్తిగనెను – కర్తనములేని వర్తన కరవుదీర్చ
నడత నవ్యత నాణ్యత నవకములను – మంచి మించెను శైవము మనుజతతుల.

ఆ.వె. సృష్టిలోని మూర్తి పుష్టిని చేకూర్చు – ఆది అంతములకు ఆద్యుడతడు
లింగరూపధారి అంగముల్ లేవుగా – ఆదిమూర్తి రూపు అంతమునకు.

ఆ.వె. అంబశేషమాంబ ఆధ్యాత్మికతతోడ – అన్నిదేవళముల అవనిజూచె
ఎచట కనని వినని ఎఱుకైన చేతను – చేయదలచె నామె చేతమందు.

గీ. ఆమె సంకల్పమేమియో అధికతరము – మాట బాట తేట మనసు మూట
భక్తతతుల కిచ్చు భాగ్యము గొనునామె – శిష్యతతుల గాంచి చెప్పెనమ్మ.

గీ. దైవ కృపతోడ గాంచితి దైవశక్తి – శక్తిరూపము మనసుల శమమునించు
వేయిలింగాల వేద్యమై వెతలుదీర్చ – ఆలయమ్మును నిర్మించ ఆశనాకు.

గీ. ఫలముకోరని కర్మయె బలమునొసగు – దైవ చింతన కర్మయు ధరణికొరకు
స్వార్థమన్నది కానము సార్థకమ్ము – అట్టిచేతలు చేయగ అతివకోర్కె.

421

గీ. కోర్కె ఫలియించు తీరెన్న కోమలమ్మ – జనుని కోర్కెలు జగతిని జయముకావు
దైవకృపతోడ జయమిచ్చు ధరణిలోన – ఆమె పొందెను ఫలమెంతొ అతిశయము.

గీ. కాశివిశ్వేశుమహిమమో కానరాదు – అమరనాథుని అంశయో అనవగతము
హరుని రూపము ద్వారాన ఆశయమ్ము – అందివచ్చెను అంబకు అధిపు కృపను.

సీ. యాత్రలు చేతురు యానన్ పడుదురు సేవయె యావగా చెలువులేదు
దైవాలయాలను దేహులు చూతురు స్వార్థము దేహాన సాదరమ్ము
నైవేద్యమిత్తురు నైచ్యమువర్తన నైరాశ్యజీవన నటులు జనులు
పరమార్థ రాహిత్య పావన భావన పడిపోయి విడిపోయె ఫలములేక.

గీ. అట్టి జనయాత్ర ఫలముల నవనికిడదు – మాతయాత్రయె మాన్యము మనుజతతులు
జాతి యావత్తు గర్వించు జయముయాత్ర – అమ్మ సంకల్పబలమది అవని జయము.

గీ. శిష్య సహచర ముఖ్యులు చెలిమి కలిమి – అమ్మమాటను నమ్మిరి అధిక ఫలము
ఒకరు నొకరుగ వచ్చిరి సకలముగను – ధార్మికతతోడ లింగాల ధరణినిలుప.

గీ. చెన్నుమీరెను చెన్నయి చేతభక్తి – ముక్తికోరక రక్తులు ముద్దుశక్తి
అంబ అపరావతారమై అవని నిలువ – వారి ఆధ్యాత్మతత్త్వము వాసిగాంచె.

422

ఆ.వె. సాగుచుండె నేడు సంస్థను దానాలు – ధర్మపరులు ధరణి ధార్మికతను
కాపుకాయుచుండె కరణాల కర్మల – అదియె రూపుదాల్చె అంబ కలుగ.

సీ.మా. ఆదివారమునాడు ఆలించుమొరలన్ని అందరిదైవమై అందగించు
సోమవారమునాడు శోభను గలిగించు ప్రశ్నలు ఉత్తరాల్ ప్రవరముగను
మంగళకరమగు మంగళవారము మహిమను శివలింగ మవనికిచ్చు
బుధవారమునాడు బుద్ధికి శుద్ధికి సిద్ధికి లింగమై శివములిచ్చు
గురువారమునాడు గురుతుగ గురువుల గుణవంత మహిమంత కూర్మిగలుగు
శుక్రవారమునందు శుభముల కలిగించు భూతము భవితయు మాత చెప్పు
శనివారమందున శమమెంచు లింగము శక్తిని పెంచగా సక్తిగలుగు.

గీ. అన్నివారాల అభవుని ఆశయమ్ము – జనులబ్రోవగ జగతికి జయము నిడగ
మానవాళికి దైవత్వమహిమదెల్పు – సేవ మానవతత్త్వాన చేరుశక్తి.

గీ. అమ్మ ఎదురుగ కనిపించు ఆప్తులకును – ఆర్తిపొందిన వారికి ఆశ్రయమ్ము
శరణుజొచ్చిన వారికి శమములిడును – శక్తిరహితుల కందించు శక్తి తనది.

423

గీ. అంబనినుజూడ పాపము అంతరించు – తల్లి నినుజూడ తరుదము తనివిదీరు
శక్తినినేజూడ భక్తితో రక్తిగలుగు – మాత నినుగన మహిమలు మాకిల కలుగు.

గీ. అమ్మ ఆశీస్సులందగా అవనిజయము – జనని వాక్కున జగమంత జయముగాంచు
మాత మనసేమొ మధురము మనుజతతికి – శక్తి శివునిది దేహమె భక్తమాత.

ఆ.వె. అందరమును వెళ్ళి అంజలించెదముగా – సుందరమ్ము దేవుమందిరము
సప్తఋషులనగరు సంపద దైవమై – సాగివచ్చె మనకు సరసగాను.

ఆ.వె. కులము మతములేదు కూరిమి భక్తియె – మతము హితముగాను మరువముగను
సతము జనులకిచ్చు సమతనుమమతను – సుఖము మఖములందు సుమధురమ్ము.

గీ. పోదము అందరు జమ్ములపాలెమునకు – పాపరహితము పావన ఫలములకును
దీనహీనుల దయజూచు దివ్యనగరు – చూచి తరియించుడందరు సుందరమ్ము.

ఆ.వె. నమ్మకమ్ము కలుగ నవ్యము దివ్యము – అమ్మసన్నిధగును అందరికిని
నిజము నిలువనీడ నీతియు ధర్మము – అదియె అమ్మచలువ ఆస్తిమనకు.

424

వినయము విలువగా విజయుడె పరసా – సహనము సమతగా వహియించె రత్నము
వేంకటరత్నయ్య వెతలను దీర్చగా – వేంకటేశ్వరస్వామి వెలుగును పంచెను
చంద్రన్న మంత్రాంగం – రత్నన్న సహకారం – సాంకేతిక విద్యకూ సాగరమాయెను.

ఆంధ్రవిద్యార్థులకు ఆశలమణిదీపాలై – అవతరించె నిచ్చట వందకళాశాలలు
ఇంజనీరుంగున హితమును పంచగా – డివిజనుకొక్కటిగా విజయంచేసెను.

పారదర్శకమ్ముగా పాలన ప్రవరమై – ప్రగతిశీలమాయెను ప్రజాసేవకునితో
అంబేద్కరు అడుగుజాడ అతనిజాడగా–అనుగమించు మునుముందుగ తెలుగుదేశము.

సూళ్ళూరుపేటనేత శుభములివ్వగా – పినాకినీ పిలుపుతోడ ప్రేమపంచగా
మంత్రాంగ దక్షుడై మహిమనిండగా – మరలగెలుపు నందగా మనమంత కోరుదము.

425

ఆశయాలపార్టి తెలుగుదేశం పార్టి – అడుగుబడుగు వర్గాలకు ఆలయమీపార్టి
ఎన్టీయార్ స్థాపించిన ఎదలపదిలమైన – అన్నమూర్తి స్ఫూర్తిగా ఆదరించుడీపార్టి.

చంద్రబాబు ముఖ్యమంత్రి చైతన్యమందించు – పరసావెంకటరత్న ప్రాభవం నిండించు
తెలుగుగంగ పారగా పచ్చదనం పండగా–వెలుగు తెలుగుదేశమే వెతలబాపు సోదరా!

మహిళాపథకాలతో మాన్యమైన దేశం – ఆపద్బంధువుగాను ఆదరించు దేశం
సంక్షేమం సవ్యమైన సరసాంధ్రదేశం – రైతురామరాజ్యమున రహియించే దేశం.

దీపము వెలిగించెను దీనులైన ఇళ్ళలో – చేయూతతో చైతన్యం దళితుల వాడల్లో
సాగునీరు తాగునీరు సాగెను ఆంధ్రలో – అభివృద్ధితొ అమరమై స్వర్ణాంధ్రం ముంగిట్లో.

అందించినవారికీ వందనం చేద్దాము – సహకారులకందరికీ సాధువాదమర్పిద్దాం.

426

మేలిమి మేధావిగా మేలుకొలిపె చంద్రుడు – అన్న అంతరంగమే ఆంధ్రజనతరంగమై
చంద్రన్నకు చెలికాడుగ అందించెనన్న – పరులసేవ ప్రవరమై పరమార్థమాయె.

బీసీ ఎస్సీలకు బిగువైన పథకాలు – మహిళామతల్లులకు మహారాయితీలు
రైతన్నల కూలన్నల రామరాజ్యసిరులు – వినియోగదారులకే విజయావకాశాలు.

పెన్నమ్మ ప్రేమతో పెరిగిన సీమలో – కాళంగి కలిమితో కమ్మదనం నిండె
స్వర్ణముఖీ శోభతో శుభములనిచ్చె – చెంగాళ్ళమాతయే చైతన్యమందించె.

పరసావంశము – వేంకటరత్నము
అంబేద్కరు అంశగా ఆశయమందము
ఆంధ్రమునకు అమరము – ఆతని మంత్రాంగము
తెలుగుదేశ విజయము తెలుపును ఆవరుస.

427

నెల్లూరుసీమలో నెలవంక విలిసింది – సూళ్ళూరుపేటకే సౌందర్యమిచ్చింది
బడుగువంశజన్మగా భాగ్యమందించింది – దళితజనుల కండగా ధైర్యమై నిలచింది.

పరసరత్నమై ప్రజలసేవలో – పదవికింపుగా ప్రగతినిండింది
తెలుగుదేశమంత్రిగా తేటదనం – సాంకేతికశాఖకే సంకేతమయ్యింది.

అన్ననందమూరికీ ఆప్తుడై ఆనాడు – చంద్రబాబు చెలిమికీ చైతన్యమై
అంబేద్కరు ఆశయాల పరిశోధకుడై – పేదపెద్దలందుతాను పేరుగాంచెను.

ధన్యమాయె ప్రజాసేవ మాన్యుని చేతతో – గణ్యమాయె స్వర్ణాంధ్రము వరునితలపుతో
మంచి మానవతలకూ మరుమల్లె తానుగా – పంచె నిండుగుండెతో పరమార్థసేవనూ.

పరసరత్నయ్య ప్రాభవమే నీకు – తెలుగుదేశమా వైభవమే నీకు
స్వర్ణాంధ్ర చంద్రుడా వాసిగల్గునీకు – ఆంధ్రజనులకందరకు అభయం గల్గు.

428

గొట్టిప్రోలు జన్మభూమి – గుణము పరసవంశము
నాయుడుపేటకే – నవ్యమైన అంశము
పెద్దరెడ్ల ప్రేమయే – పేరునివ్వగా – పేదవారి అండయే గుండెనిండుగా
అంబేద్కరు ఆశయాలు – అవనిపంటగా – ఆంధ్రదేశమంత్రిగా రత్నమాయెను.

సూళ్ళూరుపేటకే శుభములు పంచెను – చెంగాళ్ళతల్లికీ ముద్దుల పురిపెమై
నందమూరి అందము–రత్నయ్య చందము – స్వర్ణాంధ్ర చంద్రునికే స్వాగతసత్కారము.

దళితజాతి ఉద్ధరణము – ధర్మధరణి కాదర్శము
తెలుగుదేశ సిద్ధాంతము – తెలుగులకిది వేదాంతము.

విజయానికి పరచిన విరులబాట – పరసా వెంకటరత్నం ప్రగతిమాట
నెల్లూరు విజయమే నెఅజాణ పాట – చంద్రబాబు ముఖ్యమంత్రి తెలియను ప్రతినోట.

429

ఆశయాలు శ్వాసలుగా – ఆశలు హృదయాలుగా
అవని రాజకీయమంత – రాజిల్లిన రాజ్యమదే
రాజ్యం రామరాజ్యం – రహిజనకామితరాజ్యం.

సమతమమత రెండుకళ్ళు – కృషికత్వమె నోటికూడు
జయనాదం వినువీనులు – జాతిభక్తి ఆస్తికలుగ
నేతృత్వము వెన్నెముకై – మెదడు మేలి లోచనమై
భరతభవిత భాగ్యజనత – భయరహితము దేశమాత.

నవనాడీమండలమే – జనసత్వపు యువతగా
గాలినీరు గమకములై – ప్రకృతి కృతి గీతముగా
ప్రగతిగాంచు వేదభూమి – పసిడిఅందియల నాదంతో
ఘనవనములె గరువమైన – సహగీతం సంగీతం.

నినదించెడినీతినియతి – నిజతత్త్వపు విజయంగా
జనగణముల రూపంగా – జయపథమున విహరించును.

430

కలికాలం ఆకలికాలం – ఆశలకాలం – అవసరాల కాలం
అందిన అర్థానికీ – అందరాని ఆనందం
అందలమే అమరముగా – అమరిన ఆనందనం.

ఆశల తల్లికీ ఆశయాల పుత్రుడు – అవనికి సూర్యుడు అవసరాల విభుడూ
అమరిన యీ ప్రకృతికీ – అంతరంగమతడు
సమరమైన జీవితాన – సరసత కోల్పోయెనుగా
కలియుగమే ఒకయుగమై – కలిమి ఆకలిగమారె
కలలుతీర కాలునిలో – చెరిసగమై చెరిగిపోవు.

స్వరములు సరములుగామారి – స్వాగతించె భువనం
వరకిరణుని వసుధవెలుగు – వాసిగాంచె వహనం.

స్వార్థం సార్థకమైనది – స్వాతిశయపు జీవునిలో
పరార్థమే అతిశయమై – ప్రభవించును కలిలో
మానవతా నవ్యతలకు – మార్గమునిట చూడగా
మాయవంచనలులేనిది – మమత సమత మనమార్గము.

431

రావణబ్రహ్మ రాక్షసుడైనా శివునిమెప్పించిన ఆత్మలింగ సాధకుడు అహం మూర్తీభవించిన అన్నగారు అందరినీ మెప్పించిన ప్రతినాయకునిపాత్ర. రాముడు – రావణుడు ఇరువురూ ఎవరికివారే సమప్రతిభులు. సాధకులు – వ్యక్తినీతి సంఘనీతి రెండింటికీకల వ్యత్యాసంలో మంచి – చెడులవైపు వారు చేర్చబడినారు. 'జయభేరి'లోని రావణపాత్రలో అన్నతారకుని అసమాన నటనాకౌశలం ఆకాశాన్నంటింది. సత్వరజస్తమోగుణాల సహజత్వం, అన్నింటికంటే ధైర్యగుణం అన్నగారి సహజవర్తనలోనివై నిలువెల్లా సాగి నింగికెగిరాయి.

---

ఆత్మగౌరవం, ఆత్మాభిమానం అందరం అనేమాటలే. ఆమాటల్లోని ఆంతర్యాన్ని అభిమానధనుని పాత్రద్వారా విశ్వానికెరుకపరచిన విశ్వవిఖ్యాత నటసార్వభౌముడు అన్నగారు. రాజ్యకాంక్ష, దాయద్వేషం నియంతృత్వపోకడ, అసహనం, అసూయ, అధికార వ్యామోహం నిండి నిబిడీకృతమైన పాత్రలో అన్నగారినటన అనితరసాధ్యం. నమ్మి నయవంచకుల చేతిలో బలియైన భారతకథలో ప్రతినాయకుడు. నటనలో తాదాత్మ్య నయరక్తికట్టించిన ఎన్టీఆర్‌కునిజజీవితంలో ఎదురైన 'వంచనలు' ఎన్నో ఎన్నెన్నో చెప్పతర ంకాదు. చెరగనివీకాదు. కవిగీతలు రవికిరణాలై భువివి చైతన్యానికి భూమికైనపుడు కవుల జీవన కథళు పాత్రధారణతో పవులై పవిత్రమై, ప్రవరమై ప్రఖ్యాతినందుతాయి 'కవిసార్వభౌమునిపాత్ర'లో నటరత్న కవిరత్న ఘంటంలోని ఘాటు తెలుగుల మనసుల్లో ప్రతిష్టింపజేశారు. అనుభవించిన భోగం అంతిమదశలో శోకమై అవహేళనాభరితమైనది. మధురకవిజీవితం – మధురకళాకారుని జీవితం ముగిసిన విధంలో సామ్యముంది. తనవాక్కువేదమై తెలగుజనుల హృదయ పరివర్తన తెచ్చిన ఘటనలు మరపురానివి. మరువలేనివి. 'ప్రమాదోధీమతామపి'.

432

సాగుతుంది సాగుతుంది సరంభం – ఎన్నికలో ఎన్నొకలల సమరాంగణం
కార్గిల్ పోరాటము కొండల్లో కలిసిపోయె
మధ్యంతర మిథ్యగా మనముందుకు వచ్చిపడె
నేతల జాతకమంతా పాతకముల పండిపోయె
తలరాతల తపనలోన తడిసిపోయె ఎన్నికలు.

తంతువింతగా మారెను – తగవు లేని పాలనమున
ఎక్కడ చూచినగానీ – చిక్కని మోసాలే
బూటకమే వాటమాయె – మాటలేమొ మహిమనిండె
కాటకమే చేతవిధం – కార్పణ్యము కర్మతీరు.

అధికారం అనుభవించి – వదలలేనివాజెమ్మలు
దొరకని అధికారానికి – దోబూచుల దొంగలే.

యాతన ఏల్పడులలోన – ఎఱుకగల్గు జనులంత
జాతరలో జాగృతులై – పాతరవేతురు నేతల.

విడగొట్టీ పడగొట్టగ – విలువ మీరు మేధావులు
పడిపోవుట ఫలముగాను – పరిణమించు ఓటరులకు.

ధనబలం జనంబలం – దారిదప్పిన ధరణిలోన
మంచితనపు ప్రభంజనం – మరోదారిపయనించును.

పార్టీ సిద్ధాంతాలు లేని – పావనలన్నికలలోన
ప్రాభవమే వ్యక్తిత్వము – ప్రభవించును మానవత.

433

తల్లిగుండె తల్లడిల్లె – చెల్లికళ్ళు చెమరించెను
భామబతుకు గతుకుమనె – బంధువులే బావురనిరి.

వీరసైనికా విలువనీదిరా – ధీరుడవై దీక్షబూని దేశహద్దు రక్షించితి
ముందుచూపె ముచ్చటగా వెనుకబాటు కినుకనీకు
జాతిమాత కాపాడగ – జాగృతుడవు జరంతోడి

కదనానికి అదనురాగ – వదనం విప్పారగ
గగుర్పాటు చిగురించగ – కదం పదం కలిపి కదలె
ప్రేమయె పేలవమాయెను – మాతృభూమి రక్షణలో
వాత్సల్యము వాసివెలసె – వాల్లభ్యమె సరిహద్దు.

పిలచినా మరలిరావు – నీపిలుపే నియమము
తలచిన నీ చైతన్యం – తరగనిదై గుండె నిండు
కోట్లాదిగుండెల్లో కొలువు దీరినావు – కొలతలేని కోరికలే కోమలతను

మరువరాదు నీశౌర్యం – మాసిపోదు దేశభక్తి
మరచిపోము నీరూపం – మననం చేతుమునిన్ను
వీరజవానులకుజై – అమరవీరులకు జోహార్
త్యాగధనులకే జయం – యోగమన్న సైనికులదె.

434

సమరభూమి నీది – అమరుడవే నీవు
వీరధీర విప్లవమే – విజయశిఖరమైనదీ.
కార్గిల్ పోరాటం – కాంతి శాంతి ఆరాటం
హద్దుచెరిపి హతమొనర్చి ముద్దుమరచి మూర్ఖులైన
పరులగుండె దద్దరిల్లి – ఫలమై నీవిజయమాయె.

ఆలనాపాలనా అందమాకొండ – అమరావతి సదృశమే అవనిలోకొండ
అండదండ అందరికీ ఆలయమాకొండ – కండగలిగి పోరాడిన కాంక్షయెనీనిండ
ఎన్నికోట్ల జనులకో లక్ష్యమెనీ సరిహద్దు – ముద్దులనీ సంసారము ఆనందమె హద్దు
ప్రాణం ఫణముగ పెట్టి పావనతయె ముద్దు – తల్లిచెల్లి భార్యబాధ తరగనిదా సరిహద్దు.

విషాదమున వీరత్వము విలువగాంచెనిచట
విధివ్రాతగ చిత్రించగ విధవలుమీ స్త్రీలు
బావురుమను బాలకులే భావి సైనికులుగా
బాధ్యతతో తీర్చిదిద్దు వీరభామలుండిరిగా.

జోహారుల జోతలతో జోలపాడగాను – జేగీతము జైజవాను భారతంలో మహాన్
వరుడవుగా మరణించిన వార్ధకమే లేదు – సార్థకతే సాకారము కాలాంతమువరకు.

435

ఆశతోడివచ్చి – ఆశయమని చెప్పి – తీరనివేదనతోన – తిరోగమనమైతివా!
మోసం మధుమాసంగా మోదమందినావు – మేధోవిభవంతో మేదినినే చెరచినావు.

మానవ సంబంధాలకు మాయదారి అర్థమిడి
స్వార్థమునకు స్వాగతమని సొబగు వీడినావు.

నేతవైన నీవు – నేవళమును కోలుపోయి
నియంతలై యాంత్రికమున నిమ్నమైపోయితివి.

బంధం త్రెంచేయగా బాధజెందినావు
అంధకారబంధురమై అనురాగం మరచినావు.

విడివిడిగా మోసపుచ్చి విలువను విడిచితివీవు
వడివడిగా కలగలిసీ వంచన చేతురునిన్ను
హద్దుకలుగు అధికారం – ముద్దగునుర! జనులకు
వద్దు వద్దంటుండ వసుధ ఎదురుతిరుగురా!

మఱపు మానవాళికీ సహజముగా తెలియుము
ఎఱుక కలిగి జీవించుము మానవతను నిత్యము.

436

శిశువు పశువు శివరూపం జగమున – చెట్టు చేప చెడు కోరవు జనునికి
జలం బలం జయం కోరు జగతికి – మేఘశక్తి మేదినికే మేలిమగు.

పల్లమాయె పావనము ప్రగతికోరగా – మెరగ మేరువాయెనుగా అభ్యుదయమునా
చెడగొట్టెడి వాడె జీవి చెలిమి మర(చెను)వగా–సమతౌల్యము ప్రకృతికే సరసమాయెగా.

రక్షణ శిక్షణ దక్షుడు రహిలోన మానవుడే
భక్షణ భావము జనునికి భాగ్యదాయి కాదుగా
మానవతే మారణమై మహిని చెరిపివేయగా
మమత సమత ప్రకృతియే మనమంచినికోరెగా.

సహనము సరళము సరళియె సరసమీ భువికి
దహనము దానవతై ద్రఢిమవీడె ధరణిజాతి
శిశుహత్యల పశువులైరి శివపుమానవాళి
కాలుష్యపు కోరలలో కర్మ మర్మమాయె.

437

అందమైన అందానికి అంతులేదు కదరా
అందలమున కలవారికి అంతముండెకదరా
అవనికి అందంచందం అమరసదృశమ్మురా
అమరం కలదనుభావన ఆనందమె కదరా.

ఆర్తిదీర్చి ఆశదీర్చి అంతరముల మరపించి
అందరిమనసుల కందెడి అందము అసలైనదిరా
వేదాంతము వేద్యమైన వేకువయే జగత్తు
సూర్యుని సుందర కిరణమే రేబవళ్ళ హరిత్తు.

అంతమైన ఆస్తికతకు నాస్తికతే నవ్యత
అంతము తెలియని జీవుల అనాదియే దివ్యత
భవబంధము బాధ్యతగా బాధపడర మానవ
బంధనముల మథనములే భాగ్యయుతము దానవ!

మానవతకు వత్తాసుగ మహిమ గనర జనుడ
దారివీడు దానవతకు దహనేంధనమగ్రమురా!
మార్పున తీర్పున జనుని మాయజేయు అందం
మాయ మునిగి మానవుడే బానిసాయె బతుకున.

438

జాతరలో పాతరయె జాజిపూల వాసన
వాతెఱలే వడలిపోయె చాటుమాటు మాటల
అంగాంగము విడిపోయెను అర్థకాంక్షలో
అంగడిబొమ్మలసారమె అతివతీరు అవనిలో.

వలువ హీనమాయెనుగా వనిత నితంబములను
విలువ లేని హృదయమునా దయనిండెను దైన్యమునా
తిరునాళ్ళలో ఆనందము తీరు తెలియ తీయన
తీయదనం మిగిలిపోగ వగలు సెగలె తనువునా.

నగ్నత నయగారంగా భుగ్నమాయె సంస్కృతీ
మగ్నమాయె భారతభవిత నాగరకపురీతిలో
దాపరికం దారిచూపు ధరణి దారుణములకు
దావానల సదృశమది జనారణ్యసీమకూ
అహం వెలుగునీవుగా అవతరించకూ
వెలుగు మనది అందరిదీ అహం అధమమగునుగా.

పరనారీ నగ్నతలో పావనతను కోరకు
పారవశ్యభువికదే బంధనమని తెలియుము
నూలుపోగు మీదలేక న్యూనమగును వనిత
అందము అలంకారసహిత ఆశ్రయమే ఘనత.

439

అందరు రారండి అభవుని చూడ్డానికీ
ఆతడిచ్చు అభయంతో అవని భయం వీడుదాము.

పంచేంద్రియ సహితులై – పాపాలను చేయుచుండ
పంచభూత రూపుడుగా – పావనతను చేకూర్చును
కౌలాసమె కామితమ్ము – కైపువీడు కామాంధుడ!
కైవల్యము కలుగజేయు – కలియుగమున కలదైవము.

అమ్మపార్వతమ్మతోడ అర్ధనారీశ్వరుడై
గణాధిపుని మురుగనిగని గమ్యము జేర్చును నరుల
ఆస్తికతా శోభితులై – అందరూ కదలిరండి
అవనిని అమరం చేయగ – ఆ అభవుని కొలుద్దాము.

440

మేధమిగిలిపోతుంది మేలుతరిగిపోతుంది
మేలిజాతిమానవులే జాలి తరిగి జంతువులే
విలువ వలువ లేని విద్య విగత జీవులను జేసెను
జీవి విలువ తెలియగాను భావియె నందన వనమగు
ఆది అంతములు తెలియని ఆస్తికతయె ఆస్తినీకు
పుట్టి గిట్టి పూజ్యుడవై మిథ్యమధ్య వెలుగుమీవు.

అమాయకపు అవనిజనుడ! మాయ మునిగి మమత విడకు
పంచభూత పంచేంద్రియ పావనతను గమనింపుము
వయసు మనసు వైక్లబ్యము వదలు మీవు వసుధలో
దైన్యమంత దారి విడును ధైర్యమున్న ధనుడవీవు.

నీకు నీవు నిధివి కావు నీతినిధివి నిర్ణయముల
విధిని నిధిగ భావింపుము – విశదమగును విశ్వవిలువ
బానిసత్వ భావమే బాధగాను భువిని మిగులు
కరుణ తత్త్వకలిమియే కామితార్థ దాయియగును.

మరణించెడి మానవా! కరుణించుము జీవులను
కరుణ మరణ కలిత భువికి కార్యకారణములు నీవె
నిన్ను నీవు తెలియలేవు నిమ్నమైన మానవా
మన్ను మిన్ను మధ్యనీవు మంచి మమత తెలియరా.

441

వేగవంత జీవునికీ వేళ తక్కువాయె – వేదనలో జనునికీ వేళ మిగిలిపోయె
భూమి తిరుగుచున్నదీ భూపతి రవినాశ్రయించి
పగలు రేయి ఫలముగా నయము భయము నాణ్యమై
నాదము భువి నవ్యముగా – వాదము జనవేద్యముగా
వాయువులో కలిసిపోయి – వాసి వెలసె జనులదీ.

ఆకాశమె అవకాశము – ఆశ భువిని అవతరించె
పెరిగి తరిగి కరిగిపోయె –పేలవమే నరుని బతుకు.

సుఖవంతము సుందరతల శుభజీవనకాంక్ష
ఆంక్షలలో అవతరించి అంతరించు నిచట
వేదార్థము తెలియక వేదాంతము శూన్యము
అంత్యకాల నరజన్మకు వేదాంతమె పూజ్యము.

వేళతక్కువైనదీ వెతల జన్మనీది – వెలుగు వేగవిలువ దెలిసి మెలగు భువిని జీవుడా!

భూమి భ్రమణవేగము కాంతి క్రమణ వేగమూ
కనగలేవు కామాంధుడ! కావరమును విడువరా!
సహనధాత్రి సారమెరుగు – తేజస్సును తెలియుమీవు
వాయువు ఆయువు నెరుగుము – వరుణ వాసి ధరణి గనుము
ఆకాశమె ఆశయమై అవని వేళ తెలియుమీవు.

442

పుట్టిననాడు పూజ్యుడవే నీవు – పెరిగి పెరిగినీవు పేలవమై పోతివా!
అమ్మపాలు తాగువేళ అమరుడవే నీవు
అతివపాలు కలియగాను అధముడవైనావు
తప్పటడుగగు వేయువేళ తరియించెను తనువు
తప్పుటడుగు జీవితాన తపనతోడ మరుగు.

పేరుపెట్టు వేళలోన పేద పెద్దలేదు
పేరు మిగిలి పెద్దవీవు పేదనుగన లేవు
ప్రాయములో పరువు కల్గు ప్రవరుడవే నీవు
ప్రాయశ్చిత్తము విడువగ ప్రమత్తుడవునీవు.

సంసారపు సారముగన సరసుడవే నీవు
సారవంత జీవనమున రవళిలేని అందియలే
నాల్గు దశల నడవడిలో వడివడి నడచీ
నరముల సత్తువ వీడగ చతికిల బడితీ.

ఏమిలేని సంసారము –ఎఱుక తెలిసినావు
ఎఱుకతోడ బుట్టినావు – మరచిపోయినావు
మరల తెలిసి మసలుకోగ – మలినమాయె బతుకు
పుట్టుకలో మాలిన్యము – పులినమగును నడత.

443

దురాక్రమణ క్రమంగా దూరమైన సమయంలో
సరిహద్దుల హద్దు చెరిపి సరసత్వం కోరుదురా!
సాగదుమీ చొరబాటు – ఆగదుమా అదిరిపాటు
పాకు పావనత విడిచె – ఫలితమేమొ పాతరయే.

కార్గిల్ కలతకు కట్టిన మూల్యం – భారతసైన్యం బాధల వైనం
పక్కలొ బల్లెమె పాకు వాదులు – ఉగ్రవాదము వధకు సిద్ధము.

వీరజవానుల త్యాగము విలువ – దేశ రక్షణను దేహాల తెగువ
తల్లిదండ్రుల తరగని తపన – బంధుమిత్రుల బాధల వెల్లువ.

భారత మాతకు భాగ్యహేతువులు – పౌరుల కవియే ఆదర్శమ్ములు
పరుల శాంతిని భగ్నము చేసెడి – పాకిస్తానుల మరణమాన్యములు.

ధైర్యసాహసము దారిజూపగా – రణోత్సాహమే రమ్యతనిడగా
భంగపడునుగా పాకిస్తాను – భారతీయతకు భాగ్యపు పంట.

444

దేశభక్తి సమరంలో దేహాన్నర్పించినట్టి – సాహసయోధుల ఆత్మకు శాంతి కలుగును
దేశరక్ష దీక్షలో – హద్దుల పరిరక్షణలో
అమరం చేరినవారికి – అర్పింతము నివాళులు.

దైన్యమును విడనాడిన – సైన్యమునకు జేజేలు
హైన్యశత్రువుల జంపిన – జవానులకు జోహార్లు.

పరదేశీ చొరబాట్లను – అరికట్టెడి ఆశయంతొ
అహరహమును పోరాడిన – వీరులనిట వినుతింతము.

బంధు బంధములను వీడి – భరతదేశభాగ్యముగా
మాత జాతి మమత తోడ – మసలు వీరులకిదె అంజలి.

మనదేశం మాన్యమనీ – పరుల హింస హైన్యమనీ
మానవతే ధన్యమనీ – మనమంతా చాటుదాం.

445

అన్నగారి జన్మదినం – ఆంధ్రజనుల మహానాడు
అతిశయమై విశాఖలో అతివ పార్వతమ్మ జరిపె
అధికారం లేదు లేదు – ఆర్భాటం అసలు లేదు
అన్నగారు అందించిన – ఆత్మగౌరవం కలదు.

నీతిగోతిలోనపూడ్చి – వెన్నుపోట్లు పొడిచినోళ్ళు
అనుబంధం మరచిపోయి – తండ్రిని వదిలేసినోళ్ళు
మహానాళ్ళు జరుపగా – అన్న ఆత్మ శాంతించున?
ఆనాటికి ఈనాటికి – పార్వతమ్మకే తగునది.

మహిళలకే అంకితం - మహానాడు యీ దినం
మనమందరమంకితం - అన్న ఆశయాలకు
అధికారం అందుకొన్న - చంద్రబాబు చేతలన్ని
స్వార్థపరుల అర్థానికే - సార్థకమ్ముకానెకావు.

అన్న తెలుగుదేశమనీ - ఆంధ్రజనులమభ్యపెట్టు
హరికృష్ణుని అసత్యాలు - అందరికీ తెలిసినవే
అన్నగారి మూర్తితోడ - స్ఫూర్తి పొందుడందరూ
అన్నగారి ప్రగతిబాట - అందరికీ పసిడిమూట.

నందమూరి చెప్పినదీ - మనగుర్తే సింహమూ
నవ్యాంధ్రకు సోపానం - ఎన్టీఆర్ దేశమూ.

446

స్వర్ణాంధ్ర చంద్రునికి శోభనిచ్చె మహానాడు
జన్మభూమి శిల్పికీ - జయమునిచ్చె జనగణములు
అధికారం అందెను - ఆంధ్రభూమి పంటగా
అవకాశం జనసేవకు - అహరహమూ శ్రమించగా
రైతన్నల కూలన్నల రహదారిగ ఆంధ్రమూ
ప్రజలముందు పాలనతో పరవశమందెగా
పరిశుభ్రత పండెనూ - పచ్చదనం నిండెను
ఆరోగ్యం అభ్యుదయం - అందించెను ఆంధ్రులకూ
ఆదరణలొ తరించెను - చేయూతలొ చెలిమిమీరె
చేతనలో చైతన్యము - మహిళలదీ జన్మభూమి.

పల్లెలలో పాటవమ్ము - పట్నాలలో ప్రగతిసుమ్ము
బడుగువర్గ బాంధవ్యము - భారతమున కాదర్శము
ప్రతిపనిలో ప్రజలంతా భాగస్వాములేననీ
ప్రతిపైసా జనంమధ్య ఖర్చును పెట్టాలనీ
ప్రతిక్షణమూ ప్రజలతో పరవశమందాలనీ
ఆంధ్రభూమి సాంద్రమై అవనిని వెలుగొందాలని

ఆశయంగ పెట్టుకొనీ అందరిమన్ననలందిన
ఆంధ్రముఖ్యమంత్రికీ అందరండనుండిరీ.

447

నేతలార! వేత్తలార! నేలతల్లి రక్షసేసి
నెవ్వగలను పారదోలి నెయ్యమలర జీవించుడి.
గాలి ధూళిగలిసిపోయి గాటమాయె జనులశ్వాస
శుభముగూర్చు పరిశుభ్రత ఆరోగ్యమునిచ్చునురా
వార్నిధులును వాసివీడె నదులు వదలె నాణ్యతలను
త్రాగునీరు సాగునీరు సంద్రనీరు మరిగెను మాలిన్యమందు
ఆకాశము కోశమాయె అంతరిక్షనౌకలకిట
పొగలు సెగల వగలతోడ పొగిలిపోవు నేటి నరుడు
ధ్వనులు మించి ధ్వజమెత్తగ మనములేమొ మలినమాయె
నాడులన్ని బీడులాయె వాడబారె నరులశక్తి
మురికి మరకలెన్నొ పడెను భూమాతయె భూతముగా
కాలుష్యము కలవరింత కామితములు కలతలాయె
అడవులన్ని బీడుబోయె అవనిరక్ష శిక్షవిధమె
పచ్చదనం పాలిపోయి మెచ్చువిధం మెలిదిరిగెను
పొగగాలి వదలగాను పారిపోవు పరిశుభ్రత
పోటుమగల పాటవమ్ము ఓటువడును తెల్లమగును
భువిరక్షయె మనరక్షగ దక్షమగును భువన భవిత
మనచుట్టూ మలినమంత మనమె తొలగజేయవలెను.

448

ఆజన్మ అన్నగారి అభిమాని – కందుకూరులో ‘తెలుగుదేశం’
కాలూనడానికి కలిమిచెలిమి పంచిన కోటీశ్వరుడు వ్యక్తిగతం
వ్యవస్థలో మంచితనంగా వ్యక్తీకరింపజేసిన విలక్షణ నాయకుడు
వర్గంలేని పార్టీల కందని ప్రజాసేవ అతని నిత్యకృత్యం.

దరికివచ్చిన వారిని నిరాశ పరచని సిసలైన ప్రజాప్రతినిధి
ప్రథమ పౌరుడైనా పదంలో పథంలో పరార్థమే పరమార్థంగా

భావించే వినయశీలి రాజకీయాలలో పగవారికి
వగచేవారికి ఉపకరించే అజాతశత్రువు.

నాయకులకు వ్యతిరేకి అయినా ప్రజలకు సన్నిహితుడు
మనసున్న ప్రాజ్ఞుడైన రాజనీతియుతుడు హితుడు
ప్రజావసరాలు తక్షణం తీరాలని తపనపడే పాలకుడు
తనమనస్సుకూ వ్యవస్థలోని వ్యత్యస్థస్థితికీ పొంతన
కుదరని సమయంలో బాధపడే చిత్తశుద్ధి గల్గిన ప్రతినిధి.

సున్నితమనస్సు సుందర రూపము, బీదలనాదరించుట
నిత్యం జనసేవలో తరించుట కల్లూరికి కామితం.

449

జనారణ్యసీమలో జయశీలం తరిగెను
జన్మభూమి జనులలో చైతన్యం పెంచెను
తనభావం తరుగగా మనభావం పెరిగెను
తన మనములు కలియగా జనులతపన తరిగెను.

జాతిజయం కోరగా జనత ఘనత మిగిలెను
దేశభక్తి మీరగా సమత మమత పండెను
అరుణోదయ సమయంలో భువిప్రాణులు ఉద్యమించు
విప్లవించు మనసు విరులె విశ్వశాంతి పావురాలు.

భారతమే భాగ్యసీమ – భవితలోన దివ్యసీమ
సీమలోని సిరులవెలుగె – మాత మనసు మహిమ తెలిపె
బతుకు జయం గతుకుమయం – మతికి హితం మనవిజయం
బతుకు గతుకు భయం వీడి – హితమతివై సాగిపొమ్ము.

పరుల మంచి నీవు కోర – ఫలం నీకె జనంలోన
జయశీలము ననుసరింప – అరణ్యమే విరులమయం.

450

అంబరానికెగసెను సంబరము – అంతరించె అవహేళన బంధురము
క్రీడలలో మకుటమే క్రికెట్టు – క్రీడమిగిలి క్రీడగ తీసికట్టు

ఆడగ ఆనందమై అతిశయమే – ఓడగ ఓరిమి వీడగ వేదనయే.

పరములైరి వరులుగా ప్రవరులు – ఆట ఆటవికముగాను వానరులు
గెలుపు మలుపు తిరుగగా గేలియే – తలపు తలుపుతీయగా తపనయే.

సహనసహిత క్రీడలే సాగవు – సరస సరళ సరళియే మనదవు
దేశభక్తి దేహులలో దేవుడాయె – జీవుడేమొ తెలియలేక జిలుగువీడె.

విశ్వమందు విజయరథము విలువ వేరె – విస్ఫూర్తియె క్రీడలందు విదితమాయె
విజేతలకు జేతలిడగ విధియె మనది – విజితులకూ విరులుపంచ వరులె జనులు.

451

చుట్ట సురిగిపోయింది శక్తి కరిగిపోయింది
గాలి ధూళి బూడిదై పొగతో మసిబారింది.

భంగు భంగ మొనరించెను – బలమైన శరీరముల
బీడిపీకి పారవేసి – బిగువైన గుండెపటువు.

గంజాయి మత్తులోన పంజా దెబ్బనుకొట్టె
జివజచ్చిన జీవులనూ పొగవగలో పడగొట్టె
విషము విధికి విలువ చూపె – వింత వ్యాధి వెలుగుచూచె
త్రాగువారు పీల్చువారు తరతమములతోడ
త్రాణలేక మరణమునకు చేరువౌ చుందురు.

ఆరోగ్యము రోగముగా అంగాంగము వ్యాపించు
మానసికము కాన్సరుగా మనుజులనే మసిచేయు
పొగత్రాగుట నేరమనీ పోస్టరులుండ
మిగులునదే ఆనందము సమయము మించ.

ఆకుపొగే వ్యాపించెను అణువణువందు
ఆకారమె వికారమై అవహేళన పొందు.

452

కాలం కలికాలం కవితల కాలం – కలకాలం – యిది కలియుగ మేళం
రాజులకాలం కవులకు రాజ్యం – రాసభ కవులది రభసగ పూజ్యం.

కాలం కవులది కాలుజారితే – కాలుని సంస్కృతి కలవరమొసగును
కవితలు కలతల కాలమేఘమును – కదిపిన మెరుపులు కాంతుల నిచ్చును.

భోగభాగ్యముల భోజన కవితలు – త్యాగరాజ్యమున యోజన లేనివి
మకుటపు మర్కట మాన్యమానవులు – మహిమను గనగా మధువు కవితలది.

వర్తన మార్తిన నర్తన కవులది – కీర్తన కర్తగ కీర్తిమీరునది
అవనిని నిండెను అపర సృష్టియే – ఆశయమన్నది అతని పుష్టియే
భాష భాగ్యమై భావన యోగము – అక్షర శిక్షణ దక్ష కవులదే.

453

సంపాదనపాదులో పెరుగుతున్నదీ రాజకీయ వృక్షం
సంవేదన సరళిలో తరుగుతున్నదీ – ప్రజాస్వామ్య ప్రసూనం
సహజత్వం సరసత్వం సదాశయం కరవైనది
సర్వసమత ఖర్వముగా అంతరములు మించినవి.

నవ్యతలో నాణ్యతయే నయనగోచరముకాదు
నాగరకత కథలుచెప్ప నయనములే నీరుకారు
చెదపురుగులు తినిపోయెను చేతన వృక్షం
'బోనసాయి' భోగ్యములై భోరుకొలుపు లోకం
వేరుపురుగు కలదనీ విజ్ఞులు గమనించగా
ఆకుపురుగు వైద్యమునా నేతలు నిలబెట్టిరి
మొగ్గతొడిగి ఒరిగిపోయె – పిందెరాలి పేలవమై
కాయపండు పండనిదై – కాలమునకు గాలమాయె.

విత్తులోన వివరముగా – మొక్క బక్క చిక్కిపోయె
మూలమేమొ కూలిపోయి – మూగదాయె జనప్రకృతి.

సంపాదన సంవేదన – సహజత్వం సర్వసమత
సహకారమె ఆధారము – అనుబంధమమె జనబంధము
వేరుపురుగు తెలిసికొనీ – వేదనలను గమనించీ
మనిషితనం మరువనిచో – మరుమల్లెలె మన మనసులు.

చీడపీడ చెదరిపోవు – చెరగదుగా మానవత
రాజనీతి వెలుగులోన – రాజిల్లును జనస్వామ్యము.

454

సంగ్రామ రంగాన సాహస వీరులు సవనము చేసిరి పవలురేలు
సవనాన సమిధలు సామర్థ్య మహితులు సాగిరి హననాన సాధకులుగ
సాధన యోధులు బాధలు పడగాను భాగ్యమె మాతకు భవమునందు
భవమున భయమును భావములేకుండ రక్షణ దీక్షను రాజులైరి.

ఆ.వె. దేశభక్తి శక్తి దేవతలైరిగా – మానవులుగ మనకుమాన్యులైరి
భువిని రక్షసేయ దివికి జేరినవారి – ఆత్మశాంతికలిగి అమరుగాత.

సీ. బంధువులను వీడి బంధితులైరిట – భావము బాధ్యత భవితకొరకు
తలిదండ్రులకు బాధ తరియింత్రు వారలు – సరిహద్దు వీరులు వరులు సుమ్మొ
నిష్కామ కర్మకు నిజమైన సాక్షులు – నియమమె నిధిగాను భయరహితులు
కైవల్యమూర్తులు కైతవ రహితులు – కైంకర్య మహితులు అంకితులుగ.

ఆ.వె. జనని జన్మభూమి జయకేతనమ్ముగా – జాతిదేశములకు భాతి గలుగ
ధైర్య స్థైర్య రక్ష కార్యమై నిత్యము – జైజవాను జన్మ జగతి ధన్య.

సీ. క్రమశిక్ష దక్షత కాఠిన్యమయముగా – శాంతి కాంతిని యెంచి శక్తులైరి
పరులుమీదకు రాగ పద్ధతివీడగ – బుద్ధిని చెప్పెడి బద్ధులైరి
ఆత్మరక్షకు మిన్న అవనిని రక్షింప – ఆద్యులై అమరిరి అధికులైరి
భువిలోన గాలిలో పూజ్యులు సంద్రాన – సంగ్రామ పార్థులు సహితులైరి.

ఆ.వె. ఎల్లకలుగ నేడు ఎఱుకైన బతుకులు – చితికి ఛిద్రమైన చింత గలుగు
భరత సైనికులకు భాగ్యము సేవగ – భారతాంబ గనగ భాగ్యమాయె.

ఆ.వె. త్యాగ మనగ నదియె యోగము జనునికి – యోగమదియె వీరు యాగమయ్యె
యాగయోగములకు యోగ్యుడు వీరుడు – శాంతినిచ్చువారడు శక్తితోడ.

455

పరులకోసంపాటుపడని నరుని బ్రతుకెందుకని
మూగనేలకునీరందించని వాగు విలువేమిటని.

స్వార్థం సార్థకమైతే పరార్థానికి పరమార్థం జగత్తులో సాధ్యమేనా
వర్షం నేలకు హర్షమైతే అమితవర్షం జనజీవనగతికి అమర్షం.

నరుడు వరుడై బ్రతుకుబాట పూలబాటగా పరులఫలానికి పాటుపడాలి
ప్రకృతి జనవికృతిగా మారకముందే సుకృతులై మానవులు రక్షకులు కావాలి
పరుల సేవలో తరించిన పరములు పలువురు వారి వారసులం మనం
జనాభ్యుదయానికి జీవాలర్పించిన విశ్వవినుతులు విబుధులెందరో
వాగునీటిని సాగునీరుగా మార్చడానికి మనిషి మేధకు పదునుపెట్టాలి
సమతమమతల సాధనకు సహనపరుడై సారసవనం చేయాలి
మానవసేవమాధవసేవనుకొనే మహిమాన్వితుల మాన్యం మనదేశం కావాలి
ప్రకృతిని ప్రణవాకృతిగా పరిమళింపజేసికొనే పరముడు మానవుడు
మనసులు పండించే మధురఫలాల మానవత మన ఆదర్శం కావాలి.

పుట్టిచచ్చేలోపు పుణ్యకార్యమొకటైనా చేసి నరుడు కీర్తి గుర్తుపొందాలి
త్రికరణశుద్ధికి తిరునామానరులైనప్పుడు దేశం పుణ్యఫలతీర్థమౌతుంది
ప్రేమరాగము నరునియాగమై పరుల ప్రగతికి పథము పరచును
విలువవెలుగుల వెల్లువగునుగ వెల్లువలనిల వెలయు ఫలములు
జనుని పథకము జగతి వెలుగగ జనతసుగతికి జయము తథ్యము
సేవ సేచన మనసుమహిమకు చేరుస్వర్గము చేత విలువల
ప్రకృతినిగని పరముడాయెను సుకృతములతొ సరసుడగునుగ (డాయెను)
వృక్షరక్షణ మానవరక్షగా మనందరం వనరక్ష ఫలాల్ని ఆరగించాలి.

456

సేవ చెలిమితో చేతనములు చైతన్య మహితమై చింతవీడాలి
వాగువాలును వంపు తిప్పితే వరపునేల సస్యసుధల నందిస్తుంది
కోర్కెల వాగుకు కట్టకడితే కోమల ప్రకృతి కలిమి పంటనిస్తుంది
చలనం చెలిమివాగుకు చెలువం చేరువకొస్తే జనమనసులు మధురం
నరునిజీవనం నడిచేవాగు పరుల మనసు మరుభూముల పండిస్తూ సాగు
సంద్రానికి చేరిన మధురనీటివాగు ఉప్పులో కలిసి ఉపయోగరహితమౌతుంది
మెప్పుపొందే మానవుని మనసు పొంగే వాగై భూమిని పారిపండిస్తుంది
మూగజీవుల వేదన రోదనల్ని వరమానవతాసేచనతో దయారసంపండించాలి
ప్రయోజనాన్ని ఆశించేనరుడు ప్రపంచంలో ఆశయాల వెలువలో వెలిసిపోతాడు
వర్షాలకు పొంగిపారేవాగులు పరహర్షానికి మురిసే నరులు భువిలో ఒకటే

పరార్థంకోరి భోగాలు వర్జించే యోగులు పరమార్థపు నరులేనని తెలిసికో
అశక్తులకు అసహాయులకు ఆలంబనమయ్యే జీవితాలు అవనిలో అమరం
సస్యశ్యామలం చేసే నీరు వాగుల వెల్లిలో విలీనమై విలువ కోల్పోతుంది
ఒంటరిమానవునిజీవితం విలువహీనం పరుల కూడికతో అది ఫలవంతం
వాగు అడ్డుకట్టకను ఒరుసుకుంటే మూగభూమి ముచ్చటగా పంటలు పండిస్తుంది
గలగలపారేవాగు గమ్యానికి దూరంలో పరహితమానవజననం స్వర్గానికి చేరువలో
నినదించేవాడు నిండుజీవితానికి దర్పణం నీటిపంట పండించే పరసేవనరజన్మ.

వర్షానికి వాగుపొంగిపొర్లితే పరసేవాహర్షానికి నరునిమది ఆనందంతో పొంగాలి
విపత్కరస్థితుల జడివానలో వాగువికృతమైనపుడు కోరకనే సహాయమందించడం నరధర్మం

ప్రకృతిధర్మం పరవశం కల్గిస్తే పరులకోసంపాటుపడేవ దిలధర్మం జాతికి వరమౌతుంది
యుగయుగాల జనజీవనస్రవంతిలో ఉర్విని సంపన్నంచేసిన వరనరవాగులవాసి మనకు వారసత్వం
మనసుంటే మార్గముంటుందనే ముచ్చట మార్గదర్శకుడైన మనిషి మనురీతికి ఆదర్శం
ఉరవడిలో వడివడిగా సాగేవాగు యువజీవన ఆశయాల భూమార్గాన్ని దివిసీమ చేస్తుంది
పరార్థాల పరమార్థం సంఘజీవి మానవుని భువిని జీవనవాగై సస్యశ్యామలం చేస్తుంది.

457

మానవజీవన నందనవనానికి మధుమాసం మానవత
అనురాగానికీ ఆత్మీయతకు మనుజీవనరాగం మానవత
బంధానికీ అనుబంధానికీ సంబంధానికీ బంధం మానవత
అంతరాల అవాంతరాలకు అంతరంలేని వింత మానవత
మతము హితమైన మానవజీవనానికి మరువం మానవత
మనమనే మాటలోని మాధుర్యానికి మారురూపం మానవత
అభాగ్యులనూ అదృష్టహీనులనూ ఆదుకొనే ఆలయం మానవత
స్నేహానికీ సన్నిహితత్వానికీ సమతకూ సాధనం మానవతే
చేతకూ చేతనానికీ చైతన్యానికీ చెలిమి మానవత
మాతృత్వానికీ దాతృత్వానికీ దయకూ మాన్యం మానవత
ఆవేదనకూ, ఆక్రందనకూ, ఆర్తికీ ఆలంబన మానవత

చెలిమికి నేస్తమూ, కలిమికి కమలమూ బలిమికి బంధమూ మానవత
విశ్వమానవత్వానికి, విబుధ మానవభావానికీ విలువ మానవత
మాసిపోయేది మానవదేహం కీర్తివెలిగేది మానవత
మంచితనానికి మారురూపం మహనీయుల ఆశయం మానవత
మమతకూ, సమతకూ, శాంతికీ సహనరూపం మానవత
మనిషి అనవలసినదీ, వినవలసినదీ, కనవలసినదీ మానవత
ఆసురత్వానికీ అమరత్వానికీ జరిగే స్పర్థలో పుట్టిన అమృతం మానవత
ఎల్లలు లేని పంచభూతాలు మానవులకందించే ఎఱుక మానవత

458

అర్ధంతరం సభాపర్వం అంతమయ్యింది – మధ్యంతరం భారతాన అనివార్యమయింది
రేసు కాంగ్రెసు రెండింటికీ జెడ్డరేవడి – ఫ్రంటులోని ఫ్రంటు పదిలంగా నిలబడింది
అధికార రీతిని బీజేపీ మదనుడు చేబట్టాలి – పోగొట్టుకొనేది రాబట్టుకొనేది రాజులే
లోకం పన్నెండోలోకసభకు ఓటెయ్యాలి – జీవం పోయిన రాజీవుడు జీవం పోస్తాడా
లౌకికం వామపక్షమై వామనావతార మౌతుందా
కమలనాధుల భారతీయత కమ్మదనమిస్తుందా
జైనుల జమానాలు జాతిపీడను వదిలిస్తాయా
పద్నాలుగు పార్టీల కిచిడీ ఓటరుకు రుచిస్తుందా
రామజన్మభూమిని వదలని బీహారీలు పదవీ బేహారులౌతారా
నాయకులకు కొదువలేని కాంగ్రెసులో అందరూ విఘ్నేశ్వరులే
అంతరంగమెలా ఉన్నా రంగంమాత్రం రంగుపులుముకొంటున్నది
కుంభకోణాలు కుదిపేసిన కాంగ్రెసు కుంటుతుంది
కళ్యాణానికి ఉత్తరప్రదేశంలో అధ్వాన్నాల కల్మషమంటింది
ప్రభుత్వాల నిర్వహించే ఫ్రంటుముఖ్యులు పలుఇబ్బందుల్లో ఉన్నారు
సిద్ధాంతాలను సిగ్గుతో వదిలేసిన ఫ్రంటురేసులకు ఓటరు వరిస్తాడా
రాజకీయులకు అంటరాని మతపార్టీ ముద్రను ఓటరు తొలగిస్తాడా
మంతనాలు అంతరించి ఓట్ల సంతకు పరుగెత్తాలి
కూడికలూ తీసివేతలు కట్టిపెట్టి ఐక్యతతో ఎదుర్కొనాలి
అందరినీ అలరించే కమలానికే అదిసాధ్యం.

459

ఎదలనడుమ ఎల్లలులేని మానవీయతకు మకుటమౌదాం.

మనం జనం జగతిఘనం మానవతకు నవ్యతరం
మనసుకలిగి మానవులం మానవతే మధురఫలం
రక్తమొకటె రహినిజనుల జీవఫలము మానవతే
మదులగదుల మతముహితము దైవత్వము మానవతే
పరులసేవ పరమార్థము పరముసేవ ప్రజలసేవ
సాహిత్యము సంస్కారము సవ్యనీతి మానవతే
పేదపెద్ద పెరుగగాను జాతిరీతి జవమువీడు
మహనీయుల మానవతే మనదేశపు మహితత్వము
ధనము మనము హతముజేయ ఎదకు ధనము మానవతే.
స్వర్ణభారతి వర్ణగొడవలు మాతవెలుగు వెలియజేయు
మరణం తప్పని మానవునికి మదిగదిలో మానవత కీర్తినిధి
అవనిలోని అడ్డుగోడలు మానవమనసుల్లో కట్టవద్దు
ఆశయాల రూపమైన జనులు ఆదరణపొందేది మానవతవల్లనే
ప్రళయాల కల్లోలాలకాలానికి మమతనందించే మానవత మనది
చెలిమికలిమి బలిమికి చైతన్యం చేతంలోని చెరగని మానవతే
ఒకమదర్ ఒక బాపు ఇద్దరేనా దానవత్వపు దారుణాలనణచే మూర్తులు
వింగడింపుల వింతజీవితానికి విరామం అందరమొకటేననే నానుడికాహ్వానం
మనం మరచిన మనలోని మాలిన్యం తొలగిపోతే తోడు నీడల జీవనం
మతాల పుట్టిల్లు మనదేశపు మహిమ జాతిజనుల జీవనాడుల్లోని మానవత
ఐక్యానికీ లౌక్యానికీ సమానత్వానికీ సారవంతమైన జాతిభారత జాతి
ఎదుటివాడు తనలాంటివాడేననే ఇంగితానికి సాకారం మానవతే
మాటల్లో మానవతను మభ్యపెట్టకు చేతల్లో చైతన్యపు చిరుజల్లే మానవత
భువనానికి ఎల్లలులేవు మానవ భవనాలకు ఎల్లలు ఎందుకు
ధనగణనకు ధరణిలో ఎల్లలు లేవు మన ఎదగదిలో ఎల్లలెందుకు
విశ్వానికి విలువనిచ్చు మానవతకు నరవరులే మానవీయ మహితులు
పలుకు పులకరింపజేసే సంస్కారపు మానవుల ఎదల్లో పదిలమైనది మానవతే
హత్యా సంస్కృతి హననానికి త్రికాలాల్లో త్రిలోకాల్లో మానవతే మహనీయ సంస్కారాగ్ని

ప్రేమకేమి ఎల్లలేదు రాగసుధల కంతులేదు
ఆశకసలె అంతులేదు ఆశయమే మానవత.

460

ఎల్లలు లేని జనజీవనానికి జనుడు సృష్టించుకొనే ఎల్లలు జనతకు నష్టమే
ఎదల్లో పదిలపరచబడే ఎఱుకకు లోకంలో చిరునామా మానవతే
సమానతకు కేంద్రస్థానం స్మశానం కాకూడదు జనమనసులు మానవత మకుటం కావాలి.
భూమిలోపుట్టి భూమిలో కలిసే భూమిజనుల బతుకులు మానవతామధువు కోరాలి
రక్తసిక్తమౌతున్న రాక్షసరాజ్యానికి మానవత్వపుమందు అమరత్వాన్ని ప్రసాదిస్తుంది
కక్షలు, కార్పణ్యాల కర్మభూమిలో కరుణార్ద్రచిత్తుల మానవత కరకుదనాన్ని హరిస్తుంది.
వృద్ధులు, చిన్నారుల అభాగ్యుల అన్నార్తుల ఆక్రందనలకు ఆదరచిత్తుల చింతన మానవత
మానవ మహికి మహితత్వాన్ని కలిగించే కమ్మదనపు చెలిమి కలిమి బలిమి మానవత
మానవత్వాన్ని మరచిన మహిషులను మలచే మధుర సుధారసం మానవతే
త్రికరణాలకు తీర్థం పంచేంద్రియాలకు పరమార్థం మనిషి మానవతే
అరిషడ్వర్గాలకు ఆమడదూరంగా అవనిజనులను అందలాన్నెక్కించేది మానవతే
శాంతిసామరస్యాల సదనంగా ధరిత్రిని తీర్చిదిద్దే ధగధగ మెరిసే మెరుపే మానవత
కులమతాల కొలుములు జాతివర్గపార్టీల జంత్రాలు జనమనసుల మానవతను మరపిస్తున్నాయి
మనమనే భావంలోని మాధుర్యం మానవత తప్ప మరెక్కడా మనకులభ్యంకాదు
అందుకే వసుధైక కుటుంబంలోని మనము మానవత మకుటంగా మార్గాన్ని గమించాలి
ప్రాణాల్ని హరించే ప్రాకృతిక జీవితం జగతికి ప్రాభవాన్నివ్వక ప్రళయాన్ని సృష్టిస్తుంది
కష్టాల కడలిని గమించడానికి కర్ణధారి మానవుని యత్నానికి మానవత కమనీయమైనది.

461

ఈ శుభవేళ – ఆనందడోల – హర్షవర్ధనుని ఆధిక్యహేల
అతిశయించిన హర్షం – వర్ధిల్లిన వినయం

ఆశయాల సాధనలో అవతరించిన శుభదినం
హృద్యమైన విద్యలో అనవద్యం అనితరసాధ్యం
తల్లితండ్రి ఆశలకూ తరగని వెలుగిచ్చిన వైనం
మేనమామ మేలిమిసేవకు మేలైన ప్రతిఫలం
బంధుమిత్ర సమూహాలకు అందం యీ అతిశయం
నలందకూ నవ్యత తెచ్చే భవ్యకృషిని సల్పగా
భావిజీవిత మంతా భాగ్యదాయి ఔనుగా
ఇంటరులో ఇంటగెలువగా హితమతివై పయనించు
స్పర్థ విద్య వర్ధిలజేయగ సాగుమయ్య నీ సరళిలో
ఆశ్చర్యవంతమైన అవధులెన్నొ దాటగా
అందరినీ ఆకర్షించుము హర్షదృష్టిబారగా
వంశానికి వన్నెతెచ్చీ దేశానికి సేవ చేసే
జాతి జనులకోవలో జాగృతిగని పయనించు
ఆకృతి సుకృతిగా అందరినీ అలరించు
ఆశయాల సాధించగ అధికుడవై అనుగమించు.

462

షష్టి పూర్తిస్వాతంత్ర్యము – పుష్టిలేని నవతంత్రము
జనావళికి జనసత్త్వము – జాగృతినిచ్చెడి తత్త్వము
తెల్లవాణ్ణి తరిమివేసి – తెలివి కలుగు పాలనతో
తెంపరులై తెరువరులై – తెల్లబోయి చూస్తుండిరి.

సిపాయీల తిరుగుబాటు – సిరివెలుగులు విరియించగ
భగత్‌సింగు ఝాన్సీలు – భారతి నవహారతులయె
అలగాంధీ నెహ్రూలు – ఆజాద్ నేతాజీలు
సమరంలో అమరులుగా – సాగించిరి విప్లవాలు.

శివాజీ అల్లూరిలు – శివమెత్తిన స్వేచ్ఛలై
పరాయీల పాలనకు – బలియై బంధువులైరి
అమరుల ఆశయాల – ఆదర్శముగా గైకొని
అందరు సాగగాను – ఆనందమె భారతికి.

రాజ్యాంగము రాసినోళ్ళు – రామరాజ్యమాసించిరి
అంబేద్కరు ఆశయాలు – అమరంలో సమరమాయె
సిరులెన్నో కూర్చిరిచట – చింతనలను చేర్చిరీ
సంస్కృతిలో భారతులై – లోకానికి వెలుగునిడిరి.

ప్రాజెక్టులు నిర్మించిరి – జెట్టులనే పంపించిరి
సమాచార సాంకేతిక – విప్లవాల విరియించిరి
త్రివర్ణమే సువర్ణమై – తిరువీధుల నాట్యమాడె
వివర్ణమై విధులమరచి – వింతనడవడిగ మార్చెను.

మంత్రులు మారినా – మంత్రాంగము మారలేదు
రాష్ట్రపతులు మారినా – రాతమారలేదిచ్చట
కులమతాల కలవరము – కుంభకోణకుబేరము
ఎలయెన్సులు ఎన్నైనా – రిలయెన్సుకు బలమున్నది.

ప్రతినిధులది రాజ్యమాయె – పరమార్థము దోపిడాయె
ప్రజాస్వామ్యపద్ధతిలో – బందూకుది రాజ్యమాయె
విశ్వబ్యాంకు వినువీధిని – విహరించుట విలువగాను
అమెరికాతో అణుబంధము – అమరముగా భాసించెను.

సరళీకరణములోనా – సరసమాయెగ్యాటు విధము
పేటెంటుల టెంటులతో – పేట్రేగెను అగ్రభూమి.

463

కలాములను కాలరాచి – ప్రతిభలకే పట్టమనుచు
మహిళచట్టమహిమనేమొ – మసినిబూసి మరుగుపరచి
ఆకలిదారిద్ర్యములోనా – అలమటించు జనావళీ
ఆత్మహత్యలాగవుగా – అదియెనేటి భరతావని
మురికి మున్సిపాలిటీలు – కార్పొరేట్లు కంపుగొట్టు
పల్లెవెలుగు వెలుగుదప్పి – పచ్చదనం పుచ్చిపోయె.

కార్పొరేట్ల సెంటర్లో – ప్రయివేట్ల ప్రగతిలో
కంప్యూటర్ కలవరమై – కలకల మీసంధియుగం.

అంతరాలు పెరిగిపోయి – అవాంతరం అతిథిగా
ప్రజాస్వామ్య గుమ్మములో – పరవశమై ప్రగతిదప్పె
రియల్టర్ల రికార్డులఓ – భూమి భుక్తమైపోయెను
చారెడు నేలడుగగాను – వీరంగము మొదలాయెను
భూపోరాటములలో – అంధకారమధికారము
తుపాకులూ లాఠీలూ – తూట్లుపాట్లు తుదిమొదలు
రక్తతర్పణమ్ములోన – రాజ్యహింస అగ్రమాయె
ఉగ్ర అగ్ర వాదముతో – వ్యగ్రమాయె వ్యధల బతుకు
తెలంగాణ తెంపరియై – ఆంధ్రము అతిమధురమై
రాయసీమ రసికతై – సమైక్యతే సరళిదప్పె.

కాపునాడు, కమ్మనాడు – రెడ్డిసమితి రేవడిగా
మాలమాదిగల విభజన – మంచికాదు మనకిపుడు
గాంధీగిరి గమ్యమైన – దాదాగిరి దారివీడు
సత్యాహింసల మార్గము – చిరంజీవమై వెలుగును.

వనరులకిట తరుగులేదు – వాడుకొనుట వాసిలేదు
ప్రతినిధులకు చిత్తశుద్ధి – పరమార్థమె భారతికి
పార్టీలదిపేరుమార్పు – ప్రతినిధులందరువారే
నిధులు నిత్యమైనవేళ – నీతినేతిబీరాయెను.

రిజర్వేషనులలో – వేషములే రివాజులై
ఓట్లకొరకు పాట్లాయెను – జన ఓపిక నశియించెను
అంపశయ్య స్వామ్యమునకు – అంపకాలు అవసరాలు
అన్నీ ఉన్నవికానీ – అమెరిక అల్లునినోట్లో శని.

464

అవినీతి అగ్రమాయె – ఉగ్రవాద ఉరవడాయె
భయంలోన భరతమాత – బిడ్డలు భీరువులాయెను
అహింసయే హింసాయెను – ఆగ్రహమ్ము సత్యమాయె
దీక్షదిటవు కోలుపోయె – శిక్షాయెను గాంధీగిరి.

ముప్పన్నెల జెండాకిట ముద్దుమురిపెమే కరువు
ధర్మచక్రదారిలోన - వక్రగతులు ఎన్నెన్నో
ఆచార్యులు ప్రభవించిన - అందమైన భూమిలోన
అవహేళన మతములకు - అవనతుడే పరమాత్ముడు
పల్లెభారతములోనా - మల్లెలు కరువాయెను
పట్టణాల కెగుమతితో - పల్లె తల్లి చిన్నబోయె
అరువదేండ్ల ప్రాయములో - ఆదరువే కరువైనది
బిడ్డలు పరదేశములకు - భీరువులే తలిదండ్రులు.

సాంకేతిక నైపుణ్యము - సాకారము వికారము
శాస్త్రములూ ప్రగతిగాంచె - శల్యములూమెండాయెను
మనసులు మసిబారిపోయె - మమతమట్టికొట్టుకొనెను
మాన్యములే సర్వస్వము - స్వార్థము నవ సంపన్నము.

భక్తిలేని తనయులకూ - భాగ్యములభియించునా
శక్తిలేని భరతజాతి - స్వేచ్ఛను రక్షించునా
వ్యక్తులు ముఖ్యమ్మాయెను - వ్యవస్థయే వ్యత్యస్తము
అరువదేండ్ల స్వేచ్ఛలో - అన్నార్తుల ఆత్మహత్య.

భూమి భుక్తిపోరులోన - బందూకులు బందికాన
ఆక్రమణ విక్రములూ - మోసానికి మొదటిమార్కు
కాంట్రాక్టుల టాక్టులూ - కంప్యూటరు కలవరములు
సెల్లుఫోన్ల వెల్లువలూ - అణుఒప్పందపు పథకములు.

హైటెక్కుల టెక్కులూ - అంధకార అవధులూ
అరువదేండ్ల ఐదువకూ - అలంకారములు మాయే
కదులుతున్న కలలకూ - కదలలేని కలవరములు.

465

ఉద్యమించరా - ఉరవడించరా
హృద్యమైన భరతదేశ - ఉన్నతికాంక్షించుము
అలనాటి యోధులవీ - ఆశయాల ఊసులనూ
అవగాహన చేసికొనీ - అనుభూతిని పొందరా.

అరువదేండ్ల స్వాతంత్ర్యం – అవహేళన కాకుండగ
రక్షణలో శిక్షణలో – దక్షుడవై చరియించు
అంతరాల భారతం – వింతతీరు విలువలూ
దోపిడీలు దోర్బలాలు – దోహదమై దొరలుచుండె.

పతాకమే పతంగమై – ఎగిరెను ఆకాశమునకు
తంత్రితెగీ తాంత్రికమై – అవనిలోన అవనతమయె
భారతమ్మ భాగ్యమూ – భాస్వంతము అలనాడూ
భగభగ మండే గుండెలు – భాస్వరమే యీనాడు.

హితుల మతుల మమతలన్ని – హీనముల వనములై
నశియించగ కృశియించగ – నవ్యతదివ్యత వీడెను
రాజకీయ రాసభములు – రంకుబొంకు స్వామ్యములో
స్వాతంత్ర్యము స్వగతమై – విగతమాయె గణతంత్రము.

రాజ్యములో రాజ్యాంగము – పూజ్యరామరాజ్యమూ
ఆచరణము పూర్ణమాయె – అంబేద్కరు అవనతుడయె
పార్టీలూ ప్రతినిధులూ – పల్లకీలు బోయీలూ
వల్లకాటి పాలనలో – కాటికాపరులు నేడూ.

వారసులే అభ్యర్థులు – రసకందాయం స్వేచ్ఛ
సామాన్యుని సణుగుడులో – గుణగ్రహణము లేదాయెను
అంగబలం అర్థబలం – అంగాంగము మందుబలం
గూండాగిరి హత్యలే – గుణమాయెను స్వాతంత్ర్యము.

నిరంతరం ప్రవహించే – జీవనదే రాజనీతి
కొత్తతరం కోర్కెలతో – ప్రవేశించ ప్రగతిగాంచు.

466

జనవరి పండుగ జీవితం నిండుగా – జవం నిండించి చైతన్యం చిందించి
కృషి ఫలితం కూర్మి పంటగా పండాలని – మనసున మల్లెల మమతలు విరియాలని.

అసూయాద్వేషాల ఆహ్వానించి అభాసుపాలయ్యేకంటే
అన్యోన్యబంధాల అవనిలోనిండించి ఆనందం పొందు.

మనసులోమాలిన్యాన్ని మసిచేసే అగ్నిలా
దుష్టత్వాన్ని దూరంచేసే కరకు కత్తిలా
ఆశలు ఆశయాలు పండించే అవకాశంలా
మానవత్వాన్ని మృష్టాన్నంలా తినిపించే తల్లిలా
నూతనసంవత్సరం నిత్యనవ్యశోభలతో విలసిల్లాలని

మరుమల్లెల సిరి సొబగులు – తెలతెల్లని విరిగుండెల
విప్లవాల విలువలతో జీవన వధువుకు పట్టువలువలుగా అందగించాలని
సింగారం సిరిగా జీవనం బంగారుమయంకావాలని
ముంగురులు ముద్దుగా జీవితముఖాన్ని అందగించాలని
బంగారు తలపుపంటలు తనువు తపన తీర్చాలని
మురిపెంగా రాబోయే పదిహేడు మధురిమ పంచాలని
ప్రేమానురాగాల పేర్మితో ...

467

వేంకటాద్రి నిలయుడే వేల్పుగా – హరితహారంగా హొయలొలికే
పల్లెపట్టుల పంటలు పరమమై – ఇంటింటా సంతోషం నిండాలని.

పచ్చపచ్చని జీవితాల పరవశించే – మస్తు మస్తుగా మానవత్వం పరిమళించే
మరుభూముల విరులు విరబూయాలని – జీవనపుష్పాలు సౌగంధ్యం వెదజల్లాలని.

సుఖసంతోషాలు సుమసదృశంగా – జీవననందనంలో సౌగంధ్యం విరియాలని
కష్టాల కడలిని ధైర్యనావపై దరిజేరాలని–ఇష్టాలు ఇనుమడించి ఇంపుగా నెరవేరాలని.

కమ్మదనమున – కమ్మరుచులను – కమ్మభావన కమ్మబాటయు
కమ్మచేతన – కమ్మచేతల – కమ్మజీవిత – కమ్మనీదగు

కమ్మతావిని కమ్మభావిని – కమ్మకరుణను కమ్మగురువుగ
కమ్మనీరున కమ్మకంజము – కమ్మనీవుగ కమ్మబతుకున.

468

జనవరి జీవన జవ్వనిగా జాగృతం చెయ్యాలని
నవ్యసుమాల అభినవ నందనం కావాలని
వలపు తలపుల ప్రేమమలుపుల మజిలీగా మారాలని

రివ్వున ఎగిరే మనసుకు రెక్కలు ఆశయాలు అవ్వాలని
శుభకర సుమధుర సౌగంధ్యం నలుదిశలా వ్యాపించాలని
భానుడు భావాన్ని భవితను చైతన్యం చేయాలని
కాంక్షలు కాలంతో కదిలే కరదీపికలయి వెలుగివ్వాలని
క్షరంలేని కీర్తికాంత ఒడిలో వాలిపోవాలని
లుప్తమైన శక్తియుక్తులు లావణ్యభరితమౌతాయని
న్యూఇయర్‌లో న్యూమరస్ న్యూన్యూస్ విని ఆనందం పొందాలని ఆకాంక్షిస్తూ...

నూతన సంవత్సరంలో నిత్యనూతనతేజంతో
నవ్యనాణ్యతా నయనంతో, మనోవాక్కాయకర్మల
అనుగుణ ఫలితం కలగాలని ఆకాంక్షిస్తూ...

జనవరి జనజీవన ఝరిగా – వరికంకుల వయ్యారాల వరపుగా
జనగతిలో గరువం జవ్వనంగా – చిరుపంటల తంబాకుల తామరతంపరతో
కళకళలాడాలని...

469

పసిపాపల బోసినవ్వులు పసదనంగా భావన పండాలని
పరువపు పరువున పయనించే వనిత తలపున నిండాలని
సంసార సారాన్ని సహనంతో సాధించే సహిత గృహం గురుతుగా
బంధం అనుబంధం సంబంధం పెనవేసిన బంధంగా జీవితం సాగాలని
మనసారా కోరుతూ...

కోపం శత్రువుగా కారుణ్యం మిత్రునిగా – అప్యాయత అన్నగా అన్యోన్యత తమ్మునిగా
వినయం చెల్లిగా విభూతి అక్కగా – విజయం నీవుగా జీవితం సాగాలని
ఆకాంక్షిస్తూ...

అంజలించే దేవునితో – ప్రేమపంచే పెద్దలతో
మనసు మనసున మల్లెసిరులై – మనుగడంతా మాన్యమౌనుగ.

ఆలోచన లోచనంగా – ఆవేదన వాదనగా
ఆవేశం భావనగా – మనసుల్లో మధురిమలను
పండించే పరువంతో – నిండించే నిధివీవుగ
జీవితమే సార్థకము...

470

నక్సలైట్లు నక్సలైట్లు – సమానతకు సెర్చిలైట్లు
దోపిడీకి పిడిబాకులు – నల్లధనపుడైనమైట్లు
తుపాకులను చేబట్టగ – పాలక జనులకు తూట్లు
మందుపాతరల పెట్టగ – కామందుల కడగండ్లు.

సైద్ధాంతిక పోరగాళ్ళు – శుద్ధాంతపు శూలములు
పోరాటపు ధీరులు – విప్లవాల వీరవరులు
ఉద్యమాల ఉన్నతులు – ఆశయాల అమరులు
సాయుధ సాహసులు – చావుకు వెరవని వారలు.

నక్సల్ బరియోధులు – సన్యాల్ మజుందార్ వారసులు
భూపోరాటపు భక్తులు – గిరిజనులకు గీష్పతులు
దళితుల షణ్ముఖులు – దరిద్రతకు రుద్రులు
అరణ్యాల ఆర్యులు – వెనుకబాటు వెలుగులు.

సామాన్యుల మాన్యులు – శ్రమశక్తికి రక్తులు
సమానత్వ సారధులు – అర్థసమత కాద్యులు
ప్రజాస్వామ్య పావనులూ – నిరంకుశత్వ అంకుశాలు
దానవతకు దాడులు – మానవతకు మాన్యులు
ఎకెనలభైయేడుతొ – ఎఱుకను కల్గించువారు
పాలకజన దౌష్ట్యాలకు – దౌర్జన్యపు పర్జన్యులు
దేశమాత జాతకమును – మార్చివేయు అర్చులు.

471

నిస్తేజం, నిర్లిప్తత, నిర్వీర్యం – నీరవము, నిర్వేదము, నిద్రాణము
జాతినాడులన్నీ పాతరబడిపోయెను – దేశభక్తి భుక్తితో దేహశక్తి మీరెను
ప్రైవేటుల వేటుతో ప్రభుత భూతమాయెను
పౌరపాలనమునకు లాలనయే కరవాయెను
వారసత్త్వ సంపదయే వారుణిలో కలిసెను
రక్షించెడి అవతారమె రాజ్యమందు భక్షించెను
మాటల హలాయింపు మమతల మరలింపు

ఐకమత్యమనుమాటకు అర్థాలే అతికింపు
శ్రమజీవన మార్గమందు సోమరితనముండెను
బాధ్యత బాధనుపొందగ హక్కులు అందలమెక్కెను
సేవల రంగానికీ చేతనత్త్వముండెను
స్వార్థాలే శోభించగ సేవలు సెలవడిగెను
గతసంగతి గతియించగ మతులన్నీ మడిసెను
మతిమంతులు హితమెంచగ మానవతే పండును
కదలక మెదలక యుండిన కలికే నశ్వరము
కనీసమౌ అదలింపున కలుగును జనఫలితము
ఆర్తుల ఆర్తిని బాపగ కీర్తికరమె మూర్తులకు
అందరిమేలును కోరగ అందమె యీ అవనికి.

భారత జన భాగ్యములో భాగము గ్రహియించుమా
విశ్వశాంతి వినువీధిని విహరించుము మిత్రమా.

472

క్షిపణిశాస్త్రవేత్త – క్షితికి రామరక్ష – మానవతకు నవత – మరోభువికి భవిత
ఆర్తిపొందు జనత – కీర్తిపంచె ఘనత – ఆశయాలకాశ – ఆలోచన కాలంబన
పేదయింటి పెన్నిధి – పెద్దవారలకు నిధి
అత్యున్నత పదవి విధి – అంతరాలకతడవధి
సమానతకు సారధి – సామరస్యముల వారధి
అణుశక్తి అతనిరక్తి – అదియె భారతికి శక్తి
బ్రహ్మచర్య వర్తనము – అణుభేదన కీర్తికరము
అభ్యుదయపు ఉదయము – అరుణకాంతి కిరణము
ఆయుధమే రక్షణము – ఉపయోగము నాశనము
బాధలకది భాగ్యము – భవతారక మంత్రము
అత్యున్నత శక్తికీ – అందరివీ సలాములు
మాత మమత మాన్యతకూ – మనందరివి వందనములు
పితృవాక్యపాలనము – గురువు పరువు గణ్యము
సహచరులకు నమస్సు – సారూప్యపు తపస్సు
ప్రజలకు అభివాదము – పదవి పథము పరమార్థము

మూఢతకే ముకుతాడు – సంస్కారమె సహితము
శాస్త్రపథము శంకరము – అస్త్రమార్గమదిశమము
దేశపదవి ఉన్నతము – వినయమతని శీలము
మాత గులామతడు – కలామతనిపేరు
కలకాలము కలాము – కలియుగ కలలకు వరము.

473

మరణం అరణంగా మనకిచ్చిన వారలు
జీవనమే జనంగా జీవము వదలిన వారలు
రక్తతర్పణముసేసిన – శక్తి ముక్తి ముంగిళ్ళు
ప్రాణం తృణప్రాయమనీ – వదలిన వరమానవులు
బలిదానపు బంధువులు – బందూకుల పరములు
ఆశయాలకే అన్నలు – జనారణ్య జయకాములు
సమానత్వ సమరంలో అమరులైన మర్త్యులు
సామ్యవాద వాదనలో – సహగమనం చేసినోళ్ళు
విప్లవ పోరాటంలో – ఆరాటం చూపినోళ్ళు
అధికార ఖాఖీలచె – ఖూనీయై కూలినోళ్ళు
జనశక్తి ప్రతిఘటన – జాగృతికే ఆకృతి
ప్రజాయుద్ధ సంఘటన – ప్రగతిశీల సుకృతి
తుపాకులూ తూటాలూ – ఉద్యమాన్ని ఆణచలేవు
నిర్బంధము బంధనాలు – నిర్ణయాన్ని మార్చలేవు
చెరసాలలు ఉరికొయ్యలు – చైతన్యము నాపలేవు
కారిన రక్తపు బిందువె – కలకలమును సృజియించును
భూమికోసం భుక్తికోసం – పేద పెద్ద సమత కోసం
ఆయుధమును చేబట్టిన – అన్నలె మన ఆశయాలు
దొరతనము దోపిడీల – పిడిబాకున అణచివేయ
ప్రభవించిన పరములు – ప్రాభవమున విభవములు
అన్యాయము అధర్మము – సమర్థించు పాలకులు
బూటక జనస్వామ్యములో – బుకాయించు ప్రతినిధులు
నక్సలైట్ల వేటపేర – నవ్యపథము ఎన్‌కౌంటర్

పోలీసుల పోకడలే – పోరాటపు ప్రోద్బలము
అన్నలు వెళ్ళిన లోకం – అందరికీ సత్యమే
అందులకే అందరం – అన్నలకై ప్రార్థిద్దాం.

474

తెల్లవాణ్ణి తరిమాము – తెల్లబోయి చూశాము
నల్లవాణ్ణి నమ్మాము – నల్లడబ్బు పెంచాము
ప్రజాస్వామ్యమన్నాము – ప్రగతి‘శీల’కొట్టాము
లౌకికమని విన్నాము – లౌక్యముగా మెదిలాము
సార్వభౌమమన్నాము – సర్వసమత మరిచాము
ప్రభుతరంగమన్నాము – ప్రైవేట్లకు పంచాము
అధికార్లను పెట్టాము – అవినీతిని పెంచాము
ప్రతినిధులనుకొన్నాము – నిత్యనిధులె అన్నారు
ఓట్లస్వామ్యమన్నాము – నోట్లతోటి కొన్నాము
హక్కులనుచు పొందాము – బాధ్యతలను మరిచాము
ఆస్తిహక్కు విన్నాము – వ్యక్తిగతమె కన్నాము
చట్టాలని చేశాము – లొసుగులని విసిగాము
రక్షణమని అన్నాము – భక్షణ చేస్తున్నాము
అప్పులనే తెచ్చాము – తీర్చలేక చచ్చాము
సరిహద్దులు చెరిపాము – హద్దులనే మరచాము
స్వాతంత్ర్యము తెచ్చాము – స్వార్థమునే పెంచాము
అవినీతిని చూశాము – విశ్వవ్యాప్తమన్నాము
రైతురాజ్యమన్నాము – వెన్నెముకను విరిచాము
హైటెక్కని అన్నాము – హైరానా పడ్డాము
సంస్కరణని చెప్పాము – సంస్కర్తల మరిచాము
త్యాగులనే మరిచాము – భోగాలను కోరాము
భరతమాత మరిచాము – బాధలనే పొందాము.

475

అన్నలు మిన్నలు – అరుణారుణ దీప్తులు

490

తిరుగుబాట్ల తీర్థులు - విప్లవాల వీరులు
ఆశయాల అమరులు - త్యాగానికి యోధులు
నీతినియమ నీరధులు - నిర్మల భువి వారధులు
సామ్యవాద సాగరాలు - ప్రజాయుద్ధ సారధులు
అంతరాల నణచువారు - అందరొకటె అన్నవాళ్ళు
అరణ్యాల నివాసులు - ఆయుధాల పట్టినోళ్ళు
గ్రామజనుల కభిమానులు - గమ్యమేమొ ఎరిగినోళ్ళు
పీడితజన ప్రేమికులు - తాడిత జన రక్షకులు
హరిజనులకు అధినాధులు - గిరిజనులకు గీష్పతులు
సృష్టి సమతకోరినోళ్ళు - సృజనకు నవ సుందరులు
అంకితమున కంకములు - ఆదర్శపు భావనులు
శ్రమశక్తికి శుక్తులు - ధనరక్తికి ముక్తులు
రక్తార్పణ రమణులు - స్వాతంత్ర్యపు శోధనులు
విద్యాధిక విబుధులు - అధర్మాల దమనులు
ఎన్‌కౌంటర్ బలిదానులు - కూంబింగుల కూలినోళ్ళు
నిస్సహాయ నిశీధిలో - ఆయుధమే ఆధారము
మార్పుతీర్పు మాన్యతకై - యతనమెయీ ఉద్యమము
ఊపిరులే ఆగినా - ప్రాణములే పోయినా
ఆగదుయీ ఆరోహణ - సాగదుయీ ఆహరణ
ఆక్రోశించిన హృదయం - ఆత్మరీతి మిగులును
జనియించిన వారసులకు - జాగృతిగా ప్రభవించును
పోలీసుల పోకడలూ - రాజకీయ రాక్షసాలు
రాజ్యంలో సాగవింక - ఆజ్యంలో కాలిపోవు
అన్నల ఆశయాలు - అమరభువికి సోపానం.

476

నాగరికత నయనాలే - ఎఱ్ఱబారుతున్నవి
మట్టిఊడజనసంద్రం - మీరిమీరి పోతున్నది
ఆహారం విహారం - అందనిదై అందలాన
అమరికలో అరమరికై - ఆసురమే నిండుతుండె.

అసూయలే సులువుగా – అందరినీ ఆక్రమించె
కోపాలూ ద్వేషాలూ – కోరకుండ ప్రవేశించె
నగరాలే నయగారం – పల్లెలేమొ వెలిగారం
మధ్యపట్టణాలలోన – మందహాస మాధుర్యం.

కల్తీలే శాల్తీలుగ – కర్మలలో మర్మమాయె
మందులేని జబ్బులతో – మనుగడయే కడకొచ్చె
ఎవరువారు యమునతీరు – పరులను పట్టించుకోరు
పరమార్థం తెలియలేరు – స్వార్థానికె సొబగులు
పరుషమైన మాటలతో – మనసును నొప్పించువారు
ప్రతిపనికీ లాభాలని – పరార్థమును కాంక్షింతురు
పంచభూత కొనుగోళ్ళు – కోరికలతొ కొట్లాటలు
పైనక్రింది భేదములతొ – ఛిద్రమైన జనజీవన.

భయం భక్తి బాధ్యతలు  కలవుకాని తెలియరావు
భవబంధపు బంధనలో – ఇంధనములే అందరు
గ్రహాలనే జయించినా – ప్రగ్రహాలు మానలేరు
అంతరాలు శోధించిన – ఆత్మప్రత్యయం కానరు.

కలియుట మాట్లాడుకొనుట – కల'వరమే' కలరవములు
సంస్కృతి సంస్కారం – సంగ్రహముగ మిగిలిపోయె.

477

కలవరాల దేశంలో – కలవరమే కనుమరుగు
వరవర్ణిత రాజ్యంలో – వాసివరస తరిగి విరుగు
స్వార్థాలే స్వాగతించె – పరార్థమే గతియించె
పరమార్థం ఫలంలేదు – పావనతే పరమగతి.

భయంబాధ భావనలో – లయంలోని లాస్యమాయె
ఎపుడెయ్యది జరుగునో – ఎఱుకమరకలగుచుండె
కులమతాల కుళ్ళులో – కూరుకొనెను కుధరము
పేద పెద్ద పేరులతో – పేలవమే జనరాజ్యము.

భిన్నత్వం ఛిన్నమాయె – ఏకత్వం ఎదలు విడిచె
భాషప్రాంతభాగ్యములై – యోగ్యత కరవాయెను
అమాయకం ఆవరించి – జ్ఞాన జాణ చెడిపోయెను
తెలివికలుగు వారలంత – తెంపరులై తిరుగుచుండె.

ఆత్మహత్య హత్యలూ – అతిగమతులు చెరచుచుండె
పావనమౌ జీవనమే – వనములోని వగపాయెను
మతం మాదకమ్ములో – హితం హీనమాయెను
రాజ్యాలే రావణమై – పూజ్యమాయె శాంతికాంతి.

కోరికలే కొండలెక్కి – అదృష్టము లడుగంటె
అదృష్టము దుష్టమయి – అవమానమె మానమాయె
కోట్లకొలది దేవుళ్ళకు – ఆలయాలు కరవాయెను
ఆలయంలొ దేవతలకు – నిత్యపూజ నీరవమ్ము.

మాదకముల ముదములో – మధురాక్షసులెందరో
సామాన్యుల జీవితముతొ – సరదాగా ఆడుకొంద్రు
అద్రసున్న అవినీతిని – అదుమలేని అధిపతులు
లంచమున్న స్థలములను – ముంచలేని ముచ్చట్లు.

అన్నీతెలిసినవాళ్ళే – అందలాన కూర్చుండిరి
ఏమీ తెలియని వారలు – ఎదురుతెన్ను చూచుచుంద్రి
మాయజగతి మనుజులంత – మంచి మమత తెలియగాను
అన్యోన్యత పెచ్చరిలగ – కలరవమే వరమగును.

478

శివయోగము చింతించర – భవబంధము వీడర
అంతరాలమరచిపోయి – వంతలన్ని విడువర
నిర్వాణమె నీ సర్వం – గీర్వాణం నించరా
పర్వమైన శంభునితో – సర్వము అర్పించరా.

పంచాక్షరి అక్షరము – క్షరముకాదు ఓంకారము
పేదపెద్ద ఎవరికైన – నాదమె నయగారము

గుణములేని రూపులేని – గణములున్న ఉన్నతుడు
సర్వరూపసారమైన – సహకారపు సదయుడు.

పాపాత్ముల ఆత్మలన్ని – అభ్రమువలె పరిశుభ్రం
పుణ్యాత్ముల జీవితాలు – పూజితముగ పరమార్థం.

మంచిచేయు మహనీయుడు – మానవాళి వరణీయుడు
గ్రహగతులకు నియామకుడు – లోకాలకు లోహితుడు
కైలాసము నిలయంగా – తాండవించు తారకుడు
హిమాలయం ఆలయంగ – హితకారుడు జయశీలుడు.

పార్వతియే సగభాగం – గంగమ్మయె సర్వాంగం
వాగర్థము వరపుగా – ఐక్యమైన అంగాంగం
ప్రమథగణం ప్రవరమై – ప్రకృతినే శాసించగ
సర్వశక్తిసవనంగా – సహకారమె ఆకారం.

కథలలోన వ్యథలలోన – సదయుడుగా సహకరించు
పురాణాల కావ్యాలలో – పూజ్యుడైన మహనీయుడు
శివశివయని అనగానె – శివముల వర్షము కురియును
రుద్రయనగ భద్రములే – ఛిద్రములే తొలగిపోవు.

479

లయకారుని లాస్యమిది – భయబాధల భాగ్యమిది
నటరాజుని నయనమిది – నవజీవన భవనమిది
ఆక్రందన ఆకృతిగా – అందిన అవతారమిది
ఆవేదన సుకృతిగా – అమరిన ఘనమహిమ ఇది.

నవభక్తుల సేవించగ – భవమే జనబాంధవ్యం
తీర్థములను దర్శించగ – స్వార్థమె యిట మటుమాయం
ఆ సేతువు హిమాలయం – ఆలయాల సమూహమే
అన్నింటిలొ అందగించు – అమరనాథుడవునీవె.

లింగరూప ధారివైన – అంగాంగము సుందరమే
శంకర నీనామంలో – శంకరమే శాశ్వతము

కామక్రోధలోభములు – కఠినంగా అణచివేయు
శక్తిరూప ప్రభవుడవు – శరణార్థుల కరుణించు.

ద్వాదశలింగములలో – అద్వితీయ మహిమతో
అలరారెడు అభవుడా – భవబంధము విడిపించు
వైరాగ్యము రాగముగా – అనుభవమున అందించుము
అనురాగము విభవముగా – అందరిమది కొలువుండు.

నీ శక్తులు యుక్తులు – నిజముగ ప్రకటించగా
జనజయమే తథ్యము – జవసత్త్వము సాధ్యము
పార్వతమ్మ ప్రభలతో – గంగతల్లి గర్వముతో
పర్వమైన శర్వుడా – పరమార్థము తెలుపుము.

వైవిధ్యపు జగతిలో – వైరాగ్యపు సుగతిలో
ఆశీర్వాదమునీదే – కరుణకలిత కర్మనీదె
నీ శూలము సుందరమై – నిత్యానిత్యము తెలపును
అనిత్యమౌ అసురాళిని – అంతరింప జేయువాడ.

ఢమరుకమే నాదమై – వేదమహిమ తెలుపగా
అక్షరమే మూలంగా – అవతరించె భాషలన్ని.

480

శాంకరీ! శాంకరీ! శక్తినిచ్చి మముబ్రోవుము
భక్తి రక్తి నిను భజనలు జేతుము ముక్తినిచ్చి మము కాపాడుము
దుష్టశిక్షణకు దుర్గవైతివి – శిష్టరక్షణకు కాళివైతివి
అవతారములే అవతరింపగా – అనితరసాధ్యము నీత్రోవ
పాపపుణ్యముల పావనతే – పరమార్థముగా పరవశింతువు
భవసాగరమును భరింపలేక – బాధలలోనా పలవరించితిమి
సాగర వరణముచేసి – సాగించుము సవ్యముగా
పుణ్యులు పూజింపగా – ధన్యుల జేతువు తల్లీ
పాపులు పలవరింప – పరతత్త్వం దెల్పుదువు
అందమైన నీరూపం – అందరికీ అసాధ్యము
అవనిపాలనమ్ములో – అవతారమె సుతారము

పేరులెన్ని పిలిచినా – పేలవమే కాదు తల్లి
ప్రాకటముగ మన్నింపగ – మా తల్లీ! మమకారమె
తల్లడిల్లు తల్లులకూ – తరగని ఆస్తివి నీవు
కోర్కె కోరు కొమరులకు – కొంగు బంగారువే తల్లి
అమరమునే అందించగ – సమరము సేతువు
అందలములు అందుకొనగ – అందరికీ సహకారం
సమత సరళి దెలుపగాను – మమత మధువు పంచు జనని
అభయం అభినందనే – అందరికీ అందుతుంది
ఆశీస్సుల మహిమతో – యీ భువియే నందనం
ఆశయాల సరసులో – తేలియాడు నీ భక్తుడు.

481

విలువలు విగతించె – విబుధుల మది కలవరించె
పుట్టుకనిచ్చిన తల్లిదండ్రులకు – పూజ్యత కరవై పలవరించె
గురువులలో గురువంతా – గరువముతో గడచిపోయె
బంధుల బంధనమున – వందనముతో అందమాయె
మిత్రత్వము శతృత్వము – మితిమీరగ మిథ్యాలోకం
యోగమంత అయోగమై – అపయోగం అవతరించె
మాటమంచి మరణించె – మమత సమత అడుగంటె
డబ్బుకుదాసోహమనే – డంబాచారం ముదిరిపోయె
ఆస్తుల అర్జనలో – అపమార్గం అనుసరించె
మోసం మోదం మోహంతో – మేదిని మదినే అదలించె
అంతా మిథ్యయనే – అవలక్షణ ముదిరిపోయి
సోకు స్వార్థమాయెను – శోభ శోకమాయెను
అంతరాల వింతతీరు – అంతరముల బాధించెను
చింత వంత చిందిపోయి – చిగురించెను వంతచెట్టు
భగవంతుని భాగవతము – భవమందున భాగ్యహీన
రామ రామ రామయనే – రాజసమే రసాభాస
రాజకీయ రభసలో – రాసభములు మనసులు
అసత్యాల అసత్తులు – అనుమానపు అధములు

ఆశయాల శయనింత - ఆవేశపు అలమటింత
అందరాని అధమత్వం - అందరిదీ అంధత్వము
కలలలోన విహరింత - కలకాలపు కలవరింత
వలువలు వీడిన విలువల - చలువలోన చప్పరింత
కమ్మదనం కంపులోన - ఇంపు సొంపు ఇగిలింత
మానవత్వ మంచెపైన - దానవత్వ దాపురింత
రాక్షసత్వ శిక్షలోన - దైవత్వపు పలవరింత
భయంలేని భవంలోన - శుభం శూన్యమాన్యతయే.

482

అవతారమూర్తికీ అరుదైన దండాలు - ఆదిదేవీ నీకు ఆర్తితో దండాలు
కాళికా దేవికీ కమనీయ దండాలు - మధుకైటభారికీ మాన్యమౌ దండాలు
యోగమాయా నీకు యోగ్యమౌ దండాలు - అసురమర్దిని నీకు అందమౌ దండాలు
నారాయణీ నీకు నవ్యమౌ దండాలు - దైత్యాపహారిణీ దివ్యమౌ దండాలు
మహిషమర్దిని నీకు మరువమౌ దండాలు - దుర్గమాతల్లికీ సర్గమౌ దండాలు
ఆనంద దాయికీ సానంద దండాలు - శుంభనాశిని నీకు శుభ్రమౌ దండాలు
సరస్వతి దేవికీ సరసమౌ దాండాలు - శాకంభరీ నీకు శక్తితో దండాలు
అన్నపూర్ణేశ్వరీ అధికమౌ దండాలు - దుర్గమసంహారి సర్గతో దండాలు
మాతంగి తల్లికీ మంచివౌ దండాలు - పార్వతీమాతకూ పర్వమగు దండాలు
భ్రామరీ రూపకీ భాగ్యమౌ దండాలు - పాపసంహారికీ పావన దండాలు
రాక్షసంహారికీ  పావనదండాలు - అవినీతి హారిణికి నియతితో దండాలు
ఆరోగ్యదాయికీ అమరమౌ దండాలు - రక్తదంతీ నీకు సక్తమౌ దండాలు.

483

అవినీతిలో యీ దేశం - అందలాన కూర్చున్నది
దించుదిటవు కల్గగా - దివ్యమైనదీ భువియే
కోట్లకోట్ల సొమ్మంతా - కోర్కెదీర అపహరించి
సుఖవంతపు జీవితాల - సుందరులౌ చుండిరిచట
ఆక్రమణల విక్రములూ - ఆశల శలభాసురులు
ప్రజాసొత్తు దిగమ్రింగి - పరములుగా వెలుగొందురు

మాయలోనముంచేసే – మాదకాల మింగేసీ
మంచినీటముంచేసీ – మానవతను చంపుదురు
నగరాల్లో భూమినంత – నమలకుండ మింగేసి
పట్టణపరిసరాలనూ – పట్టకుండ కాజేతురు
కార్యాలయములలోనా – కార్పణ్యపు లంచములు
అధికారుల అవధులూ – అసలేమియు కానరావు
కదలని కదిలేఫైళ్ళ – కథలు వేరు వ్యధలు వేరు
ప్రజాసేవ పరమార్థం – స్వార్థానికి శోభనం
అడ్డు ఆపులేకుండగ – అడ్డదిడ్డముగ పెరిగి
అడ్డగోలు వర్తనలో – అధికారులె గణ్యులు
రాజకీయ రాసక్రీడ – రహిజనులకు గుండెకోత
రామరాజ్య కాములకూ – కామనలో నైరాశ్యము
ప్రజాస్వామ్య పద్ధతిలో – ప్రవరమైన దేశమనీ
సేవకొరకు అధికార్లు – సెలవులోన జనసేవన
దినపత్రిక చూడగా – ఏ టీవీ తిలకించిన
కథలత్రాడు కంతులేదు – కథనములే వ్యధలాయెను
మరచిపోవు మేధావులు – మాన్యతవీడిన వారలు
గుర్తుకలుగు గురువులు – దేశభక్తి జాగృతులు
సామాన్యుల గుసగుసలో – సవనం అవినీతిపై
తిరుగుబాటు తప్పదులే – తీరుమారిపోవునులే.

484

అరిషడ్వర్గాలన్నీ అవతరించెనీ భువిలో
అంతరాలు వింతగాను ఆవరించె జనులలో
కామం కనుమూసింది కలవరాల నిలిపింది
లోభం లోకంలోనా లోలుపతల పంచింది.

క్రోధం రోదించింది – కోపంతో శాపంతో
మోహం మదిమోదింది – మోదం కనుమరుగైంది
మదము మదిని లాగింది – హ్రదమె జీవమయ్యింది

మాత్సర్యము సర్వమై - మమకారం దాగింది.

లోకంలో నరకాలకు - వరకాలం వచ్చింది
మమతలేని మనుషులంత - మృత్యువునే కోరుతుండ్రి
పాపమేమొ పరవశించి  పుణ్యం కనుమరుగైంది
పాపపుణ్య ఫలములనే - గణియించుట గణ్యమాయె.

కామక్రోధలోభములనె - మూడునరకములు ఉన్నవి
వదలుకొన్న వరులందరు - వంచనలో పడబోరు
దేవతలెవరో లేరుగ - నీవె నిత్య దేవుడవు
రక్కసిగ వెక్కసమై - రమ్యజీవి నీవుగా
అంతరాన్ని తరచిచూడ - వింత తీరు అగుపించును
నీ ఆత్మయె శత్రువు - నీ ఆత్మయె నీ మిత్రుడు
బాంధవ్యం నీతోనే - బాధలన్ని నీవేలే
భావమందు సర్వస్వము - భాగ్యమంత నీకర్మము
మంచి మించి మరిలేదు - వంచనకే వసుధలేదు
నిన్ను నీవు గమనించు - నిగమమె నీ ఆంతర్యము.

485

వైరాగ్యం వైభవం - రాగమె జనబంధనం
బంధనాల బంధువుగా - బాధలనే పడబోకు
తల్లితండ్రి తపనపడీ - పెంచిన యీ తనువును
స్వార్థమునకు వాడబోకు - పరార్థంలో పరవశించు.

బాంధవ్యం వెంటరాదు - అనురాగం అసలు లేదు
జగమే జనమాయగా - జతులు మారు మతముగా
పోయేవారందరూ - పోకడలే తెలియవు
రాకడ పోకడలన్నీ - రహితెలియును దేవునకే
వల్లకాటి వరుసలోన - ముందు వెనుక తెలియదు
పోయినోళ్ళు గమనిస్తూ - తనపోకను గాంచలేరు
ఇంద్రజాలహితముగా - ఆడించెడి ఆటగాడు
అవనిలోన లేనెలేడు - ఆవలనే కలడందురు

జరామృత్యు జావళీగ – జనజీవన ముందును
కాలపురుష కలవరమే – జనవరమై జయమందును
సింధువులో బిందువుగా – తెలివిలేని తెంపరివి
నీశక్తి తెలిసికొనుట – నీతరమా తెలుపుమా
రోజ రుజలు ఉజ్జ్వలమై – తనువునంత తరిగివేయు
శ్మశానమే శయనంగా – జీవితాలు గల్లంతవు
ప్రాణశక్తి పరమార్థము – గ్రహియించగ శక్తుడవా?
గ్రహముల ఆగ్రహములో – గరువమంత వీడిపోవ
మమకారం మసిబూసి – సహకారం సవదరించి
మహాకాలు రూపమై – మడియుట తప్పదుగా
ఒంటరిగా వచ్చినావు – తుంటరివై తూలినావు
ఒక్కడివే వెళ్లతావు – చిక్కదు నీ చిరునామా
రారెవరూ నీకు తోడు – రాక్షసులో దేవతలో
పోకడనువు తెలియగానె – రాకడ కంతము లేదు
బాధలన్ని భాగ్యమనీ – బ్రహ్మచారి నీవుగా
బాధ్యతలను మరువుము – భావము నీకపుడెరుక
రాగమంత పరాగమై – అనురాగం విరాగమై
అవనిలోని వైరాగ్యం – అన్నిట తలమానికం.

486

లయకారుని లాస్యం విలయాన్ని సృష్టించింది
'కుంభకోణం' కూరిమి విడిచి మార్మికత దర్శించింది
ముక్కుపచ్చలారని ముద్దుబిడ్డల్ని బలిగొన్నది
అక్షరాస్యుల ఆస్యములన్నీ అంత వికృతిగా మారాయి
అమ్మనాన్నల అనుబంధానికి సుదూరమై వెళ్ళిపోయారు
గురువుల గుంభనలో బడులు బాధలని నిలయాలైనాయి
ప్రైవేటు సంస్థల వ్యాపారానికి పరాకాష్ఠ యిది
నాయకులు చేసే కుంభకోణాల లో ఇది ఒకటి
మాదకాల మత్తులో మహిమాన్విత ఔతుంది సరస్వతి
స్మశాన వైరాగ్యం స్వాగతిస్తూ గతాన్ని మరుస్తుంది

విలువైన జీవితాలు విగతించిన ధర్మానికి సమిధలు
అగ్నీ! ఆక్రోశిస్తున్న పసిబాలలకు ఆశ్రయమిచ్చావా?
అమ్మనాన్నలకు టాటా చెప్పి మళ్ళీ తిరిగిరాని లోకాలకు వెళ్ళారు.
పరమశివుని గరళకంఠం పరవశించిందా?
మూడో నేత్రం ముగ్ధమై అందరినీ బలికోరిందా?
రాజకీయాలు రాజిల్లి చిన్నారుల బ్రతుకు బండలైంది
ఓర్చుకోలేని గాయాలతో మార్చురీలోనికి ప్రవేశం
మృత్యువు ముగ్ధమై మురికి ప్రపంచాన్ని చూపింది
కలకాలం వెలగాల్సిన జీవితాలు కలవరపడ్డాయి.

487

వసంతమే సంతగా – వాకిటిలో వాలెను
సంతోషము సరిగమలై – సరాగమే నిండెగా
ప్రకృతియే పరవశించి – సుకృతిగా మారెగా
ఆకృతియే ఆనందము – అందరికీ పంచెగా.

వర్షము హర్షమునించీ – చైతన్యము నింపెగా
చేతనలో చెలువంతా – బలిమిగా మారెగా
అమర తరువులన్నిగూడ – అరమరికలు లేనివై
పూరెమ్మల పుప్పొడులతొ – పూజనీయమాయెగా.

పంచమస్వర నిస్వనమున – పరవశించుకోకిలలే
అరుణారుణ వరణములో – ఆలపించె అపర శ్రుతులు
శార్వులతే చెలువుమీరి – భూమి పులకరించెగా
అందరాని అందములే – అందరికీ అందెగా
యువజంటలు విహారము – భవకేళీ సుఖములో
భావములే అనుభవమై – అమరము కనువిందుగా
అంతరాలు లేని జగతి – వింతయైన విజయములో
విలువల కలువలుపూసి – కలవరమున కలవరించె
నవ్వుల పువ్వులు విరిసీ – దివ్వెల దివులనుతాకి
దివ్యమైన ఆనందము – దిగంతముల నిండెగా

వలపు తలపు లొకటియై – లోకమె ఒకలోలకమై
కాలమంత కరిగిపోయి – కాంతులు విరియించెగా
దేవాదుల దేవిడీగ – దివ్యభూమి దిటవుగా
మానవాళి మనుగడకే – మహదాశయ మమరగా
నదులన్నీ పరవశించి – నవ్యతనే కొనివచ్చీ
భూమి సస్యములు పంచి – భువనమోహనమ్ముగా
కాలమనే కడలిలో – సుడులురేగి విడివడగా
వసంతమే విషాంతమై – వసుధ సుగతి వీడగా
దేవతలెవరో ఒక్కరి – దేవురింత వలనగాని
సంతసాల వసంతము – సాగివచ్చు మధురిమగా.

488

సామ్యవాద సమరంలో అమరులైన మానవులు
అధికారపు ధిక్కృతిలో వికృతులై విలువొందిరి
అక్టోబరు ఆశయాల విక్టరీకి విబుధులు
అవకాశం అందిందని ఆగ్రహంలొ గ్రహపతులు
అరణ్యాల రణంలో అసువులు బాసిన వారలు
తుపాకీల తూటాలతొ తూలిపడిన చలాకీలు
మానవహననంలోనా మాన్యతలే తెలిసినోళ్ళు
మానవత్త్వ మహిమలోని ఆంతర్యం తరచినోళ్ళు
అనురాగం అభిమానం అందుకొన్న అడవి వీర్లు
హరిజన గిరిజన జనులకు అహర్నిశం సేవకులు
దళితజాతి దారిచూపు దాక్షిణ్యపు పుణ్యులు
జామీనుల జమీనులను జడిపించెడి జాతిజనులు
ఆయుధాల ఆక్రందన అడివిజనుల సంక్రందన
నేస్తమైన న్యాయానికి ప్రాప్తమైన పరవశులు
దారిదప్పు ధర్మానికి దయనీయత పంచెటోళ్ళు
అహంకార అధికారపు అణచివేత తెలిసినోళ్ళు
మాతృత్వం మమకారం మరచిపోయి మనెడివారు
దాతృత్వపు దరణికీ దారిజూపు జయపుత్రులు

అరణ్యాల వాల్మీకులు అటవులకే అధివ్యాసులు
సాహసాల కర్ణులు విలువిద్యకు వెలుగులు
అన్నలలో మిన్నలు సామ్యవాద సెర్చిలైట్లు
సమసమాజ టార్చిలైట్లు  సమజీవన నక్సలైట్లు.

489

రాజ్యాంగపు అధికారం – రణరాజ్యపు ఆయుధం
విలువ విగతమైనట్టివి – విబుధుల మది విషయాలు
చర్చలలో సూత్రార్థం – పాత్రమైన పరమార్థం
మంత్రిగారి మనసులో – మసకబారి మాలిన్యం.

ఎవరిబలం ఎంతుందో – తెలిసికొనుట తెలివియనీ
ప్రభుత్వము పోలీసులు – పరవశాన ప్రవరులైరి
ఆయుధాల దించివేత – అసలైన విషయమనీ
ఆంక్షపెట్టి కాంక్షసేసె – నిజమైనది అంతరం.

భూమిదున్ను బుగతలకూ – భూమి పంపకమ్మనీ
సిద్ధాంతం సేసినారు – రాద్ధాంతమె రచ్చలో
జమీందార్ల తరాలకూ – పంపకాల అంపకాలు
చట్టపరిధి దిట్టమైన – సాగుదలకు ఆగుదల
కమీషన్ల మిషనులో – కలవరమే జనవరము
తాత్సారపు తంతులతో – తరియించును అధికారం
పంపకాల కలకలం – ప్రయోజనం పరార్థము
ఎదురుకాల్పు నిల్పివేత – ఖాఖీలకు కలవరమే
తలవెలలకు తరిమివేత – నక్సలైట్ల నవ్యబాట.

విశ్వబ్యాంకు విషయానికి – విబుధుల దూరపుమాట
పోరుబాట పోరగాళ్ళ – పోకడలే వింతైనవి
రాజకీయ ఖైదీలని – గుర్తించగ గరువము
ప్రజాపోరు ప్రగతికనీ – ప్రతినిధులే పరవశము.

నల్లదండ్లు నయీమ్‌లూ – నాగరాజు టైగర్లూ
ఒకరివంటె ఒకరివనీ – పోలీసుల పరిభాషలు

హోము ముఖ్యమంత్రులు – ఒకరొకరుగ వాదులాట
తాత్సారం తగదనీ – నక్సలైట్ల హెచ్చరిక.

ఏడుసూత్ర ఏడుగడా – సఫలమైన సరళియనీ
ప్రభుత్వము నక్సలైట్లు – పారవశ్య ప్రవరులైరి
మండిన హృదయంతో – దండన నెదిరించగా
దారిలేని అన్నలకూ – అరణ్యమే దారైనది.

490

సీ. ఖండాంతరములందు ఖ్యాతిని చాటిన మనవివేకానందు మహిమ దలచి
ఆజాదుహిందఫౌజు ఆవిశ్వరూపాన నిల్పిన నేతాజి నీతి దలచి
విశ్వకవీంద్రులు విలువైన భారతిన్ విజయముగాంచిన విద్యదలచి
కన్యకుమారియు కాశ్మీరు కలిమిని ఒకటిగ నెంచెడి ఓర్పుదలచి.

తే.గీ. భరత రాజ్యాంగ గరిమను బాగుగాను – ఆచరణమున నందరు అందమొంద
పాలనమ్మున ప్రతినిధుల్ ప్రగతిగాంచ – ప్రేమకలుగును గణతంత్ర పేరునందు.

491

సీ. గాంధీలనెహ్రూల గాడ్సేల గన్నట్టి ఘనమైన భారతి గరిమయేమొ
మావోలు ఉల్ఫాలు మగటిమి మిలిటెంట్లు తిరిగెడి దేశంపు తెగువయేమొ
ఎన్డీఎ యూపీఎ ఎలయెన్సుయేదైన పార్టీలు మారని ప్రగతియేమొ
అమలుకు నోచని అతివేల చట్టాలు కలిగిన ఇండియా కాంతియేమొ.

తే.గీ. అరువదేడులు వచ్చిన భరత జనని – గాణతంత్రపు గుణమున గతులు మారె
ప్రజల స్వామ్యము ప్రతినిధి పాలనాయె – పౌరుడాలెమ్ము కాపాడ భరతమాత.

తే.గీ. గతము దలచిన జనులకు మతులు పోవు – వర్తమానము గాంచిన వాసిలేదు
భవిత బాగగునను మాట భ్రాంతియేమొ – తంత్రమాయెను గణతంత్రయాంత్రికమ్ము.

492

సీ. ప్రాణాలు మానాలు ఫణముగా నొడ్డిన మనపూర్వనేతల మహిమ దలచి
అల్లూరి ఝాన్సీయు అలభగత్సింగుల ఆశయ దీప్తుల నాలకించి
అంబేద్కరునిమతి నాలించి పాలించి రాజ్యాంగ స్ఫూర్తిని రంగరించి
పేదపెద్దల మధ్య పెరిగెడి అంతరాల్ అంతము చేయగ పంతమెంచి.

ఆ.వె. దేశభక్తితోడ దేహము పులకించ – భావిభారతంపు భాగ్యమెంచి
మానవీయ విలువ మహిమనుగమనించి – ధన్యులగుడు మీరు మాన్యులార.

ఆ.వె. రాజకీయమేమొ రభసగమారెను – రాసభముల రీతి రాజులాయె
మోసగాడు యిచట మొనగాడు ఘనుడగు – దోపిడీకి నెలవు దోర్బలమ్ము.

తే.గీ. నీతి అవినీతి మధ్యన నిత్యమిచట – పోరు జరుగుచును నుండెను పోడిమి గను
మంచి చెడులను తెలియగ మహిమతోడ – మెలగుచుండగ భారతి మేలుకొలుపు.

తే.గీ. వృద్ధిసాగెను దేశాన వృత్తముగను – సాధకులు నేడు వృద్ధులై బాధితులుగ
వినుత సంస్కార భావాల ఘనత తోడ – బోధచేయగ వినుడయ్య యోధులార.

493

సీ. నేరాలు ఘోరాలు వేరైన క్రైములు వేకువవన్ రాత్రుల వెలుగుచూచు
సత్యశోధనమున నిత్యము సాగెడి సాహసవీరులు సమయుచుండ్రు
ముడుపులు గ్రహియించు ముద్దగు ప్రతినిధుల్ ఏ శిక్షయునులేక యెసగుచుంద్రు
సర్వసమానత సార్వభౌమత్వము రాజ్యాంగ పుటలలో రమ్యమగును.

తే.గీ. న్యాయదేవత నెవ్వగ న్యాసమాయె – నల్లకోటుల నాణ్యత తెల్లనాయె
తీర్పు తీరులు వైరుధ్య నేర్పులుగను – ధర్మదేవత భారతిన్ ధ్రఢిమ విడిచె.

ఆ.వె. అంతరంగమందు అమెరిక యుండెను – ఇండియాకు మనసు ఇంపులేదు
డాబు దర్పమంత డాలర్ల మోజాయె – వెళ్ళగానె తెలియు వెలితియేదొ.

ఆ.వె. జన్మభూమియందు ధన్యతనందగా – కులము మతము జాతి కూహకముగ
తలచి తనియుడయ్య తపనను దీర్చగా – జనని జన్మభూమి గణ్యమగును.

ఆ.వె. మంచి మంచి పంచు మమతను పెంచును – మంచి ఎంచగాను మహిమనిచ్చు
మంచి మనుజులకును మాన్యతనందించు – మంచి మంచి నించు మహిని మించు.

494

తే.గీ. ఎన్నొ ఘనతలు గాంచిరి ఎఱుకతోడ – వేత్తలందరు భారతిన్ వెలుగుపంచె
విశ్వ వినువిధీయందున విజయమొంద – సిద్ధమై యుండె సిరులను ఇద్ధముగను.

తే.గీ. విశ్వవిఫణికి చేరువ విలయమాయె – దేశములమధ్య స్పర్ధలు దీనమాయె
స్నేహభావముతోడుత సేదదేరు – దేశమాయెను భారతి దివ్యముగను.

తే.గీ. పెరిగె సంపద ప్రేమలు తరిగిపోయె – కరడుగట్టిన హృదయాలు కరగకుండె
ద్రోగుచేయుట కోర్కెయై ప్రోద్బలమున – నీతి దప్పిరి ఘనులిట నియమమలర.

తే.గీ. పల్లెపల్లెల మల్లెల జల్లు కురియ – స్వార్థమును కొంత మానగా సార్థకమ్ము
వృద్ధి సాధించ బుద్ధులై బద్ధులుగను – మంచి మమతల సమతల మహిమగనుడు.

ఆ.వె. ఉడుకు రక్తమేమొ ఉరకలు వేయును – ఎఱుక మఱక లేక ఎదలు విరియ
కృషియు శ్రద్ధతోడ కూరిమి కలుగగా – పట్టుదలయు మించ పావనమ్ము.

495

ఆ.వె. విద్యనేర్చుకొనుట విద్యార్థి ధర్మము – గురువు బోధలందు గురుత గాంచ
జ్ఞాన గరిమ మించ ధ్యానము నుంచగా – విద్య యోగమగును విలువతోడ.

ఆ.వె. తనదు సృజనతోడ తామెప్పునందుచు – పరుల మనసుదోచ ఫలము గలుగు
శక్తి చెలిమి మీర చెలువము కలుగును – కీర్తిమించు జగతి కీర్తనముల.

ఆ.వె. యువత భవితయందు ఉన్నతిగనరాదు – ధర్మకర్మలన్ని దారిదప్పు
నిత్యనియమ సహిత సత్యమ్ము గాంచము – కాలగతిని మార్చ కలిమి కలుగు.

తే.గీ. టీవి సినిమాల చిత్రాలు రీవి కావు – అనుకరణమున అసలైన ఆస్తిలేదు
ధరణి ప్రతిజీవి తనదైన దారిలోన – పయనమొనరింప ఫలమును ప్రగతిగాంచు.

ఆ.వె. పాత తరమునందు పావనతను గాంచి – కొత్తతరములోని కోమలతను
మంచి మించురీతి మహనీయతను గాంచ – మనుజ జాతిపొందు మాన్యతలను.

496

ఆ.వె. త్యాగముండుటన్న యోగము రాగము – ఈవిభావిలోన హితము గూర్చు
ఇవ్వలేని నరుడు గవ్వకు కొఱగాడు – జీవి దారిలోన వెలుగు యీవి.

ఆ.వె. దారిదప్పినట్టి ధారుణి యువకులన్ – మార్గదేశికులుగ మలయజేసి
ప్రవరులైనయట్టి పరముల దలచగా – యువత భవిత వెలయు సవితగాను.

ఆ.వె. బడులు గుడులుగాను భావనజేసెడి – గురువులున్న జగతి గురుతనందు
అదియె ముఖ్యమైన ఆదాయ వనరుగా – కాంచువారలంత వంచకులుగ.

ఆ.వె. సివికు సెన్సులేని సింగారమదియేల – చుట్టుచూడనట్టి గుట్టదేల
కలిసియుండలేని కాపురమదియేల – పావనమ్ముకాని భావమేల.

ఆ.వె. ఆడమగలటన్న ఆధిక్యమదియేల - జంతు తతులయందు జాతులుండె
గొప్ప తక్కువలును గుణమున గలుగును - అతివ మగల లేవు అంతరములు.

ఆ.వె. ఆశ ఆశయాల ఆధిక్యతల తోడ - బతుకు గడపగాను భాగ్యమగును
ఆశ పెరుగగాను అంతరములు వచ్చు - ఆశయాల మనిషి అధికుడగును.

497

కరుణకలిత కథలివి - కార్పణ్యపు వ్యధలివి
విధివక్రించిన వింతలు - వికలాంగుల జీవితములు
కాళ్ళులేని జీవులు - కళ్ళులేని కబోదులు
చేయిలేని చేతనులూ - చైతన్యపు జీవనులు
తల్లితండ్రికారణమో - ప్రకృతి కృతి భావనమో
వనమాయెను జీవనమే - వసుధనిండె పాపమే
మనసులేని మానవులు - మనువర్తికి మూర్తులు
దయనిండిన దారులు - దాక్షిణ్యపు నరవరులు
పాపరహిత జీవనులు - పరమార్థపు పావనులు
జాతి జనత దీపములు - దేశజనత దేహములు
ఆలోచన కవధులు - అవగాహన వారధులు
సహన వహన సారధులు - సమజీవన మాన్యులు
సహాయమునుకోరువారు - సదయహృదయకాంక్షులు
విధి వక్రించిన విధమే - విదిత బధిర బాంధవులు
అంధకార జలధిలో - అమరిన జనపుష్పములే
లోకుల లోకమునకూ - సాక్ష్యమైన ఆదరువులు
మమకారం మహితత్త్వం - అందుకొనెడి ఆర్తులు
చేయూతను అందివ్వగ - చైతన్యం పండింతురు
వెతల మతుల మనసులకూ - వెలుగు పంచ విభవమగు
అవయవాల లేమిలోన - ఆంతర్యము తెలియదుగా
అంతరాలు పవిత్రమే - వింతగు పావిత్ర్యమే
సహాయమే సాగగా - సాహసులే వారలు
సమజీవన సరళిలో - సహగమనం వారిదే

పరిపూర్ణ మానవుడే – పరాస్తమై యుండెను
మానవతే నిండగా – దివ్యత్వం పండుగా
బతుకు వెతను పోద్రోలగ – మతిమంతులు వుండగా
అంగవికల బతుకులే – అందమగును నిండుగా.

498

కంచికి కథచేరింది – కంచి కథలు తెలిపింది
ఆచార్యుల చార్వాకం – అందంగా మలిచింది
రాజకీయ రాసభం – రాసిక్యం సన్యాసం
విన్యాసం సంసారం – ధ్వన్యాత్మక కథసారం
హిందూత్వపు ఇందుమతికి – హితం హతం అనునిత్యం
ధనం గుణం ధరిత్రిలో – దమనకాండ దారులా
ఆరువర్గముల అవధికీ – అందెడి విందగు విలువలు
శ్రీశంకర భగవంతులు – సిరి చెలువుడు చింతనలో
బుద్ధభావ బూడిదలో – పునీతుడై పుడమి నిలచె
చంద్రశేఖరేంద్రుడూ – చెలువుడు జన ఘనతకూ
జయేంద్రుడీ జాతికీ – జవసత్త్వములను పంచె
బ్రహ్మజ్ఞాన బాంధవ్యం – మిథ్యలోని విద్వత్తూ
పరమాత్మకు పావనతా – పరమార్థపు అర్థమే
మతం హితం మరచిపోయి – అహమర్థపు ఆధిక్యం
రాజకీయ రంగులలో – సింగారం సింధూరం
బంధువులే బంధనాలు – భావము సత్యాంగత్యము
ఆస్తికొరకు ఆరాటం – జాస్తి అదే ఆస్తిక్యం
శిక్షలెన్ని వేసినా – దీక్షలెన్ని చేపట్టిన
దివ్యత్వం దిగదుడుపే – దీనత్వం తనముడుపే
శిష్యకోటి చింతలలో – వంతవలపు కైంకర్యం
హిందూత్వపు చిరునామా – హీనమగును నిజం నిజం
రాజ్యాంగం రాసినోళ్ళు – చట్టాలను చేసినోళ్ళు
సరళిమార్పు కాగానే – సమానతను వల్లెవేయు

చట్టమెంత పనిచేసిన – సరళి గాంచు మానవులే
సహకారం సాకారం – సమభావం చూడనాస్తి
స్వాముల జనదేశానికి – ఆదేశం అమరత్వం
సమరశీల సన్యాసం – విమలమగును విన్యాసం.

499

భూతల స్వర్గంలో – జాతకాల యాతనలు
భువిజన సమరంలో – భవనమె తన భవితవ్యం
పేరులోని పెన్నిధులూ – పేలవాల పిలుపులూ
పరువపు నవ పరుగులూ – గరువానికి గురుతులూ
భాగవతుల భారతం – రాగవతుల రాసిక్యం
ఆత్మయోగ శంకరులకు – అవమానపు అందలం
జగతి సుగతి గాంచుననే – జనవాణికి జాంతవం
ప్రగతి బాట ఫలమనే – జగరీతికి జాణతనం
మరణం వరణమనే – మనురీతే మాలిన్యం
బతుకు బాధ భాగ్యమనే – భవజగతియె బంధురం
బంధనాల అందములే – భవిత సవిత భావనులు
అందలాల ఆశీస్సులే – అందరికీ సుఖములు
అందిన భగవంతునికీ – ఆశల జనవెల్లువలు
అందరాని ఆస్తిక్యమె – అందుకొనగ ఆరాటం
ఫలం లేని పరమాత్మకు – స్వాత్మల అనుసంధానం
నామరూప నవ్యతలే – దివ్యజగతి భవ్యత్వం
నిత్యానిత్య నిర్ణయతే – సత్యభువికి సోపానం
ఆశల కాసారంలో – జనులందరు స్నాతులే
ఆశయాల సారంలో – సవనాలకు సారథులే
దానవ మానవ సంగతి – ధారుణిలో సుగమమే
మానవదేవుల మహితం – మహనీయం మాన్యమే
స్వర్గం నరకం స్వగతం – గతమెంతో గరువం
నిజం ఇజం రీతిగాను – నియామకుని సంగతే

పావనతల వనతలూ – పరమార్థపు అర్థములూ
జాతకాల జగతిలో – పాతకాల పరువాలు

500

వార్ధక్యపు నటనలో – సార్థక జన జీవితాలు
స్వార్థశోభశోధనలో – సదయ నిండు సమాధులు
కనిపెంచిన కనికరమ్ము – కాటేసిన కాఠిన్యం
దిక్కులేని దీనత్వము – దినదినమొక గండము
ధనమూలము జగతికీ – దయరూపు ప్రగతికీ
పలకరింపు ప్రేమకూ – పరమార్థపు వర్ధనము
ముసలితనం ముసురులో – ఉసురుసురను జీవాలు
ముదనష్టపు బాంధవ్యం – విదలింపులు విసుగులో
అంతరాల తరాలకూ – ఆంతర్యం అనుభవం
విభవాలకు వినిమయం – అభయమె జన అవసరం
అమ్మపిలుపు నాన్న తలపు – అవయవాల రుజలతో
నిత్య నరక నీరధిలో – మునిగిన మాంసపు ముద్దలు
కోరికలే లేవుగాని – కోపములే ప్రత్యక్షము
ఆశలసలు అడుగంటగ – అవసరాలె అవధలు
ముద్దకరవు ముష్టి బతుకు – చితికిన చింతలు వంతలు
బిడ్డలేని భీరువులే – బిక్కు బిక్కు ప్రాణములే
అనాథాలయమ్మునందు – అందరిలో ఒకరుగా
మరలిన జీవిత మరకలు – మరపులేని విషములూ
అన్యదేశగమనములో – మతులు గతులు విదేశమై
మరచిన నవమేధావులు – బాధామయ భావితులు
మునిమనుమల కోసమై – అనుదినమూ బాధపడే
ముదనష్టపు ముదుసలులు – తీరని ఆశల ఊసులు
తిరిగిరాని లోకాలకు – తిరువీధికి పయనించిన
శ్రాద్ధంపై శ్రద్ధలేక – చలనరహిత ప్రాణులు
వచ్చే మృత్యువుకోసం – విచ్చుకొనే కనులలోన
విరిసిన దుఃఖాశ్రువులతో – విగతజీవులైనవాళ్ళు

510

బ్రతికిచచ్చు భారంతో – భాగ్యాలను కోరకనే
భవబంధాల్ తెంచుకొనీ – బతుకుబండి లాగువాళ్ళు
కాళ్ళుచేతులాడకుండ – కర్మయనీ ధర్మమనీ
కలికాలపు వృద్ధత్వం – కలరూపుగ కాంచండీ
ప్రేమలేని పేదలార – దయవీడిన దళితులార
వృద్ధులుగా మారకండి – అనాధలుగ బతకకండి.

501

అరిషడ్వర్గ విజేతకు – అరదండాలాయెను
హిందూమత హితమతికి – బంధనమ్ములాయను
కాంచీపుర కామికీ – కరుణవరణమాయెను
శంకరగురు శివమతికీ – చెఱసాలయె శివమాయెను
హత్యకేసు ఆంతర్యము – అధికారులకెరుకాయెను
చట్టపరిధి సరళిలో – బాధ్యతలే బరువాయెను
సన్యాసుల న్యాసానికి – సంసారుల విన్యాసము
కోపతాపముల బతుకులు – శాపముతో చెఱువాయెను
ఆలయ లయ లావణ్యం – జనజీవన పరమార్థం
జయభారతి సాంగత్యం – జనావళికి సంతోషం
మతం హితం మనిషి దెలియ – మానవాళి మగతవీడ
సతత జగతి బోధలతో – సహకారులు సన్యాసులు
మానవ సంబంధాలకు – మమకారం అందించెడి
మహనీయత వారలది – మంచితనపు జనులది
భారత మతమొకటేనని – భవజనులకు తెలిపినట్టి
భావుకులు బంధువులు – హిందు భవిత దేశికులు
ఇస్లాం మతి హితైషువుల – హిందూమత జనావళికి
సయోధ్యకై అయోధ్యలో – భాషించిన భాగ్యశీలి
రామాలయ నిర్మాణం – బాబ్రీ కట్టడ ధ్వంసం
దేశజనుల చరితలోన – మచ్చలనీ తెలపెనతడు
మాన్యులకిదె అభివాదం – న్యాయం న్యాసం దప్పగ
సన్యాసము సంగరమయి – సంవాదము గరళమగును.

502

కార్తీకమాసమిది – కర్మని మాసమిది
కృత్తికా నక్షత్ర – కూర్మికల నెలయిది
చలికాల వెలుగులో – చలువ వెదజల్లునది
ఆరోగ్య భాగ్యాలు – అందించు మాసమిది
ఉపవాస దీక్షలతో – ఊర్జిత సత్త్వమిడు
హరిహరుల కిష్టమై – అమరిన మాసమిది
సోమవారపు మహిమ – శోభతో నిండినది
ఉమతోటి అభవుడు – ఉండెడి వారమిది
లక్ష్మి పార్వతులను – లావణ్య మహిమతో
పూజించ పుణ్యమగు – పూర్వ పాపము పోవు
ద్వాదశలలింగాల – కొలువై ఆ శివుడు
కోటి కోర్కెల దీర్చు – కోమల హృదయుడు
వైకుంఠ మందున – వైభవ సహితుడై
లక్ష్మితోకూడినా – లక్షణయుతుడతడు
రంజాను నెలయిది – అయ్యప్ప సమయమిది
శివదీక్ష సమయమిది – రామదీక్ష వేళ రమ్యమిది
దురలవాట్లన్నిటిని – దూరముగ పోద్రోలు
పరమాత్మ ధ్యానమే – పరమార్థముగ పంచు
పాపాల జగమును – పావనమ్ముగ జేయు
కోపాలు తాపాలు – కోమలమ్ముగ జేయు
చన్నీటి స్నానాలు – ఆరోగ్య కరమనీ
కుంకుమ గంధాలు – కూర్పు క్షేమంకరము
దీపమ్ము వెలిగించ – దివ్య ఫలములు కల్గు
నైవేద్య మర్పించ – నవనిధులు లభ్యమవు
చిత్తము నిల్పగా – చిత్తగును వేదనలు
విత్తవృద్ధి కలుగు – విజయములు చేకూరు
ప్రాచీన వాక్కులలో – పావనత కలదనీ
ఫలములను పొందగా – నిలయమీ మాసము.

503

ఆజాదుకు జేజేలు – అమరునికి జోహార్లు
కలామునకు సలాము – అరుణోదయ మొలాము
దేశభక్తి దేహునకు – దివ్యమైన వందనములు
మహ్మదీయ మాన్యునకు – మరపురాని చందనములు
మంచితనం మించినట్టి – మాన్యునకివె వందనములు
సమత మమత పంచినట్టి – సారధికివె చందనములు
మొదటి శిక్ష మంత్రిగాను – మొదమిడెను జనులకు
విద్యవిలువ తెలియగాను – విబుధుడాయె జగతిలో
స్వాతంత్ర్యపు సమరంలో – స్వాభిమాన భావనలో
భారతికీ భవ్యుడాయె – దివ్యమైన దిటవుతో
నెహ్రూజీ నేతృత్వం – ఆజాదుకు మంత్రిత్వం
అందమైన అనుభవమే – విందగునుగ విబుధులకు
రంజాన్ నెల పర్వదినము – రంజైనది జన్మదినము
అల్లామది అతిశయము – మతిమంతము భారతికి
సోదరత్వ భావనలో – శోభమీరు కలామునకు
పదవి పదిలమాయెను – పరమార్థము ప్రజలది
మానవత్వ దారిలోన – మహ్మదీయమతములోన
హితమెంచెను కలాము – మతము మమత దెలిసెను
గురువు గుట్టు దెలిసెను – పరువు బరువు గాంచెను
అక్షరాలు అక్షయమ్ము – శిక్ష శివము నించెను.

504

సత్యాగ్రహము సమరంలో – గాంధీజీ గరువముతో
గమియించెను గణ్యుడు – ధన్యతగాంచిన జనుడు
భారతీయ భావనతో – బంధుత్వం నెఱపెనాడు
పాకిస్తాన్ బంధముతో – పావనతను పంచెనాడు
తెల్లవారి తరుముటతో – తెలివి బలిమి తెలిపెను
మంత్రాంగపు మాన్యతతో – మాధుర్యము పంచెను

యోధుడాయె ఆజాదు – యోజనలో ఎకిమీడు
బందూకులు బంధనములు – బాధలన్ని బలమాయెను
భరతజాతి విద్యకూ – దిశాదశల చూపెను
బహుభాషల దేశానికి – భవితను నిర్దేశించెను
హిందూ ముస్లింలంతా – భాయి భాయిగా నుండగ
భవితను కాంక్షించినట్టి – భారతీయ భావుకుడు
అహింసనే ఆయుధంగ – స్వేచ్ఛకొరకు తగవులాడి
స్వాతంత్ర్యం సాధించిన – భరతమాత బిడ్డడితడు
తలకుపైన కుచ్చుటోపి – తలపులోన సమైక్యత
భాష భావనమ్ములోన – దేశభక్తి భరతరక్తి
ఆల్లా ఈశ్వరు అందరొకటిగ – ఆశయములతో జీవించంగా
జాతి జనులకు జవజీవములను – జాజ్జ్వల్యముగా భారత భవిత
కలాము బాటయె కమనీయంగా – కలతలులేని కామనతోనా
ముందుకు సాగగ మురిపెమ్మగును – ముద్దు భారతికి ముద్దగు జగతి
తరం మారగా తరిగెను శక్తి – దేశ భావనే దిటవు వీడెను
మాత మహిమకు యువతరమంతా – నడుం బిగించగ నవ్యమ్మగును
కక్షలు శిక్షలు కలిమిని విడిచెను – కరువైపోయెను సమత మమతలు
అందరొకటిగా ముందుకు సాగగ – అమరమ్మే కద భారతావని

505

పిప్పళ్ళ బస్తాలు – గ్రౌండులో దొర్లుతుంటే – నడక నాజూకు తప్పింది
తిండి అరక్కో – కంద కరక్కో – ముందు బరువుతో మూల్గుతూ
వెనక బరువుతో ఊగుతూ – ఉచ్ఛ్వాస నిశ్వాసాల ఊదరతో
కాలక్షేప కబుర్ల వాదరతో – మొద్దుగుమ్మల బొద్దుతనం
వద్దన్నా వదలని ధనం – గజ నడుముల గమనమ్ములు
నితంబాల భారమ్ములు – స్వేదముతో చెలువమ్ములు
ఒబేసిటీ వలయమ్ములు – పనిచేయని పరువమ్ములు
గజతిండికి గరువమ్ములు – ఆత్మన్యూన భావమ్ములు
అందరికీ భారమ్ములు – యుక్తాహార విహారస్య ...
గీత గుర్తుకొచ్చింది – మన ఆరోగ్యం మనచేతిలోనే ఉందని

డాక్టర్ల చేతిలో పెట్టొద్దని

ట్రైసన్నుల సన్నులు – వస్త్రాదుల సాధువులు
భీమన్నల బిన్నులు – భామలు నవ బన్నులు
దూదిపోగు దున్నలు – ఇభముల వలె టన్నులు
WWF డానులు – తిండిపోతు తిన్నెలు

సంపన్నుల 'సం' గతులు – గతిదప్పిన గమకాదులు
అంతఃపుర అతివలు – అతిబరువున అవస్థలు. 506

గ్రౌండులో రోడ్లపై దొర్లనవసరం లేదని – అందచందాలు అందుకొని
ఆనందంతో ఆరోగ్యంతో బతకొచ్చని – జీవితకాలాన్ని పెంచుకోవచ్చని
మనభారం ఇతరులకు భారంకారాదని – ఏవగింపుకు వెకిలింపుకు స్థానం కాకూడదని
జాగ్రత్తగా కొంచెం యోగం – నియమంగా కొంత ధ్యానము
ఆరోగ్యానికి అందలం – అదే రోగానికి బంధకం
బాల్యంలో భారం యౌవనానికి శాపం – యౌవనంలో భారం యాతనలకు నిలయం
మధువ్యాధి బాధ, రక్తపోటు పోటు – దరిజేర్చే దారిద్ర్యం ఒబెసిటీ
మానసిక వ్యాధులనస – మనదరికి రాని మంచి అలవాట్లతో
జీవితాలు సాగాలని – జిలుగు వెలుగులు కలగాలని
ఒబెసిటీ బాధితులకో వినతి.

ఆబ తిండికి ఊబొచ్చింది – ఊబకరిగే ఊసొచ్చింది
బ్యూటీక్లినిక్ క్లిక్ మంది – లక్కీలేకపోతే చిక్కొస్తుంది
జిమ్ముకొచ్చారు అమ్మలు – సొమ్మసిల్లారు అతివలు
అతి సర్వత్ర వర్జయేత్తని – అందరు గుర్తించాలి.

507

మతం మత్తు తెలియరా – మానవతను చాటరా
దానవతను వీడరా – దయాగుణం గాంచరా
ప్రవక్తలే ప్రవచించిరి – ప్రాభవ వైభవములతొ
ఆచరించి అమరులైరి – అధిక ఫలంగాంచిరి
పలుమతాల నిలయమిది – హితమతులను గాంచినది

మారణాల మయమిది – దారుణాల ధరణియిది
దేవుడనే పదములోని – భావ భాష మారినది
హతమతమై హానిగూర్చి – ఆహరించు జనావళిని
జనుని సృజన భగవంతుడు – జయమే పరమార్థము
స్వార్థ శోభ మిక్కుటమై – అన్వర్థము అపసవ్యము
రాజకీయ రంగులోని – హంగులెన్నొ హతమయము
పదవుల ఓట్లాటలలో – పావులైన ఫలమిది
హిందూ హిత మతులందరు – హీనమైరి జనతలో
మహ్మదీయ మాంద్యమేమొ – మతి గతి దప్పిన విధము
సిద్ధాంతము రాద్ధాంతము – సింగారం బంగారం
మూలమూన మూర్తులకు – ఆర్తిగొల్పు అవతారం
భారతీయ భావనలో – బాధ్యతలే ముఖ్యము
ధర్మశాస్త్ర ధరణిలో – మర్మ సహిత మాధ్యమాలు
ఏ దేవుడు చెప్పలేదు – ఎఱుక మరచి పొమ్మనీ
ఏమతమూ అనలేదు – హింసతోడి బతకమనీ
క్రీస్తు కృష్ణ అల్లాలు – క్రింది మీదులెవరైనా
నాశనమును కోరలేదు – నవజీవన విధమెంచిరి
పరమత సహనమ్ములో – పవిత్రులై వెలసిరి
పరమత హననమ్ములో – ప్రభువులైరి పాలకులు

508

పరిష్కార మార్గములో – పుష్కరమే గడిచి పోయె
పునీతమౌ న్యాయమ్మే – పురిటిలోన పూజ్యమాయె
కాంగిరేసు పాలనలో – కలవరమే కలిగెను
బీజేపీ హయాములో – భయవిహ్వలమాయెను
జీర్ణించిన మసీదుకూ – జీవం పోసిందొకరు
రాముని ఆలయమంటూ – రభస చేసెనొకరు
కోర్టు గడప దాటినది – కొలువులెన్నొ మారినవి
నేరమేమొ నెయ్యమై – తియ్యనాయె తీర్థులకూ
మాయలోన ముంచిరి – మాధవునే మరచిరి

516

భూభాగోతం లోనా – పతనమాయె విలువలు
ఇమాంగారి జమానా – హిందువులకు హైరానా
సన్యాసుల శోభలన్ని – మహ్మదు జనమారణాలు
విచారణే విచారమై – విస్తరించె ధర్మములో
దేవుని చట్టాలన్నీ – దేహులకే వైభవాలు
మతఘర్షణ హర్షమగును – మాన్యజనత ప్రతినిధులకు
సమగీతను వల్లింతురు – నమాజులను అజాయింత్రు
గోద్రా మారణకాండకు – గోవిందుడె మూలము
కానరాని కామికీ – చెప్పరాని చైతన్యము
విశ్వమానవత్వానికి – వింతతీరు వ్యాఖ్యలూ
నిలువున జన విభజనతో – విభవములను గాంతురు
చట్టానికి కళ్ళులేవు – సాక్ష్యానికి జనులు లేరు
న్యాయమూర్తి నేత్రానికి – శివనేత్రమె శిథిలము
రామజన్మభూమిలోన – రాక్షసజనరాజ్యమాయె
బాబ్రీమరుభూమిలోన – భాగ్యజనుల బాధలాయె
భారతీయులందరిచట – భాయి భాయి మనగాను
భాగ్యయోగ్యభారతికీ – భవిత నిలయమగునుగా
సన్యాసులు ముల్లాలూ – సమత గీతమాలపించ
సహన వహన ధారుణిలో – సరళిమారు మానవతగ
మసీదు లెన్నికూలినా – దేవళములు నశించినా
దేహులైన మానవులది – దివ్యత్వము దిటవునా.

509

కలం కలం కలం – కలవరానికి కలం – కలకలానికి కలం
కాంతికి శాంతికి కలం – అంతరాలు తీర్చే కలం – అవాంతరాలను మార్చే కలం
అనుబంధాలనూ పెంచే కలం – సంబంధాలను సవరించే కలం – కలానికీ కాలానికీ
అనుబంధం అనంతం – చరిత్రను చెప్పే కలం – ధరిత్రిని కూర్చే కలం
కలానికీ కాగితానికీ – భార్యాభర్తల సంబంధం
సరిగా ఉంటే సరి – లేకుంటే సరేసరి – కలానికి కులం లేదు
మతం మతలబులేదు – మమత మమకారాలే – కలానికి మాధుర్యధుర్యాలు

పుస్తకం హస్తభూషణమైతే – మస్తక అభిభాణం కలం
వ్యాసుణ్ణుంచి శ్రీశ్రీదాకా – వ్యవస్థను శాసించిన వాళ్ళే
శాసనానికీ శమనానికీ – వహనానికీ సహనానికీ
వయసుకూ వలపుకూ – తలపుకూ తపనకూ
కలం కలవరమౌతుంది – భర్తృహరికైనా, బద్దెనకైనా
వేమనకైనా మరే భీమన్నకైనా – అందివచ్చిన ఆయుధం కలమే కదా
భాషించే భాషకూ – కలం రవళించే భాషకూ
అక్షరాల భేదం తప్ప – ఆలోచనా భేదం లేదు
కలం వర్షిస్తూంది హర్షిస్తూంది – గర్జిస్తూంది గమనిస్తుంది
గమనాన్నిస్తుంది అనుగమిస్తుంది – పెన్ను గన్నవుతుంది
వన్నెమీరి వాసినిస్తుంది కలం కలియుగానికి హలం
కోలాహలానికి చిహ్నం కలం – హాలాహలానికి అవరోధం
అమృతానికి ఆలయం – కలాన్ని ప్రేమించు
కవికులాన్ని ప్రేమించు.

510

దుశ్శాసన పర్వంలో శాసనాలు శంకరమే
కోపాలతొ తాపాలతొ – కోరికలే శాపములు
ప్రజాస్వామ్య వీధిలో – పదవి పథము విపథమే
స్వార్థ స్వాభిమానములే – సోకుదార్లు షావుకార్లు
సమావేశమందిరములు – ఆవేశపు ఆదరువులు
అరుపులజన కేకలతొ – అదిరిపోవు అవధులు
మైకు విరిగిపోయినా – మైకములే కమ్మినా
పైకములే పరమార్థము – ప్రభవించును స్వార్థము
సభాపతుల సారళ్యం – సభాసదుల సౌందర్యం
రంగులతో హంగులతో – వింగడించు వైభవం
పార్టీలే పావనములు – అధికారము ప్రతిపక్షము
ఇటుమారిన అటుమారిన – ఇంతేలే ప్రజార్థము
తెలుగువారి తెగువలో – తేటదనం చాటుమాట
సరసంలో విరసంగా – వివరించును విభులగతి

సిద్ధాంతపు సింధువులో – బిందువేగ ఆచరణం
రాద్ధాంతపు రంగంలో – హంగుల సారంగులే
సమతా సహవాదంలో – సామవేదులందరూ
ఆచరణకు నోచుకోని – అమరవీరనాయకులు
దళిత రక్షకత్వంలో – గళితులైన గంధర్వులు
గరువంపరువంలోనా – విరిసిన నవజీవనులు
నాయకత్వ సరసిలో – వికసించిన పద్మాలు
విలువల విజయమ్ములో – విగతజీవమైన వారు
నవజీవన నినాదమే – నవ్వులపాలైనది
జనజీవన సాఫల్యం – జగతినుండి వీడినది.

511

వ్యవస్థయే వ్యత్యస్తం – అవస్థలే అనునిత్యం
అవినీతిదే రాజ్యమూ – నీతి నిత్యపూజ్యము
మానవ స్వార్థమ్ములోన – మాడిపోవు మాన్యులూ
పావనతను కోల్పోయెను – పరార్థమే నిత్యమూ
ధనమూలము జగమనీ – ధాత్రిజనుల అభిభాషణ
ధరిత్రిలో మానవతకు – దారుణ యమపాశము
ప్రజాసేవ పేరులోన – తమసేవలో తరించుట
సుఖభోగం సుందరమని – కాంక్షించుట కలవరము
అణువునుండి బ్రహ్మాండము – అవినీతికి నిలయము
అవనిలోని అధికారత – అనుభవమున చోద్యము
చిత్రమైన చిత్తరువులు – చిత్తం కలిగిన వారలు
విత్తవివరణమ్ములో – మత్తునందు మాన్యులూ
కాంట్రాక్టరు టాక్టులో – కారుణ్యం విలవిలా
ఇంజనీరు విజనులో – ఇరుకున జనవిలవిలా
సంపాదన పాదులోన – సవ్యమైన చట్టమూ
సాగును అనుకూలంగా – కూలిపోవు జీవితాలు
మనిషిమత్తులోన మునిగి – మాయలోన పండెను
రాజకీయరాసక్రీడ – రాసభమే జనగణ్యత

కల్తీలతొ కార్పణ్యం – ఆర్పివేయు బతుకులను
రక్షభటరాజ్యానికి – శిక్షణయే జనభక్షణ
వీరోచిత విప్లవాలు – వీధులకే పరిమితము
వర్ణాశ్రమ వాగురలో – కులమతాల కుమ్ములాట
అవినీతికి తనవాడు – అందరిలో ఒకడూ
ప్రజాస్వామ్య చట్టంలో – ప్రతినిధులది ప్రగతిపాట
స్వర్ణభారతమ్ములో – సొగసులతో అవినీతి
ప్రజ్వరిల్లి ప్రభలు గాంచి – పడిపోవును వార్నిధిలో

512

దీపావళి దీపావళి – దివ్యమైన దీధితి
ధీనిధులకు భవ్య ఫలి – సర్వజనుల సహకేళి
పురాణముల పూజ్యమాయె – పుణ్యములకు నిధిగా
మానవాళి మహిమలకిది – మాన్యమాయె మహానిధి
అజ్ఞానపు చీకటికీ – అంతరింపు అపజయము
విజ్ఞానపు వెలుగుకూ – వింత విలువ దెచ్చెనిది
నరకాసుర సంహారం – నవ్య దివ్య ఫలభరితం
బలిరక్కసు సంహారం – భాగ్య యోగ్య పర్వదినం
నిశిరాతిరి వెలుగుకూ – నిమ్నమాయె దురితము
నిత్యనియమయుతులకు – దివ్యమాయె జగమంతా
తన తనయుని వధియించిన – తరుణి సత్యభామకూ
తరగని జననీరాజనం – తపనలకిది పరిహారం
లక్ష్మిపూజ లావణ్యము – లక్షణముల నందించును
దురితహారి దుష్టహారి – భవభాగ్యములందించును
రాక్షసత్వ దారిలోన – రాజ్యము పయనించుచుండ
శిక్షించెడి దేవతలకు – సిరులిచ్చును దీపావళి
స్వార్థాసుర సంహారం – శోభకూర్చు నరునకూ
సారాసుర సంహారం – సరసతనిడు సతులకు
అంతరంగ చీకట్లను – అరమరికల నన్నింటిని
అంతరాల నవనిగూల్చ – అందరికిని విందు కల్గు

పాడిపంట చెట్టుచేమ - పారవశ్యమును నించగ
జగమే జవ జీవములతొౌ - జాజ్జ్వల్యము నిత్యము

513

సిరుల విరుల వెదజల్లీ - చింత వంత పోద్రోచి
సంతసమూ సాహసమూ - సవరించును దీపావళి
శ్రీకృష్ణుని చైతన్యము - జనావళికి జాజ్జ్వల్యము
జగములన్ని వెలుగొందగ - జయమగునుగ దీపావళి
హానికారకములను - మడియించెడి టపాసులు
వెలుగుల వేకువలోనా - వెలయించును దీపావళి
అసురులు ఆనాడె లేరు - అన్నివేళలా కలరుగ
దైవత్వపు భావనలో - దమియించెడి దీపావళి
చతుర్దశీ దశలోన - నరకుని నరికిన సత్య
నవ్యనారికాదర్శము - దివ్యమైన దీపావళి
కృష్ణుడు కృపజూడగా - జిష్ణుడగును లోకంలో
భవసాగర తరణములో - బంధువె యీ దీపావళి
రాక్షసమౌ లోకానికి - రక్షగాను జనులుండిన
జాంతవమౌ మనుష్యులకు - జయమొసగును దీపావళి
పరార్థమూ పరమార్థము - ప్రజలలోన ఫలియించగ
జగమే ఒక నందనమగు - జవసత్త్వపు దీపావళి
మతముతోడి మారణాలు - మానవతను దహియించగ
దానవతను దమియించగ - దారిచూపు దీపావళి
ప్రపంచమే పావనముగ - ప్రగతిదారి సాగగాను
ప్రవరమైన దినముగా - ప్రచురమాయె దీపావళి
పరంజ్యోతి ప్రాధాన్యము - ఆత్మజ్యోతి ఆంతర్యము
తెలియజేయు తేరుయిది - తెలుపు తేట దీపావళి
దేశభక్తి భావనలో - దేశజనులు వర్తించగ
నర్తించును నవతేజం - ముక్తినొసగు దీపావళి
కాలమంత కమ్మనిదై - కలవరముల దాటిందీ
కలలకు సాఫల్యమై - కళగాంచును దీపావళి.

514

సీపీ బ్రౌనుకు జేజేలు – భాషా బంధుకు జోహార్లు
ఆంగ్లేయుడిగా అవతరించినా – ఆంధ్రభాషలో ఆరితేరెను
తాళపత్రములు తరించిపోగా – స్వచ్ఛప్రతులను వ్రాయించెనుగా
కావ్యజాలములముద్రణ సేయగ – కలిమి బలుములను భాషకు కూర్చెను
పండితశ్రేష్ఠుల రావించీ – పాఠములెన్నో సవరించీ
స్వంత విత్తమే ఖర్చులు పెట్టీ – భాషా పోషణ భావమెంచెను
మహాగ్రంథముల ఆనుపానులూ – తెలివిగ తెలిసీ తెంపరిగా
వ్యాఖ్యానములను వ్యావృతిసేసీ – వెలుగును కూర్చెను తెలుగునకూ
శృంగారమ్మని గేలిసేసినా – బంగారముగా పదిలపరచెను
సంస్కృతికాదని సంస్మృతి సేసిన – సంస్కరించగా సరళిమార్చెను
మాతృభాషపై మమత కలిగినా – పరభాషలకూ ప్రాభవమిచ్చెను
వేమనకవికీ వెలుతురు తెచ్చెను – వేల పద్యములు ముద్రణ సేసెను
మరుగున పడినా మాన్యకవులను – ఎరిగించెనుగా జగమంతటికీ
కడప కేంద్రముగ కలిమిని పంచెను – కావ్యజాలము జయమందెనుగా
నలుమూలలకూ జనులను పంపెను – నవ్యరీతిని గ్రంథముల్ దెచ్చెను
ఉద్యోగమ్మున ఉన్నతినెంచీ – సద్యోగముగా సరళిని మార్చెను
ప్రాచ్యదేశపు ఇటలీ భాషకు – నిఘంటువొకటి నిర్ధారించెను
వ్యాకరణమ్ముల వేకువలోనా – వ్యావహారికము వెలుగులు చిమ్మెను
తెలుగులకొక్కటి కళాశాలగా – స్వగృహమ్ములో శోభలు పొందెను
తాళపత్రములు పెక్కులు కలవు – పరిశోధనమున కవధులె అయ్యవి
ప్రబంధమ్ములే బంధువులైనవి – పరమార్థమ్మే వరమగుతనకు
దేశకాలముల నియతులులేకా – బ్రౌను స్ఫూర్తితో ముందుకు వెళ్ళుము.

515

ఆరాఫత్ వీరుడు – ఆశయాల ధీరుడు
అవనిలోని జనులలో – అగ్రగణ్య యోధుడు
తనవారికోసమే – తపియించిన మాన్యుడు
దేశమొకటికావాలని – ఆశించిన అధికుడు
ఆశయాల అమరుడు – ఆకాంక్షల ప్రముఖుడు

522

పాలస్తీన్ రాజ్యానికి – పాటుబడిన పావనుడు
ప్రాణములను ఫణమొడ్డి – పోరాడిన నాయకుడు
దేశభక్తి భావనలో – దేవుడైన మానవుడు
జనులందరి గుండెలలో – నిండిన పరమాప్తుడు
యుక్తవయసు వేకువలో – ఉద్యమించె ఉన్నతుడు
ఇజ్రాయెల్ వ్యతిరేకిగ – హితమును పంచినవాడు
పగవారి పన్నగముల – పసిగట్టిన ప్రముఖుడు
మృత్యువు ఎదురొచ్చిన – ముద్దుపెట్టుకొనినవాడు
నిర్బంధపు పోకడలను – నియంతృత్వ భావనలను
నిశితంగా పసికట్టీ – విప్లవించె విలువలతో
గెరిల్లాగ ప్రభవించీ – సైన్యమునే సమకూర్చి
ఉగ్రవాద అగ్రవాద – పద్ధతులను ఎదుర్కొనెను
జెరూసలెం మాదేనని – జేజేలతొ ప్రకటించెను
అమెరికాను ఎదిరించెను – అవని జనత హృది దోచెను
వ్యక్తిత్వము వ్యక్తమగును – శక్తిలోన యుక్తిలోన
శతృవులకు దడపుట్టగ – చైతన్యము ప్రకటించెను
శాంతికాముకులలోనా – తానొకడుగ నిలువగా
విశ్వవినుత పట్టమైన – నోబెల్ బహుమతి పొందెను
ఐక్యరాజ్య సమితిలోన – ప్రముఖస్థానమందెను
ఆశతీరకుండగానె – అమరుడిగా మిగిలెను
దేశభక్తి దేహులకు – గుండె దిటవు అరాఫత్తు.

516

ఆశయాల మూర్తికీ – అశ్రుల నయనాలంజలి
అమరజీవి రామునికీ – సమరశీల హృదయాంజలి
వైశ్యవంశరత్నమై – వైభవమును గాంచెను
ఆంధ్రరాష్ట్రసాధనకై – అసువులనే అర్పించెను
సమసమాజ భావానికి – సహకారమునందించెను
హరిజనులను హరి జనులుగ – ఆలయాలకే నడపెను
గాంధీజీ భావములను – గరువముగా భావించెను

సత్యాగ్రహసమరములో – నిత్యము వర్తిల్లెను
ధ్రువతారగ వెలిగెను – ధ్రువకీర్తిని గాంచెను
పట్టుపట్టి బిగియపట్టి – గట్టిదనము చూపెను
కనిగిరిలో కనకమై – కామమునే జయించెను
నిరాహార దీక్షసేసి – నిత్యుడుగా వెలిగెను
భాషలోని భాగ్యమంత – భానుడుగా గ్రహించెను
తెలుగుల ప్రత్యేకతలను – తెంపరియై తెలిపెను
సరళమైన జీవనము – విరళమైన విభవము
నడవడియే నవ్యము – దివ్యమాయె నాంధ్రము
కులముకాదు మతముకాదు – కూర్మియె ఘనమాయెను
సమభావన సహజీవన – గమనముతో గమ్యము
తేటయైన తెలుగుభాష – ధాటిగ వెలుగొందెను
భరతజాతి భాగ్యములో – పాలుపంచుకొనియెను
శ్రీరామునిపేరుతో – శివమెంచెను ఆంధ్రకూ
భవసాగరమును వీడి – బాధ్యతలను మించెను
అమరజీవి సరళిలో – అందరమూ జీవించగ
భవిత భాగ్యమగునుగా – ఆంధ్రస్వర్గమగునుగా.

517

సుఖజీవన సుందరతల – మఖమొనర్చి మాన్యులైరి
విశ్వవింత సంతలోన – విజయమొంది ధన్యులైరి
అత్యున్నత బహుమానము – అవనిలోని శోధనలకు
నోబెలు బహుమతి నోబుల్ – సహకారపు సమర్థతకు
విశ్వమేధ విలువలకూ – నశ్వరమగు మానవతకు
నవ్యశోధ దివ్యతకూ – భవ్యమైన బాంధవ్యము
ఏ దేశపు వారయినా – మత హితము ఎవరైనా
శక్తి భక్తి శాంతులకూ – రక్తి నొసగు రమ్యత్వము
మనుజజాతి మమతలకూ – విశ్వజనుల సమతకూ
విలువనిచ్చు వివేకమే – ఆల్ఫ్రెడు నోబెలు ఘనత
ప్రతి వసంత ఫలములతో – ప్రవచించెడి సిద్ధాంతం

ప్రవరమెంతొ తెలిసికొనీ – ప్రగతిగాంచు బహుమానము
అత్యున్నతమైనదీ – ఆశయాల ఘననిధి
దేశాలకు దీపమదీ – శాంతి పురస్కారమది.

డైనమైటు కనిపెట్టీ – దైవసముడు నోబెలూ
భయము బాధ భావననూ – భావించని భావుకుడూ
శాస్త్రం సాహిత్యమూ – శమము నెంచు రంగములూ
పలురీతుల బహుమతులూ – పర్వమగును విశ్వానికి
స్వీడనులో నిగ్గుదేల్చి – నార్వేలో నయముగా
ప్రదానమే ప్రాధాన్యము – ధన్యతలో ధీరులు
వేత్తలంత వెలుగులో – గమియించగ గరువము
గమ్యమేమొ విశ్వశాంతి – విబుధుల మదికుపశాంతి.

పేలుడు పేలవమై – ప్రేమగా మారగా
భారతీయ వేత్తలూ – భాగ్యములను గాంచిరి
డైనమైటు విప్లవమై – దారిచూపు ధరణినా
బహుమతులను పొందిరి – బంధువులుగ నిలచిరి.

518

మానవులను మురిపించిన – మధురమైన గానం
దివి గంధర్వులచేరి – గరువమునే పంచినది
వాచికమే తపస్సుగా – ఒలికిన భువి గంధర్వం
నటనలోన నవ్యమయి – భవ్యమాయె జగతిలో
సంగీతపు సరస్వతి – సాహిత్యపు స్వరస్వతి
భాషలకే వాచస్పతి – భావాలకు భాగ్యవతి
మధురగాన అలివేణి – మాన్యమైన రాగవాణి
పంచమ స్వర శుకరాణి – కోకిల పంచమ వాణి
స్వరలయలే సర్వస్వము – స్వాగతించునగుమోము
రాగరాజ్య రసరాణికి – విన్యాసమె విధిన్యాసము
భారతీయ మహిళగా – భాగ్యానికి చిహ్నము
ఎల్లలేని సంగీతపు – ఎఱుకయే తన భాగ్యము

తలిదండ్రులు గురువులు – తరగని యా సంపదకు
పరవశించు ప్రకృతియే – పరమార్థపు తనగతి
భరతరత్న భాగ్యలక్ష్మి – స్వరగతులకు వరలక్ష్మి
జాతీయపు గానలక్ష్మి – జగతికి జనశుభలక్ష్మి
గాంధి నెహ్రూ ఆశీస్సులు – ఇందిర హిత దీవెనలు
బిరుదుల శర పరంపర – రాగ తాళ సుబ్బలక్ష్మి
త్యాగయ్యా క్షేత్రయ్యా – పలికిన పద సంగీతం
సుబ్బలక్ష్మి గళములో – సుందరతను నించెను
కర్ణాటక సంగీతం – ఉత్తరాది స్వరగతులు
మతి మలచిన పలుకులు – మధువు లొలుకు మధురిమలు
రసభావము రహియించగ – తాళలయలు తరియించగ
భక్తి రక్తి ముక్తి గూర్చ – కీర్తి గనెను కీర్తనలను
మధురమైన ఆకృతీ – మరువని యా సుకృతీ
మానవతకు మరోకృతి – మంచితనపు మధురాకృతి
మీనాక్షీ సుందరులు – మిటి నుండి భువికి పంపి
రాగ మహిమ పంచిరీ – రమ్యతలను నించిరీ
రూపు కానరాకున్నా – చూపు చూడలేకున్నా
నిత్యసత్యమైన పాట – నిధిగ మనము వినుదుమన్న.

519

అరుణారుణ కాంతులతో – అవతరించె దీపావళి
ఆశలాశయాలతో – అనుభూతులు పంచుము
వత్సరానికొక్కసారి – వాసిగల్గు పర్వదినము
రాక్షసత్వవినాశనము – మానవత్వ మహోన్నతము
సందడిలో సరసతతో – సాగుమోయి మానవుడా
సరసార్థము సమరసతా – సాధించుము జీవుడా
ఆలోచన అవగాహన – అందింతురు అమరులు
అనుభవాల భవసారం – ఆనందం అతిశయము
చీకటిలో చిరుదివ్వె – వెలిగించుము సోదరా
అదియే పరమార్థమని – అవధరించు అధికుడా

కాంతి కాంతివంతము – శాంతినిచ్చు మంత్రము
ఆవరించు చీకట్లను – పారద్రోలు ఔషధము
చరితలేని కాలమునా – చరియించిరి పావనులు
పెద్దల ఆచరణమున – పేరుపొందె సుదినము
నామరూప జగత్తున – నవ్యమైన దివ్వె వెలుగు
భవ్య జనుల జీవితాల – భాస్వంతము చేసెగా
మానవాళి మనుగడలో – మాన్యమైన మహిమ గల్గు
మహనీయత పొందిన – మంచిదినము దీపావళి
నరకాసుర సంహారము – నాడు జరిగె నేడు జరుప
కృష్ణుడవై సత్యవై – కూరిమితో చరియించర
అంతరంగ వెలుతురులో – అంతరముల మరచిపోయి
భారత జన భారతినే – భాస్వంతము చేయుదము.

520

బాలలు బాలలు – భావి భరత పౌరులు
భవ్యమైన నడతతో – నవ్యజీవ కాంతులు
నెహ్రూజీ భావనలో – భాస్వంతపు వెలుగులు
అరవిరిసిన గులాబులు – ఆశయాల మొగ్గలు
సరస గురువు బోధనలో – జ్ఞానవెలుగు జీవనలో
నవ్య దివ్య భవ్య జగతి – నందనవని జేతురు
భరతమాత బిడ్డలు – వర వర్ణిత మూర్తులు
బోసినవ్వు బోధకులు – బాధలకే బరువులు
బాధ్యతలను తెలుపగా – యోగ్యమైన భావుకులు
దివ్యత్వపు ధీధితులు – విశ్వవినుత వారధులు
మేధలోని మెలకువతో – మేలిమి జన జీవికలో
అమాయకపు అతిథులు – మాయలోక మానవులు
మనుగడలో మనువర్తులు – ఏడుగడకు ఎదగురుతులు
తల్లి తండ్రి తపనలో – తరియించిన తాపసులు
తెలియని ఆ బాల్యవయసు – తెంపరితన నీడలోన
తెగువ పంచు విబుధులు – తెరలిన నవకెరటాలు

పెద్దవారి ప్రేమలోన – పేరుగాంచు పేదవారు
ముద్దుల మురిపాలతో – ఉద్ధరించు ఉన్నతులు
బాల భారతమ్మునందు – బంధువులే సింధువులు
విశ్వవిఫణి వీధిలోన – విజయాలకు అవధులు
వసివాడని బాల్యంలో – వాసిపొందు వసుధ జనులు
మసిబారెడి జీవితాల – మధువు కోలుపోవు వారు
చిన్నతనం చిహ్నంగా – పెద్దతనం పేరుగాంచు
పెద్దరికం పేరులోన – పెన్నిధులై విహరించు
పువ్వు పుట్టి పరిమళించు – పూజ్యత గాంచుట నిజము
నవ్వుల విరిజల్లులో – నవ్యత గాంచుట నిజము.

521

వ్యవసాయమ్మే వ్యతిరిక్తమ్ముగ – వ్యవస్థ అవస్థ వ్యావృతమ్ముగా
చేసిన అప్పులు చేతి సంకెలగ – సహకారమ్మే హాహాకారముగ
అప్పుల వడ్డీ ఆకసమంటగ – కృషి ఫలితమ్మే కూలదోయగా
పంట తంటగా మంటలు రేపగ – ఎదిగిన కూతులు ఎదకుంపటిగా
అవమానమ్ము అధః కరించగ – బోరులు బోసిగ నీళ్ళు ఎండగా
పుస్తెలమ్ముగా పస్తులుండగా – అనావృష్టికీ అంతా ఎండగ
వడగండ్లే కడగండ్ల మిగల్చగ – కల్తీ ఎరువుల శాల్తీలాయెగ
చిత్తుగ విత్తన కల్తీలాయెగ – మిరప పంటకూ మినుకు ధరలుగ
పత్తి పంటకు పలకని ధరగా – చిరుధాన్యముల పరివినాశముగ
ప్రభుత సాయమే ఫలహారముగా – ప్రాణం వదలుటె పరమార్థముగా
ఆత్మహత్యయే ఆభరణముగా – అందనిలోకం అందుకొనంగా
అన్నదాతకు అన్నార్తతగా – అంతరించెనుగ ఆంధ్రా రైతు.

522

నీతి నిండిన నిధులు ఎండిన – విధులు పండిన విభుత పంట
వాగ్దానమ్ముల వాగురలోనా – దానకర్ణుల దారులలోన
వేలకోట్లకే వెలితి వచ్చెను – రాబడిచూడగ రమ్యత కొఱవ
రైతురాజ్యమే రక్షణసేయగ – శక్తినీయగా బలిమి పంచగా

చిన్నరైతునకు చిరునామా కరువు – అరువుల బరువుల అంతరంగములు
అధికవర్షములు అనావృష్టులు – వడగండ్లే కడగండ్ల వర్షములు
హర్షంలేని శీర్షంతోనా – అభిమానమ్మే అవమానముగా
తలతాకట్టుగ పెట్టుబడులకు – తెచ్చిన అప్పులు తెమలక యుండెను
ఎన్నికలలలో ఎన్నో కలలు – తీరని కోర్కెల తిరునామములు
వెనుకకు తిరగని వెతల బతుకులు – బతుకు నివ్వని ప్రభుత దండుగ
పదవుల వేట పదను మీరినది – అవసర ఖర్చులు ఆవలికెళ్ళెను
ఇతర వ్యయములు ఇంపుగులికెను – తీరు గనగను తీర్థము స్వార్థము
అంతఃకరణము వింతకరణము – ఆత్మబోధనము అసలు శోధనము
నా బొజ్జకు శ్రీరామరక్షయను – నానుడిలో నా నవ్య జనమ్ములు
వ్యక్తులు వెలిగిరి వ్యవస్థ కుంగెను – అవస్థలే అతి సామాన్యునకు
సామాజికమున సారము గాంచిరి – సమానత్వమే మానదండముగ
దండ ధరులను దారిన నిల్పిరి – దారిగానక దళితులు నొచ్చిరి
నగరీకరణము వగపు దెచ్చెను – కుగ్రామములే కూలిపోయెను
పంచాయతులే యతులుగ నిల్చెను – ప్రజల ప్రతినిధులు విధులు విడచిరి
పథకములన్నీ పరములచేతికి – వరములొక్కటే వాక్కుల నిండుగ
మించిన కోర్కెల వంచన జీవులు – ప్రజాస్వామ్యమున పరములౌదురిట
నిత్య వినీతుల నింగివర్తనము – జాతికి జగతికి పాతకమగునుగ
దొంగనోట్లకూ దొంగ ఓట్లకూ – నిత్యం నిగమం నీతికి ఖననం
ప్రతి ఐదేళ్ళకు ప్రాధాన్యతలు – ప్రగతికి సుగతికి పరమార్థములు
మారెడి ప్రభుతలు మారని మనుషులు – మనస్వామ్యమ్మున మహనీయతలు
గుణము మారగా గృహమే మారును – ధనప్రధానము దారి దప్పును
సహకారమ్ము సామరస్యములు – సగటు పౌరునికి శిరోధార్యములు
కోపం వచ్చిన కొరతలు తప్పవు – కోమల హృదయులు కొంప ముంచెదరు
నీతి నిధులు నిరుపమ శక్తిగ – నియమ విధులతో నిత్యం సాగుము.

523

బంగారం బాధపడ్డదీ – అంగాంగం అదిరిపడ్డదీ
పచ్చదనం పాలిపోయిందీ – వెచ్చదనం వెతుకుతున్నది
రేటేమో దాటిపోయింది – వాటంగా వరస కలిపింది

మోజేమో బూజుబట్టింది – మోహనమై మోదమయ్యింది
సింగారం సిరులు పెంచింది – సిగ్గుల సిరి సీమ కెళ్ళింది
భామ బరువు భాగ్యమయ్యింది – లేమ వయసులేచి రమ్మంది
చీకటి కటి ఆకలేసింది – ఆకటి కటి అందగించిందీ
మసకలోన కసివేసింది – కసి కమ్మని కడుపు నింపిందీ
కొలిమి కలిమి కాంతి మించింది – కొలత కలత కోర్కె కోరింది
ఆభరణం భారమయ్యింది – రతి రణమే రాజ్యమయ్యింది
ముద్దు హద్దు మురిపించిందీ – మురిపెం మది మునిగిపోయింది
చేతిగాజు చెంగలించిందీ – మట్టెల సడి మందగించింది.
కలవరమే కళ్ళకొచ్చింది – తడబాటే తడిచేసింది
ఒల్లనసీ చల్లబడినది – చెల్లుబాటు చెలిమికన్నది
మడితో తడి ఆరనన్నదీ – వడివడిగా వాలుమన్నది
రసరాజ్యం రవళించిందీ – మన్మథమే మధువయ్యింది
కలవరమే వరమైనది – కలియుగమే కలయైనది
కోర్కెతీర్చ కొలువయ్యింది – వలువల వల కదలిపోయింది
వెన్నెల నెల వెలుగుచూపింది – కన్నుల కల నిజమయ్యింది
మజా మత్తు హత్తుకొంది – చిత్తం సిరిమల్లె కోరింది
గుబాళింపు గులాబీలు – గులాములై మొలామేసె
తనువే బంగారమైన – తలపే శృంగారమగును.

524

చేపకళ్ళ చేమంతీ – చేదు మందు వాసంతీ
సింహనడుము చిత్రాంగీ – గజ గమనపు గాంధారీ
తళుకుల తడి యారదు – మెలకువయే మేలిమి
సంచారము వనములో – నయగారము నడకలో
అడవిబడీ అదనెరిగి – మదన మాంత్రికమ్ములో
గజం గజం కదలలేదు – గాంధర్వపు గరువముతో
సింగారం శివమెత్తగ – సింధువె తన బంధువుగా
అంగారపు అధికారం – అంగనకది ధిక్కారం
దేవగణం గుణంలేక – దేశాలే ద్రిమ్మరుచూ

నీ దేహము నాశ్రయించ – అహమే దాసోహమనె
పదములెన్ని పలికినా – పథములేమి మారవు
గమనమె జనమనంలోన – గమ్మత్తు గమత్తు నింపె
పంజాబీ పంచాంగం – పంచిపెట్టె పంచదార
చీరెకట్టు జాకెట్టూ – చికిలించెను వంశధార
పైటపిన్ను పలకరించ – బైటబడెను బాంధవ్యం
చీరపిన్ను చెవిసోకగ – వినిపించెను వనసూత్రము
ఆధారం అధరమే – అధికారపు కదలికలు
ముద్దు ముద్దరేయగా – సద్దుమణుగు సరిగమలు
రసజగమున సరాగమే – వనజగమున పరాగమై
రాగయోగ రంజితమై – భోగభువికి భోజనమే
తరియించిన అవతారం – తనువు వేరు కాకున్నా
పొలుసులన్ని విడివడగా – అసలతనీ ఆభరణం
ఎదురుచూచి ఎదగుబులుగ – ఎఱుకలేని కఱకుదనం
మరకలేని చంద్రునికీ – మాయనిద్రై నిలచెగా
నీ అందమె బ్రహ్మాండం – నవజీవన నారిత్వం
కోరివరములీయగా – కొలత కొలువ పరమార్థం
మనసు మనసు మాయచేసి – దినుసులతో పుటం వేసి
దివ్యమైన మనువుతో – భవ్యజగతి పాలిద్దాం

525

కలిమికి ఖననం – లేమికి జననం
చెలిమికి చెలువం – బలిమికి బంధం
కామనలో కలదులేదు – కారుణ్యం కథ ఉన్నది
శాశ్వతత్త్వ శార్వరిలో – అశాశ్వతే అసలైనది
కలిమి కథలు చెప్పినా – లేమి వ్యథలు పంచినా
కలకాలం కలిమిలేమి – కలవరమే తెలియరా
పెరిగి విరిగి విరిగి పెరుగు – పేలవమైనది లోకం
ప్రేరణ ప్రేంఖణమునందు – పేరు మిథ్య తెలియుమురా
అంతులేని అందానికి – అంతమున్నదని ఎంచుచు

సొంతం నీ సొంతముగా – భ్రాంతిలోనె భావించుము
కలిమి కాంతి వీడునుగా – కలత తలకు భారముగా
కనులలోనె రెండు కలవు – కలిమి లేమి కన్నీరుగ
మస్తిష్కం స్థితిదప్పి – మనసే ఒక మర్కటమయి
మాన్యమైన మానవతను – వనముల పాల్జేయునుగా
ఆచార్యులు ఆలపించి – పరములంత ప్రవచించి
ప్రచురమైన లేమికలిమి – ప్రభావమే సమభావము
గీతి గీతగీసినా – రాతరాసి పెట్టినా
నిత్యానిత్యం సత్యం – సదానంద సారళ్యం
కలిమి కాటి దరికి రాదు – కాడు లేమి పండించును
మండించిన దేహ గరిమ – దాహకమే దాక్షిణ్యము
మట్టిగలిసి మట్టమయి – మట్టువడెడి దేహానికి
కలిమి లేమి కాంతినిడగ – కాలమె కరుణించాలి.

526

అరణ్యాల రణధీరులు – అందరికీ వారసులు
విప్లవాల వీధులలో – విహరించే విబుధులు
భూమిభుక్తి పోరాటం – కామందుల కలవరం
శ్రామికజన చైతన్యం – అధిపతులకు ఆరాటం
ఉగ్రవాద ఊపిరితో – ఉసురందిన నక్సల్‌బరి
ఉన్నతులకు ఉరియైనది – లేనివారి గురియైనది
బెంగాలున ప్రభవమంది – బెంబేలెత్తించెనుగా
శ్రీకాకుళ ఏజెన్సీ – యజనానికి భూమికగా
ఉద్యోగం ఉత్తిమాట – యువత భవిత సత్తుమాట
నిర్వీర్యం నిస్తేజం – నింగి నిండ ఆవరించె
ఉన్నవాని భోగాలకు – లేనివాడు సాక్షిగాను
బానిసత్వ భావనలో – బాధలకే బంధువాయె
రక్షభట రాజ్యంలో – కక్ష శిక్ష కలవరమ్ము
ప్రాణములకు రక్షలేదు – పరపీడన ప్రాభవమ్ము
తెలివి ఒకడి సొమ్ముకాదు – తేకువయే తెగతెంపులు

అణకువ కభయం లేదు – అనుభవాల ఆంతర్యమె
పెన్నుపేలవమ్మైనది – గన్ను గరువమందించెను
ఆత్మరక్షకవసరమై – అరణ్యముల వాసమాయె
కాంమ్రేడులు ఊడులుగా – కలవరమై పోలీసులు
నిర్బంధము వెతుకులాట – నిత్యకృత్యములుగజేసె
ఎదురు కాల్పు ఎఱుకలో – మఱకలాయె సోషలిజం
పాలకజన ప్రకృతిలో – మార్పులేక మరలిపోయె
ప్రజాస్వామ్య రాజ్యములో – ప్రశ్నకు తావున్నదిగా
హక్కులు ప్రశ్నించగా – హుకుంతోడ అంతమాయె
ప్రజలకొరకు బాధలెన్నొ – గిరిజనులకు గీప్పతులుగ
ఆకలి దాహం తీర్చగ – తీర్పు తీరు విప్లవమే

527

సాహసమే సాగిరావలె – ధైర్యం నీకు దారి చూపవలె
అనుమానమె నీ అంతరజాడ్యం – అభిమానమే నీ అభిజాత్యము
సాహసలక్ష్మిని సాగుచేయగా – పండును పంటలు ప్రాభవమ్ముగా
భయంబాటలో పయనించంగా – భవసంభవం అభయం నీడగ
అంతరాత్మలో వింత గారడీ – తరతరములకు తరగని పేరడి
అధ్యయనంలో అధ్యాపనలో – అంతరంగమే నవతరంగము
వెనుకాముందు వెదుకుట వలదు – వెనువెంటనే నీ వెలుగే కలదు
సంశయమ్ములో అంశమంశువై – ఇహమున పరము ఇంపు కంపగు
వీరుని విధమున విజయంకోసం – వారువమ్ముపై కదలిరావలె
వినుతుల ప్రణుతుల వీనుల విందుగ – వింతమార్గమున గమియించగవలె
అందరునీకై అర్రులు చాచగ – ఆనందమునే అభిలషించవలె
పరమానందం వరమై సాగగ – పారవశ్యమున ప్రగతి గాంచవలె
అందని ద్రాక్షకు అర్రులు సాచక – అందిన సంతసమనుభవింపవలె
ఎపుడో ఏదో ఏమో అగునని – ఇపుడే మదిలో కలత వీడవలె
ఆకర్షణయే క్షణికమ్మనుకొని – అపకర్షణతో అందగించుము
నీలో నీవే నిత్యమ్మనుకొని – సత్యసారమును సంగ్రహించుకో
కాలకర్మములు కలిసిరావని – కలలో ఇలలో విశ్వసించకుము

సాహసకలిమికి కాలంకర్మం – సంధానించుక సంరావించును
జవం కలిగితే జయం వచ్చునని – భయం వీడును బాధ వెడలును
మరోజగతియే మాన్యమనుకొని – మహనీయుడవై మహివెల్గుమురా
మాతృమూర్తులకు ఆతృతకలిగీ – మహదభివాదం చేయుమురా
మానవత్వమే మానదండముగ – సాహసధైర్యం సాగవలెనురా.

528

మేఘం చాటున మేలి చంద్రమా – మేలిమి వెన్నెల మాకు పంచుమా
నీకిరణమ్ముల నిత్యజోత్స్నలో – నిరతము మాలో రతమునిల్పుమా
రాతిరి జాతర రమణీయముగా – ఆ తిరువీధుల తిరిగెడి వాడ
చందమామనే సరినామములో – అందం చందం బంధమగును
సాంద్రుడవగు ఓ చంద్రనాముడా – చండత అండగ చేరి వచ్చితివి
ప్రేయసి ప్రియులకు ప్రేమపంచెదవు – విగత జీవులకు విషము నింపెదవు
తారక నీ సతి తరములవరకు – తరియించగనిను వరియించెనుగా
విరబూసిన నీ విరుల వెన్నెల – వరుల హృదయమున వాంఛలు నింపును
ఆకాశంలో ఒంటరి ఓజగ – అటునిటు తిరుగుచు అందగించెదవు
పగటి సూర్యుని సగటు వెలుగులో – వెగటుగ వెలుతురు ప్రసరించెదవు
ఆరుకాలముల అవతరింతువు – కాలమహిమలో కరగిపోవుదువు
పక్షము శిక్షగ పాలిపోవుదువు – రక్షగ రహికి కాంతి నింపుదువు
పూర్తి పూర్ణిమ ఆర్తికి అలుపు – నెలవంకకు నెఱివంకలు కలుగవు
విరహులపైనీ విజయ ప్రతాపం – రహియించుటలో నిజమే కలదు
అంగారములో శృంగారములో – భంగిమలెన్నో భావ మహితములు
అమరావతిలో అమరులచెలిగా – అవతరించిన అమృతమయుడ
కవుల కల్పనా కమనీయతలో – చకోర కోరిక చమత్కారమే
కిరణం వరణం కీరితి కరణం – మన్మథ రణమున మారని మధురం
జాబిలి జావళి జాగృత ఆకృతి – ప్రాకృత సంస్కృత పావన సుకృతి
వాడి వేడిగా వసుధ బాణములు – సుధనిలయములై శుభములు పంచును
ఆనందార్తుల ఆప్తబంధువువు – కీర్తి కిరీటము మూర్తి మంతులకు
లక్ష్మీనిలయం లాలన మహితం – శివ శిరస్సున శివముల భరితం
అపహాస్యములో ఆ నెలబాలుడు – కృష్ణుని కృపలో తృష్ణదీర్చును

హిమకిరణములా హితము మతముగ – మహిమ మాన్యము మధుసుధ సహితము
వృక్షము నీడను వృద్ధమహిళగా – శిక్షణ నిత్తురు జగతి శిశువులకు
ఆకలి కన్నం జాబిలి పాటగ – శైశవ జగతికి గతిశీలమ్ముగ
జానపదులకూ జాతికవులకూ – పదమున పథమున పలకరింతువు
రాయే నీవని రసికులు తేల్చిరి – వేత్తలు నీమతి లోతులు వెదకిరి

529

పదవుల కథ ప్రారంభం – ప్రజాస్వామ్య పరాభవం
ప్రజల మతిని పాతరేసి – అసమ్మతుల మతిమంతం
కోణిజేటికి కోరకుండ – మూలమైన ఆర్థికం
సంపాదన సర్దుబాటు – రాష్ట్రభవిత రణరంగం
నక్సలైట్ల నల్లకొండ – కుందూరుకు కుందులాట
గృహమంత్రే గురువుగాను – లఘువు బిగువు జాణజాన
కాకుళంపు కాఅడవిలో – ధర్మానికి ఆదాయం
ఉత్తరాంధ్ర ఉపశమనం – రెవెన్యూల ప్రసాదము
పంచాయతి రాజ్యములో – దివాకరుని ఉదయము
అనంతలో తలోదరిని – ముఠా మఠం ఊరు వల్లె
రఘువీరుని వ్యవసాయం – సాయమగున రైతులకు
అనంతమౌ ఆత్మహత్య – అవతారం మారునా?
కొణతాలకు వాణిజ్యం – కొనుగోలు అమ్మకాలె
జీరోలకు రామకృష్ణ – ఫారోగా నిలచునా.
అడవుల్లో గజపతులకు – శత్రువేగ శత్రుచర్ల
కాలుష్యపు విజయానికి – కారణమ్ము గమనించున?
గొల్లపల్లి సూర్యునికీ – గొట్టిబట్టిగోవు గోడు
సంవర్ధక వార్ధక్యం – సరళిమారు రోజెన్నడో?
కడియం కడుమోహనమై – రోడ్డెక్కెను రోడ్లశాఖ
భవనాలకు బంధువుగా – జక్కంపూడికి జయమా
బొత్స ఉత్సుకతను గాంచి – భారీగా పరిశ్రమలు
శ్రమవిడిచిన నేతలకూ – చేతివాటముండునా?

మహ్మదాలీ షబ్బీరుకు – సమాచార సంరంభం
పౌరుల సంబంధాలకు – బంధమేమి లేకుండున?

జేగీతకు ప్రాభవమే – పర్యాటక ప్రభుత పదవి
రూటుమార్చి గేటు తెరువ – చేటు తెచ్చుననుట నిజం
గ్రామీణం ధర్మపురికి – శ్రీనివాసు చింతనలో
పీసీసీ సారధికీ – పేలవమైనది పదవి
దేవధర్మ ఆదాయం – కరీంనగర్ దేవిడీలో
ఎమ్మెస్సార్ ఎఱుకలోన – మానవ మాధవ సమములు
ఆదిలబాదు అందలం – వినోదునకు విజయమ్ము
సంక్షేమం సరళిలోన – అలసత్వం కానబడదు?
నేదురుమల్లి రాజ్యానికి – ప్రాధమికమె విద్యలోన
భర్తపదవి బాధ్యతలకు – బాధపడిన భార్య పదవి
అన్నగాను సహకారం – కన్నాయే అందించును
లక్ష్మిలేని మమకారం – నారాయణ పొందునా?
వరంగల్లు లక్ష్మయ్యకు – పొన్నుగ పెనుప్రాజెక్టులు
తెలగాణకు తెలియునా – ఇంజనీరు కట్టడమ్ము
'పూరు' పాలనమ్ములోన – రంగనికీ రంగమిది
కోనేరులొ పడవేయున? – మున్సిపాలిటీల మురుగు
ముదినేపల్లికి ముద్దుగ – ఉన్నత పిన్నమనేనికి
సంకటములు తీరునా – ఇంటరు తంటాలతో
సబితారెడ్డికి సవిత – గనులశాఖ గరువము
లోహ లోతు కానరాక – లోలుపతల ఖనిజములు
మెదకునందు ఫరీదుకు – ఫర్వాలేదూ పదవి
వక్ఫుబోర్డు మైనారిటీలకు – క్రిందుమీదులుండవుగ?
నాయకులకు 'నాయకుఁడు – తెగల మంత్రి తెలివిగలిగి
కొండకోన పుత్రులకూ – కోరి వరములిచ్చునా?
మారెప్పకు మదుపైనది – ఎత్తిపోతలా వనరులు
వాగులలో నదులలోన – వరపుగ నీరుండునా?

సాంఖ్యతత్వ సారమంత – సరిచూచిన మంత్రాంగం
యాంత్రిక తంత్రం చేస్తే – సొంతం గల్లంతే.

531

నా జీవన మాధురి – నవజీవన సారధి
సంసారపు వారధి – నీవేనా అవధి
లాహిరి లావణ్యంలో – లవ్ గేమే లాంఛనం
పరవశించు ప్రకృతిలో – వశీకరణ వాంఛితం
అందరాని ఆకాశం – అంది అందగించినదీ
వయ్యారం వందనమని – సయ్యాటగ సాగింది
నవనందన ఆమనిలో – వనదేవత మురిసింది
దివిభువి భవ బానిసలై – ఖుషీనిషా కురిసినవి
పెదవి పేరే ప్రేమ – కదిలించగ ప్రేరణ
పలుకు కులుకు కోకిలం – పంచమ స్వర ప్రారాజ్యం
అమరం మరణించిందీ – అందమైన కనులలో
చూపు చూరగొన్నదీ – సుందరమగు ఆకృతిలో
దేవతలే దేవురించు – దేహం నీదైనదీ
దాహంతో దరిజేరగ – అమృతమే అందినది
చందురుడే చెదరిపోయి – నీముఖమున ప్రతిఫలించె
వెన్నెల నెల వెలితిగా – వెలుగుల జడి వెలయించె
బృందావని బృందములో – అందమైన రాధికా
ఎదురుచూపు ఎందుకులే – ఎద ఎదుటే నేనుంటిని
నీవు నేను ఒకటిగా – నింగి నేల ఎదుటగా
అపరసృష్టి చేద్దాము – పరసీమను ఏలుదాము
నింగి నిదురపోయింది – నేల మేలుకొన్నది
నింగి నేల వంగి కృంగి – నిన్ను నన్ను కలిపింది
కలయికలో అలయికతో – ఆంతర్యం వింతగా
వంత చింత మరచిపోయి – జీవరచన సాగిద్దాం.

532

గుట్టురట్టు చేసింది – గుండె గుబులు రేపింది
పట్టుమనీ పదారేళ్ళ – గట్టు తెంపి సాగింది
చిలిపి లిపికి చెలువం – కలికి పలుకు కోకిలం
పసిమి మిసిమి సంగమం – పారవశ్య ప్రతిఫలం
నడక నడుము నవ్యమే – దివ్య హంస దిగదుడుపే
అడుగుల సడి అడగదు – వడివడిగా వయ్యారం
అయ్యారే అమరము – సయ్యారే సమరము
అమరసమరసంగతులే – అసలు గతికి మూలములు
సోలెడైన సోకులోన – మానెడాయె మాధుర్యం
చీరకొంగు చింతనలో – జానెడాయె జాకెట్టు
అందంలో అమెరికా – జవ్వనంలో జమైకా
కోర్కెతీర్చు కొరియా – మార్కునీదె మంచూరియా
మానం మౌనం మారనిది – దానం ఇస్తే తరగనిది
మనసుమైనసయ్యింది – తనువు తపన తీరింది
ప్రత్యణువున అణగారిన – పరవశమే నీవు
నిత్యం నీ గుండెలోన – నిలచిన నిధి నేను
ఇంటర్నెట్ ఇంతీ – కంప్యూటర్ కాంతీ
పే ఛానల్ పడతీ – ప్రేమ కురియు ప్రేయసీ
అందం బంధం వేయగ – బందీనై నిలచాను
బాంధవ్యం భావ్యంగా – బంధాలను తెంచుదాం
రియోడీ జనరీలో – డిజైనర్వి నీవే
ఎఫ్టీవీ ఎరుకలో – మరకలైన మతివీవే
భాగ్యనగర భంగిమలో – అంగాంగం ఆకాశం
ఫ్లైఓవర్ నెక్లెస్ రోడ్ – లై ఓవర్ లైఫ్ నీది
ఆడతనం ఆవిరయి – మగతనమే మరణించిన
విరిసంజీవని నీవుగ – వరియింపుము వలపుతో
వలపుల వాకిలిలో – కిలకిల నగవులతో
కలకాలం కలిసుందాం – కలల నిజము చేద్దాము.

538

కొత్త ప్రభుత వచ్చింది – కొలువుదీరి కూర్చుంది
కోరికలను రేపింది – కోలాటం వేసింది
మంత్రాంగం మాటయనీ – తంత్రాంగం నెఱపింది
హస్తిన ఆంధ్రుల మధ్యా – అటూ ఇటూ ఊగింది
సామాజిక న్యాయాన్నీ – సానబట్టి సాగదీసి
ప్రాంతాల పదవులనే – పాయింటును లాగింది
రైతుల సంక్షేమమనే – తారకమంత్రం చదివి
ఆర్థిక సంక్షోభంలో – సార్థకమై నిలచింది
అసత్యాల వల్లింపును – సత్యంగా మార్చాలని
నిత్య నిధుల వేటలో – నీరవమై నిలిచింది
మేళ్ళెన్నో చేస్తామని – మేలిమి మాటలు చెప్పి
కీడులోన బడిపోయి – కీర్తికొరకు యత్నించు
అసంతృప్తి బిందువులు – అటనిటబడి అన్నికలిసి
కాలువగా కలవరమై – గట్లు తెంచి గమియించును
పదవికోర్కె అధికమై – పరుగు పరుగు హస్తినకు
హస్తంలో గీతలేక – మస్తిష్కం మందగించె
ఉచిత శక్తి ఉద్యమించి – మద్యంలో మునకలెత్తి
మాంద్యంతో ఆంధ్యమయి – ఆర్థికాంధ్ర అంతరించు
వాంఛల వాల్లభ్యంలో – లాభాలే లావణ్యం
లోకుల భువిలోభాలకు – లాభించుట కానిపనే
రాజశేఖరునిఖరము – భారవహన బంధురమై
లాభనష్టముల బరువును – లాగుటయే లక్షణమ్ము.

534

మంత్రివర్గ సర్గములో – మాంత్రికులే మనవారలు
యంత్రాంగపు తంత్రముతో – ఎఱుక మఱకలైన వారు
ఆకలి దాహం వేసీ – కలవరపడికలిమినొందు
కామితార్థ శోభితులు – కాంగిరేసు మంత్రులు
పారదర్శకత సూత్రం – ధన దర్శన పరమార్థం
అవినీతికి ఆమడలో – నీతి నిలువు దోపిడీ

వృధాకావు పైసలు – వ్యథలీన్న పైసలకే
ప్రజలసొమ్ము ప్రజలకు – జల సదృశ పరమార్థం
ఉత్తరాంధ్ర ఉద్దరిణెలో – ధర్మానికి ప్రసాదమే
విజయనగర గరిమలో – గజపతికథ గాంధర్వం
సత్యదేవు సరళికీ – నారాయణ నవ్యమే
సింహాచల కొణతాలకు – రామకృష్ణ విశాఖయే
తూగోజి మోహనం – తురుపుముక్క గోదావరి
పశ్చిమాన పసుపు పోయి – ఎదురుతెన్ను ఎదగుబులు
కోనేరుకు నేరుగా – రంగం సిద్ధం చేసిరి
మురిసిన ముదినేపల్లికి – వేంకటేశ్వరుడు దైవం
కన్నా అన్నగ నిలిచెను – కన్న కలలు కలిమినిచ్చె
క్షీరపురికి సారమిచ్చె – వణిజుడైన కొణిజేటి
నెఱజాణే రాజ్యలక్ష్మి – వెంకటగిరి నెదురుమల్లి
చిత్తమేమొ చితికెనేమొ – చిత్తూరే చిత్తాయెను
అనంతలో దివాకరుడు – అంతమగున? అనావృష్టి
రఘువీరుని రసనతో – రాజ్యపదవి పదనాయె
రెప్పపాట్న మారెప్పకు – మదుపాయెను మంత్రిపదవి
కడప గడప దాటుటలో – శేఖరునికి హంగులొచ్చె
సబితకు సారధ్యమొచ్చె – రంగారెడ్డి రంగంలో
మెదకులోన మేజువాణి – గీతకు గీతము బాడెను
మైనారిటి మహమ్మదుకు – సంక్షేమం బోర్డు పదవి
ధర్మపురి దారిదప్పె – నిజాముని హజాములో
వినోదునికి వినోదమే – ఆదిలబాదు అడవి పదవి
ఓరుగల్లు వరగల్లుగ – లక్ష్మయ్యకు మంత్రిపదవి
కరీంనగరు రీములో – కాగితమే నారాయణ
బూబునగర బాబులకు – బులపాటం ఇల్లె పదవి
హైటెక్కు హైదరబాదు – హైన్యమాయె మన్యములో
గుట్టమెక్కి కళ్ళెం మరచి – గుడిచేటుగ మారకండి
ప్రజల గుర్తు మరచి రో – ప్రళయ మగుట తథ్యం.

535

నందనవనిలో నవ్య రాధికా – వందనమే నీ వయ్యారాలకు
సయ్యాటలలో సాగిపోదమా – సరిగమ పదనిస పాడుకొందమా
రారావేనా రాచగుమ్మడి – రాసిక్యంలో మునిగిపోదమా
పావన జీవన ప్రాదుర్భావం – ప్రకృతి సుకృతి పారవశ్యమే
కలిసిపోయి కలలుకనీ – ఇలయింపుగ లయిద్దాము
రాధిక నీవదనంలో – రమ్యతలే రసించెను
అరుణాధర పల్లవిలో – పల్లవించె ఫలరసాలు
మందారాలా మాధురులే – మాకందపు రసకందాయాలే
పారిజాత నవప్రాభవాలే – పరిణయ ప్రణయపు ప్రాకారాలే
అందాలన్నీ ఆరగించే – అదను పదను ఇదే ఇదే
మదనుని వదనానికిదే – మహదానందమె నెచ్చెలి
రతికోరిక రాజ్యం చేయగ – మతిగతియే మరణించె
శ్రుతి చేయగ శుభ్రమయి – మానసమే సమమాయె
శచీ ఇంద్ర చైతన్యం – చేతనలో కలగాల
రాధాకృష్ణుల రాజ్యం – ఆజ్యంగా వెలగాల
విందుల విలువలు దెలిసీ – విజయాలే పొందాల
పంచేంద్రియ ప్రవణతలో – ప్రణయ జయం పొందాల
శ్రుతిలయలే మతిగతులై – మానసమే పండాల
అనురాగపు రాగంలో – అనునిత్యం నిండాల
కోరికలకు కొత్తందం – కోమలతై విరియాల
విరితేనెల వెల్లువలో – మునిగితేలి మురియాల
నందనమే మనధనమై – జీవనగతి సాగాల
నిధనమైన నీరసమే – సమరసముగ తెలియాల.

536

కోక కోరికయ్యింది – పైట పటువునిచ్చింది
రైక మైకమిచ్చింది – రాసిక్యం పండింది
కలల పంట పండగా – కలిమి ఇంట నిండగా

కమ్మదనం ఇంధనమై - ప్రేమ వంట వండెగా
కట్టుజారి పట్టువీడి - కళకాంతులు వెలయగా
జారుపైట జాకెట్టును - జాజ్జ్వల్యము చేసెగా
కొప్పులోని మల్లెపూలు - కోరికలకు వల్లెయనె
సుమగంధం భవబంధం - సుందరమౌ సూక్తియనె
కంకణ గణనినాదమే - నాదమయి నవ్యమయి
మెట్టెల సవ్వడి కలిమికి - మేజువాణి పలికెనుగా
రంగుల హంగుల రవికెలు - రసరాజ్యపు సోపానాలు
పలురంగుల కోకలన్ని - పరసీమకు రహదారులు
బొడ్డుక్రింది బొమ్మచీరె - బుద్ధి శుద్ధి బూడిదయి
జానబెత్తె జాకెట్టున - జరిగిపోయె దిటవంతా
లోభమైన నడుములో - లాభమెంతొ కలదనీ
జారువళుల జవసత్వం - కరిగించెను కటువంతా
కంప్యూటర్ కళ్ళవరుస - రుసరుసలతొ రూక్షమయి
దశదిశలకు ప్రాకెను - ఇంటర్నెట్ ఇంతితోడ
పలుకే బంగారమయి - ధరవరలే దారిదప్పె
ముద్దు మాట హద్దు చెఱచి - మురిపెమేమొ మూజువాణి
నడక నడ్డి విరిచెను - హంస హింస హ్రదములో
గజము హజముగ గజమాయె - జగమునిండె నితంబములు
కనుబొమలే బొమ్మకు - కలవరమై కలంగెను
ఆపులేని చూపులే - అదిలించెను నాహృదిని
ముద్దుగుమ్మముక్కుపైన - మురిసెనుగా కోపం
పెదవి పంచు ప్రేమలోన - తడిసెనుగా తనువు
చూపున కది సుందరం - మాపునకది మందిరం
రేపునకది రేవడియో - రేచుక్కయె కర్మసాక్షి.

537

మన్మోహనం

మన్మోహన మోహనం - మంచితనపు మాధుర్యం
జనహార్థిక ఆర్థికం - ధనస్వాప్యపు దాహకం

సింగు హంగులన్ని ఉన్న – సిద్ధాంతపు వేదాంతం
కాఠిన్యం కానరాని – కమనీయపు వాఙ్మయం
'నానకు'నవ సిద్ధాంతం – నాణ్యమైన భావనం
వాక్కులు జనవాల్లభ్యం – వర్తన కడు వరణీయం
పదవుల పదనేమిటో – తెలిసికొన్న పరమార్థం
ప్రజాస్వామ్య ప్రగతిలో – గతిశీలపు గాంభీర్యం
భారతీయ సంస్కృతిలో – బాధ్యత గను సంస్కారం
పాశ్చాత్యపు చదువులలో – దేశీయత దేదీప్యం
సారళ్యపు ఆర్థికంలొ – సంగతియే బీదరికం
మార్పుకోర్కె తీర్పులలో – మానవతే మాకందం
రైతురాజ్య రాణువలో – శక్తి నింపు చైతన్యం
నిరుద్యోగ వీధులలో – ఉద్యోగపు కాంతిమతం
అటలు నితలమానికమై – అందించును పాలనం
మతహితమే మంచితనం – సత్యసార సంకలితం
కాశ్మీరపు కాఠిన్యం – కరుణ కరణ సంభరితం
పాకీయుల ప్రాభవం – పరస్పరం అభయకరం
నవ శకంపు ప్రారంభం – మహిమాన్యత మానవం
శాంతి కాంతి విప్లవం – సమవాదపు సహవేదం
జనగణముల జయాంబరం – జాగృత జన సంబరం

538

పదవుల వేటలో – పాలక జనులు
విధుల విస్మరింతలో – వింత విబుధ వర్యులు
విలువలు తెలిపిరి – వలువలు విడిచిరి
సంస్కారం బోధించిరి – సహకారం మరచిరి
ప్రజాకోర్టు తీర్పులో – నేర్పరులై నెగ్గిరి
అందుకొన్న పదవికీ – అవమానం అందించిరి
సమీకరణ కరణములై – రణమున జయమందిరి
జయంభయం విడిచినదై – జననాల్కలు కరచినది
ప్రచారాలు ప్రభలుగా – విభవమ్మును పొందిరి

విచారణలు వింతలుగా – వంత వసుధ పంచిరి
పంచాంగపు అంగములో – పంచభూత భూతములో
వంచన అంచున నిలచిన – వరపాలన పరువములే
నిరంతరం డేగకన్ను – నిరవద్యపు ప్రసారాలు
మీడియాల మిణుగురులు – వాగురలో ప్రతినిధులు
సామాన్యుని చుట్టూరా – సాగవలెను స్వామ్యము
స్వార్థం కనబడినదో – వ్యర్థమె ఆ జీవితం
అసమానత మాన్యంలో – సమానతను పండించే
అసలైన అవగాహన – ఆశయమ్ము నిండాల
కులమతాల కుందాటలొ – అందినదా అందలం
లౌకికత్వ లాభంతో – ప్రలోభాలు వెడలాల
పార్టీల అధార్టీలు – దార్ఢ్యీకం దరినిచేరె
కోర్టుల కోవెలలలో – వెలమీరెను జనస్వామ్యం
వెతుకులాట వేసారెను – గతుకులాట మొదలాయెను
మతిగతిలో మసిబారెను – శృతిదప్పెను జనరాగము
ఐదేళ్ళకు ఐదువగా – హైందవ ధవ విన్యాసం
సన్యాసం సరసకెళ్ళు – సమానతను మరవగా
మంచిలోన మునిగిపోయి – వంచనలో తేలిపోయి
బాంఛలుగా జనులచూచి – బందరు దరి జేర్చుపదవి.

539

నింగినిన్ను చూసింది – వంగి వలపు కురిసింది
పైన పైట పరచింది – పరువపు వెలుగిచ్చింది
పవలు రేలు ప్రగతిగా – పావనతను విరిసింది
సూర్య చంద్ర సూక్తిగా – శక్తి రక్తి పంచింది
లోక లోలుపతలకూ – లొంగని కుంగని విభవం
అభవునంతరాత్మకే – అందును ఆ అందం
స్థావరజంగమ జగతి – స్థాపనకది స్థావరం
స్థాణువులకు రేణువులకు – సరిసంగమ స్థానం
చండతకూ అండనుండు – చలువలకు నెలవగు

544

నీలిరంగు భంగముగా – జాబిలి సూర్యుల వెలుగు
ఆంద్యంతము అనంతము – ఆకాశపు అవకాశం
అవని మానవాళికదీ – నిత్యశోభ శోధనం
వెలుగు కలుగు వేకువలో – తేకువ తెరువులు తెల్పును
చీకు చింత కాంతులలో – ప్రాపగు పలు మించులు
తెలుపురంగు రంగరించి – తెలుపునేడు వర్ణములు
శూన్యమైన సుందరమై – మాన్యమగును మినుకులు
హర్మ్యాలకు చేరువగా – అందించును అందములు
పూరిగుడిసె పూజ్యమయి – నిత్యం నెలవుండు నచట
ప్రకృతి కృతి పరవశమై – పవళించును ధాత్రిలో
పవళించిన ప్రకృతికీ – రవణముగా రాణించును
అణువు అందగించినదీ – పరమాణువు పరవశించె
అండాండము పిండాండము – ఆకాశము అవనులాయె.

540

ఆకాశం అశ్రులుచాచీ – అవనిని తడిపేసింది
తడియారని తనువులో – తాపం మొదలయ్యింది
తాళలేని ఆతాపం – తనువు విచ్చుకొన్నది
మనువాడిన విత్తనమే – మొలకెత్తెను ప్రకృతిగా
ఆరు ఋతువులందగించె – జీవజగతి జిలుగుగా
భంగరహిత జంగమమే – భాసించెను భవముగా
నింగినేల పరవశమై – వశీకృతములాయెను
బతుకు యాత్రగతుకులలో – గతులు మారి గతములాయె
పంచభూత భువనములో – భవనములే నిర్మించగ
పరస్పరము ఆహరించు – పద్ధతియే ప్రచురమాయె
తెలుపు నలుపు తెరువులన్ని – తెలివిలేక తేలిపోయె
కళ్ళకాంతి కలవరమై – కలియుగమే కరిగిపోవు
దృష్టిపథము మారిపోయె – దురిత భరిత జగమాయె
మృష్టమైన సంపదలే – ముదిమితోన ముదిరిపోయె
మందు ముందుచూపులో – మహిమ హిమముగా మారె

వెనుకముందు వెతుకులాట – వెతలకతల మతులాయె
గోప్యమైన గోళములో – గాలమేసి లాగగా
గొనము మారిపోయెను – జనము జవము పోయెను
సింధువులో బిందువుగా – మానవాళి మహోదయం
బంధములతొ బతకలేక – ఆంధ్యమాయె అవస్థతో
నీరునిప్పు తగవులాడ – నిమ్నమాయె జీవనము
గాలికలిసి గరువమై – గమనము దమనమ్మాయె
సమతౌల్యపు సంగమమే – సరళత్వము విరళత్వము
మనిషి మరచి మరలిపోగ – తరలిపోవు సంపదలు
ఆపదలకు ఆదిగురువు ఆకాశం – ఏ పదవుల ఎఱుకలేని అవకాశం
పైకి చూడ పాతకమే – పతనమె ఆ తరువాయి
బతుకు బాధయని తెలిసీ – భావనలే మార్చుకోరు
మార్పుకోరికలకైతే – మారదుగా ఆకాశం.

541

వాయువులో ఆయువున్నది – వాసనలో నాశమున్నది
ఆవరించి వరించినది – ఆచమింప శమించునది
ప్రణవానికి ప్రాణమైనది – ప్రవచనాల మూలమైనది
భావానికి భాషయైనది – అనుభవాల అంశమైనది
హృదయానికి ఉదయమైనది – నిట్టూర్పుకు నీడయైనది
ఆవులింత కాదియైనది – విశ్వాసపు విలువయైనది
జీవుల జవ సత్త్వమైనది – సత్య సార సహితమైనది
దిగంతముల దీపమైనది – దివారాత్రి దీర్ఘమైనది
నాడులలో వేడియైనది – నరనారుల నాణ్యమైనది
అంతానికి అంతమైనది – ఆంతర్యం అంతరమైనది
అనుభవ భవసారమది – అభిమానపు మానమది
సర్వకాల అవస్థలలో – ఖర్వరహిత గర్వమది
ప్రవాహమే పరమావది – పరిసరాల ప్రాభవమది
వాసనమోసుకువచ్చెడు – వరగమనపుదారి అది
మంచిచెడులు లేనెలేవు – మార్గములే గమనములు

పైరగాలి పాటవంలో – దిటవైనది జీవితము
వేడిగాలి వెల్లువలో – వాడిపోవు శరీరము
చల్లగాలి సరళిలో – వరజీవన గమనము
శ్రుతిమించిన వాయువులో – ఆయువునకు ఆటంకము
శ్వాస ఆగిపోయినా – శాశ్వతమే వరవాయువు.

542

అందానికి చందనం – బంధానికి వందనం
ఆకృతి కది ఆలయం – ప్రకృతికిది పరవశం
ప్రకృతి పరమేశ్వరులకు – ప్రాచీనపు అనుభవం
అదినవీన జంటలకూ – విదితమైన ఘనవిజయం
కనగలిగిన కాముకులకు – కమనీయపు చెలువం
కానలేని కఠినులకూ – కంటగింపు ఫలితం
స్వర్గ సర్గ వర్గములో – శోభనంపు విభవం
అమరావతి అవనిలో – ఆశయాల సాఫల్యం
అందం బంధనమైతే – బంధుత్వం బధిరమౌను
బంధం అందమ్మైతే – విందగునుగ బాంధవ్యం
తాత్వికత్వచర్చలలో – అందం అశాశ్వతం
ప్రేమ పెంపకమ్ములో – అగ్రేసరమైనది అందం
వాంఛల అంచుల్లోనా – బాంఛయె జన అందం
కోర్కె కొండ లెక్కుటకూ – కోమలతయె బంధం
మండనాలు మండించగ – మక్కువ మిక్కిలియగును
మధురమైన ఆకృతులకు – మండనమొక ముండనమే
చిరునవ్వులు చిందించెడు – విరజాజుల అందం
జాజ్వల్యం జనులలోన – జావళీలు పలికించును
అందం ఆరాధనే – అందరిదౌ ఆశయం
ఆశయమే శయనించగ – ఆకృతులకు వికృతే
తాత్కాలిక తరుణవయసు – తాపమునకు నిలువదు
కదలిన ఆ అందానికి – బదులిచ్చుట తప్పదు
కోడెవయసు వాడిపోయి – కోలుపోవు అందం

వేడుకొనగ వెల్లువయై - వేళమించు చందం
ప్రకృతి పురుషుల అందం - సుకృతికై సుందరం
ఆకృతులను అధిగమించ - అవని సుధల నందనం

543

ఇది జీవన సమరం - మది మారని స్వార్థం
ఇది ఆరని గుండం - అదె మానవ గండం
అందరాని అందలాలు - అందుకొనగ కష్టం
అందిన ఆ అందాలను - అనుభవింప ఇష్టం
నష్టమైన బతుకునూ - నవ్యంగా దిద్దుకో
కష్టమైన కామితాలు - యత్నంతో అందుకో
కలికాలం కలయనీ - కలకాలం నమ్ముకో
నమ్ముకాని కాలాన్నీ - వశపరచుకు మసలుకో
చితి చింతను వదలుకో - మతివంతల మానుకో
వల్లెయనీ వల్లకాడు - వచ్చుననీ తెలిసికో
జీవుల యెడ కారుణ్యం - జియ్యరుదని తెలిసికో
జియ్యరునీవే యగుటకు - జీవనమని తలచుకో
భేదాలు బాధలూ - భేషరతుగ స్వాగతించు
వేద్యంలో ఖాద్యంలో - వెలుగును వాంఛించుకో
బంధాలూ బంధువులూ - భారమనీ బంధనమని
భవసాగర సీమలో - బతుకు జీవులని తెలియుము
జన్మజయం కోరినా - జాతినీతి నేర్పినా
జీవసత్త్వం రాగానే - జయమందును స్వార్థం
అసువులు తీసెడి అర్థం - మసిబారిన బతుకులోన
విసువు గొలుపు విపరీతం - ధన జగతికి సోపానం
మారెడి నీముఖంలోన - మనువర్తిని గాంచుము
జారిపోవు జగతిలోన - జావళీని లిఖియించుము.

544

మూలం తెలియని మూర్ఖం - మూజువాణి మోదం

అంతం తెలియని ఆంధ్యం - అందానికి వందనం
ఎనాడో ఎక్కడో ఏదో ఒక చలనం
ఒకనాటికి చాలనమై వరియించెను భువనం
సృష్టి స్రష్ట సృజనలో సుందరమైనది జీవనం
జీవజాల జగతిలో జాజ్జ్వల్యం జీవనం
రోజులెన్ని జరిగినా రాజనాలు పండినా
రాజుపేద ఒకటేనని తేజమొకటి తెలిపెను
వేదాలూ వాదాలూ వేళమించి వెలుగుచూపె
నాదాలూ నినాదాలూ - నవజీవన గతులాయె
స్వార్థశోభ వర్థిల్లగ - అర్థము అన్వర్థమాయె
శోధనలో సాధనలో - బోధనలో బాధలాయె
నాకు నేను నాది నీది - మీకు మీరు మించినదై
వంచనలే మించిపోయి - వసుధలోన సుధపోయె
చేదునిజం చేతనమై - చేతములను ఆవరించె
అసత్యమే అనునిత్యం - అవనిని పాలించు చుండె
భావాలకు గౌరవమ్ము - భాషలకది భాగ్యము
మనస్సులో మలినాలకు - మానవతే వైద్యము
ఎన్నిదశలు మారినా - ఎన్నిదిశలు తిరిగినా
ఎంత అనుభవమ్మున్నా - వంతయె జనవాల్లభ్యం
వసుధ సుధను వాంఛించక - స్వర్గ సుధను కామింతురు
ఉన్న జనుని హితమెంచక - దేవు హితము దేవురింత్రు
నీ మూలం నీవుకాదు - వేరు వేరు కలదుగా
విత్తనముగ శిరసునెత్తి - విడివడినది నీవుగా
స్త్రీపురుషుల కలయికలో - శ్రీకరముగ ఫలమునంది
అండాండము అమృతమై - పిండమైన పిడుగువీవు
గ్రహపాటున గరువమంది - పవలురేలు ప్రగతిగాంచి
నేటి నీవు నెనరుగా - నేర్పుతీర్పు మార్పు పంచు

545

కాకిజీవితం - కారుణ్యభరితం

కలికాల కాఠిన్యం – కలకాల కలకలం
బలిభుక్కని భావింతురు – భవబంధము లెన్నుదురు
పితృదేవతగ నెంతురు – పిండములను పెడుదురు
కాకాసుర కథలలోన – కార్పణ్యము చూచెదరు
ఏకాక్షిగ ఎఱుకలోన – కఱకు దృష్టి కామింతురు
కాకాయని అరుపులోన – పోపొమ్మని ఛీత్కారం
పక్షితతుల వరుసలలో – పాక్షికమౌ ప్రాభవం
కోకిలమ్మ కోర్కెలో – కాకమ్మే అమ్మయగను
జన్మనెరిగి పెరిగినా – ధన్యత కలకూజితమే
తెల్లకాకి లేదనే – తెలివిగల్గు మానవులు
తెలివి తెల్లవారగా – తెలుపుకాకి కనబడెను
మాలకాకి మంచికాకి – వంచనకే బాంఛలు
ఉచ్ఛిష్టం ఉన్నతమని – ఊరువాడ తిరుగును
అపశకునం కాకియని – అందరు అనుకొందురు
జీవశాస్త్ర పరిభాషలో – శాశ్వతమై చెలువము
బతుకు మెతుకు కోసమనీ – వెతుకులాట వేకువతో
కూనల ఆకలి తీర్చి – కునుకు మినుకు కాంతిలో
దూరము భారముకాదు – దురితము చరితము కాదు
జీవజాల జగతిలో – పక్షికికుక్షే పరమార్థం.

546

భవితవ్యం నీదిరా – బాధపడకు సోదరా
బతుకుబాట గతుకులలో – మతిని గతిని మలచరా
యువరక్తం నీదిరా – ఉదయ కిరణమీవురా
వేకిరణపు వెలుగులతో – వెతలుమరచి సాగుమురా
విద్య వధ్యమౌనురా – విలువ నెరిగి నేర్వరా
బతుకు విద్య బంధనముల – విందుగ ఇంపొందురా
జన్మనిచ్చు తలిదండ్రుల – ధన్యులుగా నెఱుగుమురా
అభ్యున్నతి కాంక్షింతురు – అమితప్రేమ కురిపింతురు
గురువు గూటికెళ్ళనీవు – పరువు ప్రగతి గాంచుమురా

చుట్టుపట్ల లోకంలో – సుందరతలు పొందుమురా
నీవు నీవు కాదురా – నీకు మూల మున్నదిరా
మూలమెరిగి వర్తించుము – ముద్దు జీవి నీవెరా
నేనెవరని ప్రశ్నించీ – నెఱిజవాబు గాంచరా
ఈ సృష్టీ ఏమిటనీ – స్పష్టముగా తెలియుమురా
ఎదుటివాడి ఎదనెరిగీ – అదనుగ వర్తించుమురా
మథనమెనీమనుగడయై – మధురిమలను పొందరా
తెలివి తేలిపోకూడదు – తెంపరివై తెలియరా
నీచవర్తనమ్ముమాని – నిధుల విధుల గాంచరా
హక్కునీకు భుక్తమే – బాధ్యత నీ బంధువే
రాకడ పోకడలన్నీ – రాజ్యాంగపు అంగములే
సమభావన నేర్వరా – సరళముగా సాగరా
తిరుగుబాటు తీరు అనే – బతుకుబాట తెలియరా
అహంకార శత్రువుతో – మిత్రత్వము వీడరా
మమకారపు మానవతలొ – మార్ధవమ్ము కలదురా.

547

విప్లవాలు సాగాలా – వినువీధిని తాకాల
వినువీధిని సూర్యుణ్ణి – భూమికి కొని రావాల
అనునిత్యం సత్యమై – అనుభవాలు వెలయాల
అనుభవాల వాహినిలో – అభయమంకురించాల
హృదయం ఒక పద్మమై – హ్రదమున వికసించాల
పరిమళాలు పుప్పొడులు – పరిఢవిల్లి విరియాల
జనరంజక జాగృతిలో – జాతిజయం పొందాల
నీతినియమ నిబద్ధతలు – నేటి నడతలవ్వాల
అరుణిమ జన అరణంగా – మరణమైన మురియాల
రణనినాద మరణంలో – రమ్యతనే చూడాల
గుండె గురుతు గురువుగా – పరువు నిలుపుకోవాల
సడిచప్పుడు నినాదమై – ప్రతిధ్వనులు పలకాల
ఆశయాల ఆకాశం – అందరిదని తెలియాల

ఆవేశం అవసరమై – ఆశయాలు పండాల
మార్పు నేర్పు మహితమై – మానవతే నిండాల
తీర్పు తీరు తియ్యనిదై – పరిణామం సాగాల
పదుగురిదై ఫలమంతా – ప్రవచనాలు పలకాల
వేదవెలుగు వాగురలో – వేళదెలిసి నడవాల
భరతజాతి భావనలో – పరిప్లవమె ప్రాకృతికం
విప్లవాల విజయమే – సాంస్కృతికపు సాహిత్యం.

548

సోనియమ్మ

సోనియమ్మ రాజ్యం – శోభల సంపూర్ణం
ఇందిరమ్మ మందిరం – అందరిదీ అనుభవం
దేశీయత దేవళం – విదేశీయ విమతం
భాజపాకు బాధాకరం – భారతికది సమ్మతం
సోషలిజం శోభలోన – విజయమందు తథ్యం
భాష భూషలేవైనా – భావమదియె బంధనం
ఇటలీ జన్మకు చెల్లు – ఇండియా కోడలి ఇల్లు
వ్యాపారం వ్యాపృతమై – వ్యవస్థలో సుస్థిరం
నెహ్రూల నేవళతకు – గాంధీల గౌరవానికి
అందలమిచ్చుట అందం – అవసరాలు తీర్చుట సత్యం
సామాన్యుని సణుగుడులో – అణగారిన అసంతృప్తి
అవసరమై ఆవరించి – వరించెనుగ సోనియాను
దాహమైన అధికారం – దహించెను భాజపాను
సిద్ధాంతపు సుద్దులతో – సద్దుమణిగె ఎన్‌డిఏ
లౌకికత్వ లోకానికి – తలుపుల తలపులు తెరిచె
ప్రగతిశీల భావానికి – భాష్యాలే చెప్పుచుండె
ఐదేళ్ళకు అందలం – అంధకారమైన వేళ
అవతరించు విప్లవం – తరించుటే తరువాయి
కోటరీల కోర్టులో – కోర్కెలకే తావుండదు

బొమ్మలాట ఆడితే – కుమ్ములాట కూలగొట్టు
వైరుధ్యం తక్కువే – వైభవం మాట కన్పించదు
సారూప్యం సారళ్యం – సహనానికి సవనానికి హద్దు
కాంగ్రెసు రేసుగుర్రం – కళ్ళెం ఇతరుల చేతుల్లో
చేతకాని సోనియా స్వారి – చేతులు కాల్చునిజం.

549

వశ్య వాక్కు వాక్యమై – వసుధను నడిపించెను
ప్రవక్తయే క్రీస్తుగా – ప్రభవించెను ప్రభువుగా
ఆదిగ్రంథమే ఆధారగ్రంథమై – అందరికందెను అపవర్గమార్గమై
పరిశుద్ధ గ్రంథములో – పరమార్థము నిండెను
పావన ప్రభుమార్గములో – ధనధాన్యము లుండెను
అక్షయ నక్షత్రముగా – అవతరించె మన ప్రభుడు
కాలము చలికాలమై – చల్లని ఆశీస్సులనిచ్చెను
ఆర్తికి మూర్తిగ తానై – ఆపదలో వెంట నిలచు
పాపము ప్రక్షాళనముకాగా – పావనతను పంచును
రక్తధారచిందించెను – రాక్షసత్వ జనమధ్యన
ముళ్ళకీరిటమునుదాల్చి – ముక్తి నిచ్చె జనావళికి
క్రీస్తు రాజ్యమందునా – కీర్తి మానవత్త్వమునకు
సైతానుల సహించగా – సహనమూర్తి మనయేసు.
వాక్యమందు ఐక్యమైన – వాసి మానవాళికీ
క్రీస్తు బోధ భాగ్యమగును – బాధలలో మానవులకు
శిలువలోని చెలువమే – చైతన్యము యువతకు
మందిరము మహత్వమే – మనలోకపు భవితకు
క్రీస్తు జన్మయీ భువిలో – ఆస్తికతకు ఆరంభము
దేవదేవు దేహమునకు – హృదయాంజలి అర్పింతము
ఏ చర్చియందైనా – ఏ పేరున పిలచినా
ఆయేసు నామమే – మమేకమౌ మహిలో
ఏసును ధ్యానించెదము – ధ్యానముతో రండు రండు
ఏసును ప్రార్థించెదము – ప్రాభవమ్ము తోడ రండు

ఏసును కొలిచెదము - ఏసు చింతనతొ రండు
ఏసు జన్మ వింత సుమీ - చింత వంత రాదుసుమీ.
వసుంధరయె సుందరమై - అందమె ఆనందమై
మరియ నందవందనుడై - వందితుండు జనయేసు
మనసులు మురిపించును - మరియ తనయు జననము
దేవదేవు దర్శించగ - దురితములన్నియు తొలగును
పాపములను కడిగివేయ - పరమాత్మగ నిలచును.

550

వశ్య వాక్కు వర్తనులే - ప్రవక్తలై ప్రభువులైరి
విశ్వనరుల విభులైరి - నశ్వర కీర్తిని గాంచిరి
జీవరాశి జిలుగులనూ - జియ్యరులై శాసించిరి
జాణలైన జ్ఞానమతులు - జ్ఞాతులు జనమతములకు
నియమనిష్ఠ నిధులైరి - నిగమసార నిత్యులైరి
నీతి గీతి పాత్రతతో - పాపజనుల పాలించిరి
విగ్రహమ్ము ఆగ్రహమ్ము - విలువల నక్షత్రము
చంద్రవంక చలువలే - సాంద్రమైన హృదయప్రేమ
ఆరాధన ఐదుసార్లు - అమరమైన మసీదులో
అహింసయే హంసము - హింస నిత్య త్యాజ్యము
మహమ్మదుని ఆశయము - 'ఖతీజమ్మ' కమనీయము
మానవత్వ మహిమలో - సంతానము స్తవనీయము
సంఖ్యకు మీరిన సూక్తులు - సంస్తవనీయము గ్రంథము
ఖురానాయె ఖరులకూ - కార్ఖానము సంస్కరణము
దారిజూపె దానమూ - త్యాగమె జనవేద్యము
గరీబులకు నవాబులకు - గమ్యము ఖబరస్థానము
మదీనలో మాధవుడై - మక్కాలో దివ్యుడై
మహ్మదీయ మదులలో - మధువు నింద జేసెను
సలల్లాహీ వసల్లం - సహృదయుల సర్వస్వము
ఆతని చరితను వినగా - మతమే జనహితము
మత్తుమందు బానిసలై - మతము హతముజేసిరి

హితము 'అల్ల' మతముగా - హితోక్తులకు సలాములు
ఆచారము అలవాట్లూ - అందరికీ వ్యక్తిగతము
శక్తి జీవవాక్కులే - భక్తి జనత భాగ్యము
భారతీయ సంస్కృతిలో - భాగమైన ఇస్లామూ
లౌకికమై లౌల్యరహిత - స్వార్థమైన వ్యర్థకవిత
మతముల మార్పాటలు - హితమునకే దూరములు
రాజకీయ స్వార్థములో - రాబందుల క్రీడలు
సఖ్యత విఖ్యాతముగా - ఆఖ్యాతము అనుబంధము
విద్వేషము వేషముగా - విలువలకే విధ్వంసము

551

దేవుని వాక్యం - దేహుల వాక్యం
దివ్యము వాక్యం - నవ్యము వాక్యం
కీర్తన వాక్యం - వర్తన వాక్యం
కీర్తికి వాక్యం - ఆర్తికి వాక్యం
అందరి వాక్యం - ఆనంద వాక్యం
జీసస్ వాక్యం - జీవన వాక్యం
సాఫల్య వాక్యం - సంస్కార వాక్యం
సాధువు వాక్యం - సంఘము వాక్యం
మోక్షము వాక్యం - మోదము వాక్యం
అక్షర వాక్యం - అక్షయ వాక్యం
దావీదు వాక్యం - ధారణ వాక్యం
ధరణికి వాక్యం - స్మరణకు వాక్యం
మోషే వాక్యం - మోదము వాక్యం
మరియమ వాక్యం - మాధుర్య వాక్యం
పేతురు వాక్యం - ప్రేమల వాక్యం
యోబుని వాక్యం - యోజన వాక్యం
కల్వరి వాక్యం - కారుణ్య వాక్యం
రక్తపు వాక్యం - శక్తికి వాక్యం
త్యాగము వాక్యం - తెరువుకు వాక్యం

యోగము వాక్యం – యాగము వాక్యం
శాంతికి వాక్యం – కాంతికి వాక్యం
దయకీ వాక్యం – జయ జనవాక్యం
ఆరోణి వాక్యం – ఆదరణ వాక్యం
మెస్సీయ వాక్యం – మేదిని వాక్యం
విశ్వపు వాక్యం – విజయము వాక్యం
వశమున వాక్యం – వలపీ వాక్యం
వాక్యం వాక్యం – వాదర వాక్యం
వేదన వాక్యం – సాధన వాక్యం
వాక్యం చదువూ – వ్యాఖ్యను వినుమూ
ఆచరణముతో – అశాంతి విడుమూ.

552

నీతిని 'నియంత్రి'ంచి – జాతిని 'భయం'త్రించి
ధర్మాన్ని ధరణినుంచి పారద్రోలుతున్న దారుణ మానవా!
దేశం దేహం జాతి జాగృతి తెలియక జాగరణ చేస్తున్నవా!
అరుణారుణ వరణానికి అంధత్వం ఆపాదిస్తున్నావా!

కరుణామయ జీవుల 'కల' కలవరమని భావిస్తున్నావా!
ప్రకృతి ప్రాకృతికమని ఆకృతినేవికృతం చేస్తున్నావా!
సంస్కృతి సంస్కారములకు సరళత్వం సమీకరిస్తున్నావా?
పంచభూతముల భూతాకృతి పరార్థమని అర్థమౌతుందా.
సమతౌల్యత సాధుత్వం సంగరమని భ్రమిస్తున్నావా.
నీవు నేను నిత్యమనీ నింగికి నిచ్చెన వేయకు
నిచ్చెనమెట్లన్ని నీకు విచ్చుకొన్న జ్ఞాన నిధులు
కోట్ల జీవరాసులకూ కాట్లాటలు కోట్లకొరకు
కోట్లుగాట్లు వేయువేళ – కొర్కెలెండమావులు
నిగమసార మెరుగు నీకు ఆగమ 'ఆగము' లెందుకు
సాగిన ఆ'గమము'లే గమనమునకు అడ్డంకులు
కాలము మారుననీ కాల్చుకోకు జీవితాన్ని

మిగిలిన ఆ 'బొగ్గు'లే నాగరకత 'వెలుగు'దార్లు
కాలుష్యపు కాసారం – కలవరమే యాంత్రికం
కల్తీలే కలియుగమున – కాలనాగులగుచుండెను
కాలకుండువిధము తెలిసి – చేతులనే కాల్చుకునీ
ఆకులనే పట్టుకొన్న – అసలు జ్ఞానమంతసున్న
ప్రమాదమ్ము పొంచియుండె – పల్లెపట్టణములకూ
పచ్చదనం పరుగుపెట్ట – వెచ్చదనం విచ్చుకొనెను
ఋతుక్రమం రుజలతో – గతులు మతులు గాడిదప్పె
రుజలనుండి రుజువుగా – బయటపడగ బాధగలిగె
మతవాదం మితవాదం – మారణమై రణమై
మతము 'మందు' విందాయెను – అభిమతమని తెలియగా
వర్తనమారగా నర్తనమిగిలెను – కీర్తన ఆర్తిగా కీళ్ళను విరిచెను
భూమి ఉన్నదని తెలియక – ఆకాశం హద్దాయెను
అవకాశం ఎదురుచూడ – అమీతుమీ తెలియదాయె.

553

మరణమె జన అరణముగా – మహాత్ములే ప్రభవించిరి
జీవన ఆవరణములో – జీవితమును త్యజియించిరి
జనుల వేదనల దీర్చెడి – వెలుగు వేల్పులుగనిలిచిరి
బాధగాథ వారిదిగా – భాగ్యములను పంచెనుగా
వేద వెలుగు వెలుతురులో – వైభవమే హైందవము
పురాణముల పూజ్యతలో – ఆద్యమాయె మిత్రత్వము
కావ్యకథల గాంధర్వము – అధ్వరమై సాహిత్యము
ఆద్యంతము అనుశ్రుతులు – అపశ్రుతుల అవహేళన
మనిషిజన్మ మహితమాయె – మనీషియై మాన్యమాయె
మనస్వియై మనసునిండి – మధువులు పంచినసుగతి
పంచభూత భువనములో – పంచేంద్రియ ప్రభలతో
పరార్థమే ప్రగతికాంక్ష – పరమార్థమె అదిజనునకు
'అడియాశల మడి'మనిషి – కాంక్షల కడలియె జీవి
ఆశయాల ఆలయంలో – లయమగుటే జనునిగతి

ఆశయాలు శయనించగ – ఆశలు ఆకాశమంటె
శయనము పయనముగామారును – చైతన్యపు వెలుగు కలుగ
లక్ష్మణరేఖలు గీసిన – లాక్షణికులు నిద్రించిరి
ఆంక్షల కాంక్షలు మీరగ – ఆహరణము మొదలాయె
పాలక 'రాములు' భీములు – అభిరాములు అందరికీ
ధర్మ మర్మ కర్మలలో – ధరణికి ఐతిహ్యమాయె
సాంఘికమే ఆంగికమై – సరసార్థ వాచికయై
ఆహార్యము అందమై – జనాటయే సాత్వికము
హితమైనది 'మత'మైనా – జనమతమే ఫలశ్రుతి
నాంది మానవత్వమై – విశ్వమతము హితము
స్తవముగ జనక్రైస్తమై – వాస్తవ ధర్మము 'హిందు'గ
మహ్మదీయ మానవతే – మనందరికి అభిమతము
చదువులెన్ని చదివినా – పొదుపు లెన్ని చేసినా
హార్థికమ్ము ఆర్థికమ్ము – ఆచరణమె అసలు చదువు
మరణించీ మరలపుట్టు – మహితాత్ములు ఎందరో
వారి గాథబోధలన్నీ – వాస్తవమై వర్థిల్లును.

554

దేహి దేహములు – దేవుని వరములు
దివ్యవాక్యములు – భవ్యమురిపెములు
భవ్య జనులకూ – దివ్యౌషధ మిది
ఆచరణమునా – అందమైనదిది
మనోచంచలము – మహావిషాదము
విషాదయోగము – విజయపు మార్గము
సాంఖ్యయోగము – సవ్యాఖ్యానము
జీవుని విలువల – జిలుగుల హారము
కర్మయోగమూ – కార్ముక మైనది
కర్తవ్యములకు – వర్తుల విలువలు
జ్ఞానము జ్ఞేయము – జాణయైనది
అన్నియోగముల – అర్థవంతము

కర్మల న్యాసము – మర్మము దెలిపెను
సమదర్శిత్వము – సవనమాయెను
సంయమనియమము – సమయోగమ్మని
ఆత్మనిగ్రహము – అర్థము దెలిపెను
విజ్ఞానము జన – వినుతిజ్ఞానమని
విభుత విలువలను – వివరణసేసెను
క్షరము అక్షరము – భేదము దెలిపెను
బ్రహ్మము తెరువును – బాగుగ జెప్పెను
ఆధ్యాత్మికమే – రాజవిద్యయని
రహస్యమంతయు – రమ్యత దెలిపెను
వరవిభూతులే – పరముని మహిమలు
తెలిసియు తెలియని – తెరువుల వరుసలు
నశ్వరమైనది – విశ్వము రూపము
యోగముకాగా – యోజన మహితము
భక్తిభావమే – భాగ్యయోగ్యమని
యోగమందునా – ఉన్నతి దెలిపెను
క్షేత్రమేదియో – క్షేత్రజ్ఞుడెవరో
సంవాదముగా – సవదరించెను.
తమసు రజసులా – తారుణ్యములను
గుణముల ధనములు – గురుతుగ దెలిపెను
ఉత్తమ పురుషుడు – ఉన్నతుడెవరని
అంశల వివరము  అసలును తెలిపెను
అసుర లక్షణము – సురల లక్షణము
సుందర సంపద – యోగము దెలిపెను
శ్రద్ధలు మూడని – ఇద్ధము విలువగ
రజసును తమమును – సత్వము సరళిగ
మోక్షమార్గమును – శిక్షణ జేసెను
అన్నియోగముల – అంతస్సారము
దేవుడొక్కడని – దివ్యుడాతడని

పేరులు వేరుగ – పేలవమాయెను
జనన మరణముల – జాగృత జీవులు
కర్మజ్ఞానముల – మర్మయోగముల
కలియుగమ్మున – కలతలు వీడును
తెలివిగ తెలిసిన – తెరువులు దెలియును
ఆచరణమును – ఆరోగ్యమ్మగు
జననము దెలియదు – మరణము దెలియదు
మర్మమిదేయని – మహితులు చెబుదురు
అమర్మములే – ఆదిసూక్తులు
మతగ్రంథములూ – 'అభి'మతమ్ములూ
విశ్వమానవుల – వినుత 'గీత' ములు
భగవద్గీతల – భాగ్యయోగములు
మానవ శ్రేష్ఠులు – మహిమాన్వితులౌ
మహాయోగములు – 'గీత'యోగములు
యోగం యాగం – యోద్ధల కర్మలు
యోజన మనసులు – జనతకు ఘనతలు
భాషలు వేరగు – భావము ఒకటగు
ఆచరణమ్మిట – అందరి విలువగు
సనాతనమ్మది – సంస్కారమ్మది
పురస్కారమది – పూజ్య జీవులకు

555

కాలము కలగా – జీవన'మల'గా
జీవితార్ణవము – జిలుగు వెలసెను
క్రీస్తుపూర్వమున – కీర్తికలిగెనని
జాస్తిగపలుకగ – జవము లేదుగా
తదనంతరమే – తారుణ్యమ్మని
తలచిన ఫలితము – తలపున మెదలదు
ఆధునికమ్మే – అనంతధునియని
ఆరాధనమున – నవ్యత కొఱతగ

560

దివ్యము సవ్యము – దిటవే పటువే
భవ్య జీవనము – బాధల కొలువే
బాధ బోధలూ – భాగ్యము కొఱకే
యోగ్యమైనదీ – యాగములాయెను
వేదము వేధకు – వేకువ మార్గము
వేద్యము చేయగ – 'వెలుతురు' కరవయె
బ్రహ్మజ్ఞానము – బ్రాహ్మణీకమూ
బతుకు తెరువుగా – ఒకటని తెలిపిరి
జాతులు కులములు – మాతకు లేవిట
మానవకులమే – మానవతత్త్వము
మాతకు పేరులు – జాతికి ఒకటిగ
'మతము'లు పెరిగెను – సతమతమాయెను
గొప్ప తక్కువలు – గోముగ పెరిగెను
తక్కువతనమే – తరళమ్మాయెను
సాంకేతికమున – సరళత పెరిగెను
సంకేతమ్మిట – సర్వసమతయే
రాచరికములూ – రహిని వీడెనూ
జనపాలనలూ – జాతి కోరెనూ
విశ్వమానవత – విలువమారెనూ
నశ్వరమేధయె – నాటకమాయెను
దేశపు హద్దులు – ముద్దుగ మారెను
దేవళమ్ములిట – హద్దుల పద్దులు
కలిమి బలుములు – కలవరమాయెను
కలవరమ్ములే – కఠినములాయెను.



556

ఆంధ్రమా సాంద్రమా – అమరావతి చంద్రమా
నాయక జననాణ్యమా – కీర్తి క్రీస్తుపూర్వమా

గుంటూరు విజయవాడ – గురువు గురుతు పరువుగా
కృష్ణమ్మ కృపగల్గగ – తృష్ణదీర్చె తృప్తిగా
శాతవాహనాంధ్రమా – పల్లవ జనపల్లవమా
కాకతీయ రౌద్రమా – రాయల రణరంగమా
అంగరంగవైభవమా – రాజధాని రాజ్యమా
అదరహో అమరావతి – ఆనంద తాండవమా
బుద్ధుని నవబుద్ధమా – మహో చైత్య మరువమా
అమరేశ్వరలింగమా – వాసిరెడ్డి వేద్యమా
దుర్గమ అపవర్గమా – మేరిమాత మేలమా
మొగల్రాజ మోహమా – ఉండవల్లి ఉద్యమమా
కొండవీటి కోటరమా – కొలువు దీర్చు కొలుపులా
కలల రాజధానిగా – ఇలస్వర్గము ఇంపుగా
కలనిజమై కలిమిగా – కలకాలము నిలచుగా
చంద్రబాబు చెలిమిగా – చైతన్యము మేధగా
ఆలోచన ఆచరణగ – అందగించు అమరావతి
పట్టణములు తొమ్మిది – పట్టుగొమ్మ లాంధ్రమునకు
విశ్వనగరి వీధులలో – విహరించును మననగరి
అమరావతి నిర్మించగ – రాళ్ళెత్తగ రండిమీరు
నగరి పొగరు రూపఅగనూ – వరమగునుగ వసుధకూ
సమగ్రమూ అగ్రమూ – సాంకేతిక వ్యగ్రమూ
పచ్చదనపు పరిమళము – పారిశుధ్య వైభవమూ
వస్తురీతి వాస్తుగా – విస్తుపోయి చూడగా
వాస్తవమౌ కలగా – నేస్తమగును అమరావతి
తుళ్ళూరూ తుళ్ళిపడెను – తాడికొండ తడబడెను
పెనుమాకా పెనుగులాడె – మంగళగిరి మంగళమనె
అటుచివరా అమరావతి – ఇటుచివరా తాడెపల్లి
ఇంపుసొంపు మండలాలు – అండయె అమరావతికి
రజినిలోన రాజధాని – రాజిల్లును వెలుగులో
ఆటంకములన్నియును – అంధకారమున గలియును

పర్యాటక ప్రాభవమా – విద్యలకే విజయమా
పరిశ్రమల ఆశ్రమమా – శ్రమజీవుల చెలువమా
ధన్వంతరి శాస్త్రమా – వైద్యశాస్త్ర వైభవమా
క్రీడాస్థలి కేంద్రమా – ప్రాధాన్యపు ప్రాంగణమా
ధాన్యకటక ధన్యమా – ధనధాన్యపు మాన్యమా
పాలక జన పరువమా – పాలిత లావణ్యమా
సాఫ్టువేరు సారళ్యమ – హార్డువేరు ఆలయమా
శాసనసభ ఆసనమా – సచివాలయ సదనమా
న్యాయాలయ న్యాసమా – నేల వెలుగు నేస్తమా
ధ్యానబుద్ధ ధ్యేయమా – నాగార్జున జన్యమా
జ్ఞానగణ్యగరువమా – దివునల జనసేవ్యమా

557

ఈశాన్యుని ఈవితో – తూర్పు వెలుగు మార్పుతో
ఉత్తర దక్షిణదారులు – ఊరి ఉన్నతికి పదములు
బాధ్యత గలిగిన యోగ్యులు – భారతాంధ్రనాయకులు
మోడి చంద్రబాబులు – మోదమిచ్చు అమరవనికి
ప్రజాప్రయోజనములే – ప్రాధాన్యము ప్రవరులకు
వారిజనుల గుర్తింతురు – మరచిపోరు తరములకు
నీరు నిధిగ నిలబెట్టగ – పెద్ద పెద్ద చెరువులన్ని
వృథానీటి వృత్తముతో – చెట్ల పెంపకమ్ము జరుగు
రైతులిచ్చు భూములకూ – ప్రతిగ భూమి ప్రధానమై
ఆవాసము పరిశ్రమలు – కోరిన చోటున ఇచ్చును
విజయశక్తి విద్యుత్తూ – సూర్యశక్తి శుభకరము
గాలిశక్తిగరువమూ – బొగ్గుశక్తి అగ్గువము
చెట్టుచేమ చెలిమి బలిమి – గట్టు మిట్ట పట్టణమ్ము
కృష్ణకట్ట కిరువైపుల – కృతి ఆకృతి పరమాకృతి
అమరులు మానవులుగా – అమరావతి స్వర్గమై
ఆంధ్రులకది అపవర్గము – మార్గము నవ్యాంధ్రకది
సరసము సాహిత్యము – హితముదాని సర్వస్వము

కళలన్నియు అలలుగా – నిండెను ఆంధ్రార్ణవము
నాటినుండి నేటివరకు – నవ్యము జనదివ్యము
పోరాటము ఆరాటము – ఆంధ్రావని కొండాటము
తెలగాణము ఆంధ్రము – తెరువులు వేరాయెను
వగలు పగలు వలపులుగా – తెలుగు తలపు తేరునెక్కు
మనసులు మలినములతో – మసకబారె మానవతా
దినుసు విశ్వమానవతగ – దివ్యదారి నవ్యాంధ్రకు
నమ్మకమును అమ్ముకొనగ – దానిని కొందరు కొనగా
దిటవు పటువు పడిపోవును – పరిపాలన ఫలము విడును
యువత దారి గోదారిగ – పొంగి సంద్రమునకు పోవు
కట్టగట్ట కలల ఫలము – కాలధర్మమర్మమదియె
బతుకు రణము నియంత్రణము – యాంత్రికమై యాతనాయె
స్వాగతమ్ము నిస్వార్థము – స్వార్థశోభసొగసు కాదు
ఆంధ్ర అందమగునుగా – అమరావతి సాక్షిగా.

558

వసంతాల సంతలో – వస్తువులే కవితలు
వాస్తులేని సౌధములో – గేస్తులు మనకవులే
ప్రాచీనం ప్రాచ్యమనీ – ప్రాభవమ్ము నవ్యమనీ
అప్రాచ్యం మద్యమనీ – ఆధునికుల అభిభాషణ
పద్యం హృద్యమనీ – వేద్యులు భాషింతురు
వచనము చనువనీ – వచియింతురు విదులు
గ్రాంథికమే గరువమనీ – గణియింతురు గణకులూ
వ్యవహారము హారమనే – వ్యావృతులింకొందరూ
భావము భాగ్యమనీ – భాష సాధనమ్మనీ
భవ్యుల మతమాయెను – అది దివ్యత సంతరించె
పురాణములు పూజ్యమనీ – బ్రాహ్మణ్యం భాగ్యమనీ
వేదభాష వెలుతురనీ – యాజకులూ తలచిరీ
కల్పన అల్పమనీ – 'కలగ్రంథమె' అందమనీ
సంస్కృతమే ఆకృతియని – ప్రాకృతులే తలచిరీ

564

భావము మారగా – భాషయు మారెను
మేధా మథనములోనా – మేలిమి లయమాయెను
శ్రుతిలయ సుందరములనీ – మతిని గతిని మార్చిరి
అసలు భావ భాగ్యమే – అదృశ్యము దృశ్యము
కనుకలిలో వినుకలిలో – 'కలవర' కాఠిన్యమే
అన్నింటా కాలుష్యము – కవుల కలము కారుణ్యము
అరణములూ రణమాయెను – రణము అరణముల కొఱకు
అరణ్యమై రోదించెను – అసలు సిసలు రచనలూ
కులము మతము విలువలై – కూర్మి మర్మ మాయెనూ
తాత్త్విక చింతన పరులుగ – చింతింతురు వరులు
మానవ భావనలోనన – మరుగు చుండె 'మన'భాషణ
దానవ నవ్యత దివ్యత – దారియె రాదారిగా
కవుల గళము గణ్యమనీ – కలకాలము మ్రోగుననీ
కాంతిశాంతి కల్గుననీ – కలవరపడి ప్రవచింతురు
కంప్యూటరు మీటరులో – వాట్సప్పుల వరుసలలో
బుల్లితెరల లొల్లిలోన – అల్లరాయె అసలు కవిత
భాషా భావము నిండుగ – భాగ్యమగును జనకవిత
సంత సుంత సారళ్యత – వాస్తవవస్తువు స్తవము
దిగంతమౌ భావములే – కవితహోమ ద్రవ్యములు
ప్రాచీనము నవ్యమూ – ప్రాభవమే వైభవమే
ప్రతిబింబించగ గుణము – గణనీయము గరువము.

559

భవం భయం బాధమయం – బాధ్యతలే వెతలు
బాంధవ్యం అంధత్వం – వాస్తవమే విధ్వస్తము
తెలియని బాల్యములో – తేటదనం ఆటగా
కౌమారపు కౌగిలిలో – గిలిగింతలు తేలగా
యౌవ్వన వనములో – నవ్యత దివ్యతగా
వార్ధక్యపు వలపులలో – పులకింతలు అలకలుగా
నాల్గుదశల నాణ్యతలో – అణువణువూ ఆశలేగ

అడియాశల ఎడారిలో - ఎండమావి జీవనమే
సంప్రదాయ సంస్కృతిలో - ప్రకృతి కృతి పరవశము
మానవ ప్రకృతి గతమై - మరుభూమికి చేరెను
స్వార్థాసుర శోభతో - సార్థకమ్ము జీవితమ్ము
నిస్వార్థపునియమంతో - అర్థవంత జీవనమ్ము
మిసమిసలాడెడి వయసున - మసిబారెడు మానవతా
వయసుడిగిన సుడులలో - వందితమై అందగించు
వేదమువేదనగా - వాదము వధియించెను
వేదవాద వాదరలో - ఆదరమే తరమాయెను
పురాగాథ పూజ్యముగా - త్యాజ్యమాయె వ్యాజ్యము
ఆజ్యమాయె నేటిగాథ - అమరానికి సమరమై
ప్రకృతి శక్తుల కలయిక - ప్రాభవమై ప్రసరించెను
కోట్ల జీవరాసులై - కోరికలే కొలువుదీరె
కాట్లాటలు కలిమి బలిమి - పోట్లాటలు ఆటలుగా
జనజీవన వనమంతా - జాజిమల్లెలను రాల్చెను
దృశ్యమునశ్వమై - దృక్కు శాశ్వతమ్ముగా
వివేకమ్ము వేకువగా - ధర్మవిలువదారిపజూపె
భాషలు భావములూ - భవబంధ అందములై
ఆంధ్యము మాంద్యములాయెను - అభివృద్ధి పథములో
గతము గణ్యమైన వేళ - జనమతమే జయగీతము
మతము గణ్యమైనచోట - మానవతే మధుర ఫలము
మత్తుమందు మతమైన - చిత్తగునుగ చైతన్యము
భూమి ఉపరితలములందు - భూభాగ్యము అనంతము
భూమి జనుని భయంలోన - భూతమాయె తరములన్నీ

అనంతరం తరములకూ - ఆదర్శము నీ మతము
దర్శనములు మర్శనములు - ధనములు ధరమానవులకు
హిందు అల్ల క్రీస్తు గీతి - అందరికీ ధర్మగీతి
ఆస్తికమూ నాస్తికమూ - ఊహకందు ఉద్యమములు

ఊహల కందని జగతికి – జనగీతిక ఆత్మశోధ.
మన్నులోని మన్ననగా – నిన్నుకనెను యీ జగతి
నిన్ను నీవు తెలియగాను – మట్టి మన్నికగును నీకు
ఎదుటి వాడి ఎదనీదీ – నీది వాని నుదిటిదై
స్త్రీ పురుషుల ప్రేమలలో – స్థితులు గతులు అభిమతములు
అర్ధ జీవితములోనా – అర్ధాంగియె సర్వాంగము
వంగడములు కలుగగా – వింగడములు విజయములు
పలుగాకుల జనములోన – ఏకాకిగ ఎదమురియుము
కాలము క్రమియించగా – కోకిలవై కూయుము
మరణము వరణమై – శరీరమే శరవణమై
వ్రణములు అరణమై – వసుధ వీడు దినము కలదు
జననము మరణము – జనునికి వేదనలే
మధ్య మిథ్య వాదనలే – మనిషికి సిరి మదుపులు
శాంతిశక్తి కాంతిసక్తి – కరుణరక్తి అరుణభక్తి
ఓర్పు ప్రేమ మార్పు మనస్సు – మదిగది నిండిన ముక్తి
వంశ అంశ అంశువుగా – వాల్లభ్యము సంతానము
చింతలేని సంసారమె – సారజలపు కాసారము
రూపము నశియించగా – వసియించును వార్ధక్యము
ముసురును ముడుతల దేహం – తలనెఱియగ తలపులిడును
తృష్ణ వదలి తృప్తిగా – అశవిడిన శవముగా
శాంతజీవనమ్మునా – అంత్యజీవితము నడుపుము
అది ఇదియని మదిగదిలో – గడబిడలే అధికమైన
రుజగ్రస్తము జీవితమై – జీవి జవము విడుచును
భవము బాధ బంధమైన – బంధువుగా జీవించుము
సాఫల్యపు జీవనమున – దివ్య జీవితము గాంచుము
పుట్టుక పూజ్యముగా – గిట్టుట గీర్వాణముగా
బతుకు తీరు బాధ్యతగా – అబాధ్యమై అతని జన్మ
ఆశ అస్మితమ్ముగా – ఆశయమె శమముగా
విశ్వనరుని రీతిగా – నశ్వరమై శాశ్వతమౌ

కీర్తికాంక్ష ఆంక్షగా – ఆంక్ష అద్వయమ్ముగా
అదుపులోన ఆదమరచు – అతని విధము విలువగా
సమసమాజమమ్మగా – సంస్కరణము నాన్నగా
బంధుమిత్ర బంధముగా – విశ్వభావి విజయమౌ.

561

దినం దినం దివ్యము – ప్రతిదినము ప్రాభవము
క్షణక్షణం 'అక్ష'రం – క్షయమేజన జీవితం
ఉదయగిరిని ఉద్యమమై – అస్తగిరిని అక్షయమై
సూర్యచంద్ర సుందరమై – శుభకరమీ జగము
కల్పన అల్పముగా – కవులకు కలగా
పగలు రాత్రి వగలుగా – కలకాలము కలరీతిది
రాసుల రాశిలోన – రమ్యము భువనము
గ్రహముల అనుగ్రహము – నిగ్రహమే నిధులకు
జ్యోతులలో జ్యోతిగా – ఖ్యాతినొందె దివ్యజ్యోతి
నిత్యనవ్య జ్యోతిగా – ఉదయజ్యోతి ఆ అర్కుడు
విధులు విభవమైన వేళ – శుభము గూర్చు శక్తులు
పంచభూత ప్రకృతికే – ప్రాభవుడీ అభవుడు
అభవుని విభవములో – భవునిది భాగ్యము
యోగ్యుడైన మానవునికి – జీవనగతి గరువము
మంచి చెడుల మాన్యములో – అన్యుడు యీ మానవుడే
భూతతృప్తి భువనమునకు – భూతము మన జనుడే
పేరుపెంపు పేదదిగా – పేలవ ప్రకృతి లోనా
వికృతి విధ్వస్తమైన – విజయము అపజయమేగా
పంచభక్ష్య పరమాన్నము – మాన్యభవనమునదిన్నా
ఆకలికే'కలి'లోనా – అంతరమే నివాసము
త్రికరణముల తీరులలో – వేరు వేరు వర్తించిన
వేకువ వెలుగే కాదు – సూర్యుడు ఆర్యుడు కాడు
హింస వర్తనమ్మునా – హితములేదు మతమునా
మతమే సతమతముగా – సతతము హితదినములే

568

అందరు హరిజనులుగా – అందమాయె భారతము
'కులము, మతము' కూర్మిలేక – మార్మికమీ జనస్వామ్యము
అధికారము అంధమూ – ధిక్కారము కారము
అహంకార 'కారు'లోన – అల్పమన్ని దినములు
సూర్యునిలో చైతన్యం – చంద్రునిలో సాంద్రత్వం
రాత్రిపగలు రాజిల్లగ – జనుని 'రోజు' జాగృతియే
కోట్ల జీవరాసులలో – కోరిక మానవునికే
కోరికలన్నియు దీర్చగ – కోమలమీ ప్రకృతి
అన్యోన్యం నవ్యమైన – నవదినమే యీదినం
అన్యత ధన్యతకాగా – అంతరమే మనదినం
పంచభూత పావనతకు – పంచేంద్రియ సాంద్రతకు
ప్రకృతి కృతి పరమకృతిగ – భావించగ భాగ్యమగును
అస్తినాస్తి ఆస్తిగా – అహరహమూ అందముగా
సహితుడు సానందుడై – మహితాత్ముడు మానవుడు.

562

గురువులు బరువులు – పరువుల అరువులు
ఆచార్యులు ఆర్యులు – అవమర్శల ఘనులు
రూపమెంతొ రుచ్యము – ఆహార్యము అద్భుతము
వాక్యము గంభీరము – సాత్వికమట సహనము
మమతల మగాణములో – మతాచార్య గానము
హితాహరణ రణము – హతాభరణ ఫణము
సంప్రదాయ సరళిలో – జయప్రదము ఆపదము
సాంకేతిక కేతనమున – తిరోగమన తిరుమార్గము
మూఢగూఢ ముసుగులో – ముద్దుసుద్దు మురిపెము
అవగాహన అనుసరణలో – అనుభవరాహిత్యము
మాతృభాష మార్ధవము – జాతిభాష జాగృతము
గ్రంథభాష గరువము – హితము హిందు భాషాయెను
శ్లోకము 'శోక'మైన – శోభ విభవమగును
అభవము భవముగాను – భాగ్యము అభ్యాసము

అభ్యసనము వ్యసనమైన – అదె ధర్మము జనతకు
అశ్రమ ఆశ్రమములందు – విశ్రములుగ వినుతులు
విలువలు వలువలుగా – వలపు తలపు వచియింతురు
జనారణ్య రణములో – హితవాదులు ప్రతివాదులు
ప్రతిభ ప్రగతి ప్రవరులు – పరమాద్భుత వాగ్ఝరులు
విశ్వదేశ దేహులకూ – విజయ గురుతు మానవతే
నవత భవిత కాంక్షులై – సంస్కర్తలు సాగిరి
తిరువీథుల తీర్థములే – జనవీథుల స్వార్థములై
పేరుపెంపు పేలవములు – జ్ఞానలేశ గణ్యములై
శాస్త్రీయము అస్త్రమనీ – శాస్త్రమేమొ స్తోత్రమనీ
ఆసక్తులె శక్తులనీ – అభిభాషణ గురువులదీ
కలదు లేదు వాదములే – నాదములై విదులూ
నవ్యమానవత్వానికి – నాథుడు లేడాయెను
కనినదీ వినినదీ – కలదు కాని దనుమాటే
అసలుమాట అనుభవమే – అదియె నిన్ను నీకు చూపు
హితవాక్యము మితవాక్యము – హీనము హతవాక్యము
హననములో హవనములో – హావభావ విన్యాసము
చెప్పుచేత చేతనలో – మెప్పుకలుగు ఘనవాక్యము
కాళిదాసు కవితలోన – తనపైత్యము మతమగును
కాషాయ కషాయము – రంగు హంగు రభసలు
టోపీ, కుర్తాలు, సూట్లు – కర్త కర్మ క్రియలాయెను
సేవ సేద దేరగా – సేచనయే సాంత్వనము
విశ్వవశ్యమానవతే – విలువనేటి గురువులకు.

563

అస్తగిరిని అస్తమించె – ఆ యిరవై పదిహేను (2015)
ఉదయగిరిని ఉదయించెను – ఉన్నతమౌ పదహారు
పదహారు కళలలో – ప్రవరుడు చంద్రుడూ
చలువ చంద్రునీడలో – విలువలు వికసించు
గతము మితము మరవగాను – మరువమె మన మతము

ఆగతమేగతముగా – అవగతమౌ అంకమున
విదురు మధుర సూక్తులకూ – ధృతరాష్ట్రుడు దూరమూ
ధృతి కల్గగ మతిమతులూ – మాతర గీతికలౌదురు
గతమున గరువములే – వర్తమాన పరువములు
'మానము' మార్పడగా – మనధ్యేయము భవితయే
తేదీలు వేదికలూ – వేళవాదములకేగా
వేద్యము లీనాటికీ – హృద్యమైన విద్యలే
జ్ఞానగమ్యులెందరో – ధ్యానమునే కాంక్షించిరి
పరధ్యానము ప్రవరమై – వరయోగము మరచిరి
శుద్ధయోగయాగములో – శక్తి సారమెంచగా
విశయోగ వీథిలోన – భరతయోగ మాయెగా
తీర్పు మార్పు ఓటరులో – తీరు 'మోది' మోజుగా
ఆంధ్ర చంద్రబాబుదై – విబుధమాయె విమతమునా
ఉమ్మడి మడిసేద్యములో – గట్టు పట్టు వీడగా
గమ్యము అవగమ్యముగా – తెలగాణము రణమాయెను
విభజన భజనలలో – జనులు భోజ్యమైరిట
అవిభాజ్యము భాగ్యమై – పదవులె భోజనములాయె
నిధులు కలిగి నీరులేక – నిత్యము విధి బధిరమై
నీరుకలిగి నిధులు లేక – సత్యమాత్మహత్యలై
రైతులపై రౌతులుగా – రాజ్య ప్రతినిధులు మీరె
సద్యోగము ఉద్యోగము – సరసము విరసముగా
నిరసనమే నిత్యరసము – వరుసవాక్కు సమరము
వ్యక్తిత్వము వ్యత్యస్తము – వ్యవస్థలే వ్యతిరిక్తము
'పార్టు। లిచట 'పార్టీ'లే – ఆర్టులు పార్టీలాటలు అటుఇటు
ఆహ్వానం అందగా – అనురాగం చిందగా
ఆప్యాయత వెతలు దీర్చ – ఆగతమీ వత్సరమ్ము
నవ్య వసంతమ్మున – దివ్యసంత శాంతిగా
విఫణి వీథి ఫణముగా – జనవీథియె పణముగా
జనవరి వరికోతలాయె – ధాన్యము మాన్యము నిండెను
ధనలక్ష్మికి అక్షియై – ధారుణి వరణమ్మాయెను.

564

రాజధాని లేని ఆంధ్ర – లేవడిగా మిగిలెను
అత్తెసరు ఆర్థికమున – సార్థకాఖ్యగా నిలచును
చంద్రుని దృక్పథమున – సాంద్రము అమరావతిగా
ఇంద్ర రాజధానిగా – ఇంపుగులుకు సొంపులతో
జనులలోని చైతన్యము – జాగృతిగా వెలుగగా
జన్మభూమి భాగ్యమై – భారతమున భాసిల్లును
అంతరిక్షయానములో – వింతపుంతలాయెను
'షారు' జనహుషారుగా – చంద్రయాన యాగము
పథకాలు ప్రథితాలూ – ప్రచురమే ప్రచారమే
ప్రజలలోని నమ్మకమే – పారదర్శకపు పాలన.
వంచనలూ లంచములూ – బాంఛను కాల్మొక్తలూ
సాగినంతకాలమూ – సంతసరుకు ఓటర్లే.
పప్పుబెల్లములు పంచీ – మెప్పునొంద తప్పగునూ
ముప్పువచ్చు ముంగిటిలో – అంగళ్ళలో అంగిళ్ళలో
దొంగల రాజ్యములో – దోపిడి సాగునుగా
దొంగలెవరొ తేల్చగా – దొరకరు వత్సరములకు
చందన విందులో – ఎఱుపెక్కిరి ఎందరో
మఱపుగ మఱియొకటీ – ప్రతినిత్యము సత్యమై
హృద్యము మద్యముగా – సహృదయము సాంద్రమై
రేబవళ్ళు త్రాగించగ – మత్తుతోడ 'చిత్తు'లాయె
నీత్య వినీతుల మధ్యన – నిత్యమిచట వైవిధ్యము
వైరుధ్యపు వ్యక్తులైన – ఆరాధ్యము అవినీతియె
లెక్కలలో చిక్కినోడు – పక్కలు పరచిన వాడు
ధర్మదారి తప్పినోడు – మర్మముతో మరుగుపడిరి
అహంభావ భావముతో – కర్మల కాపట్యముతో
మాటల మాంత్రికులుగా – మననేతలు మాన్యులైరి
నాదినాది నీదినాది – అందరిదీ తనదనీ
అదనుపదను విదితముగా – అర్థవాదమును గాంచును

572

యజ్ఞములని యాగములని – యావ జనులు మరచిపోవ
ఎన్నిమన్నికలు గల్గిన – అన్ని వెన్ను చరచును.
బీడు భూమి వాడగా – బిగిసిన ఉరి దివ్యమై
పంట మింటి ఫలితమై – ఉసురు విసిగి ఉన్నతిగనె.
రక్షణ కరవైనదిగా – రహి ప్రకృతి రక్కసియై
వెక్కసమై అక్కసుతో – కక్కసించె కలిమి బలిమి.
అభివృద్ధే వృద్ధమై – అవనతమే నవ్యమై
ప్రకృతినే పోషించగ – పరమార్థము మానవునికి.

564

వత్సరమ్ము పేరు మార్పు – వాత్సల్యము కానరాదు
స్త్రీత్వమన్న సిగ్గులేదు – సింగారము హద్దులేదు
విద్య వధ్యమాయెనుగా – వ్యథలు కథలుగా మారె
కలలు కల్లలగుచుండెను – కొల్లలుగా హత్యలాయె
ప్రేమార్థము పేలవమై – పేగుబంధమే లవముగ
అమ్మనాన్న అన్యములై – ఆశ్రమములె ఆశ్రయములు
వెన్నెముకయె రైతన్నని – వెన్నువిరగదీయుచుండె
మన్నికమన్నన మరుగగ – కాపురములు ఆపన్నులు
పచ్చదనం పల్చబడెను – వెచ్చదనం పెచ్చుమీరె
యంత్రగాత్ర ప్రపంచమున – యాతన వాతావరణము
నాగలి కలి గల్లంతయె – మరయంత్రము మురిపించును
అరమరికయె వ్యవసాయము – అవసాయము అందరికీ
కాంక్రీటున కట్టడములు – కలపయె కనరాదుగా
అరణ్యములు రోదనతో – జనారణ్యములుగ మారె.
నట్టడవిలో కార్చిచ్చులు – చిట్టడవుల చిరుగులూ
అభివృద్ధే వృద్ధమయి – అన్నింటిని ఆహరించు
జడివానలు చలిగాలులు – తీవ్రవేడి తుఫానులూ
దేశప్రాంతముల దెలియక – అంతర్జాతీయములు
ఆరారు ఋతువులలో – 'ఆరుగాలము'ల ఛాయలు
అటుమారీ ఇటుమారీ – కటకటాయె జీవితాలు

పశువులపై విసువాయెను – పసరము మానవునికీ
పోషణభారమ్మునీ – వేషములే వేయుచుండె
ఆక్రమ విక్రములైరీ – అక్రమాలపరాక్రములు
సక్రమమౌ సరసులన్ని – వరసమారి విరసమాయె
జీవితవనములో – జీవనమే ముఖ్యము
నీరులేని జగతిలో – నిత్య 'దాహి' మానవుడగు
పోలిక ప్రోగైసాగెను – ఆగ్రహమే అనుగ్రహము
నిగ్రహ నియమములేక – మెదడులోన మెలికలాయె
ఆలనపాలనలేకా – లాలలనయే కరువాయెను
ఆందోళన పాలితులై – కల్లోలిత మనసులైరి
సంపాదన పాదులో – సంవేదిత విభవులై
సరసము విరసము దెలియని – అసమ విషమ అర్థులైరి
జనవరి వరిధాన్యముగా – జగతి పంట ఫలితమైన
అన్నినెలలు వెన్నెలలై – వన్నెదేరు వాత్సల్యము.

566

అనురాగ డోలలో – ఆనందహేలలో
సరాగమే రాగముగా – ఆగమ గీతిక పాడగ
వత్సరాలు వాలిపోయి – వయసు తూలిపోగానే
సత్సాంగత్యము సరళిగ – సాగిపోవు జీవితాలు
సశేషాలు విశేషాలు – సరిగమ పదనిసలైనా
'గమపద'గరువముకాగా – పదము పథము ఫలముగా
గతకాలము చితిచేరగ – మతి మతములు మధురమై
మన మతమభిమతముగా – చైతన్యము చెంత చేరు.
చలిగాలులు అలలుగా – వలపులు వాల్లభ్యమై
కొత్తజంట చిత్తములే – మొత్తముగా మురియగా
పడమర నెల పడతిగా – తూర్పునెలయె పడుచుగా
నెల యేపేరైన గాని – వెన్నెలలే నెలవుగా.
మార్గశీర్షమాసములో – మార్గము ధార్మికమాయె
ఆండాళ్ పాశురభక్తికి – అపమార్గమె యీయేడు.

574

జయం జన్మభూమికీ – భయంలేదు భారతికీ.
ఆంధ్రకు అడ్డులేదు – అవని మిన్న అమరావతి.
మార్పు మహిమ తెలియగా – తీర్పు తీరు తీయనగును
నేర్పు ఓర్పు నేతలే – జాతి జాగృతికి భ్రాతలు
సంప్రదాయ సరళికీ – విరళత్వము విలువగా
సంస్కరణము అరణమై – సమభావము కలుగుగా
కులము మతము మతిచెడగా – కూహకములు హత్యలై
వాహకమే వాక్కుగా – అందరమను హక్కుగా
కోర్కెలన్ని కోల్పడగా – కోమలతలు లతలుగా
సమతాసుమములు పూయగ – సతత హరిత సంస్కృతిగా
కోపము ముగియగాను – తాపమంత తరిగిపోగ
లిప్తలోన లుప్తములై – తరియించును తనువులన్ని
ఎదుటివాడు నీవాడని – ఎదగదిలో పదిలపరచ
నీమదిగదినిధికాగా – విధి నీకే విలువనిచ్చు
రాగిభోగి త్యాగివీవు – రక్తిముక్తి భక్తి నీతి
రాజ్యము రాజిల్లగాను – అనురాగమె వత్సరమ్ము.

567

సమయము సవనము – సహనము సత్యము
లయమైన సమయమే – విలయములకు విజయము
జనగణజయశీలములు – జాతికి ఘన గరువములు
సమసమయపు సారథులు – భవిత సుమపు గంధములు
కరిగిపోవు కాలమే – ఆవిరియౌనీరుగా
అందరికీ యోగ్యమగును – ఆరోగ్యము విరియగా
శతమాన కీర్తులకీ – కర్త కర్మ కాలముగా
క్రియవారిది కీర్తనగా – ఆర్తి జనత కందునుగా
కాలము బధిరమై – వ్యథల కథలు వినదుగా
విదురమైన వినుతులే – సుజనులకే నుతులుగా
గంటల మంటలతో – తంట తరిగిపోదుగా
క్షణము యుగముగా మారగ – యుగళగీతి రగడగా

తిథి విథి తీరుకాగ – తీయని సమయము
అక్షయ నక్షత్రమూ – లక్ష్య లక్షణమ్ముగా
యోగ్యమైన యోగమై – యాగమగును సుగమమై
కరణము అరణమై – రణహీనము రహి సమయము
పగలు వగలు సెగలుగా – అవగమమై అగమ్యము
చలువల సరసపు మాటలు – సారస్వత రసములు
నెలవిలువలు వెలవెలలై – వెలుగు రోజు వేసటయై
బాసటయై బాంధవ్యము – అందమగును సాంగత్యము
మొదలు చైత్రమాసమై – మోదమగును మనజగతికి
గుణము ఫాల్గుణమ్ముగా – పూర్తి గురుతు పుణ్యములకు
అశ్వని అశ్వమై ఆశ్వికశక్తితో – అందరికీ మోదము ఆమోదము
రేవతి వ్రతములో – రేపు మాపు మధురము
యుగములు ఖగములై – ఎగిరిపోయె ఎచ్చటికో
జనయుగమే జయశీలము – మన మనసే మధురమగును
యమనియమము యావగా – జనయోగము యాగముగా
నిగమములూ ఆగమములు – నిత్య నవ్య నిధులుగా
సమయ విధియె సర్వముగా – అపూర్వమ్ము అవనిగా.
రెండువేల పదహారు – మెండు సుఖము లందించగ
'కలిపిన తొమ్మిది' మదిలో – తుమ్మెద తరియగా (2+0+1+6=9)
గ్రహభూతములాగ్రహమ్ము – అనుగ్రహముగా మారి
పర్యావరణము వరణము – రణము కాదు జీవితము.
పాడ్యమి సంయమిగా – పరమార్థము వరముగా
అమవస పున్నమి అవనికి – ఆహ్లాదము పంచునుగా.
కారణ కార్యములన్నియు – కరువు పారద్రోలగా
నీటి నిధులు విధిగ కూర్చి – నిత్య వెలుగు వత్సరమ్ము.
వ్యక్తి శక్తి వ్యక్తమయి – వ్యవస్థలే స్తుతులుగా
సత్యసుందరమ్ములే – సవనమగును నవ్యవనికి.
సరములు వరములుగా – సుమములు సములుగా
సారళ్యము విరళమై – సాగును వత్సర సమయము.

568

సాంకేతిక అంకములో – సంకరమే సాకారము
మానవ సుఖజీవితమున – జీవనమొక వనము.
వనమును రక్షించుటే – ధనమగు ఇంధనమై
పచ్చదనపు మచ్చికలో – అచ్ఛుత స్వచ్ఛత అవని.
ఉత్పత్తులు ప్రతిపత్తులు – ఉత్తములు సత్యములు
విశ్వవిఫణి ఫణములపై – గణాంకములు వంకరలు.
ధర్మమధర్మమై దరిచేరక – దారిలేని మర్మమై
కర్మము కార్ముకమై – శర్మము కోరగ చెలువగు.
వ్యాపారము అపారమై – పారావారము దాటెను
అవసరమే సర్వమై – పసరము జనుడాయెను.
మాయదారి దారిలో – మనుజీవుడు మకరమై
కరములేని రమ్యుడాయె – నీర్నిధియే వట్టిపోయె.
విద్యవధ్య పీఠిపైన – పీఠములే మతమఠములు
అగ్రవాద ఉగ్రవాద – వ్యగ్రతలో వ్యథితమాయె.
దేశభక్తి భుక్తమాయె – భక్తి శక్తి స్వార్థమునకె
ఆకాశము భూమిగా – అంతరములు పెరిగెగా.
వింత తరము వరముగా – మిథ్య మానవత్వమై
కంప్యూటరు కలవరములు – 'ఇంట్యూషను' ఇరుల మయము.
ఛానళ్ళకు ఛాదస్తము – చేదునిజం చైతన్యం
బిరుదుల భీరువులుగా – ఆస్థానపు స్థాణువులై.
విద్వాంసులు విధ్వంసులు – వింధ్యవంద్యమతస్థులు.
అధ్వరులుగ అధ్వరముల – రాజుల రోజుల జరిపిరి.
రాజులు రాజ్యములుపోగ – రాజుకొనెను మతభేదము
మతములు అనుమితిలేక – మంత్ర తంత్రయంత్రములై.
మనుజీవన జవమునకు – మార్దవమును తగ్గించిరి
మేధమేలు కొఱకుగా – మేదిని అభివృద్ధికెగా
వృద్ధమాయె దేశమేధ – పరదేశము ప్రవేశించె.
పద్దులు హద్దులు ముద్దులు – 'పర' వశమై పరమార్థము

చంద్రమండలము కెళ్ళిన – సాంద్రరహిత దేశభవిత
'రాకెట్టు'లు రమ్యములై – 'జాకెట్టు'లు అవసరమయె
బులెట్ ప్రూఫు బుగ్గకార్లు – సాంకేతిక సుంకములు.
గాలినీరు గమ్యములుగ – ఆకాశము అగ్నులన్ని
మేదిని మెప్పునకాయెను – ముప్పాయెను సంకరమున
ఎల్‌నినోలు ఎదల కుదుపు – వరదవార్నిధులు ఊళ్ళు
టోర్నడోలు టార్పిడోలు – భూకంపము అంపకాలు.
ఆధునికము అదనమై – వ్యథలాయెను జనులకు
జుబ్బులన్ని మబ్బులుగా – కురిసి మురిసి కుంపటులై.

569

నిజం లేని ఇజం – 'ప్రిజం'లోని (సన్) సంకిరణం
'హజం'కాని ఇజమే – నిజమైన హ్యూమనిజం.
నిజం ప్రాణప్రాభవమే – ప్రణవమె ప్రాగ్వాక్కులో
అర్కుని యాకిరణములో – గీర్వాణము ఘనమే.
'రక్తి'మ జనరక్తములో – నాడులు నవ్యములై
బీడువారి పాడుబడగ – వాడిపోవు మెదడులు.
మెదడు వాడిపోగానే – మొదలవు తలపులు
తలపు తర్పణములుగా – తూర్పు తిరుగు మార్పులు.
నయనము అశయము – పయనించును ప్రవరతలకు
తలకు మించి భారమై – ముంచు ముద్దు ఆంధ్యమై.
ఘ్రాణేంద్రియ సాంద్రతయే – నాసికసిగా నాణ్యము
పట్టువిడుపు పద్ధతులే – ప్రాణాయామపు సిరులు.
రుచుల శుచుల జతలే – రసనేంద్రియ విసువులు
శాకపాకశమములే – శక్తికి శాక్తేయములు.
స్పర్శమర్శనములోనా – పరస్పరము ప్రవణతలు
మనసుమధురమగునుగా – మార్ధవ ఆర్ద్రతలలో.
వినుకలి కనుకలికంటెను – విశిష్టమై శిష్ఠమై
సత్యము సామీప్యమునా – వసియించును వాస్తవమై.
సత్యసంధతయె నిత్యము – అనుసంధానము అందము

అసత్యమున అవనతము – అసలు మానవత్వమే.
శరీరమ్ము ఆధ్యమాయె – ఆసుర సురకర్మలకూ
శిథిలమైన ఆకారము – చింతలవంతల ధర్మము.
నేనే నిజమనీ హజమనీ – 'మనీ'యిజమె యిజమనీ
మాలిన్యపు బతుకులలో – హైన్యమాయె హ్యూమనిజము.
నేను నేనుకాదనే – నేవళమౌ భావనయే
పుట్టు గిట్టు మధ్యనా – పూజ్యతలకు దారిగా.
పూర్ణము సర్వమనే – పుణ్యపు వాక్యమునా
పూజ్యము ఘనశక్తియై – త్యాజ్యమాయె జనఘనత.
దేహి దేహములు గొప్పగ – దివ్యమౌను జనధనత
దేహి యిచట గొప్పగాను – దేవళములు నవ్యములౌ.
అండముతో పిండమై – బ్రహ్మాండము భాండమై
బతుకే ఘనసింధువై – నిజబంధము మట్టి నీరు.
మాంసము హంసమై – మజ్జయె ముజ్జగమై
అణువులు అణ్వస్త్రములై – అణవమే మానవత.
తిండి కండ తిరువీథిన – వంట తంట వరపుగా
సమతుల్యత లౌల్యతగా – శరీరమే శరమగును.
ఖరదూషణ శేఖరులై – వరులే మానవులై
వాక్కు కిక్కు వరసలలో – వాసివిడిచె వరులందరు.
నిన్ను నీవు తెలిసికొన్న – వెన్నుదన్ను వేల్పులుగా
వేడుక క్షమియించుటగా – అక్షయమే భవ్య సమత.
భేదము బాధగాను – ఖేదము ఖేలనముగా
వాదము వధ్యమైన – ఆద్యము దివ్యత్వము.

570

'ప్రాబ్లమ్ ఓకే' అయినా – ప్రాభవమే సున్న
విభవము అభవునికెరుక – భయమే జనునికి మరక.
ఆది యనాదికీ – అంతరమే తరములు
ఇతరములేవైన గాని – ఈ'తరము'న వివరములు.
బిందువు సింధువుగమారి – వసుంధరను ధరియించెను

సుందరమౌ వసుంధరలొ – సూర్యచంద్రులార్యములు.
సూర్యుని చేరలేరు – చంద్రుని చేరగయత్నము
సఫలమగును ఫలముగా – సుఫలమదీ మానవునికి.
శక్తి కేంద్ర సూర్యప్రభా – యుక్తి జనత విద్యుత్తా
పంచభూత వాంఛితములు – పరమార్థపు భాష్యములు.
పచ్చదనం విచ్చుకొనగ – పరమశక్తి ప్రాణమై
జీవిజీవనాడులకూ – వాడిని వేడిని కూర్చును.
నీడనిచ్చు నిండుప్రాడి – వాడిపోవు నరునిచేత
చేతబడిగ చేతనలో – యాతనమై ఎరుకలేదు.
బాధ బాధ్యతల కతలు – భవరోగపు గుణములు
బాధ బోధగా మారిన – బోధిసత్త్వ కథలగును.
జ్ఞానము గణనముగా – ధ్యానము వన్యముగా
ధైర్యము జనజీవితమై – ఋషిత్వమే ఋజువాయెను.
వేకువ వాక్కులలో – మేలిముద్దు కిరణములు
సద్దుల సుద్దులతో – సరసత్వము భువికిడెను.
తరియగ తరియగా – తరతమమై తనువునా
తారుణ్యము జ్ఞానమై – తలపు సత్యమగునుగా.
మార్గము మార్గణమై – మతములు హితములై
హతమగునుగ సతమతము – సతత హరిత సర్గమగును.
ముందు అందమైన విందు – ముద్దుముచ్చటల ముగ్ధ
ఆరగించ 'అరగ'దాయె – అనుభవించ భవరోగము.
యోజనలో ఓజకలిగి – యోగ్యమైన నడత కలిగి
త్యాగము యాగముగాను – యోగసిద్ధియోద్ధవీవు.
ప్రపంచము విశాలము – సమస్యలే సమస్తమూ
సమాధాన సారథులే – అవధానులు వదాన్యులూ.
అంతమనంతమై – అంత్యము జ్ఞానమై
సాధన ధనముగా – అవని అర్థవంతమగును.
స్వాములు గురువులు – స్వాగతించ ఆ'గతము'ల
త్రికాలములు త్రిలోకములు 'త్రీడీ'లుగ విలువలగు.

అనుమానము అవమానము – మానము అభిమానమై
మనముగుణము ధనముగా – 'మహీధరము' మహియగు
క్రీస్తైనను కృష్ణుడైన – మహ్మదైన మహితులే
వారిగాథ గణ్యమై – వాసిగాంచు వార్నిధియై.

571

విశ్లేషణ శ్లేష్మములో – వినుతుల ఆశ్లేషణ
వినతుల అవనతము – విలువ వారి వాగ్ఝరులే.
వితండమూ జల్పమూ – విజయపు భాండము
వాదములో ప్రవాదము – అనువాదము అజేయము.
అర్థవాద స్వార్థములో – అన్యవాద అనుభవము
వ్యర్థవాద వ్యత్యస్థము – వ్యవస్థలలో నిత్యము.
మనసులు మార్ధవములు – మధువులుధృవములు
ఉత్తరమూ దక్షిణమూ – ఉన్నతమూ దాక్షిణ్యము.
కలవని మనసులూ – వలవని తలపులు
తనువుల తంపటలూ – అటకెక్కని అంపకాలు.
తీరుమారు వారువేరు – తీర్థములే అర్థములు
తీయని జీవితాన – జిలుగులు కనుమరుగులు.
అరగని అన్నముతో – చిన్నవోవు ఆరోగ్యము
కరగని మనసులకూ – కాఠిన్యమె కశ్మలము.
భావపు భాగ్యములు – భాషలయోగ్యతలూ
వాగర్థము అన్వర్థము – అన్యోన్యము ధన్యము.
ఆకలి కలికలవరము – వేకువ కువ కలకలము
వెతల కతలు వేద్యములు – వెలుగుల తాత్త్వికములు.
స్వత్వము తత్త్వములో – స్వభావమే అభావము
విభావంపు జగములో – వైరుధ్యము వైభవము.
లక్షలజీవుల లక్ష్యము – పరార్థము పరమార్థము
మాన్పు మందు తత్త్వార్థము – మందమతికి బంధము.
దుర్గమమే అపవర్గము – అనువర్గమె మార్గము
సర్గలు స్పర్ధలుగా – సుఖములు మఖములై.

విఖనసమే విలువగా – ఖనిత్రములు మతములు
కార్యము ఆర్యమై – ఘనులకు 'సూర్య'మై.
పర్వమఖర్వమై – పరమార్థమె 'భా'రతము.
నింద వంద్యమైన వేళ – వంధ్యము వైభవములు
తరతమములు తరియువేళ – 'తరము'లు మనమార్గములు.
రాజుల రాజ్యములూ – రహిజనులకు భోజ్యములై
పూజ్యములై పురుడు పోయ – పుణ్యపుడమి గణ్యము.
రాతిబొమ్మ రంగులతో – హంగులతో భంగులతో
అంగాంగము వంగడమై – వింగడించు విలువ మతము.
రక్తచరిత భక్తిభరిత – రక్తిభుక్తి ముక్తమై
రాజ్యములో రవళించగ –హతహితముగ జనభారతి
'భౌతిక'మే తికమకయని – భాగ్యము 'మత'ములనీ
తరతమముల తాత్త్వికతే – తరముల మెదడుల చెరిచెను
మృదువు మెదడు మార్థవమై – మృదంగమే వినిపించగ
భావ భాష భాగ్యతలే – భరతావని యోగ్యతలు.

572

సంస్కరణల సంరంభము – పరిష్కరణ ఆరంభము
ఆవిష్కరణల రణము – ఆవరణము భారతము
సంప్రదాయ దాయాదుల – దారుణముల దాక్షిణ్యము
ప్రాపంచిక వంచనము – పంచశీల ప్రవణత్వము.
'గ్రూపు'ల గురుత్వము – 'ప్రాపు'ల ప్రాగ్వాదము
సరిహద్దులు హద్దులేని – సరసత్వము విరసత్వము.
విశ్వవిపణి నశ్వరము – వశ్యులకది వాల్లభ్యము
పెద్దన్నలు చిన్నన్నలు – ముద్దు మద్దతుగ మారగ.
'చెన్ను' సన్నబడియెను – వమ్మాయెను వసుధ సుధ
కుటీరముల కుటీచకము – 'భారీ'లే బాంధవ్యము
పరిశ్రమలు విశ్రమములు – ఆశ్రమమే సంస్కరణము.
ఆయుధములు ఆస్తులై – ఆహరణము విశ్వము
విశ్వ విపణి వైభవమే – 'వైనతేయ' వార్థక్యము.

కద్రువ సంతానమై – అద్రి హిమము 'మాద్రే' యము
ఎగిరిన వాగురయై – ఎదగదినే ముంచివేసె.
పనికిరాని ప్రాభవమే – పరదేశపు విభవమై
డాలర్లకు దాస్యమై – దారుణ ఓటమి సరసన.
మేధ మాధవమ్ముగా – మానవతకు నవతయై
మనదేశపు భవితయై – సంస్కరణయె పరమార్థము
పథకాల్లో పథములూ – పదములూ విధులూ
నిధులు లేక నిర్దయలూ – నిధియే మనయువశక్తి
నేటి సంఘసంస్కరణము – పేద పెద్ద సంఘర్షణ
కులము మతము కుంపటిగా – నాయకులకు నాణ్యతయే.
కాలుష్యపు కాసారము – కలవరమ్ము మనపరము
పరములు వరపెద్దన్నలు – పరిష్కరణ 'స్వచ్ఛ'ము
మేధ మేలి తాత్వికతలు – మెలకువలీభరతవనికి
ఆరోగ్యము అరోగము – ఆస్తులు మనజాతికి.
ఉగ్ర ఉనికి అగ్రమయి – విశ్వమునకు ముప్పాయెను
జాతి జీవ జవములను – జాగ్రత్తతొ జాగృతమ్ము
ఆత్మాహుతి అవనతమ్ము – ఆత్మహత్య పిరికితనము
బాధ భయము కరుణ ధరణి – అరణమదే సంస్కరణము.
మహాత్ములే ప్రభవించిరి – మన ఆత్మల తెలిపిరి
పరమమైన సంస్కృతిలో – పరమార్థము అన్యోన్యత
భాషలోన భాగ్యములో – యోగ్యతలో త్యాగములో
అసలు సంస్కరణము కలదు – ఆశీస్సే అదిమనకు.
దేవతలే దేహములై – సేవయె సేచనమై
పరమార్థము వరముగా – సవరణయే వివరణము.
విశ్వానికి విలువనిచ్చు – విబుధుల బుద్ధులే
బద్ధమైన బుద్ధమూ – ఇద్ధమగును జనవిశ్వము
నశ్వరమౌ సంస్కృతిలో – వరమౌ నవసంస్కృతి
దినదినము 'దివము'గా – దివ్యసూర్యునిగ వెలుగును.
అడ్డుగోడలన్నికూలి – అందరమూ అధికులమై
అధికారిగ పరమశక్తి – భక్తిదేశభాగ్యమునా.

573

పాపము పుణ్యమూ – పరమాత్ముని మాన్యతలే
రాక్షస దేవతలే – రాణువలీరాజ్యములకు.
ఒక్క తండ్రి బిడ్డలే – తల్లులు వేర్వేరుగ
దక్షత దక్షునికీ – శిక్షకులై భక్షకులై.
స్వార్థము స్వాగతము – పరమార్థ స్వగతము
పరమాత్ముని విభవములు – అనుభవములు జీవాత్మకు.
అందము వికారము – అవికారపు కర్మలు
వికారమౌ అందమే – వర్తనమున ప్రహ్లాదము.
'అప'ములు(నీరు) శాపములై – శ్వసనము వ్యసనమై
వసనములు స్వనములై – శ్మశ్రువులే శక్తులై
షడ్వర్గము 'లరు'లుగా – నరుల విరులు పూయగా
పరనిందలు వంద్యములై – ఆంధ్యములిట వింధ్యములగు
వ్రతములు తరతమములు – యాగము లాగమములు
నిగమములే అగమ్యములు – నిర్ధారణ ధారణము
మేధ చిన్నదై (విన్నదనం) మేలిమి నిన్నదై – మేధవిన్నధనముగా
మెలికల మేధలోన – వెలుపలి కథ వెలుతురుగా
జరిగిన జరుగుచున్న – జరుగబోవు జగములోన
ఖచ్చితమే ఖగమాయెను – నిక్కచ్చికి చిచ్చుపెట్ట
ఛానళ్ళ నాళములలొ – ఛాందస్యము దృశ్యమై
వినుకలిలో విలయమై – లాక్షిణ్యము లయమాయెను.
హింస హంసధ్వంసమై – అహింసయే అవగాడము
హింసాహింసలవిధులు – విదుల మదుల మృదువాక్కులు
నరనారాయణ భాషణ – భూషళమౌ భాగ్య'గీత'
'విధి'గీతల 'గిరి'గీతల – గీష్పదమే మనపథము
పాపము వెంబడించు – పుణ్యము పురివిప్పు
పాపపుణ్యముల ఫలమే – మయూరంపు మృదునాట్యము
పాపపథము పుణ్యపథము – అథమమె ఆ అభవునిలో
ఆయీ జన్మల ఫలమే – ఆత్మ సాక్షాత్కారము

దేవుడు పాపములనుచేయగ – జీవుడు జినుడై వెలుగగ
పాపుల క్షమించెడి దేవుడు – పాపబాగుడగునుగా
వేదాల వెలుతురులో – పురాణముల పూజ్యతలో
మతగ్రంథ మాన్యతలో – రెండును జనరేవడులే
పదములెన్ని మార్చినా – పథములు దృక్పథములే
దృగ్దృశ్య వివేకమే – వేకువయే వేధలకు
జనపదములు పథములుగా – మనపదములు మాన్యములు
జనధనములు గణ్యములు – ఆఖ్యానపు ఖ్యాతిలో
వేనోళ్ళ విమర్శలలొ – పాపపుణ్యవేదనలే.
ముందు వెనుక వచ్చుటలే – నిలబడినది నీస్థానము
ఆస్థానము అస్థానము – అదె చివరకు ప్రస్థానము
చివరి శ్వాస ఆశలో – చిగురించిన ఆశయమ్ము
చెదరిన చెలువమ్ముగా – అర్పణమే పరమాత్మకు
పుణ్యపాపములు కలవా? – నీ పుణ్యము నాపాపము
గణ్యులు గురువులు కలరా? – గరువమె నీ సత్యవాక్కు.
ఆశయాలు అశనమై – ఆశలు దుర్వాసనలై
భాషణమే భూషణమై – దృక్ స్పృశనమే యీ విశ్వము.

574

పంచ'భూత' తృప్తితో – పావనతకు నీరాజన
పంచేంద్రియ ఫలములే – నవ్యజనుని నాణ్యత.
వేదసంహితములలో – వేద్యము భయ అభయము
మంత్రయజ్ఞ తంత్రములో – మహిజన ప్రాభవమే.
పుక్కిటి పురాణమై – ఆరణమే అపరాకృతి
సురాసురముభాసురమై – భాగ్యము దేవుని లీలగ.
ఉపనిషత్తునిషత్తులో – సత్తుచిత్తు చిన్మయాలు
విత్తు గర్భమందుంచగ – అర్భకునిది ఆజీవము.
ప్రాణము ప్రధానమై – అన్నము ఆకృతియై
ఇంద్రియముల హితములే – ఇంపు ముంపు కంపాయెను.
కంపర కలితుడుగా – కలిపురుషుడు కనిపించగ

కర్మసాక్షి సాక్ష్యముగా – క్షయమాయెను జీవాత్మ
ఆత్మలు 'అత్తరువు'న – చిత్తములే 'చిత్తరువు'న
'బిత్తర'వో వగనరుడు – నారాయణుడు దయించెను
అంతర బాహ్యములలో – ఆంతర్యము గమనించగ
మనికి కునికి కుంపటిగా – అంపశయ్య అగుపించెను.
ఆచార్యులు భీష్ములయి – పోరాటము అంతమయి
ఆరాటము ఆర్థికమై – హితబోధలు హతమాయెను.
ఉపవాసము వాసమై – వసనము అనువ్యసనమై
భోగములూరేగింపుగ – నిష్ఠలు నికృష్టములయె.
భజనల భాజనములు – ప్రసాదముల భోజనములు
పోటీపడిపొలతులు – అపాటవము ఆరాధన.
దృశ్యము నశ్యముకాగా – నాసికలే నసపెట్టగ
వాక్కులు వరసలు లేకా – చిక్కిపోయె చిదంబరమె.
రసన రసము రసియించగ – సరసత సతమతముగా
స్పర్శము అపమర్శమయి – అవగుణములు అదుపుతప్పె.
ఏకేంద్రియ ఎఱుకతో – సర్వేంద్రియ పర్వమాయె
మనసు మనినరహితమై – ఇంద్రియ రహి హితమగును.
పంచభూత కలితుడైన – పరమాత్మ సదృశుడు
వరమానవుడే యిట – పరమాకృతి పకృతిగా.
పంచభూత తత్త్వములే – పరమాత్ముని సత్త్వములు
'సత్త్వ' సహిత మానవుడే – విశ్వనరుడుగామారును.
జ్ఞానమగణ్యము – జ్ఞేయము గుణకము
అభ్యాసపు కర్మలే – అనుభవమున ధర్మములు.
రవణమగును మరణము – రణమగును జీవములో
వనములేని జీవనమున – ప్రకృతి కృతియే వరము.
మురుగు మరుగుచేయగా – 'మురుగన్' నీవ గురువు
మరుగులేని నీ మాటలు – మధురమగును జనతకు.
ఉత్పాతము హిమపాతము – ఉద్ధృతమూ ధూమమూ
రసాయనము అవసాయము – యాంత్రిక మహి ఎఱుపెక్కగ.

ధ్యానము ధ్యాసగా – దేహము దివ్యము
గాలి గోలసేయనిదై – గమ్యమగును ఆరోగ్యము
గురుత్వమే నీ గరుతత్త్వమై – గిరిత్వమే నీ గీష్పతితనమై
మరుత్తులే మన మారుతులై – అగరువత్తులే జనవత్తాసులగు
గురుత ప్రకృతే – గుణము జనులకగు
మరుడు మానవుడు – మహిమాత్ముండగు.

575

ఆరారు ఋతువులూ – అపఋతమును రాగించెను
అనుబంధపు పరాగమే – అనురాగము సరాగము.
చైత్రపు ఛత్రములో – చిత్తములే చిత్తరువులు
విశాఖంపు శాఖలలో – విలువల వలరాజులు.
జేష్ఠము కాష్ఠమై – జాజ్జ్వల్యపు జ్వలనమై
ఆషాఢము మృతమై – గాఢము గూఢము కలయిక.
శ్రావణమ్ము శ్రాద్వలమై – శక్తినిచ్చు ప్రకృతి
భాద్రపదము భద్రమై – భాగ్యమిచ్చు పథము.
ఆశ్వయుజము అశ్వమై – ఆర్భవమే యీభువి
కార్తీకము కర్తగా – ఆర్తిమూర్తి శివముగా.
మార్గశీర్షశీర్షమే – దివ్యమానవత దీక్ష
పుష్యమి పున్నమిలో – పురుడించును పూజ్యత.
మాఘము అఘములను – సుగమము చేయించును
ఫాల్గుణమున అవగణములు – గుణములిచ్చు గణ్యమై.
అన్నియు అందములే – వన్నియ వలపులే
ఏ పేరున పేర్చినా – ప్రేరకముల ఎఱుకలే.
హేమంతము హితము – హిమపాతము మతమున
వసంతమూ వాసంతీ – వసుధయె సుధభావనలో
శిశిరము శిరముగా – శింజినీరవముగా
గ్రీష్మము గీష్పతిగా – చైతన్యపు రవిగా
శరదృతువు శక్తిగా – విరిసిన వర్షముగా
వర్షర్తువు హర్షముగా – వసుధసుధలు పండునుగా.

ప్రకృతి కృతి సుగతిగా – పరమాత్ముని ఆకృతిగా
పరవశమై జనవశమై – వినశనమే విలువగా.
అరిషడ్వర్గముల లరిగా – లాహిరిలో రహిజనుడు
ఆందోళన డోలలలో – ఆనందించును 'అరి'గా.
వేదవిద్య వెలుగులలో – వేదనలకు విరుగుడుగా
భయమునకే బానిసగా – యాజనముల విజనుడే.
భయప్రకృతి వీడగా – భాగ్యయోగ్య మానవుడే
కాల విలయకథలనూ – గమనించగ గరువము.
పాంచభౌతికుడు జీవి – పరమార్థము గమ్యము
పరార్థమే ప్రకృతిగా – ప్రవణించిన ఫలితము.
ఋతువులు రుజలను ద్రోలగ – మతిమంతుడు మనిషి
మనీషిగ మారిపోగ – మానవమే మృదుమధురము.
మనస్వియై మనుజీవుడు – ఇంద్రియ నిగ్రహముండగ
'ఐంద్రి'కముద్దుల మురిపెము – ఆ కిరణమె జనఅరణము
పచ్చదనపు మచ్చికలో – వెలయును వెచ్చదనము
ఎల్‌నినోల ఆగ్రహమ్ము – అనుగ్రహముగా సాగును.
షణ్ముఖముల 'మఖము'లో – షణ్ముఖుడే కాలము
పరాశక్తి శ్రీమంతము – ఆర్మగంలు ఆయంత్రము.
ప్రాభవము ప్రభుచేతలు – పరాభవము జనునిచేత
వికృతంపు విలువలతో – ఆకృతులకు విధ్వంసము.
కాలమునకు ఎదురీదగ – ఎదసుడులే హ్రదమునా
కలిసిమెలిసి మేదినిలో – ప్రకృతితో పరవశించు.

576

ఆలోచన లోచనమై – అనురాగం వచనమై
అభిమానం అనుభూతీ – అందము అభినందనము.
కలతల కడలిలో – అలతల అడవిలో
విడివడ్డ మనసులే – మాలిన్యపు మాన్యతలు.
కామము ఆమనియై – కలవరముల కఠినమై
'ఏమని' ఎదలో తలచిన – ఎఱుకయె మదిమఱక.

క్రోధము విరోధమై – అవరోధము లేనిదై
అవరూడమె అవధియై – అన్యోన్యత శూన్యము.
లోభము లాభమై – లోకములుబ్ధమై
శతాబ్దముల శంకరము – వంకరయై సంకరము.
మదమే జనముదముగా – అదనుపదును విడిచినదై
ఆదమరచి 'మద్యము'గా – హృద్యమాయె హృదయసీమ.
మత్సరమే తత్సర్వము – తత్పరమే తపన కలుగ
వత్సరములు వాలిపోగ – వేషభాష వాసిదఱుగు.
మోహము వహనముగా – ఆహవమే ఆంతర్యము
వింత తరము విలువలతో – లయించెనుగలహరిలో.
షడ్వర్గము మార్గణమై – 'సర్గ'లు అపవర్గములై
అసురసురల ఆకథలే – సరసాలకు సురశాలకు.
మేలిమేధమేలుకొనగ – మధనములో స్వధనమై
హితము ఇంధనమ్ముగా – కాలిపోవు కాలములకు
ప్రేమలు ప్రేరకముగ – తారకలై తళుకులతో
కళకళలే కాంతి తరిగి – సుదూరాన ఉదయించెను.
త్యాగముయాగముగ – తెరువున బరువయి
యోగమందు ఆగమమై – అవధరించె అవధిలేక.
కరుణయె కరణమయి – వరణము రణమయి
అరుణిమ 'మార'ణమయి – ఆభరణము యీ భువికి
మంచి వంచనగ ముంచగ – మునిగిపోయె ముద్దుజనుడు
మునిగితేలి ముంచితేల్చి – మనగ జనుని మహిమ ఘనత
సత్యము త్యాగమయి – అనవద్యము వధ్యమయి
విద్యలేని విలువలేని – వినుతజనుడు విజయుడాయె.
అందము బాహిరమని – అనరాదుగ వంద్యులు
అంతరంగరంగములే – అసలైన అందములు.
మనోవాక్కాయములే – మానవమహిమాధ్యములు
త్రికాలాల త్రిలోకాల – తీరులు మారిన గాని.
సుసంగమము సుందరమై – సద్గురువుల సంగమమై

వాణీబ్రహ్మల వాక్కులు – వసుధకు ఆభరణము.
ప్రకృతి పురుషుల ప్రవణత – సురాకృతికి సుందరత
సూర్యచంద్రచైతన్యము – భువనమునకు భాగ్యము.
ముద్రలోననిద్రలోన – భద్రమైన జీవనమున
భాగ్యజీవసిద్ధిలోన – జీవనమే నవవనము.
కాంక్షల ఆంక్షలతో – ఆకాంక్షల అక్షయము
ఆక్షేపము విక్షేపము – అక్షయమే క్షేమము
జరిగిపోయె తరతరములు – అంతరములు వింతతీరు
కరిగిపోయె కాలమంత – విరిగిపోవు సురిగిపోవు.
సమృద్ధిగ వృద్ధమై – సిద్ధమె ప్రవృద్ధమై
బద్ధము బుద్ధమై – భాగ్యార్థమె నరుని జన్మ.
'రవి'త్వమూ 'పవి'త్వమూ – 'రాజ'త్వము 'కవి'త్వము
మృదుత్వంపు గురుత్వమే – 'గరుత్మత'పు గాంధర్వము
మధురోహల పోహళింపు – గుబాళింపు గూఢత్వము
గాఢత్వపు ప్రోఢత్వము – పదార్థాల పరవశము
సహృదయపు సారళ్యము – సరసార్థపు స్వార్థము
సాత్త్వికత్వ ఆధిక్యము – రాజస తత్త్వపు రాజ్యము
నవరసాల వరుసలో – సురశాలల సుందరతలు
మరుశాలల మనసులు – మధుశాలల అందములు.
కరుణత్వం వరుణత్వం – అంతరువుల అరణత్వం
ఆరణ్యుల ఆధిక్యం – వేదవిధుల వేధసం
మానవత్వ మాన్యతలో – దానవత్వ దుహితత్త్వం
హితతత్త్వం హీనత్త్వం – హానికరం భయకరం.
వ్యధల కథల వెల్లదనం – వధల వరుస రాజత్త్వం
జెందరు అలగ్జాండరం – ఖాళీ చేతుల ఖననం.
'శిల'లతొ శిఖండులై – 'శిలువ' తొ అఖండులై
వలువతొ 'ఖండన'మై – విలువల వినాశనము.
అపారమౌ వ్యాపారము – అంబరమున విశ్వము
నశ్వరమున మానవత – వశ్యవరము దానవత.

డేంజరు బెల్లులతో – డెత్ ముఖమున మనిషితనం
క్రైస్తవ కార్పణ్యమునకు – మహ్మదీయ మరుభూములు.
పెన్ కల్చర్ 'పెరిగి' పోయి – గన్ కల్చర్ కల్పకమై
పేలిపోతు తూలిపోతు – తూలనాడు మానవతను.
ధర్మమశోకముగా – దారిమౌఢ్యమతముగా
దారుణమే చక్రము – వక్రము ఋణ అరణములు.
'రవి'రాజ్యము రాసభమై – రాజకీయ అరాజ్యమై
రాజులు తరాజులై – అవకతవక తూకము
భారతి రాజ్యము భారతమై – గాంధారుల ధారుణియై
'రామ'ము అభిరామముగా – మతసమతే మారణము
అపహాస్యము హాస్యమై – షడ్విధాల సురసమై
తెరల తెలుపు తెల్లపోవ – కల్లగునుగ కవిత్వము.
పెద్దతెరల పేదరికము – బుల్లితెరల సల్లాపము
విలాపమై విగుణమై – అవగుణమే అసలు కవిత.
మస్తకాలె పుస్తకాలు – మాన్యవదాన్యులకు
మానవనవమస్తకమె – చితిలోని చైతన్యము.
మెదడువాడి వాడిపోయి – మోడుగ మోదముతో
ఊసులేని ఊహలతో – ఉసురుదీసుకొనుచుండెను.
అమ్మాయన అన్నియనీ – మమ్మీయన 'సున్న'యనీ
మనగురువులు బోధించగ – అమ్మగురుతగరువము.
మాతృభాష మాత్రవేసి – పరభాషల అజీర్ణతను
పారద్రోలి పావనతకు – పాదులు వేయగ వరపు.
ముగ్ధల మూటలన్ని – ముద్దుల ముద్దలుగా
తినిపించగతిరిపెమెగా – రామాయణ రమార్థము
నవనాడులు విడివడీ – భవనాడిగ అనుభవమై
భవిష్యత్తు భ్రమరమై – రమించునుగ రహి గ్రంథము.
నీర్నిధి నిధిగా – అవధి లేని నిర్ధనమై
అవగాహన గుహ్యమై – అవతరణము తరణముగా
సాంప్రదాయ సంస్కృతులు – పరిష్కృతులు తిరస్కృతులు
పరిష్కార ప్రవరులే – వర దశదిశ రవులు.

578

అష్టావక్రుని కథలో – వ్యథల సుధల వెలుతురులో
వేకువన కృష్ణకథలు – తృష్ణల తూష్ణీంభావము
సైన్సుల 'లెన్సు'లో – నాన్సెన్సుల నాణ్యతలు
సెంటిమెంటు మంటలో – తంపటలే తర్పణములు
లైసెన్సుల లాన్సరులలొ – సెక్సుసెన్సు సఖ్యతలే
సిక్సు ప్యాకు శింజినులలొ – 'వెక్సు' జనుల వేధత్వము
ఏడవ సెన్సులోన – ఎఱుక మఱక మనసులో
మూఢత మురిపెములో – సెన్సేషను శేషత్వము
చైల్డ్ వైల్డ్ లైఫ్‌లో – వైభవమే అభయము
ప్రేమాధిక్యపు పెంపున – ఆరణ్యక మరణ్యము.
బాలకృష్ణ భావములో – తృష్ణల తూష్ణీంభావము
భారతకృష్ణుని మదిలో – విశ్వజీవి తాత్త్వికత.
అష్టమి అవశిష్టము – 'ఆగమ'మే విశిష్టము
అన్వేషణ వేషములలొ – అవహేళన 'వశిష్ఠము'.
పాండిత్యపు పాండురము – తీంద్రత్వపు తిరిపెము
గాండీవపు గాంగేయము – వ్యాస శివము సుందరము.
వ్యసనులు తాపసులుగా – వేళమించ 'వాపసు'లై
సన్యసనులు ముక్తులై – సరసనడవడికి గుర్తులు.
'దిగ్గజములు'దివ్యములై – దశదిశలూ పశువులై
సురసాంగము భరతము – సత్సంగము ప్రాంగణము
మరణమునకు సమరము – మరుభూములు మాన్యములు
శివానందలహరులు – సౌందర్యపు అంధములు.
ధార్తరాష్ట్రధారుణిలో – ఆశలు అడియాశలుగా
'ఏసు'ల పుంజాటలలో – పుంజీభవ 'గీత'లు
క్రికెట్టుల వికెట్టులు – పడిపోయి పడగొట్టి
కుటుంబాలు కూలుటలు – 'విశ్వాట'ల వినతులు.
పనిలేని పసలేని – పడతుల 'కిట్టీ' పార్టీ
కట్టడి కరువైనదై – కట్టకడకు కలరవము.

అమిత్రులే మిత్రులై – అశ్వత్థపు గాత్రులై
మందువిందు పొందుతోడ – అందము మనజనస్వామ్యము.
సిద్ధాంతము రాద్ధాంతము – పదవియె పంచామృతము
మనసు వక్రవిక్రమము – మాట అవిక్రమార్క కథ.

579

వంచనలో ముంచి తేల్చి – మంచి తృంచి మర్దించీ
రసాస్వాదనముగాంచీ – 'వా'రసత్త్వవఱపు చేర్చు.
ఆచార్యుల అంచనాలు – అంచులలో ఆగిపోయి
భాష్యములేని భాషలై – భాషలు బంధములాయెను.

పూర్ణము పూర్ణమై – పులుపు తీపి పూర్ణమై
తీపి తీర్థముగమారగ – ఆర్ణవమే ఉప్పాయెను.
రణమే రవణము – క్షత్రియులది ఆర్జవము
రాజత్వము రుజత్వమై – ఋజుత్వమ్ము బూజుపట్టె.
గతిదప్పిన ప్రకృతి – గమనములో వికృతి
ఆకృతిలో అనుకృతి – స్వార్థాకృతి అపరకృతి.
మంతనములు వింతలు – మాంత్రికులుగ మానవులు
పదవుల పార్థివులుగ – 'విశ్వా'ర్థము వినిపింతురు.
తనతనమే తపనగా – మనతనమును మదుపుగా
నా నీతనమునూ – నవ్యరీతి శ్లేష్మింతురు.
మతమును గతముగా – సతతము నూతనముగ
తన విశ్వాసము శ్వాసము – నశ్వరమున వశంవదము
హింస హంస వినువీధిన – ధ్వంస నఛణఛణముగా
నీరులేక వీటిగెగిరి – విహరించును ఎండమావి
వటువు పటువు నీడెడు – విటుడు విబుధుడాయెను
వటవిట సంగమమునా – సాంకర్యము సరసమాయె.
ఆర్థికమే అన్వర్థము – వ్యర్థమిచట హార్థికము
హార్థిక ఆర్థిక త్యాగము – యజ్ఞకర్మ కాహితాగ్ని.
అవభృదమున భ్రువులుగా – క్షేమశాంతికాముకులుగ
అష్టాంగము శిష్టాంగము – అవశిష్టమె అసలు సిద్ధి.

వృద్ధుల వృద్ధిలో – వ్యర్థుల వ్యవస్థలో
వ్యత్యస్తపు అవస్తలో – సంకుచితము సంచయము.
వక్రత సక్రమముగ – వలపులు ఆకృతులుగ
వాల్లభ్యము మృదువాక్కుగ – వసియించగ ఆశీస్సే
మునివృత్తిని ముగ్ధులు మనీవృత్తి మూర్ధన్యులు
కంఠపు కారుణ్యులు – కుదించగా కూర్మలు.
మఖము ముఖము మధురములై – కర్మయాగయోగమగును
ధర్మమర్మకర్మలతో – ధారుణి అవక్రమగును.

580

ఆకాశము అశుభ్రమై – అభ్రముగా నీలమై
సుందరతలు శుభ్రములై – విభ్రమమై విదుల మదులు.
సవర్ణుల వర్ణనలో – సౌందర్యము ఆర్ణవము
సహృదయుల చింతనలో – శూన్యధన్య శుద్ధమిథ్య.
వంగిన ఆకాశము – వంగడమై మొలకెత్తగ
సూర్యచంద్రచలువలోన – చేతన చైతన్యములు.
పంచభూత ప్రాభవమున – విభవమె ఆకాశము
ఉన్నది లేదను మర్శన – మన్ను జనుల మాలిన్యత.
హర్షము వర్షమై – ఆకాశం వికాసం
జీవుల జీవనముగా – నవమైన భువినయనము
తిరిగి తిరిగి గ్రహములే – తీరులు మారగా
ఆగ్రహముల నిగ్రహములు – అంతరముల ఆకాశము
ఆర్యసూర్యు ఆప్తత – చంద్రుని రజినీ రమ్యత
సాంద్రాకాశమునందున – నిశి వెలుగుల నిమ్నత
భూమి భోజులందరు – భువనమ్మును చేరగా
ఆకాశము అవకాశము – కొందరికది కోర్కెగా.
గగనము గణ్యముగా – ఖగములు ఆగముగా
కాలుష్యము కాసారము – నిత్యనిధియె నీరసము.
గ్రహవాసము సహవాసము – విశ్వగణ్య విబుధులకు
శాస్త్రము అస్త్రముగా – అశాస్త్రీయ శాస్త్రులు.

ఆరాధన రోదనగా – ఆవేశము వేషముగా
ఆశయాలు శమముగా – అశ్రమమే ఆకాశము
చంద్రుని చెంతచేర – సాంద్రులైరి సారథులు
ఆరాధించిన చంద్రుడు – అధివసింప అవధాయెను.
హృదయాకాశమునందున – హ్రదమాయెను అశుభ్రత
అభ్రము విభ్రమముగా – పరిశుభ్రత పరిణామము
పరాభవము ఫలముగా – వరాకృతులు వలపించును
విజయము వినయముగా – గుంద్రములే గురుగ్రహములు
కాంతి శాంతి కలుగగా – దాంతి దయలు 'దవన'మై
వనధనములు ఇంధనము – వాసియెజను అవకాశము.

581

అపచారపు విచారం – ఆచారపు అపహాస్యం
అంబరాన భరతం – సంబరాల సంకులం.
వివేకమే ఆనందం – వేకువ లేనిది జనం
అక్షరజ్ఞానం క్షరం – అజ్ఞానం అక్షయం.
హిందు ధర్మ హితం – హతమున బంధితం
ధర్మానికి హననం – కర్మలకూ గ్రహణం.
ఆగ్రహమున అనుగ్రహం – నిగ్రహమున నియమం
ప్రగ్రహమే ప్రబంధం – ప్రయత్నమే అణుబంధం.
కట్టుబొట్టు కలవరం – కట్టడులే అతికఠినం
అష్టాంగం అవశిష్టాంగం – శుద్ధ సిద్ధి శూర్పణఖం.
గతగమన మననంలో – జాతిదేశ దేవళమున
జీవాత్మల పరమాత్మలు – పరమతముల ప్రార్థనలు
శుద్ధాత్మల సౌందర్యం – బద్ధాత్మల అనుబంధం
ఆనందపు ఆర్ణవాలు – సచ్చిత్తుల సంగమాలు.
ఆరోగ్యము రోగము – అనారోగ్య ఆహారము
మితము హితము మార్గము – మించు శక్తి మానము.
ధర్మత్యాగ దారులు – కరుణ కర్మ కలితములు
దార్శనికపు గమ్యానికి – ద్రఢిమనిచ్చు జనావళికి

విశ్వము వశ్యమై – వినువీధిని హైందవమై
గురుత్వమే గరువమై – నవ్య గురుత మానవత.
దేశభక్తి దేహమై – రుగ్మతలే మతకులములు
గతుకుల అతుకుల దార్లు – గమ్యతకు కుమతులు.
స్వార్థము సార్థకమై – స్వారాజ్యము శోభనమై
ఇష్టారాజ్యము హితముగ – నష్టపోవు విశ్వము.
వినయమునయనమై – విజయము గమ్యమై
అనయము పరాశక్తి – మానవునికి శ్రమశక్తి.
ఆలయాల లయలో – అవివేకపు వేకువలో
తేకువ తెఅగులు కానక – తపనపెరిగి తరిగిపోవు.
కలయికలో కలదుసుఖం – కాముకులకు కలవరం
విభేదాలు విలువలనే – వాదం ఖేదం బాధ్యం.
వ్యక్తులు శక్తులుగా – వ్యవస్థలే వెలుగులు
శక్తియె స్వార్థమై – శంకరమే వంకర.

582

సమరానికి సహనం – సమయానికి సవనం
అరుణోదయ ఆవహనం – చైతన్యపు సంకేతం.
మహామహుల మాన్యతలో – సంస్కారపు ధర్మములో
నవజీవన నాణ్యతలకు – భాగ్యసేతు భరతసీమ
అవర్ణమే సువర్ణమై – సవర్ణాలు ఆర్నవమై
సమవర్ణము సహితమై – సుమార్ణవము విశ్వము.
భాషలు భాష్యములూ – భాగవతపు గమ్యములు
ధర్మకర్మదయార్ద్రతలు – పట్టుదలల పట్టములు.
గీతల తలరాతలు – గీష్పతులకు వాతలు
విభజన మతములు – 'విశ్వగీత' నశ్వరములు.
పరమ'హంస' హంసలు – పరివ్రాజక ప్రజలు
హేతుహత్య జాతిమచ్చ – శూన్యంలో శుభవాదము.
యుగాల యాగాలు – యోజనులకు రోగాలు
రాజులు  బూజులైన – భోజులు భోక్తలుగా.

596

కలియుగమే కలగా – మలియుగమే మలినమై
గతయుగాల గణ్యతను – గరువముగా గణియింతురు.
అవిద్యయే అతిశయం – విద్యవిలువ వింతాయెను
అజ్ఞానపు అంధత్వం – అభివృద్ధికి ఆటంకం
జ్ఞాన శోధ గణ్యులు – జ్ఞానబుద్ధ వారసులు
జనస్వామ్యపు జగమునా – జాగృతి జయకేతనులు.
కనరాని వినరాని – కలిమేదో కలదనీ
మూఢత గాఢత కలిపిన – భాష భాష్యముల వినుతురు
కాషాయ కషాయము – కీర్తనలతొ మూర్తులు
అజాయింపు పూజారులు – అన్నికలిగి అసలుకు మోసము
అభిప్రాయ అప్రాయము – గొప్పల తప్పుల తరణము
హక్కు వాక్కు అతివితరణ – అదే 'మతము' అంధ్యము
రూపు రుచులు 'కుజ'లుగా – 'మతనాటక' మలుపులో
వ్యాపారము అపారమై – 'ఉగ్ర'మతము వాదమయ్యె
విశ్వశాంతి విజయంలో – సేవమాధవమ్ముగా
మానవుడే దేవుడై – మహినిండును మమతగా.
అంతరాల దొంతరలకు – అంతమె నేడగునుగా
వివేకమున స్ఫూర్తితో – 'నరేంద్రమౌ' ఆనందము.

583

'భోగి' మంట – 'రాగి' తంట – 'త్యాగి' వెంట – 'విరాగి' వంట.
భోగిపళ్ళు – భోగములకు నకళ్ళు – బాలల నవలోగిళ్ళు – సంక్రాంతికి రాగిల్లు.
కోడిపుంజు కోడళ్ళు – వాడికత్తుల అత్తలు
తెలుగుదనపు లోగిళ్ళు – వరుల 'బరు'ల వాసిల్లు
కనుమల కారుణ్యములు – పశుపూజల ఫలములు
నాగళ్ళకు వేగళ్ళు – ఎద్దుల ముద్దుల ఎదలు.
గారెల గాంధర్వములు – బూరెల బులపాటవములు
పాయసముల అసమములు – తెలుగు వెలుగు పరువములు
అరిసెల రసనల వడిశెల – మానవ మేధల మధువల
బంతిపూల బంతికూటి భావనత – పలనాటికి ఫలనవత.

584

ఆర్యసూర్య అరుణిమలో – అందగించె అవని నేడు
రథసప్తమి రథములతో – రమణీయము వీథులన్ని
సూర్యదేవళములలో – ఉదయ సంధ్య ఉదధిరీతి
నందనముల వందనముల – అందమగును సానందము
చైతన్యపు శక్తియుతుడు – ప్రకృతి కృతి పరవశుడు
లేకిరణపు వెలుగులతో – వైభవమిచ్చును భువికి
గ్రహములకూ కేంద్రమతడు – అనుగ్రహము అన్నిటికీ
ఆగ్రహమున ప్రగ్రహమున – అమిత్రుడే భువనమునకు
సముద్రముల తపియించును – వర్షములను కురిపించును
వృక్షములకు రక్షకుడూ – వృత్తులకే ఆవృతుడూ
సప్తాశ్వపు రథమునూ – సవనములో సహనముతో
మునుముందుకు లాగగాను – ముక్తుడగును మానవుడూ
కోణార్కము కోవెలలో – కరుణార్ద్రము అతనిరూపు
అరసవెల్లి ఆలయమున – కిరణస్పర్శ మురిపెము.
సూర్యశతక మయూరుడే – శుభవాక్యపు విభవుడు
దండములు మెండుగా – సంస్కృతమే సంస్కారము
ఉదయాచల ఉద్యమము – అస్తాచల అందగింపు
అన్నిలోకములను చూడ – ఆర్యసూర్యుడాప్తుడు.
ఆదిత్యుని స్తవములోన – రామకథయె అందగించె
హృదయము మధుహ్రదమాయెను – ఉన్నతిగను చదువగాను
సూర్యశ్లోక శోభలెన్నొ – హృద్యపద్యగద్యలెన్నొ
కొనియాడగ కొలతలేదు – విస్తారము సౌరశక్తి
రఘువంశము అఘరహితము – రామరాజ్య రమణీయము
సద్ధర్మము సహధర్మము – సర్వపర్వ సమధర్మము
మింట మండుచున్నమంట – ధరణితంట తీర్చునుగా
కాలము కలిమిగ దిద్దిన – కలవరములు లేవుగా
జనునిశక్తి జీవశక్తి – దీప్తశక్తి ఆప్తశక్తి
విమలశక్తి అమలశక్తి – ధరణిశక్తి ధర్మశక్తి

అన్నిశక్తులున్నగాని - సూర్యశక్తి శుభకరమే
సూర్యుడాగ్రహించకుండ - స్తుతియించుము నుతియించుము
సప్తమి రథరథుడా - సాగరవరరమణుడా
ఆరుకాలముల క్రమమును - అందముగా దిద్దుమురా.

585

భోగి భోగిమంటలే - భాగ్యనికి 'బంటు'లు
యోగచెలిమి తంటలే - ధనయాగపు దార్శనికులు.
హిమకాలపు మహిమలు - ఈదురుగాలుల 'వదరులు'
వాదర వలపుల వంపులు - ఏదరిజేరని ఎఱుకలు.
ఉత్తరాన ఉద్భృతమై - దక్షిణంపు దరిజేరగ
దాక్షిణ్యపు దక్షతలు - వాతూలపు తలపులు.
ముడుతల లత మురిపెములు - మడిమాన్యపు మాధురులు
కృషికృత్యపు తత్త్వములు - కర్మజనిత కాంతులు.
మకరరాశి మలుపులు - కుంభపుశాంకరి క్రాంతులు
ధనుర్మాస ధనువులు - 'గోదా'లకు గోదాములు.
సూర్యకాంతి సుందరతలు - చంద్రసాంద్ర అందములు
జనజీవన జయకాంతులు - సంక్రమణపు ఆక్రమణలు.
యాంత్రిక జీవనమున - యావ అర్థ ప్రాధాన్యత
హృదయార్థము హ్రదముకాగ - మునిగిపోయె మార్దవము.
పచ్చ పచ్చ ప్రకృతిలో - పుచ్చిన నవవికృతులు
సుకృతులకు క్షీణతలు - పాపుల కవి పరాకృతులు.
హృదయము ఉదయమై - ఉన్నతియే చిన్నిమంట
చలికలతల 'కలికి'గా - సరళ విరళ సమాగ్నిగా.
నిశీథికీ ఉదయానికి - నిధిగ విధిగ నిర్ణయమై
'లయ'మైన చలిమంటల - లావణ్యమె యీ 'భోగ'ము.
హరిదాసులు 'హరీ'యనగ - 'అంబా'యను గంగిరెద్దు
'గోవింద'పు గొబ్బిముగ్గు - గోర్వెచ్చని గర్వ క్రాంతి.
మాముళ్ళ పండగనీ - మారాముల మొరాయింపు
మాధుర్య మనసులకీ - అధ్వరమే రమాక్రాంతి.

తెలుగుహృదయలోగిళ్ళకు – తెలుపు తెలివి తేటలకు
విశ్వాంధ్రుల విజయమునకు – సంక్రమణపు విక్రమమిది.
కలవని ధృవములనూ – కలిపెడి సంక్రమణము
ప్రేమశాంతి త్యాగములకు – పేర్నిధిగా వార్నిదగును.
ధనగమనపు ధారుణిలో – మనమరువము మానవం
చలి చక్కిలిగింతలలో – చెలిచిక్కని సంక్రమణము
మకరము మన‘కరము’గ – మానవతకు చేయూత.

586

తూర్పుదిక్కు తీర్పరిగా – తర్పణముల గొనువాడా
వేవెలుగుల వేల్పువీవు – వైభవంపు విభుడవీవు
సృష్టికి ముందున్నవాడ – సృజనను దర్శించినవాడా
శుభముల సుందరుడా – చైతన్యపు చెలువుడా
అందము ఆరోగ్యములను – అందించెడి అధిపుడా
ఋతువుల రుజలనుబాపెడి – దీపరూపు నీదె చూపు
గోళరూపురూపుగా – చేరలేని వేడి కలిగి
చేవనిచ్చు విచ్చుశక్తి – చేతములకు వెలుగుశక్తి
నిద్రాముద్రిత జీవులు – కిరణ స్పర్శ కీర్తనగా
మేల్కొందురు మేదినినీ – పచ్చదనం వెచ్చనిదీ
చీకునంత చెరిపివేసి – వేకువలో వెలిగెటోడ
వేదములకు వేద్యుడవై – ఋషుల రుజలు బాపినోడ
మతముల కందవునీవు – మతిమంతుల మధువునీవు
చేతనాచేతనముల – చేరువగుట నీ మర్మము
నీవు నీరసించినా – నిలువలేదు యీ జగమూ
నీవు నేరమెంచినా – నిత్యమిచట సంక్షోభము
సంద్రాలకు సాంద్రుడవూ – నదులకు మోదమునీవు
ధ్రువముల ధ్రుతివినీవు – అందము అద్రులకీవు
కనిపించెడి పరమాత్మా – కనిపెంచిన కరుణాత్మా
అవనినేలు అరుణాత్మా – సవనమునకు సహజాత్మా
గ్రహచంద్రుల దరిజేరిన – నినుజేరుట కష్టమగును

నీశక్తి ఇలవిద్యుత్తూ – నీ భక్తే భవిజనశక్తి
మనుధర్మము ముందునా – జనధర్మము నీదెగా
వెలుగున విద్యను గరపిన – వేదాంతివి నీవేగా
సూర్య నమస్కారములతొ – ఆరోగ్యపు ఆర్యుడగుము.
యోగసాధనమ్ములోన – అర్కుని అవసరమెరుగుము
సిద్ధాంతము సంకేతము – విజ్ఞానము అజ్ఞానము
అందనిదీ పొందినదీ – అమేయమ్ము నీభక్తి
శ్రుతులైనను స్మృతులైనను – శతశతమానములైనను
నీశక్తిని చెప్పలేవు – శాంకరమౌ అంకమీవు
నీగమనము మార్చబోకు – జనగమనము మార్పుచేయి
స్వార్థుల పరమార్థులను – శోభిల్లగ జేయుమయ్య.
పంచభూత పావనుడవు – భవిజీవుల భుక్తివీవు
అందని అందెడి శక్తివి – కనువిందగు కలిమివీవు
కార్యము కారణము నీవు – కర్మసాక్షి అక్షమీవు
ధారుణి దక్షతలకు – ద్రఢిమ మీవు దారినీది.
అనూరుడే సారథిగను – అనునిత్యం సంచరించి
అపవర్గము మార్గముగా – అందరికిని సర్గమీవు
తాపము తపియింపజేసి – కోపము శమియింపజేసి
కోమలతను సాగించగ – కోర్కెల కొలుపుల దైవము!

587

సంతానము స్థానమై – చంట వెంట తరలిరాగ
సంక్రాంతిలోగిళ్ళే – సంతోషపు వాకిళ్ళు
అంతరాల తరాలకూ – అందని వరమైనది
ప్రకృతి మానవ శక్తుల – పరవశసంగమమైనది
విశ్వంలో విలువలకు – బ్రహ్మాండపు భాగ్యానికి
'భూ'భూతము భువనమై – సంక్రాంతికి భవనము.
సూర్యుని చైతన్యములో – సుందరమౌ చైత్యమై
మానవ మనసుల క్రాంతి – మకరరాశి పయనము.
ఆరునెలలు దక్షిణమై – ఇకనుండి ఉత్తరమై

తరతరాలు తనియగా – వరమైనది వధువుగా
ఆరంభము రంభగా – అతిశయ ఊర్వశిగా
తిలోత్తమల తరతమమై – మేనకలకు మేలిమిగా.
చిరుదివ్వెలు బాలలకు – విరిమల్లెల నవ్వులకూ
విలువల బొమ్మల కొలువులు – భవిత విజయ భోగములు.
ముళ్ళ భోగిపళ్ళకూ – చలికి భోగిమంటకూ
చక్కని రేగడి పంటకు – రాజ్యమగును తెలుగిళ్ళు
సరసాలకు చావడులు – సురశాలల సుందరతలు
వృత్తి జనుల వృత్తములు – నిర్వృతి నిరయము నింగికి
ఆరాధన సాధనలూ – అపరాధపు రోదనలు
కృషికి తగిన ఫలితములూ – వెతలువేగు సతమిచట
కనులముందు పచ్చదనము – కలికమ్మున వెచ్చదనము
పచ్చదనం వెచ్చదనం – ఫలములు మనసంక్రాంతికి.
సంప్రదాయ యాంత్రికము – సరసమైన మాంత్రికము
జనక్రాంతికి అవసరము – కాంతి శాంతి సంక్రామము
సంకురాత్రి శంకరము – జనశంకరవశంకరము
వంకరలకు టింకరులకు – అసత్యాల అవలంబము
నూతన వస్త్రములతొ – వినూత్నంపు లోచనముల
విలువ కలుగు దృక్పథమున – ధార్మికమే నవ్యకర్మ.
బాలల సంతోషములే – భవిజనులకు భాగ్యములు
సంతానపు సంతర్పణలో – అర్పణములు సంక్రాంతులు.

588

సప్తసేవలందునా – నిక్షిప్తము యీ జగమూ
శ్రీవారికి శివములలర – వాహనమున వారువములు
సప్తవర్ణ సరసిలోన – సుప్త ఛంధ చందమునా
వేద్యమగును హృద్యమగును – వెలలేనిది తులలేనిది
సూర్యప్రభా సుందరము – ఆదిత్యుని కాద్యమగును
చిన్నశేషవాహనమే – శేముషికీ చెలువమూ
గరుడవాహ గమనమే – విష్ణువునకు విజయము

హనుమంత హరితమే - హరియించును పాపములను
కల్పవృక్ష సేవనమే - కలిమి బలిమి కలియుగమున
సర్వభూపాలనమున - పర్వము పరమార్థసేవ
చంద్రప్రభా విభవమే - సాంద్ర ఇంద్ర జీవనమే
అమ్మలగన్నమ్మకూ - అలివేలుకు నమస్సులు
అందగించు ఆమెసేవ - జంతువాహనముల సేవ
అప్పన్నకు అర్పణమూ - రథసప్తమి వందనమూ
భద్రాద్రి రామునికీ - భద్రమివ్వనమస్సులూ
రవివంశపు అంశునికీ - రామరాజ్య కామనలూ
అదితీ కశ్యపులకూ - అందమైన అంశముతో
పదునాల్గు లోకములకు - పరమపావనుడు ఆరవి
సంజఛాయతోడుత - సరసుడైన ఆదిత్యుడు
భువి జంటల బంధువుగా - బంధనముల తీర్చునుగా
రంగురంగు రంగములకు - అంగిరంగు నీరంగుగ
అన్నిరంగులున్నవాడ - అవనిని వెలుగొందువాడ
అఖండమౌ భూఖండము - నీకరముల నిర్మలమూ
మర్మకర్మ మానవులకు - ధర్మవర్తనను నేర్పుము
నీధర్మము నిత్యవెలుగు - నీబాధ్యత చైతన్యము
నిమ్నజనుల మదమగ్నత - నీజయశీలము దెలియదు
మాఘశుద్ధ సప్తమిలో - ఉత్తరయానము నీదిగ
పుణ్యగణ్య ధన్యముగా - నియమనిష్ఠనిసర్గము
భువి స్వర్గము చేయగా - జ్ఞానవెలుగు వెలిగించగ
అంతరంగతరంగముల - తారంగమె నీ అంగము
ఆదివారమమరమాయె - తిరువీథులలో తియ్యనాయ
మాడవీథి మధువులొలికె - శ్రీవెలుగున సూర్యుడాయె.

589

తూర్పు తూర్పారబట్టె - పడమర ఫలరహితమాయె
ఆర్షము హర్షమయి - అపహాస్యము అన్నము
నవసంస్కృతి హైన్యముతో - భారతీయతకు దైన్యము

రాజుల యుద్ధములు – వారసత్వ సత్వములు
మతములు మారకములు – షణ్మతములు సతమతములు
ప్రాంతీయత ఫలములు – దేశీయతశీతలములు
భుక్తి భక్తి తత్త్వమై – వ్యాపారము అపారము
లేనిది ఉన్నదనీ – ఉన్నది లేనిదనీ
లేవడియగు 'నేన'ని – వడివడి తత్త్వము తరిగెను
మాతృత్వపు మార్దవములు – పితృత్వపు పీడకలలు
పెరిగి పెరిగి తరిగిపోగ – పేలవములు జనగతులు
ఆధికృత అందలములు – ధిక్కారపు దిగు'మతు'లు
అహంకార హుంకరింపు – ఓంకారపు ఒదుగుదలలు
ఆచార్యుల చారుచర్య – అందరి మదికెక్కలేదు
భావబాష బాధ్యతలలొ – బరువైనది బడుగులకు
త్రికాలములు త్రిలోకములు – హేతువులకు హతములై
త్రిమూర్తులకు తీర్థములకు – పరిమితమై ఫలమువీడె
యుగవిభజన భజనలో – భోజ్యమాయె సమత్వము
విమతములగు మతములకూ – విలువలు లవమాయెను
వర్ణకర్మవారసులుగ – వసుధ జనులు విముఖులై
విద్యవిలువదెలియగా – వధ్యమాయె మూఢత్వము
పుట్టుకట్టుబొట్టులో – పూజ్యమాయె మూఢత్వము
ఆచరింపు అవధిమీరి – వధ్యమాయె అసలుమతము
శాస్త్రశస్త్రచెలిమితో – వేదవాద వాదరతో
నిగ్గుదేరు నిత్యత్వత – నిగమములకు అదిగమ్యత.
సంస్కారపు సరళత్వము – హింసతత్వ హీనత్వము
పేరుమార్పు ఏదైనను – పెరుగు మానవత్వము
వైవిధ్యము వైరుధ్యము – జగజ్జనని ఛణత్వము
ప్రకృతిలో పరవశించ – వికృతికిక విలువలేదు.
వేవెలుగుగ తూర్పున – రేవెలుగుగ పశ్చిమాన
ఆర్ష అన్యమతములన్ని – సహర్షమగుమానవతకు.

ప్రకృతి పురుషులకూ – పరాకృతే పరమాకృతి
వరమాయెను వసుధకూ – సుధగా సుందరప్రేమయె
పంచభూత ప్రకృతిలో – పరమార్థత శక్తి రక్తి
పురుషుని వర ఆకృతితో – ప్రేమ కృతిగ అవతరించె
త్రిమూర్తులకు శక్తులూ – త్రికాలాను రక్తులూ
దేవుళ్ళకు దేవతలకు – దివ్యమాయె ప్రేమలూ
సృష్టి సుందరతలకూ – సృజన జీవ ఆకృతులకు
పుష్టి ప్రేమ పూజ్యతగా – అన్యోన్యము అవసరము
సరస్వతీ నారాయణి – పార్వతి పర్వముగా
పురాణముల పూజ్యతలో – ప్రేమ పుణ్యమాయెనుగా
శ్రుతుల స్మృతుల సుందరతలు – అందరికీ అందించె
స్త్రీపురుషుల కలయికయే – తిరుజీవుల తీరుగా
సంప్రదాయ సంస్కృతులు – సంతకెళ్ళి వింతలొచ్చె
పరదాలు పరుగులెట్టి – సరదాలుగ సంరంభము
అర్ధనారీశ్వరుడయి – అర్ధాంగిగ పార్వతిగా
అన్యోన్యత ఆనాటిది – ఈనాటిది సగపాలయె
పురుషార్థము పురిటిలోన – తృతీయమే ఆతృతగా
అరిషడ్వర్గము కామము – జవ్వనమున జవముమీరె
అందము ఆకర్షణ – కర్షాపణ కమనీయము
అనుభవమే విభవమై – ఆధిక్యము న్యూనతలయె
అక్షరములు క్షరమాయెను – అర్థములే వ్యర్థములు
స్వార్థశోభ శోధనలో – కలయికలే కలవరములు
మతముల మాలిన్యములో – అన్యోన్యత న్యూనత
తొందర చిందర వందర – తోడునీడ వేడుకాయె
తల్లిదండ్రి మాటవినరు – గురువును గురితించరాయె
పరవుల ప్రాభవములలో – వరప్రేమకు వాసిదరిగె
మనుధర్మము అధర్మమై – చతుర్వర్ణ చెలువములో
గుణకర్మల విభాగమున – గురుతు మహిళ గుంభనము
ధర్మపత్ని ధాత్రిలోన – షట్కర్మల సాధువాయె
స్వాతంత్ర్యము లేనిదనగ – చుట్టములయె చట్టములు.

591

సీమెంటు రోడ్లపైన – సీమంతుల మంత్రాంగము
మురుగుకాల్వ మరచిపోగ – తరిగిపోయె పరి'శుభ్రము'.
పల్లెలు మొల్లలు మల్లెలు – ప్రకృతమ్మ పరవశమై
యాంత్రిక జనవికృతిలో – పట్టణాలు పట్టువిడిచె.
సేద్యము వేద్యమనీ – జాతికదే సేవ్యమనీ
అన్నము మిన్నయనీ – అన్నదాత చిన్నపోయె.
కక్షలు శిక్షలూ – కాపురాన 'కైపు'లూ
దక్షత వివక్షగా – ధరణిలోన ద్రఢిమ చూపు
'స్మార్టు'ల 'మార్టు'లలోనా – సామాన్యుడు నలిగిపోయి
విశ్వసంత వింతలతో – వంతలేని వర కథకుడు
నీతిజాతి గోతిలోన – నిధులన్నియు పూడ్చివేయ
వెలికితీయు వెలకారులు – దోపిడిలో దోర్బలులే.
పాతపల్లె చెల్లిపోయి – నగరాలకు నమసులాయె
మాటమనసు మహిమలేని – 'పై' సంస్కృతి పల్లవించు.
పరత్వమ్ము అపారమై – సహజత్వము చచ్చిపోయి
జవసత్త్వము వశముదప్పి – అభినయమే 'నయ'మాయెను
మితములేని మతములేని – మీదు క్రిందు మందమతులు
తాగితినీ తరించగ – జబ్బు గబ్బు మబ్బు మతులు
మెంటలెక్కి మేధావులు – ఇదికాదని అదివలదని
డాలర్లకు దౌడుతీసి – అలసి సొలసి అవనతము.
సంప్రదాయ సరళులే – సరళిమారి విరళమయి
గరళములై మరణములై – సొబగుల స్వార్థములయె.
స్టారుహోటళ్ళలో – సరసములే విరసములై
సంస్కృతి దహియించగా – తిరోగమన ఆకృతులు.
ఆకలి ఆర్ద్రతలూ – వేకువ కువకువలూ
వెతికిన కానరాని – తెలివి వెలితి దేశానిది.
మార్పు తీర్పు లెన్నియైన – మారనిదే మనిషితనము
మట్టిరోడ్డు మన్ననగా – తారురోడ్డు తరియించుగ

చెల్లిన కాలానికి – చెల్లని చెలువుకూ
చైతన్యపు చైత్యమే – నిలచివారసత్త్వమగు
మురుగులేని మరుగులేని – మురువుల మానవతే
ఆరోగ్యము రోగహరము – ఆదియనాదికీ అపురూపము.

592

అవిద్యయే మూలమిచట – స్త్రీవిద్యల చెలువులేదు
గృహమునకే పరిమితమయి – గృహిణిగ హితమొనరించెను
రానురాను రాజ్యమునా – రమణి తీరుమారిపోయె
జనస్వామ్యపు సామ్యములో – సమానతకు మానమయె
ప్రభుత్వాలు ప్రభవమంది – పాలకులకు పడతి మీద
అభిమానము పెరుగగా – ఆస్తిని సగపాలిచ్చెను.
వ్యసనమునకు వ్యవస్థలో – వెలితిలేదు వెలుగే
స్త్రీపురుషుల చింతనలో – చింతలు వంతలు పెరిగె
మధువులొలుకు మనసులన్ని – విషముచిమ్మువింతలాయె
ప్రేమపెరిగి పేలవమై – లవలేశము మిగలదయె
ప్రత్యేకత పరవశమయి – అనులోమము విలోమము
కులమతములు ప్రవేశించి – ప్రేమలు దోమలుగ మారె
ప్రేమపెళ్ళి 'స్టారు'లంత – ప్రేరణ ప్రేరేపణగా
యువత భవిత స్టోరులోన – మిస్టరీగ స్టడీలన్నీ
ఉన్నవారు లేనివారు – మిన్నంటిరి మన్నంటిరి
మధ్యనున్న మిథ్యలోన – ప్రేమికులకు వ్యథలాయె
హృదిగదులూ హ్రదములయి – జయప్రదము ధనపథము
అన్యోన్యత న్యూనతగా – అఘోరించు ప్రేమలూ
కూడికలూ తీసివేత – లెక్కలుగా ముక్కలాయె
సుముఖమదే విముఖమయి – విన్యాసము విధ్వస్తము
ప్రేమరాజకీయములో – పేలవతలు విడాకులు
కాదంటే ఆత్మహత్య – లేదంటే కరుణము
కష్టములో కలిమిలో – ఇష్టముగా నష్టమైన
ఒకటైన ప్రేమికులే – ప్రేమకు నిజరూపములు

విశ్వవిఫణి వీథులలో – దేశీయము దేవళము
విదేశీయ విలువలలో – విజయగాథలేకొద్దియె.
మనమాతకు మనమట్టికి – మనజాతికి సంస్కృతికీ
సహజత్వపు జగతికీ – సాధనముగ ప్రేమించు
చదువుముందు సంపాదన – ఉద్యోగము ఉన్నతము
అప్పుడు ప్రేమించగా – అంతరములు అసలుండవు.

593

పురాణాల ప్రయాణాలు – పూజ్యతకూ దర్పణాలు
మిత్రత్వపు తత్త్వాలు – మీరిపోయి మిణుగురులు
నేలవిడిచి సాములూ – సాములోరి మాటలూ
శ్రవణమునకు విందులూ – ఆచరణకు చిందులూ
నీటితోడ నిధులొచ్చెను – నియమములే విధులాయెను
విదుల మదుల విధులన్నీ – అవిద్యతో ఆహతములు.
వేదవ్యాఖ్యానములూ – వ్యవస్థలకు స్థలములు
కావ్యకథల కాధారము – కలవరముల ప్రపంచము
జీవజాతి జిలుగులలో – జవసత్త్వము మతము
మతగ్రంథపు మక్కువలో – ముక్కలాయె మనుషులు.
నిబంధనల బంధములో – అంధమాయె మతములు
మానవతయె అందమనీ – విశ్వగాథ వినిపించును
సేవ సేచనమ్ముగా – చల్లబడును మనసులు
స్వార్థసేవ చెల్లుబాటు – చెల్లాచెదరే సమత
పంచభూత ప్రకృతి కాంత – పరవశించు రెండు కళ్ళు
సూర్యచంద్ర సాంద్రతలో – ఉరవడించు ఔన్నత్యము
పెద్దల మాటలనూ – చద్దిమూట విధమునా
స్వీకరించ సిగ్గాయెను – ఎగ్గాయెను ఎదల ఎఱుక
నేతల జాతకములు – పాతరలో ఫలరహితము
'వాత'ల వాక్కులకూ – విధివ్రాతే విలువాయెను.
ప్రకృతి పరవశమై – వికృతి జనవివశమై
అసలాకృతికనరాక – అమరమ్మున ఆంధ్యమాయె

చిక్కుప్రశ్న చింతనాయె – చిలుకజోస్య జ్యోతిషమున
గ్రహగతులే ఆగ్రహమున – మతిదప్పగ మరణమాయె.
మరణము అరణముగా – బతుకుకు భరణముగా
భాగ్యయోగ్య దార్శనికము – భవబంధము విడిచెగా
తనదికానిదంతా – తనదేనని తపనపడీ
తాపమందుమునుగగా – శాపము తనకగునుగా
భాషరాని విద్యకూ – భావరహిత కవిత్వము
హితముల మతములూ – ఇంపగు జనశ్రేణికి
సత్యము నిత్యమై – అసత్యమే అనిత్యమై
సత్యాసత్యములిలలో – నిత్యానిత్యము జనునికి.

594

కురువంశము అంశువుగా – కురువృద్ధుడు భీష్ముడాయె
భారతకథ భాగ్యమాయె – ఇతిహాసము ఇరులతొలచె
పాత్రల పరమార్థములో – వ్యాసుని న్యాసము వెలిగెను
కౌరవులూ పాండవులూ – కర్మల మర్మము తెలిసిన వారలు.
భీషణమౌ ప్రతినసేసి – భీష్ముడాయె పేరుతోన
తండ్రిప్రేమ తరియించెను – భ్రాతృప్రేమ భాసించెను.
పెంచి పెద్దచేసినట్టి – కౌరవులకు పాండవులకు
సేవచేసి ధన్యుడాయె – ధర్మాత్ముడు మహాత్ముడు.
కౌరవ సైనికుడైనా – పాండవప్రేమికుడైనా
శ్రీకృష్ణుని గొప్పదనము – చింతనలో చైతన్యము.
ధర్మకర్మవర్తనుడూ – దారిదప్పినడవలేదు
మహాత్ముడూ మహోదయుడు – మహనీయుల కాదర్శము.
భార్గవరాముని శిష్యుడు – బాధ్యతతో మెలిగినాడు
వీరత్వము ధీరత్వము – బ్రహ్మచర్య బ్రహ్మజ్ఞాని.
శంతనునికి గంగకూ – శక్తికి ప్రతిరూపముగా
సకలవిద్యపారంగత – సద్యశమే సాధ్వసము.
మాపుశుద్ధఅష్టమీ – మఘమహితము అఘరహితము
మాలిన్యము మరుగునుగా – ఆరోగ్యము భోగ్యముగా.

శరాసనము శవాసనము – యోగము సహవాసముగా
పుణ్యతిథికి ఎదురుచూసి – గణ్యుడుగా మాన్యుడాయె.
చిత్రాంగ విచిత్రవీర్య – చింతనలో వంతలన్ని
అంబ అంబిక అంబాలిక – అనుగువారికర్పించెను.
ధర్మజునికి దారిజూపె – పాండవులకు పరముడాయె
తాతగాను త్రాతగాను – తరియించెను ప్రసన్నుడై
భీష్మునోట సూక్ష్మముగా – వెలువడెనుగ వెలుగు కలుగ
విష్ణునామ జిష్ణువుగా – సహస్రమై సమాదరము
జీవనయానములోనా – నిస్వార్థము పరార్థము
పరమార్థము వరమైనది – వాక్కాయము కర్మలలో
మంచి మార్దవములకూ – త్యాగము తెగియింపునకు
చిరునామా భీష్ముడే – తిరువీథుల తీర్థుడే.
ఆదర్శము అందరికీ – పరాపరాపార్థివులకు
శతమానపు శత్రువులకు – శతశమానపు మిత్రులకు
కౌటిల్యపు నీడలోన – కాఠిన్యపు కలతలతో
సహజీవన సేవచేసి – సహనవహన సారథిగ
మరణమర్మమును దెలిపే – పాండవులకు పరమార్థుడు
పెద్దయైన కౌరవులకు – పేర్మిమీర సైన్యాధ్యక్షుడు
శాంతిపర్వసూక్తులన్ని – భీష్ముని భావనలుగా
ధర్మరాజు తెలియజేసి – భారతికే భాగ్యమిచ్చె.

595

వింటరు హంటరుగా – తంటల తరువులకూ
తూర్పున సూరీడు – తార్పుడు గాడాయెగా.
పడమర మన్నీనికి – మగువల మన్ననాయె
తెగువల మగలకూ – సెగలు వగలు సేచనమే.
హేమంతము హితవంతము – మగువ మతే హిమవంతము
కేశవ శుభకేతనము – శివంకరము శంకరము.
మకరమునకు విభవము – 'కరము'నకు అభయము
ఉత్తరమున కున్నతము – ప్రకృతి శక్తి సంక్రమణము

610

సప్తవర్ణ సరస్సులో – సప్తపదుల ఆప్తతలో
అన్యోన్యత అర్థార్థము – ఆలింగన లింగైక్యము
సృజన పథము సుందరమే – జనపథ పదమే అందము
అరణ్యాల వరేణ్యము – ప్రకృతి శక్తుల ప్రణవము
సత్యశివము సుందరము – నిత్యము నిజ వందితములు
నిత్యదారుణాలతో – దారిదప్పు దార్శనికత
మార్పువల్ల కానిదనీ – తీర్పరులుగ తీర్థులై
ఆర్థికత్వ అహములో – మహనీయులు స్వార్థులు
ఏడుగడే కడకిలా – ఏఱువాకగా మారి
ఏమార్చెడి కాంతిగా – సంక్రాంతికి చీకటాయె.
ఆకాశం అదృశ్యం – మేఘాలే మరపులు
నీటిచుక్క నింగికెళ్ళ – వ్యథల నిధులు వేకువలు.
ఆరుగాల శ్రమలోన – ప్రకృతి ఆక్రమమే
పరాకృతికి ఆశ్రయమై – సార్థస్వీకృతికి సిరిగా
దావాగ్నులు దరిజేరెను – లావాలే ప్రవహించెను
జడివానలు జృంభించెను – హృదిమడులే భయమొందెను.
'అతినీలము'లోకహతము – శీకరమే అతిశీతలము
వర్షర్తువు ఆర్తర్తువు – విలయప్రకృతికి నిలయము.
కర్కశకాలుష్యంలో – కలవరించె స్వచ్ఛత్వము
పచ్చపుచ్చిపోగానె – పరవశించె వినాశనము.
జీవుల కారుణ్యమునా – కార్భుణ్యుడు మానవుడే
కర్మల మర్మముతో – ప్రకృతి కలిమి వారసుడే.

596

చైత్రి నుండి ఫల్గుణమున – తెలుగునెలల తేరుతీరు
కాలగమన కల్మషములు – మసియగును ముసరవెపుడు.
ఏకాదశమాసములో – ఎఱుక భక్తి భాగ్యదాయి
మాఘమాస మధువులో – విదుల మదులు విభవములు.
మఘములు అఘములతొలచగ – జినునిసేవ జనసేవగు
విష్ణుభక్తి శివభక్తీ – శివములకూ శక్తియుక్తి.

మాఘలోని మహోదయం – ఉదధిలోన ఉజ్జ్వలం
సూర్యోదయ శుభతరుణం – రక్షణ తరుణోదయం.
శ్రీపంచమి పర్వము – వాణి వేణి వసుధరక్ష
అక్షరాభ్యాసమందు – అక్షరమౌ విద్యలెన్నొ
రంగు రంగు హంగులతో – పంచమి పరమార్థము
సంప్రదాయ సరళిలో – శుభదాయిలు శుభంకరులు
మాఘశుద్ధ ఘడియలూ – మానవులకు మధురములు
బహుళ ఘడియలన్నియూ – భావికి సరిహద్దులూ
హేమంతము హిమవంతము – సీమంతిని పార్వతమ్మ
మంచుకొండ మహిమమూ – మానవునకు మహిమాఢ్యము
కురువృద్ధుడు భీష్ముడూ – ప్రస్థానపు పార్థివుడూ
సూర్యోత్తర యానమునా – తనువువిడిచి తరించెను.
మహాశివుని మహిమరాత్రి – శివరాత్రియె శంకరము.
తిరునాళ్ళు జాతరలూ – తిరుమాఘికి సూచనలు
మేడారం సమ్మకుకు – సారక్కకు మొక్కులూ
అటవీజన జాతరలో – అమ్మలకరుణకు పాత్రులు.
సప్తమి రథిరధునిదీ – రథసప్తమి రమ్యము
ఆర్యసూర్యయాన మహిమ – శిరోధార్యమందరికీ.
ప్రత్యక్షభగవానుడు – గ్రహకక్ష్యల గమనించును
ఆరకర్షణ ఆద్యుడుగా – అవతరించె వేద్యుడుగా
ప్రాభాత స్నానముతో – ఆరోగ్యము భోగము
పంచాక్షరి పారాయణ – వంచనలకు వంచనము.
ఆగమముల నిగమములా – ఆంతర్యము సమగమనము
చలికీ వేడికీ మధ్యన – సంగమస్థలి మాఘము.

597

కుక్కుటమూ మిక్కుటమూ – కొక్కొరోకో కులము
అండజమై అందమై – అఖిలాండము నిండగా
కుక్కుటేశ్వరునిగా – పూజలందుకొనుచుండెను.
'కుక్షిపోరు' పక్షిపోరు – 'పక్షము'లకు పదవిపోరు

పలనాటి 'గీత'లో – అభయమై అంతము.
సంప్రదాయ సంస్కృతి – దాయాదుల తిరస్కృతీ
అందరికీ అనుకృతి – కలియుగమున కర్మగతి.
పెట్టపుంజు పెట్టుబడి – పెంపు ఇంపు పలుకుబడి
బరిలోన బరాబరి – గెలుపోటమి సరాసరి.
కత్తికట్టివేయగా – కుత్తుకలే తెగిపడగా
కత్తిలేని పందెములో – పోట్లు గాట్లు పోడిమిగా
కాకినెమలి కలవడగా – కమనీయము పుంజులాట
డేగ 'డేరు' చేయగా – 'తెలుపు' తెలివి మారెగా
సంప్రదాయ వికృతిలో – పుంజులాట పూజ్యమై
పందెం పందలాయె – పై పందెం పరమమాయె.
క్రీడలస్ఫూర్తిలోన – విస్తృతమయె విలువలు
తెలుగుదనపు వాకిలిలో – వెకిలింతల అపశ్రుతి.
కూలిన కాపురాలు – స్పర్థల వివర్ధనము
కొట్లాటల కొలుపులు – కోమలతకు మలినములు.
న్యాయమైన న్యాసములో – కర్మ ధర్మ ధరణిలో
ఆటల మాటున కూటమి – అటమటమై అవనతము.
వినోదంపు దంపుడులో – అమాయకుల దండనము
నోరులేని జీవాలకు – తీర్చలేని ఆవేదన.
పక్షిప్రేమ పక్షముగా – జంతుప్రేమ ప్రేరకముగ
ప్రకృతి ప్రేమ పరవశముగ – బ్రతికిన బ్రతుకే నిత్యము.
గుండాటలు గండ్రాళ్ళు – పేకాటలు పేలవములు
నగ్నదృశ్య నాట్యములు – నవసంస్కృతి వెర్రితలలు
పల్లెరైతు పండుగగా – పట్నవాస వాసితమై
పంట వెలయె తంటగా – మింటికెగసె సంస్కారము.
ఆరోగ్యము ఆహ్లాదము – ఆనందము అనుబంధము
ఆశయమే ఆశగా – అనుభవమే అసలందము.

598

భూభవనపు ఆకృతికీ – భువిలోని ప్రకృతికీ

సమతౌల్యము సాధించగ – సూర్యుని వెలుగే ఆర్యము.
జాతరలలో సమతుల్యత – పాతరగును పాపముగా
వ్యర్థము స్వార్థములుగ – వెలువరుచుచు జనులుండెను
స్వచ్ఛవెలుగు సూర్యుడిచట – విచ్చుకత్తి చిచ్చుగా
మారిపోవు విధముగాంచ – మారణమే మనయీ భువి
నియంత్రణము నివారణము – నిత్యకృత్యముగ మారగ
పరిపక్వపు హృదయములు – పరమార్థపు తనువులు.
కొలతలు కోల్పోవుచూ – కొలువు దీరె కాలములూ.
అర్క కోమలతలకూ – కోర్కెచెట్టు కొలుపు దీక్ష.
అరణ్యములు అంతరించి – అవతరించు సౌధములూ
రహదారుల పక్కచెట్లు – ముక్కలాయె విశాలతకు
ప్రకృతి ప్రేమికులిచ్చుట – పర్యావరణము వరముగ
ఉద్యమముల ఉద్యమించ – ఉన్నతిగను ప్రకృతిగతి.
అనంతమౌ రోగములకు – ఆకరమగు 'మాఘము'
నిరోధకము నిత్యయోగ – విరోధమది విమతులకూ
కంప్యూటరు సంస్కృతిలో – పూర్వాపర ప్రదేశముల
దేశవిదేశములలో – దేహము దారుఢ్య రహిత.
గోరువెచ్చగదులాయెను – పారునీరు ఫలరహితము
సంద్రమేమొ సాంద్రకలుష – తాపతప్త తరుణమాయె
తీర్థ సంగమములుకూడ – తీరుమారి తీపి విడిచె
కొండకోన కొలుపులన్ని – మంటపెంట తంటలాయె.
మనసులేని మనుషులాయె – మాతపెంపు కంపాయెను
పితరులన్న తలపులేదు – యువత పెరిగి బరువాయెను
మన్ననయే విన్నదనము – పెద్దతనము కొద్దిదాయె
మేధస్సుకు మెలికలాయె – పిడివాదము పిలుపులాయె
మాఘి మనసు మధువుగా – మనిషి అఘము విడువగా
లాఘవమే మాసముగా – మధుమాసము జీవితము.
పద్ధతిగా ఆచరించు – ప్రణాళికతొ పయనించు
లఘుమార్గము లెన్నబోకు – గురుమార్గము గురుతించుము

నెలకాలమె మాఘము – మఘమునీది కలకాలము.
కాలాధముడవుగ నీవు – కలకాలము ఉండబోకు.

599

పెగ్గులేక పేలవం – విగ్గులేక విహీనం
మజాలేక జాంతవం – నేటితరం నేవళం.
తల్లిదండ్రి పెంపకం – అంపకాల అంపశయ్య
ఆడామగ ఆంతర్యం – అవహేళన అంధత్వం
పేదపెద్ద తేడాలను – పెంచిపోషించగా
మోసాలే మోదమయి – మేధ మిగిలి బాధాయెను.
పెళ్ళి పేరంటములు – ఆర్భాటపు ఆధిక్యము
ధనమున ఘనముననూ – మనమే మలుపులు తిరిగెను.
దురలవాట్ల విదగ్ధులు – దూకుడులో దుర్బలులు
సంపాదన పాదచార్లు – జారచోర జాంతవ్యులు
వినలేని వినయము – కనరాని కపటము
కాలుదువ్వు దోర్బలము – బలహీనము బాంధవ్యము.
విద్యలేని వింతపశువు – రెండుకాళ్ళ మెండుమేధ
ఆకాశపు విహారము – అవకాశపు అవసరము.
మద్యమారిమార్ధవము – హృద్యమాంస మనఘము
అతివ క్రీడ అధికము – అంతమునకు తర్పణము.
రోగమావహించినా – రోజు రోజు రాజసము
జరారుజల జగతిలో – మృత్యువుతో మృదంగము.
పులుముకొనుట పూజలు – పూనకమున కొలుపులు
ఆర్భాటపు ఆరాధన – ఆధ్యాత్మిక వ్యాపారము.
ఆశీస్సులు నమస్సులు – అర్థం తెలియని మంత్రము
మంత్రగాళ్ళ మాయలలో – ‘చుక్క’లలో జనదేవుడు.
శుద్ధిలేని సుందరతా – అశుభ్రతల ఆరామము
కొండలపై దేవుళ్ళకు – కోర్కెమార్కు కోదండము.
‘లైకు’లూ ‘మైకు’లూ – హైటెక్కుల కూటములు
హస్తమస్తకము సేవలు – హుండీలలో బ్రహ్మాండము.

కొలుపు చిందుకొరకు 'సార' – బలుపు బలుల బ్రాంది విస్కి
సుఖదుఃఖము మఖము 'సార' – రాష్ట్రదేశ 'రమ్ము''జిన్ను'
బారులోన బీరులాయె – స్టారుతోన సరసమాయె
ముద్దు హద్దుమీరిపోయె – దిసమొలలే దివ్యమాయె.
పెరిగితరిగి విరిగి నరుడు –పేలవమౌ పేరుపోయి
దురలవాట్ల వారిధిలో – మానవతను మరచెనేడు.

600

కల్లోలపు కాశ్మీరును – కాపాడెడి వీరవరులు
సాహసమే కలిమిగా – సాగువారు ధీరమతులు.
సరిహద్దుల హద్దులూ – చెరిపివేయు స్వార్థులకూ
సింహస్వప్నమైనవారు – చీకుచింత చెలిమివారు.
దేశభక్తి దేహులూ – మాతృభక్తి మాన్యులూ
స్వీయార్పణ చిన్మయులూ – ధన్యాత్ములు ధార్మికులూ
పరదేశపు దుశ్చింతన – పరమార్థపు మత స్వార్థము
ఉగ్రవాద వేదనలో – వాదముగా యుద్ధమాయె
మంచుకొండ మహాత్ములు – చలిపులితో సమరత్వము
గుట్టలలో మిట్టలలో – కూరుకుపోయిన వారులు
వీరులార వందనాలు – ధీరులార నందనాలు
అభివందన చందనాలు – అమరవీర సలాములు.
సియాచిన్ క్షేత్రంలో – చితినిపేర్చుకొన్నవారు
చింతదేశ రక్షణలో – చైతన్యము పంచినోళ్ళు
చలిమలలో చలిగడ్డలు – జీవఖనన సానువులై
జిలుగుల సైనికతనువులు – ప్రాణములను కోల్పోయెను
'ముస్తాక్'లు ముద్దుబిడ్డలు – 'సర్దార్జీ' సమరవరులు
'హనుమంతప్ప'ల తర్పణ – అమరముగా భరతభువికి
నిత్యరక్షయోగమునా – రక్తమోడ్చు రణధీరులు
మన 'శాంతి'కి మార్గములు – భరత ధర్మ మర్మజ్ఞులు
అనిశము వారి యశము – అవనిలోన నిత్యము
మూర్తి విడిచిననుగాని – వారికీర్తి అజరామరము.

పక్కలోన బల్లెముగా - పాకిస్తాన్ స్థానీయుడు
పావన మనకష్మీరును - కశ్మలముగ సేయుచుండె
మతవాదము అతివాదము - మారణమై రణమై
మహనీయులు కన్నకలలు - మరచిపోయి చరించుటే
శిగపూవును కాశ్మీరును - రాక్షస కర్కోటకులుగ
వినశనమును చేయగాను - భరతమాత బాధపడును.
మరణించిన వీరులంత - మహనీయులు మాన్యులు
మనమంతా వారికిచట - మాన్యవందనముచేద్దాం.

601

చెరగని చరిత్రలో - మరుగుపడని మనుష్యులు
దీనజనుల రక్షణలో - దివ్యత్వపు ధీనిధులు.
విష్ణ్వంశ రాజులకూ - విశ్వమంత విజయమే
అంశ అంశువంతమై - అధికారపు వసంతము
అవనతమయి అధికారము - విధివంచన విమతమయి
సంఘానికి విఘాతము - సారహీన సంసారము.
సంస్కారము కారమయి - వికారమే ఆకారము
అపకారము అసూయలే - జనావనికి వినశనములు.
యుగపురుషుల పూజలో - పుణ్యజనులె పూజితులు
గణ్యత నెరిగిన ఘనులు - గమనగమ్యముల గాంతురు.
స్వార్థశరభగార్ధభమై - సారహీన వాక్కులతో
సహన పరీక్షలు సేయగ - అసహనమై అంతరించు.
జీవితాలు మలచినట్టి - జియ్యరు వాక్కులందు
జిలుగులు వెలుగులతో - సాధనలో శోభకలుగు
పాత్రము అపాత్రమై - గాత్రము ఆత్రముగా
స్తోత్రము శోభమీరి - శోభనమున శాపమే.
వినుటలు చెప్పుటలు - చూచుట చూపించుటలు
అన్యోన్యము గణ్యము - అవసరముల మాన్యము.
లోచన ఆలోచనగా - వివేచనే విలువగా
లోకహితము మతముగా - ఆచరణము అమృతము.

అనుభవమే భవభూతి – అనురాగము అసలుభూతి.
భవతాపహరణమే – భాగ్యమైన అనుభూతి
మంచితనము మించుతనము – మహామహుల తనమది
'మనము' అనేమాటలోన – మనసంతా మహిమయే.
పాటపదము రాసినా – పాటవమే పటువైనా
కళల కలిమి కమ్మనిదై – జనచరిత్ర జాగృతగును
ధనసేవను దహించగా – జనసేవను తరించగా
హెచ్చుతగ్గు నిగ్గుదెలిసి – జీవనమగు చరిత్రగా
వేదము చదివినా – వాదము జరిపినా
పురాణములు ప్రవచించిన – పూజ్యత జనశ్రేయమే.
మారేకాలానికి – మారని కథచెప్పిన
మనసుల ఆందోళనలు – మానవతకు దూరములు.

602

తెలుగుదనం తేజరిల్లి వెలిగే సూరీడా
కాలచక్రగమనంలో కలతకు చంద్రుడా.
దూరీకృత దురితములకు దివ్యపురుషుడా.
రాజకీయ రాసభముల కీళ్ళువిరుచు కీర్తుడా
అన్నార్తుల కన్నగా అభయమిచ్చు ఆప్తుడా
జీవన నవనాటకమున పాత్రధారి పార్థుడా
పురాణాల కావ్యాల పూజ్యపాత్ర మూర్ధన్యుడ
చలనచిత్ర చిత్రములో చరితార్థ చరితుడా
'క్రీడల' క్రీనీడలో కీర్తి ఆర్తి మూర్తిగొన్న ఘనుడా
నటన సార్వభౌమునిగా విశ్వ వశ్య వినుతుడా
జనజీవన జాగృతిలో జాబిల్లిని పూయించిన పూజ్యుడా
అధికారపు ధిక్కారము హుంకరించి పోద్రోచినవాడా
లంచగొండ్ల దోపిడీల ధనదర్పాలను దహించినవాడా
నందమూరి అందగాడ – నందనములు వందనములు
ఇంద్రునిచేరినవాడా – హితకరుడా మతిమంతుడ
దివమునుండి దివికివచ్చి – దినదినమూ దీపించెడివాడా

618

మూవీలో, టీవీలో, ముచ్చటలలో మచ్చికలో ముద్దుమోము వాడా
చరమాంకము విచారమై చెదరని అభిమానుడా
చింతనకూ, చేతకూ, మాటకు కట్టుబడిన కట్టడివాడా
రసాలను రసాలంలా రమణీయంగా రమింపజేసినవాడా
శతకాలకూ, శతమానాలకూ అందని ఆదరణమూటగట్టుకొన్నవాడా
మానవతే ధన్యతగా దానవతకు దారిని బంధించినవాడా.
భాష, భావం, భాగ్యం, భోగ్యం, యోగ్యం, తెలుగు వెలుగైనవాడా
కోట్లజనుల దృక్కులకు చక్కని దృశ్యాలనందించి దృక్పథము నేర్పరచినవాడా
ఆజన్మాంతం తెలుగులు సంస్మరించే స్మరించే ఏకైక నాయకుడా
విజ్ఞత విమర్శలో విలువలు వికసించాలనే సంస్కరణవాదీ.
కృషికీ, కృపకూ, కృషీవలత్వానికి చిరునామాగా మిగిలినవాడా.
అప్సరసలతో అనుబంధం అక్కడ, అన్నగారితో అనుబంధం ఇక్కడ
యుగపురుషులు, ఋషితుల్యులు, సంస్కర్తల కోవలో చేర్చబడ్డవాడ
అన్నా! అన్నన్నా! అన్నులమిన్నా! కన్నులవెన్నా! నీవిక్కడే ఉన్నావన్నా!.

603

'పేటెంటు'ల పెద్దన్నలు – 'టెంటు'ల్లో నిరుపేదలు
'విశ్వా'న్నల నిశ్వాసము – నశ్వరంపు శ్వాసము
మేధన్నల అమెరికాలు – మేలిముసుగు లొసుగులు
గుసగుసలో గుండాటలు – గూడుపుఠాణీ గురువులు
కూటములలొ కేతనములు – ప్రకటనలలొ ప్రాభవములు
కునారిల్లు కూర్ములు – మతమార్మిక గమనములు.
ఆయుధాల యుద్ధములు – ఆలోచన అధములు
ఉగ్రవాద సంస్కృతులు – ఉన్మాదపు వికృతులు.
విశ్వాత్మల విభవములు – మానవత్వ మధురిమలు
శ్రమశక్తికి చెలువములు – విధ్వంసపు విజయములు.
నదుల గదుల సరిహద్దులు – 'నీరము'నకు నిర్వేదము
పారావారపు కట్టలు – పహారాల విహారాలు
నాయకత్వ కత్తులు – రాజకీయ జిత్తులు
ఎత్తులపై ఎత్తులు – చిత్తులు చిన్మయులు.

ఓదార్పుల తార్పుడులు – వదరుబోతు మైకులా
విధివంచిత పౌరులు – విన్నాణపు వింతలు.
ప్రత్యేకత పవళింపులు – 'కులము'లతో కూర్పులు
పెద్దపేద పేలవములు – అందరికీ వడ్డింపులు.
నడ్డివిరచునాగరకత – గడ్డితినెడి గంధర్వత
గరికపోచ ఆరాధన – పరిగలేరు పరసంస్కృతి
బంగారము అంగారము – అంగిలికది ఉరితాడే
గొలుసు దొంగచేతిలో – గొప్పదనం గోవిందే.
సుమేరియన్ సుందరత – గ్రీకుల గీష్పతితత్వము
క్రీస్తు జన్మభూమిలో – కీర్తిగాంచె 'ఆర్తత'
మహ్మదీయ మతరాజ్యము – మాధవమై మానవమై
దానవమై దారితప్పి – దహించునిట విశ్వాన్ని.
మితిలేని మతిలేని – గతిలేని గమ్యముతో
ప్రమాదంపు ప్రయాణమై – ప్రమోదమే 'ముగింప'గు.
గతితార్కిక తర్కము – తాత్త్వికతల సాత్త్వికము
మితమన్నిట 'మించు'గాను – సమ్యక్ జన జాగృతము
టెంటుల్లో పేటెంటులు – విశ్వానికి విశ్వాసము
జ్ఞానగణ్య మానవునికి – ధ్యానశక్తి పరమాన్నము.

604

శాస్త్రశస్త్రవేత్తలూ – శక్తిభక్తి వేత్తలూ
విశ్వవిలువ విభుతలనూ – వివరించిన మూర్తులూ
రాజ్యము పూజ్యమనీ – ప్రజాస్వామ్య ఫలమనీ
అభ్యుదయము ఉదయమూ – ప్రసరించిన పథమిదీ
భూతము లోతులనూ – భువనపు జాతులనూ
భక్తి శక్తి బాధ్యతలను – భాషలలో భావించగ
సాంకేతిక సామ్రాజ్యం – విస్తరించి ప్రస్తరించి
సారూప్యత విరూపతుల – సంగమమున సవదరించు.
వేదపురాణాలలో – దర్శనాల దృశ్యములో
ప్రయోగాల యోగములో – ప్రకృతియే పరాకృతి

స్వార్ధజనుడు శోభమిగిలి – దోర్బలమున దోపిడితో
వనరులనూ వమ్ముసేసి – సుఖజీవన లోలుడయ్యె
దగ్గరిదారులలో – సిగ్గరి ధనార్జనార్జనలో
ఎద ఎగ్గున ఎఱుకలో – మతిగతినే మార్చుకొనెను.
ఆవిష్కరణము వరణము – అందరికీ బహుమతీ
ఆచరణమున అనుసరణమున – కొందరకే పరిష్కృతి.
దేశభక్తి దేహముగా – దేహశక్తి దివ్యముగా
మేధశక్తి మేలిమిగా – భావి భరత భాగ్యముగా
అంతరిక్ష కేంద్రములు – శిక్షితులతొ శివములు
యోగ్యమైన యోజనలు – జనులకవే జాగృతులు.
బ్రహ్మాండ అండములో – దండి నిధులు కలవనీ
అవని జనునకవియన్నీ – అభివృద్ధికి ధనములే.
మనసు స్వచ్ఛతను మరిచీ – తనువు తర్పణమునకై
తపనల తరియింపులో – తనధర్మము విడిచెను.
ఉగ్రవాద ఊతముతో – ఉన్నతమతములన్ని
ఉద్విగ్నము భుగ్నమై – రాజకీయ పావులాయె.
తల్లిభూమి తరియించగ – జన్మభూమి జయించగా
విశ్వజీవ విభుతలో – విభూతిగా విజయమై
నశ్వర జీవమునకూ – వేతృత్వము వెలుగగు.
గ్రహగతులను గమనించీ – భూగ్రహ విలువను దెలిసీ
భూత జాత ప్రకృతికీ – భవనము నిర్మించుము.

605

సాంకేతిక సైంధవులూ – సంకరముల అహంకృతులు
మతమౌఢ్యపు మహాసిరులు – మానవత్వ హసితములు.
ఫత్వాలకు సత్త్వములు – మతరాజ్యపు మారణములు
విద్యవిలువ వికృతులు – ఆహరింపు అహరహములు.
ఆఖ్యల సౌఖ్యములు – వ్యాఖ్యల ప్రఖ్యాతులు
భాషల బహూకృతులు – భావదాస్య బంధువులు.
మూసుకొన్న మనసులు – మూగవోవు భాషలు

ముంచితేల్చు తెలువులు – తెంపరులౌ మూకలు.
శ్రమశక్తుల విరక్తులు – సోమరితన సొంపులు
గమ్యరహిత గరువములు – పర్వరహిత పరములు.
కొత్తకొత్త పుంతలు – కంతలతో వంతలు
వంతలతో సంతలు – స్వాంతరహిత శోభలు.
కులమతాల లయములు – ఉండిలేని ఉద్యమములు
విప్లవాల విరధులు – భావజాడ్య బంధములు.
కులసంఘపు కంపులు – అధికారపు ఇంపులు
ప్రత్యేకత పవళింపులు – అంధకార ఆర్థికములు.
లంచగొండిలావణ్యులు – కాంట్రాక్టుల కామందులు
పార్టీలలొ పార్టులు – 'పవరు'కు పరమార్థులు.
దారిద్ర్యపు ధర్మములు – దుఃఖాలకు దుష్కృతులు.
శాంతానికి అపకాంతులు – సౌభ్రాత్రపు అర్భకులు.
ఆధ్యాత్మిక అంధులు – జ్యోతిష్యపు తిర్యక్కులు
వాస్తుశాస్త్ర అశక్తులు – 'పలు'శాస్త్రపు పల్లములు.
అభివృద్ధికి వృద్ధులు – వాగ్దానపు వార్నిధులు
అనుభవాల అభాగ్యులు – అనుభూతుల 'భూతములు'
టెర్రరిస్టు తెంపరులు – హత్యల ఆహూతులు
దయలేని ధార్మికులు – కర్మరహిత కార్మికులు.
కులగజ్జికి గోకుడులు – మలసదృశ సంఘములు
మార్పిడి తార్పుడు గాళ్ళు – సభల విభవ సరభసములు
జాతిద్రోహ జాంతవములు – దేశద్రోహ దేహులు
ఎవరేమైననుగాని – స్వార్థమె తమ శోభనము.
శాస్త్రమైనా శస్త్రమైనా – జనశక్తికి దర్పణములు
మానవతా మూర్ధన్యులై – విశ్వసమత చాటాలి.

606

వాస్తవాల వాక్కులలో – అవాస్తపు అవలంబన
న్యూనత అన్యోన్యతగా – నవ్యనాగరిక నిత్యత.
సద్ధర్మము విరుద్ధము – సహధర్మము సంఘర్షణ

హేతువులను వెతకగా – హేయముగా అగుపించును
కార్యకరణములలో – కర్తలు అనుభోక్తలై
కాలము చెల్లినపుడు – కడదిక్కుకు పయనింతురు
కర్తలు ఆదర్శమనీ – కర్మము ధర్మము తెలియక
తత్కాలము కాలమై – తరియింతురు తమసమున
శతమానము శయనమై – మతమానము మాన్యమై
హితమానము హతముగా – హీనమాయె 'కర్త'కర్మ.
సంప్రదాయ సవరింపులు – ప్రయోగముల పవళింపులు
కాలముతో లయములు – కామనలే సంస్కృతులు.
కాలాల సంస్కృతిలో – కలవరమే 'మత' సంస్కృతి
అభిమతమే మతముగా – అనుసరణము సతమతము.
కులసంస్కృతి కుంపటిగా – మలమాయెను 'మత'సంస్కృతి
దేహములతొ దేవుళ్ళయి – కలతలతో కరుణమాయె
మృదుల మునుల వాక్కులూ – యోగాచార్యుల చరితలు
బుధ గురువుల బోధలూ – భరతజాతి 'బంధ'ములు
సాంకేతిక సాగరమున – మునిగి పోతు మానవత
శక్తిహీన భక్తజనుడు – శాపనార్థ శంకరుడు.
అర్థవాద వ్యర్థవాద – స్వార్థవాద శోభతోడ
సంఘశక్తి సంవాదము – అసాంఘికము అశక్తము.
పాండిత్య పాండురము – పరాక్రమము విక్రమము
సక్రమముగ సంవదించ – విశ్వసరళి విజయగీతి.
సహనము సౌభాగ్యముగా – సవనము సంగ్రామముగా
వహన శక్తి వారువముగ – సహమతమే సమ్మతమగు
నీవులోని నేనెంతో – నాలోని నేనంతగ
నీవునేను నిత్యముగా – 'మన'మె జగతి సత్యముగా
భావములందరికొకటే – భాషలు వేరైనగాని
మనసు మహిమ తెలిసికొనగ – మనమహియే భాగ్యసీమ.
ప్రాచీనము నవీనము – కాలపు కొలతలే
నిత్యసత్యనియమములే – కలకాలపు మాన్యతలు.

607

విద్యల ఆలయముల – వింత విలువ విబుధులు
ఆత్మహత్య మహాత్మ్యమై – మహాతత్త్వ 'మద' ముదము
కులముల కుటిలనీతి – మతముల మత్తు మునక
విద్యార్థుల విధ్వస్తము – వధ్యశిలగ విధ్యుక్తము.
బాధ్యత పలాయనము – బోధన ఆయతనము
పదవుల పాకులాట – సద్విద్యకు సమాధిచట.
సంఘాల సాందీపము – అసాంఘికపు అధ్వరము
మరణ వరణ మహితము – సచ్ఛిష్యుల కదిశాపము.
ప్రత్యేకత ప్రవణతలు – ఏకత్వపు ఎదమరపులు
భావజాల బాధితములు – భోజన భాజన జవములు.
రాజకీయ కేంద్రములు – మేధమేలి ముసుగులు
మేకవన్నె మేధపులులు – రాసభములగాండ్రింపులు
కులమలమును పులుముకొని – మతమత్తును హత్తుకొని
అన్యోన్యము అనన్వయము – విన్నాణము కంపరము.
కంపుగొట్టు కుంపటులు – ఉపకులమున కొకసంఘము
అపసవ్యము అసవ్యము – అఖిల సంఘవైకల్యము.
గతిదప్పిన మృతవీరులు – గాంధర్వపు ఆంధ్యములు.
ఆత్మల అశాంతులు – స్వాత్మల శుభశోభలు.
ఆత్మహత్య పాపమనే – అలనాటి సూక్తులనూ
ఉన్నత విద్యల శిష్యులు – ఆదరించ అమృతమే.
శవాలపై పేలాలుగ – బంధుగణము బాంధవ్యము
రాజకీయ రంజులాట – కంపు కంపుగుంజులాట
నాయకులకు పనిహెచ్చెను – ప్రయాణములు పదనిసలు.
ప్రభుతయు ప్రతిపక్షమూ – పల్లవించి లయించును.
మూలము తెలిసియు – తెలియని అతితెలివి
వ్యవస్థలను స్థంభించి – అవస్థలే మిగిల్చెదరు.
అనులోమము విలోమము – ప్రేమపేర పెళ్ళిళ్ళూ
విడాకులకు విజయములు – వినోదమే విబుధులకూ

హక్కులు హుక్కాలకు – బాధ్యతలే బారులకు
ప్రేమలు పబ్బులకూ – పేలవమే ఆత్మహత్య.
గోతిలోన యువత భవిత – గోరుముద్ద సమత్వము
నూతిలోని న్యూనతలను – పాతివేయ మానవత.

608

భాషల భూషలతో – భాగ్యమాయె భావములు
లేఖన సుఖములేక – లేవడులై వాడిపోయె
చరిత్రయే ఛత్రముగా – ఛాత్రుల చదువులాయె
గురువుల గుంభనలో – గాంభీర్యపు గమనమాయె.
ఆంగ్లభాష భాష్యములో – అవగాహన గహనము
దేశభాష దేవిడీలొ – రాజ్యభాష రసాభాస.
వక్రీకరణములోనా – ఆక్రమణము విక్రమించె
క్రీస్తుపూర్వ శకములే – కీర్తి కీర్తనగ మిగిలెను.
పాండిత్యపు పాండురము – విశ్లేషణ శ్లేష్మము
విజయాలకు అపజయము – విభవ సభలు సరభసములు
రాజుల మంత్రాంగములో – పురోహితుల పూజ్యతలు
తనవారికి తనియింపులు – పెరవారికి పేలవములు.
ఆర్యభాష ఆవరణలొ – అసలుభాష మాసిపోయె.
దేశభాష దేహములో – పరరక్తము ప్రసరించెను.
సంఘములే సంగరములు – సమాజములు వాదములు
గురుశిష్యుల గుంభనములు – గాడిదప్పు గమ్యములు.
ఆరాధన విగ్రహమై – రోదించగ రోతమిగిలె.
మనసులేని మానవుడు – మతముచుట్టు తిరిగెను.
శాస్త్ర శస్త్రమతచర్చలు – అంతరముల అస్త్రములై
'వీర'మతము విమతముగా – రాజ్యములే అంతరించె
భూమిపైని భూషలూ – భూమిలోని భాగ్యములూ
దేశాలకు గోడలూ – దేవుళ్ళకు చపలతలు
ఋతువుల క్రతువులలో – రుజలను పోద్రోలగా
ప్రకృతి పరవశమందగ – ప్రథితులు యాజకులూ

విశ్వశాంతి విమతరీతి – దుర్దశలకు దుర్నీతులు
భయమునకు అభయమనీ – అందరు తరియింతురు.
మదిగదిలో మందత్వము – సిరులులేని సీమంతము
అనుకరణల అంధత్వము – అందరికీ అపయశము.
భారతీయ సంస్కృతిలో – 'సంస్కృత' సంస్కారమే
సకల జనుల అభిమతమై – సమభావము సహనమగును
లౌకికరాజ్యములో – లోకుల భాషలలో
లోభములనకు తావులేదు – లాభమె జనసంస్కృతి.

609

ప్రభువు కృపను పొందగా – ప్రాభవుడే మానవుడు
దేవుని ఆశీర్వచనములోనా – దేహములే పావనములు.
కృతజ్ఞతలు చెల్లించగ – విజ్ఞుడగును జనుడూ
కృతఘ్నతే అఘమగు – విలువలకు విఘ్నమది.
అయ్యల గన్నయ్యలు – అమ్మల గన్నమ్మలూ
అందరి మతముల గలరు – అందరికీ వందనములు
ఆరాధనలధమములై – కాలములకు కలరవమై
అంటుసొంటు తంటలుగా – తంపటాయె సంస్కృతులు.
పేరులు పేలవములు – ప్రేరకముల ప్రేమలు
ఉత్ప్రేరక ఊదరలు – వాదరలే వంకరలు.
సహితము 'సైన్సు'గా – 'సెన్సు' లేక 'నాన్సెన్స'యి
వన్నుమోర్ల మోరలెత్తి – మేరలేక మెలిదిరిగెను.
మలుపుల మాటలలో – మలినపు మనసులుండె
అర్థ స్పర్థ బాటలలో – అపహాస్యము జనబాటలు.
మనపూర్వపు మనుషులు – జినునిసేవ జనసేవగ
పురుషార్థ సాధనలో – పూజ్యతలను సాధించిరి.
సాధన శోధనలో – బాధలు గాథలాయె
బాధ్యత బరువులలో – విధ్వస్థము విద్యలాయె.
ఆచార్యులు అవమతులు – అనాచార సహమతులు
అవగాహన గహనములు – గమనగమ్యగార్థభములు

'నెట్టు'లు మెట్టులుగా – నింగికి నిచ్చెనవేస్తురు
ఫేసుబుక్కు పేలవమై – లవలేశమె లక్షణము.
నర్తన వర్తనాయె – నాణ్యత హైన్యమాయె
నడక నడత నశ్వరమై – ఈశ్వరుడే వరుడాయె
మ్యూజిక్కులు, మ్యాజిక్కులు – జిమ్మిక్కులు గమ్మత్తులు
మత్తత చిత్తమ్ములు – నేటిమనిషి మోక్షములు.
నేలవిడిచి సాములో – నేర్పరులై తీర్పరులై
మార్పునొందు మనిషికీ – చేతనత్వ ఛిద్రముగా.
ప్రణాళికల నాళికలో – పరమార్థపు సమ్మిళితము
కరవాలపు కారుణ్యము – మరణమునకు మార్గము
దేవుని రూపమునూ – దర్శించెడి దార్శనికులు
మానవ మనుగడకూ – మాన్యతలను పంచుడూ.

610

స్నానము ధ్యానమూ – గానము పానమూ
పావనతల ప్రవణతలు – పరముని కవిరమ్యములు.
తీర్థములందుమునిగి – తిరువీథుల సంచరించ
వ్యర్థాల స్వార్థమున – తిరునామమె తిరిపెము.
శుభ్రత అభ్రములో – సౌందర్యము విభ్రమము
భ్రమలోన సుస్నాతులు – శారీరక 'శంతనులు'
ఉదయస్నానమున్నతము – నదుల నాణ్యతల ధన్యత
ఇంటిగంగ ఇంపులోన – ఇగిరిపోవు కల్మషము.
ధ్యానము గరిష్ఠము – ధ్యేయము ఆరోగ్యము
శ్వాసమీది ధ్యాసతోడ – శక్తులు సమకూరును
ధ్యానముద్రయోగముద్ర – ధ్యేయము దేవుడుగా
మనసు మహిమ భావనతో – మాధవుడే మానధవుడు
అష్టాంగయోగములో – అతిముఖ్యము ధ్యానమనీ
అలనాటి పతంజలుడు – ప్రాధాన్యత ప్రవచించెను.
మనసు మరలిపోకుండగ – పంచేంద్రియ శక్తినణచి
ప్రశాంతతను పాటించగ – తనువు మనసు తరియించును

గానము గణ్యముగా - భక్తిభావ భాగ్యముగా
యోగ్యమైన కీర్తనలే - గమ్యమునకు గమకములు.
పాటల పద్యములా - కవితల పదములా
భాషలలో భావములో - వాగ్దేవత వరియించగ
త్యాగయ్య క్షేత్రయ్య - అన్నమయ్య తిరుమలయ్య
రామదాసు కబీరూ - ఎందరొ భువి మహితులు.
నామ జపము నాణ్యమై - మంత్రజపము జయముగా
ఓంకారము ఆకారము - భవ తాపపు నివారణము.
భగవంతుని కర్పించీ - తనుగ్రహించ తారుణ్యము
భగవంతుని పాదజలము - స్వీకరించ గరువము.
జలపానము జాగృతము - ప్రకృతి శక్తుల పరమము
పరమాత్ముని సేవలో - అర్థము పరమార్థము.
అంతరంగ శుద్ధితో - బహిరంగ భావముతో
క్రియల కీర్తనములలో - భక్తి మధువు త్రాగుమీవు.
కాలము మారుచుండె - నీతి నియమములు మారవు.
ధర్మ రక్ష శిక్షణలో - మర్మరహీత మానవుడవె.

611

సంపన్నుల పన్నులూ - పేదల కర్పింపులూ
మధ్య మిధ్య సణుగుడులు - వధ్యమగును అర్థసమత
కేంద్రీకృత సంపదలూ - సాంద్రీకృత స్వార్థములూ
వ్యవస్థలూ వధ్యములూ - అత్యయికము ఆర్థికము.
విశ్వార్థము వినుతమై - భారతార్థ మల్పమై
సంస్కరణల నలుగుడులో - విరిగిపోయె విశ్వము.
రాజకీయ జాడ్యములో - పార్టీల నాళికలలొ
పరమార్థము ఓట్లుగా - విటతాటక విన్యస్తము.
అప్పుల పప్పులతో - తిప్పలు నేత (తు)లతో
దేశభవిత భంగమై - పరమాన్నము నమ్రతాయె.
నల్లడబ్బు డుబ్బాయెను - తెల్లడబ్బు తేటపడెను.
పన్నుల పన్నాగములో - సేవల స్వచ్ఛందములు.

628

ఉద్ధరింపు ఉత్తమాట – అభ్యుదయము అసలు ఆట
ఉదయము సాయంత్రము – ఊదరలే నేతమాట
తాలు తప్పు గింజలే – తోలు తిత్తి స్వామ్యములో
'సాలు సరి'కి విరుగుచుండె – 'తలసరు'లే తరుగుచుండె
పంచిపెట్టు పద్ధతిలో – వంచనలే అంచనాలు
ఐదేళ్ళ పండుగలకు – 'ఐదువ' తనమే ధనము.
అందరూ లేనివాళ్ళే – అందరికీ ఉచితమే
సోమరిపోతుల పెంచిన – సోదరులకు వందనాలు.
పండుగలకు కానుకలు – పేరుల హోరుల వీరులు
మధ్యదళారీల మమత – దండుగలకు దర్పణములు
మతమారణ రణకాండలు – గత జలముల సేతువులు
శీతువులో శైత్యములు – వేసరింత విజ్ఞతలూ.
వాడల మేడల దారులు – వీధి పేర్ల విలువలూ
పేర్ల చివర కులములూ – పెరుగుచుండె అసహనము
అసహ్యమే సాహసమై – దుర్భరమే దర్పమై
ఆహరింత తరింపుగా – వీధుల విచ్చలవిడి తనము.
పలకరింపు పలకబారి – సున్నితతలు లోపించి
సన్నిపాత గుణరోగము – సమాజమును చుట్టుముట్టె
పన్నులు చెల్లించినా – ఎగవేత ఎదుగుదల
లౌకికమే లౌల్యమై – జనస్వామ్యపు జాడ్యమాయె.

612

చితికీ చింతకూ – మధ్య పూర్ణ బిందువే
ఆబిందువు ఆర్ణవమై – బ్రహ్మాండము బంధువగును
చింతన చెంతకూ – వంతలు వరుసకట్టి
సంతసమే సంతగా – సొంతము చీకటాయె.
సూర్యోదయ వృద్ధాప్యము – చంద్రోదయ యౌవనము
వనములోన వార్ధక్యమె – మనుసులలో మధూదయము
అందము ఇందమనీ – అందలమును అందించెను
విందుగూర్చు 'విబుధుడే' – బాధల బదులిచ్చెను.

ప్రకృతి త్యాగమయము – పరమాత్మయు ఆత్మీయుడు
అంతరార్థమును దెలియక – మానవుడే మరుగుజ్జయె.
వ్యాసుని వేదములకు – పురాణాల పూజ్యతలకు
ఆచార్యుల అనుభవాలు – అంతరువుల పొంతనలు
వాల్మీకి కావ్యములో – వాశిష్ఠ గీతలకూ
భారత 'గీత'ల భాగ్యము – భవజనులకు బలవర్ధిని
ఆర్యసంస్కృతమ్ముతో – ద్రావిడులకు విలంబనము
కథల కలిమి వ్యథకాగా – అనుశ్రుతులే అపశ్రుతులయె
మానవ సంస్కృతిలో – మాయని మచ్చాయెను
మతభాందస వితండము – మానవునిది క్రూరత్వము
గతిదప్పిన చరిత్రలూ – చరితల వ్యాఖ్యానములూ
అనుకూలము అవనతమయి – ప్రతికూలత కుంపటులే.
చదువు లేక అశక్తత – చదువురాని సమర్థత
చదివిన సరసతకరవై – సమస్తమూ సతమతము.
కులతత్త్వపు విద్యలు – మతతత్త్వపు మాధ్యమములు
సరస్వతికి నిలయములే – రాజకీయ రమ్యతలు.
కులకూపములోపడి – వ్యక్తుల గొప్పగు శీలము
మురుగును ముద్దుగ తలచెడి – 'తొలి' సంస్కృతి సంస్కారము
వేద్యులు వేదాంతులూ – తాత్త్వికతా సన్మూర్తులు
మౌనంలో మునిగిపోయి – మానవతకు శత్రువులైరి.
చింతన చైతన్యంతో – సూర్యచంద్ర స్ఫూర్తితో
చితికి వెళ్ళు మధ్యలోన – మానవత్వ మహిమనించు.
వ్యాస వాల్మీకులు నాడు – నేటి కాళిదాసాదులు
మానవసేవను చేయగ – మాధవ సేవని తలచిరి.

613

విద్యలేని వింతపశువు – సంతలోన ఓటు హక్కు
వయసొచ్చిన ఓటర్లతొ – వయసుమీరె స్వామ్యము.
ఆంగ్లమర్యాదలన్ని – సాందీపుని వేదములై
సవరింపుల సరళిలోన – సహజత్వము చనిపోయెను.

దేశకాలమానములలొ – జనస్వామ్యము దేహము
రెచ్చిపోయి పుచ్చిపోయి – పురుగులతో పవిత్రము.
అజ్ఞతలో ప్రతిజ్ఞతలు – విజ్ఞులకవి విసుగులు
లిప్తల నిర్లిప్తతలలొ – లుప్తమాయె విలువలు.
బేహారుల బేరములో – విహారమే స్వామ్యము
విచ్చలవిడి విభజనలలొ – లౌకికతకు లౌల్యము.
పరస్పరము పరవశము – పాలితులు పాలకులు
వివశమైన కట్టడులు – కట్టుబడుల కులగోడలు.
జనసంస్కృతి మనుసంస్కృతి – నవసంస్కృతి నటసంస్కృతి
కులమత నాయక సంస్కృతి – కూటనీతి కుటిలరీతి.
ఓటు 'ఫేటు' నిర్ణయించు – ఓదనమును పదిలపరచు
ఓటునమ్మి పదవికొనీ – పదనులేని వ్యథ స్మృతి
వధ్యశిలా సదృశమై – వేద్యుల గుండెలు రగిలీ
ప్రజాస్వామ్య ప్రాభవమ్ము – జీవము విడిచిన దాయెను.
పదవీ మద వ్యభిచారులు – అంధకార చర్యలతో
కొనుటలు అమ్ముటలోనా – ఓటువిలువ వమ్మాయెను.
'రన్నులు' 'విన్నుల'తోనా – రసరమ్య నటనలతో
అధికారులు నాయకులూ – అవగాహన అవగ్రహులు.
పల్లెలు పాడైపోయెను – చల్లదనం చెల్లిపోయె
నిగ్రహమే ఆగ్రహమై – కులమతముల కూలెనోటు.
ప్రచారాల ఆర్భాటము – పంపకాల పార్టీలూ
కమీషన్ల కక్కుర్తులు – 'మీనమేష' అధికారులు.
మాటలన్ని వాటముగా – రాజ్యాంగము అంగముగా
విహంగమే ఓటుహక్కు – ధనమెచ్చటొ అచటవాలు
జాతర పాతరలోనా – జాతి జనుల ఓటుహక్కు
హుక్కాతాగిన ఓటరు – మీటరెచట నొక్కునొ
ఓట్లదినములెన్నొ వచ్చె – వాటమైన ప్రభుత కరవు
భరతమాత ముద్దుబిడ్డ – వయోజనుని అయోమయము.

తుపాకీల నీడలో – తూరుపు సింధూరములో
పడమర బాంధవ్యములలో – పావనమగు గణతంత్రము.
ఉగ్రపు క్రీనీడలో – అగ్రపు అవమతులతో
మతమత్తులో గతిదప్పిన – మారణ జనతంత్రము.
ప్రధానులకు ప్రదానములు – రాష్ట్రపతుల గౌరవములు
జనరౌరవ వ్యవస్థలు – ధనగణనము దార్శనికులు.
సోదరతల తరతమములు – జనగతులకు అపశ్రుతులు
జాతిగీత గీష్పతులు – పద్మ బిరుదు భీరువులు.
వికసించిన పద్మాలకు – కిరణస్పర్శ విమర్శగా
అవమర్శన అంధత్వము – గణతంత్రపు ఆమంత్రము.
మువ్వన్నెల నెలవంకలు – పచ్చదనపు వినాశనము
దేశభక్తి యుక్తులూ – భుక్తిమార్గ 'భువనత'లు.
స్టారుల స్టార్టప్‌లు – నక్షత్రపు నయచిందులు
వాదుల అందములు – బరితెగింపు బరాబరులు
అమవసనిశినృత్యములు – దేవ వస్త్ర దేహములు
సెర్చిలైట్ల సెర్చింగులు – అత్యాచారపు అవధులు
పట్టపగటి మృత్యుఘోష – అమ్మతనపు అవనతులు
పెంపకాల పేలవములు – పేరుగొప్ప ఊరుదిబ్బ.
హృదయస్వచ్ఛతలు తరిగె – స్వచ్ఛభరత పథకములయె
పేదఠికము పథకాలలొ – పెద్దఠికము సుద్దులలో.
బ్రహ్మాస్త్రము గాండీవము – బ్రహ్మాండపు భయములాయె
అణ్వస్త్రము వ్యత్యస్త్రము – నవవిశ్వపు వినాశనము.
'ఎన్‌వీ'లు 'వీ'తిండ్లూ – వివాదమై విజయమై
ఇక్కడక్కడనిచూడక – 'నాయక' నవ విక్రీడలు
నష్టము జరిగిపోయె – శిష్టులార మేల్కొనుడు
మౌనముద్ర మగతవీడి – కార్యరంగమున దూకుడు.
అన్యాయము అవహేళన – అసహనము అధర్మము
అంతరములు అబాంధవము – అన్నిటినీ అణచరండు.
గణతంత్రము తంత్రమై – జనతంత్రము తాంత్రికమై

నాయక నవతంత్రములో – మూలవిలువలకు ముప్పగు
సవన సంధ్య వెలుగులో – భువన మాంద్యతలు విడగా
భారత గణతంత్రమే – ఆంధ్రజనులకది మంత్రము.

615

పల్లవి నవపల్లవముగ – చరణము జనరణముగా
జనగణతాత్త్విక తంత్రము – జయగీతమె భారతికి
ఓంకారము ఓదనముగ – అహంకారమధమముగా
బ్రహ్మజ్ఞాన గణనముగా – హిరణ్యగర్భ జన్యముగా.
జగద్గురుల గురుతలో – సాధుసంతు సంగతులలొ
విజ్ఞానము విజయమాయె – అజ్ఞతలే అంతరించె.
మహావాక్య మాన్యతలో – భాష్య భాగ్య భవంతిలో
వేదవాద నాదశక్తి – పురాణాల పుణ్యభక్తి
అహంబ్రహ్మ మస్మియనీ – తత్త్వమసీ తారుణ్యము
ప్రజ్ఞానం బ్రహ్మమాయె – ఏకమేవా ద్వితీయ మయె
వాల్మీకపు వర్తులములు – రామకథ రాజ్యములు
పారాశ్చర్యుల పథములు – భారత భాగ్య సంస్కృతులు.
మూలము మరచిపోయి – మూర్ఖత్వము ప్రదర్శించి
వ్యక్తుల వాదనలతో – శక్తులెన్నొ 'యుక్తు'లాయె.
కళల కలిమి కాంతులతో – అలరారెడు శాంతత్త్వము
సభ్యత విడిచిన సరళితొ – అపవాదులు శాపములయె.
వారసత్త్వ సరసత్త్వము – వర్తన కీర్తన చరితులు
గమ్యము గరువము గమనము – అటునిటు మారెడి ఘటనలు
గమ్య గమనములలోనా – గమ్యము ముఖ్యమాయె
గమనము అవగమనము – గమ్యమేమొ అగమ్యము
శీలమునకు శిలువవేసి – శిలలో దేవునిచూసీ
దైవ శీల సంపత్తులు – దారిదప్పి దౌడుతీసె.
పుస్తకములు పురుగులుగా – మస్తకములు స్తంభించెను
చిన్నిమేధ వెన్నరీతి – మృదువు వీడి వ్యధలాయెను.
ఆధునికత 'ధుని'లోబడి – అంతయు బూడిదాయె

బూడిదలో బృంగులయి – పాలిపోయి పలవరించు.
భాషల పల్లవములు – పొల్లుపోవు పల్లములై
కాండము ఖండములై – వేరుల దారులు మారెను
స్వభావములు స్వభాషలో – స్వంతముగా సొంతముగా
శాంతముగా శక్తిగలిగి – తెలియజెప్ప తేటయగును
జాతీయపు తెలుగులో – సంస్కృత సంస్కారముతో
ఆంధ్రుల భాషా తంత్రము – అత్యంతము అన్యోన్యము.

616

ఘనము ఘనము గణతంత్రము – 'మనము' విడిచి మనతంత్రము
'గణము'లలో కులరోగము – గుణములేని గురుభావము.
విశ్వవిద్యకాలయములు – నశ్వరమగు ఘనవిద్యలు.
దళితుల పేరిట దమనము – కుళ్ళు నారుమళ్ళ ధిషణ.
హంతక హత్యల నిలయము – ఆత్మహత్య ఆత్మీయము
జాంతవ వృత్తుల జయము – హద్దుమీరు అభిభాషలు.
పెద్దల దేశములోనా – పేదవాళ్ళ పెరుగుదలలు
ఎదుగుదలల తలలో – ఏవో వింతల పథములు.
పార్టీల బంధములూ – సిద్ధాంత సైంధవములు
భావప్రకటన స్వేచ్ఛకు – బందూకులె సంబంధము.
నాయకమ్మన్యులకు – నయగారము అంగారము
అగ్గిరాజుకొన్నగాని – విశ్వాసము నశ్వరము.
ఆచార్యుల అందలములు – ఆచారపు చలింపులు.
కులము మతము కూడగట్టి – కూల్చుటయే వారిశక్తి
రాజ్యాంగము అంగాంగము – రభసలౌ భస్మము చేసి
సంస్కర్తలు రచియితలను – కులముల కూర్చొన బెట్టిరి
ప్రకృత్యారాధనమున – ప్రాకృతులే పరములైరి
వికృతి విధ్వంసములోనా – విధి అంశలౌ విద్యార్థులు.
పౌరుల పాటవములోన – పరమార్థము దేశభక్తి
స్వార్థము పరార్థమున – శోభదప్పె జనతంత్రము.
రాజకీయ చదరంగము – నేతల వీరంగములు

634

అధికారుల ధిక్కారము – అహంకృతుల ఘనతంత్రము
గుణశీలము గురుతుగా – గురుతయె మనస్వామ్యము
పల్లె పంచాయతీగ – పరవశింప ప్రవరము.
చట్టాల చట్రాలలొ – చట్టుబండ స్వామ్యముగా
అవగాహన ఆచరణము – అవమతులకు మతిమంతము
జెండాల 'జామాత'లు – ఎజెండాల ఏజెంటులు
కులసంఘపు విద్రోహులు – మతసదృశ విద్వత్తులు
భావజాల పీడితులు – భాగ్యరహిత సారథులు.
పదవుల పదనిస ధ్వనులు – నిస్సారపు సరిగమ 'గుములు'
జాతిద్రోహ దేశద్రోహ – దేవిడీల దేవుళ్ళిట
భరత భవిత తంత్రములో – మాంత్రికులూ తాంత్రికులూ.

617

పవళింపుల ప్రత్యేకత – శయనింపుల శాక్తేయం
అజమాయిషి జమానాల – 'అజా' యింపు అసలు లేదు.
సుప్రభాత సుందరతలు – మధ్యాహ్నపు మందగింపు
సంధ్యల వంధ్యల వలపులు – కారుచీకటుల కలతలు.
చంద్ర సాంద్రతల విలువలు – జీవన నవ జిలుగులూ
పరిపూర్ణత పావనతలు – వర్ణించగ ఘూర్ణితములు.
పగలు రేయి వగలలో – సేవ సెగల చెలిమితో
జనసేవయె జినుసేవగ – మహోజ్జ్వలము జాజ్జ్వల్యము.
జీవన ప్రస్థానము నందున – మజిలీలే మధు సుధలు
మహాప్రస్థానమునకు – మరుని తనువు మార్గములే.
ఆర్తికీర్తి మూర్తులూ – ఆవరణకు వరణములు
వ్యక్తిత్వపు తత్త్వములో – వ్యతిరిక్తము వ్యవస్థలు.
మహామహుల జన్మభూమి – మాతృత్వపు మాన్యభూమి
జాతి ద్రోహ శక్తులతో – జవసత్త్వపు మరుభూమి.
శాంత్య హింస చెలులుగా – చెలువము విశ్వములోనా
అశాంతికీ హింసకీ – అలవాలమాయె నేడు
ప్రజాస్వామ్య స్వామ్యములో – స్వస్వామ్యము అస్వామ్యము

పారదర్శకత కథలలో – పరిసమాప్తి వ్యథలలో
ఆరని తీరని అప్పులు – అంతరముల తిప్పలు
కులము గొప్పదైనగాని – కలవరమే కలికాలము.
రాజకీయ ఉద్యోగులు – పదవీమద వ్యభిచారులు
నిరుద్యోగ ప్రతినిధులూ – ప్రతిపక్షపు విపక్షులు.
తెగబారెడు రాజ్యాంగం – తెరుపుచూపలేదు మనకు
ఎగసిపడే వ్యతిరిక్తత – ఎఱుక మదుల గుదులు కొనును
ఆస్థానపు శాసనసభ – న్యాయస్థానపు న్యాయం
కార్యదక్ష కరుణలోన – కంచె చేను మేసినట్లు
కంప్యూటర్ కనుగొనీ – స్మార్టుఫోను మార్పు పెగి
సాఫ్టువేరు 'వేరు'లలో – పురుగుచేరి పుణ్యగణ్య.
కీ బోర్డుల గీప్పతులూ – చేతివాటతెంపరులూ
కంపరాల కంప్యూటరు – కలిమిలేక కలతనిచ్చు.
పగలు రేలు జరిగిపోవు – పగటి కలలు ప్రవరమగు
రాత్రికలల రంజులోన – రమణీయము భారతము.

618

గ్రహగతులు గాడిదప్పుతూ – గాండీవ గార్ధభ ధ్వనులిచ్చాయి
అభివృద్ధి వృద్ధత్వానికి ఆడంబరాల ఆహార్యాలు అందగిస్తున్నాయి
పతివ్రతల వ్రతాలు 'వ్రాత్స్య'ల వాల్లభ్యంతో వాసిబొందుతున్నాయి
బ్రహ్మోత్సవాల బ్రాహ్మీమయ మూర్తులు బ్రహ్మ సతికోసం బావురంటున్నారు
పేలవమైన ప్రేమలో పేరుల పేర్మిని మార్మికతతో మాధవం చేస్తున్నారు
కార్తీకాల కృత్తికాలు కామందుల బుల్లితెరల్లో లొల్లిచేస్తున్నాయి.
తేడాలేని తెంపరితనంతో వ్రీడలేక విర్రవీగుతున్న విబుధుల బుద్ధత్వం.
సామ్యంలేని స్వామ్యంతో స్వాముల ప్రవేశం స్కాములకన్నా శాక్తేయం.
గుంజుకొని నంజుకుతినే గూడుపుఠాణీ గురుత్వం గరువమైంది.
సహనం అసహనంతో పోటీ పడలేక సుఖంగా మౌనముద్రలో పడింది
పసలేని పనికిరాని పనిలేని పదవీకాంక్షుల ఆంక్షలు అక్షింతలైనాయి.
పేరుగొప్ప జనస్వామ్యంలో పేదల పేలవత్వానికి కులం కలవరమౌతుంది.
కామన కాననంలో విహరిస్తూ కార్చిచ్చై కర్మల మర్మాన్ని విప్పిచెప్పింది.

636

ఊరుమ్మడి ఆస్తులు ఊరకనే లాగేసుకొని ఉద్యమించే ఉన్నతులు.
పైకి పలవరింత లోన కలవరింత వింతలలో వింత రాజకీయుల సంత
జమానాలు, జాగీర్లు, 'జాగ్వారు'లై జాంతవపంతముతో పదవీ ప్రథితులు
'మందు'చూపే ముందుచూపుగా పందలైన మందుబాబుల భవితవ్యం
జన్మభూమిని జాగృతం చేసే కామందుల 'మంద'త్వానికి వందనం.
'తల్లి'నేర్పిన ఇచ్చినదానికి బదులిచ్చే ఇంపైన సంస్కృతి వికృతిగా మారింది.
వ్యాపార సంస్కృతి వ్యావృతమై వ్యవస్థను వ్యత్యస్థం చేస్తూ అవస్థగా మారింది.
భోగుల భోగాంగం రాజ్యాంగమై 'భోజరాజు కథగా' భోక్తవ్యమైంది.
త్యాగుల 'యాగాలు' 'కుల'యోగాన యోజనలేని నాగులై కాటేస్తున్నాయి.
సంస్కృతిలో కులము మతము చరిత్ర భాగాలని తెలిసీ తెలియని ఆచార్యుల తెంపరితనం
లౌకికం 'ఇకలేదనే' లౌక్యుల వాదన వేదనగా మారకుండా మేలుకోవాలి.
సార్వభౌమత్వం 'భౌ భౌ రాజుల' బానిసత్త్వం కారాదని అందరూ నినదించాలి
డెమొక్రసీ, డీమోక్రసీ మాబోక్రసీ హిపోక్రసీగా మారకుండా ఆక్రోశించాలి
భారత సంస్కృతీయులమై సంస్కారవంతులమై కుసంస్కారాలు వెలివెయ్యాలి.
మానవగతి మరువమై గ్రహగతికే గరువమై పరువంగా ఫలించాలి.
మతివీడి గతిదప్పిన గ్రహాలకు ఆగ్రహం కలిగించక మతిమంతులంగా జీవించాలి.

619

కులాల కురుక్షేత్రం – మతాల మారణ హోమం
హితాల హుతాశనం – హీనమైన జనస్వామ్యం.
గబ్బిలాల బిలాలూ – గానుగెద్దు రవములు
అంతరాల తరాలూ – తరతమాల తర్పణలు.
వర్ణాల సువర్ణాలు – వర్గాల అపవర్గాలు
పార్టీల ప్రాభవాలు – ప్రజాస్వామ్య ప్రాథమ్యాలు.
స్వాతంత్ర్యపు వృద్ధాప్యం – శోభల శోభన చెలువం
మొదటి రాత్రి మోదకం – చివరికి చింతల వలయం.
యోజన విడి ఓటరులూ – నవనాయక నారదులూ
త్రిమూర్తులకు తిప్పలూ – త్రివర్ణమే అపవర్ణము.
వృత్తుల వర్ణములే – వర్తనలో కులములై
గోత్రములే పాత్రములై – ఛాత్రులు నవవిద్యార్థులు.

విద్యావ్యాపారములో – వధ్యమాయె విజ్ఞానము.
శాస్త్రీయత శక్తిహీన – శంకరమే 'వంక'రము.
గడ్డితినే గంధర్వులు – కల్తీలకు కామందులు
'మందు'లైన నాయకులూ – పందలు అధికారులూ.
చట్టము చక్రములో – చక్రాయిగ నిర్వచనము
విశ్లేషణ విన్యస్తము – శ్లేష్మంలో జనన్యాయము.
యువకుల జమానాలో – వృద్ధత్వపు అభివృద్ధి.
మేధమీరి మేరదాటి – దేశాలకు దేహములు.
కులటలు కూటములు – గలాటాల గారడీలు
మతాచార్య మంత్రాంగము – అనుగ్రహపు అవగ్రహము.
పేదపెద్ద దేశములో – పేలవ హృది గదులలో
పేరుకు మాత్రం సమత – కుహరమందు కుత్సితత
ప్రభుత పౌరులదనియెడు – ప్రాధమికత తెలియలేరు.
శతృత్వము మిత్రత్వము – శాక్తేయము కులశక్తికి.
ఖల్‌నాయక కులదేవుడు – కనికరించకల 'వరమే'
అధ్వాన్నపు అవిద్యతో – మూఢత్వము మురిపెమగును.
కులముల మలములలోనా – కూలుచుండె భారతము
స్వచ్ఛత శోభలు దోమలు – చికిత్సయే విచికిత్స
కులనిర్మూలన చట్టము – కూలిపోవు కూహకముల
మానము అవమానముగా – అభిమానమె అసలు కులము.

620

కులనాయక ఖల్‌నాయక – కూపములో జనస్వామ్యము
ప్రత్యేక పరవశమున – వశము దప్పు వదాన్యులు
పసిబిడ్డగ పరిపాలన – సున్నితమై సన్ననిదై
బెదిరింపుల బందూకుల – బేలగ మారెను భవిత.
స్వాతంత్ర్యము శోభనివ్వ – శుభంకరులు ఆనాడు
అస్వాతంత్ర్యపు తంత్రము – అదను పదను ఈనాడు.
రౌడీలకు గూండాలకు – రాజ్యతంత్ర మసలు రాదు
వినాశనము వినూతనము – జనాస్తులకు అపజయము.

638

నేరములకు శిక్షలేని – నేవళమౌ మనచట్టము
చట్టుబండ నాయకులతొ – జీవచ్ఛవమౌ బతికెను.
పరాయిలే పరమాత్ములు – మనవారలు మదమత్తులు
ధన్యమైన భరతావని – దీనమాయె దిటవు వీడి.
కులాలకు ఆలయాలు – మతాలకూ మజిలీలు
కులదేవుళ్ళిట సుమతులు – మతదేవుళ్ళిట మితములు.
నీతి న్యాయము ధర్మము – నిరాహార దీక్షగతులు.
నేటి నిరాహార దీక్ష – నేతిబీర బెదిరింపులు.
ఛీత్కారము చీదరింపు – పురస్కార పూజితములు.
వేదికలే రెచ్చిపోళ్ళు – వేదనలో అమాయకులు.
దేశభక్తి 'పదవి'భక్తి – పదముల ఫలమే విషము
గర్జనలూ గాండ్రింపులు – గార్ధభ స్వార్థుల కుట్రలు.
కులాలకూ ప్రత్యేకత – మతాలకూ మాన్యతలు
అలనాటి నిస్వార్థుల – ఆత్మలకే క్షోభగొలుపు
రెచ్చగొట్టి మెప్పుపొందు – నాయకమ్మన్యులంత
నవభారతి దుర్మతులు – క్షమార్హతకు చాలనోళ్ళు.
'కాపు'ముద్ర కడతేరగ – మన్నికతో మసలుకొన్న
ఉద్రేకం 'మాద్రేయం' – హృద్రోగం అంతము.
పదవుల పాకులాట – కులాలకూ కీచులాట
కాపులాట బీసి ఆట – రెడ్డాటలు కమ్మాటలు.
ఆటలు కోటలు దాటగ – విభుత్వాలు ప్రభుత్వాలు
విలువలకూ ఆగడాలు – తుదిమొదలూ తూట్లాటలు.
'జగ'న్ముద్రలు కడదాకా – జయశీలమునందవు
జనావనికి ఏవగింపు – ఆంధ్రావని కింపుగావు.

621

'మంద'భాషల మత్తులో – మాతృభాష 'మంద'యింది.
తీరు తీయనైన భాష – చేదుమాత్రగా మిగిలిపోయె
'అణుబంధాల' బంధంలో – అనుబంధాలు అగమ్యం
ఆగమాల నిగమాలలో – ఆదేశాల అవసరాలు

సృజన లేనివిజనపదం – జీవన పథమాయెనుగా
పాండిత్యం 'పర'వశించి – పరమార్థమె విశ్వభాష
విశ్వసమత విలువలేదు – విశ్వభాష ఘోషాయెను
వచ్చిరాని పిచ్చి మిగిలి – పిగిలిపోయె అమ్మనుడి
పసితనమూ వసివాడెను – మిసిమి మిగులు భావనములు
సమన్వయము అనన్వయము – అసలు లేని అమ్మపలుకు.
ద్రావిడమున దాతృత్వము – ఐతరేయ 'మంథ'మాయె
ఆంధ్రజాతి సాంద్రత్వము – ఆరంభమె 'భా'రతము.
అచ్చతెనుగు తిక్కనలో – శైవకవుల శైత్యములో
శ్రీనాథుల చైతన్యము – ప్రాబంధిక బంధురము.
పరభాషా పదములన్ని – ఓదిగిపోవు తెలుగులోన
అనువాదము అనవద్యము – వివాదములు విలువలేవు.
ప్రక్రియ ఏదైన గాని – ప్రాకృతికము పరాకృతి
భాష భాగ్యభావనమున – బాంధవ్యమె మాతృభాష
తల్లిపాల తారుణ్యము – తల్లిభాష బాంధవ్యము
తరగనిదీ చెరగనిదీ – చైతన్యపు గని అది.
అరచేతిలొ విశ్వమూ – అందరికీ ప్రత్యక్షము
తనువు మనసు తపనలో – తరియించగ తల్లిమాట.
'అద్దంకి' పద్యములో – అధునాతన వచనములో
శతకములో శతమానము – రచనలన్ని రసమయము.
పాండిత్యము పండబారి – సంస్కృతమున కృతులయి
రచనల ఛణత్వ ఘనతలు – నవరసాల రసాలములు.
అవసరాల సరసతలో – విరసమాయె విభాషలు
స్వభాషలో సుగమత్వము – సాంత్వనగా సవదరించె.
'చిన్న'తనం చిన్నవోవు – 'మధ్య విద్య' విధ్వంసము
'ఉన్నత'మే విన్నదనము – మాతృభాష మాధ్వీకము.

622

దేశీయము దేహములు – భాష విదేశీయమూ
విదేశాలు వినువీధులు – 'స్వదేశీ'లు స్వరగతములు.

మృదుభాషల మూర్ధన్యము – తూర్పుదేశ ఇటలి భాష
ముత్యపు కోవల పదములు – ముద్దుముచ్చటల హద్దులు.
క్రీస్తు పూర్వ కీర్తిలో – కీర్తనలో తనతనములో
కీర్తించిరి రాజులంత – మూర్తీభవమాయె 'భాష.'
హృద్యమైన పద్యమే – మద్యంలో కలిసిపోయి
వచనముపచనమై – వరుసలేని వధూదయము.
పదములలో ద్విపదలలో – ఆటవెలది కందములో
సీసములో ఆశువులో – వృత్తములే ఆవృతములు.
అవధానపు అందము – యక్షగాన గానగరిమ
జానపదుల జాణపదము – పథములు మన 'అమ్మ'పదము.
శైవులు వైష్ణవులకూ – శక్తినిచ్చె తెలుగుభాష
వారసత్వ సంపదకూ – వాసినిచ్చె 'వాణి'తెలుగు
కృష్ణాగోదావరి నదులు – తుంగభద్ర పినాకినీ
తూరుపు తీరపు సంద్రము – సాంద్రభాష భాగ్యములు.
వీరభూమి, విలువభూమి – మాగాణపు మాన్యభూమి
తెలుగునాడు వెలుగునాడు – భాషరూపు భాగ్యమాయె.
యోగ్యభాష భాగ్యమగును – అవగాహన అన్యోన్యత
ఆంధ్రమునకు అందమగును – భాషయోగమగును జగతి.
తల్లితండ్రి మరచిపోవు – తరుణమిదిగ కానబడును
ఆర్థికమౌ అవసరాలు – స్వార్థమునకు దాసోహము.
రక్షణ శిక్షణ దక్షణ – పోషణమున ప్రాధాన్యము
తలిదండ్రుల బాధ్యతగా – భావించగ భాష ప్రగతి.
డాలర్లకు దాసులుగా – డాంబికాల ధారుణిలో
పరభాషల వ్యామోహము – ప్రాభవమే విభవము.
అమ్మదనం కమ్మదనం – అసలు ధనం తెలుగుదనం
ఆస్తి ఆస్తి అన్నిమనకు – మధురభాష మాతృభాష.
టీవీల వీరత్వం – కంప్యూటర్ కంపరం
రాజకీయ రాసభం – 'తెలుగు' మృతికి కారణం.

వైశాఖం వైభవం – నౌకాదళ విన్యాసం
దేశరక్ష తీరరక్ష – దేదీప్యం దారుఢ్యం.
వినీలంపు సంద్రంలో – స్వచ్ఛ శోభ నౌకలు
ఆకాశం అంచులలో – ఆధిక్యత రంగరింత
చిచ్చుబుడ్ల చిద్విలాసి – తారాజువ్వల సరసి
విమానాల విలోమాలు – అనులోమపు అందాలు
విశ్వానికి తెలియజేయ – దళమ్ముల ధగధగలు
విదేశాల వినోదాలు – పరస్పరము ప్రాభవములు
సాగరంపు సందడిలో – తడిసిపోయె తీరము
దృశ్యములూ దృక్పథములు – దేశదృఢత తెలుపును.
వేలమైళ్ళ తీరములో – వేద్యమైన దళముండెను
ఉపయోగము యోగముగా – ఉన్నతిగను భారతము
ఉద్వేగం ఉత్సాహం – ఉన్నతమౌ వేగమూ
సాంకేతిక సంగమం – విజ్ఞానపు వైభవం
సాగరఘోషము సవ్యము – నవ్యము భారత బలము
తూర్పు తీర తూర్యరవము – ఆంధ్రమునకు ఆనందము
సహజ ఓడరేవుగా – సంగమమై సాగరము
కొండముందు సంద్రముగా – తిమింగలము తీరుగా
ప్రధానీ రాష్ట్రపతీ – ప్రాధాన్యము ప్రవచించిరి
రాష్ట్రప్రభుత ఆతిథ్యం – తెలుగులకే వెలుగాయెను.
ఓడల వాడలలో – విమానాల విన్యాసం
జలాంతర్గామినౌక – జాజ్జ్వల్యము దళములో
రక్షణ సామర్థ్యంలో – దక్షత దారుఢ్యంలో
సాటిలేని మేటియనీ – చూపించగ సుందరమ్ము
స్వదేశీయ జ్ఞానంతో – యుద్ధనౌక నిర్మాణము
ఇతరుల బలములెంతొ – తెలిసికొనగ తెరువిది.
వేలమంది వీక్షించగ – వీక్షణముల విందాయెను
సంగీతపు నాట్యఝరులు – సంగమించె తీరమునా.
రామకృష్ణ బీచ్‌లోన – అభిరామము ఆనందము
విశాఖకే విలువమీరె – ఆంధ్రమాత పులకించెను

అంతర్జాతీయ వింత – నౌకల కేంద్రం నవ్యం.
ప్రపంచమున పరశము – విశాఖలో వివశము.

624

మహోదయం మహోదయం – మాఘమాసపు మహోదయం
అమవస సంద్రపు అరుణోదయం – ఆరోగ్యభాగ్యపు ఉషోదయం
సంద్ర సాంద్రతల సాంద్రోదయం – ఆరోగ్యమునకు సూర్యోదయం
ప్రాభాత స్నానపు ప్రాగోదయం – అఘముల మారణ మధూదయం
పాపహరమగు ప్రభాత సమయం – పుణ్యగణ్యముల పూర్వోదయం
ఉత్తరాయణపు సూర్యుని గమనం – నిగమపు నియతుల ఆగమ ఉదయం
హేమంతమునకు హితోదయం – సీమంతులకిది శిశిరోదయం
మంచుతెరలకిది వంచనోదయం – శివములదేవుని దివ్యోదం
ప్రాతఃకాలపు పరమార్థమ్మున – సంగమస్థానపు సరసోదయము
శివశక్తులకూ శీతల ఉదయం – భవిజనులకిది భాగ్యోదయము
మానవులందరి మహోదయం – దానవ మానవ శిక్షోదయం
తిథివారముల తియ్యని ఉదయం – సోమవారపు మాఘోదయం
యజ్ఞకర్మలకు మర్మోదయం – పాపకర్మలకు దహనోదయం.
ఆరోగ్య ఆస్తికి ఆర్మోదయం – నింగికి నేలకు నిర్మలోదయం.
నీరుచెట్టులకు నిర్మల ఉదయం – పచ్చని ప్రకృతి పరమోదయము
సూర్యగమనమున సుందర ఉదయం – ఉత్తరదక్షిణ ఉద్యమ స్ఫురణం
ఋతువుల క్రతువుల రుజలకు ఉదయం – బతుకున భారపు భావపు ఉదయం.
బంధనములకిది బంధుర ఉదయం – ఇంధనమగునది భువికే భువనం.
నీలివర్ణమున నిర్మలసంద్రము – అరుణవరణమున ఆర్యోదయము
ధర్మశాస్త్రముల మర్మము ఉదయం – నమ్మకముండిన నవ్యోదయము
నీరూ నిప్పూ నిత్యసత్యములు – నియమగమనమున నిండు ప్రకృతులు
సమతా మమతా సాగు ఉదయమున – సాగకపోయిన ఆగు జీవనము.
వాడివేడిగా వేల్పుల ఉదయం – వాసి దప్పగా భువికి చేటగు
ఉప్పూ తీపీ ఉమ్మడి కలయిక – సంగమ స్థానపు సరసోదయము
కాలుష్యమ్మున కర్కశోదయము – కలతల కలిమికి కరుణోదయము
కనబడు దైవము కర్మసాక్షిగ – కలడు నిజముగా నిత్యోదయము

మంచీ చెడులూ ప్రకృతి ఫలములు – పెంచగ పెరుగును త్రుంచగ తరుగును.
భూమితాపము సూర్యుని వేడిమి – రెండూ మించిన రేవడి బతుకులు
ఉదయం ఉదయం నిత్యోదయం – సత్యము దలచుము సరళము జీవము.

625

సుందరం సుందరం – సుందరకాండ సుందరం
అందరికీ అందలం – అందుకొన ఆనందం.
మావిషాద మాధుర్యం – మిధున మథనవిషాదం
మిథిల వనిత వలపుధనం – లంకాధిపు బంధనం.
'బందరు' లకు తారుణ్యం – బందీలకు విమోక్షణం
బంధాలకు బంధుత్వం – సేవామృత శాక్తేయం.
కేశాధిపు కేశవం – రాక్షాధిపు రౌరవం
వాయుపుత్ర వారువం – వాసికలుగు శుభయోగం.
కిష్కింధపు కీలకం – యుద్ధకాండ ఊర్జితం
మధ్యనున్న మార్దవం – ఆంజనేయు అంజనం.
సింధూరం చైతన్యం – శిగపూవుగ పూజితం
సువర్చలా వర్చస్సూ – యాగయోగ రాజసం.
ఆత్మశక్తి ఆంతర్యం – అవగాహన అతిగుహ్యం
సూర్యకులపు సురభిళం – ఆర్యజనుల కది అమరం.
వైవిధ్యం వైరుధ్యం – వైభవమే అద్వైతం
నిలుచునదది ఒక్కటియే – నిలవని వవి కోకొల్లలు
విఫలమదియె అహిత ఫలము – బ్రహ్మభాగ్య బహూకృతము.
నేలతల్లి కాపాడగ – నెనరుమీరు నైర్మల్యము
భూజాతను సహజాతను – రక్షించగ దక్షతాయె.
మంత్రులు సామంతులూ – పుత్రులు జనమిత్రులూ
పూజ్యరాజ్య రాణువలూ – ఆసుర రావణ అవధులు
పరస్త్రీ వ్యామోహము – పరమార్ధుని వ్యక్తిత్వము
ఫలించనిది జ్వలించగా – మాడి మసిగ పరాజయము.
రామాయణ పాత్రలలో – రాజిల్లిన జీవాంశము
నేటి జనత ఘనతగాను – తెలియజేయ తేటదనము

644

మర్మకర్మ లేమి లేవు - ధర్వ శర్మ ధరణిలోన
లంక శంక వంకరలో - లావణ్యమె లవణత్వము
ఆర్యము ద్రావిడమూ - అసలేమీ ఇచటలేవు
శౌర్యము సాహసమూ - ధైర్య ధర్మ ధారుఢ్యము.
రామాయణ కాండలలో - రాజు సుందరమ్మాయెను.
ఆంజనేయ ఆస్తికతే - అందరికీ అభిమతమూ.

626

వాలం వాల్లభ్యంతో - గదాయుధపు గరువంతో
గమనంలో వేగంలో - యుద్ధభూమి సిద్ధయోగి
మానవ మూలం మహిమం - జాంతవ జనజగదేకం
మంతవ్యపు మంత్రిత్వం - తాంత్రికతకు తారుణ్యం
జ్ఞానమందు జాణగాను - కర్మల కరసేవకునిగ
ఫలమెరుగని పరమార్థము - సేవలోన సేదదేరు.
రాముని జీవనయానము - రమ్యమగును రమణితోడ
రమణి బంది రాక్షసులకు - బందూకున రక్షించెను.
అష్టసిద్ధులందుకొనిన - అజేయుడే హనుమంతుడు.
మతిమంతుడు స్థితిమంతుడు - మాననీయ మహితాత్ముడు.
శతరూపుల శక్తులూ - శతశతమానపు భక్తులు
హృదినిండుగ స్థిరపరచీ - ఉన్నతగతి నందుడు.
సంజీవని పర్వతమును - సహనము సామర్థ్యముతో
ఎత్తితెచ్చి ఎదిగినావు - జనహృదులకు ధనదుడవై
పంచముఖీ ఆంజనేయ - పంచభూత పాలకుడూ
అభయమిచ్చు హనుమంత - విభవమునకు విజయుడా
వీరరసపు విన్యాసము - యుద్ధభయము ఉర్విలేదు
శూరత్వపు సుందరుడా - శుభములకూ ప్రభువుగా.
బ్రహ్మచర్య భావనుడూ - సువర్చలా సుందరుడూ
మర్కట మర్మము ధర్మము - రక్షస మారణ శర్మము.
కోతిమూతి వంటికోర్కె - కొలతలేని జనత ఘనత
'రామ' రామ తారకమై - తరియించగ తపియించును

అమరుడు అతిశయుడు – సమరసహిత సారయుతుడు
'మనోజవం' మంత్రంతో – రామదూత రమ్యుడాయె.
సహన వహన సన్మతితో – సాగిన హనుమంతుడూ
ఆశీస్సులు అందించును – అందరికిని విందుగా.
కనువిందగు రూపమూ – కలకాలము గుండె నిలచు
దండిగ దారుఢ్యము కల్గు – త్రికరణముల కిరణములే.
భవం భయం బాధించగ – దుష్టశక్తి దులపరింప
శక్తితోడ భక్తిగలిగి – భజియించు 'భజరంగబలీ'.

627

బ్రహ్మమయీ భాగ్యమయీ – సర్వమయీ సరస్వతీ.
సత్వగుణపు సారస్వతి – జ్ఞానగరిమ తేజస్వతి.
శుక్లవర్ణప్లావితమతి – కరుణ వరణ తరుణమతి.
కరవీణావరపాణీ – వాగ్వంశకు అంశమతి.
అభయహస్త విభవమతీ – అక్షరమౌ శిక్షమతీ
ఓంకారపు ఓజస్వతి – బీజాక్షర తేజోమతి
వేదమూల వేద్యవతీ – పురాణాల పూజ్యమతీ
కావ్యజాల కాంతిమతీ – సాహిత్యపు హితమతీ
ప్రసన్నవూ ప్రవరవూ – ప్రాభాకర కరమీవు
విద్యార్థుల వర్ధినివీ – విమలార్థపు విజయవూ.
వ్యాసునికీ వెలుగువూ – వాల్మీకికి మూలమవు
కాళిదాసు కాళివీవు – కవులందరి కాళిందివి
నదిపేరున నవ్యవూ – విదితమైన ఆదితల్లి
స్వచ్ఛదనపు శోభనది – విచ్చుకొనిన విలువకొలువు.
మాతపేరులన్ని నీవి – మమతల మాగాణివీవు.
కోర్కెలన్ని తీర్తువీవు – కోమలతకు కొలతవీవు
మనసులోన నిన్నుచూడ – మాలిన్యములన్ని తొలగు.
అందము ఆనందమూ – అన్ని కలిసి నీదు రూపు.
అందరికీ విందగునుగ – వందనములు వాసితల్లి.
విద్యాలయములలోనా – విగ్రహముల విలువగొనగ

ఆలయ ప్రాంగణములలో - ప్రభవించిన ప్రాభవమ్ము.
బాసరలో భాసితమౌ - భాగ్యవతీ యోగవతీ
జ్ఞానవతీ జ్ఞేయమతీ - జ్ఞానదాయి జనమతీ.
దుర్గవీవు సర్గలందు - నిసర్గమే నిషత్తులకు
శుభదాయీ సూక్తిదాయి - శక్తిదాయి శమంకరీ.
ప్రథమమూర్తి మూర్తిమతీ - బ్రాహ్మీమయ భాస్వతీ
మధ్యమూర్తి విష్ణువునకు - లక్ష్మిగలాక్షణ్యకరీ
శివమూర్తికి పార్వతిగా - శివశక్తిగ సీమంతిని.
అన్నిమూర్తులకు నీవె - ఆదియైన జ్ఞానశక్తి
తెలుపు తెలుపు తెలివి తెరువు - తేజస్విని ఓజస్విని.
మూఢత్వపు మురిపెముతో - గూఢత్వపు గుంభనతో
గురుతులేని గురుత్వమున - గరువముతో గంతులాడు
జనావళికి జ్ఞానమిచ్చి - జయశీలము పెంచుతల్లి.
వాగ్దేవిగ వాఙ్మయిగా - విద్యవిలువ వెలుగు తెలుపు.
పద్మాసన పద్మవీవు - వీణానిక్వణమునీది
మాహేశ్వర సూత్రములే - నీఘనమగు పాత్రములు.
బ్రహ్మవైవర్తమునా - నీదుచరిత నిత్యమాయె
సత్యసాధు సంతులే - నీసంతుగ నిర్మలములు.
యోజనకూ యోగమునకు - యాగాదుల విజయమునకు
నీదుచరణ పద్మములే - వాదులేని వాగ్ఝరులు.
అమ్మలగన్నమ్మవు - ముగురమ్మల గుమ్మవు
అలంకార శోభితవు - ఆరాధ్యపు అంబవు.
నీ స్వచ్ఛ కిరణములతొ - విచ్చిపోవు విమతత్త్వము
మాంధ్యము ఆంధ్యమ్మంతయు - అంతరించు అనునిత్యము
నీ కరుణా దృక్కులతో - నిత్యసత్య వెలుగు కలుగు.
సత్యవతీ సౌమ్యవతీ - సౌభాగ్యపు విద్యావతీ
అష్టాదశ విద్యలన్ని - అందరి కందించుము తల్లి.
అండాండము పిండాండము - బ్రహ్మాండము లన్నియూ
బ్రహ్మగారి భాగ్యమేగ - భార్యవీవు భరింపబడ.
చతుర్ముఖుని మఖమునా - చతుర్వర్గ శాంకరిగా

అపవర్గము నందించగ – అనునిత్యము కాంక్షించుము.
రుచ్యమైన నీరూపము – రుజలను తొలగించగా
నీ సేవన భావనలో – నిరతము జనులుందురుగా
కాలము కలవరములు – చదువులన్ని సంతకెళ్ళ
నిసర్గమౌ నిషత్తతంత – వర్గప్రయోజనము కొరకు.
కులము మతము కూహకములు – నీ రూపును మాపుచేసి
స్వార్థమునకు వాడుకొనగ – శోభదరుగ చింతలాయె
మాకపమార్గములోనా – మాయలకూ తావులేదు
సత్య సత్త్వ సరస్వతికి – సహభాగులు దొరకరెచట
జ్ఞానతృష్ణ జయించగా – జాణవు నీవుంటివి.
జనజీవన సంస్కృతిలో – అక్షరమే రక్షమనకు.
శ్రీపంచమి శివములలర – వసంతమున వరపుగనగ
మాఘమాస మధురిమలో – ఐదువలకు అలకారము.
రతీ విలాసముతోడ – రతీధవుని బతికించగ
రమ్యమైన పండువుగా – రంగుల రహిపండువుగా.
ఉత్తరాయణమునందున – చిత్తము చింతనలలరగ
నియమ నిష్ఠ నిధిగ గలిగి – నిత్యముండ సత్యమబ్బు.
జనజీవన జాతరలో – జరిగిపోయె యుగములెన్నొ
పాతరలో పావనతను – పరిఢవిల్ల జేతువీవు.

628

సీ. మన్నేటికోటలో మన్నికౌ లింగమ్ము – అమరేశుడిచ్చుత అధికఫలము
మన్నేటి సరసన మన్నికౌ గుడిలోన – మాన్యుడు శివుడిచ్చు మమత సమత
అమరలింగేశుండు హిమసుత సహితుడై – పాపాలపోగొట్టు పాలకుండు
నవగ్రహసహితుడై నవ్యమౌజీవన – నడతను నేర్పించు నాణ్యముగను.

తే.గీ. పరమశివుడిచ్చు పరమమౌ పావనతల – పార్వతమ్ముకు దయగల్గ ఫలితముండు
శివము శివరాత్రి దివసాన చెలగుగాక – పూత మహలక్ష్మి మనకిచ్చు పుణ్యములను.

సీ. విఘ్నాల రాజుగా విఘ్నేశ్వరుండిచ్చు – విజయాల వితతులు విలువమీర
నందీశ్వరుండిచ్చు నయమగు ద్రఢిమను – కైలాస కైవల్య కైవశమున

హిమశైల పుత్రియై హితమతి మాయమ్మ – హిమధామ హితమును యిచ్చుమనకు
తాండవనృత్యాన తపనను హరియించు – ముక్కంటి మనకిచ్చు మురిపెములను.

తే.గీ. రూపరూపాల రాపాడు పూపి శివుడు – ఆదిభిక్షువు ఆకలి అవని వీడ
ఆదమరవని రక్షకు డార్తులకును – రాక్షసాధము మడియించు రాజుతాను.

సీ. శ్రీశైలమల్లన్న శివములనీయగా – సిరికొండ సరికొండ చింతదీర్చ
భ్రమరాంబతోగూడి భవమును పండించ – కొండపై వెలసెను కొదమ కొరకు
మల్లికార్జునుడట మాన్యమౌ దేవుడు – సర్వుల కందించు సరసతలను
లింగాల లింగమౌ శ్రీగిరి లింగంబు – పాపభారమునెల్ల పాడుజేయు.

తే.గీ. మంచి మించెడి మించుగ మెలతతోడ – ఫలిత వాక్శుద్ధి వెలుగగా పథమునందు
భక్తపాలన కళలను భాగ్యమతడు – కోట్ల జనులకు కోట్లగు కోర్కెదీర్చు.

సీ. మేలుకొను కోటయ్య మేలెంచు జనులకు – చేదుకొను మగ్నమౌ చేతసులను
కొండపై కొలువున్న కోటప్ప భక్తుల – కొంగుబంగారమై కోర్కెలిచ్చు
మొక్కుల నిష్ఠను మొదవుల మానవుల్ – పూజలు చేయగా పుణ్యమబ్బు
తిరునాళ తిరువీథి తీయని తీరున – ఆనందమందించు అవనికంత.

తే.గీ. శివములందించు శివరాత్రి శివునిదౌట – లింగ ఉద్భవ కాలంపు లీల దెలియు
లయుని కళ్యాణ లావణ్యలహిరి అదియె – విశ్వజనులకు వెలుగిచ్చు విదుల మదుల.

సీ. చీకుచింతలతోటి చిత్తము చెదరగ – ఆత్మలింగముజేర ఆశదీర్చు
తాపాల పాపాల తపనను తరియించగ – వాయులింగముజేర వాసియబ్బు
నష్టాలకష్టాల నయమును వీడగా – శంభులింగము జేర శమములబ్బు
అరిషడ్వర్గములలో అంతరించెడి మేను – అమరలింగముజేర అమరమగును.

తే.గీ. గంగజేరగ గణుతిని గాంచు జనుడు – చంద్రు హిమశక్తి చైతన్యచెలువునిచ్చు
భవుని నొగకన్ను బాధల పారగొట్టు – బూది మురువున భువనము భూరి వెలుగు.

సీ. మూడులింగాలతో ముచ్చటై ముద్దుగా – త్రైలింగ మనగాను తెలుగువెలిగె
శ్రీశైల భ్రమరాంబ శ్రియముల పతిగాను – మల్లేశుడుండగా మధురమాయె
ద్రాక్షారమునయందు రమ్యమై రవణమై – భీమేశునిధియయ్యె మీగడగను
కాళేశ్వరమునందు కమనీయ హృదయుండు – భక్తుల కండగాన్ భయములేదు.

తే.గీ. ఎన్నొలింగాల రూపాల ఎఱుక నిచ్చు – కాశి విశ్వేశులింగము కలిమి బలిమి
సంప్రదాయాల మార్పున సరగుమారె – శైవమనగానె లయమాయె శైత్యముగను.

సీ. శివశక్తి సీమల చెలువము నిండించు – శివదీక్ష శివతతి చిన్మయమున
ఢమరుకనాదము ధరణికి మాటగా – వ్యక్తీకరణయందు వేల్పునదియె
మూడవ కన్నున మూఢత నశియించు – శివమున గంగమ్మ చింతదీర్చు
పార్వతి తోడుగా పాలించ జగతిని – శబ్దార్థ సహితమై చెలువుమీరె.

తే.గీ. మూడులోకాల ముక్కోల ముంచుశక్తి – మూడు మూర్తుల లయమూర్తి ముచ్చటగను
మూడుగుణముల మురియించు ముగ్ధశివుడు–మూడు కాలాల ఆశయ మూర్తియౌను.

సీ. పదునాల్గు లోకాల పనిజేయు తత్త్వము – వ్యాపింపజేయుత వ్యావృతుండు
జీవులు జగమున ఎనుబది నాల్గైన – కోట్లకు కోర్కెల కొలతలిచ్చు
జనులకు జగమున జవమిచ్చు జాణయై – ఆరోగ్యమందించు అహము దివము
దేవాలయములందు దేవుడై దివ్యుడై – దేహుల కగుతాను దేశికుండు.

తే.గీ. అంతరంగాల మునిగిన అంతరములు – వెలికి దీయగ వెతలన్ని వెలుగునివ్వ
శక్తి యుక్తుల యత్నించు శక్తిగాను – శివుడు శివరాత్రి వెలుగిచ్చు చిత్తములను.

సీ. మాల్యాద్రి నరసింహ మాన్యమై మనకొండ – మనికిచ్చు మధువును మతము సతము
సంగమస్థలిలోన సదయను సౌమ్యుడా – స్వామియె స్వార్థము నణచివేయు
భైరవకోనలోన భైరవ శివుడుండె – భాగ్యాల భావాల భవము పండు
కమ్మల తీరాల కమ్మగా వెలసిన – పరమేశు డిచ్చుత ఫలము యశము.

తే.గీ. మనసు పరిపక్వదశనుండ మధురమగును – ఉపవసమునందు జనులున్న ఉన్నతిగను
అందరొకచోట చేరగా అందమగును – అదియె తిరునాళ్ళ పర్వము అతిశయమ్ము.

సీ. శివపురాణము సెప్పు చిత్రాల కథలందు – చిత్తము చైతన్య సిరులనిచ్చు
వారణాసిని వెల్గు వాల్లభ్య మహితుడు – కాశికా విశ్వేశు కమ్మదనము
నలమల కొండల నాణ్యమౌ శైలాన – మల్లికార్జునుడుండె మంచితనము
అమరారామములోన అమరలింగేశుండు – అమరము భువిజేయ అవతరించె.

తే.గీ. నమ్మకమ్మున దైవము నాణ్యమగును – జీవి నమ్మకమునచేయు జిలుగు పనులు
శివుడు కలడను లేడను చింతనముల – ప్రొద్దుపుచ్చక సేవల పొలుపు మీరు.

సీ. శ్రీకాళహస్తిని శ్రీకర చిత్తాన – చిన్మయ లింగము చింతనమ్ము
సాలెకు సదయను సన్మతినిచ్చిన – సాకార సౌందర్య సహితుడతడు
కాళము విషమున కమ్మని భక్తిని – కలబోసి సేవించ కాంతియుతము
హస్తియు హృదయాన అమలిన భక్తిని – సేవించ లింగము సేచనమున.

తే.గీ. బోయ భక్తిని గమనించ భోగ్యమాయె – మాయ లందలి రూపాల మార్పుకోరి
జగతి కందించు సుఖములు జాలుగాను – కాళహస్తిని హిమముఖీ కమ్మసరస.

సీ. నత్కీర కథలోన నయమున భయమున – సత్యము సవరించ సాగితివిగ
వేశ్యలు జగతిన వేల్పుల విధమున – వెలుగొంద వేద్యమౌ వెలుగునిడితి
భవులకు భవమున భాగ్యము వాణిగా – కలిగించి కలతల కాంతిజేసె
మూఢత మూర్ఖత ముచ్చట భక్తుల – మూర్తీభవించగా మురువునీకు.

తే.గీ. ఇన్ని కథలని చెప్పగా ఎన్నతరమ – చెప్ప వినగాను చైతన్య చెలువమబ్బు
కర్మ పూజల చేయగ కలిమి కలుగు – చిత్త మర్పించ నన్నియు చేరుసరస.

సీ. అమ్మగా రనగానె అతివయె పార్వతి – అర్థము నీకయె అతిశయముగ
హిమశైల పుత్రియై హితమున పయనించె – చల్లదనమునిచ్చు సరస మహిళ
తపియించె తపనతో తరుణము రాగానె – తల్లియే తరగని తాపసియెగ
శబ్దము అర్థము శాంకరమైనట్టి – చెలువున రహియించె చెరుపులేక.

తే.గీ. బూది మైపూత పూజ్యము పుణ్యమాయె – మాల కంకాళ మహితమై మరులుగొలుపు
నాగ రాజట రాజిల్లు నవ్యముగను – పథము ఫాలాక్ష ప్రథితము పదమునేడు.

సీ. అవగాహనమునందు అహమంత వెడలగ – గాత్రమ్ము చలువతో గమనమందు
సేవన సేచన చేలమ్ము లందున – నియతియు కల్గగా నియమములను
భక్తకోటులముక్తి భవబంధమోక్షము – భావింప భాస్వంత భాగ్యమాయె
శక్తిని పూజింప శక్తుల కోర్కెల – అనుగుణ రక్తితో అవల ద్రోయు.

తే.గీ. భక్తతతులకు అందించు భాగ్యములను – రోగ బాధల రోయగ రోహిణిగను
శాంతి సౌఖ్యాల సంధించ శాతముగను–భయము బతుకుల దోలెడు భవుడు శివుడు.

629

తే.గీ. కోటి కోటానుకోట్లుగా కొమరుమిగిలె – వేల వేలేండ్ల కాలము వెలుగుజూడ
భువిని మార్పుల తీరులు భువనమందు – కలుగ కథలన్ని మరువగా కమ్మనగును.

తే.గీ. బాధ అనుభవమందున భారముగను – అనుభవమ్మైన బాధయె మరపు జగతి
ఎన్నొ ఎన్నెన్నొ విధముల ఎదల మరుపు – మరపు మనిషికి వరమగు మధురముగను.

తే.గీ. విశ్వమూలము సృష్టికి వినుత జనత – బలము బలహీన పరులను భయము వెలుగ
నాశనమ్మున ప్రళయాన నయములేక – జనుడు బ్రతుకుట కష్టము జయమె మరపు.

తే.గీ. కాల గమనాన కాంతులు కమ్మదనము – వెతల కతలెన్నొ వెల్లువల్ వెలుగుజూడ
అన్ని మరచిన అందముగాదు మనసు – మనుసు మనిషికి మరపున మాన్యమగును.

తే.గీ. కులము వంశాలు కుధరానకూర్మిచెడగ – కూలె హత్యల కృత్యాల కుమ్ముదుమ్ము
ఆప్తులందరు పోగాను అవని అధమ – ఆర్తి తొలగగ మరపున ఆస్తి అదియె.

తే.గీ. తల్లి, బిడ్డలు, తండ్రులు తరలిపోగ – అన్న అక్కలు సెల్లెంఢ్రు హతులుగాగ
మిత్ర గురువుల బంధులు మిత్తిగొనగ – అట్టి ఆవేదనను మించు మరపు మహిమ.

తే.గీ. ఇష్ట జంతువు వీడగా కష్టమగును – పరుల సాహాయపడువాడు పరముడైన
హితముకాంక్షించు మానవుల్ వీడిపోగ–మనము శాంతించ మరపుగా మనసునందు.

తే.గీ. అన్నివిషయాలు గుర్తుండ అనవి అసదె – బాధ వేదన భయములు భారమగును
మనిషి నిలువడు మరపేమి మనకిలేక – అందువలన వరమాయె మరపునేడు.

తే.గీ. పొరల మాటున పడియుండు పొలుపు దక్కి–పొగులు వగలును మురువక పొంక మిచట
లేదు జగతిని జనతకు తేవడులను – మనిషి మాన్యుడు మరపున మార్పుతీర్పు.

తే.గీ. రాక్షసత్త్వము విడువగా రమ్యమాయె – అమరతత్త్వము అవనికి అధికఫలము
మానవత్త్వాన మసలుట మహితమగును – అన్నితత్త్వాలు మరపున అంతమగును.

తే.గీ. రేలు పగలును జగమున ఎఱుక కల్గ – ఒకటి ఒకదాని మరువగా వొలుకు సుగతి
సూర్య చంద్రులు మరపున సూక్ష్మరీతి–జగతి నిండించ పండించ జయము మరపు.

తే.గీ. రక్తసంబంధ బంధము రజతమగును – మరణ మన్నది మహిజన మరపు తీరు
ప్రేమ ఆప్యాయతలు పెంచు పెద్దలంత – తాము మరణించ మరపును తపననిచ్చె.

బాధలు భరించలేని జీవన భావనకు మరపు మాన్యం
చిన్నదైన మెదడుకు చైతన్యాన్నిచ్చి తరింపజేస్తుంది మరపు
మనువర్తన మార్పుకు నిత్యమైన సత్యమైన నియతి మరపు
దుష్ట దావన దురిత క్షమకు మరపు సాటిలేని మానవ వరం

'భూమి సహనం'తో పొరలమాటున దాగిన జ్ఞాపకాల గుర్తు మరపు
విశ్వాన్ని వెలిగించే వింతల్లోని విమతత్వాన్ని వెలివేసేదే మరపు
ఏమరుపాటు ఎదలో ఎన్నికాలాలకైనా ఆనందాన్నందించేది మరపు
మానవమేధకు చిన్నతనాన్ని అందించే చింతనలోనిది మరపు
మరపు మనుజీవిని జీవింపజేస్తుంది మురిపిస్తుంది
మారేకాలానికి మర్మం ధర్మం ధరించేది మానవుని మరపు
వైరాగ్యానికి అడ్డుకట్ట వేసే ఆనంద జీవన సారధి మరపు
మంతనానికి అందివచ్చే మాన్యమైన జీవన సాధనం మరపు
కలవని కలతలకూ కలిసే వలపులకూ మరపు మనువర్తి
ప్రేమ పెరుగుదలకూ తరుగుదలకూ పెరటి కల్పకం మరపు
మరపులేకపోతే మానవుని నమ్మికకు వరపు లేదనేది సత్యం
మంచితనానికి ఒంటరితనానికి వరపైనది మరపనేది.
ఆలుమగల అందం ఆనందం ఇనుమడింపజేసేది ఇంపైన మరపు
ఆకలికి అందిన ఆహారానికి మరపులేకపోతే ఆకలిలేదు
తిన్న అన్నమే తింటున్న సమాజానికి తియ్యదనం తీరైన మరపు
చేసి మరచే పనుల చేతనత్వం మనిషి చేతానికి మేలు మలుపు
మరపులేని తలపుకు మానవ జీవనంలో మలితలపు జన్మంలేదు
ఆదమరచి నిద్రించడం ఆనందానికి అవధి అవుతుంది
మరపు మధురమైన మనసుకు నిత్యనూతనత్వాన్నందించేవిరుపు
మరపులేనిదే మానవాళికి శాంతికాంతి దాంతి కలుగదు.

630

సీ. చిడిపోతు వంశాన సింహమై జనియించి – జనమనసులయందు జవము పెంచి
వినయాన విద్యను వినుతంగ నేర్చిన – విలువల జ్ఞానియై వెలుగునంది
జనసేవ తరియించ జయమొంది పదవిని – మండలాధ్యక్షత న్మాన్యుడుగను
దివివారి వంశంపు దివ్యమౌ మేనల్లు – కుశ్రమై పెరిగిన కోవిదుండు.

తే.గీ. లక్ష్మినాయుడ! యువకుల లక్ష్యమీవు – నాయకత్వాన నయమైన నడతనీది
సాదరమ్మున సామాన్య సరసుడుగను – నిండుగుండెల నిలచును నీదు మూర్తి.

సీ. నినుగన్న నీతల్లి నియమాల ధన్యత – చిన్నతనమునందు సిరిగ పదవి
నీతండ్రి మాన్యత నినుపెంచు విధమెన్న – గారాబు గణ్యత గమనమాయె
అక్కసెల్లెండ్ర అభిమాన మెన్నగా – కథ యెంతొ చెప్పగ కమ్మనాయె
జనులందు నీపేరు జయమెంచు విధమెన్న – అమరమై అధికమై అందమాయె.

తే.గీ. వయసు పోకనె వాసిని వలపునొంది – దుష్ట దుర్మార్గ దురితంపు దుర్దినమున
కరకు గుండెల గుండుకు గురిగవెట్ట – రాజకీయపు హత్యకు రంగమైతి.

సీ. అన్నరామన్నకు ఆరోజునందున – అభిమానమొప్పగా ఆప్తునిగను
తెలుగుదేశమునందు తెగువకు రూపమై – చొరబాటుతనమున సొంపుకలిగి
సామాజికంబగు సాగర రీతిన – సరసపు నేతగ సాహసమున
భయరహితముగాను భావాల బలమున – శాంతిని కోరెడి చలనశక్తి.

తే.గీ. రాజకీయపు కుళ్ళున రాక్షసమున – చిన్నతనమున చింతమీరు
అంతరంగాల శివరాత్రి అంధమాయె – వింత విలువల నేతకు వీడుకోలు.

సీ. దివిశివరాముకు దిటవైన భుజముగా – పార్టీయు పాలన ప్రగతిగాంచె
కరణము వారికి కమ్మని తమ్ముడై – జనకామితము దీర్చు జనుడుతాను
మండలాధ్యక్షత మాన్యుడౌ మహిమను – వీవిపాలెమ్మున విశదముగను
తెలుగులదేశంపు తెలివైన నేతగ – మన్యమౌ ప్రాంతము మాన్యమాయె.

తే.గీ. నేతనెయ్యము నెరపెడి నేస్తుడతడు – పట్టుదలగల్గు పథకాల పాలనమున
తనదు ఆధిక్యమును పెంచు తపనపరుడు – భువినివీడగ గుండెలు భగ్నమాయె.

తే.గీ. కందుకూరున కలతల కాలదన్ను – వెన్నుదన్నైన నేతయె వెతలుబాప
కన్నుకుట్టె విధాతకు కలతజెంది – పథకమునుపన్ని చంపగ బాధగలిగె.

తే.గీ. 'కమ్మ'దనమున కమ్మని కలిమిగాను – కమ్మకార్యాల కాంతియె కాంతి కలిత
కమ్మజనముల కందెను కామితములు – కమ్మదనమంత కలిసెను కర్కశమున.

తే.గీ. శక్తియుక్తుల మంచిని శాంతికోరె – రక్తి కలుగగ రహిజన రజిని కరుదు
దురిత పరధన వాంఛకు దూరుడతడు – ముక్తిపొందును ఆత్మయు మునుగు శాంతి.

తే.గీ. ఆత్మశాంతికి అందరు అవనికోర – ముప్పదేడులు నిండెను ముద్దువెలసె
ఆవియె నూరేండ్లు అవమతి అధమచేత – దైవవాక్యము జనవాక్య దైన్యమగుట.

తే.గీ. పెద్దపదవుల పొందగ ప్రేమకలిగి – శక్తి సామర్థ్యముల నొంది శాంకరముగ
మాటమనసులచేతల మమత మీర – స్వర్గ పథమును పొందగ వగపు కలుగు

తే.గీ. లక్ష్మీనాయుడన్న లావణ్యమింపార – రాక్షసత్త్వమంత రాలిపోవు
రాక్షసమ్మునేడు రాజ్యాన రహియించ – నేలరాలె నేత నెవ్వగాయె.

సీ. చురుకైన వర్తన సుందర చేతమ్ము – హితమెంచు హితమతి ఇంధనమ్ము
పరులను పాలించు ఫలముల నందించు – పరువైన కార్యాల పాలుగొనును
రూపము రూక్షము రుజలకు విషమగు – ఆరోగ్యవంతము అతనిమాట
పెద్దల పిన్నల ప్రేమగా మెలగును – ఆత్మీయతామూర్తి అందరికిని.

తే.గీ. సేవలెన్నియొ వినియోగ సేచనమున – జనుల అదృష్టమెన్నగా జాలికలుగ
రక్తపాతాన రాజ్యము రక్తిమీర – రాజకీయాన బందూకు రాజ్యమేలె.

సీ. మేనరికమ్మున మేలొనరించగా – దివివారి వంశాన దిటవుగలిగె
అల్లరిమూకల అధికమౌ బలమున – అణచివేయగవూరు అందగించె
తప్పును దండించు తలమానికముగాను – కందుకూరు వసింప కాంతిగలిగె
తెలుగుదేశపు వెల్గు తెంపరితనమున – యువకుల చిత్తాలు ఉరకలెత్తె.

తే.గీ. నీదు గొప్పను ఓర్వని నేరవిధికి – శివమువీడిన శివరాత్రి చెలగె చింత
అంధకారము గుండెల అలముకొనియె – ప్రేమ పండిన పండయి ప్రేలెగుండు.

తే.గీ. కందుకూరున ప్రజలంతరంగములను – ఎల్లకాలాన నిండెడి ఎరుకనీవు
నీదు కార్యాల పద్ధతి నియతులన్ని – నిలచునెప్పుడు తప్పక నిధిగ ఎదల.

తే.గీ. కమ్మదనమున 'కమ్మ'గాను – కమ్మకార్యాల కాంతియె కమ్మగాను
కమ్మకులమున కమ్మని కథగనిలచు – కమ్మదనమెంతొ మిగులును కలిమి జనుల.

ఆ.వె. కందుకూరు గుండె కందమై అందమై – లక్ష్మినాయురూపు లక్షణముగ
జనత సేవ నింద జయలక్ష్మి భరితమై – చిన్నచూపు విధిని చింతగలిగె.

సీ. కన్నీరు మున్నీరు కలతల కథగాను – కందుకూరుండెను కలిమి మరచి
గుండెల నిండిన గురుతైన రూపమ్ము – జనతను వీడగా జయముతొలగె
మండల మండన మహిమతో సాగించ – ప్రజలంత దుఃఖాన రగులుచుండె
యువతకు బలమిచ్చి యూర్జిత – శక్తిని పెరుగగ విధికెంతొ వేసటాయె.

తే.గీ. బాధ బాధించ హృదయాన బదులులేక – మాటపెగలక దుఃఖము మరియుహెచ్చ
అందజేతుము నీరాజనమ్మునీకు – ఆత్మశాంతించు నమరాన అంతమునకు.

సీ. చితికిన గుండెలు చిందర వందర – చిడిపోతు నాయుడు చెదిరిపోవ
యువకుల కొకనేత ఉర్విని వీడగా – ప్రతినిధి కొరతతో పాలిపోవు
ధైర్యము ధనముగా దైవము దరికెళ్ళ – దారియు తెన్నును ధరణిలేదు
నాయుడు లక్ష్మన్న నాకాని కెళ్ళగా – నాధుడు కరవయ్యె నవ్యజగతి.

తే.గీ. భర్తవీడగ భార్యకు బాధమిగిలె – బిడ్డ మరణించ తలిదండ్రి భీరువులుగ
భుజములేనట్టి మానవ భువనమాయె – నీవు వెడలిన జగతియే నిమ్నమగును.

సీ. చంపినదెవరైన చనిపోయె మంచియె – బతుకగ బాధగు బంధువులకు
రక్తము చూచెడి రాక్షసులైనను – మానవసేవను మరచినారు
జనులకు జయమెంచు జవసత్త్వములు కల్గ – దానవాధములకు దయయులేదు
నేతల కడ్డము నెయ్యపు నేతగా – జనమాన్యతనుపొంద జయమువీడె.

తే.గీ. కరకు బందూకు గుండ్లకు కలిమివీడె – వెనుక ముందర ఎవరున్న వెతలె మిగిలె
రాజకీయము గూండాల రాజ్యమయ్యె – హత్య సంస్కృతి మిగులగ అంధమయ్యె.

సీ. యువనేత మరణించ ఉన్నతివీడెను – కార్యకర్తలమది కాంతివీడె
నీతియు నియతికి నిధిగాను ప్రతినిధి – ప్రజలను వీడగా ఫలముదప్పె
యువకుల చిత్తాల చిన్మయ రూపాన – సిరిగాను విరిగాను చెలగినట్టి
నాయునిరూపము నడతయునాణ్యత – అనుచర గణములో ఆత్మనిండు.

తే.గీ. కూర్మి విడిచిన కుమతుల కులముమీర – కరుడు గట్టిన కర్కశ కథల కలల
నీదు రూపము కనుపట్టనిధియె మాకు – కనని దురదృష్ట కర్మను గాంచినాము.

తే.గీ. మధ్యతరగతివారికి మాన్యునిగను – అంత్యవర్గాల వారికి ఆప్తునిగను
ఉన్నతులకింపు కల్గించు ఉత్తమునిగ – వెలిగి ఆరిన జ్యోతివి వేగముగను.

తే.గీ. మాటతీరును చేతల మహితగతులు – వినయసంపద విలసిల్లు విలువ మీరు
గుణము శీలము గురుతుగ గుదులుకొనగ – మనము మానవ తత్త్వాన మసలుచుండు.

ఆ.వె. గాలిగలిసిపోయె గరువంపు ప్రాణమ్ము – గాయపడెను గుండె గాటముగను
కుళ్ళు కులము ముదిరె కూటమి కఠినమై – మూడుపదుల వాని ముంచివేసె.

సీ. జీవముపోగానె జీవుల భావాలు – వెతలకు నిలయమ్ము వెలుగులేక
ప్రాణముకలవాడు అహమున చరియించ – అవనిని ఎదిరించ కష్టమగును
సమయమురాగానె చాలించు సర్వము – కబళించ మృత్యువు కాంతివీడు
చావుకు సిద్ధమౌ నరుడెవ్వడుండును – సర్వము ప్రాణము స్వార్థమహిమ.

తే.గీ. జీవయుతుడగు మనిషియె జీససుగను – పరులకుపకారమొనరింప పరమమగును
లౌకికమ్ముగు విషయాల లోలుడగుచు – మనసు మరచిన మనుజుడు మరుడుకాడు.

సీ. హత్యలగావింప హతుడౌను మనుజుడు – హంతకులెవరైన హత్యజరుగు
తెలియని హత్యల తెలివిని తప్పింప – కాలము గమియింప కలుగుచెట్ట
రాక్షసదారుణ రహిజన కృత్యాల – మరణించు వారలు మరులెజగము
పుణ్యము పాపము పుడమికి అందగా – భువిభారమునువీడు భువనములను.

తే.గీ. ఎంతచెట్టుకు గాలియు అంతటిదిగ – కర్మఫలమును జనులంత కాంచగలరు
మంచినిలువదు కలకాల మహినినేడు–మంచివారలు మునుముందు మరలుచుంద్రు.

సీ. సాహసకార్యాల సాగెడి జగమున – సహనమ్ము లేకుండ సమతలేదు
సుందరచేతాల సుమధుర భావాలు – సుగమమ్ము సూక్తుల సుమముగాను
మమతల సుమతుల అమలిన అందాలు – అందించు జీవన సవనమునకు
బలమున భయమున భాగ్యము అందును – జనమున కదికాదు జయమునేడు.

తే.గీ. ధైర్యదాక్షిణ్య భావాలు దైర్ఘ్యమాయె – లక్ష్మి సరసన లక్ష్యము అవనిలేక
సర్వమాయెను జగమున సాక్షి లక్ష్మి – ప్రాణములు పోగ ఫలితము వరముకాదు.

సీ. చినిగిన చేతాల చింతల మునిగిన – బతుకుల గమనింప బాధకలుగు
కాలెడి కడుపుల కనకనలాడెడి – కాంతి దప్పినయట్టి కనుల జూడ
పైకప్పు పడిపోయి పయ్యెద కప్పుగా – నివశించు నిమ్నుల నియతిగాంచ
జీవిత మనునది జీవించనివ్వని – విధిచేత విలువల వింత తీరు.

తే.గీ. దయకు పాత్రుల దయజూచు దాతలిలను – బాధ భవమున హృదయాలు బాధనొంద
పాపమనియెడు పలుకులె పావనముగ – కరుణ కమనీయ దళితుల కాంతిమహిత.

సీ. మనుజీవి మనసున మమతలు మనగాను – మమకార మవనిని మందిరమ్ము
నవజీవనమునందు నయమెంచి నరుడుండ – నయగారమొలుకును నయనముగను

భవబాధ భయమును భంగమ్ము చేయగ – విశ్వమ్ము విజయమై వినుతినొందు
కలికాల గమనమ్ము కథలను వ్యథలను – దయగన ధనమెంతొ ధరణివెలుగు.

తే.గీ. మానవత్త్వము మనిషికి మహితయశము – దానవత్త్వము ధరణిని దారుణమ్ము
కరుణ తత్త్వము కాంచగ కమ్మనగును – మనసు కలుగగ మనువాడు మానవుండు.

సీ. కాలమ్ము గాలమై కథమారె జగతిని – వ్యయమున వ్యసనంపు వ్యావృతమ్ము
పథమంత వ్యథితమై భవబంధభరితమై – భాగ్యమ్ము పండగా భయముగాంచు
గమ్యము గమనము గరువము వీడెను – లక్ష్యము నెరవేర లాతి విధము
వ్యక్తిత్వ వ్యావృతి వ్యాప్తమై వెలుగగా – ఆత్మగౌరవమంత అండనుండు.

తే.గీ. కాలవిలువను గమనించి కర్మసేయ – కలిమి జనునకు కలగగ కాంతికలుగు
లక్ష్యమవగాహనముగల్గ లక్ష్మి దొరలు – శీలసంపద నరులకు శివములిచ్చు.

తే.గీ. అణువు అణువున రక్తపు అరుణిమలను–అభ్యుదయమున నుదయింత్రు అవనిజనులు
నీదు భౌతిక కాయము నింగి నిలువ – వేల నాయుళ్ళు ప్రభవింత్రు వేకువలను.

తే.గీ. భగ్నహృదయాలు భువిలోన బాధనొంది – మగ్నమాయెను కల్లోల మయము జగతి
భయము బాధల భాగ్యము భవము వీడె – శోకతప్తము యువనేత శోభవీడ.

తే.గీ. గ్రామ గ్రామాల యువకుల గరువమంత – నీదు ఉనికిని కాంక్షించు నియతితోడ
నీవులేకున్న నిమ్నమై నీరవమున – కాలు సేతులు ఆడని కర్మలాయె.

తే.గీ. శోకమయమైన లోకము శోభవీడె – దుఃఖమయమైన గుండెలు దురపిలంగ
కాంతివీడిన గ్రామాలు కళలుదప్పె – బంధుతతులకు బాధలు భయము మిగిలె.

తే.గీ. ఉడుకు రక్తము యువకుల ఊపిరిగను – ఊతమిచ్చిన నేతయె ఉర్విలోన
ఉన్నలేకున్న వాంఛయె ఉన్నతమ్ము – సామరస్యము సహనము సాహసమున.

తే.గీ. దేవుడుండిన దేశాల దేవళముల – కాచిరక్షించువాడెగా కరుణగలిగి
ఉండెనొకచోట యన్నను ఉన్నతముగ – తనదు దరిజేర్చి కొనెనుగా తరుణమునకు.

తే.గీ. మంచిమిగులును మనుజన మార్గమందు – అవని జనవాంఛితముదీర్చ అందమగును
కష్టనష్టాల దప్పింప కలిమి కలుగు – లక్ష్మినాయుడు జనులకు లక్ష్యమగును.

తే.గీ. తగవుచేసిన తరుణాన తపనపడడు – వాద ప్రతివాదములవిని వాంఛదీర్చు
ఆర్తి ఆదరమూర్తిని అధికుడతడు – వయసుచిన్నది తలపెద్ద వాసిగాంచె.

తే.గీ. శత్రువుదరిజేర రక్షించు శమముమించ – తప్పుచేసిన మిత్రుల దండనమున
తగవుదీర్చగ పదుగురి తపనదీరు – చాకచక్యము చైతన్యచారుమతియె.

తే.గీ. విషయగమనము వినుతుల వితతితోడ – అంకితమ్మగు భావము అతనిసొత్తు
మంచి అవగాహనాలోకనమున తాను – నేతలందరిలోనన నేర్పుమీరె.

తే.గీ. కలుగు దుఃఖము శమియించు కాలములను – ఆప్తులందరి ఆర్తులు అంతరించు
భార్య తలిదండ్రిబాధలు భయము వీడు – వ్యథల కథయౌను నాయుని వెలుగుకర్మ.

తే.గీ. కలలు చిడిపోతునాయుని కలిమిగాంచు – కలిమి బలిమిగ కలకాల కాంతియగును
కాంతి కిరణాలె చైతన్య కర్మనిండు – కర్మధర్మము కలియుగ కథగమిగులు.

631

సీ. అమ్మలగన్నమ్మ అవనిని మాయమ్మ – అన్నమందించెడి అన్నపూర్ణ
కామితములుదీర్చు కమ్మని అమ్మగా – కరుణాంతరంగియౌ కల్పవల్లి
కర్మలు ఫలియింప కలకాలమమ్మగా – కాంతులు చిందించు కాంతిదాయి
శీదేవి భూదేవి శివముల పార్వతి – చదువుల తల్లియౌ సరస భరిత.

తే.గీ. బ్రహ్మముఖముల వెలిగెడి బ్రాహ్మితల్లి – విష్ణు ఉరమున నివసించు వినుతలక్ష్మి
ఈశు నర్ధాంగి పార్వతి హితము తల్లి – ముగ్గురమ్మల గనెనుగా మూలధాత్రి.

632

సీ. భావము భాగ్యము భవమున పండగా – కమ్మని కల్పనన్ కాంతి కవిత
శబ్దము అర్థము శక్తిని కలియగా – తియ్యని పదముల తీపి కవిత
రసనను నిండించు రసముల నినదించు – నవరసమహితమౌ నాణ్యకవిత
శ్రుతులను మతులను సుందర చేతాల – నిండిచు శైలియు నిత్యకవిత.

తే.గీ. నిత్యనూతన యౌవన నియతితోడ – సత్వసారము వడబోయు సరసకవిత
మధుర ఫణితుల మార్గము మాన్యకవిత – రసనలందుండు కవితలె రహిని మధువు.

633

మృత్యువు జనమనసుల్లో శోకజ్వాల రగిలించి జ్వలించింది
దారుణ దహనకాండతో దయను విడిచి విహరించింది

ఆరనికన్నీరు ఆవిరై అధమమైన అందాన్ని చిందరవందరచేసింది
దుఃఖసంద్రంలో ఉద్భవించిన బడబాగ్ని దావానలమై వ్యాపించింది
అల్లరిమూకల ఆగడంతో రాదార్లన్నీ శ్మశానరూపంగా మారాయి
ఉద్వేగం ఉన్నతిని లెక్కించక అధమత్వానికి అధిపతయ్యింది
తనవారు తరించిపోగా పెరవారిని మరచిన పెనుప్రళయం
మానవునిది కానిసృష్టిని శోకోద్వేగం శోధించి నష్టపరిచింది
నరులమధ్య సంబంధం విడిగా వీడిపోయిన స్థితికి తార్కాణం
పార్టీల పావనత్వం మానవత్వానికి మసిపూసి బూడిదయ్యింది
శోకాగ్ని రాశీభూతమై మరోమారణహోమానికి దారితీస్తుంది
అనుమానం అంతరంగానికి పెనుభూతమై మానవ అంతానికి ఆరంభం
నాణ్యమైన నమ్మకానికి తొడిగిన నల్లకోటుజనుల పుకార్లు
రెక్కాడితేగాని డొక్కాడని వారి జీవనం బజారుపాలై బావురంది
నేరం నేరగాడికి నిజమైతే అదృశ్యహస్తం అసలైన అసత్యం
హస్తమున్నా లేకపోయినా ఆస్తికులం కాబట్టి నమ్మే అవకాశం
రక్తాన్ని రుచిచూచేరాబందులు రాజ్యానికి రావణాసుర సదృశులు
తీరని వేదనతో గుండెలు నిండి పెల్లుబికిన కోపాగ్నికి ఊరు ఆహుతి
ద్వేషం దయ్యమై దయనీయమై ధాత్రిని కలవరపరచిందానాడు
సందట్లో సడేమియా అనే సామాన్యుల అంతరంగం అందరికీ తెలుసు
తప్పుకు తప్పని దండన తరచి చూచేదాకా తెలియదు
తరచిచూడనివ్వని స్వార్థసమాజానిది అంధకారానికియానమే
అన్యోన్యం ఆరోపణల పర్వంలో నాయకులు మునిగి నరులను ముంచుతున్నారు
పోయిన వ్యక్తిరాడు పోవాల్సినవారు ఆగరు బ్రతికి చచ్చేవారు బలహీనులు.

634

తెలివిలేని జీవులకు తెలివిని నేర్పేకథలు కలికాలంలో కల్లలే
ప్రతిఘటనకూ 'ప్రతిఘటనకూ' కథలల్లడమే నవ్యజీవనగతి
మంచిచెడుల వివేకానికి మానవుని గమ్యానికీ మలుపులు కథలు
కథలుకంచెకెళ్ళగా ఇంటిని సరిదిద్దుకొనే నవ్యులు నేటిమానవులు
చెప్పేవాడిచేతం వినేవాడివీనులూ జీవనవనంలో కలిమికి కాంక్షలు
కలకూజితం కమ్మనిదైనా వినేవాడి మనసుకది విషం కావచ్చు కథలో

660

మేధావుల మెదడులకు మేతలైన కథలు సామాన్యుని మైమరపించాయి
పిట్టకథలు పిలిచినవెంటనే పరుగెత్తే అజ్ఞుల ఆంతర్యం అంధకారమే
కనిపించని భగవంతుని గూర్చిన కథలే జనజీవనహేతువుకు హితాలు
కనబడే వినబడే మానవుల కథలే వ్యథార్తుల జీవనానికి వెలుగురేఖలు
కల్పన కథలకు అందాన్నిస్తే మానవుని జీవన నైజం మధురం కాదుగదా
వాస్తవికతల వెతలకతలు నవ్యమానవునికి నయవర్తన నేర్పాలి.
ప్రకృతి కృతిని మానవుల వికృతి విదళన చేస్తే విమర్శ విలువలు ప్రసరిస్తుంది
జ్ఞానం జనజీవన మానమై జయగీతిక పాడే సప్తస్వరాల వెలుగు
సూర్యుని అశ్వాలవేగానికి ప్రకృతి ప్రజ్వలనమొంది చైతన్యరాగాన్ని పంచింది.
ప్రత్యక్షం ప్రత్యక్షరమై అక్షరమైన లోకానికి అందించే భాషానందం
నోరుమంచిదైతే ఊరుమంచిదవుతుందనే కథల్లో కమ్మదనం నిండు
కామితార్థ దాయిలయిన కథలకు కథనంలోని విశేషం వివరణ విలువ కలది
కళంకం కలియుగానికందించే కథలలోని కాలుష్యం కాలానికందనిది
మహనీయుల మహిమల కథలు మానవజీవితానికి వెలుగునందించే నిధులు
నిత్యసత్యజీవనదుల్లాంటి కథల మహనీయత మానవత్వాని మేలుకొలుపులు
ఆలోచనలరేకెత్తించే చైతన్యాన్ని రగిల్చే కథలు విప్తవానికి అవధులు
ఆసక్తిని కలిగించే అంశగల కథల శక్తి అమోఘమై అందాన్నిస్తుంది
అంధకారంలో అలమటించే అజ్ఞానుల జ్ఞాననేత్రం తెరిపించే కథ అమరం
మూసిన మంచిభవనపు తలుపు తెరిపించే యత్నంలో కథలు సాఫల్యమైనవే.

635

గొలుసుకట్ల కట్లు తెంచుకొన్న నవనరసమాజం నవ్య అపసవ్యదిశగా వెలుతున్నది
గిరిగీసుకొన్న నవ్యగీష్పతుల గీతోపన్యాసం పరిధిదాటకుండా పలవరిస్తున్నది.
ఘటన జరిగితే అనుమానపు తెరలు నాగరికజనరక్తపోటును అధికం చేస్తున్నాయి
అఘటన ఘటనాసామర్థ్యం సామాన్యుల జీవన నిఘంటువులో లేదనేది సత్యమే
సంఘటితంకాని విఘటనశక్తి సామాన్యుల్లో పలచబడి పలాయనం చిత్తగించింది
వినియోగం విలువలను లెక్కిస్తూ విలువ తెలియని సమాజాన్ని వింగడిస్తుంది
మూకల మూగస్వామ్యం అంచనాల అంతరంగాలకు అవగతంకాని గతమయ్యింది
ప్రమాణం పల్లవదశలోనే పండిపోయి వయసుదాటని ఓటర్ల మనోగతమయింది
పెద్దవాళ్ళ మరణాలకు కారణం కనబడినా కార్యకర్తలుమాత్రం కనబడని ఉగ్రవాదులే

పేలవమైన విలువలు పార్టీల సిద్ధాంతాలను బీటలు వార్చిమార్పిడుల తార్పుళ్ళకు సిద్ధమైనాయి
నిలువెల్లా విషమైన మానవుడు నిత్యం నిందలకు పాత్రుడై విశ్వాన్ని విషమయం చేస్తున్నాడు.
మస్తిష్కంలో మానవత్వం కొరవడి మనువర్తనలో దానవత్వానికి దాసుడౌతున్నాడు.
అంతాధనమూలమనే అధముడు అంతరంగమాలిన్యంతో అవహేళనకు పాత్రుడౌతాడు
మోసం మోరకులకు మోదాన్ని కలిగిస్తే ఆమోదించని మానవులకు అగచాట్లే
గరళం త్రాగిన ఈశ్వరునికే కష్టం తప్పనపుడు మానవులకు తప్పని తప్పిదం అదేకదా
జీవునికి ఆత్మఉంటే అదిపరిశుద్ధమైతే జగన్మాలిన్యం అంతరించటానికి అవకాశం
ఆకాశమంత అవకాశంలో విహరించే మానవ వ్యక్తిత్వం భూమి ఆధారంగా వసించేదే
వాస్తవానికి వత్తాసుపలికే అవాస్తవపు మేధాశక్తి మానవుని మనోవాంఛకు మూలం
తలపెట్టిన కార్యానికి తగవుచేకూర్చే త్రికరణశుద్ధి తలపట్టుకొని కూర్చుండి తరిస్తుంది
పట్టుదల పట్టంకట్టుకొని పరమార్థాన్నందించటానికి ప్రయత్నం చేసి విఫలమయ్యింది
జీవించినా మరణించినా మూన్నాళ్ళ ముచ్చటైన జీవితానికి మురువును గూర్చే ముద్దు కరవు
అన్నిమనసులూ అసంతృప్తి ఆజ్యంతో ప్రజ్వలిస్తూ సంతృప్తికై సంతర్పణలు చేస్తున్నాయి
మానవాతీత శక్తితానేననే భావనం తపన పూరిత తనువులకు అందిన తారుణ్యం
గౌరవానికి గార్ధభంలా వినయానికి వింతజంతువులా మనిషిమారి తరిస్తూ తపిస్తున్నాడు
కాలగమనంలో ఘటనలు మనసుల్ని కాల్చివేస్తున్నా రక్షణకోసం శిక్షణపొందలేకున్నాడు
దేవతలకు వత్తాసుపలికే మానవగణాలకు మాలిన్యం మనుజీవన మహితమై మధురమైంది
విజయమో వీరస్వర్గమో ననుకొనే మానవుల అభిమానం మాటల మలుపుల మలిసంధ్యగా మారింది
గమనం గమ్యం గాలిలోని దీపంగా తపనతో రెపరెపలాడే కాముకుడు నరుడు.

636

తెలుగుతీపి తేనెవాగు తెలియదగునదుగాదిగా
కొత్తదనపు కోర్కె చిగురు కాంతివంతమాయెనుగా
ఎదల గదుల ఎరుకమహిమ కోయిలమ్మ పాటగా
తీపిచేదు వగరు కలియ తీరుజీవనమ్ముగా.

జ్ఞాపకాల గురుతులలో కరిగిపోవు కలల కలిమి
వత్సరాల వయసుతోడ వాసిగాంచు జీవనమున
తెలుగుదనం తెలివికలిగి తెలుపులూరు తేటగాను
అవసరాలు తీర్చునదియె ఆశలందు జీవితాన

662

చిగురుసొగసు చిలిపిచేష్ట వగరుపొగరు వలపునిష్ఠ
జంటజీవితాల పంట కంటబడెడి కాలమహిమ
చలిని వదల వెచ్చదనము సమయమదే స్వాగతించ
ఆకురాలి చిగురుపుట్టి అరుణవనము అవనివెలుగు.

చైత్రమాసఛత్రమునకు నవరసములు రత్నములుగ
రసమయమే జగమంతా ఉగాదికే స్వాగతమ్ము.
యుగయుగాల కథలమధ్య అభ్యుదయము అమరమిచట
వచ్చిపోవు ఉగాదులే అవనికిచ్చు అమిత బలము.

మధుమాసపు మహోదయము ఉగాదికే నవోదయము
మానవాళి మనుగడకే మహదాశయమగును సుమ్ము
జీవసాగరమ్మునందు కలల అలలు వత్సరాలు
అందమైన కలలన్నియు నిజమగునుగ ఉగాదిన.

అంతరంగమలినమంత అణగార్చును పర్వదినము
వింతతీరు వర్తనలను విదళనమ్ము సేయునదియె
కోమలతనుకోరు జగతి నిర్మలతకునిధి యుగాది
కొత్తదనం మెత్తదనం జనజీవన జగతినిండు.

వగాదులకు వంధ్యముగను పగాదులకు ఫలములేమి
అవనిలోని అందమునకు అమరత్వము ఉగాదియే.

637

పూతవయసు వేపపూత పూజ్యమగును జగమునందు
లేతమావిపిందెపులుపులోకమునకు మేలుకొలుపు
తేనెమధువు తేటవలపు కలగలిసిన కమ్మదనము
మూడురుచుల జీవితాన ముద్దుమురిపెమగునుగాది.

ప్రకృతిలో పరవశించి వికృతమును విరియజేసి
సుకృతమున జీవించగ సుమధురము మన ఉగాది
మనసు మమత తనవు తపన తరుగు పెరుగు పర్వమిదే
వయసు పొగరు వరుల వగరు పెరుగుతరుగు నుగాదిలో.

కొత్తదనం కోరగాను పాతకోర్కె పరుగులిడును
పాతకొత్తకలయికగా పావనమగు పర్వదినము
అందానికి అందమిచ్చు అవనిశోభ అందరిదీ
అన్నిఫలములందించును అంతరంగమహిమనిండ.

చిగురు వేసి మొగ్గతొడిగి పుష్పించిన ప్రకృతిలో
చిన్ని చిన్ని పిందెలతో బంధమాయె మధురమగుచు
కోడెవయసు గూడు మనసు గూఢమగును దానవలపు
ప్రేమప్రేరకమ్ము జగతి కోయిలమ్మ కూత పిలుపు.

పచ్చదనం వెచ్చదనం పరమార్థపు లావణ్యం
ఉరకలెట్టు ఉగాదికై ముద్దుముచ్చటలనుగూడి
మంచిమించిపోవు జగతి మన్యములే మాన్యములౌ
వంచనమున వలపుజూప ఉగాదులే వగాదులౌ.

రాజీవుని రాజ్యమైన వసంతవనం ఉగాదిజగం
మధువు మథనానికి మానవశక్తిధనం ఇంధనం
వేము వెతల విషం తీయదనం తీరు పర్వానికివరం
పలుకు పులకరింత పులుపు పూర్ణజీవన మలుపు.

మనసునిండి మహిని నిండని మానవత్వమునకు
ప్రకృతి పరవశించి ప్రపంచీకరించేది ఉగాది.

638

యుగాలకు ఆద్యంతాలకు జగత్తులో ఉగాది ఆరంభసూచకం
అంతానికి అంతం ఆరంభమైతే ఆరంభ సంరంభం ఉగాది రభసం
గతానికీ వర్తమానానికీ కాలమానంలో అవమానం తప్ప అభిమానం లేదు
లక్ష్యం లక్షణానికి ఆధారమైతే లక్ష్యం లేని ఉగాది పర్వాలు ఎన్నెన్నో
సింగారించని సిద్ధాంతం సిగ్గును చిదిమేసుకొన్న జగత్తులో ఉగాదిమిథ్య
మాతల తలనరికే రాముల అంతరంగాలు అభిరామమౌతున్న రోజులు
పురాణాల పుంతలో పయనించే వింతతీరు భాగవతుల భాగవతం
ప్రకృతి పురుషులు పరస్పరం పారవశ్యం చెందే పావన క్షణం ఉగాది

పరమార్థ స్వాదుత్వానికి స్వార్థ చేదుతత్వానికీ పులకరించే పులుపు ఉగాది
త్రిగుణాతీత జీవుని జీవితానికి వత్సరాది వరపైన మార్గగామి ఉగాది
భాషలకూ, భావాలకూ, రసాలకు ఆలంబనమై ఆరంభానికి అందం ఉగాది
వగాదులు లేని వలపుల పునాది మానవతాభావాల మార్దవానికి మధురాది
వత్సర వాత్సల్యానికి నాంది ఆరంభానికి అందివచ్చే అందాల స్వాగతాది ఉగాది
కొలతల్లేని కోమలత్వం కొలువుతీరిన ప్రకృతికి కొలత ఉగాది
కోట్ల జీవుల కొత్త ఆనందాల ఆరంభానికి కాలమిచ్చిన కొలమానం
ప్రకృతి చిత్రాల చైత్రానికి చెలువం చేకూర్చే చైతన్యభావన ఉగాది
చలితో ముడుచుకొన్న ప్రకృతి శివరాత్రి జాగరణతో మేల్కొంచి ఉగాది ఐంది.
జీవనానికి ఆరంభం పుట్టుకయితే అంతం మరణం రెంటికీమధ్యరేగే కోర్కె ఉగాది
ఉగాదులు ఉషస్సులులేని జీవితాలకు నిత్యం జీవన్మరణ సమస్యలేగదా
సమస్యలతో సతమతమయ్యే జీవుల వేదనాభరిత జీవనం ఉగాది కందనిది
ఆగిపోని జీవన చక్రంలో అంతరంగాలకు అందే ఆరంభసంరంభం ఉగాది
అంగాలన్నీ సక్రమంగా ఉంటే ఉగాది అంతరంగానికి సుముఖమైనదే.
ఆకటితో అలమటించే అభాగ్యులకూ అన్నార్తులకూ అవసరంలేనిది ఉగాది
ఆరోగ్యానికి ఆమడదూరమైన బతుకులకు అనారోగ్య కరమైనది ఉగాది.
సమత మమత పంచే సామరస్య హృదయాల్లో సాధనశక్తికి ప్రతిరూపం ఉగాది.
అస్తవ్యస్త అవ్యవస్త వ్యవస్థ ఐన తీరులు ఎన్ని యుగాదుల ఫలం
మారని మానవనైజానికి మతిమరపులో ఎన్నియుగాదులు పోయాయో
దోపిడి యుగాలు మానవత్వం మరుగైన యుగారంభాలు ఎన్నెన్నో
మారణకాండల అమానుష ఉగాదులు మరెన్నో మనిచనినాయి
క్రిందటి యుగాదికి ప్రభుత్వమంటూ ఒకటుంటే నేడో అదొక చిత్రం
మోసాలు మోదుగపూలై పూసి కాచిపండి కుళ్ళియుగాదుల్లో కలిశాయి
నవమాసాలుమోసి కన్న తలిదండ్రుల గుర్తుంచుకోని యుగాదులెన్నో
యువకుల ఆశల ఉగాదులు ఆవేశపు అగ్నిలో దహనమౌతున్నాయి
పేలవమైన జగత్తులో ప్రేమనిండిన ఉగాదుల ఉనికి నామమాత్రమే
గాలివాటానికీ గానుగెద్దు సంస్కృతికీ నిలయమైన ఉగాదుల పరంపరలు
అందరికీ అందాల్సిన అవసరాలు కొందరికే పరిమితమైన ఉగాదులెన్నో
ఆరుగాలం శ్రమించి ఫలితం అందక ఆత్మస్థైర్యం కోల్పోయిన ఉగాదులెన్నో

కర్షకుల కృషిఫలితం అప్పుల ఆత్మహత్యల నిండిన ఉగాదుల వైనం
ఐదు ఉగాదులకు అవతరించాల్సిన ఓట్ల పండగ ఒక్క ఉగాదిగే ప్రత్యక్షం
ధనంమయమైన ఎన్నికల గుణం పూజ్యమయిన ఓటర్లకిది ఉగాదేనా
మార్పు సహజమైన లోకానికి యుగాదులు మారినా మారని అవగుణాలు
తెలుగువత్సరాది తీపి గుర్తులకుమారు చేదు అనుభవాలిస్తున్నది.
ఒకనాటి సామాన్యుడు వెన్నుపోట్లతో మరోయుగాదికి ముఖ్యమంత్రి
ఓట్లు, పోట్లు, పాట్లు వరుసగా యుగాదిని నిర్వీర్యం చేసినీరుగారుస్తున్నాయి
గతానికీ నేటికీ పోలిక పోలిమేరలవరకు వెళ్ళినా కనబడని ఉగాదులివి
ఉగాది పర్వాలెన్నయినా ఊరుమ్మడి బతుకుల వ్యథలు వెలుగు చూడనివే.
పెరిగే జనాభా గడిచే యుగాదుల్ని గణిస్తూ గుణిస్తూ గహనంలోనికి గమిస్తున్నది.
వనరులవినియోగం మాట విధిరాతగా సరిపెట్టుకొన్న యుగాదుల పరంపరలెన్నో
పాత ఉగాదికి పంటల ఆనందానికి పదనుపెడితే యీ యుగాది అందుకు వ్యతిరేకం.
మానవత్వం మారే ఉగాదుల కనుగుణంగా మారిపోతూ దానవత్వానికి దగ్గరయ్యింది.
ఆశనిరాశలమధ్య ఆశయరహిత నరునికి ఉగాది వివేకాన్నిస్తుందా?
మరచిపోయే మనసుల మనుషులకు ఉగాది జ్ఞాపకశక్తి ప్రసాదిస్తుందా?
మంచినిమరచి చెడును గుర్తుపెట్టుకొనే నరునికి ఉగాది నయమిస్తుందా?
కంచానికీ కలిమికీ కానికాలం దాపురించి నపుడొచ్చే ఉగాది కలికాలానిది
డెబ్బై ఉగాదుల స్వర్ణభారతం కాలే కడుపుల కథలకు ఊకొడుతున్నది.
స్వాతంత్ర్యోత్సవాలకు ఊదరలో ఉన్నవస్త్రం లేచిపోయే స్థితికి నేటి ఉగాది దర్పణం
పూరిదైనా పెంకుటిదైనా ఇంట్లో ఉండే సూర్యుడు వేధించే బాధించే వెతల ఉగాది
స్వతంత్రం వచ్చి స్వరాజ్యం రాకపోయినా రామరాజ్యం వస్తుందనే ఆశతో ఉగాదులు పోయాయి
గాంధీజీ గ్రామరాజ్యానికి వినోభాజీ భూదానానికి ఉగాదే అంతం ఆరంభం
మంచినీరు అందని పల్లెలు మాన్యుల పాలనలో మరో ఉగాదికి శంకుస్థాపన ఫలకం
దారిలేని గ్రామాలకు దయనీయంగా నడిచివెళ్ళేవారికి ఉగాది ఆశాకిరణం
ఉగాదికే ప్రారంభం స్వర్గం తెచ్చి భూమ్మీద పెట్టించే యత్నంలో రాళ్ళేయటం
భాషా భామకు ఇంగ్లీషు అందాలు దిద్ది మురిసిపోయే రోజు మన ఉగాది
కొనకుండా వచ్చే కవుల కవిత్వ సమ్మేళన మేళాలతో ఉగాదికి మళ్ళీ పెళ్ళి
ఎండిపోయే పంటలు బోసిపోయే పల్లెలు నీళ్ళు లేని నదులు ఉగాదికి నకళ్ళు
పథకాల వెల్లువ కాగితాల్లో పారిపారి ఫైళ్ళలో అడ్డుకట్టవేయబడి ఉగాదికి దుమ్ము దులుపుతారు.

666

తెగులుపట్టిన తెలుగుకు ఇంగ్లీషు వైద్యంతో బాండేజీలు కట్టే ఉగాది
కంప్యూటర్ కథలు కంపుగొట్టే హృదయాలకు జ్ఞాపక శక్తినిచ్చే నవ్య ఉగాది
అభ్యుదయంలో అందకుండాపోయిన ప్రగతికి ఆనవాలుగా ఉగాది భూమిపై వాలింది.
రాజులు రాజ్యాలు పోయినా ప్రజాప్రతినిధి రాజుల రాజశాసనానికి ఆరంభ గీతం ఉగాది.
విద్యనభ్యసించకపోయినా పరీక్ష పాస్‌చేసే ప్రయోగానికి అవధి ఉగాది
హక్కులు అనుభవిస్తూ బాధ్యతలు తెలియని భావి పౌరులకు భవబంధం ఉగాది
సేవకు సేదదేరటానికీ తేడాతెలియని తెంపరుల ప్రజాస్వామ్యానికి ఉగాది
మారణహోమం, మాదకద్రవ్యం, మానవాళి వినాశనానికి పరచిన పట్టువస్త్రం ఉగాది
దౌర్జన్యం శాశించే దశలోనున్న సమాజ జీవనానికి ఆహ్వానం పలికిన ఉగాది
దుష్టత్వం కనుసన్నల్లో బతికే మానవ జనశిష్టత్వానికి చెల్లుచీటీ ఉగాది
మానవత్త్వం మైమరచిన భూమికి మందు కనుగొనే మానవనేత మన ఉగాది.

639

జనబలహీనతల్ని పెట్టుబడిగా పెట్టి ప్రతిఫలాన్ని ప్రతినిధులు పొందుతున్నారు
ప్రజల్ని నాయకులు మోసగిస్తే రాజకీయపుటాటలో నాయకులు నాయకుల్ని మోసం చేస్తున్నారు.
ఎన్నికలముందు జనానికీ ఎన్నికల వెనుక నాయకులకు నామం పెట్టడం
వర్గరహిత సమాజానికి వర్గాల మధ్యపోరుపెట్టి విజయం సాధిస్తున్నారు
లౌకికవాదం లౌక్యవాదానికి అడ్డుగోడగా ఆకాశాన్నంటుతున్నది
అమాయకులను మాయచేసే మాయికుల మధ్య నలుగుతున్న మానవత్త్వం
రాజనీతి విడిచిపెట్టి రాజకీయాన్ని పట్టుకొని నాయకులౌతున్నారు
రాజకీయ వేత్తలు నాయకుల్లో నశించి దగాకోర్లు ధరిత్రి నిండారు
ఇష్టంలేని పెళ్లికి ముహూర్తంలా ఎన్నికలు ఇరకాటంలో జనసమూహం
వచ్చిపోయే ఎన్నికల్లో లెక్కలు ఒరగబెట్టిందేమీ లేదనే జనుల తీర్పు
తృప్తిలేని జనానికి అసంతృప్తిని నాయకులకు మిగిల్చే పద్ధతి పెరిగింది
పెట్టుబడిలేని రాజకీయం భారీ పెట్టుబడి పరిశ్రమగా మారుతుంది
ఫలితాలు ఊహించినవే అయినా పద్ధతులు మాత్రం విలక్షణం
అనుభవించిన అధికారం అసంతృప్తిని రగిల్చి అమాంతం పడదోసింది
పెట్టుబడితో కొనుక్కొనే పదవులు ప్రజాసేవకై పరితపించిపోతున్నాయి
జాతి నీతి దప్పటానికి నేతలొకనాడు కారణమయ్యారని విన్నాం
నేత నీతి దప్పటానికి జనత కారణంగా భావించే జనులున్నారీనాడు

జనత నీతివంతం కావడానికి వ్యక్తుల అవగాహన విచక్షణ అవసరం
వ్యక్తుల అవగాహన లోపాన్ని సరిదిద్దే నీతివంతమైన నేతలు అవసరం
విశిష్ట వ్యక్తుల సమాహారమైన వ్యవస్థే వింతపోకడల పోతున్నది
జనసేవను తరించాల్సిన నేతలకు నియమాలు కరవై పోతున్నాయి
కాలచక్రగమనంలో మంచి అనేపదం సాపేక్షమయినప్పుడు సంగతేమిటి
మతం మతగ్రంథాలు ఆధారమై మనిషిని మంచిపథంలోకి నడుపుతాయి
మనిషి తనలోని తపననువీడి తాలిమిని వహించాల్సిన అవసరముంది
వ్యక్తి ఆత్మస్థైర్యంతో వ్యక్తిత్వ శోభితుడై వెలుగు ప్రసరింపజేస్తే జగమే వెన్నెల.

640

ఎన్నికల భారతం కలలు కనీకనీ కలవరింతలమధ్య కాంతిదప్పుతున్నది
సంఖ్యాబలం ఏలికల పాలనాధికారాన్ని నిర్ణయించే ఎన్నికల గతిఏమిటి?
పార్టీస్వామ్యం పరాస్తమైనపుడు పాలితుల మనోవాంఛకు ఫలితం కన్పిస్తుందా?
రాష్ట్రం – కేంద్రం పరస్పరం అద్వైతంగా పార్లమెంటరీ స్వామ్యం వర్ధిల్లుతున్నది
పార్టీలు రాష్ట్రంలో కేంద్రంలో ద్వైత తత్త్వంతో దోబూచులాడుతున్నాయి
సిద్ధాంతాలు చిగురుల తొడిగే మోడు దశలో విశిష్టాద్వైత లక్షణాన్ని పొందుతున్నాయి
తత్త్వాలకు, మతతత్త్వాలకు కొదువ లేని భారతం ఎన్ని పోకడల నైనా పోతుంది
సమర్థించుకొనే తప్పులమధ్య ఒప్పులకు స్థానం లేని వింతపోకడల పాలన
పరస్పర మిత్రులూ శత్రువులూ లేని రాజకీయంలో ప్రజలే పరస్పర శత్రువులు
సర్వత్రా అవినీతి తాండవించే పార్టీల పాలకుల వైనం ప్రజలకు గిట్టనిది
అవిద్య, అవగాహన లోపం ఆశల ఆధిక్యత పాలక పాలితుల మధ్య ప్రతిబంధకాలైనాయి
అరిగిపోయిన రికార్డుల్లాంటి రాజ్యాంగశాసనాలు కొత్తటేపులపైకి ఎక్కించాలి
ఆయుధాల్ని చేతిలో ఉంచుకొని అధమత్వంతో ఎదురుచూచే దుస్థితి ఓటర్లది.
ప్రయోగించిన ఆయుధం ఫలితాన్నివ్వని స్థితిలో శక్తిహీనమై చేవదప్పుతున్నది.
ఎన్నికలాటలో క్రీడాస్ఫూర్తి కొరవడి నేరవృత్తి నర్తిస్తూ నరుల్ని వేటాడుతున్నది
ఆటగాళ్ళు మారుతున్న ఆటలో జయాపజయాలు నియమరహితమైనది.
ఆటవికత గెలుపోటములను గమనించలేని గాథగా మిగిలిపోతున్నది
సామాన్యుల మాటలకందని మార్మికత రాజకీయనాటకంలో విరాజిల్లుతుంది
భిన్నధృవాలు ఏకమై ప్రళయ సదృశరాజకీయ దొంగాటకం ప్రజ్వరిల్లుతున్నది
అవినీతికీ అధమత్వానికి ఆదిగురువుగా హిందూదేశపాలన హీనమౌతున్నది

సర్వసంగపరిత్యాగుల నిలయం కావలసినది సంగ సంగతుల్ని వల్లెవేస్తున్నది
అయినది నాది కానిది అందరిదీననే ఆశయ అధముల అభిభాషణ అందగించిందీ
పాతరవేసిన తాతలనాటి నీతిని త్రవ్వితీసే సమర్థులు పాలికాపులై రక్షిస్తున్నారు
మహాత్ముని వారసులమని చెప్పుకొనేవారు మాన్యతవీడి ఆత్మోద్ధరణపరాయణులైనారు
వల్లెవేసే నీతుల వరుసతో నీతిశాస్త్రాలు నివ్వెరపోతున్నాయి యీదేశంలో
తలకెక్కిన తిక్కదిగేంతవరకు తమదే ఆధిక్యమనుకొనే వారికెపుడూ చుక్కెదురే.
నిలవడానికి జాగాలేని నీతి నిరంతరకాలగమనంలో నిర్ణాయక పాత్ర వహిస్తుంది.

641

వాగ్దానాల ఒయాసిస్సు వట్టిపోయింది
ఆశయాల ఆకాశగంగ అమరంలో కలిసింది
జ్వలించే చైతన్యం బడబాగ్నిలా బయటపడలేదు
రాజకీయ సాగరమథనంలో అమృతం అందరికీ అందలేదు
జ్ఞాననేత్రం విప్పారేదశలో విలువల కనురెప్పవిగతజీవమైనది
గెలుపోటముల రాజకీయపుటాటలో ఓటమి ఆయుధం వదలిన వానిదే
నియంత్రణ లేని నియమాల ఆటలో ఆటగాళ్ళు నిమిత్తమాత్రులు
ఆటనియమాలు మార్చితే తప్ప ఆటంకాలు తొలగిపోవు
దాహం తీర్చలేని కోర్కెల బావినీరు కలుషమై వ్యాధి మూలమైంది.
కాలానికి కనిపించని కర్మవైరాగ్యం సోమరితనాన్ని ప్రసాదించింది
అనంతమైన విశ్వం అంతుచూచే మానవ మేధ అలిసిపోయింది
విస్తరిస్తున్న విశ్వం విలువల వర్తనలో విగతజీవమైంది.
కలిమికాటేస్తున్న లేమికి కాలం నిలువ నీడనిచ్చి రక్షిస్తుంది.
ఫలితం కోరని ప్రకృతి ఫలాలు అందుకొనే పురుషుడు కోర్కెల కాసారం
విశ్వాంతరాళ శక్తికి జీవశక్తి తలలువంచి తపించి తరిస్తుంది.
అహం అద్దంపట్టే అంతరంగాలకు అర్థం ఆజ్యం పోస్తుంది.
కలగా మిగిలిన ఎన్నికల కల కలకలంరేపి అదృశ్య దృశ్యమైంది.
దయకు ధరిత్రి దాక్షిణ్యాన్ని ప్రసాదిస్తే సహనం మనిషికి సామర్థ్యాన్నిస్తుంది.
నీతిని నిందించే మాటలు నీరవమై అవినీతిని అభినందించే విధిని నిర్వహిస్తున్నాయి
కర్మానుసారిణి బుద్ధి కరువుకాటకాలతో కామితాన్నందిస్తుంది.
రాజకీయాల మంచినీటివాగులు అవినీతి సంద్రంలో కలిసి ఉప్పగా అయినాయి.

చీకటితరిమేసే కాంతి చింతనలేని అర్థచింతతో వ్యర్థమౌతున్నది
పగటిని పాలించే సూరీడు పాలనలో కనలేని చీకటి చర్యలతో చింతిస్తున్నాడు
ఆశల అంగడిలో ఆశయాలు అమ్ముడుపోయే వస్తువులైనాయి
నాశనానికి దగ్గరగా నడుస్తూన్న జీవాళి రక్షణ కవచాన్ని చించివేస్తున్నది.

642

**పుస్తకాలు విజ్ఞాన సర్వస్వాలైతే మనిషి నడిచే నిఘంటువు కావాలి.**

శబ్దార్థాల చేతనత్వం మనిషి జీవనానికి చైతన్యం ప్రసాదిస్తుంది
అర్థం తెలియని చదువు వ్యర్థమైతే వ్యర్థంకాని శబ్దం మనిషికి వేదం
రాశీభూతమైన జ్ఞానం గ్రంథాలయమైతే ఉపయోగించుకొనే మనిషి ఉన్నతుడు
మంచిమిత్రుడైన పుస్తకాన్ని అవగాహనచేసుకొంటే మనిషి అమరుడే
శబ్దానికి అర్థంచెప్పేవి నిఘంటువులైతే విజ్ఞానాన్ని తరియించేవి పుస్తకాలు
పంచేంద్రియాల కతీతమైన జ్ఞానం మనిషి అవగాహనకు నిదర్శనం
ప్రకృతిని మధించే మేధల పరిశోధన ఫలితాల పరమార్థం గ్రహించాలి
విశ్వాన్ని మర్శించి వివేకంతో రహస్యశోధన చేయుట నరుని కర్తవ్యం
సృష్టి సర్వస్వాన్ని దాచిఉంచే సారస్వతం రసజ్ఞులకు ఆనందాన్నిస్తుంది
తత్త్వవేత్తల పరిశోధనలో తరించిన విశ్వరహస్యం తెలుసుకోవాలి
చినిగిన బట్టయినా వేసికొని ఒకమంచి పుస్తకాన్ని కొని చదవాలి
వేదాలు, పురాణాలు, కావ్యాలు, చరిత్రలు చదివి అర్థంచేసికొంటే గొప్పతనం
సమస్యలు సమాధానాలకు అనుభవం అవగాహన అర్థం కల్పిస్తాయి
పుస్తకాల గురువులు మనిషివర్తనలో పరివర్తన కలిగిస్తాయి
అమృతతుల్యమైన ఆనందాన్నిచ్చే ఆలోచనలను కల్పించే కావ్యం గణ్యం
చరాచరసృష్టి రహస్యాలు నిండిన పుస్తకాలు మనిషి మేధకు పదునుపెడతాయి
కంప్యూటర్ల కాంతిలో గమించే మనిషి మేధ అమోఘం అమేయం.
నిరంతర విద్యార్థి నియతమైన జీవనానికి పునాదివేసికొంటాడు.
ప్రశ్నలోనే జ్ఞానమున్నదని దానికి సమాధానం అభ్యాసమేనని తెలియాలి
నిన్ను నీవు తెలిసికొనేది జ్ఞానమైతే నీమాటచేత దానిని విప్పిచెబుతాయి.

643

అమ్మదనానికీ కమ్మదనానికీ అతివ ఆనందనందనం

సృష్టికడుపులో సూక్ష్మం తొమ్మిదినెలల తొలకరిలోపులకరింత.
ప్రణయం, ప్రళయం, పావనత్వం స్త్రీత్వానికి త్రిగుణాలు.
'ఈవ్' అయినా 'మరియ' అయినా 'దేవి' అయినా అందనికాలాల అతివలే
నాగరకతల గరితగా సౌకుమార్య సామరస్య సహనాల మూర్తి ఆమె.
కాంత కావ్యరూపంగా సారస్వతమై సర్వస్వాన్ని ఆవరించింది.
అరిషడ్వార్గలకు శతృవై ఆరువిధాల స్త్రీత్వం అవతారాల మార్చింది.
పురుషవాద స్త్రీవాదాల నాదాలన్నీ మానవత్వంలో మగ్నం కావాలి.
మాతృత్వ మమకారాల మనసులు సాకార స్త్రీమూర్తిని స్వాగతించాలి.
నిష్కామకర్మకు నిలువెత్తు సాక్ష్యం స్త్రీమూర్తి మాతృత్వం.
మంచిగర్భాన జనించడం, మంచిబిడ్డలకు తల్లికావడం స్త్రీకి వరాలు.
తాను కృశించి నశిస్తూ పరవశించే పాలిచ్చు అమ్మ అమరమే.
పతివ్రత అయినా పతనమైన విలువల గతాన్ని పరికిస్తే ప్రాభవమే.
వెచ్చని అమ్మఒడి వెతలు వెలసిన వెలుగుల జడి.
లాలిజోలపాటల లహరిలో కష్టాల కడలి గమించే గరువం.
మమతకూ మంచికీ ఆదిగురువై మరుమల్లె జీవితానికి మార్గదేశికం
ముద్దు మురిపాలకు మూల గురువై మూలానికి మూలమైన మురిపెం.
మానవ జీవన మధురరాగానికి సరిగమల సంగమం
వ్యాపార సంస్కృతిలో వరకట్న కర్కశత్వానికి వాసి వెలసిన వనిత
యాంత్రిక జీవనంలో గృహయంత్రమై అరిగి కరిగిపోయే అతివ.
ఆరంభానికి ఆది అంతానికి వింత అబల సబలయైన రూపం
పంచేంద్రియాలకు తృప్తి పరమానందానికి జ్ఞప్తి.
వీరత్వానికి విలువ దీనత్వానికి దిగుడుబావి.

644

అందానికి దీప్తి ఆనందానికి మూర్తి అంతరంగానికి స్ఫూర్తి.
కలలగమనానికి కమ్మనికాంతిరేఖ నిజానికి నిలువుటద్దం.
పురుషత్వానికీ స్త్రీత్వానికీ పురుడుపోసే పునీత మానవత్వం.
స్వాదుత్వానికి అసాధారణ తత్వానికీ కరతలామలకం.
సిగ్గుకూ, సింగారానికీ ఆదిమధ్య అంతాలు ఆవిడే
వినయానికీ సహనానికీ విధిచేతకు తలవంచిన తరుణి.

పురుషాధిక్య సమాజానికి ఆటవస్తువు అసూయకు ఆర్ణవం
మనుధర్మంతో మరిగిన మనసుతో మార్గంవెదికే మహిళ
సంసారానికి సారవంతమైన క్షేత్రం పర్యావరణంతో పంకిలం.
మాతృస్వామిక, పితృస్వామికాలు పాలక స్వార్థులు కల్పించిన స్వామ్యాలు
సంఘాన్ని ఆధిక్యం అధమత్వాలతో విడదీసే వ్యవస్థ మనకొద్దు
నీ అమ్మ తెచ్చిన కట్నానికి విలువ కడితే నీకు నీవు విలువ కట్టుకో
అన్ని అనర్థాలకు మూలం ఆవిడ కావిడే అనేమాట అసత్యం చేయాలి.
ఇంటికి పరిమితమయే ఇల్లాలు సంసారానికి స్వాదువు సాధువు
అహంకారం అసూయ సబలను అబల చేసి ఆడిస్తాయి
రాజ్యాలేలినా రాజుభార్యలైనా పదుగురికి మంచిని పంచాలి
వివాహం విచక్షణకే వదిలేస్తే వనిత విలువ వినూత్నం
ద్వేషంలేని అన్యోన్యప్రేమల అమరాన్ని సృష్టించుకోవాలి.
ఆత్మహత్యలు పరిష్కారానికి మార్గాలు కావని గ్రహించాలి
ఎదిరించే తత్త్వం ఎదుగుదలకు సోపానాలై ఎదలు నిండాలి
విచక్షణ, వివేకం, జీవ సంస్కారానికి జిలుగు వెలుగులౌతాయి
అవగాహనాక్షమత్వం అంతరాలను అవనతం చేస్తుంది
వ్యక్తిత్వం వెలుగొందే దివ్వెలుగా స్త్రీపురుషులు రూపొందాలి.

645

తెలుగుదనం వెదజల్లిన తేజస్సు ఉగాది ఉషస్సు
వత్సరానికి నాందివాక్యం వార్ధకస్వామ్యానికి భరతవాక్యం
లంచం తీపిని తినిపించే పచ్చడిలో చేదుకు స్థానం పూజ్యం
అనుభవాలు మిగిల్చే చేదురుచులకు చెలిమి మనిషి జీవితం
శరీరసౌష్టవానికి కొత్త జీవితం అందించే ఆరోగ్యం
కలలో తియ్యదనాన్ని రగిలించి ఇలలో చేదును మిగిల్చింది.
పురాణాలు చెప్పినా పూజ్యమైన నీతివర్తన పునాది కోల్పోయింది.
వేదాలు వల్లించినా తీరని వేదనలు కొత్తవత్సరానికి ప్రత్యక్షం
కావ్యాలు కాంతల కాంతులు వెదజల్లినా జీవితాలు అంధకారబంధురం
వత్సరం కోసం ఎదురుచూచే నయాదళితుల కందే పథకాల ఫలం
తెలుగుల తెగువకు తెంపరితనానికి తెరమరుగైన తేనె ఉగాది

672

హోరెత్తే వాగ్దానాల తీపి చేతలరుచితో చేదు అనుభవాన్నిస్తుంది
కాలం కాలుజారిన ఉగాదికి కలకాలం కలిమి కాలమనే ఆశ
ఆశయాల ఎండమావుల్లో అవతరించే ఉగాది తీయని భ్రమ మిగిల్చింది.
యుగయుగాల గతానికి ఉర్విలో నిలచిన వర్తన నర్తన ఉగాది.
మామిడి పిందెలు మాడిన మమతలకు నిదర్శనమై దర్శనమిచ్చిన ఉగాది
వేపపూత వెతలలోబడి వెలుగు దప్పిన తల్లిచెట్టు ఆవేదన ఉగాది
ప్రభుత్వాల పతనానికి ఎన్నికలలకూ కలలో కనబడే ప్రభుతల యుగాది
సిద్ధాంతాల చిరునవ్వులు మాసిన పాలనలోని పచ్చదనానికి ఉగాది
రంగులు వెలసిన రాజకీయ నీతిశాస్త్రానికి రంగులు వేసే కొత్త వత్సరం
పంచేంద్రియాల పరమార్థాకాంక్షలు ఫలాన్నందించాలనే ఉగాది ఊహ
నిష్క్రియాపరత్వానికీ, నిష్కామకర్మకూ భేదాన్ని చాటిచెప్పాల్సిన ఉగాది
కొత్తను కోరే కోమలతత్వానికి పాత అందించే మూడు రుచుల ముచ్చట.

646

ఆలుమగల అనుబంధం అమరిన యీ సంబంధం
ఆశదీర్చు అనురాగము అవనిలోన ఆనందం
బావగారి భాగ్యమైన భామనవ్వ నాగరకము
వధువు వలపు తలపు తెలియ వరుడు నరుడు వాసిగాంచు
ఆడదేమో ఆడదనుట అలనాటిది నేడుకాదు
అత్తయింటి పుట్టినింటి అందమంత ఇనుమడింపు
వరకట్నము వాసివెలయ వరుని తీరు వంట ఇల్లు
మగమనిషికి మనసులేక కాంక్షసేయు కలిమినిపుడు
చదువు ఫలము సంస్కారము సాగుజగము వరుల నింద
మామగారు మధురమగుట మనసు కలిమి మాన్యులగుట
అత్తగారి చిత్తమందు నిండు నిధులు వరుడు వధువు
సప్తపదీ సవనమందు సాగిమీరు మమతనిండ
జీవరాగమందుమీరు సరిగమలే పదనిసలే.
మంచిమించు మధురజంట సిరుల చిందు జీవనమున.
కాలమునకు కాంతినిచ్చు కథగసుధగ వెలుగునిచట.
గుణముగూడు వర్తనమున చదువుకూడు సంతసమున

రూపుగుడ్డ రుజలువీడ కలలనిండు కామితములు.
పేరువూరు తెలియనోళ్ళు ప్రేమపంచ పెరుగు జగము
మూడుముళ్ళు ముద్దుమాట మురిపెమగును మనసుకలుగ.
ఆత్మసాక్షి అగ్నిసాక్షి పంచేంద్రియ పరమసాక్షి
మగువ మనసు మగని మమత మాధుర్యము వెలుగు వెతల
రూకలేమొ రూపమునకు తూగవిచట తూలిపోవు
కాంతలేని కాంతిలేదు కల్పకమ్ము కలికిరూపు.
అమ్మగన్న నరుడవీవు నవలయామె నాణ్యతలకు
కన్నె కమల సదృశమ్ము వాడనీకు వలపు తలపు.

647

లౌకికం లౌక్యంగా లాభపడే రాజకీయుల రాజ్యాంగపు టెన్నిస్ ఉగాది
సామాజికం తరగని దారిద్ర్యపు సామజంలా జరిగే పాలన ఉగాది
సార్వభౌమత్వం సర్వం వారసత్త్వంగా అనుభవించే మహానుభావుల ఉగాది
ప్రజాస్వామికం ఇక చెల్లదని స్వార్థస్వాముల స్వారాజ్యమీ యుగాది
డెబ్బైనిండు వసంతాల దారిద్ర్యపుటానవాళ్ళకు యుగాదితో ఆరంభం
అరగని తిండిని కరగించే కఠోర కార్మికజనఘర్మజలానికి పునాది ఉగాది
అందగించే మందగమనపు పెట్టుబడిదారీ పెత్తందారీలకు మేలుకొలుపు ఉగాది
మంది బలానికీ మనీ మదానికీ అంతరువు నెరిగించే ఆంతర్యమీ యుగాది
బలంలేని ప్రభుతల నెన్నుకొనే బలవంతపు ఓటర్ల భావిగమనం ఉగాది
ఇష్టంలేని కష్టానికి ఇంపుసొంపుల నింపేకారుణ్యపు కథల సంపుటి ఉగాది
మృష్టాన్నం ముందున్నా ముద్దనోట్లో పెట్టలేని వ్యాధిగ్రస్త సమాజపు వెల ఉగాది
చేదుమాత్రమే చేవనిచ్చే చైతన్యపు పాలనలో తీపి గుర్తుల తిరునగరి ఉగాది
సుఖాల సూక్ష్మదర్శినికి అగుపించని కష్ట క్రిముల కలి సంహారిణి యుగాది
కష్టం కలిసిరాని కాలానికి కలియుగపురుషుని దీనాలాపన దివ్యమైన యుగాది
చరిత్రలో చెరగని మంచి ముద్రల్ని మన్నించలేని మార్మికతకు మార్గదర్శనే యుగాది
కనేదానికి వినేదానికీ అనేదానికీ కాలమిచ్చిన అవగాహనలేమి చెల్లుచీటి యుగాది
పెరుగుతూ తరిగిపోయే సమాజ మానవతా నైజమూర్తికి నిలువనీడ ఉగాది
సంస్కారాన్ని చావుదెబ్బ కొట్టే మనసులేని భారతీయ పౌరుల మాన్యత మన ఉగాది
కలిమిని కామించే ఆశపోతుల ఆధిక్యానికి అమరత్వం కల్గించే కల్పవల్లి యుగాది

పదుగురిదంటేనే పరమాధమమనే కాలానికి కళ్ళెం వేయలేని యుగాదులెన్నో
ఆశలు అందలాలనెక్కే మానవహృదయాల అసంతృప్తి జ్వాలలనార్పలేని జడివాన ఉగాది
అరుణోదయాన్ని కాంక్షించని అంధకార వాసులకు ఉగాది ఉషస్సు వెలుగిస్తుందా?
కష్టం ఇష్టంగామారితే విచక్షణమే విలువనివ్వని వింతతీరుల ఉగాది
కోపం మమకారంగా మారితే మార్దవరాహిత్యమై మధురిమ కోల్పోయే ఉగాది.
అందరి అంతరంగాలలోని అసమాన వాంఛలు తీర్చలేని అసంతృప్తి ఈ యుగాదిది.
ఓడినా గెలిచినా 'ఓగు' కేంద్రంగానే జరిగే వినూత్న ఆటలో విలువ వెలసిన ఉగాది.
మంచి గెలిచే మార్గంలో గమించే మానవత్వ మార్గదర్శకత్వం వహించే ఉగాదులు రావాలి.

648

అంతరాలు అంతరించాలని అవనిజనం విప్లవిస్తున్నది
తరతరాల దాస్యమంత తొలగిపోవాలని తపిస్తుంది జనత
మనిషి పుట్టుకకూ మరణానికీ మధ్యలో జరిగే విక్రియలే అన్నీ
తప్పులకు తిప్పలు తప్పవనే సమాజం తరిగిపోతున్నది
మెప్పుకోళ్ళు మెలకువలోనే ఇల్లు సర్దుకొనే స్థితిలో నేర్పరులైనాయి
అంతరంగం అంతరువుల కాలవాలమై అవనిగతిని అధమంచేస్తున్నది
మంచి సాపేక్ష మనుకొనే మానవులకు మానవత్వం మాట తెలియదు
కార్యాల కమనీయత కలిమికే పరిమితమై మితిదప్పి శృతిమించింది
హక్కులగళం ఆరున్నర శ్రుతిలో బాధ్యతల కంఠం బావురనే దిశలో
గౌరవించలేని మనిషికి గౌరవం పొందే అర్హత అసలే ఉండదు
పలకరింపులు పలకబారిన మనసులకు పులకరింతలు కల్గించలేవు
స్వార్థమే నాల్గుదిక్కులైన సమాజానికి అసలు దిక్కెవ్వరనేది ప్రశ్న.
దిగంతాలకు వ్యాప్తమై దివ్యమైన కాలుష్యానికి కత్తిరింపు కలగా మిగిలింది.
అరగొరగా మిగిలిన మంచితనానికి స్థానం కరువై కవితల్లో సంచారం చేస్తున్నది.
మేలుకొలుపు మేలిమిబంగారంలా మేధావుల కపాలాల్లో దాగి నిద్రిస్తున్నది.
అధములకందిన అధికారం వ్యధలకు నిలయమై అందర్నీ వేధిస్తున్నది.
ప్రయోగం తెలియని సిద్ధాంతంలా ప్రవచనాల్లో పవిత్రమైనది నేటిన్యాయం.
కరుడుగట్టిన కసాయి తనానికి మార్దవహృదయాలు మసిబారుతున్నాయి
హితంకోసం హింస అనే సూత్రంలో అహితాన్ని అందరికీ అందిస్తున్నారు
నశ్వరమైన నరజన్మకు నాజూకు నేర్పి నయగారం నిండించి అమరమని భ్రమిస్తున్నారు.

భూమ్మీద నిలవడానికి కష్టమై వింతలోకాలకు యానంచేస్తూ విస్తుపోతున్నారు.
మోసం మోసులెత్తే మధువనానికి పాలుపోసి పెంచే పరముద్రై ఫలరహితుడౌతున్నాడు.
మోహం మోదుగపూవులా మృదుత్వానికి మూలమై రాలిపోయి రహిపై బడుతున్నది.
మోడువారిన జీవితాలకు మోహింపజేసే కుక్క బిస్కెట్ల సబ్సిడీ సంగతి అధోగతి.
ప్రత్యేకతల ఫలితాన్ని పోగేసుకొనే నయాలక్షాధికార కుటుంబాల నాజూకైన కులగజ్జి.
ఆర్థికం అర్థవంతం కానిరోజుల్లో అర్థవిహీనులకు హార్దికం తప్ప వేరుమార్గం కన్పట్టదు.

ప్రజలసొత్తు ప్రసాదంలా పంచిపెట్టే పరముల పాలనలో ఖజానా బేజారే.
సృష్టించిన అల్లర్లకు పరిహారాలు అసత్యాల అస్మదీయులకు అందించే అర్థమే
సబ్సిడీల సంతర్పణలో బడ్జెట్లు మొగ్గలుగారాలిపోయే ప్రమాదాన్ని గ్రహించరు
సమానత్వ మానానికి చిల్లులు పొడిచే అభిమాన రాజకీయుల అమానుషగీతం.
భయపెట్టే నక్సలైట్ల బాగోతానికి తెరదించలేని ఆంతరంగిగ పోలీసు శాఖ ఆంతర్యం
చంపేవారికీ చచ్చేవారికీ సిద్ధాంతాల చింతన చీము నెత్తురులు లేనిదిగా తయారు
ధనవంతుల దౌర్జన్యాలూ దళితుల ప్రతిక్రియలూ ధరణి అంతంవరకు సాగే నిత్యనైజాలు.
నయారాజకీయ దేవతల సారథ్యానికి దాసోహమనే చరిత్ర మరచిన పార్టీల పరువం
లౌకికంలో లోకానికని మతం హతానికని భ్రమింపజేసి పదవిపొందాలనే ఆలోచన అవగమనం.
రాజులో పోయినా నయారాజుల జమానాలలో నాట్యమాడుతున్న సామాన్యుని మాన్యతా వేదం.
భూమిపై నదీనదాలనీటిని నష్టంచేస్తూ చంద్రునిలో నీటిని కనిపెట్టి సంతృప్తి పొందుతున్నారు.
శాస్త్రవేత్తల శస్త్రం మాటదప్పే రాజకీయుల మౌనవ్రతానికి అస్త్రమై విప్లవించాలి.

ఎన్నోకనిపెట్టిన వేత్తలు మానవ మెదడులో స్వార్థప్రదేశాన్ని కనిపెట్టి తొలగించలేక పోతున్నాడు.

అహరహం శ్రమించే అభాగ్యునికి అన్నమందని అధమాధమ పాలనలోని అనుభవ రాహిత్యం.

దురాశనీ నిరాశనీ దూరంచేసే సదాశయానికి సన్నద్ధులైనవారు మానవులుగా ఉండరు.

గెలుపు గుర్రంపై స్వారిచేస్తూ రాదారిపై గుంటమెట్టల్ని గ్రహించలేకపోతే అధఃపతితం కావాల్సిందే.

నిజాయితీ నిగమనమై నీతిచతికిలబడే సమయంలో నిధులే పెన్నిధులై పెంపుమీరి పతనమౌతాయి.

పాలకాధ్యుల ప్రాభవం పదుగురికి ఫలాన్నందించే దిశలో గతిదప్పిగహనంలోకి పయనిస్తున్నది.

అనంతాకాశానికి అంతం కనిపెట్టలేని మానవుడు ప్రకృతికి అమాంతం శత్రువౌతున్నాడు.

అనుక్షణం చచ్చిబతికే అవగాహనలేని మానవుడు భవిష్యత్తును అవలోకింపలేకున్నాడు.

మతాలతో సతమతమై కులాలతో కూలబడుతూ తానేమిటో తను తెలిసికొనలేకున్నాడు.

వ్యక్తిత్వం వ్యక్తమయ్యే మనుష్యుని శక్తియేకాని ధనంతో కొనబడే వస్తువసలే కాదు.

మంచి మనుగడకు నోచుకొనకపోయినా గతించిన చరిత్రలో గణ్యమైనదిగా నిలుస్తుంది.

చెడు చెలాయించే పెత్తనం వేగం విశ్వంలో విస్తరించిన వింతలా విసువు కల్గిస్తుంది.

మంచినడవడిమాత్రమే మనుగడకాదు, చెడును నివర్తించే చేవ శక్తిమంతం.

మానవత్వం మరచిన మహదాశయులు కోకొల్లలు, ఆశయమంటే అర్థంతెలియని వారువారు.

ఇబ్బందుల బంధాలను ఛేదించుకొని హితమతులుగా వెలుగొందే మానవాళి మనదికావాలి.

నేడు చెడుమంచి అయినా ఒకనాటి చెడు నేడు మంచి అయినా మంచి మానవత్వం చెడుదానికి వ్యతిరేకం.

649

తే.గీ. మహిళ మాన్యత దెలిసిన మహిళలంత – అబల సబలను జేయగ అవనిలోన
కూడి మాడగ సభలను కూర్చగాను – ఫలము లేదిట మార్పుల భవితలేక.

సీ. తల్లిగ చెల్లిగ తరుణిగ ధరణిని, వెలిగిన వెలుగాయె వెతల గుమిలి
అత్తగ అక్కగ అవనికి అందమై, మెత్తదనముగల్గ మెలగె జగతి
భార్యగ లక్ష్మిగ భవితను పండించ భారమ్ము మోసిన భాగ్యదాయి
ఇల్లాలు రంభగ ఇంపైన జీవిగ సంసారమున సాగు సారమహిత.

గీ. సృష్టి మూలము సూక్ష్మము సుందరిగను – సహన వహనాన సాగెడి సద్యశమ్ము
మాత మార్దవ మూలముమహిళ మధుర – విశ్వవెలుగగు వినుతుల విలువ మగువ.

సీ. మగవాడి మహిమకు మగువయె మూలము – మగనాలు మాన్యము మాతవలపు
యువకుల చిత్తాల యూర్జిత సత్యమ్ము – ప్రేమల హృదయాల ప్రేరకమ్ము

పసివారి మనసుల పసనిండు పాలన – పరువము గరువమ్ము ప్రాధమికము
పురుషుని తోడుగా పూజ్యమౌ సుఖమున – భువినిండు మమకార భువనమాయె.

గీ. మహిళలందరి మనసులు మార్దవములు–మహికి మాన్యము మాతలు మధురముగను
చిన్నచూపున చూడగ చింతగలుగు – ప్రేమమీరగ పెన్నిధి పేర్మి నవల.

సీ. లావణ్య లాలిత్య లహరియై లోకాన – లాలనయందున లయము లలిత
రాగాల భోగాల రాజిల్లు భాగ్యమై – అనురాగ అవనికి అందమామె
మమకార మాధురి మహినిచ్చు మధువుగా – రసనకు రుచులిచ్చు రసన రమణి
బంధాల అనుబంధ భారతి భావమ్ము – భవమును పండించు భాగ్యభామ.

గీ. స్వార్థ రాహిత్య శోభల సార్థకాఖ్య – చలువనిచ్చును జన్మాన చచ్చిబతికి
అవని సహనమునందిన అబలతాను – సబల విధమున సాగగ సమతవెలుగు.

సీ. అనురాగమందించి అమ్మయె అవనికి – అధికారి విధమున అతిశయమ్ము
మగవారు మహిళలు మహిలోన నొకటిగ – మసలిన విశ్వము మధురమగును
మనువాద స్త్రీవాద మలినముల్ వీడగా – పురుషులు స్త్రీలును పూజ్యులాయె
నవ్యత నవలల నాణ్యమౌ వర్తన – భారతి నయనాల భాసమగును.

గీ. మహిళ మధువును మగవారు అందుకొనగ–మగల అనురాగ మందగ మహిళమాన్య
మాన్య విశ్వాన యిరువురు మహితయశులు–యశము భృశముగ విశ్వము యవ్వనమ్ము.

సీ. గృహసీమ వెలుగొంద గురువుగా పరువుగా గుడికిని బడికిని గురుతు తాను
ఇంటింటి మహలక్ష్మి ఇంపొందు హితమతి సంఘాన సహితమ్ము సాగు జగతి
రక్తమ్ము పంచగా రహిమించు రాణిగా పెంచిపోషించెడి ప్రేమమూర్తి
అర్ధాంగి అర్థమై మగనికి మాన్యమై సంసార పంటల సారసహిత.

గీ. అమరమును చేయు అవనిని అతివ తాను – నరకనాయకురాలగు నవలతాను
ప్రళయసృష్టికి స్రష్టయె పతిత పడతి – విలయ విశ్వాన వినుతుల విమత విమల.

సీ. వీరాంగనామణీ విలసద్వినుతమైన – భూమిగా భువనాన పుణ్యధన్య
పతిభక్తి పావన పర్వమై గర్వమై – విశ్వాల దెలిపెడు విమల గణ్య
దాంపత్య శోభిత ధరణిగ చెన్నారు – భారత భారతి భాగ్యమామె
తల్లిగా తరియించు తనయుల పెంచెడు – సహనంపు సారధి సవనమామె.

గీ. భరత భామయె విశ్వాన భాగ్యరాశి – మాతృమూర్తికి రూపము మానవతకు
ఆర్ద్రప్రేమల ఆధిక్యమవనియామె – సౌకుమార్యపు సాధువు సాగరమ్మె.

సీ. ఐదువతనమన్న హైందవపడతికి – అమరంపు భోగ్యము ఆద్యమదియ
కట్టుబొట్టుల లోన కమనీయ రూపాలు – అందాల అతివలు భరతమందు
మతములు భిన్నము మమతలు మధురము – స్త్రీత్వంపు సిరులెన్న తీరు తెలుపు
కులములు కూర్మికి కుధరములాయెను – అందమె మనసుల చందమగును.

గీ. హిందూ దేశంపు వనితలు హితపుమతులు – విశ్వమహిళలకాదర్శ వినుతులంత
చరిత చెరగని గరువపు జాణలంత – రాణజెన్నారు రాణులు రాజ్యములను.

సీ. స్త్రీవాద సాహిత్య చింతన కొరవడ – నాగరకమ్మున నయము వీడె
శృంగార వర్ణన శృంగమ్మురీతిగా వనితలు పశువులై వాసి వెలసె
మండళ్ళ గోష్ఠుల మండన కరువయ్యె మహిళల పాలెంచ మందకొడియె
అతివల ఐక్యము అందవిహీనమై అవనిని వారంత అధములైరి.

గీ. స్త్రీకి శత్రువులు స్త్రీలన చిత్రమగును – అత్త అమ్మల మధ్యన కట్నముండె
అదియె ఆలోచనమ్మున అందగించ – జగతి అవగాహనమ్మున జయము మీరు.

సీ. అమ్మల దలచిన అతివల అధికమై అవనికి అందమ్ము అందజేయు
అత్తల కోడళ్ళ అన్యోన్య అవగాహనమునందు అందరి సమ్మతమ్ము
ఆడది ఆడదే ననుమాట అసదుగ పుట్టిల్లు మెట్టంగ పూజ్యమగును
పుత్రులు కల్గిన పూజ్యులు లేకున్న మహిళల మమతలు మధురమగును.

గీ. జాతివారలమధ్యన జాగృతముగ – పెరల పురుషులయందున ప్రేమకల్గ
మహిళ ఆశలు ఆకాశమందు నిలచు – మానవత్వాన మహిళలు మనుట నిజము.

650

రంగురంగుల పండుగ రహినిహోళి – అంతరంగము అందము ఆర్తివిడువ
పేద పెద్దల బంధము ప్రేమ వెలయ – వింత రుచులను పండించు విమల ధాత్రి.

మూడురంగుల ముచ్చట ముద్దు జెండ – ఏడురంగుల కాంతియె ఎరుక జగతి
ఇంద్రధనుసున రంగులు ఇంపుగూర్చు – రంగులెన్నైన రాగము రహిని తెలుపు.

ఎరుపు నలుపుల జాతులు ఎదల మృదువు – రంగులేవైన రక్తము అరుణమగును
అందరొకటైన ఐక్యము అవని తెలుపు – నలుపు వలపున పండగ నాణ్యమగును.

జాతి జాగృతమాయెను జయము మీర – వింత విలువల వంతలు విమతులైరి
సమత మమతల రంగులు సమసిపోయె – రంగు రాజ్యము హోళియె రమ్యమగుత.

వింతరంగుల ప్రకృతికి విలువమీరె – చిత్ర చిత్రిత రూపాల చింత రంగు
మనసు మల్లెల రంగగు మహిని నేడు – మానవత్త్వము తెలుపుగ మరువమగును.

రంగు రంగుల నీటిని రమణగలిపి – జనులు అన్యోన్యతలతోడ జల్లుకొనగ
సంతసమునొందు సరసుల సరళిజూడ – పర్వదినమగు హోళిని ఫలము గలుగు.

బావమరదళ్ళ భాగ్యము భావమందు – వరుసగలిసిన వారల వయసులోన
విధులు వింతగ రంగుల విలువ గలిసి – హోళికోత్సవ మగునేడు హోయలు మిగుల.

వంగదేశము పండుగ వాసిదెలుపు – వైభవము దెల్పు కలకత్త వెలుగునాడు
రూపుమారగ రంగుల రూపములను – జనులు సంతసమందగ జవము పండు.

ఉత్తరాదిని పర్వము ఉన్నతమ్ము – వినుత దేవాలయములందు విశదమగును
దేవిపూజల పూర్ణిమ దేహులందు – భవిత కళకళలాడును భాగ్యములను.

రాజకీయము రంగుల రాజ్యముగను – రూపు మారగ వింతగ రుజలమయము
నేత రంగుల మునుగగ నేర్పుదెలియ – పార్టిమార్చిన తెలియదు ఫలము రంగు.

కంటిచూపున కలిసెడి కామితములు – వర్ణములునేడు పెంపొంద వాసివెలసె
తెలుపు నలుపులు రెండైన తేట వెలుగు – ఎన్నిరంగులు కలిగిన ఎరుక ఒకటె.

భిన్నరంగుల మతములు బీదపెద్ద – అందరొకటిగ అవనియె మల్లెరంగు
అమిత ఆనందమందించు అందమదియె – ఉత్సవమ్మిదు ఉత్సాహ ఉన్నతులను.

జగతి జవమున జయమొందు జాణతనము – హోళికోత్సవ మొసగును హోమముగను
రంగు రంగుల విశ్వము రజతముగను – జనత నందించు పర్వాన జాగృతులను.

బాలలందరి భావన భాగ్యమగును – రంగురంగుల నీటిని రహినిజల్ల
విమతములరీతి విశదమై వెడలగాను – ఐక్యభావన వెలుగొందు హైందవమున.

పూర్ణిమానిసి పుణ్యము భువికి వెలుగు – రాత్రిపగలను భావము రాదునాడు
ధాత్రి రంగుల మయముగ తనియురోజు – జనుల మనసుల మహిమలు చలువలీను.

ప్రాంతమేదైన పరువాన పర్వదినము – ఐక్యభావన అమరము హైమవిధము
ఆయురారోగ్య ఐశ్వర్య మవని వెలయ – పండు పండుగ ఫలమున పరవశమ్ము.

గీ. రంగు రంగుల పూలిట రమ్యమగును – రంగమైనది వనమగు రాజ్యమందు
వనము మనమైన మనుజుడు వాసిగాంచు – మనము రంగుల మయమైన మంచి జరుగు.

గీ. ధనము రంగుల మయమగు ధరణి వెలుగు – ధరణి వింతగు రంగుల విలువలీను
రంగువిలువలు రెండింట రాజ్యమేలు – రాజ్యమందున హోళియె రమ్యమగును.

గీ. మనసు ఉత్సాహవంతమౌ మధురహోళి – ఆత్మ ఆనందమమరమౌ అవని హోళి
భౌతికమ్మగు సుఖముల భోగమిడెడి – విశ్వజనతకు విలువల వినుత హోళి.

ఆ.వె. రాజకీయులంత రంగులు మార్చగా – పర్వదినము హోళి పరువు దప్పె
స్వార్థచింతన వీడి సమతను జనుడుండ – హోళి పండుగగును హోమమిచట.

ఆ.వె. త్రికరణముల తీరు తియ్యనౌ విధమున్న – రంగుమారు మనసు రంగముగను
భావతీరులన్ని భాగ్యంపు భవితను – కాంక్షసేయ హోళి కల్పకమ్మె.

ఆ.వె. అంతరంగరంగు అవనికి ముఖ్యమ్ము – వింత రంగులన్ని విమతమగును
మంచి మమతరంగు మనిషికి మధురమ్ము – మానవత్వ మిడుత మహితహోళి.

ఆ.వె. రాజకీయరంగు రంగమై హంగుగా – రాజ్యపాలనమ్ము రహిని జెరచె
రాజనీతి వెలిగి రాజ్యము సేవ్యమౌ – రామరాజ్య రంగు రహికి హోళి.

ఆ.వె. మనసు మమత పెరిగి మహిజనులుండగా – పండుగాయె హోళి ప్రాభవమున
కలిమి బలిమి కలుగ కమనీయ భవితగా – కామితములు దీర్చు కాంతిహోళి.

ఆ.వె. మానవాళి మంచి మధురమై జగమున – చెడును చెరచి జయము చెలగునేడు
పేదపెద్దలనెడు పేరులు లేనిదై – అందరొకటిచేయు అమరహోళి.

ఆ.వె. కులము మతములన్ని కూరిమితోనుండ – మనుజులంత మిగులు మంచి మించి
రంగు రంగమగును రహిజన ఐక్యము – రమ్యమగును భూమి రజత హోళి.

ఆ.వె. రంగునీరు చల్ల రాజ్యము రమ్యము – వింత తీరు తెలియ వివరమౌను
పర్వదినము హోళి పరువాల పరదాల – ఆటపాటలవని అందమాయె.

ఆ.వె. మోసపూరితమ్ము మోహము భువినిండ – రంగువింగడించు రమణహోళి
ఒకరికొకరు గాను ఓర్పున జనులున్న – సమసమాజమిచట సాగుహోళి.

గీ. అందమానంద నందన అవని హోళి – జగతి ఉత్సాహభరితమ్ము జనులహోళి
ప్రగతిభావాల భవితకు ఫలము హోళి – విశ్వమానవ తత్త్వము విలువ హోళి.

గీ. హోలి రంగులకేళికి హోతలెవరు – స్త్రీలు పురుషులు పెద్దల తీరులన్ని
తియ్యదనమున పెంపొందు తిరునగరుల – మనసు మందిర మగునుగా మానవులకు.

గీ. పూలరంగులు పూతమై పూజ్యమగును – చంద్ర సూర్యుల కాంతులు చలితమగును
హోలికాంతులు జగమున హోరు గొలుప – నందనమురీతి నవ్యము నరుల భవిత.

గీ. ప్రేమమీరగ హోలియె ప్రేరకముగ – యువక హృదయాలు వేగాన ఉరకలెత్త
చిలక గోరింక లనురీతి చిందులేయ – రంగురంగుల హోళియె రమ్యమగును.

గీ. అమ్మనాన్నల శోభలు అవనిమీర – బంధుతతులన్ని భవితను బాగుపడగ
రంగు పండుగ హోళియె రంగమగును – కోర్కెదీర్చగ కోమల కొలువు హోళి.

గీ. అస్థిరత్వము రాజ్యాన అంతరించ – సుస్థిరత్వము జగమున సుందరముగ
ప్రభుత ఏర్పడు ప్రగతికి పథము పడగ – రాజనీతిని హోళియె రక్షసేయు.

గీ. భార్యభర్తల బంధము భాగ్యమొప్ప – ప్రియుడు ప్రియురాలి ప్రేమలు ప్రియముగాను
కళల అమరత్త్వమవనికి కాంతులివ్వ – మానవాళికి హోలియె మార్గమిడుత.

గీ. కొత్తకోర్కెల రంగుల కొలను హోళి – భావ భాషల భాగ్యము భవమునిండ
రంగరించెడి రంగుల రవణమగును – కర్త కర్మల క్రియలందు కాంతిహోళి.

గీ. ముద్దుమురిపాలు ముచ్చట మూర్తికట్ట – ఇంద్రియాలకు హితమగు ఇంపుగూర్చ
మానసికమున భౌతిక మహిమదెలియ – ఫలము లిడుగాక పండుగ పథములోన.

గీ. పగటికలలన్ని ఫలముల భవముపండ – రేయి కలతలు విడురీతి రేయి పవలు
జనుని ప్రగతికి బాటగ జగము వెలుగ – శుభము విడుహోళి చేతాల సుందరముగ.

గీ. మహిత మాతను కొలువగ మరువమగును–వినుత శ్రీదేవి నందించ విపుల యశము
కనకదుర్గను సేవించ కనకమబ్బు – దేవ దేవుల హోలియె తెలుపు మహిమ.

గీ. అమ్మదనమున కమ్మని ఆర్తికలదు – నాన్న మనసున నయమగు నందమొప్పు
మూలకారణ మమ్మకు ముద్దులిడగ – ముందు నాన్నను నందించ మూర్తి హోళి.

గీ. రూపచైతన్య మహిమకు ఋజువు తనువు – కోపతాపాలు కోల్పడు కొరతవీడు
రంగు పండుగ హోళికి రహిని సుగతి – మార్పు తీర్పుకు తీర్పరి మనుజహోళి.

651

జీవన ప్రవేశ నిష్క్రమణల్లో చివరిదాని చింతన చిన్మయమైనది
ప్రేమప్రవేశం పేలవమైనా ఫలవంతమైన నిష్క్రమణ పావనం
అమరప్రేమల జీవన సమరంలో నిష్క్రమణ నియతికి అద్దం
మంచిచేసి మరచే మనసులు చెడులోనికి ప్రవేశించని పరువాలు
సృష్టి సుందరతకరవైన ప్రవేశానికి పారమ్యం కాలగమనం
అంతరంగం వింతరంగుల విల్లైతే దాని నిష్క్రమణ విజయం
జీవనం జవసత్వాల జాగృతమైతే దాని ప్రవేశం ఫలవంతం కావాలి
పల్లవించని తరువుల జీవన వనం జీవి జీవన ప్రవేశానికి ఫలం
సారవంతం సహజమైన నేపథ్యంలో కర్మఫలం జీవన నిష్క్రమణ
కలగామిగిలే కలిమి ప్రవేశానికి పరువుతీస్తే నిష్క్రమణ నింద్యం
జీవి జీవన మధురిమల్లో ప్రవేశిస్తే నిష్క్రమణ మాధుర్యాన్ని ప్రసాదించాలి
బ్రతికి చెడినా చెడి బ్రతికినా బ్రతుకు సార్థకంగా నిష్క్రమించాలి.
ప్రవేశం మాలిన్యంతో ముడిపడినా నిష్క్రమణ ముడివిడదీసే అమలినం
'నేను' అనేముందు మాటకు నేపథ్యాన్ని తెలిసికొంటే నిష్క్రమణ ధన్యం
కోటీశ్వరుడైనా కూటికి లేని పేదయినా ప్రవేశనిష్క్రమణాల్లో పరముడే
'అందరికీ అందరమనే' భావనకు అందలం మానవుని నిష్క్రమణ
మానవత్వం ప్రవేశానికి మతిని అందిస్తే నిష్క్రమణ సమ్మతి నించాలి
మంచివారు పుత్రులు కలిగితే మహోన్నత నిష్క్రమణంనీది అవుతుంది
మనిషి జీవన ప్రవేశం మతిమంతమయితే నిష్క్రమణ మానవత్వం కావాలి
ఆరంభానికీ అంతానికీ మధ్య అందని అమరప్రేమల అవని అందం వింత
మనిషి మనీకి సిగ్గుకలిగిస్తే మనసు మానవత్వానికి మొగ్గచూపే నిష్క్రమణ
అన్నీ నిండుగా ఉన్న అవనిజనుడు అమాంతం శూన్యమనస్కుడౌతున్నాడు
పంచేంద్రియాలను ఫణంగాపెట్టే ప్రకాశం నిష్క్రమణలో మనసును పండిస్తుంది
నిష్క్రమణ నిండుదనంతో నియమబద్ధమై నిలువెత్తు జీవనాన్ని పండిస్తుంది.
సమాప్తమైన జీవనానికి భువిలో స్థానం కల్గించే నిష్క్రమణ నిండుదనం.
ఆరడుగుల కాటినేల ఆదర్శప్రాయమైన భువిజనమాన్యం కావాలి.

బతుకు బ్రహ్మాండమైనా చితికి లోకువేకాని భవితకు భాగ్యదాయి కావాలి.
సంపాదన లెక్కకు మీరినా బతుకు లెక్కలో చావు సాంద్రం కావాలి
జీవికి చైతన్యం చేవను కలిగిస్తే భువన భవితకది భోగ్యం
రక్తం చిందించినా రక్తిమనిండించినా అమరత్వం మంచితనానికే
కమ్మనిరుచుల నందించే కలిమికథలు లేమిలో ఆనందాన్నందివ్వలేవు
దీనత్వం, హీనత్వం, దగాకోరుతనం, ధరణిలో ఏమూలనైనా ద్రవీభూతాలే
నడవడి వడి నాణ్యత లోపించి నాగరీకమై నయవంచనగా మారుతుంది
ప్రేమపేరుకు పోయి హృదయాలు కరుడుగట్టిన మానవ మూర్తులదైన్యం
పేలవమైన మాటకారితనపు పెదవి విరుపుల విలువలు విమతాలు
కడుపు చీల్చి భూమిపైకి భూమినుండి తల్లిఒడికి, ఒడినుండి ఊయెలకూ
కాళ్ళపై నిలబడే దశలో కాలాన్ని కదలించే కదలికల కలకలం
ప్రేమనిండి పండిన దశలో పెరిగి పెద్దవాడై యౌవనంలో కాలుజారిన కథలెన్నో
కాని పుత్రుడు కరుణలేని వాడై అయినపుత్రుడు కానివాడౌతున్నాడు
నడత నందనవనంలో విహరించే విహంగమై అంగం అందవిహీనమైంది.
స్వర్గంలా ఊహించుకొని నరకంలో ఏడ్చేకంటే నరకం నుండి ప్రారంభించడం మంచిది
జీవన ప్రారంభం నరకప్రాయమేకాని నిష్క్రమణ మాత్రం స్వర్గరూపం
వెతల వెలుగు జీవనయానంలో వేగుచుక్కగా నిష్క్రమిస్తే వేల్పువే.
శిష్టమైన మానవజన్మను దుష్టత్వంతో భ్రష్టంచేసికొంటున్న భవ్య నరులు.
మానవాళి స్వార్థం మహిమలోపడి మనుగడ గడపై మాలిన్య మహితమౌతున్నది.
వత్సరాలు పైబడినా వాత్సల్యం మరచిన నరసింహాల సంస్కృతి నృత్యం చేస్తున్నది.
అంతం ఆరంభం అన్నీ సినిమాల చిత్రాలై తెరదించగానే అదృశ్యమౌతున్నాయి.
ఉరకలెత్తే యువకత్త్వం ఉన్నశక్తిని కోల్పోయి శూన్యంలో వేలాడుతున్నది
మానవుల మానవత్వానికి మరపులేని మధురకథగా జీవినిష్క్రమించాలి.
మనందరం మనందరికీ పదికాలాలపాటు గుర్తుంచుకొనే నిష్క్రమణ నియతిని పొందాలి.

652

హృదయాంతరాళాల్లో ఆనంద తరంగాల్ని రంగరించింది హోళి
శ్రుతిమించిన ఆనందానికి మితిమీరిన దుఃఖం ఫలశ్రుతి.
నదులనీటిలో మునగడం మోక్షానికయి అది నిజమై నింగికెగిరింది
రంగుల ఆటలో రంగరించిన రాక్షసత్త్వం మానవత్వాన్ని మింగేయడం

మధురలోని హోలీ మానవుల మాలిన్యాన్ని కడిగేసే రంగుల వల కావాలి.
సారనాథ సారం సాగర సదృశ ఆనందానికి నిలయమయ్యే రీతి హోళి
వివిధ ఆలయాల్లో వింత పూజలు పూజ్యమై జీవనం రంగుల మయంకావాలి.
మితిమీరడం, శ్రుతిదప్పడం జీవన గమ్యానికి అందాల అపశ్రుతులే
నిండు ప్రాణాలు నీటిలో కలియడం పావనత్వం పారి సంద్రంలో కలియడం
కర్కశత్వం రంగునీటిలో కలిసి కామితానికి కలిసిరాక రూపాలను చెరిచింది
తరతరాలనుండి తరింపజేసే హోళి తామసమయమై తపనతో నిండింది.
ఆశయం ఆనందమైనా ఆశమీరిన మానవునికి ఆర్తినిమిగిల్చే ఆవేదన హోళి
స్త్రీపురుషుల తేడాలకు చెల్లుచీటీ యిచ్చి చెలరేగే ఆనందహోళి.
తెలుపు సూరీడు పంచిన రంగుల ప్రపంచానికి నయనానందకరహోళి
రంగుల కోర్కెల రంగం రాజ్యంచేసే జీవనగమనానికి రాదారి హోళి.
వెలిసిన జీవితాలను వెల్లవేసే వెతల బతుకులకు వ్రేల్మిడి ఆనందం హోళి.
కలిసిన మనసులకూ మమతలకూ మధువులందించే మధురమైనదీ హోళి
ఆత్మీయతకు అమరత్వాన్ని అందించే ఆస్తిక్యభావమే రంగులరూపుహోళి
చెల్లినకాలానికి, చెల్లని కాసులకూ చెలిమి భవితను పంచే చేతన హోళి
అంతరంగ రంగులకూ బాహ్యవర్ణాలు దృగ్గోచరమై దుష్టత్వాన్ని నష్టపరచే హోళి
కలిమిలేములలో కలతల రంగులు రంగంపై నాట్యంచేసే జీవనసారధి హోళి
ఇష్టా ఇష్టాలతో సంబంధంలేని రంగుల అనుబంధానికి రాజ్యం రసమయ హోళి
ఆనంద విషాదాలకు ఆలవాలమైన జీవితం అందుకొనే అమరత్వం హోళి
వ్యాపార సంస్కృతి వెల్లువెత్తిన లోకానికి నియతి కల్గిన నిష్కామకర్మహోళి
యాంత్రిక జీవితానికి అంగీకరించని ఎదలకు ఎఱుకనిచ్చే రంగుల యంత్రం హోళి
ఆశయం, ఆశ, ఆనందం, ఆత్మీయతల కాలంబనమైన అవనికి అందలం హోళి
అంతరువులులేని అంతరంగాలకు వింత విలువల రంగుల నందించే హోళి ఇది.

653

నిరుద్యోగ పర్వంలో నింగిని చూచేయువకుల భవితవ్యం పూజ్యం
అదృష్టాన్ని పరీక్షించుకొనే అధికార పరీక్షల కోసం నిరీక్షణం
ఫలితం అనుకూలమైతే పరమార్థమందిందనే ఆనందడోల
ప్రతికూల ఫలితానికి పరులను నిందించే పారమార్థికాలోచనలు
శ్రమకు తగిన ఫలితం అందుకొనే వారు అధములుగా కన్పించే అవని

చేయని శ్రమకు ఫలాన్ని పొందే పరములు తెలివిమీరిన తెంపరులు
వయస్సు మీరిపోతున్న తొందరలో వావివరుసలు లేని పనుల పసందు
నియంత్రణలేని జనాభాకు నియమాలు నిర్ధారించే నీతిమంతులు
సంకల్పంలేని సామర్థ్యం కొండంతయినా కొలువుకు శోభకల్గదు
అవగాహన లేని పాండిత్యానికి అవనిలో అందగింపు అతితక్కువ
లోచనాలు ఆలోచనకు హేతువులైతే లోకంలో పరహితం
తిమిరం తిమింగలమై అమంగళమైన జీవితాలకు వెలుగెన్నడో
యత్నంలేని ఫలానికి యాంత్రిక జీవనంలో ప్రాధాన్యత కరువు
వ్యావృతమైన వ్యాపార సంస్కృతి యువకులకు మార్గగామి ఔతున్నది
చిందరవందరలైన నయమార్గం విధి విరగబడ్డవైనానికి దర్పణం
తిరగబడ్డ మంచితనం తెంచేసిన సంకెళ్ళు అసమర్థుని ఆకలికి నకళ్ళు
పొగరు, వగరున్న వంట్లో విప్లవంరేగితే నిలువరించడం సాధ్యంకాదు
మాటల్లో విప్లవాలు చేతల్లో చైతన్యం లేమి నవ్యయువకుల నైజం
సినిమా మాని పుస్తకం కొనుక్కొనే అభాగ్యులు భూమిపై కనరారు
తాత్కాలికానికి తారుణ్యాన్ని శాశ్వతానికి చేదురుచిని అందిస్తున్నారు
ఓపిక ఒంట్లో దాచుకొంటే ఓర్వలేని వారి చిరునామా వెతకాలి
సామర్థ్యానికి సహనం అందాన్నిస్తే సవనమైనా సాధ్యంకాకపోదు
యువకుల సొత్తు ఔన్నత్యం అది దేశభవితకు సుస్వప్నం
చైతన్య శక్తికి ప్రతీకలు యువకులైతే దేశదీప్తి దైవాంశం.

654

గీ. అమరజీవికి అంజలి నందజేయ – ఆంధ్రులందలి జన్మలు సార్థకమ్ము
ఆంధ్ర హృదయాల అమరుడు ఆశయముల – తెలుగులకునిచ్చె రాష్ట్రము తెగువకల్గి.

సీ. కనిగిరి ప్రాంతాన కమ్మని వంశాన – వైశ్యుడై జన్మించి వినతుడాయె
వ్యాపార రంగము యాతన గనునెంచి – తనజాతికేదియో తలచెనతడు
జాతీయ భావాల జాగృతుడాయెను – ఆంధ్రాన అధికుడై అవనిమీరె
బాపూజి మదినెంచి భావాల గమనించి – అవగాహనముతోడి ఆశయముల.

గీ. పొట్టి దిట్టగ పొడగరి పోడిమిగనె – అమర శ్రీరాముడాయెను అధికుడపుడు
గాంధిగరువము గతినెంచి గడనకెక్కె – ఆత్మనర్పణజేయగ అమరుడాయె.

గీ. లేమిజీవన గమ్యమౌ లేతమనసు – కష్టతరమైన బతుకున కామితములు
కలగ మిగిలిన కలిమిని కాంచకుండ – వెడలె గుజరాతు కోమటి వెలుగు మీర.

గీ. ఆశయమ్ముల నాశల కమ్మువారు – నేటి జగమున కలరుగా నెయ్యమరల
జీవి ఆశయసిద్ధిన జీససుగను – భావిజనులకు ఆదర్శ ప్రాయుడతడు.

సీ. తెలుగుల తెగువకు తేరైన మదరాసు – పాలన పరువాన పండబారె
ఆంధ్రుల అందమ్ము అవనిని అధికమై – దక్షిణాదిననాడు ధనదుమించె
సర్కారులందున సంరంభమాయెను – తెలగాణ తెంపరి తెలియబడెను
రాయలసీమను రభసమ్ము రహినిండె – రాజ్యమ్ము వేర్పాటు రాజుకొనెను.

గీ. జాతి ఆంధ్రము భాషయు జగము మిగిలె – ప్రాంత రాజుల ఏల్బడి ప్రాభవములు
వేరు విధముల సంస్కృతి వేద్యముగను – రాష్ట్రమునుకోరి రాంధ్రులు రభసముగను.

గీ. ఆంధ్ర కాంగ్రెసు సభలను ఆంధ్రులంత – ముక్తకంఠాన తీర్మానములనుజేసి
ఢిల్లి వారికి తెలిపిరి డీలువడగ – పాట్లు పడగాను ఫలితము పరమమాయె.

గీ. ఆంధ్రులారంభ సాంద్రులై అధములుగను – వేరు కుంపట్లు పెట్టగ వెలితి మీరె
రాయసీమయు సర్కారు రహిని రెండు – మాకు మాకని పట్నము మహిమ వీడె.

సీ. సంఘాలు వేసిరి సామ్యాన జరుగగా – అడ్డుపుల్లలు వేయ ఫలము వీడె
పెద్దల మధ్యన పేర్వడ్డ నేతలు – ఒడబాటు చేయగా ఓగునదియు
పలువురు ప్రముఖుల పాలకాధ్యుల మధ్య – అన్యోన్య భాషల నమలుజేయ
'శ్రీబాగు'నందున చింతల దీర్చెడి – సఖ్యత గుదురగా సవ్యమాయె.

గీ. ఆంధ్రరాష్ట్రము వచ్చును అనుచు జనులు – ఎదురుచూడగరాలేదు ఎదల గుబులు
కొన్ని రాష్ట్రాలు విభజించె కొలువు ఢిల్లి – చిన్న చూపున ఆంధ్రులు చింతవడిరి.

గీ. ఆత్మగౌరవ మభిమాన మంతరించ – ఆంధ్రులందరు ఆలోచనమ్ముసేయ
నిజము నిజమైన ఆంధ్రుడు నిత్యముగను – నిలిచె ముందర 'శ్రీరామ' నెనరు మీర.

సీ. మదరాసి లనగానె మనమంత కలియగా – ఆంధ్రము అసలేమి అందగించు
తమిళము తపనతో స్తవనీయ భాషగా – తెలుగును తీయనౌ తెరగు లేదు
మంత్రిముఖ్యులుకూడ మదరాసు వారివే – ఆంధ్రులు అధములు పాలనమున
నేతల తీరులు నెయ్యము వీడగా – ఆంధ్రులు అంధులై అలమటింత్రు.

గీ. తీరుచూడగ దయనీయ తీర్థమాయె – జాతి భాషలు చూడగ జవము మనది
జాణ లెందరొ నాయకుల్ జయమునొంద – అమరవీరులు యత్నించి అధికులైరి.

గీ. గాంధి భావాల గరువమ్ము గమనముగను – జాతి రక్తియె జయశీల గమ్యముగను
హింసవీడుట హితమనె హితుడు తాను – వినుత సత్యాగ్రహమ్మున విజయుడాయె.

గీ. త్యాగమూర్తికి తెలుగులు అంజలిడగ – ధైర్యసాహస మాంధ్రుల దేహములను
నిండు మెండుగ నియతుల నిధుల విధము – అమరజీవికి అవనిని శాంతికలుగు.

సీ. ఆంధ్రత్వమనునది అణువణువున నుండ – అర్పింప రక్తము అమరుడాయె
సత్యాగ్రహమ్మున సమరమ్ముసేసిన – గాంధేయవాదిగ క్రమమాయె
ఆదర్శమూర్తిగా అంకితభావాన – ఆంధ్రుడై సాంద్రుడై అమరజీవి
గుణమున గురువుగా గుంభన గురుతుగా – ఆశయ మాశగా అవతరించె.

గీ. అతడెవరన శ్రీరాముడాదరమున – రామరాజ్యము కోరెను రహిని తాను
ఆంధ్రదేశపు అందాలు అందగించ – త్యాగ జీవిగ వెలుగును తారవిధము.

గీ. ఎందరుండిరినేతలు ఏమి ఫలము – ఆంధ్రమాతకు బిడ్డడు అధిపుడతడు
జాతిజాగృతి జేసిన జాణ తాను – సంఘ సంస్కార భావపు సంద్రమతడు.

గీ. భాషజగమున జనునికి భాగ్యమిచ్చె – దాని రక్షణసేసెడి దార్ఢ్యులెవరు
ప్రజల ప్రాధాన్యమెంచగ పరమముగను – వరుడు శీరామయార్యుడు వాసిదేల్చె.

సీ. నేతలు మితిమీరి నెయ్యము మరచిరి – సేవార్థ చింతన సేదదేరె
మనమున ధనమున మలినమ్ము వ్యాపింప – కాంక్షలు మీరగా కాంతిదప్పె
స్వార్థాన సార్థక ఫలములు మితిమీర – పరమార్థమన్నది పథము వీడె
అమరుల త్యాగాలు అవనిని గుర్తించు – మానవమాన్యులు మనకు లేరు.

గీ. నాటి అలనాటి నేతల నరుల దలచి – జాతి దేశంపు సేవల జయమునెంచి
సాగ ముందుకు సహితమ్ము సామ్యమగును–మనము వీడగ స్వార్థము మాన్యమగును.

సీ. సమరమ్ముసేసెడి సామాన్యులందరు – అమరజీవిని దల్చ అధిపులిలను
మనకొకరాష్ట్రము మహినుండ మాన్యము – రాష్ట్రాను రక్తిని రహినిసాగ
నీరక్తనాడుల నిలిచిన అరుణిమ – అమరజీవినిగాంచ అధికమౌను
అవినీతి అన్యాయమధికము కాకుండ – ఆశయములనుండ ఆంధ్రసాంద్ర.

దుష్టనేతల చర్యల దూషణమున – మాట మీరక చేతల మహిమ దెలిపి
అందరొకటిగ అవనిని అందగించ – ఆంధ్రమమరము శ్రీరాము నాశయముల.

సీ. సత్యాగ్రహమునేడు సామాన్యమయిపోయె – సాధ్వసమేమియు కానరాదు
ప్రతిచిన్న విషయాన ప్రాధాన్యమేలేక – మరమమౌ చేతయు పాలిపోయె
గాంధీజి నియమమ్ము గహనాన బడిపోయె – అసదగు కృత్యముల్ అవని కదియె
ఆంధ్రను సాధించి అధికమౌ ఆయుధ – సాంద్రత మహిలోన సడలిపోయె.

గీ. మాటపెద్దగ చేతలు మప్పితమున – గొప్ప తక్కువలిట జూడ గోలతనము
మేధ పెరుగగ మనసులు మెప్పువీడె – విలువ లేనిది మాటగ వెలసె చేత.

గీ. భువిని వీడెను సత్యము భుక్తిలేక – ఆగ్రహమ్మెమొ అవనికి ఆభరణమ్ము
జనుని సత్యాగ్రహమ్మెమొ జవము వీడె – అమరమునకెళ్ళి అసురుల నాశ్రయించె.

గీ. త్యాగధనమున పూర్వులు దారిజూప – దారి నడువగ పూబాట ధరణినదియె
భావితరముల భాగ్యము భక్తిమహిమ – మానవత్త్వము మనుజుల మహిమ దారి.

గీ. కృంగి కృశియించి నశియించె కూర్మిజనుడు
పొంగి పొరలెను యశమును పొంకముగను
దీక్షసాగించి దివ్యుడై దిటవు మీరె
సాధనముసేయు బాధైన సాహసమున.

గీ. ఆంధ్ర ఆదర్శమాయెను భరతమునకు – భాష రూపాల రాష్ట్రాలు బాగుపడియె
అమరజీవియె అందరికాప్తుడాయె – ఆర్తిదీర్చిన శక్తుడు అహములేక.

గీ. శక్తివినియోగ మందున శమము కలిగె – సాటియైనది శక్తికి అవనిలేదు
ప్రాణశక్తిని వెలువడె ప్రాంశువాత్మ – అర్పణము జేసి సమరాన అమరుడాయె.

ఆ.వె. ఏమిచేయలేము ఎవ్వరునిచటన – సబబుకాదు నేడు సహజశక్తి
రామయార్యుడెన్న సామన్యుడే గద – సాధనమ్ము జేసి సాగిపోయె.

ఆ.వె. కానిదేది లేదు కర్మల దీక్షను – పట్టుదలయె పట్టుపరమమౌను
ఇలను జరుగు కలలు ఇంపగురీతిన – అంకితమ్మె అసలు ఆశయమ్ము.

655

సీ. సంస్కారరాహిత్య చదువుల గమనమ్ము – గమ్యమ్ములేనిదై గహన మెంచు
అవగాహనములేని అర్థాల శబ్దాల – అనగాను వినగాను అధమమాయె

టీవీల సినిమాల తీర్థంపు మోజున – జనగణ చిత్తాలు జవమువీడె
సత్యమ్ము సమయించి సంపద గూర్చగా – నరులంత నడతను నరకమాయె.

గీ. ఆశయములను ఆశలు అంతరించ – ఆశ లవనిని మించగా ఆర్తి మిగిలె
ఆర్తి అందము జనులకు అవగతముగ – అస్తి నాస్తిని మించగ ఆస్తి బాధ.

సీ. కర్మల మర్మము కాఠిన్యమాయెను – కర్మభూమియు నేడు కాంతివీడె
ధర్మము ధరణిని దహనము కాగాను – విధులన్ని విమతము విలువవీడె
నీతులు నిధులుగ నియమాలు నీర్గారె – మాటలు చేతలు మారిపోవు
మానవ తత్త్వాన మసలుట మరువగా – దారుణ దానవ ధాత్రి మిగిలె.

గీ. సంప్రదాయము జగమున సగము మిగిలె–మనసు మరచుట మహిమగ మతము వెలిగె
శాంతి సహనము చెరుగగ శమము వీడె – భారతీయత మరువగ బాధ గలుగు.

సీ. వ్రతముల వృత్తాల వసుధకు వరపైన – మనుజుల వర్తన మధురమౌగ
క్రతువుల కర్మల కమనీయ కలితగ – ధారుణి మహిమెంతొ దాగునందె
మతములు వేరుగా మమతలు మధురమౌ – మహినేడు మాన్యము మానవతను
నడతలు నయముగా నవతకు నాందిగా – నడయాడు నరులతో నవ్యమిదియ.

గీ. లోకవృత్తము స్వార్థాన లోభయుతము – తపన నరునకు తరగని తనముగాను
వెతలు వెఱపగు వెలుగుల వేళలందు – బాధ భవమున బోధింప భాగ్యమగును.

సీ. రామాయణమునందు రంగులు వెలయగా – రామరాజ్యమునాడు రాజిలంగ
భారత భాగాన భాస్వంత మౌపోరు – ధర్మాన సాగగా ధరణి మహిత
భాగవతులుగాను భాసిల్లు జనులంత – నిత్యమౌ నియమాలు నిధులు వెలుగ
కథలిట లేమిని కలిమిని వర్ణించ – కమనీయ జగమున కాంతి కలుగ.

గీ. వినుత సంస్కారవంతమౌ విధులు వెలయ – సహన ప్రేమయు శాంతులు సద్గతిగన
ఆస్తి ఆస్తిక తత్త్వము అహముద్రోయ – అమర భారత భారతి అందగించె.

సీ. దుశ్శాసనులుగాను దురితంపు చేష్టల – శాసనసభ జూడ శాప దహిత
కిష్కింధ కాండను కీలాల మయమగు – కీచక మూకల కీలుబొమ్మ
మంచియు చెడుగూడ మాలిన్య సహితమై – సంస్కారమును వీడె సమ్మదమున
దుష్టులై సభ్యులు దురపిల్లు జనులను – పట్టించుకొనరిట పార్టివలన.

గీ. పాలకాధ్యులు పరములు పదవిచేత – దిగిన గౌరవ మన్నది దిగునుజగతి
సభ్యతను వీడి సభ్యులు సంచరించ – ప్రథిత జనులది స్వామ్యము పరువువీడె.

సీ. రాజ్యాంగ పదవులు రాజ్యాన పూజ్యమై – అవమానములతోడ అందగించె
గౌరవస్పీకర్లు గమ్యమ్ము మరువగా – గహనమౌ స్వామ్యమ్ము గమన రహిత
పార్టీల పరువును పంతాన రక్షించ – పరమమౌ పదవియు పదనువీడె
అసలైన విషయాలు ఆకాశమునకెళ్ళు – అవకాశవాదులు అతిశయించు.

గీ. సభ సమావేశనియమాలు సంతకెళ్ళు – ప్రశ్న సమయాలు పరుగెత్తు బదులులేక
"జీరొ" గంటలు జీరోలె జిలుగువీడ – సభ నిబంధన పాటించు సరసు లెవరు?

సీ. ప్రశ్నయు ప్రతిమాట ప్రగతికి మార్గము – మంత్రుల సభ్యుల మధ్య తగవు
తిరుగు జెప్పెడి మంత్రి తిరునామమిడగాను – ప్రశ్నలు ప్రశ్నలే ప్రగతిలేక
సూటిగా మాటాడు సోదర సభ్యులు – అవగాహనములేమి అల్పులౌట
సగముండు హాజరు సరసంపు సభలను – స్వాతంత్ర్య సొగసేమొ స్వర్ణసహిత.

గీ. ఒకట రాక్షసయుద్ధము ఓర్పువిడిచి – దేవ సంగ్రామ మొకవంక దేహములను
రామ భారత యుద్ధాలు రాజ్య సభల – స్వర్ణభారతి గడపన స్వర్గ రీతి.

సీ. ఎన్నడో చేసిన ఏలిక చట్టాలు – నేడైన మార్చిన నెనరు మిగులు
మేధలు పెరిగెను మేరువు రీతిన – ప్రాచీన శాసనాల్ పనికిరావు
మోసము పెరిగెను మోతాదు మించగా – విరుగుడు కలుగగ వినుత మగును
స్వార్థము అవినీతి సార్థక అర్థమై – వ్యర్థము చేయగ వ్యథలు తీరు.

గీ. నాటిరాజ్యాంగ మంతయు నవ్యరీతి – నేటి కాలానుగుణముగ నేర్పుమీర
మార్పుచేయగ పాలన మహితమగును – భరత దేశపు భవితయు బాగుపడును.

సీ. నేతాజి చెప్పెను నేర్పుమీరగనాడు – పోరాట పటిమయె పొందుజయము
బాపూజి పలికెను భావ్యమౌ విధమున – ఉద్యమమునుసేయుమున్నతముగ
అతివాద మితవాద ఆధికమేదైన – కాలానుగుణముగ కాంతులీను
ఆశయ త్యాగాల అమరులు వారంత – వారిని దలచగా వాంఛదీరు.

గీ. బానిసత్త్వము వీడగ భవితలేదు – సంపదనుపంచ సాగును సమత నేడు
అదియె అందరి స్వారాజ్య భావనమ్ము – రామ రాజ్యము రహినిండు గ్రామములను.

సీ. ఢిల్లీలొ గూర్చుండ గల్లీల విషయాలు – గమనించ ఫలమేమి కాదులేదు
భాగ్యనగరమందు బారులు దీరగా – మూలన గ్రామాలు మురిసిపోవు
జిల్లాలకేంద్రాల జిలుగులు మీరగా – కుగ్రామములునేడు కూలబడెను
స్థానిక సంస్థలు సహజత్వమును వీడ – పల్లెల పరువును పలచబడియె.

ఆ.వె. క్రిందనుండి పైకి కీర్తికి తొలిమెట్టు – పాలనమ్ము నేడు ప్రగతి వీడ
పైననుండి క్రింద పాలన విధమున – ప్రాభవమ్మువీడ ప్రజలు వగచు.

656

**హరి కనకదుర్గల కళ్యాణ కామిత కల్హారమాల**

ఆ.వె. కూటకూళ్ళ వంశ కూర్మియె కుధరమ్ము – కే.వి అందులోన కేతనమ్ము
హరిత వనమునందు హరికృష్ణ దుర్గలు – అతిశయమ్ము జగతి అందమగును.

ఆ.వె. సప్తపదుల పదుల సాంగత్య పథముగా – సాగు కృష్ణదుర్గ సారసహిత
రంగులేడు కలియ రంగము మనసుగా – మల్లె గంధమిడును మమత మహిత.

ఆ.వె. చేయి చేయికలుప చేతము లొకటిగా – హాయి హాయి జగతి కనక హరిత
మగువ మగల మనసు మనుటకు మార్గమై – హరియు లక్ష్మి జంట హాయి గనుత.

తే.గీ. పట్టభద్రత వ్యాపార పాలకునిగ – కృష్ణకీర్తిని పొందగ కనకదుర్గ
మాస్టరయ్యెను కంప్యూటరముల నతివ–జీవనమునందు వెలుగుల జిలుగులగుత.

ఆ.వె. ప్రిన్సిపాలు పుత్రి ప్రియముగ నియతుల – శ్రమను శిక్షణమున శమము మీరు
ఆంగ్లభాష గురువు అనుగైన పుత్రుండు – సాంద్ర హరిత యశుడు సవ్యముగను.

గీ. కందుకూరును ఒంగోలు కలిసెనిపుడు – బెంగుళూరున బెంగలు బెరుకువీడు
ప్రేమ పెరుగును పెదవుల పేర్మిమాట – తల్లిదండ్రులు మీరలు తనువు కలియ.

ఆ.వె. కనకదుర్గ లక్ష్మి కామితములు దీర్చ – ఆశయాల కృష్ణ హరిత మగును
రాగ సరిగమలకు రాజ్యము మీదిగా – మధుర గానమగును మాన్యజంట.

ఆ.వె. అధర సుధల మధుర ఆలింగనములతో – తనువు తపనతీర తరళమగును
మేను మరచి మగత మేదిని విడువగ – ఇంద్రియాలు హితము ఇంపులొలుకు.

తే.గీ. కోపతాపాల శాంతులు కొల్లగొట్ట – మంచి మమతల మనురీతి పంచు పథము
ఇద్దరొకటిగ హితమతుల్ ఇరుల నడప – సూర్యచంద్రులె సుందర సూక్తులిచట.

గీ. బంధమనునది బంధువుల్ బలములోన - అందుకొనగను అవనిని అందమాయె
శుల్క రహితము సుందర శుభగ మగుట - అందరాత్మీయతలకిది అద్దమాయె.

గీ. ఎటుల చూచిన ఎదలకు ఎదుగుదలయె - ఎఱుకమీరగ యాతనల్ చెదరిపోవు
శుభము లన్నియు చేరగ సులభమగును-మదులు మాన్యములగునిట మనసు కలియ.

గీ. తల్లి దండ్రికోర్కె తరియించు మార్గాన - తపన మీరుపడగ తథ్యమిపుడు
ధర్మ నిర్వహణము ధరణిని సేయగా - విధులు విధిగ మీకు విలువ నొసగు.

గీ. సహన శాంతములను సదయను మీరగా - జగము నందు మీకు జయము కలుగు
బాధ గురుతు గలుగ భవమంత మీదిగా - సుఖము దరికి జేరు సుందరముగ.

గీ. అమ్మలేకున్న అక్కలు బావలుండ - మామ అత్తలు మరువని మానధనులు
నాన్నకోరిన అమ్మయె నాటియమ్మ - భార్య భర్తలు భవమున భాగ్యయుతులు.

గీ. వరుడు అద్దము వధురూపు వాసిదెలుపు-వధువు బింబము ప్రతిరూపు వరుని వలపు
వరుడు వధువులు కలలకు వంకలెట్ట - జంట జరిగెడి కథలను జయముగాంచు.

గీ. కలిసి కలకాల జీవన కలిమిగాంచు - శబ్ద మర్థము రీతిన శమము మీరు
చంద్ర చంద్రిక విధమున చలువ లీను - వెలుగు నీడల వెలుగొందు వెతలు విడచి.

657

సీ. పాఠశాలల నేడు పాఠాలు సెప్పరు - కాపీలు కొట్టించు కర్మమీరె
ప్రయివేటు బడులను ఫలితాలు మెండగు - కారణమును సెప్ప కథలు పెక్కు
మార్గము తెలియని మానవ మేధలు - పద్ధతులన్నిట ఫలముగాంచు
పైనుండి కిందికి పైకమె విద్యయై - అక్రమాలెన్నియో క్రమము మీరు.

గీ. లీకులందున పేపరు లీలలెన్నొ - కోట్లు ఖర్చగు కొందరు కొలువుదీర
దండనములేక తప్పులు ధరణి దొరలు - తప్పు ముప్పును కలిగించ తలగు నరుడు.

గీ. అందరందరు అవకాశ వాదులంత - పట్టుదలలేని పందలు ఫలమునంద
ఆశయములేని అసమర్థ అవనివిదులు - విధులు మరచెడి గురువులు వింత జనులు.

సీ. ప్రభుత పరీక్షల వాలకమునుజూడ - ఫలరహితమ్మాయె పథమునందు
పేపర్ల లీకులు పెనుఖర్చు జగతికి - ప్రహసన రీతియౌ ప్రల్లదమున

కారకులెవరన కనబడు కళ్ళకు – శిక్షల తీరులు శివున కెరుక
అయ్యవార్లెందరో అవమతులైరిట – విద్యల విధమెంచ విమత మగును.

సీ. తాను ఉత్తీర్ణుడగు రీతి తపనమీర – క్రమ నిబంధనలేమియు కానరావు
విద్యనేర్చిన నేర్పెడి విబుధులంత – విలువ విడిచిన చదువులు వెలుగుదప్పె.

సీ. పదియవ తరగతి పాఠశాలలునేడు – కాపీల మయమైన కాంతిదప్పె
రెసిడెన్షియలు నేడు రెండింత లాయెను – ప్రభుతను శాసించు బడులు అవియె
గురువులు చీకున గురుతున శిష్యులు – చూచి చూడనియట్లు ఉండిపోవు
చిట్టాలు ఉండవు చింతన చూచుటే – చూచిరాతలు మెండు సూక్ష్మముగను.

గీ. తీగెలాగిన డొంకంత తిరిగి కదులు – తమకు పట్టనితీరున తరము జరుగు
ఒక్కడేమియు చేయడు ఒరులలోన – తప్పుకొనిపోవు మేధావితనము గొప్ప.

గీ. మనసు చావగ మనుగడ  మరచె నీతి – లేని సంస్కార చదువున లేవడతడు
శిక్ష దక్షత చిగురించు శీలయుతుడు – కఠిన పద్ధతి కామించు కారకుడగు.

658

గీ. ఆరుగాలము శ్రమియించ ఆర్తిమిగిలె – భూమి తల్లిని ప్రేమించ భుక్తిపోయె
పంటచేలను పురుగులు పాడుచేయ – కలలు కల్లలు కథమారె కర్షకునిది.

గీ. ప్రత్తి ప్రత్యక్షమాయెను పృథివి లోన–జనుని హరియించి జయమొంద జవము గొనెను
అప్పుబాధలు ఆత్మల హననమెంచె – తెల్లదనమంత ఆంధ్రాన తెల్లవారె.

ఆశ ఆర్తిని మించి ఆత్మహత్యలకు కారణమైనది
నమ్మిన భూమితల్లి నడిసంద్రాన ముంచితే వమ్మైన ఆశలు
పచ్చనిచేలు పుచ్చిపోయిన వైనం జీవన పల్లవాలు ఎండిపోయిన కారణం
స్వేదాన్ని చిందించి రక్తాన్ని రంగరించి కృంగిపోయి నిరాకారి
శక్తినంతా కూడగట్టి చేతికందాల్సిన పంట పాడైన ఫలం స్వయం హననం
మనిషిని నమ్మలేని మనిషి భూమినే నమ్మి మోసపోయి దారిలేని దయనీయుడు
అప్పులు వడ్డీలూ లెక్కలేస్తే ఆశల లెక్కలకు అంతూదరీ లేక జీవిత లెక్క ముగిసింది
తనకాధారమైన ధారుణి దారుణంగా కృంగదీస్తే తాను ఆధారమైన
వారెవరూ గుర్తుకు రాలేదు.

694

నారుపోసినవాడు నీరుపోసి పెంచిపెద్దజేస్తే అందాల్సిన ఆశ చేజారింది
పండాల్సిన కల ఎండిపోయి పరువును మింగితే మిగిలేది నిర్జీవం
ప్రత్తి తెల్లదనం అప్పులు వడ్డీల అర్థంలో రైతుల జీవితాలు తెల్లారాయి
పోగులు తెగిన పోడిమి దప్పిన తెల్లబంగారం పేగుతెంచేచిన అంధకారం
కల్తీమందుల కల్మషానికి మర్మంతెలియని మనుషులు బలియైనారు
అభిమానం అంతరించి అప్పులభారం అమాయిక ఆశావాదికి ఆశోపహతి
పచ్చదనం పూచికాచి ఫలించే దశలో పుచ్చిపోయి పూజ్యమైన ప్రాణాన్ని మింగింది.
నందనవనం కాకపోయినా సుందరమైన జీవితాన్నాశించి కృషిస్తే కష్టాలేమరి
కాంక్షల కారుచీకట్లు ఆకాంక్షల అమరారామాన్ని వెదుక్కొంటూ జీవితాలు వెళ్ళిపోయాయి.

ఖద్దరు వస్త్రాల రాజకీయ కర్షకులు ప్రత్తిరైతుల దైన్యానికి కారణాల్ని రాజకీయం చేస్తున్నారు.

ఆరుగాలం శ్రమించిన శ్రమఫలితం అప్పుల ఐరావతాన్ని అమరంలో ఢీకొంది.

అల్పజీవులు, వెన్నెముకలేని ప్రాణులు, బుద్ధిజీవి మేధావి మానవుని కృషిని మసిచేసాయి.

లక్షలు కరిగించి పారించి ప్రాణం ఖరీదు లక్ష ఎక్స్‌గ్రేషియాతో సరిపెడదామా.

అసాధారణ వడ్డీ వ్యాపారులు పిండిన కృషికుని రక్తం ఆశల ప్రత్తిలా వెలిగి అపరదిశలో అరుణిమలో కలిసింది.

ఆలోచించిన కుటుంబభారం, ఋణభారం, ఆశించిన ఫలితం అందని భారంతో తులతూగలేక తూలిపోయింది.

పరిష్కారం ఆత్మహత్య అయితే యిక ఆశలకూ, ఆశయాలకూ అర్థం వుండదు.

659

బతుకు గడపడానికి తప్ప అంతంచేసికొనడానికి అసలే కాదు
శాంతి దూరతీరాలకు పయనిస్తూ తనవెంట మనిషిని రమ్మంటున్నది
మానవత మరచిన మానవ సమాజానికి మరణం మనువర్తినివ్వదు కదా
గ్రహాంతరాలలో నీటిని కనిపెట్టిన మానవుడు చుట్టూఉన్న వారికి నీరందివ్వలేడా
కల్తీమార్కుల కాలం కలతలకు నిలయమై కామితాల్ని యివ్వలేనిదశ
పంట పండక పండినా ధరరాక, పండి ఎండిపోయిన పుణ్యభూమిలో త్రికరణాలివి.
నమ్మకం వమ్మైన లోకంలో నవ్యమానవుడు నిలబడలేని స్థితికి తార్కాణం

ఆశలు మొగ్గలై, పిందెలై, కాయలై రాలిపోయిన దశలో ఆప్తమైన దాత్మహత్యే

సహనం లేనిజీవి హననానికి పాల్పడే దయనీయ స్థితి లోకంలో ఉంది.

శాశ్వతం కానిది లోకంలో కలదనుకొనే మానవుడు అశాశ్వతజీవనుడౌతున్నాడు.

వినియోగం విలువకలిగినదయితే దుర్వినియోగానికి దూరమైన దురదృష్ట జీవులు.

తల్లిభూమి తపనతీర తనయులకు పాలిస్తూ తననే మరచిన తనయులనుకూడ మరచింది.

ప్రకృతి కృతికి మానవుని దుష్కృతి క్రిమికీటకాదుల రూపంలో కబళించింది

ఆత్మస్థైర్యానికి అవని అందలమైతే అందుకోలేని మానవ ఆత్మల కథ వ్యథే.

మహనీయుడైన మానవుడు మాననీయుడు, అభిమానం అమ్ముడుపోగా నిలబడి జీవించలేని అనిత్యుడు.

అందమైన కలలను అప్పుల అభిమానం చిందవందరచేస్తే చింతించనిది చివరి శ్వాసే.

అప్పులు, అంపకాలకు నోచుకోని అతివలు ముందూవెనకా కాట్లాడి తూట్లు పొడిచాయి.

స్వార్థం సోదరుడు కరవై, పరార్థ పరమార్థాలు మనసును మర్దించగా మనుగడ దుస్సాధ్యమే.

అర్థం అవనికి సమర్థమయ్యేదశలో సామర్థ్యం లేని అసమర్థుల గతి ఆత్మహత్యే.

మంచితనానికి పాటుపడే మనిషికి మంచిని మించిన ఆశలమడిలో మనుగడ అనుమానమే.

ఆదరణ, స్నేహం, ఆప్యాయత, ఆదుకొనే తత్త్వం కరవైన సమాజానికి ఆత్మహత్యలు హత్యాసదృశమే.

మనిషి ఒంటరితనాన్ని కోరుకొనేదశలో భరించలేని ఒంటరి భావన బాధకు గురిచేస్తుంది.

భద్రతలేని జీవితాలకు, బంధుత్వం సంబద్ధం కాని దశకూ నేటి ఘనతలు తార్కాణం.

హత్యలు, ఆత్మహత్యలు అవని ఎదుగుదలకు ఆహతాలై దుఃఖకారణాలౌతున్నాయి.

వెన్నెముక కల్గిన మానవుడు వెతలకు నిలయుడై వెలుగు జీవితాన్ని అంధంచేసికోరాదు.

660

సీ. పాపాల కాపీలు పరుగున మించెను – ప్రాధాన్యమేలేదు ప్రతిభ కిచట

జతగూడ జాణలు జయమొందె విమతము – అయ్యవార్లకు గూడ భాగమిచట

ముందువెన్కలు జూడ మూల్గిన ముక్కిన – పట్టించుకొనువాడు పందయిచట
పద్ధతి లేనిది పరిపాలనముగూడ – మంచిని జెఱచెడి మందులిచట.

సీ. పోలిక మించగ పోడిమి దప్పెను – తనచుట్టుకలదాని తలచడెవరు
మంచిని పోల్చడు మరుగగు నదియును – తప్పును తలదాల్చు తపన పడును
చదువులు నేర్చిన సాధువులందరు – మేధల మేదిని మేలు విడచె
దోపిడి చేయగ దోషము కాదిట – దోర్బల ముండిన దొసగుతొలగు.

గీ. కలిమి మంటల లేమియె కాలిపోవు – కాలగమనాన మంటలు కాంతినిచ్చు
వెలుగు వెడలిన వెతలన్ని వెలిసిపోవు – వెతలు వీడిన నరుడిట వేధ సుమ్ము.

661

దయామయికి దానమిడగ విద్యవెలుగు వింత మెర్సి
చదువుల బడి శారదబడి మాదగు బడి యీ మెర్సి
ఓనమాలు ఓర్పుతోడ నేర్పుగుడియె మా మెర్సి
క్రమశిక్షణ పట్టుదలకు కాంతినిచ్చు మనమెర్సి
క్షరముకాని అక్షరాన్ని అందజేయు జనమెర్సి
కాలవిలువ గమనించెడి కాంతిదాయి కలమెర్సి
పాఠశాల ప్రాంగణమే సుందరతల సుధమెర్సి
పేరుదయా పెద్దమనసు పెంపొందును ధరమెర్సి
కందుకూరు కందమిదే కమ్మరుచుల నిధి మెర్సి
మాత మమత తండ్రితపన గురవు గురుతు కథ మెర్సి
ఆస్తికతను అమరించగ చిరుమనసుల తిరు మెర్సి
బిడ్డ భవిత వ్యక్తిత్వము గుణశీలము వెలుగు మెర్సి
కళలయందు కంప్యూటరు కలరవముల కాంతి మెర్సి
చెట్లనీడ ఆట చెలువు ఆరోగ్యము నందు మెర్సి
తరగతి గది పరిశుభ్రము సహనసహిత గురువు మెర్సి
కీర్తికరము క్రీస్తునేల పరహితమిట పరమ మెర్సి
ఆంగ్లభాష విశ్వభాష విదితమగును విలువ మెర్సి
వల్లెవేత వరపుకాదు వివరణమే విద్య మెర్సి
సహనశీల మగువలిచట అధ్యాపకుల సరసమెర్సి

గురుకులమును మించునదియె గురుదేవుల కులము మెర్సి
తెలుపు తెలివి పచ్చ కలిమి తెగువ వెలుగు తీరు మెర్సి
ఆశదీర్చు ఆశయముల నందజేయు అమర మెర్సి
అంతరంగ రంగులన్ని అమలినముగ అవని మెర్సి
మేరువగును మేథమిగుల పావనమగు పథము మెర్సి.

662

అఖండ కాలానికి ఖండమైన అవధి ఈ ఉగాది.
లౌకికానికీ ఆస్తిక్యానికీ మధ్య లోలకం ఈ యుగాది.
గ్రహాల పావనత్వానికీ గ్రహాంతర యానాల నాగరికత కాద్యంతం ఈ యుగాది
ఆది అంతం తెలియని అవగాహనలోని మధ్య మానవత ఈయుగాది
జీవానికీ నిర్జీవానికీ నిర్ద్వంద్వమైన నియంత ఈ యుగాది
స్వార్థానికీ పరమార్థానికీ సోదరత్వాన్ని అమరించే అమరిక యుగాది
భావనలో నవగ్రహాలకూ నవరంధ్రాలకు నవరసరూపం యుగాది
'బహుధాన్య' ధాన్యమయమై మానవుల దానశీలతకు ద్రఢిమనివ్వాలి.
పురాణం పుక్కిటిదైనా నమ్మకం నిండితే జీవనం పండుతుంది.
పంచాంగం వినడానికీ తీరికలేని స్వార్థం జీవితానికి సార్థక్యాన్నివ్వదు.
కూటికోసం కోటివిద్యల బ్రహ్మజ్ఞానులు కోకొల్లలుగా పుడుతున్నారు.
వత్సరానికి తొలిరోజు వార్థక్యానికి చిహ్నంగా ముగియరాదు.
అంతం తరువాత అవసరంలేని ఆర్థికానికి అర్థం చెప్పే రోజిది.
కందాయ ఫలాల కందుకాలు ఎగరలేని మృత్పిండాలై దారిద్ర్యంలో చతికిలబడ్డాయి.
ఖండమైన కాలానికి గుర్తుగా మళ్ళీ మళ్ళీ వచ్చే ఉగాదులు వగాదులే.
చెదరని ఆత్మస్థైర్యం, చెరగని దీక్షలకు దక్షతనిచ్చే ఉగాది కావాలి.
మోసానికి మొదటి మార్కు మానవాంతరాళానికి వింత విరుగుడు యుగాది
జ్వలించే చైతన్యం కాలపురుష నిరూపంలో రాజిల్లుతున్నాడు.
వసంత కాలానికే వడగాడ్పుల వాలకం కాలవైపరీత్యానికి నిదర్శనం
వేపచెట్టు పూతలేక పూజ్యమై చేదువల్ల చేవవీడి చెదరిపోయింది
మామిడి మిడి మిడి పంటగా కోకిలకంఠపువగరై కలలపంటగా మారింది.

663

698

కర్మాగారాల కాలుష్యానికి చెరుకుతీపి కరకు కర్షక వేదనైంది
రుచిని గ్రహించలేని రసనలకు షడ్రుచులూ చేదౌతాయి
వత్సరవాసికి వార్ధక్యం రానివిధంగా మలచుకొనే మానవ జీవన యుగాది.
అనంతుడైన పరమాత్మ దర్శనం పలురీతులుగా సాగే భిన్నత్వంలో ఏకత్వం యిది
రాజకీయులు రాజేసే కుంపట్లు కూలగొట్టే జలభాండం యుగాది
ఉంటుందా ఊడుతుందా? అనే ఉత్కంఠలో కంఠానికి చేదు ఈ యుగాది
చెక్కలైన సమాజంలో ముక్కలౌతున్న పార్టీల పరువుకు దరువేసే ప్రజాస్వామ్య యుగాది.
సభాంతరాళాల సందడులు జనాంతరంగాల సమ్మెట పోట్లుగా ప్రత్యక్షమైన యుగాది.
వసంతోత్సవాలకు వందనం చేసే నరులు స్వార్థంతో చేతులకు సంకెళ్ళు వేసికొన్నారు.
వసంతం సంతకెళ్ళి పదవుల పీఠాలుగా అమ్ముడుబోయి రాజకీయంగా రంగు మార్చింది.
ఆకాంక్షలు శుభంకోసమయినా కాంక్షలు అశుభానికి మూలాలౌతున్నాయి.
కల్పతరువును కూడా నరికేసి కుర్చీలకు వాడుకొనే స్వాములున్నారిక్కడ.
కామధేనువును కూడా కత్తికెరజేసి భాగాలుగా అమ్ముకొనే భాగ్యులున్నారిక్కడ.
పవిత్రం అపవిత్రం అర్థం తెలియని అర్థార్థుల లోకమిది.
తెలుగురాని తెలుగు నేతల తలరాతల్ని మార్చే ఉగాది ఎప్పుడో.
రాజపూజితం అవమానం మానం విడిచిన వారికి మక్కువకాదు
పూజ్యం కానివాణ్ణి పూజిస్తున్న ప్రస్తుత లోకంలో పుణ్యానికి విలువ ఉందా?
మభ్యపెట్టి దోచుకొనే మానవనైజాన్ని నాటుబాంబులతో పేల్చాలి
నలుగురికీనయమైన నయనంగా జననాయక యుగాది జయమివ్వాలి.

664

అంకురించే అవినీతి చెట్టువేళ్ళు నీఅంతరంగంలో పాకి విస్తరిస్తున్నాయేమో చూడు
ప్రధమపౌరులూ, ప్రధానమంత్రులు ప్రవచించే అవినీతి విశ్వరూపం దర్శిస్తే అంధత్వం, వంధ్యత్వం ప్రాప్తిస్తుంది.
మన్నికలేని ఎన్నికల మారణహోమంలో ఓటర్లు సమిధలే
నల్లడబ్బు, తెల్లలాల్చీ, చెరగని విషపునవ్వు వెరసి ప్రజాప్రతినిధి
విద్యాభారతి విలువల వలువలూడ్చిన విబుధుల సన్యాస విన్యాసం
జంబ్లింగ్ గాంబ్లింగ్‌లో ముక్కరానివాడు పరీక్షలో ఆటముడుస్తాడు.
అందరూకలసి అందంగా కన్పించే సుందరిని చెరిపేస్తున్నారు.

మగువమానం మాన్యంగా అనుభవించే మగపురుషుల కట్నలలీలల కలికాలం
రక్షకులూ భక్షకులూ ప్రతినిధి ప్రభువులైనపుడు రాజ్యం 'వీర'భోజ్యమే
ఆత్మహత్యల అమరారామం ఆంధ్రదేశమై పత్తి పకపక నవ్వింది
అన్నదాత విన్నదనానికి అవనత శిరస్కయై తెలుగుతల్లి శోకిస్తుంది
అస్తవ్యస్త అవ్యవస్థ వ్యవస్థ పెట్టే అవస్థలకు సామాన్యుని కటకట
నీరులేని బావుల్ని నిధులతో తవ్వించి నీరసించిన ఉద్యోగి గణం
ఆశలకు అవధిలేదు, ఆశయాలకు వ్యవధిలేదు, పరమావధి ధనం
స్వార్థం సార్థకమై స్వాతిశయం ఆశయమై స్వామ్యం గమించే తీరు అగమ్యం.
పేదవాణ్ని పైకితీసే ప్రత్యేకతల జడివాన పాలకుల కులపరం.
స్వర్ణభారతి స్వర్గంగా స్వర్ణమయ భూమిగా శతమానానికి అవతరిస్తుందా?
ఉగాది గాథలు వ్యథార్త జనాళికి వెలుగురేఖలై ప్రసరించేనా?

665

ఎదురుతిరిగే ఆశయ సారథులు ఎదురుకాల్పుల్లో హతం
హితమతుల హిమవన్నగ వ్యక్తిత్వాలు వ్యవస్థలో అవ్యక్తాలు
పదవి అధికారాల పదను ధనసంచయంలో ఇరుకొనసలూనిశితం
బడ్జెట్ వచ్చిందంటే జెట్ వేగంతో కదిలే కాంట్రాక్టు టెండర్ల కామందులు
ఇంజనీర్లు పర్సెంటేజీకి పాలుమాలితే 'మాలు'గోల్‌మాలయి కట్టడం కూలడం ఖాయం.
టెండర్ల బాక్సుల బాక్సింగ్ క్రీడలో రాజకీయ బలవంతులు రాటుదేలారు.
చిత్తాన్ని విత్తాన్ని జీవితాన్ని చిత్తుచేసే మత్తు సర్వవ్యాప్తమయిసంచరిస్తుంది
విప్లవించిన మహిళ రాజకీయుల ఆర్థికాశయాలకు రోసి 'వావిలాల'లా విలపిస్తున్నది.

ముప్ఫయిమూడు మద్యం షాపులు ముద్దుపెట్టుకొన్న కందుకూరులో కమ్మదనాన్ని కాంక్షించగలమా.

వెలిగొండ రాజకీయుల సుడిగుండంలోపడి వెలుగుదప్పకుండా భూమిమాత దప్పిక తీర్చాలి.

జనతను జాగృతం చేయలేని జన్మభూమి సిద్ధాంతం ఆచరణలో రాద్ధాంతమై అర్థరహితమౌతున్నది.

లోకసభలోలత్వం కాలం తెలియని కార్ముకమై ఎన్నికల రణక్షేత్రంలో ఓటర్ల ఎదలలో గుదులుకొంటున్నది.

700

సత్యహరిశ్చంద్రులు ప్రతినిధుల సభలు ప్రజాస్వామ్యంలో అసత్యాలకూ, ఆగడాలకూ అవధులు.

తెల్లకార్డుల రాయితీలు తెగువకల ధనవంతుల తెలివికి కరతలామలకాలు.

మార్చిన పార్టీలు నేర్చిన రాజకీయం జనదారిద్ర్యాన్ని తీర్చలేని గణతంత్ర భారతి గణ్యం.

మననంచేయకపోయినా మలినమైన విద్యాలయాలు మాన్యరాజకీయుల విధ్వస్తహస్తాలై విరాజిల్లుతున్నాయి.

రంగుల కల్లలు బుల్లితెరబబులపాటమై మురిపిస్తూ మైమరపిస్తూ జనమనసుల్ని నశ్వరం చేస్తున్నాయి.

తప్పెవరిదని ప్రశ్నించే తగవరి తనతప్పును గ్రహిస్తే స్వర్ణభారతి స్వర్గతుల్యమే.

అందని దానిని అందుకొనే యత్నంలో అందిన అందాన్ని జారవిడుచుకొనే అధముడు నవ్యుడు.

కోట్లు కొట్లాటలకు కారణమైనా కూడుబెట్టకపోయినా కోర్కెమాత్రం కోమలమే.

ఆక్రమణల విక్రములకు క్రమంలేని శాసనాల అనుక్రమం అడ్డం కాదుగదా!

పరమాన్నంలా ప్రభుత సొత్తు ఆరగించే అధములకు ప్రతిరోజూ పర్వదినమే.

కారాకిళ్ళీల కంపు, గుట్కాల గుబాళింపు, మద్యం మంపు, చుట్ట సొంపు, నవ్యుల కింపు.

666

లెఫ్ట్, రైటులు మరచిపోయిన వాహనచోదకులకు రహదారి రంకులాడి
తంతి విభాగపు తాంత్రికులు పలకని తంత్రులను భూమిలో పూడ్చిపెడతారు
అనధికార కట్టడాలను అధికారికంగా కూల్చే అసమర్థ అధికార్లు
బినామీ పేర్లతో యినాములనుభవించే హితమతుల పాలనమనది
ప్రజలకోసం ప్రభుత్వ శాఖలనుకొనే పరములపబ్లిక్ స్థలాల ఆక్రమణ
ముచ్చటగా మూడుసార్లు జన్మభూమిలో అడ్డులేని ప్రభుత్వధనం హరింపు
తన పాయసం రుచిస్తుందో లేదోగాని ప్రభుత్వమురికిగుంటైనా పరమం
రక్షణతో జనమధ్యకొస్తున్న రాజకీయులు భక్షణ పాలు మితిమీరుతున్నది

లోకం ఎటుపోయినా లోలాకుల పెట్టుకుతిరిగే రాజకీయ భావులు లాకులెత్తిన లంచగొండితనం.

రాజకీయ మగత విగతజీవమై ప్రజాప్రతినిధి పార్టీప్రతినిధిగా మారాడు.

పార్టీలు పంచబంగాళమైనా పార్టనర్లుమాత్రం చెక్కు చెదరనివారే.
సిద్ధాంత చిన్మయం చితికి నిప్పంటించి రాద్ధాంతం చేస్తున్నవారు
కొత్త ఎత్తుల కోమలత్వంలో చిత్తవుతారనుకొన్న ప్రజల చిత్తడి తత్త్వం
మార్పు మాటల్లోరాదని తీర్పుచెప్పేవారు యత్నించి ఎఱుకపొందితే మంచిది.
గ్రామరాజ్యం గానుగెద్దులా 'అరగళ్ళ'తో తిరుగుతూ అలసిపోతున్నది
రామరాజ్యం రాబందుల రాజకీయంలో జటాయువులా ఆయువిడిచింది
పూడిపోయిన పూజ్యభావం బృహన్నలలా అవతారమెత్తి అంతానికి నాంది పలికింది.
నిరుద్యోగంతో నీరసించిన నీతిదప్పిన యువత నింగిని తాకాలని యత్నం.
నిల్చున్న భూమినే నిలువునా చీల్చి పంచుకొనే తల్లీబిడ్డల ప్రేమాతిశయం
నడరాని బిడ్డను నాజూకు యువతీయువకులుగా చూడాలనె ఆశల ఆరాటం
జీవన పోరాటం జీవహీన సర్పమై జనజీవనాన్ని భయభ్రాంతం చేస్తున్నది
మొగ్గతొడగని పసిబిడ్డల పసిడిబుగ్గల జీవనవృక్షం గాలి, నీరందక గతజీవమౌతున్నది
అమ్మ అందించలేని అనురాగం ఆలిపొందు కల్గిస్తుందనే ఆధునిక పెండ్లికొడుకుల ఆవేదన.

667

సీ. గ్లామరు పార్టీలు గగనానికెళ్ళెను – రోలరు పార్టీల రోజులొచ్చె
సిద్ధాంత సిరులతో సిగ్గును విడిచిన – సిరిమల్లె పార్టీలు చింతనుండె
భారతీయతకోరు భాగ్యంపు పార్టీలు – భావదాస్యముతోడ బావురనియె
ప్రజల సేవను మర్చి పాలన వెలిగెడి – పార్టీల పరువేమొ పరమమయ్యె.

గీ. భారతీయుల ఐక్యత భంగమగుట – అప్పు అతిశయ రీతిన తిప్పలుగను
ఆర్థికమ్మగు అంతస్థులధికమాయె – అంతరంగాలు ఆశల అతిశయములు.

సీ. అధికార్లు నాయకుల్ అతిసఖ్యమెంచగ – చట్టాన దోపిడీ సరగు మీరె
వార్తల వైనమ్ము వాసిగా వెలుగును – చేతల తీరులు చేవవీడు
యోగులు భోగులు రాగులు త్యాగులు – యోజన విధమేమొ ఓజ రహిత
అంతయు కలిసిరి వింతగ జగమున – జనసొత్తు దిగమ్రింగ జయము దప్పు.

ఆ.వె. ప్రజల మార్పురాదు పాలననంచును – వట్టిమాట లాడ వరపులేదు
యతనమిలను జేయ యాతనల్ తొలగును – మార్పు తథ్యమగును మార్గమందు.

సీ. స్వార్థమ్ము సార్థక స్వామ్యపు అర్థమై – స్వాగత మొనరించు స్వాములుండె
నీతిని చంపిన నిధులను మించిన – నయవంచకులమాట నాణ్యమయ్యె
కపటమె మార్గమై గమ్యమె నటనమై – కాలాన జనులంత కాముకులయె
గీతలో తెలిపిన గీర్వాణగురుతయు – రాతలో మారగా రాక్షసులయె.

గీ. ఎన్నిచెప్పిన మార్పుకు ఏది దారి – వ్యక్తి వెతలందు మునుగగా వెలుగుశక్తి
శక్తిహీనము శమమున రక్తిలేమి – మార్పుతీర్పుల మాన్యము మనమె జగము.

సీ. అధికార్ల నిలదీయు అధికార గరిమను – కలిగిన పాలకుల్ ఖరులుగాను
ప్రజల నాదేశించు పరములు దేశాన – పత్రికలందున ప్రకటనమున
రక్షణకరవైన రాజ్యంపు జనులకు – అధికార్ల ప్రశ్నింప నధిక భయము
ఆదేశ దేశికుల్ అవనిని నాయకుల్ – గెలిచిన తరువాత గేలిసేయు.

గీ. ప్రజల ఐక్యత చెడగొట్టి ఫలితమొంద – యత్నమొనరించి ఎఱుకన ప్రతిఫలాన
అనుభవింతురు అధికార మనుభవమ్ము – ధనము గణనయె ధరణిని ధర్మమనుచు.

ఆ.వె. నీతి పదట గలిపి నియమాల వర్జించి – కాలగమన మందు కాంతివీడి
జాతి దేశభక్తి దేవుని సొత్తుగా – నేటి రాజనీతి నేత దలచు.

సీ. ప్రభుతను ప్రయివేట్లు ఫలమొందు విధమెన్న – ప్రాభవ రహితగా ప్రభుత మిగిలె
చట్టాల మాటున సాగెడి అవినీతి – జాతిని చంపుచు జయమువీడె
చైతన్య రహితగా చేతల విగతగా – సుగతిని జేరగా మగత మాత
అందరు కలిసిన అసమర్థ పాలనన్ – అర్థమ్ము వ్యర్థమై అవని విడిచె.

గీ. మాన్యమహనీయ మాతకు మన్యముండె – దానిరక్షించు వారలు ధరణిజనులు
రక్ష సహితులు భక్షింత్రు రాక్షసులుగ – వారలెవరన నేతలె వాసి భువిని.

సీ. నేవళమునువీడి నేతల చిట్టాలు – చితికిన బతుకుల చిచ్చులాయె
ప్రాభవ పథకాలు పాలక ప్రభువులందు – పసలేని ససిచెడ్డ పలుకులాయె
వెనుపోట్ల నిండిన వేకువ పథకాలు – సంద్రాన వానగా సాంద్ర రహిత
'చంద్రుడు' సూర్యుడు చెంగలించిననాడు – వాజపేయమునందు వాసివీడు.

గీ. నడత నాణ్యత నయమున్న నరులయందు – వర్తనమునందు వరపైన వరులయందు
చిత్తశుద్ధిని నిండిన చెలువు పరుల – మాట మనసున వెలువడ మాన్యమదియ.

**సీసమాలిక**

మమకారమమ్మగా అనురాగమమ్మగా – ప్రేమరాగములకు పేరుతాను
జన్మకు నాందిగా జగమున జయమొంది – ప్రాణము నిచ్చిన ప్రాణియమ్మ
నవమాసములుమోయు నయమైన నవలగా – పోలిక లేనట్టి పోడిమమ్మ
లాలను జోలను లాలించు పాలించు – లాస్యమ్ము లావణ్యలలితమమ్మ.
ఒడిజేర్చి పాలిచ్చు ఓరిమి కూరిమి – వాత్సల్య భావంపు వాసియమ్మ
నడకను నేర్పించి నడతను సరిదిద్దు – నయగారముల ప్రోవు నయనమమ్మ
అందరిమిన్నగా అమ్మయే కన్నుగా – అవనిని ఆదియై అమ్మయుండు
మంచికి మమతకు మాణిక్యమమ్మగా – మానవలోకాన మహితమమ్మ.
మానవతను మించు మార్ధవ మనసున – మాలిన్య రహితమౌ మంచియమ్మ
హరియించ తనువును హవణించు మాతృత్వ – ఆదిశక్తిగ భువి నాద్యమామె
అందమదృశ్యమై పొదగు బిడ్డయై – కనులార గాంచిన కామితమ్ము
రక్తమ్ము వెడలగా రక్తిమ రవణమై – అమ్మను రూపము అవని నిలచె.
మరణించి బ్రతికెడి మరువమ్ము మాతగా – కన్నబిడ్డను జూచి కలతవీడు
ప్రేమాంతరంగమ్ము ప్రేరణ పూజ్యమౌ – మమతానురాగాల మాల యమ్మ.
కొడుకైన కూతైన కొరతను చూడని – కడుపు కోతను నిండి కదలు భువిని
సుందర రూపమ్ము సురుచిర చేతమ్ము – బిడ్డకు కల్గగా బిగియు కోర్కె
తనువును పంచిన తపనయు తీరగా – తల్లిని తనియించ తగవు జగతి
ఆడతనమునందు ఆర్తిని సహనాన్ని – అవనికి పంచిన దతివయగును.
రాముడై కృష్ణుడై రహిని పాలించగా – కొమరుని కాంక్షించు కొమరునమ్మ
దేవియై దివ్యమై దేవత తానుగా – ధరణిని కొమరిత వరణముగను
పార్వతై, పద్మయై పాంచాలి సీతయై – ప్రాభవ మొందగా పడతి గోరు
భువిదివినేకమ్ము భువనాన జేయగా – దాక్షిణ్య ధైర్యాలు ధరణిసాగ
తనువుల తరళమై తనయుల తరుణమై – అలరారు బిడ్డడు అవని వెలుగు
అన్యోన్య సంతోష అంతరంగాలతో – అమ్మలు బిడ్డలు అలరగాను
తల్లిని పూజించ తపనయు తీరును – సంతస మహితమై సాగు జగతి
అమ్మలు అలరగ అతిశయమౌ భువి – ఆనంద నందన మగును మనసు
ఉత్తమ గర్భాన ఉన్నతిన జనియించ – కోరుదురందరు కోమలముగ
తల్లిదండ్రులమించు తనయులు కలుగగా – భవమును పండును భాగ్యగరిమ

నీతిని నిలబెట్ట నియతిని నినదించ – అమ్మనాన్నల మాట అంతకోరు.
షట్కర్మయుక్తులు సహధర్మ చారణుల్ – మహిళలు భువిలోని మాతలంత
వ్రతముల పరములు పతివ్రత నియతులు – పరమార్థ మహితులు పావనులుగ
సృష్టికి మూలముల్ తృష్ణకు దూరముల్ – మృష్టిమౌ మాతృత్వ మురువు జనులు
అమ్మలగన్నమ్మ అవనికి అమ్మగా – ప్రతివారి కమ్మయే ప్రాథమికము
సార్థక జన్మగా మాతృత్వ శోభిత – సహకార మమకార సారథిలను
ముగ్గురు మూర్తుల మూలపుటమ్మగా – అపవర్గ మిచ్చేది అవనికమ్మ.
దేవసేనానికి దివ్యమౌ అమ్మగా – పార్వతి పర్వమై పథము నిండె
విఘ్నేశు మాతకు వినుతంపు ప్రేమను – లోకాల పాలించు లోక జనని
వీరకుమారుల వినుతిగ గన్నట్టి – వీరమాతల గర్భ విజయమేమొ
దుర్గమ్మ దురితాల దూరమ్ముసేసెడి – దుర్గమై సర్గమై దుఃఖహారి
వినుత పురాణాల విజయంపు కావ్యాల – వివరింప బడెనమ్మ విలువ వెలుగ
అమ్మకు సంతసమవనిని కలిగింప – బిడ్డల భావియు పెరుగు జగతి
సంతోష సారథుల్ సదయకు వారధుల్ – విబుధులౌ తనయుల విలువ దెలియు
మాతృప్రేమను పొందు మహనీయ తనుగను – మాన్యులు పిల్లలు మరువములుగ.
పుట్టింటి పూతయై పురిటింట పూజ్యమై – పుణ్యాల రాశిగా పుత్తడమ్మ
బంగారు భవునింట భాగ్యాల రాశిగా – రంగారు సింగార రాజ్యమమ్మ
అతివను అమ్మగా అతనుడు ఆడించ – మతిమంత హితమతి మహిని అమ్మ
మన్మథు మాన్యము మహనీయ మమ్మగా – తలపున తరగని తరగ తల్లి.
చూపుల చురకల చురకత్తి మాటల – చెట్టను మరలించు చెలువు మాత
వర్తన తొలిగుర్వు వాసిని నేర్పరి – 'మాతృదేవోభవ' మహిత సూక్తి
తల్లిని మించిన తగురీతి దైవము – ధరణిని లేదన్న వరపు మాట
మమతకు మల్లిగా మధువులు పంచగా – భువినిండు బిడ్డల భూరి కలిమి
ఆదాము కవ్వగా అవనిని సృష్టించ – ఆదిమ తల్లిగా అవతరించె
గుండెను నిండిన గురువుగా గురుతుగా – గహనము పోద్రోలు కాంతి గరిత
సాంఘిక జీవిగా సవనమ్ము సేసెడి – సామాన్య మానవ సమత మాత
తప్పును తరుమగా ముప్పును తొలగించ – తెలివికి తేరైన తేటియమ్మ.
తనతప్పుతెలిసిన తనయుని మన్నించి – మురిసెడి ముద్దుల మూర్తి తల్లి
తనమాట తగవున తనువున మనసున – ఆచరించెడి బిడ్డ కవని రక్ష

గృహసీమ గరువమ్ము గ్రహపాట్ల తొలగించి – ఇంటికి ఇల్లాలు ఇరులు వీడ.

669

వేసవి చవి వెలుగుల వడి వెతలకు బడి వడగాలి
దినకరుకర కిరణపు జడి మానవజన తనువుకు తడి
వేసట వల వృద్ధుల విల విలయపు విధి విగతము చలి
ఎండ మంట ఎదకు తంట ఏడేడుకు పెరుగునంట ఎడదగంట
చల్లగాలి యంత్రాలకు చవులూరెడి జనమనసుల మడి
చల్లదనపు పెట్టెలకు సాగుజనుల మనోరథపు మగతవిగత
ఏసీలకు వాసివెలుగు గ్రీష్మతాప గిలిగింతల కేరింతల
మంచుకొండ కెళ్ళువారు మహిసూర్యుని వెలుగులేక మనలేరిల
అనావృష్టి తాండవించ అవనిజనుల ఆర్తినించు అమరకిరణుడు
కర్మభూమి జనఘర్మజలానికి కారణభూతుడు పగటి ప్రభువే
పచ్చదనం పోషించి పరువం పెంచే ఎండమండితే ఎఱుక శూన్యం
జయించిన ప్రకృతి జవం వీడ నంటుంటే వేడి సూర్యుని వెలుగు వంతపాట
ప్రకృతి కృత్యానికి పరవశించలేని నరుడు వికృత మార్గాల నన్వేషిస్తూ విఫలుడు
చెట్టుపెంచడానికి చేతులురాని అచేతనుడు నరకడానికి నడుం కడుతున్నాడు
సహజ వనరుల్ని కాలుష్యంలో కప్పి తాపానికి గదులు నిర్మించుకొని తరించే నరుడు
చైతన్యం లేని చైత్యంగా మారిన జనుడు సూరీడుని చూడడానికే జంకుతున్నాడు
చైత్యానికి ఎండంటే చెలిమి, కాని జీవమున్న మానవాళికి సూర్యకిరణమంటే భయం
ఎండవీడితే ఎఱుక వీడే ఎదగలవాడు ఎండమండితే యాతనలో సతమతం
నింగి నిండిన నిజాయితీ సూరీడు భూమ్మీదకు వచ్చేసరికి భువిజన భూతం
దివ్యత్వం దీనత్వంగా అఘోరిస్తుండే కనబడే దివ్యునికి కర్కశపు తిట్లు
ఆకాశంలో అగుపించే పగటి ఆస్తికుని అనుబంధం అర్థంతో వ్యర్థం చేస్తున్నారు
రాత్రి కన్పించే రామణీయకానికి పగటి పావనత్వానికీ మూలం కిరణమే.
చీకటి చర్యల ఎదగదుల్లో ప్రవేశించలేని సూర్యకిరణాలకు మాలిన్యం మగత
మారణహోమాన్నీ మహిలోని మాలిన్యాన్నీ సమభావంతో చూసే సూర్యునికి వందనం
స్వార్థాన్ని తరిమేసే స్వాహాదేవిని అర్థాంగిగా అమర్చుకొన్న సహస్రకిరణుని కభివందనం
కర్బనవాయువుల దౌర్జన్యానికి, కార్బన్ రాజకీయాల దౌష్ట్యానికి కాలాంతకుడైన సూర్యునికి నందనం.

670

సీ. ఆంధ్రాన అల్లూరి సాంద్రుడై అమరుడై – అమర జ్యోతిగ నేడు అవని వెలుగు
తెల్లవారల పక్కబల్లెమై విల్లమై – భవమున సాగిన భరతబిడ్డ
విప్లవ సింగమై విజయంపు కొదమగా – వినువీధి తాకిన విబుధుడతడు
మన్యంపు వీరుడై మాన్యంపు పంటయై – ఆదిమ వాసుల ఆప్తుడడు.

గీ. మన్యరాజ్యపు రాముడు మగడు జగతి – సిరికి సీతకు సరిజోడు చింతనమున
తిరుగుబాటున తిరుగని తీరువింత – ఉద్యమమ్మున ఊపిరి ఉర్వరకును.

సీ. బానిసత్వమువీడ భారతిన్ కాంక్షించి – ఆకాంక్ష దీర్చగ ఆశయమ్ము
పెరవారి పోద్రోల ప్రేరణ మహితమ్ము – ప్రేమను పంచిన పేర్మిజనుడు
నాయకత్వమునందు నయమైన నవ్యుడు – స్వేచ్ఛను వాంఛించు చేతనుండు
నేతాజి మార్గాన నెనరున ఎదిరించి – వీరస్వర్గమునందు విడిది సేసె.

గీ. అడవి చైతన్యవంతమై ఆశయమున – చెట్టుపుట్టల గట్టుల చెలిమి మిగిలె
ఐకమత్యము అవనికి ఆర్తిదీర్చ – తెల్లదొరతనమును వీడ తెలియజేసె.

సీ. అన్యాయమెదిరించి అవనికి అన్నయై – దోపిడి దారుల దొసగులెన్నె
మాటతో మరలని మదగజములతాను – సింగమై భంగించి శివములిచ్చె
శ్రమచేయు సరియైన శ్రామిక కూలియు – ఫలముగ రాకున్న ఫలమునిచ్చె
మహిళల మన్యము మానని హీనమై – మదమున నుండగా మాటుబెట్టె.

గీ. తెల్లరాజ్యము తెగులున్న తెంపరాయె – భరతమాతను దోచగ భాగ్యమేగె
మతము హతముగ విమతుల మతులు వీడె–ఆంధ్ర బిడ్డడు అసమాన సాంద్రయశుడు.

గీ. అమరవీరుల మన్యము ఆంధ్రభూమి – సమర సాంద్రుల సవనము సాగె నిచట
ప్రాణములనొడ్డి పోరాడె పావనముగ – వీరమాగాణమాయెను వినుత మహిమ.

గీ. రక్తతర్పణ జేసిరి రక్తులంత – దేశభక్తిని దిటవున తెలియజేసి
మాత సంకెల విడదీయు మహితులంత – భరత జయగాథ భవమున భాగ్యమిడుత.

గీ. గుండె నెదురిచ్చి గుండున కూలెరాజు – తెల్లకుక్కల తెలివికి తెగువ వీడె
భూమిపై బడ్డ రక్తంపు భూరి మహిమ – వేల 'రాముళ్ళు' ప్రభవించ వెలుగు కలుగు.

సీ. అమరావతీ గ్రామ మల్లూరి వాసమై – స్వర్గమ్ము వీర్యాన స్వాతిశయము
అవనిని ఆంధ్రత్వ అరుణిమ నంతను – దివిసీమ వెలిగించు దిటవు మీర
రాక్షసరహితమై రహియించ దివినంత – తీర్చిదిద్దెడి తీరు తీయనగును
సమతయు మమతయు సుగతియు శౌర్యము – సాగివచ్చెడు రీతి సామ్యవాది.

గీ. వర్గపోరాట వారధి వాసి వెలుగు – మేధ మేలిమి మెలకువ మేరువతడు
చేత చైతన్య పూరిత చెలిమియుతుడు – ఆంధ్ర భారత మాతల అనుగుకొడుకు.

సీ. ఆంధ్రత్వమవనిని అభిజాత్యమ్ముగా – ముందుగ సాగిన ముద్దుబిడ్డ
వీరత్వమున్గన న్యాయమ్ము న్యాసాన – నేతల తలదన్ను నెనరుకూన
రవి అస్తమిచని రాజ్యాన రాజిల్లి – రాజుగా క్షాత్రమ్ము రహిని బట్టె
స్వాతంత్ర్య దీక్షతో స్వారాజ్య కాంక్షతో – స్వాభిమానమ్మున సాగెజనుడు.

గీ. ఆశ ఆశయ సాఫల్యమవని జనుడు – గుణము శీలము గురువులై గుంభనమున
రాజ్యరమనిండె రమ్యుడు రామునిగను – రామరాజ్యము కోరిన రహిని రాజు.

671

సీ. భాషకు బంధమై భావానికందమై – 'ఆత్రేయ' వాణిగా అవని వెలసె
మనిషికి మనసుకు మరణంపు మహిమకు – సారథై వారధై సాగె నదియు
తేటగు మాటల తేనెల చిందించు – తెలుగుల వెలుగుగా తెలుపు మీరె
బాధకు గాథగా భవమున భాగ్యమై – కవితకు పాత్రమై కలము వెలిగె.

గీ. రాగమనురాగ రాగమై రహిని వెలసె – హితము సాహిత్య సౌరభ మితులు మీరె
గతము భవితకు వారధి గమ్యమిదియె – పుట్టి పూజ్యమై మరణించి పుణ్యుడాయె.

సీ. మాటల మాధురి మానవ తత్త్వము – మహినిండ మాన్యుడు మనసు కవియె
భాషణ భాగ్యము భావము నిండుగా – గుండెల నిండగా గురుతు మీరె
పాటల పాటవ ప్రాధాన్య ప్రభవమ్ము – గానాల రాగాల గణ్యమాయె
మనసున మండించు మమతను నిండించు – మరువమ్ము గరువమ్ము మాన్యకవిత.

గీ. తనదు బాణియె తరగని తపన కవిత – చిన్నమాటల చిందించు చెలిమి మిన్న
లోతు భావాల పేటిగా జాతినుడులు – వెలుగు జిలుగుల వెదజిమ్ము వేల్పు కవిత.

గీ. మనసులోతులు తెలిసిన మాన్యుడతడు – తెలుగు మాటల తేనియల్ తేటలూరు
చావుపుట్టుక సరగులు చాల దెలియ – మనసు కలిగిన మరువము మనసు కవియె.

672

ఏడుదినముల సృజనలోనన ఎఱుక మానవు నెరిగె దేవుడు
ఏడురంగుల మల్లెరంగున మమత మహిమల మాన్య సూర్యుడు
ఏడు గడకిట అడుగులేడుగ అతివ అతడును అవని వెలిగెను
ఏడు స్వరములు సరిగమపధని జీవగానము మధుర మిచ్చుట
ఏడు మాటను ఏడ్చునర్థము పుట్టిగిట్టిన సమయపదములు
సూర్యునశ్వము లేడె చెప్పగ హరితవర్ణము అతనికిష్టము
ఏడు దినములె నరుడు పుట్టగ పురుడు జరుగును పూజ్యమగును
ఏడు అడుగుల బంధమగునిట సృష్టికార్యము జరుగు జగమున
ఏడు జన్మల బంధమాయెను దంపతులకది దివ్యబంధము
సంతు లేడుగ చెప్పబడెనట వంతవీడగ నవియె తోడగు
ఏడు సంఖ్యల దానములుగన మాన్యుడగునిట మానవుండుగ
ఏడు లోకములుండె నూర్ధ్వము క్రిందనుండెను సంఖ్యయేడుగ
ఋషులు జగమున సప్తసంఖ్యులు కృషికి నిలయులు కూర్మి మహితులు
సప్తధాతువులుండె జగమున అవియె ధ్రఢిమకు కారణమ్మగు
సంతు సప్తము పాలనమ్మున రాచరికమున రమ్యమాయెను
ఏడుకొండలు కలియుగమ్మున హిందుదేవుడు ఉండు దేశము
క్రైస్తవమ్మున ఏడుసంఖ్యకు ఎఱుక ముఖ్యము ఎదల పదిలము
ఇష్ట సంఖ్యగ ఇంపునింపెడి ఏడు దినముల సృష్టి హితమగు
మతము మారిన హితము మహితమె మరుడు మారిన మనసు మరువము
మతము సారము మానవత్త్వము మతులు పదిలము మనసు కలుగగ.

673

ఆదిదేవుడు ఆర్తిబాపగ క్రీస్తు కర్తగ కాంతి కలిగెను
సృష్టిచేసెను ఏడుదినముల నరుల కతడయె ఏడుగడగను
అనుభవించగ అందములనిట అతడె కారణమతడె కార్యము
భూమి మిన్నును వెలుగుచీకటి నీరు సంద్రము నియతి నుంచెను
సంద్ర జీవులు భూమి ప్రాణులు భువన సారము భుక్తి శక్తులు
దినము దినమున దివ్యమహిమల దీప్తి నించెను భువన దివముల

ఏడురంగుల వెలుగుచూపెను అంధకారము అవని చూపెను
రాత్రి దివముగ రచనచేసెను సూర్యచంద్రులె సుగతి సుధలుగ
ఇంకె సంద్రము నేల నెనరున బయలు పడియెను భూమి పేరున
వృక్షతతులను బీజభావము కల్పనమునను కాంతిమీరెను
రెక్కలొచ్చిన పక్షితతులను రేపు మాపుల ఎగురజేసెను
జీవులన్నియు మాంసభరితము మాంస మహిమన మరుడు కలిగెను
భుక్తి నిద్రయు భువన జీవుల శక్తి సహితము శమము జగమయె
మరుడు మనునిట మహిమ యుతుడుగ జీవులన్నిట మిన్నమనసున
ఒక్కడాయెను నరుడు జగమున మక్కువగనిడె మగువ దేవుడు
ఏడుదినముల ఎఱుక కల్పన ఏడుగడకిది ఆది అంతము
సప్తవర్ణము సారసహితము వెలుగు విశ్వము కలిగె ముందర
గ్రహములన్నియు మినుకు మించులు భువనభాండము దెలియ కష్టము
క్రీస్తు సృజనకు కారకుడుగను నరుడు జగమున కారణముగను
కాంచలేనిది దైవమనగను ఆతడాయెను యేసు మనకిట.

674

సీ. సాగరతీరము సారవిహీనమై – చేపల చెరువుల చెంగలించె
నగరాల చుట్టును నాణ్యమౌ మాన్యాలు – ఇళ్ళస్థలములుగా యింపు గులికె
గ్రామాల గట్లన్ని గమనింప కంపుతో – చెంబట్టు కెళ్ళెడి చెలువు నించె
ఊరచెరువులన్ని ఉన్నతి వీడెను – కాలుష్యమయముగా కానబడును.

గీ. మురుగు కూపాలు ఆవాసములుగ నేడు – వ్యాధి బాధల జనులకు యాతనలుగ
దేశమందున భూమాత దేహమంత – అంతరించెడి తీరెన్న వింతయగును.

సీ. కాలుష్యమయమైన కాల్దారులన్నియు కసవున కంపున కానబడును
మురుగున మునిగిన మురిపెంపు రాదార్లు మన్నిక కోల్పడి మాసిపోయె
మరుభూములన్నియు మానవాక్రమణలై దహనమ్ము ఖననమ్ము దారిలోనె
గ్రామాల శుభ్రత గాదిదప్పినరీతి గాంచగ గర్వమ్ము ఖర్వమగును.

గీ. పల్లె కుగ్రామములు నేడు ప్రల్లదమున – కల్ల కల్లోలితములుగ కానబడును
చెల్లుచుండును దౌర్జన్య చేతలచట – వల్లకాడులు వాడలు వాసిదప్పి.

675

అమ్మదనం కమ్మదనం కలగలిసిన ఆత్మధనం
అంతరింపు అసలెలేని అవనిజనత ఆత్మీయత
జన్మనెత్తి జగములోన మంచినెంచు మానవులకు
సన్మనమ్ము సంగతించు సహన మహిమ సవ్యమగును.

దేవతలను దేవురించు దేహి జనుడు దిటవు వీడె
సేవ దైవ మనెడి మాట సేచనమ్ము హృదయమునకు
వేగవంత జీవనమున వేళమించు విధమెంచడు
రాగరహిత వర్తనమున రహిని జనుడు పసరమగును.

ఆహారము నిద్ర భయము సామాన్యము జంతువులకు
సంఘజీవి మానవుండు బద్ధ బుద్ధి భయము వీడు
జనని జన్మభూమి నరుడు స్వర్గ రీతి స్వాగతించ
మనగ మాత పితయు గురువు మనజగమే మాన్యమగును.

తల్లిమరచు తనయులిలను తగవరులుగ తరళమాయె
కల్లబొల్లి కబురులతో కలల జీవనమ్ము జరుగు
భవిత మరచి భాగ్యమునకు దాసుడాయె మానవుండు
గరిత మానవత్త్వమనెడి మాట దెలియ మాన్యుడగును.

మానవులము మనము జగతి దానవులము అసలె కాదు
దానగుణము మానధనము మంచి మించ మార్గమగును
బతికి చచ్చు భరత జనుని మతికి చిచ్చు ధనగణనము
చచ్చిబతుకు మానవులకు సేవధనము చెరగనిదే.

676

ఆశయమ్ముల నమ్ముకొంటూ – అడవులందున నక్సలన్నలు
నవ్యవిప్లవ నాణ్యతనుగన – తెలుగునేలను తెరలుచుండిరి.

అమరులగుచును నేలరాలగ – ప్రభుత వారలు మెరుపుదాడుల
ప్రతిగ నన్నలు పాతరలతో – పేల్చివేయగ దుఃఖసంద్రము.

ఎదురుకాల్పుల నెదురుకొనగా – అన్నలందరు ముందుకొచ్చిరి
మన్నికనుగన మనుజులందున – కాల్పులన్నియు విడువ వలెగా.

భూమి పోరాటాలలోనా – బానిసత్వపు తీరులోనా
బీద బిక్కి బాధలోనా – దోపిడికిపిడిబాకు అన్నా.

పంట పండెడి ప్రాంతమందున – హత్యలేమీ ఉండవచ్చుట
సస్యసారము హీనమచ్చుట – తిరుగుబాట్లకు నెలవునేల.

భార్య బిడ్డ బంధురోదన నిండగా – మరణహేల మింగె మానవులను
నక్సలన్నలంత నిత్యమ్ము వేటలో – మందుపాతరలను మునిగె మనసు.

తుపాకిరాజ్యము తూటాల మారణము – విప్లవము విరసమ్ము మనసులలో కలవరము
మార్పేమో మనకందు ననుమాట వినమేమొ–తీర్పరులు మీరంత తత్పరత ముఖ్యమ్ము.

ప్రజల దీరాజ్యమ్ము స్వామ్యమ్ము సామ్యమ్ము – ప్రభుత రక్షణగోరు పోలీసు వారంత
పోరులో మరణమ్ము పారమౌ పాలనలౌ – మంచినీ ఎంచగా మనమంత నినదించు.

ఆస్తిపాస్తులన్ని హతము జేయుచుండ – ఆస్తులేరుచునుండె అన్నలను ప్రభుత
జ్ఞాన నిధులు జగతి సుగతిని కోరగ – మార్గమిపుడు చూడ మహితమ్ము కాదది.

మానవత్వము మరచి బాధ్యతలు లేక – మనుజులజంపగా మమతను త్రుంచగా
ముక్తకంఠముతోడ మనమంత ఎదిరించ–అన్నలందరి మనసు మరలు మంచిదౌ మార్పుకు.

రక్షకభట బాధ్యతలను బరువుతోడ వహియించగ
రక్షలేక రాలిపోవు దయనీయులు దారుణము
కక్షకట్టి పాతరలను ప్రాణముగొన బాధకల్గు
కుక్షికొరకు వచ్చువారల కరకు రీతిన ద్రుంచగాను.

కర్మసాక్షి మర్మమెరిగి – శర్మమెంచి జనుల గలసి
జీవసార సంఘమందు – చేరి మీరు సుఖము గనుడు.

తెలంగాణా తెంపరులుగను – తేల్చుజనులను పీడననువిడ
భూమిపోరాటాల వెనుకను – వెన్నుదన్నుగ నిలచె బీదకు.

పెత్తనములు చేయుచుండెడి – పెట్టుబడులను వడ్డి గుంజుచు
ఆక్రమణలను అక్రమముగను – పొందుచుండిరి ప్రజలసొత్తును.

పోటి ప్రభుతను నడపగాను – ప్రభుత పరువును మంట గలిసె
పోరు పోరును జనుల బలిగొనె – వేరు వారికి కష్టమాయెను.

పేదరికమును ఆసరాగా – రాజకీయము రగులజేసిరి
పదవి పొందగ పొందుకోరిరి – పదవిరాగనె పదట గలిపిరి.

శాసనమ్మును చెరుపగాను – శ్వాసవీడుచు అన్నలందరు
తప్పునొప్పును తెలిలేకను – మెప్పు జనులను మరుగుపడగ.

మంత్రి శాసన సభ్యులందరికిని – సతము రక్షణ సారమేమియొ
సేవచేయగ రక్షణెందుకు – చేరు స్వర్గము చేవ సేవను.

శూన్యగృహముల పేల్చివేసిరి – చూడ చిత్రము మనుజులుండరు
బతుకు కొరకు బాధ్యతనుగని – బయలుదేరిన మరణ మగునుగ.

అన్నలన్నలు సఖ్యమును గన – రాజకీయము రాజుకొనగ
మధ్యనలిగిరి మాన్యులందరు – న్యాయమేమో నరకప్రాయము.

677

తెలుగుతల్లియు తేరునెక్కగ – తెగువకేసరి గుండెనిచ్చెను
ఆంధ్రరాష్ట్రపు ముఖ్యమంత్రిగ – అవనియందున అతిశయముగ.

పేరున ప్రాకాశమాయెను – పెంపు నింపె సొంపుసాగ
ముద్దు రెడ్డి రాజులందరు – అద్దమై అద్దంకి తెలుగున.

జాతిగిత్తల జాణయయ్యెను – స్వాతిశయమున చేతనముల
కాటమరాజుగా శౌర్యపు కోటగా – రాయరాజ్యము రాజభోగాల వెలసెను.

మన్నేరు పాలేరు మాన్యాల నిండించె – గుండ్లకమ్మను నీరు ముక్తి పన్నీరు
కంభము మోపాడు చెఋవు కరవును దీర్చు – రాళ్ళపాడున నవ్య రతనాలు పండెగా.

చీరాల పేరాల 'గోపాలు' ఉద్యమము – జీడి జివ్వకువేడి వేటపాలెపుదాయె
రెండవ బొంబాయి చీరెలకు చీరాల – పలక విలువ తెలుపు మారకాపురము.

చిన్నెలారాయిగా చీమకుర్తి రాయి – గ్రానైటు గురుతాయె విశ్వాన విలువకు
పండ్ల కేంద్రామిటను ఉలవపాడునేడు – సాగరము సాంద్రమ్ము తీరమ్ము హెచ్చుగు.

మాలకొండను మమత మాల్యాద్రి నరసింహ – మన్నికౌ మన్నేటి అమరలింగేశుండు
సింగరాయకొండ సిరినారసింహుడు – జనార్ధనుడుండి కాపాడు కందుకూరు.

చెన్నకేశవుడచట చెన్నుగా దీవనల – సింగరకొండలో ఆంజనేయుండుండ
వల్లూరు తల్లియు అంకమ్మ దేవతలు – శివములను చిందించు సిరిధైర్యమింపగు.

భారతము బంధము ఎఱ్ఱనకు గుడ్లూరు – కందుకూరు రుద్రు కమనీయ అష్టకము
మోచర్ల కృష్ణయ్య మాకంద కవియయ్యె – దాతలు చదువులకు ధాటియై బదులిచ్చెను.

నాట్యధారల ధార ధారణకు నవ్యమ్ము – నాగభైరవ కవిత భైరవుండిటనేడు
పవన నిర్మల ప్రభలు ప్రాకాశమున నిండె – ప్రాకారమయ్యేను మనజిల్ల కళలకు.

678

బాలలందరు భావి భారతి – నవ్యపౌరులు నీతియుతముగ
బద్ధులందరు బాగుగోరగ – బుద్ధికలిగిన సిద్ధులౌదురు.

అమ్మనాన్నల మన్ననను గని – అక్కచెల్లెల మక్కువను విని
మంచి మమతల మనసుపండగ – బంధములగని బంధువులను.

గురువు లందున వివరమైన – వినయశీలము విశదపడగా
పెద్దలందున గౌరవమ్ము – పిల్లలందున ప్రేమ పెంపు.

తెలియరానిది తెలివిలేనిది – వయసు విలువను కలిగియున్నది
పోకడలనూ పలువిధమ్ముల – పోవువారలు విలువ విడుదురు.

ప్రాయమందున పరువమబ్బగ – ప్రధితులందరు పథమునందున
శీలయుతము శాంతిమతము – హితము సమతయు సంఘసేవను.

సరస సాహితి కోరువారలు – శాంతి సౌఖ్యము పొందగలరు
అందమునుగన అందలమ్మున – వందితులుగను విలువగందురు.

ఆటపాటల పాలుపంచుక – నేటి బాలలు సుందరమ్ముగ
నాటి రీతిని మరచిపోవగ – ఈతిబాధల నోర్చుకొనుడు.

మాట చేతల మనసు మమతల – కలల కవితల సంస్కరణముల
భాష భావము పదము గీతము – బాలలకు కావలెను సతతము.

ఎఱుక తెలియని వయసువారలు – తరచు తలచుచు తెలుపు మనసుల
మాయ తెలియని మోసమెరుగని – మానసమ్ములు కలుగు బాలలు.

విశ్వమందలి వింతలన్నీ – ఒక్కవిధముగ చూడవలెనని
మక్కువనుగని మిక్కుటముగ – మానసమ్ముల నెదురుచూతురు.

కోరికల గోరంత దీపము – వెలుగు విరియును వారి మనసుల
సంతసమ్మున తలపు తీరగ – తొలగ తలపు దుఃఖకరముగ.

గోరుముద్దల తీరునాకలి – కోరిపెద్దల బాధముంచకు
బట్టలందము చట్టుబండలు – మనసు మహితము బంధమందము.

జాగుధోరణి జగతి చెరచు – బాగు పరచుము త్వరిత గతిని
నాగరకమగు జీవితమ్మున – నీతి వర్తన నీట గలుపకు.

చదువుసంధ్యల సారమెంచుము – సోమరిగనువు తిరుగబోకుము
సామసహితము సారవంతము – సాధనమ్మున ఫలితమొందుము.

విద్యశాలల వినయసంపద – జ్ఞానవృద్ధిని గణుతినొందగ
సాధ్యమౌనుగ వేద్యమిలనది – అనుభవమ్మిది భావ్యమౌనిది.

ఆశమిన్నగ ఆశయమ్ముల – ఆర్తివీడని అనునయమ్ముల
మలచి మనుజుల తలచి ధర్మము – వెలయు భూమిని నీతినియమము.

పెద్దలందరు ప్రేమపేర్మిని – చిన్నలందరు సన్నుతినిగన
బాలలందరు మహిని మెలగగ – భావమంతయు భాసమగునుగ.

పిల్లలిద్దరు ముద్దుమురిపెము – పెక్కురుండుట పేర్మి బాధలు
పెంపకమ్మున పెరుగు కష్టము – ప్రేమ పంచగ తక్కువగునుగ.

నేటి నాగర లోకమందున – ఒక్కబిడ్డయె ఎక్కువగునుగ
లేకయుండుట మక్కువగునుగ – దేశములనిట జగతి లోనన.

భయము భక్తియు బరువు కలుగగ – నయము నాణ్యత పరువు పెంచుగ
తల్లి దండ్రి గురువు దైవము – తనరగను తాసన్నుతినిగన.

తప్పటడుగులు జీవితమ్మున – మెప్పునొందును దిద్దుకొనగా
తానె సర్వము తనకు తెలుసన – మూర్ఖమగునుగ ఏమి తెలియక.

అహము వీడుము అవని వెలుగుము – సహన మలవడు సమరసతనూ
సమత మమతల సారమెరుగుము – సంఘమందున ప్రగతి గాంచుము.

దేశభక్తుల బాటయందును – జాతిరక్తుల మాటమరువక
చేతమును వెలిగించు భరతిని – భావిపుష్టికి దారి వేయుము.

గాంధి నెహ్రూ బోసు తిలకుల – భావమును గని భరతభూమిని
ఝాన్సి రజియా ఇందిరమ్మల – జాణతనమును జగతి వెలుగుము.

అన్నరాముని ఆశమ్ముల – ఆంధ్రమందలి బాలలందరు
తెలిసికొనగను తెరువు దొరకును – భావియందున భాగ్యమునుగను.

దారితెలియని వారలకునువు – దారిచూపుము దయయు కలుగగ
అంగవికలుల ఆదరించుము – హేళననుగన హేయమగునుగ.

భరతవంశపు గాథలనునువు – బాగుగనువిను చదువు సరగును
రామకథను రమణజదువుము – భరత సంస్కృతి తెలియు కథలను.

భాగవతమున భక్తిముక్తియు – చదువ రక్తియు భావమలవడు
మంచి మించును మరకతమ్ముగ – ఎంచి తుంచుము చెడును వెంటనె.

చరితలందున సారమెంచుము – కవితలందున కమ్మదనమును
వర్తనమ్మున నేర్పు దెలియును – కర్తలందరు మీరలిచ్చుట.

కళలు విద్యలు గరువమబ్బగ – వేద్యమగునుగ జ్ఞానమంతయు
వేదవిద్యలు వేల్పు విధముగ – విదితమగునుగ వేల వెలుగుల.

ధనము ముఖ్యము కాదు జగతిని – మనము దయతో మలిన రహితగ
గుణము గణ్యము గురుతు ముఖ్యము – కీర్తి నాశన కరము కాదిల.

నమ్మకమ్మును వమ్ముచేయక – నడువు నయముగ చేరు గమ్యము
ఎన్ని భయములు ఎదురు వచ్చిన – ఏమి చేయవు స్థైర్య ముండిన.

మరణమేమియు చెప్పిరాదిట – తరుణ మెంచును పోవు జీవము
జీవముండగ జీవి విలువలు – జీవహీనము జవము కోల్పడు.

వెలుగు విలువల జగతి జనులును – కలుగు కీరితి మరణమయినను
బతికి చావగ ఫలము లేదుగ – చచ్చి బతుకగ సారముండును.

మోసములతో ద్వేషములతో – మనిషి మనిషిని హతముజేయగ
హితము మరుగగు హింస ముదురును – సతమహింసను కలిగి నడువుము.

పిల్లలను ప్రేమించు దేవుడు – చల్లగను దీవించు జగతిని
కరుణ జగతిని గాంచుచుండును – తారతమ్యము తానుచూపడు.

చెట్టుపుట్టా చేను ప్రకృతి – గట్టుమిట్టా గణ్యరీతిన
సూక్ష్మజీవిని సుందరముగను – కాంచు మిలనూ కొంచె పరచకు.

పెంచు చెట్టును పంచు నీడను – చల్లదనమును సమము వర్షము
శుభ్రమునుగను చుట్టు ప్రక్కల – అభ్రమగునుగ విశ్వమంతయు.

నీరుపోయుము నారుపెంచుము – నాటు మొక్కను పెరుగు చెట్టుగ
దట్టమగునుగ కొమ్మలాకులు – దిట్టముగనిడు కాయ ఫలములు.

పండుతినగా మధురమగునుగ – కండ కలుగును పండుతినగా
కొండపిండిగ చేయవచ్చును – మనిషికండను విలువ మించును.

చెట్లు నరుకగ గట్టుతెగునుగ – అధిక వర్షము అవని ముంచును
వాతవరణము కలుషమయినను – బాధ వాతను జనులు బడుదురు.

మధురమైనది మనది ప్రకృతి – మాన్యమైనది మనుజ జన్మయు
మధురమాన్యత రెండు కలియగ – మోక్షమగునుగ మానవత్త్వము.

మానవత్త్వపు మార్గమందున – మనసు నుంచుడు మనుజులందరు
దానవత్త్వపు దారులన్నియు – మూసివేయుడు మాన్యులందరు.

బుద్ధిబోధల సారమునుగని – మోక్షమెంచుడు మార్గములను
స్వామి హైందవ సారమెంచియు – విశ్వమందున వినుతి గొనుడు.

'మానవేంద్రు'ని మహితలోచన – నవ్యమానవ వాద పటిమకు
భవ్యులందరు భాగ్యములుగను – భరతభూమిని సమత వెలుగును.

సమసమాజపు దారిలోనువు – సామ్యవాదపు తీరులెరుగగ
దేశరక్షణ దీక్ష బూనగ – దివ్యమగునుగ కాంతిశాంతుల.

ఒకరినొకరును మోసపుచ్చుచు – మోసపోదురు చివరికందరు
తెలివి కలిమియు సొమ్ముకాదెట – బలిమి భాగ్యము మానవత్త్వము.

తాత్త్వికులతత్త్వముల జదువుచు – తత్త్వమెరుగుడు జగతి సుగతిని
వేదబోధల మర్మములగని – విశ్వశక్తిని విలువ కట్టుడు.

మతము సారము మానవతయును – మనెడి తీరుల మతము తెలుపును
హిందు వాదము క్రీస్తు బోధయు – అల్లమతమును అవని వెలుగును.

కూర్మిలేకను కార్మికులును – కక్షకార్పణ్యముల కలగుచు
మార్మికతలో సామరస్యము – మరుగుపడునుగ తెలసికొనుడీ.

మనది మనకును చేదు కలుగగ – పరులు పర్వము పరము తీపిగ
వరము జనులకు మాతృభూమియె – దివము దీధితి దివ్యనాకము.

అవసరమ్ములు తీరగానే – విసరివేయగ విసువు కలుగును
గుర్తు కలుగగ తీర్చువారలు – వర్తనమ్మున వినయ వితతులు.

వాసిగాంచిన వారలెపుడో – నాశనమ్మగు కాలమహిమను
కాలవిలువను గమన మందున – కలసిపోగను కలుగు శుభములు.

చరిత తీరును సరిగ గాంచగ – మనుజులందరు మహిని దెలియగ
పరుల పీడన పరమమైనది – స్థాన పదిలము ముఖ్య విషయము.

మానవత్త్వము దారిలోనా – దానవత్వపు పోరులోనా
దయయు ధరణిని వెలుగగాను – సాగిపొమ్మిక సారజీవిగ.

నగరజీవన నాణ్యతనుగని – గ్రామమందలి గణ్యతను విని
స్వచ్ఛజీవన మాధురినిగని – అచ్చమయినా బతుకు గడుపుము.

మారణాయుధ మేమొ మనిషిని – భయము బాధను కలుగజేయును
బాంబు లెన్నియో భూతమందున – నాశనమ్మును చేసె జనతను.

ఉన్నతమ్మగు విలువలున్నను – ఏదియైనను తీసికొనవలె
అధమ మధమము అన్నయైనను – విధిగ వదలుము కలిసి మెలగకు.

కలుష భువియును మలిన మనుజులు – కలరు భారతి వెలుగు వెలియగ
సత్క్రమమ్మగు మార్గమెంచగ – దారితీయుము దయయు గాంచుము.

విద్యశాలలు వధ్యశాలలు – మనిషి మమతను మానవతను
సద్యశములను సామరస్యము – సరిగ దిద్దగ వెలుగు శాలలు.

మేధ మధనము మనసు మధురము – జనుడు జగతికి మాన్యుడగునుగ
భావి భారత నేతలందరు – నీతి సదనము నిర్మితినిగను.

ధర్మబద్ధము ధనము పొందుట – కోరికలనిట అధిగమించుట
మోక్షసాధక మౌను జగతిని – సాక్ష్యమున్నది గతము చరితను.

గొప్ప వారల గోత్రములనిట – మెప్పుపొందుడు తప్పుకలుగక
మేరమీరగ మీరలందరు – మార్పుకోరుడు మోసమిడువుడు.

మంచి మెచ్చుట మనుజు సంగతి – తుంచ తుచ్ఛము విలువ విధమును
కాలమెంతయొ విలువ యైనది – కాంచరండిట కాలగమనము.

జీవులందున కరుణగలిగిన – జీవనమ్మిట సాగుసరిగను
మాటమరువకు చేత చేవను – మనసు మరువము మలిన రహితము.

వక్రభాష్యము చెప్పువారల – సక్రమమ్మగు దారియందున
విక్రమమ్మును వీర్యయుతమును – జనుని జనసుతి నొందజేయును.

వర్ణభేదము జాతిబలిగొను – వర్గమార్గము క్రూరమైనది
జాతి జవమును పీల్చివేయును – దేశభక్తిని మార్చి మరుగగు.

మానవులలో మాన్యతనుగను – ప్రగతిబాటను సుగతి మార్గము
కనెను చాలగ సులభ మార్గము – మధ్యగోడలు పడిన మాన్యత.

ఆర్తిలోనను ఆపదలనూ – ఆదుకొనగా అందరొచ్చిన
అందమగునుగ అవనియందున – పొందు జగతియు విందు వినుతిగ.

దానధర్మము ధరణియందున – మానవాళిని మహితజేయును
ఒకరికొకరును సఖ్యతనుగన – సభ్యసంఘము సన్నుతినిగను.

పల్లెలందున వల్లెయనగను – పట్నమందున గణ్యమనగను
జనుడు పొగడగ జవము మీరగ – నాయకుండగు నీతియుతుడుగ.

సారహీనము స్వార్థ జగమును – సార్థకమ్మును జేయుడందరు
అర్థవంతము జీవతమ్మట – ఆర్థికమ్మట కీర్తికాంతయు.

రాజభోగము రాత్రిమయముగ – భాజనీయులు జనులు భోజులు
భోగులందరు భరతమందున – భవిత లేదుగ భాగ్యజాతికి.

పరులపాలన చేటుదెచ్చెను – మనది మనకగు స్వామ్యమొచ్చెను
పాలనమ్మున పాటవమ్మును – కోలుపోయిన బానిసత్వము.

అదనుచూచుక ఆహరించగ – అదరిపాటున అంతమొచ్చును
అంతరించును తనువురోగము – తపన తామరణించు వేగను.

నీతి ధర్మము నేతిబీరగ – న్యాయముండెను నేటి జగతిని
నీటికొబ్బరి సామ్యమెరిగిన – నియతి జగతియు నడచు నయముగ.

శిక్షవేయగ శివమునెంచగ – సాక్ష్యముండిన సూక్ష్మముగనూ
మనుజులందున మనసు కలిగిన – శిక్ష సాక్షిగ శివము హితముగ.

ఆత్మసాక్షియె అవనిమిన్నగ – ప్రశ్న పరమము జ్ఞానమబ్బగ
పరమపావన పాలితమ్ముగ – మనుజ గతియు ఆత్మనడుగగ.

ఇతరులనుగని మాటలాడగ – మితము హితముగ చేటుహతముగ
పలుకు పలుకున పలకవలెనుగ – పారమార్థిక పాలు వెలుగగ.

సహన సారము వహన పటిమను – సాగవలెనుగ సంఘజనులును
ముద్దుమురిపెము హద్దు మరువగ – సిద్ధి బొందును సిరుల భరతము.

సత్యసారము సత్వసహితము – సామరస్యము సౌమ్యవర్తన
సతము భారతి సొమ్ములాయెను – ధృతిని ధారణ జేయవలెనుగ.

లౌకికమ్ముగ లాస్యభారతి – సారసాఖ్యయె శూరమాతయె
మతములన్నియు జననమందెను – లాలితమ్మగు మాతృభావన.

మాల మాదిగ మానవులెగా – మాన్యులగుదురు పదవిపొందిన
పందలగుచును వెంట బడుదురు – పదవిమహిమను కులము వెడలును.

సృష్టి కులమును చేసె స్వార్థము – జనుల జీవన గతిని మార్చగ
వందితమ్ముగ హరిజనుండను – నామమిడెనుగ గాంధితాతయు.

అధమ మంత్యము ఆదియందున – విధిగ నుండెన కల్పితమ్మెగ
జగతి జన్మను నాదముండెను – ఒకటె నాదము వేరుకాదుగ.

పనినిచేయగ పరువమబ్బును – చేయువారలు తేలికగుదురు
సేవ చేయగ అధమ విధమున – వేరు మార్గము వెదకుచుందురు.

పార్టిముఖ్యము సూత్ర రహితము – పదవి పొందగ పార్టి దూరము
మిత్ర శత్రువు లేకమౌదురు – శాశ్వతమ్ముగ రాజకీయులు.

జనుల జాగృతి చదువు సంధ్యల – జగతిదెలియగ జవము కలుగును
ప్రశ్న సేసెడి పద్ద తంతయు – అలవడునుగద దిద్దువిధమును.

అందమన్నది కాంచు విధమును – అవనిజనులును హృదయములనిట
అంతరంగము రంగమగునుగ – చూచు జనులకు నందమగునుగ.

త్రికరణమ్ముల తీరు వెలుగగ – యత్నమునుగన ఫలము విలువను
బలముచేతకు భాగ్యమబ్బును – చేతమునకగు స్వాతిశయమూ.

679

బందిపోటుల రాజ్యమందున – బందుకగునుగ భవ్యసమతగ
బంధమునుగన అంధమగునుగ – ఇంధనముగద వందితమ్ముగ.

రాణిపూలను రాజ్యమందున – నాటి ప్రభుతను తిరుగుబాటున
ఖండితమ్ముగ అడవినుండెను – నేడుచూడగ ఎన్నికాయెను.

జనులుమెచ్చగ తిరుగుబాట్లును – తరగిపోవుగ పటువు వెలయుగ
జైలు జీవులు స్వేచ్ఛనుండిరి – హత్యలన్నియు హితముకొరకయె.

ఎందరెందరో ప్రతినిధులుగను – శాసనమ్మున సభలలోనన
ఎన్నికాయెను మన్ననలనిట – నేరవృత్తుల నేడు వెలసిరి.

దళిత జాతుల దమన ధరణిని – మెండుగాయెను మండె భారతి
పేరు ముఖ్యము పారముండదు – సారమిచ్చట సార్థమాయెను.

రాజకీయము రాజ్యములనిట – అర్థసాధన సారమదియెగ
సేవ లేదిట చేరధనమిట – మారుచుందురు మారకమ్మున.

కాంగిరేసులు జనతజనములు – దళము కదుదురు దహనమగుదురు
ప్రభుత నుండుట విభులవిధమట – ప్రాభవమ్మును పరువు పోయెను.

మతము బూచిగ హతముజేసిరి – జాతినీతియు చచ్చువిధమున
ఎన్నికల నిట మతము కులమును – పనికివచ్చును పరమమౌనుగ.

సామ్యవాదులు సొమ్ముకొరకట – పదవి పొందిరి పదట వాదము
ప్రాంతవారలు పొంతజేరిరి – వింత ప్రభుతయు – వంత జనులకు.

ఎక్కడుండెను ప్రభుత పర్వము – ఎగుడు దిగుడుగ చేత లన్నియు
నిగిడె 'గౌడ'యు నేర్పులేకను – గతము వారల రక్షజేసెను.

కుంభకోణపు కార్యమంతయు – కనులగట్టెను కాలమొచ్చెను
జరిగె దోపిడి తరిగె దేశము – బెయిలులేకను కేసు వేసిరి.

నవ్యనీతియు నాణ్యమయ్యెను – రాజకీయము నీతి మింగెను
భోజులందరు భాగమందిరి – బెయిలు కలిగెను బయలువెడలిరి.

జనులు పిచ్చిని ఓట్లువేతురు – గెలిచి పదవుల వెలుగుచుందురు
మేతురందరు దేశగడ్డిని – దున్నపోతులు బుద్ధిలేనివి.

స్కాములెన్నిటొ సాములందరు – 'యూరియ'ందున వారిలెక్కలు
'ఫోను'లందున వారి మూటలు – 'పంపు'లన్నియు పారుధనమున.

పెద్దలందరు పుట్టిముంచిరి – కాంగిరేసును పాతిపెట్టిరి
రాజకీయపు పెద్ద ఆయన – కేసులన్నిట బట్టబయలు.

కేసుపెట్టగ బెయిలునివ్వగ – చట్టచేతలు చట్టుబండలు
ఒకరు విడువగ ఒకరు విడువరు – న్యాయమేదియొ దేవుడెరుగును.

న్యాయమూర్తులు కన్నుమూయగ – న్యాయదేవత కళ్ళుదెరుచును
కళ్ళుమూసుక రాజకీయులు – తప్పుచేయగ తప్పుకొందురు.

తారలందరు తరుముకొచ్చిన – రాజనీతియు సినిమ చిత్రము
భోగవంతము నడుమ భాగ్యము – జనుల జాగృతి జారిపోవును.

మోసమన్నది ఎల్లకాలము – సాగబోదిక మాసిపోవును
తెలివికలుగగ తిరుగబడగను – తరుగు మోసము 'తగవు' వెలుగును.

తెలివి జనులకు తెలిపెనన్నియు – తెలిసె విషయము తెగువ కలిగెను
ఐక్యభావము ముఖ్యమగునుగ – ఏకమగునుగ జనగణమ్ములు.

చెప్పుమాటల నన్నివినగను – చేటు కలుగదు చేత సరిగను
నిజము నేరము నియమరహితము – వదల వెలువడు అసలు సత్యము.

ఇతర సొమ్మును అపహరించచన – హితము కాదుగ మతము నందున
తనది కష్టము అక్కరగునుగ – కష్టములనిల కార్య ఫలములు.

చిన్నజీవులు పెద్దవానిని – బాధపెట్టును ఆకటనుబడి
సృష్టి చిత్రము చిత్తముననిడు – సాగు నడతను సారవంతము.

దుబ్బలమ్మగు జాతులన్నియు – బానిసత్వపు బాధలనుబడె
ధనము మించెను మనము మునిగెను – దారుణమ్ముల విశ్వచరితను.

మనిషి స్వార్థము మనుట వరకెగ – మించె మనుటను మంచితుంచెను
మరల జేయగ మహిత బుద్ధులు – ఉద్భవింతురు ఉర్వినెన్నడొ.

ఘోరకలియును మారణమ్మును – భయము పుట్టును మానవునకును
శక్తిసాయము కోరునప్పుడు – వ్యక్తి విలువలు విలువకోల్పడు.

వ్యక్తి గతమయె పదవులన్నిట – శక్తిసారము స్వార్థమాయెను
తనకు పట్టదు ఏమిజరిగిన – తపన పడుదురు జనులు మనసున.

చదువ నెవ్వరు జగతిలేరుగ – కావ్యములనూ గాథలన్నిటి
మహితబుద్ధులు సంఘ చదువును – అనుభవమ్మున వెలువరింతురు.

వెదకు దేనికొ వేసటనుబడు – దొరక దెందును విలువయుండదు
మించె తాపము త్రివిధములను – ముంచుమనుజుని శోకసంద్రము.

పొట్టకోసము పుట్టి బాధలు – పట్టువిడువక పుష్టికలుగగ
సాధ్యమైనది అనుభవింపుము – దొరకపోయిన యత్నమున్నది.

హితమునుపదేశించు వారలు – మతము వీడగ మత్తువదలగ
మనుజ సేవను మనుగడంతయు – ఏడుగడగా మానవత్వము.

జన్మజన్మల పాపఫలమును – జగతి జనులను పట్టియుండును
వర్తమానము వర్తనమునను – శక్తిమేరకు తరుగజేయుము.

సమయమన్నది చాలకుండెను – ధనము గణనకు దాహమాయెను
తీరదాహము ఆకలాయెను – తినగ తియ్యన పట్టదాయెను.

గుండె దిటవును గుండెలోనన – దిగులు విధమున దారుణమ్ముల
పట్టు దప్పుచు నరములన్నియు – గుండె మనసును గురుతు దప్పును.

తెలియు రోగము మందగించెను – రోగరీతులు తెలియకుండెను
శోధనమ్ములు శోషితములుగ – వ్యాధులిలలో వ్యాప్తినొందెను.

బడికి వెళ్ళడు గుడికి నిత్యము – బోధ జేయును బాధ పాఠము
దేవుడిచ్చును శిష్యుడివ్వడు – జీత మొచ్చును నెలను నిండుగ.

అనుభవమ్ముల చెప్పవలెనను – కోర్కెమీరగ కోరడెవ్వడు
పెద్దవారల పాఠములనిట – పేర్మివేడడు కాలమహిమను.

గుడుల బడులను గుణితమొక్కటె – అహము వీడగ వినయ శీలత
మాధవునినట సేవ చేయగ – మానవులనిట మలచు మహితము.

గుడికి వెళ్ళుము చర్చికెళ్ళుము – గురుతగను మస్జిదుకు వెళ్ళుము
పరమ పావన పుణ్యమూర్తుల – బాటలోనువు పయనమెంచుము.

సేవయందున చేవయుండగ – చేరు ఫలితము మానవాళికి
కాలములకును గురుతు మనుజుల – కావ్యమగునుగ పుణ్యయుతముగ.

దేవతాగణ కథలనన్నిటి – వినెడివారలు జగతి లేరిట
మనుజగాథలు మరువకుండిన – మానవత్వము మోసులెత్తును.

కవిత సవితగ వెలుగు జగమున – పతిత భావన పావనమ్ముగ
పారమెరుగగ దళిత బాధల – ధరణి దార్ఢ్యము సామరస్యము.

పతితులందరి పైకిలేపగ – గతము మంచిని గ్రహణసేయగ
సతము మనమును సేవకిడగా – దివ్యధామము నవ్యభారతి.

నడత నాణ్యత నేర్పుగురుడే – నీతి దప్పుచు దారి వీడగ
విద్యయన్నను వినుతివీడెను – సద్యశమ్మును సామెతాయెను.

నయము వర్తన నాయకునకును – నియమమాయెను నాటి జనతకు
నేటి భారతి ముద్దు పుత్రులు – మురుగు లోనన నీతి దోసిరి.

ఉద్యమమ్ముల నియమములనట – నున్నతినిగొనె ఉత్తములుగను
పదవి పాట్లకు ఉద్యమమ్ములు – పరమమాయెను భరతభువినిట.

భారతీయత మాసిపోవుచు – భాగ్యరాశియు తరిగిపోవుచు
భావజాలము భోగములకగు – బాధ పరులకు మాటచేతల.

చిగురులేయగ 'చిరుత'లందును – నీతి నాటుడు నీరు నియమము
గాలి గరువము రక్ష శిక్షణ – పెరుగు చెట్టును పురుగు పట్టక
నీతి నీడను నల్దిశలకును – వ్యాప్తిచేయును వ్యక్తి చిరుతయె
శక్తినిండుగ శాస్త్రమెంచగ – అభ్యుదయమున భరత ఖండము.

భిన్న సంస్కృతి సంగమంబిది – ఛిన్నమైనను కలియ కష్టము
చెన్నుమీరగ భారతీయులు – చేరిరండిట ఐక్యమగుదురు.

రత్నగర్భగ రాణకెక్కెను – రౌతు రాణువ రాజ్యములతో
చక్రవర్తులు చేరిరార్గురు – సక్రమమ్మయె పాలనమ్మును.

ప్రభుని ఆజ్ఞలు వేదములుగను – మిత్రవాక్యము (పద్దెనిమిదిగ) పదియునెన్మిది
కాంత సమ్మిత కావ్యరుచులను – సహిత సాహితి భరిత భారతి.

రామకథయును జీవకథగను – భారతమ్మిట సర్వభాసము
భాగవతమట భక్తిముక్తులు – భరత సంస్కృతి సారసాఖ్యము.

సింధునాగరకతను చిందెను – నగరపాలన ద్రవిడమయ్యెను
కలిపె నుత్తర దక్షిణమ్ముల – కాలగమనము కలుషమయముగ.

వేదకాలము వేద్యమగునుగ – జీవజాలము వేదననుగన
సంస్కరణకట తావులేదట – తరము మారగ మార్పు తథ్యము.

యజ్ఞములనట పశువులన్నియు – వధ్యమగుచును విలువ తరుగగ
కృషికు లందరి వ్యావసాయము – జరుగ కష్టము మార్పుతప్పదు.

బుద్ధబోధల హింసమాయము – బద్ధమైరట జనుల బౌద్ధము
ఆచరించుట సాధ్యమదియును – అందరికినట చోటు కలుగును.

కోరికలనది కూలదోయును – హింస హననము సంస్కృతాయెను
మోక్షమార్గము అష్టవిధములు – చేసి చూపెను చేరిరందరు.

చరిత మౌర్యుల చర్వణముననను – కలిత హింసను కాలరాచెను
శోకమునువిడ దారి దొరికెను – వంశమంతయు బౌద్ధమాయెను.

దేశదేశములందువెలిగెను – హిందుదేశము పుట్టుకాయెను
మతములన్నిటి మాతమనదిగ – హితము విశ్వము మాతమహితము.

దక్షిణాపథ చరిత చూడగ – దారుణమ్మగు చిన్నరాజులు
ఒకరికొకరికి సఖ్యముండదు – తగవుకోరుచు తంటలనుబడె.

శాతవాహనులాంధ్రులైరిట – నిశితమయ్యెను వారి సంస్కృతి
వాడికలిగిన వారలందరు – ఏలిరాంధ్రను ఏకఛత్రము.

గ్రీకురాజయె అలెగ్జాండరు – ఆక్రమించగ వచ్చెనాతడు
రాజులందరు దేశమందున – ఐక్యమైరిట అంధుడంభియు.

దేశమాతకు రక్షసేయగ – దీక్షబూనిన ‘పురుష పుంగవు’
తక్షకుడుగా అంభి శిరసున  – కాటువేసెను కలిసె శత్రువు.

నందవంశము నాణ్యమయ్యెను – శక్తియుక్తము సేనసహితము
త్రిప్పికొట్టెను మాసిడోనియ – ముగిసెయుద్ధము మారెరంగము.

దేశద్రోహము మొదటిదయ్యెను – చరితయందున చెరిగిపోదది
ద్రోహులెందరొ నేడు భరతము – దోచుకొనగను దారుణమ్మగు.

మార్చివేసెను రాజుమనసును – మాన్యుడాయెను శోకమునువిడి
రక్తపాతము యుద్ధమందున – బాధగలిగెను భరతభూమిని.

సంగమంబయె సమముసాహితి – పాండితినబడి కలిసిపోయిరి
తమిళదేశము తరగ సంస్కృతి – కావ్య శాస్త్రము వెలుగుచూచెను.

చేరచోళులు పాండ్యరాజులు – తమిళభాషను కవుల పోషణ
పూర్వసాహితి పర్వమాయెను – ద్రవిడ జాతియు దార్ఢ్యమాయెను.

ఆర్యసంస్కృతి వర్ణధర్మము – ద్రవిడభావన శూద్రసాంద్రము
సంగమంబున వెలుగుచూచెను – కలిగె చరితను గ్రంథరచనయు.

శుంగవంశము కణ్వవంశము – మగధనేలెను మాసిపోయెను
పాటవమ్మున పాటలీయును – ప్రభలు కోల్పడి పురుషపురమయె.

శాలివాహన శకము మొదలయె – పురుష పురము కనిష్కుడాయెను
తత్త్వవేత్తయు బుద్ధమేధయు – కొండనాగార్జునుడు వెలిగెను.

పాలనమ్మున మతమునందున – పాలుగొనగను ప్రథితుడాయెను
మహాయానము మాన్యమాయెను – మతములన్నియు సమము తెలిసెను.

చరకసంహిత వ్రాసి చరకుడు – వేదమాయెను ఆయువునకును
అశ్వఘోషుడు బుద్ధచరితను – సంస్కృతమ్మున రచనలన్నియు.

గంధమయ్యెను భరతశిల్పము – గాంధరమ్మును వృద్ధిచేసెను
స్థూపసహితము హరవిహారము – కళల గరువము కలగ చరితము.

గుప్తరాజులు గురుతు హరితము – శాంతియుతముగ స్వర్ణయుగముగ
కళల కవితల ఫలిత శోభయు – విక్రమార్కుడు వినుతి పెంపుగ.

అలహాబాదున శాసనమ్మున – తెలియబడునుగ చరిత సర్వము
కవుల రాజును కలియు భోజుడు – కాళిదాసుకు ఆశ్రయమ్మిడె.

యమున వరకును వ్యాప్తిజేసెను – రాజులందరి నోడజేసెను
దక్షిణమునను ఉత్తరమునను – రాజ్యమంతయు విస్తరించెను.

రత్నకవులును తొమ్మిదాయెను – కాళిదాసుడు కవిత కాళిక
విశ్వవినుతిని పొందె కవితలు – సంస్కృతమ్మున సారవంతము.

పాహియానుడు వచ్చెపాలన – మత్తులేదనె మాన్యులందరు
శిక్షకఠినము చెరుపు చేయగ – శాంతియుతముగ గుప్తపాలన.

హిందు బౌద్ధము హితముకోరిరి – రాజులందరు సహన మహితులు
అమర అజంత గుహలు గట్టిరి – గణిత శాస్త్రము గోళ మహిమను.

ఉజ్జయినికట ఉద్దిలేదట – అమరసాహితి అమరమాయెను
కథల గాథల కమ్మనాయెను – కన్నుకుట్టెను హూణులకునూ.

కన్యకుబ్జము అందమయ్యెను – హర్షసహితము హర్షరాజ్యము
హిందురాజయి బంధు బుద్ధము – హుయనుసాంగుడు విడిదిచేసెను.

ఏండ్లు ఐదిట మోక్షపరిషతు – మతము హర్షము బుద్ధమాయెను
పండితులకిడు కాన్కలన్నిటి – పేదలందర పేరు పెంపున.

సంస్కృతమ్మున వ్రాసి హర్షుడు – రత్నవళి ప్రియదర్శినియు
బాణకవితయు హర్షచరితను – గద్యకాదంబరియు గణ్యము.

ఉత్తరమ్మున భారతమ్మయె – హర్షుడేగగ విడిగపోయెను
రాజుపుత్రుల రాజులైరట – శౌర్యదీధితి అరుబు యాత్రల.

ఘోరి గజినీలు ఘోరముగనట – దండయాత్రలు లెక్కలేవవి
ఐక్యదేశము ముక్కలాయెను – బానిసత్వపు బాధలాయెను.

ఢిల్లిరాజగు పృధ్విరాజును – హతముచేయగ హితము చెడెనుగ
జయముచంద్రుని పక్షపాతము – ద్రోహమెంచగ రెండవదిగా.

కులము గళమును విప్పె భరతము – సంఘమంతయు ముక్కచెక్కలు
మక్కువాయెను మహ్మదీయుల – చేతలన్నియు విభజనమ్ములె.

శాతవాహన నిహతి సాగగ – పల్లవులకిట పల్లనాడును
స్థావరమ్మయె తమిళమునకును – విస్తరించిరి కాంచిపురమున.

శైవ వైష్ణవ భాగములనూ – అందగించెడి కట్టడములను
బలిపురమ్మున వెలిగె శిల్పము – హిందు సంస్కృతి వెలిగె విశ్వము.

కంచి కాంచనమయ్యె పల్లవ – రాజ్య శిల్పులు రహిని వెలుగులు
భక్తిభావము ఆళ్వరులనట – వేద వేద్యము దాక్షిణాత్యము.

'చళుకి'రాజుల శౌర్య పటిమయు – పశ్చిమమ్ముగ తూర్పుతీరుగ
ఆంధ్రదేశపు అందమాయెను – భారతమ్మట వెలిసె భాగ్యము.

వేగిరాజుల శౌర్య ధైర్యము – వెల్లువాయెను విల్లువిధమున
పశ్చిమానను రాజమండ్రియు – పరువమిచ్చెను భరత రచనకు.

అరబురాజ్యము అరెబియాయును – మహ్మదాయెను మతము ఇస్లము
ఒక్కదేవుడు పూజచేయగ – విగ్రహమ్ముల కొలువరాదనె.

దేవతలకును గొప్ప తక్కువ – లేదు లేదనె సమము సర్వము
వందవత్సర కాలమందున – వ్యాప్తినొందెను మతము ఇస్లము.

సింధు ప్రాంతము దాటివచ్చిరి – హిందుదేశము కొల్లగొట్టిరి
మతము ప్రచురము హిందునాశము – వందితమ్ముగ జరిగెనప్పుడు.

భమత మందలి గణితశాస్త్రము – వైద్యగ్రంథము లెన్నొమార్చిరి
వారిభాషను నిలుపుకొనిరట – హిందు అరబుల మిలన సంస్కృతి.

దేశదేశములందు బౌద్ధము – మతము హిందును మరలజేసిరి
అరబు మొగలుల దండయాత్రలు – కలిపె జనులను కలదు సంస్కృతి.

పూర్వకాలపు హిందుదేశము – చరిత గర్వము ఎన్నొ గురుతుల
రాజు సర్వము రాజ్యమందున – కాలగమనము మార్చె దానిని.

సంఘరీతియు మారెనప్పుడు – మధ్యయుగమున సాంస్కృతికముగ
కులములన్నియు కలియకుండెను – భూమిసాములు భూమినిండిరి.

హిందుమతమును తీర్చిదిద్దగ – బయలువెడలిరి భరతసాములు
కులము ముఖ్యము వేరు దేవుడు – వివిధ విధముల చీలె దేశము.

దక్షిణాదిన రాష్ట్రకూటులు – కాకతీయులు హోయసాలులు
యాదవులు నటచోళులైరట – వివిధ రాజులు వేరు వేరుగ.

ఉత్తరాపథ రాజపుత్రులు – ఉత్తరమ్మున దండయాత్రల
సూర్యవంశపు శూరమణులుగ – చంద్రవంశపు చరితకలుగగ.

ప్రతీహారులు చౌహానులనూ – పారమారులు సేనపాలులు
హిందురాజులు తురకనడ్డిరి – పృధ్విరాజును పోరె ప్రధితము.

రాష్ట్రకూటుల రాజ్యపాలన – యుద్ధములతో సద్దుమణిగెను
ఎల్లోరాయును 'ఎలిఫెంటా'ను – కట్టి కళలకు కీర్తిపొందిరి.

చోళరాజులు దక్షిణాదిన – సింహళమ్మును ఏలిరప్పుడు
'చోళపురము'ను కట్టి కళలకు – నెలవుజేసిరి వ్యాప్తి జేసిరి.

తంజనగరము తావు శిల్పము – తెలుగుభారతి నెలవు ఆంధ్రము
రాజరాజును రమ్యుడాయెను – వంశధీదిధి వెలిగె తెనుగున.

ఘోరి ఘోరము ఘజిని గట్టిగ – దండయాత్రన దమనమెంచిరి
మతము హతమయె మారణమ్మున – తల్లడిల్లెను తల్లి హిందువు.

సోమనాధుడు సొమ్మసిల్లెను – కట్టడమ్ములు కూల్చివేసెను
రాజపుత్రులు నాశనమ్మయె – రాజ్యమంతయు ఛిన్నభిన్నము.

దేశమందున ఏకతనునది – లేకయుండెను లోటుజరిగెను
ఒకరినొక్కరు వెన్నుపోటుల – పరుల ఫలమును పొందజేసిరి.

కన్నడమ్మును కాంతివంతము – సంస్కృతమ్మును సారవంతము
బిల్హణుండును రన్నకవియును – ఘటికలనియెడి కేంద్రముండెను.

అగ్రహారము లిచ్చియుండిరి – బ్రాహ్మణులకట వర్ణధర్మము
హిందు జైనము వీరశైవము – మతములాయెను మితిని రాజ్యము.

యాదవులకట కృష్ణదేవుడు – దక్షిణాదిన వంశమాయెను
రాజ్యమేలిరి కొంతకాలము – అల్లవుద్దిను అంతుతేల్చెను.

కాకతీయుల శౌర్యకాకయు – హనుమకొండను కాకతమ్మయు
ఆంధ్రదేశము ఓరుగల్లున – విజయవంతము సుజనమయముగ.

రుద్రదేవుడు రుద్రరూపుడు – రుద్రమాంబయు వీరవనితగ
తెలుగు జనులను ఒక్కఛత్రము – పాలనమ్మున పరమమాయెను.

కప్పమంతయు కట్టు షరతుకు – ఇయ్యకొనెనట రుద్రదేవుడు
మాలికాఫరు జయమునొందెను – ఖిల్జి కరవును తీర్చె రాజ్యము.

కాకతీయుల రాజ్యపాలన – పిచ్చితుగ్లకు పీల్చివేసెను
తెలుగు తేజము అంతరించెను – తెగువ తెలుగుకు తెరలెనాంధ్రను.

ఎన్నొ చెఱువులు త్రవ్వివారలు – సాగుచేసిరి పంట పండగ
ఓడరేవుగ 'మోటుపల్లి'యు – ముత్యములకది పుట్టినిల్లట.

మార్కొపోలో యాత్రికుండును – వచ్చిచూచెను 'దేవి'పాలన
మెచ్చె వర్తక మేటి రాజ్యము – వీరశైవము వినుతినొందెగ.

నృత్త రత్నావళిని వ్రాసెను – జాయపార్యుడు జాణగాను
పాలకుర్తి సోమకవియును – తిక్కనార్యు తేట కవితయు.

మైసూరు రాజ్యన మురిసెను హొయసల – ద్వారసంద్రమ్ము రాజధాని రాణ
రెండువందల ఏళ్ళను పాలనజేసిరి – సహనము సొమ్ముగ వహియించె రాజ్యమ్ము.

జైనులయ్యెను మొదటివారలు – ద్వైతమధ్వయితమ్ము శిష్టము
కన్నడమ్మును సంస్కృతమ్మును – కావ్యజాలము వృద్ధినొందెను.

వారసులుగను చోళులకునూ – కాకతీయుల నోడజేసిన
పాండ్యరాజులు దక్షిణమ్మును – పండువిధము పాలనమునకు.

స్థానికమ్మగు పాలనమ్మును – చోళరాజులు అమలుపరచిరి
మధుర మధువుగ మన్నికగను – శైవ వైష్ణవ సంప్రదాయము.

దక్షిణాదిన శిల్పశోభిత – దేవళములను కట్టడములను
చిదంబరమున రామేశ్వరమున – రంగమందున రంగు కలుగగ.

గుప్తవంశము హర్షపాలన – దక్షిణాపథ రాజ్యరీతియు
రాజు శక్తుడు సర్వవిధముల – కార్యన్యాయము రక్షణందును.

ప్రాంతములుగను విభజనమ్మయె – రాజ్యమందున ముఖ్యుడుండెను
మంత్రులుండిరి మహామాత్యుడు – సంధి విగ్రహ పేర్లతోడుత.

భూమిసాముల భరతమందున – రాజరికమును వెలిగెనచ్చట
సంప్రదాయక కేంద్రపద్ధతి – సాగెప్రాంతము దక్షిణమ్మున.

సలహాపొందును రాజుమంత్రుల – రాష్ట్రపాలక ముఖ్యులుండిరి
చోళరాజ్యము చాలు విధమున – స్థానికమ్మయె నేటి విధమదె.

మండలాలను వలను నాడుల – నాడులెన్నియొ గ్రామములును
గ్రామకమిటీ సభ్య సమితియు – సమరసమ్మున తీర్చుకోర్కులు.

వనము చెఱువులు పొలము కృషికము – పరుల ననుమతి గ్రామములనట
ఎన్నికలకును మన్నికగువిధి – పద్ధతులనట అనుసరించిరి.

భూమిశిస్తుగ ముఖ్యవనరును – ప్రభుత జరుగగ 'పాలు మూడు'న
కాల్బలమ్మును గజము తురగము – నావికాబల నాయకులుగను.

న్యాయపాలన నాణ్యమయ్యెను – గ్రామకమిటీ తగవు తీర్పరి
న్యాయవాదులు నయము గుండిరి – శిక్షలెంతయొ కఠినమాయెను.

సాంఘికమ్ముగ వర్ణపద్ధతి – వృత్తివిధమున వర్తననుగనె
కులము గుణమున కూర్మి విద్యలు – వినిమయమ్మును వర్ణవివరము.

మహిళమాన్యత మరుగు పడెనట – విద్యలందున వెనుక వారట
రాజపుత్రుల భార్యలందరు – ఆత్మహననము అవనిచేసిరి.

కాకతీయుల రాజ్యమాంధ్రము – మహిళ రుద్రమ రాజ్యమేలెను
మచ్చుకొకటియె చరిత చెప్పును – మొత్తమునుగన తక్కువయ్యెను.

మతము హిందుగ మాన్యతనుగనె – రాజపుత్రుల పాలనమ్మున
బోధకులుగను ప్రజలునమ్మిన – వారలందరు దేవుడొకరనె.

వివిధరాజులు మతము లన్నిటి – నాదరించిరి ఇష్టరీతిగ
హిందుజైనుల కవుల రచనలు – వైష్ణవమ్మును వెలిగె భూమిని.

ఆలయమ్ములు అధికమాయెను – సంఘమందున ప్రథితమాయెను
తాత్త్వికమ్ములు విద్యశాలలు – వెలసెనచ్చట సమరసమ్మున.

ఎన్నొవిషయములన్ని చర్చల – గుడుల యందున సాగుచుండెను
సంస్కృతికినవి కళల కొలువులు – ప్రజల క్షేమము పరమ ధర్మము.

వ్యావసాయము ముఖ్యవృత్తిగ – పంటపండెను వర్తకమ్మును
సంఘములనట సరిగచేసిరి – వర్తకమునను ఆర్థికముగను.

మధ్యయుగమున భాషలందున – సంస్కృతమ్మును సారసహితము
ఇతరభాషలు ఇంపుకలిగెను – భేదమేమియు లేదు బాధయు.

రాజపుత్రులు చదువు రాజులు – సంస్థలెన్నియొ స్థాపనమునట
వారణాసియు నలందాయును – చరితకెక్కెను రచనలెన్నియొ.

రాష్ట్రకూటులు కన్నడిగులుగ – రచనలెన్నియొ రాజమార్గము
చోళులందరు తమిళమందున – కంబ కవిగను రామచరితయు.

వేగిరాజులు తెలుగుభాషను – కాకతీయులు కారకులుగను
ముఖ్యకావ్యము భారతమ్మును – శైవసాహితి రామకథయును.

శిల్పరీతికి తల్పమాయెను – మధ్యయుగమున రాజపాలన
తంజవూరు ఈశ్వరాలయ – వేయి స్థంభము గుడియు కట్టిరి.

భిన్నమతములు కులములన్నియు – రాజ్యవివరము విసువు గొల్పును
ఐననేమిగ అందరొకటిగ – కలిసిరప్పుడు అవసరమ్ముగ.

మొగలురాజులు మగలుకారుగ – ముదిరె వారల భోగపరతయు
మూఢమతమును పరుల హింసయు – బానిసత్వము భరతభారము.

బాల్బనాతడు వంశ బానిస – పాలనమ్మున పరువమబ్బెను
బాబరెంతయు భారమైనను – దండయాత్రల దమనమాయెను.

మొగలు రాజులు మాన్యులైరట – వారియందున సామరస్యము
అక్బరాయెను మానవత్వము – మతము జీవన రీతి దెలియును.

హుమాయూనుడు షాజహానుడు – భరతభూమిని రాజభోజులు
రాజ్య విధమును భోగమాయెను – జనుల సౌఖ్యము దేవుడెరుగును.

నెమలి ఆసన నేవళత్వము – తాజమహలున ప్రేమ మహితము
కళల గణ్యము కట్టడమ్ముల – ఉత్తరాపథ ముర్వి వెలుగును.

మొగలు రాజులు కొందరప్పుడు – దారుణమ్ముగ హిందువులనట
పన్నుబాధల స్త్రీల వేదన – తలచుకొన్నను తపన కలుగును.

దండయాత్రల దారుణమ్ముల – హిందుదేశము అంధమాయెను
పరుల సంస్కృతి పాదుకొనగను – మనది మరుగగు రోజువచ్చెను.

మొగలురాజౌరంగజేబుడు – ఢిల్లి పదవిని గుత్తగొనెనుగ
పరుల మతములు పాదుకొనగను – ఆశ్రయమ్మిడె అంత్యదశగా.

హిందుమతమును పేలికలుగను – హిందు దేశము చీలికలుగను
దేశరాజులు కలహములనట – పరుల పాలన పరువమాయెను.

రాజపుత్రుల పెండ్లియాడెను – మంత్రిపదవుల పంచియిచ్చెను
కళల గణితులు పలుమతమ్ములు – అక్బరాతడు దిన్ ఇ లాహియు.

పాలనమ్మున పాలు గొనిరట – ప్రజల పరువము రాజు గరువము
సామరస్యము సహనశీలము – సగుణమాయెను సుగుణతత్త్వము.

ధాత్రి భారతి దక్షిణమ్మున – దక్షులైరిట రాయరాజులు
ఐదు ముస్లిము రాజ్యములునట – పాలనమ్మున జనులు బరువున.

సంస్కరణమున సంస్కృతాయెను – మిశ్రమాయెను హిందు ముస్లిము
భోగ రంజిత భాగధేయులు – భోగ వర్జిత సంప్రదాయము.

కోర్కెదీరగ కోరుభోగము – కామవర్జిత కార్యసాధ్యము
రాయరాజ్యము మ్లేచ్ఛ విధముల – సంగమంబుగ సాగె కళలను.

తుంగభద్రయు తూర్యఘోషల – విజయ నగరము నగర గర్వము
నాణ్యరీతుల కళల గళముల – నాద వాదము వేద వేద్యము.

విద్యరణ్యుల బోధ మధురము – బాధ నడచగ నడచె నగరికి
హరి హరుండును బుక్కసోదర – రాజ్యమవనిని మించె మంచిని.

సాళువ వంశము తుళువ తీరును – తరగ విధమున తరుగనిదిగను
మెప్పుపొందెను ముప్పుతప్పగ – యుగము బంగరు విజయనగరము.

రాజు ప్రాజ్ఞుడు రమణ భావన – రాజు కొనెనట సారసహితము
శైలి విజయము సేవ ముఖ్యము – కవిత పందిరి శిల్పచాతురి.

రాజపదవిని అనుభవించగ – అన్నదమ్ములు అతిశయమ్మున
ఒకరినొకరిని మట్టుబెట్టుట – ముస్లిములకొక విషమ విధియగు.

విద్య వినుతులౌరంగజేబును – పాలనమ్మున సైన్యవిధమును
దక్కనందున దక్కెనతనికి – శిక్కుతేజులు శివము కోరిరి.

ఢిల్లిరాజులు సుల్తనులనట – ప్రాభవమ్మును కోలుపోయిరి
విజయ నగరిని హంపిలోనన – ఇంపు గొల్పుగ దక్షిణమ్మున.

సంగమంబయె వారివంశము – వీర శూరము కళలగరువము
కలిసిపోయెను వంశములనట – దేవరాయలు దేవుడయ్యెను.

తుళువ వంశపు తరళ రత్నము – కృష్ణదేవుడు విజయరాయలు
గజపతులనట బిజాపూరున – కొండపల్లియు కొండవీడును
ఉదయగిరియును కొండకోటలు – దర్శనమ్మున 'పేయ స'నియెను (పేయస్)
విజయ సిద్ధియు రత్నరాసులు – వీధులందున దర్శనమ్మయె.

వైష్ణవులనట విషయములనట – గారవమ్మున ప్రతిభ ముఖ్యము
మతము మరచును శక్తియున్నను – సరసుడాతడు ప్రాజ్ఞరాజగు.

ఆలయమ్మది విరూపాక్షము – వీరశైవము వెలుగు చూపెను
సిరిరంగము(శ్రీరంగం) అహోబిలమును – తిరుమలయును వైష్ణవమ్మున.

భక్తి ఉద్యమ భారవులుగను – దక్షిణమ్మున దక్షతనుగను
కర్మముఖ్యము జన్మతప్పదు – భావసామ్యము హిందు ఇస్లాం.

శంకరార్యులు వ్యాఖ్య చెప్పిరి – దేవుడొక్కడె వేరులేదని
వైష్ణవమ్మును రామనుజుడును – శిష్టమగునను విధము చెప్పెను.

'మధ్వ'మహితుడు విదితుడుగునుగ – రెండు విధముల శివుడు విష్ణువు
చైతన్యుడును నామదేవుడు – భావధారల కబీరుడును.

రామనందుడు మీరబాయియు – రాజ్యమందున భక్తిభావన
వివిధరీతుల బోధజేసిరి – విమతములనట ఖండితమ్ముగ.

భాషలందున సాహితినిగల – గ్రంథజాలము గమ్యమెంచిన
జనముల భావన శాంతిసౌఖ్యము – సమత వెలుగగ సమము వెలిగెను.

ఎఱ్ఱకోటను షాజహానుడు – ఎన్నొ మస్జిదు లన్ని మన్నిక
ఉత్తరాపథ మొత్తమంతయు – దక్షిణమ్మున ఆవరించెను.

వింధ్య దక్షిణ మరాత్వాడయు – వీర శివాజి శౌర్యసారము
ఖాండ్‌దేవుని కర్మబోధయు – తల్లి తరగని బోధ గాథల.

హిందుమతమును ఉద్దరించగ – వారువమ్మున స్వారినేర్చెను
కొండ ఎలుకగ మండె నిండుగ – శివము శివుడుగ వీర్య గురుతుగ.

గోలకొండను కాలమందున – గోరికట్టెను వీరుడాయెను
ఛత్రపతిగను బిరుదు పొందెను – ఎన్నొయాత్రల దిగ్విజయమును.

ధర్మశాస్త్రము పాలనమ్మున – ధరణినేలెను వీరశివాజి
అష్ట ప్రధానమంత్ర సహితము – వివిధ విషయము వినుతినందెను.

చౌతు సర్దేశు ముఖియు పన్నులు – గ్రామపాలన పంచయతులను
సేనవిధమును త్రివిధ మాయెను – ప్రాంత పాలన పాలకులునట.

తుకారాముడు రామదాసును – కొలిచె భవాని ప్రథిత కొరాను
గౌరవమ్మున చూచె పరులను – గుండెనిండిన శూరుడాతడు.

పోర్చుగీసులు ‘గామ’మార్గము – పూర్వమందున హిందు దేశము
కాలికట్టున దయ్యుడామను – రాజు జామ్రిన్ ఇచ్చె ననుమతి.

వర్తకమ్మున డచ్చివారలు – వచ్చిరిండియ కంపెనీలను
యీస్టు ఇండియ పేరు కలిగిన – కంపెనియునట ప్రాంతములను.

జహంగీరుడు అనుమతించెను – అంగిలేయుల కంపెనీలను
వివిధ చోటుల కోట లెన్నిటొ – రక్షణాయెను వర్తకమునకు.

ఫ్రెంచివారలు ప్రోద్బలమ్మున – వచ్చెనిండియ వర్తకమునకు
నాల్గుజాతులు ఒక్కచోటనె – పోటి మెరుగయి యుద్ధములనెటొ.

మొగలురాజుల మిగులు వారలు – భోగ రుజలను మాసిపోయిరి
దండయాత్రలు తిరుగుబాటులు – దారుణమ్మున రాజ్యతంత్రము.

ఎన్నొరీతుల విభజనమ్మయె – స్థానికమ్ముగ రాజులందరు
వేరు రాష్ట్రము నిర్మితినిగనె – రాజు పేరుకు శక్తిహీనుడు.

హైదరాబాదు బెంగాలు అయోధ్య – స్వాతంత్ర్య రాజ్యాలు వేరువేరు
రాజు మొగలులకవి లొంగియుండేను – హిందుదేశము విందు ఆంగిలేయులకు.

ఆంగిలేయును డచ్చి ఫ్రెంచిలు – స్థానికమ్మగు రాజ్య రాజులు
కలహకారణమయ్యె భారము – ద్రోహచింతన దారుణమ్మయె.

మతప్రచారము కారణమ్మున – వచ్చిరందరు పాదుకొనిరిట
దేశరాజుల చీల్చి చేసిరి – మాతమహితము వీరరహితము.

మలిన మార్గము దహన ద్రఢిమయు – మూర్ఖవిధముగ రాజ్యమందున
జనుల బాధలు చూడరెవ్వరు – దుర్భరమ్మయె దుష్టచేతలు.

ఆటవికులుగ భారతీయులు – ఆంగిలేయుల కంటబడిరిగ
వేట వృత్తిగ వర్తనమ్మున – బాధ్యతేమియు లేకయుండెను.

కలహకారణ కోరికలనట – కారుచీకటి కమ్మె భారతి
రవియు తోడుత బ్రిటీషు వారలు – రాత్రి వెలుగున దోపిడాయెను.

ఆక్రమణలను అడ్డుకొనగా – అక్రమమ్మున బంధితులుగను
జనులు జైలున బాధలనుబడె – చిత్రహింసల చితుకబాదుచు.

స్థానికమ్ముగ జమీందారులు – వారిపైనను నల్గురుండిరి
రాజులైరిట ఆంగిలేయుల – తొత్తులుగనూ తుప్పుపట్టగ.

బానిసత్వము భోజకత్త్వము – జనులయందున రాజులందున
మధ్యనొచ్చిన పరులు వారలు – మేధ కలిగిన వినుత దుష్టులు.

కర్మభూమిని మర్మమెరుగగ – మూలబడితిమి ద్వీపకల్పము
తల్పమాయెను తగవులకునూ – కల్పకమ్మిట కలదొలేదొగ.

కళలు సంస్కృతి కామితమ్ములు – కాంతి శాంతియు కారకమ్ములు
బుద్ధి బద్ధము వేదభూమిని – శుద్ధి ఆత్మను శోభనిచ్చును.

మహిళ మాన్యము రజియ సుల్తన – మగువ 'మాంచల' వీర చిగురును
రుద్ర చరితను దేవి దీధితి – కాళికలుగను కలవరమ్మున.

ఝాన్సి భారతి చేతనమ్ములు – వెలుగ జేసెను కలిగె శమమును
యుద్ధవీరుని విధము నామెయు – గుండె దడగను పరిణమించెను.

శీతలత్వము శీర్ణమాయెను – శాతమయ్యెను సెగల పొగలను
ఉత్తరాపథ ఉర్విభారతి – ఉత్తరమునిడె తిరుగుబాటుల.

ధరను భారతి ద్రవిడ భూమియు – దక్షతనుగనె స్వచ్ఛ స్వేచ్ఛయు
ఎల్లజనులును విప్లవమ్మున – ఎదురు తిరిగిరి తరలె తరళము.

భారతమ్మున మొదటిపోరుగ – సైన్యమందున హైన్యరీతిని
హిందు ముస్లిము శిక్కులందరు – యుద్ధమనగను బుద్ధి త్రిప్పిరి.

పోరు ఘోరము పారరహితము – దురంతములను దమనకాండను
దారుణమ్ముగ నణిచివేసిరి – అణగియుండిన శక్తి అధికము.

ఘటన లెన్నియొ విఘటనమ్మున – చరిత చెరగని సవనమందున
అందరొక్కటి విందు విధమున – కలసికట్టుగ పయమెంచిరి.

మతము కొరకును వర్తకమునకు – వచ్చె వారలు హితము మరచిరి
దోచువిధమును కళ్ళగట్టెను – వారిదోలగ పథకరచనలు.

మన్యవీరుడు మాన్యమయ్యెను – పోరు పంటయు పారరహితము
దండిగుండెను నిండుమనసున – తెల్లవాడిని తెల్లముగనట.

కొత్తయుగమున కూర్మిజనులను – కార్యయుతముగ కర్మసాక్షిగ
గాంధికన్నుగ బోసు వెన్నుగ – ఉద్యమమ్మును సాగెమనుజుడు.

సంస్కరణమున పేరు పెన్నిధి – కర్తలెందరొ కారకులుగను
భరత పుత్రుల కలతలన్నియు – కాలగర్భము కలిసిపోయెను.

తిలకు తిలకము దిద్దెనొసటను – భరతమాతకు వీరపుత్రుడు
పత్రసహితము తములమిచ్చెను – పెదవి పండగ అరుణకాంతులు.

సంస్థకాంగ్రెసు సారసహితము – నాయకాగ్రణి నయము నడతను
బానిసత్వపు బాణిపోవగ – ముందు నడచిరి ఉద్యమమ్ముల.

నియమనిష్ఠల ఇష్టకార్యము – సాధ్యమగునుగ సారమహిమను
ఆత్మశోధన పాతివ్రత్యము – ప్రథమమయ్యెను నాయకులనట.

బాణిలోనన భూతివిధమును – కాంగ్రెసాయెను ఐక్యభరతము
నేటివిధమున తీరులెన్నియొ – లెక్కమిక్కిలి వెక్కిరింతలు.

ఎందరొచ్చిరి పోయిరెందరు – నేలనిండుగ మనదిపండుగ
రసము పీల్చిరి పిప్పిచేసిరి – పిప్పెనుండియె ఉత్పతమ్ములు.

చెప్పవినుటను చెడును కనుటను – తప్పులనియెను త్రాత గాంధియు
మౌనముద్రను పలకరించెను – పలకబారిన పరుల గుండెను.

హింసవీడెను హితము కోరెను – హనన సంస్కృతి కూడదనియెను
దేవులందరు దీనసేవను – ఒకరెమానవ సేవ మహితము.

గాంధిమార్గము మూర్ఖవిధముగ – నేత బోసును ఎదురు దెబ్బను
హింస హింసకు హితము కూర్చును – తిరుగుబాటున తరిగె పరులను.

'అతిగ' 'మితము'గ వాదులందరు – విభజనమ్మున వినయశీలము
గెలిచె మితియును బోసు భావన – వీగిపోయెను బోసి నవ్వుల.

బుద్ధభావన అల్ల ఆశయ – క్రీస్తు ఆత్మగ హిందు గాంధియు
రామునడతయు సన్మతినబడి – సమత మానవ సహిత మాధవ.

హిందు ముస్లిము కలియ విందుగ – కలిని భరతము కాంతివంతము
కలగ స్వేచ్ఛయు విడిగ నిరువురు – దేశతీరులు వెలిగ సఖ్యము.

తూర్పు పడమర తూలనాడగ – మతము మూర్ఖము మనెడి తీరుల
హనన సంస్కృతి హీనపాలన – మారణమ్మున మనసు మరుగును.

ద్రోహచింతన దేహిమనమున – మంచి గాంచగ చాలదెపుడును
ఉద్యమమ్ముల ఊగులాడగ – జవము హీనము భౌతికమ్ముగ.

గ్రామసీమల గాంధి వింధ్యము – గుండె చల్లన హిమము మాదిరి
పండు ముదుసలి పండువిధమున – పారదోలెను పారతంత్ర్యము.

మంది మీరగ పెరుగు పల్చగ – పొందు మిగిలెను పటిమ దప్పెను
మూడురెట్లయె మోపడంతయి – జనము భారతి జతయు మరచెను.

ఉప్పుసత్యాగ్రహములోనన – మెప్పు సంద్రపు తీర జీవుల
పరుల సరకులు వరముకాదనె – సీమ సరుకుల మరలజేసెను.

పదము సార్థక మాయెనప్పుడు – విధము నేటిది చూడ బాధగు
'బందు' బంధము సమ్మెచేటగు – ప్రజలు కష్టము ప్రజల ప్రభుతను.

ఉద్యమమ్మున విప్లవమ్మున – తీరుమారెను వేరు అర్థము
మాటలెక్కుడు చేత చిక్కును – చేతనమ్ముల చేవ యుండదు.

నినదములనిట నియమరహితము – తిరుగుబాటుల తరుగు శక్తియు
విప్లవమ్మున వికసనమ్మును – కాంచుడందరు కాలగమనము.

రాజకీయము రుజల మయము – భోజులందరు రోగగ్రస్తులు
మందు పటువున మార్గగమనము – 'మందు'లేకను ముందుసాగదు.

మత్తుసేవన మిత్తివంటిది – మొత్తమంతటి చిత్తుచేయును
సత్తుకలుగగ సక్తివీడిన – 'మారి'వీడును మనిషి మనసును.

గాంధి కార్యము మద్య నిరసన – ఏబదేండ్లకు ఏవగింపుగ
సంఘమిత్తిని నెత్తినిడుకొని – నేటివారలు నోటివారుగ.

ఓటుపడునని మద్యమున్నను – దాటవేసిరి దౌష్ట్యభావన
మాటనిలబడి మత్తువదలిచె – అన్నరాముడు ఆంధ్రమందున.

కాలగమనము వింత తీరులు – కోట్ల జనులను కూర్మివారలు
కర్మ కఠినము కొందరందున – వారిలోనన 'గాడ్సె' గురుతుగ.

గుండు భారతి గుండెలోనన – దూరె దుర్గతి దారి దుష్టము
బోసినవ్వులు బాసె భారతి – ఊరి ఊరున స్ఫూర్తి శిలలను.

కర్ర పోటున కుర్రవానిని – కూర్మి కార్మిక కర్షకులనట
మూర్తిరూపున ఆత్మలందున – మరుల మురువున ముంచునేతలు.

ఆంగిలేయుల హడల జేయగ – సాంగ సహితుడు సహన మహితుడు
మనసు మమతల భారతీయుల – వెలుగు నిత్యము తొలగ దెన్నడు.

వార్ధ వర్ధిలె ఆశ్రమముగను – సార్థవనితగ కస్తురమ్మయు
మాన్యుడయ్యెను గాంధి గరువము – భరత ఖండము భాసమాయెను.

సీమ విడిచిరి పరులు వెడలిరి – పర్వమాయెను పరువు నిలచెను
పౌరులెందరొ పోరునందున – ప్రాణములనట మానరహితులు.

పాలనమ్మున మనము మనదిగ – ప్రజల ప్రజలకు ప్రజల వలనను
ప్రజలస్వామ్యము ప్రథితమాయెను – రాజ్యరీతియు రచన చేయగ.

మూడు ముద్దుల వర్ణములనట – మురిసె దేశము మధ్యచక్రము
ప్రభుత గుర్తుగ సింహ చతురము – సారనాథున స్థూప గురుతయె.

గీత జనగణ మనము మాటగ – జాతి పాడగ జీవమాధురి
దేశభక్తికి దీటు శక్తియు – రచనలందున దేశభాషల.



గీ. పంది పరిశుభ్రమును చెప్ప పారిపోవు – గార్ధభమునకు గానము గణ్యమగున
కాకి కందము కనబడ కళ్ళుమూయు – అట్లె రాజకీయులనీతి అవని నుండె.

గీ. దేనికెయ్యది ఇష్టమో దాని నేర్వ – అదియు మదినిండు మాన్యమై మరువకుండు
కష్టమైనది కార్యమ్ము కరములందు – తేల్చ తేలిక రాజకీయులకు నేడు.

గీ. పందికయినను పద్ధతి బతుకు నందు – కుక్కకయినను కనుకలి కార్యములను
దున్న దురపిల్లు ధరణిని దారుణముల – అన్ని నాయకులందున అవని లేవు.



ఆంధ్రజాతియు సాంద్రమాయెను – భాష భూషిత మహిత తల్లియు
తెలుగువీరుల తెగువ దార్ఢ్యము – ఆంధ్ర సంస్కృతి విందు విశ్వము.

కవుల త్రయమున కవన సహితము – యుగయుగమ్ముల వెలుగు చరితము
వీరధీరుల శూరవనితల – సారశక్తుల సహిత మాంధ్రము.

కావ్యసారము నవరసమ్ముల – మేళవించెను దేవభాషతొ
భక్తిరక్తియు ముక్తి సహితము – కవిత వెలిగెను రాజసహితము.

పూర్వ వెలుగులు పర్వ పరువము – సద్య శమ్మున సవ్యమాంధ్రము
భరత భావము తెలుగు భావము – దేశమందున భక్తియుతముగ.

ద్రవిడ సోదరు లాంధ్రులైరిగ – భాష భావము దక్షిణమ్ముగ
తెలుగు తెనుగును ఆంధ్ర పేరుల – తెలుగు దేశము మూడు లింగము.

తెలుగు సంస్కృతి రాజచరితలు – శాతవాహన కాకతీయులు
రెడ్డిరాజులు రాయరాజ్యము – ముచ్చటయ్యెను మూడువైపుల.

మూడు నదులను మున్నిరొకదిశ – కృష్ణ పెన్నల గోదవరులను
కట్టలెన్నియొ కర్షకుల కిట – ఇష్ట పంటల శ్యామలమ్మిన.

కలియుగమ్మున వేంకటేశుడు – ఆంధ్రదేశపు అతిధి ఆయెను
కాళహస్తియు సిరియు శైలము – ద్రాక్షరామము శైవమూర్తుల.

కనక దయితగ కనకదుర్గయు – విజయవాటిక కొండమీదను
అన్నవరమున సత్యదేవుడు – రంగనాధుడు సీమ నెల్లురు.

కూచిపూడిన గుర్తునాట్యము – యోగి సిద్ధుని ఆశ్రమమ్మున
భాగవతులకు భరతనాట్యము – భరత బాణికి భాసమానము.

మొవ్వపల్లెను నల్లకృష్ణుడు – క్షేత్రయార్యుని క్షేత్రమయ్యెను
భక్తిశృంగారాల బాణికి – వేణి పదముల రాణకెక్కెను.

కాకుళాంధ్రము రాజధానిగ – ఆంధ్రవిష్ణువు ఆలయమ్ముగ
ఆంధ్రదేశపు ముఖ్యదేవుని – పొగడె కాసుల శతక సాహితి.

మచిలి బందరు ముసలమయ్యెను – ఓడరేవది యుగములకునట
ఆంగిలేయుల స్థావరమ్మది – విద్యకేంద్రము వినుత శాలల.

నాగరకమయె నదుల తీరము – యోగులెందరొ గుహల గహనము
రాయసీమయు తెలంగాణము – కోస్తరాస్తగ ఆంధ్రముండెను.

తుంగభద్రయు వంశధారయు – కలిపె తెలుగుల ఇతరజాతుల
వనము దండక నల్లమలయును – నాణ్యమయ్యెను అటవి దట్టము.

గోదారి జిల్లాలు భుక్తి గోదాములు – రాదారి కృష్ణమ్మ జిల్లాల పావనము
పెన్నమ్మ సోమశిల పెంపారు పంటల – శ్రీశైలసాగరము సిరులకును నెలవు.

కడప గడపగ సీమశాంతులు – శాంతపడియెను శాయి నిలయము
అంతమనంతము సంజీవ జీవము – ముగ్గురాయియు మురిపెమునను.

అభ్రకమునకు శుభ్రదీధితి – రేణిగుంటను రైలుపెట్టెలు
ఏడుకొండలు కాళహస్తియు – స్వర్ణముఖియును గాధ ముక్తికి.

తెలుగు తెలగాణా ఉర్దుమాగాణ – రాజు నవాబును బానిసలు జనులు
"బాంచను కాల్మొక్త" బరువగునట – వీడెనుగ ఐక్యతను బాధలన్నియు.

ఆటుపోటుల నడ్డినట్టిది – ఆటపాటల ఆందమైనది
మాట ముద్దుల మూట వంటిది – మనది మాతయె తెలుగు తల్లియె.

తల్లి తరగని మల్లెమరువము – చల్లదనమున చెల్లుబాటున
ఆంధ్రమాతయె అందగింపున – భరత భూషిత భావ భాషల.

ఆంధ్రవనితల అందచందము – అవని వెలుగును మనసు మధురము
చిలుక పలుకుల చెఱుకు తీపియు – కలికి కలువల కళ్ళు వెలుగులు.

ఆంధ్ర మేధకు అవధిలేదెట – దేశ దేశము వినిమయమ్మున
ఆంధ్రులందరు వలసవెళ్ళిరి – విశ్వవెలుగులు శాస్త్రరంగము.

వీర మాతలు యుద్ధవిజయులు – పుత్రులనుగనె ఆంధ్రమందున
రామరాజును ఖడ్గతిక్కన – రుద్రదేవియు నాగమాంబయు.

మగువ చానమ దేవి మాంచల – బాలచంద్రుడు మాత బహుమతి
అతివ లతిగను మగలు మగటిమి – మితియుమించెను సుతులు సతతము.

తెలుగు దేశము పండుగలకును – సంప్రదాయపు దర్పణమ్ముగ
గ్రామసీమల జానపదులను – జనుల జీవన గమన మహిమను.

పంట పండగ పండుగొచ్చును – సంకురాతిరి సంతసమ్మును
ధాన్యగాదెలు ధరణినిండును – పశుల గణములు పాలు పిండును.

ఏరువాకయు సాగుచుందురు – దున్న దుక్కియు మొదటి యత్నము
పారు ఏరుల పనికి మొదలుగ – పశుల పూజల పసిడి పంటలు.

పల్లెపల్లెల పోతురాజులు – ఊరిదేవత గ్రామకంతము
పొల్లిమేరయు హద్దుపద్దులు – పల్లెజీవన పావనమ్మును.

కరణ మునసబు సభ్యులందరు – పాలనమ్మును ఊరిచావడి
రచ్చబండను తగవు తీర్పులు – మచ్చలేనిది జీవితమ్మట.

మారెకాలము మనిషిమారెను – పరువు కొఱకును పంతములనట
పౌరుషమ్మున తగవులాటలు – ఊరివృద్ధియు వ్యర్థచేతలు.

కులము వేరుగ మతము మారుగ – జనుల విడివిడి నాయకులొకటి
జగము పోయిన పదవి వదలదు – అయిదు ఏండ్లును అందదదియును.

త్యాగబుద్ధియు యోగయాగము – కర్మసారము నాయకులకట
నేటికర్మలు లాభసహితము – కామకర్మలు ధనము యోగము.

గుండెనిచ్చిన వీరులందరు – గుండెకాయలు ఉద్యమములను
పరులు చెదరిరి పదవులొచ్చెను – తృణప్రాయము పట్టుదలలను.

ఆంధ్రకాంగ్రెసు ఆదిగురువును – పట్టువీడని గాంధివాదియు
'భోగరాజు'ను పట్టముననిడె – పట్టుకలిగెను మెట్టుపైకిని.

సమరయోధుల భేరి నినదము – కవితసారము దేశభక్తియు
భావిభారత ఆంధ్రభారతి – అమర మహితము ఆశయములను.

పన్నుకట్టక పట్టుపట్టెను – 'దుగ్గిరాల'యు దగ్గరుండెను
ఆంగిలేయులు ఆత్మశోధన – మాత ఆత్మకు శాంతికలిగెను.

చదువు సారము సామ్యవర్తన – సౌమ్యతనుగన చదువు వారలు
గురువు లెందరొ గణ్యులైరిట – వారి మరువక ముందు సాగుము.

మహిళ మాన్యత చదువు షరతుగ – సాగె నాంధ్రము సంస్కరణమున
కందుకూరియు కృష్ణశాస్త్రియు – రత్నరఘుపతి యత్న ఫలమది.

పతియు పతనము దుర్వ్యసనముల – సతియు సహనము గృహము గురుతుగ
అత్తమామల కట్నసహితము – ఆడుబిడ్డల వేదనెంతయొ.

కట్నవరమున కన్యనమ్ముచు – పండుముదుసలి పంటశుల్కము
మింటనాతడు విధవ బాధలు – కోర్కె తీరదు కర్కశమ్మగు.

మరల పెండ్లియు మార్పుకోరును – కోర్కెతీరగ తీర్పునిచ్చిరి
చట్టచేతల సరిగదిద్దిరి – అబల సబలయు నేటి నియతిని.

కావ్యనాటకముగానములనట – తెలుగు గమ్యము తేటరమ్యము
దేశభక్తిని బోధసేయగ – రచనలెన్నిటొ శక్తియుతముగ.

జన్మభూమియె జగతిమిన్నగ – అన్యపాలన మనకు వద్దని
మిన్నకుండగ మిన్నుమీరగ – వెన్నెముకగను రక్షసేయుడు.

రాముడాదర పాత్రముగనూ – కృష్ణుడాశయ దీపముగనూ
గాంధిగౌరవ సమతభావన – సాగిరగను సామ్యపాలన.

ధర్మరక్షణ మాత మరువక – సోదరత్త్వము సారవంతము
మతము మరచీ గతము తలచీ – గమ్యమెంచుడు గౌరవమ్మును.

మృత్యువైనను మురిసెవారలు – ఉరియు జైళ్ళను లెక్కగొనకను
పోగ జీవము వచ్చెస్వామ్యము – పోరు తీరును పారె రక్తము.

ఆంధ్రులెందరొ అవనివీడిరి – భరత భూమిని రక్షసేయగ
మాత మరువని మగలు ఆంధ్రులు – బాటవేసిరి భావిచరితకు.

గొప్పవారల గొప్పదనమును – మెచ్చుకొనగను మెరుపు వెలుగును
తెలివి తరుగును కలిమి ప్రేమను – తెంపరులుగను తేరు నెక్కిరి.

జాతి జెండను రూపుదిద్దెను – వెంకయార్యుడు ఆంధ్రపింగళి
ముద్దుముచ్చట మూడు రంగులు – మధ్యచక్రము మురువు సహితము.

680

## డా॥ జగదీష్‌చంద్రబోస్

జగతి జీవము వృక్షసంతతి – శాస్త్రరూపము బోసు జగమున
జీవముండెను చెట్టుచేమల – కనెను తానట క్రెస్కొగ్రాఫున.

రక్షసేసిన నీడనిచ్చును – వృక్షజాతులు జగము పెరుగగ
వనము పవనము వర్షమధికము – హర్షమగునుగ పంట పండగ.

పెంచ చెట్టును పంచునీడను – చల్లదనమును సమము వర్షము
పరిసరమ్ములు శుభ్రతనుగను – వ్యాధులెన్నిటొ అణచివేయును.

చెట్టులన్నియు శ్వాస చేయును – వెలుగు పొందును విడుచుగాలిని
వలయు విషయము పొందు వృక్షము – కానిదానిని వదలు వ్యర్థము.

బొగ్గువాయువు బయలువెడలగ – దానినంతయు గ్రహణసేయును
ప్రాణవాయువు పంచు జగతికి – పచ్చదనమున మెచ్చు జనమును.

కల్పకమ్మగు జనుల హృదయము – శాస్త్రవిషయము చిన్నతనమున
బోసుబాబుకు ఆశయమ్మయె – చిన్నవాడుగ చెన్నుమీరెను.

తం(డ్రి (ప్రోద్భల మెంతొ చెప్పగ – చదువు సాగెను సారవంతము
కొత్తవిషయము కోర్కెశాస్త్రము – పక్షసహితము వృక్షమాయెను.

ప(త్రహరితము చి(త్రజీవము – వృక్షసంతతి సాక్షి జగతికి
రుజలు వదలగ సుగతి కలుగగ – చెట్లునాటగ చేవ మనిషికి.

ఇతరదేశము వెళ్ళినాతడు – చదివె శాస్త్రము నేర్చె విధమును
తిరిగివచ్చెను దేశమునకును – శాస్త్రఫలితము జనులు తెలిసిరి.

మూలికలుగను మానవులకును – రుగ్మతలనిట పార(ద్రోలగ
చెట్లమందులు చేరె జనునికి – శక్తి కలిగెను పచ్చదనమున.

గీ. జగతి జనజీవ జవమును జిలుగు వెలుగ – చెట్టుచేమల చెరగని చెన్నునీడ
వృక్షపక్షము సాక్షియె వెలుగు వేరు – పెరుగు పెద్దగ పేరున (ప్రేమ మీర.

గీ. ధర్మరక్షణ ధరణిని ధైర్యమున్న – రక్షణముసేయు జనునికి రక్షగాను
వృక్షరక్షణ సేయగ వినుత రక్ష – జనుని కాపాడు జగమున జీవమిచ్చు.

గీ. హరిత హారము హయరీతి హొయలు చిలుకు
ప(త్రసహితము పరమమ్ము పరువమొలుకు
ఛ(త్రచామర చాలన సేవితమును
చెట్టుపట్టుగ చల్లని సీమ జగతి.

గీ. రోడ్ల రాదార్ల రహిమీద రమణ చెట్లు – గట్ల గుట్టల పట్టుల గృహములందు
పాఠశాలల పొలముల పాటవముగ – నాట నాణ్యము నియతియు నేడు కలుగు.

ఆ.వె. ఒక్కచెట్టునాట పెక్కులు ఫలితాలు – చెట్టు పెంచగాను చేవ బతుకు
పథకములను (ప్రభుత పెంచగ వృక్షాల – నిధులు నదుల బడెడు నీతిదప్పి.

గీ. అటవి సామాజికమ్ముగ అవనిపెంచ – దేశదేశాల (ప్రభుతలు ధనము నివ్వ
మొక్కుబడిగను మొక్కలు పెంచబడును – దిక్కుతెలియదు ధనమెట్లు దొరలుచుండె.

గీ. కళల శాలల పథకాల కాంతితోడ – చెట్లు జీవన గట్లుగ చెరుపులేక
పెంచ పెంపుగ నిధులను పంచగాను–విధము వివరించ విషయము విసువు గొలుపు.

గీ. అధికవృష్టియు అతివృష్టి అవని వెలయ – వృక్షతతులన్ని వనములు వినశనమున
భూమి భవితను బాగుగ భువనరీతి – చేయ చెట్లకు సాధ్యము చేర్చుగట్టు.

గీ. కొట్టుకొనిపోవు కట్టలు గుట్టలన్ని – ప్రక్క వృక్షము పెరుగగ వేర్లతోడ
కట్ట గట్టిగ చెట్టులు కాలములకు – తెగవు తేలిక తరగవు తరుణమునను.

గీ. రంగు రంగుల రంగారు రాజ్యమందు – హంగు హొన్నుగ హోరమై హ్లాదమిచ్చు
పచ్చపచ్చని పైరుల పచ్చికలును – మెప్పు మురిపించు ప్రకృతి మేదినందు.

గీ. చెట్లు పెరుగగ తరుగును చేటుతపన – చల్లదనమున భూమియు చల్లబడును
జీవమింపొందు జగతిని చెట్లు పెరుగగ – జీవి! ఒక్కొక్క చెట్టుకు జీవమిమ్ము.

గీ. సెగల పొగలను ధరియిత్రి చేటుపొందు – పచ్చపచ్చని చెట్లన్ని పెచ్చరిలగ
హెచ్చువేడిని హరియించు హరితమిచట – చేటు చాటగు చెట్లను సరిగ పెంచ.

గీ. సంస్థలెన్నియొ సతతము సాగుచుండె – చెట్లపెంచగ జీవము చేవకలుగ
ధరణి దారుణములనుండి తప్పుకొనగ – సేవచేయగ సతతము హరితమగును.

గీ. అడవులభివృద్ధిజేయగ అవనిమీద – జనుల జీవన గతియంత జరుగు సుఖము
నరికివేయగ అడవుల నయము దప్పు – జీవిగతియంత హేయమై రుజలు వచ్చు.

గీ. పూర్వమానవుడుండెను ఉర్వియందు – చెట్లునీడన ఆకులు కట్టుకొనియె
కాయ కూరల దుంపలు కాలమునను – వృక్షతతులిచ్చె తపనను విలువతీసె.

గీ. జంతువులరీతి జనుడుండె జరుగనటవి – కాయలాకులు కమ్మగ కారడవిని
తినెను తీరెను తపనయు తెలుపునదియు – నీడ తిండియు బట్టయు నేటి చెట్టు.

గీ. జగము జగదీశుచంద్రుని చేతనమున – శోధనములెన్నొ శోధించె శాంతికొరకు
భౌతికమ్ముగ వృక్షాల విధము తెలియ – భాసమానము భారతి భవిత చేత.

గీ. భారతీయాత్మ భాసించె భవిత దెలిసె – జన్మభూమిని గలయట్టి జవమువెలిగె
కర్మభూమిని కార్యము కాంతిమయము – మర్మమెరిగిన జగదీశు మంచి దెలియు.

గీ. ఆత్మ జననికి అవనిని అధిక సుఖము – కల్పనముజేయ సంకల్ప కల్పకముగ
పట్టుదలయును ఫలితమ్ము పొందెనాడు–నేటి యువకులు నియతిని నయము పొందు.

గీ. జాతికర్పించె తనదైన జాణశక్తి – శాస్త్రపరిశోధనమునందు శర్మమబ్బె
మన్ననలు పొందె పరదేశ మాన్యుడయ్యె – భరతమాతకు ముద్దుల బిడ్డడాయె.

గీ. మురిసె మనతల్లి మురిపెంపు మగువ విధము–మాన్యురాలయె మాన్యుని మనుజుగనగ
భౌతికమ్ముగు జీవము భరతమునను – వృక్షశాస్త్రము వక్షమ్ము విధము వెలిగె.

గీ. చలికి చేతన వేడికి చివుకుమనుట – కాంతి రహితము మించెడి కారణములు
జీవ సహితము జీవమ్ము జవములేక – ఎన్నొ ఎన్నెన్నొ విధముల చెట్లు ధరణి.

గీ. వానిగ్రహియింప యంత్రమ్ము వాసికల్గ – చేసె సరగున తనదైన చేతగొప్ప
దేశమందున నిర్మితి దేరెనదియు – పరుల విస్మయ మందగ పదనుమీరె.

గీ. గతము గణ్యుల గమనమ్ము గుర్తుచేయ – కలుగు కార్యము కమనీయ కర్తలుగను
మనము మనసుల మంచిదౌ మార్గమెంచ– గొప్ప గుప్పను గుండెల గుబులు కొనును.

గీ. చరిత చిగురించ చేరును చేతనముల – భవిత భాసించు భారతి బాగుసేత
కవిత కమనీయ చరితల కావ్యరీతి – మహిత మానవ మాన్యమై మనసు దీప్తి.

681

## వాయుయాన దినం

గీ. భయము బాధయు భారమౌ వాయుయాత్ర–ముప్పు ముప్పిరి మురిపెము మిగుల కుండ
మునుగు ముంచును మనుజులు మూలబడగ – ప్రాణమెన్నగ తృణరీతి గాలియాత్ర.

గీ. దూరతీరాల జనులంత త్వరనుచేర – ఆశ్రయింతురు వాయుయంత్రమును బుద్ధి
వేగ వేవేగ వాయువు వేళయెరిగి – వచ్చిచేరగ వరపెంతొ విలువ కలుగ.

గీ. ఎగురుచుండును గాలిలో ఎంతొ ఎత్తు – పక్షిరీతిగ పల్టీలు పాటవమున
చోదకుండెంతొ చాకచక్యమ్ముతోడ – నడప నాణ్యత చేరును నవ్యముగను.

గీ. సరకు సరగున చేరగ సామ్యముగను – మనుజులందరు గమ్యాన మారకుండ
చేర్చసాధ్యము వాయు యంత్రమ్మునందు–సుఖము సులభము సరగున సాంద్రమగును.

గీ. త్వరను తపనను తనువును తలచకుండ – మనుజుమనసులు మునిగెను మరపునందు
యంత్రభాగము లెంతయొ యాంత్రికముగ – జాగరూకత జారెను జనులయందు.

గీ. వాయుయానము విలువైన వార్తనేడు – చేయువారలు విలువను చేవగల్గ
నడపుచోదకుడెంతయో నాణ్యతగును – గడచు యానము సంతోష గమ్యమగును.

గీ. విలువకలిగిన తనువుల వినుతరీతి – గమ్యమునుచేర్చ గరువము కల్గుజగతి
మధ్యమారణహోమము మచ్చబెట్టు – చిచ్చుచెరగని ఛిద్రము జరిగిపోవు.

గీ. ప్రభుతసాధ్యముకాదది పరుల పరము – వ్యక్తులకునిచ్చె సంస్థల వర్తనమును
మేలునాశించ కల్లెను మాయకీడు – జనులు భయమున భీతిల్లె జవము వీడ.

గీ. సంద్రములయందు మునుగగ శోకమాయె – కొండఢీకొన గుండెలు గుభిలుమనును
దారితెలియక నెక్కడో దిగును భూమి – ధరను తొందర దిగగాను దారుణమ్ము.

గీ. గాలియందున పేలును గోలగాను – బూదిదగునుగ మిగలదు పేలికయిన
తప్పు ఎవరిదొ ఎరుకకు తావు కరకు – ముప్పు మాత్రము మనకుగ మేర మీర.

682

తపన పెరిగెను ధనము గణనకు – తరిగె తపనయు నీతి నియతికి
జనుడు జగతిని స్వార్థపరునిగ – జగతి జనునికి జవము మాయము.



రామరాజ్యము రహికిభోజ్యము – పూజ్యమాయెను పుణ్యచరితులు
తీరము మారెను తపనహెచ్చెను – తనవు తపనకు తావలమ్మయె.

రాజకీయము సొమ్ము కొరకని – కొఅనుమానిన నాయకులకును
పదవులివ్వగ పాటుదప్పెను – వ్యధను జనులును వగల వారలు

కోట్లు మెక్కిరి గడ్డిగాదము – పోటితత్త్వము మెక్కుపద్ధతి
సుఖము ధనమును రాజకీయులు – పొందుచుండిరి పొందుమరచిరి.

సుఖము గణనకు సాధనమ్ముగ – దుఃఖ వివరము దూర పరచగ
పదవి మార్గము పరువుపోయిన – పరపతుండును పతియు పోయిన.

మనసు మరణము మనిషి పెరుగగ – ధనపు ప్రేమయె ధరణిరోగము
అడ్డుగోడలు కట్టుకొనగను – పొంగెపాపము ముంచు జగతిని.

యాంత్రికమ్మయె మనిషి బతుకును – అరిగిపోవును అధిక ఒత్తిడి
మరిగిపోవును మనసునార్ద్రత – తరిగిపోవును జీవకాలము.

గుండెయనునది మెత్తనైనది – మనసు మనిషిది ఆర్ద్రమైనది
కఠినరీతిని మరిగిపోగను – కష్టమగునుగ కాలమహిమను.

విశ్వమంతయు వశ్యమయినను – మనసుమాత్రము మలినమగుచును
తపననేదియొ తరుముకొనుచును – తరిగిపోవుచు ధరణి విలువయు.

పేరు పెంపులు పూరకమ్ములు – జీవితమ్ముల జవము నింపును
కీర్తి లక్ష్మియు కాలముండును – కర్తమనుజుడు కర్మసాక్షిగ.

జనత వినతుల పదవి ప్రణతుల – పాలనమ్మున పాపమాయెను
సేవ గణ్యము పుణ్యమయినను – చేరు లక్ష్మిని చేవ దరుగగ.

వినుము చెప్పిన కనుము సత్యము – అనుటమాత్రము ఆగుమాగుము
తేటమాటల యుక్త రీతిని – ముద్దుమూటగ మాటలాడుము.

సహనమనునది గుణము గొప్పది – మహిత మార్గము మనసు మనిషికి
కోపతాపము కూర్మిశత్రువు – పాపసహితము జీవితమ్మున.

నమ్మకమ్మును వమ్ముచేయకు – నడత నాణ్యత నయము లేకను
మరపు మనుగడ ప్రేమ ప్రియమగు – జీవి బతుకును చింతరహితము.

తీరు మారగ తెరువు లేరుగ – నీవు నడువగ నీరసమ్మొగ
బాట ఒకటిగ భావి శక్తికి – భావిపౌరులు బరువు మోయుడు.

గొప్ప వారల మెప్పు కొరకును – మొప్పెలందరు గుంపు గుంపులు
తెలిసితెలియని తెలివి కొరవడి – తేరునెక్కగ తీర్పరులుగను.

కీర్తి తేరది గొప్పవారిది – నేటి సంఘము ధనము కిడునది
మనసుకిచ్చెడి మహిమ కలిగిన – రోజులకు నివు ఎదురు చూడుము.

సారవంతము శూరమహితము – భరత భారతి హితము మాన్యము
సస్యశోభిత సారవాహిక – సత్యవాక్కుల మధురభాషిత.

ఏమిలేదను ధనమునందున – ఏమొకలదని యత్నమునుగను
మనిషిముఖ్యము ధనము కాదను – మనసు మరచును మనిషి చేతల.

చుట్టుచేరగ చట్టుబండలు – చట్టసారము చుట్టమగునుగ
మనదిచట్టలు మనకెపాలన – అనువిధమ్మును స్వార్థమగునుగ.

విధియులేదన విబుధులందరి – ధర్మపరతయు దారి మరచెను
కర్మవశమున ఖర్మభారతి – మర్మమాయెను మనిషి బతుకును.

మాత మరకత మాణిక్య మాన్యచిత్త – భాగ్యవేదాల వేదాంత భాసమాన
రాజ్యరమణను రాజిల్లె రహిని రమ్య – పూజ్యపావన పారమౌ ప్రేమమాత.

బతుకు బుడగయె గాలికలియును – సతము సఖ్యము జనుల మెలగుచు
వెంటనిడుకొని పోరు ధనమును – కట్టెకాలును కీర్తి వెలుగును.

వెలుగు వెలియును విలువ కొరవడు – కలుగు వెలుతురు కీర్తి దీపము
తెలియ రానిది తెలిసికొమ్మిట – తెలివి లేకను తరలిపోదురు.

కష్టపడగను నష్టపోరుగ – నాణ్యమగునుగ అనుభవమ్మున
సోమరులగను సొక్కిసోలుచు – చోద్యమునుగన చిద్రమగునుగ.

వేదసహితులు ఉపనిషత్తులు – దర్శనమ్ములు దార్శనికులును
మునులు మాన్యులు మాననీయులు – సరస సాహితి సామ్యభారతి.

గమ్యమెంచిరి గరువ మాయెను – గురువు లందరు గురుత జ్ఞానము
నడత నాణ్యత చరిత శీలము – గతము వెలుగగ వికసనమ్మయె.

దండయాత్రల దారుణమ్ముల – వీడిపోవక భరత భావన
భాగదేయులు భారతీయులు – సదృశమ్మున భరత సంస్కృతి.

గీ. గృహము గణ్యమౌ గరువంపు గరితగాను – ధరణి దాంపత్య ధారణ ధర్మయుతము
ప్రేమ పుత్రుల పాలించు పరమ పథము – విశ్వజీవిగ వినయంపు వీర్యమహిమ.

బంధుభావమ్ము భారతి భాసమగును–విందు వినుతంపు విషయము విబుధ విధము
దైవ దయితయె దయయుత దానపరత – భరత భగవంతు భావన భాస భరిత.

683

## N.T.R. – నాయికలు

ప్రభలు జిందెను ప్రభను తోడుగ – ప్రభుత వెలసెను చిత్రసహితము
ప్రభువు సినిమను విభుడు జనులను – ప్రభగ కలిసెను అన్నరాముని.

సుజాత సంజాత నటనభూజాత – భ్రుకుటి భరణుడు నందమూరియు
సహితుడాయెను సుందరముగను – జంట జతులను జాతమయ్యెను.

వహిదరెహమాను రాధాసలూజ – మీనాక్షి శేషాద్రి మాన్యమై నటనను
వెలిగించె మనవాడు జంటదివ్వెలనాడు – అదె తెలుగుచిత్రాన తేటతెల్లమునేడు.

జంట జగతికి పంటగ జాణలంత – గుండెనిండుగ పండుగ గురుతులంత
మెండు మల్లెల దంపతుల్ మేరమీర – నిండుచూపరు కనులను నయము నడత.

ఒక్కరిద్దరు తప్పక పెక్కురంత – మంచి జీవిత మనుభవ మందునుండ
పంచె పరువాల మురిపాలు ప్రాభవమున – ఆయురారోగ్య యుతులైరి అవనియందు.

లతలను లావణ్య లలితల లోలత్వ – లతికలు లాలిత్య లహరులంత
భారమ్ము తనుభార తపనల తారుణ్య – తులకింత తేటులింతులను తూగె
కాంతుల కమనీయ కాంతల కొందల – కోర్కెల కోవిద కోర్కెలలర
రసనల రాసిక్య రమణల రాగాల – రుచ్యమౌ రుచులను రాజుగాను.

కట్టుబొట్టుల నటనల కనులకింపుగాను – నడచెబెడగుల హంసల నించు మదుల
హొయలు హంగులు సింగార హారముగను – భోగరాగాల రంజిల్లు భాగ్యసీమ.

సారసౌఖ్యులు సరసులు సౌమ్యులంత – ఆంధ్రవనితల రూపును అతివలంత
సాంద్ర మాయెను మాకంద సదృశముగ – సతులు నటనాన స్వారస్య సహితులంత.

కోట్లు కొల్లగ గడియించి కోర్కెదీర – కొల్లగొట్టిరి కోర్కెల కులమువారి
హృదయ సీమను నిల్చిరి ఉవిదలంత – తెలుగు చిత్రాలు సిరికింపు తేటులంత.

దేవి, శ్రీదేవి శివమెంచు దేహమునను – సుందరాకారు అందాన సురుచిరముగ
'దీప' దీపమ్ము ధైర్యాన ధరణి నిండ – అన్న సరసన జేరగ అందగించె.

'పద్మ'ప్రియముగ పరుల మదిననదించు – చిద్రదర్శన భాగ్యమిలజెప్పెనేమొ
ప్రియము తెలుగుల విభుని సరసనున్న – పద్మప్రియ నేటి గణ్యమౌ జంటగ.

'విజయహారతి' వినయ ఆరతి – రతియు రంగము హారమహితము
అన్న ఆరీతి చిత్రజంటగ – మరుల గొలిపెను తెలుగు మురిసెను.

'వాణి'విశ్వము నాదసహితము – విశ్వనటునికి సహిత ఆమెయు
నటననాణ్యము నందమూరిది – ఘటన గణ్యము చిత్ర జగతిన.

అగ్నిహోత్రము రీతిని ఆహరించెను నాడు – రామణీయ రీతియు రాముసరసజేర
'చిత్రా'గ్ని హోత్రాన చెన్నగు దీపమ్ము – రతియు మన్మథ తలపు ఇరువురి జంట.

జిగిని కన్నుల బిగిని మిన్నగ – మంజువాణిగ మంజులయునట
వింజమాయెను అన్నసరసన – సినిమ 'మంజుల' సీమ తెలుగున.

'లత'కు ఆసర వృద్ధినొందగ – లతయె నాయిక అన్న సరసుడు
మిన్నుప్రాకెను జంట కలియుగ – అన్నగారికి మన్ననాయెను.

సంగమాయెను 'సంగీత' సరస నటన – తెలుగు తీరుకు తరగని తేటి విధము
జంట నటనల గానాల జేతలందె – వింత కాదుగ నాయిక వంతలేదు.

జయచిత్ర జయమందె జనవాణి జిగివెల్గె – జయశీలు జనమాన్య జంట గలిసె
జయప్రద పథమున జవజీవ సహితయై – బిగిహెచ్చు బిరుదుల భావజంట
శారద శర్వరి సరసమై సరసుని – రాముని జంటను రమణమీరె
జయసుధ సుధవంటి రూపమ్ము రహిమించి – రాజ్యాన రామన్న రమ్యజంట.

నాయకునితోడి నాయిక 'జయ'యు విజయ–విజయతోడుత విజయాల వినిమయమున
గణన కెక్కిన గడసరి గారవమున – జంట పంటగ జరిగెను జవము కల్గ.

విజయనిర్మల నాయికయ్యేను – నాయకుడుగను నందమూరియు
ఇరువురందున ఒకటె దాగెను – సినిమ సర్వము పదవులన్నిట.

దర్శకత్వపు దార్శనికులుగ – నిర్మితిని జనె సినిమజగతిన
కథయు మాటల రచయితలుగను – జంట మేధల స్త్రీలు పురుషులు.

'లక్ష్మి' లక్షణ లక్షిత లలిత యుతము – సుందరాకారు సుందరి సరసజేర
నందనమ్మున నటులుగ నందితులుగ – వందనమ్ములు చేకొనె వరుల జంట.

చిత్రసీమను చెన్నుమీరెను – 'జయంత'మ్మయు జంటజాణగ
జనులకన్నుల జాతి జవముగ – అందగాడును అందగత్తియ.

రాజకీయపు బాణిలోనన – జాణమాన్యత లిద్దరిలలో
విజయమందున కలిసిరిద్దరు – జంట సినిమన జయము లలితము.

కాంచ 'కాంచన' కాంచన కాంతికలిగి – పురుషు జేరెను ప్రక్కన పుణ్యమబ్బె
నాట్యభంగిమ రూపాన నీటుగాను – జగతి జంటకు జేజేలు జరిగెనంట.

అతివలెందరొ ఆంధ్రలైరట – కానివారల 'షీల' యొకతెయు
కారణమ్ముగ చిత్రనటనను – కలిసె నన్నను కలువ విధమున.

భరత భారతి ముద్దుల బిడ్డడన్న – సరస నాయక నవరస సహితకలిసె
వెలుగు భాసించె భారతి సరసనుండ – చిత్రసీమను కాంతియు చేరె దిశల.

వాణి నెల్లూరు 'వాణిశ్రీ' బాణివేరు – సహజ సుందరు కలిసెను సంపదలను
భాష భావాల రూపాల భరణమయ్యె – తెలుగు తెరకయ్యె తరగని వెలుగు జంట.

పాతతరమున 'దేవిక' పరువయుతము – పాట మాటల నటనల పాటవమున
దేవి పాత్రల దీటుగ తెలుగు సినిమ – నటన నటరత్న సరసన నయము వెలిగె.

సినిమ విజయము 'కేఆర్విజయ'యు తెలుగు – ఒడ్డు పొడవున తులతూగు వరమునటన
అందమునుమించు చందము కనులముందు–విజయ నటజయు సరసన వినుతినందె.

చిత్ర 'రాజశ్రీ' చిరముగ చేరెనన్న – నాట్యభంగిమ హృదయమ్ము నవతయొప్ప
సంగమించెను అన్నకు సరసురాలు – శ్రీల పంటగ జంటాయె సినిమలందు.

చంద్ర సదృశము మనవాని చెన్నుమోము – చంద్రకళగను నాయిక 'చంద్రకళ'యు
సాంద్ర నటనము నాణ్యము సాగివచ్చె – చిత్ర రాజము లెన్నిటొ చేరె సరస.

తమిళమందున తరళమగునట – 'జయము లలిత'ము నటన రూపము
నందమూరికి అందగింపుగ – సరసజేరెను జాణ లలితము.

అంజనమ్మగు రంజని అతివలకును – శ్రీలు చిందించె చిత్రాల సీమనందు
అన్న సరసన ముద్దుల మన్ననలను – పొందె 'శ్రీరంజన'మ్మయు పొలుపు మీరె.

కుసుమ గంధము వ్యాప్తిజేసెను – నటన కుసుమము 'కుసుమ'నటియును
గంధగ్రాహిగ నందమూరియు – కలియ చిత్రము కమ్మనాయెను.

'యస్వరలక్ష్మి'యు – సుస్వర సాక్షియు – సుమధుర గాత్రియు
రాముని జేరెను – రాజిలెనామెయు – నాయిక ముద్దుగ
నాణ్యత హెచ్చుగ – చిత్రము చందము – అందరి కందము

'కృష్ణకుమారి' నాట్యమయూరి – నిండుకన్నుల మెండుమాటల
నందమూరికి కృష్ణవేణిగ – చిత్రపంటయె వారిజంటయు.

వాటమాయెను 'వైజయంతియు' – మాల సినిమా మాన్యరీతిని
జంట కలిసెను చిత్రరాముని – మాన్యు వంటగ చిత్రపాకము.

రాజకీయులు జంటవారలు – చిత్రసీమను ఒకరి సరసన
ఒకరు నుండిరి సుకర మాయెను – సుందరమ్ముగ చిత్రమందము.

'హేమలత'ను హేమలతయును – చిత్రలతగను అల్లుకొనియెను
ఛత్రసహితుడు అన్నరాముడు – జంట హేమము కనుల బంగరు.

లోచనముగను సినిమ జగతున – తగును 'రాజసులోచన'మ్మయు
అన్నవెంటను మిన్నవెలిగెను – ఇద్దరైరట రెండుకళ్ళుగ.

చిత్రకన్నుగ 'కన్నాంబ' చిరము వెలిగె – చిత్రమగునుగ చెంతను చేరెనన్న
చిత్ర చిత్రిత చిత్రాలు చెన్నుమీరు – చిత్ర జంటగ రామన్న సరసనంబ.

జంట తుంటరి చేష్టల జాణతనము – పంట తెలుగుల పరువాల పారుయేరు
రామరావును 'సావిత్రి' రమణ నటన – మరపు రానిది లేనిది మరువముగను.

పద్మనయనయు 'పద్మిని'యునట – పద్మగర్భుని విధమునటనను
సరస జతనూ సార చిత్రము – వరుస పద్మిని వాటమయ్యెను.

'జమున' యమునగ నటన జాలుగ – కలిసె సంగమ మందు రామును
తెరను పెండ్లియు ఇలను విందుగ – జరిగె చిత్రము జనులు మెచ్చగ.

సత్యభామగ భామజమునయు – చిలిపికృష్ణుడు నందమూరియు
చిత్రములకే చిత్రమాయెను – జనత జంటను కనుల పంటలను.

అంజలించగ 'అంజలి'యునట – జనుల హృదయపు అంజలిగనట
కనుల కమ్మన వలపు వంపుల – కలిసెనిద్దరు లేవు హద్దులు.

'లక్ష్మిరాజ్యము' లక్షణయుతముగ – నటరత్నకు సరస నటిగ
నాణ్యమయ్యె నటన లోన – లక్ష్మి లక్షణలాస్య లావణ్య రాజ్యమౌ.

భాసితమ్ముగ 'భానుమతి'యును – భాష భావము సార్వభౌముని
సరస నటనను వంపుసొంపులు – మతుల చలనము మంచి నటనను.

లతయు 'మాలతి' మల్లెవిధమున – అల్లుకొనియెను విశ్వనటకుని
చల్లెగంధము దిశల దశలను – లతయు కాండము తీరు శుభదము.

వరము 'వరలక్ష్మి' వరుసను వలపు మించి – నందమూరికి నటనను నాయికగను
వందితమ్ముగ వాల్లభ్య వాసితముగ – చలన చిత్రాల వరమయ్యె వారిజంట.

సవిత సావిత్రి నటనను సరసరీతి – నాయికలమించు కలవంటి నటనమించె
అన్నసరసన మిన్నగా అతివ మెరిసె – సరస సావిత్రి నటమయ సారసౌఖ్య.

ఘంటసాలయు గణ్యగీతము – మాటరచనల కవుల గమనము
నాల్గువిధముల అభినయమ్మున – అతడెసాటిగ ఎదురులేదుగ.

మాయనైన నమాయకముగను – సుఖము సులభము దుఃఖమైనను
సరస విరసము సమము నటనను – నియమబద్ధము నయన విధమును.

ఫైటింగుల ఫోజులలో – కత్తిసాము కర్రసాము
విఠలాచార్యుల ఫీట్లను – మైమరపించును నటన.

గుర్రపు స్వారీల లోన – ఎడ్లబండ్ల పందెములను
కుస్తీలను బస్కీలను – మెరయునటన మురిపించును.

జాణయయ్యె 'జానకి'తో – జరిగెనటన జవమబ్బెను
జనుల జగతి సంతసమున – ముంచె జంట చిత్రాలను.

చిత్రసీమను అభిమాన్ల చిత్తమందు – ముద్రవేయగ రామన్న మూర్తి మహిత
తొలుత పుట్టిన అభిమాన తప్తుడితడు – నాటి నుండియు నేటికి మారలేదు.

పల్లెపదముల పిల్లవాడుగ – నగర జీవిగ నాగరకముగ
నడత నాణ్యత నయము మీరగ – కళను రాజిలె కమ్మయశముగ.

కష్టకాలపు దృష్టివీడక – వ్యక్తిగతమున సక్తిమరువక
సాటివారల సాగు గౌరవ – సారమెరిగిన సరసుడతడగు.

రైతురాజ్యము ఏలవలెనని – రాసిపెట్టగ రాజురాముడు
జనుల సుఖమును కాంక్షసేసిన – రాజకీయుడు నాయకుడుగను.

మనిషి మృదువగు పాత్ర కఠినము – అందచందము విందుచేయును
మంచి మించును నటన చెట్టయు – నవరసమ్ముల సార్వభౌముడు.

684

**కల్లూరి కోటేశ్వరరావు**

హోళ్ళ రెండిట లక్షలు హద్దుమీరు – కరము వేలక్ష లెక్కల ఖతము గాను
మనము నవనీతమునుంచుంచు – దానపరత మహిమ గొప్ప.

కందుకూరున జనులకోసము – పొందు కుదరగ బంధువాయెను
ప్రధమ పౌరుడు ఫలము అధికము – సేవకొఅకెగ సార్థకుండగు.

సీ. అభిమానమన్నది పదవికి అందనిది – పదవులు పొందగ పదిలపడియె
ధనమున్న మనసుండు ననుమాట ధరణిని – పలువుర ప్రాభవ పరువు వెలియు
పదవులు పొందిరి అన్నను ముందుంచి – పాటవ రహితులు పూజ్యులుగను
లక్షలు పొందిరి లక్ష్యము లోగొనె – మరచిరి మనయన్న మనసులేక.

పదవి పలువిధమర్థము పాలనమున – మనసు లేకుంట మతిలేని మనిషి విధము
అందరథములు మదమత్త మర్థమునను–కందుకూరున మించెను కోటయార్య ఆర్యుడితడు.

దానధర్మము కర్మసారము – చేతికెముకయు లేని కర్ణుడు
అవసరమ్ములు తీర్చు తీరది – అచ్చెరువుగను ముచ్చటగునుగ.

పనులు పరువాన చేయగ ప్రథితుడతడు – అంతమేమియు కనరాదు అతని పనుల
చుట్టు చేరుదు రందరు చుట్టములుగ – ధనము సాధించ వచ్చిన దారి చూపు.

ఉండవలెగాని కోట్లైన ఉర్వియందు – దానధర్మాల వాక్కుల దారులందు
ఖర్చుచేయగ కోటయ్య కరము మిగులు – సాటి లేరెవరిచ్చుట సాగిరాగ.

అన్న అనగానె అసలైన అభిమతమున – అధిక అభిమాన ధనమున కోటయార్య
డిచ్చె సొమ్మును సుమనమ్ము నింపు మీర – అన్న! అబ్బురమయ్యెను నాదు మదికి.

ఎందరిలలేరు ధనమున్న దొరలు మహిమ – అందరికినేడు అభిమాన ఆశయముల
ఇంద మనునట్టి హృదయము నిండుగాను – చందమునుచూడ బాధగు చాలమదిని.

685

## కనిగిరి జనార్దనరావు కావ్యావిష్కరణ

లోకలోకన లాలిత్య లోలుపతను – కవన పటిమను ధారణ కరము మీర
కావ్య మభినవ మాలోక గుర్తుజేసి – రచన చేయగ రాణించు రమణకవిత.

కవన వాణిని రాయలు కాలమునను – భువన భవనము నిర్మించి విజయమొందె
సవన మహిమను పోషణ చెన్నుమీరె – నవక భువనము అభినవ నవల కవిత.

కష్టనష్టము లెదురొడ్డి కావ్యములను – అచ్చువేయగ నచ్చక మెచ్చరెవరు
నచ్చు నవ్యత కావ్యాల నవకముగను – పెచ్చురిల్లగ పెంపగు పరమ మగును.

దృష్టిగోచరమగునది దుష్టమైన – నష్టమైనను నిలదీయ నాణ్యమగును
సృష్టి మనసున ముద్రించు చిత్రములను – పదము సరళత పదనుగ పఠిత హృదిని.

కనక గిరియందు కనకమ్ము కానుపించె – ద్రష్టమయ్యెను దృగ్గిరి సృష్టిజేసి
చూడ కనకమ్ముకామించు చూపరులను – దృష్టి మనసున్న కావ్యమ్ము సృష్టిమిగులు.

సారసహితము సాహితీ సహజధార – కవిత కాణాచి కళలకు కాంతిరాశి
ధరణి దృగ్గిరి దుహితయౌ దుర్గరాజి – కావ్య కమనీయ గణ్యమౌ గళము మీది.

కవిత కలకండ తులకించు కావ్యదండ – సరస రసవాణి వాణిగా సొబగుమీరు
ఆర్ద్రమనసుల మాలిన్య మార్థికముగ – తలగ జేయును తపనను తరళసహిత.

కరవు కుధరమ్ము కవితకు కమ్మదనము – మనసు మరుగుచు మాలిన్య మధనములను
జనుడు జగతిని జాల్ముడై జవము వీడె – కవిత సవితగ సాంద్రమౌ సారసాఖ్య.

నవ్యకావ్యాలు నవకమ్ము నాటితీరు – పూర్వరచనలు పర్వమై పూర్తిగావు
అనుభవమ్మును గణనకు రా–లేదు – యువత రమ్మంత ఉరిబడు ఓర్మిలేక.

వ్రాయనందించు వారలు వరపు మిగులు–పోషణముజేయ ముందుకు పోరు జనులు
త్వరను లోకము మరచెను తనను తాను–మనసు మనజుని మనురీతి మరల కవిత.

553/686

ఆ.వె. కర్మభూమిలోని కర్షక రత్నమా – మర్మమేమి లేని కర్మనీది
ధర్మరహితమైన ధారుణి వర్తనన్ – శర్మమెంచు నీకు శాపమాయె.

ఆ.వె. వేదభూమిలోని వేద్యుడవీవుగా – సేదదేర్చు నీవు సేద్యమునను
వేదనలను బడగ వేకువలెన్నియో – రోదనలను పంచు రోజు రోజు.

ఆ.వె. పల్లెపట్టులందు పల్లము మెరకల – చదునుచేసి అదను పదునుచేసి
సరస సస్యములను వరుసగ పండించ – ఫలము పల్లముగను పంచబడును.

ఆ.వె. ఐక్యభావనమ్ము అసలేమొ కనరాదు – సఖ్యమన్న రైతు సాగిరాడు
సేద్యగానికంత సేవనమేతప్ప – సుఖము లేని బతుకు శుభముకాదు.

ఆ.వె. గ్రామరాజ్యమనిన గౌరవరహితము – రైతురాజ్యమనగ రౌరవమ్ము
భూమిదున్నువాడు భూతముమాదిరి – భారతమ్ము భవిత భవ్యుడెరుగు.

ఆ.వె. దేశ వెన్నెముకగ దేహము రైతుదై – దేవళమ్ము ప్రభుత దేవులంత
ఫలము పొందువారు ప్రతినిధులైరిట – వెన్నెముకను విరువ వెతలెమిగిలె.

ఆ.వె. రైతురాజ్యమన్న రామరాజ్యమ్మని – పెద్దలంత పిలువ ప్రేమగలిగె
సుద్దులన్ని వినగ ముద్దాయె జనతకు – రామరాజ్యమేమొ రావణమ్ము.

ఆ.వె. భూమిపైన ప్రేమ భువనాన రైతుకు – రైతుమీద ప్రేమ రహికిలేదు
బాధకలుగజేయు భవమున ప్రకృతి – కృషికి ఫలములేని కూపమాయె.

ఆ.వె. చెమట నీటతడిపి కమతాలపండించి – సర్వశక్తులన్ని సమయజేసి
పర్వజీవనుడుగ పాపాల బడిపోవ – పావనంపు కాంక్ష పాలిపోయె.

ఆ.వె. ప్రాణమైన భూమి త్రాణము తనకగు – వర్ష వరముతోడ హర్షమగును
వృష్టి అధికమైన వృథయగు సేవలు – వృష్టిలేని రోజు నష్టి తనకు.

ఆ.వె. ఏరువాక సాగి ఏతాములాగుచు – జాతివారికంత జయముగూర్చు
కలలు నిజముగాను కాంక్షయె తనదిగా – కల్లలైన కరువు కాలమగును.

ఆ.వె. తనకు కలుగు కలిమి తాకట్టు పెట్టును – పాలబిడ్డ రీతి పంట పెంచు
బలము పురుగు మందు బాగుగ చల్లును – ఫలము దేవుడెరుగు కలియుగమున.

ఆ.వె. నేల ఎట్టిదైన నేవళముగ జేసి – మన్ను మహిమ పెంచి మాన్యముగను
కంటిరెప్పవోలె కాపాడి పైరును – పంట పండిరాగ తంటమిగులు.

ఆ.వె. భరతదేశమునకు భాగ్యమె రైతన్న – వనరులెన్నొ కలిగి వాసిమిగిలె
నదుల నీటినంత వదలక యోగింప – కరవు లేదు భవిత కలతలేదు.

ఆ.వె. వ్యావసాయ రంగ వెతలెన్నొ చెప్పగా – సంఘటితముకాని రంగమద్ది
దోచుకొనెడి వారి దోసిలినిండును – దోయిలించు రైతు చేయి విరిగె.

ఆ.వె. నగరవాసమిచట నవ్యము దివ్యమై – గ్రామసీమలన్ని కాఁడులాయె
కర్షకులను గాంచ హర్షము లేదుగా – పట్టణముల దారి పట్టుటాయె.

ఆ.వె. సాంప్రదాయకమ్ము సాగకయుండెను – యాంత్రికమ్ము కృషిగ తాంత్రికమ్ము
ధరలు మింటి కెగసి ధారుణి కృషికుడు – భువిని కూలబడియె భుక్తిలేక.

ఆ.వె. వానలేమొ లేక వరదలు మీరగా – చీడ పీడలేమొ చెలగిపోవ
చింత వంత మిగిలె చింతనపరునికి – శాంతి కాంతిలేక శాపమాయె.

ఆ.వె. జై జవాను మరియు జైకిసానననగాను – జయము జవము లేదు జాతిలోన
భారతీయ రైతు భాగ్యము పండగా – నేతలందరిచట నేర్పుగనుడు.

ఆ.వె. ఆత్మహత్యలెన్నొ ఆర్తికి చిహ్నము – మూర్తి రైతుదేమొ ముద్దు విడిచె
కష్టమైన బతుకు కాటికి వెళ్ళగా – ఇష్ట జనుల బతుకు ఇరుల నిండె.

ఆ.వె. జాతి వెన్నెముకను జవమున నిండించి – కృషికి ఫలమునిచ్చి కూర్మి పెంచి
రైతు జనుల నంత రైవతకములుగా – చూడ దేశభవిత సుందరమ్ము.

ఆ.వె. కల్తిమందులన్ని కలతల గలిగించ – కలిమివీడె రైతు కులములోన
కలకలమ్ము వీడ కర్షక జనులకు – ప్రభుత పద్ధతులును ప్రవరమగుత.

ఆ.వె. నీరుశక్తి నిచ్చి నిధులను పొందగా – రైతుపంటనిచ్చిరమ్యుడగును
ప్రళయ కాలములను ప్రభుతలు స్పందించి – అండనుండగాను అమరమగుత.

ఆ.వె. అప్పులందజేసి అధికారములవారు – ముప్పులేని వడ్డి కప్పులిడగ
చెప్పలేని గొప్ప చైతన్యపరుడయి – జాతిమెప్పుకోరు జాణరైతు.

ఆ.వె. రైతుపంటలన్ని రాజ్యాన అమ్మగా – ఫలము బలము కలుగు పావనముగ
విలువ మీరునపుడు వినియోగదార్లకు – విజయమగును రైతు విజయమద్ది.

ఆ.వె. భారతీయ ఆత్మ భాగ్యము రైతన్న – వెతల కతల జీవి వెలుగు వీడె
మానవాళి కతడు మాన్యుడై ధన్యుడై – భుక్తినిచ్చు తాను శక్తివీడె.

ఆ.వె. గాలివానరాగ గాభరాబడుతాను – సోలిపోయి పంట శోభవీడు
మండుటెండనెండి మహిమను గోల్పోగ – పండుటాకు రీతి పాలిపోవు.

ఆ.వె. అన్నమందజేసి అధికుడు తానగు – విన్నదనమునందె విలువలేక
తెలుగు రైతు తెగువ తేలిపోయెను నేడు – నల్లవర్తకమ్ము నలిపివేసె.

ఆ.వె. అన్నదాత మరవ అందరు పందలు – అహములేనివాడు ఆతడెపుడు
కష్టమతనిదాయె ఫలమేమొ పరులది – పాలకులది నేడు పరులదృష్టి.

ఆ.వె. కాలమహిమ యేమొ కారుణ్యరహితము – కలియుగమున రైతు కలతలెన్నొ
ఋతువు గతులు తప్పి మతులను పోగొట్ట – నేటిరైతు కిపుడు నెవ్వగాయె.

ఆ.వె. రత్నగర్భలోని రత్నముల్ తీయగా – రత్నమాయె రైతు యత్నమునను
మట్టి మథనమునను మాణిక్యముల్ దీసి – మాన్యుడాయె రైతు మహినినేడు.

ఆ.వె. ఘర్మజలము చింద కర్మల నొనరించి – ధర్మబద్ధమైన ధరణి బతుకు
ఇంటితంటలెన్నొ ఇదియది యనరాదు – మంటి మహిమదెలియు మమతయుతుడు.

ఆ.వె. చదువు సంధ్యలేక సరసుడు తానగు – సదయ మీరుజీవి సంతుతోడ
రాజకీయములను రచ్చలు హెచ్చగా – గ్రామరైతులందు కక్షలాయె.

ఆ.వె. నీళ్ళు భువిని ఇంకి నీతిని దప్పించ – జాతిభీతిచెంది జయము వీడె
కాల్వపూడికలను కాస్తంత తీయరు – నిర్వహణముచూడ నిమ్నమాయె.

ఆ.వె. హలము కలముగాను అంతరంగాలను – మథనచేయు కవికి మధువె రైతు
క్షేత్రమందు కృషికి క్షేమముగల్గగా – వాంఛజేయు రైతు వాసి పొందు.

**అన్నదాత – ఆత్మవ్యథ**

భరత సీమ భాగ్యసీమ – కర్షకులతొ కాంతిసీమ
వ్యవసాయమె సాయంగా – వెతలు బాసినట్టిసీమ
కిసానులను కీర్తించెడి మాన్యమూర్తులకుసీమ
సానుకూల కర్షకులను సర్వస్వము అన్నసీమ.

భరతనేల నేవళమై – జాతిని పోషించినది
రైతు అన్నదాతగా – రాజ్యమందు నిలచెనది.

మన్యములే మాన్యములుగ – మహిని మహిమ పండించగ
మనరైతే వెన్నెముకగ – మనమంతా నిలబడితిమి.

నీరువట్టిపోయినా – నిధుల వ్యధలు మీరినా
నేలనమ్ముకొన్నవాడు – నేతల కనుసన్నవాడు
వ్యాపారుల దోపిడికీ – పారముతానైనవాడు
ప్రకృతి వికృతిజెందగ – ప్రాభవమును వీడినోడు.

వ్యాపారపు పంటలలో – వ్యాధులు మీరగా
కల్తీ వ్యాపారములో – శాల్తీగా మిగులగా
పుస్తెలమ్మి సుస్తిచేసి – పూజ్యమైన పంటచూచి
ఆత్మహత్య ఆయుధమై – రైతువధకు సిద్ధమాయె.

ప్రత్తి మిర్చి పొగాకులే – మిత్తిని కొనితేగా
ప్రళయంలో లయించిన – పంట తంట చూడగా
నుయ్యి గొయ్యి ముందువెనుక – న్యూనతగా భావించగ
కృషికి ఫలము కుంపటిగా – తంపటాయె తనబతుకు.



భూమాతను నమ్ముకొనీ – భూతములను పోషించే
భువన సవన సారథిగా – భువిరైతుకు వందనములు.

హలమున పొలమును దున్నీ – అదను పదను తెలిసికొనీ
అహరహమును కాపాడీ – అవనికి జీవం పోసిన వాడా – అభివందనం.

భరతావని భాగ్యంలో – భరతజాతి భోగంలో
బోలెడు భాగం నీదే – కానీ... కాలేకడుపే నీది – నీ కర్మకు నందనం.

పత్తివేసి పట్టువీడి – మిరపవేసి అప్పుమిగిలి
పొగాకులో పొగచూరీ – పోడిమి వీడిన వాడా –
భరతజాతి వెన్నెముకా... కర్షకుడా... హర్షాభివందనం...

ఉల్లివేసి కుళ్ళిపోయి – ఉప్పు ఉప్పెనలొగలిసీ
చెరుకుతీపి ఎరగనిదై – కరకు జీవితమునీదే – వరపుత్రుడ! వందనం...

కల్తీ శాల్తీలతో – పల్టీగొట్టెను పంటలు
తప్పెవరిదొ తెలియదుగా – అప్పుమిగిలిముప్పొచ్చెను – ముద్దుల మారైతూ...

ధరపలకని ఫలంనీది – దళారీల పరమైనది
పాలకులకు పట్టదిదీ – కాలవైపరీత్యమిదీ –
కిసానులకు సానుభూతి – హాలికునికి హితంకోరు
అన్నదాత ఆత్మవ్యధను – అంతరింపజేయరా!

అన్నదాత ఆత్మవ్యధ – అవనిజనులు వినరండీ
విన్నమీరు విలువగలిగి – రైతన్నను చూడండీ
మట్టిని నమ్మినవాడు – పట్టమేమి కోరనోడు
మనసు మానవతలవాడు – కృషి చేసెడి ఋషియెతాను.

కృషితొ నాస్తి దుర్భిక్షము – రైతే భువిరాజంటూ
పెద్దలంత చెప్పినారు – సుద్దులలో ముంచినారు.

పశుసంపద మానవమై – పచ్చదనం పరిమళమై
భువిజనులకు భుక్తిపంచు – పూజ్యుడతడె అన్నదాత.

మోసదోష దూషితుడు – మోదరహిత మానవుడు
స్వేదమున్న సేవకుడు – స్వార్థరహిత సోదరుడు
తనధర్మము తనదిగాను – బాధ్యత బాధల మరువడు
జనతకు తిండినిపెట్టీ – ధనరహితుడు పస్తులుండు.

అప్పులు కల్తీలతో – అతివృష్టి అనావృష్టి
అన్నదాతనణచివేయ – ఆదరించరా నరుడా!
దేశభక్తి దేహముగా – తనశక్తే తరించగా
జాతిభుక్తి అవసరముల – జయమున తీర్చినవాడా!

స్వర్ణమయపు శోభలతో – స్వర్గసీమ భరతసీమ
గ్రామసీమ రైతు సీమ – గరువమంత కృషికునదే
ప్రజాస్వామ్య ప్రతినిధులు – రైతుజనులకే నిధులై
సంక్షేమంచూడగాను – సరళిమారి సరసమగును.

మధ్యదళారీల బెడద – వధ్యమైన వాసిగలుగు
పంటకు సరియైన ధరలు – ప్రకటించగ ఫలం గల్గు
విత్తనాలు ఎరువులందు – చిత్తము మరచిన కల్తీ
చింతవంతపాలు రైతు – చిరిగిపోవునతని బతుకు.

ఆత్మీయులు రైతులంత – ఆత్మహత్య పాలుకాగ
పాలక ప్రభువుల చేతలు – ఫలంలేని ప్రకటనలే.

అమాయకపు రైతన్నల – అణచివేయు పద్ధతులు
అంతరించ మేలగును – అందరు సంఘటితమౌను.

విఫణివీధులందున – విలువ రైతుకుండవలె
సుఫల సుందరమ్ముగా – రైతు బతుకు వెలుగవలె.

ఎఱుకలేని రైతన్నల – ఎదలందున పదిలపరచి
కరవు తీర్చు కర్షకులకు – కామనలే తీర్చవలెను.

వృత్తియె తనవృత్తముగా – వర్తించెడి వసుధ రైతు
మృత్యువునకు చేరువగా – చేరుట దయనీయమాయె.

కండకరిగి కన్నీరయి – బండ బతుకు మున్నీరయి
అండలేని అవని జనుడు – అంతరించు ఆత్మవ్యధను.

సానుభూతి జైకిసాను – రైతురాజు రాజ్యమునా
అన్నదాత సుఖీభవ! – ఆత్మవ్యధకు అంతమిదే!

గాంధీజీ చెప్పినాడు గ్రామరాజ్యం మనదని
నెహ్రూజీ నుడివినాడు ఆనకట్ట ఆయకట్టు అవనిలో ముఖ్యమనీ
కృషికునిదే విజయమనీ ఋషితుల్యులు ఋజువులతో రూపించిరి.

ఖండ ఖండాంతరాల కర్షకునికి వందనం
జాతి ఆకలిని తీర్చెడి జాణకు అభివందనం
సిరుల విరులు పూయించిన హాలికునకు నందనం
దేశకలిమి బలిమియైన దేవునకిదె నందనం.

బాధ్యత బాధలునిండిన యోగ్యుడు మనరైతు
త్యాగములో తరియించిన యోగియెమన హాలికుడు
జాతిదేశసంపదలకు జయశీలియె కృషికుడు
అందరికీ బంధువతడు బంధనముల నిండినాడు.

మానవాళి మనుగడలో మాలిన్యము లేనివాడు
మట్టిని మాన్యముజేసిన మధుర జీవనుడు తాను
విధిచేతిన కీలుబొమ్మ వ్యధలకు నిలయుడు
ప్రకృతి వికృతి చెందగ పాతాళమునందు బడును.

అప్పుల తిప్పలుకుప్పలు మేలుకొనడుమేదినిలో
తప్పుతనది కానిదైన మెప్పులలో ముప్పుతనకు
నారుపెరిగి మొక్కపూచి పంటఫలం కంటజూచి
పొలంనుండి ఇంటిదాక రాని ఫలం రైతుదగును.

పంచభూత వర్తనలో – భూతము పరమార్థముగా
పంచేంద్రియ ప్రాభవాన – ప్రవరమైన తనువు నీది
వంచన వర్తనగా వాసిబొందు వ్యవస్థలో
అవస్థలే అన్నదాత ఆత్మవ్యధా బీజములు.



అన్నదాత ఆత్మవ్యధ – అనుభవమౌనేటి కథ
కృషికునకే కూడులేని – కుటిల లోక నడత కథ.

కరువు అరువు బరువులతో – కలియుగమున కలతకథ
పరువు ఫలము నిష్ఫలమై – ప్రగతిలేని విభునికథ

చెరువుకట్ట తెగిపోగా – చేనిపంట జారిపోగ
మండే ఎండలు మడులను – మసిచేయగ మహిమవీడె.

నేతల వాగ్దానములలొ – తలరాతలు మారుననీ
తలపోసెడి రైతన్నకు – తపన పడుట మనుగడాయె
రైతుల కవసరమైన – విద్యుత్తుకు ధరలేదని
వింత వింత ప్రకటనలను – మోసపుచ్చు మోతుబరులు.

రైతుపంట ధరహెచ్చగ – రైతుబజార్లంటు పెట్టి
దళారులకు స్థానమివ్వ – అసలు రైతు అధముడాయె.

మార్కెట్ యార్డులలోనా – రైతుల మార్కెట్ జరుగును
వ్యాపారుల లాభములు – రుసుములేమొ రైతులకు.

అంతర్జాతీయమంటు – వింత ఒప్పందములు
సాంద్రమైన వ్యవసాయం – సముద్రంలొ బడిపోయె.

కోస్తాప్రాంతములోనా – కొల్లలాయె చెఱువులు
చేపల పెంపకములోన – చేదు అనుభవాలు కలిగె.

పంటల భీమాపథకం – వంట ఇంటి కుందేలయి
రైతుల ధైర్యమునంతా – అధైర్యముగ మార్చివేసె.

ఎగుమతిలూ దిగుమతులలొ – ఎగుడుదిగుడు విధానాలు
మతివిడిచిన మంతనములు – గతిదప్పెను రైతుల కృషి.
సహకారపు వ్యవసాయము – సాకారము అపకారము
ప్రభుత లిచ్చు ఉపకారము – ప్రతినిధులకు అవకాశము.

సబ్సిడీల సబ్బురాసి – దిగజార్చెడి విధానాలు
జాతిరైతు జారిపోగ – రాతిరాయె కృషికత్వము
ప్రాజెక్టుల ప్రాభవంతొ – ప్రకాశమై పంటభూమి
శాస్త్రీయపు వ్యవసాయపు – మేస్త్రీలగు రైతన్నలు.

వసుంధరయె సుందరమయి - వాసినందు పచ్చదనం
అన్నదాత విన్నాణము - అతిశయమగు అవనిలో
ధర్మసాధనకు వలసిన - శరీరమును పోషించెడి
సేద్యగాని చేతనలో - చైతన్యము తరిగిపోయె.

గ్రామాలను వదలిపెట్టి - నగరాలే గమ్యమాయె
భూమిదున్ను వారిసంఖ్య - భవితలోన తరిగిపోవు
జన్మభూమి గ్రామమందు - కక్షలు కార్పణ్యాలతొ
రక్షలేని జీవులుగా - రైతులు జీవించు చుండె.

అవగాహన ఆలోచన - అందరికీ కల్గించగ
అన్నదాత ఆశయమే - అవనికి ఆదర్శమగును.

కులం ఒకటి మతం ఒకటె కూలన్నది రైతన్నది
స్వర్ణ భారతావనిలో శోభనిచ్చు జాతికదీ-

కార్మిక కర్షక ఐక్యత కలియుగాన వర్ధిల్లీ
అన్నదాత మనసులో ఆనందము ప్రవర్ధిల్లీ
అందరి క్షేమంకోరే ఆ రైతులు సంతసిల్లి
అవని భవిత అమరముగా అవతరించు నిజమిది-

పంచభూతాల కిచట కులమతాలు లేనెలేవు
పండిన పంటల కిచ్చట వర్గభేదములు లేవు
పంటకు ధర అందుటలో కులమతాలు కలిగినవీ
రైతన్నలు ఉద్యమించ రాతమారి పోవునుగా-

ప్రాంతములే సొంతముగా ఫలరహితం ప్రకృతిలో
బీళ్ళు, మోళ్ళు, రాళ్ళు, నీళ్ళు భీకర మాయెను జగతి
ఆశల హరియించివేయు ఆనకట్ట జలాశయం
అమాయకపు రైతన్నకు అశనిపాత కల్తీలు-

ప్రణాళికల నాళికలలొ కొలతలు కలతలు రేపెను
ప్రమాణాల మానములో మౌనము మనసును చెరచెను
ప్రగతిశీల వాగ్దానము అన్నదాత మతిని చెరచె
అంతర్జాతీయములో జాతిరైతు పాతరాయె.

సంకల్పము కల్పకము కలియుగాన వికల్పము
దళారీల కర్పణము దయనీయత దర్పణము
శ్రమకు విడుచు తర్పణము ఫలరహితము పావనము
అన్నదాత ఆత్మవ్యధ – కృషికునికదె ఆత్మహత్య.

554

కులం ధనం మతం మత్తు – కూటమిగను ఎన్నికలను
కూలిపోయె జనస్వామ్యము – కుదురు విధము దేవుడెరుగు.

వ్యాపారులు తారలంత – దేశసేవ దేవతలుగ
పార్టీలలొ పరములుగా – ప్రగతి పథము క్రిందుమీదు.

అన్నబొమ్మ అతికించుక – అధికారపు తమ్ములూ
బీజేపీ పార్వతులూ – మోహనుండు మోజుతోడ.

పార్టివిడిచి పదవి విడువ – పాలనమున పద్ధతగును
పదవి పదిలమను విధమున – ఫిరాయింపు చట్టముండె.

అమరుడైన ఎన్టియారు – ఆంధ్రజనుల మదిని దూరి
అభ్యర్థుల బొమ్మగాను – పార్టిలన్ని వాడుకొనును.

మందుబాబులంతగూడి – మత్తులోన జోగుచుండ
డబ్బుసంచులెన్నొవచ్చి – దహనమాయె జనస్వామ్యము.

దగ్గుబాటి దరిజేరగ – బాపట్లను బీజేపీ
పార్వతి పరువమ్ముతోడ – పదనుమీరు ఎన్నికలను.

అన్నసుతులు అంతమంది – అంతులేని వింతరీతి
హరికృష్ణయు హతమాయెన – రాజకీయ బాబు మహిమ.

తెలుగుదేశ నవాబుగా రజాకార్ల నియమించును
అధికారపు అదను నెరిగి ఆంధ్రావని నాక్రమించు.

మోసగాడి మోము జూచి – ఓటేయగ వరపుకాదు
జనులసేవ జయమునెంచి – మంచితనము నెన్నుకొనుడు.

సంపాదన పదవినెక్క – యత్నింతురు పెట్టుబడితో
వ్యాపారము జనులతోడ – వ్యవహర్తలు ప్రతినిధులే.

రాజీవుని హత్యలోన – పాలుగొన్న హంతకులకు
పదహారేళ్ళకు శిక్షపడె – న్యాయమనగ నిదియెగదా.

విజయవాడ విద్యమ్మా – వీడితివా కాంగిరేసు
మహిళమాట గుర్తువచ్చె – పదవిమాట మరచితివా.

ఎన్నికలను నియమాలను – నెట్టివేయు నేతలందు
సంఘమేమి చేయలేదు – సరుకులేని అధికారులు
శేషనుడికి శేషమాయె – శివములేని శివసేనను
సమర్థులకు సందుండదు – అసమర్థుల పార్టిలన్ని.

రిగ్గింగులు బాంబులతో – రీతిజెరచు నాయకులను
నీతిమతులు ఎన్నికలను – నీరుగార్చ జాతి వెలుగు.

కలహాలతొ కాంగిరేసు – తగవులతో తమ్ముళ్ళూ
బీజేపీ బలము పెరిగె – కొత్తదనము కోరుజనము.

జనస్వామ్యము బూటకమై – ఎన్నికలే వన్నెతరిగి
ప్రతినిధులను గెలిపించగ – సభల తీరు రభసయౌగ.

ఉరకలేయు ఉపేంద్రకూ – బ్రేకువేసె భామ విద్య
దాసరి సరి తూగగాను – పదవి రమ్యమగును గాదె.

ఖమ్మంలో కలతలాయె – సుధాకరుని చులకనతో
భాస్కరునికి బాధాయెను – పదవి పిలుచు తమ్ముళ్ళను.

నవరసాల నొలకబోయు – కైకాలకు కష్టమేమొ
శోభనాద్రి వడ్డనలో – పదవి భామ శోభనమ్మ.

వల్లకాని నెల్లూరున ఎదురీదును ఎర్రపార్టి
పెద్దరెడ్డి చిన్నరెడ్డి పెంపుమీర ఎదురు తిరుగు.

వెంకయ్యకు వెతలువచ్చి – ఊదరతో ఊరుకొనెను
పోటిచేయ ఓటమగును – పాలుపోని ఆలోచన.

బాబుతీరు బాగుందని – దేశంలో జయసుధమ్మ
సినిమతీరు చిన్నబోయి రంగు రాజకీయమాయె.



ఏచూరి వారిల్లు ఎఱుకకు విరిజల్లు – భావించ భావన భాగ్యమబ్బు
కిరణాల కొమరుండు శ్యామల కీర్తికి – కావ్యమై కీర్తనై గరువమబ్బు
బెజవాడ భవనమ్ము తళుకుల బెళుకుల – తరముల వరకును తావియబ్బు
విఘ్నేశు డిచ్చుత విభవమ్ము విరివిగా – వినుతమౌ ఫలముల వితతియబ్బు.

పదవి పథమున పెంపొందు ఫలమునిండ–పెదవి అనురాగ రాగాన పెంపు నిండు
విరివి సంసారబంధమ్ము వెలుగు నింపు–సరవి గృహసీమ సారమ్ము సమత నింపు.

కొత్త యిల్లిచ్చు కోర్కెలు కొలతమీర – విత్తయజమాని యింపొంద వినుతుడగును
చిత్తమానంద యుతముగ చెలువు మీరు – మెత్తదనమున్న మనసులు మెరుపుగనుత.

కనకదుర్గమ్మ కలిగించు కనక చయము – కృష్ణవేణమ్మ ప్రవహించు కరుణరసము
షిరిడి వాడిచ్చు శివముల చింతదీర – దేవ దేవులు మీకండ దేశమందు.



వగలరాణి జయలలిత – నగుబాటున శశిరేఖా
కోట్ల ఖర్చుపెళ్ళి జరిపి – కోలుపోయె ముఖ్యపదవి.

రజిని కరుణ రాదాయెను – ప్రచారమే చేయకుండ
పరదేశము పారిపోయె – కరుణ పదవి కఠినమాయె.

తెలుగు భవన గేట్లు తెరచి – తరలిరండి రండంచును
తపన పడెను ముఖ్యమంత్రి – మందిమీరు మతులుపోవు.

జనుల గణం జవము వీడ – గణతంత్రము గల్లంతవు
మనతంత్రము మదుల వెలుగ – జవసత్త్వపు బతుకు వెల్గు.

అధికారం అందాన్ని పంచుకొని – చెట్టపట్టాలేసుకొని తిరిగారు
చెలిమిలేదు చేదంటును – చెరియొక దిక్కున కెళ్ళిరి.

పంపకాల విషయంలో – ఆరితేరె చంద్రబాబు
మిత్రుల మితిమీరకుండ – జాగ్రత్తలు తీసికొనెగ.

తిరగబడే తమ్ముళ్ళను - బుజ్జగించే నేర్పుగాడు
పదవికాని పదవులతో - పంపుగొట్టు ప్రతిభవాడు.

మెట్టుదిగి గట్టుచేరి మెరుపుమాట మాలిమితో
పట్టుపట్టి పదనుమీరి పరిపాలన చెసెటోడు.

సొంత ఇమేజిని పెంచుకొనే సోకులాడు మేధావీ
చెంతనున్నవారి చింత వంతవినని వయసుగాడు.

అన్న ఆశయమని అదరగొట్టి అన్నగారి వెన్నుపోటు అతిగా సమర్ధించి
వెన్నుచూపి వెళ్ళిపోయెనాడు బహిష్కరణ బరువుగా వదరుచుండె.

కొత్తపార్టి పెడతానని కోరిచెప్పెనాదాసరి
మరోపార్టి నాదేనని మరీ చెప్పె మోహనుడు.

గుల్లబారె పార్టిలన్ని మనసుమారె మరలనేడు
సినీస్టయిలు పార్టీలు తెరమీదే కరిగిపోవు.

ఆంధ్రనాడు అనిపేరున - పార్టిపెట్టిన పెద్ధపోలిసు
పాలుపోక పలచబడెను - పదవులన్న మధురమిచట.

విమలశాంతి విజయశాంతి - కమలంతో కలుషమాయె
బీజేపీ అధికారపు సినిమాలో - పాత్ర వేయ ఫలమువిడిచె.

వెంకయ్యకు సంకటములు - మితిమీరెను ఆంధ్రంలో
గెలిచే సీటే కరవాయెను - ముప్పు ముప్పవరపు మాటయె.

పార్వతి జపంచేసి ఇంద్రుడు - పరపతివీడిందనుకొని
పార్టిపెట్టె తెలంగాణం - ఇంద్ర పదవి ఓటరిస్తే ఇరులే.

ఆంధ్రాపారిస్ శారద - మరలా బరిలో దిగెనా
తెరమోజుల తీరులన్ని - మొదటిసారె తెలియదనా.
ఉమ్మారెడ్డికి సంకటం - ముప్పలనేనేగా ముప్పు
బాపట్ల పట్టణ మంత్రిని - బతికించగ బాధాయెను.

రాజమోహన్ శ్రీనివాసన్ - ఒంగోలుకు వలసవస్తే
ఖంగారుపెట్టెగా బెల్లం - ఓటర్ల ఇష్టానికి కళ్ళెం.

ఓడినట్టి సానుభూతి – ఒలకబోయు పాతకాపు
అన్నవదిన సాహాయం – అండగాను కొత్తకాపు.

రోశయ్యకు పేటలోన – రోదనలో కాంగిరేసు
సైదయ్యకు సై అనగా – దేశంలో దేవులాట.

తెనాలిలో శివశంకర్ – శివమెంచుచు నిలచెనుగా
సింగం సిరి చింతవీడి – వంత పలుక వరమగునుగ.

అధికారం విధివ్రాతను – తిరిగి వ్రాయ తరుగు బలము
ప్రతిపక్షం పదనుమీరి – పదవి ఫలము పొందగలదు.

కూలి ఇచ్చి సరిపెడితే కోట్ల సంగతేమిటి – రెండకరాలకు రేటు అన్న వెన్నుపోటు
శ్రమఫలం దక్కిన తెలుగు తమ్ముళ్ళు – క్రమశిక్షణ కరవైన తుమ్మముళ్ళు.

ఉడికిన కిచిడీలో పదార్థాలు వెలవెల – రుచిచూచే ఓటరుల మనసులు విలవిల
వీడియోలో వింత శ్రమదానం సుంత – జన్మభూమి సంత ఓటరుకిట వంత.

ఒంగోలుకు పార్వతమ్మ వంతపాడె తనమరదికి
రామిరెడ్డి ఆశయాలు మంచినీట మునిగిపోవు
అప్పుతెచ్చి పనిచేశాం అప్పనంగ మింగేశాం
మెప్పుతోడి పన్నువేశాం ఖజానాను గుల్లచేశాం.

సామాన్యపు సేద్యగాడు – కాంట్రాక్టుతో చోద్యగాడు
పార్టీలను మార్చెటోడు – పదవికొరకు ప్రజలవాడు.

మధ్యంతర భారతాన – మధ్యందిన మార్తాండుడు
ఓటరగుట తెలియుమీవు – వరపు పదవి సులభతరము.

ఉద్యోగపు సంపాదన – చాలలేదు లక్షలన్ని
రాజకీయ సద్యోగము – కోట్లనిచ్చు కలకురూపు.
కళల పదవి కలరూపము – కామితమ్ము దీర్చు జనుల
కామితమ్ము కలకాగను – కరుణమయము జనుల తలపు.

బీజేపి బెట్టుచేయ పార్వతమ్మ ఏకాకి – పట్టుసడలి మూలనున్న దగ్గుబాటి పట్టువీడె
ఓటమి గెలుపుల మాటలు చెప్పకొన్న సున్న

కూటములే కంపుగొట్టు కథ చూడర నాన్నా
వ్రతం జెడ్డ ఫలంలేని వరసెందుకు కన్నా
పదవి ఫలం ఉందంటే పదనిసలే నన్నా
ముక్కచెక్కలన్ని చేరి అసలు ముక్కమాయం
అధికారం అందివస్తే దుఃఖపడుట ఖాయం
మడిగట్టుకు మూలనున్న మనువాదుల మానసం
గరిడిదేరి గద్దెనెక్క గగనమౌను మనమతం
విలువలు వలువలు విడిచిన వివస్త్రలే రాజకీయులు
ఓటువిలువ వస్త్రమిచ్చి కట్టువారె ఓటరులు
మమత మీరిన కేసరికి కూతురు మమత
తృణమూలము అనేసరికి తొలగిపోయె సమత
బుజ్జగించు ఒజ్జలంత బులపాటం తీర్చుకొనిరి
సోనియమ్మ సోయగమ్ము పనిచేయక మానుకొనిరి
పార్టీలను విడిచిపెట్టి పదవిపట్టులీదరుగా
పరమార్థం తెలియగాను పట్టుసడలిపోవునుగా
'అతలుడు' అతనుడుగా అందగత్తె కోరుతుంది
పదవి పడతి పడిగాపులు ఎన్నికలో తెలుస్తుంది.



తెలుగు యువత హరికృష్ణుడు బతికినాడ పోయినాడ
ఆశయమ్ము తీర్చుకొన్న చంద్రబాబు హత్యజేసి
రెండెకరాల నారా బిల్ గేట్స్‌తో భేటీ
చేసిపెట్టె నారాముడు – భువనేశ్వరి బంధంతో
జయప్రదే జయమనుకొని – వెంటేసుకు వెళ్ళుచుండె
మేకప్పులు మరచిపోయి – ఎన్నికలను ఓట్లిచ్చిరి
ఓట్లమాట మాట్లాడిన – గెలుపు వలపు గతులు దప్పు.

అవసరాల గ్రామసీమ – హైటెక్కుల నగరాలూ
అంతరాల రాలిపోవు – అంతరంగమోటర్లది.

పాదయాత్ర మొదలుపెట్టి - పాలన పరువమ్ము దెలప
యత్నింతురు స్వార్థపరులు - పదవిలేక బతకలేని వారు.

కాంగిరేసు నేతలంత - కామితార్థ ఫలమునొంద
సోనియాను బలిచేతురు - స్వార్థపరులు ద్రోహులంత.

వ్యక్తిత్వం లేనివారు - వక్తవ్యం అవినీతి
కుంభకోణ కూర్పరులు - పదవి కన్య చెరచువారు.

గ్రూపుగోల కాంగ్రెసులో - త్రోసివేసె పదవినుండి
గాంధివేసె పునాదినీ - పూడ్చివేతు రంత గలిసి.

భారతీయమందురంత - బావిలోని కప్పలవలె
బీజేపీ మతమంతా - స్వదేశీయ విధానమే.

పార్టీలను మార్చువారు - పదవిపొంది పదిలముండ
వ్యక్తిత్వపు ఓటులన్ని సేవ గురుతు చెదరిపోదు.

ఎర్రపార్టీలన్ని కలసి ఎఱుకలేక పొత్తులతో
ఊగి ఊగి సాగగాను ఉనికి వీడి ఉరకలెత్తు.

గుజ్రాల్ సాబ్ గుంజాటన అకాలీల జలంధరం
బీజేపీ ప్రతిఘటన శిక్కులసిరి సింగారం.

పొత్తుముదిరి చిత్తాయెను - పరపతియే కరవాయెను
నాయకగణ శిగపట్లకు - నాశనమై ప్రభలు విడిచె.

అప్పుచిప్ప చేతబట్టి - ఆంధ్రను తాకట్టుపెట్టి
చంద్రబాబు అడుగుచుండె - శ్రమకు కూలి ఓటిమ్మని.

తెలివివాడు తిరుగువాడు - వ్యూహరచన నేర్పుగాడు
తెలుగుదేశ గెలుపు కొరకు - ఏదైనను చేయువాడు.

కాంగిరేసు బండి నిండె - వృద్ధనేతలందరితో
యువకులకే చోటులేదు - ఓటరుకెటు మిగులుచోటు.

కులం మతం వర్గాలకు - సీట్లుపంచె కాంగిరేసు
గెలుపు తలపు రాలేదని - గంతులేసెనసమ్మతి.

రంగుపూసి సోనియా – రంగంలో దిగలేదని
దిగాలుపడె కాంగ్రెస్సూ – ఫిరాయింపు పీడతోడ.

ప్రియాంకతో చేతులూపి – పిలుపు నిచ్చె సోనియమ్మ
ఇండియాను రక్షించగ – ఇటలి మహిత హితవు జెప్పె.

బోఫార్సును ఫార్సుచేయ – జైనుమిషను జయమెంచగ
చిలుక పలుకు కులుకులన్ని – కల్లలగును ఎన్నికలను.

అవినీతిని అంటనంటు – చంద్రబాబు నీతిమాట
అంటుకొన్న అవినీతికి – సాక్షి అన్న వెన్నుపోటు.

కాంగిరేసు మాతృసంస్థ – మామ సంస్థ తెలుగుపార్టి
తల్లిసంస్థ తిట్టుచుండె – అన్నసంస్థ ఆక్రమించి.

చెమ్మచెక్క చంద్రబాబు – పులిజూదపు కరుణానిధి
నిద్రకరవు దేవగౌడ – జనదళపతి యాదవుడూ
ముప్పుమాట ములాయమూ – తలటోపీ కాశ్మీరీ రాజు
సమతకు దిగిన ఎఱ్ఱపార్టీలు – కలకత్తా బాసూ అస్సాంగణహంత
అన్నీ చదరంగపు పావులే – కదిపే ఓటరు కుదిపితే
శంకరగిరి మాన్యాలే కరవు.



వందేళ్ళ వాసి వెలసిన కాంగిరేసు – జవహర్ జపంతో జగత్ప్రసిద్ధం
ఇందిరాజీ హితప్రబోధం ఇంపు – రాజీవు జీవంతో జవం నిండింది
పీవీ పిలుపుతో తలపు మార్చుకొంది – కేసరి సరిగమలతో గమ్యం వీడింది
సోనియా దాసోహంతో సొమ్మసిల్లింది – తేరిపార జూచేలోపు తెల్లారిపోతుంది.



అన్నవెన్నుపోటు చంద్రునిలో మచ్చ
తొలగించడానికి తమ్ముళ్ళ చికిత్స
అన్నను మరపించాలని కంప్యూటర్ల కదలిక
చుట్టూ చేరుతున్న అవినీతిపరులతో గండం

జనం మధ్యకొస్తే జన్మభూమి గతి దుర్గతి
జరిపిన అన్నగారి దినం ప్రచారంకోసమేగా
గతరెండు దినాలు జరపలేదు ఎందుకని
మచ్చుతొలగి పోక శరీరమంతా నిండింది.

అమెరికా జపాన్‌లు కీర్తించినా మానలేదు
ఇక వెళ్ళాల్సింది నీతినిండిన జన్మభూమి పల్లెకే.



బితుకుమనే బీజేపీ బిర్రుగా నిండింది
వలసల వరుసలతో విలువలు వీగినాయి
మతం ఓటరు హితానికి సమ్మతమౌనా
నీతికి నికేతనం కాషాయం అవుతుందా?

కమలం పదవీగంధాన్ని జనాళికి పంచుతుందా
రాజకీయులంతా రాజరాజులనే స్థితేనా
గెలుపు బలుపు భరతభవితను బుగ్గిచేస్తుందా
స్కాముల స్వాములు కనబడకుండా చేస్తారా?

దుర్గంధం నుండి కమలం పుట్టి సుగంధాన్ని పంచాలి
పదవిఫలం పదుగురకీ పంచే పరముడు ప్రతినిధి
అందుకొన్నా అందుకున్న అధికార అవధి మీదే.



పెళ్లికాని కన్య పెడసరం 'లలితమ్మ' వరం
కనుక్కొన్నారు కమలనాధులు కామితార్థ ఫలం
పేదోడి పెళ్ళికి కోట్లు ఖర్చుచేసిన దానశీలి
పెద్దవాడి శ్రాద్ధానికి పెగల్లేదు ధనమానం
శశికళ పెంచిన రాణికి చంద్రలోకయానం
కరుణ పంపిన విమానానికి కరవైన బ్రేకులు
పట్టుసడలిన పట్టాభిషేకోత్సవ ఫలితం
గుట్టుగానున్న గుమ్మటాన్ని కోర్టుకీడ్చారు

అబల సబలగా మారేవరకు కోర్టు గుట్టు చెప్పదు
చట్ట సభల ఎన్నికల చప్పుళ్ళు సాగివచ్చాయి
నల్లద్దాలకు నలుసంటుకొన్న కరుణ కనబడలేదు
కారణం జయం లలితమ్మ ఒళ్ళో బీజేపీ కూర్చొంది
పొత్తులు చిత్తులు ఓటరు చిత్తానికి చెత్తలు
నేతల నిర్వాకాలు మరచిన నేటి ఓటరు గమ్యమగమ్యం.



దొంగసారా దొరలుతోంది ఓటరన్నా జాగ్రత్త
కట్లు తెగినోట్ల కట్టల ప్రవాహం ముద్దని ముట్టబోకు
తాతముత్తాతల మార్గం మరచితే తరిస్తావు నీవు
అండ దండ అందించే అభ్యర్థిని అందగించు
జనం సొత్తు దండుకొనే నాయకులకు చెంపపెట్టు
సగం చచ్చి నీవుంటే సానుభూతి సాక్షినీకు
దగాకోరు విధానాల దారిమళ్ళు వారె అంత
చచ్చినోళ్ళు బతికినోళ్ళు చంపెటోళ్ళు మనముందర
బతుకు బాగు చేయువారె మనకు నిధులు ఎన్నికలను.



విజయశాంతి సంఘసేవ – రాజకీయ రొచ్చులోన
భారతీయ జనతపార్టి – భావమంత విజయపథము.

జయసుధ సుధ ఆలోచన – చంద్రబాబు చేతనమున
ముదిరి చెదిరి మునిగిపోయె – సినమ నటన జీవితమున.

ప్రసంగాల పాఠములను – చూచి చదువు సోనియమ్మ
రాజకీయ రంగు పూసి – ఓటరులను మభ్యపెట్టు.

సినిమాలను రంగు వెలసె – రాజకీయ రంగు మిగిలె
ఆకర్షణ వికర్షణె – జనసేవను పేరుపెట్టె.

దేశపుటెల్లలు తెలియని – రాజకీయ దేవతలకు
దాసోహము పార్టిలన్ని – భరతభవిత దేవుడెరుగు.

అధికారము అవధిగాను – పార్టిలన్ని పరువువీడి
ఫిరాయింపు పిలుపులతో – జనస్వామ్యము చెరచుచుండె.

నయనమాయె నాదెండ్ల – సోనియమ్మ సోయగాన
కాంగివనము చెరచె నదియు – కాంగికమ్మదనము వీడె.

గాంధిభవన గమ్మత్తులు – గణతంత్రము సాక్షిగాను
సుధాకరుడు భాస్కరుడూ – పార్టి వెలగు చీకటులుగ.

అమేధిలో సోనియమ్మ – బరేలిలో ప్రియాంకా
బతికి చచ్చు కాంగిరేసు – తల్లిపిల్ల సరస జేరి.

పిలుచువారు కరవాయె పీ.వీ. – స్కాములలో చిక్కుకొన్నస్వామీ
టికెట్టునకు ఇక్కటాయె – టక్కరాయె కాంగిపార్టీ.

బాబ్రికూల బాధ్యతంత – పీవీదే ననియనుచును
క్షమాపణలు వేడుకొంటు – ముస్లిమోట్లు కోరుచుండె.



చంద్రబాబు జన్మభూమి – ఓట్లువచ్చు పుణ్యభూమి
ప్రతినిధి నిధిపోగుజేయ – ప్రభుత నిధులు గుల్ల గుల్ల.

అప్పుల కుప్పల మెప్పులు – అవని జనులకవి తిప్పలు
మోసములను కాంట్రాక్టను – ప్రతినిధులే ఫలము గొంద్రు.

పచ్చజెండ ప్రజలపార్టి – ప్రభుతనడిపి ఫలముగొనగ
కాషాయము కాంగిరేసు – కాటికాడ నక్కలుగ ఎదురుచూచు.

ఓటరన్నది కేకవేయ – కైకాలకు గుండె గుబులు
కావూరికి కలవరముగ – బందరు భయమగు వారికి.

పార్వతమ్మ పదవినొదలి – పాదుకలును బదులివ్వగ
'కళ్ళజోడు' కనిపించక – శ్రీనివాసు గీతమారె.

'గుడ్డ'లన్ని పార్టిలాయె – 'తాను' రాజకీయ మాయె
గెలుపు ఓటమనుమాటలు – జనుల కంఠశోష తెలుపు.

జాతి జవము కాంగిరేసు – స్వాతంత్ర్యము సాధించెను
సోనియమ్మ దాసోహము – స్లోగనాయె రక్షించగ.

సుధాకరుని విధి చెరచగ – గాంధిభవన గతులు దప్పె
భాస్కరునికి భాగ్యమబ్బ – కాంగి భవన ఖర్మమేమొ.

ఢిల్లి గల్లి గణతంత్రము – డీలు వడెను గ్రామాలను
గాంధిగ్రామ రాజ్యమేమొ – గతిదప్పిన మతిగమారె.

పాతకాపులందరిచట – ప్రజలసొత్తు నంజినోళ్ళు
కొత్తవారి కోర్కెలకిట – తావులేదు తపనపడిన.

కోట్లకు పడగెత్తినోళ్ళు – కోరపదవి చేతికందు
ధనము పంచు దాతృత్వము – పెంచి మింతు రెన్నికలను.

బాపట్లలొ సిగపట్లయె – దేశానిది దేవులాట
జనార్ధనుని జవసత్త్వము – కాంగిరేసు కమలమాట.

గుంటూరున జాన్‌పాషా – గుంజాటన అధికమాయె
రాయపాటి శ్రీనివాసు – రగడలోన కాంగిరేసు.

తెనాలిలో శారదమ్మ – తెంపరిగా దిగెబరిలో
ఇందిరమ్మ న్యాయవాది – ఇరకాటం ఇంతింతయె.

ఖరీదైన ఎన్నికలను – ఖర్మకాలు ఓటరులది
ఖర్చుపొదుపు కలగలిసిన – చౌకబారుజనస్వామ్యము.

'జైను'మిషను మిషగజేసి – జమానాను కూల్చివేయ
కాంగిరేసు కథమారున – వ్యధగమిగులునపజయమ్ము.

తారలంత తరలిరాగ – రాజకీయమే సినిమా
జీవితాన నిజముకాని – నిజమగునిక జనులసేవ.

రోశయ్యకు రొప్పువచ్చె – 'కాసు'మతము కయ్యమాయె
సైదయ్యయు సరసుడాయె – పేటలోన ప్రేమమీరె.

సుడిగాలిగ చంద్రబాబు – చుట్టుచుండె దేశమంత
జనసంద్రం వెల్లువెత్తు – జయముకోరు జన్మభూమి.



గీ. నేత నేతాజీ వర్ధంతి నేడు జరుప – జాతి జాగృతి పొందగా జయము కలుగు
భరత భవితయు పండగ భాగ్యమబ్బ–యువత నియమాలు పాటింప నిజము సుగతి

గీ. హిందు దేశమ్ము హితులకు ఇలను నిధిగ – చంద్రు చందమ్ము హిమశైల సాగరమ్ము
ఇంద్రునమరమ్ము సాటిగా హితము పెంపు – అందజేసిన అమరుడు చంద్రబోసు.

గీ. జాతిమాతకు జయమెంచె జనుడు బోసు – బానిసత్త్వము పరుగిడు భావనమున
భయము పోద్రోలు బందూకు భవము నించు–ధైర్య సాహస మహితుడు ధరణి వెలిగె.

గీ. హిందుఫౌజున దేశాన హితము నెంచె – మందు బానిస జాతికి బందుకనియె
పరుల దోలగ దీక్షను పట్టుదలను – వదల లేదుగ వరుడిట వాసి మించ.

గీ. వాదమేదైన వసుధకు వాసికల్గ – నాదమేదైన నయముగ నరులకంద
వేద నసుద్రుంచ వేకువ వెలుగుతాను – కాదనెడువాడు యుగముల గాంచలేము.

గీ. అద్వితీయుడు అధికుడు అవనిలోన – ధరను ధైర్యాన ద్రఢిమను దక్షతలను
గుణము శీలము గురుతుగ గురుడుబోసు – పోరు బాటకు దీపము పుడమిలోన.

గీ. స్ఫూర్తి పొందగ నేతాజి మూర్తి నిలచు – వ్యక్తి శక్తిగ రూపొంది అధికుడాయె
గాంధి నెదిరించె గరువాన గమనమునను – పట్టుపట్టిన విడువడు పరువు నిలప.

గీ. పౌరసైన్యము నిర్మింప పటువు కలిగె – శక్తియుక్తియు శీలము శమము నించె
దేశదేశాలు తిరుగగ ధైర్యమబ్బె – భరతమాతకు బంగారు భవుడు బోసు.

గీ. మగువ మగలంత సైన్యాన మహితులైరి – సగుణ సారము సహమతి సవనముగను
విమల విధులను విరియించె విబుధుడతడు – దేశరక్షణదీక్షకు దేవుడాయె.

గీ. తల్లిదండ్రుల తపనను తరుమజేయ – భువిని జనియించి భూమాత భుక్తిదీర్చె
నేతలకు నేత నేతాజీ నేటి మూర్తి – జాతి జనులకు జవసత్త్వ జన్యువతడు.

గీ. మాత మనురీతి మలినమై మాసిపోయె – భరత జనులంత బానిసల్ భావమందు
పరుల పాలన పాపాల పర్వమయ్యె – ధర్మసంస్థాపనముజేయ ధరణి వెలసె.

గీ. నీతి నియతులు నియమాలు నింగికెగసె – జాతి జవమెంచ మతిపోవు జయమువీడ
అధిక అవినీతి స్వార్థము అందగించు – నేటి విధమంత మార్చగ నెలవు బోసు.

గీ. శిక్షణయు లేదు దక్షత శివము నిండు – జాతి దేశపు భక్తులు జతులు మీరు
మనది అనుమాట మృగ్యమై మమతవీడె – మూర్తి నేతాజి మనకిచ్చు స్ఫూర్తినేడు.

గీ. అమరజీవుల ఆశయ అమలుకొరకు – సమరమొనరించు పౌరులు కానరారు
భరతజనులంత నేతాజి మూర్తిచూచి – స్ఫూర్తిపొందిన భారతి సుగుణమయము.



గీ. తార తారకరాముడు తరలె దివికి – తరళకాంతుల తారగా తమము విడగ
తనువు మనసుల జనులను తప్తపరచె – సేవ చైతన్యమూర్తిగా చెలగుచుండు.

గీ. అమరమూర్తికి అందరు బంధువులుగ – సమరశంఖము పూరింప సమయు చీకు
నీతి నేతకు నీరాజనమ్ములివ్వ – నేటి నేతలు సింహాలు నేర్పుమీరు.

గీ. జనత జయగీతి వినిపించు జగమునంత – నాక మందున నయరీతి నాణ్యముగను
రామునాత్మయె సంతస రహిని మించు – అన్నసేవకు మనమిచ్చు ప్రతిఫలమ్ము.

గీ. వెన్నుపోటుల రాజ్యము వెతలు దెచ్చు – జనుల పాలన వీడెను జవమునంత
వికలమాయెను విలువలు విమతమాయె – సమత సాగెను స్వార్ధాన సవ్యరహిత.

గీ. అర్ధసమతను సాధించ అవనిలోన – సార్ధకాఖ్యులు నేతలు సాగిరంత
మాట మహిమయె మాన్యత మార్పులేదు – చేతలందున చూపించ చేవకలుగు.

గీ. రాజకీయము కుటిలము రాజ్యమందు – నిజము జనసేవ నియమాలు నీతిదప్పె
మోసగింపుల మాటల మోహపుచ్చు – నేటిపాలన గమనింప ఏవగింపు.

గీ. చేయి పైకెత్తి జైకొట్టె తెలుగువాడు – చేత చేతనములయందు చైత్యమాయె
ఆంధ్రదేశంపు వెలుగంత అమరమందు – సాంద్ర కీర్తుల నినదించు రామమూర్తి.

గీ. ఆశయమ్ముల కాశగ నందమూరి – తపన తరియించె జనసేవ తారకుండు
ఆకసమునందు తారగా అవనివెలుగు – రాజకీయాల ప్రాజ్ఞుండు రామమూర్తి.

ఆ.వె. అన్నబొమ్మతోడ అధిపులైరెందరొ – మనసులేనివారు మరలిరంత
మంటగలిపిరంత మహిజనమాన్యుని – కంటనీరు వచ్చు కథను వినగ.

ఆ.వె. వెన్నుపోట్ల తోడ వేల్పును మడియించ – కనులగట్టె మోసమాంధ్రజనుల
కలత కలగె జనత కలిమిని కోల్పోయి – తెలుగు వెలుగు దప్పె తెరువు వీడి.

గీ. మూర్తి మనకెంతొ స్ఫూర్తికి మూలమగును – కాలగమనమ్ము మనకెంతొ కాంతినిచ్చు
అన్న జనగుండె నిండుగ అధివసించు – మరువరానిది రామన్న బంధమవని.

గీ. మద్యపానము మహమారి మృత్యువాయె – సభ్యులందరి కాయెను కల్పకమ్ము
బియ్యపథకము పెరిగెను బీటవారె – పన్నులెన్నియో లెక్కింప ఫలమునున్న.

ఆ.వె. పన్నుకట్టువాడు పృథివిని కనరాడు – చట్టలొసుగులన్ని చాలయుండె
శక్తివిలువ పెరిగె శాశ్వతమగురీతి – రైతులంత వంత రాజ్యసీమ.

గీ. నేరవృత్తియు పెరిగె నేతలందు – చట్ట బద్ధము అవినీతి సాగుచుండె
అన్నిశాఖల లంచాలు అంచుమీరె – పాలనమునందు పసయేమి కానబడదు.

ఆ.వె. జన్మభూమిలోన జాగృతి కరవాయె – కంటితుడుపు చర్య కానబడును
జనత పథకమంటు జయమెంచువారలు – మధ్యవారి మహిమ కర్థమేమొ.

ఆ.వె. రాయసీమలోన రాక్షస వర్గాలు – నక్సలైట్లు కొండ వనములందు
హత్య దోపిడీలు అహరహములయందు – ఆంధ్రసీమ భయము ఆర్తి జాస్తి.

గీ. బడుగువర్గాల భానుడు అస్తమించ – దళితులందరు దయనీయ దహితులైరి
మాన్య మహిళకు రక్షణ మరచిపోగ – నేటి ప్రభుతను నేతలు నేర్పుదప్పె.

గీ. శాతవాహన తేజము సాగిపోయె – కాకతీయుల పౌరుష కలిమిపోయె
విజయ నగరాంధ్రశౌర్యము విమతమాయె – మూర్తి రాముని జేరెను ముద్దుగాను.

గీ. కష్టపడగాను కాలాన కలిమి కలుగు – దీక్ష దివ్యత్వమగునుగా దిటవుమీర
అంకమాతడు అంకిత భావమునకు – పట్టుపట్టియు విడువని పరముడతడు.

గీ. చిత్తశుద్ధికి చిరునామ ఎన్టియారు – త్రికరణములందు మన్నిక తియ్యనగును
మనసు కలిగిన మనిషికి మాన్యతబ్బు – విగ్రహముజూడ నిగ్రహ విధియు దెలుపు.

గీ. ఊరువాడల నిలువెత్తు ఉన్నతంపు – ప్రతిమలనునిల్ప పావనమగును నేల
తరతరములకు రూపమ్ము తరళమగును – తెలుగు ఘనతకు తేరగు తేటగాను.

గీ. గుర్తుకొచ్చును అవినీతి గుండె దడగ – లంచగొండుల కంటక మౌను రూపు
సంఘసంక్షేమ మెంచగ సరసుడగును – మహిళ మాన్యత మరువము మాన్యుజూడ.

గీ. ఆశకల్గించె అన్నయ్య ఆశయముల – వాసి వెలయగ వరపైన పాలనమున
అన్నమాటను దప్పని ఆర్యుడతడు – ఆంధ్రతేజము నిలువెత్తు అన్నమూర్తి.

గీ. మంచి గుణములు మనిషికి మార్గమిచ్చు – ఎంచి పొందగ రాముడు ఎఱుకనిచ్చె
పంచునాతని మూర్తులు ప్రజలకిచట – వంచననువీడి వాసిని గాంచుమీవు.



ఆశ నిరాశగా మారితే తట్టుకోలేని మనిషి ఆశలకు తెరవేయాలి
సంఘాన్ని చదివి అనుభవాల అవగాహనలతో జీవనగమనం సాగించు
హీనంగా దేన్నీ చూడకు ప్రపంచంలో అన్నీ ప్రాధాన్యమైనవే
ఆవేశంతో విప్లవించే ఆదమరచిన యువకులు నేటికాలంలో లేదు.
ఆశయాలకు అమరులైన అధికులను స్వరించే నాథుడే కరవైనాడు.
గ్రామరాజ్యం రామరాజ్యం కావలసిందిపోయి రావణరాజ్యంగా రాజిల్లుతుంది
రాజకీయాల రంగు అంతరంగ రంగాలను మలినంచేస్తూ నాట్యమాడుతుంది.
వర్గాలు–కులాలు–మతాలు మూడు రంగుల ముచ్చట కంటబడుతున్నది.
జన్మభూమిని జాగృతంచేయాల్సిన జయశీలురలో నీవొకడవు.
మూఢత్వాన్ని మట్టుబెట్టే సామాజిక చైతన్య స్రవంతివినీవుకావాలి.
జీవితంలో తిరిగిరాని కళాశాల జీవితానికి తెరపడుతుందినేడు
తిరిగిరాని జీవితానికి తొలగని అవిద్యకూ తెరతీస్తుంది సంఘజీవనం
సామాజిక రుగ్మతలను సాగనంపే విద్య అందుకొనడం నేడు సాధ్యమా!
అవహేళనమౌతున్న ప్రజాస్వామ్యానికి అవరోధంగా నీ నేర్చిన విద్య ఉపయోగించాలి
ప్రజాధనం పరమాన్నంగా ఆరగించే అవినీతి నాయకుల పనిపట్టాలి నీవు.
అవకతవకలతో అట్టుడుకుతున్న అసమర్థ జనస్వామ్యంలో జనజాగృతం చేయ్యాలి.
అసంతృప్తి మేరుపర్వతమై అలమటిస్తున్న జనతకు తృప్తి కల్గించే వాడివి నీవు
అవినీతి మగ్నమై, ఆశలతో భగ్నమై అనుభవరాహిత్యంతో అలమటించకు.
ఆమరణాంతం వెంటనంటి ఉండే నీలోని నీతిని నిన్నుకాపాడే సత్యమే.
జరిగే కాలానికి జంటతో నడవాలనే అభిలాష జీవనగమ్యానికి పెనుగులాట
పగటికలల పంగనామాల పావిత్ర్యం నిజాల నుదుటి వ్రాతకు నైసర్గికం.
కలలు నిద్రాముద్రిత జీవితాలకు నిజమై జాగృత జీవనానికి జయకేతనాలు
పండిన ఆశయాల పంటకు పరజీవితాలను ఎరువుగా వినియోగించుకోకు.
అంతస్థుకు మీరిన ఆశలు అవనిలో జీవితాలను అధఃపతితం చేస్తాయి.
ఊహల ఊయలలో విహరిస్తూ ఉన్నత విలువల్ని మరచిన మానవుణ్ణి క్షమించకు.
నిన్ను నీవు తెలుసుకొనే స్థాయి విద్య నీవు అభ్యసిస్తే విద్యాసంస్థే ధన్యం

తనతనాన్ని విడిచి 'మన'తనాన్ని కోరే మానవుని మహనీయత నీది కావాలి.
తరగని అందాలనిచ్చిన సృష్టిలోని నిస్వార్థాన్ని పరార్థంగా పరమార్థంగా మలచు
ప్రకృతి స్వార్థ రహితమై పురుషుని స్వార్థ సహితుణ్ణి చేసి పునీతమయింది.
అందరి ఆశయం అందలం ఎక్కాలనే అయినా అందుకోగల్గడం అదృష్టం
కనబడని అదృష్టాన్ని కనబడేట్టుచేయగల్గిన సామర్థ్యం వ్యక్తిత్వానిది గుణానిదీ
ఆత్మగౌరవం అందించే అమరమైన అందం వ్యక్తివికాసానికి వెలుగురేఖ అవుతుంది.
మాధుర్యం కోరేమనుషులు పరిపక్వమనసుతో పరిపూర్ణ చైతన్యంతో పయనిస్తారు.
నలుగురికి పనికివచ్చే పనిచేయడం నవ్యమానవుని విశిష్టతగా మనం గ్రహించాలి.



చీదరించుకొనేచీకటినిచిత్తంనిండా నింపుకొని వచ్చిన ఓ విద్యార్థీ!
ఆసక్తిలేక అయిదు వత్సరాలూ ఆషామాషీగా గడిపి జీవితంలోకి వెళ్తున్నావా!
నిండి ఉన్న చీకటి అణుమాత్రమైనా వీడుతుందనడానికి సంఘమే నీముందు
త్రికరణశుద్ధి తిండికే పరిమితం చేసుకొన్న సంఘజీవితం సాక్షిగా వీక్షించు
వయసుకైనా గౌరవం కలిగించే అంతరంగం గల్లంతైన గతిదప్పిన మతిమంతుడా!
డిగ్రీ చదువుతో జీవిత ప్రవేశం చేసే నీవు డీలాపడిపోయే స్థితిఉంది జాగ్రత్త
తపన లేని విద్యార్థికి తరగతి గతి తరుణానికి తరలిరాని అవకాశం
సహవిద్యాకళాశాలల్లో సహగమనంతో గతిదప్పిన మతుల గారడీలు
మూకుమ్మడి ఎగవేతల ముచ్చట త్రికాలాల కతీతమై తియ్యనైంది
దక్షత, ధైర్యం లేని పాలకవర్గాల సామర్థ్యం సర్దుకుపోయే స్థితితో అంతం
స్వేచ్ఛ విధిని వెక్కిరిస్తే ధర్మనిర్వహణ దారిదప్పి దౌడుదీసే పరిస్థితి
హక్కు బాధ్యతను ఆదమరిస్తే అవనిజనుని ఆసురత్వం అమరం
నాలుగు గోడల మధ్యనుండి విశాల విశ్వంలోకి వెళ్ళే విద్యార్థి వింత తీరు
ఆర్ట్స్ అయినా సైన్స్ అయినా 'సెన్సు'లేని జీవులకు చెప్పే చిత్రమైన స్థితి
వృత్తివిద్య వర్తనలో వరపైన వైనం చిత్తశుద్ధి తరిగిన జీవితాల మౌనం
పెద్దల ప్రేమ పెరిగి విరిగింది పరువపు పెదవుల వైపు పరుగిడి వెళ్ళింది.
తిరిగిరాని జీవితాన్ని తిమిరంలో మునిగి దారితెలియక వ్యర్థం చేసికొన్న వైనం
కాలానికి కలిసిరాని కాముకత్వంలో కథకంచికెళ్ళేదాకా కంటబడదు.
వయసుమీరిన నరునికి అందని విద్య వయసులో వరపును మరచింది.
ఉద్యోగం జీవితాశయమైనరోజుల్లో ఆశల అంతుతేలక అందం వెలిసింది.

బియ్యే అయ్యేసరికి బెండకాయ ముదురుతుందని లేతజీవితాలు తుంచబడతాయి.
ఆడామగా తేడాలేకుండా జీవితాశయాన్ని సాధించాలనే తపన పరులు కావాలి.
కళాశాలలో కలగలిసి గడపి కాలగమనంలో కలిసి కమ్మదనాన్ని పంచుకోవాలి.
అనురాగానికి అమరసందేశాన్నందించే మనసుల మాధుర్యం మనకు కావాలి.
సమత, మమతల సారాన్ని సహజీవులకందించే సవనంలో సాగిపోవాలి.
సమాజాన్ని సతమతంచేసే స్వార్థ మతాన్ని సంహరించే సుమతులు కావాలి.
అజ్ఞానులకు అవగాహన కలిగించే విజ్ఞానం మీరంతా స్వంతం చేసకోవాలి.
రూపం రూక్షమై, చేతం చెడ్డదైన జీవిలో చైతన్యం చెరిగిన చైత్యమే
వినయం విద్యకు విలువను చేరిస్తే విబుధుల విజ్ఞత విలక్షణంగా విరాజిల్లుతుంది
యాంత్రికమైన జీవితం, వ్యాపారాత్మకమై విలువలు జగానికి జనానికి తీరని శిక్షలు.
మనిషికి ముఖ్యం ధనమైతే మరి ప్రాణానికి, ఆరోగ్యానికి పహరా కాగలుగుతుందా?

సంత సరుకు జనస్వామ్యంలో వింత తీరు విద్యావ్యవస్థ
అవస్థలు తెచ్చే అయోమయపు పాలనలో భావిపౌరులు.
బి.ఏ, బి.కాంలు కాలేజినుండి యూనివర్సిటీకి ఎక్కడానికి నిచ్చెనలు
కాదంటే బడిపంతులు శిక్షణ డిగ్రీతో బతుకు తెరువు సిద్ధం
పాలకుల అడుగులకు మడుగులొత్తే గుమాస్తా గిరి చదువులు.
IAS IPS కి ఎగబాకాలనే ఆలోచనలో మగ్నమైన అపర విద్యార్థులు.
అయిదేళ్ళ కళాశాల చదువుకు భరతవాక్యం, నిజ జీవితానికి నాందీ వాక్యం.
అమ్మానాన్నల సంపాదన అబద్ధాలలో మగ్నమై అయిదేళ్ళు స్వర్గం
గురువు కనబడినా వినబడినా పరుగెత్తే తరగతి విద్యార్థుల తేటతెలివి.
జీవితాన్ని కష్టనష్టాల్ని అయనుభవంతో రంగరించి తెలిపే అవకాశం మృగ్యం
ప్రజాస్వామ్యం పరువుపెంచే పాలకుల తయారీ కర్మాగారం కళాశాల
నట్లు బోల్టులు ఊడిపోయిన అధ్యాపకయంత్రాల శోష ఎడారి ఘోష
అసమర్థులు అన్నిచోట్లఉన్నా సమర్థతకు సహకారం ఇస్తే ఇది సుక్షేత్రం.
కలుషితమైన సమాజానికి కలుషంలేని విద్య కశ్మలాన్ని కడిగి వేస్తుంది.
ఆశయాలు లేని జీవితాలకు అవకాశం దొరికితే పండగే
ఆశమీరి తరగిపోయే అవకాశాలు నిజజీవితంలో మెండేగా
వ్యక్తిత్వానికి నిలువుటద్ద ప్రవర్తన వర్తన వరపైతే విద్య సద్యోగం
గుణ గణాలు కాలానుగుణంగా గుర్తుపట్టలేనివిగా జనజీవితం తయారు

సోమరితనానికి సోదరులైన నేటి తరం కర్మకాండ కాలుష్యమే
మేధావులకు కూడ కూటికోసం అరణ్యరోదన చేయాల్సిన దుస్థితి
ధైర్యం దహనమై స్థైర్యం హననమై ఆత్మగౌరవం అడవిగాచిన వెన్నెల
సంస్కృతి తెలిసిన వాడు సంస్కారి భావిభారత పౌరుల సంస్కృతేమిటో?
పాఠ్యాంశాల చదువు పరీక్షకే పరిమితం నిజమైన చదువు జీవితానిది
ఎందరో గొప్పవారౌతారనే భావన నేటి నిరుద్యోగ పర్వంలో నిరుటిమాటే
నీతి వ్యక్తికి శక్తినిస్తే నియతి వ్యక్తిని నిజమైన మానవుని చేస్తుంది
మనసు నిండినా, మండినా సహనంతో సమ్యగ్రూపి కావడం సుగుణం
సుఖం, దుఃఖం సుడిగాలిలో, జడివానలో, ప్రళయంలో ఒకటే కదా.
మనిషి నేటి జీవన ప్రళయానికి సిద్ధమై బుద్ధికిబద్ధుడై ఉండాలి.



సమానతా భావానికి చెల్లుచీటీ యిచ్చినది నేటి మానవ జీవనగతి
ధనం ప్రాణవాయువై మనిషి ఉచ్ఛ్వాస నిశ్వాసాలు ఉరవడిస్తున్నాయి
అనురాగానికీ, ఆప్యాయతకూ అర్థాలు మార్చే ధనదారుణారావం
తల్లి తండ్రి తనవారనైనా తరగని మమతతో ఆదరిస్తే నీవు మానవుడే
తరగతి గతిదప్పిన గమనంలో గగనంలోనికి గమించి గహనమైంది
మంచిమారురూపుతో కంచికెళ్ళి కలలకమ్మదనంతో చెలిమి పంచింది
అవగాహన అందంచిందులువేసే జనుని జీవితానికి జవసత్త్వం జయభేరి
మనసుపెట్టిపనిచేసే మాన్యునికి ఎదురయ్యే ఎఱుక మలిన రహితం
చిత్తశుద్ధికి చిరునామాగా చిన్నారి విద్యార్థుల చేతలు చేవయుతం
పారదర్శకత లేని పాలనలోని విద్యాసంస్థల నిర్వహణ నిర్వీర్యమై నియతి దప్పింది.
అమ్ముడుబోయే పవిత్ర ఓటుస్వామ్యంలో అమ్మకానికో విద్యాసంస్థ సిద్ధం
ఫలితం వెంటనే ఆశించే ప్రజాస్వామ్యం జనంలో విద్య విపరీత ఫలితాలనిస్తుంది.
తెలిసిన విద్యకూ తెలియని జీవితానికీ తగవు నర్థించే తపనలో విద్యార్థి.
మేధవెలిసిన నీతిదప్పిన నేతల నిర్వాకానికి నేటి విద్యార్థి నీరాజనం
పార్టీ పల్లవాధరి పరువపు పిలుపుతో ఆహ్వానిస్తే పరుగెట్టే విద్యార్థులు
విద్యార్థి సంఘాల చైతన్యం స్వంత సభ్యుల అవగాహనలోనే గతిస్తుంది
పదహారేళ్ళ పడుచుపిల్ల సినిమా సింగారింపుతో కేకలేస్తే కేరుమంటూ వెళ్ళేబిడ్డ విద్యార్థి.
తెలిసీ తెలియని దశలో తెగువను తెలివితో సంగమింప చేసేదే విద్యాలయం

గురుకులాల గూడపుఠాణీల గురుతు చెరగని సంస్థల వింతపోకడ
కులాల కుమ్ములాటల్లో కూరుకుపోయిన విద్యాభారతి మౌనవేదన
తాత తండ్రుల మాన్యాలు అనుభవానికందకపోతే ఆతరువాత తరం గతి?
వ్యక్తిత్వపు వెలుగు వెతలన్నీ వెలువరించే జీవితం వందితమౌతుంది?
అరిషడ్వార్గలకు ఆవలిఒడ్డున అమరసదృశ జీవన భవనాన్ని నిర్మించుకో
సహన సామర్థ్యాల సంగమంగా భవిష్యజ్జీవన గమనాన్ని ఎంచుకో
భవిత నీతిమయమై, గుణశోభితమై, ధైర్యయుతమై ధనం పంచాలి.
జీవిత భాగస్వామిని ఎన్నికలో మనసుల కలయికకు ప్రాముఖ్యం యివ్వు.
వరకట్నం నీకు వరమయితే జీవితం భస్మాసుర హస్తమౌతుంది
శ్రమించు, శ్రమజీవన సౌందర్యాన్ని పంచు, చైతన్యంతో చేతం మించు
స్వార్థంకోసమై పరుల్ని హింసించకు పరార్థంలోని అంతరార్థాన్ని గ్రహించు.



సంబరాల అంబరాన్ని ఆవరించే వెలుగుచీకట్ల విలువను గ్రహించు
సంపద పదమంటుంటే ఆశయం అడుగంటితే అందలం నిందలమయమే
సరిచేయగలిగిన తప్పు సరాసరి మూల్యంతో ఒప్పు సహజంగా ఒకటే
సామర్థ్యం అర్థానికి సలాముకొడుతుంటే వ్యర్థమౌతుంది వ్యక్తిత్వం.
కలలు నిజాలయ్యే జనజీవన కలిమి కొలిమిలో జాతకాలు బూటకాలే.
హితం చెప్పే హీనం నవ్యనాగరక జనం దృష్టిలో అభిమతంలేని అర్థహీనుడు
కొనబడే జీవితాలకు వెలనిర్ణయించే బేరగాళ్ళు భవ్యభారతిలో కొల్లలు.
ఆలోచనాలోచనాలకు అడ్డుపడే అవతారపురుషుడైనా అడ్డంతొలగించు
అవగాహనా గగనంలో అడుగిడే గహనాల్ని అంతరంలేని అంతరంగంతో గమించు
అలసిన మనసును సేదదీర్చే ఆశయఫలితం జీవన స్వర్గాన్ని సృజిస్తుంది.
తపన హెచ్చినా, తనువు డస్సినా తరగని తపఃఫలం తరుణానికి తారుణ్యం
గొప్పలు మెప్పు గోరంతలు కొండంతలుగా గాలిలో కలిసి గగనానికెగసే గారడీలు
ఉబ్బితబ్బిబ్బయ్యే ఉన్నతుల ఊసు ఉనికిలేని మనికికి ఊతమిచ్చే వరవు.
కలిమి కాలానికి రెక్కలొచ్చి ఎగిరిపోయి కల్పాంతానికి ఆహ్వానం పలుకుతుంది.
మనువానికి మనసులోపించి మానవత మరచి మనువర్తన నర్తనగా మారింది.
మనకులేనిదాన్ని మరెవరో అందిస్తారనుకొనే మానవుని బలహీనత మహత్తరం.
ప్రజాస్వామ్య పార్థివులైన ప్రజలు పరమార్థానికి పోయి ఆలయాల శిలలై పోయారు.

'మంది' మహిని మాలిన్యం చేస్తుంటే పారమార్థిక పంది భూమిని రక్షిస్తుంది.
సంఘపశువు మానవుడై సమత విడిస్తే మహిషం యముని వాహనమై పవిత్రమైంది.
పురాణపుటల పులినత్వం కలిమి కరచే కఠోరనరులకు రుచిస్తుందా?
చదువు చతికిల బడినచోట సంస్కారం సారహీనమై అంధకారమయమౌతుంది
పదవి సేవాపథంలో సేద దీర్చేదైనా అలుపెరుగని సేవకులకది అనవసరమే
మానం అభిమానం మంటగలిపే స్వార్థకలిమి ఆత్మగౌరవానికి అవరోధం
నీతి వెన్నెముకగా నిలిచే వ్యక్తి వ్యక్తిత్వం నిధులకూ పదవులకూ నీరుగారనిది.
పార్టీలు మార్చే నాయకుల ప్రజాస్వామ్య పారతంత్ర్యం ప్రజల కందిన పరమార్థం.
నిధులుమింగే ప్రతినిధిత్వానికి విధులు తెలియని విబుధుల వింత ఊతం.

విభజించి పాలించే వింత రాజనీతిని అందిపుచ్చుకొన్న అపర చాణుక్యుల ప్రజాస్వామ్యం.

అందినంత అమాంతంగా మింగి అవతారాలు మార్చే రాజకీయ వితరణ శీలుర ఎన్నికలు.

అసమర్థత కానవాలుగా నిలచిన కార్య నిర్వహాక వర్గ కర్మకాండ కంపరాన్ని కల్గిస్తుంది.
సాదరత్వం, సోదరత్వం సోపానాల్లేక సొంపు దరిగి భూమిలో భ్రుంగుతున్నాయి.
సుందర సుమధుర స్వర్గం సుసంపన్నం కావాలనే భువివాసుల వాంఛ నెరవేరేనా!



నందనాలు వందనాలు నయనాలకు బంధనాలు
ఇంద్రియాల కింధనాలు ఇరులు తొలగ సుందరాలు
ఆహ్వానం అందించే హృదయాలు అమరలోక సందేశపు ఆనవాళ్ళు
అందుకొనే మనసుంటే అది స్వర్గం అందిరాని అందానికి చందనమది.
ఆశీస్సులు అందించే మమకారం వినయానికి విలువిచ్చే సహకారం
అధ్యాపక విద్యార్థుల అవగాహన ఆశయాల హరివిల్లుకు అవకాశం
కటకటాల చీకటిలో కర్మకాండ కాలునితో కాట్లాటకు మర్మకర్మ.
తీపిరుచుల కోరికలే తీక్షణాలు వలపు పంట మనసునిండ మరువమ్మే
సంసారపు సారంలో సహగమించు సంతానము సవ్యమైన మదికింపు
మార్పుతీర్పుమన్నించుము మహిలో భవిత పండు భవము వెలుగు భువిలో
ధనమే అన్నీ అనుకొని ధరణిలో దుఃఖించకు నీటిబుడగ ప్రాణమైన నిధియేమిచ్చు
మాటపెద్ద చేతచిన్న ఆశనీకుమిన్న చేతపెద్ద మాటచిన్న చేతమెంతొమిన్న

దారుణాల ధరణిలోన దాతృత్వం నీవు, కారణాలు గమనించగ కలిమి నీకు సుగమం
ఆశమీర ఆశయాల మరపు కలుగునన్నా ఆదర్శము అందరికీ అధికుడవౌరన్నా
చదువు మీవు సంఘ చరిత సమత మించ సాగ గలవు సహనంతో విప్లవమున
అవినీతికి ఎదురుపడిన అందలమే పట్టుపట్టి దీక్షతోడ ఫలము నందు
అందరమిట అధిపులమే తరుగులేక అభ్యుదయము ఉదయముగా అనుగమించ
నేనొకడినే చేయలేని దుస్థితిలో అనెడి మాట అపవాదము అనుగమించ
నమ్మకమున నాణ్యమైన నడతనడువ గమ్యమేమి గగనమనుట కాదు కాదు
మంచి మాట మంచినోట మరువమగును నోరుమంచి కాగానె ఊరుమంచినీకౌను
ఓర్పు నేర్పు మాటలోన వరమునీకు వసుధలోన చేత చెలిమి కలిమి బలిమి కాంతువీవు
మానవతకు మానవునిగ మరువకీవు, దానవతను ఎదిరించగ ధైర్యశాలికమ్మునీవు
శాంతిచేరు చైతన్యము చెరగబోదు విప్లవమ్ము విధిచేతగ వెలుగునపుడు.
జనస్వామ్యపు రాదారిలో ముళ్ళురాళ్ళు జాగృతితో తొలగించుము జయమునీకు
లంచాలకు మంచమెక్కు లౌకికులే అధికారులు లవణరీతి లావణ్యము కలిగించుము లోకమందు.

నిర్లిప్తత ఆటవిడుపు అవధిలేని విధముగాను తప్పించుకు తిరుగుటెన్న తెలివికాదు జగతిలోన.
ధనవంతుల అధికారమె ధరణిసాగునేడు గుణవంతుల గురుతించగ ప్రగతిగాంచు జగతి.
సేవ చెరిగె చేవలేని చేతలతో జగము పదవి వలదు సేవ చేయ పరమార్థము తెలియ.
విధివశాన వినాశనము జగతి జనుడు కోరు వినుతరీతి విలువనెంచ విలయమైన తొలగు.
జాతి నీతి జవములే నాయకులే నేడు జాతినయన నీతి నడత జయము జవము నేతనీవె.

ఆటపాట అమరమాయె ఆధునికము పుస్తకాల పురుగు లౌట పూజ్యమగును.
విలువలేని జీవితాన వెలుగుసున్న వెలితిగాను విధుల విలువ తెలియగాను తేట జీవితమ్మునీది. నిరంతర విద్యార్థిగ నుండు జనుడు నిధియె అంతరంగమధివసించి వెలుగు విద్య సతతం. సమస్యలను సతమతమౌ పౌరులుండెనేడు పరిష్కారమార్గమెంచ ఫలము నీది గొనుము.

555

దైవయాత్రలంటేనే దిగులు పుట్టుకొస్తుందిట
మతము మారణమ్ముగాను మమతను మింగేస్తుందిట
వేంకటేశు గుడికెళ్తె ఏడుకొండలెక్కమంటె
ప్రమాదాల బారిబడ్డ సంకటములు దాపురించు

కొండమీద దేవుడుండె జీవుడేమొ నేలమీద
శ్రీశైలపుటడవుల్లో దారిదోపిడీలు చేయు
దొంగలభయమెక్కువంట – దోచుకొంటె దిక్కులేదు
అమరనాథుయాత్రకెళితె – అమరులగుట సిద్ధమంట
మంచు ముంచుకొస్తుందట – మంచికెళ్తె మడియురీతి
కాశికెళ్ళ కాటికెళ్ళు – గంగనీట బూడిదగును
జెరూసలెము వెళ్ళువారు – ఏసు దర్శనము జేయగ
చర్చిలోన తోపులాట – జీవుడేమొ జీససగును
మక్కయాత్ర హజ్ మహిమ – అల్ల ఆలయమ్మునందు
పాట్లమయము మార్గమందు – మక్కయందు సృక్కిమడియు
మార్గమందు మోక్షమొచ్చు – మాయదారి యానమందు
మోక్షమిచ్చుదేవుడేమొ – మిన్నకుండు గుడులలోన
భువిని భూతముల నడతయు – పాపభాగమయ్యెనేడు
‘పాలు’గొనగ భగవంతుడు – పావనమగు నీనేలయు
దేవుడొక్కడైయుండును – జీవులు వేర్వేరుగాను
కామరహిత కర్మసేయ – కాంతురంత దివిదేవుని.
షిరిడికెళ్ళ శివము కలుగు – బాబ బాగుసేయు నరుల
భావమేమొ భక్తుడెరుగు – యానమందు వేదనలే
శాంతినిచ్చు సత్యసాయి – అనివెళ్ళిరి పుట్టపర్తి
శాంతివిషయమేమొగాని – ఫ్యాక్షనిస్టు మారణమ్ము
జాతరలూ తిరునాళ్ళును – జాతి సంప్రదాయమాయె
జాతర యాతనలన్నియు – జనులు దెలియు జగతిలోన
దేవుపేర జీవులంత – కలియువిధము కమ్మనగును
నాగరికత పెరిగిపోయి – దేవతలను మరచిరంత
దీక్షసేయ దిగులు తీరు – ననెడిమాట నిజమనియెడు
జీవుల బాధలుజూడగ – జాలిపడుట జరుగునేడు
గ్రామదేవతల పూజలు – గాడిదప్పుచుండెనిపుడు
హింస హంసమై ఎగురుచు – జనజీవము జారిపోవు
విఘ్నేశుని పూజలలో – వింత తీరులాయె నేడు
మజ్జనమున దౌర్జన్యము – కళ్ళగట్టుచుండుమనకు

అందరమిట సుందరముగ – కలిసిమెలసి యుండగాను
కలిమి కలుగు కమ్మగాను – కాంతి శాంతిరహిని వెలుగు
దూరతీరమెళ్ళగాను – మనసులోని దేవులంత
పెద్దవారు కానెకాదు – పెంపు చిత్తశుద్ధి జనుల
వరదేవులు దీనజనులు – వారిసేవ వాసిగాంచు
మానవులకు సేవసేయ – మాధవునికి సేవయగును
మనురీతిని మార్గములను – సరిజేయగ జరుగు శుభము
మనసు దేవునాలయమ్ము – మరువకుమీ మనుజులార.



అత్తటి బిత్తర చూపుల – చిత్తము మతిమంత మరుని మంతనములతో
మత్తిలి కన్నుల వత్తిడి – హత్తిన హృదయపు టందము చందము అమరము.
మగలను వగలను ముంచిన – మగువల మనసుల మాన్యత మహదాశయమే
పగిలిన అద్దపు గుండెల – మగలందు మంచి గనగా మానవహితమే.

ప్రేమలు పేలవమాయెను – ప్రేరణ గలిగించువారు పేదలె భువిలో
పేరులు పెదవులు పిలువగ – పేరిన మలినము మనసుల పెద్దదె చింతన్.
చూపుల మాటల శుభములు – మాపుల రేపుల మలినాకులమౌ చేతల్
దాపుల దారులె చెడ్డకు – ఆప్తుల ఆర్తిని దీర్చని అధమాధములే.

సినిమా చిత్రము చిత్తము – వినిమయ విగతికి మగతగు మాలిన్యవ్యధయౌ
కనగను వినగను కథగా – పనవిన దుఃఖమె పథమున ఫలరహితంబౌ!



ఆలుమగల వనిపంటగ, ఆలన పాలన మవనికి ఆరంభముగా
ఆలపనము అందముగా, అలుపెరుగని ఆటపాట నటనలు ఘటనల్.
కంటతడిపెట్టునరులును, కంటను తంటలనుగడపు కరుణామయులున్
కంటిని మంటిని మింటిని, కంటకముగ జూచు జనులు కరుణ విహీనుల్.
అన్నము బ్రహ్మము అవనికి, అమ్మను, అన్నయును అవని అనుబంధముగా
నాన్నయు నడతకు చిహ్నము, కన్నుల కనికరముండిన కాలమె కథయౌ.
కాలము గాలము కలిమికి, కాలుని కనుసన్నలందు కదలక తిరుగున్

వాలము వంకర తిరిగిన కాలము విశ్వసనమాయె కనశునకమునన్.
కోతికి కోపము వచ్చిన, జాతిని జాగృతముజేసి సమరము చేయున్
కోతల రాయుల కోతలు, కొదువలు పూర్తిని కోరక కులమును జెరచున్
నీటిని నిలచెడి జంతువు, వీటిని నిలువంగలేదు విధమది జగతిన్
మాటల మరచెడి మనుజుడు, చాటువుల చదువు మరచును సంపత్కరమే.
వినయము విజయము కోరును, అనయము అదుపాజ్ఞలందు అతనికి మేలౌ
గొనముల మనముల మనుజులు, మనురీతిని దెలిసి మసలు మహిమను మహిలో
సహనము సారము నరునకు, సహితంబున సాగు జగతి తనుసారధిగన్
వహనము సవనము వరమగు, మహదాశయ మాన్యమగును మంచికి ధరలో
పాలిడు పావన జంతువు ఫాలాక్షుని బలిమి వలన పరమార్థములై
గాలికి ధూళికి తిరిగెడు, కాలము కలవరము చెంద మనుజులె మృగముల్.
తప్పులు చేసిన వారలు, మెప్పులు బడయుచు, మేదిని మేల్తర మైనన్
ఒప్పులలోకము ఒరుగగ, ముప్పాయెను మానవతకు ముందుకు నడువన్
అందము అందలమెక్కెను, చందురుడే చిన్నవోయి చెరిసగమైనన్
అందరికలకారంబై, ముందర వెనుకల మురువుల రేరేడయ్యెన్
వీనుల విందగురాగము, దీనులదరిజేర్చు జనుని దివ్యసరాగమ్
మానవ మహితసరాగము, మానవతయె మహికి గురుతు అనురాగముగన్.
బీదల పాట్లను చూడగ, బాధయె భావము భాగ్యము భవసంతతికిన్
వేదన మదిలో మెదలగ, వేధగ నీవిలువ నిలచు కాలము వరకున్.
అంతరముల మరువంగా, ఆంతర్యముదెలియగాను అతిమధురంబౌ
చింతన చేతము గనగా, వింతగు విలువలు వెలుగును విబుధుల మదిలో.
కనబడు మానవు మరతురు, కనరానియట్టి దేవాదరణము సేయన్
వినబడు మాటల వినకను, వనచరములరీతివరలు వారలు వరులే.
కంపును ఇంపుగ జూతురు, కంపరమగుచేతలతో కాముల విధముల్
వంపగ సాధ్యము కాదది, చంపిన యాకుక్కతోక సాఫీ యగునే.
వేగము వగపున వేళల, ఆగడమునజేసి భయము అవనిని మీరన్
ఆగని ఆకాలమునకు, ఆగమమైనిగమమున్న ఆరాధ్యంబౌ.
శూరుని కెదురుగ నిలిచిన, సురకన్యయు సున్నయగునున సమరము నందున్
సరసపు చెలి ఎదురుండగ, వీర్యము కలవానికపుడు విరసంబగునే.

పేరున పెన్నిధి లేదని ప్రేరకమగు పల్కు పలికి పేదల రీతిన్
పేరుల వేరుగ పెట్టగ, పేరాసయె భువి జనగణ ప్రేమాదరణల్
నడకను నేర్పిన వారలు, నడతను జగమందునేర్పు నేర్పరులేగా
పడకను పాల్గొను రమణికి, కడకంటిని జూచు నేర్పు కలుగగ వలెగా.
బిడ్డలు భీరువులైనను, విడ్డూరము మాత బతుకు విలువల హీనం
అడ్డగ అవహేళనమున, గడ్డుల గడ్డుల గమనించగాను కనికరమహితుల్.
మానము హీనము మనిషికి, మానవతయె మరగిపోయె మహదాశయముల్
మానము నందున బుట్టిగ, మానికమై వరల వలయు మహిలో నరులున్.
అధికారమార్తి దీర్చగ, అధికారమె దీనులందు అభిమానమునన్
అధికారి అహంకారిగ, అధమము జనపాలనమున అవనిని చూడన్.
అవకాశమాయె బంధము, అవసరములు తీరగాను అదెవిడిపోవున్
మౌనము మనిషికి మాంద్యము, మౌనమె మాన్యులకు తొడవు మనుగడలోనన్.
మౌనము మునులకు ముద్దగు, మౌనము చెడుగుల చేతల మాంద్యంబగుగా.
మద్యము మునిగినవానికి, వధ్యము మంచియు మనుగడ వసుధనుచూడన్
పథ్యము లేదుగ పథమున, వేద్యము కావుగ వెతలును వేళల వరుసల్.
మదమున మనుజుడు తిరుగగ, మదగజమని పిల్తురిచట మానవుడైనన్
మదనుడు మత్తును గొలుపగ, వధియించెగ శివుడు వసుధ వాసిని బొందన్
పసిపిల్ల పలవరించిన, పసరపు మతియైన పడతి పాలకు పిలుచున్
వసివాడు సుదతి పిలచిన, వరుడైనను పరుగు లిడును వందన మనుచున్
అందము మందము అతివకు, మందమతిగలుగు వేళల మాంద్యము వచ్చున్
అందల మందున నిలుచును, పందల పాలగును పడతి పరమార్థముగన్.
తనువున మనసున తరళము, తనవారికె ఫలమునిచ్చు తరగదు భువిలో
తనపరభేదము మిగిలిన, తన తరళత తప్పిపోవు మనసును తనువున్
నాతరమాయిదియనుచును, జాతరచేయంగ జగతి జవహీనమగున్
'మాతరమే'యిది యనగా, మాతకు సంకెలలు వదలె మనభారతిలోన్.
తప్పులకుప్పలు నరులకు, ఒప్పులు మెప్పులును వరుల వసుధను నిజమే.
గొప్పలు గోలలు తిప్పలు, అప్పులె అసలైన బరువు అవధిని మించన్.
రోగాన రోజుచుండగ, యోగముగాదారి జగతి యోజన గంధిన్
యాగము తనువున నిండగ, రాగమె రామాభిరామ రసబంధురతన్.

వలపున వనితలు పిలిచిన, తలపున మరుజాడలేని తనువుల జనులున్
కలవరమందగ సహజము, కలియుగమున కామరహిత కలలే కథలౌ.
కాలము చేరువ కాగా, కలకల మగు జనమనసులు కలిమిని విడగా
కలకాలము జీవించగ, కలియుగ నరు వాంఛితముగ కందుము ధరలో
గుర్తును వీడును ధనమును, మృత్యువు చేరువకు రాగ మునిగణ మహిమన్
కీర్తిని పొందగ జూచును, కీర్తించును పరులసేవ పరమార్థమనున్.
హక్కులు బాధ్యతలన్నియు, క్రిక్కిరిసెను కాలమహిమ కీర్తిని విడగా
బొక్కసమేయిట సర్వము, వాక్కును చేతను వసుధను వరభావంబే.
మోసము మోహము మోదము, మీసరముగ మనసునెక్కెవాసిని గనుచున్
వేషము భాషయు వెగటుగ, మీసము లేనిదిగ బతుకు మింటిని చూచెన్.

ఆకలి కన్నము తినగా – ఆకారము పెద్దదగును అవని నరులకున్
సాకార సారసాఖ్యము – రాకాసిగమార వలదు రహిజనపోషా!

రామల మాటలు తేటలు – రామల చూపులె రహికి మహిమాన్వితముల్
భామల భావము దెలియగ – రామునికే దెలివి లేదు రమ్యగుణములన్.

రాముని బాణము రమ్యము – కాముని శరమెంతొ గరిత కమనీయంబున్
వేముని పద్యము వేద్యము – నామము లేకున్నగాని నవ్యము ధరలో.

వేకువ తేకువ మనుజుడు – లోకుల సొమ్మెల్లదినుచు లోభము తోడన్
కాకుల రీతిని బ్రతుకును – లేకిగ జనులందు దెలియు లేవడి మహిమన్.

వేశ్యలపొందును గోరకు – వశ్యముకాదెట్టి వ్యాధి వసుధమిగులా
వశ్యక మగు సహనముదా – నశ్వర మగురీతిదప్పు నరవర వినురా!

ఆలయ మందరికదెవి – ద్యాలయమగునిట అవధిని గురుశిష్యులిటన్
కాలము గురుతుగ గనుచును – చాలగ జ్ఞానము గొందురు సరసపు సరగున్.

అమ్మల పూజలు సేయగ – ఇమ్ముగ వేశుభములగును వెతలును దీరున్
కమ్మని ప్రేమను గాంతురు – ఇమ్మని అడుగక యిచ్చును హితమతిమహిలో.

ఆంధ్యము కనులకు గల్గిన – మాంద్యము మనసుకు గలుగని మానవుచేతల్
బంధన రహితములైనవి – వింధ్యము విధమున విలువలు వెలుగును భువిలో.

ముద్దుల ముగుదల హద్దులు – బుద్ధిని బట్టియె కలుగును భువనమునందున్
శుద్ధిని బద్ధములైనను – వద్దను మరివరపులేని వరులే కలుగన్.

రణమున రవణము వీర్యము – గుణమున గురువుల గరువము కులమున కూర్మిన్
ధనమున వినిమయ విలువయు – గణ్యము జనమనసులందు గరువాశయముల్.

చక్కని చుక్కను చూచిన – చిక్కును మనసేమొ చింత మరువగనుండన్
మక్కువ గలుగగ ఘనులా – ఫక్కున నవ్వగ వగలను మిగులుదురుర్విన్.

కథలను గాథల జెప్పిన – వ్యథలను మరువంగలేరు వెఱ్ఱులె ఐనన్
అధికార మవధి దప్పిన – వ్యధికరణము వేల్పులకును వేద్యులకైనన్.

స్వాముల పూజలు సేయుచు – బాముల పడుచుంద్రు భువిని ఘనమానవులున్
కామన విడిచిన గలుగును – నోముల పంటాయె నరుల కలుముల కథలన్.

నాగము కనబడినంతనె – ఆగము సేయుదురు జనులు అవనినిబాధన్
నాగుల పూజలు సలుపగ – నాగాభరణుండు రక్ష యనునది నిజమే.



జీవితమ్ము బాధమయము – మేధగలిగి మేలుకొమ్ము
తల్లిదండ్రి ఆస్తినీవు – తగదుర వికలాంగుడగుట.

మహమ్మారి పోలియోను – మందుతోడ మరపించగ
చుక్కమందేయించర – పక్కనుండు ఆరోగ్యము.

కాలుచేయి కన్నుముక్కు – జీవిత కథ తీరు తెలుపు
వంకటింకర బతుకులు – వాలిపోవు వాసిలేక.

నీవు పెరిగినీవారిని – పోషింతువు వారసునిగ
నీకు నీవె నిలబడకను – నిమ్నమగును జీవనమ్ము.

బిడ్డ పుట్టి పెరుగునపుడె – భయము గొలుపు పోలియోగ
ధైర్యమిచ్చి మందువేయ – దారినీకు ఆరోగ్యము.

కాలునిల్పు శక్తిలేక – కఱ్ఱపోటు కర్మజీవి
జీవితంపు పరుగులోన – జితుడె జాతి హతముగాను.

ఇతరుల దయ నీకు వద్దు – హితమతివిగ నీవుండిన
పోలియోను తరిమివేసి – పోషణమ్ము గనుము నీవు.

ఉచితముగను మందు దొరకు – వైద్యశాలలోన నీకు
వేద్యుడవుగ నీవుండిన – వెతలు దీరి బతుకుదువుగ.

దుఃఖమయము కుంటి బతుకు – దూరమగును చుక్కలతో
అంగములన్నియు సరిగా – అవతరించు అందముగా.

దేహమె దేవాలయముగ – భావించుము భయము లేక
పాలన లాలన పటువుగ – పోలియోను దాటవేయి.

వికలాంగుల విలువ గనుము – వంతలన్ని పోగొట్టుము
సకలము మానవమయముగ – చింతసేయ శివము గల్గు.

మాతలంత మరచిపోక – చుక్కమందు వేయించుము
యువతీయువకులు సర్వులు – పోలియోను తరుముదంత.



**జన్మభూమి విలువ**

జన్మభూమి చిన్నబోయింది – జాతి భవిత వన్నె దరిగింది
పథకం పథం తెలియనిదైనది – అధికారంతో అందగించాలంది
వృత్తి ప్రవృత్తి తెలియని వర్తనలో – నర్తించాలని నవ్యయువత భావం
చైతన్యం చెత్తకుండీ ఖాళీగా – చేతనత్త్వపు చేతలు చుట్టూరా
చెరిపే చేటపెయ్యల పెత్తనం – మరచే మనసున మాలిన్యం
తల్లినీ తల్లి భూమినీ తలచరా – తలపులో తపనతో తరించరా
ఆంధ్రం స్వర్ణమైతే అధికుడవేరా – ఆంధ్యం నీకందమైతే అధముడవేరా
సంస్కారం చెడ్డ జాతి చస్తుంది – సత్క్రియలే మనుజాతికి నిత్యంరా
శ్రమజీవన సౌందర్యం మాటల్లో – శ్రమజీవన సారళ్యం చేతల్లో
పెద్దవాళ్ళు వస్తే మంచిమాట చెప్తారని – అధికార్లు వస్తే అందరూ వస్తారని
అమలు జరిగే జన్మభూమి ఎవరికీ – ఎవరికో తెలియదు ఎవరిదీ కాదు
మరినీవు పుట్టిందెచ్చటనో తెలియునా – తెలిస్తే నీకు నాగరికం పొరలు కమ్మవు
తల్లిభూమిని గౌరవించలేని నీవు – తల్లిని గౌరవిస్తావంటే నమ్ముతామా.

అసలు విషయం తెలియని అధికారివి – విషయ వివరణ చేయలేని అధ్యాపకుడివి
విషయం తెలిసీ తెలియని జనప్రతినిధివి – అంతా అయోమయంలో ఉన్న పౌరుడివి
అందరూ పోగేసుకొనేవారనే అనుమానం – అందరిలో గూడుగట్టుకొన్న అతిస్వార్థం
వెరసి సరసత కోల్పోయిన జన్మభూమి – విలువలు గలిగిన విద్యార్థి తండ్రివి
తనయుడికి తండ్రిచేతలే వారసత్వం – విలువలు వీడిన నేతకు జనకుడివి
దేశభవిత నిర్ణేతల దీనత్వమిది – తల్లిచేలో మేస్తే దూడ గట్టున మేస్తుందా?
సంసారాల సారం సమాజ స్వరూపం – గ్రామాలకు వెళ్ళి నేతల నీతిని విప్పాలా
అధికార్ల అవినీతి భాగోతం ఆడాలా – యథాప్రజా తథా రాజా అనుకోవాలా
నీతి తెలియని అవినీతి నిండింది – అవినీతికి అందని నీతి నిండుకొన్నది.
నోడల్ నోటికీ వ్రాతకూ తేడా ఎంత – చిత్తశుద్ధి చిరునామా నామమాత్రమే
డబ్బున్న చోటి అధికారం అందమైంది – అధికారం ఆర్తిని దీరిస్తే అరుణారుణం
రక్తిమనుకోరిన రక్తం రాగరంజితం – శక్తిలేని శ్రమశక్తి తెలియనితనం వ్యర్థం
పెద్దల్ని ఆదర్శంగా తీసికొనే పిన్నలు – ఆదర్శాన్ని ఆదరించలేని పెద్దలు
మేళాలుగా మారే ప్రతినిధుల గృహాలు – వెలవెలబోయే అధికార్ల కార్యాలయాలు
పచ్చదనం మచ్చుకైనా కనబడని బడులు – పరిశుభ్రత పరిభ్రమించే మనగుడులు
టీములూ టీములీడర్లూ కాగితాల్లో – హేబిటేషన్ అధికార్లు క్రియలు రిజిష్టర్లో
గతజన్మభూమి వివరాలతో మతిబోతుంది
ఎవరికోసమో తెలియని ఏబ్రాసి జన్మభూమి.
కోఆర్డినేటర్లందర్లో కోఆర్డినేట్ చేసెదెవరు
ఎవరికి వారే యమునా తీరే తొమ్మిదో జన్మభూమి.
స్వచ్ఛందం ఏదో కానిదేదో తెలియని చందం
అందమైన ఆంధ్రం ఆంధ్రు జన్మభూమి అవునో కాదో!
విన్నదనం వీడి అన్నఆశయాన్ని అందుకో
అన్ని ఆశలు తీర్చే జన్మభూమిని ఆదరించు, ఆశ్రయించు.

556

పడుచుదనం పల్చబడెను – ముసలితనం ముద్దొచ్చెను
మగువ మనసు నిదురవోయి – మల్లె మగని పొందుకోరె.

తనువు తరిగి ముడతలువడె – కనుల కాంతి కాటుకాయె
కలల కలికి కరువు దీర్చ – కాలమేమొ గాలమాయె.

అధరసుధల అందములో – అహరహమును అవధిలేక
మునిగి తేలు ముద్దుమగలు – మూలబడగ మూలమేమొ.

బ్యూటీపార్లర్లలోన – బూటకమ్ము మురిపెముగా
హెన్నాతో హేతురహిత – రంగు వెంద్రుకల హంగులు.

బట్టతలకు బుట్టతలగ – భాగ్యమొచ్చె నాగరకము
నల్లరంగు నాణ్యతలను – పడుచుముసలి పథమువేరు.

తలకట్టున మొలకట్టున – తరిగి పెరిగె తారుణ్యము
పెదవిరంగు పదమురంగు – భంగించెను వంగడమును.

రూపుమాసె రుజల మహిమ – కాపుకాసె కాంతగరిమ
కాలమొచ్చి కలత నలత – వాలకమున వావి వరుస.

మానమహిమ దానగరిమ – మారుమగల మాగాణము
మారిపోయె మంట పంట – దారి చూచె ఎయిడ్సు గాను.

తంట తుడిచి పంట ఫలము – తరుణ వరుణ కిరణముగా
కంట పడగ కలికి ములికి – కాము బారి బడకు మీవు.

ఇంట పడతి ఇంపుసొంపు – హితము సతము సంభోగము
వేశ్య ఇల్లె వేదికగును – సుఖరోగము ఎయిడ్సు కోర్కె.

నరకమదియె దగ్గరగును – చొరకు మీవు సానివాడ
సంభోగము సాగించగ – అంగమునకు అంటు ఎయిడ్సు.

సోదరా! సోదరా! శోభదరుగు చుండెరా!
సోదరీ! సోదరీ! సొగసు కరుగు చున్నదీ!

బాధ ఎయిడ్సు, భయం ఎయిడ్సు – దురిత మెయిడ్సు, దుఃఖ మెయిడ్సు
చింత ఎయిడ్సు, వంత ఎయిడ్సు – వింత ఎయిడ్సు, విగతి ఎయిడ్సు.



క్రీస్తు యేసు కీర్తి గనుము రక్తధార రజిని కరము
పరుల బాధలను తీర్చగ తానె బాధపడెను గదా

సోక్రటీసు శోభమీరె శోధనమున తత్త్వమదియె
బంధనముల బాధపడగ ఇంధనమ్ము హితమతులకు
బుద్ధమతని భాగ్యవృద్ధి భూమి పతిగ భువన శక్తి
శోకమేమొ శోభనమై శుభమిచ్చెను సూక్తి నడత
గాంధి గమ్య గమనములను గాటమైన మనసు గలిగి
సర్వసమత మమతలతో సాగుమీవు జీవితమున
హితమతులకు మతము మధువు – సతతము జన సేవనమున
మతులు గతులు తప్పకుండ – సహన వహనముల సాగుము
హేతువాద హితము గొనుము – సంప్రదాయ సరగు జూడు
నాగరకత నాణ్యతలను – నవ్యభవ్య దివ్యుడవగు.

పాతకొత్త పంతమొద్దు – పావనతయె హద్దునీకు
మేలుకీళ్ళ మేలనమున – మేలెంచుము వైతాళిక.
మేధ మానవుల జాతికి – మేలుకలుగ జేయగాను
మేదినిలో వేదముగా – నీదుమాట నిత్యసత్య.
మోసదోష దూషితమై – మోదమెంచులోకజనత
హిందుమతము వందితమ్ము – బంధువగును మహ్మదుండు
జినుదు జనుడు జీససులను – బుద్ధులంత శుద్ధిగనుము.
హింస హీనమగును చేత – అసత్యమే ఆహతమ్ము
దానశీల ధరణి నీది – దాత విచట దళితులకును
నరుని బాధ తీర్చగాను – నవ్యుడవగుదివ్యుడవగు
బాధకలుగ జేయగాను – భగ్నమగును మనసులన్ని
సాటివార్ల నీవుగాను – నీవె సాటి వారికైన
నీతినిధిగ నియమ మహిత – నిత్య సత్య భరత ధాత్రి.
హక్కులగమనించు మీవు – బాధ్యత బరువును మోయుము
విధ్యుక్తము నాచరించ – విగతమగును దుర్గతులును.
వివేకమే ఆనందము – విజయుడాయె నరేంద్ర విభుడు.
దేవుడెచట నుండెననుచు – దేహి వెదకి దివ్యుడాయె.
హిందు తత్త్వసారమంత – ఇతరదేశముల కిచ్చిన
సన్న్యాసము సహనములను – సాగె యువత ఆదర్శము.

కాలమెంతొ విలువైనది - కలలోన గడపరాదు
కర్మఫలము మర్మముగని - కాంతిమార్గ మందు నడువు.
వంద యేండ్ల వసుధలోన - వరులెందరొ గమనించుము
ప్రవరుడవై పథములోన - ప్రాభవమును గాంచుమీవు.
ధనము గుణము ధారుణిలో - దహనమగుచు ధనముతోడ
గుణము మరువ గురుతు లేదు - గురువు నీవు గుణము దెలియ.
వర్తనమ్ము నర్తనమై వాసిగాంచు వసుధలోన
కళల కామితమ్ము దెలిసి కలియుగమున కదులు మీవు.
సహన సంస్కృతుల భారతి - సర్వెపల్లి ఆశయమ్ము
తత్త్వసారమతని దృష్టి - అదియె పుష్టి తెలిసికొమ్ము.
వేగవంత మాయెబతుకు - వేళమారు వేకువలను
భయపు బడిని బాధనొందు - బోధవలన విధము దెలియు.
తాత తండ్రు లార్జించిన - ధనము వెడలె వినిమయమున
వారి కీర్తి వాసి దెలిసి - వర్తించుము మంచిదగును.
కథల వ్యథల గాథలందు - చరిత్రలో గరితులైరి
మహాత్ములుగ మాన్యులైరి - తెలియుమీవు తెలివి గలిగి.
బతుకు గతుకులందు చితుకు - భాగ్యమంత భగ్నమగును
మనసు మగ్నమానవతలు - మహదాశయమని దెలియుము.
ఈర్ష్యవదలి హర్షమెంచు - కామరహిత కర్మచేయి
కారుణ్యము వరణమనీ - కాలమంత గడుపు మీవు.
సంఘ సహిత మెంచగాను - సరసుడవై సాగిరమ్ము
పౌరుషమ్ము ప్రజల కొరకు - పౌర నీవు కదలిరమ్ము.
పురుషార్థము పూజ్యముగా - పరుషవర్తనము మానుము
పరమ పురుషుడవు నీవుగ - పాలనమున పాలుగొనుము.



యువకుడా! యువకుడా! ఉద్యమించు యువకుడా!
నవత భవిత నాణ్యతకై విప్లవించు విజయుడా!

తిరుగుబాటు బావుటాల తీరు తెలియు మీవురా
జ్ఞాన సాధనమునందున జాణవుగను తెలియరా

భారతినీ భాగ్యధాత్రి భావమందు జాతీయత
ఆంధ్రమునీ అవని ఆస్తి బాట మాట భవపు దీప్తి.

మాత మరచిపోకురా మాన్యుడవే నీవురా
జాతి భవిత జాగృతిలో జయశీలము నీదిరా
అన్యాయం అణచివెయ్యి అధర్మమ్ము అధఃకరించు
స్వార్థమ్మును ధిక్కరించు స్వాతిశయమె నీదిరా.

ఆశయమ్ము ఆదిగా అవగాహన నాందిగా
ఆలోచన అతిశయించ ఆశయమ్ము పంటరా
మానవాళి మనుగడలో మానవతయె మాన్యమనీ
మనుజసేవ జగతిలోన మాధవునికి సేవయనుము.

నిర్లిప్తత నిస్తేజము నీరవమై జనస్వామ్యము
నీతి పద్ధతిని వీడెను నియమమెంచి నడువు మీవు
రాజకీయ రచ్చలోన మచ్చనీకు కలుగరాదు
కులము మతము కుళ్ళుతోడ కూర్మినీకు పనికిరాదు.

చదువుతల్లి ఒడిబడిలో సహనముగన సాగుమీవు
గురువు పరువు బరువు దెలిసి గుండె గుడిగ గుణుడవగుము.
చిత్తమంత మత్తుమునిగి – చెత్తకుండిగాను మారె
మగత మత్తు నిదురమాని – పరుల ప్రేమ పంచుకొనుము.

మనుజులంత ఒక్కటిగా – రూపుమాట చేతవేరె
మేల్కొల్పుము వారిలోని – మానవతను మరుమల్లెను
వైతాళికు లంత జగతి వైనము గమనించిరిచట
వారిబాధ బోధలన్ని భాగ్యమిచ్చు మనలకిచట.



భారతీయుడా! భాగ్యదేహుడా – ఆంధ్ర పుత్రుడా! అద్వితీయుడా!

అమరవీరులందజేసి అనుభవించనివ్వగా
ప్రతినిధులూ అధికారులు పంచుకొనుట చూడరా.

ప్రజాస్వామ్య మనగాను ప్రగతిశీలమిదిగా
ప్రవచించిన ఫలములేదు పాలనమవినీతిగా.

పౌరసరఫరాలలోన పోరంబోకులు జేరిరి
లోనులిచ్చిలోకులనూ లొల్లిజేయుచుండిరీ.
కంట్రాక్టరు ఇంజనీరు టెండరులో శాతమునూ
తెంపరులుగ తినివేయుచు జనుల సొత్తుదోచిరిగా.

ఏబదేండ్ల ముదుసలికీ ఎఱుకలేని జనపాలన
పింఛనుతో సరిపుచ్చను – బాంఛను కాల్మొక్తయనగ.
శిక్షలేని రక్షకులూ – భక్షణలో బాధతీర్చు
భావిభారతమునందున – భాగ్యయుతులు పోలీసులు.

కుంభకోణముల జాణలు – కులము మతము బలముతోడ
న్యాయవేద మంత్రులుగా – నేవళమును వీడిరిచట.

తుమ్ముతోడ ఊడుముక్కు – తురుపుముక్క సామెతగా
ఢిల్లి ప్రభుత వెల్లివిరియ – డీలు వడదె జనస్వామ్యము.
కేంద్రములో కేరింతలు – ఆంధ్రములో రైతుచావు
రంధ్రమాయె భాండమునకు – రంధితీర్చె స్వాతంత్ర్యము.

జనరాజులు భోజులిచట – భోజనమ్ము జనులసొత్తు
భోగయోగ పదవులందు – పరిఢవిల్లు ప్రజాస్వామ్యము.
నిత్యసరకు నింగినంటె – ధరవలకు దారిలేదు
బజారులోన నల్లధనము – భరత దహన ఇంధనమ్ము.

నేతలు ఉద్యోగులిచట – నేతుల నీతులు చెప్పగ
నెయ్యమలర లంచములను – అదికారపు మంచమెక్కె.
నీతియు నిస్వార్థమన్న – విశ్వసించి వినుటయన్న
విలువలేని విధముజూడ – విగతించెర జనస్వామ్యము.

తెలిసి తెంపరిగమారుము – తెగువను చూపించు మీవు
జనుల జాగృతిని గనగను – జాతిరక్ష సేయరమ్ము.



ఆకాశం అందుకొన్న ఆదిమానవా! – అనాదిని తెలియలేవు అధమమానవా!
అనాదియే వేద్యమయి వేదమాయెగా – వేదములను తెలియలేని వెధవ మానవా!
తెలివిగలుగు తెంపరులే తెలియపరచిరీ – పురాణముల కావ్యములను పూర్ణముగాను
'మతము'లేని మూఢుడైన మదపు మానవా!హితము తెలియలేవునీవు మతరహితముగా

జంతుజాల మందుబుట్టి జయము గొనుమురా
యాంత్రికమౌ జీవితమున యాతన బడకు
గెలుపునీది గేలిసేసె గేస్తులనిచట
తెరపిలేని సంభోగము తెలుపు ఎయిడ్సు.

భాగ్యాలకు అంతులేదు అంతంలేదు
భోగాలకు నిలయమేగ బాధ ఎయిడ్సు.

అందిన ఆకాశమేమొ అగాధమ్ముగా
స్త్రీపురుషుల చింతగా మిగిలె ఎయిడ్సు.

సుఖవంతము జీవితాన సాగుమానవా!
సుఖరోగము కలదిచ్చట గమనింపుమురా!
మనువర్తన సచ్ఛీలము మానవాళికీ
మాన్యమౌను జీవితమే శాంతిమయముగా!

ఇంటియాలి సంభోగం ఇంపు గూర్చునూ
అపరిచితుల కలయికయే ఆదిరోగమగునీకు
రోగమున్న రోదనమగు రోజు రోజుకూ
శక్తిహీనమగును నీకు మృత్యువె గతిరా.



అంబేద్కరు జీవితం ఆదర్శం అందరికీ
ఆశయాల భరితమది అంతరముల తుంచునదీ
మహారాష్ట్ర సమీపంలొ – మారుమూలపల్లెలో
భారతమ్ము బిడ్డడై – ప్రభవించి ప్రవరుడాయె.

కులమతాల రహితంగా – కలిమిలేమి రహితంగా
స్త్రీని గౌరవించనోడు – సిరుల మహిమ కోరువాడు

చింతలబడి వంతలబడి – చెదరిపోవునని చెప్పెను
అణగారిన జాతులంత – మేల్కొనమని హితవు చెప్పె
అభ్యుదయం సాధించగచ – ఆత్మస్థైర్యమది ముఖ్యము.
దళితజాతి బాంధవుడూ – గళితమాయె దాసత్వం
చీలిపోవు సమాజాన్ని – ఏకసూత్రమున కట్టెను
శ్రమశక్తిని గౌరవించ – చెలిమి కలిమి బలిమి గలుగు
ఐకమత్య శక్తిలోనె – భరత భవిత కలదనెను.
రాజ్యాంగపుటాదర్శము – భీమరావు దర్శకుడూ
హిందు సమాజంలోనా – హితం కోరె మతిమంతుడు
వీర'శివుడు' జనియించిన – పోతుగడ్డ మరాట్వాడ
దళిత మేధ వికసించెను – ఆశయాల అంబేద్కరు.

పోరాటం ఆరాటం – పేదపెద్ద అంతరించ
మాటబాట చేతమనసు – మానవతగ అవతరించె.
స్వార్థపరుల చేతిలోన – ఉద్యమాలు ఉరివేయగ
విప్లవాలు వికసించును – వీరవరుల త్యాగాలతొ.

వర్ణమేమొ వివర్ణమై – ధర్మమేమొ సవర్ణమై
వృత్తులేమొ వృత్తములై – మానవాళి మహిమగనును.

**భువన విజయ ప్రదర్శనామోదము**

**సీసమాలిక :**

"ప్రాసాద" భాసుర పద్యాల బాణియై – "కులపతి" వాణియె కూర్మిగూర్చు
మువ్వల సవ్వడి "మొవ్వ"కు మోదమై – "వృషపతి" పద్యమ్ము హృద్యమగును
"ఆకివీడు"నకిమ్ము అతివల "కొమ్ము"గా – "వరప్రసాదముని"చ్చు వరుని రచన
"పింగళ కృష్ణుడై" విలువల శివునిగా – శతకాల కావ్యాల శక్తి కవిత.
అభి"రామ" పదముల "ఆంజనేయుడెతాను – రచనల రమణను రహిని నిండు
"జంధ్యాల" మల్లుడై "జయకృష్ణ బాపు"గా – అల్లిన గంటము అతిశయమ్ము
"మూర్తి"యె కవిరీతి ముద్దగు మాటల – తుష్టిని కలిగించు "తుర్లపాటి"
విజయము చేసెను వినుతుడు మహితుడౌ – "జయసత్యవతి"గాను జయము గొనును.
మోహనరాగము మోదము అందించ – "సూర్యకాంతమ్మ"యె సుందరమ్ము.

ఆ.వె. "ఉల్చికోటరెడ్డి" ఉదయింపజేసెను – "పూర్ణచంద్రరావు" పూజ్యుడాయె.
భారతీయ భీమ భాగ్యమై "కృష్ణయ్య" – "మురళి కృష్ణ" చేత మోదమాయె.

– మైనేని శేషగిరి రావు,

లెక్చరర్, కందుకూరు.

557

ఆస్తికతా మానవతా – ఆస్తికొరకు అమ్మబడెను
పేదవారు పెద్దవారు ఆస్తికతను పేలవములు
అంతరంగ మహిమలోన అంతరములు వింత తీరు
రాజులంత ధనికులైరి మతమేమో మగతలోన
పేదజనులు మతమునందు పెరిగె నేడు మానవతా.

దానధర్మ కర్మలందు ధరణి జనత మతము వేరు
దోపిడీకి దోహదమై మతముచచ్చె మారణమున
మానవాళి మంచికోరి మమతపంచు మనుజులున్న
మతము మానవతకనుచును 'మౌనజాతి' మహిమగనును.

పరులసేవ పరమార్థము – ప్రాభవంపు మతములోన
హిందు మతము క్రైస్తవమ్ము – హితము మానవతకిచ్చును
దళిత జాతి గళితమైన – దారుణములు ధరణిలేవు
కులము మతము కూర్మినింప – సమతసాగు జగమంతా.

కరుణకనని మానవులకు – కఠినమతము కర్మలాయె
ఆకలి దారిద్ర్యమంత – అణచివేత అపరమతము.

అణగారిన జాతులంత – అవమానము సుంతలేక
అందరొకటి అనుకొనగా – అంతమగును అసమానత
మౌనజాతి మానవతకు – మహిమ నిడగ జనతనేడు
జాజ్జ్వల్యము జాతి హితము – మహోజ్జ్వలం మనుజు బ్రతుకు.

558

దేవుడు దేహము వీడగ – దేహి దేవులాట మొదలు
మానవత యెమరుగు పడెను – మానవాళి మమత వీడె

రాజ్య రాజకీయ మందు – రచ్చ మిగిలె రంగమందు
బీదవారి బాధలన్ని – తీరు రోజు తెలియదిచట.
పెద్దవారు పెరిగిపోగ – పేలవమ్ము మానవతా.
గ్రామభూమి భారతాన – గణ్యమాయె సంస్థలెన్నొ
దానశీల ధరణి మిన్న – దయకు థెరిస దారి దెలిపె.
భారతాన ఇందిరమ్మ – పేదవారి పెద్దతల్లి
స్వార్థరహిత సోదరతలు – శోభమీరు శుభదినమిది.

మతము హితము మరచిపోయి – హతము సతము అందగించ
హితము జనుని మతముగాను – హీనమగును హత్యలన్ని.
మంచితనం మించగాను – వంచనలను త్రుంచగాను
వసుధపంచు మానవతను – మనుజీవికి మధువు పంచు.
సేవచేసి సేదదీర్చు – సేవకులతొ చెలిమి చేయి
చేదురుచులు చెలగిపోవు – వేదనలను వెలుగు మిగులు.

559

ఆకలి దారిద్ర్యం దహించలేదిక్కడ – కడుపు మంటల కొలిమిలో కొడిగడుతున్నాయి
పాలకులే పాపవర్తనలొ – పావనతలనూ కోరుచుంటిరి
నాయకులే నయమును వీడీ – నడతకు నవ్యత నాపాదించిరి.
అరిచే కుక్కకు ఆకలి దీరగ – రొట్టెముక్కను విసరివేయగా
ఆశయాలతో ఆక్రోశించే – అన్నల గొంతులు నులుముతుండిరీ.

మార్పుకోరగా తీర్పుచెప్పెడీ – తీరులు తెలిసిన మేధావులనూ
స్వార్థ భూతమూ ఆవరించగా – స్వాగతించెనూ భేద భావమూ
దేశభక్తితో దేహమొసగిన – త్యాగ మహిమలో మహనీయులుగా
జాతి భవితనే జ్వలింపజేసీ – అమరవీరులై అతిశయులైరీ
వారిస్ఫూర్తినీ మూర్తుల చూచీ – త్రికరణమ్ములా మంచిని కోరీ
శాంతి సహనమూ మానవత్వము – మాతృభక్తికీ మహదాశయము.



అతుకుల గతుకుల బతుకుల – అలమటించు జనులారా
చితికిన మీ చేతనలో – చైతన్యం వికసించేనా!

ఆకలి కలగలిసిన ఆవేశం – ఆశయాల సాధించే ఆరాటం
సాధనలో శోధనలో సహకారం – సహనంతో సాధించే సమభావం.

చేయి చేయి కలిపి మానవహారంగా – భాయి భాయి అంటూ బాధ్యతతో మెలగగా
జన్మభూమి రక్తీ జాజ్జ్వల్యము కాగా – తెలుగు జనుల వెలుగు తేరునెక్కుగాదా.

మనసుల మాలిన్యం తొలగగ – మనుజుల వర్తన మారగ
మానవతల దీపించే వెలుగులై – మానధనులు గలదేశం మాన్యమే.

ఆలుమగల ఆదర్శం – అమరజీవు లాశయాలు
త్యాగధనుల తెగువలుగా – దయా ధర్మ ధరణి నిండు.

దానవత్వ దహనమగును – దారుణములు దళితమగును
మారణములు మరుగుబడును – అరుణోదయ ప్రభలు విరియు.



అంతులేని స్వార్ధానికి – అందరాని జీవితం
జీవితాశ అంతానికి – జీవనమే వనమయం
కాలంచాలనిదాయెను – కావరమున కర్మలలో
అంతరములతరాలలో – అంతరించె కాలమంత.

పంచేంద్రియ ప్రవరమైన మనసు విసిగె మానవులకు
మానహీన మానవుడే మరచిపోయె మానవతను
అవసరార్థ మాయె చెలిమి – బతుకు బాధ భావనలూ
యోగ్యులాయె భాగ్యమునను – యోగమహిమ భోగమాయె.

కరుణ కరణ ధరణి కలిమి – దానదయలు దారుణమ్ము
మంచి మమత మగత మత్తు – హత్తె జగతి భౌతికమున
జారిపోయె జవసత్త్వము – పారిపోయె ధైర్యమంత
మారిపోయె స్థైర్యమేమొ – మాసిపోయె గౌరవమ్ము.

రాజకీయమేమొ ముదిరె – రాజ్యమంత అంతరించె
పాలనమున పరువుపోయె – ప్రగతి విగత శీలమాయె
సుగతి సుమతి విగత విమత – సుఫలములకు చోటులేదు
సమత సరళి సరళ రహిత – మౌఢ్యమందు మాడె భవిత.

ఆదర్శము అదృశ్యము – ఆలోచన లుప్తమిచట
గహనమాయె అవగాహన – ఆశయాలు శయనించెను
ముదిరి మదుల చెరిచెనేడు – ముప్పేటగ స్వార్థమాయె
త్యజియించెను త్యాగమంత – సృజన కసలు చోటులేదు.

కళలు అమ్మబడుచుండెను – కలల బతుకు కలవరమున
కలత ఆవరించె కవుల – కలకలమున జీవితాలు
విశాలముగ విలువలతో – విశ్వభావనమ్ముగనగ
మనసుల మరుమల్లెపూలు – వికసించగ విప్లవమగు.

560

ధనం ధనం ఇంధనం – దహనానికి ఇది ధనం
స్వార్థాగ్నికి ఇంధనం – స్వయంవరపు సాధనం
అధికారపు అందలం – అదె ధనంతొ సాధ్యం.
ధనవంతుడె గుణవంతుడు – అర్థరహితుడవగుణుండు
మనసు దహన పరచింది – మానము మసిబారింది
అదె జనమున కింధనం – మనుజీవికి మహిమధనం
సృష్టిని శాసించేది – పుష్టికదే మూలమిచట
తుల లేనిది తృప్తిరహిత – తృష్ణకదే ఆది తృష్ణ
ఆశల కదె ఆలయం – ఆశయాలకది అంధం.
సృష్టిచేసినోడు – మట్టిలోన కలియు
మనుజు సృష్టి ధనమే – విశ్వానికి విలయం
అర్థంలో సామర్థ్యం – అదె మనిషికి అందమూ
స్వార్థంలో అర్థమే – సమాజాని కనర్థం
దానానికి దహనం – దహనానికి వహనం
దరిద్రతకు రతిగా – దయదారికి అడ్డం
కడుపు కొలిమిలోనా – కలిమి దహనమాయె
ధనము కారణముగా – ధరిత్రియే దమనం
దేహము దేవాలయమై – దేవుడైన ఆత్మదెలిసి
నడత నవ్యమానవతగ – దివ్యమగును విశ్వధనం.



**నల్లజాతి నేత – నవ్యభారతవేత్త.**

కొత్తపల్లి విల్సన్ – కొర్కెదీర్చు నెల్సన్
దళితులకే అండ – దరిద్రులకు కొండ
మానవతయె నిండ – తాత్త్వికతను పండ
సహకారమె నిండ – సమత మమత దండ.

అనాథలకు నాధుడు – అభాగ్యులకు ఆప్తుడూ
మహిళలకు మాన్యుడూ – మహనీయుడు మహిమనూ
అమానవుల ఆర్తిదీర్చు – ఆశయమున కన్నయ్య
భారతీయ దళితజాతి – భాగ్యదాయి యోగ్యుడూ.

అణగారిన జాతులకూ – ఆశ్రయమీ ఆలయం
దళిత జనత జాగృతికే – దానశీల సేవనం.
ప్రేమ పేరు విల్సనూ – పేదవారి విల్సనూ
కరుణ దయల విల్సనూ – కమ్మదనమె విల్సనూ.

మతం హితం మరచిపోయి – అంతరములు కల్పించగ
అంతరంగమున్నవాడు – అతని మతం మానవతగ.

మారణమై పోయె మతం – రాజకీయ దారుణముల
దానవతగ దారిలోన – దహియించెను మానవతను.

రాలిపోవు పూవులలో రాగము ఉదయించెనిచట
వాలిపోవు జీవితాలు – వాసిని వెలుగొందునిపుడు.
దీన హీన జాతులలో – దీపము వెలిగించినాడు
కరుణ దయల కాంతులతో – వెలుగు రేఖలిచ్చినాడు.

మేధావుల మేదినిలో – మేలుజాతి మానవుడూ
స్వార్థమంత వదలినాడు – పరార్థమున మరలినాడు.

మంచి మానవతలనూ – ఎంచుకొన్న నరుడుగా
అవహేళన చేయబడ్డ – అమానవుల నుద్ధరించె.

నిశిరాతిరి వేకువలో – నిమ్నజాతి నిలువనీడ
వసివాడిన జీవితాల – వరునిసేవ ధన్యమాయె.

కొత్తపల్లి వంశమూ – కొత్తదనం అంశమూ
పల్లెలోన కొత్తకోర్కె – పావనత మానవత.

కనబడని దేవుడూ – కనిపించే జీవుడూ
మానవ దైవాల సేవ – మనసే మందిరమాయె.

దీనుల దేవాలయ మిది – హీనులకిది హితకారి
ఆదరణే అందలమిచట – ఆర్తిదీర్చు ఆలయము.

సమాజమున రుగ్మతా – ఆకలి దారిద్ర్యమూ
పేద పెద్ద అంతరములు – ప్రేమలేని పెద్దతనము.

అమానవుల ఆస్థియిదీ – మానవతకు మాన్యమిదీ
సమత మమత సాగునిచట – సహకారమె ఆకారము.

భరత గాంధి భావమిదీ – మరో థెరిస మార్గమిదీ
కళలకు కాణాచియిదీ – కర్మఫలం కలిమి యిదీ.

నమ్మకమ్ము నవ్యమనీ – విశ్వాసము విలువయనీ
ఆత్మశక్తి ఆశయని – అవని జనత తెలియుదురిట.

చెఱను బడ్డ జీవితాలు – చేర్చబడెను పల్లెకిపుడు
'చెఱుకుంపాలెం' సదనం – సదయ హృదయ మందించును.



చిచ్చుబుడ్డి చిన్నదాన – విచ్చుకత్తి కళ్ళదాన
చుక్క చూపుముక్కెరతో – ముందుకొచ్చి ముద్దుపెట్టు.
చీరకట్టు జారిపోయి – చెదిరె నీది జఘనమంత
వళుల వరస వాలిసోలి – వాలకమే పలకబారె.
పెదవి కదలిపేలిపోయె – దోరవయసు దొండపండ్లు
దోచుకొన్న దొరను నేను – దాచుకొనవె సిగ్గు సిరులు.

808

మగువ మనసు మంచి పంచె – మధురమాయె మరుని విరులు
తేనెవాగు కన్నెవయసు – తేలియాడరావె పిల్ల.

ప్రాయమేమొ పదహారు – పరువమేమొ తడియారు
వయసు వలపు తలపు తళుకు – తడవు సేయతడిసిపోవు.

కొత్తకారు కోర్కెనీది – కోరుకొన్న కొలువు నాది
కోమలమౌ తనువు తపన – తీర్చుకొమ్ము తీరికిగా.

జారుపైట ఆగలేక – జాబిలితో ముచ్చటాడు
తొంగిచూచు తొలకరిలో – తోయజాక్షి పాలవయసు.

వాల్జడలో వాల్లభ్యము – మల్లెమాల సౌరభమ్ము
జడచివరన జఘనమంత – జావళీల జతుల గతులు.

మతిచెడెనీ మౌనములో – మనసు విప్పి మాటాడుము
చూపు సూదిరాయి విధము – చూడకెనా 'సుందరమ్మ'.

అందమేమొ చందమామ – అందిరాదె మనసు భామ
చల్లగాలి మల్లెపూలు – వేడి వాడి వేళ మిగులు.

ఆత్రమాయె ఆకలితో – అందించుము అధరాలను
మధుపానము మనసులకే – పాత్రమగును ఫలము ప్రేమ.

చీరమడత సిరుల పడతి – చిరునవ్వుల విరుల పంట
పైటకొంగు బంగారము – అంగమంతరంగమునకు.

సింగారపు సిరుల జంట – అనురాగపు అవని ఘంట
ఆశయాల పూలతోట – అదె మనసుల మాట బాట.

561

మానవాళి మాన్యమాయె – మహదాశయ శూన్యమాయె
విశ్వశాంతి విగతమాయె – మానవతే మరుగుబడియె.

గాంధిపుట్టిగిట్టెనిచట – గమ్యరహిత భారతమున
సంస్కృతేమొ సరసమాయె – ఆచరణమగమ్యమాయె.
వర్ధంతులు సార్థకమే – వర్ధిల్లగ మంచి మమత

సామరస్య మతములన్ని – సతమతమై విమతమాయె
భారత పిత బొమ్మలన్ని – బూజుపట్టి శిథిలమాయె
అవమానం అపహాస్యం – మహాత్మునికి మహిని నేడు
గాంధిగారి మాటలన్ని – గాలిలోన గలిసిపోయె
జాతిపితకు శ్రద్ధాంజలి – రాజకీయ రాద్ధాంతము.
బాట తీర్చు మహాత్ముడై – జాతి జనుల కదియె బాధ
అందరి మతమొకటేనని – అతనిబోధ దేవడొకరె.
రామరాజ్యమనగానె – అల్లరాజ్యమదియెగాను
త్యాగధనం క్రీస్తుదాయె – మానవతే మనమార్గం.

ఆదిగ్రంథ శుద్ధగ్రంథ – గీతసార ఖురాన్ కర్మ
త్రిపిటకాల తీరులన్ని – తీయనగును శీల జగతి.

నాగరకం నీడలోన – సంప్రదాయ చెట్టుచీడ
సహనజాతి భారతాన – చచ్చిపుట్టు భవిత వెలుగ.

ఎదురుచూచు ప్రపంచమే – ఎఱుక గల్గు భరతజనత
శాస్త్రతత్త్వవేదవెలుగు – శస్త్రమగును విమతములకు.

మనసుమంచి తెలియలేని – తెలివిగల్గు మానవునికి
అడ్డుగోడ కులము మతము – కూల్చివేయ కూర్మిమిగులు.



అహింస – అందమైన హంస – సత్యము – నిత్య జనత వాంఛ
సహనము – సామర్థ్యపు కాంక్ష – మతము – మానవహితకాంతి.

బాపూజీ ఆశయాల భారతికభివందనం
మహాత్మునికి మానవాళి అందజేయు నందనం
అనకు వినకు కనకు చెడూ – అతని మంచి మాట అదే
శాంత్యహింస సహనములే – సత్యాగ్రహముగ సాగెను.

బానిసత్వ భావాలకు – బాకు తాను భరతమందు
ఉద్యమాల కూపిరిగా – విప్లవాన ముందు నడచె.

సామాన్యుడు మాన్యుడాయె – స్వార్థ రహిత పరమార్థుడు
మాత బందిఖాన విడగ – దీక్ష దక్షతల దివ్యుడు.

స్వారాజ్యము సంభవించ – పరరాజ్యము పారిపోగ
సేవార్థము కాంగ్రెసుగను – భరతజాతి కూటమిగను.

కక్షల శిక్షలు వీడగ – రక్షణ దళితుల కిడగా
హరిజనులను నామమిడగ – అవతారము మార్చెనాడు.

విభజన విజయమునొందెను – విభులాంగ్లేయుల పాలన
'నిరాహార' నియమములను – నియతిమారె భరతమందు.

మతమౌఢ్యం మించెనేడు – మతహత్యలు మాడ్చె జగతి
కులకొట్లాటలు కూల్చెను – గ్రామ శాంతి కరువు నేడు.

మహాత్ముడే మళ్ళిరాగ – మనభారతి దర్శించగ
గుండెపగిలి చనిపోవును – మరల తిరిగి రాడెన్నడు.

ఆశయాల భారతమ్ము – ఆహరమ్ము హింసతో
బాపుమాట వినగాను – భాగ్యధాత్రి భారతమే.



దారుణం మారణం మానవతకు దహనం
మతమె మరణకారణం గణభారతి హననం
జనసేవే మతంగాను జగతి సంస్థ స్థాపించీ
జయమెంచగ జీవించెను జాతిమనదికాకున్నా
ఖండాంతర జన్మమేమొ ఖండితమై కలిమిపీడె
రక్కసి మూకల భారతి ముక్క చెక్కలగుట నిజము
మారణకాండల భారతి హారతియౌ మమత సమత
దారుణ నడతల యువతకు భవిత రణపు ఫలహారము
నెత్తురు టేరులను పారె నేవళమే నింగి కెగసె
కత్తుల కర్మల మత్తుల చిత్తము చిత్తయిపోయెను.

జాతి భావనమ్ము హతం – దేశ భక్తి హీనశక్తి
తేలికైన జీవనమున తేటదనం మంటగలిసె.

నవత భవిత భారతికే మకుటమాయె సహనశాంతి
హిందు జనత తత్త్వమంత హితమతులకు మాన్యమాయె
రాజకీయ హత్యలెన్నొ రాజిల్లెను రాజ్యమందు
చంపినోళ్ళు చచ్చినోళుప్ప చదునైరిట సమయమొచ్చి.

మూకుమ్మడి మరణాలు – ముప్పుదెచ్చు తప్పుతోడ
సంస్కృతికే తలవంపులు – సభ్యతకే మరణమిచట.

రామరాజ్య భారతిలో – రాజకీయ హారతిలో
కర్పూరము జనస్వామ్యము – అగ్గిపుల్ల ఆశయమ్ము.

మారణకాండల భారతి – దారుణముల ధర్మరహిత
గుండా తండాల సీమ – గురుతు కోలుపోవుచుండె.

భారతిపై అభిమానం – భాగ్యదాయి బహుమానం
ప్రజాస్వామ్య పరమార్థం – ప్రగతి ప్రజల మణిహారం.



అంపశయ్య గణతంత్రం – కొంపదీసె జనస్వామ్యం
రాజకీయ తత్త్వమంత – రాసిబోసె రాజ్యాంగం
రామరాజ్య మనుకొనెను – రావణ రాజ్యమ్మాయెను
కుతంత్రాలు గణతంత్రం – కూల్చరోరి తమ్ముడా.

రాజకీయ దుస్తంత్రం – ప్రతినిధులకు పరమసుఖం
వేదవెలుగు వెలమంత్రం – జనమనసుల జగమంత్రం
రాక్షసత్వ రహితంత్రం – కరుణ కర్మ భూమంత్రం
దుర్ణయత్వ దురిత హితం – దుర్గుణ జన గుణతంత్రం.

వనపాలన వాసిహితం – ధనజనగణ దాసిత్వం
కక్షల కలరవమంత్రం – శిక్షల క్షితిజనతంత్రం
మనసు విడిచి మనుజహతం – పరమసేవ ఫలరహితం
మతం హత్య విగతమతం – ఆస్తికతే అవగమ్యం.

అనుగమించు సోదరా – అవగతమగు నీకురా
కేరళాన కేరింతలు – గుజరాతున గుంపు మతం

భువనేశ్వర్ భాండమిచట – బద్దలాయె బుద్ధి విడిచి
ఊచకోత కాశ్మీరం – ఉరితీతయె భారతికీ.

మతం మార్పు మారిపోయె – హతం హాయి గూర్చెనేడు
అవహేళన అపహాస్యం – లౌకికమౌ రాజ్యాంగం
తిండిబెట్ట లేనిమతం – తెలివిమీరె హత్యలుగా.

మూకుమ్మడి మరణాలు – ముద్దుమాత ముఖం జెరిచె
కరుడుగట్టి కరగనిదై – పాడెగట్టె పిశాచమై
వద్దు వద్దు వద్దురో – మతమరణాలొద్దురో
హద్దు చూచి నడువరో – హాయి జీవనమ్మురో.

అయోధ్యలో ఆలయమ్ము – బాబ్రీలకు బాధాయెను
మధుర వారణాసిలలో – సోమనాధు సొబగు తీరు
సెక్యులరుకు శక్తిలేదు – సార్వభౌమ సారహీన
సోషలిష్టు శోషమీరె – డెమోక్రసీ డీమోక్రసీ.

రాజ్యాంగపు పీఠమేమొ – అంగవికల మాయె నిపుడు
ప్రియమైనది 'పియాంబులే' – పీనుగాయె హీనమాయె.
రాదు మార్పులేదురా – తీర్పు నీదె తెలియరా
విప్లవమ్ము నీదిరా – ఉద్యమమ్ము చేయరా
నిర్లిప్తత వీడరా – నీతి నిధిగ వెలుగరా
తప్పించుకు తిరుగకూ – తప్పుతెలిసి నడువరా.

**పల్సు పోలియో**

మితిమీరిన జనాభా నీడలో – శ్రుతి దప్పెను ఆరోగ్యము జగతిలో
గతిదప్పిన పరిశుభ్రపు జాడలో – గతమును నువు గమనించుము అవనిలో
భువిని బిడ్డ భవిత చూడ భయంలో – బాగుసేయు పల్సుపోలియోలతో
కాలుచేయి కన్నుముక్కు కలతలో – కాలమొచ్చె వారించగ ముందుకూ.

శరీరమున మనసుననది నిండును – తొలగిపోవు పల్సుపోలియోలలో
మహమ్మారి మనకు పోలియోగను – గుర్తించుము చుక్కమందువేయుము
రోగబాధ వెడలగాను శిశువులా – చికిత్సయే క్షితిని పల్సు పోలియో
ఉదయించెను 'యూనిసెఫ్' ఎదుటనూ – వెలుగుల విరజిమ్మెను పల్సుపోలియో.

వైద్యశాఖ సంస్థలెన్నొ వరపునా – ఏర్పాట్లు చేయుచుండె ఎఱుకనూ
ఉపయోగము దెలుయుడూ మీరలూ – పల్సుపోలియోల ప్రోత్సహించుడూ
కుంటి గ్రుడ్డి మూగ చెముడుకులమునా – కూల్చుమీవు పల్సుపోలియోలతో
డిసెంబరు ఆరునందు జనవరి పదిహేడునా–జరుగు 'మందు సందడి'నీ జయం చేయుడూ

మానవాళి కాపాడగ మాన్యుడా! మౌనము నివు విడువగా మేలగూ
నచ్చుజెప్పు డందరికీ నయమునా – హెచ్చు శిశువు ఆరోగ్యము భవితలో
పేద పెద్ద భేదమేమి లేదుగా – అందరిచట సములు మందు నందగా
నవతరమును నిర్మించగ సాగుడూ – యువకులార పల్సుపోలియోలకు.

ఎన్నెస్సెస్ ఎన్సీసీ కలుగగా – కళల శాల విద్యార్థులు కదలుడూ
భరత భావి నేతలంత యువకులూ – భావిపౌరులను రక్షణ సేయుడీ
శక్తివంత శరీరమున నిలువగా – బుద్ధి బద్ధముగ జేయును చుక్కలు
జాతిమొత్తమంతనేడు కదలెను – పోలియోను పారద్రోల జగతినీ.

అంతరములు మరచిపొమ్ము సోదరా – ఆరోగ్యము అంతస్థని తెలుసుకో
ఆడమగల గన్న తెలుగు పడతులూ – ఆలించుము మంచిమాట అందరూ
బిడ్డభవిత శిశువు మమత వెలుగగా – పల్సుపోలియోల రక్ష పొందుడూ
డబ్బులేమి కట్టవలదు చెల్లెమ్మా – ఉచితమైన పనియిదే ఉన్నతమూ.

అమ్మ అక్క చెల్లి వదిన మరదలా – అందరొచ్చి అందుకొనుడు మందునూ
నాన్న అన్న మామ బావ తమ్ముడూ – నవ్యయుగం దారి జూపి నడువుడూ.

**మానవ జీవిత ధనం మానవత్వ ఇంధనం**

ధనం ధనం ధనం ధరిత్రికే ఇంధనం
మనం మనం మనం మానవులకు మరోధనం
ఆశ అగ్ని రగులజేయ అవకాశము ఇంధనం
ఆశయాన్ని మండించెను అవని నేడు బుగ్గిమయం
వేల్పులంత వెతలు దీర్చ వెడలిరి ప్రతినిధులుగా
వేడుకాయెనది చూడగ వేదన వాదన గలియగ
నీతి వెన్నెముకలేకను నిమ్మిడాయె మానవుడూ
జాతిసేవ చేయగాను జయమందుము నేతలూ

మాత మాట మరచి మనగ మానవుడవు కావుగా
మానవతకు మారురూపె నాతిని నాణ్యత జూడగ
చిత్తశుద్ధి లేనినీకు చింతమిగులు విత్తముగా
ధర్మ కర్మలనుసరించ దారి దొరకు ధాత్రిలో
ఆస్తికతా నాస్తికతా ఆసలు నీకు వలదురా
ఆర్తిదీర్చు ఆలోచన అధికారము పొందరా
చుట్టుచూడు సుందరతల చుట్టమునీవగుదువూ
పట్టుదలను పాటించగ పట్టము నీదగునుగా
బ్రహ్మసృష్టి బాహ్యమైన బాధ ద్రష్ట వగుమురా
భాగ్యము ఆరోగ్యమైన భావమె మనధనమురా
హీన దీన మానవులకు హితుడవీవు వసుధలో
వారి నవ్వు చూడుమీవు వాసి నీకు వరపగు
శరణాగత రక్షణకూ చేతమునీ దగునుగా
ఆక్రందన ఆవేదన ఆదరణను తీరునుగా
ధనం దారిలోన మనం దీనహీనమైనదిగా
మనసృష్టియె ధనమనుకొని మహిని సాగవలయురా
పదుగురునీ పరమవాణి ఫలము గొనగ మాటాడుము
అదనెరుగుము అవనిలోన ఆర్ద్రత నువు పంచగా
మనం మంచి వారమైన ఊరుమంచి వాడమంచి
ధనకాంక్షను వీడుగాను ధరణి శాంతి దొరకునూ
ఒత్తిడిలో చిత్తడిలా ఒత్తిగిలెను ప్రశాంతతా
సహనములో సవనములా సాగునీదు జీవితం.



మతం మారణమ్మురో – హితం దారుణమ్మురో
హితం మతం హీనమురో – హతం ఆశయమ్మురో
రారాజులు రాజ్యమందు – ప్రజాస్వామ్య ప్రతినిధులే
అధికారుల అసలత్త్వం – అంధమాయె పాలనమ్ము
హిందువులూ – క్రైస్తవులూ – భాయి భాయి ముస్లిములూ
శిక్కుశివము హక్కులుగా – భారతమే భాగ్యమాయె.

భాగ్యనగరి అల్లరులూ – ముంబాయిలో మూఢత్వం
కలకత్తా కల్మషమ్ము – కాంతిహీన లౌకికమ్ము
పార్టీలూ పావనతలు – కూటములూ కుమ్ము దుమ్ము
జాతకమే మారిపోయె – జవసత్త్వములుడిగిపోయె.

విభజించీ పాలించుట – విభులు నేర్పి వెళ్ళగాను
మనవాళ్ళిట విడిదిచేసి – విభజన మాన్యము జేసిరి
ఉగ్రవాద మొచ్చిందిర – ఉద్యమమ్ము రూపుదాల్చె
వ్యగ్రమైన తీరుగనుము – వ్యవస్థలో వెతలు దీరు.

కలగూరగంపలాయె – కామందుల ప్రభుతలన్ని
మందమాయె 'మందు'తోడ – అల్లర్లు అపహరణలు
మైనారిటి మనువర్తిగ – మెజారిటీ మేలుకొలిపి
మెతుకుబెట్టి మతంమార్చి – మనజాతిని మేల్కొల్పుర.

సంక్షేమంక్షేమరహిత – సంక్షామం సహన గరిత
సంక్షోభం సర్వమాయె – సంరక్షక సరళి లేదు
వంతులేసి పంచుకొనుట – ఐదేళ్ళకు కాంట్రాక్టుగ
వాడువెళ్ళి వీడురాగ – వాలకమ్ము వంధ్యమగును.

జంబూద్వీపము నేడిట – జాతిమతము కొట్లాటల
జాజ్జ్వల్యము కులతగవుల – భరత భవిత భవుడెరుగును
మానవుడిగ మనెడి నీవు – మానవత్త్వమనసుగలిగి
కనగ అనగ వినగ మంచి – కలిమి బలిమి జాతి గనును.



పారాయణసేయరో – పాతపుస్తకాలను
కొత్తవింత పాతరోత – కోరుమంత కొత్తదనం
మేలుకొలుపు పాటరో – మేల్గీళ్ళిట మిక్కుటమ్ము
వైతాళిక గీతిలోన – వాసి వెలసె వసుధలోన.

ఆశయాల వీరులంత – అమరులైరి ఆశ వదలి
అహరహమ్ము జనసేవను – తరియించర నేతనీవు

చరిత తెలిసికొమ్మురా – గరిత భవిత గనుమురా
గమ్యమెంచి గమనములను – గమియించుము గరువమగును.

జ్ఞానసాగరమ్మునీవు – జ్ఞాతులంత జాణలుగా
గణతంత్రము సాగగాను – గణ్యమగును భారతమ్ము
ప్రగతిబాట వీడుచుండె – పాలన పద్ధతులన్నియు
జనస్వామ్యము జవము వీడు – జాగృతుడవు కాకుండిన.

ప్రతినిధులూ అధికారులు – పాలుపంచుకొనుపాలన
వద్దు వద్దుమనకొద్దుర – వాసిగనగ ఉద్యమించు

విప్లవాన అభ్యుదయము – ఉద్యమాన ఉన్నతమ్ము
తిరుగుబాటు తీరు దెలిసి – తెలివిగ నువు పాలుగొనుము
చలిమబ్బుల తీరుగాను – సరసరహిత పాలకులూ
వానకారు మబ్బులుగా – వసుధ పంట భరతి మింట.

విద్యవిలువ విగతవస్త్ర – మానహీన మానవతా
మహిళ మాన్యతలు సున్నలు – మగత విడుము మానవుడా
రామాయణ భారతాలు – భాగవతము భరతమందు
సంస్కృతికే చిహ్నములై – సంవాదపు సరగు దెలుపు.

పరపాలన పారిపోయె – మనపాలన మనముందుకు
జనపాలన జయము లేదు – భరత జగతి భాగ్యహీన
కోర్కె కొత్తదనం కోరు – పాతదనం పావనతయె
గతం దెలిసి వర్తించగ – గణ్యమగును భరత ధాత్రి.



ఏబదేండ్ల గణతంత్రం – గణాచారి గుణరోగం
ప్రజాస్వామ్య రాజ్యాంగం – పరపతి వీడిన భోగం
రాజ్యాంగం నిపుణులంత – రాజేంద్రుడు అంబేద్కరు
రామరాజ్యపాలనమున – రాజిల్లగ వ్రాసిరచట.

చట్టములే చుట్టములై – అర్థవంత అసమర్థులు
అధికారం అవధులలో – అధమాధమ మాయెనేడు

ఆకలి దప్పులు దీర్చగ – అప్పుల మెప్పులు గొనుచును
విశ్వసంత విలువగనిరి – భరత మాత వలవవలూడ్చి.

మాయరోగులంత నేడు – 'మందు'కొరకు మందులుగా
విజాతీయులనుగూడిరి – స్వజాతినే చంపగాను
క్రమశిక్షణ కరవాయెను – భయరక్షణ బరువాయెను
స్వర్ణభారతమునందున – నరకమాయె నరుల బతుకు.

కంప్యూటరు ఫీడు పీడ – రోబోటులు రోగులాయె
మేధ మరిగె మానవతలు – మనసు మలిన మాయె మగత
మంచి వినుట కనుటయన్న – మరుగాయెను మాన్యతలును
నాగరకము ముదిరిపోయి – న్యాయమాయె నేతిబీర.

ప్రజలసొమ్ము దినెడివాడు – ప్రభుతలోనె పరముడాయె
ధనం ధనం కలిసిపోయె – మనం మనం మడిసెనేడు
కేంద్రీకృత పాలనమున – కేవలమ్ము దోపిడీగ
కనుగొన్నను లేకున్నను – చర్యలేమొ చర్వితములు.

లౌక్యమాయె లౌకికమ్ము – పరమపారలౌకికమ్ము
దేవ దానవులు నాడట – మానవులకు మాన్యులైరి
మనుజులంత విడిపోయిరి – మనసులన్ని విడగొట్టిరి
భాగ్యరహిని యోగమాయె – భాగ్యమన్న భవితసున్న.

వందకోట్ల భారతాన – వాసిలేదు రాశెగాని
వినాశనము విలువలతో – వీతరాగ భరతమాత
రక్షదక్షుడవు నీవుగ – శిక్షనంది కక్ష విడిచి
మానవతను రక్షించుము – భరతజాతి భవిత వెలుగు.



కులమతాల కుమ్ములాట – పేదపెద్ద పెనుగులాట
మతమౌఢ్యపు నేతలాట – ప్రతినిధులకు నిధులవేట
అన్నికలిసి ఎన్నికలను ఓట్లుసీట్లు దాట్ల ఆట.

ప్రజాస్వామ్య దేశంలో – నాయకులుగ వేషంలో
పార్టీలను పరములైరి – ప్రతినిధులుగ గెలిచిరిగ
ముసుగు ప్రజాసేవగాను ముద్దునిధుల పోగుసేత
జనమధ్యకు రానెరాడు జారుకొనును వెనుకనుండి.

నిద్రపోవు వెనుకనుండి – నీతి నియతి గతులు దప్ప
ధర్మకర్మ మర్మముగా – దారి అడ్డగించు తాను
తనవారికె పెద్దపీట – పెరవారికి చోటులేదు
కులం కూర్మి మతం మధువు – మలినకర్మ మాన్యనేత.

ప్రజలపైన పన్నువేయు – తాను పన్ను లెగవేయును
నీతిపరులకొరకు జెప్పు – అవినీతియె తనదుచేత
కాంట్రాక్టులు కలవరింత – సబ్సిడీల పలవరింత
కనుసన్నల వారికిచ్చి – జాతి కలిమి మంటగలుపు.

రక్తతర్పణమ్ముసేయు – పరుల రక్తములు పారగ
ప్రజలు దేవులనుచుండును – దేవుని మోసము జేయును
స్వార్థమంత గూడుగట్టి – రాజకీయ రమ్యతలను
రాజిల్లును రహినితాను – రజిని చేయు భరతమంత.

ఆక్రమణల విక్రమమున – అవనినంత ఆక్రమించు
ఆకలి కలిపురుషుని వలలో – అంతరించు అర్థమహిమ
విశ్వశాంతి విలువగనగ – మానవతను మమతగనగ
అందరొకటియనుభావన – ఆర్తిదీర్చు అవని జనుల.



ఆశయాల లోకం – ఆదేశాల దేశం
ఆశయ విశ్వం – ఆవేశాల వశ్యం
మంత్రాలకు చింతకాయ రాలునా – తంత్రాలకు గణరాజ్యం నడచునా
స్వార్థానికి విఘ్నములే కలుగునా – స్వజాతికే స్వారాజ్యం వచ్చునా.ః

బాపూజీ భావానికి భాగ్యమా – నెహ్రూజీ నియమానికి నెయ్యమా
నేతాజీ ధైర్యానికి నాణ్యమా – ఝాన్సీమా జవసత్త్వం ధన్యమా.

గణతంత్రం మనకొచ్చీ - గడిచిపోయే దెబ్బదేండ్లు
ధనతంత్రం దరికివచ్చి - దరిద్రతను ధరణి నిల్పె.

అర్థవర్ధనమ్ములోన - ఆహుతాయె ప్రగతి ధనము
ఉన్నవారి సంఖ్య పెరిగె - లేనివారు మించి పెరిగె.

విలువలేని భరతమాయె - విశ్వసంస్థ వెలుగు పడగ
స్వయంపోషకత్వమన్న - సోమరితనమే ముదిరెను.

తెలియలేదు మనవారలు - తెలివిలోన పెద్దవారు
స్వేచ్ఛా స్వాతంత్ర్యములన్నను - విచ్చలవిడితనమనుచును.

హస్తిపురము భాగ్యనగరు - భరతముఖము ముంబాయా
తమిళనాట పులుల బెడద - ఉగ్రవాద భయంకరము.

భయంలోన భరతజనుడు - వేగంలో వెతలబడును
నవ్యయుగము నశ్వరముగ - ధన్యమనుచు ధరణి జరుగు.

ఈశాన్యం వాయువ్యం - దక్షిణాన ఉత్తరాన
క్రిందుమీదు ప్రక్కలన్ని - టెర్రరిస్టు తెగువ తెరలు.

మోసమన్న మోదమాయె - దోషమన్న దొరలతీరు
శిక్షలేక చెలరేగుచు - భక్షించును భరత భవిత.

కాశ్మీరం స్మేరమాయె - కారడవుల నక్సలైట్ల
ప్రగతి సుగతి కోరగాను - ప్రభవమగును విప్లవమ్ము.



అభ్యుదయం అంబరాన - అభివృద్ధియె సంబరాన
ఆలోచన అందలాన - అవగాహన అతిశయాన.

ఆశయమ్ము అందమాయె - అంతరంగ మహిమ దెలియు
అందరొకటి అవనిలోన - అదె భారతి కవసరమ్ము.

ఆంధ్రదేశమే - అందగించెనే - చంద్ర'బాబు'గా - అవతరించగా
సాంద్రమాయెనే - స్వర్ణ ఆంధ్రమే - స్వాగతించుదాం - స్వాతిశయమునా.

జన్మభూమి జాగృతిలో – జాతిభవిత ఆకృతిగా
జయశీలపు బాటలోన – పయనించగ ఫలం గల్గు.

గణతంత్రపు భారతిలో – గరువమందె తెలుగుతల్లి
జాతీయపు లౌకికాన – జాజ్జ్వల్యము ఆంధ్రభూమి.

మువ్వన్నెల ముద్దుజెండ – మాత కిచట మల్లెదండ
వందెమాతరమ్ము అండ – జనగణమన జాతిగుండె.

భరతజాతి భాష హిందీ – తెలుగు తేనె తేట తెలుపు
భాష భావనమ్ములందు – బలం మనం భరత జాతి.

సారే జహాసె అచ్ఛా – మేరాభారత్ మహాన్
జైహింద్ జైహింద్ – జై జై జై జైహింద్.



మానానికి అభిమానం హద్దు – భూతియె అనుభూతికి ముద్దు
అనుమానం అవమానం జంట – అనసూయకు అవియే తంట
తరగని తరంగం అంతరంగం – చెరగని చైతన్యం చేతనత్వం
భాషణ భూషణమైతే భావం భాగ్యం – సంవాదం సరసతకైతే సంబరం.

తినడానికి బతికె బతుకు తిమిరం – బతకడానికి తినే బతుకు భారం
తిరిగిరాని కాలం తీరు తీవ్రం – కాలం విలువ తెలియని జనతీరు తిరిపెం.
ఆత్మశోధన బోధనతో రాదు – శోధన సాధనలతో ఆత్మశక్తిపోదు
రెప్పవిప్పని పసికందు చలనం – మూసిన కనురెప్పలో మూల్గిన చైతన్యం.
తహతహపడే తరుణం లేదు – తాహతుకు తగిన తృప్తి ఉంటే కలదు.
లేనిది లేనిమనిషికి బతుకుభారం – ఉన్నదని తృష్ణవీడితే హారం
అరగని కూటికి ఆశపడనివారు – అరిగేంతవరకు కృషిచేసేవారు
పెరుగుదల మనిషికీ – అరుగుదల యంత్రానికీ
అరుగుదల పెరుగుదల కలది మేధస్సు
మేలిజాతి మేధస్సుకు మేదిని – తాత్త్వికతకు ఆస్థికతకు ప్రసాదిని
ఆకాశం ఆడిపోసుకుంటుంది – ఆశపోతు మానవుడు అధిగమించే సరికి
చుక్కలు లెక్కలేసుకున్నాయి – మానవుని లెక్కల్లో మరుగు పడతామని

బురద నిండిన భూమిలో – బూర్జువా తత్త్వం పండించే సామాజికుడు
మగతలో సుగతిని గాంచే మానవుడు – 'మత్తు'లో మంతన చింతన మరువడు
పసితనానికి పాలందని రోజులు – పెత్తనానికి పాలందించే పాలన రాజులు
ఫాస్టు ఫుడ్‌లు పరమాన్నంగా భావించు – పర్వంలో పరమార్థాన్ని వంచించు
గర్వానికి గండికొట్టే గార్ధభాలు – చార్వాకం చెవికెక్కని చాందినీలు
పెనవేసుకున్న బంధం పేలవం – నసలెత్తే నవలావణ్యం అతిమధురం
ఇంద్రజాలం కళ్ళను కట్టేస్తుంది – 'చంద్ర'జాలం కళ్ళను తెరిపిస్తుంది
కోర్కె కొత్తదయినా పాతదయినా – కోమలత్వం లేనిదయితే మలమే
అంటినా అంటకపోయినా పాదాలు భూమిపై మట్టిని తాకాల్సిందే
మెరిసేదంతా మేలిమి కాకపోయినా మురిపించేదని తెలియాలి
మైమరపించే మానసవేదం వాదంగా వదనానికి అందాలి.
మధురిమల హృదయాలలో మానవతగా పరిమళించే ఫలమే జీవితం.



అవకాశం ఆకాశం – అవగాహన గహనం
ఆలోచన అంధం లోకం – అవమతికే పదవుల పట్టం
ఆశయమే శయనించెనుగా – ఆర్ణవమే ఘూర్ణిల్లెనుగా
అందమె అవమానమ్మయి – విందుల వందనమాయె.

విశ్వాసము శ్వాసములోనె – నమ్మకమే వమ్మయిపోయె
తనదరికేరానిది శీలం – పెరవారిని చూపును లోకం.

మగువలకే మానం దానం – 'మత్తు'నకే అంకితమాయె
మాంసానికి హింసయె హత్తె – ముచ్చటగా కలిసెను మూడు
మూలమదే నాశనమునకు.

చిత్రాలను సింగారింపులు – ఆత్రంగా ఆలింగనములు
పాత్రతకే హీనం దుస్తులు – పావనమని భ్రమియించెనురా.

వేగానికి వేగం వాహనవేగం – భోగానికి యోగం భాగ్యం పరులది
త్యాగానికి అర్థం తెలియదు – మానవతకు ముప్పయె నిప్పుడు.

కష్టానికి ఫలితం కలగా – ఇష్టానికి హితమతి వెలగా
మృష్టాన్నం ముద్దుగ మోహం – కాష్టానికి కాలం కలియుగమే.



పల్లెవాసి ప్రవరుడా! పట్నవాసి ప్రముఖుడా
ప్రగతి బాట నడువరా! ప్రాభవమ్ము నొందరా
పరిశుభ్రత పరువకూ! పచ్చదనం పంచుమూ
జన్మభూమి జాతికంత జవము పంచు నేస్తమా!

శిశువు పుట్ట శివమెంచుము - పశువురీతి పాలించకు
పుట్టి పుట్టగానే నీవు - పల్సుపోలియో దెలియుము
అంగవికలుడైన నీవు - ఆర్తిపొందుదువు నేడు
ముందు జాగరూకుడవై - చుక్కల మందిప్పించుము.

బాధపడదు రోగపడదు - శిశువు కేమి చింతలేదు
రోగనిరోధకము గాను - రోజులకది పనిచేయును
అజ్ఞతలో మగ్నమైన - మురికివాడ ముగ్ధలనూ
విజ్ఞతతో విలుదెలిపి - కొని తెమ్మిట శిశువులతో.

చుక్కమందువేయగాను - శక్తిమించు బిడ్డలలో
పక్కబల్లెమైన బాధ - పోలియోగ దరికిరాదు
భరతజాతి భాగ్యమైన - విశ్వసంస్థ పథకమునా
వెలుగు దెలిసి విజయుడవై - పోలియోను తరిమివేయు.

డిసెంబరున దివ్యమాయె - ఆరును వరమైనదినము
జనవరిలో పదిహేడున - జరుగు పల్సుపోలియో
బుద్ధిశుద్ధి భువనమందు - బద్ధమగును శరీరమున
భాగ్యమదియె యోగ్యుడా! - పల్సుపోలియోగ దెలుపు.

తెలివిగలిగి విద్యార్థీ! - తెగువతోడ గమియించుము
పగబట్టి పోలియోను - పరుగిడునటు చేయుమీవు
జాతిజనులు సుభిక్షమై - జయశీలురు శిశువులుగా
పల్సుపోలియోను గొనగ - పటుతరమగు తరము వెలయు.

562

బాగోతం వినరండి - కాంట్రాక్టుల బాగోతం

టెండర్ల బాగోతం – తెలివిగలుగు తతంగం
కోట్లలోన ప్రాజెక్టులు – అంచనాలు ఆదిలోన
పేపర్లో ప్రకటనలూ – చేటంతగ చోటులోన
సీలుకవర్లు తేదీలో – పెట్టెల్లో భద్రమగును
తెరిచే రోజందరుండి – కలగలిసి ఆలోచన
సిండికేట్ కాంట్రాక్టుగ – పంచుకొని పనిగొందురు
ఎనభై పర్సెంటుదాక – తక్కువతో కోట్‌చేసి
ఇరవై పర్సెంటుతోడి – నూరుశాతం పనిచేతురు
ఇంజనీర్లు కాంట్రాక్టరు – ఇంపుగాను కలిసిమెలిసి
'ఎంబుక్కు'ల తప్పులెక్క – పనినాణ్యత పరముడెరుగు
ఆనకట్ట కట్టుటతో – అలసత్వం ప్రదర్శించి
కట్ట తెగగకారణముగ – మానవ లోపమ్మందురు
మాయ మోసములతోడుత – మార్గములను వేయగాను
గుంటల మిట్టలతోడా – గమ్యమె అగమ్యమగును
టెండరు వేసెడి రోజున – బెదిరింపుల పర్వములూ
తీసెడి తేదీలలోన – ఇంజనీర్ల తీర్లు ఇరులు
పెట్టుబడికి పట్టుబడి – పేదలంత పట్టువీడి
పెద్దలంత పెరుగుచుండి – పద్ధతులే మారుచుండె
నాగార్జున సాగరమ్ము – డెబ్బైఏళ్ళకుగూడ
గమ్యమునే చేరలేదు – గమనమెంచ గరళమగును
రాజకీయమైపోయెను – రచ్చమిగిలె రాజ్యమందు
పాలనలో పలుకులేక – పల్చబడెను పద్ధతులును
ఆశించుట అధికమాయె – ఆశమీర వ్యధగమారె
ధనాశలో దారుణమై – మానవాళి మరుగు పడును
భయం బాధ కలగలిసెను – బాంధవ్యం అర్థసహిత
అంతరములు ఆర్థికములు – వంతపాట జీవితమ్ము
భోగమునకు రోగమగుట – భోజనమే జనగణమన
సుఖాలతో సూక్ష్మమైన – సూర్యువెలుగు శూలమాయె
ఫోనుల్లో సంభాషణ – ఫోజుల్లో యువకులంత
రోజులన్ని రోగములతొ – రోదనతో జనులందరు.



రైతుల వ్యాపారమండి – దివాళాకు దగ్గరండి
ఆరుగాలం శ్రమియించీ – అంతంతగ పండించగ.
పంటకు ధరలేకపోయె – అయినకాడ్కి తెగనమ్మట
రైతు సంక్షేమమంటు – పాలకులా ప్రకటనలూ.
వ్యాపార పంటల్లో – పెట్టుబడులు పెట్టగాను
పుస్తెలమ్మి పస్తులుండ – పురుగులు తినిపోయెనంత.
ప్రత్తిరైతు ప్రగతిలోన – దారిలేక ఆత్మహత్య
కల్తీల మందులన్ని – కామందుల చేతలాయె.
పెద్దరైతు లందరూ – సబ్సిడీల లోన్లు పొంది
చిన్నరైతులందరికీ – చిప్పచేతికిస్తుండరు.
మోటార్లు కాలిపోవు – ఓల్టేజీ సరిగలేక
విద్యుత్తుకు విలువలూ – పెరిగిపోయె నింతింతగ.
వరిపంటను పండించగ – వర్ధిల్లుట లేనెలేదు
ప్రత్తి తంబాకు పంట – పరమాత్ముని కెరుకాయె.
పప్పుదినుసుపంటలన్ని – మిల్లువారి మేలుకోరు
తంటలేని పంటలిచట – తపనపడగ కానరావు.
నీరందని బీడులన్ని – వర్షమందుకొనగలేవు
ఆనకట్ట కట్టలేని – అసమర్థపు ప్రభుతలన్ని
పంటలభీమాలంటు – తంటలు తీరుస్తమంటె
అధికారం అందగానె – అందేదో ఉందంటరు
వరదలు తూఫానులొచ్చి – వరసగాను ఊడ్చుకెళ్ళ
సాయమంటు సరసకొచ్చి – తిరిగివెళ్ళి మరతురంత
రైతుకార్మికుల కెన్నో – రమ్యమైన పథకాలు
ఆచరణలొ అధమమాయె – వారికవసరములేదుగ
మార్కెట్టుయార్డులన్ని – వ్యాపారుల కొమ్ముకాయు
మిల్లుల యజమానులంత – లాభాలను లక్షింతురు
వెన్నెముకా రైతంటరు – వెతలు బడగ కథ జెప్తరు
గ్రామీణ భారతమున – గరువము పరువము రైతు

వినియోగం ఉత్పత్తులు – అంచనాలు అందముగా
రూపొందగ ధరవరలూ – గిట్టుబాటు ధర రైతుకు.



దేశానికి దౌర్భాగ్యం పట్టిందంటున్నారు
దేహులకే దౌర్భాగ్యం పట్టిందీ దేశంలో
నేతల మాటల్లోనా – నేతిబీరలుండెను
జాతుల మతములలోనా – జయములేని జీవనము
హింసా దౌర్జన్యాలతో – హీనమాయె జీవితం
మాఫియాల మత్తులో – మారణమిట మాన్యమూ
నగ్నదృశ్య నాణ్యతలో – నయగారం సినిమాలు
సెక్సు సిక్సరుల లోనా – నరుల ఆట నవ్యతలూ
నల్లధనం వెలికిరాదు – తెలుపు చేయు బడ్జెట్‌లూ
లోటులందు లోభపడగ – లోపమాయె ఆర్థికమ్ము
అదృష్టం దృష్టివీడె – అదృశ్యం  అందగించె
చేతమాట చేవలేదు – చేదు నిజం 'చేత'మాయె
వ్యవస్థలో వ్యస్తమైన – వ్యక్తి చేష్ట వెలుగు వీడె
సంఘమందు సమతలేక – దేశమేమొ దేవురించె.
తనతప్పును తెలియలేని – తరము నేటి యువతరం
మతహత్యలు మహికి ముప్పు – కులతగవులు కూర్చి జెరచు
జాతి వైరి జగము జెరచు – మనుజవైరి మహిని జెరచు
దేశానికి దెయ్యం పట్టిందని – దేవళంలో పూజ చేస్తే
దేవుడు దెయ్యం వదిలిస్తాడా – దేహులనిచ్చట రక్షిస్తాడా.
లేకితనం లోకంలో – పాకిపోయె పావనతగ
పాకివాడి కర్మతోడ – శుభ్రపరచు లోకాన్ని
అన్నదమ్ములవనిమించ – బంధుత్వం అందమైన
భాగ్య భారతములోనా – భక్తి శక్తి మీరునిచట
సంస్కారం వాణిలోన – సద్భావం భావనలో
సహజీవన సంగతిలో – దేశగీతి అమరమగును
సరిగమలను గమనముగా – నాదబ్రహ్మ గమ్యముగా

నవ్య దివ్య భారతమున – సప్త పదుల సరళిమారు.
వ్యక్తిదేహానికి మురికి – దేశానికి బానిసత్వమే
మనసులోని మకిల – అంతర్గత శత్రువే
మాటలలో మృదువు – మనదేశం చదువు
మహోన్నతం భారతం – మనుజుల్లో విప్లవమ్ము.



కరుణామయం – కమనీయమూ
జీవుల కారుణ్యం – ఆ దేవుని ఆశయం
సంఘజంతువై – జంతుప్రేమతో
జరిగెడి జనుడా – జయమగు నీకు
విశ్వాసపు శ్వానమూ – మార్జాలపు మార్ధవం
మనసులోని మాలిన్యం – మరుగు పరచు మానవా!
బలవంతము వంతెనా – బాంధవ్యం జీవులకూ
మనుజనుడే జంతువై – జంతు తతిని పెంచెనూ
అరణ్యంలొ జంతువు – ఆదిలోని మానవుడూ
మానవారణ్యంలో – మహిమ జీవకారుణ్యం
పశువు పక్షుల పాలన – పావనమీ ధరిత్రిలో
మమేకమై మానవుడే – మాన్యమాయె పాలకుడై
మేధల మేలిమి బతుకులు – మేలుకోరు విధము లేక
మేదినియే మధనమాయె – మేలుజాతి పశువులతో
మానమున్న మనుజుడే – మానరహిత జంతువుగా
మనసునిండు మానవతే – జంతు తతికి జయము పంచె
మానవుడే మాధవుడై – మానవాళి సేవ జేసె
మాన్యుడాయె కరుణ నిండి – జంతు విశ్వ జాగృతిలో
భాషలేని భాగ్యజీవి – భావముగను మానవుడే
అక్షరములు తెలియలేని – క్షరముకాని కరుణమయుడు.
ఆలనలో పాలనలో  ఆలోచన ఆశయములు
అమలుచేయు అధికుడే – జీవకరుణ ధరణి జనుడు
చేతిలోన దండమున్న చేవయుతుడు మానవుడే

చేతముగల చెలువుడుగా – జంతువులతొ చెలిమిచేయు
విషజంతువు హీనబలము – విలువనిండు స్నేహమందు
జంతువులూ పశువులన్ని – మానవాళి జయం కోరు
జనారణ్యమందునా – జయశీలము గల్గగా
జాంతవారణ్యమందు – మతిమంతము నీదిగా
పంచేంద్రియ పాలనలో – ప్రవరుడగును మానవుడే
వంచన నెరుగని జంతువు – మంచి మమత పంచునిచట
మనుజాతి మనుగడకై – జంతు తతులు జగమందున
కలకాలం గమియించును – గమనించుము మానవుడా!



ఆ.వె. పరమహంసలోని పరమార్థ తత్త్వము – వరనరేంద్రు మతము వాసి హిందు
కలివివేకమాయె కలిమిగా నతనికి – కామరహిత కర్మ కామితమ్ము.

ఆ.వె. భరతుడిష్టమాయె భావాన భారతిన్ – రామరాజ్యమతని రాగమాయె
భ్రాతృమాతృభక్తి భాగ్యము పితరుల – రామచరిత గరిత రమ్యతలను.

ఆ.వె. మోహనమ్ము దాస మోదమ్ము గాంధీజీ – ఆత్మ తత్త్వమేమొ అమరమాయె
సహన సహిత ధాత్రి సారమహింసగా – భక్తి నిత్య సత్య భాగ్యశీల.

ఆ.వె. తనదు పనిని తాను తపనను చేయగా – ఫలము కోరవలదు బలముతోడ
కర్మధర్మ మిచట కారణమేమైన – మర్మరహిత కర్మ మాన్యమగును.

గీ. గర్తపురి హిందు కళశాల గణ్యశాల – ప్రభుత నెల్లూరు శిక్షణ ప్రవరశాల
ఆంగ్లసాంఘిక శాస్త్రము అవని శిక్ష – పాఠశాలకు ప్రథముడు పాలితుండు.

ఆ.వె. రామకృష్ణ పరమరమణీయ హంసుడు – వరవివేకమాయె వరుని బాట
భారతీయ హిందు భాగ్యమౌ తత్త్వము – పుడిసి లించితాను పూజ్యుడాయె.

ఆ.వె. నిగ్రహమ్మునందు నియమములందును – నిగమములను జదివి సుగతుడాయె
మగత నిదురలోని మానవు మేల్కొల్ప – మాధ్యమికము వరుని మల్లెమాట.

ఆ.వె. భవము బాధ్యత సగభాగము దీరెను – ముప్పదైదు ఏండ్ల ముద్దుసేవ
సంతు చింత లేక సంతన గల్గగా – సాగుమాయు వృద్ధి సహిత సుఖము.

ఆ.వె. టైరు టూబులేని డేరగు సైకిలు – ఎక్కి తొక్కగాను అక్కడుండు
గాలిగల్గు టైరు వాలకముండగా – గమ్యమెంచి తొక్కగమన మదియె.

ఆ.వె. లేటుగాను పోను లేవడిగాడుగా – లెవలు రేబవళ్ళ లెంకతాను
సాటివార్ల దీటు సౌమ్యుడు అధికుడు – సాగె పదవులందు సరసముగను.

ఆ.వె. మంచి చెడులు నేడు మించు సాపేక్షతన్ – చేతగాని వాడె చేత చెరచు
మాట చేవగల్గు మాన్యము చేతయే – మనసు మార్దవమ్ము మానవతను.

ఆ.వె. పగలు వగలు మరచు పరసేవ తత్త్వము – కులము మతములిచట కూర్మి జెరచు
హితము మతముగాను హీనులు కారుగా – సతము సమతకోరు సారధులుగ.

ఆ.వె. వేలకొలది శిష్యవేల్పుల నందించ – కందుకూరు వాసి కమ్మనాయె
విద్యవిలువ దెలియ విజయము తథ్యము –వినయశీలమేమొ విలువ మీరు.

ఆ.వె. 'మల్లికార్జునుండు' మానవత్త్వముగల్గ, సిరిగిరిని విడిచెను సీమకొచ్చె
స్కంధపురిని నిండు విద్యల అందము – శారదాంబ మీకు శక్తినిచ్చు.

గీ. స్కంధపురి సోముడిచ్చును కలిమి మీకు – అంకమాంబయె అమరుచు ఆయువృద్ధి
షిరిడివాసుడు కల్గించు శివములెన్నో – మాత ఆరోగ్య భాగ్యము మమతనిచ్చు.

గీ. మానవత్త్వము మరువని మానవునిగ – పరులసేవను మాధవు ఫలము గొనుము
మల్లె మరులును ఖర్జూర మధువుగాను – 'రావు'నామము రమ్యమై రహిని వెల్గు
స్వచ్ఛభావము సొగసున వాక్కులుండు – భరత సింహుడు అర్జును భాగ్యమబ్బు
చౌటపాలెము జన్మము సారమాయె – ఇప్పగుంట వంశ ఇంపు మించు.



ఆ.వె. మనసు చంపుకొనుచు మనమంత జీవించ – మానవత్వమిచట మరుగువడియె
రాజకీయమంత రహిలోన వ్యాప్తమై – రచ్చచేయగాను రొచ్చుమిగిలె.

ఆ.వె. మంచిమాట చెప్పుమాన్యులు కరవాయె – చెప్ప వినెడివారు చెంతరారు
పాఠశాలలన్ని పాతాల శీలలై – నిర్వహణముతీరు నిమ్నమాయె.

ఆ.వె. హాజరిచట వేయ హానియె గురువుకు – ఉత్తరువుల విధము ఉత్తమాట
శిక్షవిడిచిపెట్టి శివమెంచు నేతలు – దక్షతనెడిమాట దాంభికమ్మె.

ఆ.వె. ప్రభుత పాఠశాల ప్రాభవరహితము – ప్రగతి గురుకులముల పాలబడియె
నెలకు వేతనమ్ము నెనరున లభియించు – పెక్కు హక్కులుండె చిక్కులేదు.

ఆ.వె. గ్రెడ్లువచ్చి బోధ గైకొనిపోయెను – టెస్టు పేపరులను వేస్టు గురువు
బెస్టు మార్కులొచ్చు పేపరు నలుపైన – మాస్టరేమొ రైట్ల టేస్టరాయె.

ఆ.వె. పైస ఖర్చులేక పైపైన చదువుల – కళల శాల లెన్నొ తెలివి గలిగి
సందు గొందులందు సాగించినడుపుచు – సరసముగను చెప్ప సరళమాయె.

ఆ.వె. చదువుకొనెడి వారు చాలగనుండిరి – చదువుకున్నవారె పదవిగొనిరి
కొన్న 'కున్న' చదువు కోరిక తీర్చెను – భేదమేమిలేక బాధ మిగులు.

ఆ.వె. కప్పదాట్ల చదువు గొప్పని తలచుచు – కూపమంత సర్వకూడలాయె
కూడుగుడ్డ గూడు కృషితోన సాధించు – నీతి చదువు నేడు నీరుగారె.

ఆ.వె. తెలివి తేలికాయె తెగువయె విలువగా – తేటదనము వీడె తేలిపోయె
కర్టెసీయె కరువు కామమె కాలము – కలత బడియె చదువు నలతనిండి.

ఆ.వె. పాలనమున పనులు ఫార్మాలిటీగను – కలియుగంబునందు కలిమివీడె
పట్టనట్టి దాయె ప్రజలపాలనము నేడు – విద్యశాలకదియు విస్తరించె.

ఆ.వె. తత్త్వసారమంత తపనను వచియింత్రు – తనువు భోగమేమొ తలతు రంత.
త్రికరణమ్ములన్ని తీరుల వేరులు – చివరి కాలమదియె చింత వంత.

ఆ.వె. చిత్తమందు హీరొ చిత్తము నిండును – అట్లెతానుగాను ఆచరించు
హత్య నిత్యమాయె సత్యమై సినిమాలు – మానవాళి చెడెను మాపురేపు.

ఆ.వె. బట్టకట్టుకొనుట భాగ్యము నాయిక – భవపు యువతులంత భరత మంత
సభ్యతలను విడిచి సాగును సరసము – సాగునదియు జగతి సవ్యమనుచు.

ఆ.వె. గాలివాటమాయె గానము రీతిన – జనుడు గాయపడెను జగమునందు
గానమేమొ కలిసె గాలిని జగమున – జనుని గాయమేమొ మానలేదు.

ఆ.వె. నీటిమూటలాయె మాటలు మధురమై – నీటగలిసిపోయె నీతిజాతి
నిధియె మధురమాయె నిమ్నము విధులాయె – విధియె రక్షసేయు విబుధ విలువ.

ఆ.వె. బీడు భూములుగను కాడాయె కలిమియు – కలతలన్ని కలల కలవరములు
నాడు కాడులిలను నాణ్యమై గణ్యమై – సవ్యమానవతను నదులు పారు.

563

ఆ.వె. కవిత వినగ జనులు కాకులై వచ్చిరి – బలిని దినగ కాకి బాధ దీరు
జనుల భావమేమొ జన్మను స్వార్థమై – ప్రజల నోళ్ళుగొట్ట ప్రగతి బాధ.

ఆ.వె. చెడెను విడెను పడెను చేతము రోతయై – చలువ చలనరహిత పల్లవముగ
విప్లవమ్ము వీడి విలువలు విగతమై – గతము హితమనుచును గమనమెంచు.

ఆ.వె. అమ్మలేనికొడుకు ఆంతర్యమేమన – అమ్మకలుగగాను ఇమ్ముసుమ్ము
మాతకలుగువాడు మానవజంతువై – ఆమె గౌరవించ డవనిలోన.

ఆ.వె. భార్య భర్త కలిసి బాధలు పడగాను – సంతు చింత దీర్తు రంతమందు
జగతి బాధలొందు జనకుల గాంచగా – నేటి కొడుకులకిట నెవ్వగాయె.

ఆ.వె. వింతసృష్టిలోని విజయమదేమిటో – విలువ వంతగాక వేరెకలదె
తాను కోరునదియె తనమది కింపుగా – తపన బడెడి తీరు దలచుడంత.

ఆ.వె. నాధులవని కలుగ నయగార మొలికించు – నవల తీరు దెలియ నవ్యమగును
నాధరహితమైన నవలాశిరోమణుల్ – నవ్యతలను వీడ దివ్యమగునె.

గీ. సుఖము భౌతికమైనది సురుచిరమ్ము – ముఖము ముద్దుల గులికిన మురిపెమగును
ఆత్మకింపగునదె చూడ ఆత్మసౌందర్యమై – అధిగమించిన అవనియే అమరమగును.

ఆ.వె. తనకు తెలియునదియె తారుణ్యమైనది – తెలియలేనిదేదొ తేటగాదు
తెలియరానిదేదొ తేటగునంచును – తెలివి కలుగు నరుడు తెంపరగును.

ఆ.వె. మండుచుండునగ్ని మండించ జనునిచే – మండనమున 'ముండ'మహిమ గాంచు
ముండ రండకైన మండించు సూర్యుడే – సూర్యమహిమ గొల్వ సూక్తులందు.

ఆ.వె. వేలకోట్ల యేండ్ల వేద్యుడై జనుడుండ – జంతునరులు జగతి జయముగాంచె
కలిని మానవులుగ కలిమిని కాంక్షించి – జంతు తత్త్వమునను జగతి నిండె.

ఆ.వె. కరుణ దయలనిచట కనకము మింగెను – ధర్మ కర్మలన్ని ధనము మింగె
మంచితనమునంత మానవుల్ మింగిరి – వంచనమున వసుధ వాసిమించె.

ఆ.వె. కాలకర్మలేమొ కలిసిరాకుండెను – ఆత్మ తత్త్వమేమొ అందకుండె
అంధకారమేమొ అధికార రూపాన – అవని నావరింప అహము నిండె.

ఆ.వె. సహనరహిత జనుని సారము హీనము – వహనమున్ననేమి వరపుగాదు
నేర్పు ఓర్పు తీర్పునేతకు ముఖ్యము – అవియె లేనివాడు అధముడగును.

ఆ.వె. దేశభక్తి లేని దేహుల వర్తన – నర్తనమ్మెకాని నమ్మరాదు
మాత జాతి భక్తి మనురీతి వెలిగించు – మానవాళి కదియె మహిమ నేడు.

ఆ.వె. పంకిలమున పంది పావనతనుగను – మురుగు జనులకిచట ముప్పుగాను
వంకదారులందు వాల్లభ్యమును గను – నరుడు పందికంటె నాణ్యమగునె.

ఆ.వె. ఎఱుకలేని ఎలుక కొరుకును బస్తాలు – నరుడు నడక జూడ నదియె పాఱు
నాశనమ్ముచేయు నవ్యమౌ మందుల – మారణమ్ము లవియె మనుజులకును.

ఆ.వె. వేశ్యజూడగాను వేవిళ్ళు నరునకు – ఇంటి పడతి జూడ యింపులేదు
కంపు ఇంపుగాను కలిమిని మారును – కాలమహిమ గనగ కలవరమ్ము.

ఆ.వె. పాలవయసు పాప పాలిండ్లు కోరును – కోర్కెతీరగానె కోమలమ్ము
పరులు దానికోర పాతకమౌనను – వయసు వలపు తలపు వసుధ వధువు.

ఆ.వె. రసము గ్రోలగాను రసికులై వచ్చిరి – సభను దీర్చగాను సరసమగునె
మొక్కుబడిగ వచ్చి పెక్కులు వినగాను – కానలేరు రసము కాకిగోలె.

ఆ.వె. నూటికొక్కడుండు కోటికి పల్వురు – కోలుపోయె కవిత కోమలతను
కాలగమనమంత కాలుని గమనమై – కఠినమైన ఎదలు కలతనొందు.

ఆ.వె. ఆవకాయ తినగ ఆకలి అధికము – మంటలోనె మహిమ మనుజునకును
గోగుకూర తినగ గోచార ఫలమేమొ – ఆంధ్రజనత కథయె అందమగును.

ఆ.వె. వేళకానివేళ వేదన బోధన – వేళ తెలియగాను వేసటాయె
వేళమీరిపోయె వేద్యమౌ విద్యలు – వాదనమ్ము వాసి బాధ గొలుపు.

ఆ.వె. మనిషి మనిషి  నిచట మమకారముప్పొంగ – కాంచలేడు గాని కలిమి గాంచు
బలిమి మానవులను బంధముల్ పెంచును – కలిమి కలతనించు కనుడు జనులు
ఆ.వె. యువత భవితలేని యూపములైరిగా – నవతరమ్మునడుము అవనతమ్ము
నవ్యయుగము మాట నాకమై నరకమై – చేవ కలిగికూడ చేత హీన.

ఆ.వె. రంగు విరుల ఝరులు రంగులు వెలిసెను – బోనసాయి తరులు బోలెడన్ని
సహజమైన దాని సంగతి మరువగా – కృత్రిమమ్ము కృషికి కృపయె కరవు.

ఆ.వె. అన్నదానికన్న కన్నది గొప్పాయె – విన్నదానికన్న విలువ కనుట
మేధలోని మాట మేలిమి మేదిని – నాదభరిత మేధ నాణ్యమిచట.

ఆ.వె. సింధువందు నీవు బిందువై ఉందువు – జీవముండెగాని జిలుగులేదు
వెలుగు జిలుగు కలుగు వేద్యుడు రుద్రుడై – వారినిధిని గూడ కరుగజేయు.

ఆ.వె. కాకికూయగాను కాకులన్నియువచ్చు – కోకిలమ్మ కూయ కొరత పక్షి
జన్మబంధమైన జగతిని గనరాదు – మానవాళి భావ మదియె గనుము.

ఆ.వె. దేవమానవులకు దేహముల్ మిథ్యయె – మధ్య జంతు తతులు వేద్యమగును
భౌతికమున దేహి బంధనముల్ వీడ – బాధ భోగరహిని భవమునిండె.

ఆ.వె. కీర్తికీర్తనమున వర్తనముఖ్యము – శక్తియుక్తి దెలియ రక్తి భక్తి
ఆర్తి దీర్చుమూర్తి అతిశయమౌనిట – అతడె దేవుడనుట అవని నిజము.

ఆ.వె. దేవుడనెడి దొక్కదేదీప్యభావము – జీవుడనెడి దొక్క జిలుగు వెలుగు
వేవెలుంగులందు వేద్యుడు దేవుడు – వెతల జీవి వెలుగు వేళమించు.

ఆ.వె. నిజము తెలియలేని నిమ్నుడు జీవుడు – నింగినేల లందు నిధులు వెదకు
నిధులు నిజముకాని విధమును దెలిగా – వ్యథను గ్రుంగు నిజము వేళ మిగులు.

ఆ.వె. విశ్వరూపు విధము విబుధులు తెలుపగా – బుద్ధిగలుగు వారు బుద్ధులైరి
శుద్ధిలేని జనులు శుంఠలుగా మారి – అందమంత జెరచి అంధులైరి.

ఆ.వె. మానవతకు మించి మాన్యము మరిలేదు – మానవాళి పంట మాన్యభూమి
మానమందుబుట్టి మాన్యుడిగా మార – మహిమ మాధవునిగ మహిని మిగులు.

ఆ.వె. విశ్వసనముగల్గు విభునియింటిది కుక్క – డాగుపేర్న జంతు డాబు మీరె
తిరుగవేయ నాంగ్ర తిరునామ భవునిగా – తెలియబడగ తెలివి తెల్లవారె.

ఆ.వె. గాడ్సె చంపె గాంధి గరువము బాపూజి – విశ్వమందు పేరు విలువమీరె
భవుడు చెప్పె గాడ్సె భంగము లేదిదై – ధవుని వాక్యమనగ ధరనె జెల్లె

ఆ.వె. అన్నమున్నవారు అన్నియు కోరగ – లేనివారి కోర్కెలేకితనము
అహము అవధిలేక అందలమెక్కగా – ఆశ ఆశమీరి అతిశయించ.

ఆ.వె. అవగుణమ్ములన్ని అటునిటు నిండగా – ఆశయమ్ము వమ్ము అవనిలోన.
అంతరంగమన్న అంతంతమాత్రమె – అంతరములు మిన్న వింత జనుల.

ఆ.వె. వెలుగులేని గుండె వెతలకు నిలయమై – మూలదాగియుండె ముద్దువీడి.
గడచె యుగములెన్నొ గమనము వేగమై – గుర్తువెలిసిపోయె గుణములేక.

ఆ.వె. గణము గుణముగాను గమ్యము మంచిదై – సహన సమరసతల సాగుజీవి.
వర్ణ ధర్మములను వాసియు వెలసెను – పొట్ట కూటికొరకు పోరు సలుపు.

ఆ.వె. కట్టకట్టినపుడె కనబడు వినబడు బలమె ధర్మమగును బతుకు కొరకు
పగలు రాత్రి దివ్వె పరమమై కన్పడు – మిగులు గుర్తులన్ని మినుకులాయె.

ఆ.వె. శక్తిరూపమాయె శమమున ప్రకృతి – వేరె దేవుడనిన వెలితి గాదె.
భజన పరులు గూడి భక్తిని చూపగా – వాక్కు గాలి గలిసి వాసి వెలసె.

ఆ.వె. చేతమందు గల్గు చైతన్యభావము – దీప్తమగును దివ్యదీధితిగను.
విధిని విలువలేని వెధవలు జగమున – హక్కులున్న వనుచు హతముకాగ.

ఆ.వె. మతము బాధ్యతలను మరచెడి మానవుల్ – మహిష బుద్ధియుతులు మహిని చూడ.
కథలు గాథలనుచు కంపరమెత్తింత్రు – మోసపూరితమ్ము మోదరహిత.

ఆ.వె. మార్పుకోరనట్టి మనుజులు మేధతో – మనుజ జాతి బుఱ్ర మట్టిజేసె.
నాదమయము జగము వాదముతోగూడి – వాసివెలసె సత్యవాక్కులందు.

ఆ.వె. గాలి గలిసిపోయె గరువము వాక్కుగా – మట్టిగలిసిపోవు మానవుండు
మట్టిగట్టిదైన మహిమయె బంగారు – ఓటిదైన నదియె ఊబి జగము.

ఆ.వె. మాట గట్టిదైన మాన్యము భూమియె – మూటమయము మాట ముద్దుగాదు
ఆటవిడుపు జగము ఆశయరహితమై – వాటముగను పారు ఓటమికిని.

ఆ.వె. మోద ఖేదములను మోజులు బూజులై – ఆట ఆశయమ్ము అన్యమగునె.
చుట్టుచూడ లేదు చుట్టాల గనలేదు – మంచి మాట వినడు మానవుండు.

ఆ.వె. చేత చేయలేదు చేతము హీనమై – కాత రత్నమతని కార్యమాయె.

కం. అక్కసుతీరిన వేళల కిక్కురుమనకుండు నరుడు కేవల వరుడే
మిక్కిలి కోపము తగదురః! వెక్కసమౌ జీవయుతుడ వెలుగును గనుమా!

కం. కోపము కోరిక కోరును – తాపము మతితనువునుండు తగవును గనుమా
మాపుల రేపుల మమతల – మాపకు మీమానవతల మానవనేతా!

కం. పేరున రాముడు శివుడును – పేలవమౌ వాక్కుతోడ పెద్దగ నిలువన్
పరువగు పదవిని పొందగ – పరమార్థము కాదు సేవ ప్రతినిధి వినుమా!

కం. వంశము అంశను నిలుపగ – వందితులౌ పుత్రులిలను వాసిని గాంచన్
వారివి చేతలు వరములు – వరపుత్రుల మేలుకోరు వసుధను నిజమౌ!

కం. అందము కానిది పొందగ – ఆంతర్యము ఒప్పుకొనదు అధికుల కిలలోన్
అందరు మెచ్చెడి అందము – అంతరువుల కిరవుగాదె అవని జనులకున్.

కం. ఆకొన్న ఆకతాయికి – ఆకులు ఫలహారమగును అన్నము గాగన్
ఆఖరుకు మృత్తికైనను – ఆకాలము జఠరదమన ఆకృతియౌగా.

కం. 'మానము' మాన్యము మగలకు – మానము మగనాలికిలను మరువము గాగన్
'మానము' మానవ జన్మకు – మానాధికమాయె భువిని మానవతతిలో.

కం. మాతల గరువము పరువము – మాతరముగ వెలసె నిచట మధురమ్మోచున్
జాతికి జనియించు భువికి – జాతక మహిమను నించును జాగృతిగలుగన్.

కం. సాగర సారము హీనము – సాగగ వైశాల్యమదియె సారతరముగన్
సాగర సస్యము సమతగ – సాగుము రానీవు జనుడ సహనము మహిమన్.

కం. వేగము భయమును వెతలును – వేకువ నిశిలోన కలుగు వేద్యులు మీరే
వేదన మదమును మత్తును – వేవిధముగ జెరచుమిమ్మువేదోద్ధారా?

కం. బాబులు బాబాలైనను – బాపును బాపూజియైన బాధలు పడిరే
బాబోయను వాక్కునబడి – బాబరులై బంధనముల బడిపోయిరిగా!

కం. ప్రకృతి వికృతి సేసెడి – ప్రక్రియలో మనుజుడుండె పరమార్థముగన్
ప్రాకృతికము వైకృతమై – ప్రాక్తనుడై మానవుండు ప్రతిభను వీడెన్.



ఆ.వె. తీక్షమైన చూపు తీరైన మాటలు – కమ్మనైన కవిత కలవరమ్మ
కోకిలమ్మ పేరు కోమల హృదయము – వరస రోజనమ్మ వాసి గాంచె.

ఆ.వె. భరత ధాత్రి భాగ్య భవనము నాయుడు – కలిమి కలక బారె కలికి దనము
వంగదేశమందు వన్నెలరాణిగా – హిందు అంతరంగ హిమము తల్లి.

ఆ.వె. అబల సబల రీతి అవనిని మారగా – రాజ్యపాలనమున రాణకెక్కె
పరుల దోలగాను ప్రాభవమందిన – ప్రగతిశీలి నేటి భారతమున.

ఆ.వె. ఇంట గెలిచెనమ్మ ఇంపగు విధమున – రచ్చగెలిచె రహిని రమ్యముగను
విశ్వదేశములను వినుతిని పొందెను – విలువగలుగు రత్న విభవమాయె.

ఆ.వె. సహనధాత్రిలోని సారమె మనయమ్మ – వహనమందు తాను వరముగాను
మహిళ మాన్యతలకు మాన్యమె చూడగా – మరువలేని మహిమ మాతసొత్తు.

ఆ.వె. జాతిస్వేచ్ఛకోరి జయమును గాంచగా – మహిళతోడు కూడ మహిమనిచ్చె
హిందు సంద్రమందు హిమకరు మహిమతో – ఉద్భవించె కమల మున్నతమ్ము.

ఆ.వె. స్ఫూర్తిపొందుడంత సుందరతలగూడి – మనసు మధువు గలుగు మమత తోడ
మానవతల మాత మనకెంతొ మరువము – అమ్మరీతి నామె ఆదరించు.

564

వానా వానా వానా – వానా వానా వలపుల వానా – తలపుల వానా
వయసుల వానా – తనువుల వానా
ప్రకృతి కృతి పరవశించె ప్రణవాకృతిగా
వర్షపు హర్షము జన అమర్షమును తొలగించెను
పుడమితల్లి పులకితమై పునీతమై పరవసించె
శాద్వల వర్ణపు శక్తికి శాశ్వతత్త్వమబ్బెనుగా
జడివానబడిలోన జాడ్యములే అదృశ్యం
చినుకు చినుకు చిత్తడియే చిత్తమునకు పుత్తడి.
విరుల వాన మరులు గొల్పి సిరుల ప్రేమ చిగురించెను
పుప్పొడి పొడివానలో ప్రేమ ధూళి పైకెగసెను
అన్యోన్యత అవనిలో అమరంలో మరుల వాన
గుండె కుండనిండుగా కురిసిన చినుకులవాన
రాతిరియే జాతరగా దినదిన మొక దివ్యయుగము
కలగనుటకు తీరికయే కరవాయెను కలియుగమున
మల్లెలు మాటున దాగిన మాటల తేటల వాన
కల్లలు కానిది ఎల్లలు లేనిది కమనీయపు ప్రేమవాన

చిగురు సొగసు వగరుకు తియ్యనిదా చెలిమి వాన
ఉప్పొంగే పరువానికి ఉరవడి సుమసుధల వాన



కలామునకు సలాము – అరుణోదయ మొలాము
భరతమాత గులాము – శాస్త్రవేత్త సలాము
భరతరత్న కలాము – భవిత దీప్తి కలాము
రాష్ట్రపతిగ కలాము – రమ్యకీర్తి కలాము
అణువు నందు కలాము – అమరముగనె కలాము
ఇంధనమున కలాము – ఇంపు దెలిసె కలాము
కలియుగమున కలాము – కమనీయుడు కలాము
సమత మమత కలాము – సరళ హృదయ కలాము
మతము దెలిసి కలాము – మానవతయె కలాము
వేదవేత్త కలాము – వాద రహిత కలాము
మూఢమతుల ముకుతాడు – ముద్దుబిడ్డకలాము
మేధలోని మేలిమినీ – మెలకువ గనె కలాము
దేశభక్తి దేవునిగా – వాసిగాంచె కలాము
ప్రయోగమే ప్రమాణమై – పరవశించె కలాము
శాస్త్రమె తన శస్త్రమై – శమియించెను కలాము
ఖండాంతర క్షిపణికీ – అండ కొండ కలాము
పంచభూతముల సాక్షిగ – పరమార్థుడె కలాము
జ్యోతిష్యము వదలెను – జ్యోతిని గనె కలాము
వేదాంతియె కలాము – వెలుగు బాట కలాము
అణువునందు బ్రహ్మాండము – అగుపించెను కలాము
భారత భాగ్య భవితలో – భానుడె జనకలాము.



అవినీతి ఆది అక్షరంగా – నీతిని తిరగేసి తింటున్నది
క్షరమైన శీలానికి సహజ రూపంగా అవినీతి అలరారుతున్నది
గాంధీ సిద్ధాంతాలు గాడిదప్పి అవినీతిలో గతుకుతున్నాయి

ధనంచుట్టూ తిరిగే మానవదేహాలు దహించిపోయే ప్రమాదం
ఋజువుకాని నేరాలు ఋజువర్తననే బూజు పట్టిస్తున్నాయి
కళ్ళులేని నల్లకోట్ల న్యాయానికి కలియుగంలో పారాహుషార్
చదువుకొన్న మేధావుల వేషం అవినీతి బట్టలతో సుందరం
ప్రశ్నతప్పు సమాధానం దొరకని నేరచట్టాల నేతిబీర తనం
నేతల అవినీతి చిట్టాలకు పట్టాలిచ్చే కమీషన్ల మిషన్లు
నేరవిచారణ ముగిసేలోగా నేరస్తులు పైకివెళ్ళి కీర్తిశేషమైన తీర్పులు
దేశమాత నమ్ముకొనే దరిద్ర చరిత్రుల జీవన వ్యాపారం నిరాటంకం
పురుషార్థాలలోని అర్థం అవినీతి అంద్దంలో ప్రతిబింబమౌతున్నది
అవినీతి కలుషిత రక్తాన్ని నీతి డయాలసిస్‌తో నిరంతరం శుద్ధిచేయాలి
కనే వినే ఊహించే సన్నివేశాల నివేశన స్థలం అవినీతే అవుతున్నది
శ్రుతిదప్పిన అవినీతికి శూలం ఆటవిక న్యాయ చట్టాలే
అవినీతి రాయుళ్ళు జీవితాంతం గుర్తుంచుకొనే గుర్తుగా శిక్షలుండాలి.
త్యాగమయ జీవితాల యోగులు అవినీతికి ఆమడ దూరం
అవినీతి అభివృద్ధి చెట్టాపట్టాలేసుకొని చైతన్య జీవులను హరిస్తున్నాయి
స్వార్థం అవినీతితో సోకుచేసికొని జీవనవనంలో మునిగి తేలుతున్నాయి.

## యుద్ధం అవసరమా?

శాంతికపోతం కాంతితో ఎగరాలని
పంచశీలతో వంచనపటాపంచలవ్వాలని
ప్రేమ, త్యాగం, జనజీవితాలకు వెలుగు ప్రసాదించాలని
కులాల మతాల కూటాల పార్టీల కతీతంగా బతకాలని
భరత 'భూత' భాగ్యవిధాతలు భావించారు.
రత్నగర్భ గర్భశోకంతో తల్లడిల్లుతున్నది
సహనానికి సరిహద్దును ప్రశ్నిస్తున్నది
చైనా, పాక్, బంగ్లాల చేదు అనుభవం గుర్తొస్తున్నది
కాశ్మీరం కశ్మలమై కర్కశమై అక్కసు వెలి గ్రక్కుతున్నది
భరత వర్తమాన రాజకీయులు యుద్ధ రభస చేస్తున్నారు
కార్గిల్ యుద్ధం కరుణను వర్షించింది
మారణహోమం మానవత్వానికి మచ్చయ్యింది

ఆర్థికంగా కృంగి హార్థికంగా అభినందన అందింది
పేద దేశానికి పెద్దయుద్ధం పెనుప్రమాదం
నేతల మాటల కవ్వింపులు కఠోరత్వానికి కాల్దారులు
అమెరికా అంతర్జాతీయం వింత అంతరాల విలువల్ని పంచింది
అప్పుల కోరికతో తప్పటడుగులు వేసే తిప్పలు సంభవించాయి
కోట్లాదిరూపాయల వెచ్చింపు వెనుక కోరిక ఏముందో
సామాన్యుడి సణుగుడు సంగతి రాజకీయ గతిని మారుస్తుంది
కాల్పుల, వలసలు, బలిదానాలు, ఆజాద్ కాశ్మీరుకవాంతరాలే
రాజకీయం ప్రక్కకు నెట్టి రాజనీతితో శాంతిమార్గాన్ని వెతకవచ్చు.

**ఈ దేశానికి వేదాంతులు కావాలి.**

ఎప్పుడో పూర్వం ఎవ్వరో ఒకరన్నమాట – నిజమేనా – సహజమేనా – జరిగేనా?
ఇద్దరు వేదాంతులు – కవి శాస్త్రవేత్త
యోగభ్రష్టులొకరు – అణువు ఆంతర్యమెరిగిన వారొకరు
'వాదాంతులు' కారాదు – శస్త్రజీవి కారాదు
మానవత్త్వపు మల్లెపూలు గుబాళించినవి – సౌగంధ్యం సోదర మానవాళికి అందాలి
సమానత – మాననీయత – సాగివచ్చాయి
ఆగిపోరాదీ అసమాన సంగమ సౌగంధ్యం
భయం – బాధ పెల్లుబుకుతున్న పౌర సమాజానికి
అపార మేధస్సుతో ఊరట నందించాలి
రెండు మతాలకు రెండు ధ్రువాలు
అతల్ బిహారీ వాజ్ పేయి – అబుల్ ఫజల్ జలాబ్దీన్ అబ్దుల్ కలాం
ప్రజలే బంధువులు – రక్తసంబంధీకులే బంధాలు
ప్రజా రక్త సంబంధీకులై ఇద్దరూ ప్రగతి శీలురు కావాలి.
'వేదం' జ్ఞానం వేదాంతం జ్ఞానాంతం.
అంతాన్ని అవలోడనంచేసి జనావళికి సుంతైనా 'శాంతి'
'కాంతి' ప్రసాదించాలని ఆశ, ఆకాంక్ష, ఆశయం.



సంప్రదాయ సరళిలో – ఆస్తికతా అంచులో

అమరులైన యోగులు – అందరికీ పూజితులు
గ్రామదేవతాచారము – గణ్యమైనదీ నేలను
తిరునాళ్ళను తీర్థములను – సార్థకమయె ఆంధ్రభూమి
బుద్ధుని వచనాలతో – బుద్ధిపండె జనులకిచట
నాగార్జుని నవ్యతతో – దివ్యమాయె తెలుగునేల
హాలుని సప్తశతీ – అందించెను అమరకథల
వేదమతం వెలుతురులో – విభవమంత విజయులదే
రాజులు రారాజులంత – రమ్య కీర్తులైరిచ్చట
పల్లవ చాళుక్యులిచట – పల్లవముల పండించిరి
కాకతీయ రెడ్లందరు – కళలకు కాణాచులైరి
జనావళికి అందించిరి – జాతీయత దేశభక్తి
రాయల రసరాజ్యంలో – రమణీయంగణనీయం
దిగ్గజాల దిటవు కవిత – దేదీప్యము దివ్యము
ధర్మరక్షణార్థమై – కర్మకరణ దక్షులై
దీక్షతోడ రక్షించిరి – దివ్యత్వము తత్త్వము
మతము వేరు వేరైనా – మనసు మాట మహిమ ఒకటె
కర్మలెన్ని చేసినా – మర్మము మనజీవనమే
కులమతాల కుళ్ళులో – పడిపొర్లకు పందగా
అన్నిటి సారము ఒకటె – అదియె మానవత్త్వము
మానవుడే మాధవుడు – మహిని మహిమ అలవడగా
అనుభవమే గురువుగా – ఆస్తిక్యము నందుకో.



ఆ.వె. తిక్కవరపురెడ్డి తీయని శాలలో – సేవకొఱకు చేరి సేదదేరి
మెట్టు మెట్టు నెక్కి గట్టున జేరెను – గణ్యుడైన నరుడు కృష్ణమూర్తి.

సీ. వంశము దాసరి వర్ణము యాదవ – కృష్ణుని నామము కూర్మి పెంపు
విధ్యుక్త ధర్మము విలువల విజయము – వినయము అనయము విద్యనింపు
ప్యూను పదవినుండి జాణతనముతోడ – సూపరింటెండెంటు శుభము పంచు
వర్కువిక్రముడాయె వ్రాతలో వరుడాయె – అధికార్ల మెప్పుకు అదియె మించు.

తే.గీ. సేవముప్పదియైదేండ్లు చేవనించె – తృష్ణ మితముగ కృష్ణయ్య తృప్తి నెంచె
కాలగమనమ్ము కలవరకలితమైన – పదవి విడుచుట ముందాయె పథముగనక.

తే.గీ. కందుకూరున మొదలయ్యె అందముగను – ఉలవపాడున ఉద్యమ ఉధృతిగను
ఆంజనేయుని అద్దంకి ఆస్తిగాను – విడవలూరున విజయుడై వినుతిగాంచె.

ఆ.వె. కళలశాల చరిత కథగాను మిగిలెను – కాంతి చీకటయ్యె కర్మమహిమ
విధులు బధిరమయ్యె నిధులు నిత్యమ్మాయె – నిలువలేని రీతి నిష్క్రమణయె.

తే.గీ. అన్నరీతిని ఆదరప్రాయుడయ్యె – తమ్మునిగ తాను తరళము తనువులకును
రూల్సు రూఢిగ నెఱిగిన రోచనుండు – మంచితనమున సాగెడి మనజుడితడు.

తే.గీ. బాధబోధగ భావించు భాగ్యకరుడు – సాధనమ్మున శోధించు సాహసుండు
అనుభవముతోడ అతిశయ అందమతడు – సఫల జీవన భావాన సాగువాడు.

తే.గీ. ఇరువదేడుల సఖ్యము హితము పంచె–మతము మమతగా సాగెను మనకు మధ్య
కలసి కమనీయ కాలాలు గడిపినాము – కలయు నిజమును కలిసెను కమ్మదనము.

ఆ.వె. తనువు తపనపొంది తనయులు తనయుడై – తరియజేసె నిన్ను మురియజేసె
భార్య భాగ్యమయ్యె భవతారకమ్ముగా – మనుమలైరి మరియు మనుమరాండ్రు.

ఆ.వె. కలము చేతిలోన బలము మేధను కల్గ – భావిపంచు మీకు భాగ్యగరిమ
కోర్కెతీర్చుకొన్న కోమలహృదయము – కమిలిపోదు ఇలను కలనునైన.

ఆ.వె. మీదు నమ్మకమ్మె మీకెంతొ దార్ఢ్యము – వమ్ముచేయబోకు వాసినించు
సీటు విడినగాని సిరిగల్గు హృదయాన – బ్రహ్మభాగ్యమిచ్చు భవము పండు.

తే.గీ. కన వికారము దూరమై కలియుగమున – తత్త్వబోధలు పంచును తరళతలను
కృష్ణ అవతార మహిమలో తృష్ణ గల్గ – ఆస్తికత్త్వము మీకిచ్చు అమర సుఖము.

ఆ.వె. కందుకూరు తల్లి కమ్మని సుఖమిచ్చు – స్వంత ఇల్లు మీకు కాంతినిచ్చు
మిత్ర బంధు తతులు పాత్రతనందించు – ఈశ్వరీయ విద్య వశ్యమగుత.

క్విట్ ఇండియా – విట్ ఇండియా
విట్‌నెస్ విలువే – విదేశాల పయనం
త్యాగమయం – క్విట్టిండియా
భోగమయం – విట్ ఇండియా

గాంధీని బ్రాందీతో – కలిపి తాగేశాము
కలలురాని మత్తులో – కలవపడి ఉన్నాము
పటేల్ గారి పటాన్ని – గోడకు తగిలించాము
దీనంగా హీనంగా – దిటవు వీడి చూశాడు
నేతాజీ తాజాగా నేతల మదిలో మెదిలి
ఉగ్రవాద ఉధృతిలో – ఎన్‌కౌంటర్స్ ఎగద్రోసిరి
తెల్లవారు పరుగెత్తిరి – తెగువ భారతీయులది
నల్లవాళ్ళు నాయకులై – వల్లకాడు చేస్తుండిరి
పదములెన్ని మార్చినా – పదవులేమొ పదిలము
సేవలోని సంస్కారము – సేవు చేసికొనుటయె
అగస్టస్ ఆగష్టున – హర్ష వర్ష శార్ద్వలము
భువి బృందావనముగా – భావించుటె భాగ్యము
వైవిధ్యము వైభవమని – వైధవ్యము పొందిరి
ఐకమత్య ఐడియా – అసంభవం భారతిలో
నేతల అవినీతి చిట్ట – చిత్రగుప్త లిఖితమే
అధికారుల ధిక్కారము – యమకింకగ కైంకర్యము
క్విట్ నేటి డీమోక్రసి – సేవ్ అవర్ ఇండియా
రాజకీయాన్ని క్విట్ చేయండి – రామరాజ్యాన్ని కాంక్షించండి.

**రేణుకా మదనులకు అక్షరాక్షతలు**

ఆ.వె. వెన్నపూస యింటి వెలుగు రేణుక – మదన మోహనునికి మాన్యమాయె
రెడ్డి వంశమందు రేచుక్క రీతిగా – కాంతిపంచుగాత కమ్మగాను.

సీ. నెల్లూరు జాణకు నేర్పరి రాణిగా – నెవ్వగల్ తీరును నేటినుండి
ఇంజనీర్ విద్యల ఇంపగు జంటగా – పంట పండించుగా పావనతను
అమెరికా ఆంధ్రులు అందమై బంధమై – అమరమురీతిని అమరుగాత
మంచిని పంచెడి మానవత్వానికి – మించుగ మీరలు మించుగాత.

ఆ.వె. వధువు వరులు మీరు వాసిని పంచగా – భావి జీవితమ్ము భాగ్యమగుత
తల్లితండ్రి తాత తరియించురీతిగా – వర్తనమ్ము మీది వరపు గనుత.

ఆ.వె. సాఫ్టువేరు నకును సాంగత్యమబ్బెను – ఇంజనీరు మహిళ హితముగాను
ధనము గుణములందు దాతృత్వమాయెను – మనసు కలిసె మమత మహిని నిజము.

ఆ.వె. గురువుగారి బిడ్డ గుర్తించు వినయము – రాజకీయ వంశ రాజు తాను
ఆస్తులెన్ని గాని ఆప్తతముఖ్యము – అందమాయె నదియె బంధముగను.

ఆ.వె. కందుకూరునందు కలిసిరియిద్దరు – కలిసి కష్టములను కామితముల
అనుభవించుడయ్య ఆరోగ్యభాగ్యాల – పెండ్లి ఫలము ప్రేమ పేరుగాను.

ఆ.వె. రాణికనులు మీకు రమ్యత పంచును – రాణి వాక్కు మీకు రసము పంచు
రేణుకమ్మ మీకు వేణువుగా మారి – రాగసుధల దేల్చు రహిని సతము.

ఆ.వె. సప్తపదియె మీకు సరసత నందించు – ఆప్తవాక్య సరళి ఆర్తిదీర్చు
సప్తవర్ణ రీతి సాంద్రమౌ కిరణమై – మీదు పెండ్లి మిగులు సాధురీతి.

ఆ.వె. మూడు ముడులు వేయ ముద్దుల బుద్ధులై
మూడులోకములకు ముచ్చటగుత
త్రికరణముల యందు తిరునామ మంత్రమై
యాంత్రికంపు జగతి యశముగనుత.

ఆ.వె. పేరు పేలవమ్మె ప్రేమలు మించగా – మనసుకల్ల రూపు మచ్చయేగ
రాగరాజ్యమందు రాణియు రాజుగా – భోగభూమి మీకు భోజనమ్ము.

ఆ.వె. పంచభూతతతియె పరవశమందగ – పంచ యింద్రియాలు పావనములు
పవలురేయి కల్గు పంచాంగ ప్రవణత – ఫలము కల్గజేయు కాలములకు.

ఆ.వె. మాలకొండ తాత మనుమడవైనీవు – రాణి మనుమరాలు రసన మించి
పెద్దవారిమాట శుద్ధిగ గ్రహియించి – శుభము నొందుమయ్య సుందరతల.

ఆ.వె. జ్ఞానయోగమందు గణ్యత కలదంద్రు – పదవి చదువులందు ప్రాభవమున
మానవత్వయోగ మహిమను గాంచగా – విశ్వవిలువలన్ని వశ్యమగుత.



తరతరాల అణచివేతకు తర్పణంగా – దళితులకూ దరిద్రులకూ ఇచ్చే రాయితీలు
వారికి పెట్టే అన్నంలో ఇచ్చే ధనంలో వాటాల వేటగాళ్ళు
సంక్షేమం అధికారుల సంక్షామమై ఆహరణోద్యోగంలో అందరూ

కుంభకోణాల కుప్పతెప్పలు, విచారణ చారణుల వింత విలువలు
అడుగు నుంచి ఆకాశందాకా అవకాశం చూచుకొనే రాజకీయులు
అందిన గంజే పరమార్థమనుకొనే అమాయకుల అంతరంగాలు
వార్డెన్‌లు దళిత బాలుర పాలిటి 'డెన్' లుగా పరిణమించారు
మలుపులెన్ని తిరిగినా తలపులో స్వార్థం నిండితే లభించేవి ఎండమావులే
ప్రజలధనం పంచదారగా దాచుకొనే చీమలు కుట్టగానే చావవు
వెతికి వెతికి వేసారి వేటువేసే లోపలే నల్లకోట్ల నయవంచనలు
మ్రింగి జీర్ణించుకొని త్రేన్చేవరకు మీనమేషాలు లెక్కించే పరిస్థితి
ప్రజల మరపో నిర్లిప్తతో మరేదో కాని ప్రశ్నించే తత్త్వం కరవైంది
అవినీతి అడ్రస్ ఆకాశహర్మ్యాల్లో అవకాశవాదుల అంతరంగాల్లో నిండివుంది
పర్సెంటేజీ సెటిల్ మెంటుల్లో సెంటిమెంటుల్లో 'మెంట'లయింది
పగటి దొంగల పట్టివేతకు సగటు శక్తిచాలక సతమత మౌతున్నారు
వివక్షతో శిక్షపడదు, రక్షణకు రక్షక భట రాజకీయుల తోడ్పాటు
కాలం గడిచి కనుమరుగైపోయే నేరచిట్టాలు పౌరుల విధివ్రాతలు
ఆయాకులాల ప్రాతినిధ్యంవల్ల అధికులైనవారే వారి వారి కులాల కన్యాయం చేస్తున్నారు.
ఆటవిక, ముస్లిం తెగలనేర చట్టాలే అన్యాయానికి సరైన శిక్షలు – మైనేని శేషగిరిరావు.



మంత్రాంగం – యంత్రాంగం – తంత్రాంగం – కంత్రీలమయం
పదవుల్లోని నేరచరితుల పదనుకు అదననేది లేదు
హననంలో ఆహరణంలో క్రూరత్వంలో కుటిలత్వ కూటమి
'మీడియా' జనహృదయానికి మిక్కుటమైన ఆలోచన నందిస్తున్నది
దారుణకృత్యాలకు దాక్షిణ్యం పంచే ధనవంతుల మాటల తంతు
ప్రజాధనం ప్రతినిధుల ముల్లెగా భావించి శాసించే అధికారగణం
లొసుగుల చట్టాలలోభత్వం మన శాసన కర్తల పాలిటి వరం
మాఫియాల సారాజుల మోసకార్ల మోదానికి మొదటిమెట్టు రాజకీయం
ఐదేళ్ళకు మార్చే అవకాశ మొచ్చినా అంతఃకరణాల వింత రణం
జనగణ విభజనతో జయం పొందుతున్న జాతినేతల రాత మార్చేరోజెన్నడో
అయిష్టం, ఆక్రోశం, అవరోధాలతో అవతల పారేస్తున్న ఓట్ల తతంగం

కంప్యూటర్ కరుణతో కార్యకారణాల విశ్లేషణ నెట్ వర్క్
చట్ట సభహామీలు సందట్లో సడేమియాగా జాతర చేస్తున్నాయి
కొత్త కొత్త పథకాల చిత్త చాంచల్యంలో మైమరపు 'మత్తు' పంపకం
వడ్డీలు తీర్చలేని అప్పులకుప్పల తిప్పలు ఆంధ్రజనత కురిత్రాళ్ళు
'వార్' తో చర్చల వాల్లభ్యం వాసి కల్గిస్తుందని వరమంత్రుల ఉవాచ
పోలీసుల చేతుల్లో పోకచెక్కగా మారిన ప్రజాస్వామ్య పాలన ప్రగతి
కసాయి చేతి కత్తిలా మారిన 'పోటా'ల పోకడ కడ.
పెద్దనేరాలకు శిక్షపడక పేలవంచేసి పేరుపొందే మాననీయులు
పారదర్శకత దర్శించరానిదై, నిబద్ధత బద్ధకమై నిత్య సత్యజీవనం చేస్తున్నాయి
మంత్రుల మాయ, యంత్రాంగం యావ స్వార్థమయమై శోభిస్తున్నాయి
ఉద్యమాలను దమించే దమననీతి ఉన్నత వర్గాలకు ఊతమై నిలిచింది.
అడివి బతుకుల చీకటి వీడిన నాడు తూర్పున తుపాకి కిరణోదయ మౌతుంది
అరణ్యంలో ఎదురు కాల్పుల ఎదల మూల్గులు ఎఱుకను పంచుతాయి
మైనేని శేషగిరి రావు. కందుకూరు.

బడుగువర్గ భానుడా – అడుగు వర్గ ఆప్తుడా
దళితుల దేవుడా – పతితుల పావనుడా
ఆశయాల భీమరావు – అందరికీ అంబేద్కరు
అణచివేత నణచివేయ – జనియించిన జాగృతుడు
దళితజాతి దారిలేక – దారుణ బానిసతనమున
బతుకుగతుకులో బడగా – ఉదయించిన రాముడు – ఉద్యమమున ధీరుడు.
బాబా సాహెబుగా – బాధలన్ని తెలిసినోడు
తెలివితేటలందున – తెరలిన తెలి సూర్యుడు
రాజ్యాంగ రచయితగా – రామరాజ్య కాముడు
పదవులు తృణప్రాయములని – వదలిన అసమానుడు
సమానత్వ సారథిగా – కులవర్గము కూలగొట్టి
అంత్యజాతి స్వాంతమున – విశ్రాంతిని పొందినోడు
శ్రామిక జనపక్షపాతి – కామందుల కలవరము
సమన్యాయం సాధర్మ్యం – కావాలని కాంక్షించెను
బాధలన్ని పోగొట్టగ – బౌద్ధమొకటె మార్గమని

ప్రజాస్వామ్య లౌకికముల – ప్రవచించిన ప్రవరుడు
ఆర్తులు అబలలకై – అహర్నిశం పోరాడెను
స్వాతంత్ర్యం సాధించగ – ఆత్మశక్తి ముఖ్యమనెను
భూత భవిష్యత్తులలో – అంబేద్కరు అమరుడే
అతని సాటి ఎవరు లేరు – భరత దేశ భాగ్యదాయి.



వందనం – వందనం – వందనం
దళిత వీర యోధులకు వందనం
పతిత జాతి శూరులకు వందనం
అగ్రవర్ణ ఆగడాల – కామందుల కఠినాలను
ధనవంతుల దారుణాల – పాలక జన పాపాలను
ఎదురొడ్డిన సేనానులు – మదినిలిచన మాన్యులు
రక్తసిక్త పల్లెలో – రక్తమునే ధారవోసి
ప్రాణములను ఫణమొడ్డిన – పావనులే మీరలు – మీకిదే వందనం
'కారంచేడు' కక్షలలో – కమ్మవారి శిక్షలలో
కలిమి బలిమి కోల్పోయిన – వరకరుణా మూర్తులు
బలిదానం చేసినోళ్ళు – దళితజాతి బంధువులు – వందనం
'పదిరి కుప్పం' అదిరిపోయి – పద పదమని హెచ్చరించ
పేద పెద్ద వాదులాట – పెరిగిన ఆ తరుణంలో
తిరుగుబాటు బావుటా – ఎగరేసిన సారధులు
విరిగి తరిగి విజయమంది – విభవం పంచిన వారలు – వందనం
'వేంపెంట' వేదనలో – వెలుగులు విరజిమ్మినోళ్ళు
హరిజన గిరిజన జనులు – అగ్రకులపు అగ్రేసరులు
బాధలన్ని భరియించి – భాగ్యములను పంచినోళ్ళు
అమర వీరవరులకు – ఆశయాల లాల్ సలాం
ప్రతిఘటించు పరములకు – ప్రగతి శీల లాల్ సలాం
'నీరుకొండ' నిమ్నులకు – అండదండగా నిలచిన
దళిత జాతి అన్నలకు – అరుణారుణ వందనం
దళితుల ఫలితము కొఱకై – పతితుల పావనతకై

ఐక్య పోరాటాలతో – అందరు ముందుకు పోదాం
'చుండూరు'ను మండించిన చండ సూర్యవరులకు
కులాల మంటల కూల్చివేతలో తనువుల త్యాగం చేసిన వారికి – వందనం.



సంస్కరణల సారణుల సందడి సంతలో సడేమియా
అమ్మకానికి అర్హంకానిది అధిపతుల మదిలో ఏదీ లేదు
ప్రచురణ మాధ్యమాలలో ప్రపంచదేశాల పెట్టుబడుల జోరు
సమాజం అజమాయిషీకి సంజాయిషీ చెప్పే ప్రగతిశీల పత్రికలు
పరాయిాల పరమై వరదాయినులౌతాయని వాకృచ్చే ప్రతినిధులు
పతనమౌతున్న ప్రజాస్వామ్య విలువలు విదేశీల పరంతో విగతం
స్వదేశీ శోభలో విదేశీ విలువల్ని పంచే వింతపాలకుల వంతపాట
అసమర్థతను మర్దించాలని అర్థార్థులై అమ్మకానికొడిగట్టే అతిరధులు
నమ్ముకొని ఎన్నుకొన్న వారే అమ్ముకొంటుంటే దేశం గతి దాసోఽహమే
ప్రజాఉద్యమాలు గతించి ప్రతినిధుల ఆహరణోద్యోగం ఆకాశనికెగసింది
ఐదేళ్ళ ఏలుబడి బడిలో అక్షరాభ్యాసంలోనే భాసిస్తున్న స్వార్థం
దేహం కోసం దేశాన్ని విదేశాల కర్పించే వితరణ శీలుర విలాసం
మరపు మలుపులో తలపుల పలుకులు తప్పుదారి పడుతున్న తరుణం
స్వేచ్ఛకోసం స్వేదం చిందించిన వేద్యులే వాదాల వరుసలో మొదటివారే
దండించలేని కనీసం దడిపించలేని ధర్మ పాలకుల కర్మలకు కాలమే సమాధానం చెప్పాలి.
మతహితాన్ని మారణహోమంగా మలచి మానవత్వానికి మచ్చతెచ్చే పదవీ బధిరులు.
అధికారమే ఆఖరిలక్ష్యంగా ధిక్కారంతో వర్తించే కీర్తికాముక కింకరులు
మేకవన్నె పులుల మేజువాణికి మేదినిలో మేలైన మేధావుల మెదళ్ళు కావాలి
సంకరమైన వంకర వాక్కుల వైనానికి వైభవాన్ని పంచే విబుధుల బుద్ధులు
మంచితనం పాంచభౌతిక దేహానికి పనికిరానిదని పరమార్థుల ప్రవచనం
దేవుళ్ళ రూపాలు దేహుల పాపాలకనుగుణంగా సవాలక్ష మార్పులతో సంచరిస్తున్నాయి
హేతువు హేళనగా మారేచోట ఎఱుకకు స్థానంలేక ఏమరుపాటు కల్గుతుంది
సంస్కారం కలవారు సంస్కరణలకు సన్నద్ధమైతే విలువలు విన్నదనం పొందవు.

## సనాతనుల సారళ్యం

ధర్మశాస్త్రాల మర్మజ్ఞులు – కర్మభూమికి క్రాంతి వీరులు
విశ్వహిందువుల పరమహంసలు – అశోకులు ప్రవీణులు
రామాలయ రభస బాసులు – రథయాత్రల తీర్థులు
వాణీ వేణి వాల్లభ్యులు – మాట వరస మరచినోళ్ళు – ఈ భారతదేశంలోనే.
ఫత్వాలకు వత్తాసులు – షరియత్తుల షరాబులు
అల్లాకే ముల్లాలు – ఇస్లాముకు సలాములు
కోరికలకు గులాములు – కోపమునకు కొలువులు
ఛాందసమున చేతనులు – మూఢత్వపు మూలములు – లౌకికరాజ్యంలోనే...

హిందూ ముస్లిం హీనత్వం – హితమతులందరి దీనత్వం
మతాల హతాల మారణహోమం – భయం బాధలో భావి పౌరులు
సోదరభావం ఊదరలోనే – మనోవాదరే మాలిన్యం
కులమతాలకూ కుంపటి తంపటి – రాజకీయులకు కీలకమే అది. – న్యాయానికి గాయమా...
ఉన్నత న్యాయం ఉత్తమాటగా – మదర్సవాసులు, పరివారములు
మాననీయతను మానవీయతను – మసి చేస్తుండిరి – మంచిని త్రుంచిరి
కోర్టు తీర్పునకు కొఱత వేయగా మతమౌఢ్యానికి మార్గము చూపిరి
శంకరార్యుల చైతన్యవేదం – చరితను మలచగ గరితగ మారున? – అయితే పౌరుల విధి...

వాగుడుకాయల ఆగం నుంచీ – సాధు సంతుల సంగం నుంచీ
ఉగ్రవాదుల ఉగ్రత నుంచీ – అగ్ర ఇమాంల ఇరుకుల నుంచీ
అందరు పౌరులు విడివడిపోయి – సౌభ్రాత్రానికి సమత మమతకూ
భారతదేశము పావనమైనది – సనాతనత్వపు సరళత కోరును.



మనుసంతతి మాన్యులు – భరత భూమికధినాధులు
స్వయంసేవ శోభనులు – జనసంఘపు జాణలు
ప్రజాస్వామ్య ప్రతిపక్షులు – పావనతకు పరమార్థులు
సంస్థానపు సారథులు – సన్యాసపు నీరధులు

రామజన్మభూమియనీ – రభసచేసి సభకొచ్చిరి
స్వదేశీయ నినాదంతొ – స్వార్థులుగా మారిరి
పండిత సంపాదకులు – పరిశ్రమల వరనేతలు
మంత్రులుగా పాలకులై – మండించిరి భారతాన్ని
తెహల్కాల నల్లవాళ్ళు – తెల్లబోయి తెంపరులు
ఆయిల్ బంకులప్పగింత – అధినాథుల అవినీతే
ఉపన్యాస ఊదరలో – న్యాసం విన్యాసమాయె
రాజకీయ సంస్కృతిలో – రాబందుల వేటలాయె
పెద్ద తప్పు జరిగినా – పెదవి విప్ప వీలుకాదు
యజ్ఞ యాత్ర ప్రజ్ఞలలో – యాదలేని విధమాయె
నరమేధం నాణ్యమాయె – మతంపేర గుజరాతులొ
సరిహద్దుల రక్షణలో – సంపదంత జరిగిపోయె
మానవ బలిదానంతో – పదవులన్ని పదిలమాయె
కరువు రాజకీయమై – కపటనాటకమ్మాయె
మిత్రములే శత్రువులై – ప్రజాస్వామ్య మృత్యువాయె
శాంతి ధర్మకేతనమే – ఉగ్రవాద వ్యగ్రమాయె
గాంధీ గాడ్సేలయందు – గాడ్సేయే గాడ్ ఫాదర్
జనస్వామ్యం నీరసించి – జనభారతి భయానకం.



మూడుముళ్ళ బంధమిది – ముద్దుల సంబంధమిది
ఏడడుగుల బంధమిది – ఏడుగడకు అందమిది
త్రికరణాల త్రికాలాల – తియ్యనైనదీ బంధం
త్రిలోకాల త్రిరత్నాల – తీరు తెలుపు బంధం
పంచభూత భూమిలో – పంచాంగపు దినములో
పంచేంద్రియ పావనతకు – ప్రభవించినదీ బంధం.
ఆలోచన అవగాహన – వివేకాన విశుద్ధమై
విభవం పంచెడి బంధము – శుభకామన సందేశం.
సప్త స్వర సంగీతము – సప్తవర్ణ సాంగత్యము
సప్తార్ణవ సారూప్యము – సప్తదాన సంభరితము.

ప్రకృతి పురుషుల బంధం – సుకృతికే అనుబంధం
ఆలుమగల కనురూపము – సృష్టికి శుభ సంకేతం
మతములు మారినా – అభిమత మది ఒక్కటే
అద్వైతము ద్వైతమై – అమరమునకు సోపానము
సుఖశాంతులు సుదీర్ఘమై – కడదాకా సాగి సాగి
దాంపత్యపు పూదారిగ – పుణ్యములకు నిలయము
ఆదిశక్తి అమరికకు – పరాశక్తి పావనతకు
మీశక్తుల మించులకు – మించినదీ భవబంధం
అణువుల అమరికలోనా – జన్యువు జాజ్జ్వల్యమై
ధన్యతకే రాదారిగ – ధర్మ కర్మ అనుబంధం.
విశ్వదేశ దేహానికి – విలువ వనిత సంబంధం
సూర్యకిరణ చైతన్యం – సుందర భువికే అందం.
మానవతా మార్గానికి – మగువ మగల సంబంధం
నవగమ్యపు భవగమనం – ఆశయాల ప్రతిబింబం
సంప్రదాయ సారము – సంస్కృతికే సదనము
కొత్తపాత కలయికతో – కోరికలకు సంగమము.



ప్రజాస్వామ్య భారతికీ – బాధకలిగింది
గణతంత్రపు భారతికీ – గుణరోగం వచ్చింది
లౌకికజన భారతికీ – లౌల్యం అంటింది
సార్వభౌమ భారతికీ – స్వార్థశోభ పెరిగింది.
అష్ట కష్టాలతో ఆగష్టు పదిహేను
అందరికి అందించింది అనవసర భయాన్ని
బంకుల కోటాకేటాయింపుల బొంకుల భాగోతం
డీలర్‌షిప్పుల స్కాలర్‌షిప్పుల దిగమింగే వైనం
గుజరాత్ ఎన్నిక గుంజాటనల గురువుల పరువుల గరువం
కాశ్మీర్ కలవర కల్లోలమ్ముల – కామిత పదవుల కర్కోటం
చెరిగిన హద్దుల సరిదిద్దుటలో – సంతర్పణగా ప్రజాధనం
శవపేటికలా కమీషన్లలో – రక్షణ వర్యుల భక్షణ వైనం

ఉల్ఫా, బోడో, లష్కర్, హురియత్ – ఉగ్రవాదము ఊరడింపులు
నక్సల్, నాగా, త్రిపురా, మావో – ఈశాన్యంలో శ్మశానగీతం
కరువులు బరువులు దారిద్ర్యానికి – కంప్యూటరులకె కనికారం
రాజకీయ అవినీతి రచ్చలలో – పార్టీవ్యక్తుల పరాచికం
జనవిస్ఫోటన ధన ఉల్బణలో – సామాన్యునికే శఠగోపం
జెండా పండుగ జయనినాదమున – మానవబాంబుల మహాభయం
పాకిస్తానం పానం చేసిన – టెర్రరిజానికి టెంపుల్ భారతి
చర్చలు విఫలం యుద్ధం సఫలం – పదవులు మాత్రం పదిలం పదిలం
భారత మాతకు ఘాతకులైరిగ – బాధ్యత మరచిన అధినాయకులు
స్వదేశి శోభలో విదేశి విభవము – ఇంగ్లండ్ అమెరికన్ ఇంపు సొంపులు
ముస్లిం విశ్వం ముద్దుల ముచ్చట – రామభూమిలో రాళ్ళు రప్పలు.
విశ్వవిఫణిలో విలువహీనమై – జెండా పండుగ జయం పొందినది.



తే.గీ. విజయవాటిక విలువల విబుధునకును – భాగ్యనగరున భామకు భాగ్యమబ్బె
దీప వేంకట గిరిరావు దివ్యముగను – సంగమించగ బంధము సవ్యమాయె.

ఆ.వె. దీప దీపమాయె దివ్యమై 'కొల్లా'కు – 'శేషు' సేదదేరసేవచేయ
ఇంటి యింపు సొంపు లింతింతలాయెగా – భవిత వెలుగుగాక సవిత రీతి.

ఆ.వె. వయసు వలపు తలపు వసుధను పులకించ – వాసిగాంచుడయ్య వధువు వరులు
బంధుమిత్రతతుల భావము పండింప – పెండ్లి ప్రేమ పంచు పేర్మిగాను.

ఆ.వె. తెలివి కలిమి బలిమి తెరువును చూపగా – బతుకునందు బాధ భాగ్యమగును
విశ్వదేశదేహ విజయము ప్రాప్తించ – జంట తంట దీర్చు పంట పండు.

ఆ.వె. తల్లి తండ్రులందు తరగని ప్రేమతో – తరియుడయ్య మీరు తపనతోడ
అమరనందనమ్ము ఆస్తిగా లభియించ – ఆశయాలు తీరు అందముగను.

తే.గీ. మూడు ముళ్ళది బంధము ముచ్చటగను – ఏడు అడుగుల బంధము ఏడుగడగ
సప్తరాగాల అనురాగ సరళి మించ – సప్త సంద్రాల విశ్వము సహితమగుత.

తే.గీ. చంద్ర చంద్రిక రీతిని సాంద్రముగను – పువ్వుతొడిమగ కలిసుండి పుణ్యముగను
వెలుగునీడగ సఖ్యమై వెలితిలేక – శివుని అర్ధాంగరూపమై శివముగనుత.

తే.గీ. లక్ష్మినారాయణులరీతి లక్ష్యమెంచి – వాణి బ్రహ్మల వాక్కున వాసిగాంచి
నలుడు దమయంతి రీతిని నవ్యతగని – రామసీతల రమ్యత రాజ్యమగుత.

ఆ.వె. త్రికరణముల యందు తియ్యదనము పంచి – త్రిగుణ సహితముగను తీర్థమెంచి
మూడు కాలములకు ముచ్చట పంచగా – గురువు మురువు బరువు పంచుదయ్య.

ఆ.వె. ధనముకన్న గుణము ధన్యత గాంచును – శీలవర్తనములు సిరులు నింపు
మీదు జంట మిగులు మించులు మించుగా – మేలుగాంచు గాత మెలకువలను.

ఆ.వె. అందచందములను అన్యోన్యతలుగల్గి – అవని ఆప్తతలును అమరుగాత
మనసు మానవతల మహిమను గాంచగా – భావి తొలచుగాత బంధనముల.

ఆ.వె. విజయవాడ దుర్గ విజయమునందించు – కృష్ణకూర్మిగల్గి తృష్ణదీర్చు
వేంకటేశ్వరుండు వెతలను దీర్చగా – కలను ఇలను గూడ కాంతి కలుగు.

ఆ.వె. భరతమాత పంచు భవమున సౌఖ్యాలు – తత్త్వచింతనమ్ము తరియ జేయు
తెలుగు తల్లిమీకు తేటదనమునిచ్చి – విశ్వవెలుగు తెలియు విధము తెల్పు.

ఆ.వె. తల్లిదండ్రి గురువు తరగని సంపదల్ – అనుభవమ్మె గురువు అవని నసలు
భవము పండజేయు భాగ్యము బంధమై – ఆయురున్నతులును అబ్బుగాత.

గిరిదీపలకు అక్షరాక్షతలు.



అమరంకోసం సమరంచేసే అమానుష వ్యక్తుల లోకం యిది
ఇంద్రపదవిని పదిల పరచుకొనే ప్రజాస్వామ్య ప్రతినిధుల పథం యిది
సుఖం మరగి త్యాగం మరచి సూక్తుల సూచీ ముఖాలతో ముక్తిమార్గం పొందే తాత్త్విక తారుణ్యం.

అందినంతవరకు ఆకాశాన్ని అందుకొని అందాన్ని జుట్టి త్రేన్చే మానవనైజం
బుల్లితెరల బులపాటంలో తల్లిపొర తపనపడే వైనాన్ని తెలియని వైనతేయులు
కాలగమనంకాలుని ధర్మంలో కలగాపులగమై నరకాన్ని నరికే కరవాలమైంది
వర్గపోరాటంతో ఆరాటపడే ఆరాధ్య మానవ జన్మల నవోన్మేష ప్రతిభ
కాలం చెల్లిన దారిమళ్ళిన దౌర్జన్యకాండల పర్జన్యం కురవకుండానే అరిచింది
శాంతి వచనాల వాంతులు ఫలదీకరణ సమయానికైనా ఫలితం ఇవ్వలేదు
అమ్మానాన్నలను మరచిన అమాయక మేధావులు అమెరికాలో అమరులౌతున్నారు

ఇంటర్నెట్ ఇంద్రజాలంలో ఇంకిపోయిన జనాకలి కంటిచూపుతో తీరుతుందా.
అరచేతిలోకొచ్చిన ప్రపంచాన్ని పిడికిలితో బంధిస్తే తప్ప ముక్తిలేదు.
మురికినుండి జారిపడి సిరికై ఎగబడే బడుగుమనిషి బాంధవ్యం మట్టిమరకతోనే
అందనిది అందరిదీ కాదనే ఆలోచన అపరకర్మలతోనే తెలియాలి
మతం సతమతమై హితమతమయ్యే మానవమతానికి జనాహ్వానం
లేనిది ఉన్నదనే లేవడి ఊహకు అంతా అంతరాంతరాల్లో ఉన్నదనిచెప్పాలి
అయినది కానిది కాలానికి అందని అనుభవమని వర్తమానం చెప్పాలి
నరజన్మ నవలోకజన్మకు నాందియై వరమానవతను వర్షించాలి.

565

సహజ రాజయోగమిది – సమదర్శన సారమిది
ప్రాణశక్తి ప్రణవమిది – పరమాత్మను చేర్చునది.
అష్టాంగ సాధనతో – ఆత్మశోధనమ్ముతో
అణునిర్మిత శరీరమే – అమరమౌట తెలియును.
అంతరంగ బహిరంగము – అంతరముల సంభరితము
అన్నిటినంతం చేయగ – ఆత్మవెలుగు దివ్వెగా.
త్రికరణముల తీరులో – తియ్యదనమె యోగము
పంచతత్త్వ పావనతే – పరమార్థపు యోగము.
కోతివంటి మన మనసు – కోరికలకు కొఱవియది
ఇంద్రియముల ధ్యాసమార్చి – ఇంపునొసగు యోగము.
నియమనిష్ఠ ప్రధానము – నిధులు అవసరము లేదు
తానెవరో కనుగొనుటే – తత్త్వార్థము యోగమునకు.
పాపపుణ్య ఫలములే – పరతత్త్వమునకు దారులు
నీలోనే కలిగినవని – నిత్యసత్యమును గనుము.
పంచవికారములను – పటాపంచలుగ చేయుము
వంచన పంచకుబోకుము – కాంచనమును కామించకు.
విశ్వము నశ్వరమను – వింత భయము ఆవరించె
శాంతి కాంతి చేవ కలగ – నవవిశ్వము మానవతే.
మానవుడే మాధవుడగు – మాన్యమార్గమిదియుండె
ఆస్తిసుఖము శాశ్వతమను – అసద్గమనమును మానుము.

బ్రహ్మతత్త్వమును తెలియగ – భ్రాంతులన్ని విడనాడగ
బ్రహ్మకుమారి వగుము – బ్రహ్మాండమె నీవశము.

**పరంధామ పథం**

శుక్లాంబరముల – శుభసందేశం
సూర్యనికేతన – సుందరవేదం
బ్రహ్మకుమారీ – భాగ్యభావనం
ఈశ్వరీయ మతి – హితమతమార్గం.
గీతాచార్యుని – చేతన చెలువం
ఆత్మసాధనకు – ఆస్తికరంగం
నరవరనడతకు – నవ్యసంకేతం
పరమాత్మునికీ – పర్వ సంగీతం.
మనసుల మలినము – మసిచేయునది
మమతల సమతల – మాకందమిది
తృప్తీ తృష్ణల – తుది వివేకమిది
మానవ తత్త్వపు – మహిమాన్వితమిది.
శివబాబాయే – శివభరితమ్మగు
జగమే ఖగమగు – ఆస్తులు అణగును
శాంతి సౌఖ్యములె – శక్తినిలయములు
వికార విలువలు – వినశ్వరమ్ములు.
నియమమె నిధిగా – నీతియె విధిగా
నిత్యవర్తనము – సత్యవర్తనము
ధర్మ ధారణము – దారుఢ్యమ్మగు
కర్మ వర్తనము – కమనీయమ్మగు.
సాహసమే – సరసార్థ సాధనము
నారాయణుడే – నరుడగు మార్గము
నారీమణియే నవలక్ష్మియగు
జీవ జగములకు – జిగి బిగి కలుగును.



హయగ్రీవ హయగ్రీవ – హయగ్రీవ పాహిమాం
హయగ్రీవ హయగ్రీవ – హయగ్రీవ రక్షమాం.
దేవుని అవతారములు – దేహికి ప్రతిరూపములు.
అంతరంగ ఆస్తికతకు – అర్థమైన ప్రతిమలు.
అశ్వశక్తి అతిశయము – అశ్వహేష అనురాగము
సప్తాశ్వుడు సూర్యుడు – సరళి సప్తవర్ణములు
భానుడె భవమున దేవుడు – వేవెలుగుల వేద్యుడు.
హయనాదము ఓంకారము – అదివ్యాప్తము విశ్వమందు
అశ్వనరుల రూపములో – ఆ దేవుని గమనించుము.
దుష్టుల రక్షించుటలో – శిష్టుల రక్షించుటలో
క్షితిజనులను కాచుటలో – మతిమంతుడె ఆ విష్ణువు.
వేద వేద్యుడాతడగును – వెలుగునిచ్చు వేల్పుడగును
వాక్కువాసి వాల్లభ్యము – నరవరులకు అందించును.
అవతారము కల్పనమే – అందదు హేతువునకది
కార్యకారణములలో – కరణమునకె ప్రాధాన్యము.
విగ్రహాల విలువలు – విబుధుల విన్యస్తములు
శబ్దశక్తి చేతనులై – తనువుల రూపం చేసిరి.
అసురత్వము సురత్వము – అవనిజనుల మతిలోనివి
పదముల పదనిసలలో – పరవశులై నమ్ముదురు
ధైర్యసాహసములెరక్ష – విశ్వాసము శ్వాస విగత
మానవతే అవతారము – మహిలోనిక వేరు లేదు.
జీవి జీవనమ్ములోన – జిలుగు వెలుగు యోగమగును
భావిజనుల భాగ్యానికి – భావజాల భాషయగును.



యూజీసీ మేధావుల మేలిమి తలపులో మెదలిన అబలపై అత్యాచారాల మెలకువ.

జీతం జీవనంకోసమనే జీన్కోడ్ ఆచార్యుల అభాణకాలు న్యాసంలేని న్యాయాలు.

సహజ న్యాయం సమాజ న్యాయాలలోని అంతరంగ బహిరాంగాలు అవగాహన లేక అన్యాయాలు.

విశ్లేషకులు శ్లేష్మంలో పడ్డ ఈగలైనపుడు విషయ విశేషం వివేకరహితం.

జన్మస్థానం మర్మస్థానంగా భాషించే భావి భారత పౌరుల సంస్కారానికి సలాం

అమ్మ, అక్క, చెల్లి అత్త వదిన మరదలు సంకల్పంలో ఒకటే. భావం భాషల్లో వేర్వేరు.

కారణం తెలియని కార్యాల విశ్లేషణ కలియుగ కామందుల వాగ్వధూటీ వైభవం.

నిరుక్తం నియమరహితమై పదాల అర్థాలు పరమార్థానికై పోటీ పడుతున్నాయి.

పరిణామంలో పరపద సోపానం తత్త్వవేత్తల చింతనలోని చైతన్యం.

తత్త్వం తెలియని తర్కం అర్కుణ్ణికూడ అంధకారిగానే చిత్రిస్తుంది.

హేతువు హేయమై తర్కం వర్కౌట్ కాని హీనస్థితిలో నరప్రగతికి తత్త్వమే శరణ్యం.

అధికారం ధిక్కారం అమ్మానాన్నలయితే అహంకారం సంతానం సొత్తవుతుంది

జీవన పోరాటంలో ఆరాటానికి అమ్మస్థానమయితే అవకాశాలు నాన్ననాశ్రయిస్తాయి.

అమ్మనూ, భార్యనూ, కుమార్తెనూ, కోడలినీ ఇచ్ఛలో, కోరికలో సంభావించే తీర్లు వేరు.

చదువుల తల్లిని పుస్తకాలకే పరిమితంచేసి ఆచరణలో అంతరాలతో తరిస్తున్నాము.

మాంత్రిక, యాంత్రిక, తాంత్రిక యుగాలు మాయచేసినా కలియుగంలో కలికి కమ్మదనమే కలిగింది.

రామరాజ్యంలో రామకు రమ్యత కల్గించే యత్నంలో రావణకాష్ఠం రగుల్చుతున్నారు.

మానంలేని సమానతకు మానిని అభిమానం గమ్యమయితే గమనం అర్ధనారీశ్వర తత్త్వమే.

పతివ్రతలను చెప్పి సతివ్రతులను చెప్పని సాహిత్యకారుల హితాన్ని ఏమనాలి?

పురుషార్థాలు, ఆశ్రమాలు, అరిషడ్వర్గాలు మానవాళి మొత్తానికీ సంబంధించినవే? మాటలు వేరైనా తత్త్వమొకటే.

కాలుష్యభరిత ప్రపంచంలో కాలుష్యరహిత హృదయాలు కరవే. కాబట్టి కలవరమే కర్తవ్యం.

సర్టిఫికెట్ చదువుల కాలంలో సహృదయం సామరస్యం సరళత్వం అక్షరరూపంలోని ఉచ్చారణలే?



హరితత్త్వము అణగిపోయె – అరితత్త్వము అతిశయించె

పరిసరములు సర్పములయి – విషమయమయె జీవనములు

కాలుష్యము కలవరమయి – కలియుగమున కాంతిదప్పె

మానవమేధాశక్తియె – మరణమె రణమె మధురమాయె
వృక్షగణము శిక్షలతో – కక్షల మయమాయె నేడు
అరుణిమయే అరణముగా – అవతరించె సూరీడు
హర్ష వర్ష వసుధలో – సుధ సుందరబంధమాయె
నవజీవన దారిలోన – వనగణయే ధనమాయెను
అరణ్యముల గణ్యతలో – ధన్యమగును ధరణి జనత
ఉద్యానపు ఉద్యమాన – ఉర్వరకే ఉపయోగము
పావన వన నిర్మాణమె – పర్వమైన బతుకు పంచు
హిమహితమే హీనమయి – నదులమదులు నరకమాయె
నందనవన అందములో – నవ్య వసుధ దివ్యమాయె
ఆకుల కొమ్మల అతిశయమందున – ఆరోగ్యమ్మే దాగియుండెను
నీడ జాడ వీడిపోయి – వాడిపోయె భువిజీవులు
వాయువులే కలుషమయి – ఆయువులను అదుముచుండె
రసాయనం రహిని కలిసి – రమ్యరహిత రాజ్యమాయె
మురుగు మరుగు వీడిపోయి – కరిగిపోయె కమ్మదనము
సూర్యరశ్మి కశ్మలమై – భస్మరీతి భాగ్యజగతి.
నీటి నిధులు తరిగిపోయి – నీరసమయె భువి జనత
శక్తి తరిగి భక్తి తరిగి – చైతన్యము చేవదప్పె
అమరావని వనములోన – నవ జీవన నిధులు కలవు
కాల ప్రవాహమ్ములోన – కలవరములు కలరవములె.
ప్రకృతి విలువ విగతమయి – వికృత గతులు విశదమగును
హ్లాదమయము మోదయుతము – పచ్చదనము పరిశుభ్రత.
వ్యవస్థలో వ్యక్తిగతము – అవస్థలకు అంతిమమ్ము
జగతిరక్ష జాతిరక్ష – వృక్షరక్ష ప్రకృతి రక్ష.



ఉద్యమాల ఊపిరితో ఉన్నతికై ఉరవడించు
విప్లవాల నీడలో విజయానికి పరితపించు
తిరుగుబాటు బావుటా – తిరువీధిని ఎగురవేయి
ప్రగతిబాట పాటగా – పరవశమై ప్రవచించు

దోపిడి దుర్మార్గాలను - దోహదమున ఎదిరించు
బానిసత్త్వ భావాలను బాధ్యతగా బంధించు
అణచివేత అన్యాయము - అవగాహన అతిముఖ్యము
ఆశయాన శయనించుము - ఆదర్శమె నీదృశ్యము
ఆకలి దారిద్ర్యములను - దమియించగ దారి వెదకు
ఛాందస మూఢత్వములను - చెరిపివేయ సాహసించు
కులమతాల కూహకముల - కొరతవేయ యత్నించుము
లౌకికత్వ భావనతో - భారతమును భావింపుము
వైవిధ్యపు ఐక్యతలో - వైభవ దేశమును గనుము
మహామహుల బోధలన్ని - మాన్యతగా గణియించుము
సహన శాంతి సౌఖ్యములే - సౌభాగ్యముగా నెంచుము
సారహీన స్వామ్యములో - పారదర్శకత చూడుము
ఓట్ల సీట్ల పాట్లలోన - దేశగతిని గమనింపుము
చట్టబద్ధ పాలనలో - వట్టిపోవు వరుస జూడు
ధనార్థులౌ ప్రతినిధులను - దారుణముగ ప్రతిఘటించు
పేదపెద్ద అంతరాన్ని - పెరుగకుండ అడ్డుపడుము
మోసకార్ల దోషులను - ఈసడించు విధమెరుగుము
అధికారపు మదమత్తుల - అదరగొట్టి దమియించుము
సమభావన సహజీవన - సరళతలను సాగించుము
దేశభక్తి దేహముతో - దిగ్దిగంతముల నిండుము
పాలక జన పావనతను - ప్రాభవమున ప్రవచింపుము
అధర్మాన్ని అవినీతిని - ఆగ్రహమున ఎదిరించుము
బడుగువర్గ బాధలనూ - బాధ్యతతో తెలిసికొనుము
దయా ధర్మ ధరణికీ - దారిని నివు గ్రహియించుము
ఆయుధమును ధరియించీ  - అసురమును హరియించుము
చెరసాలకు ఉరికొయ్యకు - ఉలికి పడకు జడియకు.



అధికార పదవులు - అవధిలేని వ్యధలు
పాలకజన సేవలు - స్వార్థానికి స్వాగతాలు

అవినీతికి నిలయాలు – అకృత్యాలకు నెలవులు
లంచాలకు లక్ష్యాలు – వంచనలకు వనరులు
విధిరహిత నిధులు – విధ్వస్త విజయాలు
చట్టబద్ధ దోపిడీలు – నిబద్ధతకు బద్ధకాలు
వమ్మైన నమ్మకాలు – వాసిలేని వాస్తవాలు
త్యాగరహిత యాగములు – యోగరహిత యోజనలు
వ్యక్తి నిష్ఠ వ్యావృత్తులు – జనశక్తికి జారుపాట్లు
మలిన మహిత మానములు – మానరహిత రమ్యతలు
దోపిడీల దోర్బలములు – బలహీనుల బాధకములు
బలవంతుల భాగ్యములు – ధనవంతుల దారుణములు
పేదవారి పేలవములు – పెద్దవారి ఒద్దికలు
మాటలతో బూటకములు – అరచేతిలో స్వర్గాలు
అంతులేని అధర్మాలు – జాతి నీతి నీరవములు
మంచితనపు మారణములు – దారిద్ర్యపు ఛత్రములు
బాధ్యతలకు వధ్యములు – బాంధవ్యపు సింధువులు
ధనదాహపు దారులు – దానవతకు వ్రతములు
జనరక్షకు కక్షలు – జాతిప్రగతి దుర్గతులు
అహంకార కారణములు – అహరహాల ఆశలు
అభ్యుదయపు 'భూతా'లు – ఆశయాల శయనములు
చట్టాలకు సమాధులు – సమానతకు తర్పణములు
ప్రశ్నలకే ప్రశ్నలు – జవాబులకు జారుడులు
పారదర్శకత పాతరలు – సాంకేతిక సరసగతులు
నయవంచన నాణ్యతలు – భయంలేని బాధ్యతలు
కేంద్రీకృత కేతనాలు – వికేంద్రముల విముఖతలు
దేశభవిత దేవిడీలు – దేశభక్తి ముక్తములు
ధనార్జనకు ఆర్జవములు – ధరిత్రికే దరిద్రములు
ఆదర్శము దృశ్యముగా – ఆశయాలె ఆస్తిగా
మాట మానవత గుర్తుగ – మనపయనం సాగాలి.



దేహికి దేవుడూ – దేశానికి జీవుడూ
దేవాలయ నిలయుడూ – పదవిలోని పాలకుడూ
భక్తిజ్ఞాన బాంధవుడూ – శక్తి యుక్తి చేతనుడూ
పరమాత్ముడె పావనుడూ – పాపశాప దూరుడూ
సర్వమయుడు వరదుడు – సమత మమత సాధకుడు
కర్మసాక్షి కారణుడు – కర్మకలిత మర్మజ్ఞుడు
అవతార పురుషుడు – ఆలోచన సాంద్రుడు
రుజలు మాపు రుద్రుడు – భోగ రోగ భోజనుడు
నిత్యసత్య ప్రకాశుడు – నిరతము అర్థార్థుడు
నాదమయుడు వేద్యుడు – వాద వేద వారసుడు
సూర్యచంద్ర సమానుడు – శుభకామన సుందరుడు
అహంకార దూరుడు – అహంభావ భావకుడు
సృష్టి పుష్టి నష్ట కరుడు – జీవన వన విహారుడు
మాయ మార్ధవముల వాడు – ఆర్జవమున ఆశయుడు
రాక్షసత్వదమనుడు – మానవత్వ మాంత్రికుడు
తరతమములు లేనివాడు – తనతనమున తపనవాడు
రాతిబొమ్మ రమ్యుడు – రక్తమాంస రసికుడు
త్రిలోకాల తీర్థుడు – స్వార్థలోక శోభితుడు
మనిషి మలచు మాన్యుడు – మాధవుచే మహితుడు
అందరికీ ఒక్కడు – ఒకడేమొ కొందరికే
తాపసులకు సాధ్యుడు – త్యాగయోగ యోజనుడు
నవభక్తుల నాణ్యుడు – కీర్తికాంక్ష కీర్తనుడు
అధికారపు అనంతుడు – అంతానికి ఆద్యుడు
గుణరూపపు గుప్తుడు – త్రిగుణరూప తప్తుడు
ఆదరించు అమరుడు – తరించుటలొ తాత్త్వికుడు
వైభవాలకే విభవుడు – ప్రభుత్వాల విభుడు
ఆదికి ముందున్నవాడు – ఆద్యంతము తెలియనోడు
శబ్దార్థపు శాసకుడు – భాష భావముల వాడు
వింతలకే వింతవాడు – విలువల వలువల విగతుడు

వర్ణార్ణవ పూర్ణుడు – వరసేవను పూజ్యుడు.



ఇదేమి రాజ్యం – ఇదేమి రాజ్యం – దొంగలరాజ్యం – దోపిడిరాజ్యం
తుపాకి రాజ్యం – తూటాల రాజ్యం – వాటాలరాజ్యం – పోటాలరాజ్యం
కోటాల రాజ్యం – టాటాల రాజ్యం – రోగుల రాజ్యం – భోగుల రాజ్యం
లంచాల రాజ్యం – వంచన రాజ్యం – ముఠాల రాజ్యం – మూఢుల రాజ్యం
ఫ్యాక్షను రాజ్యం – బాంబుల రాజ్యం – మాటల రాజ్యం – మర్మాల రాజ్యం
కర్మాల రాజ్యం – కలియుగ రాజ్యం – పందల రాజ్యం – 'మందు'ల రాజ్యం
బందుల రాజ్యం – బాధల రాజ్యం – వరదల రాజ్యం – బురదల రాజ్యం
సరదాల రాజ్యం – సరసాల రాజ్యం – ప్రతినిధి రాజ్యం – ప్రైవేటురాజ్యం
స్వార్థపు రాజ్యం – వ్యర్థపు రాజ్యం – రాక్షస రాజ్యం – శిక్షల రాజ్యం
భక్షణ రాజ్యం – కక్షల రాజ్యం – స్వాహాలరాజ్యం – స్వాముల రాజ్యం
స్కాముల రాజ్యం – 'జాము'ల రాజ్యం – కాల్పుల రాజ్యం – వేల్పుల రాజ్యం
క్రూరుల రాజ్యం – కులాల రాజ్యం – 'సారా'ల రాజ్యం – 'బారు'ల రాజ్యం
కాంట్రాక్టు రాజ్యం – శాతాల రాజ్యం – ముండల రాజ్యం – రండల రాజ్యం
బండల రాజ్యం – మంటల రాజ్యం – చింతల రాజ్యం – వంతల రాజ్యం
సంతల రాజ్యం – వింతల రాజ్యం – మతాల రాజ్యం – హతాల రాజ్యం
సినిమాల రాజ్యం – సీరియల్ రాజ్యం – మారణ రాజ్యం – దారుణ రాజ్యం
గణముల రాజ్యం – ఋణముల రాజ్యం – తాకట్టు రాజ్యం – తాయెత్తు రాజ్యం
ముడుపుల రాజ్యం – మూల్గే రాజ్యం – మంత్రాల రాజ్యం – తంత్రాల రాజ్యం
మంత్రుల రాజ్యం – కంత్రీల రాజ్యం – చంద్రుని రాజ్యం – ఇంద్రుని రాజ్యం
నాయుడి రాజ్యం – నశ్వర రాజ్యం – హైటెక్కు రాజ్యం – హైరాన రాజ్యం
ఐటీ రాజ్యం – మైటీ రాజ్యం – సైబర్ రాజ్యం – ఫైబర్ రాజ్యం
ఛానళ్ళ రాజ్యం – టీవీల రాజ్యం – వర్గాల రాజ్యం – వర్ణాల రాజ్యం
మానవ రాజ్యం – దానవ రాజ్యం

నవరాజ్యానికి నాందివాక్యము – మనరాజ్యానికి మానవత్వము
జనరాజ్యానికి జాగృతతత్త్వము – ధనరాజ్యానికి దయా తత్త్వము
సమరాజ్యానికి సామరస్యము – కలగాలని కలిగించాలని కలియుగ జనాళికి వినతి.



రోజుకొక్క చీరకట్టి రోజాలా నువ్వుంటే
రాజుకొంటు నామనసు రయ్యి రయ్యిమంటుందే
సిగ్గునడుము చీరకట్టు సింగారపు జాకెట్టు
లోగుట్టే చెలియపట్టు లోబడితే పైమెట్టు
పచ్చరంగు పావడా పసిమి మిసిమి రేగడా
పాలవయసు మీగడా పంచుకొంటె సరిపడా
పట్టుచీరకట్టడంలొ పసదెలిసిన వన్నెలాడి
గుట్టు దెలియరట్టాయెను గుర్తు దెలియ గుమ్మలాడి
పైటకొంగు పైకెగిరి – పైకొన్నది నామదిని
ఎగిరిమందుకొచ్చింది – ఎదగదిలో నిండింది
ఆడతనం అందంలో అరవిరిసెను అరవిందం
మరపుల మరకలలోనా మారెనుగా మకరందం
ప్రతి ఉదయం నీచందం – ఉషాకిరణ ప్రత్యక్షం
రోజారంగుల రంగం – రోజునకొక అనుబంధం
చీరకుచ్చెళ్ళలో మడత బడిన నామనసు
చేరిపైకి పారజూడ జారెను వళిత్రయముగా
స్వర్గం అపవర్గం నీసొగసులొ ఉంది
మార్గం దుర్గమమైనా మానవాశవదలనిది.
వేదనతో వెతుకులాట – వాదనలో వలపులాట
ఆటలాడి ఆగమనమె – అమరమునకు రాచబాట.



రామజన్మభూమిలో – రాక్షసరాజ్యం
బుద్ధదేవు భూమిలో – బూర్జువ రాజ్యం
నానకు గురు భూమిలో – నక్రస్వరాజ్యం
ఆదిశంకరుని భూమిలో – ఆర్తుల రాజ్యం.
మానవతను మరచిన – మననాయక రాజ్యం
కోట్ల జనుల కోరికలను – కొరతవేసినది రాజ్యం
అంతరాలు అవినీతి – వింత విలువ స్వారాజ్యం
అంచాలే లక్ష్యమనెడి – వంచకులది జనరాజ్యం.

నీతి నేతి బీరగా – నిలువున నరికిన రాజ్యం
ప్రతినిధులు ప్రభువులూ – నిధుల విభవ సామ్రాజ్యం.
మాఫియాల హంతకులా – మారణ రణ నరరాజ్యం
మానవతుల మానభంగ – కాలయముల గణరాజ్యం.
నల్లధనం నల్లకోట్ల – నాణ్య న్యాయధనరాజ్యం
నవసంస్కృతి క్రీనీడను – నడవడి చెడి నవరాజ్యం.
రక్షణ ధనరాజులకే – రమ్యమైనదీ రాజ్యం
పౌరుల పౌరత్వమునకె – ఉరితీతల సరిరాజ్యం.
మేధావుల మెదళ్ళనే – వధజేసెడి వర రాజ్యం
నీతియుతుడు పిచ్చివాడె – నిమ్నజాతి మతరాజ్యం.
స్వాముల స్కాముల్లోనా – శోభనింపు శుభరాజ్యం
కుర్చీలే కులగజ్జిలో – కూరుకుపోయిన రాజ్యం.
ఓటువిలువ తెలియనీ – ఓటరులది రాజ్యం
ఎన్నిక మన్నిక వెలసిన – ఎదురు కాల్పులది రాజ్యం.
ప్రజాధనం ఫలహారమె – పావన జనరాజ్యం
పేదపెద్ద పెరుగుదలల – పేరులేనిదీ రాజ్యం.
సామాన్యుని సణుగుడులో – అణగిన ఆ అసంతృప్తి
అగ్నిలోని ఆజ్యముగా – అంతరాన్ని మండించగ
ఆవిరులే మృత్యువులై – అధిపతులను చుట్టుకొనగ
అంత్యకాల సమీపమై – అంతరాలు అణగిపోవు
అంధమైన అధికారం – దిగంతముల కెళ్ళిపోవు.



సెంటరులోనా – వంటలు వండీ – రుచుల పంటలూ – పండించంగా
జీవన భారము – తరిగిపోవునా – సంసారమ్మిట – సంతసించునా
పొట్టకూటికోసం – పొట్టలన్ని నింపీ – పొగల సెగల మధ్య – సోలిపాలిపోగా
మట్టినమ్ముకున్న – మనిషి పొట్టనిండీ – మగత నిదురలోనా – మాయము శ్రమకాగా
కుంచె కదలగాను – రంగులందుమునిగీ – రమ్యమైన రూపం – రహిని నిలుపగాను
కంచె రీతి బతుకు – ఆకలి కల చెదిరీ – ఆశపొట్టమాడ్చె – అందానికి ఫలం
కలం కులం బలం – అక్షరమై కవిత – అందగించెరసన – ఆనందం పొంగె

ఊహ ఊపివేయ – క్షరమాయెను శక్తి – దాహమందు మునిగె – దయనీయం ధరణి

శ్రమస్వేదం తడిసి – చల్లబడిన శరీరం – మెప్పువడసె నపుడు – ఉప్పదనం వీడి

అప్పుతిప్పలెన్నొ – దోపిడి దోహదముగను – మునిమాపుసమీపించె – మూలబడె వంటపాత్ర.

❊ ❊ ❊

అన్యాయం అకృత్యం అందలాన నిలబడితే
అధర్మమ్ము స్వార్థమ్ము అంతరాలు సృష్టిస్తే
విశ్వమానవత్త్వమనెడి వింతమాట వినబడునా
మనిషి విలువ మాడిపోగ మనసు మాంద్యమౌగదా
కులాల కుమ్ములాటలో – మతాల మారణమ్ములో
మాడిపోయె మానవతా – మాన్యమానవుని నడతా!
కాలం గడిచిన కొద్దీ – కామితములు మీరగా
గాలంలో చిక్కెనుగా – గమ్యములేనిది బతుకు
అంతరాలు మరచీ – అందరమొకటనుచూ
ఒకే జాతి ఒకే మతం – ఉర్వినుండి ఉద్భవించె
అనుచు ఉద్యమించ – అవని స్వర్గమగును
ఆశయములు అందం – అందరు మానవులం.

❊ ❊ ❊

భూమిపంట పండిందీ – భువన తంట వెలిసిందీ
ఆశమంట రేపిందీ – ఆశయాన్ని మాడ్చిందీ
ఎడారిలో మడిదున్నగ – ఏరువాక సాగిందీ
బీడుభూమి పంటగా –మేధవరులు జనించె
నేలపంట పండక – నెవ్వగతో నిండగ
ఆలోచన నేస్తమై – అవగాహన కుదిర్చె.
ఏఋపాఠి పర్వమై – మట్టిపొరలు నిండగా
మాన్యమైన పంటగా – మానవతలు నిండెను
తిండికొరకు తిప్పలూ – తప్పవెన్నొ తెలియవూ

ముప్పులేదు మనిషికీ – గొప్ప మాత భూమియే.
కాచిరక్షసేసెడి – కరుణామయి భూమాత
కాలగమన మందున – ప్రాంతములకు పంపును.
ఆరాటము అందమూ – పోరాటము పోడిమీ
ఆకలి కడుపున కన్నము – అదె జనునికి ముఖ్యమూ
కడుపునిండి కలలుపండి – కలకాలము జీవించగ
కలిమి బలిమి మీరగా – కరుడు గట్టు హృదయమూ
అన్నిటికీ మూలమూ – అవని మానవత్వమూ
అందరికిట శాంతియే – ఆశయమీ భూమిలో.



గీ. విధులు తెలియని వారికి నిధుల కోర్కె
విధులు గ్రహియించ విధియేమొ విగతమగును
నిధులు విలువల గొనునట్టి నేలలోన
జనుల విధ్యుక్త ధర్మాలు జినునికెరుక.

గీ. సరళమైనది జీవన సాగరమ్ము – మునిగితేలుట తెలియగ మురిపెమగును
గహనమైనది గమ్యము గణ్యమగును – గమనమెంచిన గడుచును సమత సహిత.

గీ. ఇల్లు ఇల్లాలు కోర్కెలు ఇంపుకావు – కల్ల కపటము జనులందు కఠినమగును
కార్యశీలము గరువము కడలిధము – వాదులాడక యాదిన వశము సుమ్ము.

గీ. త్యాగి తెంపరి తెరువరి తెలియు జగము – భోగి యోగియు జీవనయోగమెరుగు
సంగముక్తుని సహనము అంగమైన – ఆత్మ జీవన శక్తులు అందగించు.

ఆ.వె. మానధనుని కృషికి మహితత్త్వమేర్పడ – మానవాళి మహిమ మరపురాదు
స్వార్థ కీర్తి కాంక్ష వర్ధిల్లు చుండగా – వ్యర్థమాయె జగము అర్థమందు.

ఆ.వె. వేగవంత మాయె వేకువనిశియందు – రాగరహిత జనుడు రమ్యమగుట
భయము భాగ్యములను బాధలు పడుచుండ – బందిఖాన బతుకు భవము నందు.

ఆ.వె. రోగపీడ బాధ రోదన జగతికి – కాంక్షమీర కలిమి కాగిపోయె
జీవి జీవమేమొ భవితకు బంధమై – వినశనమ్ము కాగ విలువ వీడె.

ఆ.వె. మోసమెరిగి మేధ మోదము నొందెను – వేషభాష వేల్పు వేద్యములుగ.
సుఖము కొరకు మఖము సుందరమైనది – శోధసాధనము శోభితములు.

ఆ.వె. విషయమెంతొ విలువ విభవము జనునకు – పరిసరమ్ములందు ప్రగతిశీల
ఆత్మసాధనమున అదియెంతొ సుభగము – తెలిసి జనుడునడువ తేటయగును.

ఆ.వె. రంగమందు నటన రంజుగా మురిపించు – భాష భూషణముల భాగ్యమందు
భూమి రంగమాయె భువిజన నటనకు – బతుకు శాశ్వతముగ భ్రమను జెందు.

ఆ.వె. మతము మానవునకు మాన్యము ధన్యము – ఆస్తికతను కల్గి అమరమాయె
నరుడు నాస్తిగాను నవ్యమాస్తికమాయె – మతముతోడ గలిసి మారణమ్ము.

ఆ.వె. కులము కూర్మివీడె కుములగ జనులంత – మతము మార్మికతను మందగించె
హితము పాలనమును హతమాయె జగమున – వినశనమ్ముకోర విలువ విగత.

ఆ.వె. దోషమోసములును దోర్బల సహితము – భాసమాయె భవిత భాగ్యహీన
భరత దేశమందు భాగ్యమౌ స్వేచ్ఛయు – బానిసత్త్వమునకు బాటవేయు.

ఆ.వె. విశ్వవెలుగు మతము విలువల హిందుగ – తత్త్వమేమొ విశ్వ తరగగాను
సహన సమరసములకు సమగమ స్థలిగాగ – భారతమ్మె భవపు భాగ్యధాత్రి.

566

దేశం దశ దదీప్యమానమై దేహుల స్వార్థంతో దివాంధమయ్యింది
దసరా సరదాలతో దారిదప్పి దాహం మితిమీరిన దేహంతో దహించింది
అమరులైన రాక్షసుల అవతారాలు సమరంలో సంహరించేదేవి పర్వందినం దసరా
పురాణాల లెక్కలలో పురివిప్పిన కర్కశత్త్వం కలికాలపు కలగా నిజమయ్యింది
తిరుగుతున్న చరిత్రపుటల తీరు తెన్నులు తీపిదనం తినిపించేదెన్నడో
మరిగిపోతున్న మానవత్త్వం రాక్షసత్త్వం రంగువెలసిన దైవత్త్వంలో రహించాయి
వేళతెలియని వేదన వేగవంత చింతనలో వెలితిలేని కల్తీ శాల్తీని కామించింది
మరపులు మరకలై రకరకాల కంప్యూటర్ల కలతలై మానవమేధకు మరణశాసనం రాశాయి.

పావురాయి టపాలు ఇంటర్‌నెట్ట వర్క్‌లో హితంలేని హతమతులై అమరాయి
యాంత్రిక లోకంలో యాత్రికుడై యాతనలో'తన' భావన మరువని తపనుడైనాడు
పనిచేయని ప్రగతిపథగామిగా సుగతికి సూక్తుల వల్లించే సుందరవాణియైనాడు

'అందరం' అంతరంగంలో అదృశ్యమై దృశ్యంలో దూరంకాని స్వార్థం అర్థమైంది
శరత్కాల మయినా శతమాన మానాలు నాలుకపై నర్తించే నవ్యనవనీతమైంది
నవనాడులందు నాటుకొన్న నవరాత్రుల నవ్యత్వం దివ్యత్వంలో దిగి మతిపోగొట్టింది
దేహం దేవుని కర్పించి దేవిడీలో ఊరేగే 'స్వామి' దేవులకు స్వాగత సత్కారాల కార్యాలు
కొరవడిన మన్నిక కోర్కెల ఎన్నికలో కల నిజమై కలగాపులగమై పూజ్యతకోల్పోయింది
దానవుని దమించి దారిచూపిన 'దసరాదేవి' మానవ రాక్షసుల మహిమలో హిమమై కరిగింది
పూజలు పుణ్యకార్యాలు పునీత మాతల జాతకాలను జాజ్జ్వల్యం చేసే జావళీలు
మాన్యమైన మాత గణ్యతను మౌనంగా తృణీకరిస్తున్న నవనాగరక కొడుకుల వన్య జీవనం
మారణకాండల మహనీయ శతాబ్దం మరోదారుణ కాండల శతాబ్దానికి దారిచూపదుకదా!
ప్రకృతి సమతౌల్యం ప్రగతికీ సుగతికీ సంబంధంలేని కార్యకారణ రణదారుణం
అశనం అవశనమై నాశనం శ్మశానంలో నవ్యమై దివ్యత్వానికి దిగుడుబావియై దీనత్వమైంది.
వేదన వాదనలతో వేళమించిన వేగం వేద్యుల వెలుగుతో వెతలు తీర్చే రోజు దసరా!
16 దసరా రణతోరణమై రవళించిన రమ్యస్వామ్యానికి ఆసరాగా నిలిచింది
మార్పు తీర్పు ఆర్పిన దివ్వెగా అర్పణచేసిన అంతరంగానికి తర్పణయై తరించింది
సృష్టినిచ్చిన శృంగారానికీ పుష్టినిచ్చిన ఉత్సాహానికీ నష్టి చేసిన నాగరలోకం నవ్వులాట
మంచి నించి మధువుపంచి నవవధువుగా ధవుని సరసన చేరిన దేవికి 'దేహ సరదా' దసరా
మానవాళి వాంఛించే మంచి కోరికకు నిరంతర అంతరాయం కల్గుతున్న నేపథ్యం యీ పదం
శాంతి శమించి కాంతి కలతచెంది దాంతి దమనమై దారి తెలియక దనుజుల పాలబడిన పాలితులు
నగరాల నగారాలు గ్రామాల గారడీలు గాటగట్టిన పాలక జనభ్రష్టతలు పవిత్ర మౌతున్నాయి
కాదన్నది కానిదైనది కామించినదై మించినదిగా మిగిలి కారుణ్య కార్పణ్యాలలో కలిసిపోతున్నది

అంతరాల తరాలు అదృశ్యమై దృశ్యమానమౌతున్న అత్యద్భుత అంతరంగాల తరతమాలు

పంతాలు పట్టింపుల యింపులో లయిస్తున్న లాక్షణిక చట్టాల లావణ్యపు గరితల గరిమలు

జీవనగీతం జియ్యరుల వనమై నవరాగంలో దివ్యమై భవసాగరసాహస యీదులాటలో హిత హతమయ్యింది

పంకమగ్నమైన పంకేరుహాక్షుల పావనతకు నవ్యతనాపాదించే నవలా శిరోరత్నాల రాసిక్యం

సూక్తుల శుభకీర్తుల సంకీర్తనలో ఆర్తుల ముక్తిని మౌక్తిక పంక్తిని ధరించే మానవ రాజుల మాన్యం

కలిమి మెలివేసిన కారుణ్యం ఋణం తీర్చుకొనే రోజున కార్పణ్యమై దర్పణంలో ప్రతిబింబించింది

కూలిపోయిన కులసౌధానికి జీర్ణోద్ధరణ కార్యక్రమంలో నిమగ్నులైన నీతిజాతిలేని నిమ్నులు

కాలాన్ని కలంతో గుర్తించి కలకాలం కలిమితో నర్తింపజేసి వర్తనలో వర్తులంగా తిరిగే వాసిగన్నవారు.

వేర్పాటు పాటవంగా రాజకీయ పాటపాడే రాబందుల నేతల బందీగా బంధువుగా బాధితుడు పౌరుడు

పెద్దాచిన్నా పేలవమనే మొద్దబ్బాయి మాటల్లో మోతుబరులు బరితెగించి బరాబరులొనరించే భావియుగం

ఓర్పు ఓర్చుకొనలేని ఖర్చులోబడి తీర్పుగా తిరగబడి ఉద్యమంగా ఉరవడించి హృద్యంగా శోభించింది

మరలా మరలా వచ్చే మానవ సదాల దసరాలు మాసిపోయిన వానికి మానసపుత్రికలై ప్రభవిస్తాయి

కానరానిది కలిమినిచ్చేది కామిత దైవమని కాంక్షించే ఆంక్షల ఆదిమానవుల కభివందనం

జన్మకూ, మృతికీ మతాన్ని ముడిపెట్టే మానవతత్త్వం బ్రతకు శ్రుతికి బంధువుగా నిలుస్తుందా

నవరాత్రులు తరతరాలకూ పాత్రమైన పవిత్రతను కొనితెచ్చే మానవధాత్రీ హిమాంశు రాత్రులౌతాయా

మానవసృష్టి ధనం మానవులను దహించే “ఘనం”గా గమిస్తుంటే మనసులను తట్టిలేపే దసరా హిమాంశువే

మరోశతాబ్దం మనముందున్నదై అందరికీ అందమైనదై ఆనందమయంచేసే హర్షాబ్దం కావాలి

రెండు శతాబ్దుల్లో రహించిన రమ్యజీవుల రసమయ జీవనం ధన్యమై గణ్యమై మాన్యమై పయనించాలి.



గీ. దురిత దుర్గము దూరము దుర్గ‘చేత’ – భవిత భాగ్యాల భరితము భామచేత
మహియె మాన్యాల మహితము మాత‘చేత’ – దుర్గ శ్రీదేవి భూదేవి ధృతియె మనకు.

గీ. అష్టలక్ష్ముల అవతార మవని ఆమె – శిష్ట సంపత్తి నిలయమై శివములిడును
మృష్ట ఆరోగ్య భాగ్యంపు మూలమామె – సృష్టి గమనమ్ము శుభగమై పుష్టి నిడుత.

గీ. అమ్మ అవతారములుగన నతిశయమ్ము – బొమ్మ రూపున బోలెడు కమ్మగాను
వినుత నవరాత్రులందున విలువగొనగ – విజయ కాంక్షయె దుర్గకు విభుత నిచ్చు.

గీ. శూలధారిగ శుభముల సుందరముగ – ఖడ్గధారిగ కామ్యముల్ కలతదీర్చు
సింహ పులివాహనమ్ముల చింత వీడ – కనకదుర్గగ సాగెడి కమ్మనమ్మ.

గీ. ఊరువాడల ఉర్వరన్ ఉన్నతముగ – ఉద్యమమ్ముగ నీపూజ ఉత్సవముల
లోక జనులంత సేతురు సోకుమీర – అమ్మనీవన్న మాకెంతొ యిమ్ముసుమ్మ!

గీ. రూపు రుచ్యము రుజలను మాపగాను – చూపు సూచ్యము శుభముల చూపగాను
కాపు కామిత దాయిగా కార్యములకు – ఆపు అవహేళనములను ఆర్తులందు.

గీ. రాక్షసత్త్వము రాజ్యాన రగిలియుండె – శిక్షకత్త్వము శిక్షగా శిరము వంగె
రక్షకత్త్వము రహిలేక రమణవీడె – మోక్షకత్త్వాన జనులకు దీక్షయిమ్ము.

గీ. భువన భాండము పాపాల పూడిపోయె – సవన సారము లేకుండ సరసరహిత
మాత మమ్మేలు జాతవు మహిని కలవు – పావనమ్మగ పాలించు ఫలముగనగ.

గీ. కనకదుర్గగాను కామితముల పంట – సహన సిరుల దేవి సహిత జనని
నవక రూపములను నాణ్యత మించిన – నవ్య దుర్గ నరుల దివ్యమగును.

గీ. చండి చాముండి కామాక్షి భండనమున – అంబ రూపము అవనికి అంకితముగ
దేవి దేదిప్యమానయై దేవళముల – దివ్య కాంతుల వెలుగొందు భవమునందు.

గీ. జగతి గాయత్రి గమ్యమై జయముగాంచ – మనకు సావిత్రి మాన్యమై మహిమగాంచ
పరమ పావిత్ర్య మౌనామె వరపు తనువు – పాలనమ్మున లాలనన్ ప్రభలు మించు.

గీ. నిత్యసత్యము నీరూపు నియతి దెలియు – సత్యసారము నీకృతి సవ్యతలను
సత్వకలితము ప్రకృతిన్ సరసముగను – రామ రమణీయతలనిండు రాజ్యసీమ.

గీ. జంతుజాలము జాగృతిన్ జయమునొందు
మంత్రమహిమల సుకృతుల్ మమతనిండు
భక్తి తత్త్వము భాగ్యమై భవపు జనత
ముక్తిపొందగ మాయమ్మ ముద్దులమ్మ.

గీ. జగము వైవిధ్యభరితమై జవమునిండె – సగము పాపము పుణ్యమై ఖగము రీతి
మూలకారణమొక్కటి కాలములకు – కలిని కామాక్షి అక్షియే కాంతిదమ్ము.

గీ. దసర సరదాలు ధరణిని దరికిజేర్చె – అష్టకష్టాలు అష్టమిన్ అవల బడియె
నవమి జీవన నవ్యతన్ నరులకిచ్చె – విజయ శీలము నిచ్చుత విజయదశమి.

గీ. భయము పోగొట్టు దుర్గమ్మ భాగ్యమొసగు
వేగవంతపు లోకాన వెతలు దీర్చు
నమ్మకములేని నరులకు ఇమ్మునిమ్ము
యాంత్రికమ్మగు జీవులన్ తంత్రియగుత.

గీ. మధురమీనాక్షి మనకిడు మధువు చదువు
కంచి కమలాక్షి కలుముల ఎంచి యిచ్చు
కాశి కరుణ విశాలాక్షి వాసియిచ్చు
కాళి కలకత్త నిత్యము కలిమినిచ్చు.

గీ. మంచిచెడులకు మధ్యన ముంచుకొచ్చె – పోరు ఘోరము పోడిమి మీరె మంచి
అమ్మరూపాన చూడగ అవసరముగ – దేవి దేహాన దేదీప్య దినమె దసర.

గీ. కరుణ కార్యాల కలతల కాలదన్ను – దయయు దానాల ధరణికి ధ్రఢిమయిమ్ము
ఆర్తి ఆకలి వేదన ఆవలద్రోయు – మూర్తి కీర్తిని కొలుతుము ఆస్తికతను.

గీ. విద్యవిలువను కాపాడు విజయ దశమి – కళల కాంతిని రక్షించు కలికి దుర్గ
నీతి ధర్మము నియతిని నిధుల గురియ – జాతి జాజ్జ్వల్య జాగృతిన్ జయముగాంచు.



రక్షణదీక్షలో దివ్యులైన భటులారా
రక్కసి తనమును త్రుంచి రహిని విడిచినారా!
అమరమునకు అతిథులై ఆయింద్రుని రక్షణలో
ఆత్మశాంతి పొందుచున్న ఆంధ్రపోలీసులార.

జనరక్షణ జాతిరక్ష దేశరక్ష ధనరక్షణ – పరిశ్రమలరక్ష – సరిహద్దులరక్ష
ప్రతినిధులకు రక్ష – వ్యవస్థ సంరక్ష – నిత్యమునీ కర్మయే సత్యము యీమాట.

శిక్షణదారిలో – దక్షత పయనించీ – తిరుగుబాటు నణచీ – పెడధోరణి పెరికీ
ఉగ్రవాద ఉనికినీ– ఉద్యమంతొా అణచీ – మానధనము కాపాడిన మాన్యులు మీరెగా!

ధైర్యసాహసాలలోన – దాపరికం లేనివాడ
క్రూరత్వము దూరముగా – కూల్చివేసి కునికినోడ
దారుణాల మారణాల – దారిలోని సూరీడా
కాలవిధిని కలసినావ – కర్కశయమ గుండంలో.

పగలనకా రేయనకా – పాటుబడెడి కాకివాడ
నేరఘోర విధులందున – భారము వహియించినోడ
ప్రజారక్ష భాగ్యముగా – పరమార్థపు సేవకుడా
కాల్పులలో బాంబులలో – కాలుని నివు జేరితివా.

మానవత్వ రహితమైన – మానవలోకము
నమ్మకమ్ములేనిదిగా – నాగరలోకము
హింసనమ్మ హితముగా – హీనత లోకము
హితమతినిను నమ్మదుగా – హీన సంస్కారిగా.

చెడునెదిరించిన చైతన్యవంతుడా
నిత్యసత్య నియతులే నిధిగ నీకుండెగా
విధుల బాధ్యతలందు విలువలే వలువలుగా
మృత్యువు ఒడిలో ఒరిగిన ముత్యముగా వెలుగొందుము.

ఆత్మశాంతి అమరములో – సమరశీల సవనములో
అమర్‌రహే – రక్షకబటులు – అంతరించు ఉగ్రవాదము.

జాతిగీతంలోని – జావళీలె నీచేతలు
వందేమాతరం పాడిన – వంతలేని గతినీది.

సారేజహాసే అచ్ఛా – సాహస రాజువు నీవు
రాజులకే రక్షనీవు – రక్షకభట శ్రేష్టుడవు.

ఆ సరిహద్దులో – అక్టోబరు నెలలో
పంజాబున కాశ్మీరున – పాకిస్తాన్ సరిహద్దున
బాధ్యతలో బరువులో – భారతికే బంధువై
భాగ్యవీర యోధుడవై – భవబంధము లన్నివిడిచి
బాటసారి మాదిరిగా – దివినిజేరి అమరుడవై
దిటవు బతుకు బతికినోడ – నీరాజనిమదె గొనుమా
నిత్యం నీస్మరణ సత్యం.

రామరాజ్యకామనలో – రావణుల దహించినోడ
ప్రజాస్వామ్య పాలనలో – ప్రాభవభట శ్రేష్ఠుడవు.

నివాళులను అర్పించగ – నీతిని ప్రస్తుతియించగ
నియమాలను నిధిగ గనగ – నిరుపమమై వెలుగు విరియు.

నక్సలైట్ల నణచినావు – ఉగ్రవాది నదిమినావు
టెర్రరిస్టు 'రిష్టు'విరిచి – తెగువ రక్షకుడవైతివి.

గుండాలను దండించగ – రౌడీలను డీలువరచ
హంతకులకు అంతకుడా – ఆర్తులకే ఆప్తుడా!

ఖాకీ దుస్తులలోనా – కాగిపోయె నీతనువు
కుచ్చుటోపి కూల్చెను – కులమతముల జాడలు.

కులమతాల కొట్లాటలు – కలవారి దురాగతాలు
మదమత్తుల మారణాలు – తాగినోళ్ళ తగాదాలు.

సమరజీవి సరసుడా – అమరజీవి వైతివిగా
అందకోయీ అంజలి – అందరిదీ అమరాంజలి.

కాలం కదలినా – కదలని నీ సాహసం
వదలదు యీ భువినీ – విడువదు మామదినీ.

అన్నిటినీ అణచినోడ – ఎన్నిటినో ఆపినోడ
మిన్నవైన పోలిసోడ – మింటిపైన మిగిలినోడ.

రక్షణలో దేవుడవై – జీవితాన జీవుడవై
తరతమాలు లేనోడ – తరలిపోయి తాపసుడవె.

అమరజవాన్ జోహార్ – వీరజవాన్ జోహార్
సాహసపోలీస్ అమర్‌రహే – రక్షణ సవనం రహించు నిత్యం.



యుద్ధభయం ఆవరించె అవనిని నేడు
బుద్ధి గలిగి వర్తించగ భువినశాంతివీడు
మొదటి రెండు యుద్ధములు మోడువార్చె మేదినిని
మూడవదీ వచ్చినచో ముదనష్టమె కలుగును.

ఆలోచన అవనిజనుని అంతరంగమున కలిగె
అవగాహనతో మెలగెను ఆశయమే శాంతిగ
నానాజాతుల సమితి నవ్యముగా వెలిగె
అదియె పేరు మారగా అంతర్జాతీయ మాయె.

హిట్లరు జనబట్లరుగా హీనునిగా జగతిని వీడె
యోధులంత యోజనలో వేదనలకు తెరదించిరి
విశ్వజాతులన్ని కూడి విలు వెలిగె సంస్థగా
అవతరించి తరింపగా విశ్వశాంతి విజయముగా.

నూట ఎనుబదెనిమిది నూతన దేశములన్నీ
విశ్వసంస్థ భాగస్వామ్య యోగ్యభవిత నందుగా
వీటో అధికారమున్న విలువకలుగు దేశములు
విజయకాంక్ష పయనించగ విధిహితమే హతమాయె.

మెరికలాంటి అమెరికాయె మేలి దేశమాయెగా
సోవియట్టు శోభవీడి విభవరహితమాయెగా

అమెరికా కనుసన్నల నడచుచున్న సంస్థగా
ఐక్యరాజ్యసమితి విలువ అణగిపోవుచుండెగా.
జాతుల సంక్షోభములే జావళీల మాదిరిగా
దేశ దేశ సరిహద్దులు దేహములను చెరిపెగా
కలతలేని జీవనము కలియుగమున కలుగగా.
ఆలయమే ఆసమితి అందరికిని మోదముగా
ప్రళయములే సంభవించి ప్రాభవమే వీడగా
ఆదుకొనే ఆశయమే ఐక్యరాజ్య సమితిదిగా
ఉగ్రవాద నిగ్రహమున ప్రగ్రహమే ప్రకటించగ.

దురాక్రమణ దూరంగా తరిమివేయు సంస్థయెగా
అణుయుద్ధము అవనికే అందరహితమైనదిగా
రణభావన రాజ్యములకు రమణీయము కాదుగా
లిటిల్‌భాయ్ ఫాట్‌మాన్ కఠినమైనవని తెలిసెను
హిరోషిమా నాగసాకి హితమునేర్పె మానవులకు
నియంతలను నియంత్రించు నీతియె ఆసంస్థది
మతము హితము మానవతకు మహిమనిచ్చునదెయిది.
అడ్డుగోడలన్నికూలి అంత విశ్వమయముగా
పౌరత్వము పావనము అందరిదొక జాతిగా
మానవులది ఆజాతి మనుమార్గము దానిది
మానవత్వ తత్త్వములో మహిని మధురమగునది.

శిక్షణ రక్షణలో శివమె దాని గమ్యము
కరుణ దయల పంచుటలో కమనీయము ధన్యము
పరస్పరము ప్రగతికీ అన్యోన్యము అభివృద్ధికి
ఆశయమే ఆశగా అంతర్జాతీయముగా
అవతరించి వృద్ధినంది తరించు నీ విశ్వసంస్థ.



పోలియో! పోలియో మాయదారి పోలియో
పోగొట్టుము దానిని పోలియో చుక్కలతో

పోలికలేనిది వ్యాధి పోలియో అనేవ్యాధి
పల్సుపోలియోలలో చెల్లిపోవు చల్లగా
అంగవైకల్యముతో అవని జనులు బాధపడగ
వైద్యశాస్త్రవాసిపెరిగి వేద్యమాయె వ్యాధిమందు
తెలివి గలిగి తెలిసికొనీ తరిమివేయు పోలియోను
అంతర్జాతీయ సంస్థ ఆరోగ్యము నందించగ
జాతి దేశములను జనత ఘనతర జన్మలు పొందగ
నాల్గుసార్లు చుక్కమందు నాణ్యతగా నందించగ
ఆనందము అందరిదై వైకల్యము వికలమగును
అయిదు వత్సరాలలోపు – అందరు బిడ్డల జనకులు
వీధిలోని బడులందు – ప్రత్యేకపు స్థలములందు
మందుచుక్క వేయువారు – మనకందుబాటులోన
పసిపిల్లల మందువేసి – పావనతను అందింతురు
డాక్టరులూ నర్సులూ – ఆరోగ్య సేవకులూ
స్వచ్ఛంద సంస్థలూ – వైద్యశాఖ ఉద్యోగులు
ఎన్సీసీ ఎన్నెస్సెస్ – విద్యార్థులు పోలీసులు
అందరచట కలియగా – అందునుగా పల్సుపోలియో
బాధలేదు భయంలేదు – జ్వరం జలుబు దగ్గున్నను
పసిబిడ్డల నందరికీ – చుక్కల మందేయించగ
సున్నయగును పోలియో – మిన్నబిడ్డ భవితవ్యము.

567

తే.గీ. జగము వైవిధ్య భరితము జనులు కూడ – కొంద రానంద పడుదురు కోర్కెలలర
జనుల సేవను దయనిండు జాతివారు – అర్థవంతము అదియెగా ఆపదలను.

తే.గీ. రుగ్మతలు లేని రుజలేని రూక్షజనులు – విశ్వమందున కనరారు విదితమదియ
వైద్యసేవల సేవించు వేద్యులిలను – నర్సులను పేర నాణ్యమై నరుల తనువు.

సీ. అతివల రూపున మతిమంత గతితోడ – మల్లెల రూపము మాన్యమగును
సహనమ్ము సాక్షిగా వహనమ్ము వైద్యమై – వాసిని గాంచెడి వరపు జనులు
బాధను తొలగించు భవితను చూపించు – భాగ్యమ్ము బావమై భవము నిండు
వేదన వెడలగ సాధన సవనమై – సంతృప్తి వహియించు సమత పంట.

తే.గీ. మదరు మాన్యము వారల మనసు మల్లె – గరిత ఫ్లొరెన్సు గమ్యము గరువమబ్బు
విసుగు విరమణ విడిచిన విబుధులంత – విశ్వ నర్సుల దినమున వినుతిగాంచు.

తే.గీ. బాధపడువారు కనబడ భాగ్యమగును – దయకు పాత్రులు దేవులు ధరణిలోన
కరుణ కనగాను కలిమిగ కాంక్షసేయ – తనువు తపనను తరిమెడి తపసులిలను.

సీ. రోగాల రూపాలు రోదన మిళితమై – జంతు ప్రపంచాన జయము మీరె
తెలివిని మించిన తెలియని వ్యాధులు – తెగబడి తెగువతో తెరలె నిచట
రసహీన వైరసు రాజ్యాన ఎయిడ్సును – క్యాన్సరు సర్వమై కరకు జగతి
ప్రాణాంత కమ్మగు వ్యాధుల ప్రగతిని – విగత ప్రమాదాల వింత దెలియ.

తే.గీ. అమ్మరూపాన ఆలించు ఆర్తులన్ని – అక్క చెల్లిగ బంధాన అనుసరించు
దేవతగతాను చల్లని దేహసేవ – మానవత్వాన మనుచుండు మహిమ భువిని.

సీ. ఏరాగ బంధమ్ము ఎఱుకను లేదుగా – అనురాగ మనగాను ఆమెగానె
ఆలనాపాలనా అనురాగమమకార – అంతరంగముతోడ ఆమె నిండు
దయజూడు ధరణిగా దయితగా సేవించు – ప్రతిఫలరహితమౌ పనియె ఆమె
బంధుత్వ రహితమౌ భాస్వంత చెలిమియౌ – సమతను మమతను సర్వమామె.

తే.గీ. ఎవరికేమియు కాదాయె ఎఱుగు సేవ – మిత్ర శతృల భేదము మీరునామె
అమ్మ మించిన అమ్మయౌ ఆధునికము – సిస్టరును దల్చ సిలుగుల శివములిచ్చు.

తే.గీ. నేటి వ్యాపార సంస్కృతి నెనరు మిగుల – కామ్య కర్మలు సర్వమై కాంతివీడె
స్వార్ధ సహితము పరసేవ ఆర్థికమ్ము – హార్థికమ్మగు మాటయే అవని కరవు.

సీ. గార్హస్త్య జీవన గమనము విరమించి – బ్రహ్మచర్యమునందు భాగ్యమెంచి
దీనుల హీనుల దివ్యులగాంచగా – దళితుల సేవయె ధర్మమగును
విధిచేతి బొమ్మలై వికలాంగులైనట్టి – మానవులిల గల్గ మ్లానమామె
వృద్ధుల నిలయాల ముద్దల సేవను – మురిపించు నర్సులె ముచ్చటాయె.

తే.గీ. స్త్రీల శిశువుల పెద్దల శివము సేవ – పరుల బాధలు పోగానె ఫలము సుఖము
కసరు విసరులు కననట్టి కాంతలంత – శాంతి సంతస సాధకుల్ శక్తిమీరి.

తే.గీ. శాక్యకులమున జన్మించి శమనుడైన – బోధివృక్షపు సన్నిధి బోధనంది
బాధతప్తుల భాగ్యము భవములోన – జ్ఞానగమ్యము మోక్షము జగమునందు.

తే.గీ. బుద్ధదేవుడు జనియించి బద్ధుడాయె – కోర్కెలిలలోన కొఱవులై కొఱతవేయ
మార్చె మానవతత్త్వము మనసునిలను – భోగభాగ్యాల వర్జించె భువనమందు.

తే.గీ. దుఃఖమూలము జగమగు దురిత సహిత – హింస హీనము హేయము హితమతులను
మేలి అణువుల యోజన మేలియోగ – బ్రహ్మచర్యము బంధువు బంధరహిత.

తే.గీ. ఆలుబిడ్డల బంధువుల్ అవనిలోన – శాశ్వతులు కారు శమమున సాగగాను
సుఖము లిల శాశ్వతములుగా చూడబోము–మోజు మోహము విడివడ మోక్షమగును.

తే.గీ. సార సంసారమనుమాట సాగదిపుడు – వేదనలనన్ని భరియింప వేద్యుడగును
వినుతమార్గము అష్టాంగ వితతితోడ – కాలగమనము సాగగ కలుగు ముక్తి.

తే.గీ. బుద్ధబోధల తత్త్వము పూర్తి దెలియ – జన్మరాహితమును కోరి జగమునందు
జ్ఞాన గమ్యము చేరగా జయముకల్గు – ఆచరణమున మానవుల్ ఆర్తివీడు.

ఆ.వె. ఆసియాకు వెలుగు అవనికి సూరీడు – ఆశ ఆర్తిబాప అధికుడాయె
అంతరంగశుద్ధి అతిముఖ్యమనెతాను – ఆచరించి చూపె అధికుడతడు.

సీ. పూర్ణిమరోజున పూజ్యుడై పుట్టెను – సిద్ధార్థ నామకసిరుల సీమ
వైశాఖమందున వాల్లభ్యశోభను – వాసిగాంచినయట్టి వరుడుతాను
సూర్యుని తేజము సూక్తుల శ్రుతిమించు – చైతన్య భరితమై చేతముండు
ఆచరణమునందు అసమానమహితము – అవగాహనముతోడ అవనినిలచు.

తే.గీ. శాంతి సమతల సుమతియె శాతవాణి – త్రిపిటకములను తిరువీధి తిరిగెతాను
రత్నత్రయమున రాజ్యము రాణమీరె – హింస హననము సంస్కృతి హితము మతము.

సీ. అణ్వస్త్రమును సేయ అధికమౌ కాంక్షను – భారతియెంచగా భాగ్యమాయె
బుద్ధపూర్ణిమ రోజు బద్ధమౌ విధమున – విస్ఫోటనముసేయ వినుతిగాంచె
విశ్వాన విలువల వేద్యంపు వెల్లువై – రక్షణ రహిమీర రాణ జెలగె
అగ్రరాజ్యములన్ని ఆశ్చర్యపడగాను – పొరుగుల రాజ్యాలు పొలుపు దక్కె.

తే.గీ. దేశరక్షణ దక్షత దివ్యమగును – వేత్తలందరి జ్ఞానమ్ము వెలుగునిచ్చె
మానవాళికి శాంతిని దానమిడగ – బుద్ధ భావన కలియగా శుద్ధమాయె.

తే.గీ. రాగ బంధాల వీడిన రాజుగాను – కలిమి కమనీయ సుఖములు కఠినములుగ
వదలె సర్వము వరుడిల సదయజనుల – ఆశయము ముక్తి ఆర్తిని అవనివీడ.

తే.గీ. తల్లి తండ్రిని వీడిన తనయుడతడు – అనుగుణమ్మగు అతివను అవని వీడె
పుత్ర మిత్రుల విడిచిన పుణ్యుడతడు – మోక్షమార్గము జ్ఞానమై మోదమిడెను.

**పిల్ల విద్యార్థి**

బంగారు భారతాన కంగారున కలిమి వీడి
కరిగిన కల జీవితమై భ్రష్ట భవిత భాగ్యంగా
బడి గుడిగా భావించే బడుగు జీవి విద్యార్థీ
వినవింపుగ వివరింతును వేదంగా నీదు బతుకు.

పుట్టిననిను పుణ్యుడిగా పురుషార్థపు గణ్యుడిగా
అమ్మనాన్నకాప్తునిగా ఐదేడులు ఎదుగుతావు
పుస్తకాల చదువుకోరి పుస్తెలమ్మి బడిజేర్తురు
ఇంగిలీసు వెంగలిలో ఇంపుసొంపు కలుగునంచు
జీవితంపు తెరువు వీడి జవములేని విద్యనేర్చి
పట్టెడన్న మెట్టలేని పాలికాపు చదువునీది.

మమ్మిడాడి సంస్కృతిలో మనసు మలినమైపోవును
గురుకులాల గురువులంత గుణగణ్యులు అమ్మకాల.
ఎల్కేజీ క్రేజులోన యూకేజీ ఉదయించును
ఫస్టుక్లాసు ప్రారబ్ధం సెకండరీ చైతన్యం.

మూడునాల్గు మూలబడగ ఐదాయెను అర్థరహిత
బరువునీది భారమాయె సంచిమించె పుస్తకాలు
ఎంట్రెన్సుల టెండెన్సీ ఎఱుకమీరు బాల్యమందె
ఎలిమెంటరి స్కూలుచూడ 'మెంటలొ'చ్చు పెద్దలకే
బలవంతపు బతుకుతీరు ప్రతిఫలించు విద్యలోన
సరకారు బడులలోన సంతసరుకు అయ్యవార్లు
వింతతీరు అధికార్లు విలువ లెంతొ విద్యమగును.
సుంతకూడ నీతిలేని స్వార్థపరుల సంతానము.

మమత వీడి మాతలంత తరుముచుంటె తపనతోడ
చిన్నమనసు చిన్నవోయి చిదుముచుండె ఆశయాల
కాన్వెంటుల కాంట్రాక్టుల కలిమి కొలిమి మెలివేసిన
కామందుల పాలబడిన నీగురువులు గురుతె వేరు.

వ్యాపారం వస్తువుగా నీవుంటివి నీతి విడిచి
వయసేదైనానుగాని వెలకు దొరకు నేటి చదువు
పరిషత్తులు మండలాలు, ప్రాభవమున పంతులోళ్ళు
జనసొత్తును దిగమింగగ జయమెంచెను స్వంత బళ్ళు.

అనుమానం రేకెత్తిన అభిమానం తలకెక్కిన
ఆశయాలు మోసులెత్త ఆశలు అడియాసలాయె.
ప్రశ్నించిన బదులురాదు ప్రవచనమున ప్రగతిలేదు
విప్లవాలు స్వప్న గతము పగటికలలు ప్రాభవములు
స్వేచ్ఛలేని జీవితమై చెలువువీడె చేతనములు
ఏడోతరగతి రాగా జిల్లా కామను టెస్టున
కాపీలే కామనాయె అయ్యవార్లు అధములాయె
ప్రైవేటు బదులవారు ప్రచారాన ర్యాంకులకై
దొంగమార్కులేయించుక దోపిడి చేయుచునుందురు
గాడిద బరువును మోయగ అడ్డగాడిదవుదువీవు
గాడిదప్పిపడిపోదువు కష్టమైన పనిచేయగ
ఇంతలంతవౌదువనీ ఇంజనీరు చదువగాను
ఇంజను ఫెయిలయిపోవగ ఇంపులేని జీవితమౌ.

డాక్టరీయె డాబుసరిగ అమెరికాకు వెళ్ళొచ్చని
ఆంధ్రలోన చదివించగ అసమర్థుడె అన్నిటిలో
కలెక్టరని కామించగ కండక్టరుగానె మిగిలె
కంప్యూటరు చదువులోన ఇంట్యూషను ఇగిరిపోయె
కాలానికి పనికొచ్చెడి కార్మికత్వ విద్యలందు
మార్మికతలు మతిని జెరుప ధార్మికతయె ధరణివీడె.

అవగాహనలేని విద్య అమ్మకమున కొస్తుండగ
వమ్మగునుగ జీవితాలు 'డమ్మీ'గా మారుదువుగ.
సమాజమును చదువగల్గు వినయ విద్య విలువగలుగ
సారవంతమైన బతుకు సాగింతువు సహనముగను.
అంతరంగమొప్పుకోని వింతరంగు విద్యనేర్వ
ఆశయాలు ఆశలన్ని ఆచరణను అణగిపోవు.
బాధలన్ని వీడిపోయె బాగైనది నేర్చుకొనగ
భావమెంతొ బలము కలుగు భవిత భవము భాసమగును
అప్పులతో తిప్పలతో తండ్రి తల్లి తనయులనూ
తాముకోరుకున్నరీతి చేయ చెలువ మొప్పు చెంత.
పదోక్లాసు సదివినాక ఉద్యోగం వస్తుందని
ప్రయత్నించి ఫలంలేక పేపరు లీకయిపోయెను.
ఇంటరులో కోచింగులు ర్యాంకులకై రాగింగులు
ఎంసెట్టుల సెట్టింగులు కంప్యూటరు కథలు వేరు
లాంగుటర్ము షార్టుటర్మ్ లాసగునుగ వత్సరమ్ము
అప్పుల తిప్పలు పడగా తప్పవుతిప్పలు నీకిట
ప్రభుత్వాలు మారగానె మారిపోవు పద్ధతులే
సిలబస్సులు మారిపోగ విలవిలమను విద్యలిచట.
బస్తీలకు పంపగానె ముస్తాబయి ముచ్చటగా
చదువు చెదలు పట్టగాను చదరంగము నీదు బతుకు
బియ్యస్సీ ఎమ్మెస్సీ ఎదిగిపోయె పైకిపైకి
బీకాములు ఎంకాములు బిగిసిపోయె లెక్కలేక
బియ్యేలూ ఎంఏలూ భీరువులై భారమాయె
డిగ్రీ లెన్నయినగాని డీల పడ్డ చదువునీది.
చదువులన్ని జీవితంలొ చట్టుబండలైపోయెను
పదవినున్న పెద్దవాళ్ళ చదువంతా స్వార్థానికె
ఎదుగుచున్న మదిగదిలో ఎరుకనిల్పు చదువెంతొ
నడక నడత నాణ్యమైన నవ్యమగును నీదు బతుకు
నాగరికం మీరిపోయి నయవర్తన నీటగలిసె

వాగాడంబరమెంతో వాటమాయె బతుకుబాట.
తరంమారె తపనమీరె తరియించగ ధనమేయని
తగవులాట మోసమంత తనకొరకే భారతాన.
మనం మనకు మాన్యమని మనమంతయు మనగనేడు
నమ్మకమ్ము వమ్ముకాదు నవ్యవిప్లవమ్మువచ్చు.
ఆసెట్టులు లాసెట్టులు స్యూసెట్టులు క్యూసెట్టులు
ఎడ్‌సెట్టులు మొగ్గతొడిగి యత్నంలో రాలిపోవు.
నీతిలేని జాతినేడు నీరసించి పోవుచుండె
అప్పుల రుగ్మతలోనన అతలాకుతలమ్ము జనని.

నిరుద్యోగ నీడలోన నిమ్నమాయె నీదు భవిత
ఉద్యోగం, సద్యోగం దోపిడీకి నిలయమాయె
లంచమన్న లాంఛనమని మించిపోయె మంచిదాయె
నీతిధర్మయుతుడునేడు మతిహీనుడు అసమర్థుడు.
సమాజమే కానరాదు స్వార్థపరుని కన్నులకిట
సమానత్వ సారథిగా సాగనీవు మాధవుడవె
ఆరోగ్యము అందరికిట అవసరమ్ము అందముగా
అర్థమునకు కొనరానిది సార్థకమ్ము పరమార్థము
సిద్ధాంతము రాద్ధాంతము సిద్ధులంత చింతనలో
పార్టీలను ప్రబలియుండె పాలనమ్ము నరకమ్మిట
ఇంజనీర్లు డాక్టర్లూ ఇమడలేక భారతాన
వీసాలకు మోసాలకు వెళ్ళిపోదురమెరికాకు
మెరికలాంటి మేధావులు మేరాభారతమునందు
మెప్పులేని మొప్పెలుగా మేదినినే మేలుకొలుపు.
కూడులేని గూడులేని కూలన్నల రైతన్నల
కూటమిగా జనస్వామ్యము కూలుచుండె కులములతో
రోడ్డుమీద నడుస్తుంటె రోదనలను వేదనలను
రొంపినీళ్ళ దిగబడగా రౌరవమ్ము గుర్తుకొచ్చు
ద్వేషాలకు మోసాలకు దేవీడీగ భారతమ్ము
విద్వేషపు విషజ్వాలల మాడిపోవు మోదు విధము

చదువుకొన్న మూర్ఖులంత మంచి చెడుల మరచిపోయి
మాలిన్యపు మనుగడలో కడతేరగ కఠినమాయె.



ఇంటిపేర్లు ఇంపుగాను ఊరిపేర్లు ఉబలాటము
కులంపేర్లు చివరచేరి కంపుచేయు చెలిమి బలిమి
అధికారం అర్థాలలొ అంతరాలు అసలె లేవు
వ్యధల బతుకు అధములలో అక్షరమ్ము అంతరమ్ము
ప్రత్యేకత పంపకాలు ఫలమివ్వగ దళితులకిట
పెద్దవాళ్ళె పంచుకొనగ పేదలకిక రోదనమిట
జనసొత్తును దిగమింగిన జాతిద్రోహ నేతలకిట
నీతిపాఠమును నేర్పగ నిధిగ నీవు తరలిరమ్ము.
ప్రజల సొత్తు రుచిమించగ ఫలహారము పాలనమున
ఉద్యోగులు నేతలంత ఉరవడిగా నంజుకొంద్రు.
కష్టాలను నష్టాలను కాలేకడుపులతోడను
కాలమంత గడుచుచుండ కాంతివీడె బతుకులన్ని
మంచుగదుల మదవంతులు వంచనతో సుఖియించగ
బానిసలుగ బడుగులంత గడుపుచుంద్రుజీవితాల
సమాజాన్ని విడగొట్టే సమత లేని విమతులంత
రాజకీయ నేతలంత రాలిపోయె రోజువచ్చు.
వాటాలతొ వంతులతో జనులవంత పాల్జేసెడి
జాతిద్రోహ దేశద్రోహ నాయకులకె నాశనమ్ము.
పెద్దవాళ్ళు పెద్దలుగా పేదలేమొ పేదలుగా
పెరిగిపోవు తరిగిపోవు రోజులకిక నెలవులేదు
అసూయలే అధికమాయె ఆశలెన్నొ అందలమున
ఆలోచన ఆశయాలు అవనిజనుడ నీకు తగును.

కలంపట్టి గళంవిప్పి కాలానికి కలిమికోరి
కాంతిశాంతి కమ్మదనము కలిగించుము భరతభువికి
దినపత్రిక దిసమొలతో ప్రదర్శించునధర్మాన్ని

ఆచరణము మృగ్యముగను ఆశయె ఆసురమౌనిట.
సంపాదన పాదులోన – పెరుగుపదవి వృక్షమిచట
నీడనుండు నిమ్నజనులు నీతినియమ నిధులు జగతి.
అధికారపు దాహంతో అంధకారమాయె భవిత
చీకటిలో చిక్కుకొన్న వ్యాపారము చెన్నుమీరె
న్యాయానికి కూడులేదు అన్యాయం పాయసమ్ము
నవ్యధర్మ మధర్మమే నరుని బతుకు నరకమౌను
నువుబతికే దారిలోన నిధులవేట నిత్యముండు
నిధియే నిత్యమ్మనుకొని నీతిని వదలుదురంతా
ఒత్తిడి చిత్తడిలోనన చిత్తయిపోవును చిత్తము
శాంతమ్ముగ నీవుండిన చింతలన్ని చెరిగిపోవు.
మానము హీనమ్మాయెను మనీమాయ మగతలోన
మౌనమ్మిట మార్గమ్మగు మానధనము గలవారికి
టెస్టు బుక్కు నోట్సులన్ని టేస్టులేక వేస్టాయెను
బతుకు టెస్టు భాగముగా బెస్టువిషయమున్న చాలు
అన్నమింతపెట్టలేని అధమ విద్యమనకెందుకు
సున్నరాని సుగతులంత అందలమున అందగింత్రు.
కులమతముల ఉద్యమాలు కుప్పతెప్పలాయె నేడు
మలమూత్రము సదృశముగ మాపెమనసు మానవతను.

తల్లిదేవతనినమ్మెడు తనయులిచట తరుగుచుండ
తరుణులగౌరవించు తపన పరులు కానరారు.
నాన్ననేమొ దేవునిగా నమ్మునరులు వరులు లేరు
నయమార్గపు గురువులనిట గురుతించెడి గుణులు ఎవరు.
తప్పించుకు తిరుగువాడు దన్యుడగును ధరణిలోన
నొప్పించిన నొవ్వగాను తప్పుతెలియు మొప్పెలంత.
వేమనేమొ వేమాయెను బద్దెనకిట బతుకులేదు
శతకాలలొ నీతులన్ని శతమర్కట మతులాయెను.
అక్కలు సెల్లెళ్ళలాగ ఆడువారి గౌరవించు
మాన్యులైన మగవారలు మహిని జూడ మరుగాయెను.

ప్రజల సొత్తు దోచుకొనుట ప్రతినిధులకు పరమమ్మిట
ప్రజాసేవ కోసమొచ్చి ప్రజల మరచి ప్రగతి గాంచు.
కళ్ళముందు ఘోరములను కాంచిమిన్నకుండువారు
తమకొచ్చిన కష్టములను తలచితపన పడుచుందురు.
పదిమందికి మేలుపంచ పందల పనిపట్టగాను
పరమార్థం అర్థమనుచు ప్రజలు తలచ ప్రగతిమీరు.
తనవారలు తనకుతీపి పెరవారలు విషము తనకు
జనవిషయము స్వార్థమిపుడు జగతిగమనమెటుపోవునొ.
పెద్దోళ్ళకు చ్టమగును పేదోళ్ళకు విరుద్ధమౌ
చట్టములను సాగు ప్రభుత గుట్టుదెలిసి జరుగుమీవు.
ఎన్నికలలొ నిలబడుటయె ఎంతొ కష్టమగును నేడు
మనీమైండు వయోజనులు మనకిప్పుడు ప్రతినిధులూ.

చావు సమీపించగానె భయముతోడ బంధువులను
మానవత్వమాటచెప్పి మరలింతురు ధనవంతులు.
మంచి మిగులు మానవులకు మరణించిన మరుగైనను
ఎంచిచూడ ధనముకంటె గుణము మించు కాలములకు.
మాత మరచు దీనులంత జాతి చెరచు జాణలంత
జయముగాంచలేరు తుదికి జవమువీడి జరయు మిగులు.
నాదేశం నాజాతని నలుగురిలో చెప్పుకొనుట
జాతి రక్తి దేశభక్తి దేదీప్యము దివ్యమగునున.
కరుణలేని కాలమాయె కాంచనమ్ము కామితమ్ము
కొంచెపడుట విత్తమునకకు మించె మనుజు వర్తనలో.
చిన్నబిడ్డ చెన్నుదప్పి అన్నార్తత నలమటింప
చూచిచూడనటులుండు మానవులకు మనసులేదు.
మరణించుట తథ్యమనీ మరపు మనకు మన్నికనీ
తెలిసినరుడు తెలివివీడి తపన పడును ధనము కొరకు.
కొనరానిది అనుబంధము కొలతలేదు సంబంధము
కోలుపోయి కొఱవడగ కర్కశమగు కలతమీరు.
ఎటుపోవునొ యీ జగతి ఏమైపోదురొ మనుజులు

ప్రళయమొచ్చు వేళరాగ పరుడు తనకు తోడగునుగ.
అందలాలు అందుకొనీ అహముమీరి గహనమందు
అంధులగుచు అధిపతులూ అంతరింద్రు వంతమీరి.
ఆపలేని జనవాహిని ఓపలేని అసూయతో
తిరగబడీ విరగగొట్ట తీరుమారు వంచకులకు.

**కల్లూరి కోటేశ్వరరావు గారికి**

మందుమానుకోవయ్య బాబూ నువ్వు మనసు మార్చుకోవయ్య బాబూ
మత్తుమనిషి చిత్తుచేయు మాసిపోవు మంచితనము
కందుకూరునందు నిన్ను జనులందరు కాంక్షించగ
ఛైర్మనుగా గెలిచినీవు చేయూతతొ చేతమిచ్చి
అప్పుచేసి జనులు మెచ్చు అవసరముల తీర్చినావు
బీదబిక్కి భీరువులకు భయములేని తీరుగాను
దానమిచ్చి దయదలతువు దాపరికము లేకుండగ
పోలీసుల జులుంలోన పేదవర్గముల వారలు
బాధపడగ బంధువుగను బయలువెడలి తప్పింతువు
నిన్నునమ్ముకొన్నవారి నమ్మకాన్ని మించినీవు
మన్ననతో మనసుతోడ మాన్యులనుగ చేయుదువిట
అస్వస్థత నీకు కలుగ అందరొచ్చి ఆప్తులంత
బాధపడిరి బంధువులుగ బంధమనిన చూడనదియె
మనసు చివుకు మనుచుండగ మాన్యుడవై మానవతను
సహాయమ్ము చేయగాను సమత మమత సహిత గుణుడ
తల్లి ప్రేమ తరగనిదై తన్వి తపన మీరనిదై
తనయలు తనయుడు తగగను తరియించగ తగవుసేయి.
చేతికెముకలేకుండగ దానమునువు చేయగాను
ఆశ్రయించుకొన్నవారి అవసరాలు తీరిపోవు.
ఆరోగ్యం ఆనందం అందుకొనగ ముందుండుము
మందుమీరి మనసుజారి మనుట దుర్లభమ్ము మీకు.
సేవజేయు తలపున్నను ప్రతినిధిగా ఫలముగొనగ
ప్రజల కొర్కె మన్నించగ ప్రార్థింతుము మేమంతయు.

కన్నీరే మున్నీరుగ కలతనొంది జనులంతా
కల్లలేని కల్లోరిని కలవరించ కమ్మనగును
బతుకుబాట గతుకులలో పడిలేచిన పతితులంత
అధిపతిగా నిన్నుగాంచి ఆనందము నొందుదురిట
ఆశయమ్ము అక్షయముగ ఆశలన్ని తీరగాను
ఆరోగ్యము నీకుండగ అదె సాధ్యము మాకిచ్చుట.
తేట తెలివి తెలుపుచుండు నీదుమాట చేతకూడ
శరీరాన శక్తిలేక సాగదిచట సజావుగను
పరులసొమ్ము కోరవీవు పదవి ఫలము పొందవీవు
పెద్దలసొమ్మంతనీవు ఖర్చుసేయ మంచికాదు.
ప్రథమ పౌరుడను పేరును సార్థకమ్ము సేయగాను
సరళిమార్చుకొనగనీవు సంతసింతు మందరమ్ము.
ధర్మసాధనముసేయగ శరీరమ్ము ముఖ్యమనగ
ఆరోగ్యము అమరుటకై అదనులోనె యత్నించుము.
అప్పులిచ్చువారు కలరు – మెచ్చుకొనెడి జనులుండిరి
కొనవచ్చును ఏదైనను – కొనగలేని దారోగ్యము.
కొట్టలేము తిట్టలేము – కోరికమాత్రము తెల్పగ
పెద్దమనసుతోడ నీవు ప్రేమమీర కోర్కెదీర్చు.
నీసొమ్మును నీవిచ్చుట – వెచ్చించగ బాధలేదు
రోగములను కొనిరాగను బాధమిగులు మామనముల.
చివరిమాట చెప్పెదనిట చింత వంత చెంతకొచ్చె
చింతించుము మతిమంతుడ మాకదియే ఆనందము.

మానర నరుడా నీవు మానుమింక మత్తుగొనుట
మానకున్న నీదు మనసు మానవతకు సుదూరమ్ము.
మాదకద్రవ్యాలు నేడు మానవులకు మిత్తిగాను
మేధను నశియింపజేస్తు మేలిముసుగు వేసుకొనెను.
గంజాయి గమ్మత్తుగ గుట్కాలు గుబులుగాను
బ్రౌను షుగరు బరువుగాను తంబాకున తరియింతురు
మత్తులతో మదిచిత్తయి మానవతను మరతురంత

కక్షలు కార్పణ్యములను కర్కశమౌ పనులు చేయు
పిన్న పెద్ద బీద పేద తరతమముల మరచిపోయి
బానిసలయి మాదకముల స్వీకరించ చింతగలుగు
జరదా సరదాగ మారి జనుల నోళ్ళ చెడగొట్టగ
విస్కి బ్రాంది జిన్ను రమ్ము విరిచివేయు నారోగ్యము
స్టెరాయిడ్లు వాడగాను చెడును చేవ విలువ వెలయు
మరణ ఘడియ సమీపించు మరచిపొమ్ము మత్తునీవు
మానహరణ ధనహరణము మాయజేయు మమత సమత
కోపతాపములు మీరును కోలుపోవు శాంతికాంతి.
గౌరవమ్ము గాడిదప్పు గాలివాటమగును బతుకు
అనుబంధము బాంధవ్యము ఆసురముగ మీసరమగు
మత్తు హత్తి యువత భవిత మార్మికతల కూర్మిజెరచు
చేతముచెడి చెరుగు చెలిమి చెడునడతను చేరు జనుడు
నాడులన్ని నలిగిపోవు నయమువీడు శరీరమ్ము
మహమ్మారి మానవతకు హితము హతము మత్తులోన
దానవతకు దగ్గరౌను దారిమారు జీవపథము.

ఆశల అలజడిలోనన ఆశయాలు అలమటించు
కోర్కె కొలిమి ఒడి కలిగిన కోమలతయె కొంచపడును
మార్ధవమౌ మనసులోనె మానవతకు చోటున్నది
స్వార్థమందు సొగసుచూడ పరమార్థము పాలిపోవు.
హింసమీరి హితము హతము హీనమగును శాంతమతము
దానవత్వ దారిలోన దయకు చోటు లేదు ధరణి
ధనము ఇంధనమ్ముగాను దహియించును ధరణిజనుల
మనమందము మాధుర్యము మహిజనులకు మాన్యమగును.
ప్రేమ పేర ప్రేరకమౌ పేదవాని పెదవిపలుకు
కామందుల కదలించగ కరుణ కలిత కామనగును.
అనుభవమ్ము అభయమిచ్చు అనుమానము అంతరించు
అవనిజనుల కదియె అవధి జీవన సమరమ్మునందు.
దీనహీన దైన్య హైన్య మానవులను మురిపించగ

సమత మార్గణమ్ముగాను విమత వికలనమమ్ముజేయి.
ఆస్తికత్త్వ నాస్తికత్త్వ వాదవేద భేదనముల
ఆత్మతత్త్వ మెరుగ గాను అదియె అహమునమరదెలుపు.
అనంతమౌ విశ్వములో అవని చిన్ని అణువు దెలియ
భువిజనుడిట భుగ్నమగును పేదపెద్ద పెనుమంటను.
రాకపోక రహిని రెండు జీవితాన సంధించగ
ఆదాయము వ్యాపారము అవగాహన ఆసురమ్ము.
నేలవిడిచి సాముచేయు నేర్పరులే నేటి జనత
నేతిబీరకాయ వోలె నీతిసున్న నేతలందు.

డొనేషన్ల నేషనులో డొల్లాయెను 'నోషను'లిట
వ్యాపారపు వెలుగులోన ప్రకాశించు సరస్వతిట.
అమ్మాయిల నమ్ముకొనెడి ఆర్యావర్తపు సంస్కృతి
అమెరికాను కామించెడు అసురవరుల అమరభక్తి.
శాపాలకు పాపాలకు చేతముచెడి చెదరిపోయి
చేతులెత్తు సామర్థ్యము చెలువుమీరె భారతమున.
కారమాయె సంస్కారము ఇంద్రియాల కామమునకు
కారణాలు కనబడవిట కర్మకాండ కథలె వేరు
మేకవన్నెపులుల మధ్య మేలిమనసు మేకలవలె
సంస్కారుల సరళియుండె సహనమంత జారిపోయి.
పురాణములు పుక్కిటివని పూజ్యభావమునువీడగ
మంచి చెడులు మనకు తెలుపు మార్గమేమొ గహనమాయె.
ప్రపంచమే చెడెనంచును పవిత్రుడై ప్రవచించెడి
ప్రబుద్ధులను గమనించగ బుద్ధి తేట తెల్లమగును.
మోజుమీరి మోసములను బూజుబట్టె రాజ్యాంగము
బూజుదులుపు రాజులంత కారడవుల వెళ్ళుచుంద్రు
వారవనితలంత గూడి వాల్లభ్యము గొనుటకొరకు
ఆందోళనచేయుచుండ అవతరించె ఎయిడ్సువ్యాధి.
హక్కులకై పోరాటము ఆక్రమించె అవనినంత
బాధ్యతలిట బాధజెంది ఆశ్రయించు అసమర్థుల.

మౌనమె మా మానమంచు మహనీయులు మనిరిచ్చుట
మ్లానమాయె మానహరణ మాతమనసు విరిగిపోయె.

టీవీఛానల్ళలోన టీనేజీ తిరుగుడువడె
యవ్వనమను వనములోన నాగరకత నాట్యమాడు.
చెదలుపట్టి చెడిపోయిన విధిచేతలు విమతమాయె
సతమతమౌ మతములన్ని తనమతమే తనకు తపన.
దూరపుకొండలు నునుపను దూహితమతి దౌర్బల్యము
ముందుమెలగు ముద్దుమనసు గ్రహియించదుగమనమందు
కొత్తవింత పాతరోత కోర్కెమీరి కొనుగోలున
పాతపాత రైనంతనె పావనతయె ఫలమువీడు.
రంకు బొంకు కతలలోన రాచరికము రాజిల్లెను
మంకువీడి మనిషి దెలియ జనపాలన జయముగాంచు.
ఆశయాల ఆంధ్రసాంద్ర అవనతమయె అధిపతులతొ
వాసిగాంచు వారసులుగ వరులు నేటి యువకులంత.
వ్యక్తిని మోసమ్ముచేయ వెతల మయము అనుచు నెంచి
ప్రభుతను పలుచనచేయగ పరములంత ఫలముగొనగ.
ఉచితము ఉచ్ఛిష్టమాయె ఉన్నతమ్ము కొన్నదియే
ఆవేదన వేదనాయె అవగాహన అవనివీడ.
ఆశయాలు శవములాయె దహనమాయె సంస్కారము
పిండతండులములతోడ తిలోదకము లిచ్చుటాయె.
గుర్తులేని సహాయాలు గుంభనమై గుడికెళ్ళగ.
మడిమాన్యము లిత్తురంత దైవాలకు మనువర్తిగ.
సత్సంగము సంపదర్థ బాధలకది బంధువుగను
బాబాల భావింతురంత భావియె సుఖవంతముగన.

బాధలెన్నొ భారముగను భావినిగన భయము మీరు
భవము నిండ కర్మఫలము నందనమిట నవ్యజగతి.
గతుకు బతుకు బాధలగన గతమె మేలుగాను తోచు
వర్తమాన మాత్మగతము సహనసహిత సత్కర్మల.
మావిచిగురుతొడగలేని మాయదారి కాలమొచ్చె

వగరులేని కోయిలగా జీవిజీవితమ్ముమారె.
వాంఛకేమొ బాంఛలుగా కాంచనమున కాంక్షగలిగి
కంచికెళ్ళు కథలరీతి కాంచగలము నరుని నీతి
అంతరించు మంచితరము వింతతరము వెలుగుచూచు
వంతల నాహ్వానించగ వాస్తవమున వేరెవరిట.
రెక్కలు ముక్కలుజేసుక రేయిబవలు కష్టించగ
రేపటి మాటయుమిగులగ రేవడగును కూలిబతుకు.
రామరాజ్యరాదారిలొ రావణరాక్షసులుందురు
హనుమంతుని రీతినీవు అధిగమించు విధిగమనము.
ధర్మమేమొ దహనమాయె ధర్మరాజు భారతాన
అధర్మమ్ము మర్మముగా అవతరించె నవ్యజగతి.
నాగరకం మీరిపోయి నరుడే వానరుడాయెను
వానరుండు నరుడుగాను జనియించుట శాస్త్రమాయె.
కాలచక్రగమమనములో వక్రరేఖ జీవితాలు
సక్రమమౌ సరళిగాంచి సాగుమీవు సమతతోడ.
తెగువలేక తెలివిగలిగి తేటమాట తెరువుగల్గి
తగవుమరచు తపనపరులు తామసమున తరుగుచుంద్రు.

సూర్యునితను చేరాలని సూక్ష్మమార్గమెంచనరుడు
సూర్యుడు తనకెదురురాగ తూలిపోయె తపనమీర.
విరుద్ధమౌ చర్యలతో విగతజీవి మానవుడే
స్వగతమ్ము స్వార్థముండ పరమార్థము పరసేవను.
త్రికరణములు తియ్యగాను వికిరణమ్ము విషమాయెను
వైవిధ్యము విద్యమగును విధ్వస్తము తనదు బతుకు.
గానుగెద్దు జీవితాలు గమ్యరహిత గమనమాయె
మననరహిత విద్యలేమొ మరచి మనసు మలినమౌను.
నిన్ను నీవు తెలియగాను నిధియె వచ్చునీకడకే
మన్ను మిన్ను ఏకమైన మారిపోదు నడవడింక.
మానవతకు మాధుర్యము అందించుము ఆస్తికుడా
ఆస్థికోరి అధముడనగ నాస్తి సుఖము జాస్తి తపన.

త్యాగము త్యాజ్యమ్ముగాను యోగమేమొ పూజ్యమాయె
భోగరహిత బోజనమున భాగమగును ఆరోగ్యము.
వేగము మీరిన జగమున వేదనలే మిగిలిపోయె
సాదరముగ సాగగాను స్వాగతమను శాంతి భవిత.
ముదిరిపోయి నాగరకత మురికి కూపమాయె జగతి
పరిశుద్ధపు సంస్కృతితో పరిణామము ఫలవంతము.
పెద్దలమాటనువినగను పేలవమని తలచుయువత
తనపెద్దలు లేకుండగ తానుండని విధముగనడు.
చావుపుట్టుకలు రెండును సహజమందురంతనేడు
అసహజమౌ జీవితాన అలమటించు ఆశమీరి.

తల్లిదండ్రి గురువు గురుతు తరగని దైవాలు వారు
జీవులనిట మరచిపోయి దేవులనే దేవురింత్రు.
పరపతి గల తిరుపతిలో పరమాత్ముని సన్నిధిలో
సరసత కొరవడుచుండెనున దోహదమున దోపిడీలు.
పరమాత్ముని పేరుజెప్పి ప్రతిఫలనము లభియించగ
పరములౌదు రంతనేడు ప్రజలను పట్టించుకోరు
ఆకలిదప్పులు తోడను అలమటించు జనావళికి
ఆశ్రయముగనీవుండిన ఆశయమ్ము అమరమౌను.
హైటెక్కుల టెక్కులోన ఆత్మతుక్కు తుక్కాయెను.
గ్లోబలు గాటులలోనన నీతి గోతిలోన బడును.
అణుబాంబుల పేలుళ్లను ధ్వనికాలుష్యము హెచ్చెను.
అగ్రరాజ్య ఆక్రందన అందరికిట మందగునుగ.
పత్తిచేల మిత్తినిండి కబళించెను కర్షకులను
వర్షమునకు హర్షమైన వాగువంక మింగె పంట.
నాగరకత నగరంలో నగ్నముగను నాట్యమాడ
సంస్కృతియే భగ్నమాయె సారహీన జనత సరళి.
కల్తీ శాల్తీలలోన కత్తిరించబడెను వయసు
కలికాలం కల్లగాను కఠినమాయె మరుని బతుకు
కర్మసూత్రగమనమందు – భరతజనత పయనించగ

ఖర్మమిగులు మర్మమముగను – కార్మికుడా తెలియుమీవు
అవినీతిని అంతమెంచి – అదనున నువు వేచియుండి
రవిరీతిని విప్లవించ – అరుణారుణ మగును జగము.

విశ్వంలో ఉద్యోగికి దూరభూమి లేదనుచును
ఉన్న ఊర్ల ఉంటుండిరి పెరవూర్లను పరములైరి.
మేధమేర మీరుచుండె మేదినేమొ మెరుపువీడె
బాధ భావనమ్ముగాను భవ్యజనుని బతుకు తీరు.
ఆకలిదప్పులు తీరగ ఆశకలుగ అవసరమ్మె
అతిశయంపు సౌఖ్యములకు అవనిజనుడు బానిసాయె.
అసూయలిట విసువుగొలుపు అరిషడ్వర్గములు మీరు
విషపు భావనలు మించగ కలుషమాయె కలల జగతి.
మమకారము సహకారము మరణించిన జరపీడిత
మానవత్వ మాటవినగ మనిషి మహిషిగా మారును.
విధ్వంసము మారణమ్ము వింత విధము దారుణమ్ము.
బుద్ధభూమి బులపాటము జాతి బుధుల విలపనమ్ము.
గౌరవమ్ము హీనమాయె కళలకాంతి వెలిసిపోయె
కామందుల కామితములె కథలు గాథలయ్యెనేడు.
నేలవిడిచి సాముచేయు నేర్పరులుగ నేతలంత
అప్పుతెచ్చి అధికులైరి అవనిజనులు అధములుగను
హత్యలతో అధిగమించి హత్యలతో పీఠమెక్కి
అధికులైరి హహత్యలతో అంతమగును హత్యలతో.
వెన్నుపోట్లు పన్నుపోట్ల వెతల ప్రభుతలన్నినేడు
ప్రజల వెన్ను విరిచివేయ జనస్వామ్యము జీవహీన
వెలిసిపోయె సిద్ధాంతము వ్యక్తిగతము రాద్ధాంతము
జనమంచియె జయమెంచును జాగృతిగని నడువరనువు.

మహిళలకిట ప్రత్యేకత మాన్యులునేడిచ్చుచుండ
చట్టమేమొ కాగితాల చుట్టగాను శుభమువీడె
పడమటింటి సంస్కృతిలో పదిలమ్మని పరుగులిడుచు
పదములు తడబడబడగా పాదువీడి పథము చెడును.

దూరపుకొండలు నునుపని దురిత సహిత దుర్ణయముల
సారవంత భూమివీడ వారవనిత తీరునీవు.
మనదేశము మాన్యముగను మనెడి విధము తెలియగాను
మంచి మించు మనుగడలో మహిమ సహిత మరుడవీవు.
వేగమాయె వేలకొరకు వేళమించు వెతలు మీరు
వేకువగను వేదార్థము వెలుగు జీవి కలిమినిధియె.
పోలికలిట మితిమీరెను పోకిరులకు పొలము భూమి
నేరములిట చేయగాను నల్లేరున బండి విధము
తేటమాట తేరునెక్కె తేరుదారి ఆకాశము
గమనముగనగహనమునకు సహనమునకు దారికరవు.
సుఖవంతపు జీవనమును సఖ్యతగని సాగించగ
అభ్యుదయమము అవగతమగు భవిత ఫలము భరితమగును
నాయకులైనాటనేట గతియించిరి మతిమంతులు
నవ్యమానవతల గూడ నరజాతికి జాగృతులుగ
జీవనసత్యము లెన్నిటొ జీవుల కెరిగించిరంత
అవగాహన ఆచరణల అతిశయించ అధికుడవెగ
వ్యక్తిత్వము త్యక్తమైన వ్యవస్థలే అవ్యక్తము
ముక్తిదాయకమ్ము వ్యక్తి మూర్ధమందు దాల్చుమీవు.

మాతృత్వం మానవతా గుర్తుచేయవలసిన వచ్చె
ఉగ్గుబాల రోజులెల్లి పెగ్గులయుగమొచ్చెనేడు
యుగానికో ధర్మమనీ మేధావులు మధనపడగ
సత్యధర్మశాంతులన్ని నిత్యమనెడి విధముమరచు
మోసానికి రోషానికి మోజుమీరు రోజులాయె
ఆలోచన అవగాహన ఆశయమే అసలులేవు
జాతీయము జాతరలో ప్రాంంతీయము పాతరలో
పతనమగుచు పరవశమున మతులు గతులు వితథమాయె
నేతిబీర నేతలంత జాతిభీరువయ్యెనేడు
ధర్మానికి దారిబందు బందూకిక మనబంధువు.
ప్రకృతి ధర్మము మారదు మనప్రకృతి మారదుగా

వికృతముగ ప్రకృతిలో మానవకృతి వికారమ్ము.
కాలము విలువను దెలియగ కామితార్థములు పొందగ
కాలమంత గాలమయ్యె కఠినమాయె కామితములు.
అంపశయ్య ధర్మములను ఆహరించు భీష్మలంత
బుద్ధియె సంచలనమయ్యె వక్రముగను వార్థకమున.
మారె మాత తలరాతయు మౌనమ్ముగ మ్లానమాయె
తనయులు తరియించగాను తాకట్టున కట్టువడును.
గండమాయె గుండాలతొ కిరాతకపు హత్యలాయె
చచ్చువారు చంపువారు సతమతమగు హితమువీడి.
అధికారపు బృహన్నలలు అంధకార సైంధవులూ
విధివంచిత జనగణమును వింతతీర్ల వేధింతురు.

చిన్నిమనసు చిన్నవోగ చెన్నుదప్పె జీవితమ్ము
చిన్ననాడె సరిదిద్దగ సన్నుతింప బడుదువీవు.
మావినుండి మాయలోకి మానవునిగ మరలిరాగ
మారణమ్ము జీవితముగ మరలుచుండ మహికిచేటు.
నవరంధ్రపు తనువుతోడ నవరసముల రుచులు చూడ
నవకమాయె నాగరకత నరకమాయె నవ్యజగతి.
దాంపత్యము పథ్యముగా ధరణిపథము వెలుగుచుండు
సంపద సుఖముల తోడను విఫలమగును విజయరహిత.
ఆదామూ అవ్వ కథలొ ఆదరువును ఆదమరచి
ఆదిగ్రంథ వర్తకులే అంధులగుచు వర్తింతురు.
ఆరంభము శూన్యమాయె అంతమేమొ ఆశూన్యమె
ఆంతర్యము వింతవిధము అంతరముల వంతమిగులు.
నీతివెన్నెముక విరిగిన నేతలిచట పాతుకొనిరి
పాతరేయ పవిత్రమగు భారతమ్ము భాగ్యమగును.
కలగలుపుగ విధానాలు కళదప్పిన ప్రభుతలోన
కలల నరుల జీవితాలు జీవనమే వనము విధము.
కంపునుండి ప్రభవించగ కంపు ఇంపు బతుకులోన
జీవమున్న కంపు పెంపు కలవరమున కలకలమున.

బట్టకట్ట భాగ్యమేమొ ముట్టుమూయు బట్టలోన
ఆంతర్యము తరముకాదు కనులకింపు కనికట్టుగ.
మూర్ధమున్న మృగముగాను మార్దవమగు మనసునీది
సార్థకమగు బతుకుబాట వార్దకమ్ము వచ్చునింక.

**పొదుపు**

జనజీవన జాగృతిలో – జయమెంచుము మహిళనీవు
జన్మభూమి జాతిలోన – పొదుపు పండు మధువు గొనగ
అభివృద్ధికి అదనైనది – అవనిలోన పొదుపొక్కటె
సార్థకముగ జీవితాల – పరమార్థము పలకరించ
డబ్బులేని వాడు డుబ్బుకు కొరగాడు – మదుపువల్ల డబ్బు కూడివచ్చు
మాన్యజీవనమున మనమంత జరుగగా
మహిళలార మీరు మనుడు సతము.

ఆ.వె. చిన్నచిన్నరాళ్ళు చేర్చగ నదియంత – నిండుమెండు కొండ యగునుగాదె
చిన్నమొత్తమైన చింతలు దీర్చును – రోజు రోజు కూడబెట్టగాను.

ఆ.వె. ఇంటిలక్ష్మి యిచట తంటలు దీర్చును – కొంతఖర్చుజేయ కోర్కెదీరు
మిగులు మొత్తములును మీరును గొప్పలై – భవితకోరు వారి భాగ్యమదియ.

ఆ.వె. పిల్లవాడుపుట్టి పెద్దగు తరువాత – కూడబెట్ట నదియె కూడు కొంత
చదువుకొరకు నదియె సరిపడు తరువాత – బాధలేదు మీకు భవమునందు.

చిరుజీతం పరువు నిల్పు – పొదుపు చేయ పొలుపు మీరు
గొప్పదైన ఉద్యోగం – పొదుపులేక పరువుచేటు.
కూలినాలి చేసికొనెడిఇ – కార్మికులకు కర్షకులకు
పథకములిట కలవు ప్రభుత – లాభదాయకమ్ములవిచ్చు.
చేతిపనులు చేయువారు – చైతన్యము విరియగాను
కలిసిమెలిసి సంఘముగా – పొదుపుచేయ ఫలము గల్గు.
కొంతమీరు పొదుపుచేయ – మీకొరకది బిడ్డలకది
కొంత ప్రభుత కలుపునుగా – పెద్దమొత్తమగును నిధిగ
వెనుకబడిన వర్గాలకు – యస్సీ యస్టీల కొరకు
ఎన్నెన్నో పథకాలను – అమలుచేయుచుండె ప్రభుత.

డ్వాక్రా గ్రూపుల ద్వారా – త్వరితమగును అభివృద్ధి
కుటుంబమూ గ్రామమంత – దేశానికి అభ్యుదయము
బ్యాంకులోను లెన్నొ కలవు – కృషి చేయగ ఫలమబ్బును
సంపాదన సవ్యముగను – పొదుపునేడు భవ్యమగును
సహకారము మమకారము – అధికారము కంటె మీరు
అవగాహన ఆలోచన – అదియె ఆశలన్ని తీర్చు
ఇంటిలోన దాచగాను – దొంగలెత్తుకొని పోదురు
బ్యాంకులలో ఆఫీసులో – దాచుకొనగ భద్రమగును
మహిళలంత ముందుండగ – మార్గమంత సుగమమగును.
గృహలక్ష్మియె గురుతుగాను – మహలక్ష్మిగ పొదుపు ఫలము.
మాతబిడ్డ భవితకోరి – జాతి జాణయగురీతిని
పెంచి పొదుపు ధనము పంచ – పేరుమీరు లోకమందు.

వృత్తులందు వర్తించగ – ఆదాయము అధికమౌను
వర్తనమున పొదుపునుండ – వాసిగాంచు వంశమంత
ఇంజనీరు డాక్టరుగను – ఇంపు విద్యలను నేర్పగ
ఖర్చుమీర కాంతిదరుగు – పొదుపు కాంతి గలుగ జేయు
కుట్టుమిషను కష్టమునను – కాస్త ఫలము కలుగగాను
కొంతదాచుకొనగనీవు – భవిత కష్టములు తీర్చును
అనాధలౌ అబలులకును – ఆశ్రయమిడు పథకములు
సబలలుగా సాగగాను – సాహాయము చేయుచుండ
గృహమందున పొదుపుసేయ – గుణవంతము సంసారము
రేపు కలుగ పొదుపునకిట – రూపుకలదు చూడగాను
స్వార్థము పరమార్థం రెండును – సాగుచుండు మదుపు నందు
ప్రజలసొమ్ము రక్షసేయు – ప్రభుత కలదు పరమముగను
అమ్మ అక్క అవని చెల్లి – అన్నదమ్ములందరిటను
నాన్నలంత నయముమీర – పొదుపుసేయ వెలుగు పథము
మహిళముందు కొస్తున్నది – అంతరంగ రంగములను
కలిసిరాగ కలిమికలదు – కామితములు తీరగలవు
అధికారులు ప్రతినిధులూ – అందరిసహకారముతోడుత

అందరొక్కమాటమీద – కదలిరాగ కలదు శాంతి.
ప్రజలస్వామ్యమందునేడు – భాగస్తుల మందరమిట
బాధ్యతలను పంచుకొనగ – బలవంతము పరిపాలన
రాజ్యాంగము రమ్యముగా – హక్కులిచ్చె అందరకూ
అన్నింటిని అమలుజరుప – అందరికిని అందమగును.

సహకారం సహనంతో – సామరస్య మలవడునిట
సమసమాజ స్థాపనలో – సహపాఠిగ నీవుండిన.
ప్రభుత బియ్యమిచ్చుచుండె – భయమేమియులేదు మనకు
ఉప్పుపప్పుచింతకూర – పోను మిగులు పొదుపుచేయి
మద్యం మహమారిగాను – మగువలంత మగలందర
మరలించగ మంచిదగును – మనబతుకులు మాన్యమగును.
మండలాధికారివచ్చు – మనకిచ్చుట భయములేదు
అన్నివిషయముల నడుగగ – అనుమానములతడు తీర్చు
వైద్యశాఖ నర్సుగారు – వారవారమున కొచ్చును
వ్యాధిబాధలను తెల్పగ – మందులిచ్చి మాటుజేయు
అయ్యవార్లు చదువుజెప్ప – బడికి వత్తురద నెరుగగ
పిల్లవాడు బడికి వెళ్ళ – ప్రోత్సహించ ఫలము గల్గు
పంచాయతి వార్డులోన – మెంబరుండె మేలిమిగను
మంచినీరు పరిశుభ్రత – నందించగ నాణ్యమగును
వీధి దీపములు పోగను – విధిగచేయవలెను నేడు
బాధ్యులెవరొ వారినడుగ – ఫలముకలుగు ప్రాంతమందు
జన్మభూమి జయమెంచగ – జాతికంత మేల్గల్గును
ప్రజలందరు పాలుగొనగ – పాలనమిట స్వర్గమగును
ప్రత్యేకతలుండెనేడు – మహిళల కిట మాన్యముగను
లాభపడగ యత్నించగ – లాభము నీదగునేడిట.
ఆలోచన మంచిదైతె – ఆశయమున అధికమగును
ఆశదీర్చు హితముగాను – దేశమునకు దివ్యమగును.

కదలిరండి కదలిరండి మహిళలార కదలిరండి
పేదరికం పెరిగె నేడు – కదనమునకు కదలిరండి

బీదరికపు బాధలన్ని పరుగిడగా మీ రందరు
మగువలంత సగర్వముగ సంసారము సాగ వేగ
మగవారికి తీసిపోని మగనాలిదె రాజ్యమిపుడు
దేశజనుల సగభాగం అతివలనెడి మాటదెలిసి
సృష్టికారకమ్ము మహిళపుష్టి జీవనమ్ము జగతి
పరస్పరం పలకరింత పొదుపు నకిట పులకింత
కలవరింత దరిద్రతకు పథమువీడి పరుగిడుగా
మండల అధికారులంత మనమంచిని కోరుచుండ్రు
మనసువిప్పి మాటాడగ సదుపాయము కలిగింతురు
సమసమాజ స్థాపనలో సగముపాలు మహిళలదే
అక్కడ ఇక్కడ ఎక్కడ అందగింత అబలలదే.
జిల్లా గ్రామీణ సంస్థ అధికారిణి కలరు మనకు
అభివృద్ధిని కాంక్షించగ అందరికిని త్రోవ చూపు
డైరెక్టరు గారి కడకు డైరెక్టుగ వెళ్ళవచ్చు
డౌటులన్ని తీరగలవు పొదుపుదారి ప్రగతి దారి
మనపేరనె యిళ్ళప్లాట్లు తప్పు మనవి పాట్లన్నియు
దుర్వ్యసనము దులిపివేయ మనమగలే మనవెంటను
ఒకరిమించి మరియొకరిగ మనమంతయు మదుపుసేయ
మనబతుకులు మంచివగును చింతలన్ని చెదరిపోవు
గ్రామరాజ్యమొచ్చెనేడు గమ్యమెంచి నడువుమీవు.

భయంలేదు మహిళ నీకు బాద్యతగని వర్తించగ
బాధలన్ని మటుమాయము పేదరికము అదృశ్యము.
ఊరువాడ ఊతమిచ్చి ఉద్యమించె ఉన్నతిగన
పల్లెలన్ని వల్లెయనగ పల్లవించె పొదుపుమల్లె.
చదువు సంధ్య నేర్పించగ బిడ్డలంత పెద్దలుగను
విధులు హక్కులన్ని తెలిసి విజయపథమున నడుతురంత
మితముగాను సంసారము హితము మీరు బతుకులందు
చంట వెంట సంతానము చావునకే దగ్గరౌను
మత్తుమనిషి చిత్తుచేయు మానుకొనగ చింతవీడు

మనం జనం కలిసిమెలిసి పయనించగ ఫలం కలుగు
గృహమునందు పరిశ్రమలు గుంపులుగా స్థాపించగ
కృషియుకూడి కూరిమితో కుటుంబమే స్వర్గమగును
గాంధిగన్న గ్రామరాజ్య గమనమెంచి సాగగాను
ఆంధ్రమందు ఆదర్శము ఆడవారె అగుదురిపుడు
ముఖ్యమంత్రి పథకములే ముద్దుగొలుపు ముగ్ధలకూ
అన్న అడుగుజాడలోన అమ్మలంత అడుగులిడుడు
వైద్యశాలలుండె ప్రభుత వలసిన రక్షణ పొందుము
మానవత్వ దారిలోన మగువలంత పయనించగ
సమసిపోవు తగవులన్ని శాంతికలుగు విశ్వమందు
పశుపోషణ ఫలమునిచ్చు వృక్షరక్ష నీకు రక్ష
పరిశుభ్రత ఆరోగ్యమము అన్నింటను పొదుపు మిన్న.

సహన వహన సారథిగా సమసమాజ వారధిగా
ప్రగతిరథము సాగగాను పరమమాయె మహిళనేడు
జన్మభూమి జాగృతిగా జాతిభవిత ఆకృతిగా
ప్రకాశాన ప్రకాశమై ప్రముఖమాయె ప్రగతిపథము
కుటుంబాన్ని నియంత్రించ కూడునుగా ఆనందము
సంసారము సంబరాన అంబరాన్ని అధిగమించు
చేతిపనుల కూతమిచ్చె చేతములను చైతన్యము
బతుకులందు బహుభాగ్యము – భాగ్యదాయి పొదుపులక్ష్మి
అక్షరాలు నేర్చుకొనగ – అక్షరమై అవతరించె
ప్రకాశమ్ము ప్రభలుజింద – ప్రజలందరు చదువుగొనగ
తాడిత పీడిత జనులకు – తానుగ వెనుదన్నుగాను
ప్రభుత వచ్చె పథకములను – ఫలముగొనగ ముందుండుము
సోమరులకు తావులేదు – సోదరులకు సాదరమ్ము
సోపానము అభ్యుదయము – స్వోత్కర్షకు తావులేదు
ఐకమత్యమవని నిండ – అందరకిట సౌఖ్యమబ్బు
సుఖశాంతులు వెల్లివిరియు – సూక్ష్మములో మోక్షమబ్బు
సాంఘిక సంక్షేమమ్మున – క్షామమన్నదిట లేదుగ

కలిసిమెలసి జీవించగ – కలదు సుఖము కలిమి మిన్న
కులం మతం నీకు వలదు – నీదు మతం హితంగాను
నియతి నడువ నిధివె నీవు – బతుకు బాట మల్లెతోట
బతికి నీవు బతికించుము – బడుగుబాధ పతితులనిట
మంచి మించు మనుగడతో – మానవత్వ మమరమగును.

పల్లెల్లో పరిశ్రమలు – పట్నాలలో ఫ్యాక్టరీలు
శ్రమియింపగ శుభము గల్గు – శక్తిమీర పొదుపుసేయి
ఊళ్ళలోన కోళ్ళుపెంచి – ఉద్యమించు పొదుపుతోడ
పాడిగేదె ఫలములివ్వ – పొడగునుగ పేదరికము
సీమపందులను పెంచగ – సిరులిచ్చును సంతుతోడ
కూరగాయలను వేయగ – కూడునెంతొ సొమ్ము మీకు
మేకల గొర్రెల మేపగ – మేలిసరకు లాభించును
ఎస్సి ఎస్టి సంస్థలన్ని – సేద్యభూమి సేకరించి
స్వంతహక్కు కల్పించగ – పంటవేసి ఫలముగొనుము
మనందరం మాన్యులమిట – మనపిల్లలు భవిత వెలుగ
మదుపుచేసి మనుడు మీరు – మతిమంతము మనబతుకులు
జన్మభూమి పొదుపు భూమి – జయమెంచగ సాగిరండి
మహిళలకిట బ్యాంకు కలదు – కలిసిమెలసి పొదుపుచేయ
రేపనునది నీకు కలుగ – పొదుపుచేయి ఫలము కలుగు
నేటిపొదుపు నేతిమాట – పొదుపులేమి పోరుబాట.
ప్రగతి ప్రభుత ఫలముగాంచ – ప్రజల పొదుపు ప్రముఖ మగును
జనపధములు జయమొందగ – జనులందరు మదుపు మీర
అంతరాలు వింతతీరు – అంతరించ జనుల పొదుపు
సంతుచింత దీర్చగాను – సగము ఫలము పొదుపు సేయి
పుట్టగొడుగు పరిశ్రమను – పూజ్యముగను స్థాపించగ.
పురమంతయు పరమమగును – జీవితముల జిలుగు వెలుగు
పొదుపు పథము పరమ పదము – సోపానము భవితకదియె.

లక్ష్మివారము లావణ్య లక్ష్మియుతము
అష్టలక్ష్మ లందరు అతిశయించు

వ్రతము వాసిని గాంచగా వలపుమించు
పతియె సతికగు ఫలముగా పరువ మింపు.

సీ. ఆదివారపు లక్ష్మి అందరినందించు అధికమౌ ఫలములనమమరనిచ్చు
సోమవారపు సొంపు సొగసైన లక్ష్మిగా సాదర సోదర సహితమిచ్చు
మంగళవారపు మహితమౌ పెన్నిధి శుభముల సూక్తిగా సుభగలక్ష్మి
బుధవారలక్ష్మిగా బుద్ధుల సిద్ధించు జ్ఞానాంజనముగాను జ్ఞప్తి లక్ష్మి.

తే.గీ. గురువు గురువారలక్ష్మికి గురుతుదెలియ, శుక్రవారము విక్రమ సుదతి లక్ష్మి
శనికి శమనము గల్గించు శక్తి లక్ష్మి, వారముల వాసి వరమైన వసుధ లక్ష్మి.

సీ. శ్రీదేవి భూదేవి శివముల నిడుదేవి, దేదీప్యమానమై దేహులకును
అమ్మల కమ్మయై అతివల మిన్నయై, అనురాగరాగమ్ము అందజేయు
వాగ్దేవి పార్వతి వరపైన లక్ష్ములు, వసుధను పాలించు వనితలైరి
సహనమ్ము వహనమ్ము సాధనసారము, సాగగానతివకు సాహసమ్ము.

తే.గీ. నోము నోచగ ఫలితము నోటివరకె, భామభాగ్యము భర్తకు భవము పండ
పతియె వ్రతముగ ఫలమెంచి పాడి నడువ, భవితపండును నిండుగ భాసమగును.

సీ. పసుపు పారాణులు పాదాల నలదగా, పావనమయ్యేనున భామ వలపు
సిగపూలు తురుమగా సిరిమల్లె సొగసున, చిందెను శిరములు చింతనమున
పట్టువస్త్రాలు పరవశించినెమ్మేను, పులకరింతలతోడ పూజ్యమగును
కాటుక కండ్లకు కామితములు దీర్చ, గాజుల మోజులు గరితయాయె.

తే.గీ. కదలు లక్ష్మిగ కాంతులు కలిమినొసగ, మగని మగసిరి మగువగా మరులు కొనగ
మాన్యమగునుగ వంశము మట్టివిధము, మానవత్త్వము మాతృత్త్వమహిమ గాంచు.

సీ. వరలక్ష్మివ్రతమున వాసిని గాంచగ, మగువలు వరులుగా మనసు దెలిసె
శ్రావణమాసము శక్తికి మహితము, వాసంతమహిమను వాసిగాంచె.

ఆ.వె. అష్టలక్ష్ములు నేడు అందాలు చిందించి, ఆనందమిచ్చిరి అతివలకును
శాంకరి శాంభవి శక్తి రాజేశ్వరి, సంకటములు దీర్చుసతిగ లక్ష్మి.

తే.గీ. అమ్మవారు నేడు అందరు మురియగ, చెలిమి బలిమి కలిమి చెంతచేర్చు
వలపు తలపు వాసి వరముగ వ్రతముగా, వాంఛదీర్చు తల్లి వనిత లక్ష్మి.

సీ. బాబాల మహిమను భాసించు భాగ్యాన, భవజనులందరు వరులుగాను
అమ్మలు అవనికి అందాల నందించ, అందరు మానవుల్ అమిత బలులు
నమ్మకమున నేడు నరులంత నయముగా, పయనించ మతములు ఫలముగాంచె
కులములు మతములు కూల్చగ జనులంత, కృషిచేయు ఋషులుగా కులము వెలుగు.

తే.గీ. వ్యక్తి వ్యక్తిత్వమహిమను శక్తిగాను, సంఘసంస్కార సరళిని సాగగాను
పరము పరమార్థమని యెంచి పాలకునిగ, మానవత్త్వము మరలక మంచి మించు.

సీ. కొట్లాట కాట్లాట కోరెడి కోవిదుల్, సుదతుల వ్రతముల సూక్తియున్నె
కోర్కెల కోట్లను కోల్పడి కొలువగా, ఫలమును గాంచక పడతులుండ్రు
అన్యోన్య దాంపత్య మవనిని వీడగా, చరియించు చరితలు గరితులగునె
బాధ్యతల్ వీడగా బరువైన భామలు, వ్రతములు జేయగా వలపులున్నె.

తే.గీ. అర్ధనారీశ్వరత్వము సార్థకముగ, వరత్రిమూర్తుల వరుసను వాసి దెలిసి
భార్యభర్తలు మెలగగా భాగ్యమగును, మహిని సంసార సంద్రము మహితమగును.

ఆ.వె. అందరికిడుతాను అతిశయలక్ష్మిగ, దాన ధరణి ధర్మ దయిత తాను
సహిత సమత సరళ సవనము సహనమై, సాగగాను జనుడు సంతసించు.

తే.గీ. సరససాహిత్య సంగీత సౌమ్యలక్ష్మి, కవుల గాయక గణముల కల్పతరువు
అమృత మధువును అందరికందజేయ, జనుల ఆత్మలు జాగృత జయమునొందు.

స్త్రీపురుషుల అన్యోన్యత – సిరులిచ్చును జాతికంత
విచ్చలవిడి సంభోగము – వింతరోగముల దెచ్చును
సుఖవ్యాధుల సంతలోన – సుంతలేదు ఆరోగ్యము
ఎయిడ్సువ్యాధి ఏదొ వింత – వంత జనుల జీవితముల.
సానివాడలందు తిరుగు – సారంగుల రంగు దెలియు
వేశ్యలోలురైన వారి – వెంగలిబతుకులు క్రుంగును
సంసారము సౌఖ్యమగును – సారవంతమగును జగము
భార్యభర్త సహకారము – భాగ్యమగును భారతమున.
మందులేని మాయదారి – మానవజాతికి మృత్యువు
మందులైన మనుజులంత – శక్తివీడి చత్తురంత.
అంటువ్యాధికానెకాదు – అవనిజనుల కాపదాయె
హెచ్ ఐ వి హెచ్చరించ – రక్తమందు పొంచియుండు.

డౌను స్ట్రీటులందు జనులు – డాబుసరిగ ఫోజులేయ
డౌనయి పోదురు మీరలు – అంటగానె అంతరిం(్రతు.
ఇల్లు ఒల్లు గుల్లగాను – ఇల్లాలును తెల్లబోయి
మగలందరు సుఖవ్యాధిని –బడిపోవగ భయము గల్గు.
పరిశుభ్రత పాటించగ – శరీరమె పరమమగును
ప్రాభవమున ఆరోగ్యము – ప్రగతి మీరు ప్రభుడవీవు.
గృహసీమకు గురువు పడతి – మగవారలు మాన్యులిచట.
ఆలుమగల అనురాగము – అభ్యుదయము సంసారము
పిన్న పెద్దలందరిచట – జన్మభూమి పిలుపుతోడ
చేరి చింత వంతదీర – పాటించుము సూచనలను.

సృష్టికర్త వింత చింత – వికలాంగులు వంతనుంట.
పుట్టుకతో పూజ్యమయిన – అవయవాల అవనితీరు.
కుంటి, గ్రుడ్డి, మూగ, చెముడు – కూరిమిగన కరుణమీరు
కాలుసేయి కదలలేని – నరజన్మము వరహీనము.
దీన, హీన దృక్కులతో – ధైర్యరహిత చిత్తముతో
భావనలే భవితమించు – భాగ్యమేమొ యోగ్యరహిత.
మనసు కలుగు మానవునకు – మానవతే మాన్యమగును
దయమీరగ ధారుణిలో – దరిజేర్చుము వికలాంగుల
మానిసికము మహిమ వీడ – శరీరమున శమములేక
వికృత ప్రకృతి రూపము – విలువనివ్వ విబుధుడవిట.
బాధలోన బాంధవ్యము – మమతలోన మాధుర్యము
త్రికరణముల తియ్యదనము – తెలియనీవు తెరువు సేవ.
సేవ అవసరమ్ముతెలిసి – బాధితులకు బంధువునిగ
వేదనలను వెతలలోన – వేగముగను వెలుగుమీవు.
పాపపు జన్మల జూచిన – అయ్యో! అనిపించునవని
పుణ్యచరిత కర్మలతో – పాపములను పారద్రోలు.
చిన్నారుల చిరుమనసుల – అక్షయమగు క్షమనిండిన
మనభారతి మహితమగును – హితము హీనులకు సేయగ.
చెమ్మగిల్లు కనులతోడ – చేతమందు చెలిమితోడ

దీనమానవుని సేవయె – మాధవునికి మహితసేవ.
చేయూతను అందించగ – అవనిలోని వికలాంగులు
మంగళమున అంగములను – అసలు మానవులుగ మారు.

**రక్షాబంధనం**

ప్రేమానురాగాల ప్రేరకమీ బంధనం – మమతానురాగాల
మారకమీ బంధనం – సోదరి సోదరులమధ్య సంబంధ
బంధురమీ బంధం – ఆడమగల అన్యోన్యత
అతిశయించు యీ దినం – అదే రక్షాబంధనం

భారతభారతి చేతికి భాగ్యదాయి యీ బంధం
జన్మభూమి జనగణములు జయమెంచగ బంధురం
మమకారము సహకారము – మానవులకు అలకారం
అందరొకటి చేయగాను – అవని వెలుగు బంధనం
వత్సరమునకొకసారిగ – వచ్చునిచ్చు పరమ గుణం
శ్రావణపౌర్ణిమరోజున – చేతనముల బాంధవ్యం
మనమంతా మానవులం – మానవత్వ శోభితులం
సోదరి సోదర భావం – సాగు జగము సంతోషం.
ఆత్మీయత అంతరమున – అభిమానం మాటతీరు
మమతచేత మాధుర్యం – త్రికరణముల తియ్యదనం.
ఎడారిలో మానవునకు – ఏరువాక జనత ఘనత
తొలకరిపులకింతల భువికి – తోయంతో అభిషేకం
రక్షాబంధన దినమున – దేశమంత దివముగాను
అక్కచెల్లి అనురాగము – అవని జనులు కాంతురంత
నదులన్నియు సముద్రమై – నయము వార్ధి గంభీరము
ఆడమగల రక్ష దక్ష – అమరావని ఆధిక్యము.

మమకారపు మాగాణం – మాన్యమాత ఘన సస్యం.
తనయ తనయు తరుణారుణ – తరళ దీప్తి యీ బంధం.
మూడుముళ్ళ ముక్తిదాయి – ముచ్చటగును ముందడుగునా
ఉదయరాగమున్నతమయి – శాంతి సూర్యుడుదయించును

స్వార్థమునకు స్వస్తి పలికి – స్వాస్తికమౌ అనుబంధము
రక్షాబంధన విధమున – రాణించును రాజ్యమందు
గుండెనిండు మెండు గుణము – గురుతు రక్ష బంధనమ్ము
ప్రేమ భావ మంకురించు – పెరుగు హితము మరుగు హతము
కార్మికుడా కర్షకుడా – కదలిరమ్ము విద్యార్థీ
దేశమాత రక్షించగ – రక్షాబంధన సేయుము.
పున్నమ చంద్రునికాంతిని – శ్రావణమాసము చెలువుగ
విరియించగ వెలుగు జగము – వికసించును శాంతికాంతి
కోపతాపములు వీడగ – కోర్కెతీరు కోమలముగ
సిగ్గు ఎగ్గు నవల దోయ – సిలుగు లన్ని చెదరిపోగ
సిరిమల్లెల బతుకులలో – విరిజల్లగు యీ బంధము.
కాన్వెంటుల వెంట దిరుగు – కమనీయపు చిన్నారులు
కలిమి బలిమి చెలిమితోడ – బంధువులగు బంధనమున.
పాఠశాల పరమార్థం – పాటవమగు సౌఖ్యమగును
బాలబాలికల మధ్యన – బంధుత్వమె బంధనమగు
కళలశాల కలిమిశాల – కలకాలము వెలుగు శాల
రాఖిపర్వదినమునందు – రాజిల్లెడి శాంతిశాల.

భారతీయ సంస్కృతిలో – భాగ్యదాయి సమానతా
సామరస్య రాఖిదినము – సాయుజ్యపు సదృశమ్ము
లింగభేద లిరిక్కులూ – స్త్రీవాదపు మూఢత్వము
పురుషాధిక్యత పూజ్యత – పోరిపారజేయు రాఖి.
ఉన్నవాడు లేనివాడు – ఊరువిడిచి పోయినోడు
అందరు అక్కల సెల్లెల – అనురాగం అందుకొంద్రు.
నాగరికత గరిమలోన – నగుబాటగు నయవర్తన
రాగసహిత రమ్యభువికి – రాఖియగును రవణముగను.

ర్యాగింగులు రేపులలో – రామనలిగి రమణవీడు
భామభాగ్య బంధముగా – రక్షబంధమగును రక్ష.
గృహసీమలు గుణవంతము – గణరాజ్యము గరువ సహిత
అందరిచట నందమొంద – అమరమగును రాఖిరోజు.

రామరాజ్యమగుననేడు – 'రామ'లరాజ్యమ్మురాగ
రాగరహిత రహిని గెల్చు – రాఖి రోజు రామ గెలుచు
అమ్మలగన్నమ్మలంత – తనయులగను తల్లులంత
తనయ తనయుతగ గదెల్ప – తరియించును రాఖిరోజు
విశ్వశాంతి మరుగుపడగ – వింత తీరు విలువలొచ్చె
వంతలన్ని తీరిపోగ – వాసిగాంచు రాఖిదినము
రాఖి సఖియ సుఖము దెచ్చు – చెలిమి చెలునికిచ్చు రాఖి
చేతనమున చేతనములు – చైతన్యపు గెలుపు రాఖి
చిత్తశుద్ధి బుద్ధి రాఖి – విత్తమునకు విలువమీరు
రాఖికట్ట రాజ్యమొచ్చు – అమరావతి కదె కేంద్రము.

ఆగష్టు ఘట్టాలు చరితలో కొల్లలు
మానవాళిమనుగడలో మాయని మచ్చలు
వినాశపు విషనాగుకు వినూత్నమౌ కోరలు
యుద్ధానికి విజయానికి మధ్యనున్న మారణాలు.
జాతిదేశ జల నిధిలో – ఘాతితుడై మానవుండు
గమ్యమెంచె గమనములో – గతిదప్పెను మతివీడగ.
ఆధిక్యపు అంధమతిగ – అహంకార పాంథుడుగా
ఆసురమున ఆర్తితోడ – కీర్తికొరకు క్రీడించును.
ఖండితమై ఖండములుగ – కండగలుగు కామందులు
అగ్రరాజ్యకూటమిగా – అవతరించె అవనిలోన
మిత్ర శతృ చిత్తములతొ – మించె మితులు మేళనమున
అణుబాంబుల ఆక్రందన – ఆక్రమించె విక్రమమున.
హిరోషిమా హితమువీడె – నాగసాకి నయము వదలె
'హారిబ్రూమ'ను హేతువు – మతము హతము ఆమరణము.
జపానునకు అపజయమయె – 'లిటిలు బాయి' కారణముగ
'ఫాటుమాను' పాటవమున – పటువు వీడె నాగసాకి.
అంతులేని మారణమున – అంతమాయె పట్టణములు
వికలాంగుల రోదనలతొ – వింత వంత అలముకొనియె
చూపులేని రూపులేని – నడువలేని నరులందరు

చెవిటి, మూగ, రుజలతోడ – చెదరిరంత చెలువు వీడి
రెండవదిగ విశ్వమందు – శాంతిజెరచె యుద్ధమదియె
మూడవది ముంచుకొస్తె – మునిగిపోవు ముజ్జగాలు.

ఆ.వె. ప్రజలబాగు గోరి పాలనమొనరించ – ప్రబలు యశము నేడు పాలకులకు
జనుల బాధదెలిసి జగమున నేతలు – జరుగ జన్మభూమి జయము గాంచు.

తే.గీ. ప్రజల వద్దకు పాలన పరమమాయె – ప్రజల ప్రతినిధులధికార్లు పల్లెకెళ్ళ
ప్రబలె శ్రమదాన పద్ధతుల్ ప్రజలయందు – బాగుపడుచుండె పల్లెలు బాధవిడచి.

తే.గీ. ఆంధ్రదేశాన ఆనాడు అన్నగారు
కేంద్ర పరిపాలనమువీడ కేకవేయ
మండలములొచ్చె మనుజుల మాన్యముగను
గ్రామముల నిండె సంతస గమ్యములును.

తే.గీ. మూడు అంచెల పాలన ముద్దుగొలుపు – కేంద్ర మయ్యెను గ్రామము కేతనముగ
గ్రామసభలయ్యె గరువంపు రమ్యసభలు – అవసరములన్ని తీరగనవియె గురుతు.

తే.గీ. ప్రజలస్వామ్యాన ప్రతినిధుల్ పరములైరి – అందరధికార్లు అసదుగ అవమతులుగ
అధిక అవినీతి అవనికి అధమముగను – సాగుపాలన సరసతన్ సమత వీడు.

ఆ.వె. వయసురాని వారు వరులుగ దేశాన – ఓటుహక్కు పొంద ఓగు ప్రభుత
వయసులేని యోధ వరులంత పోరాడి – మాత పరువు మహిని మంట గలుపు.

సీ. అమరులు సమరాన అతిశయ ధైర్యాన – దేశాన్ని రక్షించ దీక్షబూన
గాంధీజి గమనాన గమ్యమ్ము జేరగా – గరువమ్ము మాతకు పరువుగల్గ
నేతాజి నెయ్యము నేతల నీతిగా – జాతిని వెల్గించ జయము మీర
లాల్బాలు పాలులు లక్ష్ముల లహరిలో – స్వాతంత్ర్య నావను స్వాగతించ.

భగతు అల్లూరి సుఖదేవు భాగ్యముగను – భరతమాతకు బిడ్డలు భవము పండ
గుండెనిచ్చిన గురువుల గురుతు నీతి – ఆశ ఆశయ సహితమై అవని నిండె.

సీ. చట్టాలు ఆంగ్లేయ చుట్టాలు చులకనన్ – భారత జనులకు భయము మీరె
విభజించి పాలించు విమతమౌ పద్ధతుల్ – సమతను చెఱచగా సంకరములు
మతమున కులమున మారణహోమాలు – మౌఢ్యంపు చేతలై మహిమ వీడె
పోలీసు చర్యలు పోడిమి వీడగా – దేశీయులందరు దెయ్యములుగ.

తే.గీ. దయయు కనరాని దమనము ధరణిమీరె
దహనమాయెను ధర్మము ద్రఢిమవీడె
హిందు హితమాయె పరదేశ హతము విధము
పరుల పాలన పద్ధతిన్ పరువుపోయె.

సీ. ఆగష్టు పదిహేను అందరు నందించ – విందాయె జనులకు విలువ మిగిలె
తెల్లవారెళ్ళిరి తెగువవారొచ్చిరి – తెలుపగ తేటగు దేశమహిమ
యత్నాన ఫలితమ్ము యామిని వీడగా – వెలుగొచ్చె నిశిరాత్రి వేకువగను
సంకల్ప బలమున సాగిరి వారలు – సాగరమేఖల సరళి దెలిసె.

ఆ.వె. చిత్తశుద్ధి గల్గ చింతన స్వేచ్ఛయె – స్వచ్ఛమాయెనడత సొబగు మీరె
దేశభక్తి యుతులు దేహాన దేవులు – ఫణము పెట్టిరంత ప్రాణములను.

సీ. గణతంత్ర రాజ్యము గమనమ్ము తెలియక – గజిబిజి పథకాల గర్వరహిత
లౌకిక రాజ్యము లోకాన లేదను – లోకుల మాటను కాంకమీరె
సంక్షేమరాజ్యము సంక్షామమునబడి – సాగర సారమై సాగుచుండె
ఆర్థిక సమతను అందించు ప్రభుతలు – అవనిని నిలువక అంధమాయె.

తే.గీ. నాడు రాజ్యాంగ రచనమ్ము నయముగాను – వ్రాసిరందరు తలరాత వరపువీడ
హక్కుమిగిలెను బాధ్యత అసలె మరపు – స్వార్థ వర్ధన మగుచుండ భవిత సున్న.

సీ. అయిదేళ్ళ ప్రభుతలు అర్థాంతరముగాను – పతనమై విలువలు పతితలాయె
సద్వర్తనము లేని సంకీర్ణవిభులంత – వితథమై జనులకు వేసటాయె
రాష్ట్రాలు కేంద్రమ్ము రాజసరహితమై – పాలన పాతర పాతకముల
ప్రైవేట్లు పెరిగెను ప్రభుతయు తరిగెను – మథనను జనులంత మగతలోన.

తే.గీ. విశ్వరాజ్యాల అభివృద్ధి వింతలోన – సుంత సంతగ వంతను సురిగెనేడు
పాటవమ్మున అణువులు పారిపోగ – అంత అంతరజాతీయ వింతయాయె.

సీ. నలుబదేండ్లుగ నుండి నయమున పాలించె – కాంగ్రెసు ఖంగారు కలలసమత
మధ్యన మధ్యన మన్నిక కల్గిన – అరగొర ప్రభుతలు అవని మమత
కుంభకోణాలలో కూరుకుపోయిన – రాజకీయులు నేడు రాజులాయె
అర్థమ్ము నార్జించ అధిపుల పదవులు – ప్రజలిచ్చి పోషింప ప్రవరులంత.

ఆ.వె. ఏబదేండ్ల ప్రభుత ఎఱుకను గల్గించె – మరచిపోయిరంత మాన్యజనుల
జాతిజెండ జయము జనులంత గాంచగా – గతము దెలియ భవిత సతము మహిత.

సీ. న్యాయమ్ము నెనరున నెయ్యము గమనింప – నేతకు శిక్షలు వెతలు లేవు
ప్రజలను మరచెడి పరములు ప్రతినిధుల్ – సుఖముల పదవియె సురభియగును
అధికార మధమమై అవధులు మీరెను – అర్థమ్ము గణియించ నదియె దారి
సేవను మాటకు సెలవిచ్చిరందరు – చేతములందున చెరుపు మిగులు.

తే.గీ. పార్టి పరమమ్ము ప్రజలది పాతకమ్ము – ప్రజల బాగును గమనించు వారలెవరు
సరళిమారగ చట్టాలు సరభసములు – అన్వయమునందు స్వార్థము అవని వెలుగు.

సీ. హస్తిన హస్తము అవహేళనముసేయు – వక్రరేఖలచూడ వరపులేదు
ఉభయ సభలలోన ఉన్నతులుండగా – ఉపకారమంతము ఉన్నతులకె
సామాన్య జనులను సమతను నిండిచు – అసమానతలు నేడు అందగించు
మోసమ్ము నీతియై మోదమై ధర్మము – భారత జాతికి బాధమీరె.

తే.గీ. వెడలె కాంగ్రెసు జనతయు వెలుగు సూచె – క్షరము అక్షరమాలయై అవనివీడె
ఫ్రంటు ముందునకొచ్చెను ప్రభుత గాను – భారతీయము జనతయై భవము నిండె.

సీ. సిద్ధాంత రహితమై సిరిగల పార్టీలు – సిలుగుల మయమైన చింతగలుగు
వ్యక్తులు త్యజియించ వ్యవహారమునయందు – వ్యభిచారరూపమై అభ్యుదయము
కలగూర గంపలు కలతల పార్టీలు – కలలోన కామించ కథయు ముగియు
అభివృద్ధి అమరమ్ము అవనిని శూన్యమ్ము – అవసరమునలేక అంతరించు.

ఆ.వె. రాజకీరంగు రాజ్యాన వెలిసెను – రంగులేయువారు రచ్చకెక్క
రచ్చరొచ్చుమీర రంగైన బురదలో – పంది విధమునేత పలవరించ.

తే.గీ. మార్పుకోరగ తీర్పరి మానవుండు – మనసుకల్గగ మహితుడు మాన్యుడతడు
మేధ మేలిమి బంగరు మెలకువగన – వేద్యుడగునుగ విద్యార్థి వెలుగు జూడ.

ఆ.వె. సివికు సెన్సులేని సిటిజను కలుగగ – పట్టణాల పరువు పట్టపగలె
ఓటు హక్కు గల్గు ఓటరు ఓగైన – వాగుబారి బడును వరపుప్రభుత.

తే.గీ. పెద్దరాజ్యాంగముండెను పేరుగొప్ప – హక్కు బాధ్యతలుండెను హితము నడత
అంతరములెంతొ పెరిగెను అవనిజనుల – వింత తీరగు పాలన వెతలు దెచ్చె.

సీ. అమెరికా గొప్పది ఆంధ్రమే అధమము – మేధావులందరి మేలిమాట
గల్భున గరువము గ్రామాల నరకము – డాలర్ల మోజులో డాబుమీరు
పరదేశ సేవలో పరములు అధములు – పనులేవి చేసిన పరువుగాను
ఇంపోర్టు గూడ్సులో ఇంపగు కంపైన – మనదేశ వస్తువు మనకు చేదు.

ఆ.వె. నాటిదేశభక్తి నవ్యమై దివ్యమై – నవ్వులాటగాను నటన మీరె
నేటియువత భవిత నెవ్వగ విధమున – నేతిబీర విధము నేతలందు.

సీ. ఒకపూట బడిలోన ఒకగంట నిలువగా – ఓపిక కరవైన ఓగునీవు
విద్యార్థి లక్ష్యము విజ్ఞానమునుగొంట – విమతముగానున్న విలువలేదు
జనసొత్తు తినగాను జయమెంచు వారల – మాటల వినగాను మధువు జగతి
చిత్తాన చింతన పొత్తము విత్తము – చదువున సరసత పదను మీరు.

తే.గీ. విధిని కర్తవ్యమును నీవు విడువకున్న – ధర్మరక్షణ రక్షించు ధరణిజనుల
ఆశ ఆశయ అవగాహనాదరమున – భవిత భాగ్యము భారత భవమునందు.

ఆ.వె. నాటి నీతి ధర్మ నయమున వర్తింప – భయము భవము మీరె భారతమున
నేటి నీతిపరులు నేతలై జాతికి – మార్గదేశికులుగ మసలు గాత.

ఆ.వె. అభ్యుదయము నేడు అంచులు మీరెను – అంచులందు మంచు నీరు మిగిలె
అదియు ఉప్పునాయె అందరి స్వార్థాన – నీతి విడచి జాతి నీరసించె.

ఆ.వె. భరత జనత హెచ్చె భాగ్యము చేజారె – పట్టుబట్టి పట్ట పరువు గల్గ
మందిమీరగాను మజ్జిగ పల్చనై – ఫలము లేని బలము పటువు విడిచె.

ఆ.వె. ఉగ్రవాద మొచ్చె అగ్రమై వ్యగ్రమై – దేశప్రాంతములను దిటవు మీరె
అర్థసమత దాని అసలైన మందగు – మందునివ్వ ప్రభుత మమతహెచ్చు.

ఆ.వె. జన్మభూమి ప్రేమ జాజ్జ్వల్యమానమై – వెలుగుచుండె శ్రమగ వెతలలోన
కర్మ మర్మముగను కాట్లాట విధముగా – కాంతి తరిగిపోయె కాలవిధిని.

తే.గీ. బాధ్యతలులేని అధికార బాధ బరువు – అమలు మరచిన అధికార మవని సున్న
వెన్నెముకలేని అధికారి వెతల బతుకు – ముసలితనమున మాతకు మురిపెమిదియ.

తే.గీ. గగన పథమున విహరించు గమ్యరహిత
స్టారువారుల సరగేమొ సారగరిత

యుద్ధభయమున భరతమ్ము బద్ధమమత
లలిత లావణ్య మింపారు లవము జయము.

ఆ.వె. భరత వీరవరుల భవమేమొ ధన్యము – బానిసత్వ రహిత భారతమున
స్వేచ్ఛనిండిపారు సేవన రహితమై – స్వార్థసహిత మగును వార్థకమున.

ఆ.వె. ఏబదేండ్ల ముసలి ఎదలకు ఏహ్యము – బాహ్యరూపమంత భాగములుగ
మాత వృద్ధురాలు మనకెంతొ మహితగా – అంతరంగములును అందమగును.

ఆ.వె. మహిళమాన్యతేమొ మరుగాయె సభలందు – రాజకీయములను రభస మిగిలె
లోకరాజ్య సభల లోపము లౌక్యము – పురుష బలమునేడు పూజ్యమగును.

ఆ.వె. కోపతాపములను కొలిమిని బడగాను – మాడిపోవు మనిషి మమత మరచి
దయకు ధరణిలోన దాతృత్వ భవనాన – స్థానమీయుమీవు సాహసికుడ.

తే.గీ. విధిని ధర్మాన్ని పాటించి విజయమొందు – కర్మయతనాన సాధించి కాంతి మీరు
గురువు శీలమ్ము గురుతుగా పరువు పొందు – పరము పరసేవ ప్రజలకు భారతమున.

తే.గీ. అన్ని పీరియడ్లు హాజరై అందరు – అమిత విద్య గొనుడు అహము మరచి
వినయశీలమునను విజయులు మీరలు – దేశభక్తి పథము దివ్యమగుత.

తే.గీ. విద్యలేనివాడు వింతగు పశువుగ – నేర్చె విద్యతాను నీతిరహిత
తెలివి కలిగి తప్పు తెంపరితనమున – చేయు మానవుండు చెలిమి మరచి.

తే.గీ. ప్రభుత మోసము చేయగా పరములంత
ప్రభుత ప్రజలది తెలియగా విభులు నేడు
స్వార్థచింతన చింతగా స్వాస్థ్యరహిత
ఎదుటి వానికి తోడ్పడ ఎంతొ మేలు.

సీ. వీరంగమేసెను విబుధుల అవినీతి – అంతరంగాలలో అధమముగను
మనదను మాటకు మాన్యత కరవయి – తనదను భావాన తపన హెచ్చె
ఆశలు మీరెను ఆశయ రహహితమై – అవకాశ వాదము అవని మీరె
నిర్లిప్త నీరస నిస్తేజ నిధిగాను – మనుజుడు మరచెను మానవతల.

తే.గీ. తనదు అదృష్టరేఖల దారిమారె – దృష్టమాయెను ధ్రువమగు దురితములను
కడుపునిండుట కడలేని కలతగాను – తృష్ణ తూర్పున తెలవారె తుదకు నేడు.

తే.గీ. మనిషి మనిషిని దోచుట మాన్యతాయె
ధనము మితిమీర జనుడేమొ ధన్యుడాయె
నాగరకమున నరుడేమొ నాణ్యమాయె
మనము కలుగగ మనుజులు మరపు మిగిలె.

సీ. తేలికపద్ధతుల్ తెరువుగ గణింప – తెగువను తెంపరి తేట మనిషి
మాయమాటలు జెప్పి మాంద్యమె నడతగా – మనువాడు మనలోన మంచి మనిషి
ప్రతినిధి ప్రాపును ప్రాభవ సహితమై – పడిలేచు అధముడు పరమ జనుడు
తప్పుకు తిరిగెడి తరుణుడు ధరణిని – మెప్పులు పొందెడి మేలిమనిషి.

తే.గీ. భయము బాధించు వారల భవమునందు – శాంతిహీనము శమమును శక్తి రహిత
కాంతి రహితము కర్మల కలత కలల – బతుకు గతుకులమయముగా భాగ్యరహిత.

తే.గీ. అల్ల అల్లూరి నినదమ్ము కల్లగాను – నేత నేతాజి నెయ్యము జాతి గరిత
భగతు లాల్బాలు పాలుల భాగ్యమహిత – గాంధి నెహ్రూల రాజ్యము గణ్యమిచట.

సీ. కులములు మతములు కూలుట తథ్యము – కలిమియె బలిమిగా కాంచగాను
ఉన్నత మధమము ఉదధిలో బడిపోవు – సంకర సంకీర్ణ సంగతులను
అధికార పదవులె అత్యున్నతమ్ముగ – ఇతరము లేవియు హితముగాదు
నేతల మాటలు నేతుల రీతిన – జనులంత నమ్మిన జగతి విగతి.

ఆ.వె. వందకోట్ల జనుల వరుసలు చూడగా – వగపు కలుగుచుండె వరపువీడి
అంతరంగములను అందరి భావన – మాత ప్రగతి గనగ మహియె వింత.

ఆ.వె. రాజకీయులంత రాములు కృష్ణులై – రాజ్యవృద్ధికోర రమ్యమగును
ప్రజలు భాగవతులు పరముల సేవించ – వరము భరతమాత వాసి భవిత.

ఆ.వె. ధైర్యమన్న మాట ధరణిని పూజ్యమై – హింసలోన మించె హితము మరచి
వగపు వెరపు వసుధ వాసిని హతమార్చి – హిందు దేశ విధికి బంధమాయె.

సీ. సోషలిజమ్మిట శోషగా మిగిలెను – లంచాల కూరను లవణమాయె
సార్వభౌమత్వము సర్వము శూన్యము – అధికార మనుమాట అమరమాయె
డెమోక్రసీయిట డీమోక్రసిగమారె – ప్రజలంత పందలు ప్రతినిధులకు
లౌకిక జగతిని లౌల్యము హెచ్చుగా – లోకుల లోపాలు లోభములను.

తే.గీ. భరతరాజ్యాంగ మందున్న భావనలను – సరళ రీతిగ విరళమై సాగుచుండె
ప్రాత తలరాత విధమున వరపు వీడ – శిక్ష భయములు చిన్నవై చెన్నుదప్పె.

సీ. సంఘమ్ము సవ్యమై సమతను శృతిమించ – మమతయె మానవ మధువు సుమ్ము
వ్యక్తుల తత్త్వము వ్యతిరేకమునువీడ – సువిశాల తనుగన శుభము సుమ్ము
అవినీతి అధమము అందవిహీనము – అనితల్చ అందరు అతిశయమ్ము
పరసేవ పరమము పాలకవరులకు – స్వార్థము వ్యర్థమై సాగుసుమ్ము.

తే.గీ. అందరొకటిగ జీవించ అందమగును – అమిత ఆశలు అవనికి ఆహతమమ్ము
కడుపునిండుట ముఖ్యము కామితముల – కలల కలతలు కర్మల కాంతిదప్పు.

తే.గీ. భారతీయుడ వీవన భాగ్యమహిమ – శాంతికాముడ వీవైన శక్తిమించు
సంఘ సంస్కార సహితుడై సద్యశమున – ఉద్యమింపుము ధర్మాన ఉన్నతముగ.

తే.గీ. ప్రాధమికమున పద్ధతి పధమువీడె – పైన మెరుగులు తరుగులు లోన మీరె
చెప్పువారలు చేయరు చెడునడతల – మెప్పు గొనువారు త్రికరణమేని వరులు.

సీ. స్వాతంత్ర్య పంటను స్వాహాలు కలుపులై – ఆహరించుచునుండె ఆర్తిమీర
కలుపును తొలగించ కలతను వీడిన – సస్యము స్వేచ్ఛగా సాగివచ్చు
అవినీతి లంచాలు అధికార్ల వంచనల్ – అణగార్చివేయగా ఆశయమ్ము
'భారతీయుడ'వను భావమే గణ్యము – పెక్కులు చిక్కులు పేరు వెలయు.

తే.గీ. నగ్నముగనుండె రూపము నవత వీడి – భగ్నమగుచుండె భారతి భయములోన
అసమసమతయె గోరీల అందగించె – మెసవు చుండిరి పంటను పసరమట్లు.

తే.గీ. నీకు ముఖ్యము త్యాగము నిలువు రూపు – ముఖ్యమిల్లైన దేశమ్ము ముద్దు ముందు
భారతీయుడ వీవిట బంధువగుము – బంధనములన్ని తొలగును భవితపండు.

తే.గీ. నేత వేదాంతి వేద్యుడు నెయ్యమలర – జాతి జాజ్జ్వల్యమానమై జయము గాంచు
తృప్తి తులకించు తనయుల జ్ఞప్తిగొన్న – మాత మనసేమొ మరుమల్లె మంచితనము.

ఆ.వె. చీర చినిగిపోయి చింతల మునిగిన – మాత మరచి రంత మానధనులు
పట్టుచీరకట్టు పట్టుదలనునిండ – పట్టభద్రయగును భరతమాత.

ఆ.వె. విద్య వధ్యమగుచు విద్యార్థి విమతుడు – గురువు పరువుపోయె గురుతువీడ
శిష్య గురువవులిలను శీర్ణమై చెడగాను – వేదవిదుల వెతలు వెలుగుసూపె.

ఆ.వె. అన్ని అర్థమాయె అరగొర స్వేచ్ఛను - అర్థమైన అతివ అసలె లేదు
చదువు సమత మమత సహనము సారము - వినయ రహితముగను విలువవీడె.

కదలిరండి యువకులార - కదనానికి యువతులార
భరత భాగ్యధాతలార - నీతిభరిత నేతలార
అమరవీరులంతగూడి - అందించిరి స్వాతంత్ర్యం
మనమంతామగతవీడి - మన్నించగ మధురమగును.
అహింసయే అందముగా - అమరమాయె భరత భవిత
హింసనేడు హితమాయెను - హతముచేయ మహిత మతము
పేదరికం పెరిగిపోయి - అసమానత అధికమాయె
సమసమాజ సదనములో - నివసించగ నవ్యమగును
విద్యవినయ సంపన్నత - విలువలీను మార్గమందు
గమియించగ గరువమగును - గమ్యమెంతొ సుగమమగును
సహవాసము సంపన్నత - దుష్టమైన నష్టమగును
అన్యోన్యత అందమగును - అంతరములు అంతరించు
పైపైమెరుగుల లోకం - పావనముగ తలచ కీవు
ఫలవంతము బలసహితము - త్రికరణముల తీరు నడత
బృందావని బుద్ధునిగా - అందానికి అధిపతిగా
నేటియువత నడవగాను - నందనవని భరతభూమి
నీతిలేని నేతలంత - నీరసించి పోవునట్లు
విప్లవించి విధులదెలిసి - విజయులైరినుతినొందగ.
రాజకీయ వాదులంత - సేవనువీడిరి నేడిట
స్వార్థసహిత సంపాదన - సాగనంప సార్థకమగు
వ్యక్తి వెతల దీర్చునదే - వ్యవస్థగా రూపునొందె
సంస్కరణము సంస్కారము - సగుణమగును భరత భువికి.

కందుకూరు కమనీయము - వీరేశము విలువ వెలుగు
పంతమునను పంతులాయె -పడతులకే మహితుడాయె
రాణ్మహేంద్రి రాజ్యముగా - పూజ్యమాయె పుట్టుకతో
సాహిత్యపు సౌరభాన - సాగరమయె సంస్కరణము
మూఢమతుల ముప్పుగాను - గూఢమైన గురువుగాను

చిత్తశుద్ధి విత్తముగను – సిరియె మార్పు తెలుగునేల
పరిహరించె మహిళ పరద – వ్యథ విడిచెను తెలుగు పడతి
విద్యనేర్పి విజయుడాయె – వినుత రీతి సమతయాయె.
సంఘకవిత సంస్కరణము – ఆంధ్రమందు అందగించె
ఆరోగ్యము అంతరించ – అమరుడాయె సమరమందు
హితకారిణి వెలుగులోన – వెతలు విడిచె వెలదినాడు
వితథమైన వింత బుద్ధి – మాన్యమహిళ మరచిరంత.
జనజీవన దారిలోన – ముళ్ళురాళ్ళు ముసరగాను
పరులసేవ వరముగాను – తొలగించిన వెలుగు జగము
గృహలక్ష్మిని గురుతుజేసి – మహలక్ష్మిగ మలచెతాను
జనలక్ష్మిగ జాతికంత – జయము  గాంచ భయము తొలగె
ఆంధ్రజాతి వైతాళిక – గణములోన గణ్యుడాయె
మహిళ స్వేచ్ఛ గమ్యముగా – యాత్రచేసె గాత్రమునను
బాల్యవివాహాలభయమము – వితంతువుల విధివ్రాతల
లేదులేదు లేదింకను – వీరేశుని వాదనమున
చైతన్యపు చెలమతాను – చేతనమున చలువలీను
త్యాగమయపు జీవనమే – యోగిగాను వరలుచుండు.

ముక్కుపచ్చలారకుండ – మూడుముళ్ళు ముదుసలేయ
బాలవితంతువులుగాను – బతుకునీడ్చ భారమగును
వివాహమ్ము వితంతువుకు – విధిగమరల సేయగాను
విలువ హెచ్చి వెలదులంత – సంఘములో సాగిరంత
కన్యశుల్క వరశుల్కము అన్యోన్యత నాహరించు
హృదయపదవి పదిలముగను – బతుకు భాగ్యసీమయగును
వ్యక్తియె శక్తిగ వెలిగెను – సంఘటితము ఆంధ్రభూమి
సాహిత్యం సంస్కారం – సారవంతమాయె నేడు
బ్రహ్మ సమాజమ్మునాడు – కులము మతము కుళ్ళుకడిగె
బ్రహ్మజ్ఞాన మున్నవాడు – బ్రాహ్మణుడనె భయములేక
సంప్రదాయ సారమంత – వడబోయగ వాసిగల్గు
మూఢమతుల మతమంతయు – వీడజేసె వీరేశుడు.

శరీరమే బలహీనము – బలవంతము భావనలే
గీతగీసె గీష్పతిగా – ఆంధ్రవాణి అనుమతితో
రాజమండ్రి రమ్యమాయె – రామలకది రవణమ్మయె
ఆంధ్ర రామరాజ్యములో – అర్ధభాగమాయె నతివ
ప్రాక్పశ్చిమ వారధిగా – సంస్కరణపు సారధిగా
ధర్మరహిత ధరణిలోన – ధార్మికుడయె దానమునను
పత్రికలే పుత్రికలై – పరమపదము మహిళ పథము
మహనీయత కల్పించగ – మార్గమునను ముందు నడచె
అబల ఆర్తికీర్తనగా – అవని మించె జీవగీతి
కీర్తిశేషగీతముగా – మూర్తులందు మిగిలెనతడు.

మగువ మానరక్షణకై – మహనీయులు పాటువడగ
పాటవమున వీరేశము – బాటదీర్చె బాగుగాను
విద్యేనేర్చి విమలమగును – సహజీవన సంబరమ్ము
గృహసీమలు గుణవంతము – సహనమ్మున సాగగాను
తెలుగు తరుణి మేల్కొల్పిన – తెగువ వీరు తగవు మిగులు
ఆదిశక్తి మాన్యతకై – అవనిసాగె పోరాటము
గోదావరి జీవనదిగ – గోరంతలు కొండంతగ
పెరిగె పరమ పోరాటము – వీరేశుని విలువ వెలుగ
వంశమున్న తమ్ముగాని – వాసియె మసిపూతగాగ
వేశ్యవృత్తి వృత్తముగా – వేద్యమాయె సాహిత్యము
నవయుగవైతాళికుడుగ – గద్యతిక్కనను పేరున
నవల కథల నవకముగను – సాగె కవిత సరభసముగ
పావనమయె ఆంధ్రభూమి – సంస్కరణము సవనముగా
జాతిజనుల సంస్కారము – జన్మభూమి కుపహారము.
మతఛాందస మనుబాటను – గతి దప్పెను గాథలలో
మతిమంతము మరునిసేవ – పరమార్థము వరమాయెను.
ఉపన్యాస ఉదధిలోన – విధిగ జనులు పడిపోదురు
చిత్తశుద్ధి చింతనలో – విత్తమగును సంస్కరణము.
ధారవోసె సర్వస్వము – ధారుణిలో దళితులకును

ఆశయముల కందుకూరి – అభివందన కర్హుడగును.
మేలుకొనెను ఆంధ్రజాతి – మేలి ఆశయములు కలిగి
గతములోని గమనమంత – వర్తమాన వాసి భవిత.

తెలుగు వీరుల తెగువ జలధిని – తేలియాడెను వెలుగునావ
అమరవీరుల ఆశయములను అందగించెను ఆంధ్రభూమి
త్యాగమూర్తుల యాగమందున – యోగవంతము జన్మభూమి
మానవతకే మారుపేరగు – మాన్యమూర్తుల మధురభువియిది
పొట్టి దిట్టగ పోరు సల్పెను – అసువులిడగను ఆంధ్రమొచ్చెను
అమరజీవుల ఆదమరవక – తలచుకొనగను తగవు నీకిట
ఆంధ్రకేసరి ప్రకాశమునకు – అందరును నివాళి నివ్వగ
తెల్లవారలు తెల్లబోయిన – తీరు తెలియును గుండె నివ్వగ
కవుల గాయక కవిత గీతలు – విశాలాంధ్రను వినుతినొందగ
ఆంధ్రదేశము సాంద్రమాయెను – అన్నపూర్ణగ అతిశయించెను.
నలుబదేండ్లుగ పాలనమ్మున – ప్రభుతలన్నియు ప్రగతిపథమున
పాలకాద్యులు పాలుగొనగను – పార్టీలన్నియు పరమమాయెను
తెలుగు వెలుగులు తెగువ వీరులు – తేనె తేటల తెలియజేసిరి
తెలుగుజాతిని విశ్వవీధిని – వెలుగజేసెను అన్నరాముడు
అన్న ఆశయ జలధిలోనన – తమ్ములందరు మునిగిపోయిరి
ప్రజల పాలన జనుల వేదన – తీర్చ తియ్యన తీరుగరువము
అమరమగునుగ ఆంధ్రదేశము – పేదరికమును పారద్రోలగ
జన్మభూమిని జయముగాంతురు – జవము కలుగగ జాతి జనులిట
పంట బంగరు శ్రమయె స్వర్ణము – సేవభాగ్యము చిత్తశుద్ధిని
పగలు రేలును పాటుపడగను – పావనమ్మగు పాలనమ్మిట
నీతిధర్మము నియతి సత్యము – దానయోగ్యము శాంతికామన
అంతరంగము అంతరమ్ముల – అంధ్రులందరు విడువజయమగు.

విజయానికి విప్లవమే వింజామర విశ్వమందు
జనజయమును కాంచగాను చైతన్యము విరిజలము
మరుమల్లెగ మానవతను మనసులందు మననిమ్మర
పోరాటం పోరాటం – హక్కులకోసం పోరాటం

ఆరాటం ఆరాటం – ఆశయసాధనకారాటం
బాధ్యతగల్గిన భావిపౌరుల భావనలోనే పోరాటం
భాగ్యభారతికి బంధువులైనా యోగ్య యువకుల ఆరాటం
పరులసేవలో పరములు ప్రభువులు పాలలోనే పోరాటం
స్వార్థరహితమై సార్థకనాముల ప్రజాస్వామ్యమున ఆరాటం
జన్మభూమిలో జాగృతయువకుల జయగీతికలే పోరాటం
కర్మభూమిలో కాంతుల మయమై కామనగల్గుట ఆరాటం
హక్కులు తెలిసీ బాధ్యతబలమున చెలిమిని పెంచే పోరాటం
నీతిని నిధిగా ధర్మము ధృతిగా ధరణిని నింపే ఆరాటం
సంసారంతో సాగేజనుడా బలిమియె కలిమిగ పోరాటం
సంఘసేవలో సారాంశముగని సాగినమానవు నారాటం
శాంతినికోరీ హింసనువిడిచీ మానవగమనం పోరాటం
విశ్వమానవత విరులనుపంచే మరువముకోసం ఆరాటం
పదవినిపొందీ ధనముకోసమై ప్రాకులాటపై పోరాటం
ఆలోచనతో అవగాహనతో ఆశయ సహితుల ఆరాటం
స్వర్ణభారతీ వర్ణవర్గముల బారినపడితే పోరాటం
దేశభక్తితో జాతిరక్తితో ఐక్యశక్తికై ఆరాటం
అధికారంతో అంధకారమున మదమత్తులపై పోరాటం
ప్రభుత సేవలో ప్రగతినిగాంచిన ప్రజాసేవకై ఆరాటం
భయం భయంగా బతుకును గడిపే భారతీయుల పోరాటం
మనసున మమతను సంఘము సమతను సాధించుటకై ఆరాటం.

మున్సిపాలిటీ మురికివాడలో మూలిగే ముదుసలి మూగవేదన
మురికివాడల నిర్మూలనలో మునిగిపోయిన లంచావతారాల రోదన
చోటు, ఇల్లు, చెట్టూ, పాకీగొడ్లపథకాలతో పరువు పొందిన ప్రభుత
బోర్డు అధికార్ల అధికారపు అంధకారం ఆవరించిన గృహాల విభుత
జన్మభూమి జాతరలో జారిపడిన జవ్వని యవ్వనంలో జాగృతి
కర్మభూమిలో జనులు జయకేతనమెగరేసే అభ్యుదయపు ఆకృతి
పూడిపోయిన కాలవలతో పునీతమైన రహదారుల రాజసం
విశ్వాసపు కుక్కలు, మురుగు మరిగిన పందులు, కరిచే మర్కటాల కర్కోటకం

అక్రమ కట్టడాల అమాయకపు చట్టాలు అంతూదరీలేని ఆక్రమణల విక్రమం
రాజకీయుల రాజ్యంగా ప్రజాసేవ పూజ్యంగా పరమ పదిస్తున్న ప్రజాస్వామ్యం
అప్పుతెచ్చిమెప్పు పొందే పాలకులు తిప్పలైనా తియ్యనేననుకొనే పార్టీవాళ్ళు
జాతిని తాకట్టుపెట్టే జాణతనం పదవులు పదిలంచేసికొనే పాలకులకౌటిల్యం
బీదరికాన్ని బియ్యంతో కొనేసిన స్వర్ణభారతి రాజకీయ సారంగులు
పేదరికాన్ని పెరటిచెట్టులా పెంచి పోషిస్తున్న పెట్టుబడిదార్ల పెత్తనం
ప్రత్యేకతల ప్రత్యూషపవనాలతో పావనమై మధ్యన మాడిమసైపోతున్న వసుధ(మాన్యం)
సప్తశతాబ్ది అధికారవ్యవస్థ బీదరికాన్ని అంచనావేయలేక బితుకుమంటున్నది
తెలివిలేనితనం తెంపరిగా తెలివికలిమిని తెరువు వీడి తెగిస్తున్నది.
మానవ సంబంధాలు మాంద్యంతో మత్తుమయమై చిత్తాలను ఛిద్రం చేస్తున్నాయి.
లేనిబాధల్ని ఆపాదించుకొనే లేవడి బతుకులు లేమిలోనే అంతరిస్తాయి
చచ్చినా బతికినా సంతకెళ్ళే సంస్కృతి సంస్కారవంతుల సరళికారాదు
నన్నునుసరించే వాళ్ళు నలుగురున్నారని చెప్పుకొనగల్గిన నాణ్యత నీదికావాలి
పదిమందిలో వ్యక్తిత్వం, పావన పరమార్థ పరసేవనీ ఆశయమై నియంత్రించాలి.

తే.గీ. కళల కమనీయతను నేడు కాంచగాను, అరువదియునాల్గు అందున అమరముగను
ఫోటొప్రాభవమొప్పగా పొంకముగను, చిత్రకళగాను రాణించి చెన్నుమీరె.

తే.గీ. శాస్త్రసాంకేతికమ్మున శమము గూర్చు మనిషిలేకున్న మాన్యత మనకు ముందు
రూపమునుగని జనులిట రుజలు బాయ, చిత్రగ్రాహక యంత్రపు చిత్రమదియె.

తే.గీ. మార్పులెన్నియె మహినిండె మనుజతతిని, గురుతు కలుగగ గురువుగ గుణముగల్గి
జీవనాంతము భద్రము చిత్రములుగ, గ్రహణసేయగ గణ్యము కళలలోన.

తే.గీ. ఫిల్ము యంత్రాన నమరగ ప్రింటు పడగ, అద్దమమరింపప్రతిబింబ మమరునచట
మెలకువల మీరు మేలిమి మేలికళగ, అవతరించెను అవనిని అందముగను.

ఆ.వె. క్లిక్కు కొట్టగాను క్లిష్టమ్ములేకుండ, ముద్రితమ్ముగాను ముందురూపు
డార్కు రూమునందు మార్పులమధ్యన, ఫిల్ము ప్రింటువేయ వెల్గురూపు.

ఆ.వె. అంతజరుగునచట అంతరమ్మునసట, యంత్రమందునదియె మాంత్రికముగ
క్లిక్కు క్రిందికనగ కిమ్మనకుండగ, చిత్ర బింబరీతి చిత్రముగను.

తే.గీ. సినిమరంగము చిత్రము సిరులెకళకు, ఛాయగ్రాహకులెందరో చాలనమున
విశ్వవినుతుల గాంచిరి విజయులైరి, మాన్య కళలందు మధువులు మరులుగొనగ.

తే.గీ. భ్రమగ రూపము భ్రమియించు భవమునందు, పదిలమయ్యెను పద్ధతుల్ పాటవముగ
వీడియోలుగ విదితమై విజయమొంది, వాసిగాంచిన వరులకు వందనుతులు.

తే.గీ. కళలు కలిమికి రూపాలు కామితములు, అందమానంద మవసర మందజేయు
సృజన శ్రుతిమించ మతిమంత భాజనములు, ఉన్నలేకున్న జనునికి కన్నగురుతు.

తే.గీ. స్ఫూర్తినించును చిత్రాల మూర్తులన్ని, గతము హితముగ మనముందు గమ్యమునకు
మానవాళికి చైతన్య మాన్యతలను, అందజేయును చిత్రాల అవని కళగ.

తే.గీ. దూరతీరాల ప్రకృతిన్ చూరగొనగ, శాటిలైట్లను ఫోటోల శమముమీర
సార సాగరపర్యంత వారిలోన, దాగియున్నట్టి చిత్రముల్ ధరణి దెలియు.

తే.గీ. గౌరవించుము కళలను గరువమగును, సృష్టి అందము చిందించు పుష్టి కలిగి
తుష్టి కలుగగ తృష్ణను తూలవేయ, కళలు కమనీయ చిత్రాలు కాలములకు.

తే.గీ. కలలు ఇలలోన కళలుగ కామితములు, తీర్చుతీయని తలపులు తీరువేరు
తెలిసి తెలియని రోజుల తేటరుచుల, కనుల గోచరమగునుగా కాంతిమీర.

తే.గీ. ఉన్నరూపును చలనమ్ము నున్నతీరు, వివిధ భంగిమలందున విలువ దెలియ
ఇష్టమగుమూర్తి చిత్రాన తిష్ఠితమ్ము, మనసు మాలిన్యరహితమై మనును జగతి.

తే.గీ. కాలగమనాన రూపము కలుగలేక, నాశనమ్మగు జీవము నమ్మగాను
చిన్నతనమున తెలియని చేష్టలన్ని, తెలివి కలిగిన తరువాత తెలియగలవు.

తే.గీ. ప్రళయములు వచ్చి జగమంత పాడైయైన, విలయమొచ్చిన విశ్వము వితథమైన
నాటిరూపుకు సాక్ష్యము నేటిబొమ్మ, నాడునేటికి గుర్తుగ నయము జగము.

తప్పుచేస్తే కొడుతుంది – టి.విలు ఎక్కువగా చూస్తే
తనది తప్పున్నదనే భావన తల్లి కొట్టడాన్ని సమర్థించుకొంటాము
తేడాలు – వివక్ష – చూపరాదు – మగ – ఆడ
మొండితనం కల్గినవారు – వారిపై ఎక్కువ ఎటెన్షన్ కావాలి
తల్లి – తండ్రి మధ్య – చూడడంలో తేడాలు – ఉండరాదు
క్రమశిక్షణ సమంగా నేర్పాలి లేకపోతే చెడిపోతారు

పోటీవిద్య – ఒత్తిడిని నివారించడంలో తలిదండ్రులపాత్ర
హాస్టల్ లో పెట్టడం వల్ల అనుబంధం ఏమౌతుంది
డిటాచ్‌మెంట్ ఎక్కువ ఉంటే డిసిప్లేన్ ఎక్కువ ఉంటుంది
రక్షణ ప్రేమ, ఆదరణ, ఆప్యాయత – 5 సం॥ల తర్వాత 10 వరకు అబ్బుతాయి
15 తర్వాత హాస్టల్ ఉండవచ్చు.

రిసిప్రోకోకల్ – పిల్లలు, తల్లు మధ్య క్యూరియాసిటిని
అధికార బంధం కాదు – స్నేహబంధం
తల్లిప్రేమ అన్నిటికంటే ప్రత్యామ్నాయమైన తరగని ప్రేమ.
వయసు, పదవి, ధనం మొదలైనవేవీ తల్లిప్రేమ కద్దురావు.
త్రికాలాతీతమైన, ప్రపంచాతీతమైన దివ్యమైన తల్లిప్రేమ.

**అమ్మ**

అడిగినవన్నీ ఇచ్చేది – కష్టాలు, అన్నీ తీర్చేది
తనసర్వస్వాన్ని ధారవోసేది – దైవం కంటె గొప్పది
జన్మనిచ్చి మరోజన్మనెత్తుతుంది –
పిల్లలకు ముందు అన్నీ చూచి తర్వాత తాను చూచుకుంటుంది
మిత్రులు, గైడ్సుగానే ఉంటున్నారు నేడు
మారుతున్న సమాజంలో వ్యవస్థలో ఏదిమంచి ఏదిచెడు అని తెలియజేసేది.
పూర్వంలో విధానానికీ ప్రస్తుత తీరుకూ చాలా తేడా ఉంది
ఎక్కువ ఎటువైపు అందరు పోతున్నారో అటు పోవడం మంచిది
పిల్లల్లో మూవ్‌మెంట్సు ఎక్కువ అయ్యాయి.
ఆర్థిక ఒత్తిడులు కారణం ఉద్యోగాలు చేయడం
తల్లి మనసును అర్థం చేసుకొనే బిడ్డలు ఉంటారు
మెంటల్ పీస్ లేదు హోమ్‌వర్క్ – బుక్స్ బండెడు
పోటీ ప్రపంచంలో – నిజమైన మానసికానందం లేదు
తండ్రి తల్లుల అభిప్రాయాల్లో ప్రతిఒక్కరూ ఫస్ట్ రావాలని

**------ పేరెంట్స్ టీచర్స్ ---**

గృహిణి పూర్తిగా అన్నీ నేర్పుతుంది. ఉద్యోగినికి అవకాశం తక్కువ
స్త్రీత్వం – ప్రపంచాన్నంతా చూడగల్గడం

ఎటాచ్‌మెంటు విషయంలో టైమ్ - క్వాలిటీస్ డిపెండెన్స్ ఉండదు. కాన్ఫిడెన్స్ వస్తుంది పిల్లలకు. కాంప్రమైజ్.

568

సీ. ఆత్రేయ ఆర్తితో ఆంధ్రాన్ని కదిలించె - మానవ మనసును మలచె సుకవి
పాడెను పాటల పరమాన్నరీతిగా - తియ్యగా చల్లని తీరుతోడ
మాలిన్య మనసుల మలినము తొలగించి - వేద్యాంతరముగాను విదళనమున
పుట్టుట గిట్టుట పురుషార్థ పుణ్యాల - మనసున మరపించె మధురకవిగ.

తే.గీ. ఘటనయందున లీనమౌ గరితుడతడు - తనదు అనుభూతి తరగని తపనగాను
పాటమాటల పాలించె పాటవమున - చలన చిత్రమ్ము రీతిన చలన సహిత.

సీ. రవిరీతి కవిరీతి రాజ్యమ్ము హృద్యమై - రసికుల హృదయాన రాణజెలగె
పవిరీతి పవనమై ప్రచురమై పర్వమై - మనసుల మనియెను మరువముగను
ఆత్రేయ రాయగా అందరు ఏడ్తురు - రాయక యుండిన రహియె ఏడ్చు
సునిశిత సుందర సుకుమార మనసుల - మందిరముగ తాను మలియుండు.

తే.గీ. మనుజులందరి మనసుల మార్చివేసి - అలరి అలరించి అలసిన అవనిజనుడు
దివిని దివ్యుల మనసుల దెలియుకొరకు - భువిని వీడిన ఆత్రేయ భువనకవియె.

తే.గీ. బాధభావమ్ము భారమై పదములాయె - పదము పథమున రాగమై పలుకుమిగిలె
రాగమాయెను గానము రహిని పాట - సరస సాహిత్య సంగమ సారమతడు.

సీ. మనసును హృదయాన్ని మనిషిని మననీని - కవితకు కాంతియె కలిమి కవిగ
ఆస్తిక నాస్తిక అవనిని అదలించు - అదనైన పదనైన ఆర్తియుతుడు
మనసును నిండించు మహిమను పండించు - వలపును వర్ణించు వాసి రచన
అమ్మను నాన్నను అనురాగ రాగాల - పండించి పరవశ ప్రథితుడాయె.

తే.గీ. పాటమాటగ పాలించు ప్రజల హృదిని - మాట గాటము మనసుల రాటుదేలె
బాధ భావము గుండెకు భాగ్యమగును - కవిగ ఆత్రేయ అమరుడు కాలములకు.

సీ. సాహిత్యరాగాన సరసంపు రహినిండె - ఆత్రేయ పాత్రుడు అనవరతము
మౌనంపు మాటల మాంధ్యమ్ము విడజేయు - అదనున అనురాగ మమరకవిత
చావుపుట్టుకలోన చాలని ఆశలన్ - సంసారమందున సరగునింపె
జీవుడు దేవుడు జీవన భువిలోన - జీవించి మరణించు చెలువు దెలిపె.

తే.గీ. చిలుక పలుకుల కులుకుల చింతనమ్ము – పలుకు పదమున పథమేమొ పాటవమ్ము
సార గీతిక సంసార సవనమహిమ – అన్ని కలిసిన ఆత్రేయ అమరుడిచట.

ఆ.వె. మానవతకు నిండు మనసున్న ఆత్రేయ – మనసు పంచెనతడు మాటలందు
మనసుకవిగ వెలిగె మహనీయ రచనల – మనసు మహిమ తెలిపె మరుడు తాను.

సీ. పిన్నల పెద్దల పిలుపున ఫలితము – పలుకుల మాగాణి పరముడతడు
చైతన్యరహితాల చేతన సహితమ్ము – చేయగా మాటలు చేవమీరు
అదలించి కదలించి అదనున రగిలించి – దాంపత్య బంధాల ధరణి మిగిలె
ప్రేమయె ప్రచురము ప్రేరణ మహితము – ప్రేమించు వారల పెన్నిధతడు.

తే.గీ. లోకబలహీన బాధల లోలుడతడు – అంతరంగాల వింతయె అతని కవిత
వింతరాగాల విలువలు విదితమగును – సమసమాజము రహినిండు సవ్యకవిత.

తే.గీ. ఏడ్చి ఏడ్పించు ఎఱుకను ఎదలనిండు
మరచి మరపించు మురిపించు మహిత కవిత
తలచి తలపించి మనసుల తనువులందు
వలచి వలపించు వరునిది వాసికవిత.

సీ. చైతన్యవాణిగా చేతన వేణిగా – కవిత కోకిల రాగ గాన గరిత
సంగీత మేళన సాహిత్య చాలన – సమమగు సుమమైన సాంగభరిత
ఆలోచనామృత ఆపాత మధురిమల్ – అనగిన పెనగిన ఆలయమ్ము
ఆశల ఊసులు ఆశయ బాసలు – అమరిన అందమ్ము ఆంధ్రమందు.

తే.గీ. మూగమనసుకు మాటల మురువు గూర్చు
ఆకటికి నిచ్చు అందమౌ అవని పదవి.
మనసు మనసుల బంధాల మాన్యమదియ
తనువు తనువుల తపనకు తగవు కవిత.

సీ. వేదాంతధోరణి వేద్యమౌ విధమెన్న – వేదన వెలుగుల నిధియె కవిత
రంగారు శృంగార రాసిక్య రసనల – బంగారమై వెల్గు భవ్యకవిత
మానవ దానవ సంబంధ బంధాల – సరగున దెలిపెడి సరళ కవిత
కలగాని జీవన కమనీయతను చెప్పు – కాఠిన్య కలితగా కాంతి సహిత.

తే.గీ. కలల పండిచ ఎండించ కర్మముండె – కవిత వ్యవసాయ దారుడు కార్మికుండు
దుఃఖభాగుల దురితాల దూరమంచు – గరళ కంఠుడు కవితల గరితుడతడు.

సీ. దోపిడీ వర్గమ్ము దోచబడు వర్గమ్ము – వర్గాలు రెండిట వాసిగాంచె
సిద్ధాంత రాద్ధాంత సిద్ధులు లేరిట – సిరివెల్గు జగమున చింతనిండె
అన్నింట ఆత్రేయ అపవర్గ సాధన – మరపించి మురిపించు మధురరీతి
సమసమాజమునిండ సరియైన యతనమ్ము – చేయగా జగమున చేవయుతుడు.

తే.గీ. ప్రేమ మాతృత్వ మనురాగ ప్రేరితుండు – దల్లితండ్రుల అభిమాన తప్పుడతడు
మనుజ బంధాల దెలిసిన మహితుడతడు – అన్ని దెలిసిన ఆత్రేయ అమరుడిచట.



సీ. మహరాష్ట్ర గోఖలే మానవతావాది – భారత జనతకు భాగ్యగురువు
సాంప్రదాయికమైన సంపన్న వంశాన – జనియించి జగతికి జయము కోరె
ఆంగ్లభాషాబోధ అనవరతమ్ముగా – హిందు గ్రంథాలను హితుడు జదివె
రాజకీయాలలో రాణకెక్కినవాడు – భరతాన స్వేచ్ఛకు పాదులేసె.

తే.గీ. ముక్తిమాతకు లేదిట మురువు స్వేచ్ఛ – ఉద్యమమునకు ఊతమ్ము ఉన్నతుండు
హింస విముఖుడు సమతకు హంసతాను – పరులు దేశమ్ము వదలగా పాటుపడియె.

ఆ.వె. రాజకీయ గురువు రహియందు గాంధీకి – ఆలిజిన్నకతడు ఆశయమ్ము
మాటలలోనె తాను మలచును మదులను – హింస హితముకాదు హితునికపుడు.

సీ. కర్జను నెదిరించి కార్యము సాధించు – తీరును గమనించ తియ్యనగును
సంకల్ప బలమున సాగెడి సరసుడు – సహనమ్ము మార్గము సాగుజగతి
చిత్తంపు దృఢతను చైతన్య భరితుడు – పాండిత్య మహిమను పావనుండు
ఘనతర గాంధీకి గమనము నేర్పించె – శాంతిని సాగగా కాంతినింపె.

తే.గీ. రాజకీయాన మహితుడు రాటుదేలె – లేకయుండిన సాహిత్య వేఁగు చుక్క
శాసనమ్మున కెన్నికై సాగెనతడు – భరతభావిని కాంక్షించె బాగుగాను.

సీ. మానవధర్మము మహితము జీవుల – వదలక వసియించ వాసికలుగు
ఉత్తమధర్మము ఉన్నత విలువలు – పరిరక్షణముసేయ ప్రగతి కలుగు
స్థితిగతులేవైన చిత్తము స్థిరముగా – సంకల్పబలమున సాగవలయు
సేవయె పరమార్థ చేవను కల్గించు – చైతన్యమహితమై చెంగలించు.

తే.గీ. హిందుసేవను సంఘమ్ము యింపుజేసి – ఎందరెందరొ సేవకుల్ వెలుగుజేసె
కులమతమ్ముల కుళ్ళును కూలదోయ – ఆశయమ్ముల ఆశలు అవనిదీర్చె.

తే.గీ. వెళ్ళె ఇంగ్లాండు భరతాన వెతలు బాప – మళ్ళీ దక్షిణ ఆఫ్రికా మరుల గతుల
గమన మెంచెను తిరిగొచ్చి ఘనుడుచేసి – పాలనమునందు వెలుగగా ప్రజలకోర్కె.

గాంధిజూచిన గోఖలే గరితుడుగను – భరతదేశము స్వాతంత్ర్య భరితమగును
నాయకత్వాన సలహాల నయమునిచ్చె – లక్ష్యశుద్ధికి గోఖలే లాక్షణికుడు.

సీ. నిజజీవితములోన నిస్వార్ధ పరుడైన – పరసేవ తరియించు ప్రథముడతడు
ఆడంబరములేని అసలైన మనుజుడు – అసమాన శక్తికి ఆకరమ్ము
కులముల మతముల కూరిమి వలదని – సేవయె ముఖ్యము చేవయుతము
పార్టీల పదముల పావన సేవయె – ప్రాతినిధ్యమునందు ఫలముగాంచు.

దేశమంతయు విజ్ఞాన దీధితులను – వికసనముజేయ విమతము విగతమౌను
విద్య అవసర విధిగాను వినుతుడెంచె – మాతృభాషను బోధన మాన్యుడెరిగె.

క్రమశిక్షకరవైన కలుగదు స్వేచ్ఛయు – సఖ్యత సాగదు సరళివేరు
పట్టుదలను మించు పట్టము లేదిల – పాటవమొప్పగా పథము వెలుగు
విజ్ఞాన రహితమౌ విధి చేత జనులలో – విపరీత భావాల విలువమారు
సామరస్యములేని సహనము కొఱగాదు – అన్నదమ్ముల రీతి అవని వెలయ.

ఆ.వె. గొప్పజీవులందు గోచారఫలములు – అమిత గొప్పగాను అవనివెలుగు
జీవసహిత మహిత జీవన కర్మల – వాసిగాంచు వరులు వరపుగాను.



ఏయే పథకముల ఎంతెంత ఖర్చాయె – ననుమాట నడుగగా నవని లేదు
గజిబిజి చేయగా గణ్యులు ఫలమొంద – అవకాశ మిడగాను అమలుప్రభుత
నిధులను భోంచేయు నిధులైన ప్రతినిధుల్ – అధికార్లు ఒకటిగా అమరి రంత
ఊరికి మేల్జేయు ఉన్నతుల్ యత్నించ – పార్టీల వాళ్ళేమొ పాడుజేయు.

ప్రజల ప్రతినిధులందరు ప్రజలమధ్య – రక్ష గలుగగ తిరుగగ రాజ్యమంత
జనుల రక్షించు నాథుడు జగతి లేక – ప్రశ్న సేసెడి పద్ధతిన్ వదలిరంత.

సీ. శ్రమదాన లీడర్ల సభ్యుల గమనింప – బొటవ్రేలిముద్రల పొలుపు మీరు
గ్రామసభల రీతి గమ్యము లేనివై – జనవిగతముగాను జన్మభూమి

పదవుల సాధించు పార్టీల వారల – చొరవను గమనింప సొగసు మిగులు
ఫోటోల వార్తల పోటీలు పడగాను – పరములు నాయకుల్ ప్రగతి విగత.

ఆ.వె. కోట్లు ఖర్చుపెట్ట కోరికల్ తీరునా – ఆశయమ్ములేని ఆశమీర
అందరొక్కరీతి అవకాశవాదులై – జవము వీడె నేడు జన్మభూమి.

సీ. అధికార్ల సఖ్యత అసలులేదిచ్చట – కప్పల తక్కెడ కర్మవిధము
శాఖలమధ్యన సాంగత్యధోరణి – అగుపడదేమియు ఆంధ్రమందు
విషయాలు వెల్లువ విగతము కృత్యము – మొక్కుబడాయెను మొత్తమంత
చట్టము సాక్షిగా మట్టము ప్రగతియె – అధికార్ల అహమున అమరమదియు.

ఆ.వె. జన్మభూమి జయము జనులంత కోరరు – ప్రతినిదులకు నేడు పరమమదియె
అవసరమ్ము కూడ అధికార్ల కదియెగా – బ్రాహ్మణార్థమాయె బలముసేత.

సీ. జనసొత్తు దిగమింగి జయమెంచు విధమెన్న – జాగృతి గతమాయె జన్మభూమి
చైతన్యపరచగా చేతమ్ములేనట్టి – స్వార్థంపు అధికార్ల స్వామిభక్తి
అధికార మథమమై అవధులు మరచిన – అవనికి అందము ఆపదలెగ
అత్యవసరముల అదనున దీర్చగా – పదనెక్కు గ్రామాలు ప్రగతి మీరు.

తే.గీ. నాదియనుమాట నామమై నవ్యమగుట
మనది యనుభావ మథమమై మగత నుంట
ప్రభుత అందరి దనుమాట ప్రథమమగుట
దోచుకొనుటయె ధర్మమై దొసగు మీరె.



సీ. కార్యాలదాసిగా కరణాల మంత్రిగా – కాంతుల విరజిమ్ము కమ్మనమ్మ
భుక్తికి మాతగా భువనాల క్షమమీరు – రసనకు రుచులకు రాజమమ్మ
రూపాన లక్ష్మిగా తల్పాన రంభగా – అందాల నందించు అతిశయమ్ము
అవనికి ఆదిగా ఆపదకమ్మగా – అనురాగ మమకార వనియె అమ్మ.

తే.గీ. అరియెషడ్వర్గములకామె అవనిలోన – ధర్మ కర్మల ధరణియె దానమిడగ
సహన సవనాల సారమె సతియె జనని – మంచి మానవ తత్త్వాన మహితమమ్మ.

సీ. సతిగాను సుతగాను సహధర్మచరిగాను – గరితగ గమనాన గమ్యమెంచు
చూలెంత బాలెంత చురకైన యిల్లాలు – చూడ్కికి నింపుగ సుందరమ్ము

మాతగా మమతల మమకార సంద్రమై – మహినిండు మరువమై మనసుపంట
మానవజాతికి మనుగడ నందించి – ప్రాణము పోసిన పావనమ్మ.

తే.గీ. మాత ఋణమును తీర్చగా మహిని గలరె – మాతృదేవత మహినిండు మానవతయె
బ్రహ్మ పంపిన సురభియె భాగ్యమిలను – అమ్మ గృహసీమ కమ్మని ఆశయమ్ము.

సీ. గురువుగా గురుతుగా గూఢమౌ జ్ఞానమ్ము – గురుతింప జేసెడి గృహమె అమ్మ
అనురాగ సీమగా ఆశయ ఆశగా – మమకార మాన్యము మనదు తల్లి
నవమాసములుమోసి నవ్యమౌ సృష్టికి – నాందిని పలికెడి నవల జనని
హృదయమ్ము మధురము హృదినిండు జనులకు – జాతికి జవమిచ్చె జనని మనకు.

తే.గీ. జన్మనిచ్చిన దేవత జయము కోరు – తన్మయత్వాన అనురాగ తరగ ఆమె
నడక నడతను నవకాన నవనినేర్పి – తలచి తనియించి తరియించ తల్లిసుమ్ము.

సీ. కష్టాల నష్టాల కడలిని తరియించ – కామిత నావగా కల్పకమ్ము
త్యాగాల భోగాల త్యాగమ్ము శీలమై – జీవనయాగాన జీవమమ్మ
ఆశల నడియాశ అలుపున జడియని – అంతరంగానికి వింత నెలవు
సమతను విమతను సరిలేరు జననికి – మానవత్త్వము తన మతముగాను.

తే.గీ. అమ్మ రెండక్షరాలను అవని నిండు – రెండుకళ్ళను నిండెడి మెండుజనని
పెదవులందలి ప్రేమకు పేరు అమ్మ – ఆత్మ అమ్మల అతిశయ మవని సున్న.

సీ. దీవెనలిడగాను దేవతై భువినిండు – దేదీప్య మానమౌ దేహియామె
శిశువైన పశువైన శివమెంచు జగమున – అన్నియు మరపించు అధికమమ్మ
అమ్మనుమొక్కని అతిశయుడెవడుండె – బ్రహ్మైన నతులిచ్చు భవనమమ్మ
మదిమాగాణాన మమతల సౌధము – మమకార కారణమాద్యమమ్మ.

తే.గీ. సంతసమునకు శాంతికి సాగరమ్ము – చేత చైతన్య మహితమౌ చెలిమి తల్లి
కలిమి లేముల కలకాల కమ్మదనము – విత్తుపండుగ మార్చెడి విలువమాత.

సీ. పురుషుని పుణ్యాన పూజ్యమౌ భార్యగా – భరియించ తరియించు భవమునందు
చైతన్యమహితము చేతన భరితము – భర్తకు వర్తన భాగ్యముగను
తరగని ప్రేమకు చెరగని గుర్తుగా – తనువును తపియించు తల్లి నిజము
పెద్దల పిల్లల పేరును గమనించి – మోదమ్ము నందెడి ముద్దుతల్లి.

తే.గీ. చిన్న నవ్వున పోడ్రోలు చింతలన్ని – అధిక ఆప్యాయ తలనించి ఆర్తిదోలు
ఆశ ఆశయముల పంట అవని తల్లి – వెతలు వెడలును వేదనల్ విడుచు జగము.

సీ. మది బృందావన పారిజాతమై మహిలోన – మనయమ్మ మనకెంతొ మధురమగును
నీరము రహితమౌ నియతియెడారిలో – నిధియొయాసిస్సుగా నిండునామె
బాధను మరపించు భాగ్యము భావనన్ – సుఖముల శ్రుతిమించు సూక్తియామె
పాలను ప్రేమను పారించె నానాడు – ప్రసవాన పశువుగా బాధపడియె.

తే.గీ. ప్రేగుతెంచిన దామెగా ప్రేమపంచె
రక్త తర్పణ సేసియు రక్తిమీరె
తనవు కృశియించి తపనతో తనియజేయు
తల్లి హృదయము తెలియగా తరమె నరుడు.

సీ. పగలును రేలును పరమమౌ జ్యోతిగా – వెలిగెడి అమ్మయె వెలుగు జగము
ప్రేమకు పూవుల పేర్మిని తేరుగా – గుండెను నిండిన మెండు మమత
నింగికి నేలకు నెయ్యమ్ము గూర్చెడి – నేర్పున నేతగా నెనరుమీరు
మమకార సంద్రాన మాధుర్యరాగాన – ఆకాశమాశగా అవని కలిమి.

తే.గీ. ఒక్కతల్లియె జగమున ఒరులు లేరు – మిక్కుటమ్మగు భువినిండు మీగడామె
పుత్రుడిలలోన పూజ్యమై పాత్రుడైన – పరమ మగునుగ నామెకు పథము ప్రగతి.

సీ. అన్నయ్య చెడువాడు అవనిని తమ్ముడౌ – చెడు అక్క కలుగును చెల్లెలుండు
చెడు అమ్మ కలుగదు చింతల వంతల – అమ్మన్న అతిమంచి అతివ భువిని
విఖ్యాత జనులంత వినుతింత్రు అమ్మను – పెద్దల చిన్నల పెరుగునమ్మ
అమ్మలు కలుగని అధికులు కోల్పోవు – ఆనంద మవధికి అందనిదియె.

తే.గీ. అమ్మ సంసార జలధికి అరుణకిరణ – అమ్మ ఆనంద వార్నిధి అవతరణము
అమ్మ కోర్కెల కొలతల కందనిదియ – అమ్మ ఆశయ ఉదధికి అంతులేదు.

సీ. ఇంటిని సరిదిద్ది ఇంపుగ నమరించి – ఇల్లాలి విధమున ఇరుల దోలు
అత్తను మామను అనువున గాంచెడి – భరియించు భర్తను బాగుసేయు
మాటల మన్నించి మధువును పంచుచు – చేతల చెలిమిని చేర్చునామె
స్వర్గమౌ గృహసీమ సహనాన సేవల – సాగెడి స్వారస్య సహిత జగతి.

తే.గీ. ఇంటికందము హితమున కీవియామె – వంట యింటికి వెలుగుగా వాసిగాంచు
కంటిపాపగ గాచును కన్నవారి – తంట జరుగగ తపియించు తగవు సేయు.

సీ. అమ్మలగన్నమ్మ అవనికి పెద్దమ్మ – పేరున కమ్మయౌ ప్రేమమహిత
కలవారి కమ్మగా కలిమిని బొమ్మగా – కలలను సాధించు కాంతి కలిత
రాముడై ననుగాని రాజైన ధర్మజుఁ – డొకతల్లి బిడ్డలే జగమునందు
తల్లిని మించిన ధరణిని దైవము – తలచగ లేదుగా తరుణమునను.

తే.గీ. మంచుకొండను మించెడి మంచితనము
మేరువును మించు మేలిమి మెలత జగతి
మించులను మించు మనసున పంచు మమత
అమ్మలేకుండ అవనికి ఆదిలేదు.

సీ. సురలకు అమ్మయై సుగతికి సగముగా – అర్ధాంగ లక్ష్మిగా అమరెనిచట
కసవును తొలగించి కరుణను గాచిన – ఊడిగములు సేయు ఉర్విలోన
తల్లిని తలచని తనయుడు తగడిట – మనుజుడు కాడిల మదసహితుడు
మతములు ఏవైన మాతను మరువవు – మతముల మించిన మతము మాత.

తే.గీ. తనయు తప్పుల మన్నించు తగగ దిద్దు – పుత్రు పూజ్యగ జూచెడి పుణ్య చరిత
ఉగ్గుబాలకు ఉర్విని ఉదధియామె – తన్నులెన్నియొ తినునామె తపనమీర.

**అణుభారతం**

ఆకలి దప్పులకు ఆరక్షణలేని భారతానికి అణురక్షణ అవసరమా?
పాంచభౌతిక దేహాలకు పంచామృతాన్నందించే ప్రారబ్ద పాలనమనది.
పక్కలో బల్లెమనే పాకిస్తాను ప్రారంభంలో జంబూద్వీపభాగమేగా?
రాజకీయుల రక్షణకు అణుభారతంలో పరీక్షలు అవసరమైనాయా?
అవిద్య అజ్ఞానం అమాయకత్వం అసూయలతో మలినమైన భారతం
అణుపరీక్షల ఆధిక్యానికి అదరి బెదరి అమెరికావైపు చూస్తున్నది.
మానవత మరపిస్తే తప్పమన అణుపరీక్ష గుర్తులు హాహాకారాలౌతాయి.
పోటాపోటీగా పొరుగు దేశాలు ఆత్మహననసదృశంగా పరీక్షలు జరిపాయి.
రక్షణవ్యయం అదుపులేనిదై శాంతినిభక్షిస్తూ భుక్తికోసం బావురంది.
జాతి గర్వించదగ్గ పరీక్షేకాని ఫెయిలు పాసులకు జాగృతమై ఎదురుచూడాలి.

అగ్రరాజ్యాలకెదురుగా అరచేయిచాచి కూర్చొని అణుబాంబుందంటే ఆధిక్యమా.
ఓట్లకోసం ఒరవడిలో ఉరవడిగా ఆదాయవ్యయాల అంకెల గారడీలో అణుభారతం
భారతీయానికీ విశ్వవిఫణికీ అంతరాన్నితెలిపే ఆంతర్యం అణుభారతం
థార్ ఎడారి తార్మనిపించే బాంబుశబ్దంతో భావిభారతపౌరుని ఆశల అనుగమనం
రాజకీయుల దేశభక్తి తీవ్రమై ప్రజాస్వామ్య భారతంలో బాంబుగా బావురంది.
కయ్యాల, వియ్యాల కశ్మల రాజకీయంలో భారతం పాకిస్తాన్‌నేతలుపునీతులు.
పంచశీల భారతానికి అమెరికా అంతర్జాతీయం ప్రాణవాయువు బంధిస్తున్నది.
కులంతో మతంతో పుట్టే ఉద్యమాలకు ఊపిరిపోసే భారతనేతల రాజకీయానికి బాంబు పెట్టాలి.
సబ్సిడీలు, రాజకీయ సంతర్పణలతో హరిస్తున్న జాతీయ సంపదకు రక్షణకావాలి.
పోఖ్రాన్‌లో శక్తి స్థూపం కురుక్షేత్ర రణవీరుల పోడిమిని గుర్తుకు తెస్తుందా?
అణుసామర్థ్యం రామ రావణయుద్ధయోద్ధల రూపానికి శాశ్వతత్త్వవం కల్గిస్తుందా?
అణుపరీక్షల అహమహమిక భారత రూపాయి విలువను భువిలో పాతిపెడుతుంది.
కొదువలేని మేధావితనం కొలిమిలా మండుతున్న నిరుద్యోగం అణుపరీక్షతో ఆకాశాన్నంటాయి.
అణువణువునా అసమర్థత అపహాస్యం చేస్తున్న వ్యవస్థలో అణువిచ్ఛేదనమెందుకు.
ప్రాంతీయం పహరాకాస్తున్న జాతీయానికి అణుపరీక్ష అవహేళన అవుతుంది.
పార్టీలు పల్టీలు కొడుతున్న ప్రజాస్వామ్య భారతానికి అణుపరీక్షలు అందని ఫలాలే.
చెరిపివేయలేని శిలాక్షరాలైన అంతరువులు అణుభారతానికి ఆయువు పట్టులు.
నెవాడాలో భూమ్యాకాశాలు కంపింపజేసిన శక్తిమంతులలో భారతీయులెందరో
కంచే చేనుమేస్తున్న కలికాల ప్రజాప్రభుత్వాలకు అణుపరీక్ష ఉరిశిక్ష.
అవధులుమీరిన ఆదాయానికి పన్నుచెల్లించే భారతీయుని అంతరంగం అణుభారతం.
తాలిమి మీరిన మేలిమి మనసుల అమాయకపు జీవుల అవిద్య అణుభారతం.
మానవత్త్వం మరగున బడిన మనుజీవుల విశ్వానికి అణుభారతం ఆశాకిరణం.
మేడిపండైన ఆర్థిక వ్యవస్థకు మేరుపర్వతంగా భాసించే అణుపరీక్ష అధమం
అశాంతి యజ్ఞంలో ఆజ్యంపోసే అణుపరీక్షల కర్మఫలం కాఠిన్యమే.
పావిత్ర్యం ప్రాతినిధ్య ప్రభుత్వానికి ప్రాభవమిస్తే అణుభారతానికి అపవిత్రత.
అన్నవస్త్రాల భారతం అణ్వస్త్రాల అగ్రరాజ్యాల చెంత అఘోరించే స్థితికి చేరింది.
పాపాయిలాగా పుష్టిగా ఎదగాల్సిన రూపాయి అమెరికా డాలరుతో ఢీకొని విస్ఫోటనం చెందింది.

రేపోమాపో మాసే స్థితిలో భారతప్రభుత్వ భాగ్యం నిత్యావసరాల ధరల విస్ఫోటనలో తరించింది.

జన్యువులన్నీ స్వార్థాణువులై సార్థకమానువుణ్ణి సామరస్య రహితునిగా చేస్తున్నవి.
మానస సరోవర యాత్ర మృత్యులోక మహాప్రస్థానమై అమరనాథునిలో అంతరించింది.
జలప్రళయాలు ప్రణవ నాదంలో కలిసి పార్థివునికి చేరువయ్యే వలయాలైనాయి.

జై తెలంగాణ – జై జై తెలంగాణ
తెలంగాణ – తెలంగాణ – తెలియరా సోదరా!
తెలంగాణ – తెలంగాణ – కదలిరా సహోదరా!
ఈ భూమి మనదిరా – ఈ నీరు మనదిరా
శ్రమశక్తి మనదిరా – జనశక్తికి జయమురా
గోదావరి వరమురా – సింగరేణి సిరియెరా
కృష్ణవేణి మనదిరా – తృష్ణదీర్చు కొందమురా.
హైదరాబాదు ఆదిలాబాదు వరంగలు నల్లగొండ
మెహబూబ్‌నగరు నిజాంబాదు కరీంనగరు మెదకులూ
కలకాలం మనవిరా – పరులకు చేజార్చకురా
అనాదిగా నైజాముది – పోరాటం ఫలితమిది
పోతుగడ్డ ప్రాభవమిది – తెలంగాణ రాష్ట్రమురా – తెలియుమురా సోదరా!
బాంచను కాల్మొక్తయనే – భావమ్మును విడనాడుము
మనస్వంతం రాష్ట్రమనీ – కొనసాగుము సోదరా!

బీడు పొలం పాడుబడెను – భీరువుగా మిగిలితివి
పౌరుషమును ప్రకటించుము – ఫలితము మనకందునురా.

ఆనకట్ట ఒకటిలేదు – ఆకలితో ఆలమటింత
వలసనీకు నిత్యమాయె – ఆకలితో చావులాయె.

ఆలించర సోదరా – విప్లవించు వీరుడా!

కల్వకుంట చంద్రుడొచ్చె – సిద్ధిపేట ఇంద్రుడొచ్చె
తెలంగాణ వీరుడొచ్చె – తెలివి కలిగి కదలరా!
రాష్ట్రము సాధించరా!

అభివృద్ధికి అమరుడాయె – ఆదరువే కరువాయె
నక్సలైట్ల బాధలాయె – పోలీసుల పోటులాయె.

ఉద్యమించు సోదరా – సాధ్యమగును నీకురా!

రజాకార్ల కెదురొడ్డి – రక్తము చిందించినోడ
రాజకీయ రజాకార్ల – మదమణచర కదలరా!
తెలుగుదేశ పాలనలో – తెలగాణకు మేలులేదు
నలుబదేండ్ల పాలనలో న్యాయమేమి జరుగలేదు.
హైదరాబాద్ నగరమంత – ఆంధ్రాల సొంతమాయె
మేలుకొనుము సోదరా – మేలు కలుగు నిజమురా!

గ్రామాలకు దార్లు లేవు – వసతులేమొ అసలె లేవు
కరెంట్ బిల్లు కట్టలేక – కలవరపడుతుంటివిరా!
స్వర్ణాంధ్రం చేస్తానని – చంద్రబాబు ప్రగల్భాలు
కల్లబొల్లి మాటలన్ని – కనులతొ నువు గమనింపుము.

ప్రత్యేక రాష్ట్రమొస్తె – ప్రగతి సాధ్యమౌతుంది
ప్రజలంతా కలిసిమెలిసి – రాష్ట్రం సాధించుదాము
మేధావులు ఉద్యోగులు – మేలిమి జనమంత గూడి
తెలుగుతల్లి తెలంగాణ – పల్లకిని మోయుదాము.

విద్యార్థులు, కార్మికులూ – విబుధులంత విప్లవించ
విజయం మనకందుతుంది – తెలంగాణ రాష్ట్రమగును.



పాఠశాల చదువులన్ని – పాతబడిపోవునంటె
కాలేజి విద్యలకూ – ప్రారంభం జరుగునంట
తొందరేమి లేకపోయె – సందడేమి అసలె లేదు
ఫలితాలకు పరుగులేదు – హర్షమేమి కానరాదు.

వచ్చెడి మార్కులె చాలు – ఆశల ఊసులు లేవు
ఆలోచన అవగాహన – అవి ఉంటే చాలు చాలు

పల్లెటూళ్ళు విడిచిపెట్టి – పట్నాలకు పరుగులాయె
స్పర్ధతోడ చదువులకూ – సాగుచుండె జనమంతా.

విజయవాడ వెళ్ళగాను – విలువకొరకు వెళ్ళవలెను
విజయం సాధించవలెను – విబుధునిగా ఎదగవలెను
చిన్నతనం చెల్లిపోయె – పెద్దతనం పెరుగుచుండె
నిర్ణయాలు స్వంతమాయె – నియమాలకు విలువలాయె.

ఆరోగ్యం ప్రథమంగా – ఆలోచన రెండవదై
అవగాహన మూడవదై – ఆనందం నందనమ్మొ
ఎస్సెస్సీ ఎరుకతోడ – ఇంటరు హితమైనదై
ఇంజనీరు విద్యలోన – ఇంపులొలుకు జీవితము.

హితమే నీ మతముగా – హీనత జోలికి పోకుము
దయాపూర్ణ హృదయంతో – జనదారిని జయించుము.



స్వేదబిందు పతనంతో – శక్తినిండె చైతన్యం
కృషినినాద కూరిమితో – వెలుగునిండె వెతల బతుకు.

మేదినిలో మేడే – మేలుకొలుపు మేడే
మేధావుల మేధలో – మెలకువాయె మేడే
కార్మిక కర్షకలోకం – కామితముల పరిపూర్తికి
కారణమీ మేడే – కలనిజమౌ మేడే
విశ్వంలో వినువీధిని – విజయమాయె అరుణతార
ప్రపంచ కార్మికులంతా – ఒకటాయెను ఈరోజున
దోపిడీకి తావులేని – దొరలతీరు అసలె లేని
పనిచేసెడి ప్రజలంతా – ప్రముఖులౌట నిజమంటా
శ్రమశక్తికి విలువనిచ్చు – శక్తులన్ని ఏకమైన
జనశక్తికి జయమగును – జాగృతమైనది మేడే.

దినం దినం మే దినం – దివం దివం ఇది నిజం
జవం జవం జతకలిసీ – భవం భవిత భాగ్యకరం

కళ్యాణం కార్మికునకు – శమంకలుగు శ్రామికునకు
కర్షకునకు భద్రమగును – జాతికి జయకేతనమగు.

అగ్రేసర రాజ్యాలూ – ఆధిపత్య పోరులో
అంతర్జాతీయమునూ – అవహేళన పాలుసేయు.
విశ్వసంత వింతాయెను – వాణిజ్యమె విశ్వమాయె
బహుళజాతి జాతరలో – పాతరాయె ప్రజాశక్తి
జనశక్తికి దాసోహం – ధనశక్తియగును నిజం
శ్రామిక ఐక్యతలోనన – శాసనమౌ అభ్యుదయం
శ్రమజీవన సౌందర్యం – శ్రమ ఒక్కటే జయమనుట
కృషితో నాస్తి దుర్భిక్షం – కూర్చును జనరినాదమై
ఉగ్రవాద అగ్రవాద – ఊసులన్ని వాసిదప్పు
సామ్యవాద శ్రమవాదమె – సహజీవన యోగ్యమగును
రక్తం స్వేదంగా మార్చు – రాజులెమన శ్రామికులు
రాజ్యాంగం రక్షణిస్తె – రహినేలెడి రాజులె.
వ్యక్తిగతం వ్యతిరిక్తం – శక్తిగతం మే దినం
పెట్టుబడికి ఉత్పత్తికి – ప్రేరకుడే కార్మికుడు.
ఎర్రజెండ ఎరుకలో – ఎదుగుమయ్య సోదరుడా
అరుణోదయ అవనికీ – స్వాగతించు మానవుడా.

పసివారల బాల్యము – వసివాడుతు వున్నది
పసలేని జీవితము – మసిబారుతు వున్నది
ఆలనాపాలనా – అసలేమి లేనోళ్ళు
అమ్మనాన్నజాడలు – తెలియని కుర్రోళ్ళు
పేవుమెంట్ల పేలవమై – బతుకు గడుపుతున్నోళ్ళు
కడుపునిండ ఒంటినిండ – కూడుగుడ్డకలగనోళ్ళు.
ఆడామగ విభేదమే – గమనించని బాలకులు
చదువు సంధ్య సరసకే – ససేమిరా పోనోళ్ళు
బాలలూ బేలలూ – బాధలకే యోధులూ
ఒక్కొక్కటి జీవితమే – మితిలేనిది గతిలేనిది
బాధ్యత తెలియనివాళ్ళు – యోజన కరవైన వాళ్ళు

భవితయనే భావనకే – బద్ధవిరోధులు వారు
పబ్లిక్ ప్రదేశాలలో – పందలుగా మందులుగా
చేయి చాచు యాచనో – చేయితిరిగి బతికెటోళ్ళు.
బీదకుటుంబాలలో – ఆలోచన లేనివాళ్ళు
అధికంగా కనుచుండగ – అధమమాయె బతుకులూ.

యంత్రాలతొ యానతలూ – కామందుల జమానాలు
కాలానికి కలరవాలు – ధరణిలోని దరిద్రులు
ప్రేమకనని పేదోళ్ళు – పేదరికపు పెద్దోళ్ళు
పేలవమౌ పెంపకాన – పెరిగిన బాలకులూ.

వ్యాపారపు సంస్కృతిలో – వ్యవహారం తెలియనోళ్ళు
వ్యవస్థలో అవస్థలై – అంధమైన జీవితాలు
అమాయకపు చూపులతో – మాయలేమి తెలియనోళ్ళు
నిమ్నమైన నీతిలోన – గమ్యమేమి లేనివాళ్ళు.

సమ సమాజ భావనలో – సహగమనం చేయనోళ్ళు
ప్రజాస్వామ్య ప్రభుతలో – ప్రాధాన్యం తెలియనోళ్ళు
ప్రభుత్వాల ప్రమాణాలు – ప్రమాదాల మూలకాలు
ప్రజల దేను బాధ్యతంటు – ప్రవచనాలు వల్లించును.

బడిలేదు గుడిలేదు – అమ్మఒడి అసలె లేదు
సుడిగుండపు జడి బతుకులు – శుభమౌ ఆదినమేదొ
మూఢమైన జీవితాలు – మూలబడిపోవుచుండె
ముద్దులొలుకు బాల్యమేమొ – మొద్దుబారి హద్దుమీరె.

నియంత్రణే మార్గమని – పరిమితి పాటించమని
ప్రజలను చైతన్యపరచ – ఫలితముండు ననుకొంట.



వినువీధిని విజయగాథ – వింత అనుభవాల కథ
అంతరిక్ష కక్ష్యలోన – అపూర్వమౌ విహారము
మానవ అన్వేషణలో – మధురమైన అనుభూతి
రచనలోని రహస్యాలు – ఛేదించుటె చైతన్యము.

నవ్యమైన నౌకలలో – దివ్యమైన శోధనలూ
భవ్యమానవాళికీ – భాగ్యకరం యోగ్యమయం
ఆవరణపు అంతరాలు – ఆపై గ్రహ గతులన్నీ
అంబరమున ఆసక్తిగ – గమనించుట ముఖ్యమట.

భూమి విడిచిపోగానె – భువన మహిమ తెలియును
అడ్డుగోడలన్నికూలి – అభ్యుదం అమరును
శోధనలా సాధుత్వము – శోభితమౌ ప్రపంచము
శూన్యంలో సుందరతలు – శుభకరమౌ విభవము.

పట్టుదలకు పట్టము – పరిశోధన ఘట్టము
కట్టుబాట్లు కట్టడాలు – పట్టువీడి పరుగెత్తును
తెలుపు నలుపు తేడాలు – తెలివి వలన తెరలిపోవు
తేటదనం తేరుపైన – తేలిపోవు నుపగ్రహము.

మేదినిలో మేధలన్ని – సాధించిన ఘనవిజయం
మెలకువతో మేలునంత – అనుభవించ అందమగును.



ఆమని అంటున్నది – అందమె ఆనందమనీ
ఆనందం అమరమనీ – అంతరంగమంటున్నది.
పంచమస్వరమున – పంచదారలున్నవీ
పరవశమౌ గుండెలో – పరమార్థం నిండినదీ.
మానసమున వర్షించిన – హర్షమవధి లేనిదీ
కాలమహిమ కలిమిలో – కలనిజమౌతున్నదీ.
ప్రకృతికృతి సుకృతమై – జాగృతినిస్తున్నదీ
భువినందనవనముగా – భవిత భాగ్యమైనదీ.
రంగులయీ విశ్వానికి – మనసు రంగమైనదీ
నటన ఘటన నవ్యతకూ – దివ్యత్వము యీ ఆమని.
వసంతమే సంతగా – వర్తకుడయె నరుడూ
కొని అమ్మెడి కొలతలే – కోరికలకు కొలవులు.
పొరల తెరల మాటున – పొగిలిపోవు హృదయానికి

పగిలిన ప్రకృతి వగలే – ప్రాభవవవిభవము నిచ్చెను.
మనీమాయలోకంలో – ఆమనికే మనికిలేదు
సినీసెల్యులాయిడ్‌లో – శివరంజని ఆమని.

రగిలే ఎండలు – పగిలే బండలు
పొగిలే గుండెలు – పగలే మంటలు.

దూరంలో సూర్యుడు – దూకుడుగా ఉన్నాడు
భూమిమీద మానవుడూ – శక్తిహీనుడైనాడు
సృష్టిరహస్యాలనే – ఛేదించెడి మానవుడూ
సూర్యకిరణతాపానికి – సూక్ష్మత కనుగొనలేదు.

కృత్రిమంతొ కూలబడుదు – సహజానికి చావు వ్రాసె
వికటించిన ప్రకృతితో – వింత తీరు జగడమాయె
గ్రామాలె గాడిదప్పె – పట్టణాలు పట్టువీడె
కాలుష్యం కోరసాచి – కాలాంతము సమీపించె.

వేగంతో వెలుగులాయె – భయంలోన బండబారె
ముగ్ధయైన ప్రకృతంత – మొద్దుబారె మోడువారె
దారిద్ర్యం ఒక్కచోట – ధనాంధత మరోచోట
ఎండిన నిండిన బతుకులు – ఎగతాళై గతమాయెను.

కొలిమిలాంటి జీవితాలు – కొలిమినంటు జీవితాలు
కోర్కెల కొలతల జీవులు – కోమలములు కమలిపోవు
పసికందుల పావనతను – ప్రతిఫలాన్ని కాంక్షిస్తూ
పసరమువలె అమ్ముకొంటు – సొమ్ముచేయు సోకుదార్లు.

దత్తత చట్టాలన్నీ – వత్తాసే పలుకుతుంటె
దరిద్రతకు దారిలేక – చరిత్రకే మచ్చదెచ్చె.

మానవతే మానుషమై – అనురాగమె రోగమై
ఆనందము అధమమై – పసిబతుకులు వసివాడె.

అంతరంగ మంతటినీ – ఆహరించె అవసరాలు
ఆడబిడ్డ అతిబరువై – అవహేళన అమ్మకాలు.

కడుపుతీపి కడకు జరిగె – బతుకు బరువు బంధనమై
బంధాలను విడగొట్టీ – అమ్మకాన్ని నమ్ముకొనె.

అమ్మకాని అమ్మఒడిని – అమాయకపు చూపులతో
బేలలైన బాలలంత – బావురుమను వింతలెన్నొ.

అధికారుల అలసత్త్వం – దగాకోర్ల ధార్ష్టికం
పసిప్రాణం మంసంతో – వ్యాపారం వెల్లువాయె.

ఎదగది సొద వినిపించదు – ఎఱుకలేని కఱకు జీవి
దారిద్ర్యపు దాడిలో – ఓడిపోయి వాడబారె.

అమ్ముకొన్న అమ్మతనం – కొనెడివారు కోకొల్లలు
కల్లలాయె కామితాలు – వల్లకాళ్ళు జీవితాలు.



మద్యం మహమారి ఒడిలో – బడినేర్చుకు బతికెటోడ
కాపురాలు కాలిపోవు – కల్లలగును జీవితాలు.

'చీపు' తోడ చిరిగిపోవు – కరిగిపోవు గుండె పొరలు
'లివరు' లోని 'పవరు'పోయి – 'లీకు' లగును అవయవాలు.

మత్తులోన జోగిపోతు – చిత్తగుచుండెను బతుకు
మెదడు పదను అదునుదప్పి – మేదకుడవు తెలుసుకోర.

బ్రాంది విస్కి రమ్ము జిన్ను – బాధను తొలగించునంటు
భావించిన తాగుబోతు – బాధల మయుడౌను గదర.

ఇల్లు వళ్ళు గుల్లాయెను – ఇంతిమనసు చింతాయెను
బందుగణము వంతాయెను – లోకులకది అలుసాయెను.

గౌరవమ్ము లేనెలేదు – రౌరవమె మిగులు నింక
పౌరుడవై జీవించగ – ఫలితమేమి లేదు లేదు.

మానవతే మంటగలియు – జంతువృత్తి జటిలమగును
దానవుడై దారిదప్పి – ధరణికె నివు చేటవుదువు.

విచ్చలవిడి జీవితమై – పుచ్చిపోవు పేగులన్ని
విలువలేని విబుధుడవై – విధిచేతిలొ కీలుబొమ్మ.

లైసెన్సుల జారీతో – వైపులకే మోసమొచ్చె
ఆదాయపు ఆధారముగా – అనుకొనుటే అవలక్షణము.

పేదనుండి పెద్దవరకు – పేలవమౌ జీవితాలు
మనసు మానవతలు పోయి – మహికిచేటుమద్యమగును.



'నీరు మీరు' నీరుగారు – నిధులవిధం బధిరమాయె
ప్రచారమే ప్రచురమాయె – ఫలితమేమొ కలుషమాయె.

నీటికొరతలేనిచోట – నిధుల ఖర్చు నిండాయెను
నీరు జాడకానరాని – ప్రదేశముల నిమ్నమాయె.

ప్రజలపాలు ప్రచారమే – రాజకీయ రాజ్యమాయె
అధికారపు పార్టీలకు – అండదండలందుటాయె.

అవినీతి అవలక్షణ – అపహరణే అధికమాయె
అధికారుల స్వార్థమాయె – నీరు మీరు నీతిదప్పె.

సేవలన్ని సేదదేరె – సంపాదన పంపకాలు
సంతలోని సరకుగా – నీరు మీరు తారుమారె.

చెఱువుమట్టికోసమనీ – తరలి వచ్చు ట్రాక్టర్లూ
శ్రమదానం శక్తిహీన – దళారీల దాతృత్వము.

అనావృష్టి సీమలలొ – అధమమాయె నీరుమీరు
అతివృష్టి ప్రాంతాలలో – అధికమాయె దోపిడీలు.

కందకాల కళలన్నీ – అందుతాయి పేపర్లకే
ఇంకుగుంట లింకులన్ని – కాంట్రాక్టుల ఖాతాలకు.

ప్రొక్లెయినర్ ఫోజులన్ని – పెద్దవాళ్ళ లాభాలకే
జేసీపీ జర్కులన్ని – జనుల కళ్ళు మూయించుటె.

ప్రజల సొమ్ము జలం పాలు – జలమేమొ జలధిపాలు
తెగిపోయెడి కట్టలన్ని – తెలియజేయు నీరు మీరు.



నీ అధరంలో మధువున్నది – అందుకొంటె మదిరైనది
కదలికలో కథలన్నీ – కమ్మగ కనిపిస్తున్నవి.

దొండపండు కొరికితే – పండునదే కోరికంట
అధర చుంబనమ్ములో – జలధరమే జిలుగులీనె.

కళ్ళు వళ్ళు కమ్ముకొనీ – వళుల వరుస వత్తుకొనీ
చిత్తాయెను చిత్తమంత – కొత్తలాయె కోరికలే.

హంసనడక అందములో – విందుచేయి నితంబములు
ముందు వెనుక ముద్దులతో – హద్దుమీరె పిల్లతీరు.

హృదయం వదిలేసుకొనీ – ఉదయించెను కలలరాణి
కలకల కిలకిల రవముల – చిలుకరించె చిలుక కొలికి.

కాలం కళ్ళను మూసీ – గోళముగా తిరుగుచుండె
గోప్యమైన భాగాలే – భోగము నందించునుగా.

వాల్జడలో వంకరలే – మల్లెపూల మధురిమలై
మందహాస చంద్రికలతొ – అందమైన బంధమేసె.

తరుణవయసు తరగనిదీ – చెరగనిదీ చెలియమనసు
ఆర్ద్రమార్ధవములతో – అందగించె ఆమె వయసు.

పావడలో పగడంగా – పైటలోన పసదనమై
పరువంలో గరువంగా – పరవశించె పాలవయసు.

ప్రాయంలో పదహారుగ – పరవశమున శార్వరిగా
మన్మథార్తి మంత్రముగా – జన్మసాగె జయంకోరె.



పరమాత్ముని సన్నిధీ – పతితులకూ పెన్నిధీ

పారవశ్యతకు నిధీ – మానవతకు ప్రతినిధీ.

మనిషిరూపదైవమే – మనకు తెలియునాతడు
దైవతత్త్వదారియే – ధరణికి రాదారి యగు.

మాటచాలదు – మాన్యుని స్తుతియించుటకు
మనసు చాలదు – మహితుని ఊహించుటకు
కర్మయె చాలదు – కనుపించని యాదేవునకు
త్రికరణశుద్ధిచాలు – శుభదాయిని ధ్యానించగ.

వర్ణించనలవిగాను – ఆర్ణవమే అతనిది
దర్శించ నలవిగాని – ధరణియే ఆయనది
ఆలించ పాలించ – అణువణువూ ఆయనది
సర్వం పర్వమగును – సాధన శోధన బోధన తానే.

మనకోసం తపియించును – మహనీయుడు ప్రభువే
పాపపుణ్య దర్శనుడు – పరమాత్మయు తానే
పంచభూత చిన్మయుడు – పరమార్థ మహితుడు
పాలనలో లాలనలో – ప్రాభవ వైభవ యుతుడు.

నమ్ముకో అతనినే – వమ్ముకాని వలపుతో
ఉండిన లేకున్నగాని – ఉన్నతమౌ ఉనికి అది.

అండపిండ బ్రహ్మాండం ఆతని సొత్తుగా
అవతారం తరియించగ ఆతని కనుడీ.

గగనమైన గమనానికి అహము దివము నాతడే
సమాగమం సహగమనం సాగుజగము ఆతనిదే.

ఆకారం వికారమూ ఆతని అవతారములే
అలంకార మధురిమలూ ఆ విభు పరిణామములే.

నరజాతి కనుగొన్నది నామమాత్రమైనదీ
వరమైన అంతరాలు పరమాత్ముని రూపులే.

కాలానికి ముడిపెట్టిన కారుణ్యం ఆతనిదీ
కామానికి కాళ్ళిడినా కథానాయకుడు తానే.

బంధములను వేసినదీ – ఆత్మబంధువతడే
బంధనముల ద్రెంచినదీ – భగవానుడు తానే.

చేదునిజం చైతన్యం – చేతన తానేగా
వింత అనుభవాల విధి – వంత మహిమ అతడేగా.

మానవతకు మాన్యము – మహిమ మిగులునతడే
దానవతకు దైన్యము – దారిచూపు నతడే.

కనివిని కీర్తించగ – కారణమతడే
కలికాలము కలవరముల – కలవరపరచునుతానే.



ఊటీలో మీటయ్యాము – వాటంగా మేట్సయ్యాము
డేటింగును డెవలప్ చేస్తే – షూటింగే సుధలకు నిలయం.

సింపుల్‌గా కిస్సిచేసెయ్ – బంపర్‌గా బదులిచ్చేస్తా
ఆలింగన లంగరువేసీ – అమరంలో విహరించేద్దాం.

బ్యూటీక్వీన్ బుగ్గలలోనా – లవ్‌లీ లిప్స్ లాహిరిలోనా
వెచ్చనియా టచ్చింగ్‌లోనా – మచ్‌మచ్‌గా మధురం ఉందీ.

సెక్సుబాంబు సెంటరులోనా – వెక్సయ్యే వెనీసులోనా
బాక్సాఫీస్ బద్దలుకొట్టీ – ఫాక్సులోన ప్రేమే తెలిపె.

కంప్యూటర్ ట్యూషన్లోనా – ఇంటర్‌నెట్ అందంలోనా
ఈమెయిలే ప్రేమలేఖగా – డాట్‌కాముల ఛాటింగ్ మాట.

లవ్‌లీగా లవంగి సింగీ – సింగపూరు స్వీటీమంగీ
అమెరికన్ను మెరికే నండీ – ఆంధ్రాకే ఆల్రౌండ్ ఎంకీ.

సిలోన్‌లోన సిల్కే సిమ్రాన్ – మళయాళం మధువే సౌందర్య
అమ్మాయిల అమరప్రేమలో – ఆంధ్రులదే అగ్రస్థానం.

ఛార్మినారు చెలియే ఛంఛం – తాజమహలు తరుణే రంరం
దేవదాసు పారూ డేరింగ్ – లవ్‌జంటల లాహిరి లంలం.

లిప్పుకప్పు లింకే లవ్వింగ్ – రెప్పరెప్ప టప్పే లవ్వింగ్
మనసు మనసు మిక్సింగ్ లవ్వింగ్ – ఎంబ్రేసింగ్ రేసింగ్ లవ్వింగ్.

టీనేజీ ట్వింకిల్ మ్యారేజ్ – బాండేజీకి బ్యారేజ్ క్యారేజ్
లౌలైఫ్‌కి మెస్సేజ్ మ్యారేజ్ – విశ్వానికి విన్నింగ్ రన్నింగ్.

చందమామ చందం అందం – అందమైన చందన గంధం
బంధమాయె చెలిసాంగత్యం – అంబరమే ఆశాసౌధం.

మంచువానలో మునిగిన తనువుకు – పంచదారలో పండిన రసనకు
మించు వెలుగులో మసలెడు కనులకు – మించునదే చెలిమనసు స్వర్శరా.

కాలేజీలో కంటబడ్డది – టీనేజీలో వెంటబడ్డది
ఈజీగా నను లేజీ చేసీ – టీజింగ్ చేస్తూ తిరుగుతున్నది.

రెపరెపలాడే రేసుగుర్రమా – గుమగుమలాడే గులాబి పువ్వా
జమ జమలాడే జాంపండువా – పెరపెరలాడే ప్రేమ దీవివా.

జింలో వెంకట్‌లా జాకెట్టూ – మెళ్ళో మేలిమి లాకెట్టూ
జళ్ళో ఎర్రని రోజ్‌లెట్టూ – సోకే షేక్స్పియర్ సోనెట్టూ
వళ్ళే వర్డ్స్ వర్త్ పొయెట్టూ.

కంగారూలా ఖంగుతిన్నదీ – రంగేళీలా రంగు మార్చినది
గంగూలీలా గంతు వేసినది – బంగారంగా భామనచ్చినది
అంగభంగమై రంభయైనది – పొంగు వాగులా పరుగుతీసినది.

అప్సరసా సరసం రసమే – లిప్సులిసా లీనం లయమే
హృదయానికి హృదయ హ్రదమే – అనురాగపు అంతం దివమే.

విక్టరీ ఫ్యాక్టరీ హిస్టరీ – మిస్టరీ మాస్టరీ నీమాన్‌స్టరీ
జగ్లరీ జాంగిరీనీజావళీ – స్మగ్లరీ కుగ్లరీ నీ బగ్లరీ.

అంకెవేసెడీ రంకులాడివే – రంకు తెలియనీ వంకలాడివే
జంకు లెరుగని జఘనవాడివే – మంకు విదల్చెడి మహిమలాడివే.

దున్నని చేనే నీ మేను – జున్నును తన్నే నీ వెన్ను
హొన్నును తన్నే నీ పన్ను – గన్నును తన్నే నీ కన్ను.

సావిత్రే నీ సహచరి కాదా – అరుంధతే నీ అనుచరికాదా
చంద్రమతే నీ మతిమతి కాదా – సీతమ్మే నీ సరిసరి కాదా!

జాణతనం జానెడూ – ముగ్ధతనం మూరెడూ
కలికితనం కడివెడూ – వయసుధనం బోలెడూ.

కంటిచూపే కరుస్తున్నది – చెవుల తీరే చెరుస్తున్నది
పెదవుల పలుకే కలుకుమన్నది – మనసుల ఊసే మహిమనున్నది.

కంటిచూపులే కలవరించినవి – పంటినొక్కులే పలవరించినవి
పెదవి ముద్దులే ప్రేమ పంచినవి – అంగాంగము అనురాగమైనది.

ఎగిరిపడే హృదయంలో – ఎగిసిపడే ఆ వయస్సులో
ఎదగదిలో ఆ పొదలలో – మది మురిసెనుగా మందగామిని.

పదపదమని మది తొందరించెను – పదనిసయని రొద పలకరించెను
కల కలమని హృది కలవరించెను – విల విలమని విధి విలయమందెను.

చిలుక పలుకుల కులుకులలో – హంసల నడకల అరుగుటలో
చేపకన్నుల చైతన్యంలో – సాగర మధనం సారసాక్షిలో.

కాంతా! కాంతారం నీ కారుణ్యం – శాంతా! శాంతకరం నీశాక్తేయం
భామా! భాగ్యకరం నీ బాంధవ్యం – పడతీ! ఫలవంతం మనప్రేమావేశం.

విప్లవించు విమలవు నీవే – తిరుగుబాటు తిరుమలవీవే
సంస్కృతిలో సరళవునీవే – బందూకుకు బంధం నీవే.

యవ్వనంపు వనమేనీవు – కవ్వింతల కడలే నీవు
నవ్వింతల నదివే నీవు – గిలిగింతల గిరికవు నీవు.

స్తన్యమిచ్చు ధన్యవు నీవే – సౌఖ్యమిచ్చు సరసవు నీవే
మాన్యతలో మమతవు నీవే – మంచితనపు పంచవు నీవే.

సరసాల వరుసవునీవే – సురశాలకు సూచివినీవే
మరునింటికి మార్గము నీవే – వరునింటికి వధువువునీవే.

కాలం చెల్లిన యవ్వనానికీ – కామం తీరిన కామందులకూ
కారుణ్యం మరి కాఠిన్యం – కనరానిదిలే అనరానిదిలే.

ఆశను మింగిన అమరారామం – ఆకలి తీరని మోహావేశం
ఆశయ రహితవు అంధకారమూ – ఆలయలయకూ ఆదితాళమూ.

చిందర వందర జీవితాలకూ – అంధుల బధిరుల ఆలోచనలకు
మందుల పందల అజ్ఞానమునకు – వందన మిడగా వాసి గలుగును.

ఆలోచనలా లాలోచనలు – ఆక్రందనలా సంక్రందనులు
సాలోచనలా సారసాక్షులు – సాంప్రదాయపు సాంగోపాంగులు.

మూర్తుల స్ఫూర్తీమూలకు నెట్టీ – కీర్తుల కితవుల మతినేకొట్టి
ఆర్తుల ఆకలి కన్నం పెట్టీ – దీప్తితో దీనుల దిగులును తీర్చు.



వందేమాతర చంద్రకాంతిలో – మనదే భారత జనగణమనలో
విజయీ విశ్వతిరంగ రాజ్యములో – మరోపోరునకు సిద్ధముకండీ..
ప్రజాస్వామ్యమును రక్షించండి.

తెల్లనివాడే చెల్లనివాడై – నల్లని వానికి పదవులిచ్చినా
స్వార్థం లంచం సోకుదారులై – పాలన పరువం మంటగలిసెరా.

సేవాభావం సేదదీరెను – ఆర్థిక దాహం అంబరమాయెను
బంధుప్రీతియే పరిధులు దాటెను – అప్పుకు అమ్మను అడ్డంపెట్టెను.

కార్మిక కర్షక కథలే వేరు – చేతివృత్తుల జాతకమదియే
ఆత్మహత్యలా అవధులు వేరు – పసికందుల వ్యాపారం తీరు.

కంప్యూటరులా కౌగిలింతలు – ఇంటర్‌నెట్‌లా ఇంపు సొంపులు
కంపుగొట్టెడి మురికికాలువలు – కల్తీనీటితొ అతిసారాలు.

వీడియోలలో కాన్ఫరెన్సులు – టీవీ తెరపై తకతైతైలు
ప్రచారాలలో పాలిటిక్సులు – ప్రచురమైనవీ పాపపు పనులు.

ఆకస్మికముగ సస్పెన్షనులు – అంత తొందరగ రీపోస్టింగులు
తనమన తనమే తరగని వైనం – తూటావీరుల తాటాకు చప్పుళ్ళు.

తరగలేదుగా విభజన పాలన – తరిగి పోవుగా కులములు మతములు
భయమూ వేగము బాధలు పెడుతూ – ఆగమాయెరా అందరి బతుకులు.

కక్షల రక్షలనేపథ్యంలో – న్యాయం శిక్షల నేవళమ్ములో
పదవీ బధిరుల పాలనమ్ములో – పరువే పోయెర భారతీయుడా!

మరోగాంధి మనకగుపించెనా – మహాత్మ దేశం మనదయ్యేనా
అప్పుల తిప్పలు అంతం కావా – ఆకలిదప్పులు గొప్పలాయెగా.

ప్రయివేట్ పద్ధతి ఫలమిచ్చేనా – విశ్వమార్కెటున విజయం రాదా
లోకం ఒకటై లోభం పెంచును – లాభం లేదుర లక్ష్యం చూడర.

లాకప్ డెత్‌ల లాలనమ్ములో – మేకప్ పద్ధతి మేళనమ్ములో
మానభంగముల మాయాబజారున – మానవ నీతియె మసిబారెనురా.

క్రిందుమీదు మీదు క్రిందు – భయంలేదు బాధలేదు
భక్తిలేదు శక్తిలేదు – భుక్తిలేదు ముక్తిలేదు.

సిద్ధాంతం రాద్ధాంతం – వేదాంతం వేళాకోళం
పదవులకై పాకులాటలే – పాశవికమ్మై పరమపదించెను.

కుంభకోణముల జాంబవంతులు – కూటనీతుల గార్ధభమ్ములు
మాటలు మార్చెడి మదపుటేనుగులు – భారత పాలక సార్వభౌములు.

వివేకించు సోదరా – విప్లవించు సోదరా
విజయమే నీదిరా – భారతికది రక్షరా!

కాముక రాజ్యం – రావణ రాజ్యం
కౌరవ రాజ్యం – రౌరవ రాజ్యం
రాక్షస రాజ్యం – కక్షల రాజ్యం
శిక్షల రాజ్యం – శవసామ్రాజ్యం.

నిగమాగమ నైవేద్యం – వేదనినాదం
సమసమాజ నిర్మాణం – సాగరగీతం
బానిస బాధల రాజ్యం – భాసిత కిరణం
ప్రజాక్షేమ సామ్రాజ్యం – పాలకభోజ్యం.

నిలకడైన సిద్ధాంతం – నీతికి నిగమం
నియమబద్ధ జీవనము – వ్యధలకు నిలయం
అంకితమౌ సేవనం – అందమైన నరకం
ప్రేమానురాగాలకు – పేలవమౌ స్యందనం.

ఆధారం అవకాశం – అందరికీ అందవు
ఆరోహణ అధికారం – కొందరికే చెందును
విజయాలూ విలువలూ – వినయానికి గురుతులు
పేదోళ్ళూ దళితులే – పేరుకు ప్రతినిధులు.

పూజ్యమైన రాజ్యంలో – భోజ్యమె భాగ్యం
త్యాజ్యమైన సేవనలో – యోగ్యత మాన్యం
ముఖ్యమైన ప్రచారమే – ముదనష్టం దుష్టం
క్రియాశీల కీర్తనలే – ప్రియమైన వర్తనలు.

రామకథా రాజుకథా – రహిజనకథలే
చెప్పుటలో మెచ్చుకొల్పు – చైతన్యుల చేతలు
ఆచరణే రణమాయెను – చరణకరణములలో
సుఖమే సుందర స్వప్నం – బోధలె బాధల మిళితం.

ఆదర్శము దృశ్యంగా – అంతరించు ముందటే
ఆత్మీయత ఆత్మలేమి – అవనతమై పోయెను
పెదవుల కదలికలోనే – పదిలమైన ప్రేమలు
గుండెను మండింపజేయు – గుణశీలపు ఆర్తులు.

పాపానికి పుణ్యము – పైపై తొడుగాయెను
ధన్యమైన జీవితాలు – దారిదప్పిపోయెను
ఆత్మార్పణ శీలురంత – అవనతమై పోయిరి
ధనం ధన్యమనేవారె – ధరణిమూలమాయెను.

కష్టమనే భవితనూ – ఇష్టంగా మలచుకో
వర్తమాన మతమును – వంచనగానీయకు
గతం హితం గుణపాఠం – గూటిలోన వసియించు
అమలినమౌ ఆలోచన – అందమనీ తెలుసుకో.

ఒదిగి మదిగి ఎదుగుటే – ఎఱుకయనీ గమనించు
మేధమదుల మేలనమే – మేదిని సుఖమని ఎంచు
విజయ విలువ వలువయనీ – వివేకంతొ భావించు
విబుధ వశుల ప్రయాణమే – వినువీధిన విమానమౌ.



కులుకు పలుకు వినబడగా కునుకు వస్తు ఉన్నది
జోలపాట చెవిబడగా మనసు జోగిపోతున్నది
జాలిపాట జతకలియగ గుండె జారిపోతున్నది
జాణపాట జావళీలో మతిగతియే మారుతుంది.

లాలిపాట లావణ్యం లహరిలోన విహరించును
ఎంకిపాట మాధుర్యం ఎదగదిలో వినిపించును
కాపుపాట కాఠిన్యం కలరవమై కనిపించును
తెలుగుపాట తేటదనం హృదయానికి స్పందనమగు.

పాటలోని సాహిత్యం పావనమౌ అమృతం
జతగలిసిన సంగీతం మితిలేని మాధుర్యం
మతిలేని జాతులన్ని మాధుర్యం స్వాదించును
మతిమంతుడు మానవునికి మాధుర్యం అమృతమే.

సరగమల అమరికలో సంగీతం ఉన్నది
పదపదము పొందికలో పరమ పదము ఉన్నది
కర్ణాటక స్థానీలకు వర్ణగతులు ఉన్నవి
భాషల భాష్యం భాగ్యం భావమహితమైనది.

మధుర హితము ముదరగా ముద్దు భారతమ్మైనది
పడమటి పదనిస ధ్వనులకు సంధ్యకాలమైనది
కంప్యూటర్ గమపదలకు గరువం గగనం
మాటపాట మార్దవమే ఆర్ద్రమైన సంగీతం.



ప్రయాణంలో ప్రమాణాలు – ప్రమాణాలే ప్రమాదాలు

ప్రమాదాలే ప్రమోదాలు – ప్రమోదాలే ప్రసాదాలు
ప్రసాదాలే ప్రబోధాలు – ప్రబోధాలే ప్రకోపాలు.

మానవయానమే – మౌన ప్రమాణము
చేరెడి గమ్యమే – చెంత ప్రమాదము
నరవరగమ్యమే – నవ్యప్రమోదము
మోదము వేదమై – జనుల ప్రసాదము
భాషయె బోధయై – బహుళ ప్రచారము
బోధయె బాధయై – మనుజ ప్రకోపము.

ప్రయాణంలో పదనిసలే – ప్రమాణాలు ప్రమోదాలు
ప్రాభవాలు వైభవాలు – పరమార్థపు చింతనలే.

మౌనం భూషణమైతే – భాషణమే భాగ్యము
మానం అభిమానమ్మైతే – మానవాళి మహిమము
ఎదురుదెబ్బ తగిలిన – ఎదకు దెబ్బతగిలినా
వదరుబోతు జీవితాలు – అదిరిపడెడి ఆశలే.

మానని మారని గాయం – హేయమైన గౌరవమే
హేతువు తెలియని మనసుకు – హేల తనువు గాయమే.



అందం అమ్మాయిది – అనుభవమబ్బాయిది
రూపం అమ్మాయిది – రూక్షం అబ్బాయిది
ఈక్షణ అమ్మాయిది – నిరీక్షణ మబ్బాయిది
శ్రుతులే అమ్మాయిని – అనుశ్రుతులే అబ్బాయివి.

ఆడదాని ఓరుపులో అందమున్నది – సత్యశివం సుందరాల సరసత ఉన్నది
అబ్బాయిల అనుభవంలొ మబ్బు మరకలున్నవి– మరకలలోనే మెరుపుతీగెలున్నవి.

శీలశిల్ప శివరంజని రూపుచూపులో ఉన్నది
అమరికలో అరమరికలె అమృతమై ఉన్నవి
మధుర రుధిర మమతలోనె సుధ రూపం ఉన్నది
అనవరతం అవధరించు అంతరంగమున్నది.

క్షణక్షణాన పరివర్తిత సహజేక్షణమున్నది
ఆకర్షణ వికర్షణకు అదె బిందువుగా నున్నది
ఎదురుచూచు మధురిమలో ఎదపదిలము ఐనది
ఎదురైౖ ఎదనిండినచో ఎదురుచూపులేదన్నది.
శ్రీకారపు శ్రుతులలోన ఓంకారము దాగినది
ఆకారపు ఆకృతి శ్రుతి ఆడదాని దైనది
అనుశ్రుతుల అధినాథుల అనుగ్రహము అబ్బాయిది
సౌందర్యము ప్రతిఫలించు సహజీవన విధమైనది.



లవ్‌లీ సిక్స్‌టీన్ లంబాడి – అందం నీదే అమ్మాడి
పాలసముద్రం పసిపాప – పావడ జారె కన్నెపాప
రేసుగుర్రమే నీవంట – రేపటి రోజే మనదంట.
పిడికెడు నడుము – పిన్నపాప
వెబ్‌సైట్ హృదయం – వెన్నపాప
లేజర్‌లేమవు నీవంట – రేజర్ పదునే మనజంట.

కౌగిలింతలో కౌఁజు పాప – చక్కిలిగింతల చుక్కపాప
మంచుకొండపై నీవంట – పంచుకొనుటె మనవంతంట.
కాన్ఫిడెంట్ కళ్ళదాన – కాన్ఫరెన్స్ పెడదామా
కౌన్సెలింగ్ జరిగాక – ట్రాన్స్‌పరెంట్ జంటౌదామా.

వాకీటాకీ వాటంగా – షాకీ న్యూసే విందామా.

కౌలాలంపూర్ కౌలుకు తీసి – మెల్‌బోర్న్ అందం మేడేకట్టి
కొలంబియాలో కొలువే తీరి – రామోజీలో రాజీ పడదాం.

చల్లగాలిలో పల్లకి ఎక్కి – సాగరమేఖల చుట్టివద్దామా
పుష్పకమందున షైరుకు వెళ్ళి – విశ్వదర్శనము చేసివత్తమా



బంగారం భామానీ బరువెంతో చెప్పవే
సింగారం చిలుకానీ ఉలుకేంటో విప్పవే

ప్లాటినం పాప నీరేటేమిటి తెలుపవే
రేడియం రోజానీ రేంజిగుట్టువిప్పవే.

మోనోలీసా నీ మోజే లెస్స – కావ్యనాయికా నీకామన హైలెస్సా
శశికళనే తలదన్నిన చెంచులక్ష్మివా – మల్లీశ్వరి వల్లకానిమమతల మల్లివా.

అనార్కలిని అధిగమించు అమరప్రేమవా
పార్వతినే పాపమనెడు పావన వనితవా
నూర్జహాను మదిపైని విధిగీసిన గీతవా
అమరప్రేమ అందములను ముందుంచిన ముగ్ధవా.

ఆరాధన రథమునెక్కి అడివికే పయనమా
ఆపదలను స్వాగతించు అమరలోక యానమా
మనసిచ్చిన శూన్యంతో మరో జగతి గమనమా
తనువు మనసులేకంగా తరియించిన లోకమా.

పావన నవమిథునంగా పారిపోవ ఫలితమా
పాపపులోకం చూపుకు దూరమౌట పర్వమా
అమరప్రేమ ఆశయాలు అడుగున బడవరమా
చేతకాని అనురాగం చెరిపివేయ యత్నమా.



ప్రజాస్వామ్యమే పసదనమా – మానవజాతికి మరణశాసనమ
దుశ్శాసన శాసన దుర్విదగ్ధ పాలనలో – రక్షకభట శిక్షణ దక్షస్వారాజ్యంలో
మాన్యునికే మనుగడ – సామాన్యులకే చావుకడ.

అమ్మాయిల అమ్మకాలలో – ఆదాయం ఎవరిదీ
దత్తత ముసుగున – విక్రయాలలో దానకర్ణులెవరు.
మానభంగముల భంగిమలో – మౌనం దాల్చిన మాధవులెవ్వరు
ధనమదాంధులకు దారియిది – జనసామాన్యపు జైలుయిది.

శాసన పర్వంచేదు అనుభవం – అందుకొనెడి ఆ అభాగ్యులందరు
పంతంపట్టిన ప్రతినిధులంతా – పంచుకొనుటకే పలునిధులున్నవి.

కళ్ళమందరే కైలాసం – ఇంటిముందరే వైకుంఠం
నినాదాలలో నిత్యం స్వర్గం – వివాదాలతో విలువలు నరకం
కారేనీరే కలవరమ్ముగా – ఆత్మహత్యలే ఆయుధమ్ముగా
మానవముక్తికి మార్గం తెరిచీ – మాధవులైరిగ మన ప్రతినిధులూ.

సాగరమంతా సామాన్యునిదే – మాన్యుల విహరణ ధన్యత కొరకే
బంజరు భూముల భాగ్యం కొరకే – రాజకీయులకు రచ్చబండలు.

బోర్డరులలోనా బాంబుల మోతలు – ఆర్డర్ తప్పిన ఆ జవానులు
ఉగ్రవాదుల ఊచకోతలు – అగ్రరాజ్యముల కప్పుల తిప్పలు.

భారతదేశము భాగ్యవంతము – భారతీయులదె ప్రజాస్వామ్యము
బాధల గాథల యోధులె పౌరులు – సంపాదనలో మునుగు ప్రతినిధులు.



చీమనుండి సీమదాక సిరుల కొరకు బతుకులాయె
అణువునుండి బ్రహ్మదాక అధికారం బధిరమాయె.
నాదవేదముల నాణ్యత పోయెను – నవ్యజీవితము గణ్యత దప్పెను
వ్యాపారపు వేదంలో – వెతుకులాట వెతలకాయె.

నీతినియమముల నిలుకడ వీడెను – జాతి ధర్మములు జగతిని విడిచెను
దారి తెలియకనె ధర్మపు పయనము – చేరు గమ్యమే చేటు సమీపము.

సంప్రదాయమే కంపరమమాయెను – సంస్కృతి విషయమె విషమై పోయెను
గతముల గురుతులు గాలికిపోయెను – వర్తమానమే వాంఛగ మిగిలెను.

భక్తీ ముక్తీ బజారుకెళ్ళెను – వేగం భయమూ వేళకు వచ్చును
'చద్దిమూట'ల ఒద్దిక దప్పెను – 'ఫ్రిజ్జు బతకు'లే పేలవమాయెను.

ధైర్యమన్నదీ ధనమునకాయెను – స్థైర్యమన్నదీ స్థలమే మార్చెను
ఆత్మశుద్ధియే అడుగులనంటెను – ఆలోచన 'లాలూచీ'కాయెను.

ఆ'కలి' యుగమున – ఆర్తుల నాదము – వృత్తికి ఫలమమే వృత్తమాయెను
ఆత్మహత్యలూ సత్యం నిత్యం – ఎదురుప్రశ్నకూ ఎదురు కాల్పులు.



నీరులేని చెఱువులో – నిధుల వేట మొదలు
తూటికాడ తొలగింపులో – ఖజానాకు తూట్లు
కాల్వల లైనింగులోన – కాంట్రాక్టుల రింగు
ప్రజల భాగస్వామ్యమనే – పలుకు బలె పసందు.

పన్నులపై పన్నులతో – గొర్గిపళ్ళ పోటు
మద్యం పారింతలోన – మనకు మనం సాటి
ప్రచారాల హోరులోన – బారు జోరుమనది
ప్రలోభాలలాభంలో – ప్రతినిధులం మనము.

అధికారపు పంపిణీకి – అర్పణ సమర్పణలాయె
చట్టబద్ధ దోపిడీకి – చెదరంగం మొదలు
కేంద్రీకరణమ్ములో – కేరింతల మనకు
పంచాయతి రాజ్యానికి – పంచనామ మొదలు.

డ్వాక్రా మమహిళల గ్రూపులు – వక్రభాష్యమాయె
జన్మభూమి జాతరలో – పాతరాయె జనస్వామ్యం
నిధులు మళ్లి విధులు వీడి – విధ్వంసము విలువలు
చెల్లిపోవు కాలానికి – చేదుమాత్రలెన్నో.



అక్షరం అక్షరం – అందరికీ అదివరం
అ ఆలను నేర్చుకొంటె అందరికీ ఫలితమంట
అమ్మనాన్న పదములే అవసరాలు తీర్చునంట
సంతకాలు నేర్వగానె గర్వమగును బతుకుపంట
అక్షరాలు నేర్వండిరో ఓ అయ్యలార అమ్మలార
అన్నలార అక్కలార అందరికీ చెప్పిరాండిరో
అంకె సంఖ్య తెలిసికొంటె అసలు లెక్క తేలునంట
వడ్డి అసలు లెక్కలకు వరుస క్రమం కల్గునంట
పట్నానికి బస్సుపేరు నీకు నీవె తెలిసికో
వేలిముద్ర మానుకొని వెతల బతుకు గడుపుకో
అక్షరాలు నేర్చుకోవయా అయ్యవారు చెంత

కొచ్చెరా రాత్రిబళ్ళు రచ్చకొచ్చెరా జనమంతా
చదువుకొండయా
పేపర్లో వార్తలన్ని పెద్దగ చదవొచ్చురా
ఉత్తరాలు పత్రాలు ఉద్దిగ చదవొచ్చురా
పుస్తకాలు చదువుకొనీ పూజ్యులు కావొచ్చురా
అజ్ఞానం తొలగిపోయి విజ్ఞానం కలుగురా
విజ్ఞప్తిని వినుమురా – విజయుడవే నీవురా
మోసాలు తెలియవచ్చు – మోదమును పొందవచ్చు
రాజకీయ నాయకులను – రచ్చవద్ద నిలపవచ్చు
పెద్దవాళ్ళు చిన్నవాళ్ళు – ఉన్నవాళ్ళు లేనివాళ్లు
అందరికీ ప్రవేశము – చీకటి బతుకులు విడిచీ
చదువు వెలుగులోకి రండి
ఇల్లాలే చదువుకొంటే ఇల్లంతా చదువు వచ్చు
యజమానే చదువుకొంటే – యాతనలేమియు లేవు
పెద్దచదువు చదివించీ – పేరుపొంది జీవించుడి
చదువుమాట మరవకండయా – మీజీవితము
చదువుకొంటె జిలుగు వెలుగయా – మీకుటుంబము
అందరిలో ముందుకెళ్ళును– అందుకే
బడికెళ్దాం రండి – చదువుకొందాం సుండీ.
అక్షర సంక్రాంతి ఉంది – అందరికీ క్రాంతి అది
మూఢత్వం వదులుకొండయా – ముద్దు చదువు నేర్చుకొండయా
బాణామతి చేతబడుల భావవేమొ తెలిసికొండి
మీజీవితాలు దిద్దుకోండయా – వేరొకరికి ఆదర్శం కండయా.



సాయి నామము సారవంతము – సామరస్యము సాధువాదము
విశ్వజనులు వినుతించే శాంతినామము – సర్వజీవజాలమునకు పర్వనామము
కష్టకాల ఇష్టపూర్తి హితవు నామము – కలికాలపు కలవరముల కలిమి నామము
సాయి పథము సాయిపదము సౌమనస్యము
సాయి బోధ సాయినాథ సర్వస్వము సత్యము.

చిదానంద సదానంద సరళిసాయి నామము
సాధనమున శోధనమున సరస నామము.

స్వార్ధమునకు శోధనము పరమార్థపు సాధనము
కులమతముల కూలగొట్టు కూర్మినామము
బాధలకు భాగ్యము వేదములకు మూలము
వెలుగు కలుగు అక్షరము అక్షయమా నామము.

జరామృత్యువరనామము జాగృతమానామము
భయంలేని భగవంతము భావమె ఆ నామము
ఆరోగ్యము ఆలోచన నందించెడి నామము
ధనము గుణము మనములకూ దారిచూపు నామము.

అమలిన హృదయాలనూ అభినందించెడి నామము
భోగ రోగ భాగ్యములకు బోధనమా నామము
శాంతియుతము దాంతికరము కాంతియుతము నామము
కారుణ్యపు కర్మలకూ మర్మరహిత మార్గము.



మైనేని ప్రసన్నకూ – మామంచి రోజు
లక్ష్మీరూపానికి – లక్షణమౌ రోజు
పుట్టిన రోజునకూ పూజ్య వందనం
పుణ్యములకు నిలయవగుము గణ్యానందనం
ప్రాయము పదిహేడునకూ పరమ పూరకం
పౌర వయసు పద్దెనిమిది ప్రాభవ ఆగతం
సరసమైన వత్సరముల సరళికి చందనం
ఎదుగుదలకు ఎఱుక మిగులు ఎదకే అందలం.

అమ్మనాన్న సోదరులది అభినందనం
అమ్మమ్మ మామలది అంతరంగ నందనం
అందరి ఆశీస్సులకూ ఉంది ఫలితము
అందలమున నీవుండగ అందరి ఆశయం.

చల్లని తల్లివి సాగుమారోగ్యమున
సరసపు ఆలోచన సరళిని సాగించుము
కష్టములో ఫలమున్నది – ఇష్టమై నడువుము
వినయము విజయమనీ విశదముగా నమ్ముము.

జ్ఞానము గణ్యమనీ జ్ఞప్తిలో నుండుము
ధ్యానము మాన్యమనే మనసుతో నుండుము
శక్తికిమించెడి కోరికలను కోరకు
భక్తియె ముఖ్యమనే బాధ్యత గుర్తించుము.

పుట్టిన యీరోజు పండుగయే మాకు
మనసులు నిండుగా ఆశీస్సులు నీకు
ఆరోగ్యము మనశ్శాంతి అందును నీకు
అపాయమే ఉపాయమై అవతరించుగాత!



మహిళా శిశు జన్మభూమి – మహనీయమె మనభూమి
మాతృభూమి మహర్దశకు – మహిమకలది జన్మభూమి
జననీ జన్మభూమి స్వర్గానికి మిన్నయనీ
భువి దివిగా మార్చెడిదీ మనమహిళా జన్మభూమి.

ఆంధ్రభూమికీ వారధి సారధి – ఆరాధ్యపు మహిళగా అనుకొందుము
కుటుంబమున గౌరవమున – కూరిమికే మారుపేరు మనమహిళ
గృహసీమకు గురుతుగా – ఆంధ్రమాత అతివగా
అందరి ఆరాధనగా – అవతరించె మన మహిళ.

అభ్యుదయపు దారిలో – అతివలంత ముందుండె
పొదుపు పథక విధులలో – పడతులు ప్రథములుగాను
అన్ని రంగములలో – ఆడవారు అధికులైరి
ఆంధ్రదేశ అభివృద్ధికి – అద్దం పడుతున్నదది.

ఇంటిపనులు దిద్దుటలో – ఇంపైనది మహిళే
పిల్లల పోషణలోనా – ప్రియమైనది మహిళే

వేదాల పురాణాల – పూజ్యమైనదీ మహిళే
వినయానికి విలువలకూ – విజయమే మహిళ.

చంద్రబాబు పథకాలకు – సాంద్రతయే మహిళ
డ్వాక్రా సంఘాలకు – దోహదమూ మహిళ
ఆంధ్ర ఆడపడుచులుగా – అందమైనదీ మహిళ
పురుషులతో పోటీపడి – ఎదుగుతున్నదీ మహిళ.

పంచాయతి పాలనలో – ప్రాధాన్యం మహిళదీ
సౌకర్యపు కల్పనలో – సారధ్యం మహిళదీ
అవసరాలు తీర్చుటలో – అవగాహన మహిళదీ
శాంతి సహజీవనముల – స్వారధ్యం మహిళదీ.



బుద్ధుని జన్మభూమి – బుద్ధికిపుణ్యభూమి
శీలమందు శిల్పభూమి – మోక్షమునకు మోదభూమి
సిద్ధార్థుని అర్థమందు – కోరికలే కొఱవులు
బోధిసత్త్వ తత్త్వమున – జ్ఞానమహిమ గణ్యమాయె
బుద్ధగయను సిద్ధుడాయె – లుంబినివన దివ్యుడాయె
వైశాలిని విశాలమై – విశ్వమందు విబుధుడాయె
ఆచరణే ముఖ్యమనె – ఆశలు వైముఖ్యమనె
ఇంద్రియ ప్రాధాన్యమును – హితములేని మతమనె
దీనుల వృద్ధుల – దివ్యులనెడు భావమున
కరుణ దయల మూలమున – కదలించెను కలియుగమును
అష్టాంగ మార్గములే – ఇష్టాంగములాయెగా
హింసయనగ హీనమనెను – అహింసయె అవసరమనె
ఆడంబరములనతడు – ఆమడదూరము నెట్టెను
సామాన్య జీవితమే – సహితమనుచు నుడివెను
బ్రహ్మచర్య ముఖ్యమనెను – సన్న్యాసము సారమనెను
యోగనిగమ సారములను – యోజనలో నుంచుమమనెను
బుద్ధుని జాతక కథలే – శుద్ధమైన చారిత్రము

త్రిపిటకముల విషయములే – తీయనగును జనులకు
సంగముక్తుడగుటయే – సకల మతము సారమనెను
బంధములను వీడుటే – అందమైన జీవితమనె.



ఆచార్యతత్త్వమే – అమరమాయె నీ భువిలో
ఆచరించు వ్యక్తులే – శక్తులాయె చరిత్రలో
పదార్థము చైతన్యము – పరిణామ కారణములు
ఆది అంతముల వైనం – ఆచార్యులు వివరించిరి
ప్రథమమందు ఒక్కటాయె – అనంతరము రెండాయెను
అద్వైత ద్వైతములకు – ఆలోచన జోడాయెను
జీవాత్మ పరమాత్మల – ప్రాధాన్యము తెలిపిరి
ఇహపరముల విషయాలను – హితముగ వివరించిరి
మాధ్వులు శంకరులు – మహిరామానుజులు
నారాయణ కేశవులకు – నాధత్వము కల్పించిరి
ఆరాధన తత్త్వములకు – వివేకమును జతపరచి
ఆలోచన అవగాహన – అతిశయించ వివరించిరి
జనజీవనాడులను – జయశీలము నించిరి
వేదవాద నాదములను – వేకువలో వెలయించిరి
హైందవధర్మము లోనిది – అందరికీ అందనిదీ
అందుకొనిరి అందించిరి – ఆచార్యులు ఆరాధ్యులు
వేదాంత సిద్ధాంతము – రాద్ధాంతమవుతుండె
వేదవిదుల ప్రవచనాలు – వెలుగునీడ చీకటాయె
దర్శనముల దర్శించిన – శాస్త్రములను చరియించిన
అనుభవాల సారమైన – ఆశయమే ఆచార్యము
ఆస్తి నాస్తి వాదములకు – ఆదిశక్తి తత్త్వములకు
అవతరణకు తరింపునకు – ఆచార్యులె మూలమయిరి
చింత వింత చేతనలో – వంతలన్ని మరచిరి
సన్న్యాసము యోగ్యమని – సాధు తత్త్వమును దెల్పిరి.



ఆంధ్రవీరుడా అసమతేజుడా – ఆంగ్లేయులనెదిరించిన ఆహవ యోగ్యుడా
మన్యానికి వన్నెతెచ్చి – మాన్యుడైన రామరాజు
మన్నె జనం గుండెలలో – గూడుకట్టి నిలచినోడు
తెల్లవారు తెలివితోడ – ఇళ్ళు ఒళ్ళు గుల్లచేయ
స్వేచ్ఛా స్వాతంత్ర్యములను – తెలియబడరచి తెరలినోడ
దొరల దోపిడీల చూచి – దోర్బలమున విప్లవించి
తెల్లవారు తెల్లబోగ – తెలుగుతల్లి వెలుగువైతి.

పోలీసుల చర్యలన్ని – పోడిమితో ఎదిరించి
పాలకొల్లు చోడవరం – పాలికాపువైతివిగ
నీరూపం నీత్యాగం – నిత్యసత్యమైన దంట
నీగుండెల మంటలతో – మ్లేచ్ఛజాతి తంటవైతి.

మిరపకాయ టపాలతో – పరదేశుల పరపతిని
పేల్చివేసి కూల్చివేసి – పేద ప్రజల పెన్నిధైతి
భారతదేశపు భాగ్యం – ఆంధ్ర మందునీపుట్టుక
అసమానం నీ ధైర్యం – ఆరాధ్యం నీ నియమం.

స్వాతంత్ర్యం వీరుడవయి – స్వారాజ్య భానుడవయి
స్వాతిశయం ప్రకటించి – బంధనములు త్రెంచితివి
తెలుగుతల్లి ముద్దుబిడ్డ – తెల్లవారి సింహస్వప్న
గిరిజన గీష్పతివిగ – పరిసేవన చేసినోడ
ఆనాటి అల్లూరియె – ఆంధ్రులకు ఆదర్శము
దమననీతి నెదురొడ్డగ – దయామయిగ తిరగబడెను
అల్లూరిస్ఫూర్తితోడ – అందరము స్పందించగ
ఆంధ్రమే సాంద్రమగును – అందరకూ శాంతికలుగు.



భక్తి సాగరం – ముక్తి ఆకాశం
శక్తి సూర్యకిరణం – రక్తి రామాతారకం
సాయిరాం – సాయిరాం – సాదర ప్రణామము
సాధనం – శోధనం – సాయిశక్తి సంపన్నం

సాయిబాబ – సాయిబాబ – సాయిబోధ మధురం
సాయిదివ్య నామమునకు – సాధువర్తనమె నిజం
సత్యసాయి నిత్యసాయి – సచ్చిదానంద శాయి
దయాసాయి – ధర్మసాయి – ధరణినేలు ధన్యసాయి
ధనమున్నా బలమున్నా – సాయిముందు దిగదుడుపే
అధికారులు రాజులైన – అధమము జనసాయికంటె
పేదపెద్ద భావములు – పేలవాలె సాయిపేర.
కులము మతము కూహకములు – కూలును జనసాయిముందు
పరుల సేవ పరమార్ధము – పరతత్త్వము సాయికి
హీన దీన హితములే – మతమగు మనసాయికి
పాపరహిత జీవనమే – పావనమగు సాయికి
పుణ్యకర్మలను చేయుట – పూజ్యమగును సాయికి
అవతారము లెన్నొకలవు – అహంలేని సాయికి
అవధరించు దీనులమొర – దివ్యసాయి మేలుకూర్చు.
త్రికరణముల సేవించిన – తీర్చు సర్వకోరికలను
నవభక్తుల ధ్యానించిన – నవత కూర్చు జీవులకు
భయంలేని బాధలేని – భాగ్యజీవితమునకూ
యోగ్యతలను కల్పించును – యోగియైన సాయిబాబు.

జననం ఒక జయకేతనం – మరణం ఒక కీర్తికిరీటం
జనన మరణ వలయంలో – తిరుగుచుండె జీవులు
జీవన వన విహరణలో – జిలుగుమీరె జీవితాలు
అమరమున్నదన్న భ్రమే ఆ జీవికి కలిగెను
నరకమున్నదనుమాటే నవ్యమాయె నతనికి
మూలము తెలియలేని ముద్దు జీవులందరూ
నేలవిడిచి సాముచేయు నేర్పరులుగ మారిరీ
కడుపులోని ముద్దకూ కమ్మదనం కలిగించీ
కలియుగమున పడవేసిన కలిపురుషుని తెలియరూ
నేనను పదములోని నేవళమును దెలియరూ
అజ్ఞానము జ్ఞానమును అసలేమి ఎరుగరూ

బతుకుట భాగ్యమనీ భావమందు తలచగా
మరణించుటె యోగ్యమనీ మహదాశయులంటుండిరి
జాగ్రత్తలు తీసికొనీ జాగృతమై జనుడుండగ
ప్రకృతి చైతన్యమములో వికృతులే కలుగుచుండె
స్వర్గధామ వాసములో సొగసు కాంక్షించగా
నరకవాస నాణ్యతలో నవ్యతలను గాంచు చుంద్రు.
తెలిసిన ఇంద్రియాల ఇంపు గనెడి నరవరులూ
తెలియని మనసునకు తేటదనం కలిగించరు.
మరణానికి వేదాంతం – జననానికి రాద్ధాంతం
'వేది' యైన జనునికీ – సర్వం ఆ బ్రహ్మమయం
రోదన వేదనలకు – రోజు రోజు స్థానము
జననమరణ రోదనలే – జనకీర్తికి ఆనవాలు.

కన్నవారి కలలకూ – కమ్మని రూపు
విన్నవారి చెవులకూ – విలువల రూపు
అమ్మఅనే మాటలోనె – అందమున్నది
తల్లి అనే పదంలోనె – తపన ఉన్నది.
అమ్మకన్న కలలకూ – అంతరంగమున్నది
కలవరములకన్నిటికీ – కలికెమయి ఉన్నది.
అమ్మమాట వేదములో – ఆది అంతమున్నది
అమ్మప్రేమ మధురిమలో – అమరసుధలు ఉన్నవి
అమ్మఅనే కిరణములో – అన్నిరంగులున్నవి
తల్లి తెలుపు నీతిలో – తరళ మార్గమున్నది.
తల్లిమనసు తారుణ్యము – అతిమృదువైయున్నది
అమ్మమనసు అందములో – అందలమే ఉన్నది
కమ్మదనం అమ్మదనం – చల్లదనం చందనం
కమ్మనమ్మ కారుణ్యమె – కలియుగాన కమనీయం
నిష్కామ కర్మయే – నిలువనీడయాతల్లికి
అవధిలేని అనురాగమె – ఆయమ్మకు మనుగడ
ఆదిగురువు ఆతల్లే – గరువమె మన పరువమే

అంతరంగ తరంగమే - అమరపు అవతారమే
మంచి చెడుల వివేకమే - మనతల్లికి మకుటము
మంచితొ మురిపించుటే - ఘనమాతకు గణ్యము
అరిమార్గము అధమమనే - అవతారము తల్లియే
సరిమార్గము సహితమనే - సహకారము అమ్మతనము.



అధికారం మత్తులో - అమరం కనిపిస్తున్నది
అమరాంధకారంలో - అవని కానరాకున్నది
అధికారాంతమునందు - అభివందన మసలె లేదు
అనుభవంలొ అధికారం - భవరోగపు బంధుత్వం.

అమరుల అసురుల సమరం - అలనాటి అనుభవం
అసురుల అసురుల సవనం - అధికారపు కైంకర్యం
ప్రజాస్వామ్య సవనంలో - ప్రమధగణం ప్రతినిధులు
ప్రజలు సమిధలైనారుగ - రాజ్యాంగపు రభసలో.

అమరుల శాసనమే - శాపమాయె జనులకు
అసురుల పాపములే - అణచివేత కథలాయె
కల్పవృక్ష నీడలో - పెరిగిన యీ పెద్దలు
ఐరావత బలంతో - అధమాధము లౌతుండిరి.

పురాణాల పుణ్యకథలు - గణ్యమాయె గహనంలో
రాజకీయ రాబందులె - రామరాజ్య కామందులు
కుర్చీ బంధం వీడని - కూటనీతి పరులందరు
మాతృభూమి నమ్ముకొనే - దేశద్రోహ దేవతలు.

అంధమైన అధికారం - అసురుల సొత్తు
అంద మందలమునందు - అమరుల సొత్తు.
మానవమాతృలకే మానధనం కరవు - అభిమానం అధికులదే అందలమున బరువు
పరువు బరువులధికమై - పరములకే ఎసరు.



ఉషోదయం – ఉషోదయం – హుషారైన ఉదయం
నిదురించే బధిరులకూ నిత్యం చైతన్యం
సూర్యుడు ఉదయించు భూమి సుందర స్వప్నం
రవి అస్తమించని రహియె నాటి రమ్యం
ఉదయాద్రికి ఉదధికీ ఉన్నతి నాపాదించిన కిరణం
అరుణారుణ మధురిమలతొ అందించెను అమరం
ఇనగోళం హితమతియై ఇంపుగూర్చు చున్నదీ
రవిరాజ్యం పూజ్యమయి రామణీయకమ్మైనది
వెలుగుల తేనికి వెగటు సగటు లేకున్నది
వెలుగు వేళమించగా – కలిగె కాంతి కఠినమై
తారుణ్యం తాపమయి – అరుణిమయే కరుణమాయె.
ఆరంభం అంతములూ – అనుమోదించును జనత
మధ్య మిథ్య మనురీతులు – మారణ రుణ కారణములు
వేడెక్కిన వేదనలో – వెలుగు చూడ లేదు నరుడు
అస్తమించు అరుణిమలో – అంధమైన చందురుడూ
ఉదయం హృదయానికి మధురం – అస్తమయం స్తవనీయం
కిరణం నవకరణమయి – నవ్యతకది సోపానం
కోణార్కుని కోవెలలో – కొలువుతీరు సూరీడు
మంచుకొండ మర్శించగ – దర్శనీయమగునుగా
గోళములకు గోళమై – గోలతనపు దినకరుడు
పాలించును గోముగా – ప్రకృతి సర్వస్వములను.



ఉన్నవాడె దేవుడు – కన్నవాడె అధికుడు
కనిపెంచు మానవులకు – కనుపించు మాధవుడు
గర్భమందు లేని నీవు – గంతులేస్తు ఉంటివి
అంగాంగము లేర్పడగా – అమరుడనే నంటివి.

ఉసురులేని తనమున – ఉదధివంటి కడుపులో
ఉద్యమించినావుగా – ఉదయమునీకాయెగా

కదలిక లేనిదిగా – పసిగుడ్డు మిసిమిగా
గిచ్చుగాను ఏడ్వగా – గీష్పతియే నీవుగా.

అంతులేని లోకానికి – ఆరంభము నీదాయెను
ఆరంభ సంరంభం – ఆదేవుని అభిమానం
ఆకలి కలిగినా – ఏకలి ముసియించినా
తలగడ తల్లిగా – పాలను సృజియించెగా.

జోలలాలి పాటలలో – జోగిన నీశరీరం
కలలకాంతి స్పర్శలతో – కామనలే తీర్చెగా
ఆదిమధ్య అంతములు – అవినీకు స్వంతములు
అన్నిటికీ అధిపతీ – అవనియా పరమేశుడు.

సృజియించిన మతములూ – సుందరులే దేవుళ్ళూ
మూలతత్త్వ శోధనలో – మూగబోవు వారలూ
ఏపేరున పిలచినా – ఎఱుకే నీదేవుడూ
ఏరూపున చూచినా – దర్శనమే దైవమూ
ఉన్నను లేకున్ననూ – ఉన్నతి లేదందురూ
ఉన్నదన్న ఉవాచలో – ఉన్నతి కలదందురూ.



సెగరగిలే ఎండలు – భగభగ మను మంటలు
అంటరాని బండలు – అపరాహ్ణపు ఎండలు
సూర్యగోళ స్పర్శతో – సుదతి భూమి విలవిల
వార్ధినీటి ఆవిరిలో – వసుధ తలము మలమల.

పార్శ్వమందు ఫారన్‌హీట్ – మధ్యమందు సెంటీగ్రేడ్
వాలు సూర్యకిరణమందు – వాసికలుగు వంటనిప్పు
ఏపైననున్నాడో – ఎఱుకలేదు ఎడదలకు
ఊహకైన అందనిదీ – రవి బింబము ఆర్ణవమై.

పొడుపు విడుపులందునా – పోడిమి కొంచెమే
మధ్యందిన మార్తాండుడె – మరణమునకు వరణము

ఆకర్షణ ఆర్జవము – అందరాని దది ఆది
పాలన చాలనమందున – పరమ పదము పథమది.

ఇంధనమే కననిమంట – బంధనమది జనులకంట
జీవజాల జాతకమున – పాతకమమా ఇనుని మంట.
సవ్యాపసవ్య దిశల – సాగెడి అప్రయాణము
గతితప్పని గమనము – గతులు మార్చు యంత్రము.
కిరణము కరుణించును – కీర్తిభరిత లోకాన్ని
సవ్యజీవయానమున – సరసమౌను కిరణము.

ఆరాధ్యము అందలము – ఇనకిరణపు చందము
అన్నిసంధ్యలందుననూ – అతడే మనకాది గురువు
గురువు పరువు కాపాడిన – బాధ బరువు వీడునూ
రవికిరణపు రాజ్యమున – రమ్యమగును జీవనము.

569

అమ్మ ఒడి నాన్నమడి – ఊరుబడి తెలుగునుడి.
తేనెతేటి తెలుగుమాట – చెఱుకుఊట చెలిమిబాట.
అందములో బంధములో అనుబంధము చందములో
రూపములో రుచ్యములో అపురూపము అతిరుచ్యము
ఆంధ్రి సాంద్రి రచనలలో – ఐంద్రీ ముఖ సూర్యకాంతి.
తూర్పుదేశ ఇటలిభాష తూర్యములతొ వినుతికెక్కె
చరిత గరిత శాసనముల – మమత సహిత మార్దవముల
తరువోజల ఓజస్సుల – వరగీతపు వరుసలలో.
క్రీస్తుపూర్వ కీర్తి నిలయ – ద్రావిడమున ద్రఢిమత్త్వము
వ్యాకరణము వ్యవహారము – వ్యవస్థలలొ వాసితము.
మమ్మిడాడి సంస్కృతితో – కమ్ముకొనెను చీకుచింత
మారు మనువు మహితమై – ఆంగ్లమాయె అంగడిగా.
తల్లిచెల్లి ప్రేమించుము – తల్లిభాష తరియించుము
మల్లెగంధ మధురిమలను – తెలుగునేల వెదలజల్లుము.

రచ్చబండ రచ్చరచ్చగామారి రొచ్చయినట్టు
ముచ్చటైన ముద్దుమాట మూర్ఖత్వపు మురుగుకాల్వయింది
మాటకరవైన మౌనానికి – మాధుర్యపు మధురోహలు మంచితనాన్నాపాదించాయి
వంచనతో మంచితనం పంచకూళ్ళ కషాయమై
పలవరించింది కలవరించింది
కలవరం కాఠిన్యమై అక్షర శరాలను అనుసంధించింది
క్షరమైన అక్షరం వరమై సంగతించి సమగతిగా మారింది
మతగతి గతించిన గాథలను మథించి
హాలాహలాన్ని అమృతాన్ని అందంగా చిందించింది
మేథలో మేలిమి మూసలోపడి మృదుత్వాన్ని మృతతత్త్వంగా మార్చింది.
స్వచ్ఛమైన ఇచ్ఛ ఇచ్చకపుమాటలో ఇల్లువెడలింది.
అనువర్తించే అక్షరాలు మనువర్తిగా మారాయి.
ధర్మాధర్మాల దార్శనికత అక్షరాలతో అనుక్షణం క్షీణిస్తున్నది.
కీర్తికాంక్ష ఆంక్షలు మరచి స్ఫూర్తి స్థాయిని మరచింది
భౌగోళికానికీ, బౌతికతకు నిత్యం సమరం
సమరం సమత్వానికి స్వాగతం పలికితే స్వర్గమే అపవర్గమే
అపవర్గంకోసం అనుచరవర్గాన్ని అనాదరించే ధార్మికం.
ధార్మికం మతంకాదు ఆచరణం
శాస్త్రులు పాస్టర్‌లు ముల్లాలు పూజారులు దేవాలయంలో దేహధారులే
ధర్మం మార్చి, దారులు మళ్ళి దయనీయులై దర్శనమిస్తున్నారు.
దర్శనం, దృష్టిశక్తి, దార్శనికులు శక్తివంతులు.
శక్తివంతులు మానవులు, రాక్షసులు, దేవతలు పేర్లుమాత్రమే
పేర్లు భాషల్లోవేరు, భావమంతా ఆచరణీయ ఆధ్యాత్మికతే
అర్థంలేని అభిభాషణ, అర్థంకాని భాషణ పుణ్యం లేని నైపుణ్యమే
మునిత్వము, మృదుత్వము సరళత్వము సహృదయము సంగమిస్తే సాంగోపాంగమే
ఏ అంగమైనా 'అంగికి' అనుసంధానమే తప్ప వివాదమయితే వేదనే.



భట్టిప్రోలు భాగ్యము – బౌద్ధ స్థూప భోగ్యము
పాఠశాల పరువము – గురువులు జనగరువము

తమ్మన ఇంటిపేరు – తరగదు దానము తీరు
మల్లెపూవు స్వచ్ఛము – అర్జునునిగ పర్జన్యుడు
రావు విద్య రమ్యుడు – వైశ్యవంశ వైభవుడు
మూర్తి కీర్తి మురిపెము – వజ్రోత్సవ వారువము.
ఆంధ్రమందు అమరావతి – అలనాటి రాజధాని
శాతవాహనుల కాలము – శాతమాయె బౌద్ధము.
ప్రతిష్ఠానపురముగా – ప్రాభవము భవమునా
ఆంధ్రదేశరాజధాని – నేడు అమర ఆవాసము
'పురుషోత్తమ' పేరుతో – పూజ్యుడాయె ఆచార్యుడు
క్రమశిక్షణ దక్షతలో – కరుణకు తావే లేదు
'గురునాథము' గురువుగా – గురుతుగా గణాంకము
కాంపోజిట్ లెక్కలను – పక్కాగా బోధించెను
సైన్సులోని సెన్సు తెలిసి – స్వచ్ఛవస్త్ర 'శ్రీనివాసు'
నేచర్‌సైన్సులలో – నేవళతను తెలిపినాడు
'మాణిక్యము' సోషల్‌లో – మంచిమించు మాస్టారు
'రాజారావ్' రమణీయత – పంచెకట్టు దిట్టగా
సోషల్ సైన్సెస్‌లోన – శోభమీరు బోధనము
తెలుగు తెలుపు మాస్టారు – ఆరడుగుల బలవంతుడు
మల్లికార్జునుడిగా – పాటపద్యమవలీలగు
ఇంగ్లీషులొ ఇంపగు – ఉచ్చారణ దక్షతతో
'ప్రసాదు'గా ప్రసారమున – ప్రబోధించె గురువుగా
మెడతాటి ఇంటిపేరు – మేలుగ జనరల్ లెక్కలు
కూచిపూడి కూర్మిజనుడు – ఆటలు డ్రాయింగులో
దీటైన పంచెకట్టు – చెడుగుడులో రిఫ్రయిగా
గేమ్సులోన 'కాశీపతి' – 'నారాయణరావు'లు
ఎస్వీఎస్ సుబ్బారావు – విశాలమే ఆటస్థలము
చుట్టుపట్ల పచ్చచేలు – సుందరమౌ ప్రకృతి
ఆకృతిలో ప్రాంగణం – సరస్వతికి నిలయం
అరవైతొమ్మిదిలో – అలనాటి గురువుల స్థితి

నేటి స్థితీ నేర్పుకలది – గురుశిష్యుల గురుత గతి.
కార్పొరేటు విద్యలో – కారుమబ్బులాక్రమించె
మాతృభాషమారిపోయి – భావములకు బంధనమయె
సృజనశక్తి కోలుపోయి – నైపుణ్యము నేలకొరిగె
మార్కు విక్రమార్కమై – వినాశనము విద్యలాయె.



జీవితానికి జీవం జీవనం – వనానికి జీవం జీవనం
ప్రకృతికి జీవం జీవనం – పరాకృతి పంచినది జీవనం.

వర్షం పడితే హర్షం – వర్షం లేకుంటే అమర్షం
పచ్చనిచెట్టు వర్షానికి హర్షం – పచ్చని జీవితానికి వర్షం పరమార్థం.
నీటిని నిధిగా వాడుకో – జీవిత విధినే మార్చుకో
నీటిని తోడేస్తే నిధిని తోడేసినట్లే – భవిష్యత్తు భాగ్యానికి బంధం వేసినట్లే.

నీటికోసం యుద్ధాలు – జాతులమధ్య స్పర్థలు
నీటి పొదుపుతో అదుపు – అదను తెలిసి మేలుకో.
నాగరకత నీటివద్దే ప్రారంభం – నీరులేక నాగరకతే అంతం
అదుపు పొదుపు లేని వాడకం – అందరికీ చేటుతెచ్చే అంశం.

భూగర్భం శోకిస్తుంది – భవిష్యత్తు రోదిస్తుంది
నాగరకత నవ్వులపాలే – నీరులేక నివ్వెరపాటే
పెరటిలోన ఇంకుడుగుంట – పెరుగునీటి మట్టము ఇంట
పంపు నీరు పారును పంట – జనులకేమి ఉండదు తంట.

కాల్వనీరు కలిమి – చెరువునీరు పరువు
వాననీరు బరువు – నేలనీరు చెలిమి
శుద్ధిచేయి నీటిని మళ్ళీ – మళ్ళించుము పాదులకు
చెట్లుపెరిగి చెరుపు వీడును – వేడితగ్గి వర్షము మెరుగగు.

నీటిరక్ష జాతిరక్ష భవితరక్ష భవము రక్ష భువనరక్ష.



పురాణకాలంలో కామదహనం – కలికాలంలో కలవర సహితం
రంగురంగులహోలికోత్సవం – రంగరింతలో వింత మత్సరం
లక్ష్మీపూజల లక్షణ సవనం – లక్ష్మల క్షణము లావణ్యరహితం
అష్టలక్ష్ములూ ఆనందహేల – ప్రకృతి కాంతకు పరిణయలీల
సుకృత జీవన బంధులీ మేళ – సమ సమాజపు సరసతవేళ.

ఫాల్గుణమాసపు గుణమే గురుతు – శిశిరపు శివమే చింతన మరపు
భువి తాపమునా భుక్తికి కరవు – నీరు ఆవిరై నిత్యము బరువు.
స్కాందము బ్రహ్మాండము – కామదహన వృత్తమును
తేటతెల్లముగ దెలిపెను – ఈశు తపసు భంగమును.
సృష్టి స్థితీ లయములు – లక్ష్మీ లక్షణ యుతములు
అమృతమూ ఆమెరూపు – జనవృద్ధే ఆమె చూపు.
పుణ్యము జనగణ్యము – పూర్ణిమ ఘన ఆర్ణవము
హోలీ విశ్వపు హితము – అందరికది ఆశయము.
హిందూసంస్కృతి సుకృతి – హోళిక ఉత్సవ ఆకృతి
పరాకృతికి ప్రవరకృతి – విశ్వజనత విజయ శృతి.



తనువు మనసు తరియించగ – తారుణ్యము ఆరోగ్యము
రోగబాధ రోదించగ – రౌరవమే జీవితము
పరిణామము ప్రవణమై – ప్రణవమాయె ప్రారంభము
ఆద్యమైన ప్రణవమే – అనంతమౌ విశ్వము
శారీరక మానసిక – శక్తులు జీవికి యుక్తులు
ప్రయత్నమే పరమావధి – జాగరూకతయె జాగృతి.
జరారుజలు జనునికీ – సహజములే జగమున
క్షీణతలను శిక్షించగ – జీవన నియమము నిధియే
ఆహార విహారములు – అరిషడ్వర్గపు తీరులు
సరిదిద్దుక సాగగాను – సరిగమయే జీవనము.
కృత్రిమతే కృంగదీయు – స్వీకృతియే ప్రకృతి
కాలుష్యము కలవరము – దూరముచేయుము నిత్యము

నీరునిప్పు నింగి నేల – వాయువులే ఆయువులై
రోగరహిత జీవితమున – రహిజనులే రహియింతురు
జీవకణము క్షీణించుట – రోగమునకు ప్రారంభము
స్వచ్ఛగాలి, స్వచ్ఛనీరు – శోభగూర్చు తనువునకు
ఊపిరితిత్తుల వేదన – పీల్చుగాలి ధూళితోడ
క్షయరోగము ఆరంభము – శ్లేష్మము ఆటంకముగ
అన్ని అవయవాలకూ – ఆవరించు క్షయరోగము
మొట్టమొదట గుర్తించుము – వైద్యసాయమందుము
రోగము ముదిరిపోయి – రోదన పెరిగిపోయి
రోజు రోజు క్షీణించగ – మరణమునకు దగ్గరగును
పిల్లికూతలు, ముక్కుదిబ్బడ – గురకతోడి ప్రమాదము
గురుతుపట్టి చూడుము – వైద్యముతో నిర్మూలన
దగ్గు ఎక్కువై కళ్ళెపడగా – కలవరమె వ్యాధియగు
చలికాలం సంరంభం – బాధలతో బంధుత్వము
వైద్యశాస్త్రవెలుగులో – క్షయవ్యాధి క్షయమౌను
జాగ్రత్తలు పాటించగ – జాగృతియే జీవితము.



ఆ.వె. కణము గుణము కలిగి కలిసెను గర్భాన
అండమచట నిలచి పిండమాయె
పెరిగి పిండమేమొ పేర్గాంచె జీవిగా
అవయవములు కల్గ అతడె నరుడు.

ఆ.వె. యోనియందు నాడు జోజతో నుండెను – మావిలోన జనుడు మాయమునిగి
యోనినుండి పుట్టి యోనిని కాంక్షించు – కాంక్ష ఆంక్షయైన కలిమి జగతి.

ఆ.వె. జీవకణములన్ని జిలుగుల వరుసలై – అమ్మనాన్ననుండి అవతరించె
రూపు చూపులన్ని రుజలును ఋజువును – సంక్రమణముగాను సరళిమారె.

ఆ.వె. వారసత్త్వమాయె వావులు వరుసలు – సరసమేమిలేని విరసమాయె
అమ్మకమ్మదనము నాన్న నడతలన్ని – నవ్యమాయె నరుడు భవ్యజీవి.

ఆ.వె. ఆరువర్గములును ఆంధ్యము జగతిని – ఆరుకాలములును ఆర్తిమీరు
కాలగమన మంత కాలుష్యమయమాయె – జీవయాత్రనేడు జవము వీడె.

ఆ.వె. హృదయకుహరమంత హ్రదమాయె జనునికి
కలుషమయము హ్రదము కలతలెన్నొ
స్వచ్ఛహృదయమేమొ ఇచ్ఛకు పాత్రమై
ఇచ్ఛకంపు మాట ఇరుల బాట.

ఆ.వె. సెల్లులందు నేడు సొల్లు హెచ్చుగు చుండె
కల్లకపటములును కంపుగొట్టు
సిమ్ముమార్చి మార్చి సిరులకై దురపిల్లు
సెల్లులాట మానశక్తి గలుగు.

ఆ.వె. నీటిచెంత పెరిగె నేటి నాగరకత – నీరువట్టిపోయె నియమరహిత
అదుపు పొదుపు లేని అవనియె ఆపదన్ – పంచభూతములకు పంచు చెలిమి.

ఆ.వె. సాంప్రదాయమేమొ సంద్రములో మున్గె – సంస్కృతంత నదుల సంగమించె
కలుషమాయె నీరు కలవరపాటాయె – ఉప్పునీట మంచి ముప్పుదెచ్చె.

ఆ.వె. మంచిచేయువాడు మహిమించు జనుడుగా – మానవాళి తెలియు మాధవునిగ
కానరానివాడు కనబడు భవునిగా – భవమునందు జనుడు భాగ్యశీలి.

## ప్రపంచ ఆరోగ్య దినం

ఆరోగ్యం ఆరోగ్యం – అవగామన మారోగ్యం.
ఓషధులే ఓదనం – జీవుని కవి పసదనం
కలుషరహిత భువిలోన – కలవరమే కలుగదు
కలవర రహితపు జగమున – ఆరోగ్యమే అందలం
పంచభూత ప్రకృతిలో – పావనుడే నరుడు
భూత భువన ఆకృతిలో – అపరకృతి ఆరోగ్యం
జీవన శ్రుతిలయలలో – శారీరక మానసికము
శక్తి సహిత ఆకృతికీ – పరాకృతే జనుని రక్తి
సత్త్వరజము తమసులే – గుణత్రయమున గురుతులె
సమవర్తన నర్తనలో – జనవర్తన గుణసహితము

భాగ్యరహిత భువియందున – బతుకవచ్చు అరణ్యమున
ఆరోగ్యము లోపించిన – జన బతుకులె దుర్భరములు
పేరులేని వ్యాధులు – పేలవములు ఆహారము
సాంద్రరహిత సేంద్రీయము – రాసాయన రమణీయము
మార్దవమౌ భాగములకు – కాఠిన్యపు రోగములు
జీవనమే దుర్భరము – బ్రతికి చచ్చు జీవితము.
మితాహార నియమము – మితనిద్రయె మధురము
విహారములు మితములై – మితచేష్టలు సత్పథములు
శక్తికలుగు యువకులే – దేశభవిత నిర్ణేతలు
అనారోగ్య భారతము – అభివృద్ధికి ఆటంకము
స్వచ్ఛభారతమునందున – స్వేచ్ఛ జీవి వరుడుగా
పరిఢవిల్లు ఆరోగ్యము – పరవశించు దేశమాత.
వైద్యవిద్యనభ్యసించి – వైభవమ్ము పొందినోళ్ళు
పరదేశము సేవలందు – పరవశమై ఫలరహితము.
తనువున తపనల రోగము – మనసున మలినపు రోగము
మహిమలేని మనుషులందు – మానవతకు దోషము
నారాయణుడే వైద్యుడు – హరిరూపము బాధహరుడు
సేవ మరవకుండనుండ – అండయె ఆరోగ్యమునకు.



అమరావతి అమరమాయె – ఆంధ్రులంత సాంద్రులైరి
శాతవాహనుల కాలము – చరిత్రలో చెరగనిది.
వెలగపూడి వెలిగిపోయె – సచివాలయ శోభతోడ.
ఐదుకోట్ల ఆంధ్రులకల – సాకారము సదాశివము.
కృష్ణతల్లి కృపకల్గగ – తృష్ణదీరి తృప్తి కల్గు
రైతన్నల త్యాగముతో – రమ్యరూపుదాల్చె నిచట
విభజన కష్టములలో – విజయము విలువలు కల్గగ
నాయకులూ ఉద్యోగులు – నవ్యాంధ్రకు సారథులు.
సంకల్పము కల్పకమై – వికల్పములు విధ్వస్తము
అనుకూలత ఆస్తికతై – అందలమున రాజధాని.

అభివృద్ధికి రాచబాట – విశ్వాంధ్రకు నవ్యబాట.
భారతమున భాగ్యబాట – భవ్యాంధ్రకకు నవ్యబాట.
కాకతీయ కార్ముకము – రుద్రమాంబ కరవాలము
బౌద్ధభిక్షు వివేకము – అమరేశ్వరు అద్భుతము
కనకదుర్గ కనకధార – శ్రీనివాసు శ్రీలధార
ఆరామపు అమరధార – ఆంధ్రులకది వెలుగుధార
పోలవరము పాలవెల్లి – నదుల కూర్చు నవ్యవల్లి
నీరు నిధిగ నియమవల్లి – పంట తంట తీర్చుతల్లి.
మాతృభూమి మమతతో – పితృభూమి పిలుపుతో
గ్రామవృద్ధి గరువముగా – పల్లెతల్లి పరవశించు
ఉద్యోగము ఉద్యమముగ – పరిశ్రమలు అశ్రమముగ
విశ్వసంస్థలెన్నొ వచ్చి – పెట్టుబడులు మెట్టెక్కును.
జాతీయత జాజ్జ్వల్యమై – ప్రాంతీయత సంతసమై
భాష మమత భాగ్యముగా – తెలుగు వెలుగు విశ్వవెలుగు
అపురూపము ఆనందము – ఆంధ్రజాతి చంద్రజ్యోత్స్న.
చల్లనియాకిరణస్పర్శ – కలకాలము రామరక్ష.
ఆరాముని ఆదర్శము – యీ చంద్రుని వృద్ధి ఆర్తి
మూర్తికట్టి ముద్దుగొలిపి – తరతరముల వరమగును.

570

## రామరాజ్యంలో యువజనోత్సవం

నాగార్జున నవ్యమాయె భవ్యరాఘవుని రాకతొ
యువత భవిత దివ్యమగును ఉద్యమించు విద్యార్థి
నవభారత నిర్మాతలు జాతి భవితనిర్ణేతలు
జాగృతిగను విప్లవాలు జయశీలం మనదేరా.

విశ్వమంత విలువ వెలుగ విద్యాలయమాయె నేడు
యువజనుల మహోత్సవాలు ఉన్నతికే గురుతుగా
బుద్ధధర్మమంత బుద్ధిపూర్వకమమై పుష్పించగ
బద్ధుడవై సద్ధర్మము నీకర్మగ దెలియుమూ.

హింసా ఆందోళముల హితము మరచిపోకుమీవు
ఆవేదన ఆలోచన అవగాహన అందమగును
తెలివిలేని తనమునీకు తేలుకాటెయగునురా
విద్యను అర్థించగాను వేద్యుడవుగ వెలుగుదువు.

అరిషడ్వర్గముల నీవు అర్థించకు అర్థమునా
పురుషార్థమె పుణ్యముగా గమియించుము జగతినా
సమత మమత సమాజమున సాగుమింక సోదరా
సమష్టిగా సహనముతో విప్లవించ విజయమగును.

గుంటూరు సీమలోన గుణగణ్యము ఆలయము
విశ్వమంత వెలుగొందగ విలువ వరదు రాఘవుడూ
రామరాజ్యమవతరించ రాఘవునకు అండగా
అంజనేయు విధముగాను అమరుమీవు నేస్తమా!

కాలవిలువ తెలిసినీవు కామితములు పొందుమూ
కాలనాగుకాలమగును కర్కశమగు వర్తనలో
అంబేద్కరు ఆశయముల గ్రంథాలయమమరగా
ఆంధ్రదేశపాలకులూ అవతరింతురిచ్చటా.
విలువకోలుపోకుమీవు విజయగాథ చరితనూ
చతుష్షష్టికళలలోన చాతుర్యమె నీదిరా.

రావెల సాంబయ్య గలడు ప్రాజ్ఞుడైన రాజుగా
పాలనమున ప్రాభవమే పారదర్శకమ్ముగా
ఆచార్యుల ఆచరణము ఆచారము ఆంధ్రకూ
సంప్రదాయ నవ్యతలను నాణ్యతగను మీవుగా.

బాధ బోధనమ్మునందు భాగ్యముగను ఎంచుమీవు
హక్కుల బాధ్యతల దెలిసి అవసరముల దీర్చుకొమ్ము
నూటదెబ్బదొకటియైన అనుబంధపు కళాశాలలు
నూతనత్వ శోభలతో భాసురమై భాగ్యమందు.

విజయవాడ ఒంగోలున వినుతమాయె గుంటూరూ
పదము పదము కలిసిరాగ విజయపథము మనదేరా!

కులము మతము కూలగొట్టి పార్టివర్గపథము విడిచి
ప్రజల ప్రభుతయందుమనం పావనులుగ మసలుదాం.



ఎన్నెస్సెస్ ఎన్సీసి ఎఱుకగాను సేవలందు
మగువ మగల విలువ దెలిసి మనగ కలిమి మనకందును
ప్రవరులైన ప్రాచార్యుల పరువు నిలుపు విద్యార్థీ
ఉపన్యాస కులవాణిని ఉన్నతిగని ఉద్యమించు.

విద్యదాన కర్ణులంత విజ్ఞులుగా నెలకొల్పిన
సంస్థలలో చదువుకొన్న సమసమాజ కాంక్షివీవు
పలురీతుల సంఘములను పలచబడియె నీపటువూ
ఏకమైన ఎదలమలుపు ఎదుగుదలకు ఎల్లరా.

గూండాగిరి గురువుగాను మాఫియాల మరుగుగాను
గురుశిష్యుల బంధమున్న విద్యాలయ పరువు పోవు
శ్రమశక్తికి విలువనిమ్ము శ్రమదానము ప్రగతిసుమ్ము
పరిశుభ్రత పచ్చదనం పావనతల పాదుసుమ్ము.

మేధవెల్గు చంద్రునిగా మేలు తలచు మెపుడు నీవు
స్వర్ణ ఆంధ్ర సాధనలో సమిధనిమ్ము సవనములో
మంచిచూడ మంచిచేత మంచిమాట మనుగడగా
మానవతయె మాన్యముగను మనసులన్ని పంటపండు.

త్రికరణముల తీరుతెలియ తియ్యనగును జీవనం
ప్రకరణమే ప్రపంచమున నీవర్తననేస్తమా
వ్యవస్థయే చెడెనటంచు అవస్థలను పడకురా
వ్యక్తిచెడగ చెడిపోయెను వెతలు వచ్చెనని తలచుము.

వ్యక్తినీవు వ్యవస్థలో శక్తిమించి పనిచేయగ
వ్యాసుడవై వెలుగొందీ జాతిజయము కోరుదీవు
స్వార్థమేమొ వర్ధనమై పరార్థమే పాలిపోయె
పరమార్థము పాలికాపు వరదాయివి నీవెరా.

అమరులైన అన్నలంత అమరావతి జేరిరీ
అచటినుండి అవనిపైకి ఆశయముల పంపుదురూ
వీరధీర మూర్తులన్ని స్ఫూర్తిదాయకములుగా
ఆర్తిదీర్చ ఆంధ్రుడవై సాగిరమ్మ సోదరా!

రాజకీయమంత నేడు సంపాదన అవధిగా
రాజిల్లుము అదియెనీకు కీర్తిధనము రీతిగా
వల్లకాని దేదిలేదు వల్లకాడు వసుధగా
వాసిదప్పు దోషములను తొలగింపుము జనమునా.

దేశభక్తి దేహముగను దేహులైరి దివ్యులూ
జాతిరక్తి జాగృతులను జవమునింపు జగతినా
ఆహరింపు అధికమైన అంధకారమలమునూ
మితియె అందగింపు జగతి కానియెడల మృతియెరా.

ఉత్సవాల పరమార్థము ఉట్టికెక్కనీయకూ
వట్టిమాటలను చెప్పక గట్టిమేలు చేయరా
అందరమిట కలిసితిమి కళలకలిమి పంటకై
అందరికందించగాను అందరమౌర విద్యార్థీ.